# నాట్యశాస్త్రము

[గుప్తభావప్రకాశికాసహితము]



డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు

నాట్యశాస్త్రము

# నాట్యశాస్త్రము






అనువాదము

[గుప్తభావప్రకాశికాసహితము]

డా. పోణంగి శ్రీరామ అప్పారావు

నాట్యమాల ప్రచురణము-1.

విళంబి : పుష్యము
ప్రథమ ముద్రణము : 2000 ప్రతులు
(అజంతా ప్రింటర్సు : సికింద్రాబాదు)

దుందుభి : పుష్యము
ద్వితీయ ముద్రణము : 1500 ప్రతులు
(వెంకట్రామా పేపర్ ప్రొడక్ట్సు ప్రైవేట్ లిమిటెడ్, హైదరాబాదు)

ప్రతులకు :
శ్రీ పి. వి. ఆర్. కె. రవిప్రసాద్
ఫ్లాట్ నం. 6, బ్లాక్ నం. 1
సత్యనగర్, హైదరాబాదు - 500 044.
వెల : రు. 45/-

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సమాదరమున
ప్రకాశితము



పండిట్ జవహర్‌లాల్ నెహ్రూచేత
కేంద్రసాహిత్య అకాడమి జాతీయ అవార్డు బహూకరణము.

ఆంగికం భువనం యస్య
వాచికం సర్వ వాఙ్మయమ్।
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్త్వికం శివమ్॥

—అభినయదర్పణము - ప్రారంభశ్లోకము.

స్థాయీ ప్రబుద్ధహృదయే వ్యభిచారిభూతః
కామాకులాసు జనతాసు మహానుభావః।
అంతర్విభావవిషయో రసమాత్రమూర్తిః
శ్రీమాన్ప్రసన్నహృదయోఽస్తు మమ త్రినేత్రః॥

—అభినవభారతి - 7 వ అధ్యాయవ్యాఖ్యానప్రారంభశ్లోకము.

యస్య సంకల్ప మాత్రేణ విశ్వమాహార్యమద్భుతమ్।
తం మానసమహామూర్తిం వందే గిరిసుతామపి॥

—అభినవభారతి-21వ అధ్యాయవ్యాఖ్యానప్రారంభశ్లోకము.

శివే శృంగారార్ద్రా, తదితరజనే కుత్సనపరా,
సరోషా గంగాయాం, గిరిశచరితే విస్మయవతీ।
హరాహిభ్యో భీతా, సరసిరుహసౌభాగ్యజయినీ
సఖీషు స్మేరా తే మయి జనని దృష్టిస్సకరుణా॥

—సౌందర్యలహరి - 51 వ శ్లోకము

సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామ మసకృత్సద్వాసనాశోభితం।
భోగీంద్రాభరణం సమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జున మహాలింగం శివాలింగితం॥

-శివానందలహరి - 50 వ శ్లోకము.



నటరాజు

రంభ - లేపాక్షిచిత్రము



"రంభోర్వశీప్రభృతిషు స్వర్గే నాట్యం ప్రతిష్ఠితమ్." (పుట 740)

యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః।
సోఽఙ్గాద్యభినయోపేతో నాట్య మిత్యభిధీయతే॥

—నాట్యశాస్త్రము - 1 వ అధ్యా—119 శ్లో.

వయో ఽనురూపః ప్రథమస్తు వేషో వేషానురూపేణ గతిప్రచారః।
గతిప్రచారానుగతం చ పాఠ్యం పాఠ్యానురూపో ఽభినయశ్చ కార్యః॥

—నాట్యశాస్త్రము - 12 వ అధ్యా—247 శ్లో.

యథా జీవస్వభావం హి పరిత్యజ్యాన్యదేహికమ్।
పరభావం ప్రకురుతే పరభావం సమాశ్రితః॥
ఏవం బుధః పరంభావం సోఽ స్మీతి మనసా స్మరన్।
ఏషాం వాగంగలీలాభిశ్చేష్టాభిస్తు సమాచరేత్॥

—నాట్యశాస్త్రము - 26 వ అధ్యా—7-8 శ్లో.

దేవానా మిద మామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషమ్
రుద్రేణేద ముమాకృతవ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా।
త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్॥

—మాళవికాగ్నిమిత్రము - ప్రథమాంకము - 4 శ్లో.

## అంకితము

రాయలసీమ రాజకీయ పితామహుండు, స్వాతంత్ర్య
సమరయోధుడు, విస్మృత లేపాక్షి శిల్పోద్ధారకుడు,
ఆర్ద్రహృదయుడు, మహోదారుడు, సాహితీబంధువు,
మనస్వి, వాగ్మి, సౌమ్యగంభీరమూర్తి అయిన
పూజ్యపాదులు

శ్రీ కల్లూరు సుబ్బారాయ మహోదయులకు



కృతిస్వామి
శ్రీ కల్లూరు సుబ్బారావుగారు

| | | |
|---|---|---|
| కృతికర్త | : | డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు |
| జన్మస్థలము | : | పశ్చిమ గోదావరిజిల్లా, కొవ్వూరు తాలూకా, "బందపురం". |
| తల్లి-దండ్రులు | : | శ్రీమతి లక్ష్మీనరసమ్మ ; శ్రీ రామమూర్తి. |
| విద్యాభ్యాసము | : | కొవ్వూరు ఉన్నత పాఠశాల. విజయవాడ శ్రీ రాజా రంగయ్యప్పారావు కళాశాల, ఆంధ్ర విశ్వవిద్యాలయము.<br>ఉస్మానియా విశ్వవిద్యాలయములో "తెలుగు నాటకము" లను గూర్చిన పరిశోధనము. |
| ఉద్యోగము | : | భీమవరం, రాజమండ్రి, కడప, శ్రీకాకుళం, మద్రాసుకళాశాలలలో మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఉపన్యాసకులు; హైదరాబాదు న్యూ గవర్నమెంట్ కాలేజి ప్రిన్సిపాల్; పార్శ్యపుస్తకాల ప్రత్యేకాధికారి, సాంస్కృతికశాఖ ప్రత్యేకాధికారి, తెలుగు అకాడమి - అంతర్జాతీయ తెలుగు సంస్థల స్థాపక డైరెక్టర్, ప్రథమ ప్రపంచతెలుగు మహాసభల ప్రధాన కార్యదర్శి, సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరెక్టర్. |
| ఇతర రచనలు | : | తాజ్‌మహల్ (నాటిక); విశ్వభారతి (నవల); వేణువు (పద్యాత్మకగద్యము); తెలుగునాటక వికాసము (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసము); ధర్మవరం రామకృష్ణమాచార్యులు; ధూర్జటి కవితా వైభవము; తెలుగుదేశము: నృత్యకళ; నాట్యశాస్త్రపరిచయము; A Monograph on Bharata's Natya Sastra; అభినయదర్పణము (ప్రతిపదార్థసహితము); భారతీయనాటకరంగము (అనువాదం) మొ॥ |



కృతికర్త
శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు

## అనువాదపరిష్కర్తలు



**శ్రీ శ్రీభాష్యం వేంకట నరసింహ భాష్యకారాచార్యులుగారు**

జననము : 9-9-1912

జన్మస్థలము : శ్రీకాకుళంజిల్లా, బొబ్బిలితాలూకా 'మరడాం'

తల్లి-దండ్రులు : శ్రీమతి తిరువెంగళమ్మ
శ్రీ శ్రీనివాసాచార్యులు.

విద్యాభ్యాసము : విజయనగరం మహారాజ సంస్కృతకళాశాలలో 'సాహిత్య విద్యాప్రవీణ', 'భాషాప్రవీణ'. అలంకార శాస్త్ర - జ్యోతిష-న్యాయ - వేదాంతము లందు పండితులు.

ఉద్యోగము : విజయనగర సంస్కృత కళాశాలలో తెలుగు పండితులు.

✶



**శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు**

జననము : 6-4-1922

జన్మస్థలము : విశాఖపట్నంజిల్లా 'పద్మనాభం'

తల్లి-దండ్రులు : శ్రీమతి తిరువేంగడమ్మ
శ్రీ చిన శ్రీనివాసాచార్యులు.

విద్యాభ్యాసము : విజయనగరం మహారాజ సంస్కృతకళాశాలలో 'వ్యాకరణ విద్యాప్రవీణ', 'భాషాప్రవీణ'; కాశీ విశ్వవిద్యాలయములో ఎమ్. ఏ.

ఉద్యోగము : పీఠికాపురాధీశప్రభుత్వ కళాశాలలో సంస్కృతభాషోపన్యాసకులు.

# FOREWORD

DR. V. RAGHAVAN,
*Head of the Department of Sanskrit, University of Madras, Madras.*



Sri Appa Rao has offered here the Natya Sastra of Bharata in a Telugu version. He has not given a mere translation; here and there, he also reproduces some verses of the original and to his translation, he adds copious references to the treatment of the subjects in other ancient sources and in several articles and books of modern scholars; also, each section has, in the end, a review in which the topics are examined from a comparative point of view which takes into consideration Aristotle and writers on drama and criticism in the West. Illustrations of the types of theatres, poses and gestures of dance have also been added. Thus, this is really an exposition of the Natya Sastra.

Bharata's text is a comprehensive treatise dealing with dramaturgy including poetics and everything connected with the production of drama, make-up, acting, dance, music etc. To what is inherently a work of vast detail, the method of treatment adopted by Sri Appa Rao adds considerably. He has consulted all the published papers and books bearing on Bharata's work on Sanskrit dramaturgy and poetics in general and made this a useful reference book to all students of Bharata and the ancient Indian Stage. The easy style in which his exposition is couched makes it all the more useful to the general reader.

Thanks to the encouragement given in manifold ways by the national government, there is evident today a renewed enthusiasm for drama and dance. As many of the surviving forms of regional dances and dance-dramas are in the direct line of descent from the ancient Indian traditional theatre, a knowledge of the latter, based on its sources in the Sanskrit texts of Bharata and his followers, will be of great use to-day. In Andhra particularly the Bharata Sastra had been highly developed in the medieaval times in the courts of the Kakatiyas, Reddis, Rayas and Nayudus of Warangal, Kondavidu, Vijayanagar and Racakonda. In the Kucipudi tradition, the Bhagavatas of Andhra preserved a considarable amount of the knowledge of Bharata Sastra. A popular exposition like the

present one, of the ancient text of Bharata and its contents will therefore be of particular value to students and enthusiasts in the field of traditional *nāṭya* in Andhra Pradesh.

The text of the Natya Sastra has not been critically edited, even the edition with Abhinavagupta's commentary in the GOS being far from satisfactory. In this present endeavour, the author has used all the printed texts, the collateral evidences of derivative and allied literature and the discussions of several portions of Bharata's work by modern scholars. This is all that can be done in the present juncture of textual criticism relating to Bharata. The author, when he was in Madras, consulted me now and then during the course of his work on this translation and exposition. While on the whole, he has digested a good deal of information, it has to be pointed out that his discussions could have been more critical and the presentation more compact and select. Some of the views he has brought together here are not correct, but he has obviously been aiming at presenting as completely as possible all the material now available. As a compendium of this type, the work of Sri Appa Rao will, I hope, be welcomed and found useful by all students of the art. It has involed a good deal of work and has become a substantial production of several hundred pages; and the author may well be congratulated on his sustained industry and achievement.

V. Raghavan

డా. బెజవాడ గోపాలరెడ్డి

ఆయవ్యయశాఖామాత్యులు,
భారతప్రభుత్వము - న్యూఢిల్లీ.

అనేకరంగముల అభివృద్ధిపథమున సాగుచున్న భారతవర్షము వైజ్ఞానికముగ కూడ సర్వతోముఖమైన ఔన్నత్యమును సంపాదించుకొనుచున్నది. తంద్రావస్థలో నుండిన ప్రజానీకము ఒకతూరి మేల్కాంచినప్పుడు ఆ మేల్కొల్పు ఏకపథమున మాత్రమే దృక్కుల సారింపదు. స్వాతంత్ర్యలబ్ధి రాజకీయముగ కన్పట్టినను సాంఘికముగ, ఆర్థికముగ, వైజ్ఞానికముగ కూడ నూతనమార్గమును త్రొక్కుచున్నదనుట నిర్వివాదము. పలు ప్రదేశములలో సారస్వతవిలసనముతో పాటు సంగీతము, నృత్యము, తదితర లలితకళలు నూతనోత్సాహమున ప్రస్ఫుటించుటకు ఉత్సుకములగుచున్నవి. సర్వతోముఖమైన అభివృద్ధియే మన లక్ష్యమైయున్నది.

సంగీతనాటకఅకాడమీ కృషివల్లను, వివిధ సంగీత-నాటకసమాజముల ప్రోత్సాహమువల్లను, కళాశాలలలోని విద్యార్థినీ-విద్యార్థుల అభిలాషవల్లను నాట్యము (నృత్య-నాటక కళలు) అభిమానకళగా, గౌరవనీయమైన వినోదముగా రూపొందుచున్నది. దేవదాసీల వృత్తిగనుండిన నృత్యము కళంకభూయిష్ఠముగ నుండినది; మర్యాదకుటుంబముల యువతులకు అది హేయముగ నుండినది. అట్టిది రవీంద్రనాథ ఠాకూర్, వల్లతోల్, రుక్మిణి అరండేల్, ఉదయశంకర్ మొన్నగువారి ఆదరణముచే సమాజమున గౌరవస్థానమును పొందినది. కొన్ని సంఘములలో బాలికలకు ఇది అవసరమైన యోగ్యతయై వెలయుచున్నది. హేయమైనకళ పూజనీయమైనది. అన్ని ప్రాంతములలోను నృత్యకళ ప్రాధాన్యతను పొంది గౌరవింపబడుచున్నది. మణిపూర్, కథక్ నృత్యములకంటె భరతనాట్యమునకు ఎక్కువ ప్రచారము వచ్చుచుండుట ముదావహము. కూచిపూడి నాట్యసంప్రదాయము నేడు వలసినంత ప్రచారములో లేదు. ఆంధ్రులకు గర్వకారణమైన ఈ కూచిపూడినాట్యకళ త్వరలో అర్హస్థానమును పొంది, భారతదేశమునకే గర్వకారణము కాగలదని విశ్వసించుచున్నాను. ప్రాచీనశాస్త్రములకు దగ్గరవియై భరతముని సంప్రదాయమును వెల్వరించునవి ఈ భరతనాట్య-కూచిపూడినాట్య సంప్రదాయములే.

నృత్యకళతో పాటు నాటకకళ కూడ నేడు సమాజమున గౌరవస్థానమును పొందియున్నది. ఒకనాడు పంక్తిబాహ్యులుగా నెన్నబడిన నటులు ఈనాడు రాజసన్మానములతో గౌరవింపబడుట ముదావహము. ఈ సందర్భమున నాట్యకళాప్రపూర్ణ శ్రీ బళ్ళారి రాఘవాచారి తెలుగునాటకరంగమునకు కావించిన సేవను స్మరించవలసియున్నది.

సౌందర్య-యౌవన-కళా నైపుణ్యములతో రాగ-తాళ యుక్తముగ నటించుచున్న దృశ్యము కంటె సుందరమైనది ప్రకృతిలో వేరు లేదేమో! ఇంక అవస్థానుకృతియును, త్రైలోక్యానుకరణమును, సర్వభావానుకీర్తనమును అయిన నాటకకళను గూర్చి చెప్పవలసినదేమున్నది?

సంస్కృతమున భరతమునివిరచితశాస్త్రము ఉత్కృష్టమైన నాట్యశాస్త్రగ్రంథము. అందు చతుర్విధాభినయములు రస-భావానుగుణములుగా స్థిరీకరింపబడినవి. అంతియే కాదు నాట్యమండపనిర్మాణము, రంగస్థలవిభజనము, సామాజికుల విధులు, సంగీత-వాద్యములు మున్నగు విషయములెన్నో అపూర్వముగా ఇందు వివరింపబడినవి.

అట్టి రసాస్పదమైన నాట్యశాస్త్రము సమగ్రమైనది. ఇన్నిశతాబ్దములుగా తెలుగున అవతరించకపోవుట విచారకరమైన విషయమే. ఆకొరతను తీర్చుటకే శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు ఎంతో శ్రమపడి, కాలమును వెచ్చించి, మాతృకయగు భరతశాస్త్రమును యథాతథముగ అనువదితమొనర్చుటకేకాక గహనములైన శాస్త్రవిషయములను సులభగ్రాహ్య మొనర్చుటకును పెద్ద ప్రయత్నము కావించిరి. కేంద్రప్రభుత్వముయొక్క సాహాయ్యము, ఉస్మానియా విశ్వవిద్యాలయసాహాయ్యము వారికి సిద్ధించినవి.

నాట్యమండపములకు, నృత్యభంగిమలకు, అభినయహస్తములకు ఉదాహరణముల నొసంగి, గ్రంథమును సచిత్రమొనరించిరి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి విరాళముతో ఆంధ్రరసజ్ఞులకు ఈ గ్రంథమును వారు అందింపగల్గిరి. ఏకదీక్షతో శ్రీ అప్పారావుగారు ఈ కార్యమును సాధించిరని చెప్పుట అతిశయోక్తి కాదు. ఇన్నాళ్ళకు వారి కృషి ఫలించినది. ఈ శతాబ్దముననే కొందరీ గ్రంథము ననువదించుటకు పూనుకొనియున్నారు. కొందరిది సంక్షిప్తానువాదము; మరికొందరిది కేవలానువాదము. కాని, శ్రీ అప్పారావుగారిది సంపూర్ణానువాదమేకాక ప్రాచీనాధునిక వ్యాఖ్యానసారములతోపాటు స్వీయవిమర్శా సహితమై అలరారుచున్నది. ఇది చక్కని పద్ధతి. నాట్యశాస్త్రమునకు ఇదియే ప్రథమ సమగ్రానువాదమని చెప్పవచ్చును.

పండితులకు, పామరులకు ఇది అత్యంతోపయోగకారియైన గ్రంథము కాగలదని నా పూర్ణ విశ్వాసము. శతాబ్దముల సౌందర్యోపాసనము ఈ గ్రంథమున ఇముడ్చబడియున్నదన్నను, ఎందరో రసమూర్తుల అనుభవముల సంపుటీకరణమే ఈ గ్రంథమన్నను వాస్తవమే అగుచున్నది. ఆంధ్రులు దీనిని ఆదరింపగలరని నా విశ్వాసము. ఒక గొప్పకార్యమును సాధించిన శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారిని నేను అభినందించుచున్నాను.

బెజవాడ గోపాలరెడ్డి

డా. బూర్గుల రామకృష్ణరావు

కేరళరాజ్యపాలకులు,
తిరువనంతపురము.

భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రమునకు 'నాట్యవేద' మనునామాంతరము గలదు. భారతీయములగు సకలశాస్త్రములకును సర్వ విజ్ఞానమునకును వేదము లాధారభూతములు—

> ఋగ్యజుస్సామవేదేభ్యో వేదాచ్చాథర్వణక్రమాత్
> పాఠ్యం చాభినయం గీతం రసాన్ సంగృహ్య పద్మజః
> వ్యరీరచ చ్ఛాస్త్రమిదం ధర్మకామార్థమోక్షదం ॥

అను సూక్తిప్రకారము దేవతల ప్రార్థన నంగీకరించి, చతుర్వేదములను స్మరించి, చతుర్ముఖుడు, పాఠ్యాభినయసంగీతరసములను వానినుండి గ్రహించి, ధర్మకామార్థమోక్షదమగు నాట్యవేదమును రచించి ప్రయోగార్థము భరతముని కొసంగెనని నాట్యోత్పత్తిని గురించిన ప్రాచీనవిశ్వాసము. తాండవలాస్యరూపనృత్తములను శివపార్వతులగు నాది దంపతులే ప్రథమనర్తకులై ప్రయోగించిరని భారతీయులు విశ్వసించు గాథ. అదెట్లున్నను, భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రము నాట్య, నృత్త, నృత్య త్రివిధాత్మక నాట్యకళకేగాక, కావ్య-సంగీతశాస్త్రములకును ప్రాతిపదికమైన వేదము. ప్రాచీనములగు మన నాట్యాభినయసంగీతకావ్యాలంకారలక్షణశాస్త్రము లన్నింటికిని, చిత్రలేఖనము మున్నగు లలితకళలకును మూలభూతములగు సిద్ధాంతము లీ భరతముని ప్రణీత 'నాట్యశాస్త్రము' న గలవు. భారతీయచతుష్షష్టికళలకు వేదములందును, ఇతరశాస్త్రములందును పునాదు లేర్పడియున్నవి. ఈ యాధారములపైననే ప్రాచీనులు చిరకాలాభ్యాసప్రయోగానుభవముచే శాస్త్రవిజ్ఞానసౌధమును నిర్మించి కొన్నిశాస్త్రములందు పరాకాష్ఠను పొందిరి. వీనిలో నాట్యశాస్త్రము, సంగీతశాస్త్రము, అలంకారశాస్త్రము ముఖ్యములైనవి. ఈ శాస్త్రములందు ప్రాయోగికపరిశోధనలను సల్పుచు జిజ్ఞాసువులగు పండితులు మూడు నాలుగు శతాబ్దముల క్రిందివరకును సమాలోచనలు విమర్శలు జేయుచు నూతన సంప్రదాయములను విధానములను కనిపెట్టి పరిణతదశకు తీసికొనివచ్చుచునే యుండిరి.

మధ్యకాలీనమగు పారతంత్ర్యము, సాంస్కృతికదాస్యము మున్నగువానివలన భారతీయవిజ్ఞానము కుంటువడి పెరుగుదలలేక యాగిపోయినది. పాశ్చాత్యవిజ్ఞాననాగరకతా సంఘర్షణలచే చకితులమై నూతన సిద్ధాంతములను, సంస్కృతిని అలవరించుకొనుటతో కొంతకాలము గడచినది. స్వాతంత్ర్యసంపాదనానంతరము, అంతకుపూర్వమునుండియే పాశ్చాత్యపండితులచేతనే తిరిగి వెలుగులోనికి తేబడిన మనసాంస్కృతికరూపములు, ప్రాచీన విజ్ఞానము, కళాసంప్రదాయములు మరల నేటి ప్రజాస్వామ్యయుగమున పునర్వ్యాప్తిని బెందుట కవకాశము లభించుచున్నది. ప్రపంచమున నేడు విస్తరించియున్న భిన్నభిన్న శాస్త్ర కళాసంప్రదాయముల ప్రభావము పరివర్తనశీలమగు ప్రజాసంస్కృతిపై బడుట యనివార్యము.

'పురాణ మిత్యేవ న సాధు మన్యే' యని ప్రాచీనార్యోక్తియే కలదు. ఐనను దేశకాల పాత్రానుగుణముగా రావలసిన మార్పులు సనాతనములగు జాతీయవిజ్ఞానసంప్రదాయముల పునాదులపై ఆధారపడినచో వానికి సుస్థిరత్వము చేకూరును. 'క్రొత్త ప్రాతల మేలు కలయిక'ను సృష్టించుచున్న ఈ కాలమున, పండితులకే కాక పామరులకును ప్రాచీనశాస్త్ర రహస్యముల పరిచయము గలిగించుట మిగుల యవసరము.

భరతమునిప్రణీతనాట్యశాస్త్రమును 'నాట్యవేద' మనుపేర బ్ర. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు మిగుల సమర్థతతో తెనిగించి, యా శాస్త్రాంతర్గతములగు వివిధ సమస్యలను సోపపత్తికముగా చర్చించియున్నారు. ఆ గ్రంథముయొక్క ప్రథమభాగము సంగీతనాటకఅకాడమీవారి ప్రోత్సాహసహాయమువలన ముద్రితమైనది. దానిని చూచు భాగ్యము నాకు లభించినది. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు 'తెలుగునాటకము యొక్క ఉత్పత్తి పరిణతు'లను గురించి రెండు సంవత్సరములుగా ఉస్మానియా విశ్వ విద్యాలయమునందు పరిశోధన సలుపుచున్నారు. తద్గవేషణఫలితముగా వీరును భరత మహర్షిప్రణీతమగు 'నాట్యశాస్త్రము'ను సమగ్రముగా అనువదించినారు. తెనుగు వచనానువాదముతో పాటు అధస్సూచికలలో అభినవగుప్తాదుల యభిప్రాయములను, మరియు ప్రతి యధ్యాయాంతమున కొన్ని విశేషాంశములను చేర్చినారు. ఇతర లక్షణ గ్రంథములతో పోలికలను సూచించుచు గ్రీకు నాటక రంగమును గూర్చిన వివరములను కూడ పొందుపరచినారు. బహుముఖవిజ్ఞానదాయకమగు నీ గ్రంథమును అచ్చొత్తించుటకై ఆంధ్రప్రదేశప్రభుత్వము ప్రోత్సాహసహాయముల నొసంగుట మిగుల ప్రశంసనీయము, సంతోషకరము. నేను చూచిన ముద్రితగ్రంథభాగ మాకర్షణీయముగా నున్నది. పూర్తి ప్రతి సర్వాంగసుందరముగా నుండునని విశ్వసించుటకు సందేహము లేదు. యువకులగు గ్రంథకర్తలు శ్రీ అప్పారావుగారు ఆంధ్రావని కమూల్యసాహితీసేవ గావించి రనుట యతిశయోక్తి కాదు. వారిని హృదయపూర్వకముగా నభినందించుచు, వారి కితోధిక శాస్త్ర పరిశోధనమున కావశ్యకమగు పట్టుదలను, గ్రంథరచనోత్సాహమును, వాని ముద్రణ ప్రకటనల కవసరములగు సర్వవిధసౌకర్యములను పరమేశ్వరు డనుగ్రహించుగాత మని నా యాశీస్సుల నందజేయుచున్నాను.

బూర్గుల రామకృష్ణరావు

# కృతజ్ఞతలు


పితరౌ - జగతఃపితరౌ వందే

ఉన్నతవిద్య చెప్పించి నా సాహిత్యకృషిని ప్రోత్సహించినవారు మాఅన్నలు, బావలు.

నా ఉన్నతవిద్యాభ్యాసమునకు కారణభూతులైనవారు శ్రీ ఉయ్యూరుసంస్థానాధీశులు, శ్రీ అశ్వారావుపేటసంస్థానాధీశులు, డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు.

తెలుగుమీద అభిరుచి కలిగించినవారు మాపితృపాదులు శ్రీరామమూర్తిగారు, ఉపాధ్యాయులు బ్రహ్మశ్రీ అనిపెద్ది జగన్నాథశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ వారణాశి గంగాధర శాస్త్రిగారు.

ప్రాచ్య-పాశ్చాత్య కావ్య-నాట్యమర్మవివేచనాశక్తిని ప్రసాదించిన ఆచార్యపాదులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, శ్రీ జి. జె. సోమ యాజిగారు, శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు.

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు ఎమ్. ఏ. విద్యార్థులకు "సాహిత్య విమర్శ"ను పాఠముగా చెప్పెడి అవకాశమును కలిగించినవారు ఆచార్య బి. లక్ష్మీనారాయణరావుగారు.

నాట్యశాస్త్రమును అనువదించుటకు జంకుచున్న సమయములో నన్ను ప్రోత్సహించి 1954 సెప్టెంబరు నెలలో సమగ్రానువాదమునకు నాచే శ్రీకారమును చుట్టించినవారు శ్రీ సాళ్వ కృష్ణమూర్తిగారు; నిర్విఘ్న పరిసమాప్తికి ఆశీర్వదించినవారు డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, శ్రీ కె. వి. గోపాలస్వామిగారు.

అడిగిన పుస్తకముల నిచ్చి, కలిగిన అనుమానములను తీర్చి ప్రోత్సహించినవారు డా. వి. రాఘవన్‌గారు.

నా నాట్యశాస్త్రానువాదములోని మొదటి 19 అధ్యాయములను "సంస్కృతి"లో వరుసగా ప్రకటించినవారు ఆ పత్రికాధిపతులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు, ఆ పత్రిక ఉపదేశకవర్గములోనివారగు శ్రీ జి. ఎస్. ఎన్. ఆచార్యగారు.

నా సాహిత్యకృషిని మెచ్చి, పరిశోధనకు అవకాశమును కలిగించినవారు డా. వి. యస్. కృష్ణగారు, ఆచార్య జి. జె. సోమయాజిగారు, డా. ఎస్. భగవంతంగారు, ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, కేంద్రప్రభుత్వవిద్యాశాఖాధిపతులు.

26-2-1958 తేదీన శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయములో నాటి ఆంధ్ర ప్రదేశ్ ఆర్థికశాఖామాత్యులగు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులుగా సభను ఏర్పాటుచేసి, నాచే నాట్యశాస్త్రోపన్యాస మిప్పించి, గ్రంథముద్రణమునకు దారిచూపిన వారు డా. బి. రామరాజుగారు.

నాటి నా ఉపన్యాసమును విని, మదిని మెచ్చి, ప్రశంసించి, నా నాట్యశాస్త్రానువాదమును పుస్తకరూపమును పొందించుటకు కృతనిశ్చయులైనవారు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు.

ప్రభుత్వపక్షమున, గ్రంథముద్రణమునకు, నాలుగువేల రూపాయలను ఉచితముగా మంజూరు చేసినవారు విద్యాశాఖామాత్యులు శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు

గారు, ఆర్థికశాఖామాత్యులు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, ముఖ్యమంత్రులు డా. నీలం సంజీవ రెడ్డిగారు.

గ్రంథముద్రణమునకు వలయు కాగితమును సరసమగు వెలకు ఇప్పించినవారు "సిరిపూర్ పేపర్ మిల్సు" హైదరాబాదు శాఖాధిపతులు శ్రీ భండారిగారు, శ్రీ టోకర్సీ లాల్ కపాడియాగారు, శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు.

నాతో రెండు నెలలపాటు కూర్చుండి, ప్రత్యక్షరమును పరిశీలించి, నా అనువాదమును పరిష్కరించినవారు శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు. వారితో కలిసి నా అనువాదము నంతటిని మరల పరిశీలించినవారు శ్రీ శ్రీభాష్యం వేంకట నరసింహ భాష్యకారాచార్యులుగారు.

దగ్గర ఉండి, తొందరపెట్టి, నాచే ప్రెస్ కాపీ వ్రాయించినవారు శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు; దానిని సరిచూచినవారు శ్రీ శ్రీభాష్యం రామానుజాచార్యులుగారు. విశేషాంశములను చదివి, సలహాల నొసంగినవారు శ్రీ ఎమ్. నాగభూషణశర్మగారు.

ఇందులోని కరణముల చిత్రములను, హస్తముల చిత్రములను వ్రాసినవారు శ్రీ ఎ. తిరుమలరావుగారు. తక్కిన చిత్రములను వ్రాసినవారు శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారు.

అందముగాబ్లాకులను తయారుచేసి పెట్టినవారు శ్రీ రామారావుగారు (దుర్గా బ్లాక్ మేకింగు కంపెనీ), శ్రీ జి. మూర్తిగారు (మూర్తి ప్రాసెసింగు కంపెనీ).

11-7-1957 తేదీన గ్రంథముద్రణమునకు ప్రారంభోత్సవము జరిపినవారు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు.

నేను పెట్టిన తికమకలనెల్ల ఓపికతో సైచి గ్రంథమును అందముగా, నిర్దుష్టముగా ముద్రించినవారు అజంతాముద్రణాలయాధిపతులు శ్రీ శ్రీనివాస సోదరకవులు.

గ్రంథముద్రణము ప్రారంభమైననాటినుండి అది ముగియువరకును నాకు తోడునీడగా నుండి సలహాల నొసంగినవారు శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారు, శ్రీ ఎమ్. నాగభూషణశర్మగారు.

ఆయా సమయములందు అనేక విధములుగా సాహాయ్యపడి నన్ను ప్రోత్సహించినవారు శ్రీ దరిమడుగు కామయ్యగారు, శ్రీ ఎల్. బుల్లెయ్యగారు, శ్రీ కె. రాఘవ రెడ్డిగారు, శ్రీ కోట సుందరరామశర్మగారు, శ్రీ గాడేపల్లి సత్యనారాయణమూర్తిగారు, డా. యస్. వి. జోగారావుగారు, డా. బి. రామరాజుగారు, శ్రీ ఎమ్. ఆనందంగారు, శ్రీ టి. భద్రిరాజుగారు, శ్రీ ఎ. ఆర్. కృష్ణగారు, శ్రీ సంపత్‌గారు.

'ఎందరో మహానుభావులు!' అందరికిని నా కృతజ్ఞతాపూర్వకనమస్కారములు.

కరణములను వ్రాయించుటలో బరోడా ముద్రణమునందలి పటములును, 'తాండవలక్షణము' నందలి పటములును తోడ్పడినవి. అమరావతీశిల్పములను వ్రాయించుటలో ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును, ప్రతిశిరముల పటములను వ్రాయించుటలో శ్రీ ఎ. నికాల్ గ్రంథములును తోడ్పడినవి.



విశేషాంశములను వ్రాయుటలో పెక్కు గ్రంథములు తోడ్పడినవి. వివరములను ఆయా సందర్భములందే పేర్కొనియున్నాను. అనువాదములో కాశీ ముద్రణమును, బొంబాయి ముద్రణమును, బరోడా ముద్రణమును, డా. మనోమోహన్ ఘోష్ ఆంగ్లానువాదమును, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి ఆంధ్రానువాదమును తోడ్పడినవి.

పై గ్రంథముల కర్తలకును, సంపాదకులకును, ప్రకాశకులకును సర్వదా కృతజ్ఞుడను.

నా అనువాదమునకు తొలిపలుకు వ్రాసిన డా. వి. రాఘవన్‌గారికిని; వివిధనాట్యశాస్త్రకర్తలను గూర్చి విపులమగు వ్యాసమును వ్రాసిన డా. పి. యస్. శాస్త్రిగారికిని; నా కృషిని మన్నించి ఆశీర్వదించి అభినందించిన పెద్దలకును నా మనస్సుమనస్సుల నర్పించుచున్నాను.

నాట్యగృహముల పటములను వేసికొనుట కంగీకరించిన ఆచార్య డి. సుబ్బారావుగారికిని, తమ వేషముల ఫొటోలను వేసికొనుట కంగీకరించిన నటసోదరులకును; రామప్పగుడియందలి నృత్యభంగిమల ఫొటోలను, 'నాట్యమాల' చిహ్నమున కుపయుక్తమైన నాగరాజు (అలంపురం) ఫొటోను ఇప్పించిన పురాతత్త్వశాఖాధ్యక్షులకును; లేపాక్షి చిత్రముల నొసంగిన శ్రీ కల్లూరి సుబ్బారావుగారికిని నా కృతజ్ఞతాపూర్వకవందనములు.

నా నాట్యశాస్త్రానువాదమును గ్రంథరూపమున ఆంధ్ర సహృదయలోకమున కర్పించవలెననెడి పూనికను వహించి కృతకృత్యులైన అపరభీష్ములు శ్రీ కల్లూరి సుబ్బారావుగారికి ఈ నా కృతిని సమర్పించుకొనుచున్నాను. మా కులదైవమును, ఆంధ్రుల ప్రియదైవమును అగు శ్రీ భద్రాద్రి శ్రీరామచంద్రమూర్తి వారికి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాక!

నాలుగు సంవత్సరములుగా అనారోగ్యముతో తాను బాధపడుచుండియు నా సాహిత్యవ్యాసంగముమాత్రము నిర్విరామముగాకొనసాగుటలో విఘ్నమురాకుండ తోడ్పడిన నా సహధర్మచారిణి శ్రీమతి వేంకటరమణమ్మకు ఆశీస్సులు.

ఐదు సంవత్సరముల ఈ నా కృషి నేటికి ఈ రూపముగా సఫలమైనది. ఇది సహృదయుల మన్ననలను పడయగలదని విశ్వసించుచున్నాను.

ఈ నా అనువాదమును ప్రకటించిన నాట్యమాలాసంస్థాపకులు డా. పి. సాంబశివరావుగారికిని, శ్రీ పోణంగి సత్యనారాయణమూర్తి గారికిని కృతజ్ఞతాపూర్వకనమస్కారములు. ప్రాచ్య-పాశ్చాత్యనాట్యవిమర్శకగ్రంథములను పెక్కింటిని ప్రకటించు తలంపుతో "నాట్యమాల"ను స్థాపించియున్నాము. ఈ నాట్యమాలకు మహారాజపోషకులుగా చేరుట కంగీకరించిన ప్రథములు శ్రీ పసల సూర్యచంద్రరావుగారు అభినందనీయులు. ఇతర కళాభిమానులుకూడ మహారాజపోషకులుగా, రాజపోషకులుగా, పోషకులుగా చేరి నాట్యమాలనుండి ఉత్తమగ్రంథములు వెలువడుటకు తోడ్పడగలరని విశ్వసించుచున్నాను.

విశంబి : సంక్రాంతి
14-1-1959

పోణంగి శ్రీరామ అప్పారావు



భరతముని

# నాట్యశాస్త్రము

## 1. రచనాకాలము

నాట్యశాస్త్రరచనాకాలమును పలువురు పలువిధములుగా నిర్ణయించియున్నారు–

1. మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి (Journal of Asiatic Society of Bengal - Vol. V. New Series and Vol. VI.)—క్రీ. పూ. 2 వ శతాబ్ది.

2. శ్రీ మానవల్లి రామకృష్ణకవి (బరోడా ముద్రణపీఠిక)– క్రీ. పూ. 4 వ శతాబ్ది.

3. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి (సంస్కృతవాఙ్మయచరిత్ర- 2 వ సం.) — క్రీ. పూ. 3 వ శతాబ్ది.

4. డా. మనోమోహన్ ఘోష్ (Journal, Dept. of letters-Calcutta University, Vol. 25 - pp 1-54)—క్రీ. పూ. 100-క్రీ. శ. 200.

5. మహామహోపాధ్యాయ పి. వి. కాణే (History of Sanskrit Poetics - P. 45)– క్రీ. శ. 300 పూర్వము.

6. డా. ఎ. బి. కీత్ (The Sanskrit Drama - P. 13)—క్రీ. శ. 3 వ శతాబ్ది తరువాత.

పై వివిధాభిప్రాయములను సమీకరించినచో నాట్యశాస్త్రము క్రీ. పూ. 4 వ శతాబ్ది, క్రీ. శ. 4 వ శతాబ్ది మధ్యగల కాలములో రచింపబడినదని చెప్పవలసి వచ్చుచున్నది. కాని సుమారు 8 శతాబ్దములమధ్యగల కాలమును ఒక గ్రంథరచనాకాలముగ చెప్పుట హాస్యాస్పదము కాగలదు. అయినను రచనాకాలమే కాక, కర్తృత్వమును వివాదాస్పదమగుటచే నిశ్చయముగా చెప్పుటకు వీలులేకున్నది. నాట్యశాస్త్రమును ఆంగ్లభాషలోనికి అనువదించిన డా. మనోమోహన్ ఘోష్ నాట్యశాస్త్రరచనాకాలమును గూర్చి కూలంకషమగు చర్చచేసి, అది క్రీ. పూ. 100-క్రీ. శ. 200 మధ్య రచింపబడి యుండునని నిర్ణయించెను. ఈ నిర్ణయమునకు వచ్చుటలో డా. ఘోష్ చేసిన పెక్కు సూచనలను తాను అంగీకరించకపోయినను, ఆతడు నిర్ణయించిన కాలము మాత్రము విశ్వసనీయముగనే ఉన్నదని శ్రీ కాణే అభిప్రాయపడెను. వీ రిరువురి అభిప్రాయము ప్రకారము నిశ్చయముగా క్రీ. శ. 300 కు పూర్వమే రససిద్ధాంతమును, నాటకప్రదర్శనవిధానమును వివరించు నేటి నాట్యశాస్త్రము భరతమునిప్రణీతముగా ప్రచారమునం దున్నదనుట స్పష్టము.

క్రింది ఆధారములను బట్టి పై విధముగా పశ్చిమావధిని నిశ్చయముగా చెప్పుట కవకాశము కలదు; కాని పూర్వావధిని అంత నిశ్చయముగా నిరూపించలేము.

1. భవభూతి (క్రీ. శ. 700-740) ఉత్తరరామచరిత చతుర్థాంకములో భరతుడు 'తౌర్యత్రిక సూత్రకర్త' అనియు, వాల్మీకి సమకాలికుడనియు పేర్కొనెను. కావున నాట్యశాస్త్రము 7 వ శతాబ్దినాటికే ప్రచారము నందియుండును.

2. కాళిదాసు (క్రీ. శ. 4 వ శతాబ్ది చరమభాగము) విక్రమోర్వశీయమందు భరతుని. అష్టరసములను, అప్సరసలనాట్యప్రయోగమును పేర్కొనెను. రఘువంశమందు మరికొన్ని

నాట్యశాస్త్రానుకరణములు కలవు. దీనినిబట్టి క్రీ. శ. 300 నాటికే భరతుడు నాట్యశాస్త్ర ప్రణేతగా పరిగణింపబడుట స్పష్టము.

3. సప్తవిధములైన అవైదికగీతములను (సప్తరూపమును) గానము చేయుటకూడ మోక్షసాధకమే అని యాజ్ఞవల్క్యస్మృతి (క్రీ. శ. ప్రథమశతాబ్ది మధ్యభాగము) పేర్కొనుచున్నది. ఇట్లు చెప్పుటకు నాట్యశాస్త్రము ప్రమాణమని 'మితాక్షర' పేర్కొనెను. కావున, నాట్యశాస్త్రము క్రీ. శ. ప్రథమ శతాబ్దికి తరువాతిది మాత్రము కాదని సులువుగా చెప్పవచ్చును.

4. భట్టి - భామహాదులు (క్రీ. శ. 500 - 650) ముప్పదికి పైగా అలంకారములను పేర్కొనగా భరతుడు నాలుగు అలంకారములను మాత్రమే వివరించెను. అనగా నాడు నాలుగు అలంకారములు మాత్రమే ప్రసిద్ధముగా నున్నవనుట స్పష్టము. అలంకార సంఖ్య నాలుగునుండి ముప్పదికి పైగా పెరుగుటకు కొన్ని శతాబ్దములైనను పట్టియుండును. కావ భరతు డీ రచయితలకు చాల ప్రాచీనుడై యుండును. అనగా క్రీ. శ. ప్రథమ - ద్వితీయ శతాబ్దములకు చెందియుండును.

5. భాసుడు (క్రీ. శ. 3 వ శతాబ్ది) నాట్యశాస్త్రమును సంపూర్ణముగా ఎరిగియుండెనని డా. ఘోష్ నిరూపించి యుండెను [నాట్యశాస్త్రము - ఆంగ్లానువాద పీఠిక - పుటలు **LXXXIV — LXXXVI**]. కావున నాట్యశాస్త్రము క్రీ. శ. 200 నాటిదని చెప్పవచ్చును.

మొత్తమునకు ప్రస్తుతరూపములో ఉన్న నాట్యశాస్త్రము క్రీ. శ. 100-200 నాటికి ప్రసిద్ధిలో ఉన్నదని చెప్పగలము. కాళిదాసు క్రీ. పూ. ప్రథమశతాబ్ది వాడని నమ్మినచో నాట్యశాస్త్రమంతకంటెను ప్రాచీనము కాగలదనుట స్పష్టము.

కాని, నాట్యశాస్త్రభాగములన్నియును ఒకేసారి, ఒక్కరి చేతిమీదుగా వ్రాయబడలేదని విమర్శకులు తలంచుచున్నారు. ఆయా భాగముల రచనా కాలములను శ్రీ కాణే క్రింది విధముగా పేర్కొనెను—

1. 6, 7 అధ్యాయములు (రస - భావములు), 8 నుండి 13 వరకును గల అధ్యాయములు, 16 నుండి 34 వరకునుగల అధ్యాయములు ఒకేసారి రచింపబడి యుండును.

క్రీ. శ. 100 ప్రాంతములకు చెందిన అశ్వఘోషుని 'శారిపుత్ర' ప్రకరణరచనకును, నాట్యశాస్త్రపద్ధతికిని చెప్పుకోదగినంత సన్నిహితసంబంధము కన్పట్టుచున్నది. నాట్యశాస్త్రముకంటె ప్రాచీనాలంకారికగ్రంథ మింకొకటి దొరకలేదు కాన అశ్వఘోషుడు నాట్యశాస్త్రమునే అనుసరించి యుండుననుట నిస్సంశయము. కాగా, ఇప్పుడున్న అధ్యాయములలో అధికభాగము క్రీ. శ. మొదటి శతాబ్దికే గ్రంథరూపమును తాల్చి యుండవచ్చును.

2. 6, 7 అధ్యాయములలోని గద్యభాగములు, మొత్తము గ్రంథమందలి ఆర్యలు క్రీ. పూ. 200 నాటివై యుండును. ఇవి తరువాతికాలములో నాట్యశాస్త్రమందు చేరి యుండును.



3. నాట్యశాస్త్రోత్పత్తిని వివరించు ప్రథమాధ్యాయము, బహుశః తరువాతి నాలుగు అధ్యాయములు తరువాతి కాలములో కాళిదాసునకు పూర్వమే రచింపబడియుండును.

ధర్మశాస్త్రముల, స్మృతులకాలము నాటికి నటులు, గాయకులు, నర్తకులు పంక్తిబాహ్యులయినారు ; వారియెడ నిరసనభావ మేర్పడినది. ఈ అభిప్రాయమును పోగొట్టి నాటకకళకు దివ్యయోనిత్వమును కల్పించి, ఔన్నత్యమును చేకూర్చుటయే నాట్యశాస్త్రాశయముగా గోచరించుచున్నది. ఈ విషయమును నాట్యశాస్త్రమునకు దివ్యోత్పత్తి నాపాదించు మొదటి అయిదు అధ్యాయములును స్పష్టము చేయుచున్నవి. నాటకప్రయోగము యజ్ఞకర్మతుల్యమని నాట్యశాస్త్రమందు పలుసార్లు చెప్పబడుట గమనార్హము.

## 2. కర్తృత్వము

నాట్యశాస్త్రము యొక్క రచనాకాలమేకాక కర్తృత్వముకూడ వివాదాస్పదమైనదను విషయమును గుర్తించియున్నాము. పైని వివరించినట్లు ఆయా భాగములు ఆయా కాలములందు రచింపబడినవన్నచో గ్రంథకర్తృత్వమెల్ల ఒక్కరికే చెందదనుట స్పష్టమగుచునేయున్నది. మరియు క్రింది కారణములవలన కూడ కర్తృత్వవిషయము అనుమానాస్పదమగుచున్నది.

1. 'భరత' పదము కొన్నిచోట్ల ప్రథమావిభక్తిలో ఉన్నది.

2. 'భరత' పదము 'నటుడు' అను అర్థమునందు పెక్కుచోట్ల ప్రయుక్తమైయున్నది.

3. 'భరత'శబ్దమునకు భావ-రాగ-తాళములు అను అర్థమును కొందరు చెప్పినారు.

4. మత్స్యపురాణముతప్ప తక్కిన పురాణములుకాని, రామాయణ-భారతములు కాని భరతుని నాట్యశాస్త్రకర్తగా పేర్కొనుటలేదు.

పై కారణములనుబట్టి భరతమహర్షి కల్పితపురుషుడనుట కవకాశమున్నది.

5. బొంబాయి ముద్రణమునందు గ్రంథాంతమున 'నందిభరతసంగీతపుస్తకము సమాప్తము' అని ఉండుటచే నంది (నందికేశ్వరుడు ?) కూడ ఈ నాట్యశాస్త్రమునకు కర్త అగుట కవకాశమున్నది.

ఆయా కారణములనుబట్టి ప్రస్తుతనాట్యశాస్త్రము ఏకకర్తృకము కాదనియు, అది సంకలనగ్రంథమనియు తలంపబడుచున్నది. "నాట్యసంప్రదాయవేత్తయును, భరతుల (నటుల) యెడ ఆదరముకలవాడును అయిన ఎవరో ఒకరు ఆయా కాలములందు రచింపబడిన భాగములనన్నింటిని ఏకత్ర కూర్చి, మధ్య గల లోపములను తాను పూరించి, నటజాతికి గౌరవము నొసంగుటకై కర్తృత్వమును పురాణపురుషున కాపాదించి గ్రంథమును ప్రచారములోనికి తెచ్చియుండును. కాలక్రమమున నాట్యశాస్త్రకర్తగా భరతుని పేరు స్థిరపడిపోపుటయే కాక భరతుడు పురాణపురుషు డను విశ్వాసము ప్రబలియుండును.

కాళిదాసాదులు ఆ విశ్వాసముపై ఆమోదముద్ర వైచినారు" అనునది విమర్శకుల అభిప్రాయసారమని చెప్పవచ్చును.

ఇచ్చట ఒక ముఖ్య విషయమును గమనించవలసి యున్నది. సువిశాలమైన ఈ నాట్యశాస్త్రమందు పరస్పరవిరుద్ధములైన విషయములు కాని, స్వవచోవ్యాఘాతములు కాని లేవు. నాట్యశాస్త్రవిషయవివరణమునందు కన్పట్టు సూక్ష్మపరిశీలనాశక్తి, క్రాంతదర్శిత్వము ఆశ్చర్యావహములుగా నుండును. దీనినిబట్టి నాట్యశాస్త్రకర్త నిజముగా ఒక మహాపురుషుడు లేదా ఒక మహర్షి అనుటలో ఎట్టి ఆక్షేపణయును ఉండుటకవకాశము లేదు. ఆ మహర్షి కర్త కావచ్చును లేదా సంకలనకర్త కావచ్చును; ఆతడు కాళిదాసునకు పూర్వమే 'భరతు' డనెడి పేర సుప్రసిద్ధుడుగా నుండెను. కాళిదాసు క్రీ. పూ. ప్రథమ శతాబ్దికి చెందినవాడని నమ్మినచో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రూహించినట్లు ఈ భరతముని నాట్యశాస్త్రము క్రీ. పూ. 4 వ శతాబ్దికి చెందినది కాగలదు.

కావున నాట్యశాస్త్రము అతిప్రాచీనమైన దనియు, తత్కర్త యగు భరతుడు ముని అనియు నిస్సంశయముగా చెప్పవచ్చును.

వివిధనాట్యశాస్త్రములను గూర్చియు, తత్కర్తలను గూర్చియు డా. పి. ఎస్. శాస్త్రిగారు ప్రత్యేకవ్యాసమునందు చర్చించి యున్నారు. (చూ. ఒకటవ అనుబంధము)

## 3. పాఠభేదములు

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 40 వ్రాతప్రతులను సంపాదించి, సరిచూచినారు. వారు ఆ ప్రతుల నన్నింటిని మొత్తము రెండు భాగములుగా విభజించినారు— (1) ఉత్తర దేశపు ప్రతులు, (2) దక్షిణదేశపు ప్రతులు. ఇందులో దక్షిణదేశపు ప్రతులు ప్రాచీనమైనవనియు, ఉత్తరదేశపు ప్రతులు అర్వాచీనములైనవనియు వారు నిర్ణయించిరి. డా. మనోమోహన్ ఘోష్ కూడ ఈ విభజనమును అంగీకరించెను. అభినవగుప్తుడు ఉత్తరదేశపు ప్రతుల పాఠమునే అనుసరించెను. అందుచే బరోడా ముద్రణము కూడ తదనుసారముగానే ఉన్నది. దక్షిణదేశపు ప్రతులు ప్రాచీనములే కాక వైశాల్యమందును పెద్దవి. వాటిలో అచ్చటచ్చట నంది-కోహలాదుల మతమునకు చెందియున్న శ్లోకములు కూడ చేరిపోయినవని శ్రీ కవిగారు తెలిపినారు.

ఆయా ప్రతులందు కన్పించు భేదములకు అర్వాచీనాలంకారికులును, వ్రాయసకాండ్లును కారకులైయుందురనియు, శాస్త్రగ్రంథముల విషయమున రెండు భిన్నపాఠములుండుటకు అవకాశము ఉండదనియు, అందుచే పై విభజనము అనవసరమనియు శ్రీ కె. ఎస్. రామస్వామి శాస్త్రిగారు తలంచినారు.

నాట్యశాస్త్రముద్రణములను, వ్రాతప్రతులను పరిశీలించినచో ఈ క్రింది భేదములు కన్పట్టగలవు. (ఈ భేదములను అనువాదమందు ఆయా అధస్సూచికలలో వివరించియే ఉన్నాను).



1. 5 వ అధ్యాయము చివర 40 శ్లోకములు కొన్నింట సహజముగా ఉన్నవి. ప్రక్షిప్తములగుటచే కాబోలు తక్కినవానియం దివి లేవు.

2. 6 వ అధ్యాయము చివర శాంతరసప్రకరణము కొన్నింట అధికముగా కలదు. భరతుడు ఎనిమిది రసములకే వర్ణ-దైవతాదులను నిరూపించెను. కాళిదాసాదులు అష్టరసములనే పేర్కొనిరి. తొమ్మిది రసములను పేర్కొనిన ప్రథముడు ఉద్భటుడు. ఆతడు కాని, అంతకుముందువారు కాని శాంతరసప్రకరణమును నాట్యశాస్త్రమందు చేర్చియుందురు.

3. కొన్ని ప్రతులలో 8 వ అధ్యాయము రెండు అధ్యాయములుగా విభజింపబడెను. అందుచేతనే కాశీ ముద్రణము నందును, బొంబాయి-బరోడా ముద్రణము లందును అధ్యాయసంఖ్యలో భేదము కన్పట్టగలదు.

4. 12 వ అధ్యాయమున కంతటికిని భిన్నపాఠము కలదు. ఇందు శ్లోకముల వరుస తారుమా రగుటయే కాక పాఠభేదములును కలవు. ఇది బరోడా ముద్రణమునందు 12 వ అధ్యాయమున కనుబంధముగా నొసంగబడెను.

5. 14, 15 అధ్యాయములందు ఛందో వివరణములో కొన్ని ప్రతులు పింగలాదుల అర్వాచీనసంప్రదాయమును పాటించగా తక్కినవి కేవలము గురు-లఘుక్రమమునే పాటించెను. మరియు 14 వ అధ్యాయమందలి లక్షణములు కొన్నింట ఉపజాతి వృత్తములందుండగా, తక్కిన వాటిలో అనుష్టుప్ వృత్తములం దున్నవి. (నాట్యశాస్త్ర మధికభాగము అనుష్టుప్ వృత్తములందే రచింపబడెను)

6. 16 వ అధ్యాయమందు లక్షణముల నిర్వచనములు కొన్నింట ఉపజాతివృత్తములం దుండగా, మరికొన్నింట అనుష్టుప్ వృత్తములం దున్నవి. అభినవగుప్తుడు ఉపజాతి వృత్తపాఠమునే గ్రహించెను. మరియు ఈ అధ్యాయమందు అలంకార-గుణములను నిర్వచించెడి శ్లోకములు కొన్ని ప్రతులలో సరళముగను, తక్కినవాటిలో క్లిష్టములుగను ఉన్నవి. (నాట్యశాస్త్ర భాష సరళమైనదే.)

7. 8 వ అధ్యాయము వలెనే 17 వ అధ్యాయము కూడ కొన్ని ప్రతులలో రెండు అధ్యాయములుగా విభజింపబడెను.

8. కొన్ని ప్రతులలోని 34 వ అధ్యాయము తక్కినవాటిలో 24 వ అధ్యాయమైనది.

9. కొన్ని ప్రతులలోని 35 వ అధ్యాయమందలి కొంత భాగము తక్కిన ప్రతులలో ఒక ప్రత్యేకాధ్యాయ మైనది. (26 వ అధ్యా.)

10. కొన్ని ప్రతులలోని 32 వ అధ్యాయము తక్కినవాటిలో రెండు అధ్యాయములుగా విభజింపబడెను.

11. కొన్ని ప్రతులలో 36 వ అధ్యాయము రెండు అధ్యాయములుగా విభజింపబడెను.

పై మార్పు లన్నియును అభినవగుప్తునకు ముందే జరిగినవని తెలియవలెను.

## 4. వ్యాఖ్యాత : అభినవగుప్తుడు

నాట్యశాస్త్రమును పలువురు వ్యాఖ్యానించినట్లు తెలియుచున్నది. కాని, లభించినది శ్రీమదభినవగుప్తపాదాచార్యుని 'అభినవభారతి' ఒక్కటి మాత్రమే.

అభినవగుప్తుని పూర్వులు అంతర్వేది నివాసులు (గంగా-యమునల సంగమప్రదేశము). వారిలో ప్రసిద్ధుడైన అత్రిగుప్తుడు లలితాదిత్యుని కాలములో (క్రీ. శ. 8 వ శతాబ్ది చివరి భాగములో) అతని ఆహ్వానమును మన్నించి కాశ్మీరమునకు తరలిపోయెను. ఆ అత్రిగుప్తుని వంశమందు చుఖులుడు (లేదా నరసింహగుప్తుడు) అను మహేశ్వరభక్తుడు జనించెను. ఆ నరసింహగుప్తుని పుత్రుడే అభినవగుప్తుడు. అభినవగుప్తుని తల్లి పేరు విమలకళ. అభినవగుప్త డనునది బిరుదనామము.

ఇతడు ఆజన్మబ్రహ్మచారి; యోగసిద్ధుడు; పరమమాహేశ్వరుడు. పెక్కురు ఉపాధ్యాయులకడ ఈతడు వివిధశాస్త్రముల నభ్యసించెను; మొత్తము పదుమూడుగురు గురువులట! కావ్యశాస్త్రగురువు భట్టేందురాజు; నాట్యశాస్త్రగురువు భట్టతోతుడు. వీరిరువురిని గూర్చి అభినవభారతి ప్రారంభమందును, చివరను క్రిందివిధముగా పేర్కొనెను—

"సద్విప్రతోతవదనోదితనాట్యవేదతత్త్వార్థ మర్థిజనవాంఛితసిద్ధిహేతోః।
మాహేశ్వరాభినవగుప్తపదప్రతిష్ఠః సంక్షిప్తవృత్తివిధినా విశదీ కరోతి."
—(అభినవభారతి ప్రారంభమందు).

"...తస్యాత్మజోఽభినవ గుప్తపదాభిధానో భట్టేందురాజపదపాంసుపవిత్రమూర్తిః।
సద్విప్రతోతవదనా దధిగమ్య నాట్యవేదం విధత్త వివృతిం లఘు మర్థపూర్ణాం॥"
—(అభినవభారతి అంతమందు)

"యథా వాస్మదుపాధ్యాయస్య విద్వత్కవి సహృదయచక్రవర్తినో భట్టేందు రాజస్య"
—(లోచనము - పుట 160)

అభినవగుప్తుడు 24 గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. అందులో ఆరు ఆగమములకు సంబంధించినవి; ఎనిమిది ప్రత్యభిజ్ఞాదిశాస్త్రములకు సంబంధించినవి; ఎనిమిది స్తోత్రకావ్యములు (భైరవస్తవాదులు), రెండు కావ్య-నాట్యములకు సంబంధించినవి. ఇందులో కొన్ని వ్యాఖ్యానములు, తక్కినవి స్వతంత్రగ్రంథములు.

కావ్య - నాట్యములకు సంబంధించిన రెండును— ధ్వన్యాలోకవ్యాఖ్యానము 'లోచనము', నాట్యశాస్త్రవ్యాఖ్యానము 'అభినవభారతి'— వ్యాఖ్యానములు. ఇవి రెండును మూలగ్రంథకర్తల హృదయముల నావిష్కరించునవియై పరమప్రమాణములుగా నున్నవి. వ్యాకరణవిషయమున పతంజలివలె, దర్శనముల విషయమున ఆదిశంకరులవలె అలంకారశాస్త్రవిషయమున అభినవగుప్తుడు 'మహాభాష్యకారుడు'.

అభినవగుప్తుడు చివరి దశలో 1,200 శిష్యులతో, స్వీయ విరచితమగు భైరవస్తవమును పఠించుచు ఒక గుహలో ప్రవేశించి అంతర్ధానము చెందెనట; నేటికిని యాత్రికులకు ఆ గుహను స్థానికులు చూపుచుందురట. [డా. కె. సి. పాండే "అభినవగుప్తుడు" అను పేర ఒక గ్రంథమును ఆంగ్లమున ప్రకటించెను. అభినవగుప్తునిచరిత్ర అందు సమగ్రముగాకలదు].





అభినవగుప్తుని "ఈశ్వరప్రత్యభిజ్ఞావివృతివిమర్శిని" క్రీ. శ. 1014-15 లోను, భైరవస్తవము క్రీ. శ. 992-3 లోను రచింపబడెను. దీనినిబట్టి అభినవగుప్తుడు క్రీ. శ. 950 ప్రాంతముల జనించి, క్రీ. శ. 980-1020 మధ్య రచనలు చేసియుండును. అభినవగుప్తపాదాచార్యుల శిష్యుడనని క్షేమేంద్రుడు 'బృహత్కథామంజరి'లో చెప్పుకొనెను.

అభినవగుప్తుని 'అభినవభారతి' లేనిచో నాట్యశాస్త్ర మర్థమగుటయే కష్టము. అభినవభారతి' ని అనుసరించియే నేను నా అనువాదమును సాగించియున్నాను; కావుననే నా అనువాదము "గుప్తభావప్రకాశికాసహితము" అని పేర్కొనబడినది.

## 5. బరోడా ముద్రణ సంపాదకులు శ్రీ మానవల్లికవి

మద్రాసు (నుంగంబాకం) లో జననము. తండ్రి శ్రీ రామశాస్త్రిగారు. కవిగారు భరతకోశప్రారంభశ్లోకములందు స్వీయచరిత్రను కొంత క్రిందివిధముగా చెప్పుకొనినారు—
"వేంకట కుప్పాఖ్యుడనెడి సోమపీథికి రామశాస్త్రియను పుత్రుడు జనించెను. ఆయన అష్టాదశభాషాపండితుడు; నాట్యశాస్త్రవ్యాఖ్యాత. వారి పుత్రుడైన రామకృష్ణాఖ్యుడు (కవిగారు) పూర్వాచార్యవినిర్మితములును, నష్టప్రాయములును అయిన మహాగ్రంథములను అన్వేషించి కనుగొనెను. అందులో భట్టాభినవగుప్తవిరచితమగు 'అభినవభారతి' యు, నాట్యశాస్త్రమును కలవు. అందలి మహార్థములను తెలిసికొనుటకు సంస్కృతనాట్యవాఙ్మయమునెల్ల నిశ్శేషముగా చిరకాలము అధ్యయనము చేసెను.... పిమ్మట విద్యావ్యసనుల ముదముకొరకు 2½ సంవత్సరములపాటు శ్రమించి భరతకోశమనెడి ఈ పారిభాషికపదకోశమును నిర్మించి, 69 సంవత్సరముల వయస్సులో శ్రీ వేంకటేశ్వరదివ్యశ్రీపాదములందు సమర్పించెను."

కవిగారు 14, 15 సంవత్సరముల వయస్సులో 'మృగావతి' అను ఉత్తమప్రబంధమును రచించిరి. ఇది 1890 లో 'వైజయంతి' లో ప్రకటింపబడెను. అప్పుడు వీరికి 'కవి' బిరుద మొసంగబడెను. నాటినుండియు వీరికి 'కవి'గారనియే పేరు. (ఎమ్. ఆర్. కవి).

కవిగారు కవులే కాక ఉత్తమపరిశోధకులు కూడను. వీరు సంస్కృత-ఆంధ్ర-ఆంగ్ల-తమిళ-కన్నడ-మళయాళాది భాషలందు పండితులు; ఎం. ఏ. పట్టభద్రులు. నశించిపోయిన వనుకొన్న పెక్కు సంస్కృత-ఆంధ్ర గ్రంథములను కనుగొని, వెలుగులోనికి తెచ్చుటయే కాక పరిష్కరించి, "విస్మృతకవులు" అనెడి శీర్షికతో ప్రకటించిరి— అట్లు ప్రకటింపబడిన వానిలో నన్నిచోడుని కుమారసంభవము, వల్లభామాత్యుని క్రీడాభిరామము మొదలగునవి తెలుగు గ్రంథములు; చతుర్భాణి, కుందమాల మొదలగునవి సంస్కృతగ్రంథములు. శృంగారప్రకాశము, తాపసవత్సరాజము మొదలగు ఉత్తమగ్రంథములను కనుగొని లోకమునకు తెలిపినవారును కవిగారే. వీరు 40 అభినవభారతి ప్రతులను సంపాదించి, పరిష్కరించి, నాట్యశాస్త్రసహితముగా ప్రకటించినారు (బరోడా ముద్రణము). వీరి భరతకోశము నాట్య-సంగీతవిజ్ఞానసర్వస్వము.

బరోడాముద్రణసంపాదకులు



కీ. శే. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఏ.



అభినవభారతిని పరిష్కరించుటలో వారెంత శ్రమపడవలసివచ్చినదో వారి ఈ క్రింది వాక్యములు తెలుపగలవు—"The originals are so incorrect that a scholar friend of mine is probably justified in saying that even if Abhinavagupta descended from heaven and saw the MSS he would not easily restore his original reading. It is in fact an impenetrable jungle through which a rough path now has been traced" (నా. శా - 1 వ సం-పీఠిక పుట 63)

సంస్కృతసాహిత్యపునరుద్ధరణమునకు ప్రయత్నించిన పరిశోధకులలో శ్రీకవిగారు 'దీప స్తంభము' (Light House) వంటివారనియు, వారు స్వయముగా ఒక 'సంస్థ' అనియు 1928 లో డా. కె. పి. జయస్వాల్ పొగడియున్నారు. అంతర్జాతీయఖ్యాతిని గాంచిన సాహిత్యపరిశోధకులలో శ్రీ కవిగారు ప్రముఖులగుట ఆంధ్రులకు గర్వకారణము. శ్రీ కవి గారికి సాహిత్యప్రపంచములోని కవి - పండిత - విమర్శకులెల్లరును ఆనాడు జోహారు లొనర్చినారు.

శ్రీ కవిగారి సిద్ధాంతములను గూర్చి దేశమున వాదోపవాదములు చెలరేగినవి. అయినను తన సిద్ధాంత మేదియో చెప్పివేయుటయే కాని వారెన్నడును వాదములలోనికి దిగలేదు. శ్రీ కవిగారు మంచి ఆత్మప్రత్యయము కలవారు. వారికి ఆత్మప్రత్యయ మెంత కలదో అంత నిగ్రహమును, వినయమునుకూడ కలవు. ఐశ్వర్యమును, సౌఖ్యమును ఆసించక కేవలము సాహిత్యసేవకే జీవితసర్వస్వమును అర్పించిన ధన్యులు వారు. ఆ మహాపురుషునకు నా మనస్సుమనస్సులు.

"సర్వస్మిన్ జగతీతలే స్థిరయశాః, నాట్యాగమాంభోనిధా
ఆపాతాళనిమగ్నమందరనగః, శ్రీమానవల్ల్యన్వయే।
క్షీరాబ్ధా వమృతాంశు రూర్జితవచాః శ్రీరామకృష్ణప్రధీః
నాట్యం వేద మదీధరత్ కరుణయా లోకప్రియంభావుకః॥"

## 6. ముద్రణములు

1. 1865 లో F. Hall తాను ప్రకటించిన 'దశరూపకము' నకు అనుబంధముగా నాట్యశాస్త్రమందలి నాలుగు అధ్యాయములను ప్రకటించెను. (నాట్యశాస్త్రము వెలుగు చూచుటకిదే ఆరంభము)

2. P. Regnaud 1880 లో 16 వ అధ్యాయమును, 1884లో 14, 15 అధ్యాయములను, తరువాత అదే సంవత్సరములో 6, 7 అధ్యాయములను ప్రకటించెను.

3. 1888 లో J. Grosset (Regnaud శిష్యుడు) 28వ అధ్యాయమును ప్రకటించెను.

4. 1894 లో పండితులు శివదత్త - కాశీనాథపాండురంగపరబ్‌లు బొంబాయిలో 'శ్రీ భరతముని ప్రణీత నాట్యశాస్త్రము'ను అంతవరకును దొరికిన వ్రాతప్రతుల సాహాయ్యముతో ప్రకటించిరి.

1943 లో పండిత కేదారనాథ - మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాద్‌ల సంపాదకత్వములో ఇది ద్వితీయ ముద్రణమును పొందెను.

5. 1898 లో J. Grosset మొదటి పదునాల్గు అధ్యాయములను పరిష్కరించి ఆంగ్లలిపిలో ప్రకటించెను. (First Critical Edition).

6. (1) ఈ శతాబ్ది ప్రారంభములో అభినవభారతి వ్రాతప్రతులు కొన్ని లభించినవి. 1926 లో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి సంపాదకత్వములో బరోడా ముద్రణము ప్రథమభాగము (1-7 అధ్యా) అభినవభారతీసహితముగా వెలువడినది.

ఇది శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రిగారి సంపాదకత్వమున 1956 లో రెండవసారి ముద్రింపబడెను.

(2) బరోడాముద్రణము రెండవభాగము (8-18 అధ్యా) శ్రీ కవిగారి సంపాదకత్వమున 1934 లో ప్రకటింపబడెను.

(3) బరోడా ముద్రణను 3 వ భాగము (19-27 అధ్యా) శ్రీ కవిగారి సంపాదకత్వమున 1954 లో ప్రకటింపబడెను.

(4) బరోడా ముద్రణము 4వ భాగము (28-37 అధ్యాయము). 1964 లో ప్రకటింపబడెను.

7. 1929 లో కాశీ ముద్రణము శ్రీ బతుక్‌నాథశర్మ-శ్రీ బలదేవ ఉపాధ్యాయుల సంపాదకత్వమున వెలువడినది.

## 7. అనువాదములు

1. 1వ అధ్యాయము 1880 లో ఫ్రెంచిభాషలోనికి అనువదింపబడెను. 1884 లో 14, 15 అధ్యాయములను ఫ్రెంచిభాషలోనికి శ్రీ P. Regnaud అనువదించెను.

2. 28 వ అధ్యాయమును J. Grosset- 1888 లో ఫ్రెంచి భాషలోని కనువదించెను. 1922 లో దీనిని B. Breoler జర్మను భాషలోనికి అనువదించెను.

3. 1936 లో డా. బి. వి. నారాయణస్వామినాయుడుగారును వారి మిత్రులును కలిసి 4 వ అధ్యాయమును "తాండవలక్షణ" మనుపేర ఆంగ్లభాషలోని కనువదించి మద్రాసులో ప్రకటించిరి.

4. 2 వ అధ్యాయమును పలువురు అనువదించిరి. వివరములకు పుట 52 చూడవలెను.

5. మొదటి మూడు అధ్యాయములు మాత్రమే బెంగాలీ - హిందీ భాషలలో అనూదితములైనవి.

6. 6 వ అధ్యాయమును 1926 లో సుబోధచంద్రముఖర్జీ శాస్త్రి ఆంగ్లభాషలోని కనువదించి గ్రంథరూపమున ప్రకటించెను.

7. డా. మనోమోహన్ ఘోష్ మొదటి 27 అధ్యాయములను ఆంగ్లభాషలోని కనువదించెను. ఇది 1950 లో ప్రకటింపబడెను. (The Royal Asiatic Society of Bengal, Calcutta.)

8. శ్రీ భాగవతుల కుటుంబరావుగారు మొదటి రెండు అధ్యాయములను తెలుగులోనికి అనువదించి 1958 లో "త్రిలింగ" లో ప్రకటించిరి.



9. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు మొదటి ఏడు అధ్యాయములను, 18, 19, 20, 21 అధ్యాయములను ఆంధ్రీకరించి గ్రంథరూపమున 1957 లో ప్రకటించినారు.

10. డా. పి. ఎస్. శాస్త్రిగారి ఆంధ్రానువాదము "నవభారతి" అను పత్రికలో ఇప్పుడు ప్రకటింపబడుచున్నది.

11. నా అనువాదమునందలి మొదటి 19 అధ్యాయములును ముందుగా "సంస్కృతి"లో ప్రకటింపబడెను (సెప్టెంబరు 1954-జనవరి, 1957).

12. క్రి. శ. 1600 ప్రాంతములవాడగు శ్రీ పోలూరి గోవిందకవి రాగతాళ చింతామణి, తాళదశప్రాణదీపిక అను గ్రంథములందు నాట్యశాస్త్రమందలి భాగములను కొన్నింటిని అనువదించెను.

## 8. శాస్త్రసమన్వయము

నేడు 'భరతనాట్యము' అను పదము సుప్రసిద్ధ మగుటచే నాట్యశాస్త్రము కేవలము 'నృత్యము' (Dance) నకు సంబంధించిన గ్రంథమని కొందరు అభిప్రాయపడుచున్నారు; కొందరిది కేవలము సంగీతము (Music) నకు సంబంధించిన గ్రంథమని అభిప్రాయపడు చున్నారు. కాని 'నాట్య' మనగా 'దశరూప' మని అర్థము ; ఇంకను సూటిగా చెప్పవలె నన్నచో ప్రయోగమున కుద్దేశింపబడిన రూపకము 'నాట్య' మనబడును.

కాన నాట్యమనునప్పుడు రూపకరచనయు, రూపకప్రయోగమును ప్రధానములగు చున్నవి. నాట్యశాస్త్రమందు కవిదృష్టితో రూపకరచనావిధానమును, ప్రయోక్తదృష్టితో ప్రయోగవిధానమును వివరింపబడెను. కావుననే నాట్యశాస్త్రము 'కవి - ప్రయోక్తృరుపదేశ పర'మని అభినవగుప్తుడు స్పష్టముచేసి యుండెను. రూపకరచనా-ప్రయోగసమయము లందు ఛందో-వ్యాకరణ-అలంకార - నృత్త - సంగీతాదుల జ్ఞానము కవి - ప్రయోక్త లిరువురకును ఆవశ్యకము. అందుచే ఇవికూడ ఆనుషంగికముగా ఇందు వివరింపబడెను. ఈ విషయమును నాట్యశాస్త్ర పఠనమునకు పూనుకొనువారు ముందుగా గ్రహించవలసి యున్నది.

నాట్యశాస్త్రమందు 36 అధ్యాయము లున్నవి. (కొందరు చివరి అధ్యాయమును రెండుగా విభజించి యుండుటచే 37 అధ్యాయములు కన్పట్టును). ఇందు 6 వేల శ్లోకములు కలవు ; అందుచేతనే దీనిని 'షట్సాహస్రి' అందురు. విషయసూచికనుబట్టి ఆయా అధ్యాయములందు వివరింపబడిన విషయము లెట్టివో, నాట్యశాస్త్ర మెంత విస్తృతమైనదో, అది ఎందుచేత వేదమనబడినదో తెలియగలదు.

నాట్యశాస్త్రమునందు మొత్తము పదునొకండు విషయములు వివరింపబడినట్లు నాట్యవేదసంగ్రహశ్లోకము తెలుపుచున్నది (చూ. పుట. 191)—

రసా - భావా - హ్యభినయాః - ధర్మీ-వృత్తి - ప్రవృత్తయః ।
సిద్ధిః - స్వరాః - తథాతోద్యం - గానం - రంగశ్చ - సంగ్రహః ॥

విషయసూచికను పరిశీలించినచో ఏ అధ్యాయమందు ఏ విషయములు కలవో తెలియగలదు. పైపదునొకండింటిలో ఏవిషయము ఎచ్చట ఉన్నదో ఇప్పుడిచ్చట వివరింతును.

1. రసములు (6 వ అధ్యా.)— భరతుడు అష్టరసములను మాత్రమే చెప్పెను. (శాంతము అర్వాచీనకాలములో తొమ్మిదవ రసమైనది). 6వ అధ్యాయమందు రసనిష్పత్తి, రస - భావసంబంధము, రసస్వరూపములు, వర్ణ - దైవతములు, రసముల విభావాదులు వివరింపబడెను.

నాట్యము రసప్రధానమైనది. అందుచే భరతుడు ముఖ్యవిషయములనెల్ల రసమును దృష్టియందుంచుకొనియే వివరించెను, "రసములు: విభావాదులు" అను పేర రసప్రాధాన్యమును వివరించు పట్టికను గ్రంథాంతమున అనుబంధముగా నొసంగుచున్నాను.

2. భావములు (7 వ అధ్యా.)- కావ్యార్థములను భావింప జేయునవి కాన ఇవి 'భావము' లనబడినవి. మొత్తము 49 భావములు కలవు. ఈ భావములు స్థాయి - వ్యభిచారి - సాత్త్వికభేదములచే మూడువిధములు. ఈ 49 భావముల లక్షణములు, భావ - విభావ - అనుభావముల స్వరూపములు, సాత్త్వికాభినయస్వరూప - ప్రాధాన్యములు 7 వ అధ్యాయమందు వివరింపబడెను. అర్వాచీనాలంకారికులు ఈ భావములను శృంగార రసపరముగా వివరించిరి. కాని భరతుడు వీనినెల్ల సర్వరససామాన్యముగా వివరించియుండుట గమనార్హము.

3. అభినయములు—అభినయములు నాలుగువిధములు - ఆంగికము, వాచికము ఆహార్యము, సాత్త్వికము. "ప్రయోగమును అభిముఖముగా నడిపించు"నవి కాన ఇవి అభినయము లనబడినవి. నాట్యశాస్త్రమునందు సగమునకుపైగా అభినయముల వివరణమే ఆక్రమించుకొనియుండుట గమనార్హము.

(1) ఆంగికాభినయము (4 వ అధ్యా; 8-12 అధ్యా; 25 వ అధ్యా.)-ఆంగికాభినయము ప్రయోక్తదృష్టితో వివరింపబడెను. ఇది ప్రధానముగా మూడు విధములు - ముఖజము, శారీరము, చేష్టాకృతము. ముఖజాభినయము 8 వ అధ్యాయమందును, శారీరాభినయము అనగా హస్తాద్యభినయము 9 వ అధ్యాయమందును 25 వ అధ్యాయమందును వివరింపబడెను. చిత్రాభినయమనెడి 25 వ అధ్యాయము 9వ అధ్యాయమునకు అనుబంధమని చెప్పవచ్చును. చేష్టాకృతము స్థూలముగా రెండు విధములని చెప్పవచ్చును. మొదటిది రంగప్రవేశ - స్థాన - ఆసన-గత్యాదులకు సంబంధించినది; ఇంక రెండవది నృత్తమునకు సంబంధించినది. ఇందు మొదటి భేదము 12 వ అధ్యాయమందును, రెండవ భేదము 4, 10, 11 అధ్యాయములందును వివరింపబడెను. 4, 8, 9, 10, 11, 12 అధ్యాయములు ఒండొంటితో సంబంధించియున్న విషయమును పుట 129 లో వివరించియున్నాను.

(2) వాచికాభినయము (14-19 అధ్యా.) - వాచికాభినయము లేదా వాగభినయము పాఠ్య (recitation) దృష్టితోడను, రూపకరచనాదృష్టితోడను వివరింపబడెను. 14, 15, 16 అధ్యాయములందు వ్యాకరణము, ఛందస్సు, నాట్యోపయోగి వృత్తములు, కావ్యలక్షణములు, అలంకారములు, గుణములు, దోషములు వివరింపబడెను. 17 వ అధ్యాయమందు ప్రాకృతభాషాస్వరూపము, భాషాభేదములు, నామ - సంబుద్ధివిధానములు రచనాదృష్టితో వివరింపబడెను. అందే 'కాకుస్వరము' అను పేరుతో పాఠ్యవిధానము



ప్రయోక్త దృష్టితో వివరింపబడెను. 18 వ అధ్యాయమునందు దశరూపముల లక్షణములును, 19 వ అధ్యాయమందు ఇతివృత్త నిర్మాణమును రచనాదృష్టితో వివరింపబడెను.

(3) ఆహార్యాభినయము (21వ అధ్యా)—నేపథ్యజమైన విధి (Make-up and costumes) ఆహార్యమనబడును. ఇది ముఖ్యముగా ప్రయోక్తదృష్టితో వివరింపబడెను. నాట్యమందలి నైపథ్యము నాలుగు విధములు - పుస్తము, అలంకారము, అంగరచన, సంజీవము. అలంకారము మాల్య - ఆభరణ - వస్త్రధారణములకు సంబంధించియున్నది. ఆభరణముల వివరణమునందు ప్రతిశిరముల (విగ్గులు మొ॥) వివరణము కూడ కలదు. అంగరచనమందు స్వభావజ - సంయోగజ - ఉపవర్ణములు వివరింపబడెను.

ప్రకృతులు వివిధావస్థలతో కూడియుందురు; వారు మొదట ఉచిత ఆహార్యముచే ఒప్పుచున్నచో తరువాత ప్రయోగము సులువుగా సిద్ధిని పడయగలదు.

(4) సాత్త్వికాభినయము (7, 22, 23 అధ్యాయములు) - సత్త్వమనగానేమో 7వ అధ్యాయమందు వివరింపబడెను. ఇంక సాత్త్వికాభినయము 22,23 అధ్యాయములందు వివరింపబడెను. సత్త్వమనునది కవి-ప్రయోక్త లిరువురకును, సామాజికునకును కూడ ఆవశ్యకమే. "నాట్యము సర్వమును సాత్త్వికాభినయము నందే ప్రతిష్ఠితమైయున్న"దనుట అతిశయోక్తి కాదు.

ఇచ్చట ఇంకొక ముఖ్యవిషయమును గమనించవలసియున్నది. రూపకగతులైన రామాదుల రూపములను, అవస్థలను ప్రయోక్తలు తమయం దారోపించుకొని తమ అభినయసామర్థ్యముచే సామాజికులకు నిజమైన రామాదులుగానే భాసించుచున్నారు. ప్రయోజ్యులైన రామాదులు వివిధప్రకృతులను కలిగియుందురు. అట్లే ప్రయోక్తలుకూడ రకరకములుగా నుందురు. ఇందు ప్రయోజ్యుల లక్షణములు 24 వ అధ్యాయమందును, ప్రయోక్తల లక్షణములు 35 వ అధ్యాయమందును వివరింపబడెను. ఇంక భూమికాన్యాసము మూడు విధములు— ఒక ప్రయోక్త ఆకార-స్వభావములచే ఒక భూమికకు సహజముగానే సదృశుడుగా ఉండవచ్చును (ఇది అనురూపము); లేదా విసదృశుడుగా ఉండవచ్చును (ఇది విరూపము); లేదా ఉభయాత్మకుడుగా ఉండవచ్చును (ఇది రూపానురూపము). ఈ విషయములును, ప్రయోగసిద్ధిదృష్టితో భూమికాన్యాసవిషయమున శ్రద్ధ వహించవలసిన ఆచార్యగుణములును 26 వ అధ్యాయమందు వివరింపబడెను. స్త్రీ భూమికలను స్త్రీలే నిర్వహించుట ఉత్తమమనెడి విషయమిందు స్పష్టముచేయబడెను.

4. ధర్మి (13 వ అధ్యా)—లోకధర్మి, నాట్యధర్మి అనెడి భేదములచే ధర్మి రెండు విధములు. ఏప్రయోగమైనను కొంత లోకసదృశముగా నుండును; కొంత లోకభిన్నముగా నుండును (ఇందులకు కవియును కొంతవరకు కారణభూతుడే). నాట్యము లోకసదృశముగా నుండుట లోకధర్మి అనబడును; ఇంక రచనావశమునను, ప్రయోగవశమునను లోకభిన్నముగా నుండుట నాట్యధర్మి అనబడును.

లోకవృత్తానుకరణమే నాట్యము. కాని, లోకమందలి స్థావర-జంగమముల భావ-చేష్టావిధిని శాస్త్రముచే నిర్ణయించుటకు శక్యముకాదు. ప్రకృతులు నానాశీలురుగా ఉందురు. శీలమునందే నాట్యము ప్రతిష్ఠితమైయున్నది. కావున భరతుడు లోకము నొక

ప్రమాణముగా పేర్కొనుటయేకాక ఇంచుమించుగా ప్రతి అధ్యాయమందును "నేనిచ్చట చెప్పక విడిచినవానినెల్ల లోకమునుండి గ్రహించవలెను" అని చెప్పుచుండును. నాట్యము పూర్తిగా లోకసదృశముగా నున్నచో దాని విశిష్టతయే నశించును. అందుచే నాట్య-లోక ధర్ముల సామరస్యపూర్వకమైన సమ్మేళనమే ఉత్తమనాట్యసిద్ధి హేతువుకాగలదు. ఈ రెండును, నాట్యధర్మికి చెందిన కక్ష్యావిభాగమును 13 వ అధ్యాయమందు వివరింపబడెను.

5. వృత్తి (20 వ అధ్యా)—వృత్తులు నాలుగు - భారతి, సాత్త్వతి, ఆరభటి, కైశికి. వృత్తి అనగా వ్యాపారము. వాక్ - మనః - కాయ వ్యాపారముల వైచిత్ర్యముతో కూడిన చేష్టలు వృత్తు లనబడును. వాగ్రూపమైన వ్యాపారము భారతీవృత్తి; మనోవ్యాపారము సాత్త్వతీ వృత్తి; కాయికమైన అనగా చేష్టాప్రధానమైన వ్యాపారము ఆరభటీవృత్తి; ఇంక ఆయా వ్యాపారములందు కన్పట్టు శోభాదికమెల్ల కైశికీవృత్తి. ఈ వృత్తులే నాట్యమునకు మాతృకలు.

6. ప్రవృత్తి (13 వ అధ్యా)—ధర్మి - కక్ష్యా విభాగములతోపాటు ప్రవృత్తియును 13 వ అధ్యాయమందే వివరింపబడెను. ప్రవృత్తి అనగా ఆయాదేశములకు సంబంధించిన వేష - భాషా - ఆచార - వార్తా వైచిత్ర్య ప్రసిద్ధి అని అర్థము. అనగా కట్టు - బొట్టు - నడతలనుబట్టి ఒక వ్యక్తి ఫలానిదేశమునకు చెందినవాడని గుర్తించుటకు తోడ్పడునది ప్రవృత్తి అనబడును. ప్రవృత్తులు నాలుగు - ఆవంతి, దాక్షిణాత్య, పాంచాలి, ఓఢ్రమాగధి. ఇవి నాలుగును నాలుగు వృత్తులకును సంబంధించి యున్నవి. ఈ సందర్భమున ప్రాచీన భౌగోళికవిభాగములు నిర్దిష్టములైనవి.

7. సిద్ధి (27 వ అధ్యా)—ప్రయోగము సర్వమును సిద్ధిని అపేక్షించియే ప్రదర్శితమగును. అట్టి సిద్ధి దైవిక - మానుష భేదములచే రెండు విధములు. మానుషసిద్ధి పది విధములు; ఇంక దైవికసిద్ధి రెండు విధములు. ఇచ్చట సిద్ధి కేవలము ప్రయోక్తదృష్టితో వివరింపబడెను. ఇందు నాటకపు పోటీల విషయమును, ప్రయోగసమయమున ప్రాశ్నికులు **(Judges)** గుర్తించవలసిన ఘాతములును (దోషములును), ప్రాశ్నికుల లక్షణములును, ప్రేక్షకుల లక్షణములును వివరింపబడెను.

8. స్వరములు (28 వ అధ్యా)—షడ్జ - ఋషభ - గాంధార - మధ్యమ - పంచమ - ధైవత - నిషాదములు ఏడును స్వరములు. ఈ అధ్యాయమందు శ్రుతులు, స్వరములు, గ్రామములు, మూర్ఛనలు, జాతులు వివరింపబడెను.

9. ఆతోద్యములు (29-31 అధ్యా; 33, 34 అధ్యా)—లక్షణాన్వితములైన ఆతోద్యములు నాలుగువిధములు - ఇందు తంత్రీగతమైన తతాతోద్యము 29 వ అధ్యాయమందును వంశగతమైన సుషిరాతోద్యము 30 వ అధ్యాయమందును, కాంస్యగతమైన ఘనాతోద్యము (తాలవిధానము) 31 వ అధ్యాయమందును, మృదంగాది అవనద్ధవాద్యములు 34 వ అధ్యాయమందును, వాదకగుణములు 33 వ అధ్యాయమందును వివరింపబడెను.

10. గానము (32-33 అధ్యా)— 32 వ అధ్యాయమందు ధ్రువాభేదములు, ధ్రువాగానవిధానము, ధ్రువల రస-భావ-ప్రకృతి సంయోజనము మొదలగునవి వివరింపబడెను. గాయక గుణములు 33వ అధ్యాయమందు వివరింపబడెను.



ఇచ్చట ఒక విషయమును గుర్తించవలసియున్నది. అర్వాచీనకాలములో ప్రచారము నందిన రాగములు, రాగిణులు మొదలగువాని వివరణములు నాట్యశాస్త్రమందు కన్పట్టవు; అందలి విషయములు కొన్ని నేడు ప్రచారమునందు లేవు.

11. రంగము (2, 3, 5 అధ్యా.)—రంగమను పదముచే నాట్యగృహనిర్మాణము, రంగపూజకూడ గ్రాహ్యములు. భరతసుతులు ఆరుబయట ప్రథమనాట్యప్రదర్శనము నొసంగిరి. కాని, విఘ్నకరులు విఘ్నములను కలిగించుటచే సురక్షితమైన నాట్యగృహమును నిర్మించుకొనవలసి వచ్చినది. అప్పుడు బ్రహ్మ ఆదేశము ననుసరించి విశ్వకర్మ నాట్యశాలను నిర్మించెను. దాని వివిధభాగములను రక్షించుటకు బ్రహ్మ ఆయా దేవతలను నియమించెను పై నాట్యగృహముతోబాటు విశ్వకర్మ మరికొన్ని నాట్యగృహములకుకూడ అవకాశమును కల్పించెను. ఆకారమునుబట్టి నాట్యగృహములు మూడువిధములు - వికృష్టము, చతురశ్రము, త్ర్యశ్రము. జ్యేష్ఠ - మధ్యమ - అవరములనెడి ప్రమాణభేదములచే పై మూడును మరల మూడేసివిధములుగా నుండును. ఈ నాట్యగృహముల, అందలి వివిధభాగముల నిర్మాణములు 2 వ అధ్యాయమందు వివరింపబడెను.

నూత్ననాట్యగృహప్రవేశసమయమున ఆ యా దేవతల నెట్లు పూజించవలెనో 3 వ అధ్యాయమందు వివరింపబడెను. ఇంక ప్రతిప్రయోగప్రారంభమందును రంగ-దేవతా పూజాదులు నిర్వర్తించవలసినవిధము 5 వ అధ్యాయమందు వివరింపబడెను. ప్రయోగ ప్రారంభమునకు ముందు జరిగెడి ఈ రంగపూజాదికములకు పూర్వరంగమని పేరు.

ఈ రంగదైవతపూజనము యజ్ఞకర్మతో సదృశమైనదనియు, చక్కని నాట్య ప్రయోగము నిచ్చువారు యజ్ఞయాజులతో సమానముగా సద్గతిని పొందుదురనియు చాల సార్లు స్పష్టముచేయబడెను. (కాళిదాసు నాట్యప్రయోగమును 'చాక్షుషక్రతు' వనుట గమనార్హము.) ఈ పూర్వరంగమునకు లౌకికమైన ప్రయోజనముకూడకలదు.

పై విధముగా రూపకరచనకు, రూపకప్రయోగమునకు సంబంధించిన సర్వ విషయములును నాట్యశాస్త్రమందు సవిస్తరముగా వివరింపబడెను.

ఇంక మిగిలిన ప్రశ్నలు మూడున్నవి: (1) నాట్యమనగా ఏమి? (2) ఇది ఎట్లు ఉత్పన్నమైనది? (3) మరి భూలోకమం దెట్లు వ్యాప్తికాంచినది? ఇందలి మొదటి రెండు ప్రశ్నలకును సమాధానములు ప్రథమాధ్యాయమందు కలవు; చివరిప్రశ్నకు సమాధానము 36 వ అధ్యాయమందు కలదు. నాట్యోత్పత్తికథలోని చారిత్రకసత్యములను పుట 24లో వివరించియున్నాను.

## 9. అనువాదవిధానము

1. నా నాట్యశాస్త్రానువాదమునందలి మొదటి 19 అధ్యాయములును "సంస్కృతి"లో ఇంతకుముందు ప్రకటితములైనవి. కాని ఆ అనువాదమునకును, ఇప్పటి

ఈ అనువాదమునకును పోలికయేలేదని చెప్పవచ్చును. వెనుకటి అనువాదముకంటె ఈ అనువాదము సమగ్రము. భాష సరళము. అధస్సూచికలందలి వివరణము అధికమైనవి. విశేషాంశములు క్రొత్తగా చేరినవి. ఈ విధముగా ఇది నూత్నసమగ్రానువాదమగుచున్నది.

ఋషులు ప్రశ్నించినట్లును, ఆ ప్రశ్నలకు సమాధానముగా భరతుడు నాట్యశాస్త్రమును బోధించినట్లును ఇందు కలదు. నేనును అదేవిధముగా, భరతుడు చెప్పుచున్నట్లే, అనువదించియున్నాను.

2. ఈనా అనువాదమును 4 భాగములుగా విభజింపవచ్చును.

(1) భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రమునకు యథాతథగద్యానువాదము. (పెద్ద పైపులో) - 'అభినవభారతి' ననుసరించి క్లిష్టపదములకు కుండలీకరణములందు అర్థముల నొసంగియున్నాను.

(2) అధస్సూచికలు - ఇవి మరల రెండు విధములు — మొదటి విధము అభినవభారతిలోని అంశములను యథాతథముగా ఉద్ధరించుట ; ఆ భాగములు బరోడాముద్రణమునందు ఏయే పుటలలో కలవో కుండలీకరణములందు పేర్కొనియున్నాను. ఇంక రెండవ విధము- సమన్వయపూర్వకమైన నా స్వీయవివరణము.

(3) 28 అధ్యాయములకు అంతములందు విశేషాంశములను వ్రాసియున్నాను. ఇందు ఆయా అధ్యాయములందలి క్లిష్టసమస్యల సమన్వయములు, ఇతరాలంకార గ్రంథములతోడి పోలికలు, గ్రీకు-పాశ్చాత్య రూపకములకు సంబంధించిన వివరములుకలవు. (విశేషాంశములు లేని అధ్యాయములు ఎనిమిది - 10, 28-34)

(4) అచ్చటచ్చట ప్రధానములైన మూలశ్లోకములను ఉద్ధరించియున్నాను. గుర్తు తెలియుటకై ఆ శ్లోకములకు బరోడా ముద్రణమునందలి క్రమసంఖ్య పేర్కొనియున్నాను. (4 వ అనుబంధమును చూడవలెను).

3. ఈ గ్రంథమును అధ్యయనము చేయువారు ప్రతి అధ్యాయమును కనీసము రెండుసార్లు చదివినచో చక్కగా బోధపడగలదని విశ్వసించుచున్నాను. మొదటిసారి అధస్సూచికల ప్రమేయము లేకయే కేవలము మూలమును చదువవలెను. రెండవసారి అధస్సూచికలను సమన్వయించుకొనుచు చదువవలెను. పిమ్మట విశేషాంశములను చదువవలెను.

4. అనువాదమును చదువువారికి మూలాపేక్ష లేకుండ చేయుటకు ప్రయత్నించియున్నాను. ప్రతిశ్లోకమును విడివిడిగా అనువదించుటకు బదులు ఏకవిషయమును వివరించు కొన్ని శ్లోకములను ఒక ప్రమాణము **(unit)** గా గ్రహించి, వానిని ఒకే పేరాగా అనువదించి యున్నాను; ఒక్కొక్కచోట ఒక శ్లోకమే ఒక పేరా అగుటకూడ కలదు. ఏశ్లోకమున కాశ్లోకమును అనువదించి వేసినచో కొన్నిచోట్ల అన్వయము క్లిష్టముగా నుండును. అందుచే నేనే వానిని సమన్వయము చేసికొని అనువదించితిని. ప్రధానములైన నాట్యశాస్త్ర శ్లోకములను అనువాదమునందు యథాతథముగా ఉట్టంకించి వాని క్రిందనే అనువాదమును వ్రాసియున్నాను. శ్లోకము క్రిందనే '—' ఈ గుర్తుతో ప్రారంభమయ్యెడి వాక్యములు ఆ శ్లోకమునకు, లేదా ఆ శ్లోకపాదములకు అనువాదమని తెలియవలెను.



5. "నామూలం లిఖ్యతేకించి న్నానపేక్షిత ముచ్యతే" అని శ్రీమల్లినాథసూరి ప్రతిజ్ఞ. భరతుని మూలగ్రంథమును నేను యథాతథముగా అనువదించినాను (పెద్ద పైపులో ఉన్నది). అందు నేనధికముగా ఏమియును చేర్చలేదు. సంగీతాధ్యాయములందు తప్ప తక్కిన అధ్యాయములందు ఒక్కశ్లోకమునుకూడ విడువక సమగ్రముగా, సంతృప్తికరముగా అనువదించి యున్నాను. సంగీతాధ్యాయములందు అర్థము దుర్బోధమగుటచే అచ్చటచ్చట విడిచివేసినభాగములను ఆయా సందర్భములందే అధస్సూచికలలో విశదముచేసియున్నాను.

6. అభినవభారతీ వ్యాఖ్య 27 అధ్యాయములకు మాత్రమే ప్రకటితమైనది. 35, 36 అధ్యాయములకు వ్రాతప్రతిని సంపాదించుకొన్నాను. మొదట సంగీతాధ్యాయములను అనువదింపదలచలేదు. అందుచే ఆ అధ్యాయముల (28-34 అధ్యా) యొక్క అభినవభారతిని సంపాదించుటకు శ్రద్ధవహించలేదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి వ్రాతప్రతి నాయొద్ద కొంతకాలము ఉండెను. తరువాత వారడుగగా దానిని తిరిగి వారికి భద్రముగా అందజేసితిని. వారు చనిపోయినతరువాత వారి ఇతరగ్రంథములతోపాటు ఇదియును ఏమైనదో తెలియరాలేదు.

సంగీతాధ్యాయములు లేనిచో అనువాదము సమగ్రము కాదని మిత్రులును, పెద్దలును ప్రోత్సహింపగా సంగీతాధ్యాయముల అనువాదమును కూడ మొదలుపెట్టి తొందరగా ముగించుట జరిగినది. ఈ సందర్భమున శ్రీ శ్రీభాష్యం వేంకట నరసింహభాష్యకారాచార్యులుగారును, శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారును సాటిలేని సాహాయ్య మొనర్చినారు. ఈ అధ్యాయములలో ముఖ్యముగా 29, 31, 32, 33 అధ్యాయములు మహారణ్యమువలె ఉన్నవి. అయినను సాహసించి సంచార మొనర్చినాము. తెలిసినంతవరకును అనువదించుట జరిగినది. అభినవభారతి లభించియున్నచో అనువాదము ఇంతకంటె సమగ్రముగా, తృప్తికరముగాసాగియుండెడిది. (పై 5వ విషయమునుకూడ చూడవలెను).

7. విశేషాంశములందు అనేకవిమర్శకుల అభిప్రాయములను ఉట్టంకించుట జరిగినది. అందులో కొన్ని పరస్పరవిరుద్ధములైన అభిప్రాయములుకూడ కలవు. వానిలో కొందరి అభిప్రాయములు సరికావని డా. వి. రాఘవన్‌గారి అభిప్రాయము. ప్రతి అధ్యాయమునకును ఆ అధ్యాయమునే దృష్టియందుంచుకొని విశేషాంశములను వ్రాయుటచేత కొన్నిచోట్ల పునరుక్తములు తప్పలేదు. నాట్యశాస్త్రవిషయములను నేనిచ్చట సమగ్రముగా, సవిమర్శకముగా చర్చించుటకు ప్రయత్నించలేదు; కేవలము దిక్ప్రదర్శనముగా విషయవివరణ మొనర్చియున్నాను. పై కారణములచే డా. రాఘవన్ ఆశించిన "More critical...more compact and select—" అనుదానికి అవకాశము లేకపోయినది.

సవిమర్శాత్మకమైన **సమగ్రగ్రంథమును** ముందుముందు ప్రకటింపగలను.

8. ముద్రితములైన కాశీ-బొంబాయి-బరోడాముద్రణములలో అధ్యాయసంఖ్య కాశీముద్రణమునందు ఒక విధముగాను, బొంబాయి-బరోడాముద్రణము లందింకొకవిధముగాను ఉన్నది. ('పాఠభేదములు' అనెడి శీర్షికను చూడవలెను). శ్లోకసంఖ్యయందును మూడును విభిన్నములు. బరోడాముద్రణమునందు అభినవగుప్తుని విధాన మనుసరింపబడుటచే నేనుకూడ దానినే అనుసరించియున్నాను. అభినవగుప్తుడు ఆదిలో 36 అధ్యాయములని

చెప్పియు, చివరి అధ్యాయమును రెండుగా విభజించి మొత్తము 37 అధ్యాయములను కావించెను. నేను రెండింటిని కలిపివేసి ఒకే అధ్యాయముగా (36 వ అధ్యా.) గ్రహించితిని.

ప్రతి అధ్యాయప్రారంభమందును ఆయా ముద్రణములలో ఆ అధ్యాయమందలి మొత్తము శ్లోకసంఖ్యలను పేర్కొనియున్నాను. మూలమునుకూడ చూడగోరువారి గుర్తుకొరకు అధ్యాయముల మధ్యలోకూడ అచ్చటచ్చట అధస్సూచికలలో *ఈ గుర్తుతో మూడు ముద్రణములందును అచ్చటికైన శ్లోకసంఖ్యను పేర్కొనియున్నాను.

9. 2 వ అధ్యాయమందలి నాట్యగృహములను, 4 వ అధ్యాయమందలి కరణములను, 9 వ అధ్యాయమందలి హస్తములను పటరూపమున కూడ వివరించియున్నాను. కరణముల చిత్రములు చిదంబర నటరాజదేవాలయగోపురములందలి శిల్పములకు ప్రతికృతులు. ఇందు కొన్ని నాట్యశాస్త్ర శ్లోకములతో సంవదించుటలేదు. ఉదా : ప్రథమ కరణమైన తలపుష్పపుటమందు పుష్పపుటహస్తము (పుష్పాంజలి) వామపార్శ్వమందుండవలెను. కాని చిత్రమందు అట్లు లేదు. అర్గళమునకు సంబంధించిన కరణము కూడ సరిగా లేదు. అర్గళ మనగా 'గడియ' (bolt); కోట తలుపుల పెద్ద పెద్ద గడియలు వేయునప్పుడు వ్యక్తి ఏ స్థానము నందుండునో ఆ స్థానము నిచ్చట చూపవలసియున్నది. కాని, చిదంబరచిత్రము ఆవిధముగా లేదు. ఇట్టివే మరికొన్ని తేడాలు కలవు. నేను అచ్చటచ్చట చిన్న చిన్న మార్పులనుమాత్రము కావించియున్నానే కాని చిత్రములనే మార్చుటకు సాహసించలేదు; గోపుర చిత్రములను యథాతథముగా చూపుటకే యత్నించితిని.

డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కూడ తమ నాట్యశాస్త్రానువాదమందు ("నవభారతి"లో) నేను వ్రాయించిన కరణముల చిత్రములనే ఉపయోగించుకొనుచున్నారు.

10. భారతదేశమున నాట్యశాస్త్రమెంత ప్రామాణికగ్రంథమో, పాశ్చాత్యదేశములందు అరిస్టాటిల్ పండితుని 'పొయెటిక్సు' (కావ్యశాస్త్రము) అంత ప్రామాణికగ్రంథము. ఈ పొయెటిక్సు నాట్యశాస్త్రముకంటె ప్రాచీనమైనది. భిన్న దేశములందు, భిన్న కాలములలో విభిన్నదృక్పథములతో రచింపబడినప్పటికిని రెండు గ్రంథములును పెక్కు విషయములందు సమానాభిప్రాయములనే వెలిపుచ్చుట ఆశ్చర్యావహము కాకపోదు. నాట్యశాస్త్రమర్వాచీనమైనను దానిమీద గ్రీకుభావప్రాబల్యము లేదనియు, అది కేవలము స్వతంత్రగ్రంథమనియు విమర్శకులు నిరూపించియున్నారు. ఇంక పోలికలకు కారణము "సంవాదిన్యో మేధావినాం బుద్ధయః" (Great men think alike.) అని తెలియవలెను.

పొయెటిక్సులోని ముఖ్యాంశములను అచ్చటచ్చట విశేషాంశములందు వివరించియున్నాను. 'పొయెటిక్సు'కు సవిమర్శకమైన సమగ్రానువాదమును ఈ నాట్యశాస్త్రమునకు అనుబంధముగా నొసంగవలెనని తలంచితిని. కాని ఇదే వేయిపుటలగుటచే ఆ ప్రయత్నమును విరమించుకొంటిని. ఇంక, శ్రీ ఎమ్. నాగభూషణశర్మగారు సవిమర్శకముగా, సప్రమాణముగా చేసిన 'పొయెటిక్సు' అనువాదము 'నాట్యమాల' రెండవ ప్రచురణముగా త్వరలో ప్రకటితముకాగలదు.



11. నాట్యశాస్త్రమునకుకాని, అభినవభారతికి కాని సవిమర్శకముగా సంపాదింపబడిన ప్రతి లేదు. అట్టిదానిని కూర్చెడి ప్రయత్నములో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు సతమతమైనారు. అయినప్పటికిని అదికూడ అంతంతమాత్రముగానే ఉన్నది. కొన్నిచోట్ల మూలమును, మరికొన్నిచోట్ల అభినవభారతిని అర్థము చేసికొనుటకు తలబ్రద్దలు కొట్టుకోవలసినంత పని అయ్యెడిది. ఈ విషయములో నాకంటెను అధికముగా శ్రమపడినవారు శ్రీ శ్రీభాష్యము అప్పలాచార్యులుగారు. సంస్కృతాంధ్రములందు చక్కని పండితులైన ఆ మహానుభావుని సాహాయ్యమే లేనిచో నేనీ అనువాదనుమ గ్రంథరూపమున ప్రకటించుటకు సాహసించి యుండెడివాడను కాను.

అనువాద మంతయును ఇంచుమించుగా అభినవభారతీ వ్యాఖ్యను అనుసరించియే ఉన్నది. అభినవభారతి లేనిచోట్ల తక్కిన భాగములను దృష్టిలో పెట్టుకొని, సందర్భమును గమనించి, జాగ్రత్తగా అనువదించితిని. ఇట్లు గుప్త (నిగూఢములైన, లేదా అభినవగుప్తుని) భావములను ప్రకాశింపజేయునది అగుటచే విశేషాంశసహితమగు నా అనువాదమునకు శ్రీ సంపత్‌గారు "గుప్తభావప్రకాశిక" అని నామకరణముచేసి యున్నారు.

12. నేను పండితుడ ననెడి అహంకారముతోకాని, సమర్థుడననెడి అహంభావముతో కాని ఈ అనువాదమునకు పూనుకొనలేదు. వారును, వీరును "భరతుడట్లా అన్నాడు", "భరతు డిట్లా అన్నాడు" అని ఉపన్యాసములందు చెప్పెడిమాటలు నాలో కుతూహలమును రేకెత్తింపగా, నిజముగా భరతు డేమిచెప్పెనో తెలిసికొనవలెననెడి జిజ్ఞాసతో నాట్యశాస్త్రాధ్యయనమును ఆరంభించినాను. రెండువేల సంవత్సరములకు పూర్వము నాట్యశాస్త్రమందు చెప్పబడిన అపూర్వ విషయములను గ్రహించి ఆశ్చర్యచకితుడనైనాను. పాశ్చాత్యదేశములనుండి క్రొత్తగా మనము నేర్చుకొంటిమని భ్రమించెడి పెక్కు విషయములు రెండువేల సంవత్సరములనాటి నాట్యశాస్త్రమందే కలవు. ఇంతవరకును ఇది భారతీయ భాషలలోనికి సమగ్రముగా అనువదింపబడక పోవుట విచారకరము. నా నాట్యశాస్త్రాధ్యయనఫలమును సోదరనాట్యజిజ్ఞాసువులకును, కళాభిమానులకును కూడ పంచిపెట్టవలెననెడి ఆశయమే నన్నీ అనువాదమునకు ప్రేరేపించెను. ఇది సాహిత్యోపాసకులకును; నాట్యకళోపాసకులైననాటక సమాజముల వారికిని, సినీనటులకును నర్తకులకును సమానముగా ఉపకరింపగలదని విశ్వసించుచున్నాను.

నాట్యశాస్త్రమందు చెప్పబడినవాని నెల్ల నేడు యథాతథముగా అనుసరించవలెనని నా ఆశయము కాదు. కాలమునుబట్టి అభిరుచులు, పద్ధతులు మారుచుండుట సహజము. కాని, నాట్యశాస్త్రమందు సార్వజనీనములైన విషయము లెన్నియో కలవనియు, వానిని చక్కగా గ్రహించి, క్రొత్తపద్ధతులతో సమన్వయము చేసికొనినచో ఉత్తమనాట్యకళాసంప్రదాయములను నెలకొల్పగలమనియు నమ్ముచున్నాను.

పెద్దల ఆశీస్సులు, మిత్రుల సహకారము నన్ను అనుక్షణమును ప్రోత్సహించినవి. భగవదనుగ్రహము కలిమినినాకృషి ఫలించినది. చిత్తశుద్ధితో కావించిన ఈ నా కృషి సహృదయుల మన్ననలను పొందగలదని విశ్వసించుచున్నాను.

పోణంగి శ్రీరామ అప్పారావు.





నాట్యశాస్త్ర ఆవిష్కరణము

మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తి
సాంస్కృతిక వ్యవహారాల శాఖామంత్రి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
హైదరాబాదు.

# అభినందన

నాట్యశాస్త్ర స్రష్ట బ్రహ్మ. ప్రవర్తకుడు భరతముని. శ్రోతలు ఆత్రేయాది మహర్షులు. ప్రయోక్తలు భరతపుత్రులు, అప్సరసలు. సహకారులు సర్వదేవతలు. తొలి సహృదయ ప్రేక్షకులు తాండవమూర్తి నటరాజు అయిన సదాశివుడు, లాస్యరూపిణి జగన్మాత అయిన పార్వతీదేవి-ఇదీ నాట్యశాస్త్ర పరంపర. నాట్యశాస్త్రానికి ఇంకో పేరు నాట్యవేదం; 'పంచమవేదం'గా కూడా ఇది సుప్రసిద్ధమైనది. సుమారు రెండు వేల సంవత్సరాల నాటిదైన నాట్యశాస్త్రాన్ని సరళమైన అనువాదంతో విశేషాంశాల వివరణలతో తెలుగులో వెలయింపజేశారు డా. పి.యస్. ఆర్. అప్పారావుగారు. ఇది నటులకు నర్తకులకు దర్శకులకు గురువులకు పెన్నిధి వంటిది.



కాని తొలిముద్రణ ప్రతులు ఏనాడో చెల్లిపోవటంవల్ల జిజ్ఞాసువు లెందరో ప్రతులు దొరకక నిరాశపడుతున్నారు. ఈనాడు నృత్య-నాట్య విద్యాలయాలు బహుళంగా నెలకొంటున్నాయి. విద్యార్థులకు, అధ్యాపకులకు దీని అవసరం ఎంతైనా ఉంది. అందుచేత ఈగ్రంథ ప్రాముఖ్యాన్ని గుర్తించి,పునర్ముద్రణకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భూరిసహాయాన్ని అందజేసింది. ఇందులో నాకు ప్రమేయం కలిగినందుకు నేను అధికంగా ఆనందిస్తున్నాను.

దీక్షతో కృషి సాగించడం ఒకఎత్తు! ఆ కృషి ఫలవంతమై నలుగురికీ ఉపయోగ పడటం ఇంకొకఎత్తు!! ఈ విధంగా డా. అప్పారావుగారు అదృష్టవంతులు. డా. అప్పారావుగారిని అభినందిస్తూ, ఈ ద్వితీయ ముద్రణమును తెలుగు వారికి అందిస్తున్నాను.

14-1-1982

భాట్టం శ్రీరామమూర్తి

# పునర్ముద్రణ పీఠిక

గుప్తభావప్రకాశికా సహితమైన నా నాట్యశాస్త్ర ప్రథమ ముద్రణము 1958-59 సంవత్సరమున జరిగినది. ఈ గ్రంథావిష్కరణోత్సవము 20-3-1959 తేదీ సాయంకాలం 5-30 గం॥ హైదరాబాదు బర్కత్‌పురలోని ఆంధ్రయువతీ మండలిలో వైభవోపేతముగా జరిగినది. అవిష్కర్త, నాటి కేంద్రప్రభుత్వ ఆదాయ పౌరవ్యయ శాఖామాత్యులు మాన్యశ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు. సభాధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి తొలి అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు. కృతిస్వీకర్త స్వాతంత్ర్య సమరయోధులు రాయలసీమ రత్నము ఆయిన శ్రీ కల్లూరి సుబ్బారావుగారు. సరస్వతీపుత్ర శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులుగారు, కళావాచస్పతి శ్రీ కె. జగ్గయ్యగారు ఉపన్యాసకులు. సభానిర్వాహకులు శ్రీయుతులు మామిడిపూడి ఆనందం, బి. రామరాజు, ఎ. ఆర్. కృష్ణ, పతివాడ సూర్యనారాయణ, పోణంగి సత్యనారాయణమూర్తి, పాలకోడేటి సాంబశివరావుగార్లు. జీవితమున మరపురాని సంఘటన అది. ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రాంతములు సంగమించిన శుభసమయమది.

నా జీవితమున మరపురాని మరొక ముఖ్య సంఘటన భారతీయ సంస్కృతి ఒక్కచోట సంగమించిన శుభసమయము. 24-3-1961 తేదీ సాయంకాలం 5-30 గంటలకు న్యూఢిల్లీ విజ్ఞాన భవనములో నాటి భారత ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి సమక్షములో భారత ప్రథమ ప్రధానమంత్రి పండిట్ జవహర్ లాల్ నెహ్రూ గారినుండి నా నాట్యశాస్త్రమునకు కేంద్రసాహిత్య అకాడమీ వారి జాతీయ బహుమానము స్వీకరించుట.[1] ఈ బహుమానము స్వీకరించిన పదిరోజులకే నేను పి హెచ్. డి. డిగ్రీకి అర్హుడనని ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ప్రకటించుట జరిగినది!

బ్రహ్మప్రోక్తమైన "నాట్యశాస్త్రము" రెండువేల సంవత్సరముల నాడు భరతముని ద్వారా ఆత్రేయాది మహర్షులకు లభ్యమైనది. నాటి ఆ మహర్షి సంఘానికి ఆత్రేయుడు నాయకుడు! నేనును ఆత్రేయుడను (ఆత్రేయసగోత్రీకుడను)! మరి సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారు చెప్పినట్లుగా రెండువేల సంవత్సరముల తరువాత మరల "మౌనిరాజు భరతుండాత్మీయ రాహస్య లక్షణముల్ దీరిచి" ఆత్రేయుడనగు నన్ననుశాసించుట నా యదృష్టము!

[1] "రానున్నది ఢిల్లి భోగముల నూర్పిడి కాలము" అని 1959 లోనే డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారి అశంసన!

నాట్యశాస్త్ర ప్రథమముద్రణముజరిగి ఇప్పటికప్పుడే 23 సంవత్సరములైనది. ప్రథమముద్రణసమయమున దాని బరువు బాధ్యతలు ముందుగా అంచనా వేసికొనక పోవుటచేత ఆర్థికముగా చాల ఇబ్బందులకు నేను లోనుకావలసి వచ్చినది. గ్రంథవిక్రయము చేతకాక పోవుటచేత వందలకొలది పుస్తకములు ఉచితముగా చెల్లుబడి అయినవి. కాగా, ఆంధ్రప్రదేశ్ ఏర్పడుటకు పూర్వమే నేను హైదరాబాదు నివాసిని అయినప్పటికీ నేటికి కూడ స్వగృహమన్నది కట్టుకోలేకపోయినాను.

అయినప్పటికీ ఈ గ్రంథప్రచురణవలన పుష్కలముగా ఖ్యాతి లభించినది! సాంస్కృతిక రంగమున ఒక గుర్తింపు లభించినది! పలువురు పెద్దల సహృదయుల ఆదరాభిమానములు లభ్యమైనవి! పెద్దలు వెన్నుతట్టి ఆశీర్వదించినారు. సహృదయులు ప్రశంసించి, ప్రోత్సహించినారు. డా. నటరాజ రామకృష్ణవంటి నృత్యవేత్తలు, నాట్యాచార్యులు ఆత్మీయత అనుసంధించినారు. "అప్పారావుగారి నాట్యశాస్త్రమును అధ్యయనము చేసిన తరువాత కూచిపూడి నృత్యరహస్యములు నాకు బాగుగా అవగతమైనవి" అని డా. వెంపటి చినసత్యంగారు తమ ఉపన్యాసములలో పేర్కొనుచున్నారు-ఇవి అన్నియు నాకు కొండంత ధైర్యమొసంగినవి. నా కృషి సఫలమైనదన్న విశ్వాసము కలిగించినవి. శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు నెల్లూరు పిలిపించి, ఘనంగా సత్కరించారు.

ఈ రచనపై అక్కడక్కడ చిన్న చిన్న విమర్శలు కూడ వచ్చినవి. పునర్ముద్రణకు ముందు వాటిని మరల పరిశీలించినాను. కాని, నా అనువాదమును కాని, వ్యాఖ్యనుకాని మార్చుకొనవలసిన అవసరము నాకు కనిపించలేదు. ఇందుకు ఆయా విమర్శకులు నన్ను మన్నింతురని విశ్వసించుచున్నాను.

పునర్ముద్రణ సమయములో మూల గ్రంథమును కూడ యథాతథముగా ఈయవలెనని అనుకొనెడివాడను. అనగా గ్రంథము ఇంచుమించుగా రెట్టింపు కాగలదన్నమాట! అప్పుడు మొత్తం ముద్రణకు లక్షరూపాయలకంటె అధికము కావలసి ఉండును. అది నాకు సాధ్యమయ్యెడి పనికాదు. ఇంతకాలము పునర్ముద్రణమే నాకు సాధ్యము కాలేదు ప్రథమముద్రణపు ప్రతులు అయిపోయి చాలకాలమైనప్పటికని. ఇప్పుడైనను ఇది నాకు సాధ్యమయ్యెడిదికాదు-సహృదయుల అనురోధము, జిజ్ఞాసువుల కోరిక, మిత్రులు శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారి పట్టుదల, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాదరము, నాటి సాంస్కృతిక శాఖామాత్యులు మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారి ఔదార్యము నన్ను ఈ పనికి సాహసింపజేసినవి.

మరల ఇంత గ్రంథమును కంపోజ్ చేయుట చాల కష్టమైనపని. దీక్షగా చేసినప్పటికి చాలా కాలము పట్టగలదు. అందులో ఎన్ని ముద్రణ దోషములు

# పునర్ముద్రణ పీఠిక

గుప్తభావప్రకాశికా సహితమైన నా నాట్యశాస్త్ర ప్రథమ ముద్రణము 1958-59 సంవత్సరమున జరిగినది. ఈ గ్రంథావిష్కరణోత్సవము 20-3-1959 తేదీ సాయంకాలం 5-30 గం॥ హైదరాబాదు బర్కత్‌పురలోని ఆంధ్రయువతీ మండలిలో వైభవోపేతముగా జరిగినది. ఆవిష్కర్త, నాటి కేంద్రప్రభుత్వ ఆదాయ పౌరవ్యయ శాఖామాత్యులు మాన్యశ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు. సభాధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి తొలి అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు. కృతిస్వీకర్త స్వాతంత్ర్య సమరయోధులు రాయలసీమ రత్నము అయిన శ్రీ కల్లూరి సుబ్బారావుగారు. సరస్వతీపుత్ర శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులుగారు, కళావాచస్పతి శ్రీ కె. జగ్గయ్యగారు ఉపన్యాసకులు. సభానిర్వాహకులు శ్రీయుతులు మామిడిపూడి ఆనందం, బి. రామరాజు, ఎ. ఆర్. కృష్ణ, పతివాడ సూర్యనారాయణ, పోణంగి సత్యనారాయణమూర్తి, పాలకోడేటి సాంబశివరావుగార్లు. జీవితమున మరపురాని సంఘటన అది. ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రాంతములు సంగమించిన శుభసమయమది.

నా జీవితమున మరపురాని మరొక ముఖ్య సంఘటన భారతీయ సంస్కృతి ఒక్కచోట సంగమించిన శుభసమయము. 24-3-1961 తేదీ సాయంకాలం 5-30 గంటలకు న్యూఢిల్లీ విజ్ఞాన భవనములో నాటి భారత ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి సమక్షములో భారత ప్రథమ ప్రధానమంత్రి పండిట్ జవహర్ లాల్ నెహ్రూ గారినుండి నా నాట్యశాస్త్రమునకు కేంద్రసాహిత్య అకాడమీ వారి జాతీయ బహుమానము స్వీకరించుట.[1] ఈ బహుమానము స్వీకరించిన పదిరోజులకే నేను పి హెచ్. డి. డిగ్రీకి అర్హుడనని ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ప్రకటించుట జరిగినది!

బ్రహ్మప్రోక్తమైన "నాట్యశాస్త్రము" రెండువేల సంవత్సరముల నాడు భరతముని ద్వారా ఆత్రేయాది మహర్షులకు లభ్యమైనది. నాటి ఆ మహర్షి సంఘానికి ఆత్రేయుడు నాయకుడు! నేనును ఆత్రేయుడను (ఆత్రేయసగోత్రీకుడను)! మరి సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారు చెప్పినట్లుగా రెండువేల సంవత్సరముల తరువాత మరల "మౌనిరాజు భరతుండాత్మీయ రాహస్య లక్షణముల్ దీరిచి" ఆత్రేయుడనగు నన్ననుశాసించుట నా యదృష్టము!

[1] "రానున్నది ఢిల్లి భోగముల నూర్పిడి కాలము" అని 1959 లోనే డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారి ఆశంసన!

నాట్యశాస్త్ర ప్రథమముద్రణముజరిగి ఇప్పటికప్పుడే 23 సంవత్సరములైనది. ప్రథమముద్రణసమయమున దాని బరువు బాధ్యతలు ముందుగా అంచనా వేసికొనక పోవుటచేత ఆర్థికముగా చాల ఇబ్బందులకు నేను లోనుకావలసి వచ్చినది. గ్రంథవిక్రయము చేతకాక పోవుటచేత వందలకొలది పుస్తకములు ఉచితముగా చెల్లుబడి అయినవి. కాగా, ఆంధ్రప్రదేశ్ ఏర్పడుటకు పూర్వమే నేను హైదరాబాదు నివాసిని అయినప్పటికీ నేటికి కూడ స్వగృహమన్నది కట్టుకోలేకపోయినాను.

అయినప్పటికీ ఈ గ్రంథప్రచురణవలన పుష్కలముగా ఖ్యాతి లభించినది! సాంస్కృతిక రంగమున ఒక గుర్తింపు లభించినది! పలువురు పెద్దల సహృదయుల ఆదరాభిమానములు లభ్యమైనవి! పెద్దలు వెన్నుతట్టి ఆశీర్వదించినారు. సహృదయులు ప్రశంసించి, ప్రోత్సహించినారు. డా. నటరాజ రామకృష్ణవంటి నృత్యవేత్తలు, నాట్యాచార్యులు ఆత్మీయత అనుసంధించినారు. "అప్పారావుగారి నాట్యశాస్త్రమును అధ్యయనము చేసిన తరువాత కూచిపూడి నృత్యరహస్యములు నాకు బాగుగా అవగతమైనవి" అని డా. వెంపటి చినసత్యంగారు తమ ఉపన్యాసములలో పేర్కొనుచున్నారు-ఇవి అన్నియు నాకు కొండంత ధైర్యమొసంగినవి. నా కృషి సఫలమైనదన్న విశ్వాసము కలిగించినవి. శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు నెల్లూరు పిలిపించి, ఘనంగా సత్కరించారు.

ఈ రచనపై అక్కడక్కడ చిన్న చిన్న విమర్శలు కూడ వచ్చినవి. పునర్ముద్రణకు ముందు వాటిని మరల పరిశీలించినాను. కాని, నా అనువాదమును కాని, వ్యాఖ్యనుకాని మార్చుకొనవలసిన అవసరము నాకు కనిపించలేదు. ఇందుకు ఆయా విమర్శకులు నన్ను మన్నింతురని విశ్వసించుచున్నాను.

పునర్ముద్రణ సమయములో మూల గ్రంథమును కూడ యథాతథముగా ఈయవలెనని అనుకొనెడివాడను. అనగా గ్రంథము ఇంచుమించుగా రెట్టింపు కాగలదన్నమాట! అప్పుడు మొత్తం ముద్రణకు లక్షరూపాయలకంటె అధికము కావలసి ఉండును. అది నాకు సాధ్యమయ్యెడి పనికాదు. ఇంతకాలము పునర్ముద్రణమే నాకు సాధ్యము కాలేదు ప్రథమముద్రణపు ప్రతులు అయిపోయి చాలకాలమైనప్పటికిని. ఇప్పుడైనను ఇది నాకు సాధ్యమయ్యెడిదికాదు-సహృదయుల అనురోధము, జిజ్ఞాసువుల కోరిక, మిత్రులు శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారి పట్టుదల. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాదరము, నాటి సాంస్కృతిక శాఖామాత్యులు మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారి ఔదార్యము నన్ను ఈ పనికి సాహసింపజేసినవి.

మరల ఇంత గ్రంథమును కంపోజ్ చేయుట చాల కష్టమైనపని. దీక్షగా చేసినప్పటికి చాలా కాలము పట్టగలదు. అందులో ఎన్ని ముద్రణ దోషములు

మిగిలి పోవునో తెలియదు. అందువలన, ఖర్చు అధికమైనప్పటికీ "ఫోటో ఆఫ్ సెట్ ప్రోసెస్" లో దీనిని ముద్రించుటకు సాహసించినాను. పునర్ముద్రణకు ముందు ప్రథమముద్రణములో దొరలిన దోషాలను తొలగించి, నిర్దుష్టముగా ముద్రించుటకు ప్రయత్నించినాను.

నా నాట్యశాస్త్ర ప్రథమ ముద్రణము జరిగిన చాలకాలమునకు జాయప సేనాని నృత్తరత్నావళికి శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి తెలుగు అనువాదము, శారదాతనయుని భావప్రకాశమునకు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ గారి తెలుగు అనువాదము మొ॥ ప్రకటితమైనవి. వీటి ముద్రణమును పర్యవేక్షించెడి సదవకాశమును ఆంధ్రప్రదేశ్ సం.నా. అకాడమీ వారు నాకు కలిగించినారు. అందున నృత్తరత్నావళికి అరువది పుటల ఉపోద్ఘాతమును కూడ సంతరించినాను. పూర్వపు సంగీత నాటక అకాడమివారి కోరికననుసరించి నందికేశ్వరుని "అభినయదర్పణము"ను ప్రతిపదార్థ తాత్పర్య విశేషాంశములతో తెలుగున అనువదించినాను. దీనిని శీఘ్రముగా ముద్రించగలనని విశ్వసించుచున్నాను.

పెద్దలు పేర్కొన్నట్లుగా నాట్యశాస్త్రమునకు ప్రప్రథమముగా సమగ్రమైన అనువాదము వెలసినది తెలుగు భాషలోనే. అటులనే చతుర్విధాభినయనములను గూర్చి సమగ్రమైన రచన తెలుగులో వెలువరించవలెనన్న ఆశయముతో తొలుత నాట్యశాస్త్రమునకు పరిచయమువంటి గ్రంథమును రచించినాను (దీని ఆంగ్లానువాదము మాత్రమే 1967 లో ప్రకటితమైనది; ఇంకను అసలు గ్రంథము వెలువడవలసియున్నది). సమగ్రరచనాసిద్ధికి శ్రీ నటరాజు అనుగ్రహమును అర్థించుచున్నాను.

ఈ నాట్యశాస్త్రము పునర్ముద్రణ భాగ్యము పొందుటకు ప్రధాన కారకులు మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు, శ్రీ మామిడిపూడి గోపాలకృష్ణన్, శ్రీ పి. యమ్. మోహన్‌రావు, శ్రీ పి. ఆదినారాయణ, డా. అంతటి నరసింహం, శ్రీ త్రిపురనేని సుబ్బారావు, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి, శ్రీ ఎమ్. మురళీకృష్ణ గార్లు—ఈ సహృదయులందరకు కృతజ్ఞుడను.

ఈ గ్రంథము నటులకు, నర్తకులకు, దర్శకులకు, నృత్యగురువులకు ఎంత ఎక్కువగా వినియోగపడిన, నా కృషి అంత ఎక్కువగా ఫలవంతమైనదని భావించు కొందును.

15-8-1982 —పోణంగి శ్రీరామ అప్పారావు

# విషయసూచిక

## ఉపోద్ఘాతము


| | | పుట |
|---|---|---|
| 1. రచనాకాలము | ... | 4 |
| 2. కర్తృత్వము | ... | 6 |
| 3. పాఠభేదములు | ... | 7 |
| 4. వ్యాఖ్యాత: అభినవగుప్తుడు | ... | 9 |
| 5. శ్రీ మానవల్లి కవి | ... | 10 |
| 6. ముద్రణములు | ... | 11 |
| 7. అనువాదములు | ... | 12 |
| 8. శాస్త్రసమన్వయము | ... | 13 |
| 9. అనువాద విధానము | ... | 18 |


## నాట్యశాస్త్రము


పుటలు

1 వ అధ్యాయము 3-27

నాట్యోత్పత్తి (3-19) :

భరతునిప్రతిజ్ఞ - ఋషుల ప్రశ్నలు - నాట్యోత్పత్తిహేతువు - నాట్యోత్పత్తి - నాట్యవేదమును బ్రహ్మ భరతుని కొసంగుట - భరతపుత్రులు - కైశికీవృత్తి ప్రయోజనము - అప్సరసలు - మహేంద్రధ్వజోత్సవమందు నాట్యప్రయోగము - దేవతలు సంతుష్టులై బహుమానములొసంగుట - దైత్యదానవులక్షోభము - ప్రయోగము భంగపడుట - జర్జరోత్పత్తి - నాట్యగృహనిర్మాణము - నాట్యమండపభాగములు : అధిష్ఠానదేవతలు - విఘ్నకరులను బ్రహ్మ అనునయించుట - నాట్యస్వరూపము - నాట్యనిర్వచనము - రంగపూజాఫలము.

విశేషాంశములు (19-27) :

నృత్త నాట్య నృత్యములు - తాండవ లాస్యములు - నాట్యవస్తువు - మంత్రప్రయోగములు - అనుకరణము : ప్రాచ్యపాశ్చాత్యమతములు - నాట్యోత్పత్తి : శారదాతనయుని కథనము - నాట్యోత్పత్తికథ : చారిత్రకసత్యములు - గ్రీకునాటకోత్పత్తి - రాగతాళచింతామణి.

2 వ అధ్యాయము 28-65

నాట్యమండపములు (28-51) :

ఋషుల ప్రశ్నలు - నాట్యమండపభేదములు - ప్రమాణములు - మధ్యమగృహము శ్రేష్ఠము - భూమిశోధనము : కొలతలు - వికృష్టనాట్యమండపనిర్మాణము - చతుర్వర్ణ

స్తంభములను స్థాపించుట - మత్తవారణి - రంగపీఠరంగశీర్షములు - శిల్పకర్మ - కుడ్య నిర్మాణము - మండపాకారము - చిత్రకర్మ - చతురశ్ర నాట్యమండప నిర్మాణము - స్తంభములు : ఆసనములు - ద్వారములు - రంగపీఠ రంగశీర్షములు (చతురశ్రమండప మందు) - త్ర్యశ్ర నాట్యమండపము.

విశేషాంశములు (52-65):

నాట్యమండపనిర్మాణములనుగూర్చి చర్చచేసిన ప్రముఖులు-ఆచార్య డి. సుబ్బారావు గారి నూత్నవ్యాఖ్యానము - నాట్యమండపముల నిర్మాణము : ఇతరలక్షణకర్తలు - రాజప్రాసాదమందలి నృత్యశాల - శ్రీకృష్ణదేవరాయలనగరులోని నాట్యశాల-తంజావూరు రాజప్రాసాదములోని బహిరంగప్రదర్శనశాల-నాగార్జునకొండలోని బహిరంగప్రదర్శనశాల - విప్రదాసుని సంగీతచంద్రము - రాగతాళచింతామణి - గ్రీకు-రోమను-ఆంగ్లనాటకశాలలు.

3 వ అధ్యాయము 66-75

రంగదేవతాపూజనము (66-73):

నాట్యమండపమున పూజించవలసిన దేవతలు - దేవతానివేశనము - మంత్రములు - రంగదైవత పూజాఫలము.

విశేషాంశములు (74-75)

మొదటి మూడు అధ్యాయముల సమన్వయము-రాగతాళచింతామణి.

4 వ అధ్యాయము 76-153

తాండవము (76-129):

అమృతమంథనప్రయోగము-శివుని సమక్షమున రూపకప్రయోగములు-నృత్తమును పూర్వరంగమందు కూర్చుట - అంగహారములు - నృత్తమాతృకాదులు - కరణముల ప్రయోజనాదులు - కరణమాతృకలు - సౌష్ఠవము - 108 కరణములక్షణములు - చిదంబర దేవాలయగోపురశిల్పములు (పుట 149 కూడ చూడవలెను) - కరణము లేర్పడు విధము - 32 అంగహారముల లక్షణములు - రేచకములు - పిండీబంధములు - నృత్తాంగములు - తాండవనిర్వచనము - ఋషుల ప్రశ్న - నృత్తప్రయోజనము - ఆసారిత ప్రయోగములు - ఆసారితములు : పిండీబంధములు - గీతవిధి - సుకుమారనృత్తము - నృత్తము నిషిద్ధమైన సందర్భములు - భాండవాద్యప్రయోగవిధి.

విశేషాంశములు (129-153):

అధ్యాయముల సమన్వయము - తాండవము : నృత్తము - కరణములు - అంగహారములు - నృత్తనాట్యనృత్యములు : ఇతర లక్షణకర్తల అభిప్రాయములు - పదార్థవాక్యార్థాభినయములు - నట్ నృత్ ధాతువుల పౌర్వాపర్యములు - నృత్తము : అభినవగుప్తుని వివరణము - ప్రసిద్ధనృత్యభేదములు (కూచిపూడి నృత్యాదులు) - ప్రసిద్ధ నృత్యభేదముల తారతమ్యము - నృత్తరత్నావళి : రామప్ప దేవాలయము - దేవదాసి : రాజనర్తకి - చిదంబర దేవాలయగోపుర శిల్పములు - శివతాండవము - పాశ్చాత్య నృత్త నృత్యములు.



5 వ అధ్యాయము 154-189

పూర్వరంగము (154-178) :

ఋషుల ప్రశ్నలు - పూర్వరంగనిర్వచనము - పూర్వరంగాంగములు - అంతర్యవనికాంగములు - యవనిక వెలుపల నిర్వర్తింపబడు అంగములు (బహిర్యవనికాంగములు)- బహిర్గీతవిధి (నిర్గీతము) - శుద్ధచతురశ్రపూర్వరంగవిధి - గీతకవిధి - ఉత్థాపనము - పరివర్తనము - చతుర్థకారప్రవేశము - అవకృష్టధ్రువ - నాంది - శుష్కావకృష్టధ్రువ - రంగద్వారము - చారి - మహాచారి - త్రిగతము - ప్రరోచన - శుద్ధత్ర్యశ్రపూర్వరంగవిధి - చిత్రపూర్వరంగము - నాటకప్రారంభము - గీత వాద్య నృత్తములను గూర్చిన సూచన - స్థాపకుడు - పూర్వరంగప్రయోగ ఫలము - ఐదువిధములగు ధ్రువలు.

విశేషాంశములు (178-189) :

పూర్వరంగము : ప్రయోజనము - పూర్వరంగము : లౌకికప్రయోజనము - ధ్రువాగానము - పూర్వరంగాంగములు సంక్షిప్తములగుట - పూర్వరంగము : భాసనాటకములు - నాంది - యవనిక : జవనిక - యవనిక : ప్రాచీనసంస్కృతరూపకప్రదర్శనములు.

6 వ అధ్యాయము 190-231

రసములు (190-213) :

ఋషుల ప్రశ్నలు - జ్ఞానములు అనంతములు, అనేకములు - నాట్యవేదసంగ్రహము-కారికానిరుక్తములు - నాట్యవేదమందు వివరింపబడిన విషయములు - రసములు - భావములు - అభినయములు - ధర్ములు - వృత్తులు - ప్రవృత్తులు - సిద్ధులు - స్వరములు - ఆతోద్యములు - గానములు - రంగములు - రసనిష్పత్తి సూత్రము - రససూత్రభాష్యము - రసభావముల కార్యకారణసంబంధము - రసములఉత్పత్తి - వర్ణ దైవతములు - శృంగారము (విప్రలంభ సంభోగభేదములు)-హాస్యము (ఆరు భేదములు)-కరుణము - రౌద్రము - వీరము-భయానకము - బీభత్సము - అద్భుతము - రసముల యందలి భేదములు - శాంతరసము.

విశేషాంశములు (213-231):

సంస్కృతసాహిత్యవిమర్శయందలి దశలు - రససంఖ్య - రససమీకరణవాదములు - రసరాజత్వము - రసముల ఉత్పత్తి: శారదాతనయుని కథనము - శాంతరసము - రసభేదములు - రసనిష్పత్తి: భిన్నమతములు - స్థాయిభావము రసమెట్లగును ? - రసము : సుఖ దుఃఖములు - రససామగ్రి : రసప్రతీతి - అరిస్టాటిల్ సిద్ధాంతము.

7 వ అధ్యాయము 232-266

భావములు (232-260) :

భావము - విభావము - అనుభావము - భావవిభావఅనుభావములు - భావముల యొక్క సామాన్యగుణయోగము - స్థాయిభావవిశిష్టత - స్థాయిభావములు - వ్యభిచారి భావములు - సాత్త్వికభావములు - అంగి అంగ రస వివేచనము.

విశేషాంశములు (260-266) :

రస భావాధ్యాయములు - స్థాయిభావము : స్థాయిత్వవ్యభిచారిత్వములు - హాస్యము - భావవివేచనము - సత్త్వము : సాత్త్వికాభినయము - నాట్యము : మరణము - నాట్యశాస్త్రము : ఆయుర్వేద శాస్త్రము.

8 వ అధ్యాయము 267-290

ఉత్తమాంగాభినయము (267-285) :

ఋషుల ప్రశ్నలు - అభినయము - ఆంగికాభినయము - శిరఃకర్మ - రసభావ దృష్టులు-స్థాయిభావదృష్టులు - సంచారిదృష్టులు - తారాకర్మ - దర్శనప్రకారములు - రసదృష్టులు - పుటకర్మ - భ్రూకర్మ - నాసాకర్మ - గండములు - అధరకర్మ - చిబుకకర్మ - ముఖరాగములు - గ్రీవాకర్మ.

విశేషాంశములు (285-290) :

అభినయము - రూపకము : ప్రదర్శనావశ్యకత - ఆంగికాభినయభేదములు - అభినయము : నాట్యము.

9 వ అధ్యాయము 291-325

అంగాభినయము (291-321) :

హస్తాభినయము - అసంయుతహస్తములు 24 - సంయుతహస్తములు 13 - హస్తాభినయవిధానము - నృత్తహస్తములు 30 - కరణసంశ్రయములైన హస్తములు - హృదయకర్మ - పార్శ్వకర్మ - జఠరకర్మ - కటికర్మ - ఊరుకర్మ - జంఘా కర్మ - పాదకర్మ.

విశేషాంశములు (321 - 325) :

నాట్యశాస్త్రము : అభినయదర్పణము - హస్తాభినయము : కథాకళి - అసంయుత హస్తములు - లక్షణగ్రంథములందలి శిరోహస్తాదిభేదములు (పట్టికకు పుట 390 చూడవలెను) - అభినయము : నాట్యము.

10 వ అధ్యాయము 326 - 339

చారీవిధానము (326 - 337) :

చారి - భౌమీచారులు - భౌమీచారుల వినియోగము - ఆకాశికీచారులు - ఆకాశికీచారుల వినియోగము - స్థానములు - న్యాయములు - సౌష్ఠవము - చతురశ్ర అంగము - ధనుష్కరణములు - వ్యాయామము.

విశేషాంశములు (338 - 339) :

చారులు - స్థానములు : న్యాయములు - సౌష్ఠవము : చాతురశ్ర్యము - డంకన్ పద్ధతి.

11 వ అధ్యాయము మండలములు 340-345

ఆకాశికీమండలములు - భౌమమండలములు.

12 వ అధ్యాయము 346-369

గతిప్రచారము (346 - 366) :

పాత్రల రంగప్రవేశము : లయతాలకలావిధి - రసగతులు - దేశానుసారులైన గతులు - విటకాంచుకీయుల గతులు - వ్యాధిగ్రస్తాదుల గతులు - దూరప్రయాణము చేసినవాని గతి - స్థూలకాయుని గతి - మత్తఉన్మత్తుల గతులు - వికలాంగుల గతులు - విదూషకునిగతి - అధములగు చేటశకారాదుల గతులు - పశుపక్ష్యాదుల గతులు - లోకప్రామాణ్యము - స్త్రీల స్థానకములు - స్త్రీలరంగపీఠపరిక్రమము - బాలురగతి - నపుంసకగతి - ప్రకృతివిరుద్ధమగు భూమికాధారణము - ఉపవేశనవిధి - ఆసనవిధి - శయనవిధి - లోకప్రామాణ్యము.



విశేషాంశములు (367-369) :

12 వ అధ్యాయము : పాఠాంతరము - అభినయము : గతిప్రచారము - విదూషకాదులు - లోకప్రామాణ్యము : నాట్యాచార్యప్రామాణ్యము.

13 వ అధ్యాయము 370-390

కక్ష్యవిభాగము, ప్రవృత్తి, ధర్మి (370-384) :

కక్ష్యావిభాగము - బాహ్యప్రయోగము - ప్రవేశనిష్క్రమణాదులు - దివ్యుల విషయమున కక్ష్యావిభాగాదులు - ప్రవృత్తులు - రంగపీఠపరిక్రమద్వైవిధ్యము - ప్రయోగద్వైవిధ్యము - ధర్మి - లోకధర్మి - నాట్యధర్మి.

విశేషాంశములు (384-390)

కక్ష్యావిభాగము - రంగప్రవేశాదులు - ధర్మి - పాశ్చాత్యుల వాదములు - ప్రవృత్తి - శిరోహస్తాదిభేదముల పట్టిక.

14 వ అధ్యాయము 391-407

వ్యాకరణము, ఛందస్సు (391-404) :

వ్యాకరణము - వాచికాభినయప్రాధాన్యము - సంస్కృతపాఠ్యము - స్వరాదులు - శబ్దలక్షణములు - నామాదులు - ఛందస్సు - కావ్యద్వైవిధ్యము - ఛందములు - వృత్తసంఖ్య - త్రికములు - ఛందములు : త్రికములు - సంపదాదులు - ప్రస్తారము - ఉద్దిష్టము - నష్టవృత్తజ్ఞానము.

విశేషాంశములు (405-407) :

వ్యాకరణము - ఛందస్సు - వృత్తాదులను వివరించు పట్టిక.

15 వ అధ్యాయము 408-440

వృత్తములు (408-435) :

సమవృత్తభేదములు 58 - పథ్యావృత్తభేదములు - ఇతరవృత్తభేదములు - ఆర్యావృత్తభేదములు - ఆర్యాగీతిలక్షణము.

విశేషాంశములు (435-440) :

ఛందస్సు - సువృత్తతిలకము : వృత్తౌచిత్యము - పాశ్చాత్యులు : వృత్తౌచిత్యము - తెలుగునాటకములు : పద్యములు

16 వ అధ్యాయము 441 - 480

లక్షణములు, అలంకారములు, గుణములు, దోషములు (441 - 459) :

లక్షణములు 36 - అలంకారములు 4 - దోషములు 10 - గుణములు 10 - వృత్త్యాదుల రసానుకూలసంయోజనము.

విశేషాంశములు (459 - 480) :

లక్షణములు - అలంకారములు - అలంకారసంఖ్యాభివృద్ధి - అలంకారసంప్రదాయాదులు - దోషములు - గుణములు - పాశ్చాత్యసాహిత్యవిమర్శ: అలంకారములు - సంస్కృతసాహిత్యవిమర్శ - సాహిత్యశాస్త్రదశలు - సాహిత్యశాస్త్రసంప్రదాయములు - రస-అలంకార-గుణ-రీతి-ధ్వని-వక్రోక్తి-అనుమితి-ఔచిత్యసంప్రదాయములు-ఔచిత్యవిశిష్టత.

17 వ అధ్యాయము 481_507

భాషా - సంబుద్ధి - నామ - కాకుస్వరవిధానములు (481-502) :

ప్రాకృతపాఠ్యము - సమానము - విభ్రష్టము - భాషాభేదములు - దేశభాషాభేదములు - ప్రకృతిభేదము ననుసరించి పాఠ్యభేదములు - భాషలు : విభాషలు - సంబుద్ధివిధానము - పురుషులను సంబోధించు విధములు - స్త్రీలను సంబోధించు విధములు - నామవిధానము - కాకుస్వరవిధానము - స్వరములు - స్థానములు - వర్ణములు - కాకువులు - అలంకారములు - అంగములు - విరామము - కృష్యాక్షరాదులు.

విశేషాంశములు (503-507) :

ప్రాకృతభాష - పాత్రోచితభాష - కాకుస్వరము - నామసంబుద్ధి విధానములు.

18 వ అధ్యాయము 508_560

దశరూపములు (508-531) :

దశరూపములపేర్లు - వృత్తులు - నాటకము - అంకము - ప్రవేశకము - ప్రకరణము - విష్కంభకము - నాటిక - సమవకారము - ఈహామృగము - డిమము - వ్యాయోగము - ఉత్సృష్టికాంకము - ప్రహసనము - భాణము - వీథి - వీథ్యంగములు.

విశేషాంశములు (531-560) :

రూప రూపకపదములు - రూపకరచనము : రూపకప్రదర్శనము - కొన్ని పారిభాషిక పదములు - రూపకోపరూపకభేదములు - రూపకములు పాఠ్యప్రధానములు - దశరూపపరిణామము - దశరూప లక్షణములు (పట్టిక) - నాటకాదులకు ఉదాహరణములు - తెలుగు భాషలో నాటకలక్షణము - పాశ్చాత్యరూపకములు - విషాదరూపకములు - ఆహ్లాద రూపకములు - ప్రహసనములు - దివ్యలీలారూపకములు - అద్భుతరూపకములు - మూకాభినయరూపకములు - బుట్టబొమ్మలు - గేయరూపకములు - నృత్యరూపకములు - సంగీత రూపకములు-సంస్కృతరూపకముల చరిత్ర-చైనాదేశపు రూపకములు-జపానుదేశపు రూపకములు.

19 వ అధ్యాయము 561_606

ఇతివృత్త నిర్మాణము (561 - 585)

ఇతివృత్తము - ఇతివృత్తభేదము - కార్యావస్థలు - అర్థప్రకృతులు - పతాకాస్థానకభేదములు - సంధులు - సంధ్యంగములు - సంధ్యంగప్రయోజనములు - ముఖసంధ్యంగములు - ప్రతిముఖసంధ్యంగములు - గర్భసంధ్యంగములు - విమర్శసంధ్యంగములు - నిర్వహణసంధ్యంగములు - సంధ్యంగసమీక్ష - సంధ్యంతరములు - అర్థోపక్షేపకములు - లాస్యాంగములు - నాటకలక్షణసంగ్రహము - నాట్యస్వరూపము-నాట్యము లోకానుసారి.





విశేషాంశములు (586 _ 606)

ఇతివృత్తము - ఆధికారికప్రాసంగికములు - సూచ్యము : దృశ్యము - అర్థోపక్షేపకములు - రంగమున నిషిద్ధములు - అన్యథాకల్పనము - కార్యావస్థలు - అంకసంఖ్య - అర్థప్రకృతులు - సంధులు - సంధినిర్వచనము - సంధి అంకముల సంబంధము - సంధ్యంగములు - సంధ్యంగప్రయోజనములు - సంధ్యంతరములు - పతాకాస్థానకములు - సారాంశము - ఇతివృత్తనిర్మాణము : పాశ్చాత్యులు - రూపకప్రయోజనము.

20 వ అధ్యాయము 607_625

వృత్తులు (607 - 620)

వృత్తుల ఆవిర్భావము - వృత్తులు నాట్యమం దుపయుక్తములగుట - భారతీవృత్తి - భారతీవృత్త్యంగములు - సాత్త్వతీవృత్తి - సాత్త్వతీవృత్త్యంగములు - కైశికీవృత్తి - కైశికీవృత్త్యంగములు - ఆరభటీవృత్తి - ఆరభటీవృత్త్యంగములు - వృత్తులు : రసయోజనము.

విశేషాంశములు (620-625) :

వృత్తుల ఉత్పత్తిక్రమము - వృత్తులసంఖ్య - భారతీవృత్తి - శ్రవ్యకావ్యము : వృత్తులు.

21 వ అధ్యాయము 626_654

ఆహార్యాభినయము (626-650) :

ఆహార్యాభినయప్రాధాన్యము - పుస్తము - అలంకారము - పురుషులభూషణములు - స్త్రీలభూషణములు - అలంకరణౌచిత్యము - వస్త్రవిధి - అమరావతీశిల్పచిత్రములు - ఔచిత్యము - అంగరచన - వర్ణములు - స్వభావజ సంయోగజ ఉపవర్ణములు - వర్తనము - ఉత్తమనటుడు - ప్రాణులు : అప్రాణులు - ఆయా ప్రకృతుల వర్ణభేదములు - శ్మశ్రుకర్మ - వేషములు - అమరావతీశిల్పచిత్రములు - ప్రతిశిరములు : కేశరచనము - అమరావతీశిల్పచిత్రములు - దృష్టులప్రాధాన్యము - సంజీవము - ప్రహరణములు - జర్జరము - దండకాష్ఠము - ప్రతిశీర్షకనిర్మాణము - నాట్యోపకరణములు.

విశేషాంశములు (650-654) :

ఆహార్యాభినయప్రాధాన్యము - ఆహార్యము : ఔచిత్యము.

22 వ అధ్యాయము 655_689

సామాన్యాభినయము (655-684) ;

సాత్త్వికాభినయము - అలంకారభేదములు - అంగజవికారములు - స్త్రీలకు స్వభావజములైన అలంకారములు - అయత్నజములైన స్త్రీల అలంకారములు - పురుషులయందలి సత్త్వభేదములు - శారీరాభినయము - ఆరు భేదములు (సూచాభినయాదులు) - వాచికాభినయము - వాచికాభినయమందలి ఇంకొక విభజనపద్ధతి - బాహ్య ఆభ్యంతర నాట్యములు - ఇంద్రియ ఇంద్రియార్థముల అభినయము - మనస్సును నిర్దేశించుట - కామోపచారము - కామము : శృంగారము - సుఖమునకు స్త్రీలు మూలము - స్త్రీల శీలభేదములు 23 - ఉపచారము - సుఖమునకు స్త్రీలే మూలము - బాహ్య ఆభ్యంతర కామోపభోగము - కామోత్పత్తి - దశకామావస్థలు - కామావస్థల సామాన్యాభినయము - ఆభ్యంతర కామోపచారము - వాసకోచితకాలములు - వాసకసజ్జాది అష్టవిధనాయికావస్థలు - అష్టవిధ నాయికాభినయము - రంగమున నిషిద్ధములు - నాయకునికొరకుప్రతీక్ష - ఈర్ష్య - ఈర్ష్యాభినయము - రంగమున నిషిద్ధములు - కామోపచారమందలి సంబోధనలు.

**విశేషాంశములు (685 - 689) :**
సామాన్యాభినయము - ఆరువిధములగు శారీరాభినయము - నాయికా నాయక భేదములు - లేపాక్షి చిత్రములు.

**23 వ అధ్యాయము** 690-701

**బాహ్యోపచారము (690-697)**
వైశికుడు- వైశికుని వయస్యుడు-దూతికలు-దూతీగుణములు కృత్యములు-అనురక్త-విరక్త - విరక్తికారణములు - విరక్తహృదయగ్రహణోపాయములు - వేశ్యల ప్రకృతులు - యౌవనభేదములు - కామతంత్రమందలి పురుషుల భేదములు - ఉపాయములు.

**విశేషాంశములు (698-701) :**
కామోపచారము - నాయకసహాయులు - చతుష్షష్టి కళలు.

**24 వ అధ్యాయము** 702-713

**స్త్రీ పురుష ప్రకృతిభేదములు (702-711):**
పురుషుల ప్రకృతిభేదములు - స్త్రీల ప్రకృతిభేదములు - ఇతరప్రకృతులు - చతుర్విధ నాయకులు-చతుర్విధనాయకసహాయులు - నాయకుడు - చతుర్విధనాయికలు - ఆభ్యంతర పరివారము - నపుంసకాది వర్గము - బాహ్యపరివారము.

**విశేషాంశములు (711-713) :**
ప్రకృతిభేదములు - గ్రీకు చైనాదేశములందలి విభజనము.

**25 వ అధ్యాయము** 714-733

**చిత్రాభినయము (714-730) :**
చిత్రాభినయము - ప్రకీర్ణవిషయములు - ఋతువులు - భావ విభావ అనుభావములు - అభినయసామాన్యలక్షణము - స్త్రీ పురుషులు హర్షాదులను అభినయించు విధానము - పక్షులు - మృగములు - భూతరాక్షసాదులు - దివ్యులు - ప్రకీర్ణవిషయములు - ఆకాశవచనాదులు - స్వప్నాయితాదులు - మరణము - పునరుక్తి - లోకప్రామాణ్యము : నాట్యధర్మి.

**విశేషాంశములు (731-733) :**
9, 25 అధ్యాయముల సమన్వయము - ప్రమాణములు - స్వగతాదులు.

**26 వ అధ్యాయము** 734-746

**ప్రకృతి పాత్ర వివేకము (734-743):**
ప్రకృతిపాత్రల త్రైవిధ్యము - పుస్తకర్మ-నటుని పరభావప్రవేశము-త్రివిధ భూమికాధారణములు - భూమికాధారణములకు ఉదాహరణ చిత్రములు - స్త్రీల కంఠములు స్వభావమధురములు - స్త్రీల నాట్యప్రయోగములు - ప్రయోగద్వైవిధ్యము - సంగీతాభ్యాసము - ఆచార్యలక్షణము - శిష్యలక్షణము.

**విశేషాంశములు (744- 746):**
ప్రకృతిపాత్రవివేకము - రంగస్థలము : స్త్రీలు.

**27 వ అధ్యాయము** 747-763

**నాట్యసిద్ధి (747 - 758) :**
సిద్ధి - మానుషసిద్ధి - వాఙ్మయశారీరసిద్ధులు - దైవసిద్ధి - ఘాతములు - ఘాతస్థానములు - ఘాతభేదములు - ప్రాశ్నికుల లక్షణములు - ప్రేక్షకుల లక్షణములు - నాటకపు





పోటీలు : ప్రాశ్నికుల విధులు - నాట్యప్రయోగకాలములు - నాట్యమునకు నిషిద్ధమైన కాలములు - సిద్ధిగుణములు.

**విశేషాంశములు (758 - 763) :**
సిద్ధి - సామాజికగతమైన సిద్ధి - నటగతమైన సిద్ధి - దైవసిద్ధి-మానుషసిద్ధి- నేటి ప్రదర్శనములు - నాటకపు పోటీలు.

**28 వ అధ్యాయము** **జాతిలక్షణము** 764-777
లక్షణయుక్తములగు ఆతోద్యములు - గాంధర్వము - గాంధర్వవేదసంగ్రహము - స్వరములు - గ్రామములు - శ్రుతులు - మూర్ఛనలు - తానములు - స్థానములు - సాధారణములు - జాతులు - దశవిధజాతిలక్షణములు : అంశగ్రహాదులు - జాతులందలి అంశాది వికల్పనము.

**29 వ అధ్యాయము** **తంత్రీవాద్యములు** 778-788
జాతులు : రసానుగుణప్రయోగము - స్వరములు : రసానుగుణప్రయోగము - స్వరములు : వాద్యానుగుణరసప్రయోగము - వర్ణములు - అలంకారములు - అలంకారముల లక్షణములు - గతులు - ధాతువులు - వృత్తులు - గత్యాశ్రయమగు వీణావాద్యము - విపంచీ వాద్యము - బహిర్గీతవిధి.

**30 వ అధ్యాయము** **వేణువు** 789-790

**31 వ అధ్యాయము** **తాళములు** 791-806
కాలము : కల : లయ - తాలము - తాలభేదములు - తాలక్రియలు - ధ్రువలయందలి తాలక్రియలు - ఆసారితాంగములు - వర్ధమానకము - సప్తగీతకములు - వస్తువికల్పనము - గాయకవాదకలక్షణములు - లయలు - యతులు - పాణులు.

**32 వ అధ్యాయము** **ధ్రువలు** 807-824
నారదప్రోక్తములు - ధ్రువాంగములు - అవస్థానమాశ్రయములగు ధ్రువాభేదములు - యథాస్థానరసోపేతములగు ధ్రువాభేదములు - ధ్రువలఛందోవృత్త నిదర్శనము - ఛందములు: ధ్రువలు - ధ్రువలయందలి గణమాత్రావికల్పనము - ధ్రువావికల్పనము - ప్రావేశిక్యాది ధ్రువలు - ధ్రువలు : రసభావప్రకృతిసంయోజనము - ధ్రువాప్రయోగవిషయమున గమనించవలసిన అంశములు - ధ్రువారచనము : ఔపమ్యసంవిధానము - ధ్రువలు : రసానుగుణ ప్రయోగసమయములు - ధ్రువలయందు వర్ణనీయవిషయములు - ధ్రువలు : భాషాసంవిధానము - ప్రయోగక్రమము : కలాగ్రహాదివిధి - నాట్యము : ధ్రువాగానప్రయోజనము.

**33 వ అధ్యాయము** **గాయక-వాదకగుణములు** 825-827
గాయకగుణములు - గాయికాగుణములు - వాదకగుణములు - గాత్రసౌష్ఠవము - కంఠగుణములు - కంఠదోషములు.

**34 వ అధ్యాయము** **అవనద్ధవాద్యములు** 828-850
అవనద్ధవాద్యోత్పత్తి - అంగ ప్రత్యంగవాద్యములు - అవనద్ధవాద్యములు - వాద్యసంగ్రహము - అక్షరవిధి : స్వరవ్యంజనసంవిధానము - మార్గములు - ప్రచారములు - ప్రచారములు : రసయోజనము - మార్జనలు - మృత్తికాలక్షణము - సంయోగములు - గతములు - వాద్యసామ్యములు - జాతులు : రసాద్యనుగుణప్రయోగము - గతములు - గ్రహవికల్పనము - తాండవాదులు : వాద్యవిధి - అలంకారములు - కుతపవిన్యాసము -

నాయకగతులు : వాద్యవిన్యాసము - ఆతోద్యలక్షణములు - చర్మలక్షణములు - వాద్యములు : అధిదైవతములు - హస్తలక్షణములు - హస్తగుణములు - వాదకలక్షణములు.

35 వ అధ్యాయము 851-859

సామాజికులు (851-857) :

ప్రకృతిపాత్రవివేకము - సామాజికులు : స్వరూపాదులు - నటుడు : రాజు - సామాజికులు : గుణములు - నాటకసమాజ సభ్యులు : వారి విధులు - భరతోపకారకులు.

విశేషాంశములు (858-859) :

24, 26, 35 అధ్యాయముల సమన్వయము - నాటకసమాజములు.

36 వ అధ్యాయము 860-870

నాట్యావతరణము (860-866) :

నాట్యశాస్త్రోపదేశమునుపొందిన ఋషులు - ఋషుల ప్రశ్నలు - పూర్వరంగవిధి నాందీపఠనముల ప్రయోజనము - నటులు శాపగ్రస్తులగుట - దేవతల అభ్యర్థనము - ఋషుల సమాధానము - భరతుని అనునయము - నహుషుడు భరతసుతులను భూలోకమునకాహ్వానించుట - నాట్యము భూలోకమం దవతరించుట - నటవంశోత్పత్తి - నాట్యవేద మాహాత్మ్యము - భరతవాక్యము.

విశేషాంశములు (867-870) :

అధ్యాయ విభజనము : అభినవగుప్తుడు - నాట్యావతరణము : శారదాతనయుని కథనము - నాట్యావతరణము : నందికేశ్వరుని కథనము - నటులపై నిషేధము - నాట్య మహిమ - నాట్యము : యోగము.

అనుబంధములు

1 వ అనుబంధము 873-886

నాట్యశాస్త్రకర్తలు : వ్యాఖ్యాతలు - డా. పి. ఎస్. శాస్త్రిగారి వ్యాసము

2 వ అనుబంధము 887-890

నృత్త-నాట్య-నృత్య-రస-అలంకారశాస్త్ర కర్తలు : గ్రంథములు

3 వ అనుబంధము 891-896

ఉపయుక్తగ్రంథసూచి

4 వ అనుబంధము 897-905

ఉదాహృతశ్లోకములు

5 వ అనుబంధము 906-911

రసములు : విభావాదులు (పట్టిక)

6 వ అనుబంధము 912-914

కొన్నిపదములకు అర్థములు

7 వ అనుబంధము 915

విషయానుక్రమణిక (పారిభాషికపదకోశ సహితము)

సందేశములు : ఆశీస్సులు

ఓమ్

# నాట్యశాస్త్రము

# అధ్యాయము 1

## నాట్యోత్పత్తి[1]

[కాశీముద్రణమునందు - 126 శ్లోకములును, బొంబాయిముద్రణమునందు - 128 శ్లోకములును, బరోడాముద్రణమునందు - 127 శ్లోకములును కలవు. ఇట్లు లెక్కింపబడినవేకాక లెక్కలోనికిరాని ప్రక్షిప్తశ్లోకములు లేదా అధికపాఠ శ్లోకములు ప్రతి అధ్యాయమున అన్ని ముద్రణములందును మరికొన్ని కలవు.]

### భరతుని ప్రతిజ్ఞ

ప్రణమ్య శిరసా దేవౌ పితామహ - మహేశ్వరౌ ।
నాట్యశాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతమ్ ॥

సృష్టికర్త యగు పితామహునకును, నటరా జగు మహేశ్వరునకును శిరము వంచి నమస్కారముచేసి, బ్రహ్మప్రోక్తమైన "నాట్య శాస్త్రము"ను ప్రవచింతును.

### ఋషుల ప్రశ్నలు

పూర్వ మొకనాడు మహాత్ములును, జితేంద్రియులును, ధీమంతులును అయిన ఆత్రేయాది మునులు నాట్యకోవిదుడైన భరతునియొద్దకు వచ్చిరి. అది అనధ్యయన దినము. వ్రతి యగు భరతుడు అప్పుడే జపమును ముగించెను. వాని చుట్టును సుతు లందరును పరివేష్టించియుండిరి. అప్పుడు మును లీ విధముగా భరతుని ప్రశ్నించిరి—

(1) "ఓ బ్రహ్మస్వరూప! మీచే సంగ్రథితమైన వేదసమ్మిత మగు ఈ 'నాట్య వేదము'[2] ఎట్లు అవతరించినది? (2) దీనిని గ్రహించుటకు అధికారు లెవ్వరు? (3) అంగము లెన్ని? (4) ప్రమాణ మేమి? (5) ప్రయోగవిధాన మెట్టిది?[3]

---

1. "నాట్యశాస్త్రోత్పత్తి" అనునది కాశీముద్రణ పాఠము.

2. నాట్య వేదము, నాట్య శాస్త్రము అనునవి పర్యాయపదములు. 'వేద' మనగా జ్ఞానము. శాస్త్ర మనగా శాసనోపాయము. 'శాసన' మనగా తిరుగులేని దని అర్థము చెప్పరాదు. నాట్యమునకు సంబంధించిన ఆ యా నియమముల నన్నింటిని ఒకచోట క్రోడీకరించిన సంగ్రహగ్రంథ మిది. [అభినవభారతి - 1వ సం. పుట 2.]

3. ఈ ఐదు ప్రశ్నలనుబట్టి నాట్య శాస్త్రము కవి-ప్రయోక్తల ఉపదేశార్థము సంగ్రథితమైనదని తెలిసికొనవలెను. కొంద రిచ్చట కవి-ప్రయోక్తలతోపాటు ద్రష్టను అనగా సామాజికుని కూడ చేర్చి చెప్పుదురు. అది సరికాదు. ఇందు ద్రష్ట నుద్దేశించి ఉపదేశించిన దేదియును లేదు. [అభినవభారతి - 1 వ సం. పుట 8; 327 వ పుటనుకూడ చూడవలెను.]

# అధ్యాయము 1

## నాట్యోత్పత్తి[1]

[కాశీముద్రణమునందు - 126 శ్లోకములును, బొంబాయిముద్రణమునందు - 128 శ్లోకములును, బరోడాముద్రణమునందు - 127 శ్లోకములును కలవు. ఇట్లు లెక్కింపబడినవేకాక లెక్కలోనికిరాని ప్రక్షి ప్తశ్లోకములు లేదా అధికపాఠ శ్లోకములు ప్రతి అధ్యాయమున అన్ని ముద్రణములందును మరికొన్ని కలవు.]

### భరతుని ప్రతిజ్ఞ

ప్రణమ్య శిరసా దేవౌ పితామహ - మహేశ్వరౌ ।
నాట్యశాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతమ్ ॥

సృష్టికర్త యగు పితామహునకును, నటరా జగు మహేశ్వరునకును శిరము వంచి నమస్కారముచేసి, బ్రహ్మప్రోక్తమైన "నాట్య శాస్త్రము"ను ప్రవచింతును.

### ఋషుల ప్రశ్నలు

పూర్వ మొకనాడు మహాత్ములును, జితేంద్రియులును, ధీమంతులును అయిన ఆత్రేయాది మునులు నాట్యకోవిదుడైన భరతునియొద్దకు వచ్చిరి. అది అనధ్యయన దినము. వ్రతి యగు భరతుడు అప్పుడే జపమును ముగించెను. వాని చుట్టును సుతు లందరును పరివేష్టించియుండిరి. అప్పుడు మును లీ విధముగా భరతుని ప్రశ్నించిరి—

(1) "ఓ బ్రహ్మస్వరూప! మీచే సంగ్రథితమైన వేదసమ్మిత మగు ఈ 'నాట్య వేదము'[2] ఎట్లు అవతరించినది? (2) దీనిని గ్రహించుటకు అధికారు లెవ్వరు? (3) అంగము లెన్ని? (4) ప్రమాణ మేమి? (5) ప్రయోగవిధాన మెట్టిది?[3]

---

1. "నాట్యశాస్త్రోత్పత్తి" అనునది కాశీముద్రణ పాఠము.

2. నాట్య వేదము, నాట్య శాస్త్రము అనునవి పర్యాయపదములు. 'వేద' మనగా జ్ఞానము. శాస్త్ర మనగా శాసనోపాయము. 'శాసన' మనగా తిరుగులేని దని అర్థము చెప్పరాదు. నాట్యమునకు సంబంధించిన ఆ యా నియమముల నన్నింటిని ఒకచోట క్రోడీకరించిన సంగ్రహగ్రంథ మిది. [అభినవభారతి - 1వ సం. పుట 2.]

3. ఈ ఐదు ప్రశ్నలనుబట్టి నాట్య శాస్త్రము కవి-ప్రయోక్తల ఉపదేశార్థము సంగ్రథితమైనదని తెలిసికొనవలెను. కొంద రిచ్చట కవి-ప్రయోక్తలతోపాటు ద్రష్టను అనగా సామాజికుని కూడ చేర్చి చెప్పుదురు. అది సరికాదు. ఇందు ద్రష్ట నుద్దేశించి ఉపదేశించిన దేదియును లేదు. [అభినవభారతి - 1 వ సం. పుట 8; 327 వ పుటనుకూడ చూడవలెను.]

ఈ విషయముల నన్నింటిని యథాపరిపాటిగా[4] మాకు వివరింప గోరుచున్నాము." ఆ మునుల ప్రశ్నల నాలకించి, నాట్యవేద కథాకథనోత్సాహి యై భరతముని ఇట్లు చెప్పెను—ఓ విప్రులార! మీరు శుచులై, అవహితమనస్కులై బ్రహ్మచే నిర్మితమైన[5] నాట్యవేదముయొక్క ఉత్పత్తిని వినుడు.

## నాట్యోత్పత్తి హేతువు

స్వాయంభువ మన్వంతరము మొదలు వైవస్వత మన్వంతరము వరకును ఏడు మన్వంతరములు. ప్రతి మన్వంతరమునందును కృతయుగము సమాప్తమై త్రేతా యుగము ప్రారంభ మగుచుండెడికాలములో ప్రజలు కామమునకును, లోభము నకును, ఈర్ష్యకును, క్రోధాదులకును వశులై గ్రామ్యధర్మప్రవృత్తి నవలంబించి (అనగా స్వధర్మమును విడిచినవారై) సుఖ-దుఃఖ సమ్మిశ్రితములైన జీవితములను గడపుచుందురు. ఇట్టి స్థితి ప్రతిమన్వంతరమునందును కృతయుగ-త్రేతాయుగ ముల సంధికాలములో సంభవించుచుండును. పూర్వము త్రేతాయు గారంభసమయ మున పై పరిస్థితియే సంభవించెను. అప్పుడు జంబూద్వీపమును దేవతలు, గంధర్వులు, యక్షులు, రక్షోగణములు, మహోరగులు ఆక్రమించుకొని ఉండగా లోకపాలురు ధర్మప్రతిష్ఠాపనాపరులై ప్రజలను స్వధర్మ నిరతులను చేయుటకు యత్నించుచుండిరి. దీని నంతటిని చూచి మహేంద్రాది దేవతలందరును ఒకనాడు పితామహుని సన్నిధికి వచ్చి ఈ క్రిందివిధముగా ప్రార్థించిరి—

"క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్"[6] 11

---

4. ఈ ప్రశ్నలకు సమాధానములు గ్రంథమం దంతటను వికీర్ణములై ఉన్నవి. అంతియేకాక ఒక క్రమములోకూడ లేవు. ఈ ప్రశ్నలకు సమాధానములేకాక, ప్రశ్నించ బడని అనేక విషయములుకూడ ఇందు వివరించబడినవని తెలియవలెను.

5. బ్రహ్మనిర్మిత మనుటచే ఈ నాట్య శాస్త్రము సదాశివుడు, బ్రహ్మ, భరతుడు అనువారు చెప్పిన మూడు మతములలో బ్రహ్మమతముయొక్క సారమును ప్రతిపాదించు చున్న దనియు, శాస్త్రకర్త మాత్రము భరతుడే అనియు గ్రహించవలెను. [అభినవభారతి - 1 వ సం. పుట 9]

6. హృద్యమైనది దృశ్యము, వ్యుత్పత్తిప్రదమైనది శ్రవ్యము; కాగా, ప్రీతి-వ్యుత్ప త్తులను కలిగించునదని అర్థము. మనస్సును ఆకర్షించునది క్రీడనీయకము. ప్రజల మనస్సులను ఆకర్షించి, గ్రామ్య ధర్మ ప్రవృత్తినుండి మరలించి, స్వధర్మ నిరతములను కావించి, ప్రీతి వ్యుత్పత్తుల నొసంగున దని సారాంశము [అభినవభారతి - 1 వ సం. పుట 11]. శ్లోకము లను, క్రమసంఖ్యతోసహా, బరోడా ముద్రణమునుండి ఉదాహరించుచున్నాను.



"దృశ్యమును, శ్రవ్యమును అయిన క్రీడనీయకమును (అనగా చూచుటకును, వినుటకును వీలయిన వినోదవస్తువును) మేము కోరుచున్నాము. శూద్రజాతులకు నేటి వేదముపై అధికారము లేదు. కాన సార్వవర్ణికమైన ఇంకొక వేదమును సృజించుము."

## నాట్యోత్పత్తి

దేవతల ప్రార్థనను అంగికరించి బ్రహ్మ వారిని పంపివేసెను. పిమ్మట తత్త్వ విదుడైన ఆ బ్రహ్మ సమాధిగతుడై చతుర్వేదములను స్మరించెను.

ధర్మ్యమర్థ్యం యశస్యం చ సోపదేశ్యం ససంగ్రహమ్ ।
భవిష్యత శ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్ ॥ 14
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్ ।
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరో మ్యహమ్ ॥ 15
జగ్రాహ పాఠ్య మృగ్వేదా త్సామభ్యో గీతమేవ చ ।
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణా దపి ॥ 17

"ధర్మప్రతిపాదకమును, చతుర్విధ పురుషార్థసాధకమును, యశస్కరమును, ఉపదేశ్యసహితమును, సమ్యక్ జ్ఞానప్రదమును, ముందుతరములవారికి సత్కర్మమార్గ మును ప్రదర్శించునదియును, సర్వశాస్త్రార్థసంపన్నమును, సర్వశిల్పప్రవర్తకమును,[7] ఇతిహాస సహితమును[8] అగునట్లుగా 'నాట్యము' అనెడి పంచమ వేదమును నిర్మిం

---

7. ఈ గుణము లన్నియును ఒకేచోట కూడి ఉండుటయే నాట్యమందలి విశేషము. ఇతిహాస మనగా దశరూప మని ఇచ్చట అర్థము. కాగా, నాట్యమందలి భేదములైన నాట కాదులందు ఒకేచోట పై సమస్త వస్తువులును సిద్ధించు నని సారాంశము. [సూచనము - బరోడా ముద్రణమునందు 14 వ పుటలో అభినవభారతీ వ్యాఖ్యలో ప్రథమ పాదమునందు "ఇతిహాసోపదేశక రూపకం సప్రభేదం" అని తప్పు పడినది. దానిని "ఇతిహాసో దశరూపకం సప్రభేదం" అని చదువుకొనవలయును. 16 వ పుటలోని చివరి పాదమునుకూడ పరిశీలించ వలయును.] పంచమవేద మనునప్పుడు 'పంచమ' మనునది సంఖ్యాప్రతిపాదకము కాదు. "నాలుగు వేదములను అతిశయించునది" అని మాత్రమే అర్థము.

8. "ఇతిహాస" పదమునకు రెండు వ్యుత్పత్తులను చెప్పవచ్చును: (1) కర్మఫలముతో సంబంధించిన అర్థములు ప్రత్యక్షములుగా ఎందు చూపబడునో అది ఇతిహాస మనబడును. (ఇతిః = ఏవమర్థే ప్రత్యక్ష నిర్దేశం ద్యోతయతి; హాః = ఇహాశబ్ద ఆగమః; ఆసః = ఆసనం; ఏవం ప్రకారాః ప్రత్యక్ష పరిదృశ్యమానా ఆగమికార్థాః కర్మఫల సంబంధ స్వభావా యత్ర ఆసతే). (2) హర్షపూర్వకమైన జ్ఞానవికాసమును కలిగించును కాన ఇతిహాస మనబడినది. (ఇతిః = జ్ఞానం; తస్య హాసః = హర్షపూర్వకో వికాసః.) [అభినవభారతి - 1 వ సం. పుటలు 11-12] ఇతిహాసమైన భారతమునుకూడ మనవారు పంచమవేదముగానే పరిగణించిరి. ఇతిహాసమునుండి కథలను గ్రహించి నాట్యమును నిర్మించినట్లు తరువాత బ్రహ్మ చెప్పును.

తును" అని బ్రహ్మ సంకల్పించి నాలుగు వేదములనుండియు నాలుగు నాట్యాంగములను గ్రహించి నాట్యవేదమును నిర్మించెను - ఋగ్వేదమునుండి పాఠ్యమును, సామవేదమునుండి గీతమును, యజుర్వేదమునుండి అభినయములను, అథర్వవేదమునుండి రసములను గ్రహించెను. ఇట్లు బ్రహ్మ, వేదోపవేదముల[9]కు సంబంధించి యుండునట్లు లలితాత్మకమైన నాట్యవేదమును సృష్టించెను.

నాట్యవేదమును బ్రహ్మ భరతుని కొసంగుట

పిమ్మట బ్రహ్మ ఇంద్రుని రావించి "నేను ఇతిహాసమును (దశరూపమును) సృష్టించితిని. దీనిని దేవతల కిమ్ము. కుశలులు, విదగ్ధులు, ప్రగల్భులు, జితశ్రములును అయినవారికి[10] ఈ నాట్యవేదమును సంక్రమింప జేయుము" అని చెప్పెను. అప్పు డింద్రుడు ప్రాంజలియై పితామహున కిట్లు విన్నవించెను—"ఈ నాట్యము యొక్క గ్రహణ - ధారణ - జ్ఞాన - ప్రయోగములందు దేవతలు అశక్తులు, ఉయోగ్యులును. వేద రహస్యజ్ఞులును, సంశితవ్రతులును అయిన ఈ ఋషులు (భరతుడును, తత్పుత్ర శతమును) నాట్యవేద గ్రహణ - ధారణ - ప్రయోగములకు[11] సమర్థులు. దీనిని వారికే యిమ్ము." అంతట అంబుజ సంభవుడు నన్ను పిలిచి - "ఓ అనఘ! పుత్రశత యుక్తుడవైన నీవు దీనికి ప్రయోక్తవు కమ్ము" అని ఆదేశించి, నాకు నాట్యవేదమును బోధించెను. పిమ్మట యోగ్యులైన నా పుత్రులకు నేను గీనిని సాకల్యముగా నేర్పి, ప్రయోగ విధానమును కూడ చెప్పితిని.

భరత పుత్రులు

1. శాండిల్యుడు
2. వాత్స్యుడు
3. కోహలుడు
4. దత్తిలుడు
5. జటిలుడు
6. అంబష్టకుడు
7. తండువు
8. అగ్నిశిఖుడు
9. సైంధవుడు
10. పులోముడు
11. శాద్వలి
12. విపులుడు

---

9. ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వవేద శిల్పవేదములు నాలుగును ఉపవేదములు. ఇవి క్రమముగా ఋగ్ - యజుస్ - సామ - అథర్వ వేదములకు సంబంధించినవి.

10. కుశలులు=గ్రహణధారణ యోగ్యులు ; విదగ్ధులు=ఊహాపోహ సమర్థులు; ప్రగల్భులు=సభాకంపము లేనివారు ; జితశ్రములు=వ్యాయామాభ్యాసాదులచే అలసట లేని సముచిత దేహములు కలవారు. [అభినవభారతి - 1 వ సం. పుట 17]

11. గ్రహణము=గురుముఖతః గ్రహించుట ; ధారణము = గ్రహించినదానిని మరచిపోకుండుట ; జ్ఞానము =ఊహాపోహ విచారము ; ప్రయోగము=సభలో గావించెడి ప్రదర్శనము ; సంశితవ్రతులు=అభ్యాసదక్షులు. [అభినవభారతి - 1 వ సం. పుట 17]



13. కపింజలి
14. బాదిరుడు
15. యముడు
16. ధూమ్రాయణుడు
17. జంబుధ్వజుడు
18. కాకజంఘుడు
19. స్వర్ణకుడు
20. తాపసుడు
21. కైదారి
22. శాలికర్ణుడు
23. దీర్ఘగాత్రుడు
24. శాలికుడు
25. కౌత్సుడు
26. తాండాయని
27. పింగలుడు
28. చిత్రకుడు
29. బంధులుడు
30. భల్లకుడు
31. ముష్టికుడు
32. సైంధవాయనుడు
33. తైతిలుడు
34. భార్గవుడు
35. శుచి
36. బహులుడు
37. అబుధుడు
38. బుధసేనుడు
39. పాండుకర్ణుడు
40. కేరలుడు
41. ఋజుకుడు
42. మండకుడు
43. శంబరుడు
44. వంజులుడు
45. మాగధుడు
46. సరలుడు
47. కర్త
48. ఉగ్రుడు
49. తుషారుడు
50. పార్షదుడు
51. గౌతముడు
52. బాదరాయణుడు
53. విశాలుడు
54. శబలుడు
55. సునాభుడు
56. మేషుడు
57. కాలియుడు
58. భ్రమరుడు
59. పీఠముఖముని
60. నఖకుట్టుడు
61. అశ్మకుట్టుడు
62. షట్పదుడు
63. ఉత్తముడు
64. పాదుకుడు
65. ఉపానహుడు
66. శ్రుతి
67. చాపస్వరుడు
68. అగ్నికుండుడు
69. ఆజ్యకుండుడు
70. వితండ్యుడు
71. తాండ్యుడు
72. కర్తరాక్షుడు
73. హిరణ్యాక్షుడు
74. కుశలుడు
75. దుస్సహుడు
76. లాజుడు
77. భయానకుడు
78. బీభత్సుడు
79. విచక్షణుడు
80. పుండ్రాక్షుడు
81. పుండ్రనాసుడు
82. అసితుడు
83. సితుడు
84. విద్యుజ్జిహ్వుడు
85. మహాజిహ్వుడు
86. శాలంకాయనుడు
87. శ్యామాయనుడు
88. మాఠరుడు
89. లోహితాంగుడు
90. సంవర్తకుడు
91. పంచశిఖుడు
92. త్రిశిఖుడు
93. శిఖుడు
94. శంఖవర్ణముఖుడు
95. షండుడు
96. శంకుకర్ణుడు
97. శక్రనేమి
98. గభస్తి
99. అంశుమాలి
100. శఠుడు
101. విద్యుత్తు
102. శాతజంఘుడు
103. రౌద్రుడు
104. వీరుడు

అను ఈ నా నూర్గురు[12] సుతులను, బ్రహ్మ ఆజ్ఞను అనుసరించి, లోక హితార్థమై వారి వారి యోగ్యతలకు అనుగుణములైన ఆయా భూమికలయందు[13] నియోగించితిని.*

## కైశికీవృత్తి ప్రయోజనము

పిమ్మట భారతి, సాత్త్వతి, ఆరభటి అనెడి వృత్తులతో[14] కూడిన ప్రయోగము నొకసారి ప్రదర్శించి, ఆ విషయమును ప్రణామ పూర్వకముగా బ్రహ్మకు విన్నవించితిని. అంతట, భారత్యాది వృత్తులతోపాటు "కైశికీవృత్తినికూడ చేర్చుము. మరి అందులకు కావలసిన సామగ్రి ఏదో తెలుపుము." అని బ్రహ్మ నన్ను ఆదేశించెను. అప్పుడు నేనిట్లంటిని—"కైశికీ వృత్తిని ప్రయోగించుటకు యోగ్యమైన ద్రవ్యమును ఇమ్ము. మున్నొకసారి భగవంతుడైన నీలకంఠుడు ఆనంద నృత్తము చేయుచుండగా అంగహార సంపన్నమును, రసభావ క్రియాత్మకమును అగు కైశికీ ప్రయోగమును

12. ఇందలి పేర్లు శతసంఖ్యను దాటినవి. ఆయా ముద్రణములందు పాఠభేదములు కూడకలవు. కొన్ని పేర్లు సార్థకములై ఆయా భూమికలను ధరించుటకు వారికిగల యోగ్యతలను సూచించుచున్నవి. [అభినవభారతి - 1 వ సం. పుట 21]

13. ఈ భూమికలు ఉత్తమ - మధ్యమ - అధమ ప్రకృతులకు సంబంధించినవి. ఎవనికి ఏ కర్మయందు అభినివేశమును, సామర్థ్యమును కలవో భరతుడు బాగుగా గుర్తించెను. ఒకడు హర్షమును ప్రకటింప సమర్థుడు; మరియొకడు శోకమును అభినయించుటలో దిట్ట. కావున ఎవడే భావమును ప్రదర్శించుటకు సమర్థుడో వానిని ఆ భావసంశ్రయమైన భూమికయందే నియోగించెను. [అభినవభారతి - 1 వ సం. పుట 20]

*[కాశీ ముద్రణమునందు 1-41 శ్లో; బొంబాయి ముద్రణమునందు 1-40 శ్లో; బరోడా ముద్రణమునందు 1-40 శ్లో.]

14. వృత్తి=ధర్మాది పురుషార్థ చతుష్టయ సాధనమునచేయు వాఙ్మనఃకాయవ్యాపారము. ఏ కర్మ ఆరంభమైనను అచ్చట ఈ వాఙ్మనఃకాయవ్యాపారము విధిగా ఉండును. ఇది లలిత, విచిత్ర, పరుష భేదములచే త్రివిధముగా నుండును. ఉత్తమ ప్రకృతుల సర్వ వ్యాపారమును సౌష్ఠవమయముగా నుండును. అట్లే ఇతరములును. భారతీవృత్తి వాగ్వ్యాపారము. సాత్త్వతి మనోవ్యాపారము. ఆరభటి కాయికవ్యాపారము. కైశికి సౌందర్యోపయోగి అయిన వ్యాపారము. 'సత్' అనగా జ్ఞానము లేదా ప్రకాశము. 'సత్' కలది సత్త్వము అనగా ప్రకాశవంతమైన మనస్సు; దానియొక్క వ్యాపారము సాత్త్వతీవృత్తి. అరులు=ఉత్సాహవంతులు; ఉత్సాహవంతులైన భటుల వ్యాపారమునకు సంబంధించినది ఆరభటీవృత్తి; అనగా ఆరభటి యుద్ధాదులకు సంబంధించిన వృత్తి. కేశములు దేహమునకు కేవలము శోభావహములు; అట్లే కైశికీవృత్తి శోభావహము; లాలిత్య మనునదియెల్ల కైశికీ విజృంభితమే. [అభినవభారతి - 1 వ సం. పుట 20] ఈ వృత్తులు 20 వ అధ్యాయమందు విపులముగా వివరించబడును.



చూచియున్నాను.[15] మధురమగు వేష రచనతో ఈ కైశికీ వృత్తిని నాట్యమందు ప్రయోగించినచో శృంగారరసాభివ్యక్తి హేతువుకాగలదు. కాని స్త్రీజనుల సాహాయ్యములేనిదే పురుషు లీ కైశికీ ప్రయోగమును (అనగా శృంగార రసాభినయమును) చేయజాలరు. కావున వారి నొసంగుము." అప్పుడు తేజోమూర్తియగు బ్రహ్మసంకల్ప మాత్రమున అప్సరసలను సృజించి, నాట్యాలంకారచతురలైన (అనగా కైశికీవృత్తి ప్రయోగమునందు నేర్పరులైన) ఆ అప్సరసలను ప్రయోగార్థమై నా కొసంగెను.

అప్సరసలు

| | | |
|---|---|---|
| 1. మంజుకేశి | 9. సుదతి | 17. మాగధి |
| 2. సుకేశి | 10. సుందరి | 18. అర్జుని |
| 3. మిశ్రకేశి | 11. విదగ్ధ | 19. సరల |
| 4. సులోచన | 12. విపుల | 20. కేరల |
| 5. సౌదామిని | 13. సుమాల | 21. ధృతి |
| 6. దేవదత్త | 14. సంతతి | 22. నంద |
| 7. దేవసేన | 15. సునంద | 23. పుష్కల |
| 8. మనోరమ | 16. సుముఖి | 24. కలమ |

అను ఈ ఇరువదినలువురు అప్సరసలను బ్రహ్మ నా కొసంగి, శిష్యసహితుడగు 'స్వాతి' అను మునిని పణవ - మృదంగ - కాంస్యాది భాండ వాద్యములందు నియోగించెను. మరియు, నారదాదులను, గంధర్వులను గానక్రియకై నియోగించెను.

## మహేంద్రధ్వజోత్సవమందు నాట్యప్రయోగము

ఇట్లు సుతసహితముగా వేదవేదాంగ సంభవమైన నాట్యప్రయోగమును చక్కగా తెలిసికొనినవాడనై సుతులతోడను, స్వాతి - నారదులతోడను కలిసి,[16] బ్రహ్మనుచేరి, కృతాంజలినై - "నాట్యగ్రహణము పూర్తిఅయినది. ఇంకేమి చేయ

15. నృత్తము=నర్తనము. అర్థప్రదర్శకము కాని కేవల గాత్రవిలాస విక్షేపము నృత్తమనబడును. నృత్తమందలి అంగముల (అవయవముల) విలాసవిక్షేపము అంగహార మనబడును. ఇవి కరణముల కూడికవలన ఏర్పడును. కరణ-అంగహారములు 4 వ అధ్యాయమందు వివరించబడినవి. రస భావ క్రియాత్మకము=కవి-నట-సామాజిక హృదయములందు రసోత్పత్తిని కలిగించునది. [అభినవభారతి - 1 వ సం. పుటలు 21-22]

16. వీరితోపాటు అప్సరసలుకూడ కలరని గ్రహించవలెను. భరతుడు నాట్యాచార్యుడు. భరతసుతులది అభినయము, అప్సరసలది నృత్తము, స్వాతిది వాద్యము, నారదాదులది గానము. ఈ నృత్త - గీత - వాద్య - అభినయముల సామరస్యపూర్వకమైన సమ్మేళనమే నాట్య మనబడును. ఈ 'మేళనము' అను పదమునుండియే నేటి 'మేళము' అను పదము

వలెనో సెలవిమ్ము" అని అడిగితిని. అంతట పితామహుడు "నీ నాట్యప్రయోగమునకు ఇదియే మంచి సమయము. ఇప్పుడు మహేంద్రునియొక్క శోభావంత మగు ధ్వజోత్సవము[17] ప్రవర్తిల్లుచున్నది. నీ నాట్యవేదము నచ్చట ప్రయోగింపుము" అని చెప్పెను.అది మహేంద్రవిజయసూచకమైన ధ్వజోత్సవము. అసుర - దానవులు నిహతులుకాగా అమరులందరును సంతోషముతో ధ్వజోత్సవమును చేసికొనుచుండిరి. ఆ ఉత్సవమునందు నేను నా నాట్యప్రయోగమున కుపక్రమించితిని.

వేదసమ్మతమును, ఆశీర్వచన సంయుతమును, అష్టాంగపద[18] సంయుక్తమును విచిత్రమును అయిన 'నాంది'ని మొట్టమొదట ప్రయోగించితిని. నాంది అయిన పిమ్మట, దేవతలు దైత్యులను జయించిన విధమును అనుకరించుచు నాట్యమును

---

వచ్చియుండవచ్చును. ఈ మేళమును 'బృంద' మనుపేర శారాదాతనయుడీ క్రిందివిధముగా వివరించెను. [భావప్రకాశము - పుట 298]

"నటాశ్చ నర్తకాశ్చైవ గాయకా వాదకాదయః।
యస్మిన్ప్రయోగే మిలితాస్తత్ర తద్బృంద ముచ్యతే॥
తదేవాభ్యంతరం బాహ్య మితి ద్వేధా విభిద్యతే।
అభ్యంతరే స్యాత్ స్త్రీబృందం బాహ్యే స్త్రీ - మర్త్య మిశ్రితమ్॥"

—ప్రయోగమందు నట - నర్తక - గాయక - వాద కాదులు మిశితమైయుండుట 'బృంద, మనబడును. అభ్యంతర - బాహ్యములనెడి భేదములచే ఈ 'బృందము' రెండు విధములు. కేవల స్త్రీ బృందము 'అభ్యంతర' మనబడును ; స్త్రీ - పురుషులు కలిసియున్న బృందము 'బాహ్య' మనబడును. 'బృందము'ను దామోదరుడీ విధముగా వివరించెను [భరతకోశము - పుట. 422] - "గాతృ - వాదక సంఘాతము 'బృంద' మనబడును. 4 గురు ముఖ్యగాయకులు, 8 గురు సమగాయకులు, 8 గురు గాయనులు (స్త్రీలు), 4 గురు తాలధారిణులు, 4 గురు మార్దంగికులు, 4 గురు వేణుగాయకులు కలిగిన బృందము 'ఉత్తమ' మనబడును. ఇందులో సగము బృందము 'మధ్యమ' మనబడును. దానిలో సగము 'లఘు' వనబడును."

17. ఈ ధ్వజోత్సవమువంటిదే భూలోకమందుకూడ ఒక ఉత్సవము చేయబడినట్లు భారతమునందు కలదు. ఉపరిచరవసువునకు ఇంద్రుడు "దుష్టనిగ్రహ - శిష్టపరిపాలన క్షమంబైనయొక్క వేణుయష్టి" నొసంగినాఁడు. అతడును "అవ్వేణు యష్టికి మహావిభవంబు మెఱసి యేఁటేట 'నింద్రోత్సవం' బను నుత్సవంబు సేయుచు నీశ్వరునకు నింద్రాదిదేవతలకు నతిప్రీతి సేసె నది మొదలుగా రాజు లెల్లం బ్రతిసంవత్సరంబు నింద్రోత్సవంబు సేయుచుండుదురు." [శ్రీమదాంధ్ర మహాభారతము - ఆది ప. 3 వ ఆ. 24 ప.]

18. అంగభూతములైన పదములనగా అవాంతర వాక్యములు లేదా సుప్తిజంతములు ; అనగా మహావాక్యాంతర్గము లగు అవాంతర వాక్యములు, లేదా విడిపదములు అని అర్థము. తరువాతి కాలములో పాదమనగా 'ఒక వృత్తపాదము' అను నర్థముకూడ వచ్చినది. వివరములకు 5 వ అధ్యాయ మందలి 7 వ విశేషాంశమును చూడవలెను.



ప్రయోగించితిని. ఇందు సంఫేట - విద్రవములు, ఛేద్య - భేద్యాత్మకము లయిన యుద్ధములును కలవు[19]. ఈ నాట్యప్రయోగమును చూచి బ్రహ్మాదిదేవతలు సంతోషపడినవారై నా సుతులకు సర్వోపకరణముల[20] నొసంగిరి.

దేవతలు సంతుష్టులై బహుమానము లొసంగుట

ఇంద్రుడు సంప్రీతుడై శుభకరమైన స్వీయధ్వజమును నా సుతుల కొసంగెను. బ్రహ్మ కుటిలకమును అనగా విదూషకోపయోగి యగు వక్రదండము నిచ్చెను. వరుణుడు పారిపార్శ్వకోపయోగియును, శుభకరమును అయిన భృంగారము నొసంగెను. సూర్యుడు ఛత్రమును (చాందినీ). శివుడు సిద్ధిని, వాయువు వ్యజనమును (విసనకఱ్ఱ), విష్ణువు సింహాసనమును, కుబేరుడు కిరీటమును ఇచ్చిరి. ప్రేక్షణీయము (నాట్యము) సుశ్రావ్యమగునట్లు సరస్వతీదేవి అనుగ్రహించెను. ఆ సదస్సునందలి తక్కిన దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు సంతుష్టాంతరంగులై తమతమ జాతి గుణములకు తగినట్లుగా నా సుతులకు భాషితములను భావ - రసములను, రూపమును, క్రియాబలమును[21] ప్రసాదించిరి.*

---

19. "తదంతేఽనుకృతి ర్బద్ధా యథా దైత్యాః సురైర్జితాః॥ 57
సంఫేటవిద్రవకృతా ఛేద్యభేద్యాహవాత్మికా। 58

తదంతే=నాందియు ప్రస్తావనయు అయిన పిమ్మట; అనుకృతి=నాట్యము. అనుకృతి అనగా నాట్యానుకారరూపమైన ప్రస్తావనయే అని కొందరందురు. అది సరికాదు. అది ముందే అయిపోయినది. సంఫేటము=రోషోక్తులు, విద్రవము=శంకా - భయ - త్రాసములతోకూడిన కార్యము. ఛేద్యము=శస్త్రయుద్ధము, భేద్యము=మల్లయుద్ధాత్మకమైననియుద్ధము. [అభినవభారతి - 1 వ. సం - పుటలు 26 - 27]

20. ఇట్లు నటులను, గాయకులను సత్కరించుట ప్రాచీనాచారము. ఆ సత్కారమును ధనవంతులు చేయుదురు. తదితరు లూరకే ప్రయోగమును చూతురు. నేటికిని ఈ సంప్రదాయమును వీథి భాగవతముల విషయమున చూడగలము. శ్రీమంతులిట్లు కళలను పోషించు సంప్రదాయమునకు బదులు ప్రతి ప్రదర్శనమునకును 'టిక్కెట్ల' పద్ధతి నేడు అమలులోనికి వచ్చినది. ప్రయోగ ప్రారంభములోనే విఘ్నములు కలిగినట్లు తరువాత చెప్పబడును. వానినెల్ల చక్కబెట్టుకొన్నపిమ్మట మరల ప్రయోగము సాగినది. అప్పుడు బ్రహ్మాదిదేవతలు ఉపకరణముల నొసంగిరని తెలియవలెను. అప్పుడు చెప్పవలసిన ఈ విషయము సౌలభ్యార్థము ఇచ్చట ముందే చెప్పబడుచున్నది.

21. భాషితము=ఆయాభూమికలకు ఉపకరించు వాచికాభినయమందు శిక్షణము, రూపము=ముఖరాగము, క్రియాబలము=ఆయాభూమికలను చక్కగా ప్రయోగించుటకుచితమైన ఆంగికబలము.

*[కాశీ ముద్రణమునందు 41-65 శ్లో ; బొంబాయి ముద్రణమునందు 41-63 శ్లో: బరోడా ముద్రణమునందు 41-68 శ్లో.]

దైత్య దానవుల క్షోభము : ప్రయోగము భంగపడుట

దైత్య-దానవ నాశనమును అనుకరించెడి పై ప్రయోగము మొదట ప్రారంభమైనప్పుడు అచ్చట చేరియున్న దైత్యులందరును క్షోభపడిరి.[22] అంత, వారు విరూపాక్షుడు మొదలగు విఘ్నకరులను ప్రోత్సహించి "మన మిట్టి నాట్యమును సహింపజాలము. బయలుదేరుడు" అని పలికిరి.

అప్పుడు విరూపాక్షాదులు అసుర సహితముగా విజృంభించి, మాయచే తిరోహితులై నటుల వాక్కును, చేష్టను, స్మృతిని స్తంభింపజేసిరి. ప్రస్తావనా ప్రయోగమందే సపరివారముగా సూత్రధారుడు అట్లు భంగపడుటను కాంచి ప్రయోగ వైషమ్యమునకు కారణ మేమని ఇంద్రుడు దివ్యదృష్టితో పరిశీలించెను. సభయందంతటను నిండియున్న విఘ్నకరులయొక్క మాయవలన మాటను, చేష్టను కోల్పోయిన అనుచర సహితుడగు సూత్రధారుడు వానికంట పడెను. ఇంద్రుడంతట కోపముతో వేగముగాలేచి, రత్నస్థగితమై వెలుంగుచున్న తన ఉత్తమ ధ్వజమును గ్రహించి, దానితో రంగపీఠ గతులగు విఘ్నకరులను జర్జరీకృత దేహులను కావించెను.

జర్జరోత్పత్తి

దానవులతోకూడ విఘ్నకరులందరును నిహతులగుటచే దేవతలెల్ల సంతసించి భరతునితో ఇట్లు చెప్పిరి—"అహో! నీ కిప్పు డొక దివ్యాయుధము లభించినది. ఇది అసురుల, విఘ్నకరుల, దానవుల సర్వాంగములను 'జర్జర మొనర్చినది' (శిథిలీభూతము చేసినది) కాన ఇంక ఇది 'జర్జర' మని పిలువబడునుగాక! హింసార్థమేతెంచెడి తక్కిన హింసకులుకూడ ఈ జర్జరమును చూచినంతనే పైవారి గతినే పొందుదురు." ఇంద్రు డీమాటలను ఆమోదించి "అట్లే అగునుగాక. మరియు నిది నటులందరకును రక్షాహేతువు కాగలదు" అని అనుగ్రహించెను. ఆ ఇంద్రోత్సవమునందు ప్రయోగము తిరిగి ఉత్సాహముతో ప్రారంభమైనది. అంతట, శేషించిన విఘ్నకరులు మరల విజృంభించి నటులకు భయమును కలిగింప నారంభించిరి. అట్లు వారు పగదీర్చుకొను తలంపుతో నుండుట గ్రహించి, నేను సుతసమన్వితముగా బ్రహ్మనుచేరి— "ఈ నాట్యమును నాశనముచేయుటకు విఘ్నకరులు నిశ్చయించుకొనినారు. ఓ సురేశ్వర! రక్షించువిధాన మాలోచింపుము" అని ప్రార్థించితిని.

22. దైత్యులు క్షోభపడుటకు కారణము పై ప్రయోగము స్వజాతి నాశనమును నిరూపింపనుండుటయే. ప్రస్తావనను పట్టియే వారీ విషయమును గ్రహించిరి. విఘ్నకరులును, దైత్య - రాక్షసులును సమాధానపడి శాంతచిత్తులైన పిమ్మట ప్రయోగము కొనసాగినది. ఈ నాట్య ప్రయోగమును సంపూర్ణముగా చూచిన పిమ్మటనే దేవత లా యా ఉపకరణముల నొసంగిరని గ్రహించవలయును. ఉపకరణముల నొసంగిన వారిలో రాక్షసులుకూడ నుండుట గమనార్హము. సమాధానపడిన తరువాతనే వారు ఉపకరణముల నిచ్చిరనుట సమంజసము.



నాట్యగృహ నిర్మాణము

అప్పుడు బ్రహ్మ విశ్వకర్మను పిలిచి "ఓ మహామతీ! లక్షణసంపన్నమైన నాట్యవేశ్మమును[23] జాగరూకతతో నిర్మింపుము" అని ఆజ్ఞాపించెను. అంతట విశ్వకర్మ శుభకరమును, సర్వలక్షణసంపన్నమును అయిన నాట్యగృహమును అచిరకాలములోనే నిర్మించి, బ్రహ్మయొద్ద కేగి, కృతాంజలియై "ఓ దేవ! నాట్యగృహము సిద్ధమైనది. దానిని పరిశీలింప గోరుచున్నాను" అని విన్నవించెను. మహేంద్రాదులును, తదితరులును వెంటరాగా వెడలివచ్చి నాట్యగృహమును పరిశీలించిన పిమ్మట దేవతలందరితోడను బ్రహ్మ క్రింది విధముగా చెప్పెను.

నాట్యమండపభాగములు - అధిష్ఠానదేవతలు

"ఈ నాట్యమండపముయొక్క భాగములను మీమీ అంశములచే ఆవహించి రక్షించవలెను. సౌమ్యప్రకృతి యగు చంద్రుడు సర్వమండప రక్షణమందును నియుక్తుడగుగాక. లోకపాలురు దిశలను, మరుత్తులు మూలలను, మిత్రుడు నేపథ్యభూమిని, వరుణుడు అంబరమును, అగ్ని వేదికను, మేఘములు భాండవాద్యములను, చతుర్వర్ణాధిష్ఠాన దేవతలు ప్రధానములగు నాలుగు స్తంభములను, ఆదిత్యులును రుద్రులును ఇతర స్తంభములను, భూతములు ధారణులను, అప్సరసలు ఆయా శాలలను, యక్షిణిలు వేశ్మమును, మహోదధి మహీపృష్ఠమును, కాల-కృతాంతులు ద్వారశాలను, మహాబలులైన నాగముఖ్యులు ద్వారపత్రములను, యమదండము దేహాలిని, త్రిశూలము దేహాలి పై భాగమును[24] వరుసగా రక్షింతురుగాక."

23. నాట్య వేశ్మము = నాట్య గృహము = నాట్య మండపము = నాట్యశాల = ప్రేక్షా గృహము = **Theatre building.** నాట్య మండపములను నిర్మించు విధానము 2 వ అధ్యాయమందు విపులముగా వివరింపబడినది. విశ్వకర్మ నిర్మించినదే ప్రథమనాట్యగృహము. ఇది నిర్మించబడుటకు పూర్వము నాట్య ప్రయోగము ఆరుబయటనే (open air లో) జరిగినదని తెలియవలెను. ఇదియే 13 వ అధ్యాయమందు 'బాహ్యప్రయోగ' మనబడినది.

24. ఈ భాగములనుగూర్చిన వివరము లన్నియును 2 వ అధ్యాయమందు కలవు. ద్వారపత్రము = కవాటము. దేహాలి = ద్వారబంధము.

బ్రహ్మ ఆదేశము ననుసరించి నియతి - మృత్యువు లిరువురును ద్వారపాలురై నారు. మహేంద్రుడు స్వయముగా రంగపీఠ పార్శ్వమందు నిలిచెను. దైత్య నిషూదనియైన విద్యుత్తు మత్తవారణియందు నిక్షేపింపబడెను. మత్తవారణి యందలి నాలుగు స్తంభములను రక్షించుటకు మహాబలులైన భూత - యక్ష - పిశాచ - గుహ్యకులు నియమితులైరి. జర్జరమందు దైత్య నిబర్హణ సమర్థమైన వజ్రము నిక్షేపింపబడెను. ఆ జర్జరముయొక్క ఐదు పర్వము (=కణుపు) లందును మహా తేజోవంతులైన దేవతా శ్రేష్ఠులు … క్రింద వివరించిన రీతిగా నిలిచిరి. శిరః పర్వము నందు బ్రహ్మ, ద్వితీయ పర్వమునందు శంకరుడు, తృతీయ పర్వమునందు విష్ణువు, చతుర్థ పర్వమునందు స్కందుడు, పంచమ పర్వమునందు శేష - వాసుకి - తక్షకు లనెడి మహానాగులును నిలిచిరి. ఇట్లు విఘ్న వినాశార్థము దేవతలు జర్జరమందు నిలిచిరి. రంగపీఠ మధ్యమందు బ్రహ్మ స్వయముగా ప్రతిష్ఠితుడయ్యెను. బ్రహ్మ పూజార్థమే ప్రయోగ ప్రారంభమున రంగపీఠ మధ్యమందు పుష్పములు చల్ల బడును. పాతాళవాసులైన యక్ష - గుహ్యక - పన్నగులు రంగపీఠముయొక్క అధోభాగ రక్షణమందు నియుక్తులైరి. మరియు ఇంద్రుడు నాయకుని, సరస్వతి నాయికను, ఓంకారము విదూషకుని, హరుడు తక్కిన ప్రకృతులను రక్షించుటకు పూనుకొనిరి. ఇట్లు ఏయే భాగముల రక్షణమునందు ఏయే దేవతలు నియుక్తులైనారో ఆయాభాగములకు వారే అధిష్ఠాన దేవత లని బ్రహ్మ పలికెను.*

### విఘ్నకరులను బ్రహ్మ అనునయించుట

ఈలోపల దేవతలందరును పితామహునితో ఇట్లు చెప్పిరి—"మీ రీ విఘ్న కరులను సామవచనములతో శాంతింపజేయుడు. మొదట సామమును, తరువాత దానమును, పిమ్మట భేదమును, అటుపిమ్మట దండమును బ్రయోగించవలెను కదా?" అప్పుడు బ్రహ్మ విరూపాక్షాదులను దగ్గరకు పిలిచి "ఈ నాట్య వినాశనము నకు మీరేల పూనుకొనినారు ?" అని ప్రశ్నించెను. బ్రహ్మ ప్రశ్న విని దైత్యులతోను, విఘ్నగణములతోను కూడినవాడై విరూపాక్షుడు సామపూర్వకముగా ఇట్లు సమా ధానము చెప్పెను—"భగవంతుడవైన నీవు సురలకోర్కెను అనుసరించి ఈ నాట్య వేదమును సృష్టించితివి. కాని, మా కిది అవమానకరముగా ఉన్నది. మీరు దీనిని దేవతలకొరకే నిర్మించినారు. లోక పితామహులైన మీ రిట్లు చేయుట న్యాయ్యము కాదు. మీవలన దేవత లెట్లు ఉద్భవించిరో దైత్యులును అట్లే ఉద్భవించిరి కదా ?"

*[కాశీ ముద్రణమునందు 65-99 శ్లో; బొంబాయి ముద్రణమునందు 64-98 శ్లో; బరోడా ముద్రణమునందు 63-98 శ్లో.]



### నాట్యస్వరూపము

విరూపాక్షుని సమాధానమును విని బ్రహ్మ ఇట్లు చెప్పెను—

"అలం వో మన్యునా దైత్యా విషాదం త్యజతానఘాః ॥ 105

భవతాం దేవతానాం చ శుభాశుభవికల్పకః ।
కర్మభావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః ॥ 106

నైకాంతతో౽త్ర భవతాం దేవానాం చానుభావనమ్ ।
త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్ ॥ 107

క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః ।
క్వచిద్ధాస్యం క్వచిద్యుద్ధం క్వచిత్కామః క్వచిద్వధః ॥ 108

ధర్మో ధర్మప్రవృత్తానాం కామః కామోపసేవినామ్ ।
నిగ్రహో దుర్వినీతానాం వినీతానాం దమక్రియా ॥ 109

క్లీబానాం ధార్ష్ట్యజననముత్సాహః శూరమానినామ్ ।
అబుధానాం విబోధ శ్చ వైదుష్యం విదుషా మపి ॥ 110

ఈశ్వరాణాం విలాస శ్చ స్థైర్యం దుఃఖార్దితస్య చ ।
అర్థోపజీవినా మర్థో ధృతి రుద్విగ్నచేతసామ్ ॥ 111

నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకమ్ ।
లోకవృత్తానుకరణం నాట్య మేత న్మయా కృతమ్॥ 112

ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్ ।
హితోపదేశజననం ధృతి క్రీడా సుఖాదికృత్ ॥ 113
(ఏత ద్రసేషు భావేషు సర్వకర్మక్రియాస్వథ ।
సర్వోపదేశజననం నాట్యం లోకే భవిష్యతి ॥)

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్ ।
విశ్రాంతిజననం కాలే నాట్య మేత ద్భవిష్యతి ॥ 114

ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధి వివర్ధనమ్ ।
లోకోపదేశజననం నాట్య మేత ద్భవిష్యతి ॥ 115

న తత్ జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా ।
నాసౌ యోగో న తత్కర్మ నాట్యే౽స్మిన్ య న్నదృశ్యతే॥ 116

తన్నాత్ర మన్యుః కర్తవ్యో భవద్భి రమరాన్ ప్రతి ।
సప్తద్వీపానుకరణం నాట్యమేత ద్భవిష్యతి ॥ 117

దేవానా మసురాణాం చ రాజ్ఞా మథ కుటుంబినామ్ ।
బ్రహ్మర్షీణాం చ విజ్ఞేయం నాట్యం వృత్తాంతదర్శకమ్ । 118

(వేదవిద్యేతిహాసానా మాఖ్యానపరికల్పనమ్ ।
వినోదకరణం లోకే నాట్య మేత ద్భవిష్యతి ॥
శ్రుతిస్మృతి సదాచార పరిశేషార్థ కల్పనమ్ ।
వినోదజననం లోకే నాట్య మేత ద్భవిష్యతి॥)

"ఓ దైత్యులార! కోపము వలదు. ఓ అనఘులార! విషాదమును పొంద కుడు. మీ యొక్కయు, దేవతలయొక్కయు కర్మల (చేష్ట) తోడను, భావ (ఆశయ) ముల తోడను, అన్వయ (వంశ) ముల తోడను కూడి ఉండునట్టిదిగా నేనీనాట్యవేదమును నిర్మించితిని. శుభాశుభ ఫలముల నిచ్చెడి ధర్మాధర్మములయొక్క స్వభావములను మీ అందరికిని ఇది ప్రదర్శింప గలదు.

ఈ నాట్యము కేవలము మీ చరిత్రను మాత్రమే లేదా కేవలము దేవతల చరిత్రను మాత్రమే ప్రదర్శించదు. ఈ నాట్యము త్రైలోక్య భావాను కీర్తన[25] మని తెలిసికొనుడు. (అనగా ఇది మీకును దేవతలకును మాత్రమే సంబంధించిన భావము లను ప్రదర్శించుటతో ఆగిపోదు. మూడులోకములం దున్న వారి సర్వభావములను ఇది ప్రదర్శించును.) నాట్యమం దొకచోట ధర్మము, ఒకచోట శమము, ఇంకొకచోట హాస్యము, మరియొకచోట యుద్ధము, ఇంకొకచోట కామము, వేరొకచోట వధయును ప్రదర్శింపబడుచుండును.[26]

ఈ నాట్యము ధర్మప్రవృత్తులైన వారియొక్క ధర్మమును, కామోపభోగుల కామమును, దుర్వినీతులుచేయు నిగ్రహమును (దుండగమును), జితేంద్రియుల దమక్రియను, క్లీబుల హాస్య భాజనత్వమును, శూరుల ఉత్సాహమును, అజ్ఞానుల అజ్ఞానమును, విద్వాంసుల వైదుష్యమును, రాజుల విలాసమును, దుఃఖితుల స్థైర్య

25. అను కీర్తనము=చెప్పుట. మూడు లోకములందలి సర్వభావములును ఇందు చెప్పబడును. అనగా నాట్యము దేశ-కాల-పాత్రబద్ధమై గిరిగీసికొని ఉండదు. శుభాశుభఫల ముల నిచ్చెడి ధర్మాధర్మములను ప్రదర్శించుటయే ఇందలి ప్రధానాశయ మని గ్రహించ వలెను.

26. ఇచ్చట ధర్మాది శబ్దములు తత్త దుచితస్థాయి - వ్యభిచార్యాది సూచనములు - ధర్మార్థములు ఉత్సాహాదులను, క్రీడ విస్మయాదులను, శమము నిర్వేదాదులను, హాస్యము హాసాదులను, యుద్ధము నిర్వేదాదులను, కామము రత్యాదులను, వధ క్రోధ - భయ - జుగుప్సాదులను సూచించును. నాట్య మంతయును లోక వృత్తానుసారముగనే ఉండును. కాన లోకమునందు కన్పట్టు సర్వభావములును ఇందుండునని గ్రహించవలెను. ఒకచోట (క్వచిత్) అను పదములచే దశరూపకములలో ఏదో ఒకటి చెప్పబడినదన్నమాట. ఒక్కొక్క రూపకమునందు వీనిలో ఒక్కొక్కటి కాని అనేకములు కాని ప్రదర్శింపబడుచుండును. [అభినవభారతి-1 వ సం. పుట 39]



మును, అర్థోపజీవుల అర్థమును, ఉద్విగ్న చేతస్కుల ధైర్యమును సామాజికులకు ప్రదర్శించును.[27] ఇట్లు నానా భావోపసంపన్నమును, నానావస్థాంతరాత్మకమును, లోకవృత్తానుకరణమును అగునట్లుగా నేనీ నాట్యమును నిర్మించితిని. ఈ నాట్యము ఉత్తమ - మధ్యమ - అధమ భేదములతో నొప్పు మానవులయొక్క వివిధ కర్మల నాశ్రయించి యుండును. ఇది ఉపదేశాత్మక మగుటయేకాక హితమును, ధైర్య మును, క్రీడను, సుఖమును కూడ కలిగించును. సర్వకర్మలతోడను కూడినదై భావ - రసముల మూలమున అందరకును ఉపదేశజనకము కాగలదు. దుఃఖార్తులకు, శ్రమా ర్తులకు, శోకార్తులకు, తపస్వులకు (దీనులకు) విశ్రాంతిని కలిగించును. (అనగా వారివారి దుఃఖ - శ్రమ - క్లేశాదులను పోగొట్టి ఆనందమును కలిగించును.) అంతియే కాక హితమును, యశస్సును, ఆయువును, బుద్ధివికాసమును కూడ కలిగించును.

ఈ నాట్యమందు కన్పట్టని జ్ఞానముకాని, శిల్పముకాని, విద్యకాని, కళ కాని, యోగముకాని, కర్మకాని లేనేలేదు.[28] సర్వ శాస్త్రములును, సర్వ శిల్పము లును, వివిధములైన కర్మలును ఈ నాట్యమందు కూడియున్నవి. ఇట్లు నాట్యము సప్తద్వీపానుకరణ మగుచున్నది. మీరు అమరులపై కోపించుట తగదు. దేవతలు, అసురులు, రాజులు, కుటుంబులు, బ్రహ్మర్షులు మున్నగువారి వృత్తాంతములనెల్ల ఈ నాట్యము ప్రదర్శించును.[29] వేదములనుండియు, విద్యలనుండియు, ఇతిహాసముల

27. సామాజికులకు తమ హృదయముతో సమానమగు హృదయధర్మము కల వారితో హృదయసంవాదము కలుగును కాన "ధర్మ ప్రవృత్తులైన వారికి ధర్మమును; కామోపభోగులకు కామమును... ఈ నాట్యము కలిగించును."— అనుచు పై శ్లోకము లను కొందరు సామాజిక పరముగా అన్వయింతురు. "అధర్మ ప్రవృత్తులకు ధర్మమును... ఈ నాట్యము బోధించును"— ఈ విధముగా మరికొంద రర్థము చెప్పుదురు [అభినవ భారతి- 1 వ సం. పుట 41.] నానాభావోప సంపన్నము=అనేక విధములగు భావము లచే అనగా స్థాయి - వ్యభిచారి - విభావాదులచే సర్వతోవ్యాప్త మగునది; నానావస్థాంత రాత్మకము=విభిన్నములగు అనగా దేశ - కాల - ప్రవృత్తులచే భిన్నములగు అవస్థలు కలిగి నది; లోకవృత్తానుకరణము=లోకవృత్తమును అనుకరించి ప్రదర్శించునది.

28. సప్తద్వీపానుకరణమును, దృశ్యమానమును అయిన నాట్యమందు కన్పట్టని (సహృదయ హృదయ గోచరములు కాని) జ్ఞానాదులు లేవని తాత్పర్యము. ఈ శ్లోక తాత్పర్యమును కావ్యమున కన్వయించి భామహుడు మరియొక చక్కని శ్లోకమును రచించినాడు. [కావ్యాలంకారము - 5 వ అ- 4 శ్లో.]—

న స శబ్దో న త ద్వాచ్యం న స న్యాయో న సా కలా।
జాయతే య న్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః॥

29. "అనుకరణ" పదమునకు యథాతథముగా ప్రదర్శించుట అను అర్థమును చెప్పరాదు. అట్లు చేసినచో రసస్ఫూర్తి కలుగనే కలుగదు. పాశ్చాత్య విమర్శక పితామహు

నుండియు ఆఖ్యానములను గ్రహించి వినోద జనకము లగునట్లు కూర్చుటయే నాట్యమగును. శ్రుతులును, స్మృతులును, సదాచారములును, ఇతరములగు అనేక విశేషములును నాట్యమందు వినోదజనకము లగునట్లుగా కూర్చబడును.

నాట్య నిర్వచనము

యోఽయం స్వభావో లోకస్య సుఖ-దుఃఖ సమన్వితః।
సోఽంగాద్యభినయోపేతో నాట్య మిత్యభిధీయతే॥ 119

సుఖ - దుఃఖ సమన్వితమైన ఈ లోకస్వభావము అంగాద్యభినయోపేత మగుచు 'నాట్య' మనబడును.[30]

రంగపూజా ఫలము

ఇట్లు నాట్య స్వరూపమును వివరించి, పితామహుడు దేవతలతో ఇట్లు చెప్పెను—"ఈ నాట్యమండపమునందు విధిపూర్వకముగా మంత్ర - ఓషధి సమన్వితమైన హోమములతో పూజ నొనరింపుడు. భక్ష్య - భోజ్య - పానీయములతో బలుల నొసంగుడు. ఈ నాట్యము మర్త్యలోకమునందును ప్రవర్తితము కాగలదు. మీరందరును మర్త్యలోకమునకేగి మానవు లచ్చటచేయు శుభకరమైన ఈ పూజను గ్రహింపుడు. రంగపూజ చేయకుండ ప్రేక్షా ప్రయోగమును చేయరాదు (నాట్యమును ప్రదర్శించ రాదు). రంగపూజ చేయకయే నాట్యమును ప్రయోగించువాని జ్ఞానము నిష్ఫలమగును. అట్లు చేసిన వాడు తిర్యగ్యోనియందు పుట్టును. ఈ రంగ

---

డైన అరిస్టాటిల్ కూడ 'ఇమిటేషన్' (Imitation = అనుకరణము) అను పదమును ప్రయోగించియున్నాడు. అచ్చటకూడ పై విధముగానే వ్యాఖ్యానింప బడినది. సప్త ద్వీపములు — జంబూ - ప్లక్ష - శాల్మలి - కుశ - క్రౌంచ - శాక - పుష్కర ద్వీపములు. వీనిలో ఒక్కొక్క దానియందు మరల తొమ్మిదేసి విభాగములు కలవు. జంబూ ద్వీపమందలి తొమ్మిది భాగములలో నొకటియే భారతదేశము. ఈ ఏడు దీవులందును దేవ - ఋషి - మానవ - రాక్షసాదులు నిండియున్నారు. వారిలో ఉత్తమ - మధ్యమ - అధమ భేదములు కలవు. ఇట్టి వివిధ వ్యక్తులయొక్క వృత్తాంతము లిందు ప్రదర్శింపబడును.

30. ఈ శ్లోక మొక్కటియే 'నాట్య' పదమును నిర్వచించుచున్నది. దీనికి ముందున్న శ్లోకములు నాట్యస్వరూపమును మాత్రమే వర్ణించినవి. నాట్య ప్రయోజనమును సంక్షిప్తముగా ఈ క్రింది విధమున పేర్కొనవచ్చును—(1) సర్వభావాను కీర్తనము; (2) సప్త ద్వీపానుకరణము; (3) హితోపదేశకము; (4) విశ్రాంతిజనకము; (5) వినోదజనకము. నాట్య స్వరూపము 19 వ అధ్యాయము చివరకూడ కొంత వివరింపబడినది. 13 వ అధ్యాయమందలి 29 వ అధస్సూచికను కూడ చూడవలెను.



దైవత పూజనము యజ్ఞముతో సమానమైనది.[31] కావున నాట్యప్రయోక్తలు (both producers and actors) ప్రయత్న పూర్వకముగా ఈ పూజ నొనర్పవలెను. నర్తకుడు రంగపూజ నాచరించక పోయినను, అర్థపతి (యజమానుడు) ఇతరులచే రంగపూజ చేయించక పోయినను నష్టపడుదురు. దేవతలాచరించిన విధమున శాస్త్ర ప్రకారముగా పూజను చేయువారు శుభములైన అర్థములను పొందుదురు. అంతియే కాదు, తరువాత స్వర్గలోకమునుకూడ పొందుదురు— బ్రహ్మ పై విధముగా ఉపదేశించి, రంగపూజ నాచరించుటకై నన్ను ప్రోత్సహించెను.*

ప్రథమాధ్యాయము సమాప్తము.

---

## విశేషాంశములు

### 1. నృత్త - నాట్య - నృత్యములు

నాట్య మనగా దశరూపకము లేదా దశరూపకములలో ఏదో ఒకటి. ఇంకను సూటిగా చెప్పవలెనన్నచో, ప్రయోగమున కుద్దేశింపబడిన రూపకము 'నాట్య' మనబడును. దీనినే 'నాటకము' (drama) అనుచున్నాము. నాటకము దశ రూపకములలో ప్రధాన భేదము. రూపము లేదా రూపకము అనునది సామాన్య వాచకము. అయినను రూపకమను పదమును వదలివేసి 'నాటక' మను పదమునే సామాన్య వాచకముగా వాడుచున్నాము. ఈ విషయము లను "దశ రూపములు" అనెడి 18 వ అధ్యాయమందు ఇంకను వివరింతును. నృత్త - నాట్య - నృత్యములను గూర్చి ప్రాచీనాధునిక విమర్శకు లనేకులు అనేక విధములుగా

---

31. రంగదైవత పూజనమేకాదు, నాట్యప్రయోగ మంతయును యజ్ఞతుల్యమనియు; నాట్యమందు సిద్ధిని పడయువారు చక్కగాయజ్ఞము నొనరించినవారు పొందు సత్ఫలమునే పొందుదురనియు భరతుడు పెక్కుచోట్ల చెప్పెను. రంగస్థలము పవిత్రమైన యజ్ఞవేదికతో సమానమనియు, నటులు పవిత్ర హృదయులై ప్రవర్తించవలె ననియు సారాంశము. కవికులగురు వగు కాళిదాసు నాట్య ప్రయోగము "చాక్షుషక్రతు" వని చెప్పుట గమనార్హము. రంగమనగా నటులు నటించెడి ప్రదేశము (దీనిని మనమిప్పుడు రంగస్థల మందుము). ప్రేక్షకులు కూర్చుండెడి ప్రదేశమును కూడ ఒక్కొక్కప్పుడు రంగ మనుట కలదు. అంతియే కాదు, ప్రేక్షకులు అను నర్థమునందు కూడ కాళిదాసు "రంగ" పదమును వాడి యుండెను—"అహో రాగబద్ధ చిత్తవృత్తి రాలిఖిత ఇవ సర్వతో రంగః" [అభిజ్ఞాన శాకుంతల ప్రస్తావనలో]. 5 వ అధ్యాయమందు నాందీ శ్లోకములలో "రంగస్యాశా సమృద్ధ్యతు" అని చెప్పబడినది. రంగమనగా "నటకుశీలవవర్గ" మని అభినవగుప్తు డచ్చట వ్యాఖ్యానించెను. దీనినిబట్టి నటవర్గము కూడ రంగ మనబడినదనుట స్పష్టము.

*[కాశీ ముద్రణమునందు 99-126 శ్లో; బొంబాయి ముద్రణమునందు 99-128 శ్లో; బరోడా ముద్రణమునందు 98-127 శ్లో.]

వ్రాసినారు. నేడు నాట్య శబ్దము 'నృత్య' మునకు పర్యాయపదముగా వాడబడుచున్నది. ఉదా: భరతనాట్యము. ఇందలి 'నాట్య' పదమునకు 'నృత్య' (dance) మనియే అర్థము.

నాట్య శాస్త్ర మందు 'నృత్య' మను పదము లేదు. అభినవగుప్తుడు కూడ దీనిని వాడినట్లు కన్పట్టదు. (మూలమందు కన్పట్టు 'నృత్య' మనెడి పాఠములు సరికావు. అట్లు కన్పట్టు ప్రతి పదమునకును క్రింద 'నృత్త' మను పాఠాంతరము లుండుట గమనించవలెను.) ఇంక నాట్యశాస్త్ర మందు నృత్త - నాట్య పదములే కలవు. వీనిలో నాట్యము బ్రహ్మచే సృష్టింపబడినది. నృత్తమును పరమేశ్వరుడు ప్రవర్తింప జేసెను. ఈ నృత్తము నాట్యము కంటె చాల ప్రాచీనమైనది. అయినను నృత్తము నుండి నాట్యము జనించినదని మాత్రము చెప్పరాదు. రెండు కళలును వేర్వేరుగా జనించి వేర్వేరుగా అభివృద్ధిచెందినవి. మహేశ్వ రాదేశము ననుసరించి భరతుడే ప్రప్రథమముగా నృత్తమును నాట్యమందు చేర్చెను.

కరణ - అంగహారసంపన్నమైనది నృత్తము. ఇది అర్థములను బోధించదు. కేవలము అవయవ విన్యాసములతో కూడి ఉండును. నాట్యము నాలుగువిధము లగు అభినయములతో కూడి ఉండును. నృత్తమునందలి అంగవిన్యాసమును, నాట్యమందలి అభినయమును కలిసినచో 'నృత్య' మగును. భరతుడే ఈ సమ్మేళనము చేసినట్లు కన్పట్టుచున్నది. ఇట్టిదానికి 'నృత్య' మను పేరు తరువాత వాడుకలోనికి వచ్చినది. కాగా నృత్తము మొదట జనించినది. తరువాతిది నాట్యము. ఈ రెండింటి సమ్మేళనమే నృత్యము. పూర్వరంగమందు ప్రయుక్తము కాదగిన తాండవమును వర్ధమానపూర్వకముగా వివరించునప్పుడును, పిండీ బంధములందును (ఇవి 4 వ అధ్యాయమందు వివరింపబడినవి), చిత్రాభినయాధ్యాయ మందును (25 వ అధ్యా.), లాస్యాంగము లందును (19 వ అధ్యా.), లాస్య విధానము నందును (31 వ అధ్యా.) 'నృత్య' స్వరూపము మనకు గోచరమగుచున్నది. కాని భరతుడు మాత్రము దానిని 'నృత్య' మనలేదు. క్రీ.శ. 15 వ శతాబ్ది వాడగు విప్రదాసుడు తన 'సంగీత చంద్రము' లో నాట్యము, నృత్యమునకు పర్యాయ పదముగా కన్పట్టుచున్నదని తెలిపినాడు. క్రీ.శ. 4 వ శతాబ్దివాడగు అమరసింహుడే తాండవ - నటన - నాట్య - లాస్య - నృత్య - నర్తనములు పర్యాయ పదములని తెలిపినాడు. కావున క్రీ. శ. నాలుగవ శతాబ్ది నాటికే నృత్యము ప్రచారములో నున్నదనియు, నాట్య - నృత్యములు పర్యాయ పదములైనవనియు గ్రహించవచ్చును.

ఈ నృత్యమును సృష్టించినవాడు భరతుడైనను దానిని పెంపొందించి, దానినుండి ఉపరూపకములను సృష్టించినవాడు కోహలుడుగా కన్పట్టుచున్నాడు. పైన వివరించిన దానినిబట్టి నృత్తమునుండి నృత్యము, నృత్యమునుండి నాట్యము జనించిన వనెడి వాదములు సమంజసములు కావని గ్రహించవచ్చును. [నాట్య - నృత్త - నృత్యముల స్వరూప - సంబంధ ములను నిర్ణయించుచు శ్రీ కె. ఎమ్. వర్మగారు ఆంగ్లమున ఒక చక్కని గ్రంథమును నూతనముగా ప్రకటించినారు. విపులముగా తెలియగోరువారు దానిని చదువవలెను.]

## 2. తాండవ - లాస్యములు

నృత్త స్వరూపమును, తత్ప్రయోజనమును 4 వ అధ్యాయమందు వివరింపబడినవి. నృత్తమునందు తాండవ - లాస్యము లనెడి రెండు భేదములు కలవనియు, వీనిలో తాండ



వము ఉద్ధతముగా నుండుననియు, అది పురుషప్రయోజ్య మనియు ; లాస్యము సుకుమార ముగా నుండుననియు, ఇది స్త్రీ ప్రయోజ్యమనియు సాధారణముగా చెప్పబడుచున్నది. ఇట్టి వివరణము నాలుగవ అధ్యాయమందు కన్పట్టదు. అందు తాండవ మనెడి పదము నృత్తమునకు కేవలము పర్యాయపదముగా మాత్రమే వాడబడినది. లాస్య మనెడి పదము అందు లేనేలేదు. ఆ అర్థమునందు "సుకుమార ప్రయోగము" అను పదము కలదు. ఇంక పురుష ప్రయుక్తమైనది ఉద్ధతమనియు, స్త్రీ ప్రయుక్తమైనది సుకుమారమనియు తలంచుట కూడ సమంజసము కాదు. పురుషుడును సుకుమార నృత్తము చేయగలడు: స్త్రీ ఉద్ధత నృత్తమును చేయగలదు. ఎవరు చేసినను, నృత్తము ఉద్ధతముగా ఉన్నచో తాండవ మనబడు చున్నదనియు, సుకుమారముగా ఉన్నచో లాస్య మనబడుచున్న దనియు గ్రహించుట సమంజసము. ఇంక నాట్య స్వరూప వివరణమును, నాట్య నిర్వచనమును ప్రథమాధ్యా యాంతమందే కలవు.

## 3. నాట్యవస్తువు

దేవతలు దైత్యులను జయించిన విధమును అనుకరించుచు దేవేంద్రుని ఎదుట భరత సుతులొక నాట్యమును ప్రయోగించిరి. దీనిని బట్టి ప్రభు పరితోషమునకు ప్రభు చరితము నెప్పుడైన నాట్యమున వర్ణించవచ్చు నను అర్థము సంభావ్య మగుచున్నది. కాని అది సరి కాదు. ప్రసిద్ధ చరితమును కాని, ఉత్పాద్య వస్తువునుకాని రూపకమునందు గ్రహించవలెనని మాత్రమే దశరూపాధ్యాయ మందు చెప్పబడినది. కావున, ప్రత్యక్ష చరితమును (వర్త మానమును) నాట్య వస్తువుగా స్వీకరించరాదనుట స్పష్టము. ప్రత్యక్ష చరితమును చూచు వారలకు రాగ - ద్వేషాదులు కలుగును. వారు దానితో తాదాత్మ్యమును చెందలేరు. తాదా త్మ్యము లేనిచో రసాస్వాదన యోగ్యతయే కలుగదు. ఇచ్చట ప్రదర్శింపబడిన వస్తువు వర్త మాన చరితమని తలంచుటకంటె పూర్వకల్పములోని మన్వంతరమందలి దేవాసుర చరితమని తలంచుట సమంజసము. ఆ దృష్టితోనే దేవతలా ప్రయోగమును చూచి సంతుష్టులైనారు. కాని దైత్య - దానవులా ప్రయోగమును ప్రత్యక్ష చరితముగానే భావించి క్షోభపడుట సంభవించినది. [అభినవ భారతి - 1 వ సం. పుట 27.] వస్తువు=ఇతివృత్తము.

## 4. మంత్రప్రయోగములు

దైత్య - దానవులు ప్రయోగమునకు విఘ్నమాపాదించినట్లు చెప్పబడినది. వారు నటుల వాక్చేష్టలను కూడ స్తంభింపజేసిరి. శత్రువు లిట్లు కల్పించు విఘ్నములకు ప్రతీకార మొనర్చుటకై నటులు మంత్రశాస్త్రము నభ్యసించుట పరిపాటి అయినది. తెలుగు దేశమునకు గర్వహేతువులైన కూచిపూడి నర్తకులు మంత్ర శాస్త్రవేత్తలుగా కూడ ప్రసిద్ధిచెందిరి. శత్రువులు వారికి కల్పించిన విఘ్నములను గూర్చియు, వారందులకు చేసిన ప్రతిప్రయోగము లను గూర్చియు అనేకములగు కథలు తెలుగు దేశమునందు ప్రచారములో ఉన్నవి. మహేంద్రుడు విఘ్నకరులను దండించినట్లే పరిపాలకులుకూడ సిద్ధి విఘాతకులను దండించ వలెనని అభినవగుప్తుడు సూచించెను. [అభినవభారతి - 1వ సం. పుట 29.]

### 5. అనుకరణము : ప్రాచ్య - పాశ్చాత్య మతములు

అనుకరించుట, అనుకృతి, అనుకరణము అనెడి పదములు నాట్యపరముగా ప్రయుక్తములైనవి. అనుకరణ మనగా లోకవృత్తమును యథాతథముగా వర్ణించుట లేదా ప్రదర్శించుట అను నర్థమును చెప్పరాదు. లౌకికమిధునమును చూచునప్పుడు మనకు రాగ ద్వేషాసూయాదులు కలుగునేకాని రసప్రతీతి కలుగదు. కావున లోకవృత్తము యథాతథముగా "నాట్యము" అనిపించుకొనదు. లోకమునందలి సంఘటనలే నాట్యమందును కన్పట్టుచుండును కాన నాట్యము లోకమునకు అనుకరణ మనబడినది, అంతమాత్రమే. ఆ సుఖ దుఃఖాది సంఘటనలు చతుర్విధాభినయ సహితములైనప్పుడే నాట్య మనబడును. ఇందలి అంగవిన్యాసాదులు లోకమునందుకంటె భిన్నములుగా నుండునను విషయము అందరకును తెలిసినదే. అభినయములే నాట్యమును లోకమునుండి వేరుపరచుచున్నవి. లోకములో దుఃఖపూరితములైన ఘట్టములను చూచి మనమును దుఃఖింతుము. కాని, ఆ దుఃఖపూరితములైన ఘట్టములే కావ్యమందు వర్ణింపబడునప్పుడు వినియు లేదా చదివియు, నాట్యమందు ప్రదర్శింపబడునప్పుడు చూచియు ఆనందింతుము. నాట్యము లోకమునకు యథాతథమగు అనుకరణము కాదనుటకు దీనిని ఒక ఉదాహరణముగా గ్రహించవచ్చును.

భారతీయాలంకారికులు కవికి బ్రహ్మపద మిచ్చి అతడు తలచుకొన్నట్లుగా కళాసృష్టి అగునని చెప్పియున్నారు. వీరి వివేచనము కవిత్వ పరమైనను, దానిని సర్వకళా ధర్మము గనే పరిగణించవచ్చును. కవి సృష్టినిగూర్చి ఆనందవర్ధను డీ క్రింది విధముగా పేర్కొనెను.

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః । యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే ॥
శృంగారీచేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్ । సఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవ తత్ ॥
భావా నచేతనానపి చేతనవచ్చేతనానచేతనవత్ । వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా॥"

అంతియేకాక "నానృషిః కురుతే కావ్యమ్" (భట్టతౌతునిదిగా హేమచంద్రుడుదాహరించెను), "కవయః క్రాంతదర్శినః" అనెడి ఆలంకారిక వచనములుకూడ కవితా శిల్పిని సాక్షాద్ద్రష్టయైన వైదిక ఋషితుల్యునిగా పేర్కొనుచున్నవి. కావ్యప్రకాశ ప్రథమ శ్లోకములో మమ్మటుడు కవి సృష్టి బ్రహ్మ సృష్టినిమించిన దనినాడు. కాన అనుకరణ మనగా కేవలలోకానుకరణము కాదనెడి విషయమును భారతీయులు గుర్తించి రనుట స్పష్టము.

పాశ్చాత్య దేశములకు భరతుని వంటివాడగు అరిస్టాటిల్ (క్రీ. పూ. 384-322) కూడ 'పొయెటిక్స్' (Poetics) అను తన గ్రంథమునందు కళానిర్వచనములో 'ఇమిటేషన్' (అనుకరణము) అను పదమును వాడియున్నాడు—"**Epic poetry and tragedy, as also comedy, Dithyrambic poetry, and most flute-playing and lyre-playing, are all, viewed as a whole, modes of 'imitation'. But at the same time they differ from one another in three ways, either by a difference of kind in their means, or by differences in the objects, or in the manner of their imitations." ['Aristotel's Art of poetry'-edited by Fyfe, Page 3].**

అసలు అనుకరణము రెండు విధములు—(1)ఉన్నదానిని ఉన్నట్లుగా చెప్పుట లేదా వర్ణించుట. ఇది బాహ్య స్వరూపమునకు సంబంధించినది. (2) ఉన్నదానిని ఉన్నట్లుగా



కాక ఎట్లుండవలెనో అట్లు చెప్పుట లేదా వర్ణించుట (an imaginative reconstruction of the possibilities of Nature). ఇది ఆంతర్యమునకు సంబంధించినది. మొదటి అర్థమును మాత్రమే గ్రహించి ప్లేటో (క్రీ. పూ. 427-347) అనుకరణాత్మకములైన కళలను నిరసించినాడు. కాని, వాని శిష్యుడే అగు అరిస్టాటిల్ రెండవ అర్థమును గ్రహించి కళ ఉత్తమమైనదని నిర్ణయించినాడు. 'పొయెటిక్స్' మీద బృహద్విమర్శను వెలయించిన ఎస్. హెచ్ బుచెర్ అను పండితు డీ క్రిందివిధముగా సిద్ధాంతించెను—

"Imitation so understood, is a creative art. It is the expression of the concrete thing under an image which answers to its true idea. To sieze the universal and reproduce it in simple and sensuous form is not to reflect a reality already familiar through sense perceptions; rather it is rivalry of nature, a completion of her unfulfilled purpose, a correction of her failures." [Aristotle's Theory of Poetry and Fine Art - page, 154.]

అరిస్టాటిల్ అభిప్రాయమును సుప్రసిద్ధ విమర్శకుడగు ఎల్. ఏబర్ క్రాంబీ ఈ క్రింది విధముగా వ్యాఖ్యానించెను—"...The poet first derives an inspiration from the world by the power of his imagination; the art of poetry then imitates this imaginative inspiration in language. [Principles of Literary Criticism, 1932 - page 86.]

### 6. నాట్యోత్పత్తి: శారదాతనయుని కథనము

నాట్యోత్పత్తిని గూర్చియు, నాట్యావతరణమును గూర్చియు భావప్రకాశమందు శారదాతనయుడు చెరియొక కథనుచెప్పెను. రెండవకథను 'నాట్యావతరణము' (నాట్యము భూలోకమందు వ్యాప్తిచెందుట) అనెడి 36 వ అధ్యాయమందు వివరింతును. ఇంక మొదటికథ వ్యాసప్రోక్తమట. [భావప్రకాశము - 3 వ అధికారము - పుటలు 55 - 57.]—

"మహేశ్వరుడు కల్పాంతమందు లోకములనన్నింటిని దగ్ధముచేసిన పిమ్మట స్వేచ్ఛగా ఆనందతాండవ మొనర్చెను. తరువాత మనస్సంకల్పముచే విష్ణువును, బ్రహ్మను సృజించెను. మాయామయియగు వైష్ణవీశక్తి సర్వమంగళయగు అంబికారూపమును దాల్చి శివుని వామపార్శ్వమందు నిలిచెను. అంతట దేవదేవుని నియోగము ననుసరించి బ్రహ్మ లోకములనెల్ల సృజించి, శివుని పురావృత్తమును ప్రత్యక్షముగా చూడగోరెను. ఈశుని దివ్యచరిత్రము నెట్లు చూడగలుగుదునాయని చింతించుచున్న బ్రహ్మయొద్దకు నందికేశ్వరు డేతెంచి, సప్రయోగముగా నాట్యవేదమును బోధించి ఇట్లు చెప్పెను—"నాట్యవేదోపదిష్టములైన రూపకములలో ఒకదానిని నీవు లక్షణాన్వితముగా నిర్మించి చక్కగా భరతులకు (నటులకు) నేర్పుము. ఆ రూపకము భావాభినయకోవిదులైన భరతులచే ప్రయుక్తమైనప్పుడు ప్రాక్తన కర్మలన్నియును నీకు ప్రత్యక్షములు కాగలవు." ఇట్లుచెప్పి నందికేశ్వరుడంతర్ధాన మొందెను. చింతితార్థము చేకూరినందులకు బ్రహ్మ ఆనందించి, దేవతలతో కూడినవాడై, 'త్రిపురదాహ' మనెడి రూపకమునురచించి, దానిని భరతులకు నేర్పి "చక్కగా ప్రయోగింపు"డని కోరెను.

వారు దానిని ప్రయోగించిరి. దానిని చూచుచున్న బ్రహ్మయొక్క నాలుగు ముఖముల నుండియు నాలుగు వృత్తులతోపాటు శృంగారాది ప్రధాన రసములు నాలుగును జనించెను.

### 7. నాట్యోత్పత్తి కథ : చారిత్రక సత్యములు

నాట్యోత్పత్తినిగూర్చి నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమందు చెప్పబడినకథ పుక్కిటి పురాణమని ఆధునిక విమర్శకులు త్రోసిపుచ్చుచున్నారు. ప్రతివిషయమునకును దివ్య యోనిత్వమును కట్టిపెట్టుట మనవారికి అలవాటు అయిపోయినదని హేళనచేయుచున్నారు. ఇందలి సత్యాసత్య నిర్ణయమును పెద్దలకే విడిచిపెట్టుదును.

కథ కల్పితమో కాదో అటుండనిండు. ఇందలి పౌరాణిక వాతావరణములో కొన్ని చారిత్రక సత్యములుకూడ సమ్మిళితములై ఉన్నవని గ్రహించుట అవశ్యకము—

(1) భారతీయ నాట్యోత్పత్తికి మతముమాత్రము కారణము కాదు. యుగసంధిలోని ప్రజల గ్రామ్యధర్మప్రవృత్తియే నాట్యోత్పత్తికి హేతువైనది. అధర్మ మార్గమందు చరించు ప్రజలను ధర్మమార్గప్రవృత్తులను కావించుటకే ఈ నాట్యము ఉద్దిష్టమైనది.

(2) కవి- ప్రయోక్త లెట్టివారుగా ఉండవలెనో ఈ కథయందు సూచింపబడినది— బ్రహ్మవంటివాడే కవిగానుండవలెను. ('రంగపీఠమధ్యమందు బ్రహ్మ స్వయముగా ప్రతిష్ఠితు డయ్యెను' అనుటనుబట్టి ప్రయోగకాలమున కవి సన్నిహితుడుగా నుండవలెనని సూచింపబడినది.) ప్రయోజయిత (యజమానుడు = Producer) ఇంద్రునివంటివాడు కావలెను. నటులకు శిక్షణ నొసంగెడి నాట్యాచార్యుడు (దర్శకుడు) భరతమునివంటివాడు కావలెను. నటులు కోహలాదులవంటివారును, సుకుమారోపకరణము అప్సరసలవంటిదియును, మృదంగాదులను వాయించువారు స్వాతిమునివంటివారును, గీతజ్ఞులు నారదునివంటివారును కావలయును. నాట్యమండపము సురక్షితమును, ప్రయోగకాలము ఇంద్రోత్సవ సదృశమును, సామాజికులు ప్రశాంతరాగద్వేషులును, ప్రయోగము దేవతాపూజనపూర్వకమును కావలయును. ఇట్లు సర్వలక్షణ సంపన్నమగు నాట్యప్రయోగమే ఉత్తమమైనసిద్ధిని పడయగలదు. [అభినవభారతి. 1 వ సం - పుట 47] సుకుమారోపకరణము = స్త్రీజనము.

### 8. గ్రీకు నాటకోత్పత్తి

పాశ్చాత్య దేశములందు 'ట్రాజెడీ' (**Tragedy** = విషాదరూపకము), 'కామెడీ' (**Comedy** = శుభాంతరూపకము) అను భేదములచే రూపకములు ముఖ్యముగా రెండు విధములు. వీనిలో విషాదరూపకము ప్రథమమేకాక ప్రధానముకూడను. భారతీయులు విషాదరూపకములను ఆదరించలేదు. ఇందులకు కారణమును 7 వ అధ్యాయాంతమందలి 6 వ విశేషాంశములో వివరింతును. విషాద–శుభాంతరూపకముల ఉత్పత్తి వికాసములను గూర్చి అరిస్టాటిల్ తన 'పొయెటిక్స్' లో చర్చించి ఒక క్రమమును సూచించియున్నాడు. ఇతర విమర్శకులింకను అనేకవాదములను ప్రతిపాదించియున్నారు. అరిస్టాటిల్ అభిప్రాయమును మాత్రము ఈ క్రింది విధముగా పేర్కొనవచ్చును—

డయొనిసస్ **(Dionysus)** లేదా బేకస్ **(Bacchus)** అనునతడు గ్రీకులకు ప్రకృతిదేవత; 'ద్రాక్షాసవాధిష్ఠానదేవత' అనికూడ అందురు. వీనినిగూర్చి ప్రతిసంవత్సరమును రెండుసార్లు



ఉత్సవములు జరిగెడివి. ఇందు మార్చి నెలలో జరిగెడి ఉత్సవము ప్రధానమైనది. అప్పుడు ఉత్సాహవంతులైన ప్రజలందరును ఒకచోట గుమిగూడి డయొనిసస్‌ను గూర్చి పాటలను కలిసి పాడెడివారు. ఈ పాటలనే 'డిథీరాంబ్స్' (**Dithyrambs**) అందురు. ఇట్టిపాటలను పాడెడివారి సంఖ్య క్రమముగా ఏబదికి పరిమితమైనది. ఆదిలో ఈ పాటలు అప్పటికప్పుడే కల్పింపబడెడివి. కాని, ఏరియాన్ (**Arion**) అనువాని కాలమునుండి క్రమముగా కవులు వ్రాసెడి సంప్రదాయమేర్పడినది.. ఈ పాటలను పాడుటకు ఒక నాయకుడేర్పడినాడు. తక్కినవారు వానిననుసరించెడివారు. థెస్పిస్ (**Thespis**) అనునతడు తరువాతికాలములో, పై నాయకుని స్థానములో, ఒకనటుని ప్రవేశపెట్టినాడు. ఆ నటుడొక్కడే వేర్వేరు కృత్రిమ ముఖములతో (**masks**) వేర్వేరు భూమికలను అభినయించెడివాడు. క్రమముగా డయొనిసస్ కథలకు బదులుగా ఇతర పౌరాణిక చారిత్రక గాథలు ఇతివృత్తములు కాదొడగినవి.

క్రీ.పూ. 534 లో విషాదరూపకముల పోటీలు ప్రారంభమగుటతో నాటకరచయితలు వృద్ధిపొందిరి. ఎస్కిలస్ **(Aeschylus-B. C. 525-456)** అను నాటకరచయిత రెండవనటుని ప్రవేశపెట్టెను. ఇతనిచేతిలోనే విషాదరూపకము ఒక నిర్దిష్టస్వరూపమును పొందినది. సాఫోక్లిస్ **(Sophocles-B. C. 496-409)** అనునతడు మూడవ నటుని ప్రవేశపెట్టినాడు. రంగాలంకరణమందు శ్రద్ధవహించిన ప్రథముడును ఇతడే. అరిస్టాటిల్ వీనిని ఉత్తమ విషాదరూపక రచయితగా పరిగణించెను. అటుపిమ్మట యురిపిడస్ **(Euripides-B. C. 480-406)** అనునతడు సాంఘికేతివృత్తములనుకూడ పరిగ్రహించెను.

ఇంక శుభాంతరూపకోత్పత్తిని పైవిధముగా నిర్దిష్టముగా చెప్పుటకు తగిన ఆధారములులేవు. శుభాంతరూపకము విషాదరూపకమంత ఉత్తమ జాతికిచెందినదిగా పరిగణింపబడెడిదికాదు. క్రీ. పూ. 487 లో శుభాంతరూపకముల పోటీలు ప్రారంభమైనవి. అప్పటి నుండియు ఇవి ప్రసిద్ధికి వచ్చెను. అరిస్టాఫేన్సు **(Aristophance - C. 448 - C. 388 B. C)** ఈ శుభాంతరూపక రచనలో ప్రసిద్ధుడు. వీని రూపకములు 'ఓల్డుకామెడీ' **(Old Comedy)** అను శాఖకుచెందినవి. తరువాతి రూపకములు 'మిడిల్ కామెడీ' **(Middle Comedy-C. 375 - 325 B. C.)** అను పేరుతో నేడు వ్యవహరింపబడు చున్నవి. ఇందు సాహిత్య విమర్శయు, హేళనయు ప్రధానములుగా నుండును. అటుపిమ్మట రచింపబడిన మెనాండర్ **(Menander - B. C. 342-291)** ప్రభృతుల రూపకములు 'న్యూ కామెడీ' **(New Comedy)** అను శాఖకుచెందినవి. ఇందు హాస్యసమ్మిశ్రితమైన గృహస్థ వాతావరణము చిత్రింపబడెను.

పై రూపకములలో 'కోరస్' (**Chorus** - బృందగానము) అనునది ప్రధానపాత్రను వహించుచుండును. ఈ బృందగానమందలి వ్యక్తులు హితోపదేశకులైన పెద్దలుగా, రూపకమునకు సాక్షీభూతులైన ప్రేక్షకులుగా, రూపకములోని పాత్రలుగా మారుచుందురు.

గ్రీసుదేశమందలి రూపకోత్పత్తిని పైన దిఙ్మాత్రముగా సూచించియున్నాను. క్రీ. పూ. 5, 4 శతాబ్దముల నాటికే గ్రీకు రూపకములు విశిష్టత నార్జించుకొని స్థిరపడినవనుటస్పష్టము. సంస్కృతరూపక రచన ఎప్పుడు ప్రారంభమైనదో నిర్దుష్టముగా చెప్పజాలము. క్రీ. పూ. 200–క్రీ. శ. 200. మధ్యకాలములోకాని, ఇంకను కొంచెము ముందుకాని ప్రారంభమైయుండునని విమర్శకు లూహించుచున్నారు; కావున, సంస్కృతరూపక రచన గ్రీకురూపక

రచనకంటె అర్వాచీనమగుచున్నది. దీనినిబట్టి "భారతీయ రూపకములకు గ్రీకురూపకములు మూలములు" అను సిద్ధాంతమును కొందరువిమర్శకులు లేవనెత్తిరి. ఈ వాదము సహేతుకము కాదని అనేకులు నిరూపించియున్నారు. భారతీయ నాట్యోత్పత్తిని గూర్చిన వాదోపవాదములు ఎ. బి. కీత్ రచించిన 'సంస్కృతరూపకములు' (Sanskrit Drama) అను ఆంగ్ల గ్రంథములో విపులముగా పరామర్శింపబడినవి.

గ్రీకు రూపకోత్పత్తికి మతమే కారణమగుటస్పష్టము. చైనాదేశపు నాటకోత్పత్తికిని మతమే కారణము. క్రీ.శ. 6వ శతాబ్దిలో ఉత్తరచైనాలో నాటకప్రదర్శన ప్రారంభమైనది.

9. రాగతాళ చింతామణి

పదునారవ శతాబ్దికి తరువాతివాడుగా తలంపబడుచున్న పోలూరి గోవిందకవి తన 'రాగతాళ చింతామణి' యందును, 'తాళదశప్రాణ దీపిక' యందును నాట్యశాస్త్రమందలి కొన్ని అధ్యాయములను తెనిగించియున్నాడు. రాగతాళ చింతామణియందు నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమును కొంత విపులముగానే తెనిగించెను. వాని అనువాదములోని విశేషములనుమాత్ర మిచ్చుట వివరించుచున్నాను—

(1) నాలుగు వేదముల సారమును గ్రహించి నాట్యవేదమును కల్పించిన బ్రహ్మ దానిని 'నిజపుత్రుండైన భరతమునికి నుపదేశంబు గావించె' నట [1 వ. అ. 31]. కాని, భరతుడు బ్రహ్మపుత్రుడని నాట్యశాస్త్రమందు చెప్పబడలేదు. అంతియే కాక భరతపుత్రులుగా పేర్కొనబడిన నూర్గురును బ్రహ్మపుత్రులే అనినాడు గోవిందకవి. [1. వ. అ. 37]

(2) "నాట్యవేదము మహానటుడు మహేశ్వరుఁ దొనరించె మును వేదయోగ్యముగను
వేదస్వరూపమై విలసిల్లనదిచూడ, స్త్రీ శూద్ర జాతికిఁ దెలియ వినఁగఁ
జూడంగరా దని సురగురుండు దలంచి, నాట్యవేదము వేఱె నరులకెల్ల
సర్వ సాధారణంబుగా శ్రావ్యమగుచు, వెలయఁజేసెద...."

అని బ్రహ్మ సంకల్పించి 'ఆదిమాహేశ్వరప్రోక్త నాట్యవేదానుగుణంబై, సకలార్థసిద్ధి ప్రదంబై వెలయ నాట్యవేదమును' కల్పించెనట. [1 వ. అ. 34-35] నాట్యశాస్త్రమును బట్టి శివుడు నృత్తకర్త మాత్రమే. బ్రహ్మయే ప్రథమనాట్య ప్రవర్తకుడు.

(3) గోవిందకవి నృత్త - నాట్యభేదములను పాటించినట్లు కన్పట్టదు. భరతునకు 'శంభుని నర్తనంబువేళ కైశికి నాట్యము' కన్పట్టెనట. [1 వ. అ. 42]

(4) గోవింద కవి అప్సరసల నీ క్రిందివిధముగా వర్ణించెను. (1 వ. అ- 45)

సీ. ముజ్జగంబుల గెల్వ పజ్జించి నిల్చిన, మదనశాంబర మహామాయలనఁగ
రాహు కళంకాది రాహిత్యమున నొప్పు, పరిపూర్ణ దివ్యబింబంబులనఁగ
క్షణికధర్మముమాని శాశ్వతప్రభలతోఁ, మెలఁగెడి తొలకరి మెఱుపులనఁగఁ
జైతన్యములుదాల్చి ధాతముందఅనిల్చు, జోకైన పసిఁడి శలాకలనఁగ
సకల మోహనసౌందర్య సారమెల్ల, గరుగులనుబోసి చేసినకరణిఁ దోఁప
నప్సరఃస్త్రీలు జనియించి యజునిమ్రోల, నిలిచిరప్పుడు....

(5) భరతుఁడు మందరపర్వతాగ్రమున నటులకు నాట్యశిక్షణ మొసంగెనట. [1 వ. అ. 46]



(6) భరతుడు ఇంద్రోత్సవ సమయంబున "ఒక్క రమ్యప్రదేశంబున రంగమండపంబు రంగపీఠాద్యపద్యాది నాట్యోపగ్రహాలంకార యుక్తంబుగాఁ గల్పించి దీపకళికా సహస్రంబులు వెలుంగ' రాత్రిసమయంబున నాట్యంబున కుపక్రమించె నట. అప్పుడు ఎవరెవ రేయే కృత్యముల నాచరించిరో విపులముగా వర్ణింపబడెను. [1 వ. అ - 50.]

(7) 'ఇవ్విధంబున నింద్రవిజయోత్సవంబులయందు సార్వత్రికంబుగాఁ గైశికీ నాట్య ప్రయోగంబు భరత ప్రీతియుక్తంబై ప్రవర్తిల్లుచో నొక్క నాటి ప్రయోగ సమయంబున—

సీ. నిత్యమై దానవదైత్య నాశనకథ, ప్రస్తావనాయుక్తిఁ బ్రబలియిట్లు
కైశికీ నాట్యంబు ఘనముగా నడువఁగఁ, జూచి యోర్వఁగలేక నీచమతులు'

.... విఘ్నములు కలిగించిరట. [1 వ. అ - 52 - 53.] ప్రథమ ప్రదర్శనమందే విఘ్నములు కలిగినట్లు నాట్యశాస్త్రము తెలుపుచున్నది.

(8) నాట్యస్వరూపమును గోవిందకవి ఈ క్రిందివిధముగా వివరించెను [1వ అ. 73-77]

మీకును సురలకు మేటి శుభాశుభ, కర్మవిజ్ఞానవిక్రయము గల్గ
నానార్థమయమైన నాట్యవేదము నేను, కావించితిని........
ఒకచోట ధర్మంబుప్రకటించి తెల్పును, గ్రీడామహిమ నొక్కక్రేవఁజూపు
నిష్టార్థసాధన నెఱిఁగించు నొకచక్కి, నొకవంక శమవృత్త మొనరదెల్పు
నొకత్రోవ హాస్యంబు సుకరంబుగావించు, యుద్ధరంగముఁ జూపు నొక్కమూల
నొకచెంతఁ గామంబు నూర్జితంబుగవేర్పు, వదినొక్కచో దుష్టవధమునెఱపు.

...ఇట్లు సకలవేద-శాస్త్ర-స్మృతి-పురాణ-ఆగమ-ఇతిహాస సహితపురావృత్తాది పుణ్య కథాప్రసంగ నిధానంబైన సప్తద్వీప - సముద్ర - పర్వత - ఆరణ్య - నదీ - నదాది, దేవ - తిర్యక్ మనుష్యాది చర - అచరాత్మక సకల లోకవ్యవహారానుకరణంబై ధర్మ - అర్థ - కామ - మోక్ష చతుర్విధ పురుషార్థసిద్ధి ప్రదంబై వెలయు. ఇట్టి నాట్యమహిమంబుల మీరెఱుంగక యీ నాట్యంబు కేవల దేవతా విజయరూపంబని భ్రాంతివహించి దేవతలతోడి మత్సరంబున వేద తుల్యంబైన యీ నాట్యశాస్త్ర ప్రయోగంబునకు విఘ్నంబాచరించుట ప్రత్యవాయంబు...

(9) నాట్యనిర్వచనమును గోవిందకవి తెనిగించలేదు.

---

# అధ్యాయము 2

## నాట్యమండపములు[1]

[కాశీముద్రణమునందు 105 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 111 శ్లోకములును; బరోడా ముద్రణమునందు 105 శ్లోకములును కలవు.]

**ఋషుల ప్రశ్నలు**

ఆత్రేయుడు మొదలగు మునులు భరతుడు చెప్పినదానిని శ్రద్ధతో విని—"ఇంక రంగపూజావిధానమును తెలుపుము. భవిష్యత్కాలమందలి మానవులు నాట్యవేశ్మమం దేయే క్రియలను చేయవలెను? నాట్యవేశ్మ లక్షణమేమి? పూజావిధానమెద్ది? నాట్యప్రయోగమునకు ప్రధానమైనది నాట్యమండపమేకదా? కావున దాని లక్షణమెట్టిదో ముందుగా వివరింపుము" అని మరల ప్రశ్నించిరి.

అంతట భరతు డిట్లు చెప్పెను—నాట్యవేశ్మముయొక్కనిర్మాణవిధానమును, పూజావిధానమును చెప్పెదను వినుడు. దివ్యుల గృహ-ఉపవనముల సృష్టి సంకల్పమాత్రమున జరిగిపోవును. కాని, మానవులక్రియలు శాస్త్రసమ్మతములై, ప్రయత్నపూర్వకముగా సంపాదింపబడవలెను. కావున, మానవులు నాట్యమండపమును ఎచ్చట, ఎట్లు నిర్మించవలెనో, దాని వాస్తు-పూజావిధానము లెట్టివో వివరింతును.

**నాట్యమండప భేదములు**

ధీమంతుడైన విశ్వకర్మ ప్రేక్షాగృహములను గూర్చి యోచించి[2], శాస్త్రానుసారముగా మూడు విధములగు సన్నివేశములను (ఆకారములను) కల్పించెను— వికృష్టమండపము, చతురశ్రమండపము, త్ర్యశ్రమండపము (ఇది సన్నివేశాశ్రయమైన విభజనము). ప్రమాణభేదమునుబట్టి ఇవి ఒక్కొక్కటి మరల మూడేసివిధములుగా నుండును— జ్యేష్ఠము (పెద్దది), మధ్యమము, అవరము (చిన్నది)[3] (ఇది

1. 'మండప విధానము' అని బొంబాయి, బరోడా ముద్రణముల పాఠము. 'ప్రేక్షాగృహలక్షణము' అని కాశీ ముద్రణ పాఠము.

2. బ్రహ్మయొక్క ఆదేశము ననుసరించి విశ్వకర్మ నాట్యమండప నిర్మాణమునకు పూనుకొనిన విషయము ప్రథమాధ్యాయమందే చెప్పబడినది.

3. వికృష్ట మనగా పొడువు ఎక్కువగా, వెడల్పు తక్కువగా నుండు దీర్ఘచతురశ్రాకారము. చతురశ్ర మనగా పొడువు, వెడల్పులు సమానముగా నుండు ఆకారము. త్ర్యశ్రమనగా మూడువైపులను సమానముగా నుండు సమత్రిభుజాకారము. వికృష్ట - చతురశ్ర - త్ర్యశ్రములే జ్యేష్ఠ - మధ్యమ - అవరము లనబడునని కొంద రందురు. ఒక్కొక్క



ప్రమాణాశ్రయమైన విభజనము). వీని ప్రమాణములు హస్తదండసమాశ్రయములుగా[4] నిర్దిష్టములైనవి. జ్యేష్ఠము 108 హస్తములపొడువును (నిడివి = length), మధ్యమము 64 హస్తముల పొడువును, అవరము 32 హస్తముల పొడువును కలిగియుండును.

వీనిలో జ్యేష్ఠము దేవతలకును, మధ్యమము రాజులకును, అవరము తక్కినవారికిని ఉపయోగపడును[5]. ప్రేక్షాగృహము లన్నిటియందును మధ్యమము ప్రశస్తము. ఇందు పాఠ్యమును, గేయమును చాలచక్కగా వినబడును. చిన్న నాట్యమండ

నాట్య మండపమందు ప్రమాణ భేదమునుబట్టి మూడేసి రకము లుండుననియు, కావున మొత్తము 9 నాట్య మండపము లేర్పడుననియు మరికొందరందురు. ఈ అభిప్రాయమే యుక్తమైనది...వీని ప్రమాణములు హస్తములలోను, దండములలోను కూడ నిర్దిష్టములగుటచే పై 9 రకములును ఈ రెండు భేదములచే 18 విధములగుచున్నవి. ఈ భేదములన్నియును ప్రచారములో లేకపోవచ్చుననియు, కాని సంప్రదాయము తెలియుటకై పేర్కొనబడినవనియు అభినవగుప్తుడు తెలిపెను. [అభినవభారతి - 1 వ సం. పుట 49]

4. 'వీని ప్రమాణములు హస్తదండ సమాశ్రయములు' అనగా హస్తములలోను, దండములలోను వీని ప్రమాణములు నిర్దేశింపబడినవని అభినవగుప్తుడు అర్థము చెప్పెను. ఆధునిక విమర్శకు లందరును అభినవగుప్తుని అనుసరించియే తమ వ్యాసములను రచించిరి. కాని ఆచార్య శ్రీ డి. సుబ్బారావుగారు మాత్రము "ఒక హస్తము పొడువుగల కొలబద్దచే (దండము = కొలతబద్ద) కొలవబడునవి" అను క్రొత్త అర్థముమ తెల్పినారు. అప్పుడు నాట్య మండపములు తొమ్మిది విధములు మాత్రమే అగును. [బరోడా వారి నాట్యశాస్త్ర ప్రథమ సంపుటముయొక్క ద్వితీయ ముద్రణము నందలి 6 వ అనుబంధమును చూడవలయును - పుట 429] శ్రీ సుబ్బారావుగారి వ్యాఖ్యాన సారమును ఈ అధ్యాయాంతమున 6 వ విశేషాంశములో వివరింతును.

5. దేవతలు, రాజులు మొదలగు పదములచే ప్రేక్షకులు సూచింపబడినారని కొంద రందురు. అది సమంజసము కాదు. పై పదములచే నాయక - ప్రతినాయకాదులు గ్రహింపబడినారని తెలియవలెను. అనగా దేవాసురప్రాయమును, ఆరభటీ ప్రధానమును అయిన డిమాది రూపకములను ప్రయోగించుటకు రంగపీఠము విస్తీర్ణముగా నుండెడి జ్యేష్ఠ మండపమే కావలయును. అట్లే నృపతి ప్రాయములైన నాటకాదులను మధ్యమ మండపమందును, శేషించిన ప్రకృతులతోకూడిన భాణప్రహసనాదులను అవరమండప మందును ప్రయోగింపదగును [అభినవభారతి - 1 వ సం. పుటలు 50-51]. డా. యస్. సి. సర్కార్ ఆంగ్లానువాద మింకొకవిధముగా నున్నది — "దేవాలయములందలి నాట్యమండపములు జ్యేష్ఠములు. రాజులు కట్టించినవి మధ్యమములు. ధనికులు, వర్తకులు మొదలగువారు కట్టించినవి అవరములు." ["Bihar Theatre" - No. 3-page 8].

పమును నిర్మింపదలచినప్పుడు త్ర్యశ్రాకారమే బాగుండును. అట్లే మధ్యమ నాట్యమండపమునకు చతురశ్రమును, పెద్ద నాట్యమండపమునకు వికృష్టమును బాగుండును[6].

ప్రమాణములు

ఈ ప్రేక్షాగృహములను నిర్మించునప్పుడు విశ్వకర్మ నిర్దేశించిన ప్రమాణములనే తప్పక అనుసరించవలెను. అణువు, రజము, వాలము, లిక్ష, యూక, యవము, అంగుళము, హస్తము, దండము అనునవి ప్రమాణములు—8 అణువులు= 1 రజము; 8 రజములు=1 వాలము; 8 వాలములు=1 లిక్ష; 8 లిక్షలు= 1 యూక; 8 యూకలు=1 యవము; 8 యవములు=1 అంగుళము; 24 అంగుళములు=1హస్తము ($1\frac{1}{2}$ అడుగు); 4 హస్తములు=1 దండము (6 అడుగులు) —ఇంక పై ప్రమాణములతో[7] నాట్యమండప నిర్మాణవిధిని వివరింతును.

మధ్యమగృహము శ్రేష్ఠము

మర్త్యులకొరకు నిర్దిష్టమైన నాట్యమండపము (వికృష్ట మధ్యమ నాట్యమండపము) 64 హస్తముల పొడువును, 32 హస్తముల వెడల్పును కలిగియుండవలెను. నాట్యమండపమును ఇంతకంటె పెద్దదిగా నిర్మించరాదు. నాట్యమండపమింతకంటె పెద్దది అయినచో నాట్యము స్పష్టతను కోల్పోవును.

మండపే వికృష్టే తు పాఠ్యముచ్చరితస్వరమ్।
అనిస్సరణధర్మత్వా ద్విస్వరత్వం భృశం వ్రజేత్॥ 19
యశ్చాప్యాస్యగతో భావో నానాదృష్టిసమన్వితః।
స వేశ్మనః ప్రకృష్టత్వా ద్వ్రజే దవ్యక్తతాం పరామ్॥ 20
ప్రేక్షాగృహాణాం సర్వేషాం తస్మా న్మధ్యమ మిష్యతే।
యావ త్పాఠ్యం చ గేయం చ తత్ర శ్రవ్యతరం భవేత్॥ 21

---

6. ఈ రెండు వాక్యములకు మూలమైన శ్లోక మీ క్రింది విధముగా నున్నది—

కనీయస్తు స్మృతం త్ర్యశ్రం చతురస్రం తు మధ్యమమ్।
జ్యేష్ఠం వికృష్టం విజ్ఞేయం నాట్యవేద ప్రయోక్తృభిః॥ [పుట. 50]

ఈ శ్లోకమును అభినవగుప్తుడు వ్యాఖ్యానించక పోవుటచే ఇది ప్రక్షిప్తముగా నెంచబడినది. "వికృష్ట - చతురశ్ర - త్ర్యశ్రములే జ్యేష్ఠ - మధ్యమ - అవరము లనబడును" అను నర్థమును బలపరచుచున్నట్లుగా ఈ శ్లోకము స్థూలదృష్టికి గోచరించుచున్నది. కాని ఈ భావము భరతుని కథనమునకుగాని, అభినవగుప్తుని వ్యాఖ్యానమునకుగాని అనుగుణముకాదు. అందుచే నేను పై విధముగా భావనచేసినాను.

7. ఈ ప్రమాణములు కౌటిల్యుని అర్థశాస్త్రమందలి ప్రమాణములతో సంవదించుచున్నవి.



నాట్యమండపము చాల పెద్దది అయినచో ఉచ్చరింపబడిన పాఠ్యమునందలి కాకుస్వరాదులు అనిస్సరణ ధర్మత్వమువలన తప్పక విస్వరత్వమును పొందును. అంతియే కాక నాట్యమండపము అతి విస్తీర్ణముగా నున్నచో నానాదృష్టి సమన్వితములైన ముఖభావములు స్పష్టముగా గోచరించవు. కావున, ప్రేక్షాగృహము లన్నింటి యందును పాఠ్య-గేయములు శ్రవ్యతరములై యుండెడి మధ్యమ ప్రేక్షాగృహమే వాంఛనీయము.[8]*

దేవలోకమునందలి గృహోపవనముల సృష్టి దేవతల ఇచ్ఛా మాత్రముననే సిద్ధించును. కాని, మనుష్యుల భావములన్నియును ప్రయత్నసహితములైనప్పుడే రూపములను తాల్చును. కావున, మనుష్యులు దైవకృత భావములతో పోటీపడరాదు. మనుష్యులు నిర్మించుకొనవలసిన నాట్యగేహ (వికృష్టమధ్యమ నాట్యగృహ) లక్షణమును ఇప్పుడింక వివరింతును.

భూమి శోధనము : కొలతలు

నాట్య మండప నిర్మాత ముందుగా భూమియొక్క యోగ్యతాయోగ్యతలను పరీక్షించవలెను. తరువాత ప్రమాణానుసారముగ మండప నిర్మాణమునకు పూనుకొనవలయును. నాట్య మండపమును నిర్మింపదలచిన భూమి ఊషర క్షేత్రము (చవిటినేల) కారాదు. గట్టిగా నుండవలెను. నిమ్నోన్నతములులేనిదై సమముగా నుండవలెను. అందలి మట్టి నల్లగా కాని, బూడిదరంగు కలిగి కాని ఉండవలెను. ఈ గుణము లా భూమియం దున్నవో లేవో నిర్మాత ముందుగా పరిశోధించవలెను (ఇది బాహ్యశుద్ధి). పిమ్మట ఆ భూమిని నాగలితో దున్నించి, అందున్న ఎముకలను

---

8. అనిస్సరణ ధర్మము=ప్రతిధ్వనిని కల్గించు ధర్మము=**Principle of reflection of sound.** నాట్యమునకు వాక్కు శరీరమని 14 వ అధ్యాయమందు చెప్పబడినది. ప్రతిధ్వనులవలన అట్టివాక్కు (పాఠ్యము) స్పష్టతను కోల్పోయినచో ప్రయోగము నిష్ఫలమగును. చాల పెద్దనాట్యమండపమునందు పాఠ్యమును మెల్లగా ఉచ్చరించినచో దూరమునందున్న వారికి వినిపించదు. గట్టిగా ఉచ్చరించినచో దగ్గరగానున్నవారికి బాధాకరమగును. నాట్యమండపము చాలపెద్దది అయినచో నాట్యము 'వినిపించదు, కనిపించదు'...అని సారాంశము. ఇందు మొదట పాఠ్యగేయముల విషయమును, తరువాత అభినయవిషయమును చెప్పబడెను. ఇంక నాట్యమండపము అతికనీయసము (చాలచిన్నది) అయినచో అనురణనాత్మక మధురస్వరాభావముచే మాధుర్యహీనమగునని అభినవగుప్తుడు పేర్కొనెను. [అభినవభారతి - 1 వ. సం. పుట. 53]

*[కాశీ ముద్రమునందు 1-21 శ్లో; బొంబాయి ముద్రణమునందు 1-24 శ్లో; బరోడా ముద్రణమునందు 1-21 శ్లో.]

మేకులను, పుర్రెముక్కలను, గడ్డిని, తుప్పలను తొలగించవలెను (ఇది ఆభ్యంతర శుద్ధి). ఇట్లు బాహ్యాభ్యంతర శుద్ధిచేసిన పిమ్మట కొలతలను నిర్దేశించవలెను.' పుష్యమీ నక్షత్రయోగమున తెల్లని సూత్రముతో కొలతలు వేయవలెను. ఈ సూత్రమును నూలుతోకాని, బల్బజమనెడి గడ్డితోకాని, ముంజమనెడి దర్భలతోకాని, నారతోకాని గట్టిగా, తెగకుండునట్లుగా తయారు చేయవలెను. కొలతలను వేయుచున్నప్పుడు సూత్రము గట్టిగా లేకపోవుటచే సగమునకు తెగినచో యజమానునకు మరణము తప్పదు. సూత్రము మూడవ వంతునకు తెగినచో రాజు యొక్క ఆగ్రహమునకు గురియగుట తటస్థించును. సూత్రము నాలుగవవంతునకు తెగినచో ప్రయోక్తకు నాశము సంభవించును. అంతియేకాక కొలతలను వేయుచున్నప్పుడు సూత్రము చేతినుండి జారిపడినను ఏదో ఒక నష్టము కలిగితీరును. కావున, సూత్రమును గట్టిగా పట్టుకొనవలెను. కొలతలనుకూడ హెచ్చుతగ్గులు లేకుండునట్లుగా, సావధానముగా వేయవలెను.

### వికృష్ట నాట్యమండప నిర్మాణము

*కొలతలు :* బ్రాహ్మణులను దానాదికములచే సంతృప్తులను కావించి, శుభతిథి కరణములుగల సుముహూర్తమున పుణ్యాహవాచనమును కావించవలెను. అప్పుడు శాంతితోయము నంతటను ప్రోక్షించి, సూత్రమును గ్రహించవలెను.

చతుష్షష్టి కరాన్ కృత్వా ద్విధా కుర్యాత్ పునశ్చ తాన్ ॥ 33
పృష్ఠతో యో భవేద్భాగో ద్విధాభూతస్య తస్య తు ।
సమ మర్ధవిభాగేన రంగశీర్షం ప్రకల్పయేత్ ॥ 34
పశ్చిమే చ విభాగేఽథ నేపథ్యగృహ మాదిశేత్ ।
విభజ్య భాగా న్విధివద్యథావదనుపూర్వశః ॥ 35

మొదట, నాట్యగృహము యొక్క పొడువు 64 హస్తములను గుర్తించవలెను, పిమ్మట దీని వెడల్పు 32 హస్తములను గుర్తించవలెను. ఇది మధ్యమ వికృష్ట మనబడెడి నాట్యగృహము. ఈ దీర్ఘచతురశ్రమును రెండు సమభాగములుగా చేయవలెను. అప్పుడు 32 హస్తముల చతురశ్రములు రెండేర్పడును. ఈ రెండింటిలో

---

9. ఇచ్చట బరోడా ముద్రణమం దొక అధికపాఠ శ్లోకము కలదు. — "మూడు ఉత్తరా నక్షత్రములును (ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ఉత్తరఫల్గుని), సౌమ్య (మృగశిర)- విశాఖా - రేవతీ - హస్తా - తిష్యా - అనూరాధా నక్షత్రములును నాట్యకర్మకు అనగా మండప నిర్మాణాదులకు ప్రశస్తములు."



ముందుభాగము అనగా తూర్పుభాగము రంగమండల[10] మగును. వెనుకభాగమును అనగా పశ్చిమ భాగమును మరల రెండు సమభాగములగునట్లుగా విభజించవలెను. అప్పుడు 16×32 హస్తముల దీర్ఘచతురశ్రములు రెండేర్పడును. వీనిలో పశ్చిమ భాగము నేపథ్యగృహ[11] మగును. తక్కిన భాగమును మరల రెండు సమభాగములగునట్లుగా విభజించినచో 8×32 హస్తముల దీర్ఘచతురశ్రములు రెండేర్పడును. అందలి పశ్చిమభాగము రంగశీర్షమును[12], తూర్పుభాగము రంగపీఠమును[13] కాగలవు. (వివరములకు ప్రక్క పుటలోని పటమును చూడవలెను.)

---

10. రంగమండలము=ప్రేక్షక గృహము=Auditorium. దీనియందే ప్రేక్షకులు కూర్చుందురు. ఇది 32×32 హస్తముల (48×48 అడుగుల) చతురశ్రము. ఇందు సుమారు 500 మంది ప్రేక్షకులు కూర్చుండవచ్చును. దీనిని దండప్రమాణముతో చూచినచో 32×32 దండముల (288×288 అడుగుల) చతురశ్ర మేర్పడును. అప్పుడు సుమారు 20,000 మంది ప్రేక్షకులు కూర్చుండుటకు వీలుకలుగును. ప్రాచీన గ్రీసు దేశములో 20 లేదా 30 వేలమంది ప్రేక్షకులు నాటక ప్రదర్శనమును చూచెడివారట. కాని, అవి పైకప్పులేని పర్వతసానువులనుట మరువరాదు.

11. నేపథ్యగృహము=నేపథ్యభూమి=నటులు వేషధారణముచేయు ప్రదేశము= **Green room or make-up room**—ఇది 16×32 హస్తముల దీర్ఘచతురశ్రము. దీని నుండి రంగశీర్షమును ప్రవేశించుటకు రెండు ద్వారములున్నట్లు తరువాత చెప్పబడును. బహుశః నేపథ్యగృహమునందు రెండు భాగములు లేదా గదులు—ఒకటి పురుషులకును, ఇంకొకటి స్త్రీలకును — ఉండెడివేమో? ఈ దృష్టితో చూచినప్పుడే ఆ రెండు ద్వారములును ప్రయోజన సహితము లగుచున్నవి. పురుషులతో కలిసి స్త్రీలు వేషములు వేయుచున్నట్లు నాట్యశాస్త్రము తెలుపుచునేయున్నది.

12. భరతుడు రంగశీర్షమును రంగపీఠమును వేర్వేరుగా నిర్దేశించెనా లేక రెండును ఒకటియేనా అను విషయము తీవ్రవాదోపవాదములకు గురి అయినది. అభినవగుప్తుడు మాత్రము రెండును భిన్నములనియే నిర్ణయించి, అట్లే వ్యాఖ్యానించినాడు. డా. వి. రాఘవన్, శ్రీ డి. ఆర్. మాంకడ్, డా. పి. యస్. శాస్త్రి, మిస్. గోదావరి వి. కేత్కర్, డా. సి. బి. గుప్త మొదలగువారు అభినవగుప్తుని అనుసరించి వ్యాసములను ప్రకటించిరి. డా. మనోమోహన్ ఘోష్, ఆచార్య శ్రీ డి. సుబ్బారావు మొదలగువారు అభినవగుప్తుడు పొరపడెనని అభిప్రాయపడినారు. రంగశీర్ష - రంగపీఠములు వేర్వేరు భాగములుకావనియు, రెండును ఒక్కటియేఅనియు, రంగపీఠము (రంగశీర్షము) నేపథ్య గృహముతో సమానమైన పరిమాణము కలిగి యుండుననియు వారు నిర్ణయించినారు. నేను నా అనువాదమునందు, అభినవగుప్తుని అనుసరించి యున్నాను. ఆయా సందర్భములందు విమర్శకుల వివిధాభిప్రాయములను అధస్సూచికలందు వివరించి యున్నాను. వేషధారణమును ముగించి, నేపథ్య గృహమును వెడలివచ్చి, రంగపీఠమునందు ప్రవేశించవలసిన

వికృష్ట నాట్యమండపము (64 హ × 32 హ)

వివరములు :

1 - నేపథ్యగృహము (16×32 హ.)
2 - రంగశీర్షము (8×8 హ.)
* - ద్వారములు.
•• •• - షడ్దారుకము
3, 3 - రంగశీర్ష పార్శ్వభాగములు (నటుల విశ్రాంతి స్థానములు)
----- - రంగపీఠ - రంగశీర్షముల మధ్యనుండెడి తెర.
4 - రంగపీఠము (8×16 హ.)
5, 5 - మత్తవారణులు (8×8 హ; 8×8 హ.)
6 - రంగమండలము = ప్రేక్షక గృహము (32×32 హ.)
○ - చతుర్వర్ణ స్తంభములు
(బ్రా = బ్రాహ్మణ స్తంభము,
క్ష = క్షత్రియ స్తంభము,
వై = వైశ్య స్తంభము,
శూ = శూద్ర స్తంభము)
తూ = తూర్పు, ద = దక్షిణము,
ప = పశ్చిమము, ఉ = ఉత్తరము.




సమయము కొరకు నిరీక్షించుచు, పాత్రలీరంగశీర్షమునందు వేచియుందురు. ఇది 8×32 హస్తముల దీర్ఘచతురశ్రము. ఇందు మధ్యభాగమున 8×8 హస్తముల ప్రమాణముగల ఉన్నతమైన వేదికను నిర్మించవలెను. నాట్య మండపమును వెలికిలగా పరుండి నిద్రించుచున్న వ్యక్తిగా నూహించినచో రంగపీఠము హృదయముగను, రంగశీర్షము శిరస్సుగను కన్పట్ట గలవు [అభినవభారతి - 1 వ సం. పుట 56]. పై వేదిక మీదనే వాదక - గాయకులు ఉపవిష్టులై యుందురని అభినవగుప్తుడు 5 వ అధ్యాయమందు పేర్కొనినాడు.

13. రంగపీఠము = రంగస్థలము = రంగము = **Stage.** ఇది 8×32 హస్తముల దీర్ఘచతురశ్రము. కాని 8×16 హస్తముల మధ్యభాగమే అసలు రంగపీఠము. దీనికి రెండు ప్రక్కలను 8×8 హస్తముల చతురశ్రములుండును. వానినే అభినవగుప్తుడు మత్తవారణు



లని పేర్కొనెను. రంగపీఠము 16 హస్తముల పొడువును, 8 హస్తములవెడల్పును కలిగి యుండవలెనని కొందరందురు. మరికొందరు 8 హస్తముల పొడువును, 16 హస్తముల వెడల్పును కలిగియుండవలె నందురు. ఎట్లైనను రంగపీఠము దీర్ఘ చతురశ్రముగా నుండ వలెననుట స్పష్టము. [అభినవభారతి - 1 వ సం. పుట 57]. రంగపీఠముయొక్క పొడువు 16 హస్తము లున్నచో అది రంగమండలములోనికి కాని, రంగశీర్షములోనికి కాని చొచ్చుకొనిపోవును. రంగశీర్షములోనికి చొచ్చుకొనిపోయినచో రంగశీర్ష - రంగపీఠములు కలిసిపోయి రెండును ఒకటియే అగును. ఈ అభిప్రాయమును అభినవగుప్తుడు సమర్థించలేదు.

రంగపీఠ - రంగశీర్షములు భిన్నములనెడివారి ఉపపత్తులు కొన్ని క్రిందివిధముగా నున్నవి—(1) 34 వ శ్లోకమునందు రంగపీఠము ప్రత్యేకించి పేర్కొనబడకపోవుటకు కారణము రంగపీఠ - రంగశీర్షములు సమాన ప్రమాణములు కలవి యగుటయే. రంగపీఠ ప్రశంస ఇచ్చట లేకపోయినను పెక్కుచోట్లకలదు. (2) ప్రథమాధ్యాయమందు - "వేదికను రక్షించుటయందు అగ్ని నియుక్తుడయ్యెను...మహేంద్రుడు స్వయముగా రంగపీఠ పార్శ్వ మందు నిలిచెను...రంగపీఠ మధ్యమందు బ్రహ్మ స్వయముగా ప్రతిష్ఠితుడయ్యెను...." అని చెప్పబడినది. ఇందలి వేదికయే రంగశీర్షము, తక్కినది రంగపీఠము. (3) 2 వ అధ్యాయమందు 63 వ శ్లోకములో "రంగపీఠముయొక్క. పార్శ్వములందు మత్తవార ణులను నిర్మించవలె" ననియు, 64 వ శ్లోకములో "....రంగపీఠ ప్రమాణమును బట్టి.... మత్తవారణులను నిర్మించవలె" ననియు; 68 వ శ్లోకములో "పిమ్మట రంగపీఠమును శాస్త్రానుసారముగా నిర్మించవలెను, ఇంక రంగశీర్షమును షడ్దారుకసమన్వితమును చేయవలెను" అనియు చెప్పబడినది. దీనినిబట్టి రంగశీర్ష - రంగపీఠములు భిన్నములని స్పష్టమగుచున్నవి. (4) అభినవగుప్తుడు తన అభినవభారతీవ్యాఖ్యయందు 61 వ పుటలో "రంగపీఠే కార్యే రంగశిర స్తావదాహ", అనియు; 68 వ పుటలో "రంగపీఠస్య యదుపరి శిరోరూప మిత్యర్థః. తథా చ వికృష్టమండపే రంగపీఠాపేక్షయా రంగశిర ఉన్నతం వక్ష్యతే" అనియు; 210 వ పేజీలో (5 వ అధ్యాయమందు) "తత్ర యవనికా రంగపీఠ తచ్ఛిరసోర్మధ్యే" అనియు స్పష్టముగా పేర్కొనినదానినిబట్టి కూడ ఇవి భిన్న ములనుట స్పష్టము.

ఈ రంగశీర్షము—(1) రంగపీఠమును ప్రవేశించవలసిన పాత్రలు సిద్ధముగా నిలిచి యుండుటకును; (2) రంగపీఠమునుండి తాత్కాలికముగా నిష్క్రమించిన పాత్రలు విశ్రాంతి తీసికొనుటకును; (3) ఆయా దృశ్యములను ప్రదర్శించి రంగమునకు శోభను కలి గించుటకును; (4) కుతప విన్యాసమునకును ఉపయుక్తమగునని అభినవగుప్తుడు పేర్కొ నెను. కుతపమనగా వాద్య - వాదక - గాయక సమూహము. రంగపీఠముకంటె ఉన్నతముగా నిర్మింపబడిన 8×8 హస్తముల వేదికమీద కుతపవిన్యాసము జరుగుననియు, దానికి రెండుప్రక్కలనున్న ప్రదేశములందు పాత్రలు నిలుచుటయు, విశ్రాంతి తీసికొను టయు జరుగుననియు గ్రహించవలెను. ఇది వికృష్ట నాట్యమండపవిషయము. ఇంక చతురశ్ర - త్ర్యశ్ర నాట్యమండపములందు రంగశీర్ష - రంగపీఠములు సమతలములుగానే ఉండునని తరువాత చెప్పబడును.

ఇట్లు శాస్త్రము ననుసరించి క్రమముగా భాగములను విభజించవలెను[14].*

*ఇష్టకాస్థాపనము, బలివిధానము :* పిమ్మట శుభనక్షత్రయోగము నందు మండపనివేశనము[15] చేయవలెను. ఆ సమయమున శంఖ-దుందుభుల నిర్ఘోషములును, మృదంగ-పణవాది సర్వాతోద్యముల నినాదములును విజృంభించవలెను. అప్పుడా ప్రదేశమునందు అనిష్టులగు పాషండులును, ఆశ్రమ స్వీకారము చేసినవారును, కాషాయ వస్త్రధారులును, వికలాంగులును ఉండరాదు; ఉన్నచో వారిని ముందుగానే పంపివేయవలెను. రకరకములగు అన్నములతో, గంధ-పుష్పములతో రాత్రి వేళ పదిదిక్కులందును బలిని వేయవలెను. తూర్పుదిక్కునందు తెల్లని అన్నముతోను, దక్షిణమునందు నల్లనిఅన్నముతోను, పశ్చిమమందు పచ్చని అన్నముతోను, ఉత్తరమునందు ఎఱ్ఱని అన్నముతోను బలిని వేయవలెను. ఇంక తక్కిన దిక్కుల కెవరెవరు దైవతములో వారివారికి తగినట్లుగా, మంత్రపూర్వకముగా బలుల నొసంగవలెను. ఇష్టకాస్థాపన సమయమునందు బ్రాహ్మణులకు నేతితో కూడిన పాయసమును, రాజులకు మధుపర్కమును[16], పనివారికి బెల్లముకలిపిన అన్నమును ఒసంగవలెను.

---

14. నాట్యమండప భాగములను వివరించెడి మూలశ్లోకములు కొంతసందిగ్ధములుగా నున్నవి. నేను అభినవగుప్తుని వ్యాఖ్య ననుసరించి పై విధముగా విపులీకరించి వ్రాసినాను. 64 హస్తముల పొడవును రెండుగా విభజించవలెననియు, ఆ రెండుభాగములలో వెనుక భాగమును మరల రెండు సమభాగములు చేయవలెననియు అందరంగీకరించుచున్నారు. అట్లేర్పడిన రెండుభాగములలో ముందుభాగము రంగశీర్షముకాగా, పశ్చిమభాగము నేపథ్య గృహమగును. నేపథ్య గృహమునుగూర్చియు ఎవరికిని పేచీ లేదు. ఇంక ఉన్నదంతయును రంగశీర్షమునుగూర్చియే. పై శ్లోకములందు [33-35 శ్లో] రంగపీఠపదమే లేదు, రంగశీర్షముమాత్రమే చెప్పబడినది. రంగపీఠమనునది ప్రత్యేకభాగమైనచో భరతుడు దానిని తప్పక పేర్కొనియుండెడివాడనియు, అట్లు చెప్పకపోవుటచే రంగపీఠ - రంగశీర్షము లొక్కటియే అని గ్రహించవలెననియు డా. ఘోష్ మొదలగువారి వాదము. వీరు రంగపీఠమునకు రెండుప్రక్కలను మత్తవారణులను అంగీకరింపగా, ఆచార్య శ్రీ సుబ్బారావుగారు దానిని కూడ అంగీకరించక మత్తవారణి, రంగశీర్షము, రంగపీఠము అను పదములకు నూత్నార్థములను చెప్పిరి. ఇంక రంగశీర్ష - రంగపీఠములు భిన్నములనెడి అభినవగుప్తుని వాదమును, రంగశీర్ష నిర్మాణ విధానమును పై రెండు అధస్సూచికలలోను తెలియజేసియున్నాను.

* [కాశీముద్రణమునందు 22–35 శ్లో; బొంబాయి ముద్రణమునందు 25–33 శ్లో; బరోడా ముద్రణమునందు 22–35 శ్లో].

15. నివేశన మనగా ఇష్టకాస్థాపనరూపమైన కర్మయని అభినవగుప్తుడు తెలిపెను. దీనినే మనము 'శంకుస్థాపన' మందుము. ఇష్టక = ఇటిక.

16. 'మధుపర్క' మనగా పెండ్లిలో వధూవరుల కొసంగెడి దీక్షావస్త్రములు కావు పెరుగు, నేయి, పాలు, తేనె, బెల్లము కలిసిన దానిని మధుపర్కమందురు. ఇది వధూవరుల కిచ్చునపుడు దీక్షావస్త్రముల నొసంగుదురు కాన వానికిని ఈ పేరే వచ్చియుండును.



మూలా నక్షత్రమందు, మంచితిథి, కరణములతో అనుకూలమైన ముహూర్తమందు బుధు లీ ఇష్టకాస్థాపనమును చేయవలెను.

**చతుర్వర్ణ స్తంభములను స్థాపించుట**

ఇట్లు ఇష్టకాస్థాపనమైన పిమ్మట గోడలను కట్టుట కుపక్రమించవలెను. ఇది పూర్తి అయిన పిమ్మట శుభతిథి-నక్షత్ర-కరణ-యోగమునందు నాలుగు స్తంభములను స్థాపించవలెను. ఇందులకు రోహిణి లేదా శ్రవణము శ్రేష్ఠము. నియమవంతుడైన ఆచార్యుడు మూడురాత్రు లుపవసించి, సూర్యోదయ మగుచున్న శుభకాలమం దీ స్తంభములను స్థాపించవలెను.[17] నేతితోను, ఆవాలతోను సంస్కరింపబడిన వస్తువులతో బ్రాహ్మణ స్తంభమును ఆగ్నేయ దిశయందు స్థాపించవలెను. ఇప్పట్ల పూజాద్రవ్యము లన్నియును తెల్లనివిగానే ఉండవలయును. ఈ స్తంభముయొక్క అధోభాగమునందు కర్ణాభరణములైన దుద్దులు మొదలగువానిలోని బంగారపు ముక్కను నిక్షేపించవలెను. స్తంభస్థాపనానంతరమున బ్రాహ్మణులకు పాయస మొసంగవలెను.

తరువాత ఎఱ్ఱని వస్త్ర - మాల్యా - అనులేపనములతో క్షత్రియ స్తంభమును నైఋతి దిశయందు ప్రతిష్ఠించి, ద్విజులకు బెల్లము కలిపిన అన్నము నొసంగవలెను. ఈ స్తంభముయొక్క అధోభాగమునందు రాగిని నిక్షేపించవలెను. పిమ్మట పచ్చని ద్రవ్యములతో వైశ్యస్తంభమును వాయవ్యదిశయందు స్థాపించి ద్విజులకు నేతితో తడిసిన అన్నము నొసంగవలెను. ఈ స్తంభముయొక్క అధోభాగమునందు వెండిని ఉంచవలెను. ఇంక నల్లని పూజా ద్రవ్యములతో శూద్ర స్తంభమును ఈశాన్య దిశయందు స్థాపించి ద్విజులకు పులగమును ఒసంగవలెను; ఈ స్తంభముయొక్క అధోభాగమున ఇనుము నుంచవలెను. అంతియేకాక, ఈ మూడు స్తంభములయొక్క అధోభాగములందు కూడ బంగారమును ఉంచవలెను.

స్వస్తి - పుణ్యాహవాచనములతో, జయజయ శబ్దములతో, పుష్పమాలలతో స్తంభస్థాపనము జరుపవలెను. ఆ సమయమందు బహువిధములైన రత్నదాన -

---

17. ఈ స్తంభములను రంగమండపముయొక్క నాలుగు మూలలందును స్థాపించవలెనని శ్రీ మాంకడ్ అభిప్రాయపడెను. అది సమంజసముగా కన్పట్టదు. నాట్యగృహముయొక్క నాలుగు మూలలందును వీనిని స్థాపించవలెననెడి శ్రీ సుబ్బారావుగారి అభిప్రాయము యుక్తముగానున్నది. కాని, గోడలను కట్టుట పూర్తి అయిన పిమ్మట ఈ స్తంభములు స్థాపింపబడుచున్నట్లుగా మూలమందు కలదు. మరి వీని ప్రయోజనమేమి ? విద్య, పరాక్రమము, వాణిజ్యము, సేవానిరతి అనువానికి ప్రసిద్ధి చెందియున్న నాలుగు వర్ణములకును చిహ్నములుగా నాలుగు స్తంభములను స్థాపింపబడవలెనని గ్రహించవలెను.

గోదాన - వస్త్రదానములచే బ్రాహ్మణులకు సంతృప్తిని కలిగించవలెను. కదలుట, వదులుగా నుండుట, తిరుగుట అనునవి లేకుండ స్తంభములను స్థాపించవలెను. అట్లు చేయనిచో ఈ క్రింది దోషములు సంభవించును. స్తంభము కదలుచున్నచో అనావృష్టి సంభవించును; స్తంభము తిరుగుచున్నచో మృతి-జాడ్యాదులవలని భయము కలుగును; స్తంభము వదులుగానున్నచో శత్రువులవలన దారుణమైన భయము సంభవించును. ఈ దోషములు లేకుండునట్లుగా మంగళప్రదమైన స్తంభములను ప్రతిష్ఠించవలెను.

పవిత్రమైన బ్రాహ్మణ స్తంభమును ప్రతిష్ఠించునప్పుడు దక్షిణగా గోవును దానమొసంగవలెను. తక్కిన స్తంభములను ప్రతిష్ఠించునప్పుడు పని వారికి భోజనము పెట్టవలెను. ధీమంతుడైన ఆచార్యుడు మంత్రపూతమైన దానినే ఇతరులకొసంగవలెను. పురోహితునకును, రాజునకును మధుపాయసములతో భోజనము పెట్టవలెను. పనివారికి లవణముతో కూడిన పులగమును ఒసంగవలెను. ఇట్లు పై విధుల నన్నింటిని నిర్వర్తించి, ఆతోద్యములన్నియును మ్రోగుచుండగా, యథాన్యాయముగా అభిమంత్రించి, శుచిఅయిన ఆచార్యుడు స్తంభములను లేవనెత్తవలెను.

> యథాఽచలో గిరి ర్మేరు ర్హిమవాం శ్చ మహాబలః॥ 61
> జయావహో నరేంద్రస్య తథా త్వ మచలో భవ[18]। 62

అను మంత్రమును పఠించుచు ఆ స్తంభములను స్థాపించవలెను. ఈ విధముగానే తద్‌జ్ఞులు తక్కిన స్తంభములను, ద్వారములను, గోడలను, నేపథ్యగృహమును శాస్త్రానుసారముగా నిర్మించవలెను.*

మత్తవారణి:

> రంగపీఠస్య పార్శ్వే తు కర్తవ్యా మత్తవారణీ॥ 63
> చతుస్తంభసమాయుక్తా రంగపీఠప్రమాణతః।
> అధ్యర్థహస్తోత్సేధేన కర్తవ్యా మత్తవారణీ॥ 64
> ఉత్సేధేన తయోస్తుల్యం కర్తవ్యం రంగమండపమ్॥ 65

---

18. "మేరుగిరివలె కదలనిదానవై, హిమవంతునివలె మహాబలశాలివై, అచలముగా నుండి నీవు రాజునకు జయమును చేకూర్పుము." — రాజు అనగా నాట్య ప్రయోజయిత = నిర్మాత = **Producer** అని గ్రహించవలెను.

* [కాశీ ముద్రణమునందు 36-63 శ్లో; బొంబాయి ముద్రణమునందు 34-69 శ్లో; బరోడా ముద్రణమునందు 36-63 శ్లో.]



పిమ్మట రంగపీఠముయొక్క పార్శ్వమునందు మత్తవారణిని[19] నిర్మించవలెను. ఈ మత్తవారణి నాలుగు స్తంభములను, రంగపీఠముతో సమానమగు ప్రమాణమును కలిగియుండవలెను. ఈ మత్తవారణియొక్క ఎత్తు 1½ హస్తము లుండవలెను. దీనితో అనురూపమైన ఎత్తున రంగమండపము ఉండవలెను.

---

19. ఈ ద్వితీయాధ్యాయ మంతటిలోను అతి క్లిష్టమైన ఘట్టములు—ఒకటి రంగశీర్ష నిర్మాణము, రెండు మత్తవారణీ-నిర్మాణము, మూడు షడ్దారుక నిర్మాణము. ఈ మూడును అనేక వాదోపవాదములకు గురి అయినవి. మత్తవారణీ నిర్మాణమునకు సంబంధించిన పై శ్లోకములను అభినవగుప్తుడీ విధముగా వ్యాఖ్యానించెను—ఇందలి పార్శ్వము, మత్త వారణి అను పదములు రెండును ఏకవచనములో ఉన్నవి. కాని, పార్శ్వ మనగా ఉభయ పార్శ్వములనియు, రంగపీఠముయొక్క రెండు పార్శ్వములందును రెండు మత్తవారణులను నిర్మించవలెననియు గ్రహించవలెను. ఒక్కొక్క మత్తవారణియందు నాలుగేసి స్తంభములు నాలుగు మూలలందును ఉండవలెను. రెండు మత్తవారణులయొక్క ప్రమాణములును కలిసి (8×8 హ. +8×8 హ. = 128 చ. హ.) రంగపీఠముయొక్క ప్రమాణముతో (16×8 హ. = 128 చ. హ.) సమానముగా నుండవలెను. ఈ మత్తవారణులయొక్క ఎత్తు 1½ హస్తము లుండవలెను. మత్తవారణులు రంగపీఠముకంటె 1½ హస్తముల ఎత్తున ఉండవలెనని కొందరందురు. రంగపీఠము మత్తవారణులతో సమానమగు ఎత్తు కలిగి ఉండవలెనని మరికొంద రందురు. (ఇది సమంజసముగా నున్నట్లు అభినవగుప్తుడభిప్రాయ పడినాడు.) [అభినవభారతి - 1 వ సం. పుట 61.]

చివరి శ్లోకమందలి 'రంగమండప' పదమునకు అభినవగుప్తుడు రంగపీఠమను నర్థమును చెప్పెను. కాని, ఆధునిక విమర్శకులు కొందరు ఆ పద మచ్చట తప్పుగా పడినదనియు, 'రంగమండల' మని ఉండవలెననియు అభిప్రాయ పడుచున్నారు. రంగమండలమునందలి ఆసనముల వరుసలు సోపానాకృతిగా నుండుననియు, చివరివరుస యొక్క ఎత్తు రంగపీఠము యొక్క ఎత్తుతో సమానముగా ఉండవలెననియు ముందు చెప్పబడును. కాగా మత్తవారణులు, రంగపీఠము, ఆసనముల చివరివరుస అనునవి మూడును ఒకే ఎత్తులో ఉండునని గ్రహించవలెను. రంగశీర్షము యొక్క మధ్యభాగము (ఎనిమిది హస్తముల చదరము) ఈ రంగపీఠాదులకంటె ఉన్నతముగా నుండును.

మత్తవారణుల ప్రయోజనమును భరతుడుకాని, అభినవగుప్తుడు కాని వివరించలేదు. ఇవి నేటి 'సైడ్‌వింగ్సు' (**Sidewings**) వంటివి అనుటకు వీలున్నదేమో? 13 వ అధ్యాయమందు కక్ష్యావిభాగము చెప్పబడును. కక్ష్యావిభాగములుగా కూడ ఇవి ఉపయుక్తములు కావచ్చుననియు; మత్తవారణులకు, రంగపీఠమునకు మధ్య గోడలుండుననియు శ్రీ మాంకడ్ అభిప్రాయపడెను.

మత్తవారణిని గూర్చి డా. పి. యస్. శాస్త్రిగారు ఈ విధముగా వ్రాసినారు — "...రంగపీఠమునకు రెండు ప్రక్కలను రెండు మదపుటేనుగులను నిర్మింపవలెను. ఉత్తరమున నొకటి, దక్షిణమున నొకటి కలిసి రెండేనుగులు రాగలవు. ఈ ఏనుగులు

ఈ మత్తవారణిని నిర్మించునప్పుడు నానావర్ణములుగల మాల్య, ధూప, గంధ, వస్త్రములను, భూతప్రియమగు బలిని ఒసంగవలెను. స్తంభముల అడుగున ఇనుపముక్కల నుంచవలెను. బ్రాహ్మణులకు పొంగలితో కూడిన భోజనమును పెట్టవలెను. ఇట్లు శాస్త్రానుసారముగా మత్తవారణిని నిర్మించవలెను.

---

నాలుగు స్తంభములతో కలిసి ఉండవలెను....ప్రేక్షకుల కభిముఖముగా నున్న ఈ యేనుగులు నాట్యమండపమును మోయుచున్నట్లు కన్పించగలవు" [భారతి, నందన శ్రావణము - పుట 177.]

ఆచార్య శ్రీ డి. సుబ్బారావుగారు ఈ శ్లోకములకు, అందలి పదములకు క్రొత్త అర్థములను చెప్పి ఇంకొక విధముగా వ్యాఖ్యానము చేసినారు—

"రంగమనగా నటులు నటించెడి ప్రదేశము (రంగస్థలము=stage). రంగము యొక్క పై భాగము (top of the stage) రంగశీర్షమనబడును. రంగము యొక్క అడుగుభాగము (base of the stage) రంగపీఠమనబడును. అందుచే రంగపీఠ - రంగశీర్షములు భిన్నప్రదేశములు కావు. అవి రెండును ఒకేప్రదేశము యొక్క అడుగు - పై భాగములుమాత్రమే. రంగశీర్ష మేస్థలమును ఆక్రమించునో రంగపీఠమును అదేస్థలమును ఆక్రమించును. కావున రెండింటిని భిన్నములుగా చూపవలసిన అవసరములేదు. ఈ రంగశీర్షము లేదా రంగపీఠము నేపథ్యగృహముతో సమానమగు ప్రమాణమును (16×32 హ.) కలిగియుండును.

"ఇంక మత్తవారణి విషయము. పార్శ్వము, మత్తవారణి అను పదములకు బహువచనమును చెప్పుకొనవలసిన ఆవశ్యకతలేదు. మత్తవారణి అనగా మదించిన ఏనుగుల యొక్క వరుస. పార్శ్వమనగా ప్రేక్షకులకు ఎదురుగా కన్పించెడి రంగపీఠము యొక్క పార్శ్వభాగము; దీనిమీద మదపుటేనుగులవరుస చిత్రితమగును. రంగపీఠము ఎంత వెడల్పు కలిగిఉండునో అంతదూరమును ఈ ఏనుగులవరుస వ్యాపించి యుండవలెను. అనగా రంగపీఠము వెడల్పు 32 హస్తములు; ఈ ఏనుగులవరుసయును 32 హస్తముల పొడుపుకలిగి యుండవలెను. అధ్యర్ధహస్తమనగా 1½ హస్తమని అర్థముకాదు. అర్ధహస్తము (9 అంగుళములు) కంటె అధికమనిమాత్రమే అర్థము. కావున ఈ మదపుటేనుగుల ఎత్తు అర్ధహస్తమును మించి ఉండవలెను. 'చతుస్స్తంభ' అనుటకంటె 'చతుస్స్తంబ' అనుట యుక్తము. స్తంబమనగా ఏనుగులనుకట్టెడి కొయ్య. ఇవి మదించిన ఏనుగులగుటచే వానిని కట్టుటకు స్తంబము లావశ్యకములు. అట్టి స్తంబములు నాలుగు ఇందుండవలెను.

"రంగమండప పదమునకు రంగమండలమను నర్థమును చెప్పుకొననక్కరలేదు. 'తయోః' అను పదమునకు మత్తవారణీద్వయమని అర్థముకాదు; మత్తవారణీ - రంగమండపములని మాత్రమే అర్థము. మత్తవారణి యొక్క ఎత్తు రంగమండపము యొక్క ఎత్తునకు అనుగుణము (proportionate) గా ఉండవలెనని ఇచ్చట అర్థముచెప్పవలెను. కావున, అభినవగుప్తు డూహించినట్లుగా, ఆధునిక విమర్శకు లర్థముచేసికొనినట్లుగా మత్తవారణులు రెండనియు, అవి రంగపీఠము యొక్క ఉభయపార్శ్వములం దుండుననియు అనుకొనుట తప్పు".



రంగపీఠ - రంగశీర్షములు :

> రంగపీఠం తతః కార్యం విధిదృష్టేన కర్మణా।
> రంగశీర్షం తు కర్తవ్యం షడ్దారుకసమన్వితమ్॥ 68
> కార్యం ద్వారద్వయం చాత్ర నేపథ్యగృహకస్య తు।
> పూరణే మృత్తికా చాత్ర కృష్ణా దేయా ప్రయత్నతః। 69

పిమ్మట రంగపీఠమును శాస్త్రానుసారముగా నిర్మించుటకు పూనుకొనవలెను. షడ్దారుక[20] సమన్వితముగా రంగశీర్షమును నిర్మించవలెను. నేపథ్యగృహమునకు

---

20. రంగశీర్షము, మత్తవారణి అనెడి పదములవలెనే 'షడ్దారుక' మనెడి పదము కూడ భిన్నవ్యాఖ్యానములకు దారితీసినదని తెలిపియున్నాను. షడ్దారుకమును గూర్చి అభినవగుప్తుని అభిప్రాయ మీ క్రింది విధముగానున్నది. "ఇచ్చట 'దారువు' అనగా కఱ్ఱ దూలము లేదా స్తంభము. ఆరు దారువులుకలిగినది షడ్దారుక మనబడును. నేపథ్యగృహ - రంగశీర్షములకు మధ్యనున్న గోడ యొక్క మధ్యభాగములో 8 హస్తముల ఎడము కలిగిన రెండు దారు స్తంభములను స్థాపించవలయును. వానిమధ్య నాలుగుహస్తముల ఎడము కలిగిన మరి రెండు స్తంభములను స్థాపించవలయును. (అనగా మొదటి స్తంభములకును ఈ స్తంభములకును రెండేసి హస్తముల ఎడము ఉండును.) ఈ నాలుగు స్తంభములను కలుపుచు అడుగున నొక కఱ్ఱదూలము, అట్లే పైన ఇంకొక దూలమును ఉండును; ఈ ఆరు దారువుల సమూహమునకే షడ్దారుకమని పేరు." [అభినవభారతి - 1 వ సం. పుట 62-63]

ఈ షడ్దారుక ప్రయోజనమేమియో భరతుడుకాని, అభినవగుప్తుడుకాని వివరించ లేదు. రంగస్థలమునకు కేవలము శోభావహముగా మాత్రమే తలంచవలసియున్నది. ఈ షడ్దారుకమునొద్ద రంగశీర్షమునందు ఉన్నతముగానున్న వేదికమీద కుతప విన్యాసము జరుగును. రంగశీర్ష ప్రయోజన మిక్కవరకే పేర్కొనబడినది. షడ్దారుకమున కిరుప్రక్కలను అనగా ఉత్తరమున నొక ద్వారమును, దక్షిణమున నింకొక ద్వారమును నిర్మించవలెను.

డా. పి. యస్. శాస్త్రిగారు షడ్దారుకము నీక్రింది విధముగా వివరించినారు—

".... నేపథ్య గృహమునకు తూర్పునగల గోడవద్ద మధ్యగా రెండు స్తంభముల నేర్పరుపవలయును. ఈ రెంటిమధ్య దూరము ఎనిమిదిమూర లుండవలెను. ఒక్కొక్క స్తంభమునకు తూర్పుగా నాలుగు మూరల దూరమున మరల రెండు స్తంభములను నిర్మింపవలెను. అప్పుడు నాలుగు స్తంభములు రాగలవు. వీటిలో వెనుక గల రెండు స్తంభములకు క్రిందుగాను, ముందుగా గల రెంటికి పైగాను దూలములవంటి రెండు కొయ్యల నేర్పరచగా, నాలుగు స్తంభములతోకలిసి మొత్తము ఆరుకొయ్యలు రాగలవు. ఈ షడ్దారువులు మండపాకారమున నుండును. ఈ షడ్దారుక ప్రదేశమున గాయకాద్యుపరంజకవర్గ ముండును...."
[భారతి-నందన శ్రావణము. పుట 177]

ఇంక శ్రీ సుబ్బారావుగారు మత్తవారణి విషయమున చేసినట్లే రంగశీర్ష-షడ్దారుకముల విషయమున కూడ నూత్న వ్యాఖ్యానమును చేసియున్నారు. వారి వ్యాఖ్యాన

తూర్పువైపున రెండు ద్వారము లుండవలయును.[21] రంగశీర్షమును మంచి నల్ల మట్టితో నింపవలయును.

ముందుగా నాగలిచే ఈ మట్టిని త్రవ్వి బెడ్డలు, గడ్డి, రాళ్ళు లేకుండ చేయవలెను. ఆ నాగలికి రెండు తెల్లని ఎద్దులను పూన్చవలయును. ఈ పనిని చేయువారు అంగవైకల్యములు లేనివారుగా నుండవలెను. ఈ మట్టిని మోయువారుకూడ అంగవైకల్యములు లేనివారై, బలిష్ఠులుగానుండి క్రొత్త తట్టలతో ఆ మట్టిని మోయవలెను. ఇట్లు ప్రయత్నపూర్వకముగా రంగశీర్షమును నిర్మించవలెను. ఈ రంగశీర్షము కూర్మపృష్ఠమువలె లేదా మత్స్యపృష్ఠమువలె నుండరాదు. స్వచ్ఛమైన

---

మీ విధముగా నున్నది— "షడ్దారుక మనగా ఆరు దారువుల సమూహం రూపమైన చక్రము. రంగశీర్షమును షడ్దారుక సమన్వితముగా నిర్మించవలెనని చెప్పుటచే ఈ రెండింటికిని సన్నిహిత సంబంధము కలదనుట స్పష్టము. ఇచ్చట ఒకేఒక షడ్దారుకము చెప్పబడినదని తలంచరాదు. రంగశీర్ష నిర్మాణములో చాల షడ్దారుకము లుపయుక్తము లగును....పిమ్మట రంగపీఠమును శాస్త్రానుసారముగా నిర్మించుటకు పూనుకొనవలెను. షడ్దారుక సమన్వితముగా రంగశీర్షమును నిర్మించవలెను అని చెప్పినప్పుడు రంగశీర్షము వేరు, రంగపీఠము వేరు అని తలంచరాదు. ఆ రెండును రంగస్థలము యొక్క ఊర్ధ్వాధోభాగములని ఇదివరకే తెలుపబడెను కదా.

"రంగస్థలము యొక్క అధోభాగమున అనగా రంగపీఠమునందు షడ్దారుకముల నెడి చక్రములను నిలుపవలెను. వానిని బల్లలతోను, వెదురుతోను బాగుగా కప్పివేసి, పైన పరిశుద్ధమైన నల్లమట్టినిపోసి అద్దమువలె సమతలము కలిగినదానినిగా చేయవలెను. ఈ సమతలమే రంగశీర్షమనబడును. ఇట్లు షడ్దారుకముల వలన రంగశీర్ష - రంగపీఠములకు మధ్య అవకాశము **(open space)** పర్పడును. ఇట్లు అవకాశ మేర్పడుటచే పాదగతుల వలన జనించెడి ధ్వనులు, వాద్యధ్వనులు, సంగీతమును ద్విగుణీకృతములై సుఖశ్రావ్యములగును. ఈ నిర్మాణము పూర్వుల నిర్మాణచాతురిని వ్యక్తముచేయుచున్నది. ఇట్లు మధ్య అవకాశ ముండుటచే రంగశీర్షమునందు రంధ్రమొనర్చి అవసరమునుబట్టి కొన్ని పాత్రలు క్రింద నుండి పైకి ఆవిర్భవించినట్లు చూపవచ్చును. ఈ షడ్దారుకములు అన్నివైపులను అమర్చబడినను కప్పివేయబడియుండును కాన పైకి కనిపించవు.

"నాట్యమండపము ద్విభూమికము కావలెనని ముందు చెప్పబడును. ద్విభూమికమనగా రెండు భూములు లేదా అంతస్తులు కలదని అర్థము. పైన వివరించినట్లుగా రంగపీఠ మొక భూమియును, రంగశీర్ష మింకొక భూమియును అగుచున్నవి."

21. రంగశీర్ష - నేపథ్యగృహముల మధ్యనున్న గోడలో రెండు ప్రక్కలను రెండు ద్వారములు నిర్మింపబడవలెను. ఈ రెండు ద్వారముల మధ్యను గాయకాదులుందురు. వెనుక గోడ ఉండుటచే జంత్ర గాత్రముల ధ్వని ప్రేక్షకులవైపే ప్రసరించును. అందుచే బాగుగా వినబడును. 11.వ అధస్సూచికను కూడ చూడవలెను.



అద్దముయొక్క పైభాగమువలె సమతలముగా నుండవలెను. రంగశీర్షమును మట్టితో నింపుటకు ముందు అడుగున రత్నముల నుంచవలెను. తూర్పున వజ్రమును, దక్షిణమున వైడూర్యమును, పశ్చిమమున స్ఫటికమును, ఉత్తరమున ప్రవాళమును, మధ్యభాగమున బంగారమును ఉంచవలెను.

*శిల్పకర్మ :* ఇట్లు రంగశీర్షమును నిర్మించి, తరువాత కొయ్యపనికి ఉపక్రమించవలెను. ఊహా ప్రత్యూహములతో ఈ కొయ్యపనిని నిర్వర్తించవలెను. ఇందు అనేక శిల్పములుండును. మరియు నిది నానాసంజవనములచే, బహువ్యాలములచే, పెక్కు సాలభంజికలచే అంతటను అలంకరింపబడవలెను. నానా విన్యాసములతో కూడుకొనిన నిర్య్వూహములు, కుహరములు, అనేకవిధములైన వేదికలు, చిత్రజాల గవాక్షములు, పీఠములు, ధారణులు, కపోతాలులు, కుట్టిమములయందలి స్తంభములు మొదలగు శిల్ప విన్యాసములెల్ల కొయ్యపనికి సంబంధించినవే.[22]

*కుడ్యనిర్మాణము :* ఇట్లు కొయ్యపనిని పూర్తికావించి గోడలను కట్టుటకు ఉపక్రమించవలెను. గోడలను కట్టుటలో ద్వారమునకుఎదురుగా స్తంభముకాని, నాగదంతము కాని, వాతాయనము కాని, కోణముకాని, మరియొక ద్వారము కాని రాకుండ శ్రద్ధ వహించవలెను.*

---

22. ఇందలి పదముల కర్థములు సరిగా తెలియుటలేదు. శ్రీ డి. ఆర్. మాంకడ్ క్రిందివిధముగా అర్థములను వివరించెను. — ఊహము = స్తంభముయొక్క పైభాగము ; ప్రత్యూహము = స్తంభముయొక్క క్రిందిభాగము. ఈ పదము లొకదాని కొకటి పూరకములు. స్తంభముయొక్క క్రిందిభాగమును అధోముఖముగానున్న పద్మమువలెను, స్తంభముయొక్క పైభాగమును ఊర్ధ్వముఖముగానున్న పద్మమువలెను నిర్మించుట ఊహాప్రత్యూహము లగునేమో? "యుక్తి - ప్రతియుక్తులతో ఆలోచించుట" అనియు ఈ పదముల కర్థము చెప్పవచ్చును. లేదా వీనినికూడ కొయ్యపనికి సంబంధించిన రెండు శిల్ప విశేషములనుగా పరిగణించవచ్చును. సంజవనము = ప్రాంగణము, దీర్ఘచతురశ్రాకారము, నాలుగిండ్ల భవంతి; నిర్య్వూహము = ద్వారము, అంతస్తు, వృత్తమును ఖండించు మరియొక వృత్తము, కుహరము = కవాటము, లోపలి కిటికీ; వేదిక = అరుగు, ఇనుప ఊచలతోకట్టిన అడ్డు; జాలగవాక్షములు = ఆవుకన్నులవంటి రంధ్రములుకల జాలసహితమైన కిటికీ; పీఠము = అరుగు; ధారణి = స్తంభము, ఇంటిపై కప్పు, స్తంభములు చేయుట కుపయుక్తమగుచెట్టు; కపోతాలి = పావురములగూడు; నాగదంతము = పాముపడగవలెనున్న కిటికీ, స్తంభముపైనుండెడి గజముఖమువంటి సాధనము, గోడలో నుండెడి మేకువంటి కొయ్య ; మందవాతాయనము = చిన్న కిటికీ.

* [ కాశీముద్రణమునందు 64-81 శ్లో: బొంబాయి ముద్రణమునందు 70-86 శ్లో; బరోడా ముద్రణమునందు 63-80 శ్లో.]

*మంటపాకారము :*

కార్యః శైలగుహాకారో ద్విభూమి ర్నాట్యమండపః ॥ 80
మందవాతాయనోపేతో నిర్వాతో ధీరశబ్దవాన్ ।
తస్మాన్నివాతః కర్తవ్యః కర్తృభి ర్నాట్యమండపః ॥ 81
గంభీరస్వరతా యేన కుతపస్య భవిష్యతి । 82

—నాట్యమండపము ఆకారమునందు శైలగుహావలె[23] కన్పట్టవలెను. మరియు ఈ నాట్యమండపము రెండుభూములను[24] కలిగియుండవలెను. ఇందు కిటికీలు చిన్నవిగా నుండవలెను. గాలి ప్రవేశించుటకు వీలులేనిదై, ఉచ్చరింపబడిన స్వరము గంభీరముగా

---

23. పైనుండి చూచినచో నాట్యగృహము కొండగుహావలె కన్పట్టవలెను. అనగా గుహయొక్క పై భాగమువలె నాట్యగృహముయొక్క పైకప్పు ఉండవలెనని అర్థము. పైకప్పుయొక్క మధ్యభాగము రెండుప్రక్కలకంటె ఉన్నతముగా నుండవలెనని సారాంశము. పైకప్పు సమతలముగాకాక పైవిధముగానున్నచో ధ్వనులు ప్రేక్షకులకు చక్కగా వినబడగలవని శ్రీ సుబ్బారావుగారు పేర్కొనినారు.

"శైలగుహాకారత్వాత్ స్థిర శబ్దాదిత్వం చ భవతి"

అని అభినవగుప్తుడుకూడ పేర్కొనెను [అభినవభారతి - 1 వ. సం. పుట. 64]

24. "కార్యః శైలగుహాకారో ద్విభూమి ర్నాట్యమండపః" ॥ 80 ॥

'ద్విభూమి' (రెండు భూములు) అనుదానినిగూర్చి శ్రీ సుబ్బారావుగారి అభిప్రాయమును 20 వ. అధస్సూచికచివర తెలిపియున్నాను. ఈ 'ద్విభూమి' అను పదమునకు అనేకులు అనేకవిధములుగా అర్థములు చెప్పినట్లు అభినవగుప్తుడు పేర్కొనెను [అభినవభారతి-1 వ సం. పుటలు. 63-64]— (1) రంగపీఠమునకు క్రిందిభాగము, పైభాగము అనునవియే రెండు భూములని కొంద రందురు. (ఇది శ్రీ సుబ్బారావుగారి అభిప్రాయముతో సంవదించుచున్నది). (2) రంగపీఠము చుట్టును ప్రదక్షిణము చేయుటకొరకు మత్తవారణులకు వెలుపల ఏర్పరచబడిన దారియే రెండవ భూమియని మరికొంద రందురు. (3) పైన ఇంకొక అంతస్తు ఉండునని ఇంకకొందరి అభిప్రాయము (డా. పి. యస్. శాస్త్రిగారును, డా. సి. బి. గుప్తయును ఈ అభిప్రాయమును అనుసరించిరి.)

(4) "కార్యః శైలగుహాకారోఽద్విభూమి ర్నాట్యమండపః"

అను విధముగా పాఠ్యమును గ్రహించి 'అద్విభూమి=రెండు భూములు లేనిదై, ఏక భూమిగానే ఉండవలెను' అని కొంద రందురు. (5) అభినవగుప్తుని ఉపాధ్యాయుడైన భట్టతౌతుని అభిప్రాయ మీ క్రిందవిధముగానున్నది — రంగపీఠసమీపమునుండి ద్వారదేశ పర్యంతమును నిమ్నోన్నత క్రమములో సోపానమార్గమువలె ఆసనములవరుసలు నిర్మింపబడును. ఇవియే రెండుభూములు. ఇట్లు నిర్మించుటవలన ముందుకూర్చున్నవారు వెనుక కూర్చున్నవారికి అడ్డురారు. ఆసనముల చివరివరుస రంగపీఠముతో సమానమగు ఎత్తున ఉండవలెను.



ఉండునట్లీ నాట్యమండపమును నిర్మించవలెను. కుతపస్వరము[25] గంభీరముగానుండవలెనన్నచో నాట్యమండపము గాలి చొరుటకు వీలులేనిదిగానే ఉండవలయును.

*చిత్రకర్మ :* గోడలను కట్టుట పూర్తికావించి, వానికి చెక్కసున్నము చేయవలెను. తరువాత, దానిమీద సున్నము వేయవలెను. ఇట్లు గోడలకు చెక్కసున్నము చేసి, సున్నము వేసిన పిమ్మట అందముగాను, సమతలములుగాను ఉన్న ఆ గోడలపై చిత్తరువులను వ్రాయించవలెను. ఈ గోడలపై స్త్రీపురుషులును, లతాబంధములును[26], వారి విలాసక్రీడలును చిత్రింపబడవలెను. వికృష్ట మధ్యమ నాట్యమండపమును ప్రయోక్తలు పై విధముగా నిర్మించవలెను.*

చతురశ్ర నాట్యమండప నిర్మాణము

ఇంక చతురశ్ర నాట్యమండప లక్షణమును వివరింతును. నలువైపులను 32 హస్తములే ఉండునట్లుగా యోగ్యమైన భూమియందు ఈ చతురశ్ర నాట్యమండపమును నిర్మించవలెను. వికృష్ట నాట్యమండప నిర్మాణ సందర్భమున చెప్పబడిన విధులు, లక్షణములు, శుభకర్మలు మొదలగునవన్నియును ఈ చతురశ్ర నాట్యమండప నిర్మాణమునకును వర్తించును. ముందుగా చతురశ్రమును సమతలముగా

---

25. కుతప శబ్దమునకు అభినవగుప్తుడు నాలుగుచోట్ల అర్థములు వ్రాసెను— (1) సంఘటక-గాయక-వాదకసమూహము [1 వ. సం. పుట 64]. (2) చతుర్విధాతోద్య భాండములు [1 వ. సం. పుట 72]. (3) చతుర్విధాతోద్యమును, దానిని ప్రయోగించువారును [1 వ. సం. పుట 184]. (4) నాట్యభూమికి ఉజ్జ్వలతాధాయియైన వర్గము [1 వ సం. పుట. 212]. పైవానిలో 2, 4 అభిప్రాయములు కేవలము వాద్యము లను నర్థమును చెప్పుచున్నవి. 1 వ అభిప్రాయము కేవలము వాదకు లను నర్థము చెప్పుచున్నది. 3 వ అభిప్రాయము రెండు అర్థములను చెప్పుచున్నది. ఆతోద్యమనగా నాలుగువిధములగు వాద్యములు. భాండమనగా చర్మముతో మూయబడిన రాండోలువంటి పెద్ద వాద్యము. 'కుతప' మను పదమునకు రెండు నిర్వచనము లొసంగబడినవి—(1) కుం=నాట్యభూమిని; తపతి=ఉజ్జ్వలముగా చేయునది. (2) కుతం=శబ్దమును: పాతి=రక్షించునది [అభినవభారతి 1 వ సం. పుటలు 64; 212.]

26. లతాబంధములు = ద్రమిడాభినయ సన్నివేశములు, లేదా మాలత్యాదిలతావేష్టన వైచిత్ర్యములు, లేదా పిండీబంధ విశేషములు. (ఇవి నాలుగవ అధ్యాయమందు వివరింపబడును) [అభినవభారతి - 1 వ సం. పుట. 64]. ఇచ్చట చెప్పబడినవి అజంతాచిత్రములను పోలియుండును.

* [కాశీ ముద్రణమునందు 82-89 శ్లో; బొంబాయి ముద్రణమునందు 87-92 శ్లో; బరోడా ముద్రణమునందు 80-85 శ్లో.]

నొనర్చి, పిమ్మట సూత్రముచే విభాగించవలెను.[27] వెలుపలి గోడలను గట్టిఇటికలతో నిర్మించవలయును.

స్తంభములు - ఆసనములు :

తత్రాభ్యంతరతః కార్యా రంగపీఠోపరిస్థితాః ॥ 89
దశ ప్రయోక్తృభిః స్తంభాః శక్తా మండపధారణే ।
స్తంభానాం బాహ్యత శ్చాపి సోపానాకృతి పీఠకమ్ ॥ 90
ఇష్టకా దారుభిః కార్యం ప్రేక్షకాణాం నివేశనమ్ ।
హస్తప్రమాణై రుత్సేధై ర్భూమిభాగ సముత్థితైః ॥ 91
రంగపీఠావలోక్యం తు కుర్యాదాసనజం విధిమ్ ।
షడన్యాంతరే చైవ పునః స్తంభా న్యథాదిశమ్ ॥ 92
విధినా స్థాపయే త్తజ్జ్ఞో దృఢా న్మండపధారణే ।
అష్టౌ స్తంభా న్పున శ్చైవ తేషా ముపరి కల్పయేత్ ॥ 93
స్థాప్యం చైవ తతః పీఠ మష్టహస్తప్రమాణతః ।
విద్ధాస్య మష్టహస్తం చ పీఠం తేషు తతో న్యసేత్ ॥ 94

—పిమ్మట నాట్యమండప ధారణమునకు సమర్థములైన పది స్తంభములను రంగపీఠోపరిభాగమున[28] నిర్మించవలెను. ఈ స్తంభములకు దూరముగా రంగమండల

27. ఈ విభజన విధానమును అభినవగుప్తు డీవిధముగా వివరించినాడు— పొడువు, వెడల్పులందు ఎనిమిదేసి భాగములను గుర్తించినచో చతురంగఫలకమునందువలె మొత్తము నాట్యమండపమునందు 64 కోష్ఠములు రాగలవు. అందు మధ్యనున్న నాలుగు కోష్ఠముల చేతను రంగపీఠము నేర్పరచవలెను. ఇది 8 హస్తముల చదరము కాగలదు. ఇంక దీని వెనుక ప్రాక్పశ్చిమములుగా 12 హస్తములు, దక్షిణోత్తరములుగా 32 హస్తములు ప్రమాణముకలిగిన భాగము మిగులును. ఇందులో, 4 × 32 హస్తముల ప్రమాణముకల రంగశీర్షమును రంగపీఠముయొక్క పృష్ఠభాగమున నిర్మించవలెను. దాని వెనుక నేపథ్య గృహమును నిర్మించవలెను. ఇది 8 × 32 హస్తముల పరిమాణము కలిగియుండును. ఇంక రంగమండలము 12 × 32 హస్తముల పరిమాణము కలిగియుండును. [అభినవభారతి— 1 వ సం. పుట. 65]. ఈ వివరణమునుబట్టియే నేను చతురశ్ర నాట్యమండపముయొక్క పటమును తయారుచేసియున్నాను. ఇంక, శ్రీ సుబ్బారావుగారు రంగపీఠ - రంగశీర్షములు భిన్నములనుట కంగీకరించరనువిషయము తెలిసినదేకదా.

28. 'రంగపీఠోపరి' అనునప్పుడు 'రంగపీఠముమీద' అని శ్రీ మాంకడ్ అభిప్రాయపడెను. 'రంగమండలమునందు' అని డా. శాస్త్రిగారి అభిప్రాయము. శ్రీ సుబ్బారావుగారు రంగశీర్ష (రంగపీఠ) — నేపథ్యగృహముల రెండింటిని గ్రహించి, పది స్తంభములను ఆ రెండింటి యందును గుర్తించినారు.



మందు[29] సోపానాకృతిగా నుండునట్లు కొయ్యలతోను, ఇటికలతోను ప్రేక్షకులకొరకు ఆసనములను నిర్మించవలెను. ఈ ఆసనముల మొదటివరుస భూమికంటె ఒక హస్తము ఎత్తున ఉండవలెను. ఇంక తక్కిన వరుసలుకూడ అట్లే ఒకదానికంటె ఇంకొకటి ఉన్నతముగా నుండవలెను[30]. ఈ ఆసనములన్నియును రంగపీఠము నవలోకించునవిగా నుండవలెను (అనగా అన్ని వరుసలలో కూర్చుండినవారికిని రంగస్థలము చక్కగా కనబడవలెను). పిమ్మట, మండపధారణ సమర్థములైన ఇంకొక ఆరు స్తంభములను

ఈ పది స్తంభములను గూర్చి అభినవగుప్తు డీ విధముగా వివరించెను. ఇది శంకుకాదుల అభిప్రాయ మట [అభినవభారతి - 1 వ సం. పుట 65]—రంగపీఠము యొక్క నాలుగు మూలలందును నాలుగు స్తంభములను స్థాపించవలెను. ఆగ్నేయ దిశకు 4 హస్తముల దూరమున దక్షిణముగా ఒక స్తంభమును, అట్లే నైఋతిదిశకు 4 హస్తముల దూరమున దక్షిణముగా ఇంకొక స్తంభమును స్థాపించవలెను. ఇట్లే ఉత్తరముగా రెండు స్తంభములను స్థాపించవలెను. ఇంక తూర్పుగా ఈశాన్య - ఆగ్నేయ దిశలకు నాలుగేసి హస్తముల దూరమునం దుండునట్లు మరి రెండు స్తంభములను నిర్మించవలెను. ఇట్లు మొత్తము పది స్తంభము లగుచున్నవి. ఇట్లే తక్కిన పదునాల్గు (6 + 8) స్తంభములను గూర్చియు శంకుకాదుల అభిప్రాయమును అభినవగుప్తుడు వివరించియున్నాడు [చతురశ్ర నాట్య మండపముయొక్క పటమును చూడవలెను]. డా. శాస్త్రిగారు ఈ విధముగా వివరించినారు— "ప్రేక్షకులు కూర్చొను ప్రదేశమున పది స్తంభము లుండును. గోడలకు 12 మూరల దూరమున ఈ స్తంభములు రావలెను. ఒక్కొక్క స్తంభమునకు మధ్యగల దూరము ఎనిమిది మూర లుండును. కాగా ఉత్తరమున ఐదు స్తంభములు, దక్షిణమున ఐదు స్తంభములు గలవు. ఈ స్తంభములకు మధ్య గల ప్రదేశము ఎనిమిది మూర లుండగలదు." [భారతి - నందన శ్రావణము - పుట 179].

29. 'స్తంభానాం బాహ్యతశ్చ' — పది స్తంభములును రంగపీఠముమీద నుండునని నిర్ణయించినప్పుడు వానికి 'వెలుపల' అనగా 'దూరముగా రంగమండలమునందు' అని అర్థము చెప్పుకొనుట సమంజసముగా నుండును.

'సోపానాకృతి పీఠకమ్' అనగా "The columns should have projecting and stepped bases" అని శ్రీ సుబ్బారావుగారు వ్రాసినారు; తక్కినవారు దీనిని తరువాతి పాదముతో అన్వయించి 'ఆసనములు సోపానాకృతిగా నుండవలె' నని చెప్పిరి.

30. 'హస్త ప్రమాణైః', 'ఉత్సేధై ర్భూమిభాగ సముత్థితైః' అని విడదీసి 'ఒకహస్త' ప్రమాణము వెడల్పును, ½ హస్తము ఎత్తును కలిగి, వానిమీద కూర్చుండెడివారికి రంగపీఠము చక్కగా కన్పడునట్లుగా ఆసనములు నిర్మితములుకావలె నని శ్రీ సుబ్బారావుగారు వ్రాసినారు (భూమిభాగము = అర్ధభాగము). ఈ అర్థముకూడ రమ్యముగానే ఉన్నది.

రంగమండలమందు శాస్త్రానుసారముగా స్థాపించవలెను. తరువాత హానిచుట్టును[31] మరి ఎనిమిది స్తంభములను స్థాపించవలెను. అటుపిమ్మట, పై ఆరు స్తంభములమధ్య భాగమందు 8 హస్తముల పొడువులుగల ఆసనముల వరుసలను నిర్మించవలెను.

---

31. ఇచ్చట, 'అంతరే' అనగా 'నేపథ్య గృహములో' అని అర్థము చెప్పికొనవలెననియు, పై ఆరు స్తంభములే షడ్దారుకమనియు, రంగశీర్షము నాలుగు మూరలే యగుటచే గాయకాదులకు నిర్మింపబడు షడ్దారుకమును చతురశ్ర మండపమున నేపథ్యగృహములో నిర్మించవలెననియు డా. శాస్త్రిగారు వ్రాసినారు. [భారతి - నందన శ్రావణము పుట. 179] 'తేషాముపరి' అనుదానిని బట్టి ప్రాచీన నాట్య మండపములలో ఉపరి ప్రాసాదము లేక పై అంతస్తు ఉండెడిదని నిర్ణయింప వీలున్నదనుచు డా. శాస్త్రిగారు ఈ క్రిందివిధముగా వ్రాసినారు—"నేపథ్యగృహమునకు ముందుగల రంగశిరస్సున స్తంభములను మండపాకారమున చూపినచో స్వర్గాది ప్రదర్శనార్థము ప్రాసాద మొకటి రాగలదు. ఇట్టి ప్రాసాదము రంగశిరమున నుండును. ఈ నాట్యమండపమునకు పై అంతస్తుగా, రంగపీఠ సమాన విస్తారముగల ప్రాసాద మొకటి యుండును. ఈ ప్రాసాదములోనికి బోవుటకు ఉత్తరమున, దక్షిణమున పదునారేసి మూరలుగల ప్రదేశమును వదలవలెను. ఈ ఉపరి ప్రాసాదము ఎనిమిది స్తంభములతో నిర్మింపబడునది. దక్షిణదిక్కున ఆగ్నేయ మూలగా రంగశీర్షమునకు పైన ఒక స్తంభ ముండును. దీనికి ఉత్తరముగా నాలుగు మూరల దూరమున రెండవ స్తంభ ముండును. దీనికి నాలుగు మూరల దూరమున ఉత్తరముగా మూడవ స్తంభ ముండును. ఈ మూడవదానికి నాలుగుమూరల దూరమున నాల్గవ స్తంభ ముండును. ఇట్లే ఉత్తరదిక్కునగూడ నాల్గు స్తంభములు రాగలవు. ఇవి ఎనిమిది స్తంభములు. ఈ స్తంభముల మధ్యగల ప్రదేశము ఎనిమిది మూరలు. ఇది నలుచదరముగా నుండవలెను. కనుక ఈ స్తంభముల కెనిమిది మూరలు పశ్చిమముగా గోడ ఉండును. ఈ స్తంభములను గోడను కలుపుచు వేదికలు రెండు ఉండవచ్చును. ఇట్లు పై అంతస్తున వచ్చు ప్రాసాదము చతురశ్ర మండపమునగల విశేషము" [భారతి. నందన శ్రావణము. పుట. 179].

ఉపరి శబ్దమునకు 'మీద' అని కాక 'చుట్టును' అను అర్థము ఇచ్చట చక్కగా సరిపోవునని శ్రీ సుబ్బారావుగారు అభిప్రాయపడినారు. ఇట్లర్థము చెప్పుకొన్నచో ఉపరి ప్రాసాద కల్పనావశ్యకత ఉండదు. డా. శాస్త్రిగారి పై అభిప్రాయముకూడ రమ్యముగా నున్నది. ఉపరి ప్రాసాదమున కవకాశమున్నదో లేదో, అది విజ్ఞులు తేల్చవలసిన విషయము. ఈ సందర్భమున, ఉపాధ్యాయ భట్టతౌతుని అభిప్రాయమును అభినవుడీ క్రిందివిధముగా వివరించెను— "ఈ నాట్యమండపము చంద్ర సోదరము (?) ఇందు ముఖ్యముగా మూడుభాగములున్నవి. అధోభూమి, రంగపీఠము, రంగము... మొదటి 10 స్తంభములను అధోభూమియందును... తరువాతి 6 స్తంభములను రంగపీఠమునందును... పిమ్మట 8 స్తంభములను రంగశిరమునందును నిర్మించవలెను. [అభినవభారతి—1 వ సం. పుటలు 67—69.]



ఇవి విద్ధాస్యములై ఉండవలెను. తరువాత మండపధారణ యోగ్యములైన మరికొన్ని స్తంభములనుకూడ అవసరమైనచోట్ల స్థాపించవలెను. ఈ స్తంభము లన్నియును సాల భంజికలచే అలంకరింపబడినవై మండపముయొక్క బరువును మోయుచుండవలెను.

ద్వారములు : తరువాత నేపథ్యగృహమును శ్రద్ధతో నిర్మించవలెను. రంగపీఠమును ప్రవేశించుట కొక ద్వారమును[32] ముందుగా నిర్మించవలెను. దానికెదురుగా జనులు ప్రవేశించుటకొరకు ఇంకొక ద్వారమును నిర్మించవలెను. ఈ రెండవ ద్వారము రంగమున కభిముఖముగా నుండవలెను.

*రంగపీఠ-రంగశీర్షములు :* చతురశ్ర నాట్యమండపమునందలి రంగపీఠము 8 హస్తముల చదరము కావలెను. ఇది సమతలమై, వేదికవలె[33] కన్పట్టవలెను. ఈ వేదికయొక్క పార్శ్వమునందు వెనుకచెప్పిన విధముగా, అదే ప్రమాణము కలిగి యుండునట్లుగా నాలుగు స్తంభములతో కూడిన మత్తవారణిని నిర్మించవలెను. (చతురశ్ర నాట్యమండపముయొక్క వివరములకు ప్రక్కపుటలోని పటమును చూడవలెను.) వికృష్ట నాట్యమండపమున రంగశీర్షమునందలి కొంత భాగము సమముగాను తక్కినది దానికంటె ఉన్నతముగాను ఉండవలెను.[34] చతురశ్ర నాట్యమండపము

---

32. ద్వారసంఖ్యయు, అవి ఉండవలసిన చోట్లును స్పష్టముగాలేవు. ఇచ్చటి శ్లోకములు ఈ క్రింది విధముగా నున్నవి—

**నేపథ్యగృహకం చైవ తతః కార్యం ప్రయత్నతః । ద్వారం చైకం భవే త్తత్ర రంగపీఠ ప్రవేశనం ॥ 96**
**జన ప్రవేశనం చాన్య ద్రాభిముఖ్యేన కారయేత్ । రంగ స్యాభిముఖం కార్యం ద్వితీయం ద్వారమేవ తు ॥ 97**

అభినవగుప్తుడు మొత్తము నాలుగు ద్వారములను చెప్పినాడు— వెనుక చెప్పినట్లుగా నేపథ్యగృహముయొక్క గోడలో రెండు ద్వారములు, నటులు వెలుపలనుండి నేపథ్య గృహమును ప్రవేశించుటకు పశ్చిమమున మూడవద్వారము, ప్రేక్షకులు రంగమండలమును ప్రవేశించుటకు తూర్పున నాలుగవ ద్వారము— మొత్తము నాలుగు ద్వారములుండును. ఈ అభిప్రాయము సమంజసముగా కన్పట్టుచున్నది. మూడవ ద్వారము మొదటి రెండు ద్వారముల మధ్యను ఉండవలెనని డా. శాస్త్రిగా రభిప్రాయపడినారు.

33. ఈ 'వేదికా'పదము వివాదాస్పదమైనది. కాని, రంగపీఠమే వేదికవలె కన్పట్టుననియు, వేదిక ఒక భిన్నభాగము కాదనియు, శ్రీ సుబ్బారావుగారు చేసిన వ్యాఖ్యానము సమంజసముగా నున్నది. ఇంక మత్తవారణిని, వికృష్టమండప విషయమున వివరించిన విధముగా ఈ వేదికయొక్క ముందుభాగమున నిర్మించవలెను.

34. "వికృష్టమండపమున రంగశీర్షము 16 × 32 హస్తముల ప్రమాణము కలిగి యుండును. అందులో ముందరి సగము (8 × 32హ.) కంటె వెనుకటి సగము (8 × 32హ.) ఉన్నతముగా నుండవలెనని సారాంశము. దీనిమీదనే రెండుద్వారములకు మధ్యను కుతప విన్యాసము జరుగును." అని శ్రీ సుబ్బారావుగారు వ్రాసినారు. ఇట్లు రెండు భాగములను అంగీకరించుటతో వికృష్ట మండప విషయమున శ్రీ సుబ్బారావుగారి అభిప్రాయము

చతురశ్ర నాట్యమండపము (32×32 హ.)




వివరములు

1 - నేపథ్యగృహము (8×32 హ.)
2 - రంగశీర్షము (4×32 హ.)
* - ద్వారములు
3 - రంగపీఠము (8×8 హ.)
4, 4 - మత్తవారణులు (8×8 హ., 8×8 హ.)
5, 5 - వరండాలు (4×8 హ., 4×8 హ.)
6 - రంగమండలము=ప్రేక్షక గృహము (12×32)
O - మొదటి పది స్తంభములు
+ - తరువాతి ఆరు స్తంభములు
● - ఆతరువాతి ఎనిమిది స్తంభములు
◆ - చతుర్వర్ణ స్తంభములు
(బ్రా=బ్రాహ్మణ స్తంభము,
క్ష=క్షత్రియ స్తంభము, వై = వైశ్య స్తంభము,
శూ=శూద్ర స్తంభము). తూ=తూర్పు,
ద=దక్షిణము, ప=పడమర, ఉ=ఉత్తరము.

నందు మాత్రము 8 హస్తముల చదరమని చెప్పబడిన రంగపీఠమంతయును సమతలముగానే ఉండును. పై విధముగా చతురశ్ర నాట్యగృహమును నిర్మించవలెను.

త్ర్యశ్ర నాట్యమండపము

ఇంక త్ర్యశ్ర గేహలక్షణమును వివరింతును. త్ర్యశ్ర నాట్య వేశ్మమును త్రికోణముగా (సమత్రిభుజముగా) నిర్మించవలెను. మధ్య (పశ్చిమ) కోణమునకు ఎదురుగా రంగపీఠమునుకూడ త్రికోణముగానే నిర్మించవలెను.[35] పై పశ్చిమకోణమునందే[36] ద్వారమును ఏర్పరచవలయును. రెండవ ద్వారమును రంగపీఠమునకు వెనుకభాగమున పర్పరచవలయును. ఇంక గోడలను కట్టుట, స్తంభములను స్థాపించుట మొదలగువాని విషయములో చతురశ్ర నాట్యగృహ నిర్మాణ విష

అభినవగుప్తుని అభిప్రాయమునకు కొంత సన్నిహితమగుచున్నది. రంగపీఠము, రంగశీర్షము అను రెండుపేర్లు పెట్టి రంగపీఠముకంటె రంగశీర్షము ఉన్నతముగా నుండునని అభినవగుప్తుడు చెప్పగా, రంగపీఠ - రంగశీర్షములు భిన్నము లని అంగీకరింపక రంగశీర్షము



యమున చెప్పబడిన విధినే అనుసరించవలెను. (వివరములకు క్రింది పటమును చూడవలెను.)

త్ర్యశ్ర నాట్యమండపము (32×32×32 హ.)




వివరములు

1 - నేపథ్యగృహము
2 - రంగశీర్షము
* - ద్వారములు
3 - రంగపీఠము
4, 4 - మత్తవారణులు
5 - రంగమండలము
తూ=తూర్పు
ద=దక్షిణము
ప=పడమర
ఉ=ఉత్తరము

ఇట్లు పై విధి ననుసరించి నాట్య గృహములను బుధులు నిర్మించవలయును[37]
ఇంక పూజా విధానమును వివరింతును.*

ద్వితీయాధ్యాయము సమాప్తము

---

యొక్క వెనుకభాగము మాత్రము ఉన్నతముగా నుండు నని శ్రీ సుబ్బారావుగారు అంగీకరించినారు.

35. డా. సి. బి. గుప్త, మిస్. కేత్కర్, శ్రీ మాంకడ్ మొదలగువారందరును ఈ రంగపీఠమును తలక్రిందులుగా చూపియున్నారు. ఆపద్ధతి బాగుండలేదు.

36. అభినవగుప్తుడు స్పష్టముగా పేర్కొనియున్నను, ఇది పశ్చిమ కోణమను విషయమును కొందరు గుర్తించలేదు.

37. పైవిధి ననుసరించి ఇంతకుముందు చెప్పిన పదునెనిమిది నాట్యమండపములనే కాక ఇంకను పెక్కు విధములగు నాట్యమండపములను బుధులు నిర్మించవచ్చును. బుధుడనగా ఊహాపోహవిదుడు.

* [కాశీ ముద్రణమునందు 90-105 శ్లో; బొంబాయి ముద్రణమునందు 92-111 శ్లో; బరోడా ముద్రణమునందు 86-105 శ్లో.]

## విశేషాంశములు

### 1. నాట్యమండప నిర్మాణములనుగూర్చి చర్చచేసిన ప్రముఖులు

నాట్యశాస్త్ర మందలి అధ్యాయము లన్నింటిలోను అతి క్లిష్టమైన దీ రెండవ అధ్యాయము. ఇందు, నాట్యమండప విభాగములకు సంబంధించిన పెక్కు పేర్లు వివాదములకు తావిచ్చుచున్నవి. అభినవగుప్తుడు తా నర్థము చేసికొన్నట్లు వ్యాఖ్యానించినాడు. అచ్చటచ్చట కొంత వ్యాఖ్య శిథిలమైనది. తక్కినదానిలో లేఖకుల అశ్రద్ధవలన పెక్కు దోషములు చేరినవి. మొత్తముమీద వ్యాఖ్యానము అసందిగ్ధమైన అభిప్రాయమును కలిగించుట లేదు. అభినవగుప్తుని అనుసరించి ఆధునిక విమర్శకు లనేకులు వాదోపవాదములు చేయుచు పెక్కు విమర్శలు వెలయించినారు. వారిలో కొందరు, వారి రచనలు :—

(1) డా. వి. రాఘవన్ 'Theatre Architecture in Ancient India' అనుపేరుతో 'త్రివేణి' లో (1931-33) మూడు వ్యాసములను ప్రకటించిరి. (Vol. IV, No. 6; Vol. V, No. 4; Vol. VI, No. 1.)

(2) శ్రీ డి. ఆర్. మాంకడ్ — "Ancient Indian Theatre" అనుపేర ఒక చిన్న పుస్తకమును 1950 లో ప్రకటించిరి. ఇది మొదట 1932 లో "Indian Historical Quarterly" లో వ్యాసరూపమున ప్రకటితమైనది.

(3) మిస్. గోదావరి వి. కేత్కర్ - నాట్యశాస్త్ర విషయములను గూర్చి 'భారతీయ నాట్యశాస్త్రము' అను పేరుతో మరాటీభాషలో ఒక గ్రంథమును ప్రకటించిరి.

(4) శ్రీ కె. ఆర్. పిషరోటి — "The Ancient Indian Theatre" అను పేరుతో సర్ అన్నామలై చెట్టియార్ స్మారక సంపుటములో ఒక వ్యాసమును ప్రకటించిరి.

(5) డా. పి. కె. ఆచార్య - "Hindu Play House" అను పేరుతో ఏప్రిలు, 1936 లో "Modern Review" లో ఒక వ్యాసమును ప్రకటించిరి.

(6) డా. మనోమోహన్‌ఘోష్ — నాట్యశాస్త్రమును ఆంగ్లములోనికి అనువదించి 1951 లో ప్రకటించిరి.

(7) డా. యస్. సి. సర్కార్ - "Bharata's Natya Sastra - 2nd Chapter" అను పేరుతో జనవరి, 1954 లో "The Bihar Theatre" అను పత్రికలో రెండవ అధ్యాయమును వ్యాఖ్యానాత్మకముగా అనువదించి ప్రకటించిరి.

(8) డా. సి. బి. గుప్త - నాట్యశాస్త్ర విషయములను క్రోడీకరించి "The Indian Theatre" అను పేరుతో 1954 లో ఒక గ్రంథమును ప్రకటించిరి. ఇది వారి పి. హెచ్. డి. పట్టమునకు సంబంధించిన పరిశోధన గ్రంథము.

(9) డా. పి. యస్. శాస్త్రి—'నాట్యగృహము' అనుపేర 'భారతి' లో (నందన – శ్రావణము) వ్యాఖ్యానాత్మకమగు అనువాదమును ప్రకటించిరి.

(10) ఆచార్య డి. సుబ్బారావు—వీరు ఈ రెండవ అధ్యాయమునకు నూత్నవ్యాఖ్యను వెలయించినారు. వ్యాఖ్యానసహిత మగు వీరి ఆంగ్లానువాదము నాట్యశాస్త్ర ప్రథమ సంపుటముయొక్క ద్వితీయ ముద్రణములో 6 వ అనుబంధముగా ప్రకటింపబడినది.



### 2. ఆచార్య డి. సుబ్బారావుగారి నూత్న వ్యాఖ్యానము

శ్రీ సుబ్బారావుగారి అభిప్రాయములను అధస్సూచికలందు అచ్చటచ్చట పేర్కొని యున్నాను. ఇప్పుడు వారి వాదసారమును, వారు ప్రకటించిన పటములను వివరించుచున్నాను—

"వ్యాఖ్యానమైన అభినవగుప్తుని 'అభినవభారతి'ని అర్థము చేసికొనుటకు ప్రయత్నించినంతగా మూలమును అర్థము చేసికొనుటకు ఆధునిక విమర్శకులు ప్రయత్నించలేదు. అభినవగుప్తుడు నాట్యశాస్త్రమున కించుమించుగా వేయి సంవత్సరముల తరువాతివాడు. నాడు భరతునినాటి నాట్యగృహనిర్మాణాదులు ప్రచారములో లేవు. అభినవగుప్తుడుకాని, వాని గురువగు భట్టతౌతుడుకాని ప్రాచీనసంప్రదాయమునకు చెందిన నాట్యగృహములను స్వయముగా చూచినట్లు కన్పట్టదు. ప్రతిచోటను అభినవగుప్తు డితరుల అభిప్రాయములనుగూడ పేర్కొనుచుండును. దీనినిబట్టి నాటికి సంప్రదాయ విచ్ఛేదము కలిగినదనియు, అందువలన మూలమునకు విభిన్నములగు వ్యాఖ్యానములు బయలుదేరినవనియు స్పష్టమగుచున్నది. మూలము నర్థముచేసికొనుటకు అభినవగుప్తు డెంతయో ప్రయత్నించి, ఆయా వైరుధ్యములను సమన్వయముచేయుటకు పూనుకొనినాడు. కాని, కొన్నిచోట్ల వాని వ్యాఖ్యానము కేవలము పాండిత్య స్ఫోరకమై మూలమునకు దూరమగుచున్నది. కావున, వాని అభినవభారతిని విడిచి, మూలమును స్వతంత్రముగా యోచింప బూనుకొనుట సాహసము కానేరదు.

ముందుగా ఈ క్రింది పదముల కీ నిర్దిష్టార్థములను గ్రహించవలసి యున్నది—

నాట్యవేశ్మము = నాట్యమండపము = ప్రేక్షాగృహము = మండపము = Theatre building.

రంగము = Stage; రంగపీఠము = base of the stage; రంగశీర్షము = surface or top of the stage; మత్తవారణి = a line of intoxicated elephants; విద్ధాస్యము = Faces so reversed as to face the stage; హస్తదండ సమాశ్రయము = based on a measuring rod (దండ) of one cubit (హస్త); షడ్దారుకము = a Wooden six piece unit; ద్విభూమి = having two floors; అనిస్సరణధర్మము = principle of reflection;

నాట్యమండపములు మూడు విధములు—వికృష్ట - చతురశ్ర - త్ర్యశ్రములు. ఇందు ఒక్కొక్కదానికి మూడేసి ప్రమాణము లున్నవి—జ్యేష్ఠ - మధ్యమ - అవరములు. కావున నాట్యమండపములు (3 × 3 =) 9 అగుచున్నవి. ఇవి హస్తదండ ప్రమాణాశ్రయములు. అనగా ఒక హస్తప్రమాణముగల కొలబద్దచే కొలవబడునవి. హస్తముల ప్రమాణము, దండముల ప్రమాణము అని విడదీసి అర్థము చెప్పరాదు. కావున అభినవగుప్తుడు చెప్పినట్లు నాట్యగృహములు 18 కాజాలవు.

ఈ 9 నాట్యమండపములలోను కొన్ని అసంభవములు, మరికొన్ని మానవుల కనుపయుక్తములు. ఇంక మానవుల కుపయుక్తములగునవి మూడు మండపములు మాత్రమే—(1) వికృష్ట మధ్యమ నాట్యమండపము (64 × 32 హ.); (2) చతురశ్ర - అవర నాట్యమండపము (32 × 32 హ.); (3) త్ర్యశ్ర - అవర నాట్యమండపము (32 × 32 హ.) - నిజమున కీమూడే నాట్యశాస్త్రమందు వివరింపబడినవి. మండపము లన్నింటిలోను మధ్యమ

ప్రేక్షాగృహము శ్రేష్ఠమైనదని చెప్పుట ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్రానుసారముగాకూడ నున్నది. ఈ మధ్యమ ప్రేక్షాగృహమందు పాఠ్యమును, గేయమును చక్కగా వినిపించును.

ఏ ప్రేక్షా గృహమునందైనను, ప్రక్క పటములో చూపినవిధముగా, మొత్తము మూడేభాగము లుండును. రంగపీఠ మను నొక ప్రత్యేక భాగమును, మత్తవారణు లను రెండుభాగములను కల్పించవలసిన ఆవశ్యకత లేదు. ప్రతిచోటను 'మత్తవారణి' అను పదము ఏకవచనమందే ప్రయుక్తమగుట గమనార్హము. రంగమునకు, రంగపీఠము మూలమును అనగా క్రింది భాగమును, రంగశీర్షము పైభాగమును అగుచున్నవి. కాగా, రంగశీర్ష-రంగపీఠములు ఒకే ఒక ప్రదేశము యొక్క ఊర్ధ్వాధోభాగము లనియు, ప్రత్యేకముగా కన్పట్టెడి ఈ ప్రదేశము వేదిక' అనికూడ అనబడు ననియు గ్రహించవలెను. రంగపీఠ పార్శ్వమందు, అనగా ప్రేక్షకులకు కన్పించెడి పార్శ్వమందు మదించిన ఏనుగుల వరుసను నాలుగు స్తంభములతో కూడి యుండునట్లుగా రంగపీఠము యొక్క పొడువునను చిత్రించవలెను. ఆ ఏనుగుల ఎత్తు అర్ధహస్తమును (9 అం.) మించి ఉండవలెను. మత్తవారణీ-రంగమండపముల ఎత్తులు ఒకదానికొకటి అనురూపముగా నుండవలెను. (మత్తవారణిని ప్రక్కపుటలోని పటములో చూడనగును.)

బ్రాహ్మణ స్తంభము మొదలగు నాలుగు స్తంభములను. మండపము యొక్క నాలుగు మూలలందును

వికృష్ట నాట్యమండపము (64×32 హ.)




వివరములు

1 - నేపథ్యగృహము (16×32 హ.)
2 - రంగశీర్షము (16×32 హ.)
* - ద్వారములు
3 - ప్రేక్షకనివేశనము (32×32 హ.)
○ - మొదటి పది స్తంభములు
+ - తరువాతి ఆరు స్తంభములు
● - ఆతరువాతి ఎనిమిది స్తంభములు






వివరములు

1, 1 - నేపథ్యగృహ ద్వారములు.
2, 2 - మత్తవారణియందలి స్తంభములు.
3 - - - - 3 - మత్తవారణి

స్థాపించవలెను, రంగశీర్షమును షడ్దారుకములతో నిర్మించవలెను. షడ్దారుకము లనగా 6 కొయ్యలతో చేయబడిన చట్రములు. ఇట్టి చట్రములను బల్లలతోను, వెదురులతోను కప్పివేయవలెను. దానిపైన నల్లని మట్టిని నింపి అద్దమువలె శుద్ధతలము కలిగినదానినిగా చేయవలెను. ఇదియే రంగశీర్ష మనబడును. ఈ షడ్దారుకములు రంగపీఠములోపల నుండునవి కాన పైకి కనిపించవు. వీనికి అడుగుభాగము - పైభాగము అనగా రంగపీఠము-రంగశీర్షము అను రెండు భూము లేర్పడుచున్నవి కాన నాట్యమండపము 'ద్విభూమి' అనబడినది. ఇట్టి షడ్దారుక నిర్మాణమువలన రంగపీఠ - రంగశీర్షముల మధ్యభాగము ఖాళీగా నుండును. ఇందునుండి దేవతలు మొదలగు పాత్రలు పైకి ఆవిర్భవించినట్లు చూపవచ్చును. ఇట్లు ఖాళీగానుండుటచే పాదగతులవలన కలిగెడి ధ్వనులు, ద్విగుణీకృతములై సుఖ శ్రావ్యములగును. ఈ నిర్మాణ విధానము పూర్వుల నేర్పరితనమును వ్యక్తముచేయుచున్నది. (ఈ షడ్దారుకములను ప్రక్కపుటలోని పటములో చూడనగును.)

మండపము యొక్క కప్పు, శైలగుహాయందలి కప్పువలెనే మధ్యను ఎత్తుగానుండి, ప్రక్కలకు వ్రాలి ఉండవలెను. ఇట్లుండుటవలన ధ్వని సుఖ శ్రావ్యమగును.




వివరములు

1 - నాట్యమండపము శైలగుహాకారముగా నుండుట.

2 - వెలుపలినుండి నేపథ్యగృహములోపలకు ద్వారము.

3 - రంగపీఠములోపలకు ద్వారము.)

4, 4 - షడ్దారుకములు (ఇవి అనేకము లుండును; పూర్తిగా కప్పివేయబడును కాన పైకి కనిపించవు. వికృష్టమండపమునందు ముందుభాగముకంటె వెనుకభాగము ఎత్తుగా నుండును.)

5, 5 - రంగశీర్షము (ఈ అంకెల అడుగున ఉన్న నల్లనిభాగము నల్లమట్టితో కప్పబడిన భాగము; ఇదియే రంగశీర్షము. దాని క్రిందిది అనగా షడ్దారుకముల క్రిందిది రంగపీఠము; ఇవియే రెండు భూములు.)

6 - చతుస్తంభములతో కూడిన మత్తవారణిఉండెడి పార్శ్వము; పటమునందు నాట్యమండప పార్శ్వభాగము మాత్రమే చూపబడుటచే అది ఇప్పుడు కన్పట్టుటలేదు.

7, 7, 7 - ఆసనముల వరుసలు.

చతురశ్రమందు - పది స్తంభములను రంగపీఠోపరిభాగమునందు నిర్మించవలెను. వీనికి దూరముగా ఆసనములవరుసలను నిర్మించవలెను. ఒక్కొక్కవరుస 8 హ. పొడువు, ఒక హస్తము వెడల్పు, ½ హ.స్తము ఎత్తును కలిగి రంగపీఠము నవలోకించుచున్నట్లు విధ్ధాస్యమై ఉండవలెను.

పిమ్మట రంగమండల మధ్యభాగమందు 6 స్తంభములను స్థాపించవలెను. పైన చెప్పబడిన ఆసనముల వరుసలు ఈ 6 స్తంభముల లోపలనే ఉండును. ఈ 6 స్తంభముల చుట్టును మరి 8 స్తంభములను స్థాపించవలెను. పై స్తంభములన్నియును (10+6+8) నాట్యమండపము లన్నింటి యందును ఉండును. వీనినే కాక, కప్పు యొక్క బరువును మోయుటకు వలసిన మరికొన్ని స్తంభములను కూడ అవసరమైనచోట్ల స్థాపించవచ్చును.

చతురశ్రమండపమందలి రంగపీఠము వేదికవలె కన్పట్టవలెను. అంతియేకాని వేదికను ప్రత్యేకముగా నిర్మించవలెనని ఇచ్చట అర్థము చెప్పరాదు. వికృష్టమండపమున రంగపీఠ



మందలి ముందరి 8 హస్తముల భాగముకంటె వెనుకటి 8 హస్తముల భాగము ఉన్నతముగా నుండును. షడ్దారుకములను చిన్నవిగాను, పెద్దవిగానుచేయుట వలన ఈభేదము రాగలదు. చతురశ్ర నాట్యమండప నిర్మాణమునకు సంబంధించిన వివరములకు ప్రక్క పటముచూడవలెను. ఇంక త్ర్యశ్ర నాట్యమండపమును క్రింది పటములో చూపినవిధముగా నిర్మించవలెను.

చతురశ్ర నాట్యమండపము (32×32 హ.)




త్ర్యశ్ర నాట్యమండపము (32×32×32 హ.)




వివరములు
(రెండు నాట్యమండపములకును సమానమే)

1 - నేపథ్యగృహములు
2 - రంగశీర్షములు (=రంగపీఠములు)
* - ద్వారములు
3 - ప్రేక్షకనివేశనములు
○ - మొదటి పది స్తంభములు
+ - తరువాతి ఆరుస్తంభములు
● - ఆతరువాతి ఎనిమిది స్తంభములు
◦ - చతుర్వర్ణ స్తంభములు
(బ్రా=బ్రాహ్మణస్తంభము
క్ష=క్షత్రియ స్తంభము
వై=వైశ్య స్తంభము
శూ=శూద్రస్తంభము)

తూ=తూర్పు, ద=దక్షిణము, ప=పశ్చిమము, ఉ=ఉత్తరము.

"అభినవగుప్తో ఒప్యనుభవలుప్తో హ్యనుమితమర్థం వితరతి యత్ర।
అభినవదృష్ట్యా సముదితమర్థం ప్రముదితబుద్ధ్యా విమృశత తత్ర॥"

—అభినవగుప్తుడు కూడ అనుభవలుప్తుడై ఎచ్చట అనుమితమైన అర్థమునే (ఊహించియే) చెప్పెనో అచ్చట అభినవదృష్టితో సంపాదింపబడిన పై అర్థములను ప్రముదితబుద్ధితో విమర్శింపుడు."

—శ్రీ సుబ్బారావుగారి వ్యాఖ్యానము చాల సమంజసముగా కన్పట్టుచున్నది. షడ్దారుక - మత్తవారణుల విషయమున వారి వివరణము రమ్యతరముగానున్నది.

13 వ అధ్యాయమున కక్ష్యావిభాగవివరణమునందు రంగశీర్ష ప్రసక్తి లేదు; అభినవ గుప్తుడు కూడ ఆ విషయమును ప్రస్తావించలేదు. అభినవగుప్త డచ్చట చేసిన వివరణము సుబ్బారావుగారు మొదలగువారి వాదమునకు బలమునొసంగుచున్నట్లున్నది. [అభినవ భారతి - 2 వ సం. పుటలు 197-198]. 13 వ అధ్యాయమందలి 4 వ అధస్సూచికను చూడవలెను. ప్రేక్షాగృహములన్నింటియందును మధ్యమము ప్రశస్తమని భరతుడు అసందిగ్ధ ముగా చెప్పియుండెను. అట్టియెడ శ్రీ సుబ్బారావుగారు చతురశ్ర-త్ర్యశ్రముల విషయమున అవర మండపములనే గ్రహించుట సమర్థనీయమగునా ?

### 3. నాట్యమండపముల నిర్మాణము : ఇతర లక్షణ కర్తలు

నాట్యశాస్త్ర మందే కాక మరికొన్ని నాట్య - సంగీతాది గ్రంథము లందు కూడ నాట్య మండపములు వర్ణింపబడినవి - (వివరములకు "త్రివేణి" యందు ప్రకటింపబడిన, డా. వి. రాఘవన్ గారి 3 వ్యాసములను చూడవలెను).

(1) 'విష్ణు ధర్మోత్తర పురాణ'మందు రెండు రకముల నాట్యమండపములు వర్ణింపబడినవి. ఇందు వికృష్ట - చతురశ్ర మండపములే చెప్పబడినవి. చతురశ్రము యొక్క ప్రమాణము 16 × 16 గజములు. వికృష్టము యొక్క ప్రమాణము స్పష్టముగా లేదు.

(2) నారదుని 'సంగీత మకరంద' మందు 48 × 48 గజములు ప్రమాణము కల చతుశ్ర మండపము వివరింపబడినది. ఇది ఎట్లు అలంకరింపబడవలెనో చాల వివరముగా చెప్పబడినది. రంగమండలమందు మధ్యభాగమున రాజు కూర్చుండుటకు సింహాసనమును వేయవలెనట. ఈ మండపమునకు నాలుగు ద్వారము లుండును. ఇది భరతుని జ్యేష్ఠ మండపమువంటిది కాదగును.

(3) భావప్రకాశమునందు (10 వ అధ్యా.) శారదాతనయుడు రాజప్రాసాదమం దుండదగిన మూడురకముల మండపములను వర్ణించినాడు. ఇతడు వికృష్టమునకు బదులుగా 'వృత్తము' అను భేదమును పేర్కొనెను—రాజు, ఇతర నాట్య మండపాధిపతులతో, పౌర జానపదులతో కలిసి 'వృత్త నాట్యమండప'మందు మిశ్ర నృత్యమందలి 'చిత్ర' విధానమును వీక్షించవలెను. వారకన్యా - అమాత్య - వణిక్ - సేనాపతి - సుహృత్ - సుతులతో కూడిన వాడై చతురశ్ర నాట్యమండపమందు మార్గ - దేశి భేదముల మిశ్రమమైన నృత్యమును వీక్షించవలెను. ఇంక పట్టమహిషితో, ఋత్విక్ - పురోహిత - ఆచార్యులతో, అంతఃపుర జనులతో కూడినవాడై త్ర్యశ్ర మండపమందు మార్గ నృత్యమును వీక్షించవలెను.



శారదా తనయుడు శారదోపాసకుడు. భావాభినయకోవిదులైన నటులు ప్రదర్శించిన ముప్పది విధములైన వేర్వేరు రూపకముల నాతడు వీక్షించిన పిమ్మట శారదాదేవిని నాట్య వేదముకొరకు అర్థించెను. దేవ్యాదేశము ననుసరించి శారదాతనయుడు నాట్యశాలాపతి యైన దివాకరు డను నొక ద్విజుని యొద్ద నాట్య వేద మఖలమును నభ్యసించెను. తత్ఫలమే 'భావప్రకాశము'.

(4) బసవరాజు యొక్క 'శివతత్త్వ రత్నాకరము' లో ఇక్కేరియందు రాజు కట్టించిన నాటకశాల వర్ణింపబడినది. అందలి దీప విధానము విచిత్రముగా నుండెడిదట.

(5) శ్రీకుమారుని 'శిల్పరత్న' మందు దేవాలయ నాట్య మంటపము వర్ణింప బడినది. ఇందలి శ్లోకములు స్పష్టముగా లేవు. అయినను ఈ క్రిందివిధముగా చెప్పవచ్చును— మొత్తము నాట్యమంటపము 4 భాగములుగా నుండును. రంగస్థలము చదరముగా నుండి 4 స్తంభములను కలిగి యుండును. దీని వెనుక భాగమునందు కుతప విన్యాసము జరుగును. ఇది భరతుని రంగశీర్షము కావచ్చును. ఈ భాగమునకు వెనుక నేపథ్య గృహమును నిర్మించవలెను. ఈ నాట్య మంటపము దేవాలయ దక్షిణ భాగమునందు గర్భగుడియందలి దేవుని కభిముఖముగా నిర్మింపబడవలెను. రాజప్రాసాదమందలి నాట్యమంటపమును, పట్టణమందలి నాట్యమంటపమును ఇట్లే లక్షణయుక్తముగా నిర్మించవలెను.

(6) నారదుని 'నారదశిల్ప' మందు నాటకశాలల వివరములు కలవు. ఇందలి భాష అతి పురాతనమగుటచే సరిగా బోధపడుట లేదు. దీని భావమును ఈ క్రిందివిధముగా గ్రహించవచ్చును— దైవ-గాంధర్వ-క్షాత్రభేదములచే నాటకశాలలు ముప్విధములు. దైవ భేదము దేవాలయమందు నిర్మితము కావలెను. ఇందు దైవిక రసయుతములు అనగా భక్తిరస ప్రధానములగు ఇతివృత్తములు గల ప్రయోగములు ప్రయుక్తములగును. క్షాత్రభేదము రాజప్రాసాదమందు నిర్మింపబడవలెను. ఇందు క్షాత్ర రసయుతములు అనగా వీరరస ప్రధానములు అగు ఇతివృత్తములు గల రూపకములు ప్రయోగింపబడవలెను. ఇంక గాంధర్వ భేదము పట్టణములందు ప్రజలందరును చూచుటకు వీలుగా నిర్మింపబడవలెను. ఇందు నానారసయుతములగు ఇతివృత్తములు గల రూపకములు ప్రయుక్తములగును. వీనిలో గాంధర్వ మంటపము విపులముగా వర్ణితమైనది. ఇందు నాట్యమంటపమున మూడే భాగములు చెప్పబడినవి—రంగమండలము, రంగస్థలము, నేపథ్యగృహము. పై 'బాల్కనీ' వంటి ప్రదేశమందు స్త్రీలు కూర్చుందురని పేర్కొనబడెను. ఇంకను అనేక విశేష వివరణములు కలవు.

(7) వాసుదేవ సూరి 'ప్రాసాద లక్షణము'లో రకరకముల నాట్య-నృత్యాగారములు వర్ణింపబడినవి. డా. రాఘవన్ తన రెండవ వ్యాసములో ఈ ప్రాసాదములకు సంబంధించిన అనేక వివరములను ఉద్ధరించెను. తమిళ వాఙ్మయమందు కన్పట్టు నాటకశాలా నిర్మాణాదుల వివరములను కూడ డా. రాఘవన్ మూడవ వ్యాసమునందు వివరించెను.

### 4. రాజప్రాసాదమందలి నృత్యశాల

శార్ఙ్గదేవుని సంగీత రత్నాకర మందు రాజప్రాసాదమందలి నృత్యశాల వర్ణింపబడినది. [7 వ అధ్యా - 1351-61 శ్లో]. అందలి ఆసన విధిని ప్రక్కపుటలోని పటములో చూడనగును.




## 5. శ్రీకృష్ణదేవరాయల నగరులోని నాట్యశాల

కృష్ణదేవరాయలు స్వయముగా సంగీత - నాట్యముల నభ్యసించెనని చరిత్రలు చెప్పుచున్నవి. శ్రీ భండారు లక్ష్మీనారాయణ అను సంగీతవేత్త కృష్ణరాయలకు, వారి అంతఃపుర స్త్రీలకు సంగీతము నేర్పెను. రాయలు 'విద్వత్సభారాయ' బిరుదాంచితుడై కొలువుతీర్చి యుండగా రంజకం శ్రీరంగరాజు, వాని కుమార్తె రంజకం కుప్పాయి, నట్టువ నాగయ్య మొదలగు వారు నృత్య - నాట్యములను ప్రదర్శించెడివారు.

ఈ నాట్యశాలను Paes అను యాత్రికుడు విపులముగా వర్ణించి యున్నాడు. [See Saletore's "Social and Political Life in Vijayanagara Empire - Part II - PP. 409-411.]

## 6. తంజావూరు రాజప్రాసాదములోని బహిరంగ ప్రదర్శనశాల

దీనిని 'తిరంద వెళి అరంగం' (open air theatre) అందురు. ఇది నాయక రాజుల ప్రాసాదములో 'సర్వతీ మహల్ గ్రంథాలయము' నకు పడమటి దిక్కుగా దాని నానుకొని యున్నది. ఇది పూర్వము ఏ రూపమున ఉండెడిదో తెలియదు. పైన కప్పు లేదు. నాలుగు దిక్కులందును తక్కిన ప్రాసాదమునకు సంబంధించిన ఎత్తయిన గోడలు కలవు. చతురస్రాకారముగా నున్న ఈ ప్రదేశమందు నేలమీద 2000 మంది సుఖముగా కూర్చుండవచ్చును. ఈశాన్య దిశయందు ఎత్తయిన దిమ్మ ఉండెడిది. దీనిమీద నిలుచుండి మాటాడినచో శబ్దవిపులీకరణ యంత్రముల సాహాయ్యము లేకయే రెండు వేల మందికిని సుస్పష్టముగా వినిపింపగలదు. 'సంగీత కచ్చేరీ' లు చేసినను పై యంత్ర సాహాయ్య మక్కరలేదట. దీని విశిష్టతను గుర్తించి శ్రీ పలనియప్పన్ అను జిల్లా కలెక్టరు 1952 లో దీనిని పునరుద్ధరించి ఈశాన్యదిశయందు రంగ స్థలమును కట్టించెను. ఇప్పుడది చక్కని 'బహిరంగ నాట్య మండపముగా' నున్నది. నాయక రాజులు కూడ దీని నిందులకే ఉపయోగించెడివారని తలంపవచ్చును. ఒక మూలగా నున్న ఈ రంగస్థలముమీద నిలిచి చూచినచో ప్రేక్షక స్థానము వర్తులాకారమున కన్పట్ట కలదు (Amphi-Theatre). [తంజావూరు 'ఆర్ట్సు గేలరీ' నిర్వాహకులు శ్రీ జి. కృష్ణమూర్తి గారు 22-7-58 తేదీన నాకు వ్రాసిన లేఖలోనుండి పై వివరములను పేర్కొనియున్నాను.]

## 7. నాగార్జునకొండ త్రవ్వకములలో బయల్పడిన బహిరంగ ప్రదర్శనశాల

నాగార్జునకొండ త్రవ్వకములలో ఒక బహిరంగ ప్రదర్శనశాల (open air stadium) బయల్పడినది. అందు ఒక ప్రక్క ఉన్నతప్రదేశమును (Pavilion), తక్కిన మూడు ప్రక్కలను సోపానాకృతి కల ఆసనముల వరుసలును కలవట. ఇది బహిరంగ నాట్యశాలయో లేదా కేవల క్రీడారంగమో తెలియదు. దీని వివరములు త్వరలో ప్రకటితములు కాగలవని అచ్చటి సూపరింటెండెంటు డా. రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారు తెలిపినారు.

## 8. విప్రదాసుని సంగీతచంద్రము

విప్రదాసుడు తన సంగీతచంద్రమునందు (అముద్రితము) నాట్యశాలా నిర్మాణ విషయమున ఈక్రింది విశేషములను తెలిపెను.

వికృష్ట - చతురశ్ర - త్ర్యశ్రభేదములచే నాట్యగృహము మూడువిధములు. అందు చతురశ్రము దీర్ఘము, సమము అను భేదములచే మరల రెండు విధములు. వీనిలో వికృష్టము ఉత్తమము, చతురశ్రము ఉత్తమము-మధ్యమమును, త్ర్యశ్రము అధమమును. ఇట్లు నాట్య గృహములు నాలుగు విధములగుచున్నవి. మిక్కిలి పొడవైన ఉత్తమ వికృష్టము (108 × 64 హ.) దేవతలకును, దీర్ఘమైన చతురశ్రము (64 × 32 హ.) రాజులకును, సమమైన చతురశ్రము బ్రాహ్మణాదులకును, త్ర్యశ్రము హీనవర్ణములకును ఉచితముగా నుండును. మహాత్ముడగు భరతుడును నాట్యగృహమును నాలుగు విధములు గనే విభజించెను.

దీర్ఘ చతురశ్రమును పశ్చిమదిక్కునుండి 16 హ., 8 హ., 8 హ., 32 హ., పొడువులు కల నాలుగు భాగములుగా విభజించవలెను. మొదటిది నేపథ్యగృహము, దాని ముందరిది రంగశీర్షము, దానిముందరిది రంగపీఠము, దానిముందరిది సభాస్థానము.

ఆగ్నేయాది నాలుగు మూలలందును కోణబిందువులు మధ్యకు వచ్చునట్లు వరుసగా బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్ర స్తంభములను నిలుపవలెను. బ్రాహ్మణ-క్షత్రియ స్తంభములమధ్య అనగా దక్షిణ దిశయందు 7 స్తంభములను, అట్లే వైశ్య-శూద్ర

స్తంభములమధ్య అనగా ఉత్తర దిశయందు మరి 7 స్తంభములను నిలుపవలెను. పై నాలుగును కలిసి ఉత్తర దక్షిణములందు మొత్తము 18 స్తంభములగును. స్తంభములు నిలిపినచోటునుకూడ కలుపుకొని (From centre to centre) ఒక స్తంభమునకును ఇంకొక స్తంభమునకును మధ్యదూరము 8 హస్తము లుండవలెను.

ఇంక తూర్పువైపునను, అట్లే పడమటి వైపునను మధ్యదూరము 16 హస్తము లుండునట్లుగా రెండేసి స్తంభములను నిలుపవలెను. వాని మధ్యలందు నాలుగు హస్తముల మధ్యదూరముకల మరి రెండేసి స్తంభములను నిలుపవలెను. ఇట్లు తూర్పు - పడమరలందు మొత్తము 8 స్తంభము లధికముగావచ్చును. నేపథ్యగృహమునకు వెనుకనుండు స్తంభముల ననుసరించి నాట్యమందిరమందు, ఒక్కొక్క వరుసలో ఏడేసి స్తంభము లుండునట్లుగా, 4 వరుసలలో మొత్తము 28 స్తంభములను నిలుపవలెను.

ఈ విధముగా తూర్పున 4 స్తంభములు, దక్షిణమున 9 స్తంభములు, పడమట 4 స్తంభములు, ఉత్తరమున 9 స్తంభములు, మందిర మధ్యమందు 28 స్తంభములు— మొత్తము 54 స్తంభములు ఉండును.

ఈ స్తంభములు 8 హస్తముల పొడువు, ఒక హస్తము వెడల్పు కలిగి ఉండవలెను. ఉత్తర దక్షిణములందు మూడేసి వరుసలుగా స్తంభములుండును. ఈ వరుసలమధ్య, అనగా మందిర మధ్యభాగమున 16×8 హస్తముల కోష్ఠకములు (గదులు) ఎనిమిది ఏర్పడును. వీని కిరువైపులను 8×4 హస్తముల కోష్ఠకములు పదునారును (అనగా రెండు వైపులను చెరి ఎనిమిదియును) అట్లే వాని కిరువైపులను 8×4 హస్తముల కోష్ఠములు ఇంకొక పదునారును ఏర్పడును. ఇట్లు మొత్తము 40 కోష్ఠకము లగును.

ఈ స్తంభములపై నాలుగు దిక్కులందును, నానాచిత్రాంకితములైన ధారణు లన బడు కట్టలను యథోచితముగా నుంచవలెను. వానిపై తక్షక సంస్కృతములైన తులల నుంచవలెను. ఆ తులలపై నడ్డముగా దృఢమైన కట్టలను నిలుపవలెను. కొయ్యలతో చేయ బడిన పద్మములను, ఒండొంటిని అంటి యుండునట్లుగా కూర్చి, మధ్యభాగములను కప్పి వేయవలెను. ఈ విధమున నీరంధ్రముగా, సుశ్లిష్టముగా కట్టలతో పైభాగమును కూర్చి, నింబపత్రములతోను, ఇటికలతోను కప్పి, దిమ్మిసకొట్టి, సమతలమునుగా చేయవలెను.

(ఇచ్చట రెండవ పక్షముగా అభినవగుప్తుడు చతురశ్రమండప విషయమున చేసిన వివరణమువంటి వివరణము చేయబడెను)

రంగపీఠముయొక్క ప్రమాణము ననుసరించి దానిపై ఉపరిభూమికను (చాందినీ వంటి దానిని) నిర్మించవలెను. ఇది సువర్ణకలశములతో ఉజ్జ్వలములైన నాలుగు స్తంభములతోకూడి ఉండవలెను......మధ్యకోష్ఠకములు నాలుగును రంగపీఠము కావలెను...... రంగపీఠమునకు వెనుక 8×8 హ. రంగశీర్షమును, దానికి వెనుక 16×32 హ నేపథ్య గృహమును ఉండును. నేపథ్యమునకు పడమటివైపున ఒక ద్వారమును, రంగప్రవేశమున కనువుగా తూర్పువైపున ఇంకొక ద్వారమును ఉండవలెను...రంగశీర్షము షడ్దారువులు కలిగి యుండవలెను. తూర్పువైపు ద్వారమున కిరుప్రక్కలను రెండు స్తంభము లుండును. ఆ స్తంభములకు మీదను క్రిందను రెండేసి దూలములను (దారువులను) అమర్చవలెను



(ఇట్లని భరతుడే చెప్పెనట!) ఇవియే షడ్దారువులు...రంగపీఠమున కెదురుగా 6వ కోష్ఠములో 4 హ. చదరమునందు $1\frac{1}{2}$ హ. ఎత్తున సుధాధవళితమైన సభాపతి నివేశనమును నిర్మించవలెను..........నాట్యమందిరమునకు లోపల చుట్టును 5 హ. స్థలము విడిచిపెట్టి, మూడు హస్తముల ఎత్తున ఒక గోడను కట్టవలెను, దానికి అచ్చటచ్చట దారులుండవలెను; దానిచుట్టును రక్షకజనులు నిలిచి రక్షించుచుండవలెను. (వీరు నేటి 'గేట్ కీపర్సు' కావచ్చును. పై వివరములనన్నింటిని పటరూపమున క్రింద చూపుచున్నాను—

విక్రుష్ట నాట్యమండపము (64×32 హ.)




వివరములు :

1 - నేపథ్యగృహము (16×32హ.)
2 - రంగశీర్షము (8×8 హ.)
- షడ్దారుకము
* - ద్వారములు
3, 3 - రంగశీర్షమునందలి ఖాళీ స్థలములు(8×12హ., 8×12హ.)
4 - రంగపీఠము (16×16 హ.)
5, 5 - మత్తవారణులు (8×16 హ., 8×16 హ.)
6 - సభాపతి స్థానము
7 - రంగమండలము
8 - మూడు అడుగుల ఎత్తున దారులతో కూడియుండునట్లుగా కట్టబడిన గోడ
O - స్తంభములు ఏబదినాలుగు
• - చతుర్వర్ణ స్తంభములు నాలుగు

**6. రాగ తాళ చింతామణి :**

నాట్యశాలానిర్మాణ విషయమున గోవిందకవి ఈ క్రింది విశేషములను పేర్కొనెను.

1. "బ్రహ్మ నియోగంబునం జేసి విశ్వకర్మ తన శిల్పశాస్త్ర ప్రావీణ్యంబు మెఱసి యష్టోత్తర శతహస్త ప్రమాణంబైన వికృష్టాఖ్య రంగమంటపం బొకటి దేవతా యోగ్యం

బుగా నిర్మించె" [1 వ అ. 57 ప.]—భరతుడు ప్రథమాధ్యాయమున ప్రమాణమును స్పష్ట ముగా పేర్కొనలేదు.

2. జ్యేష్ఠ (108 హ) - మధ్యమ (64 హ). కనిష్ఠ (32 హ) - భేదములచే నాట్య గృహములు ముప్విధములు. ఒక్కొక్క భేదమునందు ఆకారమును బట్టి వికృష్ట-చతురశ్ర-త్ర్యశ్ర భేదములచే మూడేసి వికృతులు కలవు. [1 వ అ. 58-62 ప.].

3. ఆయా దేవత లాయా మండప భాగ రక్షణార్థము పూనుకొనగా "బ్రాహ్మణాదికవర్ణము లపరంగ నాల్గు, రంగ ముఖ్యచతుస్తంభ రంగులయ్యె" నట [1 వ అ-64 ప].

4. "మత్తవారణియందుహత్తి దైత్య నిహంత్రియైన విద్యుల్లత యమరియుండె" [1 వ అ - 66 ప.] అనుచు, మత్తవారణీ పదమును ఏకవచనమందే ప్రయోగించెను. తన్నిర్మాణాదుల వివరము లిందు లేవు.

10. గ్రీకు - రోమన్ - ఆంగ్ల నాటకశాలలు :

పాశ్చాత్యుల నాట్యశాలా విశేషములను కూడ కొన్నింటిని పేర్కొని యీ ప్రసంగము నింక విరమింతును.

1. ప్రాచీన గ్రీసుదేశమున నాట్యశాలానిర్మాణ మనునదియే లేదు. ఏదేని ఒక కొండలోయలో డయొనిసస్ ఉత్సవము జరుగుచుండెడిది. డయొనిసస్ ఆలయమునకు ముందు 'నృత్తరంగము' (dancing-floor) ఉండెడిది. ఇది 64 అడుగుల వ్యాసముకల వృత్తము. నృత్తరంగ మెల్లప్పుడును వృత్తాకారముగనే ఉండెడిది. ఈ భాగమునే ఆర్కెష్ట్రా (orchestra) అందురు. దానికి ముందు, పర్వతము వరకును వ్యాపించి యుండెడి భాగమున ప్రేక్షకులు కూర్చుందురు. ఇది అర్ధవృత్తాకారముగా నుండెడిది. ఇందు 20, 30 వేలమంది ప్రేక్షకులు పట్టెడివారు. పై భాగమున కప్పులేదని వేరుగా చెప్ప నక్కరలేదు కదా.

తరువాతి కాలములో దేవాలయమునకును, నృత్తరంగమునకును మధ్య నృత్తరంగమునంటి నేపథ్య గృహమువంటి ఒక చిన్న గది కట్టబడినది; దీనినే 'స్కెనీ' (Sknene) అందురు. (ఈ పదమునుండియే scene అను పదము ఉత్పన్నమైనది.) ఇది క్రమముగా రెండంతస్తుల గృహముగా మారినది. ఇది వెనుక తెరగాను, దేవతాదులు కన్పించి మాటాడుటకు తగిన ఉన్నతమగు వేదికగాను ఉపయుక్తమయ్యెడిది. అటు పిమ్మట, ఈ స్కెనీకి ఇరుపార్శ్వములందును 'పెరాస్కెనీలు' (Paraskenia) అనబడు రెండు వరండాలు సభాస్థానమువరకును వ్యాపించునట్లుగా నిర్మితములైనవి. ఈ మూడింటికిని, ఆర్కెష్ట్రాకును మధ్య రంగస్థలము ఉండెడిది. ఇది ఉన్నతముగా ఉండెడిదో లేదో తెలియదు. స్కెనీనుండి రంగమును ప్రవేశించుటకు మూడు ద్వారము లుండెడివి. పెరాస్కెనీలనుండి సభాస్థానమును ప్రవేశించుటకు మరి రెండు ద్వారము లుండెడివి. వీనిని నటులతోపాటు ప్రేక్షకులు కూడ ఉపయోగించెడివారు. స్కెనీ గోడయే వెనుక తెరగానుండెడిదని చెప్పితిని. ఇది శిల్పవిశిష్టముగా నుండెడిది. 'రంగాలంకరణము'ను (Scene-painting) ప్రవేశపెట్టిన ప్రథమునిగా సొఫోక్లిస్‌ను అరిస్టాటిల్ పేర్కొనెను. విషాదరూపకమున ఒక ఆలయము లేదా ఒక రాజప్రాసాదము, శుభాంత రూపకమున ఒక గృహము



లేదా ఇండ్లవరుసతో కూడిన వీథి సాధారణముగా చూపబడుచుండెడిది. ఈ తెరలు శిల్పవిశిష్టమగు స్కెనీ గోడను కప్పివేయుచుండెడి వని ఊహించవచ్చును [The Oxford Companion to the Theatre—Page 337]. అలెగ్జాండరు కాలమునాటికి రంగస్థలము 12 అడుగుల ఎత్తున ఉండవలెనను నియమము వచ్చినది. నాటికి 'కోరస్' అంతరించినది. ఆర్కెష్ట్రా ఉండెడి ప్రదేశమున ఊరి పెద్దలు కూర్చుండుట మొదలుపెట్టినారు. ప్రేక్షకుల ఆసనములు కఱ్ఱతో చేయబడెడివి.

2. రోమనుల నాట్యశాలలును ఇట్టివే. పైన ఏదోవిధమగు కప్పు వేయుదుమనియు, ఎండ తగులదనియు వారు ప్రకటనలుకూడ చేసెడివారట.

3. క్రీ. శ. 14 వ శతాబ్దిప్రాంతమున ఆంగ్లదేశమున రూపక ప్రదర్శనములను చర్చి అధికారులు ప్రారంభించిరి. నీతిబోధనయే వారి ప్రధానాశయము. మొదట చర్చి లోపలి వేదికమీదనే ప్రదర్శనములు జరిగెడివి. పిమ్మట చర్చికి ముందుభాగమున ప్రత్యేకముగా నిర్మించిన రంగస్థలముమీద ప్రదర్శనములు జరుగుచుండెడివి.

రూపక ప్రదర్శనములను 'చర్చి' అధికారులు వదలుకొన్న తరువాత **inn-yards** లో ప్రదర్శనములు జరిగెడివి. జేమ్సు బర్ బేజ్ (**James Burbage**) అనునతడు లండను నగరమున 1576 ప్రాంతముల ప్రప్రథమనుగా నాట్యగృహమును నిర్మించెను. యువనటులు ప్రత్యేకముగా నాట్యశాలలను నిర్వహించెడివారు. బహిరంగ నాటకశాలలు కూడ ఉండెడివి. ఊరిలోని పెద్దలు రంగస్థలము మీదనే కూర్చుండెడివారు. టిక్కెట్ల పద్ధతి అమలులోనికి వచ్చినది.

1642 లో ఇంగ్లండులో నాటకప్రదర్శనములు నిషేధింపబడినవి. 1660 లో రెండవ ఛార్లెసు రాజ్యాధికారమునువహింపగానే ఆ నిషేధము తొలగినది. నాటినుండి క్రమముగా పెద్దపెద్ద నాట్యగృహములు నిర్మింపబడసాగెను.

---

# అధ్యాయము 3

## రంగదేవతాపూజనము[1]

[కాశీముద్రణమునందు - 104 శ్లోకములును; బొంబాయిముద్రణమునందు - 102 శ్లోకములును; బరోడాముద్రణమునందు - 102 శ్లోకములును కలవు.]

వెనుకచెప్పిన విధమున శాస్త్రానుసారముగా నిర్మింపబడినదియును, సర్వ లక్షణ సంపన్నమును, శుభమును అయిన నాట్యగృహమునందు గోవులును, రక్షో నాశనకరములైన మంత్రములను జపించు బ్రాహ్మణులును ఏడు రోజులు నివసించ వలెను. పిమ్మట దీక్షితుడును, నియమవంతుడును, శుచియును, నూత్నవస్త్రధారి యును, మూడురోజు లుపవసించినవాడును అగు నాట్యాచార్యుడు మంత్రపూత మైన జలములతో శరీరమును ప్రోక్షించుకొని, 8వ నాటి రాత్రి నాట్యగృహమందు మంత్రపూర్వకముగా దేవతల నాహ్వానించి, వా రచ్చట నిలుచునట్లు చేయవలెను.

సర్వలోకేశ్వరుడును భవుడును అయిన మహాదేవుడు, జగత్పితామహుడగు బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, కుమారస్వామి, సరస్వతి, లక్ష్మి, సిద్ధి, మేధ, స్మృతి, ధృతి, మతి, సోముడు, సూర్యుడు, మరుత్తులు, లోకపాలురు, అశ్వినీదేవతలు, మిత్రుడు, అగ్ని, వర్ణదేవతలు, రుద్రులు, కాలుడు, కలి, మృత్యువు, నియతి, కాలదండము, విష్ణుప్రహరణము, నాగరాజగు వాసుకి, వజ్రము, విద్యుత్తు, సముద్రములు, గంధర్వులు, అప్సరసలు, మునులు, భూతములు, పిశాచములు, యక్షులు, గుహ్యా కులు, మహోరగులు, నాట్యవిఘ్నకరు లగు అసురులు, ఇతర దేవ-రాక్షసులు, నాట్యకుమారికలు, మహాగ్రామణి (గణపతి[2]), భూతసంఘములు, ఇతరదేవతాదులు, దేవర్షులు మున్నగువారికందరకును అంజలిపూర్వకముగా ప్రణామము చేసి, వారి వారి స్థానముల నావహింపజేసి ఇట్లు చెప్పవలెను—

భవద్భి ర్నో నిశాయాం తు కర్తవ్యః సంపరిగ్రహః।
సాహాయ్యం చైవ దాతవ్య మస్మిన్నాట్యే సహానుగైః॥ 11

—రాత్రియందు మీరు మమ్ములను మీ రక్షణలోనికి తీసికొనుడు. మీరు మీమీ అనుచరులతో కలిసి ఈ నాట్యమందు మాకు సాహాయ్యము నొసంగుడు.

---

1. 'రంగదైవతపూజన' మనునది బరోడా ముద్రణపాఠము. 'రంగదేవతాపూజన' మనునది కాశీముద్రణపాఠము. 'రంగదైవత పూజావిధాన' మనునది బొంబాయి ముద్రణ పాఠము; అభినవభారతీపాఠమును ఇదియే.

2. 'మహాగ్రామణి' అను పదమునకు 'గణపతి' యని అభినవగుప్తు డర్థము చెప్పెను. కాని నాట్యశాస్త్ర రచనాకాలమునాటికి గణపతిపూజ ప్రచారములో లేదని విమర్శకుల అభిప్రాయము. ఇతడు విష్వక్సేనుడు కావచ్చును.



ఇట్లు వీరినందరిని ఏకముగా పూజించి కుతపమును (చతుర్విధాతోద్య- భాండములను) ప్రయోగించి నాట్యప్రసిద్ధికొరకు జర్జరపూజ నొనర్పవలెను. పూజా సమయమున "ఓ మహేంద్రాయుధమ! సర్వదానవ సూదన! సర్వవిఘ్ననిబర్హణ! నీవు దేవతలందరిచేతను నిర్మింపబడినావు. అట్టి నీవు రాజునకు (నిర్మాతకు) విజయమును, వాని శత్రువులకు పరాజయమును, గో-బ్రాహ్మణులకు శుభమును, నాట్యాభివృద్ధిని కలిగింపుము" అని జర్జరమును ప్రార్థించవలెను. నాట్యాచార్యు డిట్లు శాస్త్రానుసారముగ ఉపాసించి, రాత్రి నాట్య మండపమందే వసించి, ప్రభాత సమయమున పూజావిధి కుపక్రమించవలెను. ఆర్ద్ర, మఖ, భరణి, పూర్వాభాద్ర, పూర్వాషాఢ, పూర్వఫల్గుని, ఆశ్లేష, మూల అను నక్షత్రములు రంగపూజకు ప్రశస్తములు.

### దేవతానివేశనము

నియమవంతుడును, శుచియును, దీక్షితుడును అయిన నాట్యాచార్యుడు వెలిగింపబడిన దర్భలతో రంగమును ప్రకాశింపజేసి దేవతాపూజనమును నిర్వర్తించ వలెను. దారుణమును, ఘోరమును, యమదైవతమును అయిన దినాంత ముహూ ర్తమునందు ఆచమించి, యథాన్యాయముగా దేవతలను ప్రతిష్ఠించవలెను. రక్త సూత్ర వినిర్మిత కంకణములును, రక్త చందనములును, రక్త పుష్పములును, రక్త ఫలములును (అనగా అంతయును ఎఱ్ఱగానుండు పూజా సామగ్రిని) ఇప్పట్ల ఉపయోగించవలెను. యవలు, తెల్లఆవాలు, లాజలు, అక్షతలు, శాలిబియ్యము, నాగపుష్పచూర్ణము, పొట్టుతీసిన కొఱ్ఱలు మున్నగు ద్రవ్యములతో ముందుగా యథాస్థానమందు, యథావిధిగా దేవతా నివేశనముకొరకు 16 హస్తముల ప్రమాణముగల మండలమును[3] రచింపవలెను. శాస్త్రానుసారముగా నాలుగు దిశలందును, నాలుగు ద్వారములను కల్పించవలెను. ఆ మండల మధ్యమందు ఉత్తర దక్షిణములకు అడ్డముగా ఒక రేఖను గీసినచో నాలుగు కక్ష్య లేర్పడును. ఆ నాలుగు కక్ష్యలందును ఆయా దేవతలను ప్రతిష్ఠించవలెను (అనగా ధ్యానముచే, మంత్రములచే వారిని ఆవాహనము చేయవలెను).

---

3. 16 హస్తముల పరిమాణము అనగా 4 హస్తముల చదరమని అర్థము. ఇది రంగపీఠ పృష్ఠభాగమందు రచింపబడవలెను. శంకుకాదులు 16 హస్తముల చదరమును నర్థమును గ్రహించినట్లు తోచుచున్నది; దీనిని రంగమండలమందు కూర్చుట కుదురదు. కాన వారి దృష్టిలో హస్తమనగా జేన (9 అంగుళములు) అని గ్రహించవలెను. [అభినవభారతి- 1 వ సం - పుట 74]

మండల మధ్యభాగమందు పద్మమును[4] రచించి, దానిమీద బ్రహ్మను ప్రతిష్ఠించవలెను. ఈశాన్య దిశయందు భూతగణ సహితముగా శివుని ప్రతిష్ఠించవలెను. ప్రాగ్దిశయందు నారాయణుని, మహేంద్రుని, స్కందుని, సూర్యుని, అశ్వినులను, శశిని, సరస్వతిని, లక్ష్మిని, శ్రద్ధను, మేధను నిలుపవలెను. అట్లే ఆగ్నేయ దిశయందు-స్వాహా సహితుడగు అగ్నిని, విశ్వదేవతలను, గంధర్వులను, రుద్రులను, సర్పగణములను; దక్షిణదిశయందు - యముని, సపరివారుడగు మిత్రుని, పితృదేవతలను, పిశాచములను, ఉరగములను, గుహ్యకులను; నైరృతి దిశయందు-రాక్షసులను, భూతములను; పశ్చిమదిశయందు - సముద్రములను, జలాధిపతి యగు వరుణుని; వాయవ్యదిశయందు-సప్తవాయువులను, పక్షులచేపరివృతుడగు గరుడుని; ఉత్తరదిశయందు - కుబేరుని, నాట్యమాతలను, గుహ్యకులను, యక్షులను; మరల ఈశాన్యదిశయందు - నంద్యాది గణేశ్వరులను, బ్రహ్మర్షులను, భూతసంఘములను వరుసగా ఆయా స్థానములందు ప్రతిష్ఠించవలెను.

ఆగ్నేయదిశయందున్న స్తంభమునందు సనత్కుమారుని, నైరృతిదిశయందున్న స్తంభమునందు దక్షుని, వాయవ్యదిశయందున్న స్తంభమునందు స్కందుని, ఈశాన్యదిశయందున్న స్తంభమునందు మహాగ్రామణిని నిలుపవలెను.[5]

ఇట్లు, ఆయా స్థానములందు సుప్రసన్నులైన దేవతలను నిలిపి. వారినెల్ల ఆయా శాస్త్రములందు చెప్పబడిన విధముగా పూజించవలెను. ఈ దేవతలకు తెల్లని మాల్యములను, చందనమును ఒసంగవలెను. గంధర్వ - అగ్ని - సూర్యులకు ఎఱ్ఱని మాల్యములను, అనులేపనములను ఒసంగవలెను. ఇట్లు గంధ - మాల్యధూపములను

4. మధ్య నొక పద్మమును, చుట్టును ఎనిమిది దిశలందు ఎనిమిది పద్మములను - మొత్తము తొమ్మిది పద్మములను రచింపవలెనని అభినవగుప్తుడు పేర్కొనెను. మధ్యపద్మమందు బ్రహ్మను నిలిపినట్లే తక్కిన పద్మములందు ఆయా దేవతలను ఆవాహనము చేయవలెను. కావున, పై మండలము నవపద్మమండల మగును. [అభినవభారతి-1 వ సం - పుట 75]

ఇచ్చట గుహ్యకులు వేరుగను, యక్షులు వేరుగను చెప్పబడినారు. కాళిదాసు ఇరువుర నొక్కజాతిగానే భావించెను. [చూ. మేఘదూతము - 1-5 శ్లో.]

5. "స్తంభే సనత్కుమారం తు దక్షిణే దక్షమేవ చ
గ్రామణ్యముత్తరే స్తంభే పూజార్థం సంనివేశయేత్" 32

పై అనువాదమున కిది మూలశ్లోకము. 'తూర్పు స్తంభము, దక్షిణ స్తంభము' అనుచు శ్రీ ఘోష్ అనువదించినాడు. ఇది యుక్తముగా లేదు. 'దక్షిణ పూర్వే ఆగ్నేయ స్తంభ ఇతి. ఉత్తర పూర్వే ఐశాన స్తంభ ఇత్యర్థః' అనుచు అభినవగుప్తుని వ్యాఖ్య కన్పట్టుచున్నది [1 వ సం- పుట 75]. ఇచ్చట ప్రతీక లేదు. అందుచే ఇది పై శ్లోకమునకు సంబంధించినదో కాదో తెలియదు. అయినను దీని ననుసరించి పై విధముగా అనువదించినాను.



యథానుపూర్విగా నొసంగి యథార్హముగా అర్పింపవలెను. బ్రహ్మకు మధుపర్కమును, సరస్వతికి పాయసమును, శివ - విష్ణు - మహేంద్రాదులకు మోదకములను, అగ్నికి నేయికలిపిన అన్నమును, సోమ - అర్కులకు బెల్లముకలిపిన అన్నమును, విశ్వదేవ - గంధర్వ - మునులకు మధుపాయసములను, యమునకు అపూపములను, మిత్రునకు మోదకములను, పితరులకు పిశాచములకు ఉరగములకు నేతిని క్షీరమును వరుసగా నొసంగవలెను. మాంసయుతమైన పక్వాన్నముచేతను, సురా - సీధు - ఫలాసవముల చేతను,[6] పలలాప్లుతములగు చణకములచేతను భూతసంఘము నర్చింపవలెను.

ఈ విధముగానే మత్తవారణినికూడ పూజింపవలెను. ఇప్పట్ల రక్షోగణములను పక్వము లేదా అపక్వము అగు మాంసముచేతను; దానవులను సురా-మాంసముల చేతను పూజించవలెను. ఇంక తక్కిన దేవగణములను అపూప - ఉత్కారికలతో కూడిన అన్నములచేతను, సాగరములను నదులను మత్స్యములచేతను పిండి వంటకములచేతను పూజించి, వరుణునకు ఘృతపాయసము నొసంగవలెను. వివిధములగు ఫలమూలములచే మునులను, విచిత్రములైన భక్ష్య-భోజ్యములచే వాయువులను పక్షులను, అపూపములచే పేలాలతోకూడిన భక్ష్య - భోజ్యములచే నాట్యమాతలను కుబేరుని పూజించవలెను. ఇట్లు శ్రద్ధగా నానా విధములగు భోజనములతో బలుల నొసంగవలెను. ఇంక ఈ బలికర్మను మంత్ర విధాన పూర్వకముగా వివరింతును.*

-మంత్రములు

బ్రహ్మనుగూర్చి చెప్పిన మంత్రమున కర్థము - ఓ దేవదేవ! మహాభాగ! సర్వలోక పితామహా! నేనొసంగెడి మంత్రపూతమైన ఈ బలిని సర్వమును స్వీకరింపుము.[7]

శివునిగూర్చి - ఓ దేవదేవ! మహాదేవ! గణేశ![8] త్రిపురాంతక! నేనర్పించిన మంత్రపూతమగు ఈ బలిని స్వీకరింపుము.

6. సుర=చెట్టునుండి వచ్చినది=కల్లు; సీధువు=పువ్వులనుండి వచ్చినది=మకరందము; ఫలాసవము = పండునుండి తీయబడినది = రసము; పలలము = మాంసము; చణకములు = సెనగలు.

*[కాశీ ముద్రణమునందు 1-46 శ్లో; బొంబాయి ముద్రణమునందు 1-45 శ్లో; బరోడా ముద్రణమునందు 1-46 శ్లో]

7. బ్రహ్మనుగూర్చిన మంత్రము ఈ క్రింది విధముగా నున్నది—

**దేవదేవ మహాభాగ సర్వలోకపితామహ । మంత్రపూత మిమంసర్వం ప్రతిగృహ్ణీష్వ మే బలిమ్॥ 47**

ఇట్లే ఇతర దేవతలనుగూర్చిన మంత్రములును కలవు. నేను ఆ మంత్రములకు అర్థములను మాత్రమే వ్రాయుచున్నాను.

8. తరువాతి కాలములో గణపతికి పేరైన 'గణేశ' పద మిచ్చట శివునకే ప్రయుక్తమగుట గమనార్హము (పై 2 వ అధస్సూచికనుకూడ చూడవలెను).

విష్ణువునిగూర్చి - ఓ నారాయణ! అమితగతి! పద్మనాభ! సురోత్తమ! నేనర్పించిన ఈ మంత్రపూతమగు బలిని స్వీకరింపుము.

ఇంద్రుని గూర్చి - ఓ పురందర! అమరపతి! వజ్రపాణి! శతక్రతు! విధిమంత్ర పురస్కృతమైన ఈ బలిని స్వీకరింపుము.

కుమారస్వామినిగూర్చి - ఓ దేవసేనాపతి! స్కంద! భగవానుడ! శంకర ప్రియ! షణ్ముఖ! ప్రీత మనస్కుడవై నేనొసంగెడి బలిని స్వీకరింపుము.

సరస్వతిని గూర్చి - ఓ దేవదేవి! మహాభాగ! సరస్వతి! హరిప్రియ! మాత! భక్తితో నేను సమర్పించిన ఈ బలిని స్వీకరింపుము.

రాక్షసులనుగూర్చి - నానా నిమిత్త సంభూతులరగు ఓ సర్వ పౌలస్త్యులార! రాక్షసేంద్రులార! మహాసత్త్వులార! ఈ నా బలిని స్వీకరింపుడు.

లక్ష్మిని, సిద్ధిని, మతిని, మేధనుగూర్చి - ఓ లక్ష్మి! సిద్ధి! మతి! మేధ! సర్వలోక నమస్కృతలార! ఓ దేవులార! మంత్రపూతమైన ఈ నా బలిని స్వీకరింపుడు.

వాయువునుగూర్చి - ఓ సర్వభూతానుభావజ్ఞ! లోకజీవన! మారుత! నేనొసంగెడి మంత్రపూతమైన బలిని స్వీకరింపుము.

అగ్నినిగూర్చి - ఓ దేవవక్త్రి! సురశ్రేష్ఠ! ధూమకేతు! హుతాశన! దేవ! భక్తితో నేనిప్పుడొసంగు బలిని స్వీకరింపుము.

సూర్యునిగూర్చి - ఓ సర్వగ్రహశ్రేష్ఠుడ! తేజోరాశి! దివాకర! దేవ! భక్తితో నే నిప్పుడొసంగు బలిని స్వీకరింపుము.

చంద్రునిగూర్చి - ఓ సర్వగ్రహాపతి! సోముడ! ద్విజరాజ! జగత్ప్రియ! నేనొసంగెడి మంత్రపూతమైన బలిని స్వీకరింపుము.

నందీశ్వరాది గణేశ్వరులనుగూర్చి - నందీశ్వరపురస్కృతులైన ఓ సర్వమహా గణేశ్వరులార! భక్తితో ఇప్పుడు నేనొసంగు బలిని స్వీకరింపుడు.

పితృదేవతలనుగూర్చి - ఓ సర్వపితృదేవతలార! నమస్కారము. నే నొసంగు బలిని స్వీకరింపుడు.

భూతములనుగూర్చి - బలిప్రియులగు భూతములకు నిత్యమును నమస్కారము.

కామపాలునకు - ఓ కామపాల! నీ కెల్లప్పుడును నమస్కరింతును. ఈ విధి నీకై చేయబడినది.

గంధర్వులనుగూర్చి - నారద - తుంబుర - విశ్వావసు పురోగములైన సర్వ గంధర్వులార! నేనొసంగెడి బలిని స్వీకరింతురుగాక.



యమ మిత్రులనుగూర్చి - ఓ యమ మిత్రులార! భగవానులార! ఈశ్వరులార! లోకపూజితులార! మంత్రపురస్కృతమైన ఈ నా బలిని స్వీకరింపుడు.

సర్పములనుగూర్చి - రసాతలగతులగు ఓ పన్నగులార! నమస్కారము. పాపనాశనులార! నమస్కారము. నాచే పూజితులయి నాట్యసిద్ధి నొసంగుడు.

వరుణునిగూర్చి - ఓ సర్వాంభఃపతి! వరుణదేవ! హంసవాహన! నాచే పూజితుడవయి సముద్ర - నదీ - నదసహితముగా ప్రీతమనస్కుడవు కమ్ము.

గరుత్మంతునిగూర్చి - ఓ వైనతేయ! మహాసత్త్వ! సర్వపక్షిపతి! విభు! నేనొసంగు మంత్రపూతమగు బలిని స్వీకరింపుము.

కుబేరునిగూర్చి - ఓ ధనాధ్యక్ష! యక్షపతి! లోకపాల! ధనేశ్వర! గుహ్యకులతోను, యక్షులతోను కలిసి నేనొసంగు బలిని స్వీకరింపుము.

నాట్యమాతలనుగూర్చి - బ్రాహ్మి మొదలగు నాట్యమాతలార! నమస్కారము. సుముఖులును, సుప్రసన్నలును అయి నేనొసంగు బలిని స్వీకరింపుడు.

రుద్రప్రహరణమునుగూర్చి - ఓ రుద్రప్రహరణమ! నే నొసంగు బలిని సర్వమును గ్రహింపుము.

విష్ణుప్రహరణమునుగూర్చి - ఓ విష్ణుప్రహరణమ! భక్తితో నేనొసంగు బలిని గ్రహింపుము.

కాల - కృతాంత - మృత్యు - నియతులనుగూర్చి— సర్వప్రాణి వధేశ్వరులయిన ఓ కాల - కృతాంతులార! మృత్యు - నియతులార! నే నొసంగు బలిని స్వీకరింపుడు.

వాస్తుదేవతలనుగూర్చి - మత్తవారణీ సంశ్రితలైన ఓ వాస్తుదేవతలార! నే నొసంగెడి మంత్రపూతమైన బలిని చక్కగా గ్రహింపుడు.

ఇతరులనుగూర్చి— స్వర్గ - అంతరిక్ష - భూభాగ సమాశ్రితులును, దశదిశా సమాశ్రితులును అయిన ఇతర దేవ గంధర్వులార! మీ కొరకైన ఈ బలిని స్వీకరింపుడు.*

పిమ్మట నీళ్ళు నిండుగా కలిగినదియును, పుష్పమాలలచే[9] అలంకరింపబడినది

---

*[కాశీముద్రణమునందు - 46-72 శ్లో; బొంబాయిముద్రణమునందు - 46-71 శ్లో; బరోడాముద్రణమునందు - 47-71 శ్లో.]

9. 'పుష్పమాలా పురస్కృతమ్' అని మూలమందున్నది. కాని ఘోష్ 'పర్ణమాలా పురస్కృతమ్' అను అధస్సూచికలోని పాఠమును గ్రహించెను. పూర్ణకుంభమునందు మామిడి కొమ్మనుంచి, ఆ కుంభమును పూలమాలచే చుట్టి అలంకరించెదరు. పురస్కృత మనగా అలంకరించబడినదని అర్థము.

యుసు అగు కుంభము నొకదానిని రంగమధ్యమందు స్థాపించి, దానియం దొక బంగారపు ముక్క నుంచవలెను. వస్త్రములు కప్పియున్న ఆతోద్యముల నన్నింటిని గంధ-మాల్య-ధూప-భక్ష్య-భోజ్యములచే పూజింపవలెను.

జర్జరపూజనము

ఇట్లు యథాక్రమముగా దేవతలనందరిని పూజించి, పిమ్మట విఘ్న జర్జరమైన జర్జరమును పూజింపవలెను. హితమును కోరువారు ఆ జర్జరముయొక్క శిరస్సు నందు తెల్లని వస్త్రమును, రౌద్ర పర్వమునందు నీలవస్త్రమును, విష్ణుపర్వము నందు పచ్చని వస్త్రమును, స్కంద పర్వమునందు ఎఱ్ఱని వస్త్రమును, మూల పర్వమునందు రంగురంగుల వస్త్రమును కట్టవలెను; అనురూపము లగు ధూప-మాల్య-అనులేపనముల నర్పించవలెను. పిమ్మట విఘ్ననాశము కొరకు జర్జరము నీ క్రిందివిధముగా నభిమంత్రించవలెను—"మహా వీర్యవంతుడవుగా, వజ్రసారుడవుగా, మహా తనుడవుగా విఘ్న వినాశార్థము పితామహాది సురలచే నీవు నిర్మింపబడితివి. సర్వ దేవగణ సహితుడై బ్రహ్మ నీ శిరస్సును రక్షించుగాక! హరుడు ద్వితీయ పర్వమును, జనార్దనుడు తృతీయ పర్వమును, కుమారస్వామి చతుర్థ పర్వమును, పన్నగోత్తముడు పంచమ పర్వమును రక్షింతురుగాక! వీరందరు నిత్యము నిన్ను రక్షింతురుగాక! నీవు దేవతలకు శుభప్రదుడవుగా నుందువుగాక! శ్రేష్ఠమైన అభిజిత్తు నక్షత్రమందు అరిసూదనుడవై జన్మించితివి. రాజునకు జయమును, అభ్యుదయమును కలిగింపుము."

ఇట్లు జర్జరమును పూజించి, బలిని సర్వమును నివేదించి, మంత్రాహుతి పురస్కృతముగా అగ్నియందు హోమ మొనర్చవలెను. తరువాత దీప్తములైన ఉల్కలచే రాజుయొక్కయు, నర్తకీగణముయొక్కయు దీప్త్యభివర్ధన మొనరించ వలెను. ఇట్లు రాజుయొక్కయు, నర్తకీగణముయొక్కయు దీప్తిని ప్రకాశింప జేసి, మంత్రపూతమగు జలముతో ప్రోక్షించి, ఇట్లు చెప్పవలెను— "మీరు మహాకుల ప్రసూతులు. గుణగణములచే అలంకృతులు. జన్మసిద్ధమగు గుణము నిత్యమును మీయందు నిల్చుగాక!"

ఇట్లు నృపతి అభ్యుదయమునుగూర్చి పలికి, నాట్యప్రసిద్ధికొరకు నాట్యాచార్యుడు ఆశీస్సును పలుకవలెను— "సరస్వతి, ధృతి, మేధ, హ్రీ, శ్రీ, లక్ష్మి, స్మృతి, మతి అను ఈ నాట్యమాతలు మిమ్ము రక్షించి మీయెడ సౌమ్యలును, సిద్ధి ప్రదలును అగుదురుగాక!"

తరువాత యథాన్యాయముగా, మంత్రపురస్కృతముగా హవిస్సును హోమమొనర్చి, నాట్యాచార్యుడు ప్రయత్నపూర్వకముగా కుంభమును పగులగొట్ట



వలెను. అట్టియెడ కుంభము పగులనిచో యజమానునకు శత్రుభయము ప్రాప్తించును. కాని, సరిగా పగిలినచో యజమానుని శత్రువులు క్షయము నొందుదురు. ఇట్లు జాగ్రత్తగా కుంభమును పగులగొట్టిన తరువాత నాట్యాచార్యుడు ప్రజ్వలించు చున్న దీపికను గ్రహించి క్ష్వేడన-స్ఫోటన-వల్గన-ప్రధావనములతో[10] సశబ్దముగా రంగమును సర్వమును ప్రదీప్తము చేయవలెను. అట్లు రంగమును సశబ్దముగా ప్రదీప్తము చేసినతరువాత శంఖ-దుందుభి - మృదంగ - పణవాది ఆతోద్యము లన్నియును మ్రోగుచుండగా రంగయుద్ధముల నేర్పాటుచేయవలెను. విరుగుట, చీలుట, పగులుట, గాయములు ప్రదీప్తములును సశోణితములును ఆయతములును అగుట మొదలగు నిమిత్తములు సిద్ధిలక్షణములని తెలియవలెను.

రంగదైవత పూజాఫలము

ఇట్లు చక్కగా పూజితమైన రంగము యజమానునకును, ఆ పట్టణమందలి, ఆదేశమందలి ఆబాలవృద్ధమైన ప్రజకును శుభమును కలిగించును. చక్కగా పూజింపబడని రంగము దేవతలచే దురధిష్ఠితమై నాట్యవిధ్వంసమునకు కారణమగును; రాజునకు అశుభమును కలిగించును. పైన వివరించిన విధానమును విడిచిపెట్టి, యథేష్టముగా రంగాదులను నిర్మించువాడు శీఘ్రముగా నష్టమునుపొంది తిర్యగ్యోనియందు జన్మించును. రంగదైవతపూజనము యజ్ఞముతో సమానము. రంగమును పూజింపనిదే ప్రయోగమును ప్రయోగింపరాదు. రంగాధిష్ఠాన దేవతలు పూజితులైనచో వారు నటులకును పూజార్హతను కలిగింతురు; వారు సమ్మానితులైనచో నటులకును సమ్మానమును కలిగింతురు. కావున సర్వప్రయత్నములతో రంగపూజను చేయవలెను. అపప్రయోగము దహించినంత వేగముగా వాయువుతో కూడిన అగ్నికూడ దహించలేదని తెలియవలెను. శాస్త్రజ్ఞుడు, వినీతుడు, శుచి, దీక్షితుడు, శాంతుడును అయిన నాట్యాచార్యుడే రంగపూజ చేయవలెను. ఉద్విగ్నమనస్కుడై, అస్థానమందు బలి నొసంగువాడు మంత్రహీనుడైన హోతవలెనే ప్రాయశ్చిత్తార్హుడగును. నూత్న నాట్యగృహమునందును, ప్రేక్షాప్రయోగ ప్రారంభమునందును[11] పైన వివరించిన విధముగా రంగదైవతపూజనమును నిర్వర్తించవలెను.

తృతీయాధ్యాయము సమాప్తము

---

10. క్ష్వేడనము=సింహనాదము; స్ఫోటనము=చరచుట; వల్గనము=గెంతుట; ప్రధావనము=వేగముగా పరుగెత్తుట; ప్రదీప్తము చేయుట=ప్రకాశింపజేయుట; ప్రేక్షాప్రయోగము=రూపక ప్రదర్శనము.

11. "ఇత్యయం యోవిధి ర్దృష్టో రంగదైవత పూజనే।
నవే నాట్యగృహే కార్యః ప్రేక్షాయాం చ ప్రయోక్తృభిః" 102

అని చివరిశ్లోకము. నూత్న నాట్యగృహమందు ప్రేక్షాప్రయోగమును ప్రారంభించునప్పుడు

## విశేషాంశములు

### 1. మొదటి మూడు అధ్యాయముల సమన్వయము

నాట్య గృహమునందలి ఆయా భాగముల నన్నింటిని రక్షించుటకు దేవతలందరును పూనుకొనినపిమ్మట బ్రహ్మనాట్య స్వరూపమును వివరించి, విఘ్నాదులను సాంత్వనపరచిన విషయము ప్రథమాధ్యాయమందు చెప్పబడినది. విఘ్నముల విజృంభణము సమసిపోయినను, శుభప్రదమైన రంగదేవతాపూజనము ఆవశ్యకమని తలంచి బ్రహ్మ భరతునిచే ఆపూజను చేయించెను. ఇది అంతయును దివ్యలోక విషయము. విఘ్నవినాశన మైనపిమ్మటకూడ దివ్యలోకవాసులు రంగదేవతాపూజన మొనర్చినప్పుడు ఇంక మానవుల విషయమున చెప్పవలసినదేమున్నది ? వారు తప్పక దీనిని చేయవలెననుట స్పష్టము.

మొదటి మూడు అధ్యాయములును ఒండొంటికి సంబంధించియున్నవి. నాట్య గృహమును నిర్మించవలసినదిగా బ్రహ్మ విశ్వకర్మ నాజ్ఞాపించెను. ఆతడు నాట్య గృహమును నిర్మించువరకును ప్రయోగము ఆపివేయబడినది. ఆతడు దేవతలకొరకు వికృష్టజ్యేష్ఠ మండపమును నిర్మించియుండును. దానితోపాటుగా ఆతడు మరికొన్ని నాట్యగృహములకుకూడ అవకాశము కల్పించెను. కథావిచ్ఛేదము కాకుండుటకై నాట్య మండప నిర్మాణము ప్రత్యేకముగా 2 వ అధ్యాయమందు వివరింపబడినది. నాట్య గృహము సిద్ధముకాగానే దేవతలు నాట్యమండప రక్షణకు పూనుకొనుట, పిమ్మట బ్రహ్మ విఘ్నాదులను సాంత్వనపరచుట జరిగినది. విఘ్నములు సమసినవి. అయినను బ్రహ్మ రంగదేవతాపూజనము చేయించి, పిమ్మట ప్రయోగ ప్రారంభమున కనుజ్ఞయిచ్చెను. ప్రయోగము సాంతముగా చూచి సంతుష్టులైన దేవతలు నటులకు బహుమానముల నొసంగిరి. పై రంగదేవతాపూజయే ప్రత్యేకముగా మూడవ అధ్యాయమందు వర్ణింపబడినది. ఇట్లు రెండు, మూడు అధ్యాయములు ప్రథమాధ్యాయమందలి భాగములే అని గ్రహించవలెను.

రాగ తాళ చింతామణియందుమాత్ర మీ రెండు భాగములును ఆయా సందర్భములందే సంగ్రహముగా చెప్పబడినవి.

### 2. రాగ తాళ చింతామణి

నూత్న నాట్య గృహమందు గో-బ్రాహ్మణులు ఏడు రోజులు నివసించవలసిన కారణమును గోవిందకవి ఈ క్రింది విధముగా వివరించెను [రాగతాళ చింతామణి-1-వ అ-80]—“......అఖండ సచ్చిదానంద రూపంబైన బ్రహ్మంబు నిజశక్తి మహిమంబు జేసి చరాచరాత్మక ప్రపంచాకారంబున బ్రకాశింపుచునుండు. అట్టి ప్రపంచంబు ధర్మప్రతిష్ఠితంబై ప్రవర్తిల్లు. అట్టి ధర్మంబు సత్యదయాశౌచ తపోరూప పాదచతుష్టయాన్విత దివ్యగోరూపంబై విలసిల్లు. మఱియు నా ధర్మంబు వేదాగమ ప్రతిపాదితంబై

---

పై విధముగా రంగపూజను చేయవలెనని కొంద రందురు. ప్రేక్షా ప్రారంభమం దెల్లప్పుడును తప్పక రంగపూజను చేయవలె నని మరికొంద రందురు. [అభినవభారతి - 1 వ సం - పుట 83] ఇచ్చట వ్యాఖ్య కొంత శిథిలమైనది. అభినవగుప్తుడు మొదటి అభిప్రాయమును సమర్థించినట్లు కన్పట్టుచున్నది.



బ్రహ్మవిజ్ఞానసాధనంబగు. అట్టి వేదాగమాది వాఙ్మయంబెల్ల బ్రాహ్మణాధీనంబై యుండు. కావున నట్టి గోబ్రాహ్మణ గణంబు సాక్షాత్పరమేశ్వరరూపంబై సకలలోక పూజ్యంబగు ననియును దాదృశ గోబ్రాహ్మణ పాదన్యాస పవిత్రంబైన క్షేత్రంబు కాశీక్షేత్రంబునుం బోలె బరమపావనంబై రంజిల్లుననియును శాస్త్రదర్శనంబున నిశ్చయించె......”

భరతుడు మొదట భూసురులచే 'తత్త దధిదేవతావాహన-మంత్ర-జప-హోమ-బల్యన్నదాన-చతుర్విధ భక్ష్యోపహార సమర్పణాది పూజా విశేషంబులు' చేయించెను. పిమ్మట తాను మరల ప్రత్యేకముగా రంగారాధనంబు చేయదలంచి క్రమమున ఆయా దేవతావాహనము కావించెనట.

---

# అధ్యాయము 4

## తాండవము[1]

[కాశీముద్రణమునందు - 321 శ్లోకములును, బొంబాయిముద్రణమునందు - 326 శ్లోకములును, బరోడాముద్రణమునందు - 320 శ్లోకములును కలవు.]

### అమృతమంథన ప్రయోగము

పైవిధముగా రంగదేవతాపూజనము కావించినపిమ్మట "ఓ ప్రభూ! ఏ ప్రయోగమును[2] ప్రయోగించవలెనో వేగముగా[3] ఆజ్ఞాపింపుము" అని పితామహునకు విన్నవించితిని. అప్పుడు "'అమృతమంథనము'ను ప్రయోగింపుడు. ఇది ఉత్సాహజనకమును, సురలకు ప్రీతికరమును కాగలదు. ధర్మ-కామ-అర్థ సాధక మగునట్లుగా నేను కూర్చిన ఈ సమవకారమును మీరు ప్రయోగింతురుగాక!" అని బ్రహ్మ ఆదేశించెను. అంతట మేము 'అమృతమంథన' మనెడి సమవకారమును[4] ప్రదర్శింపగా, అందలి కర్మ-భావానుదర్శనమువలన దేవదానవు లందరును సంతోషించిరి.

### శివునిసమక్షమున రూపకప్రయోగములు

కొంతకాలమైన పిమ్మట అంబుజసంభవు డొకనాడు నన్నుపిలిచి "మహాత్ముడైన త్రినేత్రునకు మన మిప్పుడు నాట్యమును చూపుదము" అని చెప్పి, దేవతల

1. మూడు ముద్రణములందును 'తాండవ లక్షణము' అని కలదు.

2. దైత్య-దానవ నాశాత్మకమైన ప్రయోగము ప్రయోగింపబడుచుండగా విఘ్నము కలిగినట్లు ప్రథమాధ్యాయమందు చెప్పబడినది. దశవిధ రూపకములలో ఆ ప్రయోగము ఏ రూపకమో చెప్పబడలేదు. అది అసలు రూపకము కాదనియు, నాట్యానుకార రూపకమగు ప్రస్తావన మాత్రమే అనియు కొందరు తలంచిరి. వీరి దృష్టిలో ఇప్పుడు చెప్పబోవు అమృతమంథన మనేడి సమవకారమే ప్రథమ రూపకము. ప్రథమాధ్యాయమందు రూపకమే ప్రయోగింపబడినదని అభిప్రాయపడినచో అమృతమంథనము రెండవ రూపకమగుచున్నది.

3. రంగదేవతాపూజనము అయిన వెంటనే ప్రయోగము ప్రారంభము కావలెను; రెండింటికిని మధ్య వ్యవధానము ఉండరాదు. [అభినవభారతి - 1 వ సం - పుట 84]

4. అమృతమంథన మనగా అమృతముకొరకు దేవదానవులు క్షీరసాగరమును మథించుట. సమవకారము దశరూపములలో నొకభేదము. దీని నిర్వచనాదులు 18 వ అధ్యాయమందు కలవు. అనుదర్శన మనగా తిరిగి చూచుట. తమ తమ పూర్వుల కృత్యములను భావములను లేదా తాము వినిన కథాంశములను ప్రయోగమునందు ప్రత్యక్షముగా దర్శించుట అనుదర్శన మగును.



తోడను, మాతోడను కలిసి బయలుదేరి, కైలాసమునుచేరి, ఆ దేవదేవు నర్చించి, "ఓ సురోత్తమా! నేనొక సమవకారమును సృజించితిని. మీరు దానిని వినవలెననియు,[5] చూడవలెననియు వేడుచున్నాను" అని త్రినేత్రునకు విన్నవించెను. "అట్లే చూతును" అని శివు డంగీకరించెను. అంతట పితామహుడు "ఓ మహామతీ! సంసిద్ధుడవు కమ్ము" అని నన్నాజ్ఞాపించెను. అనేక విధములగు పర్వతములతో, మనోహరములగు గుహలతో, సెలయేళ్లతో, భూతగణములతో ఒప్పుచున్న ఆ హిమవత్పర్వత పృష్ఠభాగమందు మే మప్పుడు ప్రయోగమును ప్రారంభించితిమి. మొదట పూర్వరంగమును నిర్వర్తించి, పిమ్మట అమృతమంథన మనెడి పై సమవకారమును, 'త్రిపురదాహ' మనెడి డిమమును[6] ప్రదర్శించితిమి. కర్మ-భావానుకీర్తనములగు ఆ ప్రయోగములనుచూచి, భూతగణములు హర్షమును పొందినవి. మహాదేవుడును సంప్రీతుడై పితామహునితో ఇట్లు చెప్పెను—

### నృత్తమును పూర్వరంగమందు కూర్చుట

"ఓ మహామతీ! యశస్సును, శుభమును, పుణ్యమును కలిగించునదియును, బుద్ధిని వృద్ధి పొందించునదియును అగు నాట్యమును నీవు చక్కగా సృజించితివి. సంధ్యా కాలములయందు నృత్తము చేయుచున్నప్పుడు నేనుకూడ ఈ విషయములను గూర్చి చింతించితిని. కరణ – అంగహార సంపన్నమగు నా నృత్తమును నీవు పూర్వరంగ విధులందు చక్కగా కూర్చుము. దీనివలన వర్ధమానకము ననుసరించెడి ఆసారిత గీతములందలి, మహాగీతములందలి అర్థములు చక్కగా అభినయింపబడగలవు. నీవు పూర్వరంగమును 'శుద్ధము'గా (నృత్తవిరహితముగా) నొనర్చితివి.

5. "మహాత్ముడైన త్రినేత్రునకు...నాట్యమును చూపుదము" అని బ్రహ్మ అనుటలో 'మహాత్మ' శబ్దమునుబట్టి ఉత్తముడును, అధికారియును అయిన వానికే ప్రయోగమును చూపించవలెననియు, "మనము...చూపుదము" అనుటనుబట్టి కవి ప్రయోగ కాలమున సన్నిహితుడుగా నుండవలెననియు స్పష్టమగుచున్నది. 'వినవలెను' అను దానినిబట్టి కవి ప్రప్రథమముగా తన రచనను పరీక్షకునకు వినిపించవలెనని గ్రహించవలెను. సామాజికులకు ప్రప్రథమముగా వినిపించవలె ననుట అంతగా సమంజసము కాదు. పరీక్షకులయిన పెద్దలు వినుటయేఉపకారకము కాగలదు. ఇచ్చట సాక్షాదీశ్వరుడే పరీక్షకుడు, పరితోష్యుడు, రసచర్వణాత్మక మయిన మహాభోగ మిచ్చువాడును అయినాడు. [అభినవభారతి - 1 వ సం - పుట 86]

6. త్రిపురదాహ మనగా శివుడు రాక్షసుల మూడు పురములను కాల్చివేయుట. డిమము దశరూపములలో నొక భేదము. దీని నిర్వచనాదులు 18 వ అధ్యాయమందు కలవు.

ఈ అంగహారములతో కూడినచో అది 'చిత్రము' కాగలదు[7]" అంతట, "ఆ అంగహారముల ప్రయోగమును తెలుపుము" అని బ్రహ్మ శివుని కోరెను. అప్పుడు శివుడు తండువు[8]ను పిలిచి "ఈ భరతునకు అంగహారముల ప్రయోగమును తెలు

---

7. ఇచ్చట పరమేశ్వరుని వాక్యము లీ క్రిందివిధముగా నున్నవి—

"అహో నాట్యమిదం సమ్యక్ త్వయా సృష్టం మహామతే।
యశస్యం చ శుభార్థం చ పుణ్యం బుద్ధివివర్ధనమ్॥ 12

మయాఽపీదం స్మృతం నృత్తం సంధ్యాకాలేషు నృత్యతా।
నానాకరణసంయుక్తై రంగహారై ర్విభూషితమ్॥ 13

పూర్వరంగ విధావస్మిం స్త్వయా సమ్య క్ప్రయోజ్యతామ్।
వర్ధమానకయోగేషు గీతే ష్వాసారితేషు చ॥ 14

మహాగీతేషు చైవార్థాన్ సమ్యగేవాభినేష్యసి।
య శ్చాయం పూర్వరంగస్తు త్వయా శుద్ధః ప్రయోజితః॥ 15

ఏభి ర్విమిశ్రిత శ్చాయం చిత్రోనామ భవిష్యతి।" 16

ఈ సందర్భమున అభినవగుప్తుని వ్యాఖ్యాన మీ క్రింది విధముగా నున్నది — బ్రహ్మ సృజించిన నాట్యము చక్కగానే ఉన్నది. కాని అందు భరతుడు ప్రదర్శింపజేసిన కైశికీ నృత్తము సరిగా లేదు. నీలకంఠుని తాండవమునందు కైశికీనృత్తమును చూచి యున్నట్లు భరతుడు ప్రథమాధ్యాయమందు చెప్పినాడు. అది చూచి, దాని ననుసరించి భరతుడు కైశికీ నృత్తమును నాట్యమందు కూర్చినాడు. కాని, చక్కని ఉపదేశము లేకపోవుటచే భరతుడు కూర్చిన ఆ కైశికీనృత్తము అంత సుశ్లిష్టముగా లేదు. కావుననే అంగహారముల ప్రయోగమును నేర్పుటకు తండువును నియమించుట జరిగినది. 'స్మృతం' అను దానినిబట్టి నృత్తము బహు ప్రాచీనమని గ్రహించవలెను.

నృత్తమునందలి హస్త-పాద సమాయోగము 'కరణ' మనబడును. అట్టి కొన్ని కరణముల మొత్తము ఒక అంగహారమగును. వీని నిర్వచనములు ఈ అధ్యాయమందే కలవు. పూర్వరంగవిధి 5 వ అధ్యాయమందు వర్ణింపబడినది; అందు అంతర్యవనికాంగములు తొమ్మిదియును, బహిర్యవనికాంగములు పదియును చెప్పబడినవి. వర్ధమానకమ ననుసరించెడి ఆసారిత గీతములందలి నృత్తవిధి ఈ అధ్యాయమందే వర్ణింపబడినది. శుద్ధపూర్వరంగము ఈ విధిచే మిశ్రితమై చిత్రపూర్వ రంగమగును. మహాగీతము లనగా 5 వ అధ్యాయమందు వివరింపబడెడి ధ్రువాగీతములు. ఈ గీతములన్నింటియందలి అర్థములను ఈ నృత్తముచే చక్కగా అభివ్యక్తము చేయవచ్చును. ఇది 'వాక్యార్థాభినయ' మనబడును. [అభినవభారతి - 1 వ సం - పుటలు 87-88]

8. 'తండువు' అను పేరు నందీశ్వరున కపరనామము. అట్లే 'ముని' శబ్దము భరతునకు అపరనామము. తండువు చెప్పినదికాన ఆ నృత్తము 'తాండవ' మనబడినది. [అభినవభారతి-1 వ సం - పుటలు 88]



పుము." అని ఆజ్ఞాపించెను. ఆ తండువు నేర్పిన కరణసంయుక్తములగు అంగహారములను రేచక సహితములుగా ఇప్పుడు వ్యాఖ్యానింతును.[9]

అంగహారములు

1. స్థిరహస్తము
2. పర్యస్తకము
3. సూచీవిద్ధము
4. అపవిద్ధము
5. ఆక్షిప్తకము
6. ఉద్ఘట్టితము
7. విష్కంభము
8. అపరాజితము
9. విష్కంభాపసృతము
10. మత్తాక్రీడ
11. స్వస్తికరేచితము
12. పార్శ్వస్వస్తికము
13. వృశ్చికాపసృతము
14. భ్రమరము
15. మత్తస్ఖలితకము
16. మదవిలసితము
17. గతిమండలకము
18. పరిచ్ఛిన్నము
19. పరివృత్తరేచితము
20. వైశాఖరేచితము
21. పరావృత్తము
22. అలాతకము
23. పార్శ్వచ్ఛేదము
24. విద్యుద్భ్రాంతము
25. ఉద్వృత్తకము
26. ఆలీఢము
27. రేచితము
28. ఆచ్ఛురితము
29. ఆక్షిప్తరేచితము
30. సంభ్రాంతము
31. అపసర్పితము
32. అర్ధనికుట్టకము

అను భేదములచే అంగహారములు ముప్పదిరెండు విధములు. కరణములతో కూడుకొనిన ఈ అంగహారముల ప్రయోగమును, ఈ కరణాంగహారములయందలి హస్త-పాద ప్రచారమును ఇప్పుడింక వివరింతును. కరణములనుండియే అంగహారములెల్ల నిష్పన్నము లగుచున్నవి.[10] కావున కరణముల పేర్లను, వాని ప్రయోగమును ముందుగా వివరింతును.

---

9. కరణ మనగా క్రియ లేదా చేష్ట. నృత్తమునకు సంబంధించిన క్రియ అగుటచే ఇది నృత్తకరణమనబడినది. (దీని నిర్వచనము తరువాత చేయబడును. 11 వ అధస్సూచికను కూడ చూడవలెను.) అంగహారమనగా అంగవిక్షేపమని అమరకోశార్థము. కరణములచే అంగములను సహజ స్థానమునుండి సముచితమైన మరియొక ప్రదేశమును సవిలాసముగా పొందించుట అంగహారమనబడునని అభినవగుప్తుడు పేర్కొనెను. [అభినవభారతి-1 వ సం-పుట 91] నృత్తమునకు కరణము మూలభూతమైనను అంగహారాత్మకమైనదే నృత్తమనుట సముచితము.

10. కరణముల కూడికవలన అంగహారము లేర్పడుచున్నవి. అంతమాత్రమున అంగహారములు కేవలను కరణముల కూడికమాత్రమే అని తలంచరాదు. నాలుగు రేచకములును కరణములందుకంటె అంగహారములందే ఎక్కువగా ఉపయుక్తమగును. ఈ రేచకములు శోభావహములేకాక ఒక భంగిమమునకును ఇంకొక భంగిమమునకును మధ్య నేర్పడెడి అవకాశములను పూర్తిచేసి నైరంతర్యమును (continuity) చేకూర్చును. ఇట్లు రేచకములు అంగహారములందధికముగా ఉపయుక్తములగును. కావుననే భరతుడు "కరణసంయుక్తములగు అంగహారములను రేచకసహితములుగా ఇప్పుడు వాఖ్యానింతు"నని చెప్పెను.

### నృత్తమాతృకాదులు

నృత్తమునందలి హస్తపాద సమాయోగము[11] 'కరణ' మనబడును. ఇట్టి రెండు నృత్తకరణములు ఒక నృత్తమాతృక అగును. రెండు లేదా మూడు లేదా నాలుగు మాతృకల వలన అంగహారము లేర్పడును. మూడు కరణములు ఒక కలాపక మగును. నాలుగు కరణములు ఒక 'మండక' మగును. ఐదు కరణములు ఒక 'సంఘాతక'మగును. మరియు, ఆరు లేదా ఏడు లేదా ఎనిమిది లేదా తొమ్మిది కరణముల కూడికల వలన అంగహారము లేర్పడుచున్నవి.[12]

---

11. ఏకకాలమున హస్త - పాదములను సమన్వయ పూర్వకముగా, సవిలాసముగా కదలించుట కరణమనబడును. హస్తపాదముల కదలికలు అనేకవిధములుగా నుండవచ్చును. కాని, విలాస విన్యాసములతో కూడుకొనినవే కరణములందు గ్రాహ్యాములు. హస్త-పాదములు మాత్రమే చెప్పబడుటచే తక్కిన అవయవములకు ఇందు సంబంధము లేదని కాని, అవి చలనరహితములుగా నుండునని కాని తలంచరాదు. 'హస్త'మను పదము ఊర్ధ్వకాయము నందుండు శాఖా - అంగ - ఉపాంగములకు ఉపలక్షణము. అట్లే 'పాద' మను పదము అధః కాయమునందలి పార్శ్వ - కటీ - ఊరు - జంఘా - చరణములకు ఉపలక్షణము [అభినవ భారతి-1 వ సం - పుట 90]. హస్త - పాదములతోపాటు తక్కిన అవయవములును కదలుచునే ఉండును. కావుననే "కటీ - పార్శ్వ - శిరః - ఉరః - పృష్ఠ - ఉదరములతో కూడుకొనిన హస్త - పాదములయొక్క ప్రచారము నింక వివరింతును" అని తరువాత భరతుడు చెప్పను. పూర్వక్షేత్రసంయోగత్యాగమునుండి సముచిత క్షేత్రాంతరప్రాప్తి పర్యంతమైన ఏకయాపమగు క్రియ కరణమనబడునని అభినవగుప్తుడు వివరించియున్నాడు. శరీరావయవముల యొక్క విలాసవిక్షేపమునకు సంబంధించిన క్రియ కరణమనబడునని సారాంశము.

12. ఇచ్చటి వాక్యములలో కొంత వైరుధ్యము కన్పట్టుచున్నది. 2 కరణముల కూడిక 'మాతృక' అగుచున్నదనియు రెండు లేదా మూడు లేదా నాలుగు మాతృకలవలన అనగా 4 లేదా 6 లేదా 8 కరణములవలన అంగహారములేర్పడుచున్నవనియు మొదట చెప్పబడినది. తరువాతి వాక్యములో "నాలుగు కరణములు ఒక 'మండక'మగు"నని చెప్పబడినది. ఆ తరువాతి వాక్యములో మరల 6 లేదా 7 లేదా 8 లేదా 9 కరణములవలన అంగహారము లేర్పడునని మరల చెప్పబడినది. నిజమునకు 4 కరణములతో నేర్పడిన అంగహారమేలేదు. ఈ వైరుధ్యమును తొలగించుటకీ వాక్యములనీ క్రిందివిధముగా మార్చుట సమంజసము— "..........రెండు కరణములు ఒక మాతృక అగును, మూడు కరణములు ఒక కలాపకమగును, నాలుగు కరణములు ఒక మండకమగును, ఐదు కరణములు ఒక సంఘాతకమగును. 6 లేదా 7 లేదా 8 లేదా 9 కరణములవలన లేదా అంతకుమించిన కరణముల వలన అంగహారము లేర్పడును".

రెండు కరణముల కూడికయగు 'మాతృక'యే అంగహారాత్మకమైన నృత్తమునకు మాతృక లేదా మూలభూతము **(basic unit)** అని అభినవగుప్తుడు తలంచినాడు. అది అంత సమంజసముగా కన్పట్టదు. మార్చిచూపిన పై వాక్యములనుబట్టి కరణమే నృత్తమునకు



ఇంక కరణములందలి హస్త - పాద ప్రచారమును వివరింతును. ఈకరణములు నూట ఎనిమిది.

#### కరణములు

1. తలపుష్పపుటము
2. వర్తితము
3. వలితోరుకము
4. అపవిద్ధము
5. సమనఖము
6. లీనము
7. స్వస్తికరేచితము
8. మండలస్వస్తికము
9. నికుట్టకము
10. అర్ధనికుట్టకము
11. కటిచ్ఛిన్నము
12. అర్ధరేచితము
13. వక్షస్స్వస్తికము
14. ఉన్మత్తకము
15. స్వస్తికము
16. పృష్ఠస్వస్తికము
17. దిక్స్వస్తికము
18. అలాతకము
19. కటీసమము
20. ఆక్షిప్తరేచితము
21. విక్షిప్తాక్షిప్తము
22. అర్ధస్వస్తికము
23. అంచితము
24. భుజంగత్రాసితము
25. ఊర్ధ్వజానువు
26. నికుంచితము
27. మత్తల్లి
28. అర్ధమత్తల్లి
29. రేచకనికుట్టితము
30. పాదాపవిద్ధకము
31. వలితము
32. ఘూర్ణితము
33. లలితము
34. దండపక్షము
35. భుజంగత్రస్తరేచితము
36. నూపురము
37. వైశాఖరేచితము
38. భ్రమరకము
39. చతురము
40. భుజంగాంచితము
41. దండకరేచితము
42. వృశ్చికకుట్టితము
43. కటిభ్రాంతము
44. లతావృశ్చికము
45. ఛిన్నము
46. వృశ్చికరేచితము
47. వృశ్చికము
48. వ్యంసితము
49. పార్శ్వనికుట్టకము
50. లలాటతిలకము
51. క్రాంతకము
52. కుంచితము
53. చక్రమండలము
54. ఉరోమండలము
55. ఆక్షిప్తము
56. తలవిలాసితము
57. అర్గళము
58. విక్షిప్తము
59. ఆవర్తము
60. దోలాపాదకము
61. వివృత్తము
62. వినివృత్తము
63. పార్శ్వక్రాంతము
64. నిశుంభితము
65. విద్యుద్భ్రాంతము
66. అతిక్రాంతము
67. వివర్తితకము
68. గజక్రీడితకము
69. తలసంస్ఫోటితము
70. గరుడప్లుతకము
71. గండసూచి
72. పరివృత్తము

---

మూలమనుట స్పష్టము. ఈ అభిప్రాయమే యుక్తియుక్తముగా నున్నది. [శ్రీ కె. యమ్. వర్మగారి "నృత్త - నాట్య - నృత్యములు" అను గ్రంథమును చూడవలెను. పుటలు 56-58] మాతృక - కలాపక - మండక - సంఘాతకములనుగూర్చి భరతుడుకాని, అభినవగుప్తుడుకాని వివరించలేదు.

73. పార్శ్వజానువు
74. గృధ్రావలీనకము
75. సన్నతము
76. సూచి
77. అర్ధసూచి
78. సూచీవిద్ధము
79 అపక్రాంతము
80. మయూరలలితము
81. సర్పితము
82. దండపాదము
83. హరిణప్లుతము
84. ప్రేంఖోలితకము
85. నితంబము
86. స్ఖలితము
87. కరిహస్తము
88. ప్రసర్పితకము
89. సింహవిక్రీడితము
90. సింహాకర్షితము
91. ఉద్వృత్తము
92. ఉపసృతకము
93. తలసంఘట్టితము
94. జనితము
95. అవహిత్థకము
96. నివేశము
97. ఏలకాక్రీడితము
98. ఊరూద్వృత్తము
99. మదస్ఖలితము
100. విష్ణుక్రాంతము
101. సంభ్రాంతము
102. విష్కంభము
103. ఉద్ఘట్టితము
104. వృషభక్రీడితము
105. లోలితము
106. నాగాపసర్పితము
107. శకటాస్యము
108. గంగావతరణము

కరణముల ప్రయోజనాదులు

పైకరణములన్నియును నృత్తమునందును, యుద్ధమునందును ఉపయుక్తములగును. యుద్ధములం దుపయుక్తమగు చారీవిధానమును గతిపరిక్రమమందు వివరింతును.[13] నాట్యాచార్యులు తమ నాట్యశక్తినిబట్టి కరణముల నెచ్చటనైనను ఉపయోగించుకొనవచ్చును. కరణమునందు ప్రాయశః వామకరము వక్షఃస్థితమును, దక్షిణకరము చరణానుగామియును కావలయును. నృత్తమునందు కటీ-పార్శ్వ-శిరములయొక్కయు, ఉరః-పృష్ఠ-ఉదరములయొక్కయు కర్మలు హస్త-పాద ప్రచారములతో లేదా కర్మలతో సమన్వయమునందవలెను. ఇట్లు, కటీ-పార్శ్వ-శిరః-ఉరః-పృష్ఠ-ఉదరములతో కూడుకొనిన హస్త-పాదములయొక్క ప్రచారముల నింక వివరింతును.[14]

13. గతి పరిక్రమమనగా పాద ప్రచారమని చెప్పవచ్చును. ఈ పాదప్రచారము-చారులు (10వ అధ్యా.), మండలములు (11వ అధ్యా.) ఆయా పాత్రల నడకలకు సంబంధించిన విధానము (గతి ప్రచారము-12వ అధ్యా.) అను మూడు అధ్యాయములందు వివరింపబడినది.

14. 11వ అధస్సూచికనుకూడ చూడవలెను. ఇచ్చట 'శిరః' అనినచోట మూలమందు 'ఉరః' అని కలదు. కాని 'శిరః' అను పదమే సమంజసమని శ్రీ వర్మగారు నిరూపించిరి. [నృత్త-నాట్య-నృత్యములు - పుట 54]



కరణమాతృకలు : సౌష్ఠవము

యాని స్థానాని యాశ్చార్యో నృత్తహస్తా స్తథైవచ ॥ 59
సా మాతృకేతి విజ్ఞేయా తద్యోగా త్కరణం భవేత్ ।
కటీ కర్ణసమా యత్ర కూర్ప రాంసశిర స్తథా ॥ 60
సమున్నత మురశ్చైవ సౌష్ఠవంనామ తద్భవేత్ ॥ 61

స్థానములు, చారులు, నృత్తహస్తములు[15]-అనునవి మాతృకలని తెలియవలెను; వీని కలయిక వలన కరణములేర్పడును. కటీ-కర్ణము లొకేరేఖలోను, కూర్పర-అంసశిరము లొకేరేఖలోను ఉండగా, ఉరము సమున్నతమగుట 'సౌష్ఠవ' మనబడును.*[16]

కరణముల లక్షణములు§

1. తలపుష్పపుటము- పుష్పపుటహస్తమును వామపార్శ్వమునం దుంచవలెను. అగ్రతలసంచర పాదమును, సన్నత (నత) పార్శ్వమును కావించ

15. స్థానము=అస్త్రములు మొదలగువానిని ప్రయోగించునప్పుడును, ఇతర సన్నివేశములందును నిలిచెడి పద్ధతి [10 వ అధ్యాయమును చూడవలెను]. 'చారి' అనగా పాదప్రచారము [చూ. 10 వ అధ్యా.]. నృత్తహస్త మనగా కేవలము నృత్తమునందుపయుక్తమగు హస్తాభినయమునకు సంబంధించినది. సంయుత-అసంయుత హస్తములతోపాటు ఇవియును 9 వ అధ్యాయమందు వివరింపబడును. ఈ మూడును కరణమునకు మాతృకలు. వీని కలయికవలననే కరణము నిష్పన్నమగును. అట్టి కరణము నృత్తమునకు మాతృక లేదా మూలము అగుచున్నది.

* [కాశీ ముద్రణమునందు- 1-60 శ్లో ; బొంబాయి-బరోడా ముద్రణములందు-1-61 శ్లో.]

16. సౌష్ఠవ నిర్వచన శ్లోకము మరల 10 వ అధ్యాయమందు కూడ కలదు (92-93 శ్లో.). మనిషి నిటారుగా నిలబడి చేతులను సూటిగా ప్రక్కలకు చాచవలెను; అరచేతులు అధోముఖములుగా నుండవలెను. నృత్తారంభమందు ప్రతి నర్తకుడు లేదా నర్తకి ఇట్లు నిలబడుట మనము చూచుచుందుము. కూర్పరములు=మోచేతులు; అంసశిరములు=భుజస్కంధములు లేదా మూపులు. నృత్తారంభోచితావస్థను కుమారగిరిరెడ్డి 'వసంతరాజీయ' మందీ క్రింది విధముగా వివరించెను. ఇది 'సమనఖకరణ' తుల్యముగానున్నది—

అంగస్య చతురస్రత్వం సమపాదౌ లతాకరౌ । ఆరంభే సర్వనృత్తానా మేత త్సామాన్య మిష్యతే ॥
—[కాటయవేముని మాలవికాగ్నిమిత్ర వ్యాఖ్య - పుట 144]

§ [చిదంబర దేవాలయగోపుర శిల్పములు : కరణములకు లక్ష్యములు

చిదంబరమందలి నటరాజస్వామి ఆలయముయొక్క నాలుగు గోపురముల గోడల మీదను భరతుడు వివరించిన 108 కరణములకును లక్ష్యములు కలవు. తూర్పు-పశ్చిమ

గోపురములలో ఆయా కరణములక్రింద నాట్యశాస్త్రమందలి లక్షణ శ్లోకములే 'గ్రంథలిపి' లో ఉదాహృతములైనవి. ఒక్కొక్క కరణము ఒక్కొక్క శిలాఫలకముపై (21"×20") చెక్కబడినది. ప్రతిఫలకమునందును నర్తకికి ఇరుపార్శ్వముల ఒకరు మృదంగమును, ఇంకొకరు తాళమును వాయించుచుందురు. ఈ శిలాఫలకము లొకదానిపై ఇంకొకటి అమర్చబడుటచే ఏక స్తంభముగా గోచరించును. ఒక్కొక్క స్తంభమునందు ఎనిమిదేసి ఫలకములున్నవి. ఇట్టి స్తంభములు గోపురద్వారమున కిరుపార్శ్వములందును ఏడేసి ఉన్నవి. అనగా మొత్తము 112 శిలాఫలకము లున్నవన్నమాట ; ఇందులో 108 ఫలకములు కరణములవి, ఒకటి శిల్పుల మూర్తులున్న ఫలకము, తక్కినవి ఇతరములు. నాలుగు గోపురములలో తూర్పు గోపురమునందలి కరణములు క్రమసహితములగుటయే కాక రమణీయతరములుగానున్నవి (14 వ విశేషాంశమును చూడవలెను).

1914లో పురాతత్త్వశాఖ వారు ఈ కరణముల ఉనికిని గుర్తించి, వానిని 'ఎపిగ్రాఫికా ఇండికా'లో ప్రకటించినారు. వారు 93 కరణములకు మాత్రమే 'కఱ్ఱ బ్లాకు'లను (Wood-cut Blocks) తయారు చేసినారు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు 1926 లో వానిని నాట్యశాస్త్ర ప్రథమ భాగముయొక్క ప్రథమ ముద్రణమునందు ప్రకటించినారు. 1936 లో డా. బి. వి. నారాయణస్వామి నాయుడుగారును, వారి సహచరులును 'తాండవ లక్షణ' మను పేర ఈ నాలుగవ అధ్యాయమునకు ఆంగ్లానువాదమును ప్రకటించినారు. వారు, గోపురములందలి నూటఎనిమిది కరణములకును ఛాయాచిత్రములను తీయించి అందులో ప్రకటించినారు. 1955లో శ్రీయుతులు గోపీనాథ్, యస్. వి. రమణరావుగారలు **"The Classical Dance Poses of India"** అను గ్రంథమును ప్రకటించి అందులో 105 కరణములకు రేఖాచిత్రములను ప్రకటించినారు. వీరు కరణముల వరుసను వ్యత్యస్తముచేసి ఒక క్రమమును సూచించుటకు ప్రయత్నించిరి. 1956 లో నాట్యశాస్త్ర ప్రథమ భాగము రెండవసారి ముద్రింపబడినప్పుడు సంపాదకులైన శ్రీ కె. యస్. రామస్వామి శాస్త్రిగారు స్వయముగా చిదంబరము వెళ్ళి, శిల్పములను పరిశీలించి 108 కరణములను ప్రకటించినారు. పురాతత్త్వ శాఖవారు ప్రకటింపని 15 కరణములకును వీరు క్రొత్తగా రేఖాచిత్రములను వేయించిరి. ఇంతకు ముందరి ముద్రణములలో కొన్నిటికి లక్ష్య - లక్షణముల సమన్వయము కుదురుటలేదు. శ్రీ శాస్త్రిగారు సమర్థతతో వానిని సరిదిద్ది ప్రకటించినారు.

చిదంబర లక్ష్యములందు స్త్రీయే నృత్తముచేసినట్లు కలదు. కాని, కంచిలోని కైలాసనాథ దేవాలయమందలి లోపలిభాగమునన్న శిల్పములలో కరణములను పురుషుడే నిర్వర్తించెనని తెలియుచున్నది. శ్రీ గోపీనాథ్ రేఖాచిత్రములు పురుషకృతములుగానే ఉన్నవి. నేను చిదంబర లక్ష్యములనే అనుసరించితిని. మా రేఖాచిత్రములను వ్రాసిన మిత్రుడు శ్రీ కె. తిరుమలరావు వర్ధిష్ణువగు కళోపాసకుడు. శ్రీ రామస్వామిశాస్త్రిగారు క్రొత్తగా వేయించిన చిత్రములు కొన్నియును, అసలు శిల్పములు కొన్నియును నాట్యశాస్త్ర మందలి నిర్వచనములతో సంపూర్ణముగా అన్వయించుటలేదు. అందుచే ఈ క్రింది సంఖ్యలు గల కరణములందు అల్పములగు మార్పులు చేయవలసివచ్చినది – 11, 18, 20, 23, 26, 38, 64, 71, 73, 90, 94, 95, 99, 101, 103.]



వలెను.[17] [పుష్పపుటము సంయుత హస్తభేదము, అగ్రతల సంచరము పాదప్రచార భేదము, సన్నతము పార్శ్వకర్మ భేదము (ఆంగికాభినయ మందలి ఈ భేదము లన్నియును 9 వ అధ్యాయమందు వివరింపబడును). ఈ మూడింటియొక్క సమన్వయ పూర్వకమగు క్రియ 'తలపుష్పపుట' కరణ మనబడును. అగ్రతలసంచర పాదము, పుష్పపుట హస్తము అనువాని కలయిక కలదగుటచే ఇది 'తలపుష్పపుట' మనబడినది. ఇట్లే తక్కినపేర్లను ఊహించుకొనవలెను. సూత్రధారుడు పుష్పాంజలిని వెదజల్లుటయందీ కరణ ముపయుక్తము. అభినవభారతి - 1వ సం - పుట 92-93]

2. వర్తితము- పతాక హస్తములను మనికట్టువొద్ద వంచి, పిమ్మట వ్యావర్తన - పరివర్తనముల (వెనుకకు మరల్చుట, చుట్టుట, త్రిప్పుట) నొనర్చుచు తొడలపై జార్చవలెను. [ఇందు ఉత్తానము (ఊర్ధ్వముఖము) లుగా నున్న పతాక హస్తములు అసూయా వాక్యార్థాభినయమునందును, అధోముఖములుగా నున్న పతాకహస్తములు రోషవాక్యార్థాభినయమునందును ఉపయుక్తములగును. అభినవ భారతి - పుట 97]

3. వలితోరుకము- శుకతుండ హస్తములను వ్యావర్తన-పరివర్తనములను చేయుచు, వలితోరువును కావించవలెను. [ఇది ముగ్ధావిషయమం దుపయుక్తము.]

4. అపవిద్ధము- కుడిచేతితో శుకతుండ హస్తమును ప్రదర్శించి దానిని తొడవెనుకకు జార్చవలెను. ఎడమచేతిని బొమ్ముమీద ఉంచవలెను. [కుడిచేతితో శుకతుండ హస్తమును, ఎడమచేతితో కుటకాముఖ హస్తమును ప్రదర్శించవలెను. ఇది అసూయా-కోపవాక్యాభినయములం దుపయుక్తమగును. అభి. భా. పుట 98]

5. సమనఖము- హెచ్చుతగ్గులు లేకుండ గోళ్ళను సమముగానుంచి, రెండు పాదములను దగ్గరగాచేర్చి, సహజముగా నిలువవలెను. చేతులు వ్రేలాడుచుండవలెను. [నర్తకి లేదా నర్తకుని ప్రథమప్రవేశమందు ఈ కరణ ముపయుక్తము. కొందరభిప్రాయపడినట్లుగా ఇది జప్య - మంగళాది విషయములందు ప్రయుక్తమగుట సమంజసము కాదు. చేతులు లతాహస్తములు కావలెను. అభినవభారతి-పుట 98.]

17. కరణముల లక్షణములను వివరించుటలో హస్తముల, పాదముల, ఇతర అంగముల క్రియలను వేర్వేరుగా వ్రాసియున్నాను. ఇవి, సాధారణముగా, ఏకకాలమందు జరుగు క్రియలు. 'పిమ్మట', 'తరువాత' అని చెప్పబడినచోటులందు మాత్రమే క్రమము కలదు. తక్కినచోట్లనెల్ల కరణమందలి అంగక్రియలన్నియును ఏకకాలమందే జరుగును. మూలమందు ముఖ్యసూచనలు మాత్రమే చేయబడినవి. ప్రతి కరణమును ప్రదర్శించుటలో అనుసరించవలసిన విధానమును అభినవగుప్తుడు విపులముగా వ్యాఖ్యానించెను. నేను అభినవ భారతిలోని ముఖ్యవిషయములను కూడ కుండలీకరణములందు పుటసంఖ్యాసహా పేర్కొని యున్నాను. అభినవగుప్తుడు వినియోగములను కూడ తెలిపెను.

6. లీనము - అంజలి హస్తమును ఱొమ్ముమీదనుంచి, మెడను పైకి చాచి, మూపులను వంచవలెను. [ప్రియ ప్రార్థనా వాక్యార్థాభినయమం దిది ఉపయుక్తము. దేవతా ప్రణామమునందిది కూడదు; అచ్చట అంజలి హస్తము తలమీద నుండవలెను. ఇచ్చట గ్రీవారేచితమును అనుసంధించుకొనవలెను. అభినవభారతి - పుట 99]

7. స్వస్తికరేచితము- రెండు చేతులతో మొదట రేచిత - ఆవిద్ధవక్రక హస్తములను ప్రదర్శించి, పిమ్మట స్వస్థానమునకు తెచ్చి, స్వస్తిక హస్తమును ప్రదర్శించవలెను. పిమ్మట స్వస్తికమును విడివడజేసి విప్రకీర్ణ హస్తములను ప్రదర్శించవలెను. తరువాత నడుముమీద పక్షప్రద్యోత-పక్షవంచితక హస్తములను ప్రదర్శించుట స్వస్తికరేచితకరణ మగును. [ఇట్టిది ఆరు నృత్తహస్తములతో కూడి యుండును. ఎచ్చట నృత్త మెంతకాలము ప్రధానముగా అభినేయమో అంత కాలమును ప్రహర్షాది యోగమునందు అచ్చటచ్చట ఈ కరణమును ప్రయోగించవలెను. అభినవభారతి - పుటలు 99-100]

8. మండలస్వస్తికము- మండలస్థానమందు నిల్చి అరచేతులను ప్రేక్షకుల కభిముఖములుగాను, ఊర్ధ్వతలములుగాను ఉండునట్లుచేసి సంయుత స్వస్తికహస్తములను ప్రదర్శించవలెను. [ఇది తిరస్కార వాక్యాభినయమందు ప్రయుక్తము]

9. నికుట్టకము- తన మూపులమీద చేతులను పర్యాయముగా నికుట్టితము చేయుచు, అట్లే పాదములను కూడ నికుట్టితము చేయవలెను. [అంగమును ఉన్నమన-వినమనములు చేయుట (పైకి-క్రిందకు ఆడించుట) నికుట్టనము (నికుట్టితము) అనబడునని కోహల నిర్వచనము. పర్యాయముగా=ఒక హస్తము తరువాత ఇంకొక హస్తమును. ఆత్మసంభావనా ప్రధానమైన వాక్యార్థాభినయమం దిది మాటి మాటికిని అభినయింపబడును. ఏ హస్తము నికుట్టిత మగునో తత్సమ కాలమున అదే పాదమును నికుట్టితము కావలెను. అభినవభారతి-పుట 101]

10. అర్ధనికుట్టకము- అలపల్లవ హస్తమును, వ్రేళ్ళు మూపునకు అభిముఖములుగా నుండునట్లుగా వంచి, అదే పాదముచే నికుట్టన మొనర్చవలెను. [నికుట్టనమును ఒక ప్రక్కయందే చేయుటచే ఇది అర్ధనికుట్టక మనబడినది. స్వాత్మసంభావనా ప్రధాన వాక్యార్థాభినయమం దిది ఉపయుక్తము. అభినవభారతి-పుట 102.]

11. కటిచ్ఛిన్నము- ఛిన్నకటిని ప్రదర్శించుచు, పల్లవహస్తములను మూపులమీద పర్యాయముగా మాటిమాటికిని ఉంచవలెను. [విస్మయ ప్రధానమైన వాక్యార్థాభినయమందిది ఉపయుక్తము. అభినవభారతి - పుట 102.]

12. అర్ధరేచితకము- సూచీముఖ హస్తమును ప్రదర్శించి, చాచి, మరల దగ్గరగాలాగి, పాదమును నికుట్టితముచేయుచు, సన్నత (నత) పార్శ్వమును






















1. తలపుష్పపుటము 2. వర్తితము 3. వలితోరుకము 4. అపవిద్ధము 5. సమనఖము 6. లీనము 7. స్వస్తికరేచితము 8. మండలస్వస్తికము 9. నికుట్టకము.

ప్రదర్శించవలెను. [ఇది అసమంజస చేష్టా ప్రధాన వాక్యార్థాభినయమం దుపయుక్తము. అభినవభారతి - పుట 103.]

13. వక్షఃస్వస్తికము- పాదముల నొకదానిపై ఇంకొకదానిని ఉంచి స్వస్తికాకారముగా నొనర్చి, ఆభుగ్న హృదయముమీద రేచిత హస్తములను కూడ స్వస్తికాకారముగా నొనర్పవలెను. [లజ్జిత-జాతానుతాప ప్రధాన వాక్యార్థాభినయమందిది ఉపయుక్తము. అభినవభారతి - పుట 103.]

14. ఉన్మత్తకము- అంచితపాదములను, రేచితహస్తములను ప్రదర్శించవలెను. [ఆవిద్ధచారిచే దీనిని ప్రయోగించవలెను. ఏకవచన-ద్వివచనములచే అంగపర్యాయము సూచితమగుచున్నది. ఇది అతిసౌభాగ్యజనిత గర్వమునందు ప్రయుక్తము.]

15. స్వస్తికము- హస్తములను, పాదములను స్వస్తికాకారముగా నొనర్పవలెను. ['卐' ఇది స్వస్తికముయొక్క గుర్తు. వక్షఃస్వస్తికమందు హృదయమాభుగ్నమగుటమాత్ర మధికము. ఇది ద్వేషణ-నిషేధ-రహస్య వాక్యార్థాభినయమం దుపయుక్తము. అభినవభారతి - పుట 104.]

16. పృష్ఠస్వస్తికము- బాహువులచే విక్షేప - ఆక్షేపముల నొనర్చి, పాదములచే అపక్రాంత-అర్ధసూచీ చారులను ప్రదర్శించవలెను. [విక్షేప సమకాలమున అపక్రాంతచారిని. ఆక్షేప సమకాలమున రెండవ పాదముచే సూచీచారిని ప్రదర్శించి, పిమ్మట హస్తములను పాదములను స్వస్తికాకారముగా నుంచవలెను. దీని ప్రయోజనము స్వస్తికమువలెనే. పరాఙ్ముఖముగా నుండుటచే ఇది పృష్ఠస్వస్తికమైనది. పృష్ఠముమీద హస్తముల స్వస్తికమును వాంఛించు కొందరు, ఇది యుద్ధవిషయ పరిక్రమములం దుపయుక్తమగునందురు. అభినవభారతి - పుట 105.]

17. దిక్స్వస్తికము- వరుసగా నాలుగు దిక్కులయందును హస్తములను, పాదములను స్వస్తికములుగా నొనర్పవలెను. [గీత పరివర్తములందిది ఉపయుక్తము]

18. అలాతకము- అలాతకచారిని ప్రదర్శించి, కుడిచేతిని మూపునుండి తొలగించి, ఊర్ధ్వజానుచారిని ప్రదర్శించవలెను. [కుడిపాదముచే అలాతచారిని ప్రదర్శించవలెను. కుడిచేతిని దూర మొనర్చుటలో నితంబ మనెడి నృత్తహస్తము ప్రయుక్తమగును. లలిత నృత్త విషయములందిది ఉపయుక్తము. అభి. భా. పుట106]

19. కటీసమము- స్వస్తికరణమందలి పాదములను హస్తములను విడివడునట్లుచేసి కుడిచేతిని బొడ్డుమీదను, ఎడమచేతిని కటి (నడుము) మీదను ఉంచి, పార్శ్వము ను ఉద్వాహితము చేయవలెను (పైకి ఎత్తవలెను). [కుడిచేయి కటకాముఖహస్తమును, ఎడమచేయి అర్ధచంద్ర హస్తమును కావలెను. ఎడమప్రక్కకు వంగవలెను. ఉద్వాహిత హృదయముయొక్క లక్షణమును ఇచ్చట అన్వయించుకొనవలెను. జర్జరాభిమంత్రణసమయమున సూత్రధారునిచే ఈ కరణము ప్రయుక్తమగును.]






10. అర్ధనికుట్టకము 11. కటిచ్ఛిన్నము 12. అర్ధరేచితము 13. వక్షస్స్వస్తికము 14. ఉన్మత్తకము 15. స్వస్తికము 16. పృష్ఠస్వస్తికము 17. దిక్స్వస్తికము 18. అలాతకము.

20. ఆక్షిప్తరేచితము- ఎడమచేతిని ఎదపైనుంచి, కుడిచేతిని పైకి-ప్రక్కలకు చాచుచు (శరీరమునుండి దూరముచేయుచు), వేగముగా కదలించుచు, కలుపుచు దూరము చేయుచుండవలెను. [ప్రయోగానుసారముగా ఇచ్చట అంచిత-సూచీ పాదములను ప్రదర్శించవలెను. త్యాగ-ఉపాదానవాక్యార్థములం దిది ప్రయుక్తమగును. అభినవభారతి - పుట 107]

21. విక్షిప్తాక్షిప్తకము- హస్తములను పాదములను మొదట విక్షిప్తముచేసి పిమ్మట ఆక్షిప్తము చేయవలెను. [ఒక హస్తము వ్యావర్తితము చేయబడు సమయమందే ఒక పాదము విక్షిప్తము కావలెను, అనగా దూరముగా త్రోయబడవలెను. అప్పుడు రెండవది చతురశ్రహస్తము కావలెను. మరల పరివర్తితము చేయుచు హస్త పాదములను ఆక్షిప్తము చేయవలెను (దగ్గరగా లాగవలెను). అప్పుడు రెండవ హస్తము విక్షిప్తము కావలెను. గమనాగమన ప్రధానమైన వాక్యార్థమం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 107]

22. అర్ధస్వస్తికము- రెండు పాదములను స్వస్తికముగానుంచి, కుడిచేతితో కరిహస్తమును ప్రదర్శించి, ఎడమచేతిని ఱొమ్ముమీద నుంచవలెను. [ఇచ్చట కరి హస్తమనుటకు బదులుగా 'కటిహస్త' మని కొందరు చదువుదురు. అర్ధచంద్ర హస్తము కటిమీద నుండవలెనని దీని అర్థము. ఎడమచేయి కటకాముఖహస్తము కావలెను. ఈ కరణము అభినయహస్త రహితము. అభినవభారతి - పుట 108]

23. అంచితము- అర్ధస్వస్తికమందలి కరిహస్తముతో వ్యావృత్త-పరివర్తములను కావించి, పిమ్మట ముక్కుకొనమీద వంచవలెను. [ముక్కుమీద అలపల్లవ హస్తముగా వంచబడవలెను. సంముఖీన-ఆత్మవిషయ-స్వాతిశయ-కౌతుక-ఆనంద ప్రధానములగు వాక్యాభినయములం దుపయుక్తమగును. అభినవభారతి-పుట 108]

24. భుజంగత్రాసితము- కుంచిత పాదమును పైకెత్తి, ఊరువును త్రిప్పవలెను. మోకాలిని, అట్లే నడుమునుకూడ త్రిప్పవలెను. [ఇది రజ్జుసర్పభ్రాంతి యందలి త్రాసమును నిరూపించుటయం దుపయుక్తము. ఇందొక హస్తము కటకాముఖమును, రెండవది దోలాహస్తమును కావలెను. నృత్త మనాదిసిద్ధమని ఇది నిరూపించుచున్నది. భుజంగత్రాసితచారియును ఇట్టిదే. కరణతుల్యములైన పేర్లుగల చారులన్నింటను ఇదేవిధమని తెలియవలెను. అభినవభారతి - పుట 109]

25. ఊర్ధ్వజానువు- కుంచితపాదమును పైకెత్తి, మోకాలిని స్తనసమముగా నుంచవలెను. హస్తములు ప్రయోగము ననుసరించి ఉండవలెను. [ఎత్తిన మోకాలి మీదుగానున్న హస్తము అలపల్లవము లేదా అరాలము కావలెను. రెండవది కటకాముఖ హస్తమై హృదయమునకు దగ్గరగా నుండవలెను. అభినవభారతి - పుట 109]

26. నికుంచితము- పాదమును వృశ్చికకరణమునందువలె చేసి, ఎడమ చేతిని ఆ ప్రక్కయందే వంచి, కుడిచేతిని ముక్కుకొనమీద ఉంచవలెను. [ఇచ్చట రెండును అరాల హస్తములే కావలెను. ఎడమచేయి తలకు ప్రక్కగా నుండవలెను.






















19. కటీసమము 20. ఆక్షిప్తరేచితము 21. విక్షిప్తాక్షిప్తకము 22. అర్ధస్వస్తికము 23. అంచితము 24. భుజంగత్రాసితము 25. ఊర్ధ్వజానువు 26. నికుంచితము 27. మత్తల్లి.

ఆకాశగమనోన్ముఖ-వితర్క-ప్రార్థనాది ప్రధాన వాక్యార్థాభినయమం దీ కరణ ముపయుక్తము. అభినవభారతి - పుట 109]

27. మత్తల్లి- రెండు పాదములను ఘూర్ణితములును ఉపసర్పితములును అగుచుండగా, హస్తములు పర్యాయములుగా ఉద్వేష్టితములును అపవిద్ధములును కావలెను. [ఘూర్ణనము=తిరుగుడువడుట, ఉపసర్పితము=సమీపించినది, ఉద్వేష్టితము=మధ్య ఖాళీ ఏర్పడునట్లు చేతులు పైకెత్తి కలుపబడినది లేదా చుట్టుకొనబడినది, అపవిద్ధము=కలిపి పిమ్మట తొలగింపబడినది. బహువచనమునందు చెప్పుటచే మరల మరల దీనిని ఆచరించవలెనని సూచితము. మత్తునికి ఇష్టము కాన ఇది మత్తల్లి అనబడినది. మత్తశేఖరకాదివిషయమున ఇది ప్రయుక్త మగును.]

28. అర్ధమత్తల్లి- స్ఖలితకరణము నందలి పాదములు వీడివడునట్లు చేసి ఎడమచేతితో రేచిత హస్తమును ప్రదర్శించవలెను. కుడిచేతిని కటియందుంచవలెను. [ఇది తరుణమద విషయమున ప్రయుక్తము. అభినవభారతి - పుట 110]

29. రేచితనికుట్టితము- కుడిచేయి రేచితమును, కుడిపాదము నికుట్టితమును (ఉద్ఘట్టితపాదమును) కావలెను. ఎడమచేయి దోలాహస్తము కావలెను. [ఇది ఉయ్యెలయందువలె గమనాగమనములను సూచించును. అభినవభారతి-పుట 110]

30. పాదాపవిద్ధకము- కటకాముఖ హస్తములను, అరచేతులు వెలికిలగా నుండునట్లు, బొడ్డుమీద ఉంచవలెను. పాదములచే క్రమముగా సూచీవిద్ధ - అపక్రాంత చారులను కావించవలెను.

31. వలితము- చేతిని ఆవిద్ధముచేసి, సూచీపాదమును ప్రదర్శించి, త్రికమును వివర్తితము చేయవలెను. [ఆవిద్ధముచేయుట=సూచీముఖ మనెడి నృత్తహస్తమిచ్చుట సూచితము. భ్రమరీచారిచే త్రికమును త్రిప్పవలెను. 'త్రిక' మనెడి పదమును భరతుడు నిర్వచింపలేదు. వెన్నెముక క్రిందిభాగము అనగా తొడల యెముకలు రెండును, వెన్నెముకయును కలియుచోటు త్రిక మనబడునని అమరకోశ నిర్వచనము. త్రికవలనము వలన ఇది 'వలిత' మనబడినది.]

32. ఘూర్ణితము- కుడిచేతితో వలితమనెడి నృత్తహస్తమును ప్రదర్శించి, గుండ్రముగా త్రిప్పి, ఎడమచేతితో దోలాహస్తమును ప్రదర్శించి, పాదములను స్వస్తికమునుండి విడివడునట్లు చేయవలెను.

33. లలితము- ఎడమ చేతితో కరిహస్తమును ప్రదర్శించి, కుడిచేతిని వివర్తము చేయవలెను. పాదములను హస్తముల ననుసరించి మరల మరల పర్యాయముగా కుట్టిత మొనర్చుచుండవలెను. [ఇది సవిలాసనృత్త విషయము.]

34. దండపక్షము- ఊర్ధ్వజానుచారి నొనర్చి, లతాహస్తమును దాని మీదుగా ఉంచవలెను. అట్లే రెండవపైపున కూడ చేయవలెను.

35. భుజంగత్రస్తరేచితము- భుజంగత్రాసితచారి నొనర్చి, రెండు హస్తములను రేచితములనుకావించి ఎడమప్రక్కయందుంచవలెను.












28. అర్ధమత్తల్లి 29. రేచితనికుట్టితము 30. పాదాపవిద్ధకము 31. వలితము 32. ఘూర్ణితము 33. లలితము 34. దండపక్షము 35. భుజంగత్రస్తరేచితము 36. నూపురము.

36. నూపురము- భ్రమరీ చారిచే త్రికమును త్రిప్పి, చేతులతో వరుసగా లతా-రేచిత హస్తములను ప్రదర్శించి, పాదముచే నూపుర పాదికచారిని కావించవలెను. [నూపురపాదికచారిని ఏపాదము ప్రదర్శించునో, ఆ హస్తమే రేచితము కావలెను. అభినవభారతి - పుట 113]

37. వైశాఖరేచితము- హస్తములును, పాదములును, కటియును, గ్రీవమును రేచితములు కాగా శరీరమంతయును వైశాఖస్థానమం దుండవలెను. [అభివాహనమందిది ఉపయుక్తము. చతుర్విధ రేచకములును ఇందు చెప్పబడినవి. గ్రీవా-కర-కటీ-పాదములను వేర్వేరుగా భ్రమింపజేయుట (ఆడించుట) రేచిత మనబడునని రాహులకుడు నిర్వచించెను. అభినవభారతి - పుట 113]

38. భ్రమరకము- స్వస్తికమునందలి పాదముచే ఆక్షిప్తచారిని కావించి, చేతులను ఉద్వేష్టితము చేసి త్రికమును వలితము చేయవలెను. [పాదము ఏకవచనమందును, హస్తములు ద్వివచనమందును ఉండుటచే పర్యాయ ప్రయోగము సూచితమైనది; లేదా ఉద్వేష్టిత శబ్దముచే 'ఉల్బణము' అనెడి నృత్తహస్తము సూచితము. ఉద్ధత పరిభ్రమణమందిది ఉపయుక్తము. అభినవభారతి - పుట 114]

39. చతురము- ఎడమచేతిని అంచితము (అలపల్లవ హస్తమును) కావించి, కుడిచేతితో చతురహస్తమును ప్రదర్శించి, కుడిపాదమును కుట్టితము చేయవలెను. [కుడిపాదము ఉద్ఘట్టితపాదము కావలెను. విదూషకుని సవిస్మయాభినయమందును, సూచాభినయాదు లందును ఇది ఉపయుక్తము. అభినవభారతి - పుట 114]

40. భుజంగాంచితకము- పాదములతో భుజంగత్రాసితచారిని, కుడిచేతితో రేచిత హస్తమును, ఎడమచేతితో లత యనెడి నృత్తహస్తమును ప్రదర్శించవలెను.

41. దండకరేచితము- హస్తపాదములను దండము (కఱ్ఱ) వలె పూర్తిగా విక్షిప్తముచేసి, పిమ్మట రేచితము చేయవలెను. [హస్తములు దండపక్షహస్తములు కాగా, పాదములు దండపాదచారియం దుండును. ఇది ప్రమోదనృత్తమునం దుపయుక్తము ; ఉద్ధత విషయములందును ఉపయుక్త మగునని కొందరందురు.]

42. వృశ్చికకుట్టితము- పాదమును వృశ్చికకరణమునందువలెనే చేసి, చేతులను అలపల్లవ హస్తములుగా మూపులమీద పర్యాయముగా నికుట్టితములను చేయవలెను. [విస్మయ-ఆకాశగమనేచ్ఛాది ప్రధాన వాక్యార్థాభినయమందు ఇది పయుక్తము. అభినవభారతి - పుట 115]

43. కటిభ్రాంతము- సూచీచారి నొనర్చి, కుడిపాదమును ప్రక్కగానుంచి టిరేచితమును కావించవలెను. [ఇది గతి పరిక్రమమం దుపయుక్తము.]

44. లతావృశ్చికము- కుడిపాదమును వెనుకకు వంచవలెను. అరచేయియు, ంగిన వ్రేళ్ళును పైకి ఉండునట్లుగా ఎడమచేతిని లతాహస్తముగా ప్రదర్శించవలెను. ఆకాశమునుండి భూమిమీద పడుటను నిరూపించుటయందు ఇది ఉపయుక్తము.]

45. ఛిన్నము- వైశాఖస్థానమందు నిలిచి, అలపల్లవ హస్తమును నడుము






















37. వైశాఖరేచితము 38. భ్రమరకము 39. చతురము 40. భుజంగాంచితకము 41. దండకరేచితము 42. వృశ్చికకుట్టితము 43. కటిభ్రాంతము 44. లతావృశ్చికము 45. ఛిన్నము.

మీదనుంచి, పర్యాయముగా ఛిన్నకటిని ప్రదర్శించవలెను. [అంగప్రతిసారణ-తాలభంజనాది విషయములం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 116]

46. వృశ్చికరేచితము- పాదమును వృశ్చికకరణమునందువలెనే చేసి, చేతులతో క్రమముగా స్వస్తిక-రేచిత-విప్రకీర్ణ హస్తములను ప్రదర్శించవలెను. [ఇది ఆకాశయానకమందు ప్రయుక్తమగును. అభినవభారతి - పుట 116]

47. వృశ్చికము- చేతులను మూపులమీదకును, పాదమును వెనుకకును వంచి, వెనుకభాగమునకు దూరముగా నుంచవలెను. [పాదము తేలుకొండెవలె నుండవలెను. ఆకాశగతియందును, ఐరావణాది విషయములందును ఇది ప్రయుక్తము. అభినవభారతి - పుట 117]

48. వ్యంసితము- ఆలీఢస్థానకమందు నిల్చి, ఱొమ్ముమీద రేచితహస్తములను ప్రదర్శించి, విప్రకీర్ణహస్తములను కావించి పైకి-క్రిందకును ఆడించవలెను. [ఇది విభ్రమాది ('హనుమదాది' అనుట బాగుండునని శ్రీ మా. రామకృష్ణకవిగారు సూచించినారు) పరిక్రమ నిరూపణమం దుపయుక్తము. అభినవభారతి-పుట 117]

49. పార్శ్వనికుట్టకము- స్వస్తికహస్తములను ఒక ప్రక్కగా కావించి, ఆవైపు పాదములను నికుట్టితము చేయవలెను. [అట్లే రెండవవైపునకూడ చేయవలెను. ప్రకాశన - సంవరణ - అభ్యాసప్రధాన వాక్యార్థాభినయమం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 118]

50. లలాటతిలకము- వృశ్చికపాదముయొక్క బొటనవ్రేలితో లలాటమందు తిలకమును రచింపవలెను. [ఇచ్చట కుడిపాదముయొక్క బొటనవ్రేలితో పాటు ఎడమచేతియొక్క బొటనవ్రేలును లలాటముమీదకు రావలెను. విద్యాధరగతియం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 118]

51. క్రాంతకము- పాదమును వెనుకకువంచి, పిమ్మట అతిక్రాంతచారి నొనర్చి, కరములను ఆక్షిప్తము చేయవలెను. [ఉద్ధత పరిక్రమమం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 118.]

52. కుంచితము- కుడిపాదమును వంచవలెను. కుడిచేతినికూడ వంచి, అరచేయి పైకి ఉండునట్లుగా ప్రక్కగా అలపల్లవ హస్తమును ప్రదర్శించవలెను. [ఇది నిర్భరానందపూర్ణ దేవతాభినయమందు ప్రయుక్తము. ఇందు కుడిమోకాలిని భూమిమీద ఆన్చి, ముందునకు సాగవలెను. అభినవభారతి - పుట 119]

53. చక్రమండలము- చేతులు నిలువుగా వ్రేలాడుచుండ, శరీరమును వంచి, ఆభ్యంతరాపవిద్ధమును (అడ్డితచారిని) కావించవలెను. [ఇది ఉద్ధత పరిక్రమ-అలంకరణాది విషయములందు ప్రయుక్తము. అభినవభారతి - పుట 119]

54. ఉరోమండలము- స్వస్తికమునుండి విడివడినపాదములతో అపవిద్ధ (బద్ధ) ఛారిని కావించి, ఉరోమండలి హస్తములను ప్రదర్శించవలెను.*

* [కాశీముద్రణమందు 60-114. శ్లో; బొంబాయి - బరోడా ముద్రణములందు 61 - 115 శ్లో.]






























46. వృశ్చికరేచితము 47. వృశ్చికము 48. వ్యంసితము 49. పార్శ్వనికుట్టకము 50. లలాటతిలకము 51. క్రాంతకము 52. కుంచితము 53. చక్రమండలము 54. ఉరోమండలము.

55. ఆక్షిప్తము - చేతులను, పాదములను వేగముగా ఆక్షిప్తము చేయవలెను. (వెనుకకు కాని, ప్రక్కలకు కాని వేగముగా ఆడించవలెను.) [ఇది విదూషక గతి నిరూపణమం దుపయుక్తము. అభినవభారతి - పుట 120.]

56. తలవిలాసితము- అడుగుభాగమును వ్రేళ్ళును పైకి ఉండునట్లుగా పాదమును ప్రక్కగా పైకి చాచవలెను. చేతిని పైకెత్తి పాదముయొక్క అడుగు భాగమును తాకునట్లుగా అరచేతిని వంచవలెను. [రెండవవైపునకూడ ఇట్లే చేయవలెను. ఇది సూత్రధారాది విషయమం దుపయుక్తము. అభినవభారతి - పుట 120]

57. అర్గళము- $2\frac{1}{2}$ తాలములమధ్యదూరము కలిగి పాదములు వెనుకగా ఉండవలెను. అట్లే $2\frac{1}{2}$ తాలములమధ్యదూరము కలిగి హస్తములు వానికి ముందు భాగమున ఉండవలెను. [ఇది అంగదప్రభృతుల పరిక్రమములను నిరూపించుటయం దుపయుక్తము. అభినవభారతి - పుట 120. శరీరమును వెలికిలగా వంచవలెనని సారాంశము.]

58. విక్షిప్తము- చేతిని పాదమును వెనుకకును, ప్రక్కలకును ఒకే విధముగా విక్షిప్తము చేయవలెను. [ఉద్ధత పరిక్రమ నిరూపణమం దుపయుక్తము. అభినవభారతి - పుట 121]

59. ఆవర్తము- కుంచిత పాదమును చాచి, మరల వేగముగా ఆవర్తము చేయవలెను (వెనుకకు లాగవలెను); చేతులు ప్రయోగానుసారముగా నుండవలెను. [హస్తముల ఆ (ఈషత్) వర్తనము కలదగుటచే ఇది ఆవర్తకరణమైనది. ఇందు చాషగతిచారిని ప్రయోగించవలెను. చేతులు ఉద్వేష్టిత-అపవేష్టితములు కాని, దోలాహస్తములు కాని కావలెను. సాగరికాపాశబంధాద్యవసరములందు నాయకుని ఉపసర్పణమును (సమీపించుటను) నిరూపించుటలో ఈ కరణ ముపయుక్తము. అభినవభారతి - పుట 121]

60. దోలా (=డోలా) పాదకము - కుంచిత పాదమును పైకెత్తి ఒక ప్రక్క నుండి ఇంకొక ప్రక్కకు ఊగించవలెను. హస్తములు ప్రయోగానుసారముగా అనగా దోలాహస్తములుగా నుండవలెను.

61. వివృత్తము (=నివృత్తము- ఇదికాశీపాఠము)- చేతులను, పాదములను ఆక్షిప్తము చేసి, భ్రమరీచారితో త్రికమును వివర్తముచేసి, పిమ్మట రేచితహస్తములను ప్రదర్శించవలెను. [ఇదియును, తరువాతిదైన వినివృత్తకరణమును ఉద్ధత పరిక్రమ నిరూపణమం దుపయుక్తము. అభినవభారతి - పుట 122]

62. వినివృత్తము- సూచీవిద్ధమును చేసి, త్రికమును వినివర్తనము చేసి (త్రిప్పి, మరల స్వస్థానమునకు మరలించి) రేచిత హస్తములను ప్రదర్శించవలెను. [సూచీవిద్ధ మనగా ఒక పాదముచే సూచీచారి నాచరించి, రెండవ పాదమును మడమమీద స్వస్తికాకారముగా నుంచుట. ప్రయోజనము పైదానివలెనే.]

63. పార్శ్వక్రాంతము-పార్శ్వక్రాంతచారిని ఆచరించి, పాదమును ముందు












55. ఆక్షిప్తము 56. తలవిలాసితము 57. అర్గళము 58. విక్షిప్తము 59 ఆవర్తము 60. దోలా పాదకము 61. వివృత్తము 62. వినివృత్తము 63. పార్శ్వక్రాంతము.

నకు పడవేయవలెను. హస్తములు ప్రయోగానుసారముగా నుండవలెను. [హస్తములును పాదప్రయోగానుసారముగా పర్యాయముగా ముందునకు చాచబడుచుండవలెను. రౌద్ర ప్రధానమైన భీమసేనాదుల పరిక్రమమం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 123]

64. నికుంభితము (= నిస్తంభితము) - పాదమును వెనుకకు వంచి, బొమ్మను బాగుగా పైకెత్తి, తిలకప్రదేశమందు హస్తము నుంచవలెను. చేతితో కటకాముఖహస్తమును ప్రదర్శించి నడిమి వ్రేలితో బొట్టు పెట్టుకొను చున్నట్లు చేయవలెను. [ఇది మహేశ్వరాభినయమునకు సంబంధించిన కరణము. పాదమును వెనుకకు కుంచితమొనర్చుటకుబదులు వృశ్చికపాదమును ప్రదర్శించవలెనని కొందరందురు. అభినవభారతి - పుట 123]

65. విద్యుద్భ్రాంతము- ఒక పాదమును ప్రక్కనుండి వెనుకకు వలితము చేయుచు తలను రాచుకొనునట్లుగా చాచి. అన్ని వైపులను గుండ్రముగా త్రిప్పవలెను. [ఉద్ధత పరిక్రమమం దిదిప్రయుక్తము. విద్యుద్భ్రాంతచారీ లక్షణమునుఇదియే.]

66. అతిక్రాంతము- అతిక్రాంతచారి నాచరించి, పాదమును ముందునకు చాచవలెను. చేతులు ప్రయోగానుసారముగా నుండవలెను. [గతిపరిక్రమమందిది ప్రయుక్తము. వినియోగము చెప్పబడని కరణములన్నియును గతి పరిక్రమమందు ప్రయుక్తములగునని తెలియవలెను. అభినవభారతి-పుట 124]

67. వివర్తితకము- ఒక హస్తమును ఒక పాదమును ఆక్షిప్తముచేసి, త్రికమును వివర్తితముకావించి, రెండవ చేతితో రేచితహస్తమును ప్రదర్శించవలెను.

68. గజక్రీడితకము- ఎడమచేతిని వంచి చెవిదగ్గరనుంచి, కుడిచేతితో లతా హస్తమును ప్రదర్శించి, దోలా పాదచారిని కావించవలెను. [ఇందు కరిహస్త ప్రయోగము సూచితమైనది. దీని ప్రయోజనము నామోచితమని తెలియవలెను.]

69. తలసంస్ఫోటితము- పాదమును వేగముగా పైకెత్తి, ముందునకు పడవేయవలెను. అరచేతులతో చప్పటులు కొట్టవలెను. [చప్పటులు కొట్టుట మొదలగువానియం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 125]

70. గరుడప్లుతకము- పాదమును వెనుకకుచాచి, చేతులతో లతా-రేచిత హస్తములను ప్రదర్శించి, తలను బాగుగా పైకెత్తవలెను. [పాదము వృశ్చిక పాదమువలె నుండును. దీని ప్రయోగము నామోచితమని తెలియవలెను.]

71. గండసూచి- సూచీపాదమును నతపార్శ్వమును ప్రదర్శించి, ఒక చేతిని బొమ్మమీద నుంచి, రెండవ చేతిని అలపల్లవ హస్తముగా చెక్కిలి కానించవలెను. [గండసంశ్రయ ప్రధాన భూషణాభినయమం దిది ప్రయుక్తము. కొందరు సూచీ పాదమే చెక్కిలి కానించవలె నందురు. కొందరు సూచీముఖ నృత్తహస్తమును చెక్కిలి కానించవలె నందురు. మరికొందరు సూచ్యాస్య (సూచీముఖ) మనెడి అభినయ హస్తమును వాంఛింతురు. అభినవభారతి - పుట 125]

72. పరివృత్తము- చేతులను పైకెత్తి, అపవేష్టితము చేసి, సూచీపాదమును






















64. నికుంభితము 65. విద్యుద్భ్రాంతము 66. అతిక్రాంతము 67. వివర్తితకము 68. గజక్రీడితకము 69. తలసంస్ఫోటితము 70. గరుడప్లుతకము 71. గండసూచి 72. పరివృత్తము.

వివర్తితము చేసి, భ్రమరీచారిచే త్రికమును త్రిప్పవలెను.

73. పార్శ్వజానువు- ఒక పాదము సమపాదము కావలెను. రెండవ పాదము తొడ ప్రక్కకు రావలెను. ముష్టిహస్తము ఱొమ్ముమీన నుండవలెను. [కటియందు అర్ధచంద్ర హస్తము ఉండవలెనని అభినవగుప్తుడు. కాని బొమ్మయం దట్లు లేదు. యుద్ధ-నియుద్ధ విషయములం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 126]

74. గృధ్రావలీనకము- ఒక పాదమును వెనుకకు చాచి, జానువును కొంచెము వంచి, చేతులను ప్రక్కలకు చాచవలెను. [గెద్దను నిరూపించుట మొద లగు వానియం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 126]

75. సన్నతము- ముందున కెగిరి, ముందుభాగమున పాదములను స్వస్తిక ముగా నొనర్చి, చేతులను సన్నతము (దోలాహస్తములను) చేయవలెను. [ముందున కెగురుటలో హరిణప్లుతచారి సూచితము. అధముని కీర్తించుటయందును, ఉపసర్ప ణమునందును ఇది ప్రయుక్తము. అభినవభారతి - పుట 127]

76. సూచి- కుంచిత పాదమును పైకెత్తి, ముందుభాగము భూమిని తాకుచున్నట్లుగా ముందునకు ఉంచవలెను. చేతులు ప్రయోగానుసారముగా నుండవలెను.

77. అర్ధసూచి- అలపద్మ (అలపల్లవ) హస్తమును తలపైనుంచి, కుడి పాదముతో సూచీచారిని ప్రదర్శించవలెను.

78. సూచీవిద్ధము-సూచీచారితో ఒక పాదమును రెండవ పాదముయొక్క మడమమీద నుంచవలెను. ఒకచేయి కటియందును, రెండవచేయి ఱొమ్ముమీదను ఉండవలెను. [కటియందలి చేయి పతాకవంచితకము లేదా అర్ధచంద్రము కావలెను. రెండవది కటకాముఖహస్తము కావలెను. చింతావిషయములను నిరూపించుటయం దిది ఉపయుక్తము. అభినవభారతి-పుట 128]

79. అపక్రాంతము- ఊరు వలనమును ప్రదర్శించి, పాదముతో అపక్రాంత చారిని కావించవలెను. చేతులు ప్రయోగానుసారముగా నుండవలెను.

80. మయూరలలితము- వృశ్చిక కరణమునందువలె పాదమునుచేసి, రేచితహస్తములను ప్రదర్శించి, భ్రమరీచారిచే త్రికమును త్రిప్పవలెను. [ఈ కరణము మయూర నృత్తానుకారి. అభినవభారతి-పుట 128]

81. సర్పితము- అంచిత పాదములను దూరముగా తొలగించి, పరివాహిత శిరమును రేచితహస్తములను ప్రదర్శించవలెను. [ఏపాదము దూరముగా తొలగింప
























73. పార్శ్వజానువు 74. గృధ్రావలీనకము 75. సన్నతము 76. సూచి 77. అర్ధసూచి 78. సూచీవిద్ధము 79. అపక్రాంతము 80. మయూరలలితము 81. సర్పితము.

బడునో ఆవైపే పరివాహిత శిరమును ప్రదర్శించవలెను. రేచితహస్తమును ప్రదర్శితము కావలెను. ఈ విధిని మరల రెండవవైపున కూడ అనుసరించవలెను. పాదకృత మదోపసర్పణ నిరూపణమందిది ఉపయుక్తము. అభినవభారతి-పుట 129]

82. దండపాదము- నూపుర పాదికచారి నొనర్చి, పిమ్మట దండపాదచారి నొనర్చి పాదమును చాచవలెను. చేతులను వేగముగా ఆవిద్ధము చేయవలెను (వంచవలెను). [సాటోప పరిక్రమాది నిరూపణమం దిది ఉపయుక్తము. అభినవభారతి-పుట 129]

83. హారిణప్లుతము- అతిక్రాంతచారిని కావించి, ముందున కెగిరి (ఒక గంతువేసి) పిమ్మట పాదమును నేలమీద పడవేయవలెను. జంఘనువంచి మీదికి ఎగురవేయవలెను. [ఇందు హారిణప్లుతచారి కర్తవ్యము. అభినవభారతి-పుట 129]

84. ప్రేంఖోలితకము- దోలా పాదచారిని కావించి ఒక గంతు వేసి, పిమ్మట పాదమును నేలమీద పడవేయవలెను. భ్రమరీచారిచే త్రికమును త్రిప్పవలెను.

85. నితంబము- భుజములను పైకిచాచి పిమ్మట చేతులవ్రేళ్ళను క్రిందికి ఉండునట్లుగా చేసి, బద్ధచారిని కావించవలెను.

86. స్థలితము- దోలాపాదచారిని కావింపగా, చేతులు తదనుసారు లగునట్లు రేచితములు కాని, ఘూర్ణితములు (తిరుగుడువడునవి) కాని కావలయును.

87. కరిహస్తము- ఎడమచేతిని బొమ్ముమీదనుంచి, కుడిచేతిని ప్రోద్వేష్టిత తలముగా నొనర్చి (మధ్య ఖాళీ ఏర్పడునట్లు అరచేయి బయట కుండునట్లు చేతిని పైకి వంచుట) చెవియొద్ద నుంచవలెను. అంచిత పాదమును ప్రదర్శించవలెను. [ఇది కరిహస్త మనెడి నృత్తహస్తముతో సమానము. అభినవభారతి - పుట 131]

88. ప్రసర్పితకము- ఒక చేయి రేచిత హస్తమును, రెండవచేయి లతా హస్తమును, పాదములు ప్రసర్పితతలములును కావలయును. [రేచితహస్తము వైపే పాదములను మెల్లమెల్లగా జరపవలెను. ఖేచర సంచారమును నిరూపించుట యందిది ప్రయుక్తము, అభినవభారతి - పుట 131]

89. సింహవిక్రీడితము- ఒక పాదముతో అలాతచారిని ముందుభాగమున కావించి, రెండవ పాదమును వేగముగా కదలించవలెను. చేతులు పాదానుసారులు కావలయును. [సింహకరఘాత సామ్యమువలన దీనికీ పేరు వచ్చెను. ఇది రౌద్రగతి నిరూపణమం దుపయుక్తము. అభినవభారతి - పుట 131]

90. సింహాకర్షితము- ఒక పాదమును వెనుకకు వంచి (వృశ్చిక పాదమును కావించి), చేతులను నికుంచితము చేయవలెను. ఈ విధముగా ఇంకొకసారి కూడ చేయవలెను. [కుడిచేయి పద్మకోశ హస్తమును, ఎడమచేయి ఊర్ణనాభ హస్తమును కావలయును. సింహాద్యభినయమందిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 131]






















82. దండపాదము 83. హారిణప్లుతము 84. ప్రేంఖోలితకము 85. నితంబము 86. స్థలితము 87. కరిహస్తము 88. ప్రసర్పితకము 89. సింహవిక్రీడితము 90. సింహాకర్షితము.

91. ఉద్వృత్తము- చేతిని, పాదమును, దేహమును అఙ్క్షిప్తము చేసి, ఉద్వృత్తచారిని కావించవలెను.

92, ఉపసృతకము- ఒక పాదమును ఆక్షిప్తము చేసి (ఆక్షిప్తచారిని కావించి) చేతులు ఆ పాదమును అనుసరింపగా, శరీరమును ఆనతము చేయవలెను (వంచవలెను).

93. తలసంఘట్టితము- దోలాపాదచారి నాచరించి, అరచేతులను ఒండొంటితో చేరచి, ఎడమచేతితో రేచితహస్తమును ప్రదర్శించవలెను. [అనగా వైష్ణవ స్థానమందు నిల్చి, కుడిచేతిని కటియందుంచి ఎడమచేతితో రేచితహస్తమును ప్రదర్శించవలెను. అనుకంపా ప్రధానమైన వాక్యార్థాభినయమం దుపయుక్తము. అభినవభారతి - పుట 133]

94. జనితము- ముష్టిహస్తమును ఱొమ్ముమీదనుంచి, రెండవ హస్తమును (లతాహస్తము) వ్రేలాడవేయవలెను. పాదము తలాగ్రసంస్థితము కావలెను (అనగా జనితాచారి నాచరించవలెను).

95. అవహిత్థకము- జనిత కరణమును ఆచరించి, చేతులవ్రేళ్లు ఒండొంటికి అభిముఖము లగునట్లుగాచేసి, మెల్లగా క్రిందకు జార్చవలెను. [ఒకచేతిని అరాల హస్తముగాచేసి లలాటమందును, రెండవ చేతిని అలపల్లవహస్తముగా వక్షము నందును ఉంచుటచే వ్రేళ్ళు ఒండొంటికి అభిముఖముగా నగును. గోపన ప్రధానమైన వాక్యార్థాభినయమం దిది ఉపయుక్తము. కొందరిచ్చట అవహిత్థహస్తమును వాంఛించుచు ఇది చింతా-దౌర్బల్య నిరూపణమ లం దుపయుక్తమగునందురు. అభినవభారతి-పుటలు 133-134]

96. నివేశము- చేతులను ఱొమ్ముమీదనుంచి, నిర్భుగ్నహృదయముతో మండలస్థానమందు నిలువవలెను. [గాత్రవిశ్రమణము వలన దీని కీపేరు వచ్చినది. అభినవభారతి-పుట 134]

97. ఏలకాక్రీడితము- అగ్రతల సంచర పాదములతో గెంతి క్రిందపడ వలెను. అప్పుడు శరీరమును వంచి, త్రిప్పవలెను. [ఏడకాక్రీడితచారి ఇందు కర్తవ్యము. అధమ ప్రకృతిగతి నిరూపణమం దిది ప్రయుక్తము. అభినవభారతి-పుట 134]

98. ఊరూద్వృత్తము- చేతిని ఆవృత్తముచేసి తొడ వెనుకభాగమందుంచ వలెను. జంఘనువంచి పైకెత్తవలెను. [ఊరూద్వృత్తచారితో కూడ వ్యావర్తిత మునుచేసి అరాల హస్తమును తొడమీదను, కటకాముఖహస్తమును వెనుక భాగమునందును ఉంచవలెను. ప్రణయకోప - ఈర్ష్యా - ప్రార్థనాది వాక్యార్థాభినయ నిరూపణమం దిది ప్రయుక్తము-అభినవభారతి-పుట 134]

99. మదస్ఖలితకము- చేతులను వ్రేలాడవేసి (లతాహస్తములను ప్రదర్శించి), పరివాహితశిరస్సుతో ఆవిద్ధచారిని కావించవలెను. [మద్యమదనిరూపణమందు ఇది ప్రయుక్తము. అభినవభారతి - పుట 135]






















91. ఉద్వృత్తము 92. ఉపసృతకము 93. తలసంఘట్టితము 94. జనితము 95. అవహిత్థకము
96. నివేశము 98, ఏడకాక్రీడితము 98. ఊరూద్వృత్తము 99. మదస్ఖలితకము.

100. విష్ణుక్రాంతము- ఒక పాదమును ముందునకు చాచి, గమనోన్ముఖ ముగా వంచి, రేచితహస్తములను ప్రదర్శించవలెను. [ఇది విష్ణుపరిక్రమణమునకు సంబంధించిన కరణము. అభినవభారతి - పుట 135]

101. సంభ్రాంతము- చేతిని ఆవర్తితము చేసి, తొడ వెనుక భాగము నందు వంచవలెను. ఊరువులను ఆవిద్ధము చేయవలెను. (అనగా ఆవిద్ధచారిని కావించవలెను). [ఇది సంభ్రాంత పరిక్రమణ నిరూపణమం దుపయుక్తము. అభినవ భారతి - పుట 135]

102. విష్కంభము- సూచీ హస్తము లందలి ఎడమచేతిని కుడిచేతితో అపవిద్ధ మొనర్చి, ఎడమ పాదమును నికుట్టితము చేసి, ఎడమచేతిని రొమ్ముమీద నుంచవలెను. [రెండవవైపు కూడ మరల అట్లే చేయవలెను. అభినవభారతి - పుట 136]

103. ఉద్ఘట్టితము- ఉద్ఘట్టితపాదములను ప్రదర్శించి, అరచేతులను ఒండొంటితో చరచి, నతపార్శ్వమును ప్రదర్శించవలెను. [ఇది ప్రమోద విషయ నిరూపణమందు ప్రయుక్తము. అభినవభారతి - పుట 136]

104. వృషభక్రీడితము- మొదట అలాతకచారి నాచరించి, పిమ్మట రేచిత హస్తములను ప్రదర్శించవలెను. తరువాత ఈ హస్తములను కుంచితములను, అంచితములను కావించవలెను. (ముడువబడినవి, దగ్గరగా చేర్పబడినవి కావలెను.)

105. లోలితము- రేచిత హస్తములను వంచి, పరిలోలితశిరమును ప్రద ర్శించి సహజముగా నుంచవలెను.

106. నాగాపసర్పితము- పాదములను స్వస్తికమునుండి విడివడజేసి; పరి వాహితశిరమును రేచితహస్తములను ప్రదర్శించవలెను. [కుటిలగతిచే ఇది నాగాపసర్పిత మనబడినది. తరుణమదమును నిరూపించుటయం దిది ప్రయుక్తము. అభినవభారతి - పుట 137]

107. శకటాస్యము- నిషణ్ణాంగముతో (సమస్థితియందున్న శరీరముతో) అగ్రతలసంచర పాదమును పైకిచాంచి, ఉద్వాహిత హృదయమును ప్రదర్శించ వలెను. [ఒక పాదము మోకాలితో సమానముగా నుండవలెను. ఆ చేయి కటకా ముఖ హస్తముగా రొమ్ముమీద ఉండవలెను. రెండవచేయి రెండవ పాదమును అనుసరించవలెను. ఇందు శకటాస్యచారి కర్తవ్యము. బాలక్రీడా - భాణికాదులను నిరూపించుటయందిది ఉపయుక్తము. అభినవభారతి-పుట 137]

108. గంగావతరణము- పాదములయొక్క అడుగుభాగములను వ్రేళ్ళను పైకిపెట్టి, త్రిపతాక హస్తములను క్రిందికిపెట్టి, శిరమును సన్నతముచేయవలెను. (చక్కగా వంచబడినది కావలెను.) [దీనినిగూర్చి పెక్కు అభిప్రాయములను అభినవ గుప్తుడు పేర్కొనెను. ఈ కరణము త్రివిక్రమపాద ప్రసరణ పూర్వకమైన గంగాదేవి యొక్క అవతరణమునకు సంబంధించినది. అభినవభారతి-పుట 138]






















100. విష్ణుక్రాంతము 101. సంభ్రాంతము 102. విష్కంభము 103. ఉద్ఘట్టితము
104. వృషభక్రీడితము 105. లోలితము 106. నాగాపసర్పితము 107. శకటాస్యము 108. గంగావతరణము

### కరణములేర్పడు విధము

వ్యాయామ విషయమున (10 వ అధ్యా) చెప్పబడిన స్థానములకును, చారులకును సంబంధించిన పాదప్రచారములే కరణములకును వర్తించును. నృత్తమునకు సంబంధించినవిగా చెప్పబడిన నృత్తహస్తముల (9 వ అధ్యా.) ప్రయోగము ఈ కరణములందు అంతర్గతమై యుండును. కరణమునందు సాధారణముగా ఎడమ చేయి రొమ్ముమీదనుండును; కుడిచేయి పాదమును అనుసరించి యుండును. చారులు, నృత్తహస్తములు అనునవి కరణములకు మాతృకలని తెలియవలెను. వీని వివిధ భేదములవలన కరణము లేర్పడుచున్నవి.[18]

నూట ఎనిమిది కరణములను పైన వివరించియున్నాను*.

### అంగహార లక్షణములు

ఇంక అంగహారముల లక్షణములను వరుసగా వివరింతును—

1. స్థిరహస్తము- రెండు హస్తములను చాచి, పైకెత్తి సమపాదమును ప్రయోగించవలెను. వ్యంసితకరణ మందలి దక్షిణ హస్తమును పైకి చాచవలెను. పిమ్మట ప్రత్యాలీఢస్థానమును గ్రహించి నికుట్టక కరణమును ప్రయోగించవలెను. తరువాత క్రమముగా ఊరూద్వృత్త-ఆక్షిప్త-స్వస్తిక-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. ఈ అంగహారము హరునకు ప్రీతిపాత్రమైనది. [ఇందు మొదట 'లీన' కరణ ముద్దిష్టమైనది. సమపాద మనగా 'సమనఖ' కరణము. విప్రకీర్ణములైన రెండు కరములను పైకెత్తి ఉంచవలెను. వ్యంసితకరణ మందలి ఆలీఢస్థానమునుండి పరివర్తనము చేసి ప్రత్యాలీఢస్థానమును గ్రహించవలెను. తరువాత వరుసగా ఆ యా కరణములను ప్రయోగించవలెను. ఇట్లు కరణముల సమ్యక్సంయోజనమువలన అంగహారము లేర్పడునని తెలియవలెను. అనగా ఈ కరణములు పూసలవలె విడివిడిగా ఉన్నను అవి వరుసగా ప్రయోగింప బడునప్పుడు ఏకసూత్రత ఏర్పడును. అట్టి ఏకబుద్ధి కలుగుటలో రేచకములు సాహాయ్యపడును. "ఈ కరణముల అనుసంధానము యోగమువంటి దగుటచే ఇది హరునకు ప్రీతి నాపాదించుచున్న"దని అందురు. ఏక భావమున కరణము లిట్లు ప్రయుక్తములైనను వాని ప్రయోగమువలన నిర్దిష్టార్థము లేవియును సూచితములు కావు. మొత్తముపై మహావాక్యార్థమునకు అవి శోభాసంపాదకములగును. కావుననే

18. ఈ పేరాయందలి విషయములు కాశీముద్రణమునందు లేవు.

*[కాశీముద్రణమునందు 115-169 శ్లో, బొంబాయి ముద్రణమునందు 114-173 శ్లో, బరోడా ముద్రణమునందు 115-173 శ్లో.]



వాని ప్రయోజనము అదృష్ట రూపమని చెప్పబడినది. అభినవభారతి - 1 వ సం- పుటలు 138-140]

2. పర్యస్తకము- మొదట తలపుష్పపుట-అపవిద్ధ కరణములను, తరువాత నికుట్టకకరణ సంయుక్తమైన వర్తితకరణమును ప్రయోగించవలెను. పిమ్మట ఊరూద్వృత్త-ఆక్షిప్త-ఉరోమండల-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను. ఈ అంగహారము హారోద్భవము. [ఇందు మొత్తము పది కరణములు ప్రయుక్తములగును. "రెండు హస్తములను చాచి......ప్రత్యాలీఢ స్థానమును గ్రహించి" - అను పై స్థిరహస్త లక్షణమును సర్వాంగహార సామాన్య లక్షణముగా కొందరు గ్రహింతురు. పెక్కు ఇతర అంగహారముల నిర్వచన ప్రారంభములందు ఇట్టిది చెప్పబడక పోవుటయే వారు పై విధముగా ఊహించుటకు కారణము. ప్రతి అంగహారమునకును ఒక్కొక్క విధిని ఊహించుకొనవలయునని మరికొందరందురు. అభినవభారతి - పుట 140]

3. సూచీవిద్ధము- అలపల్లవసూచిని ప్రయోగించి, పిమ్మట విక్షిప్త-ఆవర్తిత-నికుట్టక-ఊరూద్వృత్త-ఆక్షిప్త-ఉరోమండల-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను క్రమముగా ప్రయోగించవలెను. [అలపల్లవసూచి=అలపల్లవ హస్తముచే ఉపలక్షిత మగు అర్ధసూచీ కరణము. నికుట్టకము మున్నగు 6 కరణములును స్థిరహస్తమందలివే. అభినవభారతి-పుట 141]

4. అపవిద్ధము- అపవిద్ధ-సూచీవిద్ధకరణములను ప్రయోగించి, ఉద్వేష్టితమైన హస్తముతో త్రికమును పరివర్తన మొనర్చి, ఉరోమండలక హస్తములను పిమ్మట కటిచ్ఛిన్న కరణమును ప్రయోగించవలెను. [ఉద్వేష్టితమైన హస్తముతో అనగా ఉద్వేష్టిత కరణముచే బద్ధచారిచే త్రికమును వలితము చేయవలెను. ఉరోమండలక హస్తములచే ఉరోమండల కరణము ఉపలక్షితమైనది. "పిమ్మట కటిచ్ఛిన్న కరణమును ప్రయోగించినచో అది అపవిద్ధ మనబడును; దీనిని ప్రయోక్తలే గ్రహింపగలరు"-అని మూలమందు కలదు. ప్రయోక్తలను పదమును అభినవగుప్తుడు ఈ క్రిందివిధముగా వ్యాఖ్యానించెను—ప్రయోగ కుశలులు ప్రయోక్తలనబడుదురు. మంచి పండితులైన వారుకూడ స్వయముగా ఈ అంగగతిని తెలిసికొనజాలరనియు, శిరో-భ్రూ-నేత్రాది కర్మసహితమైన ఈ కరణముల యోజనయును అందలి భాగములును స్వరూపతత్త్వ విదులైన ప్రయోక్తలకు మాత్రమే తెలియుననియు, ఇతరులకు ఉపదేశించినను వారు ప్రయోగించలేరనియు, వీనిని నిరూపించుటకు శక్యము కాదనియు తెలియవలెను. గీత-వాద్య-లయ-యతి-వాక్యార్థభేదములచే వీని యోజన వివిధమై అనంతముగా నుండును. సుశిక్షితుడైన లక్షణకారుడుకూడ వాక్యములకు

ప్రతిపదమునకును లక్షణమునుచేయ సమర్థుడుకాడు. కావున 'దీని తరువాత దీనిని ప్రయోగించవలెను' అని తనలోతాను బాగుగా ఆలోచించుకొని తరువాత శాస్త్రమును రచింపవలెను. అభినవభారతి-పుట 142.]

5. ఆక్షిప్తకము- నూపుర-విక్షిప్త-అలాతక-ఆక్షిప్తక-ఉరోమండలక-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను క్రమముగా ప్రయోగించవలెను. [ఈ నిర్వచనము యొక్క రెండవపాదమందు 'పునరాక్షిప్తకం' అని కలదు. 'పునః (మరల)' అని ఎచ్చట వచ్చునో అచ్చట రెండేసిసార్లు ప్రయోగించవలె నని కొందరందురు. ఆక్షిప్తకము మున్నగు 5 కరణములును పర్యస్తక మందలివే. అభినవభారతి - పుట 143]

6. ఉద్ఘట్టితము- దక్షిణపార్శ్వమందు హస్తమును ఉద్వేష్టితమును అపవిద్ధమును చేయుచు పాదమును నికుట్టితము చేయవలెను. అట్లే వామపార్శ్వమందుకూడ చేయవలెను. పిమ్మట ఉరోమండలక-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను. [మొదటి వాక్యముచే నికుట్టక కరణము సూచితమైనది. ఉరోమండలకము మున్నగు 4 కరణములును పర్యస్తక మందలివే. అభినవభారతి-పుట 143]

7. విష్కంభము- హస్తము లొకదాని తరువాత ఇంకొకటి ఉద్వేష్టితము లగుచుండగా పాదములు నికుట్టితములు కావలెను. పిమ్మట హస్తపాదములు కుంచితములును అంచితములును కాగా ఊరూద్వృత్తకరణమును ప్రయోగించవలెను. తరువాత చతురశ్ర హస్తమును ప్రయోగించి పాదమును నికుట్టితము చేయవలెను. పిమ్మట భుజంగత్రాసిత కరణమును ప్రయోగించి హస్తమును మరల ఉద్వేష్టితము చేయవలెను. అప్పుడే భ్రమరకముచే త్రికమును పరిచ్ఛిన్నముచేసి, పిమ్మట కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [ఇందలి మొదటి వాక్యమునందు నికుట్టక కరణము చెప్పబడినది. రెండవ వాక్యమందు ఊరూద్వృత్తమే కాక నికుంచిత, అంచిత కరణములును చెప్పబడినవి. 3 వ వాక్యమందు అర్ధనికుట్టక కరణము సూచితమైనది. భుజంగత్రాసిత కరణమును ప్రయోగించునప్పుడే భ్రమరక కరణముచే ఛిన్నత్రికము నొనర్పవలెను. కటిమధ్యవలనము 'ఛిన్న' మనబడును. అభినవభారతి - పుటలు 143-144]

8. అపరాజితము- విక్షిప్తమును ఆక్షిప్తమును అగుచున్న హస్తములతో దండపాద కరణమును ప్రయోగించి, పిమ్మట వ్యంసిత కరణము నొనర్చుచు వామ హస్త-పాదములను చాచవలెను. తరువాత నికుట్టక-అర్ధనికుట్టక-ఆక్షిప్తక-



ఉరోమండలక-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. (ఆక్షిప్తక-ఉరోమండలాదులు పర్యస్తకమందలివే)

9. విష్కంభాపసృతము- నికుట్టక-అర్ధనికుట్టక కరణములను భుజంగత్రస్తరేచితమును ప్రయోగించి, హస్తరేచితముతో పతాకహస్తమును నిర్దేశించి, వరుసగా ఆక్షిప్తక-ఉరోమండలక కరణములములను ప్రయోగించవలెను. తరువాత కటిచ్ఛిన్నకరణ సహితముగా లతాహస్తములను ప్రయోగించవలెను. [పతాక హస్తమును చెప్పుటచే భుజంగత్రస్తరేచితమును ఉభయపార్శ్వములందును ప్రయోగింపవలెను. అభినవభారతి - పుట 145]

10. మత్తాక్రీడ- త్రికమును చక్కగా వలిత మొనర్చి, నూపురకరణమును ప్రయోగించవలెను. తరువాత భుజంగత్రాసితకరణమును, దక్షిణపార్శ్వమందు వైశాఖరేచితకరణమును ప్రయోగించవలెను. తరువాత ఆక్షిప్తక-ఛిన్న-భ్రమరక (వామపార్శ్వమందు)-వ్యంసిత-ఉరోమండలక-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్నకరణము లను వరుసగా ప్రయోగించవలెను. ఈ అంగహారము శివునకు ప్రియము. [ఇందు మొత్తము 12 కరణములు కలవు. భ్రమరకకరణముచే త్రికమును వలితము చేయవలెను. అభినవభారతి - పుట 146]

11. స్వస్తికరేచితము- హస్త-పాదముల రేచితములతో వృశ్చికకరణమును ప్రయోగించి, మరల అట్లే ఇంకొకసారి చేయవలెను. పిమ్మట సవ్యాపసవ్య హస్తములతో క్రమముగా నికుట్టక కరణమును ప్రయోగించి, తరువాత కటిచ్ఛిన్న కరణముతో లతాహస్తములను ప్రయోగించవలెను. [హస్త-పాదముల రేచిత మనగా వైశాఖరేచితము. ఇందు 6 కరణము లున్నవి. అభినవభారతి - పుటలు 146-147]

12. పార్శ్వస్వస్తికము- మొదట ఒక పార్శ్వమునందు స్వస్తిక-అర్ధనికుట్టక కరణములను ప్రయోగించి, రెండవ పార్శ్వమందును మరల అట్లే చేయవలెను. తగువాత హస్తమును ఆవర్తముచేసి ఊరుపృష్ఠమునందు పడునట్లు చేయవలెను. పిమ్మట ఊరూద్వృత్త-ఆక్షిప్త-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్నకరణములను ప్రయోగించవలెను. [స్వస్తికమనగా దిక్స్వస్తికకరణ మని గ్రహించవలెను. తరువాతివాక్యమందు అపవిద్ధకరణము చెప్పబడినదని తెలియవలెను. అభినవభారతి - పుట 147]

13. వృశ్చికాపసృతము- వృశ్చికచరణమును లతాహస్తమును ప్రయోగించి ఆ హస్తమునే నాసాగ్రమందు బాగుగా నికుంచితమును చేయవలెను. తరువాత ఆ హస్తమునే ఉద్వేష్టిత మొనర్చి పరివర్తము చేయవలెను. క్రమముగా నితంబ-కరి

8

హస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [మొదటి వాక్యమందు వృశ్చికచరణ-లతాహస్తములచే లతావృశ్చిక కరణమును, పిమ్మట నికుంచితకరణమును చెప్పబడినవి. తరువాతి వాక్యమందు మత్తల్లికరణము సూచింపబడినది. కొందరు నితంబముయొక్క భ్రమరమును చెప్పుదురట. అభినవభారతి - పుట 147]

14. భ్రమరము- నూపురకరణమును ప్రయోగించి, పిమ్మట వరుసగా ఆక్షిప్తక-ఛిన్న-సూచీవిద్ధ-నితంబ-కరిహస్త-ఉరోమండలక-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను.

15. మత్తస్ఖలితకము- మత్తల్లికరణమును ప్రయోగించి, దక్షిణకరణమును ఆవర్తముచేసి, కపోలప్రదేశమందు బాగుగా నికుంచితమును చేయవలెను. పిమ్మట వరుసగా అపవిద్ధ-తలసంస్ఫోటిత-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. దక్షిణకరముచే ఆవర్తము చేయవలెననుటచే గండసూచీకరణమును, బాగుగా నికుంచితము చేయవలెననుటచే లీనకరణమును సూచితములు. అపవిద్ధ-తలసంస్ఫోటితకరణములు ఒకే వేగముతో ప్రయుక్తములు కావలెను. అభినవభారతి - పుటలు 148-149]

16. మదవిలసితము- బాగుగాచలించుచున్న దోలాహస్తములను స్వస్తికము నుండి విడివడిన పాదములను, అంచితములును వలితములును అయిన హస్తములను ప్రయోగించి, పిమ్మట వరుసగా తలసంఘట్టిత-నికుట్టక-ఊరూద్వృత్త-కరిహస్త-కటిచ్ఛిన్నకరణములను ప్రయోగించవలెను. [దోలాహస్తములచే మదస్ఖలిత కరణమును, పాదములచే మత్తల్లికరణమును సూచితములు. తలసంఘట్టితముచే తలసంస్ఫోటిత కరణమును గ్రహించవలెను. కొందరు మొదటి మూడింటిని మూడేసిసార్లు ప్రయోగించవలె నందురు. అప్పుడు 13 కరణము లగును. మరికొందరు మొత్తము కరణము లేడింటిని ముమ్మారు ప్రయోగించవలె నందురు. అప్పుడిందు 21 కరణములుండును. అభినవభారతి - పుట 149]

17. గతిమండలము- మండలస్థానకమందు నిలిచి, హస్తములను రేచితములను, పాదములను ఉద్ఘట్టితములనుకావించి, వరుసగా మత్తల్లి-ఆక్షిప్తక-ఉరోమండలక-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [మండలస్థానముచే మండలస్వస్తిక-నివేశకరణములును, హస్తరేచితములచే ఉన్మత్తకరణమును, పాదోద్ఘట్టనములచే ఉద్ఘట్టితకరణమును ఉద్దిష్టములైనవి. ఇందు మొత్తము 8 కరణము లున్నవి. అభినవభారతి - పుట 149]

18. పరిచ్ఛిన్నము- మొదట సమపాదమును పిమ్మట ఛిన్నకరణమును ప్రయోగించవలెను. తరువాత ఆవిద్ధపాదముతో భ్రమరకరణమును (వామపార్శ్వ



మందు), వామసూచిని, అతిక్రాంత-భుజంగత్రాసిత-కరిహస్త-కటిచ్ఛిన్నకరణములను క్రమముగా ప్రయోగించవలెను. [సమపాదము = సమనఖకరణము; ఆవిద్ధ పాదముతో = ఆవిద్ధ చారితో సంభ్రాంతకరణమును; వామసూచి = వామపాదముతో అర్ధసూచీకరణమును. ఈ అంగహారమునందు మొత్తము 9 కరణములుకలవు. అభినవభారతి - పుటలు 149-150]

19. పరివృత్తకరేచితము- స్వస్తికమునుండి విడివడినహస్తములను శిరస్సుపై నుంచి, పిమ్మట గాత్రమును వంచి దక్షిణహస్తముచే రేచిత మొనర్పవలెను. మరల గాత్రమును పైకెత్తి ఆ హస్తముతోనే రేచిత మొనర్చి లతాహస్తములతో వృశ్చిక కరణమును ప్రయోగించవలెను. పిమ్మట వరుసగా రేచిత-కరిహస్త-భుజంగత్రాసిత-ఆక్షిప్తకకరణములను ప్రయోగించవలెను. అంతట స్వస్తికపాధము నొనర్చి, తరువాత పరాఙ్ముఖవిధిచే దీని నంతటిని అధికముగా ఇట్లే ఆచరించి, పిమ్మట కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [శిరస్సుపై నుంచి .... అనుటచే నితంబకరణమును పిమ్మట స్వస్తికరేచితమును సూచితములైనవి. గాత్రమునువంచి.... అనుటచే విక్షిప్తాక్షిప్తక కరణమును, గాత్రమును పైకెత్తి అనుటచే.... లతావృశ్చికకరణమును సూచితములు. రేచితకరణ మనుటచే ఉన్మత్తకరణము చెప్పబడినది. స్వస్తికపాద మనుటచే పాదస్వస్తిక పర్యంతమును బద్ధచారి సూచితమై నితంబకరణము చెప్పబడినది. పరాఙ్ముఖ విధి అనగా అంగహారము లన్నింటియందును చివరి రెండు కరణములను విడిచి తక్కినవానిని నలుదిశలయందును ప్రయోగించి చివరి రెండింటిని మాత్రము అంతమున సమ్ముఖముగా ప్రయోగించవలెనని భరతుని ఆశయము. అభినవభారతి - పుటలు 150-151]

20. వైశాఖరేచితము- గాత్రముతోకూడ అపవిద్ధహస్తములచే రేచిత మొనర్చి, మరల అట్లే గాత్రమును పైకెత్తి రేచిత మొనర్చవలెను, పిమ్మట నూపురపాదము నొనర్చి భుజంగత్రాసిత-రేచిత-మండలస్వస్తిక కరణములను ప్రయోగించి బాహుశిరస్సులను నికుంచితముచేసి, వరుసగా ఊరూద్వృత్త-ఆక్షిప్తక-ఉరోమండల-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [ఇందలి మొదటి వాక్యమునందు వైశాఖరేచిత కరణము అంగద్వయముచే నొనర్పబడవలెనని సూచితము. నూపురపాద మనుటచే నూపుర కరణమును, రేచిత మనుటచే ఉన్మత్త కరణమును చెప్పబడినవి. బాహుశిరస్సుల ననుటచే నికుట్టక కరణము సూచితము. అభినవభారతి - పుటలు 151-152]

21. పరావృత్తము- దక్షిణాంగముచే జనిత కరణమును ప్రయోగించి, ఒక పాదమును చాచవలెను. అట్లే అలాతక కరణమును ప్రయోగించి త్రికమును

పరివర్తము చేయవలెను. పిమ్మట అంచిత వామహస్తమును కపోలప్రదేశమందు నికుట్టితముచేసి, కటిచ్ఛిన్న కరణమును ప్రయోగించవలెను. [ఒక పాదమును చాచవలెను...అనుటచే శకటాస్యకరణమును, త్రికమును పరివర్తము చేయవలెను అనుటచే భ్రమరక కరణమును గ్రహించవలెను. అంచిత వామహస్త మనుటచే కరిహస్త కరణము సూచితము. కపోల ప్రదేశమందు నికుట్టితముచేయుట ఇచ్చట విశేషముగా చెప్పబడినది. అభినవభారతి-పుట 152]

22. అలాతకము- స్వస్తిక-వ్యంసిత (దీనిని రెండుసార్లు చేయవలెను, ఇందు హస్తములు రేచితములు కావలెను)-అలాతక-ఊర్ధ్వజాను-నికుంచిత-అర్ధసూచీ-విక్షిప్త-ఉద్వృత్త-ఆక్షిప్తక-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను.

23. పార్శ్వచ్ఛేదము- హస్తములను వక్షమునందు నికుట్టితముచేసి ఊర్ధ్వజాను కరణమును ప్రయోగించవలెను. పిమ్మట ఆక్షిప్తక-స్వస్తిక కరణములను ప్రయోగించి త్రికమును పరివర్తము చేయవలెను. తరువాత ఉరోమండల-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను. [నికుట్టితమనుటచే వృశ్చికకుట్టిత కరణము సూచితము. అభినవభారతి-పుట 154]

24. విద్యుద్భ్రాంతము- మొదట వామపాదము నుపయోగించి అర్ధసూచీ కరణమును, మొదట దక్షిణపాదమును ఉపయోగించి విద్యుద్భ్రాంత కరణమును ప్రయోగించవలెను. పిమ్మట మొదట దక్షిణపాదము నుపయోగించి అర్ధసూచీ కరణమును, మొదట వామపాదము నుపయోగించి విద్యుద్భ్రాంత కరణమును ప్రయోగించవలెను. తరువాత ఛిన్న-అతిక్రాంత (దీనిని వామపార్శ్వమందు చేయవలెను)-లతావృశ్చిక-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను.

25. ఉద్వృత్తకము- నూపురపాదమును కావించి, రెండు చేతులును పార్శ్వములందు వ్రేలాడుచుండగా, వానిచే విక్షిప్తకరణమును ప్రయోగించవలెను. వానిచేతనే సూచిని ప్రయోగించి, త్రికమును పరివర్తముచేసి, లతావృశ్చిక-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [నూపురపాదమనుటచే నూపురకరణము సూచితము. 'చేతులు వ్రేలాడుచుండగా' అనుటచే భుజంగత్రాసిత-గృధ్రావలీనక కరణములు చెప్పబడినవి; వీని పిమ్మటనే విక్షిప్తకరణము ప్రయుక్తముకావలెను. తరువాత ఉద్వృత్తకరణము చెప్పబడినది. పిమ్మట త్రికపరివర్తమునకు బద్ధచారితో నితంబకరణమును ప్రయోగించవలెను. అభినవభారతి-పుటలు 155-156]

26. ఆలీఢము- వ్యంసితకరణమును ప్రయోగించి, హస్తములను బాహుశిరములను నికుట్టితములను చేయవలెను. వామపాదముచే నూపురకరణమును,



దక్షిణపాదముచే అలాతక-ఆక్షిప్తక కరణములను ప్రయోగించి, ఉరోమండలహస్తములను ప్రదర్శించి కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [హస్తములను...నికుట్టితము...అనుటచే నికుట్టక కరణమును, ఉరోమండల హస్తములనుటచే ఉరోమండలక కరణమును సూచితములు. అభినవభారతి-పుట 156]

27. రేచితము- హస్తముచే రేచితమొనర్చి, పార్శ్వమందు వంచి మరల ఆ హస్తముచేతనే రేచితమొనర్పవలెను. పిమ్మట గాత్రమునువంచి పైవిధముగానే రేచితమొనర్పవలెను, తరువాత రేచితకరణమును ప్రయోగించవలెను. పిమ్మట రేచిత-ఉరోమండలక-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [హస్తమును రేచితమొనర్పవలెననుటచే హస్తరేచితములు గల కరణము లన్నియును ఇచ్చట ప్రయుక్తములు కావలెనని గ్రహించవలెను. అంతమందు రేచితమను కరణమును ప్రయోగించవలెను. వీనినెల్ల స్వబుద్ధితో జాగ్రత్తగా ఆలోచించి సుశ్లిష్టములగు నట్లుగా ప్రయోగించవలెను. ఇట్టిది విచిత్ర భేదసంకీర్ణమైన అంగహారము. హస్తరేచితములు కల కరణముల నన్నిటిని అభినవగుప్తుడు పేర్కొనెను. అభినవభారతి-పుటలు 156-158]

28. ఆచ్ఛురితము- నూపురకరణమును ప్రయోగించి, త్రికమును పరివర్తము చేయవలెను. వ్యంసితకరణమును ప్రయోగించి మరల త్రికమును మాత్రమే పరివర్తము చేయవలెను. తరువాత వామపార్శ్వమందు అలాతక-సూచీకరణములను ప్రయోగించవలెను. పిమ్మట కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను ప్రయోగించవలెను. [త్రికపరివర్తమనుటచే భ్రమరకకరణము చెప్పబడినది. త్రికమును మాత్రమే అనుటచే నితంబకరణము సూచితము. అభినవభారతి-పుట 158]

29. ఆక్షిప్తరేచితము- హస్త-పాదములచే క్రమముగా రేచిత-స్వస్తికముల నొనర్చి, అట్లే మరల విడదీయవలెను. పిమ్మట రేచితములచేతనే హస్తపాదములను పైకెత్తవలెను. తరువాత ఊరూద్వృత్త-ఆక్షిప్తక-ఉరోమండలక-నితంబ-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను. [రేచిత-స్వస్తికముల కలయిక గల కరణములన్నియును ఇందు ప్రయుక్తములు కావలెనని తెలియవలెను. అభినవగుప్తుడు వానినెల్ల పేర్కొనెను. అభినవభారతి-పుట 158-160]

30. సంభ్రాంతము- విక్షిప్తకరణమును ప్రయోగించి, హస్త-పాదములు ముఖము ననుసరించునట్లు చేయవలెను. వామసూచితో వామహస్తమును విక్షిప్తము చేయవలెను. దక్షిణహస్తమును వక్షమునందుంచి, త్రికమును వలితము చేయవలెను. పిమ్మట నూపుర-ఆక్షిప్తక-అర్ధస్వస్తిక-నితంబ-కరిహస్త-ఉరోమండలక-కటిచ్ఛిన్న

కరణములను వరుసగా ప్రయోగించవలెను. [హస్త - పాదములు ముఖము ననుసరించవలె ననుటచే అంచిత-గండసూచీ-గంగావతరణ కరణములు చెప్పబడినవి. 'వామసూచి' ఇత్యాదులచే అర్ధసూచీ-దండపాద కరణములు సూచితములు. తరువాత చతుర-భ్రమరక కరణములు వరుసగా సూచితములు. అర్ధసూచియందు దక్షిణపాదము నుపయోగింతురు. కాని ఇచ్చట వామ పాదమునే ప్రయోగించవలెను. అభినవభారతి - పుట 160 - 161]

31. అపసర్పితము - అపక్రాంత కరణమును వ్యంసిత హస్తమును ప్రయోగించి, ఉద్వేష్టిత మొనర్చి పిమ్మట అర్ధసూచీ-విక్షిప్త-కటిచ్ఛిన్న-ఊరూద్వృత్త-ఆక్షిప్తక-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను. [వ్యంసిత హస్తమనుటచే వ్యంసిత కరణమందలి హస్తక్రియ మాత్రమే చెప్పబడినది. ఉద్వేష్టితముచే కరిహస్తము సూచితము. అభినవభారతి - పుట 161]

32. అర్ధనికుట్టకము - నూపుర పాదమునుకావించి, వేగముగా ఆక్షిప్తము చేసి, హస్తములు పాదమును అనుసరించుచుండగా త్రికమును పరివర్తముచేయవలెను. కర-పాదములను నికుట్టితముచేసి ఉరోమండలక-కరిహస్త-కటిచ్ఛిన్న కరణములను వరుసగా ప్రయోగించవలెను. [నూపురపాద మనుటచే నూపుర కరణము సూచితము. వేగముగా ఆక్షిప్తము చేయవలె ననుటచే వివృత్తకరణము చెప్పబడినది. కర-పాదములను నికుట్టితము చేయవలె ననుటచే ఆ వ్యాపారముకల నికుట్టిత-అర్ధనికుట్టితాది కరణములు సర్వమును గ్రహింపబడినవి. అభినవభారతి-పుట 162]

ముప్పదిరెండు అంగహారములను పైన వివరించితిని.*

### రేచకములు

ఇంక రేచకములను[19] వివరింతును. రేచకములు నాలుగు: మొదటిది పాదరేచకము, రెండవది కటిరేచకము, మూడవది కర లేదా హస్తరేచకము, నాలుగవది

*[కాశీముద్రణమునందు 170-239 శ్లో; బొంబాయి ముద్రణమునందు 174-248 శ్లో; బరోడా ముద్రణమునందు 174-247 శ్లో.]

19. పాదాదులను కదల్చుట రేచితము లేదా రేచకము అనబడును. అనగా పాదాదులు మొత్తముగా కదలవలెనని అర్థము. మునివ్రేళ్ళమీద లేదా మడమమీద నిలిచి కదల్చినంతమాత్రమున పాదరేచక మనబడదు; పాదము నంతటిని ఎత్తి ఏ విధముగా కదల్చినను అది పాదరేచక మగును. అట్లే తక్కిన మూడు అంగముల విషయమునను గ్రహించవలెను. ఈ రేచకములు కరణాంగహారములం దుపయుక్తము లగుటయే కాక ప్రత్యేక ప్రయోజనమును కూడ కలిగి ఉన్నవి. అందుచేతనే ఇవి వేరుగా చెప్పబడినవి. సుకుమారగీత-వాద్య ప్రధానములైన ప్రయోగములం దివి ఉపయుక్తము లగును.



కంఠరేచకము. చారీ-కరణాదులయందు కాని, తదితరములందు కాని అంగములలో ఏ ఒకదాని నేని స్వస్థానమునుండి కదుల్చుట, లేదా గుండ్రముగా త్రిప్పుట, లేదా పైకెత్తుట, లేదా స్వేచ్ఛగా చలింపజేయుట రేచకము (రేచితము) అనబడును.[20]

1. పాదరేచకము- తొట్రుపడుట, చలించుట అనునవి పాదరేచకమందలి క్రియలు. వివిధ పాదగతులతో ఒక పార్శ్వమునుండి మరియొక పార్శ్వమునకు వెడలుట పాదరేచకమనబడును.

2. కటిరేచకము- త్రికమును మీదికెత్తుట, కటిని గుండ్రముగా త్రిప్పుట, పిమ్మట వెనుకకు లాగుట[21] అనునవి కటిరేచకమందలి క్రియలు.

3. హస్తరేచకము- హస్తమును పైకెత్తుట, క్రింద పడవేయుట, విసరుట, త్రిప్పుట, ముందునకు చాచుట[22] అనునవి హస్తరేచకమందలి క్రియలు.

4. గ్రీవా(కంఠ)రేచకము- కంఠమును పైకెత్తుట, క్రిందికి వంచుట, ప్రక్కకు వంచుట, త్రిప్పుట[23] అనునవి గ్రీవారేచకమందలి క్రియలు.

### పిండీబంధములు

మృదంగ-భేరీ-పటహ-భాండ-డిండిమ-గోముఖ-పణవ-దర్దురాది సర్వాతోద్యములను మ్రోగుచుండగా రేచక-అంగహారములతో నృత్తమును చేయుచున్న శంకరుని, సుకుమారముగా నృత్తము చేయుచున్న పార్వతిని నంది-భద్రముఖాది గణములు కాంచి, అందేర్పడిన పిండీ బంధములను గుర్తించి, ఆయా బంధముల కనుగుణములగు పేర్లు పెట్టిరి.[24] ఈక్రింది పిండిబంధములు ఆయా దేవతల

20. ఇవి వరుసగా పృథగ్భావ-వలన-ఉద్వాహన-చలనము లనబడును.

21. ఈ మూడును రేచకక్రియలని తెలియవలెను. ఇవి ఉద్వర్తన-వలిత-అపసర్పితము లనబడును.

22. ఇవి ఉద్వర్తన-పరిక్షేప-విక్షేప-పరివర్తన-విసర్పణము లనబడును.

23. ఇవి ఉద్వాహన-సన్నమన-పార్శ్వసన్నతి-భ్రమణము లనబడును.

24. ఇచ్చట మూలమందలి శ్లోకము లీ క్రింది విధముగా నున్నవి —

"రేచకై రంగహారైశ్చ నృత్యంతం వీక్ష్య శంకరమ్ ॥ 249
సుకుమారప్రయోగేణ నృత్యంతీం చైవ పార్వతీమ్। మృదంగభేరీ పటహై ర్భాండడిండిమగోముఖైః॥ 250
పణవై ర్దర్దురై శ్చైవ సర్వాతోద్యైః ప్రవాదితైః। దక్షయజ్ఞే వినిహతే సంధ్యాకాలే మహేశ్వరః ॥ 251
నానాంగ హారైః ప్రానృత్య ల్లయతాలవశానుగైః। పిండీబంధాం స్తతోదృష్ట్వా నందిభద్రముఖా గణాః॥ 252
చక్రుస్తే నామ పిండీనాం బంధమాసాం సలక్షణమ్।" 253

పై ఎనిమిది శ్లోకపాదములలో 5, 6 పాదములను అనువాదమందు వదలివేసినాను. ఈ పాదములు రెండును ముందరి నాలుగు పాదములకును విరుద్ధముగా నున్నవి; వీని అర్థమీ క్రింది విధముగా నున్నది —" దక్షయజ్ఞము హతమైన నాటి సంధ్యాకాలమందు

యొక్క లేదా వారివారి వాహనాదులయొక్క ప్రతికృతులను సూచించుచు వారికి సంతోషమును కలిగించును. ఈశ్వరి లేదా వృషభపిండి ఈశ్వరునకు చిహ్నమై ఆయనకు సంతోషదాయిని అగును. అట్లే పట్టసిపిండి నందికిని, సింహవాహినిపిండి చండికకును, తార్క్ష్యపిండి విష్ణువునకును, పద్మపిండి బ్రహ్మకును, ఐరావతిపిండి ఇంద్రునకును, ఝషపిండి మన్మథునకును, శిఖిపిండి కుమారస్వామికిని, రూపపిండి లక్ష్మికిని, ధారాపిండి జాహ్నవికిని, పాశపిండి యమునకును, నదీపిండి వరుణునకును, యక్షీపిండి కుబేరునకును, హలపిండి బలరామునకును, సర్పపిండి నాగలోకవాసులకును, దక్షయజ్ఞ విమర్దని అనెడి మహాపిండి గణేశ్వరులకును, త్రిశూలాకృతికల రౌద్రపిండి అంధక ద్విషుడైన శివునకును చిహ్నములై వారివారికి సంతోషమును కలిగించును. ఇట్లే

---

వివిధాంగహారములతో లయతాల వశానుగముగా మహేశ్వరుడు నృత్తము చేసెను." ఈ వాక్యములను పై వాక్యములతో కలిపి చెప్పినచో దక్షయజ్ఞ ధ్వంసమైనంతనే శివుడు పార్వతితో నృత్తము చేసినాడను నర్థము వచ్చుచున్నది. ఇది అసంభవము. అందుచే ఏదేని ఒక భాగమును తీసివేయవలసి యున్నది. అభినవగుప్త ననుసరించి డా. ఘోష్, శ్రీ మాధవ శర్మగార్లు రెండును రెండు ప్రత్యేక సందర్భములను నర్థమును చెప్పినారు. శ్రీ కె. యమ్. వర్మగారీ రెండుభాగములును ప్రక్షిప్తములే అనినారు. అంతియేకాదు నాలుగవ అధ్యాయ మందలి చివరి భాగమంతయును తరువాతి కాలములో చేర్పబడినదనియే వారు తలంచిరి.

ఇరువురు ప్రయోక్తలు సమకాలమున, ఏకభావమున నృత్త మొనర్చుటచే 'పిండిబంధ' మేర్పడును. ఇందు ఇరువురే కాక ఇంకను అధికముగా ప్రయోక్త లుండవచ్చును. ఈ నృత్తము అనేక వాద్య సహితమై, తాల-లయానుసారియై, రేచకాంగహారములతో ప్రయుక్త మగును. ఇట్టి ప్రయోక్తలు కలిసి అంగహారములను ప్రయోగించునప్పుడు ఏర్పడు ఆకార విశేషము ఏ దేవతా ప్రకృతిని సూచించునో ఆ పేరుతో ఆ పిండీబంధ మును వ్యవహరించిరి. పిండిబంధ మనగా అంగహార ప్రయోగమం దేర్పడు ఆకార విశేష మని సారాంశము. ప్రయోగము చేసెడి స్థలము, హస్తపాదాద్యంగములు, ప్రయోక్తలు, సమవిషమాది ప్రయోగములు అను వీని కలయికయే 'పిండి' (సమూహము) అనబడును. ఇట్టి కలయికవలన సామాజిక హృదయములందు ఒక ఆకార విశేషము స్ఫురించును. అట్టి ఆకార విశేషమునే 'పిండీబంధ' మందురు. కరణాంగహారాదుల సమూహమునకును 'పిండి' అని పేరు. ఈ పిండీబంధములు ఆ యా దేవతల రూపమున కాని, ఆ యా దేవతల ధ్వజాదుల రూపమున కాని ఉండును.

సారాంశము : 1. ఇరువురు కాని, అంతకుమించి కాని ప్రయోక్తు లుండవలెను. 2. వీరు కరణాంగహారములను ఏకభావమున ప్రయోగింతురు. 3. అట్లు ఏకభావమున ప్రయుక్తమైన కరణాంగహారాదుల సమూహముచే త్రిశూలాది-ఆకార విశేషములు సూచితము లగును. 4. అట్లు సూచితములైన ఆకార విశేషములను బట్టి వానికి పేర్లు పెట్టబడినవి. [అభినవభారతి - 1 వ సం - పుటలు 167-169]



ఇతర దేవతల విషయమునను వారివారి ధ్వజాకృతులను పోలిన పిండిబంధములను ప్రయోగించవలెను.

నృత్తాంగములు : తాండవ నిర్వచనము

పై విధముగా శివుడు రేచక - అంగహార - పిండీ బంధములను సృష్టించి, వాని నెల్ల తండుమునికి ప్రసాదించెను. వానితో అతడు నృత్త ప్రయోగమును సృష్టించెను. దానినికాంచి సంతోషించినవాడై "గీతప్రయోగము నాశ్రయించి ఈ నృత్తమును ప్రవర్తింపజేయుము" అని శివుడు తండుమహర్షిని ఆదేశించెను. అంతట ఆమహర్షియు దీనికి గాన-వాద్యములను చక్కగా కూర్చి నృత్త ప్రయోగమును సృష్టించెను. ఇట్లు తండువుచే ప్రయుక్తమగుటవలన ఈ నృత్తము 'తాండవ' మన బడినది.

ఋషులప్రశ్న

కావ్యార్థసాక్షాత్కారము కొరకు నాట్యజ్ఞులు ఆంగికాద్యభినయ మొనర్చుచున్నారు. ఇంక నృత్త ప్రయోజన మెద్ది? దీని స్వభావ మెట్టిది? గీతకార్థములతో సంబంధింపక పోయినను, అర్థభావకము కాకపోయినను ఈ నృత్తము గీతముల యందును, ఆసారితములందును ఏల ప్రయుక్తమగుచున్నది?

నృత్తప్రయోజనము

భరతుని సమాధానము- నృత్తము అర్థమును ఏమాత్రమును అపేక్షింపని మాట నిజమే. కేవలము శోభను (రంజనమును) కలిగించుటకే నృత్తము ప్రవర్తిత మైనది. ప్రాయికముగా సర్వలోకమునకును సహజముగా నృత్తము ఇష్టము. అందు చేతనే నృత్తము మంగళప్రద మనబడినది. వివాహము, పుత్రజననము, ఆవాహము (భార్యతో కలిసి అల్లుడు మామగారి యింటికి వెళ్ళుట), ప్రమోదము, అభ్యుదయము మొదలగు సమయములందు వినోద కారణమగునట్లుగా ఈ నృత్తము ప్రవర్తిత మైనది. ఇది కేవలము వినోదకారణ మగుటచేతనే గీతకాదులందు సమ్యక్ నృత్త విభాగకములైన శుష్కాక్షరములు భూతసంఘములచే ప్రవర్తితములైనవి.[25]

---

25. గీతములందలి సాహిత్యాక్షరములకు బదులు 'ఝుంటుం' మున్నగు అర్థ రహితములగు అక్షరములను కూర్చి ప్రయోగించుట శుష్కాక్షరప్రయోగ మనబడును. ఈ శుష్కాక్షరములను దేవతలు తిరస్కరింపగా వారియందలి స్పర్ధచే దైత్యాదిభూత సంఘములు ఆదరించినవి. ఇవి శుద్ధనృత్తమునందు, ఆదిలో, విభాగ ప్రాపకముగా ప్రయుక్తము లగును. గీతకము లనగా మద్రకాదులు. 5 వ అధ్యాయమును చూడవలెను.

ప్రాయికముగా తాండవవిధి 'దేవస్తుతి' నాశ్రయించియుండును. దాని సుకుమార ప్రయోగము శృంగారరస సంభవమగుచున్నది.[26]

ఇంక తండు ప్రయుక్తమైన తాండవవిధిని వర్ధమానకము ననుసరించి వివరింతును.[27]

## ప్రథమాసారిత ప్రయోగము

ప్రయోగ సమయమున, అక్షరముల వృద్ధివలన కలల వృద్ధియు నర్తకుల వృద్ధియు జరుగునుగాన ఇది 'వర్ధమానక' మనబడినది. యథావిధిగా కుతప విన్యాసాదుల నొనర్చి (ప్రత్యాహారాదులను నిర్వర్తించి) ప్రయోక్తలు 'ఆసారిత' ప్రయోగమున కుపక్రమించవలెను.[28]

మొదట తంత్రీగాన సమన్వితముగా ఉపోహనమును నిర్వహించవలెను.[29] పిమ్మట భాండవాద్య సమన్వితముగా ఒక నర్తకి రంగమునందు ప్రవేశించవలెను.

---

26. నృత్తమందలి సుకుమారాది విభాగములు నాట్యశాస్త్రమందు చెప్పబడలేదనియు, పై పేరానుండి అధ్యాయాంతమువరకును గల భాగమంతయు ప్రక్షిప్తమేయనియు శ్రీ వర్మగారు అభిప్రాయపడినారు. నృత్త-నాట్య-నృత్తములు - పుటలు 85-87]

27. ఇంతకుముందు తాండవవిధి కరణ-అంగహారాత్మకముగా వివరింపబడినది. ఇప్పుడది గీత-తాల-అభినయ సమ్మిశ్రితముగా నిరూపింపబడును.

ఇప్పుడు చెప్పబోవునది అంతయును, నిజమునకు, పూర్వరంగమునకు (5 వ అధ్యాయమునకు) చెందియున్నది. శుద్ధపూర్వ రంగమును చిత్రపూర్వ రంగముగా నొనర్పునప్పు డీ విధి స్వీకృత మగును.

28. ప్రత్యాహారము మొదలు ఆసారితము వరకును గల తొమ్మిదియును పూర్వరంగాంగములు. ఇవి యవనికలోనే నిర్వర్తింపబడును. తొలి ఎనిమిదింటిని నిర్వర్తించిన పిమ్మట ఆసారిత ప్రయోగమున కుపక్రమించవలెనని సారాంశము.

ఈ ఆసారితము రెండు విధములు-యవనిక లోపల శుష్కాక్షర ప్రయోగమే జరుగును; ఇదియే ఉపోహనము. ఉపోహనము అయిన పిమ్మట యవనికను తొలగించి, నర్తకి రంగమునందు ప్రవేశించినప్పుడు సార్థక పదయుక్తమగు ఆసారిత ప్రయోగము జరుగును. శుద్ధపూర్వరంగమందు శుష్కాక్షరప్రయోగము అయినవెంటనే ఇంక బహిర్యవనికాంగ ప్రయోగ మారంభమగును. కాని చిత్రపూర్వ రంగమందు సార్థకమగు ఆసారిత ప్రయోగమును నృత్తమును ప్రయుక్తములు కావలెను. దీనివలననే శుద్ధపూర్వరంగము చిత్రపూర్వ రంగముగా మారును. 5 వ అధ్యాయమును చూడవలెను.

29. 'స్వరములు ఏ అంగమున సన్నిహితములై యుండునో అది 'ఉపోహన' మనబడును. ఉపోహన మనునది గీతాంగము. వస్తుగీతమును (అర్థసహితమైన గీతము) ప్రయోగించుటకు ముందు స్వర-కాల-నియమముకొరకు చేయబడెడి శుష్కాక్షర సమన్వితమగు గానము



ఈ భాండవాద్యము విశుద్ధకరణ జాతులందు ప్రయుక్తము కావలెను. అట్లు ప్ర
శించి, ఆనర్తకి వాద్యానుసారిణి అయిన గతిలో తదనుగుణమైన ఒక చారి
ప్రయోగించవలెను. పుష్పాంజలి ధారిణియై రంగమండపమును ప్రవేశించిన ఆ నర్
వైశాఖరేచిత కరణమును ప్రయోగించవలెను. పిమ్మట పుష్పాంజలిని విడిచి, రం
పీఠమును చుట్టివచ్చుచు రంగదేవతలకు ప్రణమిల్లి అభినయము జేయవలెను (గీతా
మును అభినయించవలెను). గీతమును అభినయించునప్పుడు వాద్యమును ప్రయో
గించరాదు. కాని, అంగహార ప్రయోగములందు అనగా శుద్ధనృత్తమునంద
భాండవాద్యమును తప్పక ప్రయోగించవలెను. సమమును, రక్తమును, విభక్తము
స్ఫుటమును శుద్ధ ప్రహారజమును, నృత్తాంగ గ్రాహియును అగునట్లుగా వాద్యజ్ఞు
తాండవమందు వాద్యమును ప్రయోగించవలెను.[30] ఇట్లు గీత-వాద్యములు నృత్తా
సారముగా ప్రయుక్తములైన పిమ్మట ఆ నర్తకి నిష్క్రమించవలెను.[31]

---

'ఉపోహన' మగునని సారాంశము. ఇందు వీణాది తంత్రీగత వాద్యములును, వేణువు
ప్రయుక్తములు కావలెను. ఘన-అవనద్ధ వాద్యము లిందుండరాదు. నర్తకీ ప్రవేశమం
గత్యనుగుణముగా భాండవాద్యము ప్రయుక్తము కావలెను.

30. ఇచ్చటి మూలశ్లోకము లీ క్రింది విధముగా నున్నవి :

యత్రాభినేయం గీతం స్యాత్తత్ర వాద్యం న యోజయేత్ ॥ 276
అంగహార ప్రయోగేతు భాండవాద్యం విధీయతే।
సమం రక్తం విభక్తం చ స్ఫుటం శుద్ధప్రహారజమ్ ॥ 277
నృత్తాంగ గ్రాహి వాద్యజ్ఞై ర్వాద్యం యోజ్యం తు తాండవే। 278

వాక్యాభినయము ప్రధానమైనప్పుడు తదాచ్ఛాదనకారియైన అవనద్ధ వాద్యమున
ప్రయోగించరాదనియు, కేవల నృత్తమందు ప్రయుక్తము కావచ్చుననియు గ్రహించవలెను
కావ్యమునందు చెప్పబడసిదానిని గీతముచే ప్రసాధించవలెను. గీతము ననుసరించి వాద్యమ
లుండును. తదనంతరమందు నృత్తము ప్రయోగింపబడుచుండును. ఈ గీత-వాద్య-నృ
ములు మూడును నాట్యమునకు అంగములు. ఇవి నాట్యమునకు ఆధిక్యమును చేకూర్చును
[అభినవభారతి - 1 వ సం - పుట 186]

31. నిష్క్రమించుట యనగా రంగమునుండి నిష్క్రమించుట అని అర్థము కాదు
అభినయమును విరమించి, ప్రక్కకు తొలగుట అని మాత్రమే అర్థము. తరువాత వచ్చు
ఇతర నర్తకుల విషయమున కూడ ఇట్లే గ్రహించవలెను.

ఇట్లు- 1. నర్తకి ఏకాకియై ప్రవేశించుట, 2. అభినయముచేయుట, 3. అంగ
-హారములను ప్రయోగించుట, 4. తొలగుట, 5. అంతవరకును నృత్తముచేయుట
6. వాద్య వైచిత్ర్యము అను ఆరును ప్రథమాసారితమందలి క్రియలు. [అభినవభారతి -
1 వ సం - పుట 188]

ఆసారితములకు సంబంధించిన నర్తకీ ప్రయోగ మీ క్రింది విధముగా నుండును :

### ఆసారితప్రయోగ సామాన్యలక్షణము

నాలుగు ఆసారితములందును నలుగురు నర్తకులు (స్త్రీలు) పై విధముగానే ఒకరి తరువాత ఇంకొకరు ప్రవేశించి యథాసంఖ్యముగా నాలుగు పిండీబంధములను నిబంధించవలెను ఈ పిండీబంధములను నిబంధింపకపూర్వము ఆ నర్తకులు పర్యస్తకమును (అభినయశూన్యమైన కేవల ఆంగిక విధిని=శుద్ధ నృత్తమును) ఒనర్పవలెను. పిండీబంధములు నిబంధింపబడిన పిమ్మట వారు నిష్క్రమించవలెను. పిండీబంధప్రయోగ సమయములో చిత్ర-ఓఘ-కరణాన్వితముగను, పర్యస్తక ప్రమాణ సంయుక్తముగను వాదకులు వాద్యములను ప్రయోగించవలెను.[32]*

### ద్వితీయాసారిత ప్రయోగము

మరల పూర్వమువలెనే ఉపోహనమును అధికముగా చేయవలెను. అంతియే కాక ఆసారితగానమును కూడ అధికముగా ప్రయోగించవలసియున్నది. ప్రథమాసారితమందు చెప్పిన విధముగానే ఇందు ఇంకొక నర్తకి ప్రవేశించి ద్వితీయాసారిత గీతముయొక్క అర్థమును అభినయించ వలెను. ఇదేవస్తువును (గీతకార్థమును) మరల అంగహారములచే ప్రదర్శించవలెను.[33] ఇట్లు ద్వితీయాసారితము సమాప్తము కాగా ఆ నర్తకి నిష్క్రమించును.

### తృతీయ-చతుర్థాసారితముల ప్రయోగము

తరువాత, వెనుకచెప్పిన విధముగానే[34] మూడవ నర్తకి ప్రవేశించి తృతీయాసారితమును, నాలుగవ నర్తకి ప్రవేశించి చతుర్థాసారితమును వేర్వేరుగా నిర్వర్తించవలెను.[35]

ఇట్లు, భాండవాద్యమును గానమును నాలుగు ఆసారితములందును ఆయా సందర్భములందు ప్రయోగించవలెను. ఈ ప్రయోగమందు ప్రథమ వస్తువును (గీతాంగమును) ఒకసారియును, ద్వితీయ వస్తువును రెండుసార్లును, తృతీయ వస్తువును మూడుసార్లును, చతుర్థ వస్తువును నాలుగుసార్లును ప్రయోగించవలెను.

### ఆసారితములు : పిండీబంధములు

ఆయా ఆసారితములందు ప్రయుక్తములగు పిండీబంధములు నాలుగింటిని వివరింతును[36]-1. పిండి, 2. శృంఖలిక, 3. లతాబంధము, 4. భేద్యము (ఇవి నాలుగు ఆసారితములందును వరుసగా ప్రయుక్తము లగును).

---

ప్రథమ నర్తకి ప్రథమాసారితమును సర్వమును నిర్వర్తించును. ద్వితీయ నర్తకి ద్వితీయాసారితమందు అభినయము చేయుచున్నప్పుడు ప్రథమ నర్తకి అంగహారములను ప్రదర్శించును. తృతీయ నర్తకి తృతీయాసారితమునందు అభినయము చేయుచున్నప్పుడు మొదటి ఇరువురును అంగహారములను ప్రయోగింతురు. చతుర్థ నర్తకి చతుర్థాసారితమునందు అభినయముచేయుచున్నప్పుడు తక్కిన ముగ్గురును అంగహారములను ప్రదర్శింతురు. అభినయమును కూడ అందరును కలిసి చేయవలెనని కొందరందురు. వీరు జాల శృంఖలికాది పిండీబంధ జాతములందు పరస్పర బాహుబంధ వైచిత్ర్య రచనలను కూడ వాంఛింతురు. [అభినవభారతి - 1 వ సం. పుట 192]

32. ఈ విధి అంతయును నాలుగు ఆసారితములకును సమానము. పై 31 వ అధస్సూచికను కూడ చూడవలెను. చిత్రపూర్వరంగమందు 'పరివర్తన' మనెడు బహిర్యవనికాంగము పూర్తి అయినవెంటనే ఈ నర్తకులు రంగమును ప్రవేశించి, నాందీపఠనానంతరము రంగమునుండి పూర్తిగా నిష్క్రమింతురు. శుద్ధపూర్వరంగమందు వీరి ప్రవేశముకాని, నృత్తాదులు కాని ఉండవు.

కలా భేదమును బట్టి ఆసారితము నాలుగువిధములు:- 1. కనిష్ఠాసారితము 17 కలలు; 2. అది ద్విగుణ లయాత్మకమైనచో లయాంతరమనబడును; 3. మధ్యమాసారితము.-- 33 కలలు ; 4. జ్యేష్ఠాసారితము - 65 కలలు. [అభినవభారతి - 1 వ సం - పుట 183].

*[కాశీ ముద్రణమునందు 240-278 శ్లో., బొంబాయిముద్రణమునందు 249-288 శ్లో., బరోడా ముద్రణమునందు 248-281 శ్లో.]



33. ప్రథమాసారితమును నిర్వహించి, నిలిచియున్న ప్రథమ నర్తకితో కలిసి ఈ రెండవ నర్తకి అంగహార ప్రయోగము చేయవలెను. ఈ అంగహార ప్రయోగమందు పిండీబంధములలో నొకటి అయిన 'శృంఖలిక' నిర్వర్తింపబడును.

ప్రథమాసారితమందలి అంగహార ప్రయోగమందు పిండీబంధములలో మొదటి భేదమైన 'పిండి' నిర్వర్తింపబడును.

35. తృతీయాసారితముయొక్క అంగహార ప్రయోగమందు మూడవ పిండీబంధ భేదమయిన 'లతాబంధము'ను ; చతుర్థాసారితముయొక్క అంగహార ప్రయోగమునందు నాలుగవ పిండీబంధ భేదమయిన 'భేద్యకము'ను నిర్వర్తింపబడవలెను.

34. ఉపోహనము, రంగప్రవేశము, రంగపరిక్రమము, దేవతాప్రణామము, అభినయము, అంగహారప్రయోగము, పిండీబంధస్ఫూర్తి అనునవి ఆసారితము లన్నింటియందును సమానములే.

36. ఈ పిండీబంధములందు నర్తకీప్రయోజ్యమగు పరస్పర సంబంధము (నర్తకులచే చేయబడు అభినయముల సంబంధముచే ఏర్పడు అన్యోన్య సంబంధము) ఉండును. ఆ సంబంధ మొకప్పుడు ఒకేనాళమందు కూడియున్న రెండు పద్మములవలె సజాతీయము కావచ్చును. మరియొకప్పుడు హంసవదనమందలి తామరతూటితోడిపద్మమువలె విజాతీయముగా నుండవచ్చును. [అభినవభారతి - 1 వ సం-పుట 191]

1. పిండి- పిండము (ముద్ద) వలె నుండును కాన ఇది 'పిండి' అనబడినది. ఇది కనిష్ఠాసారితమందు నిర్వర్తింపబడును.

2. శృంఖలిక- గుల్మము (పూలగుత్తి) శృంఖలిక అనబడును. ఇది లయాంతరాసారితమందు నిర్వర్తింపబడును.

3. లతాబంధము- జాలోపనద్ధము (వలవలె నుండునది) లతాబంధ మనబడును. ఇది మధ్యమాసారితమందు నిర్వర్తింపబడును.

4. భేద్యకము-నృత్తసహితమైనది భేద్యక మనబడును. ఇది చతుర్థాసారితమందు నిర్వర్తింపబడును.

ఈ పిండీ బంధములకు ఉత్పత్తి హేతువులు వివిధములుగా నుండును. 1. యంత్రము (ఆధారము అనగా స్థానభేదము), 2. భద్రాసనము (అంగభేదములు), 3. శిక్షాయోగము (కరణాంగహారముల అభ్యాసము)- ఈ సర్వప్రకారములచేతను పిండీ-శృంఖలికాది బంధములను ప్రయోక్తలు నిర్వర్తించవలెను.

పై విధముగా వర్ధమానకమందలి ప్రయోగమును నిర్వర్తించవలెను.

### గీతవిధి

ఇంక గీతములయు, ఛందకములయు విధిని వివరింతును. వస్తునిబద్ధములును, అంగకృతములును అగు గీతములను, నృత్త-వాద్యములందు వాని ప్రయోగమును వివరింతును. భాండవాద్యము లన్నియును మ్రోగుచుండగా, క్షేప (ప్రథమవస్త్వాదియందలి ఉపోహనము)-ప్రతిక్షేప (ద్వితీయ వస్త్వాదులందలి ప్రత్యుపోహనము)ములతో కూడిన తంత్రీగానము ప్రయుక్తమైన పిమ్మట, నర్తకి రంగమునందు అవతరించవలెను.[37] ఆ నర్తకి మొదట గీతమునందలి వస్తువునంతను అభినయించి, మరల దానిని నృత్తముచే ప్రదర్శించవలెను. పూర్వము ఆసారితవిధియందు చెప్పబడిన నృత్త-అభినయ-వాద్యముల విధానమే గీతముల వస్తుప్రయోగమునందును అనుసరించవలెను.

వస్తునిబద్ధగీతకములకు సంబంధించిన విధి పై విధముగా నుండును.

ఇంక అంగనిబద్ధములైన గీతముల లక్షణమును వివరింతును. వస్తువిషయకమైన ఏ విధి నృత్త-అభినయ-వాద్యముల విషయమున చెప్పబడినదో ఆ విధినే అంగనిబద్ధములైన ఛందకముల యందును అనుసరించవలెను. ఉపోహనముతో కూడిన ముఖ మనెడి అంగమునందు[38] వాద్యము వేర్వేరుగా వర్ణవిప్రకర్షముచే గుర్వక్షర

37. ఈ నర్తకీ-ఆవిర్భావము పూర్వము చెప్పబడిన నర్తకీ ప్రవేశమే.

38. ఆసారితమునందు ముఖ-ప్రతిముఖ-శరీర-సంహరణము లనెడి నాలుగు అంగములు కలవు.



కృతము లేదా అల్పాక్షరకృతము కావలసియుండును. ఒకవేళ గీతివశమున ఆ అంగము మరల మరల ఆవర్తితమైనచో ప్రథమావర్తమును అభినయించి, తక్కిన ఆవర్తములను నృత్తముతో కూర్చవలయును. ఈ అధిక ఆవర్తములందు వాద్యమును త్రిపాణి-త్రిలయాన్వితముగా[39] ప్రయోగించవలెను. అనగా లయ ననుసరించి వాదకులు వాద్యమును ప్రయోగించవలెను.

తత్త్వము, అనుగతము, ఓఘము అనునవి కరణమునకు సంబంధించినవి. స్థితలయ యందు తత్త్వమును, మధ్యలయ యందు అనుగతమును, ద్రుతలయ యందు అధికముగా ఓఘమును ప్రయోగించవలెను. ఇది వాద్యగతమైన విధి. ఛందకముల యందును, గీతకములయందును అంగములు ఆవృత్తములు కావలెను. నృత్త-అభినయ-వాద్యములందు నిత్యమును ఈ విధినే పాటించవలెను. వస్తునిబద్ధ గీతకములందు 'గ్రహము' (వాద్యముల ప్రారంభము) అంతమునం దుండవలెను. కాని అంగముల ఆవృత్తి జరిగినప్పుడు గ్రహము ఆదియందే జరుగవలెను.

గీతక-ఆసారిత-ఛందకములయందు పై విధానమును అనుసరించవలెను. ఈ నృత్తవిధి అంతయును దేవస్తుత్యాశ్రయమైనది. (అనగా పరమశివునకు ప్రీతిని కలిగించుటయే దీని ప్రయోజనము.)

### సుకుమారనృత్తము

ఇంక సుకుమార నృత్తమును వివరింతును. కామసముద్భవమును, శృంగార రససంభవమును అయిన సంలాపము 'సుకుమార' మనబడును.[40] ఇందేయే అవస్థలలో ప్రయోక్తలు నృత్తమును ప్రయోగించవలెనో ఆ విధి నంతను వివరింతును—

అంగ-వస్తునివృత్తు లందును (ఒక అభినయమును ప్రయోగించి వేరొక అభినయమును ఆరంభింపబోవునప్పుడును), వర్ణనివృత్తులందును (గీతక్రియలకు విస్తారమును ఆపాదించు స్థాయ్యాదివర్ణ నివృత్తులందును), అభ్యుదయ స్థానమునందును నృత్తమును ప్రయోగించవలెను.

దంపతుల మధ్య మదనాశ్రయమై ఏదేని వస్తువు ఏ కొంచెము కన్పట్టినను ప్రహర్షజనకములగు గుణ-వచనాదులచే జనించిన నృత్తము నచ్చట ప్రయోగించవలెను. [వాసకసజ్జా-అభిసారికా విషయకమైన నృత్త మిచ్చట చెప్పబడినది.]

39. సమపాణి-ఉపరిపాణి-అర్ధపాణి అను భేదములచే పాణి త్రివిధము. తాలమును అభివ్యంగ్యము చేయునది కాన ఇది 'పాణి' అనబడినది. ఛందస్సు-అక్షరములు-పదములు అను వీని సామ్యము 'లయ' అనబడును. ద్రుతాదిభేదములచే ఇదియును త్రివిధము. [అభినవభారతి - 1 వ సం - పుటలు 195-196]

40. శృంగారసంబంధి అయిన సంలాపమందు ఉపయుక్తమగు నృత్తము 'సుకుమార నృత్త' మగునని సారాంశము.

కాంతుడు సన్నిహితుడై యుండగా వసంతాది ఋతుకాలాద్యవలోకము లందు గీతకార్థ సంబద్ధమగు నృత్తమును ప్రయోగించవలెను. [ఇది స్వాధీన భర్తృకా విషయము].

నృత్తము నిషిద్ధమైన సందర్భములు

కావ్యమందలి నాయిక ఖండిత కాని, విప్రలబ్ధ కాని, కలహాంతరిత కాని అయి యున్నప్పుడు నృత్తమును ప్రయోగించరాదు.

ప్రియుడు సన్నిహితుడుగా లేనిచో తత్సమాగమోపాయమును గూర్చి సఖులతో పర్యాలోచనము చేయుచున్నప్పుడును, ప్రియుడు దేశాంతరగతుడైనప్పుడును నృత్తమును ప్రయోగించరాదు. [ఇందు క్రమముగా విరహోత్కంఠితా-ప్రోషితభర్తృకల విషయము చెప్పబడినది.]

ఋతుకాలాది దర్శనము దూతిచే వర్ణితమైనప్పుడు కలిగెడి ఔత్సుక్య-చింతాదులందు కూడ నృత్తమును ప్రయోగించరాదు (ఇదియును ఖండితనాయికా విషయమే). కాని, నాయిక ఎప్పుడు ప్రసాదము నొందునో అప్పటినుండియు తక్కిన భాగములందు నృత్తమును ప్రయోగించవలెను. దేవస్తుత్యాశ్రయమైన ఛందక సంబంధి యగు గీతాంగమునందు ఉద్ధతములైన విద్యుద్భ్రాంత, గరుడప్లుతకాది మాహేశ్వరాంగహారములచే నృత్తమును ప్రయోగించవలెను. ఇంక స్త్రీ-పురుషాశ్రయమును, శృంగార సంబద్ధమును అయిన గానమునందు తలపుష్పపుట-లీన-నితంబాది దేవీకృత లలితాంగహారములచే నృత్తమును ప్రయోగించవలెను.

నర్కుటక-ఖంజక-పరిగీతకము లనెడి చతుష్పదవృత్తములతో కూడిన ధ్రువా గానములందు భాండ-నృత్త విధి నిప్పుడు వివరింతును.

భాండవాద్యప్రయోగవిధి

ఖంజ-నర్కుట ధ్రువాగీతములలో ప్రథమ పాదాంతమున సన్నిపాత కలా గాన సమయమందు భాండవాద్యము నారంభించవలెను. ఛందోయుక్తమైన ధ్రువా గీతము సమపాదమును, సమాక్షరమును అయినప్పుడు ప్రథమ పాదావసానమునుండి ప్రదేశిని (చూపుడు వ్రేలు) తో భాండవాద్యమును మ్రోగించవలెను. ధ్రువాగీతము గానము చేయబడిన పిమ్మట దానిని అభినయించవలెను. తరువాత మరల ఆ ధ్రువను గానము చేయవలెను. అప్పుడు ప్రథమ పాదాంతమున మరల వెనుకటివలెనే భాండ వాద్యమును ప్రయోగించవలెను. మరియు, అంగ-వస్తు నివృత్తులందును, వర్ణాంతర నివృత్తులందును, ఉపస్థానములందును భాండవాద్యమును ప్రయోగించవలెను.



తంత్రీ-వాక్-కరణ కృతములగు ఆంతరమార్గములలో తాండవమునందు భాండ వాద్య సహితముగా సూచీచారిని ప్రయోగించవలెను.

మహేశ్వరుని చేష్టయగు ఈ తాండవమును చక్కగా ప్రయోగించునతడు సర్వ పాపవిశుద్ధాత్ముడై, శివలోకమును పొందును. ప్రయోగమును బట్టి తాండవ మిది పై విధముగా నుండును. నాట్యవేదవిధినిగూర్చి ఇంకేమి అధికముగా చెప్పవలెను ?*

చతుర్థాధ్యాయము సమాప్తము.

---

## విశేషాంశములు

### 1. అధ్యాయముల సమన్వయము

తాండవమనెడి ఈ నాలుగవ అధ్యాయము 11 వ అధ్యాయము తరువాతనో, 12 వ అధ్యాయము తరువాతనో ఉండుట సమంజసము. కరణ-అంగహారములను నిర్వచించుటలో శిరఃకర్మాదులు, హస్తములు, చారులు, స్థానములు, మండలములు, గతిప్రచారములు మొదలగునవి పేర్కొనబడెను. వీని అర్థములు, వివరములు తెలియనిచో కరణ-అంగహారముల నిర్వచనము లర్థముకావు. పైన చెప్పబడినవానిలో గతిప్రచారములు 12 వ అధ్యాయమందును, తక్కినవన్నియును 8, 9, 10, 11 అధ్యాయములందును వివరింపబడును. ఈ అయిదు అధ్యాములందలి విషయములనెల్ల గ్రహించినప్పుడే కరణ-అంగహారముల లక్షణములు సుగమములు కాగలవు. ఈ గ్రంథాంతమున సవివరముగా శబ్దానుక్రమణిక నొసంగియున్నాను. దాని సాహాయ్యమున ఆయా వివరములను గ్రంథమునందు గుర్తించుకొనవలయును. అభినవగుప్తుడు మాత్రము కరణ-అంగహారములను వ్యాఖ్యానించునప్పుడే చారీ-హస్తాదుల లక్షణములను కూడ ఉదాహరించుచు వచ్చెను.

### 2. తాండవము : నృత్తము

'నృత్య' మను పాఠము ఈ అధ్యాయమందు కొన్నిచోట్ల కన్పట్టుచున్నది. కాని, అచ్చట 'నృత్త' మని ఉండుటయే సమంజసము. నాట్యశాస్త్రమందు నృత్త-నాట్యములే వివరింపబడినవనియు, 'నృత్యము' అందు వివరింపబడలేదనియు ఇంతకుముందే వివరించితిని.

'తాండవ' మనగా 'నృత్త' మనియే ఇచ్చటి అర్థము. శివతాండవమును భరతుడింతకుముందే పరిశీలించియుండెను. శివుడిప్పుడు బ్రహ్మనిర్మితమైన నాట్యమును క్రొత్తగా చూచెను. ఇంతకుముందు సంధ్యాకాలములందు నృత్తముచేయుచున్నప్పుడు శివుడుకూడ దీనినిగూర్చి ఆలోచించెనట. కాని, నాట్యమును సృష్టించుటకుమాత్రము పూనుకొనలేదు.

---

*[కాశీముద్రణమునందు 279-321 శ్లో, బొంబాయిముద్రణమునందు 288-326 శ్లో, బరోడాముద్రణమునందు 282-320 శ్లో.]

ఇప్పుడు భరతప్రయుక్తమైన నాట్యమును చూడగానే నృత్త-నాట్యములను సమ్మిశ్రితము చేసినచో బాగుండునని శివునకు తోచెను. అనగా తన నృత్తమునకు, నాట్యమునందలి అభినయమును జోడింపవలెనని శివుడభిప్రాయపడెను; ముందుగా ఆపనిని, 'పూర్వరంగమందు చేయు'మని బ్రహ్మనాదేశించెను. అంతట భరతుడావిధముగా చేసెను. దీనితో ఒక క్రొత్తమార్గము సృష్టింపబడినది. అదియే 'నృత్యము'. ఇది ఒక క్రొత్తమార్గమని బ్రహ్మ కాని, భరతుడుకాని తలంచినట్లు కన్పట్టదు, కాని, నిజమునకు, భరతుడే నృత్యమునకు సృష్టికర్త అయినాడు. ఇది అర్వాచీనకాలములో పూర్వరంగమునందేకాక విడిగాకూడ ప్రయుక్తమగుచు 'నృత్య' మనుపేర ప్రసిద్ధినందెను. అమరకోశమందలి "తాండవం-నటనం-నాట్యం-లాస్యం-నృత్యం చ నర్తనే" అనుదానినిబట్టి క్రీ. శ. 5 వ శతాబ్దికిపూర్వమే 'నృత్య' పదము ప్రచారములోనికి వచ్చినదని చెప్పవచ్చును. ఏదేని ఒక గీతమును లేదా గీతములను, ఒక సంప్రదాయమునను సరించి, అభినయించుట 'నృత్య' మనబడునని స్థూలముగా చెప్పవచ్చును. సాధారణముగా ఒక నర్తకియే ఇందు పాల్గొనుచుండును. ఉపరూపకములని చెప్పబడునవి ఈ 'నృత్య'మునకు సంబంధించినవే.

ఈ 'నృత్యము'ను కూడ శివుడే చేసినట్లు చెప్పెడి రెండు శ్లోకములను అభినవగుప్తుడు పేర్కొనినాడు. ఇవి కోహలుడు చెప్పిన శ్లోకములట [1-వ సం - పుట 180]. అర్వాచీనాలంకారికులు నృత్త-నృత్యములు రెండింటియందును తాండవ-లాస్య భేదములు చెప్పియున్నను నాట్యశాస్త్రమందుమాత్రము నృత్తవిషయమున నట్టి భేదము కన్పట్టుటలేదు. నృత్యము ప్రచారములోనికి వచ్చిన తరువాత అందీ భేదము. తేర్పడియుండును; దీనితోబాటు నృత్తమునందును ఈభేదము తేర్పడియుండును. కాని, 'లాస్య'మనెడి అర్థమునందు 'సుకుమార ప్రయోగము' అనునది ప్రయుక్తమగుట గమనార్హము. 19 వ అధ్యాయమందలి 29-వ అధస్సూచికనుకూడ చూడవలెను. ఇంక దశరూపములందు కొన్ని (డిమాదులు) ఉద్ధత ప్రయోగములుగాను, తక్కినవి సుకుమార ప్రయోగములుగాను గణింపబడుట కూడ గమనించవలసి యున్నది [ప్రథమాధ్యాయాంతమునగల మొదటి రెండు విశేషాంశములను కూడ చూడవలెను]. అంగహారములలో విద్యుద్భ్రాంత-గరుడప్లుతకాది మాహేశ్వరాంగహారములు ఉద్ధతములనియు, తలపుష్పపుట-లీన-నితంబాదులు దేవీకృత లలితాంగహారములనియు ఈ అధ్యాయాంతమున చెప్పబడుట కరణ-అంగహారాత్మకమైన పరిగణనము మాత్రమే; ఇది మొత్తము నృత్త మంతటికిని చెప్పిన విభజనము కాదుకదా." నాట్య ప్రయోగజ్ఞుడు ఉద్ధతములగు అంగహారములను, చారులను, మండలములను స్త్రీల గతుల విషయమున ప్రయోగించరాదు." అని 12 వ అధ్యాయమందు చెప్పబడుట గమనార్హము.

మొత్తముమీద, నాట్యశాస్త్రమందు 'తాండవ'మను పదము కేవలము 'నృత్తము' అను అర్థమునందు మాత్రమే ప్రయుక్తమైనది. నృత్యమునకుకూడ దివ్యయోనిత్వమును చెప్పిన కోహలుడే నృత్యము నొక ప్రత్యేకకళగా వృద్ధిపొందించిన ప్రథముడుగా తలంపబడుచున్నాడు. కోహలుడు క్రీ. శ. 3, 4 శతాబ్దములమధ్యనాడు కావచ్చునని విమర్శకుల



అభిప్రాయము. నృత్యమనెడి ఈ నూతనకళతో కోహలుడు ఉపరూపకములను సృష్టించినట్లు అభినవగుప్తుడే పేర్కొనెను [అభినవభారతి - 2వ సం - పుట 407 చూడవలెను.]

### 3. కరణములు

నూటఎనిమిది కరణములు నాట్యశాస్త్రమందు పేర్కొనబడియున్నవి. కరణములు నూట ఎనిమిది మాత్రమే అని దీనిని సిద్ధాంతముగా భావించరాదు. చేతనప్రధానమగు మానవజీవితమునందు నిత్యకృత్యములలో అనేకములగు క్రియావిశేషములను మనము గుర్తించవచ్చును. హస్త-పాదసంయోగ రూపములైన ఆ క్రియలెల్ల కరణములే. 12 వ అధ్యాయమందు గతిప్రచారము వర్ణితమైనది. వానిలో ఈ నూట ఎనిమిది కరణములకంటె భిన్నములైన క్రియారూపములుకూడ కన్పట్టగలవు. కాని ఇచ్చట విశిష్టరూపములైనవి మాత్రమే స్వీకరింపబడినవని గ్రహించవలెను. ఇవి ముఖ్యముగా నృత్తమం దుపయుక్తములగుచున్నవి.

ఈ కరణములు నృత్తమునందును, యుద్ధ-నియుద్ధములందును, గతి పరిక్రమములందును ఉపయుక్తములు కాగలవని ముందు తెలియగలదు. కరణప్రయోగమునందు గతి, అవస్థానము అను రెండు అవస్థా భేదములు కలవు. అవస్థానమనగా నిలిచియుండుట లేదా స్థితి ; గతి అనగా చలనము లేదా కదలిక. అవస్థానమందు వైష్ణవ-మండలాది స్థానకము లుపయుక్తములగును. ఇంక గతియందు చారు లుపయుక్తములగును. చారులు కేవలము పాదములయొక్క చలనమునకు సంబంధించినవి. గతియందు దేహములోని పూర్వకాయమునకు సంబంధించిన నృత్తహస్తములు, దృష్టులు మొదలగునవి ఉపయుక్తములగును. పతాకాదిహస్తములు స్థితియందే ఉపయుక్తములగును. ఇట్లు స్థితి-గతి సంమేళనము వలన కరణము లనంతములగును. కాని అంగహారములం దుపయుక్తములగునంతవరకే ఇచ్చట గ్రహింపబడినవి. [అభినవభారతి - పుటలు 94-95]

వాక్యార్థమును ప్రదర్శించునప్పుడు కూడ ఈ కరణము లుపయుక్తములు కాగలవు. నాట్యాచార్యు డీ విషయమున జాగ్రత్త వహించవలెను. అనగా ఒక కరణములోని హస్త-పాద విన్యాసములు ముగిసిన తరువాత వేరొక కరణములోని హస్త-పాద విన్యాసములను స్వీకరించునప్పుడు ఏకసూత్రత చెడిపోకుండునట్లు నాట్యాచార్యుడు సంయోజనము చేయవలెను. భరతుడు కరణములకు ప్రయోజనములను వివరించలేదు; కాని అభినవగుప్తుడు వివరించియున్నాడు. ఆతడిచ్చిన ఉదాహరణము లన్నియును ప్రాకృతమునందున్నవి. (ప్రాకృతము గీతమునకెక్కువ అనుకూలము; గీతమునకు ప్రాధాన్యమున్నచోట నృత్తమునకు కూడ ప్రాధాన్యముండును.)

ఇచ్చట అభినవగుప్తుడు వాక్యార్థాభినయ-పదార్థాభినయముల నెడి పదములను వాడెను. నాట్యము వాక్యార్థాభినయ (రసాభినయ) మనియు, నృత్యము పదార్థాభినయ (భావాభినయ) మనియు ధనికాదుల మతము. అభినవగుప్తుని అభిప్రాయముమాత్ర మిదికాదు.

ఈ కరణములందు కొన్ని ముఖ్య మానసిక భావములను తెలుపును. మరికొన్ని మిశ్రమ భావములను తెలుపుచున్నవి. కొన్ని గరుడ-సింహాది పశుపక్ష్యాదులను సూచించును.

మరికొన్ని దేవతలను సూచించును. తక్కినవి కేవల అంగవిక్షేపాత్మకములు. అధికభాగము ఏదో ఒకదానిని సూచించునవే అయియున్నవి.

### 4. అంగహారములు

అంగహారములు ముప్పదిరెండు పేర్కొనబడినవి. నూటఎనిమిది కరణముల పరస్పర సంయోజనముచే అంగహారము లనంతముగా ఏర్పడవచ్చును. కాని విశిష్టములును, స్పష్టగోచరములును అగు ముప్పదిరెండుమాత్రమే ఇందు పేర్కొనబడినవని తెలియవలెను. అభినవగుప్తుడు 'అంగహార' శబ్దమునకు మూడు వ్యుత్పత్తుల నొసంగినాడు. [అభినవభారతి-1 వ సం - పుట 89]

(1) "అంగానాందేశాంతరే ప్రాపణప్రకారోఽంగహారః"- ఒక స్థితిలోఉన్న అంగములను సముచితమైన ఇంకొక స్థితిని పొందించు విధానము అంగహారమనబడును.

(2) "హరస్య చాయం హారః ప్రయోగః"-హరుడనగా శివుడు. ఆ హరునకు సంబంధించిన ప్రయోగమగుటచే ఇది అంగహార మనబడినది.

(3) "అంగ నిర్వర్త్యో హారోఽంగహారః"-అంగములచే నిర్వర్తింపబడునది కాన ఇది అంగహారమనబడినది.

పై వానిలో రెండు, మూడు వ్యుత్పత్తులను కలిపి "అంగములచే నిర్వర్తింపబడు పరమేశ్వరప్రీతికర మగు వ్యాపారము 'అంగహార' మనబడును" అని చెప్పుట సమంజసముగానుండును. ఇంక ఆ అంగవ్యాపార మెట్టిదో మొదటి వ్యుత్పత్తి వివరించుచున్నది.

కరణములవలన అంగహారము లేర్పడుచున్నవనియు, కరణమే నృత్తమునకు మాతృక అనియు 12వ అధస్సూచికలో తెలిపియున్నాను. ఒక్కొక్క అంగహారము అనేక కరణముల సమాహారమైనప్పటికిని అంగహార ప్రయోగమందు ఆయా కరణములు విడివిడిగా కన్పట్టరాదు. అవి ఏకరూపముగా భాసించి, ఏకతాబుద్ధిని కలిగించవలెను. అట్లు ఏకరూపత సిద్ధించుటలో రేచకములు తోడ్పడును. ఈ విషయమును 10వ అధస్సూచికలో వివరించియున్నాను.

కరణ-అంగహారములను నిర్వర్తించుటకు చక్కని వ్యాయామము అవసరము. చారీప్రయోగమే వ్యాయామ మనబడును. ఈ విషయము 10 వ అధ్యాయాంతమున స్పష్టము చేయబడును. నాట్యాచార్యుడు 'అవయవగతి' ని చక్కగా గుర్తించినవాడు కావలెను; శరీరశాస్త్రమును చక్కగా తెలిసినవాడు కావలెను. ఇంక శిష్యుడు మంచి సుశిక్షణము కలవాడై శిల్పి శిలను మలచునట్లుగా తన అవయవములను మలచగలిగినవాడు కావలెను; అనగా అంగము లన్నియును వాని స్వాధీనములోనుండి ఎట్లుకావలెనన్న అట్లు కాగల మృదుత్వమును కలిగియుండవలెను.

కరణ-అంగహారముల నిర్వచనములను చదివి, సాధించుటకు ప్రయత్నించినంత మాత్రమున ఎవ్వరును నృత్తప్రయోగసమర్థులు కాజాలరు. శాస్త్ర మెంతచెప్పినను అందు కొన్ని ఛిద్రములు (gaps) ఉండుచునే ఉండును. సంప్రదాయము ననుసరించి ఆచార్యుడు వానిని పూరించుచుండును. అనగా, అభినవగుప్తుడు చెప్పినట్లుగా నాట్యాచార్యుడు ఛిద్ర



చ్ఛాదనమునుచేసి (లోటులను పూర్తిచేసి), అలాతచక్రప్రతిమత్వమును (మండుచున్న కొరవిని గుండ్రముగా త్రిప్పినచో ఏర్పడు జ్వాలావలయమందలి ఏకతను) సాధించవలయును. పుస్తకమును చదివి కరణములనుకాని, అంగహారములనుకాని ప్రయోగించుటకు పూనుకొన్నచో కరణములందు అవయవములకును, అంగహారములందు కరణములకును ఏకరూపత సిద్ధింపక అవి విడివిడిగా గోచరించుచునేయుండును. కావున శాస్త్ర-సంప్రదాయవిదుడైన ఉత్తమ ఆచార్యునియొద్దనే నృత్తమును అభ్యసించవలెను. ఈ నృత్తాభ్యాసము యోగాభ్యాసతుల్యము. కావుననే నృత్తము హరునకు ప్రీతిపాత్రమైనది.

### 5. నృత్త-నాట్య-నృత్యములు ; ఇతర లక్షణకర్తల అభిప్రాయములు

(1) నందికేశ్వర ప్రణీతమగు అభినయదర్పణమున (క్రీ. శ. 3-వ శతాబ్ది ప్రాంతములు- ఇది నాట్యశాస్త్రము తరువాతిది) నాట్య-నృత్త-నృత్యములీ క్రిందివిధముగా వివరింపబడియున్నవి :

> నాట్యం నృత్తం నృత్య మితి మునిభిర్భరతాదిభిః ॥ 12
> నాట్యం తన్నాటకం చైవ పూజ్యం పూర్వకథాయుతమ్ ।
> భావాభినయహీనం తు నృత్తమి త్యభిధీయతే ॥ 15
> రసభావవ్యంజనాదియుక్తం నృత్య మితీర్యతే। 16
>
> —(డా. ఘోష్ సంపాదించిన అభినయదర్పణము - 1957)

—భరతముని మొదలగువారు నాట్య - నృత - నృత్యములు అనెడి మూడు భేదములను చెప్పినారు. పూర్వకథాయుతమైన నాట్యము లేదా నాటకము ఆరాధనీయము. భావాభినయహీనమైనది (రసభావవిహీనమని 'వావిళ్ళ' వారి పాఠము) నృత్త మనబడును, ఇంక రస భావ వ్యంజకమైనది నృత్య మనబడును.

(2) నాట్య-నృత్య-నృత్తములను 'దశరూపక' ప్రథమ ప్రకాశమందు ధనంజయుడు క్రింది విధముగా వివరించెను :

> అవస్థానుకృతి ర్నాట్యం .... .... .... ....
> .... .... .... .... దశధైవ రసాశ్రయమ్॥ 7
> అన్య ద్భావాశ్రయం నృత్యమ్ నృత్తం తాలలయాశ్రయమ్ ।
> ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథాపరమ్॥ 9
> మధురోద్ధత భేదేన తద్ద్వయం ద్వివిధం పునః ।
> లాస్య తాండవ రూపేణ నాటకాద్యుపకారకమ్॥ 10

—అవస్థానుకరణము నాట్యము....రసాశ్రయమైన ఆ నాట్యము పది విధములు. నృత్యము భావాశ్రయము. నృత్తము తాలలయాశ్రయము...మరియు పదార్థాభినయమైన నృత్యము 'మార్గ' మనబడును. నృత్తము 'దేశి' అనబడును. మధుర-ఉద్ధత భేదములచే నృత్య-నృత్తములు రెండును మరల రెండేసి విధములు. మధురము (మధుర నృత్య - మధుర నృత్తములు రెండును) 'లాస్య' మనబడును. ఉద్ధతము (ఉద్ధత నృత్య - ఉద్ధత నృత్తములు రెండును) 'తాండవ' మనబడును. ఇవి నాటకాదుల కుపకారకములు.

దీనిపై ధనికు డీ క్రిందివిధముగా వ్యాఖ్యానముచేసెను. —"కావ్యమందు వర్ణితులైన ధీరోదాత్తాది నాయకులయు, తదితరులయు అవస్థలను అనుకరించుట నాట్యమనబడును. అనగా చతుర్విధాభినయములచే నటులు నాయకులతో తాదాత్మ్యమును పొందుట నాట్యమనబడును. నాట్యము రసాశ్రయము కాగా, నృత్యము భావాశ్రయమగును. గాత్రవిక్షేప మనెడి అర్థము కల 'నృత్' అను ధాతువునుండి పుట్టినదగుటచేతను, ఆంగికాభినయ బాహుళ్యము కలదగుటచేతను, దీనిని ప్రదర్శించువానికి 'నర్తకు' డను వేరు పేరు ఉండుటచేతను, లోకమున దీనికి 'ప్రేక్షణీయ' మను పేరు వచ్చుటచేతను నృత్యము నాట్యముకంటె భిన్నమగుచున్నది. కావున నృత్య భేదములైన డోంబీ- శ్రీగదితాదులు నాట్యభేదములైన నాటకాదులకంటె భిన్నములగుచున్నవి. వెనుక చెప్పినట్లు నాటకాదులు రసవిషయములు. పదార్థభూతములైన విభావాదుల యొక్క సంసర్గము కల వాక్యార్థము రసనిష్పత్తి హేతువు. అట్టి వాక్యార్థాభినయ రూపమైన నాట్యము రసాశ్రయమగుచున్నది. అవస్పందనము (కించిత్ చలనము) అను నర్థము కల 'నట్' అను ధాతువునుండి నాట్యపదము నిష్పన్నమగుటచేతను, ఇందు చలనము తక్కువై సాత్త్వికాభినయ బాహుళ్యము ఉండుటచేతను, దీనిని నిర్వర్తించువాడు నటు డనబడుటచేతను, ఇది ప్రేక్షణీయమేకాక శ్రవ్యమగుటచేతను ఈనాట్యము నృత్యముకంటె భిన్నమగుచున్నది. ఇంక చచ్చత్పుటాది తాల - ద్రుతాదిలయాశ్రయమాత్రమగు అంగవిక్షేపముకలదై అభినయశూన్య మగునది నృత్త మనబడును. నృత్త-నృత్యములు రెండును గాత్ర విక్షేప విషయమున సమానములే అయినను (రెండు పదములును 'నృత్' ధాతువునుండి పుట్టినవే) అనుకరణాత్మకమైన నృత్యము నృత్తముకంటె భిన్నమగుచున్నది. నృత్య-నాట్యములు రెండును అనుకరణ విషయమున సమానములే అయినను రసాశ్రయమైన నాట్యము నృత్యముకంటె భిన్నమగుచున్నది...కించి దవాంతర పదార్థాభినయముచే నృత్యమును, శోభాహేతువగుటచే నృత్తమును నాట్యమునకు ఉపకారకములగుచున్నవి."

(3) ప్రతాపరుద్రీయకారుడుకూడ ధనంజయ - ధనికుల ననుసరించియే నాట్య-నృత్య-నృత్తములను వివరించెను. కాని, శ్రీ కె. పి. త్రివేది ప్రకటించిన నాగరప్రతిలో నృత్త-నృత్య పదములు వ్యత్యస్తములుగా పడినవి. అది పొరపాటు. శ్రీ మాధవరామ శర్మగారి అనువాదములో సరిగానే ఉన్నవి.

(4) విప్రదాసుడు 'సంగీతచంద్రము' (అముద్రితము) నందు నాట్య నృత్యముల నీక్రిందివిధముగా వివరించెను. (నృత్తమును నిర్వచింపలేదు.)

నటనీయమగు అర్థముతో తాదాత్మ్యమునొందగల నటునిచే అభినయపూర్వకముగా అర్థము ఎచట వ్యక్తముచేయబడునో అది 'నాట్య' మనబడును. ఇచ్చట నాట్య శబ్దము అభిధావృత్తిచే అభివ్యంగ్యమగు అర్థమును ప్రతిపాదించును; లక్షణావృత్తిచే తద్వ్యంజకమగు అభినయనమును గూడ ప్రతిపాదించును.

కరణములచే అంగహారము నిష్పన్నమగును. ఆ అంగహారములచే అనురంజితములగు చతుర్విధాభినయములచే నృత్యము నిష్పన్నమగును. ఇచ్చట నృత్యశబ్దము అభిధావృత్తిచే అభినయమును, లక్షణావృత్తిచే వ్యంగ్యమగు నర్థమును ప్రతిపాదించును.



ఇట్లు నాట్య-నృత్యశబ్దములు రెండును అభినయమును లక్షణా - అభిధావృత్తులచే ప్రతిపాదించుచున్నవి.

(5) 'సంగీతదర్పణ' ప్రారంభమునందు దామోదర పండితుడు (17వ. శతాబ్ది ప్రారంభము) మార్గ-దేశీ భేదముల నీక్రిందివిధముగా వివరించియున్నాడు—

"గీతం-వాద్యం-నర్తనం చ త్రయం సంగీత ముచ్యతే। మార్గ-దేశీ విభాగేన సంగీతం ద్వివిధం మతమ్॥ 3
ద్రుహిణేన యదన్విష్టం ప్రయుక్తం భరతేన చ। మహాదేవస్య పురత స్తన్మార్గాఖ్యం విముక్తిదమ్॥ 4
తత్తద్దేశస్థయా రీత్యా యత్స్యాత్ లోకానురంజనమ్। దేశే దేశే తు సంగీతం తద్దేశీత్యభిధీయతే॥ 5

—గీత-వాద్య-నర్తనములు మూడును 'సంగీత' మనబడును. ఇట్టి సంగీతము మార్గ-దేశీభేదములచే రెండు విధములు. బ్రహ్మచే ఆవిష్కృతమును, శివుని యెదుట భరతునిచే ప్రయుక్తమును, ముక్తిదాయకమును అయిన సంగీతము 'మార్గసంగీత' మనబడును. ఆయా దేశరీతుల ననుసరించి, ఆయా జనులను రంజింపజేయునది 'దేశిసంగీత' మనబడును. (ఈ నిర్వచనములె నర్తనమునకుకూడ అన్వయించును.)

(6) శారదాతనయుడు 'భావప్రకాశము'లో నృత్తమును ప్రాచీనమతవిరుద్ధముగా వివరించియున్నాడు (పుట-181.)

నృత్యం భావాశ్రయం నృత్తం రసాశ్రయ ముదాహృతమ్। నృత్య-నృత్త విభాగశ్చ బహుభి ర్బహుధోదితః
తద్ద్వయం నాటకాదీనాం భూయసా హ్యుపకారకమ్। నృత్య-నృత్త విభాగస్తు పరస్తా త్కథయిష్యతే॥

శారదాతనయుడు నృత్యము భావాశ్రయ మనియు, నృత్తము రసాశ్రయ మనియు ఇచ్చట చెప్పి, వీని విభాగమును తరువాత చెప్పుదు ననినాడు. కాని ఈ ప్రసంగము మరల వచ్చిన 236, 298, 308 పుటలలో ఇట్టి వివరణము కానరాదు. అచ్చటి వివరణములు దశరూపకాద్యనుగుణములుగానే ఉన్నవి.

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు నా కొసంగిన భావప్రకాశము యొక్క వ్రాత ప్రతిలో 'నృత్తం రసాశ్రయమ్' అను దానిలోని 'నృత్తం' అను పదమునకు 'నిత్యః' అను పాఠాంతరము కలదు. దీనిని బట్టి నృత్యము రసాశ్రయము కూడ అగుచున్నది. ఇదియును ప్రాచీన మతవిరుద్ధమే. నాట్యమువలె నృత్త - నృత్యములు రెండును రసాశ్రయములే అని శ్రీ కె. యమ్. వర్మగారు "నాట్య - నృత్త - నృత్యము" అను తమ గ్రంథములో నిరూపించినారు. వీరి వాదసారమునకు ఆ గ్రంథము నందలి 44-45 పుటలను, 70-71 పుటలను చూడవలెను.

వీరి వాదమునకు పై భావప్రకాశ శ్లోకము బలము నొసంగుచున్నది.

### 6. పదార్థ-వాక్యార్థాభినయములు

పాండిత్య ప్రకర్షకు సంబంధించిన సిద్ధాంతముల జోలికి పోక పదార్థాభినయ-వాక్యార్థాభినయముల కీ క్రింది విధముగా అర్థము చెప్పుట సమంజసమని తలంచుచున్నాను— నృత్యమునందు సాధారణముగా నర్తకి ఏదో ఒక గీతమును లేదా పదమును లేదా అష్టపదిని అవలంబించి అభినయము చేయును. అందు ప్రతి పదమునకును అభినయము చేయును. కొన్ని పదములకు విపులమైన అభినయ విధానముకూడ నిర్దిష్టమై యున్నది. ఇట్లు ప్రతి

పదము యొక్క అర్థమును ఆంగికాభినయ బాహుళ్యముతో అభినయించి చూపుట నృత్య మందలి విశిష్టత. ఇంక నాట్యమందు ప్రతి పదమునకును అభినయము ఉండదు. అంతియే కాదు, ప్రతి వాక్యమునకుకూడ అభినయము చేయబడదు. మొత్తముమీద వాక్యార్థము సూచిత మగునట్లు అల్పముగా ఆంగికాభినయమును, అధికముగా సాత్త్వికాభినయమును ఉండును. కావున, ప్రతి పదము యొక్క అర్థమును అభినయించి చూపుట పదార్థాభినయ మగును; ఇదియే నృత్యము. వాక్యము యొక్క అర్థము సూచితమగునట్లు చేయు అభి నయము వాక్యార్థాభినయ మగును; ఇదియే నాట్యము.

ప్రతిపదార్థాభినయము నాట్యమున కెట్లు సరిపడదో శ్రీ కొప్పరపు సుబ్బారావు గారి వాక్యములను పరిశీలించినచో తెలియగలదు. (శ్రీ సుబ్బారావుగారు ఆంధ్ర నాటక రంగ చరిత్రను వ్రాయ తలపెట్టి, పదియవవంతు అయినను పూర్తిచేయకుండగనే మరణించి నారు. అందలి ప్రథమ భాగమునుండి)— "కాళీయ ఫణిఫణాగ్రములఁ దాండవమాడు। నడుగు దమ్ములకు జోహారు లనుము" అనే పద్యం నాచేత రిహార్సల్సు చేయించిన పద్ధతి నాటికీ నేటికీ మరుపురాదు. విశేషమేమంటే ప్రతి పదానికి అభినయం ఉండాలి. 'ఫణిఫణా' అన్నప్పుడు అరిచేతి వ్రేళ్ళు పాము పడగలాగ వంచి ఆడిస్తుండాలి. 'తాండవమాడు' అన్న ప్పుడు ఒక చెయ్యిపైకి, ఒకటి క్రిందికి గాలిలో ఈదుతున్న ఫక్కీగా ఎగరవెయ్యాలి. 'అడుగుదమ్ములు' అన్నప్పుడు అడుగుల్ని నడకద్వారా చూపిస్తు తమ్ముల్ని హస్తాంజలి ద్వారా ఏకకాలంలో సూచించాలి. ఇక 'జోహారు లనుము' అన్నప్పుడు గరుడాళ్వారు ఫక్కీలో రెండు చేతుల్ని నడినెత్తిమీద పెట్టుకొని 'అడియేన్ దాసోహం' ఫక్కీలో అమాం తంగా వంగిపోవాలి. ఇలాంటి ప్రత్యేక పరిశ్రమతో తయారైన ఆ వేషం నాకు చిరస్మర ణీయమే అయింది.

ఇది 1910 కి పూర్వపు స్థితి. తెలుగులో పద్యనాటకములు జోరుగా సాగుచున్న రోజులవి.

ఇట్టి ప్రతిపద-అర్థ-అభినయము నాట్యమునకు విరుద్ధము. కాని, నృత్యమునకు ఆవశ్యకము; దానికి జీవ మదియే.

### 7. నట్ - నృత్ ధాతువుల పౌర్వాపర్యములు

నాట్య-నృత్త-నృత్యములలో ఏది ప్రాచీనము? లేదా వీని ఆవిర్భావ క్రమ మెట్టిది? నట్-నృత్ అనునవి సంస్కృత ధాతువులా? లేక ప్రాకృత ధాతువులా? అను విచారణమును ప్రాచీన భారతీయాలంకారికు లెవ్వరును చేయలేదు—

ఈ మూడింటిలో నృత్తము అనాది అనియు, నాట్యము బ్రహ్మ సృష్టి అనియు, నృత్యము (నృత్తము+అభినయము) భరతకృత మనియు, ఇంతకుముందే తెలిపియున్నాను. నృత్తము అనాది అని వేదములును, మొహెంజదారోలో దొరికిన శిల్పఖండములును నిరూ పించుచున్నవి.

'నట్' ధాతువునుండి 'నాట్యము' అను పదమును (నటనము, నటుడు, నటి అనునవి కూడను), 'నృత్' అను ధాతువునుండి 'నృత్తము' అను పదమును (నర్తనము, నర్తకి,



వర్తకుడు అనునవి కూడను) వచ్చినవి. 'నృత్' అను ధాతువునకు 'క్యప్' ప్రత్యయము చేరి 'నృత్యము' అను పదము నిష్పన్నమైనది. వీనిలో 'నట్' అనునది ప్రాకృత ధాతు వనియు, 'నృత్' అనునది సంస్కృత ధాతువనియు ఆధునిక విమర్శకులు తలంచుచున్నారు. 'నృత్' నకు 'నట్' అనునది ప్రాకృత రూపమని వీబరు మొదలగు విమర్శకులు తలంపగా 'నట్' నకు 'నృత్' సంస్కృతరూపమని కొందరు తలంచినారు. ఈ 'నట్' ధాతువు అనార్య భాషలనుండి సంస్కృతమున చేరియుండునని మరికొందరు తలంచినారు. 'నాట్' అను ధాతువునుండి 'నాట్యము' అను పదము వచ్చినదని ప్రాచీనులలో నాట్యదర్పణ కర్తలు మాత్రము తెలిపినారు [పుట - 28].

ఋగ్వేదకాలము: 'నృత్' 'నట్' అను ధాతువులు రెండును ఋగ్వేదకాలము నుండియు కలవని తెలియుచున్నది. కాని, 'నట్' అనునది 'వ్యాపించు' అను నర్థమునందు మాత్రమే ప్రయుక్తమైనది ("మానో రక్షోఽభినట్ ..."—రక్షః=రాక్షసజాతిః; నః=అస్మాన్; మాఅభినట్=మాభివ్యాప్నోతు-విద్యారణ్యవ్యాఖ్య.) [ఋగ్వేదము - 7 మం-104 సూ. 23 ఋ.] ఇంక 'నృత్' అనునది నృత్తమను నర్థమందే ప్రయుక్తమైనది (నృతయే=నర్త నాయ, కర్మణి, గాత్ర విక్షేపాయ - విద్యారణ్యవ్యాఖ్య) [ఋగ్వేదము - 10 మం - 18 సూ. 3 ఋ.] మరియు, యజ్ఞాదులొనర్చునప్పుడు ఋత్విజులును, యువతులును నృత్తమొనర్చెడివారనుటకు తార్కాణములు కలవు. వివిధరూపములలో నృత్యమనుపదము వేదము లన్నింటను కలదు. కాని ఎల్లెడల 'నృత్తము' అను అర్థమునందే అవి కన్పట్టుచున్న వని విమర్శకు లభిప్రాయపడుచున్నారు.

ఋగ్వేదకాలమునాటి 'నృత్' ధాతువున కర్థము కేవలము గాత్రవిక్షేపమని తలంచు టయె సమంజసముగా కన్పట్టుచున్నది. క్రమముగా అందు ఇతరాంశములు చేరియుండును. ఇట్లేర్పడిన క్రొత్తకళను సూచించుటకు క్రొత్తపదము అవసరముకాగా, అందులకు 'నట్' ధాతువు ఉపయుక్తమైయుండును. మొదట ఈ 'నట్' ధాతువు కూడ 'నృత్త' మను నర్థ మందే ప్రయుక్తమైయుండును. ఈ ఊహకు "నట నృత్తౌ" అను సూత్రము కూడ బలమొసంగుచున్నది [సిద్ధాంతకౌముది - తిజంతభ్వాదిగణము - 781].

ఇంతమాత్రమున నృత్తమునుండి నాట్యము జనించినదని అర్థముకాదు. రెండును వేర్వేరుగా జనించినవని నాట్యశాస్త్రమునుబట్టి స్పష్టముగా తెలియుచున్నదికదా?

పాణినికాలము: 'నట్' ధాతువు నాట్యము, నటుడు అను నర్థమున మొట్టమొదటిగా పాణినీయమందే కన్పట్టుచున్నది. పాణిని (క్రీ. పూ. 5వ శతాబ్ది) పేర్కొనిన "నటసూత్ర ములు" [అష్టాధ్యాయి - IV-3-110-111 సూ.] నటులకు సంబంధించినవే అనియు, నర్త కులకు, నృత్త-నృత్యములకు సంబంధించినవి కావనియు విమర్శకులు సిద్ధాంతించుచున్నారు. ["నాట్య - నృత్త - నృత్యములు" పుట 25 చూడవలెను.]

పతంజలికాలము: పతంజలి (క్రీ. పూ. 2వ శతాబ్ది) కాలమున నటులు సకుటుంబ ముగా ప్రదర్శనముల నొసంగుచున్నట్లు తెలియుచున్నది. 6 వ అధ్యాయమందలి ప్రథమ పాద ద్వితీయసూత్రమును వ్యాఖ్యానించుచు పతంజలి ఇట్లు వ్రాసెను—"వ్యంజనాని పున ర్నటభార్యావ ద్భవంతి. తద్యథా నటానాం స్త్రియో రంగగతా యో యః పృచ్ఛతి 'కస్య

యూయం 'కస్యయూయ' మితి తం తం 'తవ' 'త' వేత్యాహుః. ఏవం వ్యంజనాన్యపి యస్య యస్యా ఉచః కార్య ముచ్యతే తం తం భజంతే" (వ్యంజనములు నటభార్యలవంటి వగుచున్నవి. ఎట్లనగా- నటులయొక్క స్త్రీలు రంగస్థలమున 'నీవెవరిదానవు' 'నీవెవరిదానవు' అని ప్రశ్నించినవారికందరకును 'నీదాననే' 'నీదాననే' అని సమాధానము చెప్పుచుందురు. అవిధముగనే వ్యంజనములుకూడ. ఏయే అజ్విధులు విధింపబడుచుండునో వాని నన్నింటిని పొందుచుండును.)

అప్రస్తుతమైనను ఇచ్చట ఒక విషయమును స్పష్టముచేయవలసియున్నది. ప్రాచీన కాలమున నటులు, ముఖ్యముగా నటభార్యలు నీతిరహిత లనుటకు పై పతంజలి వాక్యము లను ఎ. బి. కీత్ ఉదాహరించెను [The Sanskrit Drama Page - 363]. ఈ అభిప్రాయము పొరపాటు. నటభార్యలు అడిగినవారికెల్ల 'నీదాననే' 'నీదాననే' అని సమాధానము చెప్పుట 'రంగమునందు' మాత్రమే. 'కీత్' పండితు డీ విషయమును గమనింపక తోచినట్లు వ్యాఖ్యానించుట విచారకరము. నటసూత్రములనుగూర్చి పాణినియు, నటప్రదర్శనములనుగూర్చి పతంజలియు పేర్కొనుట గమనించియున్నాము. క్రీ.పూ. 2వ శతాబ్దినాటికే నటప్రదర్శనములు జరుగుచున్నను ఒక్కరూపకమేని, నాటిది, లభింపకపోవుట దురదృష్టము. మనకు లభించిన ప్రథమోదాహరణములు క్రీ.శ. ప్రథమ శతాబ్దికి చెందిన, లేదా ఇంకను కొంత అర్వాచీనము లగు అశ్వఘోషుని శారిపుత్ర ప్రకరణాదులు [మృచ్ఛకటిక క్రీస్తు పూర్వకాలమునకు చెందినదనియు, భాసనాటకములు క్రీస్తు పూర్వకాలమునకు చెందినవనియు వాదములు కలవు. కాని, అవి సిద్ధాంతములుకావు. భాసుడు నాట్యశాస్త్రమును ఎరిగినవాడనియు, భాస నాటకములు నాట్యశాస్త్ర రచనకు తరువాతివనియు డా. ఘోష్ నిరూపించెను. (నాట్యశాస్త్రము - ఆంగ్లానువాదము - ఉపోద్ఘాతము - LXXXIV-LXXXV). ఇంక మృచ్ఛకటిక క్రీ. శ. 6 లేదా 7 వ శతాబ్ది ప్రాంతముల రచింపబడినదని ఆర్. డి. కర్మార్కర్ ప్రభృతులు నిరూపించియున్నారు.]

కాళిదాసు కాలము : ఋగ్వేదాదులందు 'నృత్య' పదమున్నను అది కేవలము గాత్ర విక్షేపమాత్రమైన నృత్తమను నర్థమందే ప్రయుక్తమైనదనియు, భరతుడే నృత్యసృష్టి కర్తయనియు తెలిపియున్నాను. మాళవిక 'ఛలితమను నాట్యము'ను ప్రదర్శించినట్లు కాళిదాసు (క్రీ. శ. 3 వ లేదా 4 వ శతాబ్ది) మాలవికాగ్నిమిత్రమందు పేర్కొనెను. ఇది రూపకముకాదు; ఇది యథారస మభినయింపబడినదని తరువాత చెప్పబడుటచే కేవలము అంగవిక్షేపాత్మకమైన నృత్తమును కాదు. అభినయపూర్వకమైన నృత్తమిది. దీనినే నృత్యమందురు. కాని నృత్యమను పద మిచ్చట ప్రయుక్తము కాలేదు. నృత్యమను పదమును స్పష్టముగా పేర్కొనిన ప్రథముడు అమరసింహుడేయని చెప్పవచ్చును. నాట్యమను పదము నృత్యమను నర్థములో నేటికిని ప్రచారమం దున్నది. ఉదా : భరతనాట్యము.

కాళిదాసు పైవిధముగా నాట్యమను పదమును 'నృత్య' మను నర్థమందేకాక 'రూపకము' అను నర్థమునందు కూడ వాడియున్నాడు. "నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్."



ఇట్టి ప్రయోగములు తరువాతి కాలములో ఈ పదముల అర్థవిపర్యయమునకు కారణములై యుండును, ఆలంకారికుల నిర్వచనములలో గల భేదములకిదియొక కారణమని చెప్పవచ్చును.

8. నృత్తము - అభినవగుప్తుని వివరణము

"నృత్తము నాట్యముకంటె భిన్నమెట్లయినది ? నృత్తస్వరూప మెట్టిది ? నృత్త ప్రయోజనమేమి ?" అని ఋషులు ప్రశ్నించిరికదా. ఆ సందర్భమున నృత్తస్వరూపమును గూర్చియు, తత్ప్రయోజనమును గూర్చియు అభినవగుప్తుడు విపులమగు వ్యాఖ్యానము చేసియున్నాడు. ఇప్పట్ల అభినవగుప్తుడు ఈశ్వరప్రవర్తితములైన ఏడువిధములగు నృత్తములను పేర్కొనెను. [అభినవభారతి - 1 వ సం - పుట 182]

(1) శుద్ధనృత్తము-ఇదికేవలము రేచక-అంగహారాత్మకమైనది.

గీతకాద్యభినయోన్ముఖమైన నృత్తము రెండువిధములుగా నుండును. [శ్రీవర్మ మొదలగువారీ విభాగమును సరిగా గుర్తించినట్లు కన్పట్టదు.]—

(2) (అ) గాన క్రియామాత్రానుసారియగు నృత్తము. ఇందు గీతికి ప్రాధాన్యము; ఆంగికాభినయము తదంగముమాత్రమే

(3) (ఆ) వాద్య-తాలానుసారియగు నృత్తము– అనగా బాహుప్రేంఖణ-ఉరఃకంప-పార్శ్వనమనోన్నమన-చరణసరణ-స్ఫురిత-కంపిత-భ్రూతారాపరిస్పంద-కటిచ్ఛేద - అంగవలన మాత్రరూపమైన నృత్తము. ఇందు ఆంగికాభినయము బహులము. వాద్య-తాలముల కనుగుణముగా అంగాభినయ ముండును. [ఇది 'కథక్' నృత్తమువంటిదికాని, జాతరలందు చేయబడెడి నృత్తమువంటిదికాని కావచ్చును.]

(4) ఉద్ధతనృత్తము.

(5) సుకుమార (=మసృణ) మిశ్రమగు ఉద్ధతనృత్తమ

(6) సుకుమార (=మసృణ) నృత్తము.

(7) ఉద్ధత మిశ్రమగు సుకుమార నృత్తము.

ఈ ఏడింటిలో మొదటి మూడును ఒకరకము; తరువాతి నాలుగును ఇంకొకరకము. శుద్ధ-ఉద్ధత-సుకుమార-మిశ్రాత్మక భేదచతుష్టయ భిన్న కావ్యార్థానుసారిత్వమువలన నృత్తమును చతుర్విధమగుచున్నది. ఈ ఏడింటిలో ప్రథమభేదము లౌకికమైన స్వతంత్రనృత్తమందు లేదా దేవతా పరితోషణమందు ఉపయుక్తమగును. ఇంక రెండవ భేదము పూర్వరంగవిధియం దుపయుక్తము. తక్కినవి ఆయా సందర్భములం దుపయుక్తములగును. ఇట్లు విశ్వమంతయును తాండవముచే వ్యాప్తమైయున్నది. [అభినవభారతి-1వ సం-పుట 182]

నిజమున కివి అన్నియును కేవల నృత్తప్రకారములు కావు. ఇందులో చివరి నాలుగింటియందును అభినయముండును. అందుచే తరువాతికాలమువారు పేర్కొనినట్లుగా ఇవి నృత్యప్రకారములగుచున్నవి. తనవాటికి నృత్యపదము ప్రసిద్ధమైనను అభినవగుప్తుడా పదమును వాడియుండలేదు. కారణము నాట్యశాస్త్రమందా పదము లేకపోవుటయే అని చెప్పవచ్చును.

అర్థానుకూలమైన అంగవిక్షేపము, ఏకపాత్ర ప్రయోగము, దేవతాస్తుతి, శృంగారాద్యభినయములు మొదలగునవి నృత్త - నాట్యములు రెండింటను సమానములే. అందుచే నృత్త - నాట్యములు అభిన్నములని కొందరి వాదము. అభినవగుప్తుడీ వాదమును మూడు రకములుగా విడదీసి వానికి సమాధానమును చెప్పియున్నాడు. [అభినవభారతి - 1 వ సం- పుటలు 174-175]. చివరకు నృత్త-నాట్యములు భిన్నములనియు, నృత్తము నాట్యాంగమనియు, అది గీతాదులవలె నాట్యోపయోగి అనియు నిర్ణయించెను. [అభినవభారతి - 1 వ సం-పుట 180.]

9. ప్రసిద్ధ నృత్యభేదములు

నాట్యమునే కాక నృత్తమును, సంగీతమును కూడ సలక్షణముగా, విపులముగా వివరించిన ప్రథమగ్రంథము నాట్యశాస్త్రమే. అనగా నాట్యశాస్త్రమందు నృత్త - నాట్యములు రెండును సంగీతమును గూడ వివరింపబడిన వన్నమాట. నేడు దక్షిణదేశమున కూచిపూడి నాట్యమనియు, భరతనాట్య మనియు ప్రసిద్ధిచెందిన నృత్య సంప్రదాయములు ఈనాట్యశాస్త్ర విహితములైనవే యని తెలియవలెను. అనగా అవి ఇందు వివరింపబడిన అభినయ-నృత్త - సంగీతములందలి అంశముల సమ్మేళనమువలన సిద్ధించినవే. కూచిపూడినాట్యము, భరతనాట్యము, కథాకళి, కథక్, మణిపురినృత్యము అనునవి నేడు భారతదేశమున ప్రసిద్ధిగాంచిన నృత్య సంప్రదాయములు. ఇవి అన్నియును మార్గ నృత్యభేదములు. వీనిలో కూచిపూడి నృత్యము ప్రాచీనమైనది. వీని స్వరూపములను దిఙ్మాత్రముగా సూచింతును.

(1) *కూచిపూడి నాట్యము:* దీనికే 'కూచిపూడి భాగవత' మనియు పేరు. కూచిపూడి భాగవతులను గూర్చి స్పష్టముగా తెలిపెడి ప్రథమ చారిత్రకాధారము క్రీ. శ. 1506 నాటి చరిత్రను తెలిపే వేమాచుపల్లి కైఫీయతు. విజయనగర ప్రభువగు వీరనరసింహరాయల యెదుట సిద్ధవటం సీమను పరిపాలించుచున్న సమ్మెట గురువరాజు చేయు దారుణ కృత్యములను ఈ భాగవతులు కేళిక మధ్యలో ప్రదర్శించి, ప్రభుదృష్టి నాకర్షించి, ఆ దారుణ కృత్యములను మానిపించుటకు తోడ్పడినట్లుగా ఆ కైఫీయతునందు కలదు. ["Studies in the History of the third Dynasty of Vijayanagara" by Dr. N. Venkata Ramanayya— Appendix C-Pp 462-463.]

ఈ కూచిపూడి భాగవతులకు ముందు నాట్యము దేవదాసీలచే చేయబడుచుండెడిది. వారి దుష్ప్రవర్తనలచే (వారి దుష్ప్రవర్తనలకు సంఘములోని పెద్దలుకూడ బాధ్యులే) పవిత్రమైన ఈ కళ హీనస్థితికి వచ్చినది. ఆ సమయములో కూచిపూడివారు వీథి నాటకములనే ప్రదర్శించుచుండెడివారు. 14 వ శతాబ్ది ప్రాంతముల నటరాజు అనుగ్రహం పొందిన సిద్ధేంద్రయోగి ఈ కూచిపూడి బ్రాహ్మణులకు నృత్యకళను నేర్పెను. దానినే 'పారిజాతము' లేదా 'భామాకలాపము' అని అందురు. నృత్యకళ పరమకోటిని పొందిన అపూర్వసృష్టి యిది. భామాకలాపమునే కాక గొల్లకలాపమును, ఉషాపరిణయాది నృత్య ప్రధాన నాటకములను (యక్షగానములు లేదా వీథి భాగవతములు) కూడ వీరు ప్రదర్శింతురు. ఈ మేళములందు పురుషులు మాత్రమే ఉందురు. ఈ కూచిపూడివారిది



ఒక పవిత్రగాథ. అబుల్‌హాసన్ కుతుబ్‌షా అను గోల్కొండ నవాబు (క్రీ. శ. 1672-1687) ఈ భాగవతులకు క్రీ. శ. 1675 ప్రాంతముల కూచిపూడిని అగ్రహారముగా నిచ్చివేసెను.

విజయనగర సామ్రాజ్యము నశించిన తరువాత కూచిపూడి భాగవతులలో కొందరు తంజావూరునకు వలసపోయిరి. తంజావూరుదగ్గరనున్న 'మేలట్టూరు'లోని భాగవత మేళ నాటకములకు కూచిపూడి నాట్యమే మార్గదర్శకమని తలంపబడుచున్నది. కూచిపూడి నర్తకుల వలెనే మేలట్టూరు భాగవతులు కూడ బ్రాహ్మణులును, పురుషులును. ఆ నాటకము లన్నియును తెలుగుభాషలో రచింపబడినవే. నేడు భామాకలాప-గొల్లకలాపములను తక్కిన వర్ణములవారుకూడ, పురుషులే కాక స్త్రీలును, నేర్చి ప్రదర్శించుచున్నారు. మాఊరిలోని (బందపురం, కొవ్వూరు తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా) 'పిచ్చుకకుంట్లు' ఏబది ఏండ్లుగా కూచిపూడి నాట్యమును నేర్చి, ప్రదర్శించుచున్నారు. వీరిలో దేశి లక్ష్మినారాయణ అనునతడు భామ వేషము కట్టి అత్యద్భుతముగా అభినయించుట నే నెరుగుదును.

కూచిపూడి - మేలట్టూరు నర్తకులకు భగవదారాధనమే లక్ష్యము కాన వీరందరును భాగవతు లనబడిరి.

కూచిపూడి నాట్యములో ప్రజ్ఞానిధి అయిన శ్రీ వేదాంతం లక్ష్మినారాయణశాస్త్రి గారీ మధ్యనే చనిపోయిరి. వారినిగూర్చి ఆచార్య మోహన్ ఖోకర్ వ్రాసిన ప్రశంసా వాక్యములు గమనార్హములు—"Though shy, simple and unassuming, this Master is a real fount of knowledge pertaining to his art. He has trained several artists. When at Madras over 10 years ago, he even taught Balasaraswathi a whole set of padams and javalis. She later publicly declared that the Sastri's art and teaching had opened her eyes to a new world of dance and beauty, of which she had been unaware till then." ["Marg" - Vol X - No. 9 - (Sep, 1957) - page 32] (శ్రీ శాస్త్రిగారు నేర్పుటకు ముందే శ్రీమతి బాలసరస్వతి ఉత్తమ భరతనాట్య నర్తకిగా ప్రసిద్ధినందియున్నది!).

(2) *భరతనాట్యము:* దీనినే 'సదిర్ నాట్య' మనియు, 'తంజావూరునాట్య' మనియు అందురు. అసలు భరతనాట్య మనగా భరతుని నాట్యశాస్త్రమందు చెప్పబడిన రూపకప్రదర్శనవిధాన మని యర్థము. కాని, ఇప్పటి భరతనాట్యపదమునకు ఆ అర్థము వర్తించదు. ఇచ్చట నాట్య మనగా నృత్యము మాత్రమే. 'భరత' మనగా భావ-రాగ-తాళముల సమ్మేళనము కలిగిన దని అర్థము. ఈ భరతనాట్యము ప్రాచీనమైనదికాదు. తంజావూరు రాజగు శరభోజీ (క్రీ. శ. 1798-1824) పరిపాలనాకాలములో అనగా ఇంచుమించుగా 140 సంవత్సరముల క్రిందట మాత్రమే ఇది ఆరంభమైనది. శరభోజీమహారాజుఆస్థాననర్తకు లగు పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు, శివానందం అను నలుగురు సోదరులు ఈ భరతనాట్యమునకు పితామహులు. వీరు నాట్యమునందు అలరింపు, జతిస్వరము, శబ్దము, వర్ణము, పదము, తిల్లాన అను క్రమమును ఏర్పరచి దానిని సువ్యవస్థితము చేసినారు. నేడు భరతనాట్యమని పిలువబడునదిదియే. ఇందు సాధారణముగా ఒకేనర్తకి రెండుమూడు గంటలపాటు నృత్యముచేయును.

నాయికాభినయమందు గురువగు 'నట్టువనార్' చెలికత్తెగా వ్యవహరించుచుండును. అల రింపు అనునది ప్రార్థనాత్మకమైన నృత్తము. దీనికి ఎక్కువ కాలము పట్టదు. జతిస్వరం మను నది కేవలము నృత్తప్రధానమైన భాగము. కరణములిందు ప్రయుక్తములగును. శబ్దమునందు పాటతో అభినయ మల్పముగా ప్రారంభమగును. వర్ణమనునది నృత్త-అభినయముల అపూర్వ సమ్మేళనము. ఇందు కష్టతరములైన అంగహారములు ప్రయుక్తములగును. భరతనాట్య మంతటిలోను కష్టమైనభాగమిదియే. ఇది పూర్తిఅయిన పిమ్మట నర్తకి విశ్రాంతి తీసికొనును. ఇంక పదమనునది కేవలము అభినయ ప్రధానమైన భాగము. ఇందు క్షేత్రయ్య పదములు, కీర్తనలు, అష్టపదులు, శ్లోకములు అభినయింపబడును. ఇందుపయుక్తములగు గీతములు తెలుగు భాషలోనివే యగుట గమనార్హము. ఇప్పుడిప్పుడు జానపద గేయములను కూడ ఇందు అభినయించుచున్నారు. తిల్లానయందు శరీర సౌష్ఠవ ప్రదర్శకమైన నృత్తము ప్రయుక్తమగును. ఏదేని శ్లోకాభినయముతో నాట్యము పూర్తిఅగును. దేవదాసీవ్యవస్థ పతితమై నృత్యము నీచముగా పరిగణింపబడుచున్న కాలములో శ్రీ ఇ. కృష్ణయ్యరు (న్యాయవాది, మద్రాసు) దీనిని స్వయముగా అభ్యసించియు (1926-33), నర్తకులను ప్రోత్సహించియు (1933-34) భరతనాట్య పునరుద్ధరణమునకు పితామహుడయ్యెను. 1937 ప్రాంతమున శ్రీమతి రుక్మిణీదేవి రంగమున ప్రవేశించెను. పిమ్మట ఉదయశంకర్ ప్రభృతులు ఈ భరత నాట్య విషయమున అనేక నూత్న ప్రయోగములను చేసియున్నారు.

నేడీ భరతనాట్యము అంతర్జాతీయ ఖ్యాతిని గడించినది.

(3) *కథాకళి*: ఇది మలబారుదేశమునకు చెందినది. దీనిని ఉద్ధతనృత్యముగా పేర్కొనవచ్చును. ఇందు వాచికము అప్రధానమై ఆంగికాభినయము ప్రాధాన్యమును వహించును. ఇదికూడ 3, 4 శతాబ్దములక్రిందట మాత్రమే ఆరంభమైనది. కథాకళిపాత్రల వేషధారణమునం దొక ప్రత్యేకతకలదు. కథాకళికి మూలము భరతనాట్య శాస్త్రమే అయినను వారు దానియందు పెక్కులు మార్పులుచేసి, ఒక ప్రత్యేక శాస్త్రమును నిర్మించు కొనినారు. ఉదా: భరతుని త్రిపతాక హస్తము కథాకళిలో పతాకహస్తమగును. ఇట్టి మార్పులు కొన్ని అసహజములుగా ఉన్నవని విమర్శకులు నిరూపించియున్నారు [డా. వి. రాఘవన్‌గారి "Kathakali and Bharata Natya"అను వ్యాసమును చూడవలెను. త్రివేణి 6 సం. సంచిక 2] 'కథాకళి'ని 'నృత్యనాటకము'గా పేర్కొనుచుందురు. ఇందు రామాయణ భారతములయందలి కథలు చిత్రితములగుచుండును. కీ. శే. వల్లథోల్ మహాకవి దీనిని సువ్యవస్థితముచేసి, బహుళ ప్రచారములోనికి తెచ్చెను.

(4) *కథక్*: ఇందు హిందూ-మొగలాయి కళాసమ్మేళనముకలదు. ఇది ఉత్తర హిందూస్థానమందు ప్రచారములో నున్నది. భరత నాట్యమునందు హస్తాభినయము ప్రధానముకాగా ఇందుపాదప్రచారము ప్రధానము. కథక్ నర్తకుడు ఏ తాళమునందైనను గంటలకొలది నృత్యముచేయగలడు. ఇందు అర్థమునకు ప్రాధాన్యము లేదు. తాళగతి ఇందు పరాకాష్ఠ నందినదని చెప్పవచ్చును.

(5) *మణిపురి*: ఇది భక్తుల భక్త్యావేశమునకు సంబంధించిన నృత్యము. అస్సాము, బెంగాలు దేశములందు ప్రచారములోనున్నది. ఇందు శాస్త్రముకంటె లోకమే అధిక



## ప్రసిద్ధ భారతీయ నృత్య భేదములు



కూచిపూడి
(ఆంధ్రదేశము)



మణిపురి
(అస్సాంరాష్ట్రము)



భరతనాట్యము
(తంజావూరు, మద్రాసు)



కథక్ (ఉత్తర హిందూస్థానము)



కథాకళి (కేరళరాష్ట్రము)

ప్రాధాన్యమును వహించును. చైతన్యుని వైష్ణవముతో ఇది ఎక్కువ ప్రచారమునకు వచ్చిన దని చెప్పవచ్చును. అంగ-ప్రత్యంగములకు సంబంధించిన విలాసవిశేషము లిందు ప్రధానములు. మణిపురి నర్తకులు ఆకర్షణీయమైన వేషధారణ మొనర్తురు. మణిపురి నృత్యము లాస్యప్రధానమైన నృత్య మని చెప్పవచ్చును.

పై నృత్యస్వరూపములను దిఙ్మాత్రముగా సూచించియున్నాను; చెప్పవలసినదింకను చాలగలదు.

## 10. ప్రసిద్ధనృత్యభేదముల తారతమ్యము

ప్రసిద్ధ భారతీయ నృత్యభేదములను గూర్చి ప్రసంగవశమున శ్రీరామ్‌గోపాల్ ఈక్రిందివిధముగా చెప్పియుండెను_"Every dance form creates its own aura, exhales its particular atmosphere. Bharata Natyam has solemnity and spiritual grandeur. Kathakali delves into the metaphysical and creates from it an eerie world of enchantment. Kathak stimulates the senses as with the cloying smell of exotic blooms. But Manipuri is the dance form that reaches the heart of Nature, and epitomizes its beauty and its richness" ["Indian Dancing" by Ram Gopal and Serozh Dadachanji (1953) - Page 78].

పై గ్రంథకర్తలకు 'కూచిపూడనాట్య' మనునది ఒకటి కలదని తెలిసినట్లు లేదు. "తెలుగుపాటలతోపాటు భరతనాట్యముకూడ ఆంధ్రదేశమునందే జనించినదనెడివాదము అనుమానాస్పదము; కారణము మంచి నటరాజ విగ్రహములు ఆంధ్రదేశమునందు లేకపోవుటయే" అనియు వారు వ్రాసినారు [పుట 55]. ఈమధ్య కేంద్ర సంగీతనాటక అకాడమీవారు జరిపించిన చర్చా సదస్సులో పైనాలుగే శాస్త్రీయములైనవనియు ఒడిస్సీ, కూచిపూడి మొదలగు నృత్యములు శాస్త్రీయములు కావనియు నిర్ణయింపబడెను. సుశిక్షితులైన కూచిపూడి నర్తకుల ఉత్తమ ప్రదర్శనములను ఆ పండితులెవ్వరును చూడ లేదు. భారతప్రభుత్వ సమాచార శాఖవారు ప్రచురించిన "Indian Dance" అను చిన్న గ్రంథములో (ఫిబ్రవరి, 1955) 'The Kuchipudi Dance' అను శీర్షికతో ఒక అసహ్యకరమగు ఫొటో ప్రకటింపబడినది. కూచిపూడినాట్యమనగా వారికెంతతెలియునో ఇది చెప్పకయే చెప్పుచున్నది. అవకాశము కలిగినప్పుడు ఉత్తమ ప్రదర్శనమును చూపించుటకు కూడిపూడి నర్తకులుకాని, అందభిమానము కలిగిన పెద్దలుకాని, ప్రజాప్రభుత్వముకాని పూనుకొనలేదు. ఫలితముపై నిర్ణయము.

కూచిపూడి, భరతనాట్యములు రెండింటికిని మూలగ్రంథము ఒక్కటియే—భరతుని నాట్యశాస్త్రము లేదా దానికి పుత్రికవంటిదగు నందికేశ్వరుని అభినయదర్పణము. భరత నాట్యమందొక క్రమము పాటింపబడుచుండగా భామాకలాపమం దింకొక క్రమము పాటింపబడుచున్నది. మరియు భామాకలాపమందు, అప్రధానమైనను, అంతయో ఇంతయో ఇతివృత్త మున్నది. భరతనాట్యము రెండుమూడు గంటల కాలములో నిర్వర్తింపబడుచుండగా భామా కలాపమును పూర్తిగా ప్రదర్శించుటకు నాలుగైదు రోజులకంటె



ఎక్కువ కాలమే పట్టును. కాని, నేడు దానిని ప్రదర్శించు ఓపిక ఆ నర్తకులకును లేదు; చూచు ఓపిక ప్రజలకును లేదు; ఏదో తేలికగా, తక్కువ వ్యవధిలో, ఒకే పాత్రతో అయిపోయినచో అందరికిని చాలును.

కూచిపూడినాట్యము నృత్యము కాదనియు, నృత్యనాటక మనియు సాధారణముగా చెప్పుచుందురు. దీనిని శాస్త్రీయ నృత్యముల పట్టికలో చేర్చకపోవుట కిదియొక కారణమట. ఇంకొక ముఖ్యకారణము కూచిపూడి నాట్యము భరతనాట్యములోని భాగమే యట; అందుచే దీనిని ఒక ప్రత్యేక కళగా పేర్కొన నక్కరలేదట. ఇవి చాల వింతయైన కారణములు; అసలీ రెండు కారణములును సత్యదూరము లనుట సాహసము కాజాలదు. భామాకలాపమును సంపూర్ణముగా చూడకయే, ఆ నర్తకులు హడావిడిగా ప్రదర్శించు ఉషాపరిణయాది నృత్యనాటకములను మాత్రమే చూచి చెప్పెడిది మొదటి కారణము. భామాకలాపమునందలి ఇతివృత్తము లెక్కలోనిది కాదు; తక్కినపాత్ర లంతకంటెను అప్రధానములు. అందు భామ (సత్యభామ) ఒక్కతెయే ముఖ్యపాత్ర. ఆమె విసుగు కలుగకుండ, గంటలకొలది లేదా రోజుల తరబడి చేయు అభినయము నృత్యవిద్యకు నికషోపలము. ఈ సత్యమును గుర్తింపనివారి కేమిచెప్పిన ఏమి తెలియగలదు?

భామాకలాపమును, కూచిపూడి నృత్యనాటకములును నాలుగైదు శతాబ్దముల కంటె ప్రాచీనములు కాగా అవి నిన్న మొన్నటి దగు భరతనాట్యములోని భాగములే అనుట హాస్యాస్పదము. ప్రభువుల, ప్రజల ఆదరాభిమానములు దానికి లభించినవి, ఆ నర్తకు లదృష్టవంతులు (ఇట్లనుట వలన భరత నాట్యమును నేను తక్కువచేయుచున్నానని భావించరాదు; ఆ ఉత్తమ కళకు నే నెల్లప్పుడును వినయావనతుడనే). అట్టి భాగ్యము నేడు కూచిపూడి నర్తకులకును, వారి కళకును పట్టలేదు. కావుననే ఆ కళయును, ఆ నర్తకులును చిన్నచూపుతో చూడబడుట సంభవించినది. ఇందులకు కొంతవరకా నర్తకులు కూడ బాధ్యులే. వారిలో వారికి ఐకమత్యము లేకపోవుట, సంప్రదాయమును విడిచి, ప్రదర్శనములను ఆధునిక పద్ధతులలో సులువుగా తేల్చివేయుట మొదలగునవి వారి యందలి లోపములు.

కూచిపూడి నాట్య విశిష్టతను లోకమునకు చాటవలసిన బాధ్యత నాట్యకళాభిమానుల మీదను, ఆ నర్తకుల మీదను, ముఖ్యముగా ప్రజాప్రభుత్వము మీదను కలదు. ఈ విశిష్ట నాట్యము నశించుటయే సంభవించినచో అందులకు బాధ్యతను వారే వహించవలసియుందురు.

"దాక్షిణాత్యులు బహు నృత్త-గీత ప్రియులు" అని భరతుడు చెప్పుటయు, సంగీతమునందును నృత్త-నృత్యములందును ఆంధ్రులే తక్కిన దాక్షిణాత్యులకు నిన్న మొన్నటి వరకును మార్గదర్శు లగుటయు గమనార్హములు.

పైన పేర్కొనబడిన నృత్య విధానములన్నియును నాట్యశాస్త్రమందు చెప్పబడిన విధానము మీదనే ఇంచుమించుగా ఆధారపడియున్నవనుటలో సందేహములేదు. దేశ-కాల-ఆచార్య భేదముల ననుసరించి ఆ యా సంప్రదాయములు రూపొందినవి. భేదము బాహిరము మాత్రమే; ఆంతర్యమున వీనిలో గల ఏకతను విజ్ఞులు గుర్తింపగలరు.

పై విధములే కాక దేశమునం దింకను పెక్కు నృత్త-నృత్యభేదములు కలవు. ఇందులో ఒడిస్సీ మొదలగునవి 'మార్గ' జాతికి చెందినవి కాగా పర్వత-అరణ్య ప్రాంతీయ

లగు ఆటవికుల, జానపదుల నృత్త-నృత్యములు 'దేశి జాతి' కి చెందియున్నవి. భారతదేశమున ప్రసిద్ధినందిన నృత్యములలో రాధా-కృష్ణ నృత్యము బహుజనాదరణ పాత్రమైనదని చెప్ప వచ్చును.

## 11. నృత్తరత్నావళి : రామప్ప దేవాలయము

కాకతీయ గణపతిదేవుని సేనాపతియు, గజసైన్యాధినాథుడును అయిన జాయ (జాయన లేదా జాయప) సేనాపతి క్రీ. శ. 1253-54 (కలియుగ 4355 వ సం॥) లో 60 సంవత్సరములు దాటిన వయస్సులో నృత్త రత్నావళిని రచించెను. కౌమార దశ నుండియు జాయన ప్రజ్ఞాతిశయము తెరింగిన గణపతిదేవ మహారాజు స్వయముగా శ్రద్ధ వహించి గుండామాత్యులవారిచే ఆతనికి విద్యలను కళలను నేర్పించెనట. ఆ గణపతిదేవ మహారాజు కోరికపైననే జాయన నృత్తరత్నావళిని రచించెను. ఇందు రెండు ప్రధాన భాగ ములు కలవు—ఒకటి 'మార్గ' నృత్తము (ఇది భరతప్రోక్తము), ఈ విషయమునం దీతడు అభినవగుప్త-కీర్తిధరాచార్యుల ననుసరించెను; రెండవది 'దేశి' నృత్తము, ఈ విషయ మున మతంగుని బృహద్దేశిని అనుసరించెను. ఒక్కొక్క భాగమునందు నాలుగేసి అధ్యాయ ములు కలవు. మొదటి అధ్యాయము నర్తనవివేకము, రెండవది అంగనిరూపణము, మూడవది చారీ-స్థానక-మండల లక్షణము, నాలుగవది కరణ-అంగహార వివేచనము, అయిదవది దేశీస్థానక-కరణ-భ్రమరీ లక్షణము. ఆరు, ఏడు, ఎనిమిది అధ్యాయములందు ఆ కాలమున తెలుగుదేశములో నున్న దేశి నృత్త పద్ధతులు—పేరణి, చర్చరి, దండ రాసక, ఘటసరి, బహురూపము, చిందు, కోలాటము మొదలగున వెన్నియో వర్ణింప బడినవి. పాల్కురికి సోమనాథుడు కూడ పండితారాధ్యచరిత్రమందు బహువిధములగు దేశీ నృత్తభేదములను పేర్కొనెను. సంస్కృతమూలమందు లేకపోయినను తిక్కన సోమయాజి బృహన్నల నేర్పినదంతయు దేశీనృత్త మనియే పేర్కొనుట గమనార్హము—

> "ఒండు పనులకు నెలవులే కునికిఁజేసి, యభ్యసించితి శైశవమాదిగాగ
> దండలాసక విధమును గుండలియును, బ్రేంఖణంబు తెఱంగును బ్రేరణియును."
>
> (విరాటపర్వము - ప్ర. ఆశ్వా - 238 ప.)

జాయన సంగీతమును గూర్చి 'గీతరత్నావళి'ని కూడ రచించెనట. అది లభ్యము కాలేదు. లభించిన నృత్త రత్నావళి నైనను పరిష్కరించి ప్రచురించుటకు తెలుగుదేశమున ప్రయత్నము జరుగలేదు. ఇది విచారకరమైన విషయము. మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథ భాండారమువారి నిమిత్తము సహృదయులు డా. వి. రాఘవన్‌గారు దీని సంపాదకత్వమును వహించి విపులమైన ఆంగ్ల పీఠికతో 1968లో ప్రకటించినారు.

పెదకోమటి వేమభూపాలుని 'సంగీత చింతామణి' తిరువనంతపురమునందలి పేలస్ లైబ్రరీలో నుండుటయు, నాగరలిపిలోనున్న నృత్తరత్నావళి వ్రాతప్రతి యొకటి వంగదేశ మున లభించుటయు, రాజపుత్ర రాజైన కుంభకర్ణుడు తన సంగీతరాజ రచనమందు నృత్త రత్నావళి నుపయోగించుకొనుటయు పరిశీలింపగా నృత్త-నాట్య సాంప్రదాయక విజ్ఞాన మునకు తెలుగుదేశము ప్రామాణికముగానుండెడి దను విషయము స్పష్టమగుచున్నది.



(వివరములకు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి ఆంధ్రీకరణమును (1969). దానికి నా పీఠికను చూడవలెను.

వరంగల్లు జిల్లా పాలంపేటలోని రామప్ప దేవాలయము తెలుగుదేశములోని దేవా లయములన్నింటిలోను అధికశిల్పకళాసమన్వితము. ఇది 'రుద్రేశ్వరు'ని ఆలయము. కాకతీయ గణపతి దేవుని సేనానియు, మంత్రియు నగు రేచర్ల రుద్రదేవుడు క్రీ. శ. 1213 (శక. 1135)లో ఈ దేవాలయమును కట్టించెను. ఇందలి ప్రతిభాగమును ఒక అపురూప శిల్పఖండమే అనుట అతిశయోక్తి కానేరదు. కాకతీయులనాటి నృత్తకళాభిమానమున కిది పరాకాష్ఠ. ఈ దేవాలయశిల్పములే జాయనకు కూడ ప్రోత్సాహకములై యుండును. అందలి రెండు నృత్తభంగిమలను క్రింద ఉదాహరించుచున్నాను—





## 12. దేవదాసి : రాజనర్తకి

తన జీవితసర్వస్వమును దేవదేవుని సేవకు అంకితముచేసికొన్న భాగ్యశాలిని 'దేవదాసి' అనబడును. ఆ యా నిర్ణీత వేళలందును, ఉత్సవ సమయములందును ఆ దేవుని యెదుట నాట్య మండపమునందు నృత్యముచేయుట ఆమె ముఖ్య విధి. ఐదేండ్ల ప్రాయముననే తల్లిదండ్రు

లీమెను దేవునకు అంకితము చేసెడివారు. అప్పటినుండియు ఆమెకు దైవమే భర్త; ఆ దేవునిలో ఐక్యమైపోవుటకే ఆమె జీవితసాధన అంతయును. ఆదిలో 'దేవదాసీ' కుల మనునది లేదు. అట్లు దేవుని కంకితముచేయబడిన వీరందరును అస్ఖలితబ్రహ్మచారిణు లగుటచే కుల మేర్పడుట కవకాశము లేకుండెను. కాని, కాలక్రమమున ఆ నిష్ఠ తగ్గినది. వారును కామ-అర్థవశులై దేవుని సన్నిహితత్వమునకు అర్హతను కోల్పోయిరి. క్రమముగా 'దేవదాసీ' కుల మేర్పడినది. మఱికొంత కాలమునకు 'దైవ సేవ' అప్రధానమై 'మానవ సేవ' ప్రారంభమైనది. ఇట్లు పవిత్రమైన 'దేవదాసీవ్యవస్థ' పతితమైనది.

అట్టి సమయమందే కూచిపూడి బ్రాహ్మణులు నృత్య విద్యను చేపట్టియుందురు. సద్బ్రాహ్మణులు, అందున కేవలము పురుషులు, 'నృత్య' విద్యను చేపట్టి ఆ కళకు మరల ఒక ఉన్నతదశను కలిగించిరి.

శ్రీ వేదాంతము లక్ష్మీనారాయణశాస్త్రి (కూచిపూడి) వంటి నర్తకులు, శ్రీమతి పెండ్యాల సత్యభామ (దేవదాసి-సీతాపురము) వంటి నర్తకీమణులు భగవదైక్యమును పొందినారు. ఇంక, నేడు, తరువాతి తరమువా రేమిచేయుదురో చూడవలసియున్నది.

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'వేయిపడగ' లందు పవిత్ర మూర్తి అయిన ఒక 'దేవదాసి'ని మన కన్నులకు కట్టినారు; ఆమెయే 'గిరిక.' ఒకసారి ఆమె భక్తిపరవశయై పాడుచు 'దేవదేవునితోడి సంస్పర్శ' మనెడి భావము మనస్సునకు తట్టి నంతనే సిగ్గుపడిపోయినది. అప్పుడు ప్రక్కనేయున్న రాణి తన జీవితమును నిందించుకొన్న దట! ఆ పవిత్రమూర్తి యెదుట ఒక్క రాణియేమి? అందరును అంతియే. దేవదేవుని, కళను పవిత్రభావముతో ఆరాధింపగలుగుట పూర్వజన్మసుకృతఫలము మాత్రమే.

దేవాలయములందు దేవదాసివలెనే, రాజాస్థానములందు 'రాజనర్తకి' ఉండెడిది. శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానమందు రంజకం కుప్పాయి మొదలగు నర్తకీమణు లుండెడి వారని తెలిపియున్నాను. 'వసంతరాయ' బిరుదాంచితుడగు కుమారగిరిరెడ్డి ఆస్థానములో 'లకుమాదేవి' అనెడి రాజనర్తకి ఉండెడిది. ఈమెనుగూర్చి అనేకములగు గాథలు కలవు. కుమారగిరిరెడ్డి నాట్యవిద్యాపారంగతుడు, వసంతరాజీయమనెడి నాట్యశాస్త్ర కర్త. లకుమాదేవి ఆనాట్యశాస్త్రమందలి రహస్యములను అభినయించి వన్నెకూర్చెడిదట. ఈ విషయమును కుమారగిరిరెడ్డి బావమరదియగు కాటయవేముడు అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యాన ప్రారంభ శ్లోకములలో క్రింది విధముగా పేర్కొనియున్నాడు—

జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభోః । సదసి లకుమాదేవీ యస్యశ్రియా సదృశీ ప్రియా ।
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా । వితరతి బహూనర్థార్థి వ్రజాయ సహస్రశః ॥

—ఏ కుమారగిరి ప్రభువుయొక్క సిరితో సదృశురాలగు లకుమాదేవి సభలలో నాట్య శాస్త్రార్థములకు వేలకొలది నూతనాభినయములను చేకూర్చుచు అర్థి బృందమునకు వేల కొలది ధనములను దానము చేయుచున్నదో ఆ కుమారగిరి ప్రభుని మహిమ లోకాతీతమై వర్ధిల్లుచున్నది.



ప్రాచీన కాలమునుండియు దేవదాసియును, రాజనర్తకియును నృత్య విద్యకు పట్టుగొమ్మలై, దానిని పవిత్రభావముతో ఆరాధించుచు సాహిత్య ప్రపంచములో చిరంజీవిను లైనారు.

## 13. చిదంబర దేవాలయ గోపుర శిల్పములు : కరణములకు లక్ష్యములు

—పై శీర్షికతో 83, 84 పేజీలలో చిదంబర దేవాలయమందలి కరణముల లక్ష్యములను గూర్చి వివరించియున్నాను. ఆ గోపురకుడ్యములందలి ఒక భాగమును ఉదాహరణముగా క్రింద చూపుచున్నాను. ఆయా శిలాఫలకము లొండొంటితో అతుకబడిన విధానమును గమనించవలెను. వానిలో చివరిఫలకమందు కరణములనన్నింటిని చెక్కిన శిల్పుల మూర్తులు కలవు—



## 14. శివతాండవము

ఆంగికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయమ్ ।
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికమ్ శివమ్ ॥

అనినాడు నందికేశ్వరుడు అభినయదర్పణ ప్రారంభమందు. నృత్త సమయమున ఎవనికి ఈ విశ్వమంతయును ఆంగికాభినయమో: ఈ వాఙ్మయమంతయును వాచికాభినయమో; చంద్రతారాదులే ఆహార్యాభినయమో—అట్టి సాత్త్వికస్వరూపుడైన శివునకు నమస్కరించుచున్నా నని పై శ్లోక భావము.

నృత్త సృష్టికర్త శివుడే యని భరతుడు చెప్పినాడు. శివుడు 'నటరాజు' గా సుప్రసిద్ధుడు. శివుని నృత్తము అనాది. ఈ శివనృత్తము తండువుచే క్రమబద్ధమొనర్పబడినది కాన ఇది వానిపేర 'తాండవ' మనబడెను. ఇట్లు శివుని నృత్తమే 'శివతాండవ' మనబడినది. ఇట్టి శివతాండవము సప్తవిధము లని శైవాగమములు చెప్పుచున్నవి—1. కలికతాండవము, 2. ఉమా (గౌరీ) తాండవము, 3. సంధ్యా తాండవము, 4. సంహార తాండవము, 5. త్రిపుర (విజయ) తాండవము, 6. ఊర్ధ్వ తాండవము, 7. ఆనంద తాండవము. ఈ సప్త తాండవములును పరమేశ్వరుని పంచక్రియా శక్తికి అనగా సృష్టి-స్థితి-సంహార-తిరోభావ-అనుగ్రహము లనెడి ఈ క్రియ లైదింటికిని చిహ్నములు (బ్రహ్మ-విష్ణు-రుద్ర-మహేశ్వర - సదాశివులు ఈ పంచక్రియలకును కర్తలు). కలికతాండవము సృష్టికిని, ఉమా-సంధ్యా తాండవములు స్థితియందలి స్థిరత్వ-పరిరక్షణములకును, సంహారతాండవము ప్రపంచలయమునకును, త్రిపుర తాండవము తిరోభావమునకును, ఊర్ధ్వతాండవము అనుగ్రహమునకును (మోక్షమునకును) చిహ్నములు; ఇంక ఆనందతాండవము పై పంచక్రియల సమాహార రూపమై యున్నది.

చిదంబరమందు 'నటరాజస్వామి' ఆలయ మున్నది. సాధారణముగా ఉత్సవ సమయము లందలి ఊరేగింపుకొరకు దేవాలయములందు ప్రత్యేకముగా 'ఉత్సవ విగ్రహము' లుండును. కాని చిదంబరమునందు 'మూలవిరాట్టు' అయిన నటరాజస్వామి విగ్రహమునే కదలించి ఊరేగింతురు; ఇది అపూర్వము. ఆనందతాండవ రూపమైన నటరాజవిగ్రహ దర్శనము సాటిలేని ఒక అనుభూతిని కలిగించును. నటరాజవిగ్రహ స్వరూపమును, దాని వివరములను క్రింద పొందుపరచుచున్నాను. (పటము ప్రక్కపుటలో కలదు.)

నటరాజు జ్వాలమాలాప్రభామండలమం దున్నాడు. ఆ వృత్తాకారను సర్వనాదాత్మకమైన ప్రణవము (ఓమ్) నకు చిహ్నము. వేణిబంధము (జటాజూటము) నందు గంగయును, అర్ధచంద్రుడును కలరు. గంగ సంపత్సమృద్ధికిని, చంద్రరేఖ అనుగ్రహమునకును చిహ్నములు. అంతియేకాక చంద్రుడు కాలమున కధిపతికూడను. సూర్య-చంద్ర-అగ్న్యాత్మకములైన శివుని మూడు నేత్రములును మూడు కాలములకును చిహ్నములు. అంతియేకాక మూడవ నేత్రము జ్ఞానమునకు చిహ్నము (ఈ జ్ఞాననేత్రస్థానమందే మనము తిలకాదులను ధరింతుము). శివుని కుడిచెవియందు మకరకుండలమును (పురుషాభరణమును), ఎడమ చెవియందు తాటంకమును ఉండుట ఆతడు అర్ధనారీశ్వరు డనుటకు చిహ్నము. సర్పములు కుండలినీ శక్తికి చిహ్నములు; అసలు శివుడు భుజగభూషణుడు కదా! యజ్ఞోపవీతము పవిత్రతకును, సర్వకర్మాధిపత్యమునకును చిహ్నము. నాలుగు హస్తములలో పై కుడిచెయి డమరుక సమన్వితము, డమరుకము సృష్టికి చిహ్నము; క్రింది కుడిచేయి అభయ హస్తము, ఇది స్థితికి చిహ్నము; పై ఎడమచేయి అగ్ని సమన్వితము, ఇది సంహార






చిహ్నము; క్రింది ఎడమచేయి దోలాహస్తము, ఇది అనుగ్రహాత్మకమైనది. రెండుపాదములలో కుడిపాదము స్థితపదము. దానిక్రింద నున్న మరుగుజ్జు (రాక్షసుడు) రుగ్జరామరణములు, అజ్ఞానము మొదలగు వానికి చిహ్నము. శివుడు వానినెల్ల జయించి అణగద్రొక్కెను; ఆ జయచిహ్నమే స్థితపదము. ఎడమపాదము కుంచితపాదము; ఇది అనుగ్రహమునకును, మోక్షమునకును చిహ్నము. శివుడు ధరించిన గజచర్మమును, జంఘలమీది గజ్జెలును వీరతా చిహ్నములు. ఇట్టి తాండవము పరమేశ్వరుని పంచక్రియా శక్తికి చిహ్నమై యున్నది.

భరతుడే నృత్యమును సృష్టించెనని ఇంతకుముందు వివరించి యున్నాను. కాని నృత్తమునే కాక నృత్యమును కూడ శివుడే సృజించెనని కోహలుని అభిప్రాయమట—

"సంధ్యాయాం నృత్యతః శంభో ర్భక్త్యాగ్రే నారదః పురా ।
గీతవాం త్రిపురోన్మథం తచ్చిత్రస్తత్ర గీతకే ॥

చకారాభినయం ప్రీత స్తత స్తండుం చ సో ఒబ్రవీత్ ।
నాట్యోక్తాభినయేనేదం వత్స యోజయ తాండవమ్ ॥"

(అభినవభారతి 1 - వ సం - పుట 180.)

—హిమాలయముపై ఒకనాటి సంధ్యాకాలమున శివుడు నృత్త మొనర్చుచుండగా వాని యెదుట నారదుడు భక్తితో త్రిపురోన్మాథ గీతమును గానము చేసెను. ఆగీతమును వినుచున్న శివుడు ప్రీతమనస్కుడై ఆ గీతకార్థమును అభినయించెను. అంతట శివుడు తండువును పిల్చి "ఈ తాండవమును నాట్యమందు చెప్పబడిన అభినయముతో కూర్చుము" అని ఆదేశించెను.

శివానందలహరిలో శంకర భగవత్పాదులు శివుని సంధ్యాతాండవమును (50 వ శ్లో), ఆనంద తాండవమును (53 వ శ్లో.) ప్రశంసించి యున్నారు. సంధ్యాతాండవ ప్రసక్తి నాట్యశాస్త్రమందే కలదుకదా. తెలుగు కవి నన్నెచోడుడు తన కుమారసంభవమునందు శివతాండవమును వర్ణించియుండెను (ద్వితీయాశ్వాసాంతమున). సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు 'శివతాండవ' మను పేర చక్కని గేయకావ్యమును రచించినారు; అది నృత్త-గీతముల కనుగుణముగానుండి, చక్కగా నిర్వహింపబడినప్పుడు తాండవమూర్తి యగు శివుని మన కనుల యెదుట నిలుపుటకు సమర్థమై యున్నది.

## 15. పాశ్చాత్య నృత్త - నృత్యములు

పాశ్చాత్య దేశములందును నృత్త - నాట్య - నృత్యములు కలవు. క్రీ. పూ. 6, 5 శతాబ్దములనుండియు గ్రీసు దేశములో నృత్తము ప్రచారమందున్నదనుట స్పష్టము. డయొనిసస్ ఉత్సవములందు నృత్తము ప్రయుక్తమయ్యెడిదనియు, గ్రీకు నాటకోత్పత్తికి ఈ నృత్తమే మూలమనియు తెలిపియున్నాను. ఈ నృత్తము కేవలము గాత్ర విక్షేపాత్మకమే కాక గీతి సహితము కూడను. దీనినే ప్రొఫెసర్ ఆర్. జి. మౌల్టన్ 'ఆటపాట' (Ballad-Dance) అనెను (వెనుక చెప్పిన 'డిథిరాంబ్' అనునది ఈ ఆటపాటలలో ఒక భేదమే). ఈ ఆట పాటయే సర్వ సాహిత్య విద్యలకును మూలకందమని ఆతని సిద్ధాంతము. సౌలభ్యార్థము వాని వాక్యములనే క్రింద ఉదాహరించుచున్నాను ["The Ancient Classical Drama" - 1898 - Pp. 3-5] —

"The ultimate origin to which Greek Tragedy traces up is the Ballad-Dance, the fundamental medium out of which all varieties of literature have been developed—a sort of literary protoplasm. It consists in the combination of speech, music, and that imitative gesture which, for lack of a better word, we are obliged to call dancing...The real dancing of the Greeks is a lost art, of which the modern ballet is a corruption, and the orator's action a faint survival. It was an art which used bodily motion to convey thought: as in speech the tongue articulated words, so in dancing the body swayed and gesticulated into meaning.

......wherever the language of primitive peoples raises itself to that conscious elevation which makes it literature, it appears not alone, but supported by the sister arts of music and dance—a story, or poetical conception is at one and the same time versified, chanted, and conveyed in gesture......such



a Ballad-Dance is fitted to be the starting-point of all literary progress, will be easier to understand when it is recognised as the natural parent of the three main divisions of poetry. In epic poetry, where thought takes the form of simple narrative, the speech of the Ballad-Dance triumphs over the two elements. Lyric poetry consists in meditation or highly-wrought description taking such forms as odes, sonnets, hymns-poetry that lends itself to elaborate rhythms and other devices of musical art: here the music is the element of the Ballad-Dance which has come to the front. And the imitative gesture has triumphed over the speech and the music in the case of the third branch of poetry: drama is thought expressed in action.

......It must be premised that in Greek antiquity divine worship as a whole shows traces of a dramatic character."

నృత్త-నృత్య-నాట్య స్వరూపములు పైన దిఙ్మాత్రముగా సూచింపబడినవి. స్త్రీపురుషులు కలిసి నృత్యముచేయుట అనునది గ్రీకు లెరుగరు. వారి నృత్త-నృత్యములు మతసంబంధమైనవి; వారి నాట్యమగు విషాదరూపకము కూడ దానినుండియే వర్ధిల్లినది. గ్రీకుల నృత్య ప్రాశస్త్యమును గూర్చి Charles Kingsley చెప్పిన వాక్యములను మౌల్టన్ ఉదాహరించెను [పుట - 4]—"A dance in which every motion was a word, and rest as eloquent as motion; in which every attitude was a fresh motive for a sculptor of the purest school, and the highest physical activity was manifested, not, as in coarse comic pantomimes, in fantastic bounds and unnatural dispositions, but in perpetual delicate modulations of a stately and self-sustaining grace." అనాటి గ్రీకు నృత్యకళ కాలగర్భములో కలిసిపోయినది. పాశ్చాత్యుల నేటి నృత్యప్రకారములలో సుప్రసిద్ధమైనవి ఒకటి 'బేలే నృత్యము' (Ballet-Dance), రెండవది ఒపెరా (Opera). పదునాల్గవ లూయీ చక్రవర్తి కాలములో బేలే నృత్యము ఒక ప్రత్యేక కళగా పెంపొందినది. దీని నిర్వచన మీ క్రింది విధముగా నున్నది—"Ballet is a dramatic spectacle in which the action is presented in dancing and in mime to the accompaniment of music." [The Oxford Companion to the Theatre - P 47]. ఇంక ఒపెరా 1597-98 ప్రాంతముల ప్రప్రథమముగా ప్రదర్శితమైనది. ఇది మన యక్షగానమువంటిదని చెప్పవచ్చును. దీని నిర్వచన మీ క్రింది విధముగా నున్నది—"Opera is a dramatic composition, intended to be represented on the stage, in which vocal and instrumental music plays an essential part. In a stricter sense, opera has been defined as a drama of which every word is sung." [The Oxford Companion to the Theatre - page 585].

"Theatre and Stage" అను విజ్ఞానసరస్వములో 'Dancing, Ballet' అను శీర్షికతో ఆర్నాల్డ్ హాస్కెల్ అనునతడొక వ్యాసమును; 'Dancing, Stage' అను శీర్షికతో ఫిలిప్. జె. ఎస్. రిచర్డ్సన్ అనునతడొక వ్యాసమును [Vol. I. Pp. 181 - 215 and 216 - 232] వ్రాసియున్నారు. వానిని పరిశీలించవలెను. నర్తకియొక్క రూప-గుణాదులను గూర్చియు తదితరాంశములను గూర్చియు వారు చేసిన ప్రసంగములను పరిశీలించునప్పుడు బాహిరము లగు భేదములను విడిచివేసినచో సర్వదేశములందును కళలు అంతస్సారమున ఒకేవిధముగా నుండునని విజ్ఞులు గుర్తింపగలరు.

# అధ్యాయము 5

## పూర్వరంగము[1]

[కాశీ ముద్రణమునందు 175 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 180 శ్లోకములును, బరోడా ముద్రణమునందు 174 శ్లోకములును కలవు. మూడు ముద్రణములందును అధ్యాయాంతమున 40 శ్లోకములు అధిక పాఠముగా నీయబడినవి.]

### ఋషుల ప్రశ్నలు

నాట్య విషయములను ఇంకను వివరించుటకు పూనుకొనిన భరతుని వాక్యములనువిని సంతుష్టాంతరంగులైన మహర్షులు "నాట్యోత్పత్తి, జర్జరసంభవము, విఘ్నములశమనము, దేవతాపూజనము, మొదలగు విషయములను వింటిమి. వానినెల్ల మననము చేసితిమి. ఇంక సర్వలక్షణసంపన్నమైన పూర్వరంగమును సమగ్రముగా వివరింపుము." అని భరతుని కోరిరి. అంతట భరతుడు క్రిందివిధముగా వివరించెను -

ఓ మహానుభావులార! పూర్వరంగమును, దానికిసంబంధించిన పాదభాగములను, కలలను, పరివర్తములను[2] వివరింతును.

### పూర్వరంగ నిర్వచనము

రంగమునందు పూర్వమే, అనగా రూపకప్రయోగమునకు ముందే, ప్రయుక్తమగును గాన ఇది "పూర్వరంగ" మనబడుచున్నది.[3] తంత్రీ (వీణాదులు) - భాండ (మృదంగాదులు) - వాద్యములతో, పాఠ్యములతో (ప్రసంగములు) కూడియుండు

1. మూడు ముద్రణములందును "పూర్వరంగవిధానము" అని యున్నది.

2. పాదభాగములు=ధ్రువాస్వరూప నిరూపకములు. కళలు=నిష్క్రామాది సప్తవిధ తాలకలలు (ఈ కలా శబ్దముచే మానాత్మకమైన తాలమార్గము సర్వమును సంగృహీత మైనది). పరివర్తములు=గాన క్రియకు సంబంధించిన ఆవృత్తులు.

3. గీత - తాల - వాద్య - నృత్తములు వ్యస్తముగా కాని, సమస్తముగా కాని ప్రయుక్తమగునదియును, నాట్యాంగభూత మైనదియును పూర్వరంగ మనబడునని అభినవగుప్తుడు పేర్కొనెను. "పూర్వమే చేయబడెడి తౌర్యత్రికము పూర్వరంగ మనబడు"నని శ్రీ హర్షుడు పేర్కొనెను [అభినవ భారతి - 1 వ సం - పుట 209]. "రంగ సంరక్షణార్థము చేసెడి కర్మ పూర్వరంగ"మగునని విప్రదాసుడు పేర్కొనెను. [సంగీత చంద్రము-అముద్రితము.]



నట్లుగా పూర్వరంగముయొక్క అంగములను క్రిందివిధముగా యథాక్రమముగా నిర్వర్తించవలెను.

### పూర్వరంగాంగములు

1. ప్రత్యాహారము, 2. అవతరణము, 3. ఆరంభము, 4. ఆశ్రావణము, 5. వక్త్రపాణి, 6. పరిఘట్టన, 7. సంఘోటన, 8. మార్గాసారితము, 9. ఆసారితము. జ్యేష్ఠము, మధ్యమము, కనిష్ఠము అను భేదములచే ఆసారితము ముప్విధములు.

పై తొమ్మిదియును అంతర్యవనికాంగము లనబడును. వీనిని యవనిక[4] లోపలనున్న ప్రయోక్తలు తంత్రీ-భాండవాద్య సమన్వితముగా నిర్వర్తించవలెను. ఇవి బహిర్గీతము లనబడును.[5]

పిమ్మట యవనికను తొలగించి సర్వకుతప సంయుక్తముగా నృత్త-పాఠ్యములను నిర్వర్తించవలెను (అనగా యవనికను తొలగించిన పిమ్మట ఈ క్రింది బహిర్యవనికాంగములు పదింటిని వాద్యసహితముగా వరుసగా నిర్వర్తించవలెను)— 1. మొదట మద్రకాది గీతములలో ఏదో ఒక గీతకమును పాడవలెను; లేదా వర్ధమానకము ననుసరించెడి తాండవమును ప్రయోగించవలెను. దీనితరువాత 2. ఉత్థాపనము, 3. పరివర్తనము, 4. నాంది, 5. శుష్కావకృష్ట, 6. రంగద్వారము, 7. చారి, (8) మహాచారి, (9) త్రిగతము (త్రికము), (10) ప్రరోచన అను అంగములను క్రమముగా పూర్వరంగమున ప్రయోగించవలెను.

పూర్వరంగవిధియందు పై అంగములను నిర్వర్తించవలెనని తెలియవలెను.*

ఇంక ఈ అంగముల లక్షణములను వరుసగా వివరింతును.

4. యవనిక అనగా తెర. దీనినే 'జవనిక' అనియు అందురు. ఇది రంగపీఠ - రంగశీర్షముల మధ్య నుండునని అభినవగుప్తుడు పేర్కొనెను. 6 వ అధస్సూచికయందలి పటమును చూడవలెను. యవనిక అను పదము గ్రీకు ప్రాబల్యమునకు చిహ్నమని కొందరు వాదింతురు. అది సరికాదు. వివరములకు ఈ అధ్యాయాంతమందలి 7, 8 విశేషాంశములను చూడవలెను. ఈ యవనికలోపల నుండు నటులచేకాని, లేదా వైణవికాదులచేకాని ఇవి అన్నియును ప్రయుక్తములగును.

5. బహిర్గీతముయొక్క ఉత్పత్తి, ఆ పదనిర్వచనాదులు తరువాత వివరింపబడును. "బహిర్గీతము"నే "నిర్గీత" మనియు అందురు; లేదా నిర్గీతము బహిర్గీతములో ఒకభాగము.

*[బొంబాయిముద్రణమునందు - 1-16 శ్లో, బరోడాముద్రణమునందు - 1-16 శ్లో.]

అంతర్యవనికాంగములు

1. ప్రత్యాహారము- కుతపవిన్యాసము[6] 'ప్రత్యాహార' మనబడును. అనగా

---

6. 'కుతప' శబ్దమునకుగల అర్థము లిదివరకే వివరింపబడినవి. నేటి నాటక శాల లందీ 'కుతపము' రంగస్థలమునకును ప్రేక్షక స్థానములలోని మొదటి వరుసకును మధ్య ఒక నిమ్నప్రదేశమున (Pit) ఉండుట చూచుచున్నాము. ఆంధ్రదేశములో ఈ అలవాటు బెజ వాడ మైలవరం నాటక సమాజముతో (1914-15 లో) ప్రారంభమైనదని చెప్పుదురు. కాని, 'కుతపము' రంగశీర్షమునం దున్నప్పుడే 'నేపథ్య సంగీతము' (back-ground music) అనునది అన్వర్థమగును. 'హార్మోనియం' రాకతో రంగశీర్ష ప్రయోజనము అంతరించినదని చెప్పవచ్చును. అంతకుముందు ఫిడేలును, మృదంగమును రంగమునందే 'సైడు వింగ్సు'లో (side wings) ఉంచెడివారు. 1900 ప్రాంతములనుండి తెలుగు దేశమున హార్మోనియం ప్రచారములో నున్నది. ప్రారంభములో దీనిని శ్రుతికొరకుమాత్రమే ఉపయోగించెడివారు. తరువాత పద్యములకు వాయించుట ఆరంభమైనది.

ప్రత్యాహారమందు కుతప విన్యాసమును, అవతరణమందు గాయనీ-గాయకుల నివేశ నమును జరుగునుకదా. ఆయా స్థానములను అభినవగుప్తుడు స్పష్టముగా పేర్కొనెను [అభినవభారతి - 1 వ సం - పుట 212]. ఆ వివరములను క్రింది పటములో స్పష్టము చేయుచున్నాను (నాట్యగృహము యొక్క పూర్తిపటమును 34 వ పేజీలో చూడవలెను)—




సూచనలు:

1 - మార్దంగికుడు- పూర్వాభిముఖముగా కూర్చుండును.

2 - ఇరువురు పాణికులు లేదా పాణవికులు- మార్దంగికునకు వామ పార్శ్వమున కూర్చుందురు.

3 - గాయకుడు- రంగపీఠమునకు దక్షిణమున ఉత్తరాభిముఖముగా కూర్చుండును.

4 - గాయనులు (స్త్రీలు - ఇద్దరు ముగ్గురు)- గాయకుని ఎదుట దక్షిణాభిముఖముగా కూర్చుందురు.

5 - వైణికుడు- గాయకుని వామ పార్శ్వమందు కూర్చుండును.

6 - వేణుధారులు (ఇరువురు)- వైణికుని ఎదురుగా కూర్చుందురు.

7, 7 - వేషధారులైన నటులు విశ్రమించు స్థానములు.

(మొత్తము పది పదునొకండు మంది ఒక 'మేళ'ములో నుందురు.)

★ - నేపథ్యగృహ ద్వారములు.

..... - రంగపీఠ - రంగ శీర్షముల మధ్య గల తెర.



నిర్దిష్టస్థానములందు వాదకులు తమతమ వాద్యములను చేర్చుట. దీనిని ఆచరించుట వలన యాతుధానులును, పన్నగులును సంప్రీతు లగుదురు.

2. అవతరణము- గాయనీ[7]-గాయకులు వచ్చి నిర్దిష్టస్థానములందు కూర్చుండుట 'అవతరణ' మనబడును. దీనిని నిర్వర్తించుటవలన అప్సరసలు సంతుష్టి నందుదురు.

3. ఆరంభము- పరిగీతక్రియారంభము 'ఆరంభ' మనబడును. అనగా గీతము నుపక్రమించుటకుముందు గాత్రమును సరిచేసికొనుటకు ఆలాపముచేయుట. దీనివలన గంధర్వులు సంతోషింతురు.

4. ఆశ్రావణ- ఆతోద్యరంజనము 'ఆశ్రావణ' మనబడును. అనగా ఆయా వాద్యముల శ్రుతులను ఏకోన్ముఖమగునట్లుగా సరిచేసికొనుట. దీనివలన దైత్యులు సంతుష్టి నందుదురు.

5. వక్త్రపాణి- వాద్యవృత్తి విభాగము 'వక్త్రపాణి' అనబడును. అనగా దక్షిణవృత్తి, వామవృత్తి మొదలగు వృత్తుల ననుసరించి వాద్యములను సరిచేసికొనుట. దీనివలన దానవులు సంతుష్టి నందుదురు.

6. పరిఘట్టన- వీణాదులపై శుష్కాక్షరములను (అర్థరహితములయిన ధ్వనులను) పలికించుట 'పరిఘట్టన' అనబడును. దీనివలన రాక్షసగణములు తృప్తి నందును.

7. సంఘోటన- పాణివిభాగార్థము 'సంఘోటనా' విధి నిర్ణయింపబడినది. లయానుగుణముగా అవనద్ధాదులను (మురజాదులను) సరిచేసికొనుట సంఘోటన అనబడును. దీనివలన గుహ్యకులు సంతుష్టిని పొందుదురు.

8. మార్గాసారితము- తంత్రీ-భాండ సమాయోగము 'మార్గాసారిత' మన బడును. అనగా వీణాది తంత్రీవాద్యములను, మురజాది భాండవాద్యములను సమ్మేళనముచేసి పలికించుట. దీనివలన యక్షులు సంతుష్టి నందుదురు.

---

7. యద్యపి పురుషో గాయతి గీతవిధానం తు లక్షణోపేతమ్।
స్త్రీవిరహితః ప్రయోగ స్తథాపి న సుఖావహో భవతి॥—

—అని 30 వ అధ్యాయమందు చెప్పబడును. లక్షణోపేతమైన గీత విధానమును పురుషులు గానము చేసినప్పటికిని స్త్రీ విరహితమైన ప్రయోగము సుఖమును గలిగించదు అని దీని భావము. సంగీత విషయముననే కాక, ప్రయోగమునందును స్త్రీల ప్రాధాన్యమును, ఆవశ్యకతయును స్పష్టముగా గుర్తింపబడినది. ఇందులకు ప్రత్యేకముగా అప్సరసలు సృష్టింప బడుట ప్రథమాధ్యాయమందు వర్ణింపబడినది కదా. [అభినవభారతి-1 వ సం-పుట 212]

9. ఆసారితము- కలాపాతవిభాగార్థము ఆసారితక్రియ విధింపబడినది. ఇది తాలగతమైనవిధికి సంబంధించియున్నది. దీనివలన యక్షులు సంతుష్టినందుదురు.[8]

యవనిక వెలుపల నిర్వర్తింపబడు అంగములు

1. గీతవిధి- దేవతలను కీర్తించుటకొరకు గీతవిధి నిర్దిష్టమైనది. దీనిని నిర్వర్తించుటవలన దేవతలు సంతుష్టులగుదురు. ఇది శుద్ధపూర్వరంగమందలి విధి. ఇంక చిత్రపూర్వరంగమందలి వర్ధమానకసహితతాండవప్రయోగమువలన అనుచర సహితుడగు రుద్రుడు ప్రీతుడగును.

2. ఉత్థాపనము- నాందిపాఠకులు[9] రంగమునందు ప్రప్రథమముగా ప్రయోగమున కుపక్రమింతురుకాన ఇది 'ఉత్థాపన' మనబడినది. దీనివలన బ్రహ్మ సంతుష్టుడగును.

3 పరివర్తనము- నాలుగుదిక్కులను వరుసగా చుట్టివచ్చుచు లోకపాలురకు వందనములుచేయుట 'పరివర్తన' మనబడును. దీనివలన లోకపాలురు సంతుష్టినందుదురు.

4. నాంది- దేవ-ద్విజ-నృపాదులయొక్క ఆశీర్వచనములు కలదై నిత్యము ను ప్రయుక్తమగునది "నాంది" అనబడును.[10] దీనిని ప్రయోగించుటవలన చంద్రుడు సంప్రీతుడగును.

---

8. ఆశ్రావణాదులు ఆరే బహిర్గీతము లనబడును. ప్రత్యాహార-అవతరణ-ఆరంభములు మూడింటికిని ప్రత్యేకస్థితి లేదు; అవి ఆశ్రావణమందే కలిసిపోవును.

9. నాందిని పఠించువాడు సూత్రధారుడు.' ఏవమస్తు' అనువారు పారిపార్శ్వకులు. వీరు ముగ్గురే నాంది పాఠకులు. అంతమున ప్రస్తావనాదులను నిర్వర్తించుటకు సూత్రధారుడే 'స్థాపకుడు' అయి మరల రంగమును ప్రవేశించును. 31 వ అధస్సూచికను కూడ చూడవలెను.

10. పూర్వరంగమందు అంతర్యవనికాంగములు తొమ్మిదియును,యవనికకు వెలుపల నిర్వర్తింపబడు అంగములు పదియును (మొత్తము 19) చెప్పబడినవి. ప్రయోగ వశమున వీనిలో కొన్నింటిని కాని లేదా అన్నింటిని కాని మానివేయవచ్చును. కాని, నాందిమాత్రము ఎల్లప్పుడును అపరిహరణీయమని 'నిత్య' శబ్దమున కర్థము. కావుననే "నాంద్యంతే సూత్రధారః" అని ప్రాచీన కవులు తప్పక లిఖించుచుందురు. కావున నాందిని మాత్రము తప్పక పఠించవలెను. ఈ నాందియే భారత్యంగ నిరూపణమున (20 వ అధ్యాయములో) "ప్రరోచన"గా పేర్కొనబడినది [అభినవభారతి - 1 వ సం - పుట 217.].

"దేవ-ద్విజ-నృపాదులయొక్క ఆశీర్వచనములుకలదై" అనునప్పుడు "వారి ఆశీస్సుల నర్థించుచు చేసెడి ప్రార్థన" అనికాని, "శివుడు మిమ్ము రక్షించునుగాక !"-ఇట్లు మంగళమును



5. శుష్కావకృష్ట- అవకృష్టధ్రువ శుష్కాక్షరములచే ప్రయుక్తమగుటవలన ఇది శుష్కావకృష్ట అనబడినది. మరియు ఇది జర్జరస్తుతిపూర్వకమై యుండును. దీని ప్రయోగమువలన పితృగణములు తుష్టినందును. అవకృష్టాప్రయోగముచే నాగులును, జర్జరస్తుతి ప్రయోగముచే విఘ్నవినాయకులును సంతుష్టినందుదురు.

6. రంగద్వారము- వాచిక-ఆంగికాభినయములు ఇచ్చటనుండియే ప్రారంభమగును కాన ఇది 'రంగద్వారము' అనబడినది. (అనగా ఇది రంగమునకు ప్రవేశము వంటిదన్నమాట. ఉత్థాపనమందలి ప్రారంభము సర్వప్రయోగ సామాన్యమైనది. ఇందలి ప్రారంభము నిర్దిష్టరూపక విశేషాత్మకమైనది.) దీనివలన విష్ణువు సంప్రీతుడగును.

7. చారి- శృంగారాభినయము 'చారి' అనబడును.[11] దీనివలన పార్వతి సంతుష్టినందును.

8. మహాచారి- రౌద్రాభినయము 'మహాచారి' అనబడును.[12] దీనివలన భూతగణములకు సంతోషము కలుగును.

---

కోరుట అనికాని అర్థమును చెప్పుకొనవలసి యున్నది. రూపకములందు కన్పట్టు నాందీ శ్లోకములు రెండవ విధముగానే కన్పట్టుచున్నవి. "ఆశీర్వచనముతోఁ గూడినదిగా దేవ-ద్విజ-నృపాదుల స్తుతి యేది ప్రయోగింపఁబడునో అది 'నాంది' యని పేర్కొనబడినది" అని విశ్వనాథుడు నాందిని నిర్వచించెను [(శ్రీ) వేదంవారి అనువాదము-సూ.282-పుట 136]. ఈ అధ్యాయాంతమందలి 6 వ విశేషాంశమును చూడవలెను.

ఈ నిర్వచనాంతమందు బొంబాయి ముద్రణములో ఒక గద్యము కలదు ; బరోడా ముద్రణమునందు ఇది అధస్సూచికలో నున్నది— "చిత్ర పూర్వరంగమందు నాందీ పాదముల మధ్య పూర్వోక్త లక్షణముకల వర్ధమానకమును ప్రయోగించవలెను. కొందరు శుద్ధ-చిత్ర పూర్వరంగములందు గీతక ప్రయోగానంతరము వర్ధమానకమును వాంఛింతురు."

ఈ వర్ధమానకమును ఐదవ బహిర్యవనికాంగముగా కొందరు గణింతురట. అప్పుడవి పదునొకండగును. అందుచేతనే కాబోలు డా. సి. బి. గుప్త [Indian Theatre-Page 119] మొదలగువారు మొత్తము 20 అంగములని పేర్కొనిరి.

నాందీ ప్రయోగముచే చంద్రుడు ప్రీతుడగును ; కావుననే అర్వాచీనులు నాంది చంద్ర నామాంకితము కావలెనందురు.

11. శృంగార ప్రధానమైన పార్వతీ - పరమేశ్వరుల చరితమును స్తుతిరూపముగా తదుచితములైన అంగహారముల చేతను, చారులచేతను ప్రదర్శించుట 'చారి' అనబడును. [అభినవభారతి-1 వ సం - పుట 219]

12. పరమేశ్వర .కృతములును, రౌద్రరస భూయిష్ఠములును అగు త్రిపురమర్దనాదులను, స్తుతిరూపముగా, తదుచితములైన మండల-అంగహారములచే ప్రదర్శించుట 'మహాచారి' అనబడును. [అభినవభారతి-1 వ సం-పుట 219]

9. త్రిగతము ("త్రికము" అని కొన్నిచోట్ల కలదు)- విదూషకుడు, సూత్రధారుడు, పారిపార్శ్వకుడు అను ముువ్వురును భావిరూపకవిషయమగు సంభాషణమును చేయుట 'త్రిగత' మనబడును.

10. ప్రరోచన- హేతుయుక్తి సమాశ్రయముగా (ఆయా కారణములను కూర్చుటచే) కావ్యార్థసూచనముచేసి, ప్రయోగింపబోవు రూపకమునందు సామాజికులకు ప్రీతికలుగునట్లు చేయుట 'ప్రరోచన' అనబడును.[13]*

బహిర్గీతవిధి

ఇంక బహిర్గీతవిధియందలి ఆశ్రావణవిధిక్రియను, బహిర్గీతముయొక్క ఉత్పత్తిని, దాని ప్రయోగమునందలి ప్రయోజనమును వివరింతును—

నారదాదులును, గంధర్వులును ఉపోహన - నిర్గీతసహితమును, దేవస్తుత్యభినందితమును అయిన 'సప్తరూపము'ను చిత్ర - దక్షిణవృత్తులలో సభయందు ప్రవర్తింపజేయుచు దేవ-దానవులందరకును సమ్యగ్లయతాల సమన్వితమైన నిర్గీతమును వినిపించిరి.[15] సప్తరూపమైన గానము సుఖజనకముగా నున్నను, అది దేవస్తుత్యభినందితమగుటచే దానిని విని, మాత్సర్యమువలన, దైత్య రాక్షసులు క్షోభమును పొందిరి ; వారికి నిర్గీతమే బాగున్నదనిపించెను.

అంతట, "వాదిత్రసహితమైన నిర్గీతమునే మనము గ్రహింతము. స్వకర్మానుకీర్తనమయిన సప్తరూపముచే దేవతలు సంతోషించిన సంతోషింతురుగాక. ఇంక

13. త్రిగత-ప్రరోచనలవలన ఎవరు సంతుష్టి నందుదురో చెప్పబడలేదు.

ఇన్ని పూర్వరంగ విధులు స్థూలదృష్టికి అనవసరములుగా తోచవచ్చును. అది సరి కాదు. వివిధవ్యావృత్తులలో నున్న ప్రజలందరును ఒకే సమయమునకు రాలేరు. ముందు వచ్చినవారికి, ముఖ్యముగా స్త్రీ-బాల-మూర్ఖాదులకు, కుతూహలము జనింపజేయుటకై ఇన్ని విధు లేర్పడినవి. అంతియేకాదు, ఇది అంతయును దేవతా పూజాపూర్వకము ; దేవతలు సంతుష్టులైనచో శుభఫలముల నొసంగుదురు.

*[బొంబాయి ముద్రణమునందు - 16-30 శ్లో. + 46.53 శ్లో; బరోడా ముద్రణమునందు - 16-29 శ్లో. + 45.52[14] శ్లో.]

14. ఈ శ్లోకములందు తరువాత వివరింపబడెడి ప్రయోజనములను సౌలభ్యార్థము ఇచ్చటనే ఆయా స్థలములందు వివరించియున్నాను.

15. దేవస్తుత్యభినందితము=దేవతాస్తుతిపూర్వకమైనది ; అనగా అహో, రమ్యము, సాధు సాధు అనెడి స్తుతులచే దేవతలు తమతమ అభినందనములను తెలియజేయుచున్నారు. లయలు=ద్రుతాదులు, తాలములు=శమ్యాది విశిష్టములైన త్ర్యశ్ర - చతురశ్ర - మిశ్ర తాలములు. నిర్గీతము=నిరర్థకగీతము అనగా అర్థసహితమగు పదయోజనము లేనిది.



మనము మాత్రము నిర్గీతమునే గ్రహించి, దానిచేతనే సర్వదా సంతుష్టిని పొందుదము." అనుచు దైత్య-రాక్షసులు తమలో తాము హెచ్చరికలు చేసికొని తమకు సంతుష్టిని కలిగించెడి నిర్గీతమును మాత్రము (అది అర్థరహితమైనను తమకు అభిమానపాత్ర మగుటచే) మాటి మాటికిని పొగడుచుండిరి. ఇది దేవతలకు కోపకారణమయ్యెను. "ఈ దానవ-రాక్షసులు నిర్గీతముచేతనే సంతుష్టిని పొందుచున్నారు. వీరికి సప్తరూప మక్కరలేదు. ఈ నిర్గీతప్రయోగము నశించవలెనని మేము కోరుచున్నాము, మీ అభిప్రాయమేమి ?" అని వారు నారదుని అడిగిరి.

అంతట నారదుడు "వైణవ స్వరాశ్రయమైన నిర్గీతము నశించకుండునుగాక. ఉపోహన సంయుక్తమును, వైణవస్వర విభూషితమును అయిన ఈ నిర్గీతము సప్తరూపవిధానమునకూడ ఉండును. ఇట్టి నిర్గీతముచే ఆకృష్టులైన దైత్య-దానవ-రాక్షసులు ప్రయోగమున కింక క్షోభమును, విఘాతమును కలిగింపరు." అని దేవతలకు నచ్చజెప్పెను.

ఇట్లిది దైత్యుల స్పర్థవలన 'నిర్గీత' మనియు, దేవతల బహుమానమువలన 'బహిర్గీత' మనియు వ్యవహరింపబడినది. బుధులు దీనిని లోహతంత్రులుగల చిత్రవీణమీద గురు-లఘ్వక్షర సమన్వితముగా, వర్ణ-అలంకారసంయుక్తముగా ప్రయోగించవలెను. అర్థబోధక పదరహితమై, కేవల వర్ణయోజనముచేతనే గానము చేయబడును కాన ఇది 'నిర్గీత' మనబడినది. ఈ నిర్గీతము నిజముగా దేవతలకు మనస్సునందిష్టములేకున్నను, నారదాదేశము ననుసరించి బలాత్కారముగా బహుమానము చూపవలసి వచ్చినది. ఇట్లిది మనస్సునకు వెలుపలిది అనగా మనః పూర్వకముకానిది అగుటచే ఇది 'బహిర్గీత'మని కూడ పిలువబడినది.[16] అంతియేకాక సార్థకపద సంయుక్తమగునప్పుడు కూడ ఇది 'బహిర్గీత' మనబడును.

16. కేవల నిర్గీతము (నిరర్థకమైన గానము) చే దేవత లెన్నడును సంతోషించరు. "అసూయయా చ దేవానాం బహిర్గీత మిదం స్మృతం" అనునప్పుడు 'చ' కారముచే ఈ బహిర్గీతము సార్థకములగు పదములతో కూడ కూడియుండునని సూచితమగుచున్నది. [అభినవభారతి-1వ సం-పుట 223]

నిర్గీత-బహిర్గీత పదములను విప్రదాసుడు క్రింది విధముగా వివరించెను [సంగీత చంద్రము-అముద్రితము]—

"ఆశ్రావణ - ఆరంభ - వక్త్రపాణి - పరిఘట్టన - సంఘట్టన - మార్గాసారితములు అను ఆరు అంగములును దేవస్తుత్యర్థములు. ఇవి రెండువిధములు—అపదము, పదబద్ధము. అపదము నిర్గీతమనబడును. పదబద్ధమైనది బహిర్గీతమనబడును. ఇది సర్వదేవ ప్రియావహము. అందుచే ఆశ్రావణాదులను పదబద్ధములుగానే ప్రయోగించవలెను."

సప్తరూప సమన్వితమైన నిర్గీతముయొక్కయు, ఉత్థాపనాదుల యొక్కయు[17] ప్రయోజనము నింక వివరింతును.*

ఆశ్రావణము మొదలు మహాచారివరకును గల పూర్వరంగాంగము లన్నియు దేవతాపూజకొరకు ఉద్దిష్టములైనవి. ఏయే అంగములచే ఏయేదేవతలు సంతుష్టి నందుదురో, ఎవరిమనస్సున కేదిప్రియమో దానినంతయును ఆయా అంగములను వివరించునప్పుడే పేర్కొనియున్నాను.[18] ఇట్లు పూర్వరంగము చక్కగా నిర్వర్తింపబడినచో దేవతలందరును ప్రశంసింతురు. ఈ సర్వదైవత పూజనమువలన ప్రేక్షాపతి, ప్రయోక్తలు మొదలగువారికి ధనము, యశస్సు, ఆయువును కలుగును. ఈ పూర్వరంగ కృతములగు నిర్గీతములచే దైత్య-దానవులును, సగీతములచే దేవతలును తుష్టినందుదురు.[19] ధ్రువావిధానమును వివరించునప్పుడు (31 వ అధ్యాయమందు) నిర్గీత - సగీత - వర్ధమానకములయొక్క లక్షణ-కర్మలను వివరింతును.*

---

17. "ప్రత్యాహారమువలన యాతుధానులును పన్నగులును, అవతరణము వలన అప్సరసలును, ఆరంభమువలన గంధర్వులును సంతోషింతురు." అని వివరించెడి 1½ శ్లోకమును ప్రక్షిప్తమని అభినవగుప్తుడు త్రోసిపుచ్చెను. ప్రత్యాహారాదులు మూడును ఆశ్రావణయందే అంతర్భూతములగునని ఆత డభిప్రాయపడెను. [అభినవభారతి-1 వ సం-పుట 224]

ఇంక అంతర్యవనికాంగములైన ఆశ్రావణాదులు ఆరును, ప్రథమబహిర్యవనికాంగమైన గీతవిధి ఒకటియును కలిసి మొత్తము ఏడు అంగములగును. ఇదియే సప్తరూపమైన నిర్గీతము. కావుననే "సప్తరూప సమన్వితమైన నిర్గీతము యొక్కయు ఉత్థాపనాదుల (శేషించిన బహిర్యవనికాంగముల) యొక్కయు ...." అని చెప్పబడినది.

*[ బొంబాయి ముద్రణమునందు 31-45 శ్లో; బరోడా ముద్రణమునందు 30-44 శ్లో.]

18. ఆయా అంగములను నిర్వచించునప్పుడే నేనీ ప్రయోజనములను వివరించియున్నాను. అందుచే ఇచ్చట నున్న 8 శ్లోకములను [బరోడా - 45-52 శ్లో.] మరల అనువదించలేదు.

19. ఇచ్చట, అనగా 56 వ శ్లోకము తరువాత ఒక అధిక శ్లోకముకలదు—

"యా విద్యా యాని శిల్పాని యా గతి ర్యచ్చ చేష్టితమ్ ।
లోకాలోకస్య జగత స్తదస్మి న్నాటకాశ్రయే" ॥

—నాటకములో ఈ జగత్తునందలి సమస్తవిద్యలు, శిల్పములు, గతులు, చేష్టితములు ఉన్నవి.

*[ బొంబాయి ముద్రణమునందు - 54-61 శ్లో., బరోడా ముద్రణమునందు 53-57 శ్లో.]



## శుద్ధచతురశ్రపూర్వరంగవిధి[20]

### గీతకవిధి

పిమ్మట మద్రకాది గీతములలో ఎదో ఒక గీతమునుకాని, లేదా వర్ధమానక సహితమగు తాండవమును కాని ప్రయోగించవలెను.

### ఉత్థాపనము

తరువాత "ఉత్థాపనీధ్రువ" ను గానముచేయవలెను. ఈ ధ్రువయందు 4 పాదములుండును. పాదమునకు 11 అక్షరములు ; వీనిలో 1, 2, 4, 8, 11 అక్షరములు గురువులు. తక్కినవి లఘువులు. ఇది త్రిష్టుప్ ఛందములోని 'విశ్లోక' మనెడి వృత్తజాతికి చెందినది ;[21] తాళమును తదుచితముగానుండవలెను. అనగా చతురశ్రతాలమునకు సంబంధించినదై 4 సన్నిపాతములు, 3 లయలు, 4 పరివర్తములు (గానక్రియకు సంబంధించిన ఆవృత్తులు), 3 పాణులు కలిగియుండును. ఇందు 2 కలలుగల శమ్య, 2 కలలుగల తాలము, మరల ఏకకలాయుతమైన శమ్య, 3 కలలు గల సన్నిపాతమును ఉండును. ఇట్లు అష్టకలాయుతమగు సన్నిపాతమును ప్రయోగించవలెను. ఇట్టి సన్నిపాతములు నాలుగు కలిసి ఒక పరివర్తమగును.

1. *ప్రథమపరివర్తము* : వీనిలో ప్రథమపరివర్తము స్థితలయయందు ప్రయుక్తము కావలయును. ఇందలి తృతీయ సన్నిపాతమునందు ఖాండములను ప్రయోగించవలెను.

2. *ద్వితీయ పరివర్తము* : పిమ్మట ద్వితీయ పరివర్తమును మధ్య లయయందు గానముచేయవలెను; ఆ సమయములో పారిపార్శ్వక సహితముగా సూత్రధారుడు రంగమునందు ప్రవేశించవలెను. రక్షామంగళ సంస్కృతులు, శుద్ధవస్త్ర

---

20. చతురశ్ర - త్ర్యశ్ర భేదములచే పూర్వరంగము రెండువిధములు - ఇప్పుడు 'చతురశ్రపూర్వరంగ' విధానము వివరింపబడుచున్నది. పిమ్మట 'త్ర్యశ్రపూర్వరంగ' విధానము వివరింపబడును. త్ర్యశ్రమునందు కలా - తాలప్రమాణములు సంక్షిప్తములగును. ఇదియే వీనికి గల ముఖ్యభేదము. ఈ చతురశ్ర - త్ర్యశ్రములను శుద్ధముగా కాని, చిత్రముగా కాని ప్రయోగించవలెను. ఇప్పుడు శుద్ధచతురశ్రపూర్వరంగము వివరింపబడుచున్నది. దీనికి 4 వ అధ్యాయమందు చెప్పబడిన వర్ధమాన సహితమగు తాండవమును చేర్చినచో చిత్రపూర్వరంగము కాగలదు. ఇదియే వీనికి గల ప్రధానభేదము. ఈ అధ్యాయాంతమున గల అధిక భాగమునందు చతురశ్ర - త్ర్యశ్రములే కాక 'మిశ్రమము' అను మూడవభేదముకూడ పేర్కొనబడినది.

21. ఛందోభేదములు 14 వ అధ్యాయమందును, అందలి వృత్తభేదములు 15 వ అధ్యాయమందును వివరింపబడినవి.

ధారులు, సమనస్కులు, అద్భుతదృష్టియుతులు, దీక్షితులు (ఉపవసించినవారు), శుచులును అయిన ఆ ముగ్గురును సమముగా ప్రవేశించి, సౌష్ఠవాంగ పురస్కృతముగా వైష్ణవస్థానమందు నిలువవలెను. సూత్రధారుడు పుష్పాంజలియుతుడు కాగా పారిపార్శ్వకులిరువురిలో ఒకడు భృంగారమును (బంగారపు జలకలశమును) రెండవవాడు జర్జరమును ధరించియుండవలెను. సూత్రధారుడు ఆ యిరువురి మధ్య నిలిచి, వారితోపాటుగా బ్రహ్మ పూజార్థము 5 అడుగులు ముందునకు నడవవలెను. ఈ నడకలో చరణ విన్యాసము క్రిందివిధముగా నుండవలెను— మధ్య దూరము మూడు తాలములు (ఈ 'తాలము' కొలతకు సంబంధించినది) ఉండునట్లుగా ఒక్కొక్క పాదమునే (మొదట వామపాదమును) మెల్లగా పైకెత్తి, దించి, అదే దూరములో ఉంచుచుండవలెను. ఇట్లు 5 అడుగులువేసి, మొదట వామపాదముతో సూచీచారిని, తరువాత దక్షిణ పాదముతో విక్షేపమును ఆచరించవలెను. అప్పుడు సూత్రధారుడు 'బ్రహ్మమండలము' నందు పుష్పాంజలిని సమర్పించవలెను; రంగపీఠ మధ్యమందు బ్రహ్మ స్వయంప్రతిష్ఠితుడై యున్నాడుకదా. తరువాత లలితహస్తాభినయముతో ముమ్మారు భూమిపై బ్రహ్మకు అభివాదనము చేయవలెను. సూత్రధార ప్రవేశము మొదలు బ్రహ్మాభివందనాభినయపర్యంతమైన ఈ ద్వితీయ పరివర్తమును మధ్య లయాశ్రితముగా నిర్వర్తించవలెను. ఇందులకు మొత్తము 32 కలల కాలము పట్టును ఈ కలాకాలమున కనుగుణముగా పాదన్యాసమును సరిపెట్టుకొనవలెను.

3. *తృతీయ పరివర్తము* : తృతీయ పరివర్తమందు సూత్రధారుడు మాత్రము మండల ప్రదక్షిణమును, ఆచమనమును కావించి జర్జరమును గ్రహించవలెను. ఈ క్రమమును ఈ క్రింది విధముగా నిర్వర్తించవలెను — బ్రహ్మమండలమునుండి శీఘ్రముగా లేచి, దక్షిణ పదము నుద్ధరించి, దానితోనే వేధమును (ఒక పాదముచే రెండవ పాదముయొక్క మడమమీద కొట్టుట) కావించి, వామపాదముచే విక్షేప మొనర్చవలెను (ఈ క్రమముచే సూచీచారి సూచితమైనది). పిమ్మట దక్షిణ పాదముతో పార్శ్వక్రాంతచారి నాచరించి వామ వేధమును (వామ పాదముచే వేధమును), దక్షిణ విక్షేపమును (దక్షిణ పాదముచే విక్షేపమును) కావించవలెను. ఈ ప్రకారముగా ప్రదక్షిణమును పూర్తికావించి, భృంగారధారి అయిన పారిపార్శ్వకుని పిలిచి భృంగారమందలి జలముతో శౌచము నాచరించవలెను. శౌచానంతరము యథాన్యాయముగా ఆచమించి, ఆత్మప్రోక్షణ మొనర్చుకొనవలెను. అనగా చతుర్థ సన్నిపాతములో విఘ్న జర్జరమైన జర్జరమును సూత్రధారుడు గ్రహించవలెను - బ్రహ్మమండల ప్రదక్షిణముతో ప్రారంభమై, జర్జర గ్రహణముతో



అంత మగుచున్న ఈ తృతీయ పరివర్తము ద్రుతలయాశ్రితముగా నిర్వర్తింపబడవలెను.

4. *చతుర్థ పరివర్తము* : అట్లు జర్జరమును గ్రహించి 8 కలల కాలము జపముచేయవలెను. తరువాత వామపాదముతో వేధమును, దక్షిణ పాదముతో విక్షేపమును కావించి, కుతపమున కభిముఖముగా 5 పదములు గమించవలెను. అచ్చట మరల వామపాదముచే వేధమును, దక్షిణపాదముచే విక్షేపమును కావించవలెను. జర్జర గ్రహణముతో ప్రారంభమై, కుతపాభిముఖగమనముతో అంతమగు ఈ చతుర్థ పరివర్తమును కూడ ద్రుతలయాశ్రితముగానే నిర్వర్తించవలెను. చతురశ్ర పూర్వరంగమునకు సంబంధించిన ఈ చతుర్థ పరివర్తమునందు కర - పాద నిపాతములు 16 ఉండును. అనగా ఒక్కొక్క పాతమునకు 2 కలల కాలము పట్టును. కాని త్ర్యశ్ర పూర్వరంగమునందు 12 పాతములు మాత్రమే ఉండును. మరియు హస్తముతో ముమ్మారు భూతలమును స్పృశించుచు వందనములు చేయుట, జలముతో ఆత్మప్రోక్షణము చేసికొనుట అను రెండును త్ర్యశ్రపూర్వ రంగమందు ప్రయుక్తములు కానక్కరలేదు.

పై విధముగా ఉత్థాపనమును నిర్వర్తించవలెను.*

పరివర్తనము

ఇంక "పరివర్తన"[22] విధానమును వివరింతును. ఇందలి 'పరివర్తనీధ్రువ' చతురశ్రతాలమునకు సంబంధించినదై అష్టవిధ సన్నిపాతములతో మధ్యలయయందు నిర్వర్తింపబడును. ఈ ధ్రువయందు నాలుగుపాదములుండును. ఒక్కొక్కపాదమునందు 13 అక్షరములుండును; చివరి అక్షరము మాత్రమే గురువు, తక్కినవన్నియును లఘువులు. ఇది అతిజగతి ఛందమునకు సంబంధించినది. ఇందు సూత్రధారుడు అనుగత వాద్యములతో, వార్తికమార్గములో లలితపద విన్యాసపూర్వకముగా ఆయా దిక్కులందు ఆయా దేవతలకు క్రమముగా అభివాదనము చేయవలెను. ఇప్పట్ల ఒక్కొక్క పాద పతనమునకు 2 కలల కాలము పట్టును. వామపాదముచే వేధ మొనర్చి, రెండు పాదములకును 2 తాలముల ఎడము ఉండునట్లుగా దక్షిణ పాదముచే విక్షేప మొనర్చుచుండవలెను.

---

* [బొంబాయి ముద్రణమునందు 60-88 శ్లో; బరోడా ముద్రణమునందు 58-87 శ్లో.]

22. ఉత్థాపనీధ్రువాగానమందలి 'పరివర్త' పదము గానమందలి ఆవృత్తులకు సంబంధించినది. ఈ 'పరివర్తనము' రంగమును చుట్టివచ్చుటకు సంబంధించినది. ఈ భేదమును డా. ఘోష్ గుర్తించినట్లు కన్పట్టదు.

తరువాత అతిక్రాంత పాదములతో (అతిక్రాంతచారి) 5 అడుగులు ముందునకువచ్చి పిమ్మట ఆయాదిశలందు ఆయా దిగ్దేవతలకు అభివాదన మొనర్ప వలెను. మొదట శక్రాధిదైవతమగు పూర్వదిశను, అనంతరము యమదైవతమగు దక్షిణదిశను, పిమ్మట వరుణదైవతమగు పశ్చిమదిశను, చివర ధనదాశ్రయమగు ఉత్తరదిశను నమస్కరించవలెను. ఇట్లు దిశాభివందనము చేయుటకు వామపాదముచే వేధమును. దక్షిణపాదముచే విక్షేపమును కావించుచు పరివర్తనమును ప్రారంభించ వలెను. ఈ పరివర్తనమందు సూత్రధారుడు ప్రాఙ్ముఖుడై పురుష-స్త్రీ-నపుంస కములనెడి మూడు పాదములతో రుద్ర-ఉపేంద్ర-అంబుజ సంభవులకు అభివాదన మొనర్చవలెను. పురుషపదమైన దక్షిణపదముతో శివునకును, స్త్రీ పదమైన వామ పదముతో విష్ణువునకును, నాభిసమముగా ఉత్క్షిప్తమైన నపుంసక దక్షిణ పదమును ముందునకు వేయుచు బ్రహ్మకును నమస్కారము చేయవలెను,

చతుర్థకార ప్రవేశము

పైవిధముగా పరివర్తనమును నిర్వర్తించవలెను. పరివర్తనాంతమందు పుష్ప ములతో చతుర్థకారుడు (నాలుగవవాడు) యథావిధిగా రంగమును ప్రవేశించి, జర్జరమును, కుతపమును, సూత్రధారుని శాస్త్రానుసారముగా పూజించవలెను. ఇచ్చట వాని గతిపరిక్రమము (పాదవిన్యాసము) భాండవాద్యముల ననుసరించి యుండవలెను. మరియు నిచ్చట గానము (అర్థవంతమైనపాట) ఉండరాదు ; స్తోభ క్రియ (శుష్కాక్షరగానము) మాత్రమే ఉండవలెను. ఇట్లు పూజను నిర్వర్తించి చతుర్థకారుడు వెడలిపోవును. [పిమ్మట చిత్రపూర్వరంగమం దిచ్చట నర్తకాంగనలు ప్రవేశింతురు.]

అవకృష్టధ్రువ

పిమ్మట 'అవకృష్టధ్రువ'ను గానముచేయవలెను. ఇది చతురశ్రతాలమునకు సంబంధించినదై స్థిత (విలంబిత) లయయందు నిర్వర్తింపబడును. పాదములందు గుర్వక్షరములధికముగా నుండును. మరియు నిదిఅవపాణికయును, స్థాయివర్ణాశ్రయో పేతమును, కలాష్టక వినిర్మితమును కావలయును. (అవకృష్టధ్రువ పంక్తిచ్ఛందస్సు నకు సంబంధించినది. ఇందు నాలుగు పాదములుండును ; ఒక్కొక్క పాదమునకు 10 అక్షరములుండును. అందు 4, 5, 7, 8 అక్షరములు లఘువులు ; తక్కినవి గురువులు[23]*.

23. ఈ నిర్వచనము ఒక్కప్రతిలో మాత్రమే ఉన్నదట. అభినవగుప్తుడు దీనిని వ్యాఖ్యానించలేదు. 'గుర్వక్షరము లధికముగా నుండును' అనుదానిపై వ్యాఖ్యానించుచు



నాంది

తరువాత సూత్రధారుడు మధ్యమస్వరము నాశ్రయించి 8 లేదా 12 పదములతో కూడిన "నాంది" ని పఠించవలెను—

నమో ఽస్తు సర్వదేవేభ్యో ద్విజాతిభ్యః శుభం తథా ।
జితం సోమేన వై రాజ్ఞా శివం గోబ్రాహ్మణాయ చ ॥ 105
బ్రహ్మోత్తరం తథై వాస్తు హతా బ్రహ్మద్విష స్తథా ।
ప్రశా స్త్విమాం మహారాజః పృథివీం చ ససాగరామ్ ॥ 106
రాష్ట్రం ప్రవర్ధతాం చైవ రంగ స్యాశా సమృధ్యతు ।
ప్రేక్షకర్తు ర్మహాన్ ధర్మో భవతు బ్రహ్మభాషితః ॥ 107
కావ్యకర్తు ర్యశ శ్చాస్తు ధర్మ శ్చాపి ప్రవర్ధతామ్ ।
ఇజ్యయా చానయా నిత్యం ప్రీయంతాం దేవతా ఇతి ॥ 108

దేవతలకందరకును నమస్కారము. ద్విజులకు శుభము కలుగునుగాక ! రాజు అయిన సోముడు జయించునుగాక ! గోబ్రాహ్మణులకు మంగళము కలుగునుగాక !

బ్రాహ్మణులకు అభ్యుదయము కలుగునుగాక ! వారి శత్రువులు నశింతురు గాక ! సాగర పరీతమైన భూమిని మహారాజు పరిపాలించుగాక !

రాష్ట్రము అభివృద్ధి నందునుగాక ! రంగము (నట-కుశీలవ వర్గము) యొక్క ఆశలు సఫలములగును గాక ! బ్రహ్మ చెప్పిన మహాధర్మము ప్రేక్షాకర్తకు కలుగును గాక ! (ప్రేక్ష=రూపక ప్రయోగము, ప్రేక్షాకర్త=నాట్యగృహాధిపతి)

కావ్యకర్తకు (రూపక రచయితకు) యశస్సు కలుగునుగాక ! లోకమున ధర్మము వర్ధిల్లునుగాక ! ఈ పూర్వరంగ మనెడి పూజచే దేవతలు నిత్యమును సంప్రీతు లగుదురుగాక !

ఈ నాందీ పదాంతరములందు పారిపార్శ్వకు లిరువురును స్పష్టోచ్చారణ ముతో "ఏవమస్తు" (అట్లే అగునుగాక !) అనుచుండవలెను. [చిత్రపూర్వరంగ మందు ఈ నాందీ పఠనానంతరము నర్తకాంగనలు వెడలిపోదురు.]

శుష్కావకృష్టధ్రువ

ఇట్లు సలక్షణమైన నాందిని పఠించినపిమ్మట జర్జరస్తుతి పూర్వకమైన శుష్కావ కృష్ట ధ్రువను పఠించవలెను. ఈ శుష్కావకృష్టధ్రువ అష్టకలా ప్రమాణయుత మైనది. ఇందు 9 గురువులు + 6 లఘువులు + 3 గురువులు వరుసగా ఉండును. ఉదా : దిగ్లే దిగ్లే ఝుండే ఝుండే జంబుక వలితకతే తేజా !

ముందు చెప్పబోయెడి శుష్కావకృష్టధ్రువయొక్క లక్షణమునే ఇచ్చట అనుసంధించు కొనవలెనని చెప్పియున్నాడు [ అభినవభారతి—1 వ సం-పుట 236].

* [బొంబాయి ముద్రణమునందు - 89-106 శ్లో., బరోడా ముద్రణమునందు - 87-103 శ్లో.]

## రంగద్వారము

పిమ్మట ఏ దేవుని పూజామహోత్సవమునందు[24] ప్రస్తుతము నాట్యము ప్రవర్తిల్లుచున్నదో ఆదేవుని గూర్చి గంభీర స్వర సంయుతముగా ఒక శ్లోకమును పఠించవలెను. పిమ్మట రాజునకు ఏ దేవునియందు భక్తి కలదో ఆదేవునిగూర్చి కాని; బ్రాహ్మణులను గూర్చి కాని మరియొక శ్లోకమును పఠించవలెను. ఈ రంగ ద్వారముయొక్క అంతమునందు జర్జర గౌరవార్థము ఇంకొక శ్లోకమును పఠించ వలెను[25] (ఈ శ్లోకములను అభినయ సహితముగా పఠించవలెను).

## చారి

ఇట్లు జర్జరమును నమస్కరించి, పిమ్మట 'చారీ' విధిని నిర్వర్తించవలెను. ఇందు పారిపార్శ్వకులు వెనుకకు అడుగులు వేయుచు పశ్చిమమునకు తప్పుకొన వలెను. ఇచ్చట మధ్య లయాన్వితమైన 'అడ్డితధ్రువను' గానము చేయవలెను. ఇది చతుస్సన్నిపాతయుతమై చతురశ్ర తాలమునం దుండును. ఇందు నాలుగుపాదము లుండును; ఒక్కొక్క పాదమునకు 12 అక్షరములు. అందు 1, 4, 5, 12 అక్షరములు గురువులు; తక్కినవి లఘువులు. పూర్వము మహేశ్వరుడు ఉమా సహితుడై నానాభావ విచేష్టితములతో క్రీడించినప్పుడు ప్రయుక్తమైన చారీ

---

24. సంస్కృతరూపకముల ప్రస్తావనలను పరిశీలించినచో కొన్ని రూపకములు దేవోత్సవములందు ప్రదర్శింపబడుటకు రచింపబడినట్లు తెలియగలదు. పూర్వకాలమందు ప్రతి దేవాలయమున నాట్యప్రదర్శనములకై రంగమంటపము లుండెడివి. ఏ దేవుని ఉత్సవ సమయమున ఆ రూపకము ప్రదర్శింపబడుచున్నదో ఆ దేవుని స్తుతించుచు ఒక శ్లోకమును పఠించవలెనని తెలియవలెను. దీనికి ముందు విష్ణు స్తోత్రమును చేయవలెననియు, అంతకు ముందు జర్జర శ్లోకమును పఠించవలెననియు అభినవగుప్తుడు పేర్కొనెను. [అభినవభారతి - 1 వ సం-పుట 238]

25. శుష్కావకృష్టధ్రువ, జర్జర స్తుతి శ్లోకము, విష్ణు స్తుతి, దేవతాస్తోత్రము, రాజున కిష్టమైన దేవ స్తవము లేదా బ్రాహ్మణ స్తవము, జర్జర స్తుతి శ్లోకము— అను ఈ క్రమమును అభినవగుప్తు డంగీకరించెను. శుష్కావకృష్టధ్రువ, దేవతాస్తోత్రము, జర్జర శ్లోకము, విష్ణు స్తుతి పూర్వక రంగద్వార శ్లోకము, జర్జర శ్లోకము—అనెడి క్రమమును మరికొందరు చెప్పుదురట. చారీ ప్రయోగము రంగద్వారమునకు సంబంధించినదే అని కొందరందురట. రంగద్వారమందు అవకృష్టధ్రువమాత్రమే ఉండునని మరికొందరందురట. రంగద్వారమందు ధ్రువాగానమే ఉండదని ఇంకొక కొందరందురట. [అభినవభారతి - 1 వ సం-పుట 239]

పారి పార్శ్వకులు వెనుకకు తప్పుకొనుటచే చారీ-మహాచారులను సూత్రధారు డొక్కడే నిర్వహించునని గ్రహించవలెను.



విధానము నింక వివరింతును— అవహిత్థస్థానమందు నిల్చి, వామభుజము నధోముఖ మొనర్చి, ఉరమును చతురశ్రము కావించి, మస్తకమును అంచితమొనర్చి, వామ పల్లవహస్తముతో జర్జరమును నాభి ప్రదేశమునందు త్రాసువలె పట్టుకొని, సవిలా సాంగ చేష్టితములతో, పాదములమధ్య దూరము ఒక తాలము ఉండునట్లుగా 5 అడుగులు గమించవలెను. పిమ్మట వామవేధమును దక్షిణ విక్షేపమునుచేసి, శృంగారరస సంయుక్తమైన ఒక అర్యను పఠించవలెను (పార్వతీ పరమేశ్వరుల ప్రణయకోపమునకు సంబంధించియుండునట్లుగా) ఇట్లు చారీ శ్లోకమును పఠించి, పరివర్తన మొనర్చి, ప్రాఙ్ముఖుడై 5 అడుగులు పోవలెను.

## మహాచారి

అప్పుడచ్చట ఉత్తమమైన ఆ జర్జరమును పారి పార్శ్వకుని హస్తములందుంచి, పిమ్మట యథావిధిగా 'మహాచారి'ని ప్రయోగించవలెను. ఇందు చతురశ్ర ధ్రువను గానము చేయవలెను. ఇది అష్టకలాప్రమాణయుతమై చతుస్సన్నిపాతములతో కూడినదై, ద్రుతలయాన్వితమై ఉండును. ఈ ధ్రువకు నాలుగుపాదములుండును, ఒక్కొక్క పాదమునకు 11 అక్షరములు. అందు 1, 4, 7, 10, 11 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు. ఉదా :

> పాదతలాహతి పాతితశైలం, క్షోభితభూత సమగ్ర సముద్రమ్ ।
> తాండవనృత్త మిదం ప్రలయాంతే, పాతుజగత్సుఖదాయి హరస్య॥ 127

—ప్రళయాంతమందు హరుడు తాండవనృత్తము చేయగా, ఆ హరుని పాదతలాహతిచే శైలములు పడిపోయినవి. సమస్తభూతముల కావాసమైన సముద్రమంతయును క్షుభితమైనది. జగత్సుఖదాయి అయినట్టి ఆ హరతాండవము మిమ్ము రక్షించునుగాక!

పిమ్మట ఆ సూత్రధారుడు ఖాండోన్ముఖుడై పాదవిక్షేపణ మొనర్చవలెను. లలితములు, ద్రుత సూచీచారి నొనర్చి, విక్షేప పరివర్తనములను చేయవలెను. లలితములు, ద్రుత లయాన్వితములును అయిన అతిక్రాంత పాదములతో, మధ్యదూరము 3 తాలము లుండునట్లుగా పాదములను ఎత్తివేయుచు 5 అడుగులు గమించవలెను. అచ్చట వామవేధమును, దక్షిణ విక్షేపమును కావించి, అట్టి పదములతోనే ప్రాఙ్ముఖుడై వెనుకకుపోవలెను. మరల మూడుపదములు ప్రాఙ్ముఖముగానే నడచివచ్చి, అచ్చట వామవేధమును, దక్షిణపాద విక్షేపమును చేయవలెను. అప్పుడు శ్లోకపాదములను సమాసయుక్తముగాచేసి రౌద్రరస భూయిష్ఠమైన శ్లోకమును పఠించవలెను. పిమ్మట త్రిపదితో పారి పార్శ్వకులను పిలువవలెను. వారు వచ్చినతరువాత 'నర్కుటధ్రువ'ను గానము చేయవలెను.

### త్రిగతము

తరువాత భారతీవృత్తి[26] భేదమగు 'త్రిగతము'ను ప్రయోగించవలెను. అప్పుడు విదూషకు డాకస్మికముగా రంగమునందు ప్రవేశించి, అసంబద్ధ కథాలాపములతో సూత్రధారుని నవ్వించవలెను. ఆ సంభాషణములో గండ (ఆకస్మికమగు ఆరోపణము) సంయుక్తమగు వితండ వాదమును తాలికను ప్రయోగించి, రూపక కథకు సంబంధించునట్లుగా "ఎవరు ? ఎక్కడ ? ఎవరు జయించినారు ?" అనుచు ప్రశ్నలు వేయవలెను (అందులకు సమాధానముగా కావ్యస్వరూపము వివరింపబడును). అందులో పారిపార్శ్వకుడు వాదించుచుండును. దానిని విదూషకుడు ఖండించుచుండును. అప్పుడు సూత్రధారుడు 'స్థాపనము' (నిర్ణయము) చేయుచుండును. ఇదియే త్రిగతము.

### ప్రరోచన

పిమ్మట ప్రరోచన. ఇందు సిద్ధిచే సామాజికప్రీతిజననము జరుగవలెను (అనగా ఇందు సామాజికులను సుముఖులను చేసికొనుట జరుగును). రంగ సిద్ధికై కావ్యవస్తు నిరూపణమును మరల చేయవలెను.

ఇట్లు సర్వమును నిర్వర్తించి, సూచీవేధ నొనర్చి, అనావిద్ధగతిగల పాదములతో ముువ్వురును ఒకేసారి రంగమునుండి నిష్క్రమించవలెను.[27]

ఇట్లు శుద్ధచతురశ్ర పూర్వరంగ విధిని యథాశాస్త్రముగా ప్రయోగించవలెను.*

---

26. భారతీవృత్తియును, తదంగములు నాలుగును 20 వ అధ్యాయమందు వివరింపబడును. ఈ అధ్యాయమందలి 32 వ అధస్సూచికను కూడ చూడవలెను.

27. పూర్వరంగాంతమున ప్రరోచనాదులను నిర్వర్తించి సహచరులతో సూత్రధారుడు నిష్క్రమించును. అట్లు నిష్క్రమించి తిరిగి ఆతడే స్థాపకుడుగా రంగమును ప్రవేశించి, రంగసిద్ధికై కావ్యవస్తు నిరూపణమును మరల చేయును. ఈ విషయము ఈ అధ్యాయాంతమున వివరింపబడును.

ఇచ్చట ఒక విషయమును గమనించవలెను. మొదట చెప్పిన ప్రరోచనాదులు పూర్వరంగ శేషభూతములైనవి. ఇచ్చట కవి ఉదాసీనుడు. ఈ సంభాషణ అంతయును సూత్రధారాదులచే తత్కాలోచితముగా కూర్చబడును. ఇందలి గీతకాదులన్నియును లోకానుసారులగును. ఇంక అధ్యాయాంతమందు చెప్పబడిన ప్రస్తావనాదులు భారతీవృత్తి భేదములు. ఇవి కవికృతములు [చూ. 20 వ అధ్యా.]. ముద్రిత సంస్కృత నాటకములందీ కవికృతములే మనకు కన్పట్టుచున్నవని తెలియవలెను. దీనితరువాత రూపక ప్రయోగము ప్రారంభమగును. [అభినవభారతి-1 వ సం-పుట 249]

*[బొంబాయి ముద్రణమునందు - 107-141 శ్లో; బరోడా ముద్రణమునందు 104-137 శ్లో.]



### శుద్ధత్ర్యశ్రపూర్వరంగవిధి

ఇంక శుద్ధత్ర్యశ్రపూర్వరంగవిధిని వివరింతును. దీని ప్రయోగమును, ఇందలి అంగములును చతురశ్రవిధి తుల్యములే. కాని త్ర్యశ్రవిధియందు తాళప్రమాణము మాత్రము సంక్షిప్త మగును. ఇందు శమ్య 2 కలలు, తాలము ఒకకల, మరల శమ్య ఒకకల, సన్నిపాతము 2 కలలు కలిగి ఉండును. ఈ విధమైన కలా-తాల-లయాన్వితమగు ప్రమాణముతో ఉత్థాపనాద్యంగయుతమగు త్ర్యశ్రపూర్వరంగమును నిర్వర్తించవలెను. ఇందలి ఉత్థాపనిధ్రువ జగతి ఛందమునకు సంబంధించినది. ఇందు నాలుగు పాదములుండును ; ఒక్కొక్క పాదమునందు 12 అక్షరములు; అందు 1, 4, 8, 10, 12 అక్షరములు గురువులు; తక్కినవి లఘువులు.

ఇట్లు నృత్తజ్ఞులు త్ర్యశ్రమునందు ధ్రువాగానమునే కాక వాద్యమును, గతిప్రచారమును, తాలమునుకూడ సంక్షేపించవలెను. అంగ విచేష్టితమును వాద్య-గీత ప్రమాణము ననుసరించి విస్తీర్ణముగా కాని లేదా సంక్షిప్తముగా కాని చేయవలసియుండును. చతురశ్రవిధియందు ఒక్కొక్క హస్త-పాదప్రచారమునకు 2 కలల కాలముపట్టును ; పరిక్రాంతమందు మొత్తము 16 కర-పాదపాతములుండును. కాని, త్ర్యశ్రమునందు ఈ కర-పాదపాతములు 12 మాత్రమే ఉండును. చతురశ్రవిధిలో దిగ్వందనమందు పంచపదీగమనము చెప్పబడినది; కాని, త్ర్యశ్రమందు త్రిపదీగమనమే చాలును. ఈ విధమైన తాళ ప్రమాణము ననుసరించి చతురశ్రవిధులనే త్ర్యశ్రమునందును నాట్యాచార్యుడు నిర్వర్తించవలెను; పునరుక్తదోష నివారణార్థము మరల చెప్పుటలేదు.

ఈ విధముగా భారత్యుపాశ్రయము లగు త్ర్యశ్ర-చతురశ్ర భేదములతో కూడిన శుద్ధపూర్వరంగవిధులను ప్రయోగించవలెను.*

### చిత్రపూర్వరంగము

శుద్ధపూర్వరంగమును పైన వివరించియున్నాను ఇంక దీనిని "చిత్రపూర్వరంగము" గాచేసెడి విధానమును వివరింతును. ఉత్థాపన-పరివర్తనములను కావించి, చతుర్థకార దత్తములైన పుష్పములతో నలంకరింపబడినపిమ్మట గంధర్వులు (ఉత్తమ గాయకులు) ప్రమాణపూర్వకముగా ఉదాత్తగానముచేయుచుండగా, దేవదుందుభులధికముగా నినదించుచుండవలెను. అప్పుడు సిద్ధులు (సిద్ధాంగనలు) రంగమునందంతటను కుసుమమాలలనువెదజల్లుచుండ అగ్రభాగమునందు దేవులు (నృత్య ప్రవీణలైన దేవతాస్త్రీలు) అంగహారములతో నృత్తమును చేయవలెను. చిత్రభావమును

---

*[బొంబాయి ముద్రణమునందు - 141-152 శ్లో; బరోడా ముద్రణమునందు - 137-149 శ్లో.]

చక్కగా కోరువారు ప్రతినాందీ పదమధ్యమునందును వెనుకచెప్పబడిన పిండీ-రేచక-అంగహార-న్యాస-ఉపన్యాస సంయుతమైన తాండవవిధిని ప్రయోగించవలెను. (ఈ వివరములన్నియును 4 వ అధ్యాయమందు వర్ణితములై యున్నవి.)

శుద్ధపూర్వరంగమును ఇట్లు చిత్రపూర్వరంగముగా ప్రయత్నముతో నొనరించవలెను. నాందీ పఠనానంతరము నర్తకాంగనలందరును నిష్క్రమించవలెను. అట్లు వారు నిష్క్రమించినపిమ్మట సూత్రధారుడు శుష్కావకృష్టాది ప్రరోచనాంతము వరకును గల అంగజాతమును నిర్వర్తించవలెను.

ఇట్లు త్ర్యశ్ర-చతురశ్రపూర్వరంగవిధులను శుద్ధముగాకాని, చిత్రముగా కాని నిర్వర్తించి సూత్రధారుడు అనుచర సహితముగా రంగమునుండి నిష్క్రమించవలెను.[28]

నాటకప్రారంభము

అట్లు సూత్రధారాదులందరును నిష్క్రమించినపిమ్మట లక్షణాన్వితమైన నాటకమును ప్రయోగించవలెను.

గీత-వాద్య-నృత్త ములనుగూర్చిన సూచన

ఈ పూర్వరంగవిధులలో నృత్త-గీతవిధి అధికము కారాదు.[29] గీత-వాద్య-నృత్తములు అధికముగా ప్రయుక్తములైనచో ప్రయోక్తలకును, ప్రేక్షకులకును కూడ ఖేదము కలుగును. ఖిన్నులైనవారియందు రస-భావముల విషయమున స్పష్టత ఉండదు. అప్పుడింక తక్కిన ప్రయోగము రక్తికట్టదు.[30*]

స్థాపకుడు[31]

పై విధముగా పూర్వరంగము సక్రమముగా నిర్వర్తింపబడిన పిమ్మట సూత్రధారుని గుణ-ఆకృతులే కలిగిన స్థాపకుడు రంగమునందు ప్రవేశించి, సౌష్ఠవాంగ పురస్కృతముగా వైష్ణవస్థానమున నిలువవలెను. సూత్రధారుని పదవిన్యాసమువంటి పదవిన్యాసముతోనే ఆతడు నడవవలెను. స్థాపకుడు ప్రవేశించు సమయమున అర్థానుసారిణి అయిన ప్రావేశికీధ్రువాగానమును చేయవలెను. ఈ ధ్రువాగానమును మధ్యలయలో త్ర్యశ్రతాలమునందుకాని చతురశ్ర తాలమునందుకాని చేయవలెను. ఈ ధ్రువాగానాంతమున దేవ-బ్రాహ్మణ-ప్రశంసా పూర్వకమైన చారీ ప్రయోగమును నిర్వర్తించవలెను. పిమ్మట మధుర వాక్యోపేతములును, నానాభావ రసాన్వితములును అగు శ్లోకములతో రంగమునందలి సామాజికవర్గముయొక్క హృదయములను రసాస్వాదనోచిత ప్రసాదగుణము కలవిగా నొనరించి కవియొక్క నామాదులను కీర్తించవలెను. తరువాత కావ్యముయొక్క ప్రసిద్ధిని తెలియపరచెడి ప్రస్తావనను నిర్వహించవలెను. అందు కావ్యార్థసూచకము లగు ఉద్ఘాత్యకాదు లుండవలెను.[32]

---

28. విషయ సమన్వయముకొరకు ఇచ్చటి శ్లోకముల క్రమమును కొంచెము మార్చి యున్నాను.

పై వాక్యము తరువాత [అనగా బరోడా ముద్రణమునందు 160-161 శ్లోకముల మధ్య] మూడు శ్లోకములు అధిక పాఠముగా గుర్తింపబడినవి-"యవనికాంతర సంస్థితుడై సూత్రధారుడు దేవ-పార్థివ-రంగముల ఆశీర్వచనములతో కూడినదియును, కవినామ గుణోపేతమును, వస్తూపక్షేపకమును, లఘువర్ణపదోపేతమును, చిత్రవృత్తాలంకృతమును అయిన ఆశ్రావణమును చేయవలెను. ఆశ్రావణావసానమందు నాందిని ప్రయోగించి, సూత్రధారుడు మరల రంగమును ప్రవేశించి, ప్రస్తావనను నిర్వహించవలెను."

29. ఈ సూచనపై అభినవగుప్తుడీ క్రిందివిధముగా వివరించెను– ఇచ్చట ఒక్కొక్క అంగహారమును మాత్రమే ప్రయోగించవలెను. ఉత్థాపనము, పరివర్తనను, అవకృష్టాగానము, నాందీపాఠము, శుష్కావకృష్ట, జర్జరశ్లోకములు రెండు, ధ్రువ, రంగద్వారము, అడ్డితధ్రువ, ఆర్యాపఠనము, ధ్రువ, రౌద్రశ్లోక పఠనము, నర్కుటము, త్రిగతము, ప్రరోచన అను అంగములు మొత్తము పదునారు కాన 16 అంగహారములను మాత్రమే ప్రయోగించవలెను. త్ర్యశ్ర్యమునందును ఇంతియే. చిత్రపూర్వరంగమున నాందీ పదాంతరములందు అధికముగా నృత్తమును ప్రయోగించవలెను. [అభినవభారతి-1 వ సం-పుట 246.]

30. ఇచ్చట ఒక అధికపాఠ శ్లోకము కలదు; ఇది ఒక ప్రతియందే కలదట— "లక్షణ విరహితమై బాహ్యలక్షణోపేతమైనచో విస్తృతము కాగలదు. కావున నాట్యము లోకమును, శాస్త్రమును రెండింటిని అనుసరించి యుండునని గ్రహించవలెను."— ఇందలి మొదటి వాక్యము సరిగా అన్వయ మగుటలేదు.

*[బొంబాయి ముద్రణమునందు 153-169 శ్లో., బరోడా ముద్రణమునందు 150-161 శ్లో.]

31. రూపకవృత్తిని సమస్తమును స్థాపించువాడు కాన ఇతడు 'స్థాపకుడు' అనబడినాడు. రంగసిద్ధికొరకు మరల కావ్యవస్తు నిరూపణము చేయవలెనని ఇంతకుముందు చెప్పబడినది. అట్లు మరల కావ్యవస్తు నిరూపణము (స్థాపనము) చేయువాడే ఈ స్థాపకుడు.

ఇచ్చట నొక విషయమును గ్రహించవలెను. ఈ స్థాపకుడు సూత్రధారునికంటె భిన్నుడుకాడు. అనగా పూర్వరంగమును సాంతముగా నిర్వహించి నిష్క్రమించిన సూత్రధారుడే స్థాపకుడై మరల రంగమును ప్రవేశించి ప్రస్తావనాదికమును నడపును. అనగా ప్రదర్శింపబడనున్న రూపకమును సామాజికులకు పరిచయము చేయును [అభినవభారతి-1 వ సం-పుట 248.]

32. ఈ ప్రస్తావననే 'ఆముఖ' మనియు అందురు. ఇది స్థాపనలో ఒక భాగము. దీనిలోని అంగములే ఉద్ఘాత్యకాదులు.

ఈ ప్రస్తావన భారతీవృత్తి భేదములగు నాలుగు అంగములలోను ఒక అంగము. తక్కిన అంగములు-ప్రరోచనా-వీథీ-ప్రహసనములు. పూర్వరంగమందు ఈ భారతీవృత్తి 'నాంది'తో ప్రారంభ మగుచున్నది. 20 వ అధ్యాయమందు ఈ 'నాంది'యే 'ప్రరోచన' అనబడినది; ఈ ప్రరోచనయు, పూర్వరంగమందలి ప్రరోచనయు భిన్నములు.

కథ దివ్యము, మానుషము, దివ్యమానుషము అను భేదములచే మూడు విధములుగానుండును. స్థాపకుడు దివ్యమునందు దివ్యుడై, మానుషమునందు మనుష్యుడై, దివ్యమానుషమునందు దివ్యుడు లేదా మనుష్యుడునై కావ్యార్థసూచన చేయవలెను. ముఖసంధియందలి బీజమునకు సదృశముగా నటీ[33]- విదూషక - పారిపార్శ్వకుల సంభాషణములచే అనేక విధములుగా కావ్యార్థమును సామాజికులకు సూచింపవలెను. (త్రిగతమందలి కావ్యార్థ సూచనము అల్పమాత్రము. ఇచ్చట సమగ్రముగా నుండును.)

ఇట్లు కావ్యమునుగూర్చి ప్రస్తావించి, ఆ కావ్య ప్రస్తావకుడు[34] నిష్క్రమించును. ఇట్లు యథావిధిగా పూర్వరంగమును ప్రయోగించవలెను.

### పూర్వరంగప్రయోగ ఫలము

ఇట్లీ పూర్వరంగమును యథావిధిగా ప్రయోగించువారు అల్పమైన అశుభమునుకూడ పొందరు. అంతియేకాక స్వర్గలోకమును పొందగలరు. పై విధులనుల్లంఘించి యథేష్టముగా దీనిని ప్రయోగించువాడు ఘోరమైన ఆపదను పొందును; అంతియేకాక తిర్యగ్యోనియందు పుట్టగలడు. అప్రప్రయోగము దహించునంత వేగముగా ప్రభంజన సమీరితమైన అగ్నికూడ దహించలేదు.

---

33. నటీ-విదూషక-పారిపార్శ్వకులు స్వకార్య నిరూపణ వ్యాజముచే చిత్రముగ పలుకుచుందురు. అందులో కావ్యార్థ సూచనలు చేయబడుచుండును. కాగా, వారి సంభాషణలు ముఖసంధియందలి బీజమునకు అనుగుణముగా నుండవలెనని సారాంశము.

ఇచ్చట స్థాపకుడొక్కడే ప్రస్తావన నడపుచున్నట్లు మూలమందు కలదు. కాని వానితో నటీ-విదూషక-పారిపార్శ్వకు లున్నట్లుగా అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను; నేను దీనిననుసరించి తెనిగించితిని. ఈ అధ్యాయమం దెచ్చటను మూలమున నటీ ప్రశంసయే లేదు. 20 వ అధ్యాయమందు ఆముఖమును లేదా ప్రస్తావనను నిర్వచించునప్పుడు మాత్రము నటి కూడ చెప్పబడినది. 27 వ అధస్సూచికను కూడ చూడవలెను.

34. "కావ్యప్రస్తావకుడైన ఆద్విజుడు నిష్క్రమించును" అని పూర్వముద్రణ పాఠము. 'కావ్య' మనగా 'రూపక' మని ఇచ్చటి అర్థము.

**Drama or play; Dramatist or play-wright** అను పదములకు సంస్కృతమునందు ప్రత్యేక పదములు లేవు. కావ్యను, కవి – అనియే వ్యవహారము. రూపకపదమున్నను కావ్యమనియే వాడుచుందురు. ఇంక రూపకనిర్మాతకు అట్టి పదముకూడ లేదు; అతడును కవియే.



ద్విప్రమాణ[35] నిర్మితమైన ఈ పూర్వరంగ విధిని అవంతి-పాంచాల-దాక్షిణాత్య-ఓఢ్రమాగధి దేశస్థులు అనుష్ఠించవలెను.

పూర్వరంగాశ్రయమైన విధిని వివరించితిని. ఇంక ఏమి చెప్పవలయునో కోరుడు.*

* * *

### ఐదువిధములగు ధ్రువలు[36]

శుద్ధ-చిత్ర పూర్వరంగములందు ఉపయోగింపదగు ధ్రువలు ఐదు విధములు— 1. ఉత్థాపనిధ్రువ, 2. పరివర్తనిధ్రువ, 3. అవకృష్టధ్రువ, 4. అడ్డితధ్రువ, 5. విక్షిప్తధ్రువ– ప్రయోక్తలీధ్రువలను ఉపోహన సహితముగా పూర్వరంగమందు ప్రయోగించవలెను.

ఈ ఉపోహనము ఉత్థాపనియందు 8 కలల కాలములోను, పరివర్తనియందు 6 కలల కాలములోను, అవకృష్టయందు 5 కలల కాలములోను, అడ్డితయందు 4 కలల కాలములోను, విక్షిప్తయందు 3 కలల కాలములోను నిర్వర్తింపబడవలెను. చిత్రపూర్వరంగమందు గురు-లాఘవ సంయుక్తముగాను, కలా-తాలసమన్వితముగాను చిత్రమార్గమున ఉపోహనము నాచరించవలెను. చిత్రపూర్వగంగమందు చిత్రమార్గాశ్రితమైన కలలను, మిశ్రపూర్వరంగమందు వార్తిక మార్గాశ్రితములైన కలలను, శుద్ధపూర్వరంగమునందు దక్షిణ మార్గాశ్రితములైన కలలను ప్రయోగించవలయును.

---

35. ద్విప్రమాణ నిర్మితము - వివరణమునకు 20 వ అధస్సూచికను చూడవలెను.

'ఓఢ్రమాగధి' అనుదానికి కొన్ని వ్రాతప్రతులలో 'ఆంధ్రమాగధి' అను పాఠాంతరము కలదు.

నాట్యమునందు చెప్పబడిన ప్రవృత్తులు నాలుగును పై నాలుగు దేశములను బట్టియే ఏర్పడినవి. ఆవంతి, దాక్షిణాత్య, పాంచాల మధ్యమ, ఓఢ్రమాగధి అను నాలుగును ప్రవృత్తులు [13 వ అధ్యా. చూడవలెను]. రూపకనాయకుడు ఏ ప్రవృత్తి విశేషమునకు చెందినవాడో, ఆ ప్రవృత్తికి అనుగుణములైన వేష-భాషా-ఆచార-అభినయములతో సూత్రధారాదులందరును వ్యవహరించవలసియుండునని తెలియవలెను.

*[బొంబాయి ముద్రణమునందు 169-181 శ్లో., బరోడా ముద్రణమునందు 162-174 శ్లో.]

36. ఈ ధ్రువలను వివరించెడి 40 శ్లోకములును మూడు ముద్రణములందును ప్రక్షిప్త భాగముగా గుర్తింపబడినవి. వీనిని అభినవగుప్తుడు వ్యాఖ్యానించలేదు—శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తామొక వ్యాఖ్యను రచించి ఇందు చేర్చినారు. వారి వ్యాఖ్యననుసరించి ఈ భాగమును తెనిగించినాను. ప్రక్షిప్తము అను నూహతో డా. ఘోష్ వీనిని అనువదించలేదు.

మాగధి, అర్ధమాగధి, సంభావిత, పృథుల అను భేదములచే గీతులు నాలుగు విధములు [ఇవి 29 వ అధ్యాయమందు వివరింపబడినవి. ఇవి పూర్వరంగమందే కాక నాట్యమందును ప్రయుక్తములగును]. చిత్రపూర్వరంగమందు చిత్రమార్గాశ్రితముగా మాగధీ గీతినికాని అర్ధమాగధీ గీతినికాని ప్రయోగించవలెను. మిశ్రపూర్వరంగమందు వార్తికమార్గాశ్రితముగా సంభావిత గీతిని ప్రయోగించవలెను. శుద్ధపూర్వరంగమందు దక్షిణమార్గాశ్రితముగా పృథులగీతిని ప్రయోగించవలెను.

ఇంక ఉపోహన క్రియయందలి గురు-లఘు విధానమునుకూడ వివరింతును.

1. ఉత్థాపనీధ్రువ- ఉత్థాపనీధ్రువయందలి ఉపోహనమున మొదట 'దిగ్లే దిగ్లే' అనియు, చివర 'ఝుంటుం' అనియు కూర్చవలెను. వాని మధ్యలో 16 లఘ్వక్షరము లుండవలెను. ఈ విధముగా ఉపోహనము కావించి, పిమ్మట మాగధ్యాది గీతులను గానము చేయవలెను. ఉత్థాపనీధ్రువ యందలి అక్షర నియమమును కలా-కాల విభాగమును పూర్వమే వివరించితిని. ఇంక ఉత్థాపనిధ్రువకు ఉదాహరణము—

దేవం విభుం త్రిభువనాధిపతిం కైలాసపర్వతగుహాభిరతమ్।
శైలేంద్రరాజతనయాదయితం మూర్ధ్నా నతోఽస్మి పురనాశకరమ్॥

—దేవుడు, విభుడు, త్రిభువనాధిపతి, కైలాసపర్వతగుహాభిరతుడు, త్రిపురనాశకరుడును అయిన శైలేంద్రరాజతనయాదయితుని (పార్వతీపతిని) శిరస్సువంచి నమస్కరించుచున్నాను.

పై విధముగా పూర్వరంగ ప్రయోక్తలు ఉత్థాపనీధ్రువను గానము చేయవలెను.

2. పరివర్తనీధ్రువ- ఇందలి ఉపోహనము 6 కలలకు పరిమితమై ఉండును. మొదట 'దిగ్లే దిగ్లే' అనియు, చివర 'ఝుంటుం' అనియు కూర్చవలెను. మధ్య 12 లఘ్వక్షరము లుండును. ఈ గీతియొక్క గురు-లఘ్వక్షరక్రమ మీక్రిందివిధముగా నుండును—1, 2, 4, 8, 10, 14, 15 లు గుర్వక్షరములు; తక్కినవి లఘ్వక్షరములు. ఇట్టిది పరివర్తనీధ్రువ అనబడును. ఇందు 3 లయలు, 3 యతులు, 4 పరివర్తములు, 3 పాణులు, 4 సన్నిపాతములు ఉండును. ఇది 32 కలలకు పరిమితమై ఉండును. ఉదా:

చంద్రార్ధభూషణజటం వరం వృషభకేతుం
కైలాసపర్వతనివాసినం సురవరిష్ఠమ్।
శైలాధిరాజతనయాప్రియం ప్రమథనాథం
మూర్ధ్నా నతోఽస్మి త్రిపురాంతకం పరమయోగినమ్॥



—చంద్రార్ధభూషణజటుడు, శ్రేష్ఠుడు, వృషభకేతుడు, కైలాసపర్వతనివాసి, సురశ్రేష్ఠుడు, ప్రమథనాథుడు, త్రిపురాంతకుడు, పరమయోగి అయిన శైలాధిరాజతనయాప్రియుని నమస్కరించుచున్నాను.

ఇట్లు ప్రయోక్తలు పరివర్తనిధ్రువను పూర్వరంగమందు ప్రయోగించవలెను.

3. అవకృష్టధ్రువ- ఇందలి ఉపోహనము పంచకలాయుతము. ఇందు గీతిపాదములను వెనుకటివలెనే 'దిగ్లే దిగ్లే', 'ఝుంటుం' అనువానితో కూర్చవలెను, వాని మధ్య 8 లఘ్వక్షరములుండును. ఈ గీతియందలి 3, 6, 9, 11, 15, 16 అక్షరములు గుర్వక్షరములు. తక్కినవి లఘ్వక్షరములు. ఇందు 68 పాతభాగములు (ఇది కాలమునకు సంబంధించిన నియమమై యుండును), 4 సన్నిపాతములు, 3 పాణులు ఉండును. ఉదా:

వరదం సగణం త్రిపురాంతకం వృషభకేతుమ్
గజచర్మపటం విషమేక్షణం భువననాథమ్।

భుజగాభరణమ్ జగతాంహితం భువనయోనిమ్
ప్రణతోఽస్మి భవంత ముమాపతిం త్వసితకంఠమ్॥

—వరదుడవు, గణసహితుడవు, త్రిపురాంతకుడవు, వృషభకేతుడవు, గజచర్మవస్త్రుడవు, విషమేక్షణుడవు, భువననాథుడవు, భుజగాభరణుడవు, జగద్ధితుడవు, భువనయోనివి, అసితకంఠుడవు, ఉమాపతివి అగు నిన్ను ప్రణమిల్లుచున్నాను.

4. అడ్డితధ్రువ- ఈగీతియందు ఒక్కొక్క పాదమున 3, 6, 13 అక్షరములు గుర్వక్షరములు; తక్కినవి లఘువులు. ఇది చతుర్గుణమై (నాలుగురెట్లు) ఉండవలెను. ఇందలి ఉపోహనము 4 కలల కాలమునకు పరిమితమై యున్నది. దీనిని కూడ 'దిగ్లే దిగ్లే', 'ఝుంటుం' అను పదములతో వెనుకటివలెనే కూర్చవలెను. మధ్య 4 లఘ్వక్షరములుండును. ఉదా:

ప్రవరం వరదం ప్రణమత సతతమ్ గజచర్మపటం మునిజన సహితమ్।
ఉమయాసహితం భుజగవలయినమ్ ప్రణతోఽస్మి శివం త్రిభువనసహితమ్॥

—శ్రేష్ఠుడు, వరదుడు, అయినవానిని సతతము నమస్కరించుచున్నాను. గజచర్మవస్త్రుడు, మునిజనసహితుడు, ఉమాసహితుడు, భుజగవలయోపేతుడు, త్రిభువనసహితుడు అయిన శివుని ప్రణమిల్లుచున్నాను.

5. విక్షిప్తధ్రువ- ఈగీతియందు ఒక్కొక్క పాదమున 3, 6, 9, 10 అక్షరములు గుర్వక్షరములు; తక్కినవి లఘ్వక్షరములు. ఇందు త్రిగుణములగు (మూడురెట్లు) పాతములు ఉండును. ఉపోహనము 3 కలలకు పరిమితమై ఉండును.

వెనుకటివలెనే 'దిగ్లే దిగ్లే', 'ఝంటుం' అను వానిని కూర్చవలెను. మధ్య లఘ్వక్షరములుండవు. ఉదా :

త్రిపురాంతకరం బహులీల ముమయాసహితం బహురూపమ్ ।
భుజగాభరణం త్రిపురాంతకం ప్రణమామి సదాపరమీశమ్ ॥

త్రిపురాంతకరుడు, బహులీలామయుడు, ఉమాసహితుడు, బహురూపుడు, భుజగాభరణుడు, త్రిపురాంతకుడు, పరమేశుడు అయినవానిని ప్రణమిల్లుచున్నాను.

ఇట్లు త్ర్యశ్ర-చతురశ్ర తాల కృతములగు గీతులతో కూడిన సర్వ ధ్రువలను ఆచార్య బుద్ధి ననుసరించి పూర్వరంగమందు యథావిధిగా ప్రయోగింప దగును.

త్రివిధములగు పూర్వరంగములను చక్కగా వివరించితిని. ఇంక ఏమి చెప్ప వలెనో కోరుడు.

పంచమాధ్యాయము సమాప్తము.

---

## విశేషాంశములు

### 1. పూర్వరంగము : ప్రయోజనము

ఇంద్రధ్వజోత్సవ సమయమున ప్రప్రథమముగా నాట్య ప్రదర్శనము జరిగినప్పుడు భరతుడు 'నాంది'ని మాత్రమే ప్రయోగించెను. దీనినిబట్టి పూర్వరంగాంగములలో ముఖ్యమైన నాందిని మాత్రము ప్రయోగించినచో చాలునని కొందరనినారట. అభినవుడు దానికంగీకరించక తన ఉపాధ్యాయుడగు భట్టతౌతుని అభిప్రాయము నీ క్రింది విధముగా పేర్కొనెను—విఘ్నరక్షాకరణార్థము మండపభాగ నివేశితులైన దేవతల పరితోషమునకే పూర్వరంగము నిర్వహింపబడుచున్నది. (ఆయా అంగములవలన ఆయా దేవతలు సంతుష్టులగుదురని చెప్పబడెను కదా). ఈ ప్రథమనాట్యప్రయోగ సమయమునకు విఘ్నోత్పత్తి కానేలేదు. అందుచే పూర్వరంగ ప్రయోగమునకు అవకాశమే లేదు. కాన, 'తత్రాశిష మాశాస్తే' అనెడి శ్రుతివాక్యము ననుసరించి సర్వకర్మారంభము లందును ఆశీఃపూర్వకత్వము నిర్దిష్ట మగుటచే నాట్యారంభమం దిచ్చటకూడ వేదసమ్మితమును ఆశీర్వచన సంయుక్తమును అయిన నాంది ప్రయుక్తమైనది. శివుని ఎదుట ద్వితీయ ప్రదర్శనము జరిగినప్పుడు "మొదట పూర్వరంగమును నిర్వర్తించి........" అని భరతుడు చెప్పెను [4 వ అధ్యాయ ప్రారంభమునందు]. అనగా అప్పటికి విఘ్నోత్పత్తి మొదలగునవి జరిగినవి. విఘ్నరక్షాకరణార్థము దేవతలాయా మండప భాగములందు నివేశితులైనారు. ఆ దేవతా పరితోషణార్థము పూర్వరంగ మావశ్యకమైనది. అందుచే "మొదట పూర్వరంగమును నిర్వ



ర్తించి......" అని చెప్పబడినది. అచ్చట నాందియే కాక సర్వశుద్ధ పూర్వరంగాంగములును ప్రయుక్తములైనవి. ప్రథమాధ్యాయమందు చెప్పబడిన ప్రథమప్రయోగమునందు నాందిమాత్రమే ప్రయుక్తమైనది. [అభినవభారతి-1 వ సం - పుట 25]

కావున దేవతాపరితోషణమే పూర్వరంగ ఫలమనుట స్పష్టము. మూడవ అధ్యాయమందు కేవలము దేవతాపూజయు, స్తోత్రమును చెప్పబడినవి; ఆ విధి ముఖ్యముగా నూత్న నాట్యగృహమందు అవశ్యము చేయదగినది. ఇంక పూర్వరంగము ప్రతిరూపక ప్రదర్శన ప్రారంభమందును అవశ్యకర్తవ్యమని తెలియవలెను. 4 వ అధ్యాయమందు "మొదట పూర్వరంగమును నిర్వర్తించి......" అని చెప్పబడినది. కాని వివరము లచ్చట లేవు. ఆ పూర్వరంగవిధానము సమగ్రముగా 5 వ అధ్యాయమందు వివరింపబడెనని తెలియవలెను.

శివుని ఎదుట భరతుడు ప్రదర్శించినది శుద్ధపూర్వరంగము మాత్రమే. అనగా ప్రత్యాహారాద్యంతర్యవనికాంగములు తొమ్మిదింటిని, గీతకవిధానాది బహిర్యవనికాంగములు పదింటిని కర్తవ్యమాత్రముగా నృత్త విరహితముగా ప్రయోగించెనని గ్రహించవలెను. అప్పుడు శివుడు నృత్తమును అనుగ్రహించెను. దానిని బహిర్యవనికాంగములందు చేర్చుటచే అది చిత్రపూర్వరంగమైనది. గీత-వాద్యములే కాక నృత్తముకూడ నాట్యమునకు రంజకత్వమును చేకూర్చును. కావున ఇప్పుడు నాట్యము గీత-వాద్య-నృత్త సమ్మిశ్రితమై బహు రమ్యమైనది.

### 2. పూర్వరంగము : లౌకిక ప్రయోజనము

ఈ పూర్వరంగమువలన లౌకిక ప్రయోజనముకూడ కలదు. ప్రయోగమును చూచుటకు ప్రేక్షకులందరును, నియమితమైన సమయమునకు, ఒకేసారి వచ్చుట సంభవించదు. ప్రజలు వివిధవ్యాపృత్తులలో ఉందురు. కొందరు పనిలేనివారు చాల ముందుగా వత్తురు. కొందరు ప్రయోగము ప్రారంభమైన తరువాతకూడ వత్తురు. అట్లు వచ్చినవారు అతి ముఖ్యులైనచో ప్రయోగమును మరల ప్రారంభించవలసినదే! కావుననే "రెడ్డొచ్చె, మొదలాడరా" అను సామెత వ్యాప్తిలోనికి వచ్చినది. ఇట్లు చాల ఆలస్యముగా వచ్చెడివారి విషయ మెట్లున్నను, ముందుగా వచ్చెడివారికి కొంత వినోదమును చేకూర్చవలసి యున్నది. ఈ వివిధ పూర్వరంగాంగములు ఆ కొరతను తీర్చగలవు. కావుననే "వాద్యం స్త్రీ-బాలమూర్ఖాది కుతూహలాది జననం ప్రయోజ్యమ్" [అభినవభారతి-1 వ సం - పుట 213] అని అభినవగుప్తుడు పేర్కొనినాడు. నేటికిని, వీథిభాగవతములం దీ విపుల పూర్వరంగ విధానమును చూడగలము. ఉత్తరదేశమందలి యాత్రాదులందును ఈ విధాన మిప్పటికిని అనుసరింపబడుచున్నది.

నేడు ఇంగ్లీషు సినిమాలను ప్రదర్శించునప్పుడు అసలు సినిమా గంటన్నర మాత్రమే కాగా వార్తాచిత్రాదులు 45నిముషములు లేదా ఒక గంట సేపు చూపబడుచున్నవి. అనగా, ఒకగంట ఆలస్యముగా వచ్చినవారికికూడ అసలు సినిమా తప్పిపోదన్నమాట. ఇంక ముందు వచ్చినవారికి ఒక గంటసేపు కావలసినంత వినోదము. ఇంగ్లండు దేశములో పెద్ద నాటకమునకు ముందు ఒక ఏకాంకికను, సాధారణముగా ప్రహసనాత్మకమైన దానిని, ప్రదర్శించెడి

వారు. దీనికి 'కర్టెన్ రైజర్' (Curtain-raiser) అని పేరు. ముందు వచ్చినవారిని వినోదింప జేయుటయే దీని ముఖ్య ప్రయోజనము. ఇది ఈ 20 వ శతాబ్ది ప్రారంభము వరకును ప్రచారములో ఉన్నది. ఈ శతాబ్ది ప్రారంభ ప్రాంతముల ఒకే సాయంకాలము పెక్కు చిన్న నాటకములను—నేటి "వెరైటీ ఎనటెర్టైన్మెంటు"వంటిది— చూపుచుండెడివారు (ఆలస్యముగా వచ్చినవారికి తగ్గింపురేట్లమీద కూడ టిక్కట్ల నమ్మెడివారు). 'ప్రొఫెషనల్' ప్రదర్శకులు కేవలము ఒకేఒక పెద్ద నాటకమును చూపవలెనను కోరికగలవారగుటచే ముందరి చిన్ననాటకములకు క్రమముగా ప్రచారము తగ్గిపోయినది. నేడు చిన్ననాటక ములను (ఏకాంకికలను) అమెచ్యూర్ సంఘములవారు మాత్రమే అదరించుచున్నారు.
[The Oxford Companion to the Theatre - Page 171]

3. ధ్రువాగానము

నాట్యశాస్త్రమునుబట్టి ప్రరోచనాంతము వరకును గల పూర్వరంగవిధు లేవియును అసలు నాటకమునకు సంబంధించినవి కావు. అంతియేకాక పూర్వరంగమందు చెప్పబడిన ధ్రువలుకాని, తక్కిన గీతములుకాని రూపకరచయితచే రచింపబడినవి కావు. సూత్ర ధారాదుల సంభాషణ యందలి గద్యముతోపాటు ఇవియును తత్కాలోచితముగా సూత్ర ధారాదులచే కల్పింపబడును ; లేదా ఆ యా కవులు అచ్చటచ్చట వ్రాసిన వానిని ఎన్ను కొని ఇచ్చట అనుకూలతను బట్టి ఉపయోగించుకొనుచుందురు. అసలు నాటకములందలి ధ్రువలుకూడ ఇట్లే చేర్పబడుచుండును; కవులు వ్రాసిన ఘట్టములు చాల తక్కువ. ఈ విష యమును గూర్చి డా. రాఘవన్ ఈ క్రింది విధముగా వ్రాసియున్నారు :

The Dhruvas were not written by the poet himself; many of them took the lead of the verses in the play and would appear redundant,, if seen from the wrong angle. In fact, my own idea about the peculiar Prose-verse or Champu form of the Sanskrit drama is that to an original prose text, song-verses were added when the play was enacted; taking the suggestion from these song-verses or Dhruvas, the poets themselves began to insert verses wherever the emotion or idea reached a degree of pointedness and need effective expression. In the great classical period, when the prose-verse dramatic masterpieces were produced, the stage-artists had their own composers, who wrote the Dhruva-music, using the poets contextual verses for guidance. The few cases cited above [ ఉదా: శాకుంతలమున పంచమాంక ప్రారంభమందలి హంసపదిక పాడిన అంతరీధ్రువ మొ॥] in which we find the dramatists themselves inserting a stray Dhruva are merely exceptions indulged in for novelty or to show the poets' knowledge of stage-technique." ['Music in ancient Indian Drama'— The journal of the Madras Music Academy vol. XXV-parts I-IV-p. 86].

ఈ ధ్రువలను వెనుకనుండి గాయకులు పాడుచుందురు.

కుమారగిరిరెడ్డి తన వసంతరాజీయమందు ఐదువిధములగు ధ్రువలను క్రిందివిధముగా నిర్వచించినట్లు అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యలో కాటయవేముడును, ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యలో నాదెండ్ల గోపమంత్రియును పేర్కొనియున్నారు—



సూచనే పాత్రభేదానాం తత్ప్వథావార్థసూచనీ ।
యా గీతిః సా ధ్రువా తుల్యసంవిధానవిశేషణే ॥
ప్రావేశ క్యాక్షేపికీ చ తథా ప్రాసాది కీతి చ ।
నైష్క్రామి క్యాంతరీ చేతి తాసాం లక్షణ ముచ్యతే ॥
ప్రవేశసూచకాదౌ తు ధ్రువా ప్రావేశికీ మతా ।
ప్రసంగమధ్యే ఽన్యార్థస్యాక్షేపాదాక్షేపికీ మతా ॥
ప్రాసాదికీ తు పాత్రాణాం వ్యాకులానాం ప్రసాదనాత్ ।
నిష్క్రామసూచకాయాంతే ధ్రువా నైష్క్రామికీ భవేత్ ॥
విషాదే విస్మృతే క్రోధే ప్రసాదే సంభ్రమే మదే ।
దోషప్రచ్ఛాదనాదౌ చ గీయతే యా తు సాంతరీ ॥

4. పూర్వరంగాంగములు సంక్షిప్తములగుట

పూర్వరంగమందు భరతుడు ఇన్ని అంగములను చెప్పినను సంస్కృతనాటకములందివి కన్పట్టకపోవుటకు కారణము ఈ పూర్వరంగాంగముల విషయమున కవి ఉదాసీనుడగుటయే. అర్వాచీనాలంకారికులు ఈ అంగములను వివరించుటయే మానివేసినారు; ఒక్క శారదా తనయుడు మాత్రమే వీనినెల్ల పేర్కొని నిర్వచనముల నొసంగెను. తక్కినవివరముల నాతడు కూడ ఈయలేదు. "పూర్వరంగమును నిర్వర్తించి సూత్రధారుడు నిర్గమించిన తరువాత అట్టివాడే అగు నటు డొకడు ప్రవేశించి కావ్యస్థాపన మొనరించవలెను" అని మాత్రమే ధనంజయుడు పేర్కొనినాడు. భరతుడుచెప్పిన స్థాపకుడే ఈ నటుడు. అంతకుముందు జరుగవలసిన కార్యక్రమమును ధనంజయుడు వివరించలేదు. "దేనిని నాట్యవస్తువుకంటె పూర్వమే రంగవిఘ్నోపశాంతికొరకు కావింతురో అది పూర్వరంగమనంబడును. దీనికి ప్రత్యాహారము లోనగు నంగములు పెక్కులు కలవు; అయినను (ఆ యంగములలో) అవశ్యముగా విఘ్నోపశాంతికై నాందిని కావింపవలయును"అని చెప్పి విశ్వనాథుడు పూర్వ రంగాంగములందలి నాందిని మాత్రమే వివరించెను. [సాహిత్య దర్పణము— శ్రీవేదంవారి అనువాదము సూ. 281-పుట. 136]

మొత్తమునకు పూర్వరంగవిధి క్రమముగా విస్మృతమైనదని చెప్పవచ్చును. ప్రతి నాటకమునందును సూత్రధారుఁడు "అలం విస్తరేణ" (విస్తరము వలదు) అనుచు ప్రస్తావ నను ప్రారంభించును. పూర్వరంగ విధులు సంక్షిప్తము లైనవని కాని, మానివేయబడినవని కాని అనుటకు ఇదియొక నిదర్శనము.

పూర్వరంగాంగము లెంతగా సంక్షిప్తము లైనను నాందీశ్లోకమును; కవినామ-కథా సూచనములు, ఋతుగానము, ప్రథమపాత్ర ప్రవేశసూచనము అనెడి అంగములు మాత్రము ప్రస్తావన లేదా స్థాపన లేదా ఆముఖము అను పేరను సంస్కృతనాటకము లందు నిలిచియున్నవి. 20 వ అధ్యాయమందు భారతీవృత్తిని వివరించునప్పుడు ప్రరోచనా-ప్రస్తావన (ఆముఖము)లు రెండును మరల చెప్పబడినవి. 5 వ అధ్యాయమందు చెప్ప బడినవానిలో కవి ఉదాసీనుడు అనగా తటస్థుడు. కాని 20 వ అధ్యాయమందు చెప్పబడిన ప్రరోచనా - ప్రస్తావనాదులను కవియే స్వయముగా రచించును. నేడు సంస్కృతరూపకము

అందు కన్పట్టు నాందీ ప్రస్తావనాదులు కవికృతములే. 5 వ అధ్యాయమందు చెప్పబడని నటీ ప్రవేశ-ఋతుగానములు 20 వ అధ్యాయమందు చెప్పబడినవి (20 వ అధ్యాయమందలి 18 వ అధస్సూచికను, మూలమును కూడ పరిశీలించవలెను). నటీ ప్రవేశ - ఋతుగానములతో సంగీత - నృత్యముల కవకాశము కలిగి ప్రస్తావన మరింత ఆకర్షణీయమైనదని చెప్పవచ్చును.

భరతుడు చెప్పిన పూర్వరంగమునకు కాని, ముద్రిత సంస్కృత నాటకములందు కన్పట్టు కవికృత ప్రస్తావనాదులకు కాని వివిధ విషయములందు మగ్నులై యుండెడి ప్రేక్షకుల దృష్టిని రంగముమీదకు కేంద్రీకరింపజేసి వారి మనస్సులను రసోన్ముఖములనుగా చేయుటయే ముఖ్య ప్రయోజనము. "అదియునుంగాక తదీయ ఘటనావైభవాభంగరంగ ప్రసంగంబు నకుం బూర్వరంగంబు రసోత్తరంగంబగుట యెఱింగితివి కదా" [వసుచరిత్ర - 3 ఆశ్వా. 62 ప.] అని అనుటలో రామరాజభూషణుడు పూర్వరంగము అధిక రసవంతముగా ప్రయుక్తము కావలెనని సూచించుట గమనార్హము.

పాశ్చాత్యుల రూపకారంభములందు 'ప్రొలోగ్' (prologue) అనునది కలదు. ఇది మన ప్రస్తావనను పోలినది. ప్రదర్శింపబడనున్న నాటకమున కిది ఉపోద్ఘాతము వంటిది. దీనిని ప్రప్రథమముగా ప్రవేశపెట్టినవాడు యురిపిడస్ అను ప్రసిద్ధ గ్రీకు విషాదరూపక రచయిత. ఎలిజబెత్తు కాలములో ఆంగ్లేయులు దీనినే 'కోరస్' (chorus) అనినారు. రిష్టొరేషన్ కాలములో ఇది ఎక్కువ ప్రచారము నందినది. 19 వ శతాబ్దినుండి దీని వ్యాప్తి తగ్గెను. ఈ ప్రొలోగ్ హాస్యపూరితమే కాక, ఒక్కొక్కప్పుడు నాటి సాంఘిక-రాజకీయ పరిస్థితులను తీవ్రముగా విమర్శించుటయు కలదు. ఇట్లు విమర్శనాత్మకములైన 'ప్రొలోగ్స్' వ్రాసిన వారిలో డ్రైడెన్, గారిక్ మొదలగువారు ముఖ్యులు [The Oxford Companion to the Theatre - Pp. 634-635].

5. పూర్వరంగము : భాసనాటకములు

భాసుడు తన రూపకములందు స్థాపకునిచే రూపకమును పరిచయము చేయించు సంప్రదాయమునకు స్వస్తిచెప్పి పూర్వరంగ విధులను మరింత సంక్షేపించియున్నాడు. సూత్రధారుడే రూపకమును కూడ ఆరంభించి వెడలును. బాణు డీ విషయమును ఈ క్రింది విధముగా వివరించెను— "సూత్రధార కృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః సపతాకై ర్యశోలేభే భాసో దేవకులై రివ." (సూత్రధారునిచే చేయబడిన ఆరంభములు కలవియును, బహు భూమికలు పతాకలు కలవియును అగు దేవగృహములవంటి నాటకములచే భాసుడు కీర్తినందెను) [హర్షచరిత్ర-కృత్యవతారిక-15 శ్లో]. భాసుని నాటకములందు కవినామాది కీర్తనమునకు సంబంధించిన ప్రరోచనలు కూడ లేవు (అందుచేతనే వాని కర్తృత్వము వివాదాస్పద మైనది); ఇంక సంగీత నృత్యముల కసలే స్థానము లేదు.

భాసుని నాటకములు సూత్రధార ప్రవేశముతో ప్రారంభ మగుచున్నవి; నాంది తెరలోనే జరిగిపోవును. కాని తరువాతి నాటకములు నాందితోనే ప్రారంభ మగుచున్నవి. నాంది అయిన తరువాత సూత్రధారుడు ప్రవేశించి ప్రస్తావన నడపును. ఆదిలో కాకపోయినను, కాలక్రమమున నాందీ-ప్రస్తావనలను కవులే వ్రాసెడి సంప్రదాయ మేర్పడియుండును.



పూర్వరంగాంతమందు స్థాపకుడు ప్రవేశించి కావ్యప్రస్థాపన చేయునని చెప్పుచు భరతుడు చేసిన వివరణముతో భాసుని నాటకములు కాక తక్కినవన్నియును ఇంచు మించుగా సరిపోవు చున్నవి. నాట్యశాస్త్ర నియమములకు సరిపడని అనేక ఘట్టములు భాసనాటకములం దున్నవి. అందుచే భాసుడు భరతునకు పూర్వుడని కొంద రభిప్రాయ పడినారు. శాస్త్ర నియమములను ఎరిగియున్నను, స్వతంత్రించి భాసుడు ఉల్లంఘించె ననియు, అందుచే భాసుడు భరతునకు తరువాతివాడే అనియు మరికొందరి అభిప్రాయము. ఎట్లైనను కాళిదాసుచే ప్రశంసింపబడిన భాసుడు క్రీ. శ. 4 వ శతాబ్దికి పూర్వుడనుట నిశ్చయము. "ప్రథితయశసాం భాససౌమిల్లక కవిపుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః ?" అని మాలవికాగ్నిమిత్ర ప్రస్తావనలో కాళిదాసు పేర్కొనియుండెను.

పూర్వరంగమందు చెప్పబడిన గీతవిధి అంతయును సంస్కృత నాటకములలో ఋతుగాన రూపమున శేషించి యున్నది. పూర్వరంగాంగములం దెచ్చటను నటీప్రవేశ-ఋతుగాన ప్రశంసలు లేవు; కవికృతములైన భారత్యంగములందు మాత్రమే వీనిని భరతుడు పేర్కొనెను— 20 వ అధ్యాయమందు ప్రస్తావనలో నటియు, ప్రస్తావనాంగమయిన ప్రవృత్తకములో ఋతుగానమును చెప్పబడినవి. ప్రావేశిక్యాదిధ్రువ లైదును నేడు తెలుగు నాటకములందును, సినీమాలయందును పాటలరూపమున కన్పట్టు చున్నవి. వీనిని పాత్రలు స్వయముగా పాడవచ్చును. లేదా వెనుకనుండి గాయకులు పాడవచ్చును. ఇట్లు వెనుకనుండి పాడుటయే 'నేపథ్యసంగీత' మనబడును.

6. నాంది

నాంది ఆశీర్వచన సంయుక్తము కావలెనని భరతుడు చెప్పెను. కాని "ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యార్థసూచకః నాందీతికథ్యతే" అని ఆదిభరతుడు చెప్పినట్లుగా రాఘవభట్టు శాకుంతల వ్యాఖ్యానమందు పేర్కొనెను. ఆశీః-నమస్క్రియారూపమును, కావ్యార్థ సూచకమును అయిన శ్లోకము 'నాంది' అనబడునని పైదాని కర్థము.

ఈ కావ్యార్థసూచనము ప్రత్యక్షముగాకాని పరోక్షముగాకాని ఉండవలెనని ప్రతాపరుద్రీయకర్త విద్యానాథుడు పేర్కొనినాడు. నాంది దేవ-భూప-సభా-భర్తృ-ముఖ్యుల మంగళమును చెప్పునదికావలెననియు, ముఖ్యు లనునప్పుడు సరస్వతీ-కవి ప్రభృతులను గ్రహించవలెననియు నాట్యదర్పణ కర్తలు పేర్కొనిరి. [నాట్యదర్పణము-పుట 193]

ఆదిభరతు డెవరను విషయము వివాదాస్పదమైనది. ఆదిభరతునివనిచెప్పి రాఘవభట్టు ఉదాహరించిన కొన్ని శ్లోకములు నాట్యశాస్త్రమందు యథాతథముగా నున్నవి; పై శ్లోకమువంటివి మరికొన్ని లేవు. అట్లే భరతునివని చెప్పిన కొన్ని శ్లోకములు యథాతథముగా నాట్యశాస్త్రమందు కలవు; మరికొన్ని లేవు. [వివరములకు డా. ఘోష్ వ్రాసిన "Problems of Natya Sastra" అను వ్యాసమును చూడవలెను—Indian Historical Quarterly—Vol. V. pp 72-80]

కవికృతమైన 'నాంది' లేనిచో సూత్రధారుడే నాందిని కల్పించుకొనవలెననియు, నాందిపాఠకు లనగా సూత్రధార-స్థాపక-పారిపార్శ్వకులనియు నాట్యదర్పణకర్తలు తెలిపిరి.

"నందీశ్వరప్రియావహాముగా చేయబడునది కాన ఇది 'నాంది'' అనబడినదని కొందరందురు. "సామాజికులను 'నందింప' (ఆనందింప) చేయునది కాన ఇది 'నాంది'' అనబడినదని మరికొందరందురు. "దేవతలను ఆనందింపజేయునది కాన 'నాంది'" అనియు, (దేవాః = ఇంద్రియములు), "ఇంద్రియములను ఆనందింపజేయునది నాంది" అనియు ఇంకొక కొందరందురు. నాందియందు 8 లేదా 12 పదములుండవలెనని భరతుడు చెప్పెను; 8 పదములు కలది త్ర్యశ్రపూర్వరంగమందును, 12 పదములు కలది చతురశ్ర పూర్వరంగమునందును ఉండునని తెలియవలెను. 6 లేదా 8 పదము లుండవలెనని నాట్యదర్పణకర్తలును, 8 లేదా 10 లేదా 12 పదము లుండవలెనని సింగభూపాలుడును, 8 లేదా 12 లేదా 18 లేదా 22 పదము లుండవలెనని విద్యానాథుడును పేర్కొనినారు. ఈ 'పద' శబ్దము మరల వివాదాస్పదమైనది. ప్రథమాధ్యాయమందలి 18 వ అధస్సూచికను చూడవలెను.

నాంది 'చంద్రనామాంకితము' కావలెనని శారదాతనయుడును, నాందియందు శంఖ-చంద్ర-అబ్జ-కోక - కైరవాదిపదము లుండవలెనని విశ్వనాథుడును పేర్కొనినారు.

పై విషయములను సంగ్రహించి నాందీ లక్షణమును క్రిందివిధముగా చెప్పవచ్చును :

1. ఇది రూపక ప్రయోగారంభమందు విధిగా పఠింపబడవలెను. 2. నాందియందు ఆశీర్వచనము లేదా నమస్క్రియయును, కావ్యార్థ సూచనమును ఉండవలెను. 3. ఇది చక్కని శ్లోకమందు మంగలప్రదముగా కూర్పబడవలెను. దేవ-నృప-ద్విజ-సభా-కవి-నటాదులకు శుభమును కోరునదిగా ఉండవలెను. 4. 6 లేదా 8 లేదా 10 లేదా 12 లేదా 18 లేదా 22 పదములు ఇందుండవలెను. 5. సూత్రధారుడు మధ్యమ స్వరములో దీనిని చదువుచుండగా ప్రతిపాదాంతమున పారిపార్శ్వకులు 'ఏవమస్తు' అనుచుండవలెను. 6. దీనిని పఠించుటవలన చంద్రుడు సంతోషించును. 7. చిత్ర పూర్వరంగమందు నాందీ పదాంతరములందు తాండవమును కూర్చవలెనని కొందరందురు. 8. ఇందు చంద్ర-శంఖ-అబ్జ-కోక - కైరవాది పదములు కాని తత్పర్యాయ పదములు కాని ఉండవలెను. 9. దీనిని కవికాని, సూత్రధారుడుకాని రచింపవలెను.

పూర్వరంగమును నిర్వచించి, నాందీప్రాముఖ్యమును కుమారగిరిరెడ్డి వసంతరాజీయమునం దీ క్రింది విధముగా వివరించియుండెను [కాటయవేముని శాకుంతల వ్యాఖ్యలో]:

ప్రథమః పూర్వరంగ శ్చ తతః ప్రస్తావనేతి చ ।
ఆరంభే సర్వనాట్యానా మేతత్సామాన్య మిష్యతే ॥

యన్నాట్యవస్తునః పూర్వం రంగవిఘ్నోపశాంతయే ।
కుశీలవాః ప్రకుర్వంతి పూర్వరంగః స కీర్తితః ॥

యద్యప్యంగాని భూయాంసి పూర్వరంగస్య నాటకే ।
తేషా మవశ్యకర్తవ్యా నాందీ నందీశ్వరప్రియా ॥

ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యముఖోదితః ।
నాందీతి కథ్యతే తస్యాం పదాదినియమోఽపివా ॥

మాంగల్యారంభ చక్రాబ్జ కోక కైరవ శంసిపీ ।
నాందీ పదై ర్ద్వాదశభి రష్టాభి ర్వాప్యలంకృతా ॥



నేడు నాటక ప్రారంభమందు మనవారు 'పరాబ్రహ్మ పరమేశ్వర' అను పాటను గాని, మరియొక పాటను లేదా శ్లోకమును గాని పాడుచున్నారు. ఇదియే నేటి నాంది. ఇంక కవి-కథా-పాత్రాది వివరములను ప్రకటన పత్రములలో ముందుగానే తెలుపుచున్నారు. అది చాలదనుకొన్నచో నాటక ప్రారంభమందు 'మైక్'లో వివరములు తెలుపుట ఆచారమైయున్నది. ఈ పద్ధతివలనను 'గ్రామఫోను' పాటలవలనను పూర్వరంగావశ్యకత తొలగిపోయినను గీత-నృత్త-వాద్యముల సమ్మేళనముతో భరతుడాశించిన రంగప్రసాధనము (సభారంజకత్వము) మాత్రము మృగ్యమైనదనుట నిస్సంశయము.

## 7. యవనిక : జవనిక

'యవనిక' అను పదమునకు 'జవనిక' అనునది పర్యాయ పదము. రాజశేఖరుడు (క్రీ. శ. 10 వ శతాబ్ది) 'కర్పూరమంజరి' యందు అంకములనుటకు బదులుగా 'జవనికాంతరము' లనినాడు. కర్పూరమంజరి ప్రాకృత భాషారూపక మగుటచే 'జవనికా' పదమును ప్రాకృత పదముగా కొందరు తలంచిరి. అది సరికాదు. జవనిక కూడ సంస్కృత పదమే. జవముతో త్రోయబడునది కాన ఇది 'జవనిక' అనబడినది. ఈ జవనికా పదము 'జు' అను ధాతువునుండి నిష్పన్నమైనది. దీనిని అట్లే జకారాదిగా గోవర్ధనాది కవులు వాడియున్నారు; రాజశేఖరుడును జవనికా పదమును అట్లే స్వీకరించి వాడియుండుటచే అది ప్రాకృత పదమని భ్రమించుటయు, 'అదేర్యోజః' అను సూత్రము ప్రకారము సంస్కృత 'య' కారము ప్రాకృతమున జకార మగును గాన 'యవనికా' పదమును సంస్కృతముగాను, 'జవనికా' పదమును దానికి ప్రాకృతముగాను తలంచుటయు జరిగినది. 'జవనికా' పదము బొంబాయి ముద్రణమునందు పాఠాంతరముగా అధస్సూచికలో కన్పట్టుచున్నది.

ఇంక యవనికా పదము. సంస్కృత వాఙ్మయమందు 'యవన' పదము 'గ్రీసుదేశము' లేదా 'గ్రీసు దేశస్థులు' అను నర్థములందు ప్రయుక్తమై యున్నది. యవనులు పుష్యమిత్రుని ఎదిరించినట్లు మాలవికాగ్నిమిత్రమందు కలదు (5 వ అంకములో) యవనాంగనలు (యవని) రాజునకు అంగరక్షకులుగా నున్నట్లు అభిజ్ఞాన శాకుంతలమువలన తెలియుచున్నది (2 వ అంకములో). దీనినిబట్టి 'యవనికా' పదముకూడ గ్రీసు దేశ సంబంధమును తెలుపుచున్నదని ఊహించుట కవకాశము కలుగుచున్నది. క్రీ. పూ. 4 వ శతాబ్దినాటికే గ్రీసు దేశమున రూపక-రచనా ప్రదర్శనములు ఉచ్చస్థితిలో ఉన్నవని గుర్తించి యున్నాము. అలెగ్జాండరు దండయాత్రతో గ్రీకు-భారతీయ సంస్కృతుల సమ్మేళనము జరిగెను. అప్పుడు గ్రీకు రూపక ప్రదర్శనములను భారతీయులు చూచి వాని ననుకరించి యుందురనియు, తచ్చిహ్నమే 'యవనికా' పదమనియు కొందరు ఆధునిక విమర్శకులు ప్రతిపాదించియున్నారు. కాని, ఈ వాదము సత్యసమ్మతము కాదనియు, భారతీయ రూపకోత్పత్తికి గ్రీకురూపకము మూలము కాదనియు పెక్కురు విజ్ఞవిమర్శకులు నిరూపించి యుండిరి. అసలు, గ్రీకు నాటకరంగమున మన తెరవంటిది లేనేలేదు. 'యవన' అను పదము ఒక్క గ్రీసుదేశ సంబంధమును మాత్రమే తెలుపుటలేదనియు, సంస్కృత వాఙ్మయమందు పర్షియా-ఈజిప్టు-సిరియా-బాక్ట్రియా దేశములు, దేశస్థులుకూడ ఈ పదముచేతనే వ్యవహరింపబడెడివార

నియు, ఈ దేశములనుండి దిగుమతి అయిన వస్త్రముతోనే యవనిక తయారగుచుండెడి దనియు, అందుచే యవనికాపదము 'అందలి వస్త్రము ఇతర దేశములకు సంబంధించినది' అను అర్థమును మాత్రమే తెలుపుచున్నదనియు డా. కీత్ పేర్కొనుట గమనార్హము [Sanskrit Drama - page 61]

"యవంత్యత్ర జనా ఇతి యవనికా, యు మిశ్రణే" (జనులు దీనియందు కూడుదురు కాన ఇది యవనిక అనబడినది) అని గురుబాలప్రబోధికాకారుడు 'యవనికా' పదమునకు వ్యుత్పత్తి వ్రాసెను. మరియు 'యవనికా' పదమునకు 'జవనికా' అను పాఠాంతర మున్నట్లుకూడ సూచించినాడు. 'యమనికా' అను పదముకూడ కొన్నిచోట్ల చూపట్టు చున్నది. డా. యస్. కె. డే ఈ పాఠమును స్వీకరించెను. ['The Curtain in Ancient Indian Theatre'-Bharatiya Vidya-Vol. IX 1948]. "ప్రేక్షకులకు కనపడకుండ జేయునది" అని ఈ పదమున కర్థము. 'ప్రతిసీరా - యవనికా - తిరస్కరణీ' పదములు పర్యాయ పద ములని అమరకోశమందు కలదు. 'అడ్డముగా - కట్టబడునది' కాన ప్రతిసీర అనబడినది; 'ఆచ్ఛాదించునది' కాన తిరస్కరిణి అనబడినది. మొత్తమున కీ పదములన్నియును 'తెర' అను అర్థమునే సూచించుచున్నవి. ఈ తెర కేవలము భారతదేశమునకు సంబంధించిన దనుట నిస్సంశయము.

గ్రీసు దేశపు నాటకరంగమున ఆదిలో తెర అనునది లేనేలేదు (తరువాత వచ్చిన— స్కెనీ గోడకు ముందుండెడి— తెర మన నేపథ్యగృహద్వారములకు ముందుండెడి తెరల వంటిది మాత్రమే). క్రీ. పూ. ప్రథమ శతాబ్ది ప్రాంతమున రోమనులు తమ నాటకరంగమున ప్రప్రథమముగా ముందరితెరను ప్రవేశపెట్టిరి. నాట్యగృహమును ప్రప్రథమముగా నిర్మించిన వారును రోమనులే. నాటక ప్రారంభమందు ఈ తెర భూమిలోనికి పోయెడిది. నాటకము పూర్తి కాగానే మరల పైకి లేచెడిది. ఈ తెర ఒక తేలిక చట్రమునందు బిగింపబడి యుండెడిది. ఎలిజబెత్తు కాలపు ఆంగ్ల నాటకశాలలందు ముందరి తెర ఉన్నట్లు కన్పట్టదు. 'రిష్టొరేషను' కాలమునందు ఆకుపచ్చని ముందరి తెర కలదు. ప్రొలోగ్ అయిన వెంటనే తెర పైకి లేచెడిది. ఇంక నాటకము ముగిసినప్పుడే తెర మరల వ్రాలెడిది. తెర పడినచో నాటకము ముగిసినదని అర్థము. రంగమునందలి పాత్రలందరును నిష్క్రమించుటచేతనే అంకాంతమును తెలియపరచెడివారు. అట్టలమీద పేర్లను వ్రాసి స్థలమును నిర్దేశించెడివారు. దానిని మార్చుటచే రంగాంతమును తెలియపరచెడివారు. తరువాతిదృశ్యములో వచ్చెడి పాత్రలు ఆ సమయమున రంగమునందే ఉండెడివారు. 18 వ శతాబ్ది మధ్యభాగమునందు ప్రతి అంకమునకును తెర వేసెడి ఆచారము ('Act-drop') వ్యాప్తిలోనికి వచ్చినది. 1880 ప్రాంతముల ఇర్వింగ్ రంగాంతమును సూచించు తెరనుకూడ ఉపయోగించుటకు మొదలుపెట్టెను. [The Oxford Companion to the Theatre-page 171]

చంద్రశేఖర పండితుని భరతసారములో 'యవనిక' క్రింది విధముగా వర్ణితమైనది. [శ్రీ లంకా సూర్యనారాయణశాస్త్రిగారి అనువాదము-పుట 13]—



ధార్యా యవనికా రమ్యా నానావర్ణవిభూషితా ।
భావై ర్బహువిధాకారైః రంజయంతీ జగత్త్రయమ్ ॥
అఖండమండలం చిత్రం విస్తీర్ణం దీర్ఘ మంశుకమ్ ।
విస్తృత్య పూర్వరంగే ఽస్మిన్నేపథ్యం కల్పయే ద్బుధః ॥
నేపథ్యాంతరితః పూర్వం రంగపూజాం సమాచరేత్ ।

—"బహువిధ వర్ణములచే అలంకరింపబడి బహువిధాకారములుగల భావములతో లోకత్రయమును రంజించు రమ్యమగు యవనికను నాట్యమండపమున నేర్పరచ వలయును. ఇంకను అతుకులులేక నలుచదరముగానుండి చిత్రవర్ణములుగలిగి రంగస్థలము నకు సరిపోవునంతటి పెద్దదియగు నేపథ్యవస్త్రమునకు లోపలిభాగమున నేయుండి మొదట రంగపూజను, దేవతా ప్రార్థనమును జేయవలయును."

8. యవనిక : ప్రాచీన సంస్కృతరూపక ప్రదర్శనములు

'అంతర్యవనికాగతైః ప్రయోక్తృభిః' [బరోడా ముద్రణము - 11 వ శ్లో.], 'విఘట్య వై యవనికాం' [బరోడా ముద్రణము-12వ శ్లో.] అను నప్పుడు ఈ అధ్యాయ మందు యవనికాపదమును భరతుడు వాడియుండెను. "ప్రత్యాహారాద్యాసారితాంతము లైన తొమ్మిది అంతర్యవనికాంగములను ప్రయోగించవలెను. యవనికకు వెలుపల గీతక ప్రయోగాది ప్రరోచనాంతములైన పది అంగములను ప్రయోగించవలెను...... ఇచ్చట యవనిక అనగా రంగపీఠ- రంగశీర్షముల మధ్యనుండునది. దానిలోపలకు వచ్చి యున్న నటులచే లేదా వైణికాదులచే ప్రత్యాహారాదులు ప్రయుక్తములగును, యవనికను తొలగించిన పిమ్మట గీతకాదులను ప్రయోగించవలెను" అని అభినవగుప్తుడీ సందర్భమున వ్యాఖ్యానించెను [అభినవభారతి - 1వ సం - పుట 210]. "ధ్రువసంప్రవర్తితమై 'పట' మపకర్షితము చేయబడినపిమ్మట నానార్థ-రససంభవముగా పాత్రలు ప్రవేశించవలెను" అని 12 వ అధ్యాయ ప్రారంభములో భరతుడు మరల పేర్కొనెను. "పటమపకర్షితము చేయబడిన పిమ్మట=యవనికను తొలగించినపిమ్మట" అని అభినవగుప్తుడచ్చట వ్యాఖ్యా నించుటనుబట్టి యవనికా - పటములు రెండును పర్యాయపదము లనుట స్పష్టము.

భరతుడు ఒక తెరనే చెప్పెనా ? లేక రెండు తెరలను నిర్దేశించెనా? అనునది వివా దాస్పదమైన విషయము. అభినవగుప్తుని బట్టి రంగపీఠ - రంగశీర్షముల మధ్య ఒక తెర ఉండుననియు, ఆ తెరలోపల (అనగా రంగశీర్షమునందు) ప్రత్యాహారాది నవాంగములు ప్రయుక్తము లగుననియు స్పష్టమగుచున్నది. ఈ తెరను తొలగించుకొని పాత్రలు రంగమునందు యథావసరముగా ప్రవేశించుచుందురు. రంగమందున్నపాత్రలు నేపథ్యము నవలోకించుచున్నట్లు సూచింపబడునప్పుడు ఈ తెరవైపు చూచుచుందురని గ్రహించవలెను. నేపథ్యమునుండి వినిపించెడి మాటలు, ధ్వనులు మొదలగునవి ఈ తెర వెనుకనే ప్రవర్తితము లగును. నేపథ్యసంగీత మనగా ఈ తెరలోపల రంగశీర్షమందున్న గాయకాదులచే చేయబడు ధ్రువాగాన మని తెలియవలెను. "యవనికను తొలగించిన పిమ్మట పాత్రలు ప్రవేశింతురు" అనుటలో ఈ తెర పూర్తిగా తొలగింపబడునా ? లేక పాత్రలు తెరను త్రోసికొని మాత్రమే ప్రవేశింతురా ? అను సంశయము కలదు. అంకము ప్రదర్శింపబడుచున్నప్పుడు

ఈ తెర పూర్తిగా తొలగింపబడినచో రంగశీర్షమందలి గాయకాదులు కన్పించుచుందురు ; అట్లు కన్పించుట సమంజసముగా నుండదు. సంస్కృత నాటకములందు 'పాత్ర ప్రవేశ సూచనము' లేనిదే క్రొత్తపాత్ర రంగమున ప్రవేశించరాదనెడు నియమ మొకటి పాటింప బడినది. కాని, ముందు సూచన లేకయే క్రొత్తపాత్ర 'అపటీక్షేపము' చే రంగమును ప్రవే శించు ఘట్టములు కూడ కొన్ని కలవు (పటీ - అపటీ - జవనికా పదములు పర్యాయపదములని హాలాయుధుడు పేర్కొని యుండెను). అపటీక్షేపముచే అనగా 'తెరను చేతితోఒక ప్రక్కకు త్రోసి' అని అర్థము. పై తెర తొలగింపబడియున్నచో క్రొత్తపాత్ర దానిని త్రోసికొని ప్రవేశించుట కవకాశము ఉండదు. కావున ఈ తెర ప్రదర్శన సమయములో వేయబడియే ఉండుననియు, దానిని త్రోసికొని పాత్రలు ప్రవేశించుచుందురనియు గ్రహించుట సమంజసము. దీని వెనుకనుండియే ధ్రువాగానాదులు ప్రవర్తితము లగుచుండును.

మరి ప్రాచీనకాలమందు ముందరి తెర **(front drop-curtain)** ఉన్నదా? లేదా? అను విషయమును పై విధముగా నిర్దుష్టముగా చెప్పుటకు వీలులేకున్నది. "అంతర్యవని కాంగములు" అని పెక్కుచోట్ల చెప్పి, "బహిర్యవనికాంగములు" అని ఒకచోట మాత్రమే అభినవగుప్తుడు స్పష్టముగా చెప్పియుండెను. అయినను రంగపీఠ - రంగశీర్షముల మధ్య నుండునది అంతర్యవనిక అనియు, దాని ముందరనుండునది బహిర్యవనిక **(front curtain)** అనియు పై ప్రయోగములనుబట్టి ఊహించుటకు అవకాశము కలుగుచున్నది. మరియు "పటమపకర్షితము చేయబడిన పిమ్మట పాత్రలు ప్రవేశించవలెను" అని 12 వ అధ్యాయ మందు భరతుడు చెప్పుటలో అది 'ముందరి తెర' అను అర్థము సూచితమగుచున్నది. 5 వ అధ్యాయమందు 'యవనిక' అనియు, 12 వ అధ్యాయమందు 'పట' మనియు భిన్న పదము లను వాడుటకూడ ఆ తెరలు భిన్నము లని ఊహించుటకు తోడ్పడుచున్నది.

ముందరి తెర నాట్యశాస్త్రమందు నిర్దిష్టము కాలేదని తలంచువారు క్రిందివిధముగా చెప్పుదురు— "సంస్కృత నాటకములందలి అంకము లన్నియును తత్కాల వర్ణనలతో కాని, పాత్రల నిష్క్రమణమునకు నిర్దిష్టములగు సూచనలతో కాని అంతములగుచుండును. మరియు 'పాత్ర లందరును నిష్క్రమింతురు' అని ప్రతి అంకాంతమందును కవి సూచించుచుండును. దీనినిబట్టి అంకాంతమున పాత్రలందరును ఏదోవిధముగా తప్పక నిష్క్రమించవలెననియు, అప్పుడు తరువాతి అంకము ప్రారంభ మగుననియు గ్రహించవలసియున్నది. ముందరి తెరయే ఉన్నచో అంకాంతమున పాత్రలందరును నిష్క్రమించవలసిన అవసరములేదు. వారు రంగమందుండగానే తెరను వేయవచ్చును. ఇట్లు జరుగుట మనము నేడు చూచుచునే ఉన్నాము. కావున ముందరి తెర లేదని చెప్పవచ్చును."

కాని ఇందుల కొక ప్రతిబంధకము కలదు. 'తతః ప్రవిశతి ఆసనస్థః' (అప్పుడు ఆసన స్థుడై ప్రవేశించుచున్నాడు) అను సూచన కేమి అర్థము చెప్పవలెను? ఆసనమునందు కూర్చున్న తరువాత ముందరి తెర పైకి ఎత్తుట కాని, ప్రక్కకు తొలగించుట కాని చేసినచో మాత్రమే పై సూచన అన్వర్థము కాగలదు. ముందరి తెర లేదనుకొనినప్పుడు "ఆసనమును వేయగానే అతడు వచ్చి కూర్చుండును ; అప్పుడు కూర్చుండి ప్రవేశించినట్లే అగును" అని ఇచ్చట అర్థము చెప్పుకొనవలసి యున్నది. అయినచో ఆసనము వేయుట, నటుడు వచ్చి



కూర్చుండుట మొదలగున వన్నియును బహిరంగముగానే జరుగునని గ్రహించవలెను.

ఈ వాదములందలి గుణదోషములకు విజ్ఞులే ప్రమాణము.

సంస్కృత రూపకములందలి అంకములందు రంగ విభజనము లేదు. అంకమంత యును ఒకే రంగముగా ఉండును. కాని పరిశీలించి చూచినచో, స్పష్టముగా నిర్దిష్టములు కాకపోయినను, కొన్ని అంకములందు రంగములు కన్పట్టుచుండును. ప్రవేశక-విష్కంభ ములు ప్రత్యేక రంగములనియే చెప్పవచ్చును. కొన్ని అంకములు ఏ వీథియందో, ఏ ఉద్యాన వనమునందో ప్రారంభములై రాజసభయందో, అంతఃపురమునందో అంతములగుచుండును. అప్పుడవి భిన్నరంగము లనియే చెప్పవచ్చును. ఇట్టి రంగములను కక్ష్యావిభాగముచే గుర్తించ వలెనని 13 వ అధ్యాయమందు చెప్పబడును. ఈ రంగములను భిన్నములుగా చూపుటకు ఏవేని తెరలను వాడెడివారేమో చెప్పజాలము.

ప్రాచీన ప్రదర్శనములం దుపయుక్తములైన తెరలను ఒక ప్రక్కకు లాగెడివారా? లేదా పైకి చుట్టెడివారా? లేదా రెండుగా చీల్చియున్న దానిని రెండు ప్రక్కలకును లాగెడివారా? అను ప్రశ్నలకు సమాధానము చెప్పుట కష్టము. రంగపీఠ-రంగశీర్షముల మధ్యనున్న తెర ఎల్లప్పుడును వేయబడియే ఉండునని నిర్ణయించినప్పుడు దాని విషయ మున పై ప్రశ్నల కవకాశము లేదు. కాని, ఆశ్చర్యకరములగు దృశ్యాదులను రంగశీర్ష మందు ప్రదర్శించునప్పుడు మాత్రము ఈ తెర పూర్తిగా తొలగింపబడి యుండెడిదని ఊహింపవచ్చును. ఇంక, ముందరి తెర ఉన్నదని అంగీకరించినప్పుడు అది ఏ విధముగా తొలగింపబడెడిదో నిశ్చయముగా చెప్పుటకు తగిన ఆధారములు లేవు. పాశ్చాత్య దేశములందలి ప్రాచీన పద్ధతులను 7 వ విశేషాంశములో పేర్కొనియున్నాను. తెలుగు కవులు నిశాసతిని లేదా చరమదిక్సతిని నర్తకినిగా, సాంధ్య రాగమును 'కెంబట్టు తెర'నుగా ఉత్ప్రేక్షించిన ఘట్టము లనేకములు కలవు [ప్రభావతీప్రద్యుమ్నము-5 వ ఆశ్వా. 58 ప; నృసింహపురాణము-3 వ ఆశ్వా. 78 ప. మొదలైనవి]. వా రచ్చట చేసిన వర్ణనలను బట్టి ఆ తెర కూచిపూడి భామాకలాపమందు భామకు పట్టెడి తెరవంటిదని సులువుగా చెప్ప వచ్చును. "గగన మనెడి రంగమునం దంతటను నిండియున్న తమోభర మనెడి నేపథ్యమును (తెరను) దిక్కులనెడి స్త్రీలు ఒయ్యనొయ్య సడలింపగా రాత్రి యనెడి శైలూషి యొక్క మౌక్తిక పట్టము, నిటలము, వక్త్రము వరుసగా తోచినట్లు తూర్పున చంద్రుడు రేకయు, సగంబై, బింబమైతోచె" నని రామరాజభూషణుడు వర్ణించుటలో (వసుచరిత్ర-4వ ఆ. 17ప) పట్టిన తెరను క్రిందికి క్రమముగా వదలెడివారని తెలియుచున్నది. ఇంతకును ఇది నృత్య విషయము.

ధార్వాడ కంపెనీవారు ప్రప్రథమమున నాటకములను ప్రదర్శించిన నాటినుండి (అనగా 1880 నుండి) మొన్న మొన్నటి వరకును తెలుగు దేశమున కప్పీల సాహాయ్య ముతో తెరలను పైకి చుట్టుటయే ప్రచారమందున్నది. తరువాత తెరను మధ్యకు చీల్చి ఆ రెండింటిని రెండు ప్రక్కలకు కాని లేదా ఐమూలగా పైకికాని లాగుట ప్రచారము లోనికి వచ్చినది. కొంద రిప్పటికిని ఏకముగా ఉన్న తెరనే ఏదో ఒక ప్రక్కకు నియతముగా లాగుచుందురు.

---

# అధ్యాయము 6

## రసములు

[కాశీముద్రణమునందు - 83 శ్లోకములును, 11 గద్యములును కలవు; బొంబాయిముద్రణమునందు - 84 శ్లోకములును, 11 గద్యములును కలవు; బరోడాముద్రణమునందు-82 శ్లోకములును, 11 గద్యములును కలవు; మూడు ముద్రణములందును శ్లోకములు మాత్రమే గణింపబడినవి. బొంబాయి, బరోడా ముద్రణములందు శాంతరసమునకు సంబంధించిన భాగము అధిక పాఠముగా గణింపబడినది. ఇందు 6 శ్లోకములును, ఒక గద్యయును కలవు. కాశీముద్రణమునందీ భాగము లేదు.]

### ఋషుల ప్రశ్నలు

పూర్వరంగవిధిని తెలిసికొనిన పిమ్మట మహామునులందరును భరతునితో మరల ఇట్లనిరి—"ఈ క్రింది ఐదు[1] ప్రశ్నలకును సమాధానమును కోరుచున్నాము- 1. నాట్యమునందు నాట్యవిచక్షణు లంగీకరించిన రసములు రసత్వము నెట్లు పొందుచున్నవి? (లోకములో తీపి, కారము మొదలగువానికి 'రసము' లని పేరుకదా. ఇంక నాట్యమందలి శృంగారాదులను కూడ 'రస' పదముతోనే వ్యవహరించుటకు కారణమేమి?) 2. భావములని ఎట్లు చెప్పబడినవి? 3. అవి దేనిని భావింపజేయును? రస-భావముల తత్త్వమును సంగ్రహ-కారికా-నిరుక్త సహితముగా మాకు చెప్పుము."

అప్పుడు భరతుడు రస-భావముల తత్త్వమును క్రిందివిధముగా వివరించెను—

---

1. ఐదు ప్రశ్న లడుగుచున్నట్లు చెప్పబడినను, మూడు ప్రశ్నలు మాత్రమే కన్పట్టుచున్నవి. దీని నీ క్రింది విధముగా సమన్వయించుకొనవలెను—భావములకు సంబంధించిన ప్రశ్నలు రెండింటిలోను మరి రెండు ప్రశ్నలు ఇమిడియున్నవి. మొదటి ప్రశ్నలో - (1) భావము లనగా ఏమి? (2) భావపదమునకు వ్యుత్పత్తి ఏమి? ('భవతి ఇతి భావః' అనియా? లేక 'భావయతి ఇతి భావః' అనియా?). ఇంక రెండవ ప్రశ్నలో- (1) 'భావయతి (ఉత్పాదింపజేయు, వ్యాపింపజేయు) ఇతి భావః' అను వ్యుత్పత్తిని చెప్పినచో ఎట్లు ఉత్పాదింపజేయును? ఎట్లు వ్యాపింపజేయును? (2) దేనిని ఉత్పాదింపజేయును? దేనిని వ్యాపింపజేయును?—ఇట్లు భావములకు సంబంధించిన ప్రశ్నలు నాలుగును, రసములకు సంబంధించిన మొదటి ప్రశ్న ఒకటియును కలసి మొత్తము ఐదు ప్రశ్న లగుచున్నవి. [అభినవభారతి - 1 వ సం - పుటలు 261-262; 343] డా. ఘోష్ ఈ ప్రశ్నలను వివరించవలసిన శ్రమను తీసికొనలేదు.



జ్ఞానములు అనంతములు, అనేకములు

ఓ తపోధనులార! సంగ్రహ- కారికా- నిరుక్తములను యథాక్రమముగా, సమగ్రముగా నిరూపింతును. నాట్యమునకు సంబంధించిన వ్యాకరణాది శాస్త్రముల యొక్క జ్ఞానములును, చిత్ర-పుస్తాది శిల్పములును అనేకములును అనంతములును అగుటచే నాట్యమునకు సంబంధించిన సర్వవిషయములను సమగ్రముగా వివరించుటకు శక్తుడను కాను. అనేకములైన జ్ఞానములనెడి సముద్రములలో ఏ ఒక జ్ఞాన సముద్రమును కూడ తరింపలేము. అట్టియెడ జ్ఞానసముద్రము లన్నింటిని యథాతత్త్వముగా తరింపగలుగుట దుస్సాధమేకదా? కావున అల్పములైన సూత్రములను వాని వివరణములను కలదియును, లక్షణములను బాగుగా సాధించునదియును అగు నాట్యమునకు సంబంధించిన రస-భావాది సంగ్రహమును మాత్ర మిప్పుడు నిరూపింతును.

### నాట్యవేద సంగ్రహము

సూత్ర (లక్షణ) - భాష్య (వ్యాఖ్యాన) ములలో విస్తరముగా ఉపదేశింపబడిన అర్థములను నిశ్చితదృష్టితో సంక్షేపముగా నిబంధించుట 'సంగ్రహ' మనబడును.

> రసా - భావా - హ్యభినాయాః - ధర్మీ - వృత్తి - ప్రవృత్తయః ।
> సిద్ధిః - స్వరాః - తథాతోద్యం - గానం - రంగశ్చ సంగ్రహః ॥ 10

1. రసములు, 2. భావములు, 3. అభినయములు, 4. ధర్ములు, 5. వృత్తులు, 6. ప్రవృత్తులు, 7. సిద్ధులు, 8 స్వరములు, 9. ఆతోద్యములు, 10. గానములు, 11. రంగములు అను ఈ పదునొకండు విషయముల స్వరూపమే నాట్యవేద సంగ్రహము[2].

---

2. ఈ పదునొకండు విషయములే నాట్యశాస్త్రమందు చర్చనీయాంశములు. అభినయత్రయము అనగా ఆంగిక - వాచిక - సాత్త్వికాభినయములు మూడును, గీత - ఆతోద్యములు రెండును కలిసి నాట్యము పంచాంగమే అని భరతుని అభిప్రాయమట. నాట్యము ఏకాదశాంగాత్మక మనెడి పై అభిప్రాయము కోహలమతమట [అభినవ భారతి - 1 వ సం - పుట 264]. కొందరు 'ఉపచారము, మండపము' అను మరి రెండు అంగములను చేర్చి మొత్తము నాట్యము త్రయోదశాంగాత్మక మందురట. ఈ అభిప్రాయమును తెలుపు శ్లోకము అధిక పాఠముగా నాట్యశాస్త్ర ప్రథమ సంపుట ప్రథమ ముద్రణమందు కలదు.

## కారికా-నిరుక్తములు

సూత్రరూపమునకాని, శ్లోకరూపమునకాని ఒక అర్థము అల్పపదములతో సంక్షిప్తముగా చెప్పబడినప్పుడు అర్థప్రదర్శనకారియగు ఆ సూత్రము లేదా శ్లోకము 'కారిక' అనబడును.

అనేకవిధములగు నామముల యొక్క స్వరూపములను కోశముచేకాని, ప్రకృతి - ప్రత్యయ విభాగముచే కాని, క్రియా - కారక విచారముచేకాని, అనేక విధములగు ఇతర సిద్ధాంతములచే (ఆక్షేప-ప్రతిసమాధానములచే) కాని సాధించుట నిరుక్త మనబడును. ధాత్వర్థవివేచనము చేయుటచే సంగ్రహముగా, అర్థ సూచకముగా అర్థమును నిర్ణయించి చెప్పుట నిరుక్తమనబడును.*

## నాట్యవేదసంగ్రహమందు వివరింపబడిన విషయములు

ఇంతకుముందు సంక్షిప్తముగా పేర్కొనబడిన 'సంగ్రహ' మందలి విషయములను ఇప్పుడింక కారికా - నిరుక్త సహితముగా విస్తరించి చెప్పుదును.

## రసములు

బ్రహ్మచే ప్రవచింపబడిన రసములెనిమిది [ఇవి ఈ అధ్యాయమందే చెప్పబడును.]-

**శృంగార - హాస్య - కరుణా - రౌద్ర - వీర - భయానకాః ।**
**బీభ - త్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యేరసాః స్మృతాః[3] ॥** 15

1. శృంగారము, 2. హాస్యము, 3, కరుణము, 4. రౌద్రము, 5. వీరము 6. భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము.

## భావములు

మొత్తము నలుబది తొమ్మిది భావములు కలవు. అందు స్థాయిభావము లెనిమిది, సాత్త్వికభావము లెనిమిది. సంచారి లేదా వ్యభిచారి భావములు ముప్పదిమూడు. [ఈ భావములన్నియును 7 వ అధ్యాయమందు వివరింపబడును].

---

*[కాశీ, బొంబాయి, బరోడా ముద్రణములందు 1-18 శ్లో].

3. 'రసములు తొమ్మిది' అనువారి రెండవ పాదము నీ క్రింది విధముగా పఠింతురు-
**బీభ-త్సాద్భుత-శాంతాశ్చ నవ నాట్యేరసాః స్మృతాః ॥**
[ఉద్భటుని కావ్యాలంకార సారసంగ్రహము చతుర్థ వర్గము - 4 వ శ్లో.]
'కరుణ' అనగా 'దయ'. కావున, 'రసము' అను అర్థమునందు 'కరుణము' అని అనవలెను.



స్థాయిభావములు ఎనిమిది—

రతి - ర్హాసశ్చ - శోకశ్చ - క్రోధోత్సాహౌ - భయంతథా ।
జుగుప్సా - విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః[4] ॥ 17

1. రతి, 2. హాసము, 3. శోకము, 4. క్రోధము, 5. ఉత్సాహము, 6. భయము, 7. జుగుప్స, 8. విస్మయము.

సంచారి (వ్యభిచారి) భావములు ముప్పదిమూడు—

నిర్వేద-గ్లాని-శంకాఖ్యా-స్తథాసూయా-మదః-శ్రమః ।
ఆలస్యంచైవ-దైన్యంచ-చింతా-మోహః-స్మృతి-ర్ధృతిః ॥ 18
వ్రీడా- చపలతా- హర్ష- ఆవేగో- జడతా తథా ।
గర్వో- విషాద- ఔత్సుక్యం- నిద్రాపస్మార ఏవ చ ॥ 19
సుప్తం- విబోధో- ఉమర్షశ్చా- ప్యవహిత్థ- మథోగ్రతా ।
మతి- ర్వ్యాధి- స్తథోన్మాద- స్తథామరణమేవ చ ॥ 20
త్రాసశ్చైవ- వితర్కా-శ్చ- విజ్ఞేయా వ్యభిచారిణః ।
త్రయస్త్రింశదమీ భావాః సమాఖ్యాతాస్తు నామతః ॥ 21

1. నిర్వేదము, 2. గ్లాని, 3. శంక, 4. అసూయ, 5. మదము, 6. శ్రమము 7. ఆలస్యము, 8. దైన్యము, 9. చింత, 10. మోహము, 11. స్మృతి, 12. ధృతి, 13. వ్రీడ, 14. చపలత, 15. హర్షము, 16. ఆవేగము, 17. జడత, 18. గర్వము, 19. విషాదము, 20. ఔత్సుక్యము, 21. నిద్ర, 22. అపస్మారము, 23. సుప్తము, 24. విబోధము, 25. అమర్షము, 26. అవహిత్థము, 27. ఉగ్రత, 28. మతి, 29. వ్యాధి, 30. ఉన్మాదము, 31. మరణము, 32. త్రాసము, 33. వితర్కము.

సాత్త్వికభావములు ఎనిమిది—

స్తంభః- స్వేదోఽథ- రోమాంచః- స్వరభంగోఽథ- వేపథుః ।
వైవర్ణ్య- మశ్రు- ప్రలయ ఇత్యష్టౌసాత్త్వికాః స్మృతాః ॥ 22

1. స్తంభము, 2. స్వేదము, 3. రోమాంచము, 4. స్వరభంగము, 5. వేపథువు, 6. వైవర్ణ్యము, 7. అశ్రువు, 8. ప్రళయము.

## అభినయములు

నాట్యమందలి అభినయములు నాలుగు విధములు. [ఆంగికము 8-12

---

4. రసములు తొమ్మిదనునప్పుడు స్థాయిభావములును తొమ్మిది అగును. ఈ వాదమువారు ఈ రెండవపాదము నీ క్రింది విధముగా పఠింతురు—
**జుగుప్సా-విస్మయ-శమాః స్థాయిభావాః ప్రకీర్తితాః ॥**

అధ్యాయములందును, వాచికము 14, 15, 16, 17 అధ్యాయములందును, ఆహార్యము 21 వ అధ్యాయమందును, సాత్త్వికము 7, 22 అధ్యాయములందును, ఈ నాలుగు అభినయములకును సంబంధించిన సామాన్యాభినయము 22వ అధ్యాయమందును, చిత్రాభినయము 25 వ అధ్యాయమందును వివరింపబడును.]

ఆంగికో- వాచికశ్చైవ- హ్యాహార్యః- సాత్త్వికస్తథా ।
చత్వారోఽభినయా హ్యేతే విజ్ఞేయా నాట్యసంశ్రయాః ॥ 23

1. అంగికము (శారీరాభినయము), 2. వాచికము (వాగభినయము), 3. ఆహార్యము (అంగరచనము, వస్త్ర-భూషాదిధారణము), 4. సాత్త్వికము (సత్త్వసంబంధమైన అభినయము).

ధర్మలు

ధర్ములు (ధర్మి=అభినయవిధానము) రెండువిధములు [చూ. 13వ అధ్యా.]
లోకధర్మీ- నాట్యధర్మీ ధర్మీతి ద్వివిధః స్మృతః । 24

1. లోకధర్మి (లోకసహజమైనది-**Realistic practice or Realism**), నాట్యధర్మి (సామయికము - **Conventional Practice or Idealism**).

వృత్తులు

నాట్యమునకు మాతృకలైన వృత్తులు నాలుగు [చూ. 20వ అధ్యా.]
భారతీ- సాత్త్వతీచైవ- కైశి- క్యారభటీ తథా ॥ 24
చతస్రో వృత్తయో హ్యేతా యాసు నాట్యం ప్రతిష్ఠితమ్ । 25

1. భారతి, 2. సాత్త్వతి, 3. కైశికి, 4. ఆరభటి - ఈ నాలుగువృత్తులయందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నది.

ప్రవృత్తులు

ప్రవృత్తులు (ఆయా దేశవేష-ఆచారాదులు) నాలుగు [చూ. 13వ అధ్యా.]
"ఆవంతీ- దాక్షిణాత్యా చ తథా- చైవోఢ్రమాగధీ[5] ॥ 25

5. 'ఓఢ్రమాగధి' అనుదానికి 'అర్ధమాగధి' అనియు, 'ఆంధ్రమాగధి' అనియు పాఠాంతరములు కలవు. ఇందు ప్రాగుత్తర-పశ్చిమోత్తర హిందూస్థానముల ప్రసక్తి లేకపోవుట గమనార్హము. నాట్యశాస్త్ర రచనాకాలమునాటికి వంగదేశము, అస్సాము మొదలగు ప్రాగుత్తరభాగములు ఆర్య నాగరికతా ప్రభావమునకు లోనుకాలేదనియు, విదేశీయుల దండయాత్రలకు తరచుగా గురియగుచుండెడి పశ్చిమోత్తర భాగములందు స్థిరమైన సంప్రదాయము నెలకొని ఉండలేదనియు డా. ఘోష్ అభిప్రాయపడెను [నాట్యశాస్త్రము - ఆంగ్లానువాదము - పుట 104].



పాంచాల మధ్యమా చేతి విజ్ఞేయాస్తు ప్రవృత్తయః । 26

1. ఆవంతి, 2. దాక్షిణాత్య, 3. ఓఢ్రమాగధి, 4. పాంచాలమధ్యమ.

సిద్ధులు

సిద్ధులు (సిద్ధి=నాట్యము జయప్రదమగుట) రెండు విధములు. [చూ. 27వ అధ్యా.]
దైవికీ- మానుషీచైవసిద్ధిః స్యాద్ద్వివిధైవతు ॥ 26

1. దైవికి (ఇది ఉత్తమమైనది), 2. మానుషి (ఇది సామాన్యమైనది)

స్వరములు

స్వరములు ఏడు. [చూ. 28 వ అధ్యా.]
శారీరశ్చైవ- వైణాశ్చ సప్తషడ్జాదయః స్వరాః ।
(నిషాద- ఋషభ- గాంధార- మధ్య- పంచమ- ధైవతాః ॥)

1. షడ్జము, 2. నిషాదము, 3. ఋషభము, 4. గాంధారము, 5. మధ్యమము, 6. పంచమము, 7. ధైవతము.

ఈ సప్తస్వరములును శరీరోద్భవములును (ఇది గాత్రసంగీతము), వీణాజన్యములును (ఇది జంత్రసంగీతము) కూడ అగుచు రెండువిధము లగుచున్నవి.

ఆతోద్యములు

సలక్షణములైన ఆతోద్యములు (వాద్యములు) నాలుగువిధములు. [తతము 29 వ అధ్యాయమందును, అవనద్ధము 34 వ అధ్యాయమందును, ఘనము 31వ అధ్యాయమందును. సుషిరము 30 వ అధ్యాయమందును వివరింపబడును.]

తతం- చైవావనద్ధంచ- ఘనం- సుషిరమేవచ ॥ 27
చతుర్విధం చ విజ్ఞేయమాతోద్యం లక్షణాన్వితమ్ । 28

1. తతము-ఇది తంత్రీగతము (వీణ మొ॥), 2. అవనద్ధము (ఆనద్ధము)-ఇది పౌష్కరము (చర్మముచే మూయబడిన మద్దెల మొ॥), 3. ఘనము- ఇది కాంస్యతాళము (కంచుతాళములు), 4. సుషిరము- ఇది వంశము (వేణువు మొ॥)

గానములు

ధ్రువాగానము లైదు విధములు[6] [చూ. 32 వ అధ్యా.]
ప్రవే - శాక్షేప - నిష్క్రామ - ప్రాసాదిక - మథాంతరమ్ ॥ 29
గానం పంచవిధం జ్ఞేయం ధ్రువాయోగసమన్వితమ్ । 30

6. ధ్రువలను గూర్చిన వివరములకు 5 వ అధ్యాయాంతమందలి 3 వ విశేషాంశమును చూడవలెను. ధ్రువ=గీత్యాధారమున నియతమైన పదసమూహము.

[1. ప్రవేశగానము (రంగమునందు ప్రవేశించు పాత్రయొక్క భావమును, ప్రకృతిని, అవస్థానమును సూచించు గానము)

2. ప్రసాదగానము (ప్రవేశించిన పాత్రయొక్క చిత్తవృత్తిని సామాజికులకు తెలియజేయు గానము)

3. ఆక్షేపగానము (రసాంతమును సూచించుటకు చేయబడు గానము)

4. ఆంతరగానము (గతి పరిక్రమణ నిరూపణాద్యవసరములందు చేయబడు గానము)

5. నిష్క్రామగానము (పాత్ర నిష్క్రమించునప్పుడు చేయబడు గానము)]

రంగములు

రంగములు మూడు విధములు [రంగముల నిర్మాణాదులు 2 వ అధ్యాయ మందు వివరింపబడినవి.]

చతురశ్రో - వికృష్టశ్చ - రంగ త్ర్యశ్రశ్చ కీర్తితః ॥ 30

1. చతురశ్రము 2. వికృష్టము 3. త్ర్యశ్రము.

ఇట్లు నాట్యసంగ్రహము స్వల్పసూత్రములతో నిర్దిష్టమైనది. ఇంక దీనిని సూత్ర-భాష్యములచే, ఆక్షేప-ప్రతిసమాధానములచే వివరింతును.*

రసనిష్పత్తి సూత్రము

ముందుగా రసములను వివరింతును—

"నహిరసాదృతే కశ్చిద ప్యర్థః ప్రవర్తతే.
తత్ర విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః."

—రసహీనమై ఏ అర్థమును ప్రవర్తింపదు[7]. అట్టి రసము విభావ-అనుభావ-వ్యభిచారి భావముల సంయోగమువలన నిష్పన్నమగును[8]. [1వ సం - పుట 270]

*[మూడు ముద్రణములందును 14-31 శ్లో.]

7. రూపకమందు కాని, కావ్యమందు కాని రసమే ముఖ్యమనియు, రసముగా పరిణమించని లేదా రసమునకు పోషకము కాని ఏ అర్థమును (భావమును) వానియం దుండరాదని సారాంశము—వ్యాఖ్యాతృ-నట-సామాజికుల దృష్టిలో రసమునకే ప్రాముఖ్య మని అభినవగుప్తుడు పేర్కొనెను.

ఇచ్చట 'రస' పదము ఏకవచనములో ఉన్నది. నిజమునకు, రూపకమందు సూత్ర రూపమున ఒకే రసము ప్రతిభాసించుచుండును. తక్కిన రసము లన్నియును దానినే అనుస రించి ఉండును [అభినవభారతి - 1 వ సం - పుట 271].

8. ఇది సుప్రసిద్ధ భరత రససూత్రము. ఇందలి సంయోగ-నిష్పత్తి పదములను భరతు డెచ్చటను నిర్వచింపలేదు; అర్వాచీనాలంకారికులవలె రస నిర్వచనమందు 'స్థాయి' పదమును కూడ చేర్చలేదు. మొత్తమున కీ సూత్రము తరువాతి కాలములో పలువిధము



రససూత్ర భాష్యము

ప్రశ్న : అందులకు దృష్టాంత మేమి ?

సమా : వివిధములైన వ్యంజనముల (రుచికరములైన ద్రవపదార్థముల), ఓషధుల (పసుపు మొదలగునాని), ద్రవ్యముల (బెల్లము మొదలగువాని) సంయోగము (చక్కనిపాళ్ళలో కూర్చుట) వలన రసములు నిష్పన్నములగుచున్నట్లే నానావిధము లగు భావముల సంయోగమువలన రసము నిష్పన్నమగుచున్నది. అనగా గుడాదిద్రవ్య ముల, వ్యంజనముల, ఓషధుల సంయోగమువలన షాడవాదిరసములు[9] సిద్ధములగు చున్నట్లే వివిధములైన విభావాదులచే ఉపగతములై (ప్రత్యక్షకల్పత్వమును పొందినవై) స్థాయిభావములు కూడ రసత్వమును పొందుచున్నవి (ప్రతిపాదించుచున్నవి.)

ప్రశ్న : అయినచో 'రస' మను పదమున కర్థమేమి ?

సమా : ఆస్వాదింపబడుచున్నది కాన అది 'రస' మనబడుచున్నది.

ప్రశ్న : రసము ఎట్లు అస్వాదింపబడుచున్నది ?

సమా : వివిధములగు వ్యంజనములచే సంస్కరింపబడిన అన్నమును భుజించు చున్న సుమనస్కులైన పురుషులు రసములను (రుచులను) ఆస్వాదించుచు హర్షా దులను పొందుచున్నట్లే, వాచిక - ఆంగిక - సాత్త్వికాభినయములచే ప్రదర్శితము లగుచున్న వివిధములగుభావములచే వ్యంజితములైన స్థాయిభావములను సుమనస్కులైన ప్రేక్షకులు ఆస్వాదించుచు హర్షాదులను పొందుచున్నారు[10]. కావుననే ఇవి 'నాట్యరసము' లని చెప్పబడినవి (తీపి, వగరు మొదలగు ఆరురసములు 'లౌకికరసము' లని తెలియవలెను.)

లుగా వ్యాఖ్యాతమై విభిన్నవాదములకు దారితీసినది. జగన్నాథ పండితుడు రసగంగాధర మందు పదునొకండు మతములను పేర్కొనియుండెను. ముఖ్యములైన నాలుగు మతము లను విశేషాంశములందు వివరింతును. ఇచ్చట ఒక సత్యమును మాత్రము తప్పక గుర్తించవలయును. విభావ-అనుభావ-వ్యభిచారి భావములు భావకుడైన సామాజికుని భావనలో సంయోగమును (కలయికను) చెందును; రసము నిష్పన్నమగుటయు వాని భావనలోనే. వివరములకు ఈ అధ్యాయాంతమందలి 8 వ విశేషాంశమును చూడవలెను.

9. 'షాడవ' మనగా అన్ని రుచులను కలియుటచే ఏర్పడిన వింతరుచికల పదార్థము. 'షాడవాది రసములు' అనుటకు బదులుగా 'షడ్రసములు' అని కాశీముద్రణ పాఠము.

10. నటుడు అభినయములచే భావములను వ్యక్తము చేయును. ఆ భావములు ప్రేక్షకులలోని స్థాయిభావములను వ్యంజితములను చేయును.

ఇందు ఆస్వాద్యము, ఆస్వాదయిత, ఆస్వాదఫలము అను మూడును చెప్పబడినవి.

"ప్రేక్షకులు...హర్షాదులను పొందుచున్నారు అని అనుటలో ఆదిశబ్దముచే శోకా దులు కూడ గ్రహింపబడును. కావున అట్లనుట యుక్తము కాదు. నాట్యము సామాజికుల

ఈ విషయములను వివరించెడి అనువంశ్య శ్లోకములు[11] ( గురుశిష్యపరంపరగా లభించినవి) రెండు కలవు. [ 'ముందుగా రసములను వివరింతును' అను చోటనుండి ఇంతవరకును మూలము గద్యములో ఉన్నది.]

యథా బహుద్రవ్యయుతై ర్వ్యంజనై ర్బహుభిర్యుతమ్ ।
ఆస్వాదయంతి భుంజానా భక్తం భక్తవిదో జనాః ॥ 32

భావాభినయసంబద్ధాన్ స్థాయిభావాం స్తథా బుధాః ।
ఆస్వాదయంతి మనసా తస్మాన్నాట్యరసాః స్మృతాః ॥ 33

—బహుద్రవ్యయుతములైన, బహువ్యంజనములతో కూడిన అన్నమును అన్నము యొక్క రుచి నెరిగిన జనులు భుజించుచు రసనావ్యాపారముచే ఆస్వాదించుచున్నట్లే, భావ - అభినయములతో సంబద్ధములైన స్థాయి భావములను చర్వణ చేయుచు బుధులు మనోవ్యాపారముచే (మనస్సుచే) ఆస్వాదించుచున్నారు. అందుచేతనే ఇవి 'నాట్యరసము' లనబడినవి[12].

---

విషయమున హర్షైకఫలమని తెలియవలెను" అని తలంచుకొందరు, "హర్షమును పొందుచున్నారు" అని మాత్రమే పఠింతురు [అభినవభారతి-1 వ సం-పుట 289]. ఈ అభిప్రాయమును అభినవగుప్తుడు సమర్థించలేదు. వివరములకు ఈ అధ్యాయాంత మందలి 9 వ విశేషాంశమును చూడవలెను.

11. ఇవి భరతకృతములైన శ్లోకములు కావు. గురుశిష్య పరంపరగా వచ్చిన ఈ శ్లోకములను సుఖసంగ్రహార్థము భరతుడిందు పొందుపరచికొనెను. ఇట్లే 'భవంతి చాత్ర శ్లోకాః' అనియు, 'అత్రార్యే భవతః' అనియు, 'అత్ర' అనియు, 'అపిచ' అనియు ప్రాచీన శ్లోకములను, ఆర్యలను ఈ 6, 7 అధ్యాయములందు భరతుడచ్చటచ్చట ఉదాహరించుచుండును.

12. ఇందుకూడ భోగ్యము (ఆస్వాద్యము), భోక్త (ఆస్వాదయిత), భోగఫలము (ఆస్వాదఫలము) చెప్పబడినవి. "రససముదాయ రూపమే నాట్యము...కావ్యమనునప్పుడు ముఖ్యముగా దశరూపాత్మకమైదనియే అర్థము...కావుననే వామనుడు 'సందర్భేషు దశరూపకమ్' అని ప్రస్తుతించినాడు...కావ్య మనగా నాట్యమే" అని 'నాట్యరసము' అను దానిపై అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను.

ఇచ్చట ఇంకొక విషయమును గుర్తింపవలసి యున్నది—నటునియందు రసము ఉండదు; అనగా వానికి రసానుభూతి ఉండరాదు. అతడు ఆస్వాదనోపాయము మాత్రమే; కావుననే 'పాత్రము' అనబడినాడు. పాత్రము మద్యాది రసాస్వాదమున ఆస్వాదయితకు తోడ్పడునే కాని, దానికి తదనుభూతి ఉండదు; అది కేవలము సాధనము మాత్రమే. అట్లే నటుడు ప్రేక్షకుల రసాస్వాదమునకు ఒక సాధనము మాత్రమే [అభినవభారతి-1వ సం-పుట 291.]



రస - భావముల కార్యకారణ భావము

ప్రశ్న: అయినచో రసములనుండి భావములు నిర్వృత్తములగుచున్నవా? లేక భావములనుండి రసములు నిర్వృత్తములగుచున్నవా? రస - భావములు పరస్పరసంబంధముచే నిష్పన్నములగునని కొందరందురు. ఈ మూడు పక్షములందేది యుక్తము?

సమా: భావములనుండియే రసములు నిర్వృత్తములగుచుండుట స్పష్టము. రసములనుండి భావములు నిర్వృత్తములగుట లేదు.[13] ఈ విషయమును వివరించు శ్లోకములు కొన్ని కలవు. [ఈ ప్రశ్న - సమాధానములు రెండును మూలమునందు గద్యములో ఉన్నవి.]

వివిధాభినయములచే హృదయగతములైన రసములను 'భావింపజేయునవి'[14] కాన నాట్యవేత్తలు వీనిని 'భావము' లందురు. బహువిధములగు ద్రవ్యముల సంయోగమువలన వ్యంజనము భావింపబడు (అనుపానాదిరసము నిష్పన్నమగు) చున్నట్లే, వివిధాభినయ సహితములైన భావములవలన రసములు భావింపబడుచున్నవి.

న భావహీనోఽస్తి రసో న భావో రసవర్జితః ।
పరస్పరకృతాసిద్ధి స్తయో రభినయే భవేత్ ॥ 36

—భావహీనమైనరసము ఉండదు, అనగా నాట్యమందు భావములేని దేరసనిష్పత్తియే లేదు; అట్లే రసవర్జితమైన భావమును ఉండదు, అనగా నాట్యమందు, రసమునకు

---

13. ఈ అనువాదము డా. రాఘవన్ సంస్కరించిన పాఠము ననుసరించియున్నది. [చూ. Bhoja's Srngara Prakasa, page 541]

కాని, తరువాతి శ్లోకముల అర్థమునుబట్టి పై వాక్యముల నీ క్రిందివిధముగా మార్చుట సమంజసమని డా. ఘోష్ అభిప్రాయపడెను—"ప్రశ్న:- భావములనుండి రసములు నిర్వృత్తము లగుచున్నవనియు, రసములనుండి భావములు నిర్వృత్తములగుట లేదనియు కొందరందురు. అది సరికాదు. ఎందుచేత? సమా:- అవి పరస్పర సంయోగమువలన నిష్పన్నములగుచుండుట స్పష్టమేకదా". ఇది అర్థయుక్తముగా కన్పట్టుటలేదు.

14. 'భావింపజేయును (భావయంతి)' అను క్రియకు ప్రసిద్ధములైన రెండు అర్థములు కలవు—1. రసములను నిష్పన్నము చేయుట, 2. సామాజికులచే రసములను అనుభవింపజేయుట.

ఇచ్చట పై రెండర్థములును అన్వితములగును. మొదటి అర్థము కవుల, నటుల కర్తవ్యమునకు సంబంధించియున్నది; రెండవ అర్థము సామాజికులమీద భావముల ప్రభావమును వ్యక్తముచేయుచున్నది.

హేతువైనప్పుడే అది 'భావ' పదముచే వ్యవహృత మగును. ఇట్లు పరస్పరకృతమైన రస-భావముల సిద్ధి అభినయమందు సంభావ్య మగుచున్నది.

వ్యంజనౌషధి సంయోగముచే అన్నమునకు స్వాదుత్వము (ఆస్వాద్యత) కలుగుచున్నది. అన్నముచే వ్యంజనములకు సుఖభోగ్యత కలుగుచున్నది. అట్లే భావములు, రసములు పరస్పరము భావింపబడుచున్నవి.[15]

బీజమునుండి వృక్షము, వృక్షమునుండి పుష్ప-ఫలములు కలుగుచున్నట్లు, సర్వరసములు మూలభూతములగుచున్నవి. వానినుండియే భావములు వ్యవస్థితము లగుచున్నవి [16] (భావాదివ్యపదేశము కలవి అగుచున్నవి.)*

## రసముల ఉత్పత్తి-వర్ణ-దైవతములు

ఇంక రసములయొక్క ఉత్పత్తి-వర్ణ-దైవత నిదర్శనములను వివరింతును—

ఉత్పత్తి: ఉత్పత్తి హేతుభూతము లగు (ప్రధానములగు)రసములు నాలుగు మాత్రమే—శృంగార-రౌద్ర-వీర-బీభత్సములు. వీనిలో శృంగారమునుండి హాస్యమును, రౌద్రమునుండి కరుణమును, వీరమునుండి అద్భుతమును, బీభత్సము నుండి భయానకమును ఉత్పన్నములైనవి. అనగా శృంగారానుకృతి హాస్యమన

15. 'భావములు రసములను భావింపజేయును' అనునప్పుడు 'భావయంతి' అను క్రియకు 'నిష్పన్నముచేయు' అని అర్థము. ఇంక 'రసములు భావములను భావింపజేయును' అనునప్పుడు 'భావయంతి' అను క్రియకు 'భావాదివ్యపదేశమును కలిగించు' అని అర్థము. ఇట్లు క్రియాభేదముకలదు కాన 'భావయంతి' అను ఏకక్రియనుపయోగించుటవలన అన్యోన్యాశ్రయత్వదోషము కలుగదు. [అభినవభారతి-1వ సం-పుట 293.]

16. కవిగతమైన రసము బీజము. ఆ బీజమునుండి జన్మించిన కావ్యమే వృక్షము. అభినయాది నటవ్యాపారముచే ఆవిష్కృతములైన భావములు పుష్పస్థానీయములు. సామాజిక రసాస్వాదము ఫలస్థానీయము. ఈ విధముగా విశ్వము రసమయము. ఇట్లు కవిగతమైన రసము కావ్యగతమగుచున్నది. అందుచేతనే "శృంగారీచేత్ కవిః—" [ధ్వన్యాలోకము-3వ ఉద్యోతము. 42 శ్లో.] అని ఆనందవర్ధనాచార్యులు పేర్కొనిరి. అట్లు కావ్యగతమైన రసమే నటవ్యాపారముచే అభివ్యక్తమై సామాజికునిచే ఆస్వాదింపబడుచున్నది. కావుననే "కవిర్హి సామాజికతుల్య ఏవ" అని భట్టతౌతుడు చెప్పెను.

*[కాశీముద్రణమునందు - 32-38 శ్లో., బొంబాయిముద్రణమునందు - 33-39 శ్లో., బరోడాముద్రణమునందు - 31-38 శ్లో.]



బడును;[17] రౌద్రకర్మయొక్క ఫలమే కరుణము; వీరకర్మయొక్క ఫల మద్భుతమన బడును; ఇంక బీభత్స దర్శనమువలన జనించునది భయానకమని తెలియవలెను.

వర్ణములు: శృంగారము శ్యామవర్ణము. హాస్యము సితవర్ణము (తెలుపు) కరుణము కపోతవర్ణము. రౌద్రము రక్తవర్ణము. వీరము గౌరవర్ణము. భయానకము కృష్ణవర్ణము. బీభత్సము నీలవర్ణము. అద్భుతము పీతవర్ణము (పసుపు).

దైవతములు: శృంగారము విష్ణుదైవతము. హాస్యము ప్రమథదైవతము. రౌద్రము రుద్రాధిదైవతము. కరుణము యమదైవతము. బీభత్సము మహాకాల దైవతము. భయానకము కాలదైవతము. వీరము మహేంద్రదైవతము. అద్భుతము బ్రహ్మదైవతము[18].

విభావ - అనుభావ - వ్యభిచారిభావ - స్థాయిభావ సంయుక్తములగు రసముల లక్షణ - నిదర్శనములను, స్థాయిభావముల రసత్వమును ఇంక వివరింతును.

17. శృంగారము అనుకృతిరూపమున అనగా ఆభాసరూపమున హాస్యమునకు హేతువగును. ఈ ఆభాసమందలి రతి కామనాభిలాషమాత్రరూపమైన వ్యభిచారిభావమే కాని స్థాయి కాజాలదు; స్థాయివలె మాత్రము గోచరించును. తద్వశమున విభావాదులు కూడ ఆభాసరూపమును పొందుచున్నవి. ఆభాస మనగా అనౌచిత్యప్రవృత్తి. అనౌచిత్యమున్నచోటనెల్ల అది ఆభాసమేఅగును. ఆ ఆభాసము హాస్యమునకు విభావమగును. ఇచ్చట శృంగారపదము తక్కిన రసముల కుపలక్షకము. దీనిచే సర్వరసములును గ్రాహ్యములే అనగా కరుణాద్యాభాసములును హాస్యమునకు విభావములే [అభినవభారతి-1 వ సం-పుట 295].

వికృతములైన వేష-అలంకారములు హాస్యమునకు విభావములని తరువాత చెప్పబడును. ఇచ్చట 'వికృత' పదమునకు దేశ-కాల-వయః-ప్రకృతి-అవస్థా వైపరీత్యమని అర్థము. దీనినిబట్టి సర్వరసములయందలి అనౌచిత్య ప్రవృత్తియు హాస్యమునకు విభావమగుననుట స్పష్టము [అభినవభారతి-1 వ సం-పుట 313].

18. రస-స్థాయిభావ-వర్ణ-దైవతముల క్రమమును పట్టికరూపములో ఇచ్చుచున్నాను.

| రసములు | స్థాయిభావములు | వర్ణము | దైవతము |
|---|---|---|---|
| 1. శృంగారము | రతి | శ్యామవర్ణము | విష్ణువు |
| 2. హాస్యము | హాసము | సితవర్ణము | ప్రమథులు |
| 3. కరుణము | శోకము | కపోతవర్ణము | యముడు |
| 4. రౌద్రము | క్రోధము | రక్తవర్ణము | రుద్రుడు |
| 5. వీరము | ఉత్సాహము | గౌరవర్ణము | మహేంద్రుడు |
| 6. భయానకము | భయము | కృష్ణవర్ణము | కాలుడు |
| 7. బీభత్సము | జుగుప్స | నీలవర్ణము | మహాకాలుడు |
| 8. అద్భుతము | విస్మయము | పీతవర్ణము | బ్రహ్మ |

శృంగార ప్రకరణము

1. *శృంగారము :* ఇది 'రతి' అనెడు స్థాయి భావమునుండి జనించును; ఉజ్జ్వల వేషము కలిగి ఉండును. లోకమందు ఏదేని శుచిగా, మేధ్యము (పవిత్రము) గా, ఉజ్జ్వలముగా, దర్శనీయముగాఉన్నచో దానిని 'శృంగార' ముతో ఉపమింతురు. ఉజ్జ్వల వేషయుతుడు 'శృంగారవంతు' డనబడుచున్నాడు. గోత్ర - కుల - ఆచారముల ననుసరించి కాని, పెద్దలమాట ననుసరించి కాని, లోకప్రసిద్ధి ననుసరించి కాని పురుషులకు నామములేర్పడుచున్నట్లే ఆచారము ననుసరించియు, పెద్దలమాట ననుసరించియు రసములు, భావములు మొదలగు నాట్యాశ్రితములగు అర్థములకుకూడ నామధేయము లేర్పడుచున్నవి. హృద్యమును, ఉజ్జ్వలమును అగు వేషము కలదగుటవలన 'శృంగార రసము' అను నామము ఆచారసిద్ధమైనది. ఈ శృంగారరసము నిండు యౌవనములో ఉన్న ఉత్తమ స్త్రీ - పురుష ప్రకృతులకు సంబంధించి ఉండును.

ఇట్టి శృంగారము సంభోగము, విప్రలంభము అను భేదములచే రెండు అవస్థలను కలిగిఉండును.

*సంభోగ శృంగారము :* వసంతాది ఋతువులు, పుష్పహారములు, కామోద్దీపకములైన గంధము మొదలగువాని పూతలు, నగలు, విదూషకుడు మొదలగు ఇష్టజనుల సహవాసము, గీతాదులు, శ్రేష్ఠములైన భవనములు, వానియందలి నివాసము, ఉద్యానవన విహారములు లేదా వానినిగూర్చిన ప్రశంసలు, కామోద్దీపకములైన చిత్రాదులు, ఉత్తమజనుల అనుకరణము, జలక్రీడలు మున్నగు విభావముల[19] వలన సంభోగ శృంగార ముత్పన్నమగును. కనులను, కనుబొమలను చతురతతో త్రిప్పుట, కడకంటి చూపులను ప్రసరింపజేయుట, లలితములైన అంగహారములను ప్రదర్శించుట, మధురములైన వాక్యములను పలుకుట మున్నగు అనుభావములచే ఈ సంభోగ శృంగారమును అభినయించవలెను. ఆలస్యము, ఉగ్రత, జుగుప్స అను మూడును తప్ప తక్కిన వన్నియును ఇందు వ్యభిచారిభావము లగును.

*విప్రలంభ శృంగారము :* ఇంక విప్రలంభ శృంగారమును నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, శ్రమ, చింత, ఔత్సుక్యము, నిద్ర, స్వప్నము, ప్రబోధము, వ్యాధి,

19. విభావమునందు ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము అను భేదములను భరతు డెచ్చటను చెప్పలేదు; సూచింపలేదు. ఇట్టి విభజనము కాల్పనికము, అర్వాచీనమును. [అభినవభారతి-1 వ సం-పుట 304].



ఉన్మాదము, అపస్మారము, జాడ్యము, మోహము మరణము మొదలగు అనుభావములచే[20] అభినయించవలెను.

*విప్రలంభశృంగార - కరుణరసముల భేదము :* *ప్రశ్న :* శృంగారము రతి ప్రభవమైనది కదా? అందు కరుణాశ్రయములగు నిర్వేదాది భావము లెట్లుండును?

సమా : శృంగారమునందు సంభోగము, విప్రలంభము అను రెండు భేదములు కలవని పూర్వమే చెప్పితినికదా? అందు విప్రలంభ శృంగారము అభిలాషాది దశావస్థలను కలిగియుండునని వైశికశాస్త్రకారులు చెప్పియున్నారు. వానిని సామాన్యాభినయమందు వివరింతును[21]. శాపమువలని క్లేశము, ఇష్ట జన నాశము, వధ బంధనము అనువానివలన సముత్పన్నమై, అపేక్షా (ఆశా) రహితముగానుండునది కరుణము. ఇంక విప్రలంభము ఔత్సుక్య - చింతలవలన ఉత్పన్నమై అపేక్షతో (ఆశతో) కూడిఉండును. కరుణ - విప్రలంభ శృంగారములకు నిరపేక్షత్వ - సాపేక్షత్వములే భేదకములగును కాని నిర్వేదాది భావాభినయమున భేదము ఉండదు. కావున శృంగారమునందు నిర్వేదాది సర్వభావములును సంభవించును. అందుచే కరుణమును, విప్రలంభ శృంగారమును భిన్నములని తెలియవలెను.[22] ఈ విషయ

20. "ఆలస్యము...ఇందు వ్యభిచారిభావము లగును" అనునప్పుడు 'ఇందు' అను పదమునకు "సంభోగ-విప్రలంభ శృంగారములు రెండింటియందును" అని అభినవగుప్తు డర్థము వ్రాసెను.

విప్రలంభ శృంగారమందు చెప్పిన వన్నియును వ్యభిచారిభావము లైనను అనుభావములని చెప్పబడినవి. ఇవి స్వానుభావములచే అనుభావితము లగుచుండును కాన వీనిని అనుభావములుగానే పేర్కొనుట జరిగినది. అంతియే కాక కొన్నిచోట్ల సాత్త్వికవ్యభిచారి భావములు కలిపి చెప్పబడుచుండుటయు కలదు.

21. అభిలాషాది దశావస్థలను సామాన్యాభినయమందు (22 వ అధ్యాయము) వివరింపబడును.

వైశికశాస్త్రము—వేశము=వేశ్యావర్గము. వారితోడి సంభోగమును గూర్చి చెప్పెడిది వైశికశాస్త్ర మగును. అనగా కామసూత్రమని అర్థము [అభినవభారతి-1 వ సం-పుట 309].

22. కరుణ-విప్రలంభావస్థలను రెండింటిని కలిపి విశ్వనాథాది అర్వాచీనాలంకారికులు "కరుణ విప్రలంభ" మనెడి శృంగారభేదము నింకొకదానిని నిర్వచించినారు. తాత్కాలికముగా నిరాశ స్పష్టమగుచున్నను ముందుముందు ఆశకు తప్పక అవకాశ మున్నచో అది 'కరుణ విప్రలంభ' మనబడును. "ఇరువురిలో ఒకరు మరణింపగా చనిపోయినవారు తిరిగి బ్రతుకువరకును గల విరహము" కరుణ విప్రలంభ మగునని సింగభూపాలుడు పేర్కొనెను. వివరములకు శ్రీ బులుసువారి 'రసార్ణవసుధాక'రానువాదమును [పుటలు 587-

మును వివరించు శ్లోకములు కలవు. [ఇంతవరకును ఈ శృంగారప్రకరణము మూలమందు గద్యములో ఉన్నది.]

సుఖప్రాయములగు ఇష్టములతో కూడినవాడును, ఋతు - మాల్యాదులను అనుభవించువాడును, ప్రమదాయుక్తుడును అగు పురుషుడు 'శృంగార' పదవాచ్యుడగును (అనగా పై విశేషములతో కూడిన పురుషుడు శృంగార విభావమని తెలియవలెను).

ఈ సూత్రమును వివరించెడి రెండు ఆర్యావృత్తములు కలవు—

ఋతు - మాల్య - అలంకారములు, విదూషకాది ప్రియజనులు, గీతాది హృద్యవిషయములు, కావ్యశ్రవణ - పఠనములు, ఉద్యానవనగమన - విహారములు అనునవి శృంగారసముద్భవమునకు హేతువులు. నయన - షదనప్రసన్నతలు, స్మితము, మధురవాక్కులు, ధృతి, ప్రమోదము, మధురములైన అంగహారములు అనువానిచే శృంగార రసమును అభినయించవలెను.*

హాస్య ప్రకరణము

2. *హాస్యము :* హాస్యము 'హాస' మనెడి స్థాయిభావమునుండి జనించును. వికృతములైన పరవేష - అలంకారములు, ధార్ష్ట్యము (నిర్లజ్జత), లౌల్యము (విషయములందు అనియతత్వము), కుహకము (చక్కిలిగింతలుపెట్టుట), అసత్ప్రలాపము, అంగవికలులను చూచుట, అనిమిత్త భయాదులను, అకార్యకరణములను వికృతవేషాదులను వర్ణించిచెప్పుట మున్నగు విభావముల వలన హాస్యరసముత్పన్నమగును. పెదవులను ముక్కులను చెక్కిళ్ళను స్పందింపజేయుట, కనులను కొలదిగా మూయుట, విప్పారజేయుట, స్వేదము, ముఖరాగము, రెండు చేతులతో తన ప్రక్కలను పట్టుకొనుట అనెడిభావములచే హాస్యము నభినయించవలెను. అవహిత్థము, తంద్ర (మోహము), నిద్ర, స్వప్నము, ప్రబోధము, అసూయ మొదలగునవి హాస్యము నందు వ్యభిచారిభావము లగును.

*ఆత్మస్థ - పరస్థ భేదములు:* ఆత్మస్థము, పరస్థము అను భేదములచే హాస్యము రెండు విధములు—1. తానే నవ్వినచో అది ఆత్మస్థ మగును. 2. ఇతరులను

593]; శ్రీ సన్నిధానంవారి కావ్యాలంకారసంగ్రహ వ్యాఖ్యను [పుటలు 411-413] చూడవలెను.

*[కాశీముద్రణమునందు - 39-48 శ్లో; బొంబాయిముద్రణమునందు - 38-49 శ్లో; బరోడా ముద్రణమునందు-39-48 శ్లో.]



నవ్వించుట పరస్థ మగును.[23] ఈ విషయములను వివరించెడి ఆనువంశ్యములైన ఆర్యావృత్తములు రెండు కలవు. [మూలమందు పై రెండు పేరాలును గద్యమునందున్నవి.]

విపరీతములైన అలంకారములు, వికృతములైన ఆచారములు నామములు వేషములు, వికృతములైన అంగవికారములు అను వీనిచే జనులు నవ్వుదురు. కాన ఇది హాస్యమనబడినది. స్త్రీ - నీచ ప్రకృతులయందీ రసమధిముగా కన్పట్టును.

*ఆరు విధములగు హాసభేదములు :* ఈ రసము నందు ఆరు భేదము లున్నవి—

స్మిత మథ హసితం విహసిత ముపహసితం చాపహసిత మతిహసితమ్ ।
ద్వౌ ద్వౌ భేదౌ స్యాతా ముత్తమమధ్యాధమ ప్రకృతౌ ॥ 52

1. స్మితము, 2. హసితము, 3. విహసితము. 4. ఉపహసితము 5. అపహసితము, 6. అతిహసితము—వీనిలో మొదటి రెండు భేదములును ఉత్తమ ప్రకృతులయం దభివ్యక్తము లగును. ఇంక మధ్యవి రెండును మధ్యమ ప్రకృతులయందును, చివరివి రెండును నీచప్రకృతులయందును అభివ్యక్తము లగును. వీని స్వరూపములు క్రిందివిధముగానుండునని తెలియవలెను[24]—

ఉత్తమ ప్రకృతులయం దభివ్యక్తము లగునవి—

ఈషద్వికసితైర్గండైః కటాక్షైః సౌష్ఠవాన్వితైః ।
అలక్షితద్విజం ధీర ముత్తమానాం స్మితం భవేత్ ॥ 54

ఉత్ఫుల్లాననేత్రం తు గండైర్వికసితై రథ ।
కించిల్లక్షితదంతం చ హసితం తద్విధీయతే ॥ 55

*స్మితము* (Gentle Smile) : చెక్కిళ్ళు కొంచెము వికసించవలెను. కడకంటి చూపులు సౌష్ఠవయుతములు కావలెను. పలువరుస కనబడకుండ గంభీరముగ నవ్వవలెను. ఇట్టిది 'స్మిత' మనబడును.

23. విదూషకుడు ఆత్మస్థనులైన వికృత వేషాది విభావములను చూచి తానే స్వయముగా నవ్వుకొనుట ఆత్మస్థ మగుననియు, వానిచే ఆతడు రాణిని నవ్వించినప్పుడు అది ఆమెకు పరస్థ మగుననియు కొందరు చెప్పుదురు. అది సరికాదు.

ఒకడు నవ్వుచున్నప్పుడు. హాస్యకారణమును మనము చూడకపోయినను. వానిని చూచి మనమును నవ్వుదుము. కారణమును ప్రత్యక్షముగా చూచినను గాంభీర్యముచే ఒక్కొక్కప్పుడు మనము నవ్వును అణచిపెట్టుకొందుము ; అయినను నవ్వుచున్న ప్రక్కవారిని చూచి మనమును హసన్ముఖులమే అగుచుందుము. కావున హాసము సంక్రమణ స్వభావము కలదని తెలియవలెను. ఇట్టిది పరస్థమగును. ఇంక తాను ప్రత్యక్షముగా హాస్యకారణమును గుర్తించి నవ్వుట ఆత్మస్థ మగును [అభినవభారతి-1 వ సం-పుటలు 313-314].

24. ఇందలి ఆంగ్ల పదములుG. C. O. Haas దశరూపకాంగ్లానువాదములోనివి—

బౌద్ధులు ఎనిమిది రకముల హాసములను చెప్పిరట.

*హసితము* (Smile) : చెక్కిళ్ళు వికసించవలెను. కనులును, ముఖమును బాగుగా విప్పారవలెను. పలువరుస కొంచెము కనబడునట్లు నవ్వవలెను. ఇట్టిది 'హసిత' మనబడును.

మధ్యమప్రకృతులయం దభివ్యక్తములగునవి—

ఆకుంచితాక్షిగండం యత్సస్వనం మధురం తథా ।
కాలాగతం సాస్యరాగం తద్వై విహసితం భవేత్ ॥ 56

ఉత్ఫుల్లనాసికం యత్తు జిహ్మదృష్టినిరీక్షితమ్ ।
నికుంచితాంగకశిరస్త చ్చోపహసితం భవేత్ ॥ 57

*విహసితము* (Laughter) : కనులును చెక్కిళ్ళును కొంచెము ముడువబడవలెను. ఉచితసమయమందే నవ్వురావలెను. ముఖము కొంచెముగా ఎరుపెక్కవలెను. నవ్వు మధురమును, సస్వనమును కావలెను. ఇట్టిది 'విహసిత' మనబడును.

*ఉపహసితము* (Laughter with ridicule) : ముక్కుపుటములు విప్పారవలెను. చూపులు వక్రముగానుండవలెను. అంసములను, శిరమును ముడుచుకొనవలెను. ఇట్టిది 'ఉపహసిత' మనబడును.

నీచప్రకృతులయం దభివ్యక్తము లగునవి—

అస్థానహసితం యత్తు సాశ్రునేత్రం తథైవ చ ।
ఉత్కంపితాంసకశిర స్తచ్చాపహసితం భవేత్ ॥ 58

సంరబ్ధసాశ్రునేత్రం చ వికృష్టస్వర ముద్ధతమ్ ।
కరోపగూఢపార్శ్వం చ తచ్చాతిహసితం భవేత్ ॥ 59

*అపహసితము* (Uproarious laughter) : అస్థానమందు (శోకాదిసమయము లందును) నవ్వు వచ్చును. కనులనుండి అశ్రువులు కారును. అంసక-శిరములు పైకెగురుచుండును. ఇట్టిది 'అపహసిత' మనబడును.

*అతిహసితము* (Convulsive laughter) : కనులు తొట్రుపాటుతో కూడినవై అశ్రుసహితములు కావలెను. స్వరము శ్రుతికటువుగా ఉద్ధతముగా ఉండవలెను. నవ్వునప్పుడు చేతులతో తన ప్రక్కలను పట్టుకొనవలెను. ఇట్టిది 'అతిహసిత' మనబడును.

పైన పేర్కొనిన విధముగా ఈ ఆరు భేదములును నాటకమున ఆయా కార్యములవలన జనించిన ఆయా హాస్యస్థానములలో ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులయం దభివ్యక్తము లగుచుండవలెను. ఆత్మసముత్థ - పరసముత్థ భేదములచే రెండువిధములైన ఈ హాస్యము ప్రకృతిత్రయగతమై, అవస్థాత్రయమును కలిగి ఉండును.



కరుణరస ప్రకరణము

3. *కరుణము* : ఇది 'శోక' మనెడి స్థాయి భావమునుండి జనించును. శాపమువలని క్లేశము, ఇష్టజననాశము వలని వియోగము, విభవనాశము, వధ, బంధనము, దేశబహిష్కారము, అగ్ని మొదలగువానివలని మరణము, ఆపదలు కలుగుట మొదలగువిభావములవలన కరుణరసముత్పన్నమగును. కన్నీళ్ళు కార్చుట, పరిదేవనము చేయుట ( తన్నుగాని, దైవమునుగాని, ఇతరులను గాని ఉపాలంభించుట), నోరెండిపోవుట, శరీరముయొక్క రంగుమారుట, అంగములు వ్రేలాడుట, ఉచ్ఛ్వాసనిశ్శ్వాసము లధికమగుట, మరపు (దీనిచే స్తంభ - ప్రలయములు సూచితములు) మొదలగు అనుభావములచే కరుణరసము నభినయించవలెను. నిర్వేదము, గ్లాని, చింత, ఔత్సుక్యము, ఆవేగము, భ్రమ, మోహము, శ్రమము, భయము, విషాదము, దైన్యము, వ్యాధి, జడత, ఉన్మాదము, అపస్మారము, త్రాసము, ఆలస్యము, మరణము, స్తంభము, వేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, స్వరభేదము మొదలగునవి ఇందు వ్యభిచారి భావములు. ఈ విషయములను వివరించెడి రెండు ఆర్యలు కలవు. [ ఇంతవరకును గద్యము ].

ఇష్టజనులవధను చూచుటవలనకాని, అనిష్టములైన వాక్యములను వినుటవలనకాని, ఇట్టివియే అగు ఇతర భావవిశేషములవలనకాని. కరుణ రసము సంభవించును. గట్టిగా ఏడ్చుట, మూర్ఛాదుల నొందుట, పరిదేవనముచేయుట, విలపించుట, ఆయాసపడుట, గుండెలు బాదుకొనుట అనెడి అనుభావములచే కరుణ రసమును అభినయించవలెను.

రౌద్రరస ప్రకరణము

4. *రౌద్రము* : ఇది క్రోధమనెడి స్థాయిభావమునుండి జనించును. ఇది రాక్షసుల, దానవుల, ఉద్ధతమనుష్యుల ప్రకృతులకు సంబంధించియుండును ; సంగ్రామమువలన జనించును. క్రోధము, ఆధర్షణము (ఇతరులభార్యలను చెరచుట), అధిక్షేపము ( దేవ - జాతి - అభిజన - విద్యా - కర్మలను నిందించుట), అవమానము, అసత్యవచనము, ఉపఘాతము (పనివారలను బాధించుట), వాక్పారుష్యము (కొట్టుదును, చంపుదును అని భయపెట్టుట), అభిద్రోహము (చంపదలంచుట), అసూయ మొదలగు విభావములచే రౌద్రరసముత్పన్నమగును. కొట్టుట, విరచుట, మర్దించుట, నరకుట, ఆయుధమును గ్రహించుట, శస్త్రములను ప్రయోగించుట, రక్తమును స్రవింపజేయుట మొదలగునవి ఇందలి అనుభావములు. మరియు ఎఱ్ఱని కనులు, చెమట, బొమముడి వేయుట, పండ్లు కొరుకుట, ఔడుకరచుట, చెక్కిళ్ళు

అదరుట, అరచేతుల నొండింటితో రాయుట మొదలగు అనుభావములచే రౌద్ర రసమును అభినయించవలెను. సంమోహము, ఉత్సాహము, ఆవేగము, అమర్షము, చపలత, ఉగ్రత, గర్వము, స్వేదము, వేపథువు, రోమాంచము, స్వరభేదము మొదలగునవి ఇందు వ్యభిచారి భావములు.

రౌద్రరసమునందు అధికారులు : ప్రశ్న : రౌద్రము రక్షో - దానవాదులకు సంబంధించినదని చెప్పబడినది కదా ? అది ఇంక ఇతరులకు సంబంధించియుండదా?

సమా : అది ఇతరులకును సంబంధించియుండును ; కాని అధికారులు మాత్రమే ఇచ్చట గ్రహింపబడినారు. రాక్షసాదులు సహజముగనే రౌద్రమూర్తులు.

ప్రశ్న : ఎందువలన ?

సమా : రాక్షసాదులు అనేక బాహువులు, అనేక ముఖములు, చింపిరిగా నున్న పింగలశిరోజములు, ఎఱ్ఱని మిడిగ్రుడ్లు, భయంకరములైన నల్లని రూపములు కలిగి ఉందురు. కావున వారి వాచిక-ఆంగిక చేష్టలన్నియును సహజముగానే రౌద్రభూయిష్ఠములు. వారు శృంగారమునుకూడ ప్రాయికముగా క్రూరాకారముగనే సేవింతురు. రాక్షసాదులను అనుకరించెడి పురుషుల యందును సంగ్రామ - సంప్రహారకృతమైన రౌద్రరస ముత్పన్నమగును. ఈ విషయములను వివరించెడి అనువంశ్యములైన ఆర్యలు కలవు. [ఇంతవరకును గద్యము ]

యుద్ధమందలి కొట్టుకొనుట, నరుకుట, వికృతముగా ఛేదించుట, చీల్చుట, యుద్ధమునందలి తొట్రుపాటు అను వానివలన రౌద్రరసము పుట్టుచున్నది. వివిధములైన శస్త్రములను ప్రయోగించుట, శిరమును మొండెమును భుజములను తెగగోయుట మొదలగువానిచే దీని నభినయించవలెను. ఇట్లు రౌద్రములైన వాక్కులు అంగములు చేష్టలు కలిగినదై, శస్త్రప్రహారములతో కూడినదై, ఉగ్రకర్మలతో నిండినదై, రౌద్రరసము ఒప్పుచుండును.*

వీరరస ప్రకరణము

5. వీరము : ఉత్సాహము ఉత్తముల స్వభావము. ఉత్సాహాత్మకము కాన వీరము కూడ ఉత్తమప్రకృతికము. అసంమోహము (కలతచెందకుండుట), అధ్యవసాయము (పట్టుదల), నయము (సంధి - విగ్రహాదుల ప్రయోగము), వినయము (ఇంద్రియజయము), బలము (చతురంగబలము కలిగియుండుట), పరాక్రమము (శత్రుమండలాదుల నాక్రమించుట), శక్తి (యుద్ధాదులందలి సామర్థ్యము), ప్రతాపము (శత్రువులకు సంతాపమును కలిగించు ప్రసిద్ధి), ప్రభావము (అభిజన - ధన - మంత్రిసంపద) మొదలగు విభావములవలన వీరరస ముత్పన్నమగును. స్థైర్యము, ధైర్యము, శౌర్యము, త్యాగము (దానాదులొసంగుట), వైశారద్యము (సామాదులను నేర్పుతో ఉపయోగించుట) మొదలగు అనుభావములచే దీని నభినయించవలెను. ఇందు ధృతి, మతి, గర్వము, ఉగ్రత, అమర్షము, స్మృతి, రోమాంచము, ప్రతిబోధము మొదలగునవి సంచారిభావములు. ఈ విషయములను వివరించు రెండు ఆర్యలు కలవు [ ఇంతవరకును గద్యము. ]

*[ కాశీ ముద్రణమునందు 49-66 శ్లో; బొంబాయి ముద్రణమునందు 50-67 శ్లో; బరోడా ముద్రణమునందు 49.66 శ్లో. ]



ఉత్సాహము, అధ్యవసాయము, అవిషాదము, అవిస్మయము, అసంమోహము అనువానిపలనను, ఇట్టివే అగు ఇతర అర్థవిశేషములవలనను వీరరసము పుట్టుచున్నది. స్థైర్యము, ధైర్యము, వీర్యము, గర్వము, ఉత్సాహము, పరాక్రమము, ప్రభావము, ఆక్షేపపూర్వకములైన వాక్యములు అనెడి అనుభావములచే వీరరసమును అభినయించవలెను.

భయానకరస ప్రకరణము

6. భయానకము : ఇది భయమనెడి స్థాయిభావమువలన జనించును. వికృతరవము వినుట, పిశాచదర్శనము, నక్కల గ్రుడ్లగూబల అరపులు, ఇతరుల త్రాసమును ఉద్వేగమును చూచుట, శూన్యగృహమునకు కాని అరణ్యమునకు కాని వెళ్ళుట, స్వజన వధా-స్వజన బంధనములను చూచుట వినుట, వధాదులకు సంబంధించిన కథలు చెప్పుట మొదలగు విభావములవలన భయానకరస ముత్పన్నమగును. కంపించుచున్న కర-చరణములు, చలించుచున్న కనులు, పులకలు, ముఖవైవర్ణ్యము, స్వరభేదము మొదలగు అనుభావములచే భయానకరసము నభినయించవలెను. స్తంభము, స్వేదము, గద్గదము, రోమాంచము, వేపథువు, స్వరభేదము, వైవర్ణ్యము, శంక, మోహము, దైన్యము, ఆవేగము, చపలత, జడత, త్రాసము, అపస్మారము, మరణము మొదలగునవి ఈ రసమునందు వ్యభిచారి భావములు. ఈ విషయములను వివరించెడి ఆర్యలు కలవు. [ఇంతవరకును గద్యము]

వికృతరవము, సత్త్వదర్శనము, సంగ్రామ-అరణ్య-శూన్యగృహ గమనములు, గురు - నృపులయెడ కావించిన అపరాధము అను వానివలన భయానకరసముత్పన్నమగును.

స్వభావజమైన భయము : గాత్ర-ముఖ-దృష్టులయందలి వైపరీత్యము, ఊరువులు స్తంభించుట, శూన్యముగాచూచుట, చలించిపోవుట, అంగములు జారుట, నోరెండిపోవుట, హృదయము కంపించుట, పులకలు మొదలగు అనుభావములచే భయమును అభినయించవలెను. ఇది స్వభావజమైన భయము.

కృతక భయము : ఇంక కృతక భయమును సత్త్వసముత్థముగా[25] అభినయించవలెను. ఇందు చేష్టలు మృదువుగా ఉండవలెను. పై అనుభావములచేత నే ఇదియును అభినయింపబడవలెను.

కర-చరణ కంపన-స్తంభనములు, గాత్రప్రకంపము, హృదయకంపనము, ఎండిపోయిన పెదవులు తాలువులు కంఠము అనువానిచే రెండు రకముల (కృతక-సహజ) భయానకరసమును అభినయించవలెను.

బీభత్స ప్రకరణము

7. *బీభత్సము* : ఇది జుగుప్స అనెడి స్థాయిభావమునుండి జనించును. అహృద్యములు, అప్రశస్తములు, అప్రియములు, అచోక్షములు (సహజముగ శుద్ధ పదార్థములైనను, మలాదులచే దూషితములు), అనిష్టములును అయిన వస్తువులను చెప్పుట, చూచుట, వినుట మొదలగు విభావములవలన బీభత్సరస ముదయించును. శరీరమును పిండీకృతముచేయుట, ముఖసంకోచనము, ఉల్లేఖనము(వాంతిచేయుట), ఉమ్మివేయుట, గాత్రమును ఎగురవేయుట మొదలగు అనుభావములచే దీనిని అభినయించవలెను. ఇందు అపస్మారము, ఉద్వేగము, ఆవేగము, మోహము, వ్యాధి, మరణము మొదలగునవి సంచారి భావములు. ఈ విషయములను వివరించెడి అనువంశ్యములైన ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

అభిమతము కానివానిని దర్శించుటచేతను, దుష్టములైన గంధ-రస-స్పర్శ శబ్దములచేతను, వివిధములైన ఉద్వేజనములచేతను, బీభత్సరస ముత్పన్న మగును. ముఖ-నేత్రములను సంకోచింపజేయుట, ముక్కుమూసికొనుట, ముఖమునువంచుట, ఎత్తెత్తి నేలకు అంటీఅంటకుండ అడుగులు వేయుట అనెడి అనుభావములచే బీభత్స రసము నభినయించవలెను.

అద్భుతరస ప్రకరణము

8. అద్భుతము : ఇది విస్మయ మనెడి స్థాయిభావమునుండి జనించును. దివ్యజనదర్శనము, ఈప్సితమనోరథము సిద్ధించుట, ఉద్యానవనములకు దేవాలయ

25. సత్త్వ మనగా మనస్సమాధానము. ఇది 7 వ అధ్యాయమందు విపులముగా వివరింపబడును. నటశిక్షణఅంతయును సత్త్వసంపాదనార్థమే.

సహజ భయము రజ-స్తమః ప్రకృతులైన నీచులయందుండును. సత్త్వ ప్రధానులైన ఉత్తమ ప్రకృతులయందు సత్త్వసముత్థమైన అనగా ప్రయత్నకృతమైన అనగా కృతక భయముమాత్రమే ఉండును. గురువులను సందర్శించునప్పుడు రాజాదులు సత్త్వసముత్థ ముగా భయమును ప్రదర్శించుట ఇట్టిదే. [అభినవభారతి - 1 వ సం - పుటలు 327-328]



ములకు వెళ్లుట, సభా-విమాన-మాయా-ఇంద్రజాలాదులను సందర్శించుట మొదలగువానివలన అద్భుతరస ముత్పన్న మగును. విస్ఫారిన కనులు, రెప్పపాటు లేని చూపు, రోమాంచము, అశ్రుపాతము, స్వేదము, హర్షము, సాధువాదము, అధికదానము, హాహాకారము, బాహువులను వదనములను అంగుళులను వస్త్రము లను ఆడించుట మొదలగు అనుభావములచే అద్భుతరసము నభినయించవలెను. స్తంభము, అశ్రువు, స్వేదము, గద్గదము, రోమాంచము, ఆవేగము, సంభ్రమము, ప్రహర్షము, చపలత, ఉన్మాదము, ధృతి, జడత, ప్రలయము మొదలగునవి ఇందు వ్యభిచారిభావములు. ఈ విషయములను వివరించెడి అనువంశ్యములైన ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

అతిశయార్థయుక్తములైన వాక్యములు, ప్రశస్తకర్మాత్మకమైన శిల్పములు, అత్యుత్కృష్టములైన రూపములును అద్భుతరసమునకు విభావములని తెలియవలెను. స్పర్శము, గ్రహణము, ఉల్లుకసనము (శరీరమును ఆహ్లాదపూర్వకముగా ఊర్ధ్వముగా కంపింపజేయుట), హాహాకారము, సాధువాదము, వేపథువు, గద్గద వచనము, స్వేదము మొదలగు వానిచే అద్భుతరసమును అభినయించవలెను.

రసములయందలి భేదములు

వాగాత్మకము, నైపథ్యాత్మకము, క్రియాత్మకము అనెడి భేదములచే శృంగారము మూడు విధములు.

అంగము, నేపథ్యము, వాక్యము అనెడి భేదములచే హాస్య-రౌద్రములు మూడేసి విధములు. (వాక్యరౌద్రము స్వభావరౌద్ర మనబడును.)

ధర్మనాశముచే జనించునది, అర్థనాశముచే జనించునది, శోకముచే జనించు నది అనెడి భేదములచే కరుణము మూడు విధములు.

దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము అనెడి భేదములచే వీరము త్రివిధము.

కృతకము, అపరాధజము (తాను తప్పుచేయుట, లేదా ఇతరులు తనయెడ తప్పుచేయుట), విత్రాసితకము (స్వభావ భీరువుల భయము ; ఆకు కదలినను వీరు భయపడుదురు) అనెడి భేదములచే భయానకము మూడు విధములు.

క్షోభణము (శుద్ధము), ఉద్వేగి (అశుద్ధము) అనెడి భేదములచే బీభత్సము ద్వివిధము. విష్ఠా (మలాదులు)-క్రిమి (అసహ్యకరములైన పురుగులు మొదలగు నవి) దర్శనములచే జనించునది ఉద్వేగి (ఇది శుద్ధము). రుధిరము, ఆంత్రములు (ప్రేవులు) మొదలగువానిని చూచుటవలన జనించునది క్షోభణము (ఇది అశుద్ధము).

దివ్యము-ఆనందజము అనెడి భేదములచే అద్భుతము రెండు విధములు. దివ్య దర్శన జన్యమైనది దివ్యము. హర్షమువలన జనించునది ఆనందజము.

లక్షణలక్షితములైన అష్టరసములను పైన వివరించియున్నాను. ఇంక భావముల లక్షణములను వివరింతును.*

[శాంతరస ప్రకరణము[26]

9. శాంతము: ఇది శమమనెడి స్థాయిభావమునుండి జనించును; మోక్షము నందు ఆసక్తిని కలిగించును. తత్త్వజ్ఞానము, వైరాగ్యము, ఆశయశుద్ధి మొదలగు విభావములవలన శాంతరసము జనించును. యమ - నియమములు, అధ్యాత్మ - ధ్యాన - ధారణ - ఉపాసనములు, సర్వభూతదయ, వైరాగ్య చిహ్నములను ధరించుట మొదలగు అనుభావములచే శాంతరసమును అభినయించవలెను. ఇందు నిర్వేదము, స్మృతి, ధృతి, సర్వాశ్రమశౌచము, స్తంభము, రోమాంచము మొదలగు నవి వ్యభిచారిభావములు. ఈ విషయములను వివరించెడి ఆర్యలు, శ్లోకములును కలవు [ఇంతవరకును గద్యము.]

మోక్షము, అధ్యాత్మము (ఆత్మవిషయకజ్ఞానము) అనువానివలన శాంతము జనించును. తత్త్వజ్ఞానము హేతువుగా కలదియును, మోక్షోపదేశకమును అగునది శాంతరసమని తెలియవలెను. ఈ రసము బుద్ధీంద్రియ-కర్మేంద్రియ సంయమము, పరమాత్మయందు మనస్సును లగ్నముచేయుట అనువానితో కూడినదై సర్వప్రాణి సుఖహితరూపముగా ఉండునని తెలియవలెను.

> న యత్ర దుఃఖం న సుఖం న ద్వేషో నాపి మత్సరః।
> సమః సర్వేషుభూతేషు స శాంతః ప్రథితో రసః॥
> భావా వికారా రత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః।
> వికారః ప్రకృతేర్జాతః పున స్తత్రైవ లీయతే॥

---

* [కాశీముద్రణమునందు 67-76 శ్లో., బొంబాయిముద్రణమునందు 65-82 శ్లో., బరోడాముద్రణమునందు 67-82 శ్లో.]

26. భరతు డష్టరసవాది అనుట ప్రసిద్ధము. కాని తరువాతివారగు ఉద్భటాదులు శాంతమును 9వ రసముగా అంగీకరించిరి. ఆనందవర్ధన-అభినవగుప్తులు దీనిని సమర్థించి, సిద్ధాంతించియున్నారు. ఈ శాంతరస ప్రకరణము కాశీముద్రణమందు లేదు. డా. ఘోష్ కూడ ఈ భాగమును అనువదించలేదు. ఇంక బొంబాయి, బరోడా ముద్రణములం దీ భాగము అధికపాఠముగా ఈయబడినది. దీనికి అభినవగుప్తుడు విపులమైన వ్యాఖ్యానమును రచించెను. ఆతడు నాట్యశాస్త్రమందలి ప్రథమాధ్యాయమునుండియు దీనిని సమర్థించు చునే యున్నాడు. ధ్వన్యాలోక-లోచనములు రెండింటను శాంతరసస్థాపన విషయమున విపులములగు చర్చలు కలవు.



> స్వం స్వం నిమిత్తమాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే।
> పున ర్నిమిత్తాపాయే చ శాంత ఏవోపలీయతే॥

—ఎందు దుఃఖముకాని, సుఖముకాని, మాత్సర్యముకాని లేదో ఎందు సర్వ భూతములయందును సమత్వమే కలదో అయ్యది శాంతరసము. రత్యాదిభావము లనెడి వికారములకు శాంతము ప్రకృతి (ఉత్పత్తిస్థానము). దానినుండి జనించిన వికారములు మరల అందే లీనమగును. ఆయా నిమిత్తములవలన రత్యాది భావ ములు శాంతమునుండి జనించి, ఆ నిమిత్తములు నశింపగనే తిరిగి శాంతమునందే లీనమగును.[27] ఇట్లు లక్షణాన్వితములైన నవరసములను[28] తెలిసికొనవలయును.]

షష్ఠాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

### 1. సంస్కృతసాహిత్యవిమర్శయందలి దశలు

సంస్కృతసాహిత్యవిమర్శచరిత్రయందు ప్రధానముగా ఐదు దశలు గోచరించు చున్నవి—

1. రూపక-రస చర్చలు ప్రధానమైన కాలము—నాట్యశాస్త్ర రచనాకాల మిదియే. ఇందు కేవలము కావ్యమునకు సంబంధించిన విషయములు అత్యల్పములుగా కలవు. ఈ కాలమును నాట్యశాస్త్రకాల మనవచ్చును.

2. రూపక-రస చర్చలు మృగ్యమై, కేవలము కావ్యచర్చయే ప్రాధాన్యమును వహించిన కాలము—ఈ కాలమున రచింపబడిన విమర్శగ్రంథములుకూడ 'కావ్య' పదయుత నామములతో వ్యవహరింపబడినవి. భామహుని 'కావ్యాలంకారము', దండి 'కావ్యా దర్శము', వామనుని 'కావ్యాలంకారసూత్రవృత్తి', ఉద్భటుని 'కావ్యాలంకారసార

---

27. నిర్వికారస్థితిగల శాంతమందుకూడ ఉపాధివశమున వికారములు (భావములు) జనించుచుండును. ఆ ఉపాధి నశింపగనే అవికూడ నశించును. అందుచే శాంతమునందు కూడ సర్వభావములును సంభావ్యము లగుచున్నవి. అందుచేతనే ఇది రత్యాది భావములకు 'ప్రకృతి' అని చెప్పబడినది.

28. ఉద్భటాదులు 9వ రసమును అంగీకరింపగా, విశ్వనాథుడు 10వ రసమును కూడ ప్రతిపాదించెను. "అథమునీంద్ర సమ్మతో వత్సలోరసః" (సాహిత్య దర్పణము 3వ ప్రకరణము—శ్రీ వేదంవారి అనువాదములో 241వ సూత్రమును చూడవలెను) అనుచు అతడు వత్సలరసమును పదియవ రసముగా భరతసమ్మతమైనదానినిగా ప్రతిపాదించి వర్ణ-దైవతాదులను నిరూపించి యున్నాడు (17వ అధ్యాయమందలి అధస్సూచికను చూడ వలెను). రససంఖ్యను గూర్చిన వాదములకు 2వ విశేషాంశమును చూడవలెను.

సంగ్రహము' మొదలగునవి. ఈ కాలమున ముఖ్యముగా అలంకారముల సంఖ్య అభివృద్ధి నందినది. కావ్యమున కలంకారములు ముఖ్యములుగా తలంపబడినవి. రూపకచర్చయు, రసచర్చయు పూర్తిగా విస్మృతములైనవని చెప్పవచ్చును. ఆ రెండును భిన్న శాస్త్రము నకు సంబంధించినవిగా తలంపబడినవన్నమాట. ఈకాలమును అలంకారశాస్త్ర కాల మన వచ్చును. (అలంకార పదమునకు శబ్దార్థాలంకారములనియే కాక సౌందర్యమనియు అర్థము కలదు.) సాహిత్యవిమర్శకులకు 'ఆలంకారికు' లను పేరు ఈ కాలమందే వచ్చియుండును.

3. రసము కావ్యమునకు కూడ ముఖ్యమని అన్వయించిన కాలము — ఈ కాలము నందు ముఖ్యులు ఆనందవర్ధన-అభినవగుప్తులు. వీరిరువును కావ్య-నాట్యములకు రసము 'ఆత్మ' అని నిరూపించిరి. భరతుడు 'కావ్యమున కితివృత్తము శరీర' మని చెప్పినాడేకాని ఆత్మ విషయమును ఎత్తికొనలేదు. అయినను నాట్యమందు రసమే సర్వముఖ్యమని భర తుడు తలంచినట్లు స్పష్టమగుచున్నది. రసప్రాధాన్యమును వివరించు పట్టికను ఈ గ్రంథాంత మున కూర్చినాను. దానిని పరిశీలించినచో భరతుని దృష్టిలో రసమున కెట్టి ప్రాధాన్యము కలదో, నాట్యరసములని ఏల అనబడినవో తెలియగలదు.

"రీతిరాత్మా కావ్యస్య" అనుచు వామనుడు ప్రప్రథమముగా కావ్యముయొక్క 'ఆత్మ' విషయమును లేవనెత్తినాడు. అప్పటినుండియు కావ్యాత్మ విషయమునుగూర్చి అనేక వాదములు బయలుదేరినవి. వీనినే మతములనియు, సంప్రదాయములనియు అందురు. కావ్యాంగములైన రస-అలంకార-గుణ-రీత్యాదులలో ఒక్కొక్క-దానిమీద ఒక్కొక్క శాస్త్రకర్త అభిమానము చూపించియుండుటచే ఈ మతము లేర్పడినవి. వివరములకు 'సాహిత్యశాస్త్ర సంప్రదాయములు'; 'కావ్యాలంకార పరిచయము' అనెడి నా వ్యాసము లను చూడవలెను. ['కిన్నెర'—జనవరి, 1955; ఫిబ్రవరి, 1955]

4. రూపకచర్చ మరల ప్రాధాన్యమును వహించిన కాలము—తక్కిన కావ్యాంగ ములు పూర్తిగా విడువబడి కేవల రూపక - రసములు మాత్రమే ఈ కాలమందు చర్చింప బడినవి. ధనంజయుని 'దశరూపకము'; సాగరనంది 'నాటకలక్షణ రత్నకోశము', రామ చంద్ర - గుణచంద్రుల 'నాట్యదర్పణము', శింగభూపాలుని 'రసార్ణవసుధాకరము' మొద లగునవి ఈ కాలమునందలి రచనలు. నాట్య-రస విషయకములగు గ్రంథములలో ఈనాటి దగు శారదాతనయుని భావప్రకాశము విషయవైశాల్యమున నాట్యశాస్త్రమంతటి గ్రంథము.

5. కావ్య - నాట్య విషయములు సర్వమును ఒకే గ్రంథమందు వివరింపబడిన కాలము—విద్యానాథుని 'ప్రతాపరుద్రీయము', విశ్వనాథుని 'సాహిత్యదర్పణము' ఈ కాల మున రచింపబడిన గ్రంథములు. 10, 11 శతాబ్దములనాటి భోజుని శృంగారప్రకాశ మును ఇట్టిదే. 'సాహిత్యశాస్త్రము' అనెడి పేరు అన్వర్థమైన దశ ఇదే అని చెప్పవచ్చును.

పై ఐదు దశలందును రసమునకు ప్రాధాన్యము లేనిది ఒక్క రెండవదశమాత్రమే. అందైనను భామహ-వామనాదులు దానిని పూర్తిగా విస్మరించలేదు; రసమును అలంకారము గానో, గుణముగానో నిర్వచించుటకు ప్రయత్నించియున్నారు. ఇంక తక్కిన దశలలో సర్వాలంకారికులును రసమునకు పట్టాభిషేకమును కట్టిరి. ఈ రసము కావ్య - నాట్యము



లందు వాచ్యము కారాదనియు, వ్యంగ్యముగా ఉండవలెననియు ఆనందవర్ధన - అభినవ గుప్తుల సిద్ధాంతము. దీనికి 'రసధ్వని' అని పేరు. "కావ్యాత్మ రసధ్వని" అను సిద్ధాంతము నేటికిని తిరుగులేనిదై నిలిచిఉన్నది.

2. రససంఖ్య

నాట్యశాస్త్రమందు భరతుడు ఎనిమిది రసములను మాత్రమే ప్రతిపాదించెను. భరతు డెనిమిది రసములను మాత్రమే ప్రతిపాదించినట్లు కాళిదాసు కూడ పేర్కొనియుండెను.

"మునినా భరతేన యః ప్రయోగో భవతి ష్వష్టరసాశ్రయో నిబద్ధః"

[విక్రమోర్వశీయము—2 వ అంకము, 17 వ శ్లో.]

రసములు తొమ్మిదని ప్రప్రథమముగా చెప్పినవాడు ఉద్భటుడు. ఆతడు భిన్నముగా చదివిన శ్లోకపాదమును ఉదాహరించియే ఉన్నాను.

రుద్రటుడు తన కావ్యాలంకారమందు 'ప్రేయస్సు' ను పదియవరసముగా పేర్కొ నెను. ఈ ప్రేమ కామసంబంధమైనది కాదు. ఇటువంటిదేయగు "వాత్సల్యము"ను పదియవ రసముగా విశ్వనాథుడు పేర్కొని యుండెను.

భట్టలోల్లటాదులు 49 భావములును రసములు కాగలవని సూచించినారు. రుద్రటుడు సంచారిభావములుకూడ రసములు కాగలవని స్పష్టముగా పేర్కొనుటయేకాక రసము లనంతములనికూడ సూచించినాడు.

రసనా ద్రసత్వ మేషాం మధురాదీనా మివోక్త మాచార్యైః।
నిర్వేదాదిష్వపి తన్నికామ మస్తీతి తేఽపి రసాః॥

(రుద్రటుని కావ్యాలంకారము)

మరికొందరు భక్తిరసము, మాయారసము మొదలగు నూత్నరసములను ప్రతి పాదించియున్నారు. ఇంచుమించుగా ఈ మతముల నన్నింటిని ఖండించి రసములు తొమ్మిది మాత్రమే అని అభినవగుప్తుడు సిద్ధాంతించెను. ఈ సిద్ధాంతము అధికజన సమ్మతమైనది. ఇంకను వివరములకు డా. రాఘవన్‌గారి "The Number of Rasas" [Adyar Library Publication - 1940] అను గ్రంథమును, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్యానమును [పుటలు 304-320] చూడవలెను.

2. రససమీకరణవాదములు

ఇట్లు రసము లనంతమనువారు ఉండగా, రసము ఒక్కటియే అని మరి కొందరు ప్రతిపాదించియున్నారు. అన్ని రసములవలనను కలుగు ఆనందమొక్కటియే అగుటచే ఈవాదము సమర్థనీయముగనే కన్పట్టును. పరమార్థమున శాంతము ఒక్కటియే రసము అనియు, రతి మొదలగు ఆయా ఉపాధి భేదములచే శృంగారాదిరూపమున అది అనేక విధ ములుగా కన్పట్టుచున్నదనియు శాంతరసప్రకరణమందు చెప్పబడినది. కావునసర్వరసములకు శాంతమే మూలమని ఈవాదముయొక్క సారము. అట్లే కరుణ మొక్కటియే ప్రకృతి రసమని భవభూతి ఉత్తరరామచరితలో ప్రతిపాదించినాడు—

ఏకోరసః కరుణ ఏవ నిమిత్తభేదా ద్భిన్నః పృథ క్పృథగివాశ్రయతే వివర్తాన్ ।
ఆవర్తబుద్బుదతరంగమయాన్వికారా నంభో యథా సలిల మేవ హి తత్సమస్తమ్ ॥
(ఉత్తరరామ చరిత - తృతీయాంకాంతమున)

శృంగార మొక్కటియే ప్రకృతిరసమని భోజుడు ప్రతిపాదించెను. మరికొందరు అద్భుతమును ప్రకృతిరసముగా ప్రతిపాదించిరి. ఈ వాదములు 'రససమీకరణ' వాదము లనబడును.

### 3. రసరాజత్వము

ఈ రసములలో ఏది రసరాజమని కొందరు చర్చించిరి. పై విధముగనే మరల అనేక వాదములు బయలుదేరినవి. శృంగారము రసరాజమని అధికు లంగీకరింతురు. శృంగార-వీర ములు నాటకమందు 'అంగి' రసములుగా అంగీకృతము లైనవి. లోకమందు శృంగారము సర్వప్రాణి సాధారణము. దీనివలన సంసార మేర్పడును. తద్రక్షణమున వీరమావశ్యకము. ఆ సంసారము విచ్ఛిన్నమైనచో కలుగునది దుఃఖము. ఇట్లు సృష్టి, స్థితి, లయము లనెడి మూడు జీవితావస్థలకును మూడు కావ్యరసములు పొందుపడియున్నవి. అందుచే శృంగార-వీర-కరుణములు మూడును పై విధముగా ప్రధానములని కొందరందురు.

ఇవి అన్నియును వారి వారి అభిమానములకు సంబంధించిన వాదములు. రసముల కొక క్రమమును అభినవగుప్తుడీ క్రింది విధముగా పేర్కొనెను—

కామము సకలజాతి సులభము. అది అందరకును హృద్యమైనది. అందుచే శృంగారము మొదట చెప్పబడినది. నిరపేక్షా భావముకల హాస్యము శృంగారానుగామి; అందుచే అది రెండవది. శృంగారముయొక్క విపర్యయమే కరుణము; అందుచే అది మూడవది. పిమ్మట కరుణ నిమిత్తమైన రౌద్రము చెప్పబడినది; ఇది అమర్ష ప్రధానము. తరువాత కామ-అర్థములు ధర్మమూలము లగుటవలన ధర్మప్రధానమైన వీరము చెప్పబడినది. ఈ వీరము భీతాభయప్రదానసార మగుటచే తదనంతరము భయానకముచెప్పబడినది. భయానక-బీభత్సముల విభావము లించుమించు సమానము లగుటచే బీభత్సమువీరముచేతనే ఆక్షిప్త మగుచున్నది. వీరముయొక్క అంతమునందు తత్ఫలమేఅద్భుతము. ఇవి అన్నియును త్రివర్గాత్మకములు. వీని అనంతరము మోక్షఫలమైన శాంతముచెప్పబడినది. ఇట్లు రసములు నవసంఖ్య కలవై ఒప్పుచున్నవి. ఈ రసములలో శృంగారాదులు కోమలరసములు, రౌద్రాదులు ఉద్ధతరసములు. వీనిలో కావ్య-నాట్యములందేదేని ఒకటి 'అంగి' (ప్రధాన) రసముగా ఉండును. తక్కినవానిలో కొన్ని 'అంగ' (అప్రధాన) రసములు అగును. ఈ అంగరసములు అంగిరసమును మ్రింగివేయునట్లుగా కాక తత్పోషకములుగా మాత్రమే వర్ణితములు కావలెను. [అభినవభారతి-1 వ సం-పుట 267]

### 4. రసముల ఉత్పత్తి : శారదాతనయుని కథనము

రసముల ఉత్పత్తిని గూర్చి శారదాతనయు డీ క్రింది విధముగా పేర్కొనెను. ఈతడీ సందర్భమున చెప్పిన కథయందలి ప్రథమ భాగమును ప్రథమాధ్యాయాంత మందలి



6 వ విశేషాంశమునందు వివరించియున్నాను. తక్కిన దిప్పుడు వివరించుచున్నాను. భరతుని వలె శారదాతనయుడును శృంగార - వీర - రౌద్ర - బీభత్సములనే ప్రధాన రసములుగా పేర్కొనెను—

అట్లు భావాభినయ కోవిదులైన భరతులచే ప్రదర్శింపబడుచున్న ప్రయోగములను చూచుచున్న బ్రహ్మయొక్క నాలుగు ముఖములనుండియు నాలుగు వృత్తులతోకూడిన శృంగారాది రసములు క్రిందివిధముగా ఉత్పన్నములైనవి.

భరతులు పార్వతీ - పరమేశ్వరుల సంభోగమును అభినయించినప్పుడు తూర్పు దిక్కుగా నున్న బ్రహ్మయొక్క ముఖమునుండి కైశికీవృత్తితో శృంగారరసము జనించెను.

భరతులు దక్షాధ్వరధ్వంసము నభినయించినప్పుడు పశ్చిమదిక్కుగా నున్న బ్రహ్మయొక్క ముఖమునుండి ఆరభటీవృత్తితో కూడిన రౌద్రము ఉత్పన్నమైనది.

భరతులు త్రిపురమర్దనమును చక్కగా అభినయించినప్పుడు దక్షిణదిక్కుగా నున్న బ్రహ్మయొక్క ముఖమునుండి సాత్త్వతీవృత్తితో వీరము ఉత్పన్నమైనది.

ఆ నటులు శంభునియొక్క కల్పాంతకర్మను అభినయించినప్పుడు ఉత్తరదిక్కుగా ఉన్న బ్రహ్మయొక్క ముఖమునుండి భారతీవృత్తితో బీభత్సము ఉత్పన్నమైనది.

వీనినుండి తక్కిన రసము లీ క్రింది విధముగా ఉత్పన్నములైనవి :

జటాజినధరుడు, భోగిభూషణుడు, అగ్నిలోచనుడు, భస్మాంగరాగుడు అయిన శివుడు పార్వతిచే కామింపబడినప్పుడు ఆమెసఖులవలన హాసము అధికముగా జనించినది. కావుననే శృంగారమునుండి హాస్యము జనించినదనుట.

త్రిపురమర్దన సమయమందు శివుడు ప్రదర్శించిన వీరమువలన సమస్తభూతములందును అద్భుతము జనించినది. కావుననే వీరమునుండి అద్భుతము జనించినదనుట.

దక్షాధ్వరధ్వంససమయమున దేవతలందరును వికలాంగులుగా చేయబడుటను చూచినప్పుడు పార్వతీదేవి సఖులయందు కరుణ ముత్పన్నమైనది. కావుననే రౌద్రమునుండి కరుణ ముత్పన్నమైనదనుట.

దగ్ధావశేషులైన ఆదిదేవతలయొక్క అస్థికలను భస్మమును ధరించి, ఆ శ్మశానమందు నృత్యముచేయుచున్న శివుని గాంచి భూతసంఘములు భయపడెను. కావుననే బీభత్సమునుండి భయానక ముత్పన్నమైనదనుట. [భావప్రకాశము - 3 వ అధికారము - పుటలు 57-58.]

### 5. శాంతరసము

భరతుడు శాంతరసమును పేర్కొనలేదనుట స్పష్టము. దృష్టి-ముఖరాగాదులను, స్వర-లయ-గుణ-అలంకారాదులను ఎనిమిది రసములకు మాత్రమే భరతుడు వివరించెను. మరియు వర్ణ-దైవతములను చెప్పునప్పుడు, ప్రధాన-జన్యరసములను చెప్పునప్పుడును శాంతరస ప్రసక్తియేలేదు. ఆనందవర్ధనుడు శాంతమును రసముగా స్థాపించునప్పుడు తన వాదమున కనుకూలమైన వాక్యములను నాట్యశాస్త్రమునుండి ఉదాహరించలేదు. కావున భరతుడు శాంతమును పరిగ్రహించలేదనుట నిశ్చయము.

కాని, ప్రథమాధ్యాయమున నాట్య స్వరూపమును వివరించునప్పుడు "క్వచిచ్ఛమః" అనియు; "తుష్యంతి... మోక్షేష్వథ విరాగిణః"(27వ అధ్యా.) అనియు చెప్పియుండుటను బట్టి భరతుడు పరోక్షమార్గమున శాంతము నంగీకరించెనని శాంతరసవాదులు సమర్థించినారు. మరియు ఇతిహాస-పురాణ-శబ్దకోశములలో శాంతరసము అంగీకరింపబడియున్నది. మహాభారతము శాంతరస ప్రధానముగా ఎన్నబడుచున్నది. దీనినిబట్టి కావ్యమున శాంతమంగీకారమైనను, నాట్యమున దానికి స్థానములేదని ధనంజయాదులు కొందరందురు. కాని ఆనందవర్ధన-అభినవగుప్తులు ఇట్టి వాదముల నంగీకరించలేదు.

ఇంక శాంతముయొక్క స్థాయిభావమునుగూర్చి వాదములు కలవు. భరతుడు భావముల మొత్తము నలుబది తొమ్మిది అని నిశ్చయించివేసెను. అందుచే ఇంకొక క్రొత్త భావమును సృజించుట కిష్టపడక వ్యభిచారి భావములలో మొట్టమొదటిదగు 'నిర్వేదము' ను దీనికి స్థాయిగా కొందరు గ్రహించిరి. అభినవగుప్తునికి పూర్వులు 'శమ' మును స్థాయిగా గ్రహించిరి. ఈ పాఠమే నాట్యశాస్త్రమం దీయబడినది. శమ-శాంతములు రెండును పర్యాయపదములని కొందరు అభిప్రాయపడిరి. రుద్రటుడు సమ్యగ్‌జ్ఞానమును స్థాయిగా అంగీకరించెను. భోజుడు 'ధృతి' అనెను. కొందరు 'జుగుప్స' స్థాయి అనిరి. ఇంకను అనేకులు అనేక భావములను పేర్కొనిరి. కొందరు రత్యాదిభావము లన్నియును కలిసి శాంతమునకు స్థాయిభావ మగుననిరి. అభినవుడు ఈ వాదములనన్నింటిని చర్చించి 'తత్త్వజ్ఞానము' శాంతమునకు స్థాయి భావమని నిర్ణయించెను.

'ప్రబోధచంద్రోదయము' శాంతము ప్రధానరసముగాగల సంస్కృతరూపకము.

## 6. రసభేదములు

రసములవిషయమున నాట్యశాస్త్రమందు చెప్పబడిన భేదములనే కాక అర్వాచీనాలంకారికులు మరికొన్ని భేదములను పేర్కొనియున్నారు. ముఖ్యముగా విప్రలంభ శృంగారమందు— 1. అభిలాషా విప్రలంభము, 2. ఈర్ష్యా విప్రలంభము, 3. విరహ విప్రలంభము, 4. ప్రవాస విప్రలంభము, 5. కరుణ విప్రలంభము అనెడి పెక్కు భేదములు ఏర్పడినవి. వీరమునందు దయావీరమనెడి నాల్గవభేదము చేరినది.

ఆయా రసములకు విరోధిరసములేవియో, పోషక (అవిరోధ) రసములేవియో అర్వాచీనాలంకారికులు పేర్కొనియున్నారు. వానిని పట్టికరూపములో క్రింద వివరించుచున్నాను. [శ్రీ వేదంవారి సాహిత్య దర్పణానువాదము - 3వ పరిచ్ఛేదము, 242 సూత్రమును, శ్రీ జ. మాధవరామశర్మగారి నవరసగంగాధరము, 132 వ పుటను చూడవలెను]—

| రసము | విరోధిరసములు | పోషకరసములు |
|---|---|---|
| 1. శృంగారము | కరుణ-బీభత్స-రౌద్ర-వీర-భయానకములు | అద్భుత-హాస్య-వీరములు |
| 2. హాస్యము | భయానక-కరుణములు | శృంగారము |
| 3. కరుణము | హాస్య-శృంగారములు | — |
| 4. రౌద్రము | హాస్య-శృంగార-భయానకములు | వీరము |



| రసము | విరోధిరసములు | పోషకరసములు |
|---|---|---|
| 5. వీరము | భయానక-శాంతములు | రౌద్ర-అద్భుత-శృంగారములు |
| 6. భయానకము | శృంగార-వీర-రౌద్ర-హాస్య-శాంతములు | — |
| 7. బీభత్సము | శృంగారము | వీరము |
| 8. అద్భుతము | — | శృంగారము |
| 9. శాంతము | వీర-శృంగార-రౌద్ర-హాస్య-భయానకములు | — |

అనౌచిత్య ప్రవృత్తి వలన రస-భావములు క్రమముగా రసాభాసమును, భావాభాసమును అగునని అర్వాచీనాలంకారికులు నిర్వచించియున్నారు. రసాభాస-భావాభాసములనెడి పదములను భరతు డెచ్చటను వాడలేదు. కాని హాస్యస్వరూప వివరణములో ఈ అభిప్రాయము సూచితమగుచున్నది. బహునాయకరతి, ఏకత్రైవానురాగము, మ్లేచ్ఛగతము, తిర్యగ్గతము అనెడి భేదములచే శృంగారాభాసము చతుర్విధము. ఇట్లే తక్కిన రసములయందును, భావములయందును ఆభాసత్వము కలదు. ఈ ఆభాసముకూడ రసమగునా కాదా అనుదానిని గూర్చి వివాదములు కలవు. ఆయా ఆభాసోదాహరణములకు శ్రీ సన్నిధానంవారి కావ్యాలంకారసంగ్రహవ్యాఖ్యను చూడవలెను. [పుటలు 414-421; 433-446]

## 7. రసనిష్పత్తి : భిన్నమతములు

రసనిష్పత్తినిగూర్చిన భరతసూత్రము పెక్కు వాదోపవాదములకు గురి అయినదని పేర్కొనియున్నాను. వీనిలో నాలుగు వాదములు ప్రధానములైనవి. వీని సారములను క్రింద వివరించుచున్నాను—

నటులు రామాదుల భూమికలను అభినయించునప్పుడు చూచి సామాజికులు హర్షమును పొందుచున్నారు. అయినచో రసనిష్పత్తి రూపకమందు వర్ణింపబడిన రామాదులయందు (అనుకార్యులయందు) జరుగునా? ఆ భూమికలను అభినయించు నటులయందు జరుగునా? లేక చూచుచున్న ప్రేక్షకులయందు జరుగునా? అను ప్రశ్నలే ఈ భిన్నమతములకు కారణములైనవి. అనగా రసము అనుకార్యనిష్ఠమా? లేక నటనిష్ఠమా? లేక సామాజికనిష్ఠమా? అనునది విచారణీయాంశమన్నమాట.

మనకు తెలిసినంతలో భట్టలోల్లటుడు ప్రప్రథమముగా భరత రససూత్రమును వ్యాఖ్యానించెను. వాని వాదమును శ్రీశంకుకుడు ఖండించి తానింకొక విధముగా వ్యాఖ్యానించెను. ఈ శ్రీశంకుకుని వాదమును భట్టనాయకుడు ఖండించెను. ఈ ముగ్గురి గ్రంథములును మనకు లభించలేదు. కాని ఆ మూడు వాదములను అభినవగుప్తుడు అభినవభారతియందు పేర్కొని తన నూత్న సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఈ అభినవగుప్తమతమే నేటికిని ప్రమాణముగా నిలిచియున్నది.

భట్టలోల్లటుడు— రసము అనుకార్యులైన రామాదులయందుండును. సీతాదులు విభావము. రసమీవిభావములచే ఉత్పాదితమై, అనుభావములచే గమ్యమానమై, సంచారులచే

పుష్టినందును. నటుడి విభావ - అనుభావ - వ్యభిచారి భావములను అభినయించునప్పుడు, ఆ నటనా కౌశలముచే రసము వానియందే ఉన్నట్లు గోచరించును; దానిని గాంచి, భావించి సామాజికులు హర్షమును పొందుదురు. అనగా సర్పము కాకున్నను సర్ప మనుభ్రాంతిచే రజ్జువు (త్రాడు) వలన భయము కలుగుచున్నట్లు రామునకు సీతయందు గల అనురాగరూప మయిన రతి నిజముగా నర్తకునియందు లేకున్నను నాట్యనైపుణ్యముచే వానియందున్నట్లు భాసించుచు సహృదయుల హృదయములందు చమత్కారమును కలిగించుచు రసమని చెప్పబడునని తాత్పర్యము. దీనికి 'ఉత్పత్తి' లేదా ఆరోపవాదమని పేరు. భట్టలోల్లటుడు మీమాంసకుడు.

రసము రామాదినిష్ఠ మనినచో తదనుభూతి సామాజికునకు ప్రత్యక్షముగా కలుగుట లేదని అంగీకరించినట్లైనది. ఇది ఇందలి లోపము.

శ్రీశంకుకుడు— రసము నటులయందుండును ; అనగా అనుకర్తృ నిష్ఠము. నటులు రామాదులుగా తలంపబడుచున్నారు. వారు రత్యాదులను ప్రదర్శించుచున్నారు, కావున వారియందు రసము ఉండును. రసములేనిచో రత్యాదులకు ప్రసక్తియే లేదుకదా. కావున వ్యాప్తి మూలమున సామాజికుడు నటునియందు రసమును అనుమానించుచున్నాడు. ఇట్లు నటగత రత్యాది స్థాయిభావములనే సామాజికుడు అనుభవించి ఆనందించుచున్నాడు. అనగా ధూమమువలన అగ్ని అనుమానింపబడినట్లు విభావాదులచే రత్యాదిస్థాయిభావములు అనుమితములై రసశబ్ద వాచ్యములగునని తాత్పర్యము. దీనికి 'అనుమితి' వాదమని పేరు. శ్రీశంకుకుడు నైయాయికుడు.

ఇందును సామాజికునకు ప్రాధాన్యము లేదు. అంతియేకాక అనుమానజ్ఞానము ప్రత్యక్షమువలె చమత్కారజనకము కాదు. ఇది ఇందలి లోపము.

భట్టనాయకుడు—రసము సామాజిక నిష్ఠము. అనగా నిజముగా సామాజికునియందే రసోత్పత్తి జరుగును. సామాజికుడు ప్రదర్శనము కాంచుచు 'సాధారణీకరణము' (Universalisation)అనెడి గుణవిశేషముచే నాయకాభేదమును పొంది సాక్షాన్నాయకరసానుభవమును అనుభవించును. దీనికి 'భుక్తి' వాదమని పేరు. భట్టనాయకుడు సాంఖ్యవాది.

భట్టనాయకుడు భావకత్వ - భోజకత్వములనెడి వ్యాపారములను కల్పించెను. అవి అనవసరములు. మరియు సామాజికులయందు రత్యాదులు బీజరూపముగానైన లేనిచో అతడు సాక్షాన్నాయకానుభవమునుమాత్ర మెట్లు పొందగలడు? ఆ విషయమును చెప్పక పోవుటయే ఇందలి దోషము. ఈ లోపమును అభినవగుప్తుడు తీర్చెను.

అభినవగుప్తుడు— రసము సామాజిక నిష్ఠమే. లోకములో సహృదయుని హృదయమందు రత్యాధిభావములు 'వాసనా' రూపమున ఉండును. రూపకమందలి విభావాదులు ఆరత్యాదులను మేల్కొల్పి అభివ్యక్తము చేయును. పునఃపునరనుసంధానముచే అనగా భావనాబలముచే ఆ విభావాదులు సాధారణములు (Universal) అగును. అట్టి స్థితిలో సామాజికుడు సర్వప్రపంచమును మరచి, అనిర్వచనీయమైన ఆనందమును అనుభవించును. ఇట్టి ఆనందానుభవము భావకులైన సహృదయులకు మాత్రమే కలుగును. ఇతరులయందు



భావనకాని రత్యాది వాసనలుకాని ఉండవు కాన వారికి రసానుభూతి లేదు. దీనికి 'అభివ్యక్తి' వాదమని పేరు. అభినవగుప్తుడు వేదాంతి. [శ్రీ సన్నిధానంవారి కావ్యాలంకారసంగ్రహ వ్యాఖ్య — పుటలు 279-291 చూడవలెను]. "సిద్ధాంతము : అధ్యయనము" అను హిందీ గ్రంథములో పై సిద్ధాంతములను పట్టిక రూపములో శ్రీ గులాబ్‌రాయ్ క్రింది విధముగా నొసంగెను. [పుట 164]

రసనిష్పత్తి

| వ్యాఖ్యాత | దార్శనిక మతము | వాదము | రసనిష్ఠ | 'సంయోగ' పదము యొక్క అర్థము | 'నిష్పత్తి' పదముయొక్క అర్థము |
|---|---|---|---|---|---|
| 1. భట్టలోల్లటుడు | మీమాంసకుడు | ఉత్పత్తి లేదా ఆరోపము | రామాద్యనుకార్య నిష్ఠము | కార్య-కారణ భావము | ఉత్పత్తి |
| 2. శ్రీశంకుకుడు | నైయాయికుడు | అనుమితి | నటనిష్ఠము | గమ్య-గమక లేదా అనుమాప్య-అనుమాపక భావము | అనుమితి |
| 3. భట్టనాయకుడు | సాంఖ్యవాది | భుక్తి | సామాజికనిష్ఠము | భోజ్య-భోజక భావము | భుక్తి (ఆస్వాదము) |
| 4. అభినవగుప్తుడు | వేదాంతి | అభివ్యక్తి | సామాజికనిష్ఠమే | వ్యంగ్య-వ్యంజక భావము | అభివ్యక్తి |

8. స్థాయిభావము రసమెట్లగును ?

విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః।
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయీభావో రసః స్మృతః॥

—"విభావ-అనుభావ-సాత్త్వికవ్యభిచారి భావములచే స్వాద్యత్వమును పొందింపబడిన స్థాయిభావమే రసమనబడును" అని దశరూపకమందు (చతుర్థ ప్రకాశ ప్రారంభమున) ధనంజయుడు నిర్దేశించెను. ఇంచుమించుగా ఆనాటి, తరువాతి ఆలంకారికు లెల్లరును ఇట్లే చెప్పియున్నారు. కాని రసనిష్పత్తి సూత్రములో భరతుడు స్థాయిభావమును చెప్పనేలేదు; ఈ సూత్రమునందు స్థాయిగ్రహణము శల్యకల్ప మయ్యెడిదనియు, అందుచే భరతుడు దానిని గ్రహించ లేదనియు అభినవగుప్తుడు మూడు నాలుగుసార్లు నొక్కి చెప్పెను. [ఉదా: యథాహి దార్ష్టాంతిక సూత్రే స్థాయిగ్రహణం శల్యకల్పమితి-పుట 588; అతఏవ సూత్రే స్థాయి గ్రహణం నకృతమ్. తత్ప్రత్యుత శల్యభూతంస్యాత్ - పుట 284]. మరి ఈ భిన్నాభిప్రాయములను సమన్వయించుటకు ముందుగా రసప్రతీతిని వివరించవలసి ఉన్నది—

లోకమున ప్రేయసీ-ప్రియుల పరస్పరాలోకనములు, ఆదరణము, సంలాపము, చిరునగవులు మొదలగ వానిని చూచినతోడనే వివేకి వా రిరువురి చిత్తవృత్తియు ప్రీతియుక్తము లేదా రతి రూపమని ఊహింపగలడు. ఆ ప్రేయసీ ప్రియులు రతికి కారణము లగుటయు, పరస్పరాలోకనాదులు ఆ రతికి కార్యము లగుటయు ఇట పై ఊహకు అవకాశ మిచ్చుచున్నవి. లోకమున రతికి కారణములగు స్త్రీపురుషులును, రతికి కార్యము

లగు స్మితాదులును, తత్సహచారులగు లజ్జాదులును కావ్య-నాట్యములందు క్రమముగా విభావములును, అనుభావములును, వ్యభిచారి భావములును అగుచున్నవి. లోకమునందలి సీతారాములు ఈనాటివారు కారు. అయినను కావ్య-నాట్యము లందలి వాక్-అంగ-సత్త్వ-ఆహార్యము లనెడి చతుర్విధాభినయములు సామాజిక హృదయమున గల భావనా శక్తిని ఉద్దీపింప జేయును. అంతట సామాజికుడు భావించుటకు మొదలుపెట్టును. ఈ భావాదులను సామాజికుడు పునఃపునరనుసంధానము చేయుటవలన, అనగా చర్వణము చేయుచుండుటవలన నటుల రూపములో ఉన్న సీతారాములు అలౌకికమగు భావనారూపము గొంది ఆసామాజికునకు అలౌకికములగు విభావము లగుదురు. ఇట్లే ఆ యా పాత్రముల కటాక్షాదులును లౌకికరూపమును కోల్పోయి అలౌకికమగు అనుభావరూపమును పొందును. వ్యభిచారి భావముల విషయమునను ఇట్లే గ్రహించవలెను. ఇట్లు విభావ - అనుభావ-వ్యభిచారి భావములయొక్క వస్తువులు భావమాత్రములు కావున అవి అలౌకికము లనుట స్పష్టము. ఇవి కావ్య-నాట్యములందు మాత్రమే ఉండును.

సామాజికుడు ఈ విభావాదులను కావ్య నాట్యములందు గ్రహించునప్పుడు వానిని తటస్థముగా గ్రహింపడు. భావకుడైన ఆ సామాజికునిహృదయ మిదివరకే పైన చెప్పినట్లుగా కార్య-కారణాద్యనుమానము మొదలగువానిచే సంస్కరింపబడియున్నది. అందుచే కావ్య-నాట్యములందలి విభావములవలన వాని హృదయమున రత్యాదు లుదయించును. అభినయము లన్నియును ఆ రత్యాదులకు అనుభావములై వానికి ఉత్తేజనమును కలిగించును. విభావాదుల చర్వణమువలన క్రమముగా సామాజికుడు తన్మయీభావము నొందును. అనగా వాస్తవిక సీతారాముల హృదయములందెట్టి చిత్తవృత్తు లుదయింపనగునో అట్టి చిత్తవృత్తులే (వ్యభిచారి భావములు) సామాజికునియందును పుట్టును. దీనినే 'అనుభవన' మనియు, 'తన్మయీభావ'మనియు అందురు, ఇప్పట్ల ఈ వ్యభిచారి భావములు (చిత్తవృత్తులు) స్థాయిభావమును ఒరపిడిపెట్టును.

ఇట్లు విభావానుభావచర్వణ వ్యభిచారి చర్వణయందు పర్యవసించును; అనగా విభావానుభావములు భావితములు కాగానే వ్యభిచారులు స్ఫురించును. ఆ వ్యభిచారులలోనే దండలో దారమువలె ఉండి స్థాయిభావము కూడ చర్వితమగును. అట్లు చర్వ్యమాణమగు స్థాయియే రసచర్వణ నొదవించును. ఈ రసానందము బ్రహ్మానంద సహోదరము.

ఇది రసప్రతీతి విధానము; ఇది అభినవగుప్త ప్రోక్తమైన అభివ్యక్తి వాదము.

ఇచ్చట ఈ క్రిందివిషయములను స్పష్టము చేయవలసి ఉన్నది - విభావానుభావ వ్యభిచారులు సమ్యక్సంయోగమును పొందుట భావకుడయిన సామాజికుని హృదయమందే. పై వివరణమునుబట్టి విభావానుభావవ్యభిచారిభావములు మూడును రత్యాది స్థాయిభావమును సంపూర్ణముగా సంస్కరించుటవలననే రసము నిష్పన్నమగు చున్నది. కావున రసనిష్పత్తికి పై మూడే కారణము లగును కాని స్థాయికారణము కాజాలదు. అందుచే స్థాయిపదము రససూత్రమందు సంగృహీతము కాలేదు.

చిలుముపట్టిన కంచుపాత్రను తోమినచో అది ప్రకాశించును. కాని, ఆ ప్రకాశ మనునది ఆ కంచుపాత్రయొక్క సహజధర్మము కాదు. వెలుతురువలన దానికి సంక్రమించిన ధర్మమది. కాని పాత్రమే ప్రకాశించుచున్నదని మనమందుము. అట్లే స్వచ్ఛమైన స్ఫటికమున పచ్చనిరంగు చేరినచో అదియును పచ్చగానే ఉండును. ఆ పచ్చదనము దానికి సహజధర్మము కాదు, కాని దానిని 'పచ్చనిస్ఫటిక' మని మనము వ్యవహరింతుము. అట్లే స్థాయిభావము రసము కాదు. కాని రసము స్థాయిభావరూపోపహితమై ఆస్వాదింపబడు చున్నది కాన స్థాయియే రసమని ఔపచారికముగా అందురు. మరియు, మొదట భావకునకు కార్యకారణానుమానములవలన రత్యాది చిత్తవృత్తులే జనించును కావునను, విభావానుభావము లొనర్చు రసాభివ్యంజనమును సంస్కరించునది స్థాయియే అగుటచేతను, వ్యభిచారిచర్వణయం దంతటను స్రక్సూత్ర కల్పముగా స్ఫురించునది స్థాయియే అగుటచేతను రసప్రసంగమునం దంతటను స్థాయిభావము వ్యాపించియుండుట స్పష్టము. అందుచే ఔచిత్యము ననుసరించి స్థాయియే రసమనుచుందురు.

రత్యాది స్థాయిభావములు జడమగు అంతఃకరణధర్మములు. కాని రసమనునది ఆత్మసంవేదన రూపమైనది, అనగా అది చిద్ఘనమగు ఆత్మస్వరూపము. వీనికి పరస్పరైక్యము సంభవింపదు గాన స్థాయి రసమగుననుట పొసగదు. కావుననే భరతుడు సూత్రమునందు స్థాయి పదమును గ్రహించలేదు; గ్రహించి యున్నచో నిజమునకు శల్యకల్ప మయ్యెడిదే.

పై కారణముచేతనే దృష్టాంతమందు కూడ స్థాయికల్పమైన పదము గ్రహింపబడలేదు. అభినవగుప్తుడు రసనిష్పత్తి సూత్రమును దృష్టాంతముతో క్రింది విధముగా సమన్వయించెను—పాకరూపమైన సమ్యగ్యోజనముచే అలౌకికమైన రసము పుట్టుచున్నది. ఇచ్చట రసాభివ్యంజకమైన జలము ప్రధానము కావున ఈ వ్యంజనము విభావస్థానీయము, చింతపండు, పసుపు మొదలగునవి అనుభావ ప్రాయములు, గుడాది ద్రవ్యములు చక్రాది రసవిలక్షణ మధురాది యోగముచే వ్యభిచారి కల్పములు. ఇవి అన్నియును మిశ్రితములైనప్పుడు జనించెడి రసవిశేషము స్థాయికల్పము; ఇది విభావకల్పమైన వ్యంజనజనితమని తెలియవలెను. కావున లౌకికమయిన రసమునందును సంయోగము చెందునవి మూడు మాత్రమే; తత్కల్పములైన విభావాదులు మూడే రససూత్రమందు గ్రహింపబడినవని తెలియవలెను. [అభినవభారతి-1వ సం-పుట 288]

నిజమునకు బ్రహ్మానందముకాని, రసానందముకాని అఖండరూపముగా ఉండును. కాని రసానందము తొమ్మిది విధములగు స్థాయి చిత్తవృత్తులచే ఉపహితమగుటవలన శృంగార-వీరాదిరూపమున నానావిధమగుచున్నది. అనగా ఉపాధులగు రత్యాదుల ఆకారములతో స్వప్రకాశమును, పరిశుద్ధమును, అఖండమును అగు రసానందము వివిధములుగా కన్పట్టుట సంభవించుచున్నది. ఇదియే బ్రహ్మానందమునకును, దీనికిని గల భేదము. బ్రహ్మానందమున పరబ్రహ్మము తప్ప ఇతర మేమియును గోచరము కాదు. ఇంక రసానుభవమునందు అంతఃకరణ వృత్తులగు రత్యాదులతో ఉపహితమగుచునే రసము గోచరించును. రంగుతోకూడిన స్ఫటికము ఆ రంగుయొక్క ఆకారముతోనే కన్పట్టినట్లు రసానందమునకు ఏ స్థాయి ఉపాధిఅగునో ఆ స్థాయి రూపముననే అది అనుభవములోనికి వచ్చును. విభావాది చర్వణ ఉన్నంతకాలమే ఈ రసానందము ఉండునని తెలియవలెను.

కావ్య-నాట్యములు రెండింటివలనను భావకునకు రసాస్వాదము కలుగును. కావ్యమునందు రసాస్వాదము కలుగువిధానమును వాక్యపదీయకారుడగు భర్తృహరి క్రింది విధముగా పేర్కొని యుండెను—

> శబ్దోపహితరూపాం స్తాన్ బుద్ధేర్విషయతాం గతాన్
> ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే ॥

శ్రవ్యకావ్యమునందు కవికృతములైన వర్ణనలచే కంసాదులు (నాయకులు) రూపములను పొంది సామాజికుని భావనచే వాని హృదయమున ప్రవేశించి ప్రత్యక్షముగా గోచరింతురు. అప్పుడు సామాజికుడు తదభేదమునుచెంది రసాస్వాదము చేయును. సహృదయులైన వారికి మాత్రమే కావ్యమునందు రసాస్వాదము కలుగును. ఇంక నాట్యము సహృదయులనేకాక సామాన్యులను కూడ ఆకర్షించుటకు సమర్థమైయున్నది. నాట్యమందలి ధ్రువాగీత్యాదులవలనను, ఇంకను తత్కాలోపస్థితములగు ఇతర కారణములవలనను, సామాజికుల హృదయములు సంస్కరింపబడి, అందరి హృదయములును ఏకరూపములై రసాస్వాదనోన్ముఖములగును. కావుననే ప్రస్తావనలోని నటీ-గీతాదులు సామాజికుల మనోనురంజనము చేయుట కుద్దిష్టములై ఉన్నవి. ఇట్లు రసాస్వాదనోన్ముఖములైన హృదయములందు పైనచెప్పిన విధముగా రసనిష్పత్తి జరుగును.

రసము స్వశబ్దవాచ్యము కారాదు. అది అభివ్యంజకము కావలెను. భావ-అభినయములేకాక అనుప్రాసాదులు, వృత్తి-రీతులు మొదలగునవి కూడ రసాభివ్యంజకములగుచున్నవి. లౌకికములైన పలుకులనే కవి కావ్యరూపమున నిష్పాదించినప్పుడు ఈ అభివ్యంజన మేర్పడును. కనుకనే సహృదయుడు కావ్యమును పలుమారు చదివియు, నాటకాదుల ననేకసారములు చూచియు, తనివితీరక, మాటిమాటికి చదువుచు, చూచుచు ఆనందసాగరమున మునుగుచున్నాడు. ఇట్లెన్ని పర్యాయములు పఠించినను విసుగు కలుగనీయక రసాస్వాదము నొనరించుకావ్యములే కర్తకు 'మహాకవి' అను ప్రసిద్ధిని కొనితేగలవు. [పైవివరములు శ్రీ వేదాల తిరువేంగళాచార్యుల వారి "ఆంధ్రధ్వన్యాలోకము" నుండి గ్రహింపబడినవి. పుటలు 99-104 చూడవలెను.]

### 9. రసము : సుఖ-దుఃఖములు

రసము లన్నింటివలనను ఆనందమే కలుగుననియు, 'సామాజికులు హర్షాదులను పొందుచున్నారు' అని అనుట సమంజసము కాదనియు కొందర భిప్రాయపడినట్లు అభినవగుప్తుడు పేర్కొని యుండెను. లోకమునందు హర్ష - శోక కారణములవలన మనకును క్రమముగా హర్ష - శోకములే కలుగుచున్నవి. వీనినే సుఖ-దుఃఖము లందుము. కాని కావ్య - నాట్యములం దిట్లు జరుగుటలేదు. సీతారాముల వియోగమందుకూడ కావ్య - నాట్యములలో మనము ఆనందమునే పొందుచున్నాము ; ఆనందము కలుగనిచో సొమ్మిచ్చి మనము దుఃఖమును కొనితెచ్చుకొందుమా ? కావున ఆనందముకొరకే మనము కావ్య నాట్యములను పరిశీలించుచున్నామనుట స్పష్టము. ఈ విషయమునే విశ్వనాథుడు క్రింది విధముగా వివరించినాడు [శ్రీ వేదంవారి సాహిత్యదర్పణానువాదము - 3 వ పరిచ్ఛేదము. సూ. 37-38]—"లౌకికములైన శోకహర్షాది కారణములవలన లోకమునందు



శోకహర్షాదులే కలుగును. కాని, లోకమునందలి ఆ కారణములే కావ్యమునందు అలౌకిక విభావములనుపేర వ్యవహృతములై అవి అన్నియును హర్షమునే కలిగించును. మరి హరిశ్చంద్రాదుల చరితమును చూచునప్పుడు అశ్రుపాతాదులు కలుగుటకు కారణము హృదయము కరగుటచేత అని తెలియవలెను." అరిస్టాటిల్ మొదలగువారుకూడ విషాదరూపకఫలము ఆనందానుభవమే (Pleasure) అని అంగీకరించియున్నారు.

కొందరాలంకారికులు పై అభిప్రాయమును అంగీకరించుట లేదు. వారి దృష్టిలో కొన్ని రసములు దుఃఖాత్మకములు.

రసము సుఖాత్మకమును, దుఃఖాత్మకమునుకూడ అగునని నాట్యదర్పణకర్తలు పేర్కొని ఉన్నారు [పుట. 158]—

> స్థాయీభావః శ్రితోత్కర్షో విభావ వ్యభిచారిభిః । స్పష్టానుభావనిశ్చేయః సుఖ-దుఃఖాత్మకోరసః ॥

కొన్ని రసములు నిజముగా దుఃఖాత్మకములే అనియు, ఆ రసములతోకూడిన ప్రదర్శనాదులను కాంచి ప్రేక్షకు డానందించుటకు కారణము నటులయొక్క- లేదా నాటకకర్తలయొక్క ప్రతిభయే అనియు వారు నిరూపించియున్నారు. "రసాహి సుఖ-దుఃఖావస్థారూపాః" అని భోజుడుకూడ అభిప్రాయపడెను. 'రసకలిక' యందు రుద్రభట్టుకూడ "కరుణామయానా మప్యుపాదేయత్వం సామాజికానామ్. రసస్య సుఖదుఃఖాత్మకతయా తదుభయలక్షణత్వేన ఉపపద్యతే. అతఏవ తదుభయజనకత్వమ్" అని పేర్కొని యుండెను. లోకమునందలి సుఖ-దుఃఖములే అభినయోపేతములై నాట్యమగుచున్నవని భరతుడు చెప్పుట గమనార్హము.

పై అభిప్రాయములు రెండింటియందును కొంత సత్యము, మరికొంత అసత్యమును లేకపోలేదు. కావ్య-నాట్యములను పరిశీలించునప్పుడు మనము ఆనందమునే పొందుచున్నామనుట సత్యమే. కాని శృంగారరసాస్వాదమును, కరుణరసాస్వాదమును ఒకేవిధముగా ఉండునని చెప్పుట సమంజసము కాదుగదా ? హరిశ్చంద్ర చరిత్రమును నాటకముగా చూచికాని, కావ్యముగా చదివికాని ఆనందమునే పొందుచున్నాము. శృంగారమునందలి ఆనందము రత్యుపహితముకాగా శోకమునందలి ఆనందము శోకోపహితమైన దనుటలో అసత్యము లేదుకదా ? అచ్చటను, ఇచ్చటను ఆనందము మాత్రము సమానమే. మరి స్థాయిభావముల లోని భేదముమాట ఏమిటి? ఈ ఉపాధిభేదములచేతనే కదా అఖండమైన రసానందము నవవిధములుగా గోచరించుచున్నదనుకొనినాము? అందుచే కరుణ రసాస్వాదములో ఆనందమునందు శోకమనునది రేఖామాత్రముగానైనను ఉండుటతప్పదు. హరిశ్చంద్ర చరిత్రమును చూచునప్పుడు మనకు తెలియకయే మన కనులవెంట నీరు కారుచున్నది. వీనిని ఆనందబాష్పము లనలేముకదా ? కావున ఇవి శోకచ్ఛాయలైన దుఃఖబాష్పము లనుటలో వైరుధ్యము లేదని నమ్ముచున్నాను.

మరి లోకములోని శోకము కావ్య-నాట్యములలో ఆనందరూప మెట్లగుచున్నదనగా 'ఉత్తమకవి కావ్యమందలి వ్యంజనా వ్యాపారమహిమముచే' అని చెప్పుట సత్యసమ్మతమగును. ఇట్టిది లోకముకంటె భిన్నమగుటచేతనే రసానందము అలౌకికమని చెప్పుట ఉపపన్న మగుచున్నది. 'రతి' చైతన్యముయొక్క ఆనందాంశముతో సంవలితమై శృంగారరస

మును స్ఫురింపజేయుచున్నట్లే జుగుప్సా-భయ-శోకములును చైతన్యము యొక్క ఆనందాంశముతో సంవలితములై క్రమముగా బీభత్స-భయానక-కరుణరసములను స్ఫురింపజేయుచున్నవి. ఇట్లు ఆనందాంశముతో సంవలితము లగుటచేతనే బీభత్స-భయానక-కరుణములు నాట్యమందు సంసేవ్యము లగుచున్నవి.

కావున సంభోగమందలి దంతక్షత-నఖక్షతాదులవలెనే కరుణాదులందలి శోకాద్యనుభవముకూడ ఆస్వాద్యమానమే అగుచున్నదని తెలియవలెను.

ఇచ్చట ముఖ్యముగా ఒక విషయమును గుర్తునందుంచుకొనవలెను. లౌకికములైన సంభోగాదులవలన కలిగెడిది సుఖము మాత్రమే. దానిని ఆనందమనరు. ఆనందమనునది అలౌకికమైనది. అది కావ్యనాట్యములవలననే కలుగును.

"Pain and Pleasure" [Macmillan & co, 1894] అను గ్రంథములో (2 వ ప్రకరణమందు) హెచ్. ఆర్. మార్షల్ ఎనిమిది ఉద్వేగములను (Emotions) పేర్కొని చర్చించియుండెను—Joy, Dread, Sorrow, Relief, Love, Fear, Anger, Surprise. వీనిలో మొదటి నాలుగును ప్రధానములైనవి. ఈ ఎనిమిదింటినేకాక ఇంకను కొన్ని అల్పములైన ఉద్వేగములనుకూడ అతడు వివరించియుండెను. మొత్తముమీద ఈ ఉద్వేగములన్నియును 'విషాద-అహ్లాదములు' (Pain and Pleasure) అనెడు రెండు ప్రధాన చిత్తవృత్తులకు సంబంధించి ఉన్నవని అతడు సిద్ధాంతించెను.

### 10. రస సామగ్రి : రస ప్రతీతి

రస సిద్ధాంత సారమును సులభ గ్రాహ్యముగునట్లుగా క్రింద వివరించుచున్నాను :

రస సామగ్రి : 1. రసానుభూతి అందరకును కలుగదు. ఆ అనుభూతి సంస్కారవంతులైన సహృదయులకు మాత్రమే కలుగును. సంస్కార మనగా రత్యాదిభావములను ఆస్వాదింపజేయు హృదయ ధర్మము (instinct). ఈ భావములు అప్పటికప్పుడు కలుగునవి కావు. బీజరూపమున సహృదయుల మనస్సులలోనే ఉండును. ఈ బీజములు (రత్యాది భావములు) మొలకెత్తుటకు అవకాశము కలుగు పర్యంతమును సుప్తావస్థలో హృదయమందు అణగి ఉండును. ఇవియే 'వాసనలు' అనబడును. ఈ వాసనల నిద్రావస్థయే 'నిర్వికారాత్మక చిత్తస్థితి'.

2. హృదయాకర్షకమైన సన్నివేశము లేదా వస్తువు లేదా వ్యక్తి హేతువుగా నిద్రావస్థలో ఉన్న రత్యాదిభావములు సంస్కార బలముచే ఉద్బుద్ధములగును. ఇట్లు రత్యాదులుద్బుద్ధములగుటకు హేతువైన సన్నివేశము, లేదా వస్తువు, లేదా వ్యక్తి 'విభావ' మనబడును.

3. తడి తగిలినవెంటనే బీజమునుండి మొలకవచ్చినట్లుగా నిద్రావస్థలో ఉన్న రత్యాదులు శక్తిసంపన్నమును, విశిష్టమును అగు ఈ విభావము ఆధారముగా ఉద్బుద్ధములగుచున్నవి. ఇతఃపూర్వము నిర్వికారముగా ఉన్న చిత్తమునం దిట్లు ఉద్బుద్ధములగువానినే 'భావము' అందురు. అనగా విభావమాధారముగా మనస్సునందు కలిగెడి ప్రథమ వికారము



లేదా చిత్తవృత్తి విశేషము 'భావము' (feeling) అనబడును. (అనగా విభావము కారణము ; భావము కార్యము).

4. ఆ భావము చంచలము కాక రసస్ఫూర్తివరకును స్థిరముగా ఉండవలయును ; ఇట్టి భావమునకే 'స్థాయి భావము' అనిపేరు. ఇవియే రత్యాదులు. ఏ విధమైన ఇతర భావ సంపర్కము కలిగినను మార్పునకు లోనుగాక, ఆ భావములను కూడ తనలో లయింపజేసికొనగల లేదా తనకు పోషకమగునట్లు చేసికొనగల దృఢత్వము కలదే 'స్థాయిభావము' (deep rooted feeling or permanent state) అనబడును.

విశిష్టమగు సన్నివేశము ఆధారముగా సహృదయుడగు వ్యక్తి హృదయమున మొలకెత్తి, వికాసమును గాంచి, రసస్ఫూర్తి పర్యంతమును నిలిచిఉండు భావము స్థాయి భావమగునని సారాంశము.

5. ఇట్లు స్థిరపడిన భావములు విభావచర్వణాబలమున సహృదయుని హృదయమున ఉత్తేజమును కాంచును. ఇది రసోన్ముఖమైన స్థితి. వీనినే ఉద్వేగములు (Emotions) అందురు.

6. అట్లు హృదయమున ఉత్తేజమును పొందిన స్థాయి భావములు నాయికా-నాయకుల (వారితో అభేదమును చెందిన సామాజికుల) మనో-దేహములపై ప్రాబల్యమును వహించి, వారిని అనేకములగు ప్రవృత్తులకు లోనుచేయును. ఈ మార్పులు హృదయ వికాసమునకు వెనువెంటనే కలుగునవి కాన వీనికి 'అనుభావము' అని పేరు. ఈ అనుభావములు రెండు రకములు. వ్యక్తిప్రయత్నపూర్వకముగా చేయు కటాక్ష-భ్రూవిక్షేపాదులు మొదటి రకము. ఇవి కేవలానుభావములు. ఇందులకు హృదయము పూర్తిగా భావావిష్టము కానక్కరలేదు.

7. ఇంక వ్యక్తిప్రయత్న మేమియును లేకయే దేహమునందు చూపట్టు అనుభావములు రెండవరకము. వీనికి 'సాత్త్విక' భావములని పేరు. ఇవియే రోమాంచాదులు. హృదయములు పూర్తిగా భావావిష్టములైనప్పుడే ఈ భావములు వ్యక్తములగును. సత్త్వ మనగా హృదయగతభావములను పైకి ప్రకాశింపజేయు మానసిక వ్యాపారము. (సాత్త్విక భావములుకూడ నిజమునకు అనుభావములే కాన రససూత్రమందివి వేరుగా గణింపబడలేదు.)

8. స్థాయిభావ ప్రాబల్యమున ఇట్లు దైహికములగు మార్పులు మాత్రమే కాక మనస్సున పెక్కు భావపరంపరలు ఉద్బుద్ధములగుటయును కలదు. ఈ భావపరంపరనే 'వ్యభిచారిభావములు' లేదా 'సంచారిభావములు' అందురు. ఇవియే నిర్వేదాదులు. ఈ భావములు హృదయమున స్థిరముగా నిలువక వెంటవెంటనే పుట్టుచు, లేచుచు, అడగుచు ఉండును. కావుననే వీనిని సముద్రపుటలలతో పోల్చుచుందురు. ఇవి స్థాయిభావములను దృఢతమముచేసి రసాభిముఖముగా నడిపించును.

9. పైన పేర్కొనబడిన విభావ - అనుభావ - సాత్త్విక - వ్యభిచారిభావములచే పైవిధముగా స్థాయిభావము స్వాద్యత్వమును పొందింపబడినప్పుడు సామాజికుడు శుద్ధమును, స్వప్రకాశమును అగు ఆనందమును అనుభవించును. ఈ ఆనందము ఉపాధి అయిన స్థాయితో సంవలితమై ఉండును. ఇట్టి ఆనందమునే 'రసము' అందురు. ఈ రసానందము బ్రహ్మానంద సహోదరము (Transcendency).

రసానుభూతి : రసానుభూతిపొందుటకు సామాజికుడు నాలుగు అవస్థలను దాటవలసి
ఉన్నదనియు, ఐదవదానిలో అనందానుభవము కలుగుననియు అభినవగుప్తుని సిద్ధాం
తము. ఆ అవస్థలను క్రింద వివరించుచున్నాను—

1. హృదయసంవాది అయిన విభావము (Aestnetic object) సామాజికుని కనులను,
చెవులను విప్పారఁజేయును (Sense level).

2. ఈ దర్శన - శ్రవణములవలన సామాజికుడు భావన చేయుటకు మొదలుపెట్టును.
ఆ భావనవలన క్రమముగా అతడు ఆ విభావముయొక్క పరిమిత బాహ్యస్వరూపమునే
కాక అందు దాగియుండి, బాహ్యేంద్రియములకు కన్పట్టని విశిష్టధర్మమును, అనంతత్వ
మును దర్శింపగలుగును (Imaginative level). ఇందులకు రంగమున ప్రదర్శితమగు, కావ్య
మున వర్ణితమగు అనుభావాదికము దోహదము చేయును.

3. ఇట్లు విశిష్ట దర్శనమైనంతనే వాని ప్రవృత్తియే మారిపోవును. ఇప్పుడు వానికి
ఎదుట ప్రత్యక్షముగ కన్పించు విభావాదులతో పనిలేదు ; వాని అంతర్యమును గూర్చి
తాను భావన చేసిన విశిష్ట స్వరూపమే వాని మనఃఫలకము ఎదుట నిలిచిఉండును. [ఇట్టి
అర్థమునందే "Art is the representation of the real in its mental aspect" అని
Worsfold పేర్కొనెను.] అనగా సామాజికుడు లౌకిక ప్రవృత్తి నుండి మరలి, స్వీయసృష్టి
అయిన ఒకానొక భావనాలోకమున సంచరించును. ఆ స్థితిలో అతడు పునఃపునరనుసంధాన
ముచే తన భావనకు కారణమైన విభావముతో తాదాత్మ్యమును (Identity) పొందును.
అనగా నాయకాద్యభేదమును పొంది, సాక్షాత్తుగా తదనుభవమునే తానును పొందుట
కభిముఖుడగును. వెనువెంటనే నాయకాదుల ఆవేశాదులెట్టివో అట్టివే వీనికిని కలుగగలవు.
అనగా వారి సుఖ-దుఃఖములనే ఈతడును పొందుచుండును. ఇదియే ఉద్వేగస్థితి లేదా
సత్త్వస్థితి (Emotional levei). సామాజికుని లేదా పాఠకుని ఇట్టి స్థితిని పొందింపగల
ప్రయోగము లేదా కావ్యము మాత్రమే ఉత్తమమని తెలియవలెను.

4. ఇట్లు సాక్షాన్నాయకాద్యనుభవమునే పొందుచు, ఆ భావతీవ్రతకే లోనైన
సామాజికుడు క్రమముగా తన్ను తాను మరచిపోవును (Self-forgetfulness). అనగా
అతడు స్వ-పర భేదములకు కారణమైన వ్యక్తిత్వమునే కోల్పోవును. ఇట్టి అలౌకిక స్థితికే
'సాధారణీకరణ' మని పేరు (Universalisation). సంభావన సరిగా లేకపోవుట మొదలగు
ఏడు విఘ్నములను తరించినప్పుడే సామాజికు డిట్టి స్థితిని పొందగలడు.

5. ఈ సాధారణీకరణ స్థితిలో సామాజికుని బాహ్యేంద్రియములు పనిచేయుట
పూర్తిగా మానివేయును. స్థాయితో కూడిన హృదయము, ఆనందముతో కూడిన ఆత్మ—
ఇవి రెండు మాత్రమే పనిచేయుచుండును. ఇదియే బ్రహ్మానందసబ్రహ్మచారి అయిన రసస్థితి
(Transcendency).

అసలు ఆత్మ ఆనందస్వరూపము. కాని, దానిని అజ్ఞానము లేదా విషయాంతరములు
ఆవరించి ఉండును. ఆ అజ్ఞానము తొలగినచో ఆనందము స్వస్వరూపముతో ప్రకాశించును.
విభావ-అనుభావ-వ్యభిచారి చర్వణ వలన ఆ అజ్ఞానావరణము తొలగును. అనగా
మనస్సునకు ద్రుతి (కొంచెము మనస్సు కరుగుట), విస్తరము (మనస్సు కొలదిగా విప్పారుట),



వికాసము (మనస్సు పూర్తిగా విప్పారుట) అనునవి క్రమముగా కలుగును. అప్పుడు
అనిర్వచనీయమైన ఒక చమత్కారవిశేషము జనించును. అదియే రసము లేదా ఆనందము.
విభావాది చర్వణలో ఏ స్థాయిభావము చర్వితమగునో తద్భావోపహితమై ఈ రసము
ఆస్వాదింపబడును. విభావాదికమును చర్వణచేయుచున్నంతసేపును సామాజికునకు లేదా
పాఠకునకు ఈ రసానుభూతి ఉండును.

"What is Art" అను గ్రంథములో (11 వ అధ్యా.) టాల్‌స్టాయ్ భరతుని సిద్ధాంత
ములను పోలిన సిద్ధాంతములను కొన్నింటిని ప్రతిపాదించియుండుట గమనార్హము.
ఉదా : 'రసప్రతీతి' ని అతడు "Transmission of feelings" అనెను.

### 11. అరిస్టాటిల్ సిద్ధాంతము

భారతీయ రససిద్ధాంతమువంటి నిశిత సమగ్రసాహిత్య విమర్శ ప్రాచీనకాలమున
పాశ్చాత్యులందు మృగ్యమనుట అతిశయోక్తి కాదు. అయినను రససిద్ధాంతమును పోలిన
ఒక సిద్ధాంతమును అరిస్టాటిల్ విషాదరూపక నిర్వచనములో ప్రతిపాదించియుండెను—
"A Tragedy is the imitation of an action...with incidents arousing pity and fear
wherewith to accomplish its catharsis of such emotions" [Fife's edition of Poetics
—page 16] విషాద-రూపకములందలి సన్నివేశము లన్నియును శోక-భయములద్వారా
ఆయా ఉద్వేగములయొక్క 'కెథార్సిస్' ను సాధించునవి కావలెనని పై నిర్వచన
సారము.

'ఇమిటేషన్' అను పదమువలెనే ఇందలి 'కెథార్సిస్' అను పదముకూడ పెక్కు
వాదోపవాదములకు గురి అయినది. పొయెటిక్సు మీద ఎస్. హెచ్. బుచెర్ ప్రామాణిక
మైన ఒక వ్యాఖ్యానమును వెలయించెను. వాని వివరణము బహుజనసమ్మతమైనదని చెప్ప
వచ్చును. విశేష వివరములకు ఈ గ్రంథమును (Aristotle's Theory of Poetry and Fine
Art), శ్రీ గుపః వ్రాసిన 'Tragic Relief' అను గ్రంథమును, ఎఫ్. ఎల్. ల్యూకాస్
వ్రాసిన 'Tragedy' అను గ్రంథమును, ఇ. ఎ. వుడ్‌హౌస్ త్రివేణిలో [5 వ సం.-4 వ
సంచిక-పుటలు 341-347] వ్రాసిన వ్యాసమును ముఖ్యముగా పరిశీలించవలెను. 'పొయె
టిక్సు'కు ఆంధ్రానువాదము వెలువడవలసియున్నది.

అరిస్టాటిల్ గురువగు ప్లేటో (Plato) 'రిపబ్లిక్' (Republic) అను తన గ్రంథములో
"కళలన్నియును మానవునిలో అణగి ఉండెడి ఉద్వేగములను రెచ్చగొట్టుటయే ధ్యేయ
ముగా కలిగి ఉండును" అని విమర్శించి ఉండెను. ఆ విమర్శకు అరిస్టాటిల్ క్రింది విధ
ముగా సమాధాన మొసంగెను—"కళలు మానవుని ప్రకృతికి అపకారకములు కావు. అవి
మానవునకు సహజములైన భయ-శోకములు అనెడి ఉద్వేగములను పైనుండి తగినంతగా
అందించుట ద్వారా వానిని ఆ ఉద్వేగ స్థితినుండి తప్పించి సాధారణమైన స్థితిలోనికి కొని
వచ్చుచున్నవి. ఇట్లు కళలు మానవునకు మంచినే కలిగించుచున్నవి."

పై వివరణసందర్భమున తన 'పాలిటిక్సు' (Politics) గ్రంథములో అతడు 'కెథార్సిస్'
అను పదమును ప్రయోగించెను. కాని ఆ పదము నాత డెచ్చటను నిర్వచింపలేదు.

'కెథార్సిస్' అను గ్రీకు పదమునకు మత సంబంధమును ఆరోపించి పవిత్రీకరణము (Purification) అను అర్థమును, వైద్యశాస్త్రానుసారముగా క్షాళనము లేదా శోధనము (Purgation) అను అర్థమును చెప్పబడెను. హోమియోపతీ వైద్యశాస్త్రమందు "like cures like" అను సిద్ధాంత మొకటి కలదు. గ్రీకువైద్యశాస్త్ర సిద్ధాంతమును ఇదియే. ఒక రోగియొక్క రోగమును కుదర్పవలెనన్నచో ఆ రోగకారణము లెట్టివో గ్రహించి, ఏమందు వేసికొన్నచో ఆరోగ్యవంతునిలో కూడ సరిగా అట్టిరోగమే ప్రవేశింపగలదో ఆ గుణము కలిగిన మందునే ఆ రోగి ఇత్తురు. 'ఉష్ణము ఉష్ణమువలన శమించును' అన్న విధముగా పై రోగికి అప్పుడు రోగము నయమగును. అట్లే నిత్యమును శోక-భయములతో నిండియున్న మానవులు విషాదరూపకమందు ప్రదర్శింపబడెడి శోక - భయములను కాంచి, భావించి, ఒక విధమైన మానసిక శాంతిని పొందుదురు. ఈ క్రియాకలాపమునకే 'కెథార్సిస్' అని పేరు.

దీనిని మనము లోకమందును చూడవచ్చును. ఏదో అవ్యక్తమగు బాధతో ఏడ్చు చున్న పిల్లలను ఉయ్యాలలో పరుండబెట్టి వారి గోలను మించెడి విధముగా వేగముగా ఊపుదుము. అప్పుడు ఆ పిల్లలు సుఖముగా నిద్రపోదురు. అట్లే శోక-భయములతో కూడిన మానవులు తమయందున్నవానికంటె అధికములైన శోక - భయములను కళా ప్రపంచ మందు కాంచి ఒకవిధమైన శాంతిని పొందుదురు. కావుననే విషాదరూపకములవలన కూడ ఆనందము కలుగుట కవకాశము కలుగుచున్నది. అనగా కొన్ని ఉద్వేగములు సహజముగా మానవునిలో అంతర్గతములై ఉండును. తనలో ఉన్నట్టి ఉద్వేగములనే (ముఖ్యముగా భయ-శోకములను) ఆతడు విషాదరూపకమందు చూచి అనుభవించుట జరుగును. ఇట్లు సమాంతరములయిన ఉద్వేగములను పైనుండి ప్రతిక్షేపించుటవలన విషాదరూపకము వానిలోని సహజోద్వేగములను రెచ్చగొట్టి, బహిర్గతములగునట్లు చేసి వానిని సాధారణ పరిస్థితికి కొనివచ్చును. అందుచే ఉద్వేగోపశమనమును కలిగించెడి విషాదరూపకము బాధా కరము కాక ఆనందదాయకమే అగుచున్నది.

కావున ఉద్వేగములను నియమితముచేయుటచే, కళాత్మకములైన సూత్రముల ద్వారా సంఘటింపబడిన విషాదరూపకమైనను లేదా మరియొక కళావిశేషమయినను మానవు నకు ఆహ్లాదకరము కాగలదు. నిత్యజీవితములో అనుభవింపబడెడి భయ-శోకములకును, కళా త్మకములైన భయ-శోకముల అనుభవమునకును ఇదియే భేదము.

కొంద రాధునిక విమర్శకులు విషాదరూపకము భయ-శోకములలో ఏదో ఒకదానిని ప్రతిపాదించిన చాలునని తలంచిరి; కొందరు శోకమున్నచో చాలుననిరి. కాని ఇట్టి వ్యాఖ్యానములు అరిస్టాటిల్ అభిప్రాయమునకు అనుగుణములుగా కన్పట్టవు. భయ- శోకములు రెండును విషాదరూపకమందుండునని ఆతడు స్పష్టముగా చెప్పియుండెను.

కాని ఇచ్చట ఒక సందేహము కలుగవచ్చును. ఈ క్షాళనము సమస్త ఉద్వేగము లకును సమాన ధర్మమేకదా? అట్టిచో అరిస్టాటిల్ శోక-భయములను మాత్రమే విశేషించి చెప్పుటయేల? విషాద రూపకము యొక్క ప్రయోజనమును గూర్చి చెప్పదలచినవాడ గుటచే అందు ప్రవర్తించు ఈరెండు వికారములనే అతడు తడవియుండెనని సులువుగా



చెప్పవచ్చును. ఈశ్వరాంశ సంభూతమైన మానవుని ఆత్మ నిత్యప్రసన్నముగా ఉండవలసి ఉండగా శోక-భయములనెడి ఈ రెండు వికారములును ప్రబలశత్రువులై ఆత్మను కలుషితమును, దూషితమును చేయుచున్నవి. అంతఃకరణము చర్వితమై, ప్రసన్నము కావలెనన్నచో ఈరెండు వికారముల క్షాళనమును (కెథార్సిస్) ఆధ్యాత్మిక సాధనములలో మొదటి మెట్టు. కళా ప్రపంచమునందు విషాదరూపక దర్శనమువలన తత్ప్రాప్తి శీఘ్రతర మగును. కాన ఈ నాటకములు సర్వథా సంసేవ్యములగుచున్నవి.

లౌకిక జీవితములందును, ఆత్మాభివృద్ధికి, రత్యాదులు శోక - భయములంతటి ప్రతి బంధకములు కావు. కాన, అంతశ్శత్రువులలో శోక-భయములవంటి ఆత్మవినాశ హేతువులు తక్కినవి కావు. అట్టి శోక - భయములను క్షాళితము చేయుటయే విషాదరూపక ప్రయో జనము.

విషాదరూపక ప్రయోజనమును ఎఫ్. ఎల్. ల్యూకాస్ క్రింది విధముగా వివరించెను- "Tragedy is a representation of human unhappiness which pleases us notwith- standing, by the truth with which it is seen and the skill with which it is communicated" ["Tragedy"—page 58].

12. ఈ అధ్యాయమందు నాట్య సంగ్రహమున చెప్పబడిన పదునొకండు విషయ ములే నాట్యశాస్త్రమునందు విపులముగా వివరింపబడెనని తెలిపియున్నాను. ఆ విషయముల నెల్ల 'శాస్త్ర సమన్వయము' అనుపేర ఉపోద్ఘాతమందు వివరించితిని. ఈ శాస్త్ర సమ న్వయమును, విషయ సూచికను పరిశీలించినచో నాట్యశాస్త్ర వైశాల్యమును, సమగ్రత యును స్పష్టములు కాగలవు.

# అధ్యాయము 7

## భావములు[1]

[కాశీముద్రణమునందు 124 శ్లోకములును, 50 గద్యములును కలవు; బొంబాయిముద్రణమునందు 180 శ్లోకములును, 55 గద్యములును కలవు; బరోడాముద్రణమునందు 121 శ్లోకములును, 52 గద్యములును కలవు. మూడు ముద్రణములందును శ్లోకములు మాత్రమే గణింపబడెను.]

### భావము

ఇప్పుడింక భావములను వివరింతును—

ప్రశ్న : 'భావము'లకు ఆ పేరెట్లువచ్చినది ? 'భావములు' అను పదమునకు 'భవంతి ఇతిభావాః' అని వ్యుత్పత్తియా ? లేక 'భావయంతి ఇతిభావాః' అని వ్యుత్పత్తియా ?

సమాధానము : వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయోపేతములైన[2] కావ్యార్థములను (అనగా రసములను) భావింపజేయునవి కాన ఇవి భావము లనబడినవి.[3]

---

1. ఈ అధ్యాయమునకు మూడు ముద్రణలయందును 'భావవ్యంజకాధ్యాయ' మని పేరు.

2. ఇచ్చట ఆహార్యాభినయము చెప్పబడలేదు. దీనికి నాట్యమందు ప్రాధాన్యమున్నను వాచికాద్యభినయములందిది అంతర్గతమై ఉండును కాన ప్రత్యేకముగా పేర్కొనబడలేదు. అంతియేకాక కావ్యమందు ఆహార్యమునకు పూర్ణత్వమేలేదు. కావుననే 'కావ్యమువలన గూడ రసాస్వాదము కలుగును' అనుట యుక్తమగుచున్నది. [అభినవభారతి-1 వ సం-పుట 344] నాట్యశాస్త్రమందు పెక్కుసార్లు 'కావ్య' పదము ప్రయుక్తమగుట గమనార్హము.

కొన్నిచోట్ల 'కావ్య' పదమునకు రూపకరచనా మాత్రమని అర్థము. నాట్యమనగా ప్రయోగించుట కుద్దేశింపబడిన రూపకము.

3. 'భావింపజేయునవి కాన భావములైనవి'—'భావ' పదమునకు రెండు ప్రసిద్ధార్థములున్నవి—1. భావన (ఉత్పాదించుట); త్రివిధాభినయముల సాహాయ్యమున కావ్యార్థములను అనగా రసములను ఉత్పాదించుట. 2. వాసన (వ్యాపించుట); సామాజికుల హృదయములందు వ్యాపించుట.

ఇచ్చట మొదటి అర్థము గ్రాహ్యము. వర్ణనాత్మకమైన వాచికము, సంనివేశవలనాదికమైన ఆంగికము, అంతర్బహిరాత్మకమైన సాత్త్వికము—ఈ అభినయములు మూడును కావ్యార్థ భావనయందు కరణభూతములు అనగా రసములను ఉత్పాదించుటయందు సాధనములు అని తెలియవలెను. [అభినవభారతి - 1 వ సం - పుట 343]



'భూ' అను ధాతువునకు 'కరణము' (అనగా చేయుట) అని అర్థము. కావుననే భావితము, కృతము, వాసితము అను పదములు ఏకార్థకములగుచున్నవి. లోకమందు కూడ[4] "అహో ! ఈ గంధముచే లేదా ఈ రసముచే సర్వమును భావితమైన"[5] దనుట ప్రసిద్ధమే. కావున భావ పదమునకు 'వ్యాప్తి' అనగా వ్యాపించుట అని అర్థము. ఈ విషయములను వివరించు శ్లోకములు కలవు [ఇంతవరకును అనగా ఈ ప్రశ్న-సమాధానములు రెండును మూలమున గద్యమునందున్నవి]—

ఏ అర్థము విభావముచే ఆహృతమై అనగా నిష్పాదితమై, అనుభావముల చేతను, వాగంగసత్త్వాభినయములచేతను గమ్యమానమగునో అనగా అభివ్యక్తము చేయబడునో ఆ అర్థము భావమనబడును.[6] వాచిక-ఆంగిక-ముఖరాగాత్మకమైన అభినయముచేతను, సాత్త్వికాభినయముచేతను,[7] కవ్యంతర్గతమైన భావమును[8]

---

4. 'భావిత' మను పదము లోకమున కరణార్థమందేకాక వాసితార్థమందును ప్రయుక్తమగుచుండుననుటకు ఇది ఒక ఉదాహరణము.

5. కస్తూరి కట్టిన వస్త్రమునందు ఆ వాసన వ్యాపించునట్లు, భావములును సామాజికుల హృదయములందు వ్యాపించును.

6. ఈ వ్యుత్పత్తియును, ఇంతకుముందు చెప్పబడిన వ్యుత్పత్తియును కవి-నటశిక్షను దృష్టిలో పెట్టుకొని చెప్పబడినవి. ఇచ్చట భావమునకు 'ఉత్పాదించు' అని అర్థము. ఇంక సామాజిక పరముగా మరిరెండు వ్యుత్పత్తులు చెప్పబడును. అచ్చట భావమునకు 'వ్యాపించు' అని అర్థము. [అభినవభారతి - 1వ సం - పుట 345]

భావమనునది చిత్తవృత్తి విశేషమని తెలియవలెను. "భావమనగా రసానుకూలమగు చిత్తవృత్తి విశేషము" అని భానుదత్తుడు రసతరంగిణిలో పేర్కొనుట గమనార్హము.

7. సత్త్వమనగా చిత్తైకాగ్రత. దానినుండి పుట్టినదే కృతకబాష్పాదిప్రాప్తి. ఇదియే సాత్త్వికాభినయమనబడును. వైవర్ణ్యమనెడి సాత్త్వికభావముచే ముఖరాగము సాత్త్వికాభినయమం దంతర్భూతమగుచున్నను, ముఖరాగమునకు ప్రత్యేక ప్రాధాన్యముండుటచే అదికూడ ఒక అభినయముగా చెప్పబడినది.

ముఖరాగము నాలుగు విధములనియు, అభినయము శాఖా - అంగ - ఉపాంగ సంయుక్తముగా చేయబడినను ముఖరాగ విహీనమైనచో శోభాన్వితము కాజాలదనియు 8వ అధ్యాయాంతమందు చెప్పబడును. [అభినవభారతి - 1వ సం - పుట 346]

3. వర్ణనా నిపుణుడైనవాడు కవి. కవ్యంతర్గత భావమనగా కవికి అనాదిప్రాక్తన సంస్కార ప్రతిభానమయము అయిన రాగాదికము (ఇది లౌకిక విషయజన్యము కాదనుట స్పష్టము). ఆ రాగాదులు కవిచే కావ్యమందు వర్ణితములగును. అవి దేశ-కాలాది భేద రహితములుగా, సర్వసాధారణీభావముతో ఆస్వాదింపబడుటకు యోగ్యములుగా ఉండును [అభినవభారతి-1వ సం-పుటలు 445-446] అట్లు కవిచే వర్ణితములైన భావములు

భావింపజేయునది అనగా ఆస్వాదయోగ్యముగా చేయునది కాన ఇది భావమన బడినది. వాగంగాది వివిధాభినయసంబద్ధములైన రసములను భావింపజేయునది అనగా ప్రేక్షకులచే ఆస్వాదింపజేయునది కాన ఇది భావమనబడినదని నాట్య ప్రయోక్తలు తెలియవలెను.

విభావము

ప్రశ్న : అయినచో 'విభావము' నకు ఆ పేరెట్లువచ్చినది ?

సమా : విశిష్ట జ్ఞానహేతువైనది లేదా విజ్ఞానము అను అర్థము కలది 'విభావ' మనబడును. విభావము, నిమిత్తము, హేతువు- ఇవి పర్యాయపదములు. వాచిక - ఆంగిక - సాత్త్వికాభినయములు దీనివలన విభావ్యములగును అనగా విశిష్టముగా తెలిసికొనబడును కాన ఇది విభావమనబడినది. విభావితము (విశిష్ట ముగా తెలిసికొనబడినది), విజ్ఞాతము అను పదములు ఏకార్థకములు. ఈ సంద ర్భమున ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము]

వాగంగాభినయాశ్రయములైన పెక్కు అర్థములు దీనివలన విభావ్యము లగును కాన దీనికి 'విభావ'[10] మను పేరు వచ్చినది.

---

నటునిచే అభివ్యక్తము చేయబడినప్పుడు, అవి విశిష్టచిత్తవృత్తులను రసనయోగ్యములనుగా చేయును. అనగా కవిగతములైన రాగాదులను సామాజికగతములనుగా చేయు చిత్త వృత్తి విశేషము 'భావ'మనబడునని సారాంశము.

9. విభావము, అనుభావము అనునవి రెండును అంతమందు 'భావ' పదమును కలిగి ఉన్నను భరతుడు వివరించిన నలుబది తొమ్మిది భావములలోనివి మాత్రము కావు.

విభావమునందు, అర్వాచీనాలంకారికులు చెప్పిన ఆలంబన-ఉద్దీపన భేదములను భరతుడు చెప్పలేదనియు, అట్టి విభజన కాల్పనికమని అభినవగుప్తుడు పేర్కొనినట్లును తెలిపి యున్నాను. [చూ. 6వ అధ్యాయమందలి 19 వ అధస్సూచిక]

10. చిత్తవృత్తుల ఉద్భవమునకు హేతువైన విషయము విభావమనబడునని సారాంశము. పెక్కు అర్థములు=స్థాయి-వ్యభిచార్యాద్యనేకార్థములు; విభావ్యము లగును=విశేషముగా తెలియబడును.

అభినయమునకు అనేక హేతువులుండవచ్చును—హాస్యమునకు హర్షాదులును, బాష్పములకు ఘర్మ - ధూమ - రోగాదులును కారణములగుచున్నవి. ఈ బాష్పాదుల వలన ఏమి ప్రతీయమానమగుచున్నది అను విషయమును విభావమునుబట్టి వెంటనే నిశ్చ యింపగలము. [అభినవభారతి-1 వ సం-పుట 347]

సూచన : ఇంతటితో అభినవభారతి ముగిసినది. ఇంక 7 వ అధ్యాయమందలి తక్కిన భాగమునకును, 8 వ అధ్యాయమునకును వ్యాఖ్యానము లభించలేదు. తాను సొంతముగా ఒక వ్యాఖ్యానమును రచించి దినికి జోడించవలయునని శ్రీ మానవల్లి రామ కృష్ణకవిగారు తలంచినారు. అదియును కార్యరూపమును తాల్చినట్లులేదు.



అనుభావము

ప్రశ్న : 'అనుభావము'నకు ఆ పేరెట్లువచ్చినది ?

సమా : వాగంగసత్త్వకృతమైన అభినయము దీనివలన అనుభావ్యమగును అనగా అనుభవయోగ్యముగా చేయబడును కాన ఇది 'అనుభావ' మనబడినది. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము]

వాగంగాభినయములచే అర్థము అనుభావ్యమగును కాన ఇచ్చట ఇది అనుభావమనబడినది. మరియు ఈ అనుభావము శాఖా (హస్త)-అంగ-ఉపాంగ సంయుక్తముగా ఉండును.[11]

భావ-విభావ-అనుభావములు

ఇట్లు, భావములు విభావ-అనుభావ సంయుక్తములని తెలియవలెను. ఇచ్చట భావస్వరూపము సిద్ధించినది. ఇంక, విభావ-అనుభావ సంయుక్తములైన ఈ భావములకు లక్షణములను, నిదర్శనములను వివరింతును. వీనిలో విభావ- అనుభావములు రెండును లోకప్రసిద్ధములు, అవి లోకస్వభావానుగతముగా ఉండును కాన అతిప్రసంగ నివృత్త్యర్థము వాని లక్షణములను వివరించుటలేదు. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము]

అభినయమందు విభావ-అనుభావములు లోకస్వభావసంసిద్ధములును, లోక యాత్ర ననుసరించి ఉండునవియును అగునని బుధులు తెలియవలెను.

భావములయొక్క సామాన్యగుణయోగము

భావములు మూడు విధములు; అందు స్థాయిభావము లెనిమిది, వ్యభిచారి భావములు ముప్పదిమూడు, సాత్త్విక భావము లెనిమిది. ఈ నలుబది తొమ్మిది భావములును కావ్యరసాభివ్యక్తి[12] హేతువులని తెలియవలెను. ఈ నలుబది తొమ్మిది భావములయొక్క సామాన్యగుణయోగమువలన (అనగా చర్వ్యమాణములైన ఈ నలుబది తొమ్మిది భావముల వలన) రసములు నిష్పన్నములగును. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము]

---

11. అనుభావమనగా కటాక్షాది చేష్టలు. ఇవి శరీరజములు; ప్రయత్నపూర్వకము లైనవి. సాత్త్విక భావములుకూడ అనుభావములే. కాని అవి ఆంతర భావములు. అవి వ్యక్తములగుటకు హృదయము పూర్తిగా భావావిష్టము కావలసి ఉన్నది. ఈ భేదముచే అవి వేరుగా గణింపబడినవి. శాఖ-అంగ-ఉపాంగముల అభినయములు 8. 9 అధ్యాయము లందు వివరింపబడును.

12. 'అభివ్యక్తి' పదమును భరతుడే వాడెను. దాని అర్థమును గ్రహించి, విపులీక రించి, సిద్ధాంతించినవాడు అభినవగుప్తుడు.

ఏ అర్థము హృదయసంవాది అగునో తదర్థభావనమే (చర్వణము లేదా సంవేదనము) రసోద్భవహేతువు. శుష్కమైన కాష్ఠమందు అగ్నివలెనే ఆస్వాద యోగ్యమైన ఆ అర్థము శరీరమునందంతటను వ్యాపించును.*

స్థాయిభావ విశిష్టత

ప్రశ్న : కావ్యార్థముల నాశ్రయించుకొని ఉన్నవియును, విభావ-అనుభావ వ్యంజితములును, సామాన్యగుణయోగమును పొందినవియును అయిన ఏకోన పంచాశత్ (49) భావముల వలన రసములు నిష్పన్నములగునని చెప్పబడెనుకదా? మరి స్థాయిభావములు మాత్రమే రసత్వమును పొందునని చెప్పుట ఎట్లు పొసగును?[13]

సమా: పురుషులందరును సమానములగు లక్షణములు కలిగి, ఒకే విధమగు అంగ-ప్రత్యంగ నిర్మాణముతో కూడిఉన్నవారైనప్పటికిని అందులో కొందరు మాత్రమే కుల-శీల-విద్యా-శిల్ప-కర్మ-విచక్షణత్వములవలన రాజత్వమును పొందుచున్నారు. ఇంక అల్పబుద్ధులైన ఇతరులు వారికి అనుచరులగుచున్నారు. అట్లే ఏకోన పంచాశద్భావములును సమాన ధర్మములు కలవి అయినను అందు రత్యాది స్థాయిభావములు మాత్రమే ప్రాధాన్యమును వహించుచున్నవి. తక్కిన విభావ-అనుభావ-వ్యభిచారులు వానిని ఆశ్రయించుకొని ఉండును. అనగా, బహ్వాశ్రయత్వము (చాల భావములకు ఆశ్రయములైనవగుట) వలన స్థాయిభావములు స్వామిభూతములగుచున్నవి. అంగభూతులైన పురుషులు రాజుల నాశ్రయించుకొని ఉన్నట్లు అంగభూతములైన ఇతర భావములును స్థాయిభావముల నాశ్రయించుకొని ఉండును [ఈ వాక్యము ఒక ప్రతిలోనే కలదట]. స్థాయిభావములు రసత్వమును పొందుచున్నవి. ఇంక వ్యభిచారి భావములు కేవలము పరిజన భూతములై ఉండును.

ప్రశ్న : ఇందులకు దృష్టాంతమేమి ?

సమా : బహుజన పరివారుడైనప్పుడే 'నరేంద్ర' నామము కలుగునుగాని మహాపురుషుడైనంత మాత్రమున ఎవరికిని ఆపేరురాదు. కావున విభావ-అనుభావ-వ్యభిచారి భావములతో కూడుకొనిఉన్న స్థాయిభావమునకే 'రస' నామము లభించును. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము]

*[కాశీ, బొంబాయి, బరోడా ముద్రణములు మూడింటియందును 1-7 శ్లో.]

13. స్థాయిభావరూపోపహితమై రసానందము అనుభవింపబడునుగాన 'స్థాయియే రసత్వమును పొందుచున్నది' అని చెప్పుట ఔపచారికము మాత్రమే అని తెలియవలెను. వివరములకు 6 వ అధ్యాయాంతమందలి 8 వ విశేషాంశమును చూడవలెను.



నరులలో నృపతి, శిష్యులలో గురువువలెనే సర్వభావములలో 'స్థాయిభావము' మహనీయము.

రస లక్షణముల నిదివరకే చెప్పితిని. ఇప్పుడింక భావసామాన్య లక్షణములను వివరింతును. ముందుగా స్థాయిభావములను వివరింతును.[14]

స్థాయిభావములు

1. రతి—ఇది ప్రమోదాత్మకము. ఋతువులు, పుష్పమాలలు, మైపూతలు, ఆభరణములు, ప్రియజనులు, మంచిఇల్లు, వ్యతిరేకత లేకుండుట మొదలగు విభావముల వలన రతి సముత్పన్నమగును. నవ్వుమొగము, తీయనిమాటలు, కనుబొమల కదలికలు, కడకంటి చూపులు మొదలగు అనుభావములచే రతి అభినయింపబడును. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము]

ఇష్టార్థ విషయ లాభమువలన రతి జనించును. వాఙ్మాధుర్యము చేతను, తదుచితములైన అంగచేష్టితముల చేతను రతిని సౌమ్యముగా అభినయించవలెను.

2. హాసము[15]—పరుల చేష్టలను అనుకరించుట, కుహకము (చిన్నపిల్లల చక్కిలిగింతలు లేదా మోసము), అసంబద్ధప్రలాపము, దోషములను ఎన్నుచుండుట,

14. ఈ భావములన్నింటిని తరువాతి ఆలంకారికులు కేవలము శృంగారపరముగా వివరించుచు వచ్చిరి. కాని భరతుడట్టి ప్రత్యేకతను చూపక సర్వరస సామాన్యముగా నిర్వచించి ఉండెను. అర్వాచీనాలంకారికులు రసాధ్యాయమును భావాధ్యాయమును వేరు వేరుగా వివరింపక కలిపివేయుటయు గమనార్హము.

స్థాయిభావలక్షణమును ధనంజయుడీ క్రిందివిధముగా నొసంగెను [దశరూపకము - 4వ ప్రకాశము - 34 శ్లో.]—

"విరుద్ధైరవిరుద్ధైర్వా భావైర్విచ్ఛిద్యతే న యః। ఆత్మభావం నయత్యన్యాన్ స స్థాయీ లవణాకరః॥"

6 వ అధ్యాయమందలి 8 వ విశేషాంశమును కూడ చూడవలెను.

వ్యభిచారి భావములుగా ఉండెడి స్థాయిభావములకే ఈ అధ్యాయమందు లక్షణములు చెప్పబడినవని మహిమభట్టు వ్యాఖ్యానించెను. వివరములకు ఈ అధ్యాయాంతమందలి 2 వ విశేషాంశమును చూడవలెను.

15. హాసమును విశ్వనాథుడును, జగన్నాథపండితుడును క్రింది విధముగా వివరించి యున్నారు—

"వికృతాకార-వాక్-వేష-చేష్టాదేః కుహకాద్భవేత్ హాసో హాసః స్థాయిభావః"

—సాహిత్య దర్పణము [చూ. శ్రీ వేదంవారి అనువాదము - సూ. 228-పుటలు. 90-91]

"వాక్-అంగాది వికార దర్శన జన్మా వికాసాఖ్యో హాసః" —రసగంగాధరము

'వికాస' మనెడి పదమును అధికముగా చేర్చుటవలన జగన్నాథుని నిర్వచనము రమణీయతరముగా ఉన్నది.

మూర్ఖత, మొదలగు విభావముల వలన హాసము జనించును. వెనుక (6 వ అధ్యాయమందు) చెప్పబడిన స్మితాదులే ఇందలి అనుభావములు. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము]

పరచేష్టానుకరణమువలన హాసము జనించును. పండితులు దీనిని స్మిత - హాస - అతిహాసితములతో అభినయించవలెను.

3. శోకము— ఇష్టజనుల వియోగము, విభవనాశము, వధ, బంధనము, దుఃఖము సంభవించుట మొదలగు విభావములవలన శోకము జనించును. కన్నీరు కార్చుట, విలపించుట, పరిదేవనమొనర్చుట, వెలవెలబారుట, స్వరముమారుట, అంగముజారిపోవుట, భూమిమీదపడుట, పెద్దపెట్టున ఏడ్చుట, ఆక్రందనము చేయుట, దీర్ఘముగానిశ్శ్వసించుట, జడత్వము, మోహము. ఉన్మాదము, మరణము అనునవి శోకమందలి అనుభావములు. రుదితము (రోదనము) మూడు విధములు- ఆనందమువలన పుట్టినది, ఆర్తివలన జనించినది, ఈర్ష్యవలన పుట్టినది. ఈ సందర్భమున కొన్ని ఆర్యలు కలవు. [ఇంతవరకును గద్యము]

హర్షముచే కపోలములు వికసించుట, పూర్వస్మరణముతోకూడిన వాక్యములు చెప్పుచుండుట, కడకంటిచూపులు విస్తృతములగుట, శరీరము రోమాంచసహితమగుట, కన్నీరు వెలువడుట అనువానితో కూడిన రుదితము ఆనందమువలన పుట్టినదగును. అధికముగా కన్నీరుకార్చుట, ధ్వనితోకూడి ఉండుట, శరీరము నడక చేష్టలును అస్వస్థములగుట, క్రిందపడి దొర్లుచు ఏడ్చుట అనువానితో కూడిన రుదితము ఆర్తివలన జనించినదగును. పెదవులు కపోలములు బాగుగా చలించుట, శిరము కంపించుట, నిశ్వాసములధికమగుట, బొమముడులు కటాక్షములు కుటిలములగుట అనువానితో కూడిన స్త్రీల రుదితము ఈర్ష్యవలన జనించినదగును.

శోకము స్త్రీ- నీచప్రకృతులయందే వ్యక్తమగుచుండును. ఇది ముఖ్యముగా ఏదేని వ్యసనము లేదా ఆపదవలన సంభవించును. శోక సమయమున ఉత్తమ- మధ్యమ ప్రకృతులు ధైర్యముతోను, నీచప్రకృతులు రుదితముతోడను ఉందురు.

4. క్రోధము— ఆధర్షణము, ఆక్రోశము, కలహము, వివాదము, ప్రాతికూల్యము మొదలగు విభావములవలన క్రోధము ఉత్పన్నమగును. నాసాపుటములు పెద్దవిఅగుట, కనులను పైకెత్తిచూచుట, పెదవులను బిగించుట, కపోలములు అదరుట మొదలగునవి ఇందలి అనుభావములు. [ఇంతవరకును గద్యము]

క్రోధము ఐదు విధములు- శత్రువుల వలన జనించినది, గురువువలన జనించినది, ప్రేమ కలవారివలన జనించినది, భృత్యులవలన జనించినది, కృతకము



(తెచ్చిపెట్టుకొన్నది). ఈ విషయములను వివరించు కొన్ని ఆర్యలు కలవు. [ఈ వాక్యము గద్యము]

బొమముడివేయుట, కపోలములను పైకెత్తుట, పెదవులను బిగించుట, అరచేతులను రాయుట, జబ్బలను గుండెలను చరచుట అనువానితో శత్రువుమీద కోపమును చూపవలెను. కొంచెము క్రిందిచూపు, కన్నీరు, చెమట తుడుచుకొనుచుండుట, కోపపుచేష్టలను అవ్యక్తముగాచేయుట అనువానితో వినయసహితముగా గురువుమీద కోపమును చూపవలెను. స్వల్పముగా కదలుచుండుట, కడకంటి చూపులలో కన్నీరు నిలుపుట, బొమముడివేయుట, పెదవులు చలించుట అనువానితో ప్రణయినిమీద కోపమును చూపవలెను. తర్జనము (చేష్టాపూర్వకముగా బెదరించుట), నిర్భర్త్సనము (మాటలతో బెదరించుట=చీవాట్లు పెట్టుట), కళ్ళు పెద్దవిచేయుట, తృణీకారభావమును చూపులయందు వ్యక్తముచేయుట అనువానితో క్రూరతారహితముగా పరిజనులమీద కోపమును చూపవలెను. ఏదేని ఒక కారణముచే తెచ్చిపెట్టుకొన్న కోపము కృతకమగును. ఇందు కోపమువలన కలుగు ఆయాసమును, కోపచిహ్నములను చూపవలెను. ఇది వీరరసమందును ప్రయుక్తమగును (ఇది ఉభయరసములకును సంబంధించినది - అని కాశీముద్రణ పాఠము).

5. ఉత్సాహము—ఇది ఉత్తమ ప్రకృతులయందుండును. విషాదములేకుండుట, శక్తి, ధైర్యము, శౌర్యము మొదలగు విభావములవలన ఉత్సాహము జనించును. ధైర్యము, త్యాగము, వైశారద్యము మొదలగు అనుభావములచే ఉత్సాహమును అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము.] [266వపుటను చూడవలెను].

6. భయము — ఇది స్త్రీ- నీచప్రకృతులయందుండును. గురుజనులయెడ లేదా రాజునెడ చేయబడిన అపరాధము, శూన్యాగారనివాసము, గహనములైన అటవీ-పర్వత పర్యటనములు, గజ-అహిదర్శనము, నిర్భర్త్సనము, దుర్దినము (వర్షించుచున్న పగలు) రాత్రి, చిమ్మచీకటి, గ్రుడ్లగూబలు నక్కలు మొదలగువాని కూతలు వినుట అనెడి విభావములవలన భయము జనించును. చేతులు కాళ్ళు వణకుట, గుండె దడదడకొట్టుకొనుట, నిశ్చేష్టత, నోరెండిపోవుట, నాలుకతో పెదవులను తడుపుచుండుట, స్వేదము, వేపథువు, త్రాసము, రక్షణకొరకు వెదకుట, పరుగెత్తుట, ఆక్రోశించుట మొదలగు అనుభావములతో భయమును అభినయించవలెను. ఈ సందర్భమున కొన్ని శ్లోకములు కలవు [ఇంతవరకును గద్యము].

గురు - రాజాపరాధములు, రౌద్రదర్శనము, ఘోరవార్తలను వినుట మొదలగు వానివలన కలిగిన సమ్మోహముచే భయము జనించును. శరీరము వణకుట, విత్రాసము, నోరెండిపోవుట, సంభ్రమము, నేత్రములను పెద్దవిగా తెరచుట మొదలగు వానితో భయమును అభినయించవలెను. భయంకరములైన విషయముల వలన పురుషులయందు జనించిన భయమును జారిపోయిన అంగములతో, కనుమూతలతో నర్తకులు (నటులు) అభినయించవలెను.

ఇచ్చట ఒక ఆర్యకూడ కలదు [ఇది గద్యము].

కర - చరణ - హృదయములు కంపించుట, నోరెండిపోవుట, పెదవులను తడుపుకొనుచుండుట, స్తంభము, సంభ్రమముతో కూడిన ముఖము, వేపథువు, సంత్రాసము అనువానిచే భయమును అభినయించవలెను.

7. జుగుప్స— ఇది స్త్రీ- నీచప్రకృతులయందుండును. హృద్యములు కాని వానిని దర్శించుట, వినుట మొదలగు విభావములవలన జుగుప్స జనించును. సర్వాంగములను ముడుచుకొనుట, ఉమ్మివేయుట, మూతి వంకరగా పెట్టుట, హృల్లేఖము (గుండె. రాచుకొనుట) మొదలగు అనుభావములతో జుగుప్సను అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము].

ముక్కు మూసికొనుట, సర్వాంగములను సంకోచింపజేయుట, ఒక విధమైన అస్థిరత్వము, లేదా కలత చెందుట, గుండె రాచుకొనుట అనువానిచే జుగుప్స నిర్దేశింపబడవలెను.

8, విస్మయము —మాయా - ఇంద్రజాలములు, అమానుష కృత్యములు, అతిశయముతో కూడిన చిత్రలేఖన-పుస్తములు, విద్యాతిశయము మొదలగు విభావముల వలన విస్మయము జనించును. కండ్లు పెద్దవిచేయుట, రెప్పవాల్పక చూచుట, కనుబొమలు ఎగురవేయుట, రోమాంచము, తలఊపుట, బాగుబాగు అని మెచ్చుట మొదలగు అనుభావములతో విస్మయమును అభినయించవలెను. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము]

లోకాతిశాయి అగు కృత్యమువలన కలిగిన హర్షమునుండి విస్మయము జనించును. ప్రహర్షము, రోమాంచము మొదలగు వానిచే విస్మయమును ప్రదర్శించవలెను.

రససంజ్ఞ కలిగిన[16] స్థాయి. భావములను పై విధముగా తెలిసికొనవలెను.* [ఇది గద్యము]

---

16. 'రససంజ్ఞ కలిగిన అను ఈ పాఠము పై అధస్సూచికలో సూచించిన మహిమభట్టు వ్యాఖ్యానమునకు వ్యతిరేకముగా ఉన్నది. కాని ఈ పాఠము కొన్ని ప్రతులలో



వ్యభిచారిభావములు

ఇప్పుడింక వ్యభిచారిభావములను వ్యాఖ్యానింతును—

ప్రశ్న : వ్యభిచారిభావములకు ఆ పేరెట్లు వచ్చినది ?

సమా : వ్యభిచారి (=వి+అభి+చర) అనుదానియందు 'వి, అభి' అనునవి రెండును ఉపసర్గలు. 'చర' అనునది 'గతి' (చరించుట) అను అర్థమును తెలుపు ధాతువు. రసముల విషయమున ఆభిముఖ్యము (సహకారిత్వము) తో, వివిధముగా చరించునవి కాన ఇవి వ్యభిచారిభావములనబడినవి. ఈ వ్యభిచారిభావములు వాచిక - ఆంగిక - సాత్త్వికాభినయోపేతములై ప్రయోగమునందు రసములను 'తీసికొని వచ్చును'[17] (ఆస్వాదయోగ్యములనుగా చేయును).

ప్రశ్న : ఎట్లు ?

సమా : ఇట్లు చెప్పుట లోకప్రసిద్ధమే. ఈ నక్షత్రమును లేదా ఈ దినమును సూర్యుడు 'తీసికొనివచ్చుచున్నాడు' అనుటవంటిదే ఇదియును. కాని బాహువులతో మోయుచు లేదా స్కంధములమీద పెట్టుకొని వానిని తీసికొనివచ్చుటలేదు కదా ? అయినను 'సూర్యుడు దినమును లేదా నక్షత్రమును తీసికొనివచ్చును' అని చెప్పుట లోకప్రసిద్ధమే. ఇట్లే వ్యభిచారిభావములును ప్రయోగమునందు రసములను తీసికొనివచ్చునని గ్రహించవలెను.

నాట్య సంగ్రహమందు చెప్పబడిన ముప్పదిమూడు వ్యభిచారిభావములను ఇప్పుడు వరుసగా వివరింతును—

1. నిర్వేదము[18]— దారిద్ర్యము, వ్యాధి, అవమానము, ధిక్కరించుట, ఆక్రోశము, క్రోధముతో కొట్టుట, ఇష్టజనవియోగము, తత్త్వజ్ఞానము మొదలగు

---

లేదట. కావున "పై విధముగా స్థాయిభావములను తెలిసికొనవలెను" అనుపాఠము సరి అయినదిగా కన్పట్టుచున్నది.

[కాశీ-బొంబాయి-బరోడా ముద్రణములు మూడింటియందును-8-27 శ్లో].

17. 'రసములను తీసికొనివచ్చును'— ఈ 'తీసికొనివచ్చు' టకు రెండర్థములున్నవని ఇదివరకే వివరించిఉన్నాను— 1. రసములను ఉత్పాదింపజేయుట (bring rasas into being). అనగా స్థాయిభావమును సంస్కరించి, రసనిష్పత్తికి తోడుపడుట; 2. రసమును సామాజికునకు అభిముఖమును అనగా ఆస్వాదయోగ్యమును చేయుట.

18. ఎనిమిది స్థాయిభావములకు మాత్రమే భరతుడు లక్షణ - నిదర్శనములను పేర్కొనెను. అంతియే కాక భావముల మొత్తము నలుబదితొమ్మిది అని నిర్దేశించివేసెను. అందుచే శాంతమును 9 వ రసముగా అంగీకరించిన కొందరు వేరొక స్థాయిభావమును

విభావములవలన నిర్వేదను జనించును. రుదితము, ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు, సంప్రధారణము (వివేచనము), మొదలగు అనుభావములతో స్త్రీ-నీచప్రకృతులు నిర్వేదమును అభినయించవలెను. ఈ సందర్భమున ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము.]

దారిద్ర్యము, ఇష్టజన వియోగము మొదలగువాని వలన నిర్వేదము జనించును. దానిని సంప్రధారణ-నిశ్శ్వసితములతో అభినయించవలెను.

ఈ విషయమును వివరించు ఆనువంశ్యములైన ఆర్యలుకూడ కలవు [ఇది గద్యము.]

ఇష్టజనవియోగము, దారిద్ర్యము, వ్యాధి, దుఃఖము, పరుల అభివృద్ధిని చూచుట అనువాని వలన నిర్వేదము జనించును. నిర్వేదముతోకూడిన పురుషుడు బాష్పములచే తడిసిన కనులను, నిశ్శ్వసితములతో దీనములైన ముఖ-నేత్రములను కలవాడై యోగివలె ధ్యానపరుడై ఉండును.

2. గ్లాని— వాంతులు, విరేచనములు, వ్యాధి, తపోనియమము, ఉపవాసము, మనస్తాపము, అధికముగా సంభోగించుట, అధికముగా త్రాగుట, అతివ్యాయామము, నడచివచ్చుట, ఆకలిదప్పులు, నిద్రాభంగము మొదలగు విభావములవలన గ్లాని జనించును. నీరసించిన మాటలు కనులు చెక్కిళ్ళు పొట్ట కలిగిఉండుట, మెల్లగా అడుగులువేయుట, వణకు, ఉత్సాహములేకపోవుట, శరీరము సన్నగిల్లుట, వైవర్ణ్యము, స్వరభేదము మొదలగు అనుభావములతో గ్లానిని అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు. [ఇంతవరకును గద్యము.]

వాంతులు, విరేచనములు, వ్యాధి, తపస్సు, ముసలితనము, అనువానివలన గ్లాని జనించును. శరీరము సన్నగిల్లుట, మెల్లగా అడుగులు పడుట, వణకు, సన్నని ఎలుగు, నేత్రవికారములు, దైన్యగతి, అంగములు జారిపోవుట మున్నగువానితో గ్లానిని మాటిమాటికిని అభినయించవలెను.

3. శంక—ఇది సందేహరూపమైనది; స్త్రీ-నీచప్రకృతులయందు జనించును. దొంగతనము పట్టుబడుట, రాజునకు అపకారము చేసియుండుట, పాపకార్య మొనర్చియుండుట మొదలగు విభావములవలన శంక జనించును. మాటిమాటికిని చూచుచుండుట, అవకుంఠనము (తప్పించుకొనుటకు ప్రయత్నము), నోరెండిపోవుట, నాలుకతో పెదవులను తడుపుకొనుట, ముఖము పాలిపోవుట,

---

కల్పింపక, వ్యభిచారులలో మొదటిదగు ఈ 'నిర్వేదము' ను శాంతమునకు స్థాయిభావమునుగా గ్రహించిరి.



స్వరము భేదించుట, వేపథువు, పెదవులెండుట, మాట రాకపోవుట మొదలగు అనుభావములతో శంకను అభినయించవలెను [ఇంతవరకును గద్యము.]

దొంగతనము చేయుట మొదలగువానివలన జనించిన శంక భయానక రసమందు ప్రయుక్తము కావలెను. ప్రియుడు చేసిన మోసము మొదలగువానివలన జనించిన శంక శృంగారమునందు ప్రయుక్తము కావలెను.

ఇందు ఆకారమును కప్పిపుచ్చుట ఛాన్యమనియు, ఆ ఆకార సంవరణము కుశలములైన ఉపాయములచేతను, ఇంగితములచేతను సూచింపబడవలెననియు కొందరందురు. ఈ సందర్భమున రెండు ఆర్యలు కలవు [ఇది గద్యము.]

శంక రెండు విధములు—(1) ఆత్మసముత్థము (తన దోషముల వలన తన యందు జనించినది) (2) పరసముత్థము (ఇతరులవలన తనకు సంక్రమించినది). ఆత్మ సముత్థమైన శంకను దృష్టులచేతను, చేష్టలచేతను వ్యక్తము చేయవలెను. శంకించుచున్న పురుషుడు చలించుచున్న అంగములు, వంచిన తల, ప్రక్కచూపులు, ముద్దగా చాచబడిన నాలుక, నల్లని ముఖము కలిగి ఉండును.

4. అసూయ—వివిధములైన అపరాధముల వలనను, ద్వేషము వలనను, ఇతరులయొక్క సౌభాగ్యము ఐశ్వర్యము బుద్ధి విద్య విలాసము అనువాని ఆధిక్యమును చూచుట మొదలగువాని వలనను అసూయ జనించును. పరిషత్తులో దోషములనే ఎంచుట గుణములను నిరసించుట, ఈర్ష్యతో కూడిన కనులు, వంచిన తల, నిరసన పూర్వకమైన బొమముడి, కుత్సనము (నిందించుట) మొదలగు అనుభావములతో అసూయను అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

పరుల సౌభాగ్య-ఐశ్వర్య-బుద్ధి-విద్యా-విలాసములయొక్క ఔన్నత్యములను చూచుట వలనను, తనకు అపకారము జరిగినప్పుడును అసూయ జనించును. బొమముడి వేయుటచే పైకిలేచిన కపోలములు, ఈర్ష్యా-క్రోధములచే ప్రక్కకు త్రిప్పిన ముఖము, విద్వేషము, గుణములను అణచివేయుట అనువానిచే అసూయను అభినయించవలెను.

5. మదము—మద్యము నుపయోగించుటవలన మదము జనించును. మదము మూడు విధములు; ఇందులకు విభావములు ఐదు. ఇచ్చట కొన్ని ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

మదము మూడువిధములు—తరుణమదము, మధ్యమదము, అవకృష్టమదము. విభావము లైదగుటచే దీని అభినయముకూడ ఐదు విధములుగా ఉండును—

మత్తులలో ఒకడు పాడును, ఒకడు ఏడ్చును, ఒకడు నవ్వును, ఒకడు పరుషముగా మాటాడును, ఒకడు నిద్రించును. (ఇవియే ఐదు విధములగు అభినయములును.)

ఉత్తమ ప్రకృతులు నిద్రింతురు; వీరిది తరుణ మదము. ఇట్టివారు నవ్వు మొగము, మధురరాగము, సంతోషము, కొంచెముగా తడబడు మాటలు, తొట్రుపాటుతో కూడిన సుకుమారగతి కలిగి ఉందురు. మధ్యమ ప్రకృతులు నవ్వుదురు, పాటలు పాడుచుందురు; వీరిది మధ్యమమదము. ఇట్టివారు తిరుగుడువడుచున్న గ్రుడ్లు, జారవిడిచిన బాహువులు, అస్థిమితములైన బాహు విక్షేపములు, నిలుకడలేని వక్రగతి కలిగి ఉందురు. అధమ ప్రకృతులు పరుషవాక్యములు పలుకుదురు, ఏడ్తురు; వీరిది అవకృష్టమదము. ఇట్టివారు స్మృతిలోపము, గతిభంగము, వాంతులు, ఎక్కిళ్ళు, దగ్గు, చాచబడిన మొద్దునాలుక, ఉమ్మి వేయుట అను వానితో కూడి ఉందురు.

రంగస్థలముమీద త్రాగుటను అభినయించునప్పుడు మదవృద్ధిని ప్రకటించవలెను. అదివరకే త్రాగి, పిమ్మట రంగస్థలమునందు ప్రవేశించునప్పుడు మదక్షయమును ప్రకటించవలెను. సంత్రాసము, శోకము, భయము, ప్రహర్షము మొదలగు కారణములున్నప్పుడు, మదము అతిశయముగా ఉన్నను, ప్రయత్నముతో దాని తగ్గుదలను క్రమముగా నిరూపించవలెను. అభ్యుదయమును గూర్చియు, సుఖమును గూర్చియు వార్త విన్నప్పుడు శోకముపోవునట్లే పై భావవిశేషములవలన మదము శీఘ్రముగా తొలగును.

6. శ్రమము— బహుదూరము ప్రయాణముచేయుట, వ్యాయామ మొనర్చుట మొదలగు విభావములవలన శ్రమము కలుగును. శరీరమును నొక్కుకొనుట, పిసుకుకొనుట, నిశ్శ్వసితము, ఆవులింత, నడవలేక నడవలేక నడచుట, నయన-వదనములను మూసికొనుట, సీత్కారము మొదలగు అనుభావములచే శ్రమమును అభినయించవలెను. ఈ సందర్భమున ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]

నృత్తము, ప్రయాణము, వ్యాయామము అనువానివలన శ్రమము కలుగును. నిశ్శ్వాస-ఖేదగమనములచే దానిని అభినయించవలెను.

7. ఆలస్యము— ఖేదము, వ్యాధి, గర్భము, స్వభావము, శ్రమము, సౌహిత్యము మొదలగు విభావములవలన ఆలస్యము స్త్రీ-నీచప్రకృతులయందు జనించును. ప్రపనియందును ఆసక్తిలేకపోవుట, శయనించుట, కూర్చుండుట, నిద్రించుట, తంద్రీసేవనము (సోమరిపోతుతనము) మొదలగు అనుభావములచే ఆలస్యమును అభినయించవలెను. ఈ సందర్భమున ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]



ఖేదము, స్వభావజము అనెడి రెండు విధములగు ఆలస్యములను ఆహారము తీసికొనుటతప్ప తక్కిన పనులన్నింటిని పరిత్యజించుటచే అభినయించవలెను.

8. దైన్యము— దుర్గతి, మనస్తాపము మొదలగు విభావములవలన దైన్యము జనించును. అధైర్యము, మాంద్యము, తలపోటు, అన్యమనస్కత, శుభ్రత లేకుండుట మొదలగు అనుభావములచే దైన్యమును అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]

చింత, ఔత్సుక్యము, దుఃఖము మొదలగువాని వలన పురుషులయందు దైన్యము జనించును. శుభ్రత లేకుండుట మొదలగు వివిధానుభావములచే దైన్యమును అభినయించవలెను.

9. చింత—ఐశ్వర్యముపోవుట, ఇష్టద్రవ్యము అపహరింపబడుట, దారిద్ర్యము మొదలగు విభావములవలన చింత జనించును. నిశ్శ్వసితము, ఉచ్ఛ్వసితము, సంతాపము, ధ్యానము, ముఖము వాల్చి ఆలోచించుట, శరీరము చిక్కిపోవుట మొదలగు అనుభావములచే చింతను అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు. [ఇంతవరకును గద్యము.]

ఐశ్వర్యభ్రంశము, ఇష్టద్రవ్యనాశము, హృదయవితర్కము అనువానివలన పురుషులయందు చింత అనేకప్రకారములుగా జనించును. ఉచ్ఛ్వసితము, నిశ్శ్వసితము, సంతాపము, శూన్యహృదయము, అధైర్యము, శుభ్రత లేకుండుట మొదలగు వానిచే చింతను అభినయించవలెను.

10. మోహము—దైవికముగా కాని లేదా వ్యసనమువలన కాని దెబ్బ తగులుట, వ్యాధి, భయము, ఆవేగము, పూర్వవైరమును స్మరించుట మొదలగు విభావముల వలన మోహము జనించును. నిశ్చైతన్యము, భ్రమణము, నేలమీద పడుట, తిరుగుడువడుట, చూడలేకపోవుట మొదలగు అనుభావములచే మోహమును అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకమును, ఒక ఆర్యయును కలవు. [ఇంతవరకును గద్యము.]

హఠాత్తుగా దొంగను చూచినప్పుడును, వివిధములైన త్రాసనములు కలిగినప్పుడును, ప్రతీకారము చేయలేకపోవుట వలనను పురుషునియందు మోహము జనించును.

వ్యసనమువలన కలిగిన దెబ్బ, భయము, పూర్వవైరస్మరణము, రోగము అను వాని వలన కలిగిన మోహమును అన్ని ఇంద్రియములను జడీభూతములను చేయుటచే అభినయించవలెను.

11. స్మృతి——పూర్వ మనుభవించిన సుఖ-దుఃఖ భావములు జ్ఞప్తికి వచ్చుట 'స్మృతి' అనబడును. ఆరోగ్యముగా ఉండుట, తెల్లవారుజామున మెలకువ వచ్చుట, సమానవస్తువును దర్శించుట, సమానవస్తువు ఉదాహరింపబడుట, చింతా-అభ్యాసములు మొదలగు విభావముల వలన స్మృతి కలుగును. శిరఃకంపనము, అవలోకనము, కనుబొమలు పైకిలేచుట మొదలగు అనుభావములచే స్మృతిని అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

ఎన్నడో మరచిపోయిన గత సుఖ-దుఃఖములను, జరిగినవానిని జరిగినట్లుగానే బుద్ధిలో భావించువాడు 'స్మృతిమంతు'డనబడును. ఆరోగ్యముగా ఉండుట, అభ్యాసము, వినుట, చూచుట అనువానివలన కలిగిన స్మృతిని తల పైకెత్తుట, తల ఆడించుట, కనుబొమలాడించుట మొదలగువానిచే అభినయించవలెను.*

12. ధృతి——శౌర్యము, విజ్ఞానము, చదువు, విభవము, శౌచము, ఆచారము, గురుభక్తి, అధిక మనోరథలాభము, అధిక అర్థలాభము, క్రీడ మొదలగు విభావముల వలన ధృతి జనించును. ప్రాప్తములైన విషయములను అనుభవించుట, లభింపని, అందని, చెడిపోయిన, నశించిన విషయములకై వగవకుండుట మొదలగు అనుభావములచే ధృతిని అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

విజ్ఞానము, శౌచము, విభవము, చదువు, శక్తి అనువానివలన ధృతి జనించును. భయ-శోక-విషాదరహితముగా దీనిని ఉత్తములు ప్రయోగించవలెను. ప్రాప్తములైన శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను అనుభవించుట, అప్రాప్తములైన వానికై శోకింపకుండుట 'ధృతి' అనబడును.

13. వ్రీడ——ఇది అకార్య కరణాత్మకము. అనగా పెద్దలమాట నెదిరించుట, పెద్దల నవమానించుట, తన ప్రతిజ్ఞను నిర్వహింపలేకపోవుట, పశ్చాత్తాపము మొదలగు విభావముల వలన వ్రీడ జనించును. ముఖము చూపలేకపోవుట, తలవంచి చింతించుట, నేలరాయుట, వస్త్రములను ఉంగరమును స్పృశించుచుండుట, గోళ్ళు గిల్లుకొనుట మొదలగు అనుభావములచే వ్రీడను అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

అకార్యమొనర్చుచుండగా పెద్దలైనవారు తన్ను చూచుటచే తాను చేసిన పనికి పశ్చాత్తాపమును చెందువాడు వ్రీడావంతుడని తెలియవలెను. అతడు లజ్జచే నిగూఢవదనుడై, భూమిని రాయుచు, వస్త్ర-అంగుళీయకములను స్పృశించుచు, గోళ్ళు గిల్లుకొనుచు ఉండును.

* [కాశీ-బొంబాయి-బరోడా ముద్రణములు మూడింటియందును 28-55 శ్లో.]



14. చపలత—— రాగ-ద్వేషములు, మాత్సర్యము, ఈర్ష్య, అమర్షము, ప్రతికూలత మొదలగు విభావములవలన చపలత జనించును. పరుషముగా మాటలాడుట, బెదరించుట, వధ, బంధము, కొట్టుట, తన్నుట మొదలగు అనుభావములచే చపలతను అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]

విమర్శింపకయే వధ, బంధనము మొదలగు అకార్యములను ఆరంభించువాడు అనాలోచితముగ పనులు చేయువాడగుటచే చపలుడనబడును.

15. హర్షము—— మనోరథలాభము, ఇష్టజనులతో కలయిక, మనస్సునకు సంతోషము, దేవతాప్రసాదము, గురువుల అనుగ్రహము, రాజానుగ్రహము, భర్తృప్రసాదము, భోజనలాభము, నూతనవస్త్రప్రాప్తి, ఉపభోగములు మొదలగు విభావములవలన హర్షము జనించును. నయనములును వదనములును ప్రసన్నముగా ఉండుట, ప్రియభాషణములు, ఆలింగనము, జలదరింపు, గగుర్పాటు, కన్నీరు, స్వేదము మొదలగు అనుభావములచే హర్షమును అభినయించవలెను ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

దుర్లభమైన వస్తువు లభించుట, అర్థలాభము, ప్రియసమాగమము, హృదయములోని కోరిక సిద్ధించుట అనువానివలన హర్షము జనించును. ప్రసన్నములైన నయన-వదనములు, ప్రియభాషణము, ఆలింగనము, రోమాంచము, లలితాంగ విహారములు, స్వేదము మొదలగువానిచే హర్షమును అభినయించవలెను.

16. ఆవేగము——ఉత్పాతము (అశుభసూచనములు), వాతము (పెనుగాలి), వర్షము, అగ్ని (అగ్నిప్రమాదము), కుంజరోద్భ్రమణము (ఏనుగు విశృంఖలముగా తిరుగుట), ప్రియవార్తాశ్రవణము, అప్రియవార్తాశ్రవణము, వ్యసనాభిఘాతము (ఆపద) మొదలగు విభావములవలన ఆవేగము జనించును.

ఉత్పాతకృతమైన ఆవేగము——అకస్మికముగా మెరపుకనిపించుట, ఉల్కలును పిడుగును పడుట, చంద్ర-సూర్య గ్రహణములు, తోకచుక్కలుకన్పించుట అనువానివలన ఉత్పాతకృతమైన ఆవేగము జనించును. దీనిని సర్వాంగశైథిల్యము, వైమనస్యము; ముఖము పాలిపోవుట, విషాదము, విస్మయము మొదలగువానిచే అభినయించవలెను.

వాతకృతమైన ఆవేగము——ముసుగు వేసికొనుట, కనులను నులుముట, ఎగిరిపోయెడి వస్త్రములను దగ్గరకు తీసికొనుట, త్వరితగమనము మొదలగువానిచే పెనుగాలివలన జనించిన ఆవేగమును అభినయించవలెను.

వర్షకృతమైన ఆవేగము— సర్వాంగములను పిండీకృతముచేయుట, పరుగెత్తుట, తలదాచుకొనుటకు చోటు వెదకుట మొదలగువానిచే వర్షకృతమైన ఆవేగమును అభినయించవలెను.

అగ్నికృతమైన ఆవేగము—పొగతోనిండిన కనులు, అంగములను ముడుచుకొనుట లేదా చలింపజేయుట, పెద్దపెద్ద అంగలువేయుట, తొలగిపోవుట మొదలగువానిచే అగ్నిప్రమాదమువలన జనించిన ఆవేగమును అభినయించవలెను.

కుంజరోద్భ్రమణకృతమైన ఆవేగము— వేగముగా తొలగుట, చంచలగమనము, భయము, వేపథువు, విస్మయము, వెనుకకు చూచుచుండుట మొదలగువానిచే ఏనుగు విశృంఖలముగా తిరుగుటవలన కలిగిన ఆవేగమును అభినయించవలెను.

ప్రియవార్తాశ్రవణకృతమైన ఆవేగము— వార్త తెచ్చినవానికి ఎదురేగుట, ఆలింగనము చేసికొనుట, వస్త్రాభరణములను కానుకగా ఇచ్చుట, అశ్రువు, పులకలు మొదలగువానిచే మంచివార్తను వినుటవలనకలిగిన ఆవేగమును అభినయించవలెను.

అప్రియవార్తాశ్రవణకృతమైన ఆవేగము—నేలమీదపడుట, తిరుగుడువడుట, పరుగెత్తుట, విలపించుట, ఆక్రందనముచేయుట మొదలగువానిచే చెడువార్త వినుటవలన కలిగిన ఆవేగమును అభినయించవలెను.

వ్యసనాభిఘాతజమైన ఆవేగము—ఆకస్మికముగాతొలగిపోవుట, శస్త్రమును డాలును కవచమును ధరించుట, గజ-రథ-తురగములను ఆరోహించుట, దెబ్బకొట్టుట, మొదలగువానిచే ఆపదవలన కలిగిన ఆవేగమును అభినయించవలెను. [ఇంతవరకును గద్యము.]

ఎనిమిది విధములగు ఈ ఆవేగము సంభ్రమాత్మకమైనది. ఉత్తమ-మధ్యమ ప్రకృతుల విషయమున స్థైర్యసహితముగాను, నీచప్రకృతుల విషయమున మరలిపోవుటచేతను ఈ ఆవేగములను అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు.

అప్రియనివేదనము, తిరస్కారపూర్వకమైన శత్రువాక్యమును ఆకస్మికముగా వినుట, శస్త్రాక్షేపము, త్రాసము అనువానివలన ఆవేగము జనించును. అప్రియనివేదనకృతమైన ఆవేగమందలి అనుభావములు విషాదముచే జనించినవి కావలయును. ఇంక ఆకస్మికముగా శత్రుదర్శనమైనప్పుడు జనించెడి ఆవేగమునందు ప్రహారణ-పరిఘట్టనాదులు అనుభావములగును.

17. జడత—ఏకార్యమును చేయకుండుట 'జడత' అనబడును. ఇష్టములైన వానినికాని అనిష్టములైనవానిని కాని చూచుటవలనను, వినుటవలనను, వ్యాధి మొదలగువాని వలనను జడత జనించును. బదులాడకుండుట, తడబాటుగా చెప్పుట, ఏమియు పాలుపోనట్లుండుట మిన్నకుండుట, రెప్పవాల్చక చూచుట, పరవశత్వము,



మొదలగు అనుభావములచే జడతను అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]

తన కిష్టమైనదానినికాని అనిష్టమైనదానినికాని, సుఖమునుకాని దుఃఖమును కాని గుర్తించలేక తూష్ణీంభావముతో పరవశుడై ఉండు పురుషుడు 'జడు'డనబడును.

18. గర్వము—ఐశ్వర్యము, కులము, రూపము, యౌవనము, విద్య, బలము, ధనలాభము మొదలగు విభావములవలన గర్వము జనించును. అసూయపడుట, అవమానించుట, ధిక్కరించుట, ఒళ్ళు విరుచుకొని తిరుగుట, ఎగతాళిగా నవ్వుట, పరుషముగా మాటాడుట, పెద్దలను లెక్కచేయకుండుట, ఆక్షేపించుట, సమాధాన మీయకపోవుట, మాటాడకుండుట, తన భుజములను చూచుకొనుచుండుట, మధ్యలో మాటను త్రుంచివేయుట మొదలగు అనుభాములచే గర్వమును అభినయించవలెను.

19. విషాదము— తలపెట్టిన కార్యమును పూర్తిచేయలేకపోవుట, దైవికమైన ఆపద మొదలగువానివలన విషాదము జనించును. సాహాయ్యమును అన్వేషించుట, ఉపాయమును చింతించుట, ఉత్సాహమునకు విఘాతముకలుగుట, వైమనస్యము, నిశ్శ్వాసము మొదలగు అనుభావములచే ఉత్తమ-మధ్యమ ప్రకృతులు విషాదమును అభినయించవలెను. పరుగెత్తికొనిపోవుట, దిక్కులుచూచుట, నోరెండిపోవుట, నాలుకతో పెదవులను తాకుచుండుట, నిద్ర, నిశ్శ్వాసము, ఆలోచన మొదలగు అనుభావములచే అధమప్రకృతులు విషాదమును అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్యయును, ఒక శ్లోకమును కలవు [ఇంతవరకును గద్యము.]

కార్యము సంపూర్ణము కాకపోవుట, దొంగతనము పట్టుబడుట, రాజదోషము, దైవకృతమైన అర్థవైపరీత్యము అనువానివలన విషాదము జనించును. వైమనస్యము, ఉపాయచింతనము, అనువానిచే ఉత్తమ-మధ్యమ ప్రకృతుల విషాదమును, నిద్రా-నిశ్శ్వాస-ధ్యానములచే అధమ ప్రకృతుల విషాదమును అభినయించవలెను.

20. ఔత్సుక్యము— ఇష్టజనవియోగమును స్మరించుట, ఉద్యానవనదర్శనము మొదలగు విభావములవలన ఔత్సుక్యము జనించును. దీర్ఘనిశ్శ్వాసము, తలవంచి ఆలోచించుట, నిద్ర, సోమరితనము, శయనాభిలాష మొదలగు అనుభావములచే ఔత్సుక్యమును అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]

ఇష్టజనవియోగము, దానిని స్మరించుట అనువానివలన ఔత్సుక్యము జనించును. చింత, నిద్ర, సోమరితనము, ఒడలు బరువెక్కుట అనువానిచే ఔత్సుక్యమును అభినయించవలెను.

21. నిద్ర— దుర్బలత్వము, శ్రమము, క్లేశము, మదము, ఆలస్యము, చింత, ఎక్కువగా భుజించుట, స్వభావము మొదలగు విభావములవలన నిద్ర కలుగును. తలబరువెక్కుట, శరీరము తిరుగుచుండుట, శరీరము జోగుచుండుట, కనులు మూతలుపడుచుండుట, ఒడలు విరుచుకొనుట, మాంద్యము, ఉచ్ఛ్వాసము, కనులు మూసికొనుట, గాత్రశైథిల్యము మొదలగు అనుభావములచే నిద్రను అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

ఆలస్యము, దుర్బలత్వము, క్లేశము, శ్రమము, చింతనము, స్వభావము, రాత్రి మేల్కొని ఉండుట అనువాని వలన నిద్ర కలుగును. ముఖము బరువెక్కుట, శరీరము తిరుగుచున్నట్లుండుట, కనులు మూతలుపడుట, జడత్వము, ఆవులింత, ఒడలు నొక్కుకొనుట మొదలగు అనుభావములచే నిద్రను అభినయించవలెను.

22. అపస్మారము— దేవ-యక్ష-నాగ-బ్రహ్మరాక్షస-భూత-ప్రేత-పిశాచములు ఆవేశించుట, అట్టిదానిని గూర్చి జ్ఞప్తికి తెచ్చుకొనుట, ఎంగిలి తినుట, శూన్యభవనమునందు నివసించుట, అశుచిత్వము, నిద్రా-భోజనాదులందు కాలనియమమును పాటించకపోవుట, ధాతువైషమ్యము (వాత-పిత్త-కఫములు సరిగా లేకుండుట), వ్యాధి మొదలగు విభావములవలన అపస్మారము కలుగును. అదరుట, నిశ్వాసము, వణకుట, పరుగెత్తుట, ఆకస్మికముగా పడిపోవుట, స్వేదము, స్తంభము, నురుగులు క్రక్కుట, నాలుకతో పెదవులను నాకుచుండుట మొదలగు అనుభావములచే అపస్మారమును అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు. [ఇంతవరకును గద్యము.]

భూత-పిశాచములు సోకుట, వానిని స్మరించుట, ఎంగిలి తినుట, శూన్యగృహనివాసము, కాలనియమమును పాటించకుండుట, అశుచిత్వము అనువానివలన అపస్మారము కలుగును. నిలుచున్న పాటున భూమిమీద పడుట, వణకుట, నురుగులు క్రక్కుట, తెలివిలేకుండగనే లేచిపోవుట అనునవి అపస్మార లక్షణములు.*

23. సుప్తము—నిద్రకు లోనగుట, ఇంద్రియవిషయములను అనుభవించుట, మోహము, నేలమీద శయనించుట, లాగబడుట మొదలగు విభావములవలన నిద్రాజన్యమైన సుప్తము జనించును. ఉచ్ఛ్వాస-నిశ్వాసములు, అంగశైథిల్యము, కనుల మూతలు, సర్వేంద్రియములు సమ్మోహము చెందుట, కలవరింతలు మొదలగు

*[కాశీ-బొంబాయి-బరోడా ముద్రణములు మూడింటియందును 56-74 శ్లో.]



అనుభావములచే సుప్తమును అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

నిద్రకు లోనగుట, ఇంద్రియసంతృప్తి, మోహము అనువానివలన సుప్తము కలుగును. కనులు మూసికొనుట, ఉచ్ఛ్వాస-నిశ్వాసములు, కలవరింతలు, ప్రలాపములు, నిశ్చేష్టత, సర్వేంద్రియ సంమోహము, స్వప్నము అనువానిచే సుప్తమును అభినయించవలెను.

24. విబోధము (ప్రబోధము) — తినినది అరిగిపోవుట, నిద్రాభంగము, స్వప్నము అంతమగుట, తీవ్రశబ్దశ్రవణము, తీవ్రస్పర్శము మొదలగువిభావములవలన విబోధము కలుగును. ఆవులింతలు, కనులు నులుముకొనుట, ప్రక్కనుండి లేచుట మొదలగు అనుభావములచే విబోధమును అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్య కలదు [ఇంతవరకును గద్యము.]

ఆహార విపరిణామము, శబ్ద-స్పర్శములు మొదలగువానివలన విబోధము కలుగును. అట్లు కలిగిన విబోధమును ఆవులింతలు, కనులు నులుముకొనుట, ముఖమును తుడుచుకొనుట అనువానిచే అభినయించవలెను.

25. అమర్షము—అధిక విద్యా-బల-ఐశ్వర్యయుతులైనవారిచే సభయందు అధిక్షేపింపబడుటవలన లేదా అవమానింపబడుటవలన అమర్షము జనించును. తల ఆడించుట, అధికముగా చెమర్చుట, తలవంచి ఆలోచించుట, ధ్యానము, పూనిక, ఉపాయాన్వేషణము, సహాయాన్వేషణము మొదలగుఅనుభావములచే అమర్షమును అభినయించవలెను. ఇచ్చట రెండు శ్లోకములు కలవు. [ఇంతవరకును గద్యము.]

విద్యా-శౌర్య-బలాధికులైనవారిచే సభామధ్యమందు అధిక్షేపము లేదా అవమానముపొందిన ఉత్సాహవంతునియందు అమర్షము జనించును. ఉత్సాహము, పట్టుదల, తలవంచి ఆలోచించుట, తల ఆడించుట, చెమర్చుట మొదలగువానిచే అమర్షమును అభినయించవలెను.

26. అవహిత్థము(అవహిత్థ)—ఆకారమును కప్పిపుచ్చుకొనుట అవహిత్థము. లజ్జ, భయము, అపజయము, గౌరవము, కుటిలత్వము మొదలగు విభావముల వలన అవహిత్థము జనించును. తాను చెప్పినమాటనే ఇంకొకవిధముగా సర్దిచెప్పుట, క్రిందిచూపులు చూచుట, చెప్పుచు మధ్యలో ఆపివేయుట, లేని ధైర్యమును చూపుట మొదలగు అనుభావములచే అవహిత్థమును అభినయించవలెను. ఇచ్చట ఒకశ్లోకము కలదు [ఇంతవరకును గద్యము.]

ధార్ష్ట్యము, కౌటిల్యము అనువానివలన జనించిన భయాత్మకమగు అవహిత్థమును లెక్కచేయకుండుట, సరిగా సమాధానమీయకుండుట, అధికముగా మాటాడకుండుట అనువానిచే అభినయించవలెను.

27. ఉగ్రత—దొంగతనము పట్టుబడుట, రాజునెడ అపరాధ మొనర్చుట. అసత్ప్రలాపము మొదలగు విభావములవలన ఉగ్రత జనించును. వధ, బంధనము, తాడనము, నిర్భర్త్సనము మొదలగు అనుభావములచే ఉగ్రతను అభినయించవలెను. ఇచ్చట ఒక ఆర్య కలదు. [ఇంతవరకును గద్యము.]

దొంగతనము పట్టుబడుట, నృపాపరాధము అనువానివలన ఉగ్రత జనించును. వధ-బంధన-తాడనములు మొదలగు అనుభావములచే ఉగ్రతను అభినయించవలెను.

28. మతి—నానాశాస్త్రార్థ విచింతనము, ఊహా-అపోహములు మొదలగు విభావములవలన మతి జనించును. శిష్యోపదేశము, అర్థమును వాఖ్యానించుట, సంశయమును పోగొట్టుట, మొదలగు అనుభావములచే మతిని అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము.]

నానాశాస్త్రార్థబోధముచే మతికలుగును. దానిని శిష్యోపదేశము, అర్థవివరణము మొదలగువానిచే అభినయించవలెను.

29. వ్యాధి—వాత-పిత్త-కఫ-సన్నిపాతములవలన వ్యాధి జనించును. ఇందలి విశేషములు జ్వరాదులు. జ్వరము రెండు విధములు- 1. సశీతము (చలి జ్వరము); 2. సదాహము (తాపముతో కూడిన జ్వరము).

వణకుట, శరీరమంతయును కంపించుట, ముడుచుకొనుట, నిప్పు కాచుకొనవలెనను కోరిక, గగుర్పాటు, దవడలను ఆడించుట, ఎగబీల్చుట, నోరెండిపోవుట, మూలుగుట మొదలగు అనుభావములచే శీతజ్వరమును అభినయించవలెను.

అంగ - కర - చరణ విక్షేపము, భూమి మీద పడుకొనవలెనని ఉండుట, గంధపుపూతలు మొదలగువానిని కోరుట, చల్లదనమును ఇచ్చగించుట, ఆయాసపడుట, నోరెండిపోవుట, బిగ్గరగా అరచుట మొదలగు అనుభావములచే దాహజ్వరమును అభినయించవలెను.

మొగము ముడుచుకొనుట, ఒడలు కొయ్యబారుట, నిశ్శ్వాసము, మూలుగుట, బిగ్గరగా అరచుట, వణకుట మొదలగు అనుభావములచే తక్కిన వ్యాధులను అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకము కలదు. [ఇంతవరకును గద్యము]

మొత్తము మీద వ్యాధులన్నింటిని గాత్రశైథిల్యము, చేతులను కాళ్ళను కొట్టుకొనుట, ముఖమును ముడుచుకొనుట అనువానిచే అభినయించవలెను. (అనగా ఇవి ప్రధానములని అర్థము)



30. ఉన్మాదము - ఇష్టజన వియోగము, విభవనాశము, పెద్ద దెబ్బ, వాత-పిత్త-శ్లేష్మ ప్రకోపము మొదలగు విభావములవలన ఉన్మాదము జనించును. నవ్వుట, ఏడ్చుట, బిగ్గరగా అరచుట, అసంబద్ధముగా ప్రలాపించుట, శయనించుట, కూర్చుండుట, లేచుట, పరుగెత్తుట, నృత్తమొనర్చుట, పాడుట, పఠించుట అనువాని నెల్ల కారణము లేకయే చేయుట; బూడిదను, దుమ్మును శరీరమునందు చల్లుకొనుట; గడ్డిని, పారవేసిన దండలను, కుళ్ళు గుడ్డలను, చింకిగుడ్డలను, కుండపెంకులను, పుత్తెలను, మూకుళ్ళను ఆభరణములుగా ధరించుట, ఆనందించుట; అనేక విధములైన వెకిలిచేష్టలను చేయుట; ఇతరులను వెక్కిరించుట మొదలగు అనుభావములచే ఉన్మాదమును అభినయించవలెను. ఇచ్చట రెండు ఆర్యలు కలవు [ఇంతవరకును గద్యము.]

ఇష్టజన నాశము, విభవనాశము, పెద్ద దెబ్బ, వాత-పిత్త-కఫ ప్రకోపము, వివిధ చిత్తవికారములు అనువానివలన ఉన్మాదము జనించును. కారణములేకయే ఏడ్చుట, నవ్వుట, కూర్చుండుట, పాడుట, పరుగెత్తుట, ఆక్రోశించుట మొదలగు వికృతచేష్టలచే ఉన్మాదమును అభినయించవలెను.

31. మరణము[19]— మరణము రెండు విధములు- (1) వ్యాధిజము (వ్యాధివలన కలుగునవి); (2) అభిఘాతజము (గాయములు మొదలగువానివలన కలుగునవి).

ఆంత్రము (liver), యకృత్తు (spleen), శూల, వాత-పిత్త-కఫములు అనువాని వైషమ్యములవలనను, గండము (వ్రణము), పిటకము (పుండు), జ్వరము, విషూచి మొదలగువానివలనను సంభవించు మరణము వ్యాధిజము.

---

19. భారతీయాలంకారికులు రూపకమునందు మరణమును పూర్తిగా నిషేధించిరను భావము మనలో వ్యాప్తమై ఉన్నది. అది సరికాదు. భారతీయాలంకారికులు, ముఖ్యముగా భరతుడు, మరణమును నిషేధించలేదనుట స్పష్టము. ఉగ్రత, చపలత మొదలగువానిలో కూడ వధ చెప్పబడినది. ప్రథమాధ్యాయమందు నాట్య స్వరూపమును వివరించునప్పుడు "క్వచిత్ వధః" అని కూడ పేర్కొనబడినది. ఇంక రంగముమీద వధను ప్రత్యక్షముగా చూపకూడదనుటకు ముఖ్యకారణము అది జుగుప్సావహమును, ప్రదర్శనవిషయమున సౌలభ్యరహితమును అగుటయే. సంస్కృతరూపకములందు ప్రతినాయకుల మరణములు వర్ణితములగుచునే ఉండును. కాని, నాయకమరణము కలవి (పాశ్చాత్యుల విషాదరూపకముల వంటివి) మనకు లేకపోవుటకు కారణము భారతీయ విశిష్ట దృక్పథమే కాని వేరుకాదు. వివరములకు ఈ అధ్యాయాంతమందలి 6 వ విశేషాంశమును చూడవలెను.

శస్త్రము, పాముకాటు, విషము, క్రూరమృగములు అనువానివలనను ; ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పశువులు మొదలగు వాహనములనుండి క్రింద పడుట వలనను కలుగు మరణము అభిఘాతజ మనబడును.

వీని అభినయవిశేషముల నింక వివరింతును—(1) వ్యాధిజమైన మరణము- గాత్రము విషణ్ణమగుట, అంగవిచేష్టితము లధికముగా లేకుండుట, కనులు మూతలు పడుట, ఎక్కిళ్ళు, శ్వాసబరువుగావచ్చుట, పరిజనులను చూడకపోవుట, గొణుగుట, మాట సరిగా లేకపోట మొదలగు అనుభావములచే వ్యాధిజమైన మరణమును అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకము కలదు [ఇంతవరకును గద్యము.]

వ్యాధిజములైన మరణము లన్నింటియందును అభినయము ఒకే రకముగా ఉండును. ఈ మరణములను గాత్రవిషణ్ణత, అంగవిచేష్టితము లధికముగా లేకుండుట అనువానిచే అభినయించవలెను.

(2) అభిఘాతజమైనమరణము- ఇందలి అభినయవిశేషములు అనేక ప్రకారములుగా ఉండును- శస్త్రక్షతము, పాముకాటు, విషపానము, గజాదుల నుండి పడుట, శ్వాపదములు (క్రూరమృగములు) అనువానిచే మరణము సంభ వించినప్పుడు క్రిందివిధముగా అభినయించవలెను—

శస్త్రక్షతమువలన కలుగు మరణమును ఆకస్మికముగా నేలమీదపడిపోవుట, వేపనము (వణకు), స్ఫురణము (అదరుట) మున్నగు వానిచే అభినయించవలెను.

పాము కరచుటచే లేదా విషపానముచే కలిగిన విషవేగమునందు కార్శ్య-వేపథు-విదాహ-హిక్కా-ఫేన-స్కంధభంగ-జడతా-మరణములనెడి ఎనిమిది అవస్థ లను అభినయించవలెను. ఇచ్చట రెండు శ్లోకములు కలవు. [ఇంతవరకును గద్యము]

ప్రథమ వేగమునందు కార్శ్యము (చిక్కిపోవుట), ద్వితీయ వేగమునందు వేపథువు (వణకు), తృతీయ వేగమునందు దాహము (మంట), చతుర్థ వేగము నందు హిక్క (ఎక్కిళ్ళు), పంచమ వేగమునందు ఫేనము (నురుగులు), షష్ఠ వేగమునందు స్కంధభంగము (మెడ వ్రాలిపోవుట), సప్తమ వేగమునందు జడత (నిశ్చైతన్యము), అష్టమ వేగమునందు మరణము కలుగును.

ఇచ్చట రెండు ఆర్యలు కూడ కలవు. [ఇది గద్యము.] శ్వాపదములచే, గజ-తురగాది యానములనుండి పడుటచే కలిగెడు మరణమును శస్త్రక్షతమువలన కలిగెడి మరణమునందువలెనే అంగశైథిల్యము మొదలగు వానిచే అభినయించవలెను.



ఇట్లు నానావిధములగు అవస్థలతో కూడుకొనిన మరణములను తదుచితము లైన భావములచే, అంగచేష్టితములచే నిరూపించవలెను.

32. త్రాసము — విద్యుత్తు, ఉల్కలు, అశనిపాతము (పిడుగుపాటు), భూకంపము, మేఘములు, పెద్ద జంతువులు, పశువుల అరపులు మొదలగు విభావ ముల వలన త్రాసము జనించును. అంగములను ముడుచుకొనుట, కంపనము, వేప థువు, స్తంభము, రోమాంచము, గాద్గద్యము, ప్రలాపము మొదలగు అనుభావ ములచే త్రాసమును అభినయించవలెను. ఇచ్చట ఒక శ్లోకముకలదు. [ఇంతవరకును గద్యము.]

మహాభయంకరనాదము మొదలగువానివలన త్రాసము కలుగును. అంగ శైథిల్యముచే, అక్షినిమీలనముచే త్రాసమును అభినయించవలెను.

33. వితర్కము—సందేహము, విమర్శ, విప్రతిపత్తి (అన్యథాభావము) మొదలగు విభావములవలన వితర్కము జనించును. వివిధ విచారములు, ప్రశ్న, సంప్రధారణము (నిర్ణయము), రహస్యమును కప్పిపుచ్చుట మొదలగు అభినయము లచే వితర్కమును అభినయించవలెను. ఇచ్చట ఒకశ్లోకము కలదు [ఇంతవరకును గద్యము.]

విచారణాదుల వలన జనించు సందేహాతిశయాత్మకమగు వితర్కము తల ఆడించుటచే, కనుబొమలను ఎగురవేయుటచే అభినయింపబడవలెను.

ముప్పదిమూడు వ్యభిచారిభావములను పైన వివరించితిని. ఆత్మగత-పర గత-మధ్యస్థములైన ఈ వ్యభిచారిభావములు ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులైన స్త్రీ-పురుషులచే ఆయా రూపకములందు దేశ-కాల-అవస్థానురూపముగా ప్రయో గానుసారముగా అభినయింపబడవలెను.* [ఇది గద్యము]

## సాత్త్వికభావములు

ఇంక సాత్త్విక భావములను వరుసగా వివరింతును.

*ప్రశ్న* : వీనికి 'సాత్త్విక భావము'లను పేరు వచ్చుటకు కారణము ఇతర భావములు సత్త్వరహితము లగుటయే అగునా ?

సమా : అవును. *ప్రశ్న* : ఎట్లు ?

సమా : మనస్సునుండి పుట్టినది "సత్త్వము" అనబడును; ఇది సమాహితమైన (సమాధిగల) మనస్సునుండి ఉత్పన్నమగును. అనగా మనస్సుయొక్క సమాధ్యవస్థ

*[కాశీ ముద్రణమునందు 75-92 శ్లో., బొంబాయి - బరోడా ముద్రణములందు 75-93 శ్లో.]

యందు సత్త్వము నిష్పన్నమగును.[20] నాట్యమందు రత్యాది భావానుగుణముగ జనించెడి రోమాంచ-అశ్రు-వైవర్ణ్యాదులు సత్త్వస్వభావములు. వీనిని అన్యమనస్కుడు (మనస్సమాధి లేదా ఏకాగ్రత లేనివాడు) అభినయించలేడు. లోకమందు రోమాంచాదులు అనుభవసిద్ధములే. నాట్యము లోక స్వభావానుకరణమే అగుటవలన నాట్యమునందును ఇవి ఉండును. నాట్యమందు వీనిని అభినయించవలె నన్నచో సత్త్వము ఆవశ్యకమగుచున్నది.

ప్రశ్న : ఇందులకు దృష్టాంతమేమి ?

సమా: నాట్యధర్మి ననుసరించి ప్రదర్శింపబడెడి సుఖ-దుఃఖకృత భావములు సత్త్వవిశుద్ధములైనప్పుడే లోకమునందలి సుఖ-దుఃఖకృత భావములతో సమానములు కాగలవు (అనగా స్వభావసిద్ధములుగా కన్పట్టగలవు). రోదనాత్మకమైన దుఃఖము అదుఃఖితుడైన నటునిచేతను ప్రహర్షాత్మకమైన సుఖము అసుఖితుడైన నటునిచేతను ఎట్లు అభినయింపబడగలవు ?[21] నటుడు నిజముగా దుఃఖితుడు కాకపోయినను, సుఖితుడు కాకపోయినను దేని సాహాయ్యముచే అశ్రు-రోమాంచములను (దుఃఖమును-సుఖమును) ప్రదర్శింపగలడో అదియే సత్త్వ మని తెలియవలెను. ఆ కారణముచేతనే వీనికి సాత్త్వికభావము లను పేరు కలిగినది. [ఇంతవరకును గద్యము.]

ఇట్టి సాత్త్వికభావము లెనిమిది—స్తంభ-స్వేద-రోమాంచ-స్వరభేద-వేపథు-వైవర్ణ్య-అశ్రు-ప్రలయములు. వీనిని రస-భావ-అనుభావకముగా వివరింతును—

1. స్వేదము—క్రోధము, భయము, హర్షము, లజ్జ, దుఃఖము, శ్రమము, రోగము, తాపము, ఘాతము, వ్యాయామము, క్లమము (ప్రాణము చాలివచ్చుట),

20. సత్త్వ మనునది మనఃప్రభవమైన ఒక విశేషస్థితి. "పరగత సుఖ-దుఃఖ భావనచే భావితమైన అంతఃకరణము సత్త్వ మనబడును" అని ధనిక-విద్యానాథాదులు సత్త్వమును నిర్వచించి ఉన్నారు.

అంగజములు, స్వభావజములు అని 22 వ అధ్యాయమందు చెప్పబడు స్త్రీల అలంకారములును, సాత్త్విక భావములును, అట్లే ఇతరములగు చేష్టలును అనుభావ స్వరూపములే. కాని వానిలోగల ఆయా భేదములను బట్టి అవి వేర్వేరుగా గణింపబడినవి.

21. దుఃఖమును అభినయించుటకు నిజముగా దుఃఖించుచున్న నటుడును, సుఖమును అభినయించుటకు నిజముగా సుఖించుచున్న నటుడును లభించుట అసంభవము. కాన నటుడు తాను నిజముగా సుఖితుడు కాకపోయినను లేదా దుఃఖితుడు కాకపోయినను సుఖమును లేదా దుఃఖమును అభినయించుచునే ఉన్నాడు. అట్టి అభినయమును ఆతడు చేయగలుగుట సత్త్వప్రభావము చేతనే. అనగా అదుఃఖితుడైన నటుడు దుఃఖితుడై అశ్రువును, అసుఖితుడైన నటుడు సుఖితుడై రోమాంచమును అభినయించుటకు సాహాయ్యపడునది 'సత్త్వ' మని సారాంశము.



ఘర్మము (వేసవి), సంపీడనము అనువానివలన స్వేదము జనించును. విసనకఱ్ఱతో విసరుకొనుట, చెమట తుడుచుకొనుట, గాలిని కోరుట మొదలగు వానిచే స్వేదమును అభినయించవలెను.

2. స్తంభము—హర్షము, భయము, రోగము, శోకము, విస్మయము, విషాదము మొదలగువానివలన స్తంభము సంభవించును. తెలివి లేకపోవుట, చలనము లేకపోవుట, జడునివలె ఉండుట, శూన్యముగా ఉండుట, అంగశైథిల్యము అనువానిచే స్తంభమును అభినయించవలెను.

3. కంపము(=వేపథువు)—శీతము, భయము, హర్షము, రోషము, స్పర్శము, ముసలితనము, రోగము అనువానివలన కంపము పుట్టును. వేపనము, స్ఫురణము, కంపనము అనువానిచే వేపథువును (కంపమును) అభినయించవలెను.

4. అశ్రువు (=అస్రము)—ఆనందము, అమర్షము, ధూమము (పొగ), అంజనము (కాటుక), ఆవులింత, భయము, శోకము, రెప్పవాల్చక చూచుట, చలి, రోగము అనువానివలన అశ్రువు కలుగును. బాష్పాంబువులతో నిండిన కనులు, కళ్లు తుడుచుకొనుట, మాటిమాటికి కన్నీటిబిందువులు పడుచుండుట అనువానిచే అస్రమును (అశ్రువును) అభినయించవలెను.

5. వైవర్ణ్యము—చలి, క్రోధము, భయము, శ్రమము, రోగము, క్లమము, తాపము అనువానివలన వైవర్ణ్యము సంభవించును. కష్టసాధ్యమైన దీని అభినయమును నరములను బిగబట్టి ప్రయత్నపూర్వకముగా ముఖవర్ణమునందు మార్పు తెచ్చుటచే సాధించవలెను.

6. రోమాంచము—స్పర్శము, భయము, శీతము, హర్షము, క్రోధము, రోగము అనువానివలన రోమాంచము కలుగును. మాటిమాటికిని పులకలు కలుగుట, ఉల్లుకసనము (వెండ్రుకలు నిక్కపొడుచుకొనుట), శరీరమును స్పృశించుకొనుచుండుట అను వానిచే రోమాంచమును అభినయించవలెను.

7. స్వరభేదము (=స్వరభంగము=వైస్వర్యము =గాద్గద్యము)—భయము, హర్షము, క్రోధము, ముసలితనము, తీవ్రత, రోగము, మదము అనువానివలన స్వరభేదము కలుగును. భిన్నస్వన - గద్గదస్వనములచే స్వరభేదమును అభినయించవలెను.

8. ప్రళయము — శ్రమము, మూర్ఛ, మదము, నిద్ర, అభిఘాతము, మోహము మొదలగు వానివలన ప్రళయము జనించును. చేష్టలు లేకుండుట, చలనము లేకుండుట, నిశ్వాసము అవ్యక్తమగుట, నేలమీద పడుట అనువానిచే ప్రళయమును అభినయించవలెను.

## ఆయా రసములందు ప్రయోగింపదగు భావములు

మూడు అవస్థలుగా ఉన్న నలుబది తొమ్మిది భావములను పైన వివరించి ఉన్నాను. ఇంక ఏరసమందు ఏయే భావములు ప్రయోగింపదగినవో వివరింతును. (ఇచ్చట స్థాయి-వ్యభిచారి-సాత్త్వికములు కలిపి వివరింపబడినవి.)

1. శృంగారమునందు ప్రయోగింపదగు భావములు—ఆలస్యము, ఉగ్రత, జుగుప్స అను మూడు భావములును తప్ప తక్కిన నలుబది ఆరు భావములను ప్రయోగింపదగును.[22]

2. హాస్యమునందు— గ్లాని, శంక, అసూయ, శ్రమము, చపలత, సుప్తము, నిద్ర, అవహిత్థము అనెడి భావములను ప్రయోగించవలెను.

3. కరుణమునందు— నిర్వేదము, చింత, దైన్యము, గ్లాని, అస్రము, జడత, మరణము, వ్యాధి అనెడి భావములను ప్రయోగించవలెను.

4. రౌద్రమునందు— గర్వము, అసూయ, మదము, ఉత్సాహము, ఆవేగము, అమర్షము, క్రోధము, చపలత, ఔగ్ర్యము (ఉగ్రత) అనెడి భావములను ప్రయోగించవలెను.

5. వీరమునందు— అసంమోహము, ఉత్సాహము, ఆవేగము, హర్షము, మతి, ఉగ్రత, అమర్షము, మదము, రోమాంచము, స్వరభేదము, క్రోధము, అసూయ, ధృతి, గర్వము, వితర్కము అనెడి భావములను ప్రయోగించవలెను.

6. భయానకమునందు— స్వేదము, వేపథువు, రోమాంచము, గాద్గద్యము, త్రాసము, మరణము, వైవర్ణ్యము అనెడి భావములను ప్రయోగించవలెను.

7. బీభత్సమునందు— అపస్మారము, ఉన్మాదము, విషాదము, మదము, మృత్యువు, వ్యాధి, భయము అనెడి భావములను ప్రయోగించవలెను.

8. అద్భుతమునందు— స్తంభము, స్వేదము, రోమాంచము, విస్మయము, ఆవేగము, జడత, మూర్ఛ, హర్షము, మోహము అనెడి భావములను ప్రయోగించవలెను.

నానాభినయ సంశ్రితములైన సర్వ సాత్త్వికభావములును రసములందు పైన వివరించిన విధముగా ఉండునని తెలియవలెను.

---

22. "ఈ భావములే యథావసరముగా స్థాయి-సంచారి-సాత్త్వికములై శృంగార రసమును ఉద్దీపింపజేయును"—అని ఒక వ్రాతప్రతియం దిచ్చట అధికపాఠము కలదట.



## అంగి-అంగరస వివేచనము[23]

నహ్యేకరసజం కావ్యం కించిదస్తి ప్రయోగతః।
భావో వాపి రసో వాపి ప్రవృత్తి ర్వృత్తి రేవచ॥ 119

బహూనాం (సర్వేషాం) సమవేతానాం రూపం యస్య భవేద్బహు।
స మంతవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణో మతాః॥

దీపయంతః ప్రవర్తంతే యే పునః స్థాయినం రసమ్।
తేతు సంచారిణో జ్ఞేయా స్తేహి స్థాయిత్వమాగతాః॥

—ప్రయోగమును బట్టి చూచినచో ఏకరసజమైన కావ్యము ఉండదు. అనగా ప్రయోగమునందు, ఆదినుండి అంతమువరకును, ఏదో ఒకరసముమాత్రమే ఉండదు. ఒక రసము ప్రధానమైనచో మరికొన్ని రసములు దానికి అంగములుగా ఉండును. అట్లే కావ్యమునందు ఒకే భావము, లేదా ఒకే రసము లేదా ఒకే వృత్తి, లేదా ఒకే ప్రవృత్తి ఉండదని తెలియవలెను. ఒకే కావ్యమునందు కూడిఉన్న అనేక రసములలో ఏ రసముయొక్క రూపము అధికముగా ఉండునో ఆ రసము 'స్థాయి రసము' (ప్రధానరసము లేదా అంగిరసము) అగును. తక్కిన రసములు 'సంచారి రసములు' (అప్రధానరసములు లేదా అంగరసములు) అగును. అనగా అవియును స్థాయిరస తుల్యములే అయినను అసలు స్థాయిరసమును దీపింపజేయుచు ప్రవర్తించునుగాన సంచారిరసములనియే అనబడును.

విభావ-అనుభావయుతమును, అంగవస్తు సమాశ్రయమును (ప్రాసంగికేతి వృత్తమునకుకూడ ఆశ్రయమైనదియును), సంచారిసంయుక్తమును అగు స్థాయియే

---

23. అంగిరస-అంగరస వివేచనమును కాని, విరోధి రసవివేచనమును కాని భరతుడు ప్రత్యేకముగా 'పేరుపెట్టి' చేయలేదు (ఈ వివేచనమును నిశితముగా చేసిన ప్రథముడు ఆనందవర్ధనుడే).

పై శ్లోకములలో మొదటి శ్లోకముకాక తక్కిన రెండు శ్లోకములును, వానితరువాత ఉన్న మరి నాలుగు శ్లోకములును కొన్ని వ్రాతప్రతులలో లేవట. అందుచే ఇవి ప్రక్షిప్తములుగా తలంపబడినవి. పై వానిలో మొదటి శ్లోకమందలి రెండవ పాదమును, రెండవ శ్లోకమునుకలిపి సింగభూపాలుడు రసార్ణవసుధాకరమందు ఉదాహరించియుండెను [శ్రీ బులుసు వారి అనువాదము-పుట 262]. పై శ్లోకములు రెండును 20 వ అధ్యాయాంతమందు మరల కుండలీకరణములందే కలవు.

ఈ శ్లోకముల భావము కొంత క్లిష్టముగా ఉన్నది. ఈ భాగమునకు అభినవభారతియే లేదుకదా. ఇంక శ్రీ మాధవశర్మగారి అనువాదమును, డా. ఘోష్ ఆంగ్లానువాదమును కూడ ఉపకరించలేదు. ధ్వన్యాలోక-లోచనములందలి అంగిరస-అంగరస వివేచనమునుబట్టి పై విధముగా భావన చేసితిని. ఇందలి ఔచిత్యమునకు సహృదయులే ప్రమాణము.

రసముగా భాసించుచున్నది. స్థాయిభావముకూడ మొదట సంచారిభావాకారముగానే ఉండునుకాన ప్రయోక్తలు దానిని సత్త్వాతిరేకముగా ప్రయోగించవలెను.

నానాభినయములచే ప్రయోగింపబడు పై సాత్త్వికభావములన్నియును అన్ని రసములందును కూర్పదగినవే.

ఒకే రసము, లేదా ఒకే భావము, లేదా ఒకే వృత్తి కలిగిన కావ్యము ఉండనేరదు. అనేక భావములను, రసములను, వృత్తులను, ప్రవృత్తులను ప్రయత్న పూర్వకముగా సమర్థతతో కావ్యమునందు సంయోజనముచేసినచో అది తప్పక రాగరంజితము కాగలదు.

నానాభావార్థసంపన్నములైన స్థాయి-సాత్త్విక-వ్యభిచారి భావములతో కూడిన రసములు పుష్పములవలె,[24] సుకుమారముగా, కావ్యమునం దంతటను వ్యాపించవలెను.

నాటకమందు రస-భావముల వ్యవస్థ పై విధముగా ఉండును. ఈవ్యవస్థను ఎరిగినవారు నాట్యప్రయోగమందు ఉత్తమ సిద్ధిని పొందుదురు.*

సప్తమాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

### 1. రస - భావాధ్యాయములు

అర్వాచీనాలంకారికులందరును విభావ - అనుభావ- స్థాయిభావ - సాత్త్వికభావ-వ్యభిచారి భావములను శృంగారపరముగా మాత్రమే వ్యాఖ్యానించి, తక్కిన రసముల విషయమున వీని స్వరూపమును ఊహించుకొనవలెనని చెప్పి విరమించుచుందురని తెలిపి ఉన్నాను. భరతు డట్టిప్రత్యేకత చూపలేదు; భావములన్నింటిని సర్వరససామాన్యముగానే నిర్వచించెను. మరియు, అర్వాచీనాలంకారికులవలె లక్షణములకు లక్ష్యములుగా ఉదాహరణ శ్లోకములను ఒసంగలేదు. అర్వాచీనాలంకారికులు రస-భావములను ఒకే అధ్యాయమందు కలిపి వివరించుచుండగా భరతుడు వానిని వేర్వేరు అధ్యాయములందు విపులముగా వివరించెను. అర్వాచీనాలంకారికులవలె భరతుడు విభావమందు ఆలంబన-ఉద్దీపన భేదములను చెప్పలేదు. అట్టి విభజనమును అభినవగుప్తుడు కాల్పనికమని త్రోసిపుచ్చెను.

### 2. స్థాయిభావము : స్థాయిత్వ-వ్యభిచారిత్వములు

ఈ అధ్యాయమందు వ్యభిచారిభావములుగా ఉండెడి స్థాయిభావములకే లక్షణములు చెప్పబడినవనియు, రసములుగా అభివ్యక్తములయ్యెడి స్థాయిభావముల లక్షణములు రసముల లక్షణములందే గతార్థములైనవనియు మహిమభట్టు 'వ్యక్తివివేక' మందు వ్యాఖ్యానించెను. వాని అభిప్రాయ మీ క్రిందివిధముగా ఉన్నది—

స్థాయిభావానుకరణములే రసములు. అవియే ప్రధానములు. వాని రెండింటికిని బింబ-ప్రతిబింబ భావముండుటచే రసస్వరూపమును వర్ణించినచో స్థాయి భావరూపమును వర్ణించినట్లే అగును. రసలక్షణము 6 వ అధ్యాయమందే వర్ణితమైనది. దానివలన స్థాయి భావలక్షణము గతార్థమే అగుచున్నది. అందుచే స్థాయిభావములను ప్రత్యేకముగా వివరించవలసిన అవసరము లేకపోయినది. కావున వ్యభిచారి భావములుగా ఉండెడి స్థాయిభావములకే 7 వ అధ్యాయమందు లక్షణము చెప్పబడినది. (వివరములకు శ్రీభాగవతులకు టుంబరాయ శాస్త్రిగారి వ్యక్తివివేకానువాదమును చూడవలెను-ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.)

స్థాయిత్వము లేదా స్థిరముగాఉండుట అను ధర్మము స్థాయిభావములందే ఉండును. అట్లే వ్యభిచారిత్వమనెడి ధర్మము వ్యభిచారి భావములందును, సాత్త్వికత్వ మనెడి ధర్మము సాత్త్విక భావములందును మాత్రమే ఉండును. కాని వీనిలో స్థాయిభావములకు మాత్రము స్థాయిత్వమేకాక వ్యభిచారిత్వముకూడ ఉన్నది. అందుచే అవి స్థాయిభావములును, వ్యభిచారిభావములునుకూడ అగుచున్నవి. కావుననే స్థాయిభావములగు హాసము శృంగారమునకును, శోకము విప్రలంభమునకును వ్యభిచారి భావములుగ మారినవి. వ్యభిచారి-సాత్త్విక భావములు మాత్రమెన్నడును ఇట్లు మారవు.

సారాంశ మేమనగా రత్యాద్యష్ట భావములకును స్థాయిత్వమే కాక వ్యభిచారిత్వము కూడ కలదు. నిర్వేదాది వ్యభిచారిభావములకు వ్యభిచారిత్వమేకాని స్థాయిత్వము ఉండదు; సాత్త్విక భావములకును ఇట్లే.

### 3. హాస్యము

శృంగారరసమునుండి హాస్యము జనించునట్లు భరతుడు పేర్కొనెను. తక్కిన ఆలంకారికు లందరును దీనినే అనువదించిరి. ఇది ఒకరకము మాత్రమే. నాటకములందలి విదూషక హాస్యము ఈ రకమునకు చెందినది. ఇంకను హాస్యవిధము లనేకములు కలవు. వానినెల్ల భరతుడు ప్రత్యేకించి వివరించలేదు. అందుచే "హాస్య విషయమున మన ప్రాచీనుల

---

24. "పుష్పావకీర్ణాః కర్తవ్యాః" అని మూలము. కాని "పుంసావకీర్ణాః" అని కాశీ ముద్రణపాఠము. రూపకమునందు పురుషపాత్రలకే ప్రాధాన్య మీయవలెననియు, వారే రస-భావములను చక్కగా నిరూపింప గలరనియు కాశీ ముద్రణ పాఠభావమై ఉండును. ప్రాచీన సంస్కృత రూపకములన్నియు ఈ భావమునకు బలము నొసంగుచున్నవి. డా. ఘోష్ ఈ పాఠనునే గ్రహించెను. అయినను నాట్యశాస్త్రమునకు ఈ భావము విరుద్ధమని నేను భావించుచున్నాను. ఇందు స్త్రీ-పురుష పాత్రలకు సమప్రాధాన్యము కలదని ముందుముందు స్పష్టముగా తెలియగలదు.

* [కాశీముద్రణమునందు 93-124 శ్లో., బొంబాయిముద్రణమునందు 94-130 శ్లో., బరోడాముద్రణమునందు 94-121 శ్లో.]

దృష్టి అంధమనియే చెప్పవలె" ననెడి విమర్శలు బయలుదేరినవి. కాని, ఇట్టి విమర్శలు సమంజసములు కావు. నాట్యశాస్త్రమందు హాస్యము మొదలగునవన్నియును 'నటదృష్టి'తో వివరింపబడినవనెడి సత్యమును మరవరాదు. అనగా హాస్యాభినయము మాత్రమే ఇందు వివరింపబడినదని తెలియవలెను.

Bergson వ్రాసిన "Laughter" వంటి ప్రత్యేక గ్రంథములను మన పూర్వులు వ్రాసిఉండకపోవచ్చును. కాని, వ్రాసినంతలో నిశితదృష్టిని చూపినారా? లేదా? అను విషయమే పరిశీలనార్హము. వ్రాయనిదానిని పట్టుకొని దూషించుట వివేకమనిపించుకొనదు.

6 వ అధ్యాయమందు తక్కిన రసములతోపాటు హాస్య రసమును వివరింపబడినది. ఇందు కరుణ-భయానకాది రసములకంటె హాస్యరసమే ఎక్కువగా వివరింపబడి ఉన్నది. (రచనా ప్రణాళిక ననుసరించి అంతకంటె విపులీకరించుటకు సాధ్యపడదు). భరతుడు చెప్పిన ఆత్మస్థ-పరస్థ భేదములును, దానిపై అభినవగుప్తుడు చేసిన వ్యాఖ్యానమును, హాస్యాభినయమందు చెప్పబడిన ఆరు భేదములును మన పూర్వుల నిశితదృష్టికి తార్కాణములు. 20 వ అధ్యాయమందు కైశికీవృత్త్యంగమగు నర్మమును వివరించునప్పుడు మరల మూడు విధములగు హాసములు చెప్పబడుట గమనార్హము.

హాస్యము ప్రధాన రసముగాగల ప్రహసనము ఒక రూపక భేదముగా చెప్పబడినది. శక్తిమంతుడగు రచయిత ఇంకెన్ని రకముల హాస్యముల నైనను చూపవచ్చును. కాని పూర్వకవు లట్టిప్రయత్నము చేయకపోవుట ఆలంకారికుల దోషము కాజాలదు.

శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు హాస్య విషయమున పరిశోధనముచేసి పెక్కు విశేషములను తెలిపియున్నారు. శ్రీ సంగమేశంగారి "తెనుగు హాస్యము" వంటి గ్రంథము లిప్పుడిప్పుడు వెలువడుచున్నవి. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు మొదలగువారు పెక్కు వ్యాసములను రచించియున్నారు.

పాశ్చాత్యులు హాస్య భేదములైన 'Wit' and 'Humour' అను వానిని గూర్చియు, ఇతర భేదములను గూర్చియు నిశితములగు విమర్శలను వెలయించినారు. హిందీలో రామచంద్రవర్మకృతమైన "హాస్యరసము" అను గ్రంథముకూడ పరిశీలనార్హము. సంస్కృత వాఙ్మయమందలి హాస్య పాత్రములను గూర్చి" "Sanskrit Comic Characters" అను పేర శ్రీ జె. టి. పరీఖ్ ఒక గ్రంథమును ప్రకటించియుండెను.

## 4. భావవివేచనము

"Psychological studies in Rasa" అను గ్రంథములో డా. రాకేశగుప్త స్థాయి-వ్యభిచారి భావములు నలుబది ఒక్కంటిని, అర్వాచీనాలంకారికులు పేర్కొనిన శమ-స్నేహ-భక్తి - వాత్సల్యములనెడి మరినాలుగు స్థాయిభావములను, ఛలమనెడి ఇంకొక వ్యభిచారి భావమును పరిశీలించి క్రిందివిధముగా సిద్ధాంతించెను. [పుట. 145]—

(a) All the eight Sthayibhavas of Bharata are mental affections.

(b) Out of the thirty-three Sancharibhavas of Bharata fourteen are mental affections (నిర్వేద-శంకా-హర్ష- దైన్య-ఉగ్రతా-చింతా-త్రాస-అసూయా- అమర్ష-గర్వ-వ్రీడా-ఆవేగ-విషాద-ఔత్సుక్యములు)



(c) Four are unemotional feelings (ధృతి-మతి-తర్క-అవహిత్థములు)

(d) Five are feelings of organic sensations (గ్లాని - శ్రమ - విబోధ - అలసత-వ్యాధులు)

(e) And the rest ten cannot be termed as feelings or Bhavas (జడతా-స్మృతి-మరణ-మద-సుప్త-నిద్రా-అపస్మార-మోహ-ఉన్మాద-చపలతలు)

(f) Out of the four Sthayibhavas added by others three are mental affections. (స్నేహ-భక్తి-వాత్సల్యములు.)

(g) One is an unemotional feeling (శమము)

(h) The thirty-fourth Sancharibhava mentioned by Deva is an unemotional feeling. (ఛలము.)

డా. రాకేశగుప్త రస విషయమును నూత్న దృక్పథముతో లేదా పాశ్చాత్య మనశ్శాస్త్ర దృష్టితో పరిశీలించుచు అనేక ప్రాచీన సిద్ధాంతములను త్రోసిపుచ్చి, క్రొత్త వ్యాఖ్యానములను చేసెను. ఆతడు రసానుభూతికి సంబంధించిన "సాధారణీకరణ స్థితి"ని అంగీకరించలేదు. వ్యభిచారిభావములు కూడ రసత్వమును పొందగలవనెడి రుద్రటమతమును విపులముగా చర్చించి సమర్థించెను. కొన్ని రసములు దుఃఖాత్మకములని అంగీకరించెను.

డా. గుప్త 'రస' పదమునకు రెండర్థములను చెప్పియుండెను— 1. Rasa as 'Poetic Relish' (విభావానుభావాదికమునకు సంబంధములేనిది); 2. Rasa as 'Emotion' (విభావానుభావాదికమునకు సంబంధించినది). ఈ రెండు విధములగు అర్థములను పై గ్రంథమునందు రెండు భాగములుగా చర్చించి యుండెను.

## 5. సత్త్వము : సాత్త్వికాభినయము

అభినయము లన్నింటియందును సాత్త్వికాభినయము ముఖ్యమైనది. దీని ప్రాధాన్యమును భరతుడే స్పష్టముగా తెలిపియుండెను. "సాత్త్వికాభినయమందే నాట్యము ప్రతిష్ఠితమై ఉన్నది" అని 22 వ అధ్యాయమందు మరల చెప్పును. నటుని నటనము సత్త్వసాధితము కానిచో సిద్ధిని పొందజాలదు.

నిజమునకు అభినయమందు రోమాంచాదులేకాక సర్వభావములును సత్త్వనిష్పన్నములనియే చెప్పవచ్చును. ఈ అభిప్రాయమును సింగభూపాలాదులు వ్యక్తము చేసియే ఉన్నారు. కాని, సూటిగా సత్త్వమునుండి నిష్పన్నములగునవి కాన రోమాంచాద్యష్టభావములకే సాత్త్వికములను పేరు వచ్చినది. ఈ అధ్యాయమందలి 20 వ అధస్సూచికను కూడ చూడవలెను.

నాట్యశాస్త్రమందలి సత్త్వ నిర్వచనము నట దృష్టితో చేయబడినది. నాట్యశాస్త్రము "కవిప్రయోక్తృపదేశపర"మని అభినవగుప్తుడు ఆదిలోనే స్పష్టము చేసెనుకదా. ఇంక "పరగత సుఖ-దుఃఖభావనచే భావితమైన అంతఃకరణము సత్త్వము" అనెడి ధనికాదుల నిర్వచనము సామాజిక దృష్టితో చేయబడినది. అందుచే రెండు నిర్వచనములకును వైరుధ్యములేదు. రెండింటి సారమును ఒక్కటియే.

6. నాట్యము : మరణము

రంగస్థలమునందు మరణమును చూపవచ్చునా ? కూడదా ? అనునది వాదోపవాదములకు దారితీసినది. భారతీయాలంకారికులు మరణమును నిషేధించిరని విశ్వసింపబడుచున్నది. కాని అది సమంజసముకాదు.

"భాసుడు ప్రతిమానాటకమందు దశరథమరణమును ప్రత్యక్షముగా చూపినాడు. నాటికి, రంగమునందు మరణమును చూపరాదను నిషేధములేదు. తరువాతి కాలములో నాట్యశాస్త్రము మరణమును నిషేధించినది. ఈ నిషేధమునకు పూర్వుడగు భాసుడు నాట్యశాస్త్రమునకు ముందరివాడగుచున్నాడు" అనెడి సిద్ధాంత మొకటి కలదు. [శ్రీ గణపతి శాస్త్రిగారి ప్రతిమానాటక పీఠికను చూడవలెను.]

భాస-భరతుల పౌర్వాపర్యము లెట్లున్నను నాట్యశాస్త్రము మరణమును నిషేధించినదా ? లేదా ? అనునది ప్రస్తుత విషయము. ఈ అధ్యాయమందలి 19 వ అధస్సూచికలోను, 18 వ అధ్యాయమందలి 26 వ అధస్సూచికలోను ఈ విషయమును కొంత చర్చించిఉన్నాను. 12 వ అధ్యాయమందు (18 వ అధస్సూచికను చూడవలెను) "రూపకమందు ఒక ప్రకృతి చనిపోయినట్లు చెప్పబడిఉన్నచో దానిని ప్రయోగించు ఆ ప్రయోక్తకూడ మరణించవలసినదేనా ?" అని ఎదురు ప్రశ్నించుటలో రూపకమునందు మరణాభినయము ఆవశ్యకమని తెలుచున్నది. 25 వ అధ్యాయమందు (చిత్రాభినయము) మరణ సమయమున 'కాకువు' ఎట్లుండవలెనో చెప్పబడినది. వీనినన్నింటినిబట్టి చూడగా భరతుడు రూపకములందు మరణమును నిషేధించలేదనుట స్పష్టము. కాని రంగస్థలమునందు ప్రత్యక్షముగా చూపరాదనియు, ప్రవేశకాదులందు సూచింపవచ్చుననియు భరత-అభినవగుప్తులు నిర్దేశించిఉన్నారు. ఇంక విశ్వనాథుడుమాత్రము మరణమును పూర్తిగా నిషేధించిఉండెను.

పైసూత్రములను ఉల్లంఘించిన ఘట్టములు సంస్కృతరూపకములందు కొన్ని కలవు- మృచ్ఛకటికయందలి వసంతసేన మరణము, ప్రతిమ యందలి దశరథ మరణము, నాగానందమందలి జీమూతవాహనుని మరణము, ఊరుభంగమందలి దుర్యోధన మరణము మొదలగునవి. వీరిలో వసంతసేనా-జీమూతవాహనులు మరల జీవించిరి ; అట్టి వర్ణనలకు నిషేధము లేదు. కాని దశరథ-దుర్యోధనులు అట్లు మరల జీవించలేదు. అందున, దుర్యోధనుడు నాయకుడు కూడను.

ఇప్పు డింకొక ప్రశ్న బయలుదేరును. భరతాదులు మరణమును నిషేధింపనిచో నాయక మరణమును అంగీకరింతురా ? ముఖ్య రూపకములైన నాటక-ప్రకరణములందు నాయక మరణమును వా రంగీకరింపరని వెంటనే చెప్పగలము. 'ఊరుభంగము' తదితరమగుటచే అది ఆ సూత్రమునకు బాధకము కాదని తెలియవలెను.

నాయక మరణముచేతనే ఒక రూపకము "Tragedy" (విషాదాంత రూపకము లేదా అశుభాంత రూపకము) అగునా ? అను ప్రశ్న విచారణీయము. పాశ్చాత్యుల రూపకములలో "Tragedies" అనబడు వానియందెల్ల అంతమున నాయక మరణము విధిగా కన్పట్టుచున్నది. కాని, అంతమున నాయక మరణము ఉండితీరవలెనను సూత్రమును ఎవరు విధించినారో



తెలియదు. అరిస్టాటిల్ 'పొయెటిక్స్' ను వెదకి చూచితిని; కాని, అందీ నియమము కన్పట్టలేదు. "Tragedy" అను పదముయొక్క వ్యుత్పత్తికూడ 'విషాదాంత' మనెడి భావమును సూచించుట లేదు. అతడు పొయెటిక్స్‌ను వ్రాయునాటికి ముగ్గురి రూపకములు వానికి లక్ష్యములుగా ఉండెను. అవి అన్నియును అంతమందు నాయక మరణమును కలిగి ఉండుట యాదృచ్ఛికము. మనవారు భారత-భాగవత-రామాయణములనుండి రూపక కథల నెన్నుకొనినట్లే, ఆ గ్రీకు రూపక కర్తలును ప్రాచీన గ్రీకు పురాణములనుండి తమతమ రూపకములకు కథలను ఎన్నుకొనిరి. మన కథ లన్నియును శుభాంతములుగానే ఉండును ; వారి కథలు అశుభాంతములుగా ఉండును. ఈ కథలయందలి భేదమును బట్టియే రూపకముల అంతములందును భేదము వచ్చినది. అంతియే కాని మరణమును అరిస్టాటిల్ అంగీకరించుట చేతను, భరతుడు నిషేధించుట చేతను ఈ భేదను రాలేదని ముఖ్యముగా గుర్తించవలయును.

కథానిర్వహణ మెట్లున్నను అంతమున మరణమున్నచో అది tragedy అగుననియు, శుభాంతమైనచో అది comedy అగుననియు తలంచుట తప్పు. ఏ రూపకమునందైనను - అది పాశ్చాత్యముకానీ, భారతీయముకానీ—కథానిర్వహణమే ప్రధానము; అంతము ప్రధానముకాదు. 'హేమ్లెట్' కథనంతటిని హాస్యపూరితముగా నడిపి, అంతమున వాని మరణమును చూపినంత మాత్రమున అది tragedy యును, లేదా కథ నంతను అట్లేఉంచి అంతమున హేమ్లెట్, ఒఫీలియాలు బ్రతికి, వివాహమాడి, సుఖముగా రాజ్యము చేయుచున్నట్లు మార్చినచో అది comedy యును కాజాలదు. కావున కథా సంవిధానమే ఇందు ప్రధానమగుచున్నది. విషాదభావము రూపకమును చూచుచున్నప్పుడె కలుగును; అంతమునకాదు. అందుచేతనే నేను విషాదాంతమందలి, అంతమను పదమును వదలి 'విషాద రూపకము' అను పదమును వాడుచున్నాను.

ఈ దృష్టితో చూచినచో అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తరరామ చరితము, కొంతవరకు మృచ్ఛకటిక మొదలగునవన్నియును విషాదరూపకములే కాగలవు ; అంతములను మార్చినచో అవి సర్వవిధముల tragedies కాగలవు. రూపకమునకు విషాదత్వమును తెచ్చునవి అందలి సంఘటనములుమాత్రమే కాదు ; వాని ప్రభావమునకు లోనైన పాత్రముల భావ తీవ్రతయును. ఇప్పట్ల పాశ్చాత్యులు పాత్రకు ప్రాధాన్యమీయగా, భారతీయులు రసమునకు ప్రాధాన్యమిచ్చినారు. ఇదియే భేదము. తక్కిన అన్నివిషయులందును, 'కెథార్సిస్ - రస నిష్పత్తి' అనువానితోసహా, రెండింటికిని సామ్యముకలదు. మానవప్రవృత్తి ఎచ్చటనైనను ఒక్కటియేకదా.

కావున మన పూర్వులు విషాదరూపకములను రచింపలేదని విచారించుటయు, నిందించుటయు సమంజసములుకావు. భారతీయాలంకారికులు మరణమును నిషేధించలేదనియు, ప్రదర్శన సౌలభ్యమును అభిలషించి ప్రత్యక్షప్రదర్శనమును నిరాకరించిరనియు, 'ధర్మమునకు జయము కలుగుట' అనునదియే ఆదర్శముకావలెననెడి దృష్టితో నాయక మరణమును నిషేధించిరనియు తెలియవలెను. ఇంకను వివరములకు "A so-called convention of the Hindu Drama" అను డా. ఘోష్ వ్యాసమును [Indian Historical Quarterly-Vol. IX. No. 4.]; "Aristotle's Katharsis and Bharata's Sthayibhavas"

అను డా. కున్హన్‌రాజాగారి వ్యాసమును [Brahma Vidya - Vol. XII. part I.] పరిశీలించవలయును. డా. రాజాగారు పై శీర్షికతో నాలుగు భాగములుగా వ్రాయుదునన్న వ్యాసమును పూర్తిగా ప్రకటించినట్లులేదు; మొదటి భాగమును మాత్రమే ప్రకటించినారు. వారు దానిని పూర్తిచేసినచో బాగుండును.

### 7. నాట్యశాస్త్రము : ఆయుర్వేదశాస్త్రము

గ్లాని, వ్యాధి, మరణము, స్తంభము, స్వేదము మొదలగు భావముల వివరణము లన్నియును ఆయుర్వేద శాస్త్రానుసారముగా ఉన్నవని ప్రొఫెసర్ రమేంద్రకుమార్ సేన్ (సిటీ కళాశాల, కలకత్తా) గారు నిరూపించిఉన్నారు. నాట్య రసములకు లౌకికములైన షడ్రసములే మూలములనియు, భరతరస సూత్రముకూడ వైద్య శాస్త్రానుసారముగా ఉన్నదనియు, అసలు, నాట్యశాస్త్రమందలి రస-భావ అధ్యాయములు రెండింటికి ఆయుర్వేద శాస్త్రమే ఆధారమనియు వారి సిద్ధాంతము. గ్రీకు-భారతీయ అలంకార శాస్త్రములకు గల భేద సాదృశ్యములను కూడ వారు పరిశీలించినారు. వివరములకు వారి "Susruta Caraka and Bharata" (Indian Historical quarterly-vol. XXX. No. 1) అను వ్యాసమును; "A brief Introduction to A Comparative study of Greek and Indian Poetics and Aesthetics" (1954) అను చిన్న గ్రంథమును పరిశీలించవలెను.

---

చూ. 239 పుట అసంమోహాము మొదలగు వానిచేత అభివ్యక్తమును, వ్యవసాయనయాత్మకమును అయిన ఉత్సాహమును అప్రమాదము మొదలగు వానిచేత ఉత్పన్నమయినట్లుగా అభినయించవలెను.

# అధ్యాయము 8

## ఉత్తమాంగాభినయము[1]

[కాశీ ముద్రణమునందు - 172 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు - 174 శ్లోకములును, బరోడా ముద్రణమునందు - 177 శ్లోకములును కలవు. బరోడా ముద్రణ ద్వితీయ సంపుటము ఈ అధ్యాయముతో ప్రారంభమగుచున్నది.]

### ఋషుల ప్రశ్నలు

"రసములను గూర్చియు, భావములను గూర్చియు సమగ్రముగా తెలిసికొంటిమి. ఇంక ఈ క్రింది విషయములను గూర్చి తెలిసికొనగోరుచున్నాము- నాట్యమందు 'అభినయము' ఎన్ని విధములు ? 'అభినయ' మనెడి పదమున కర్థమేమి ? అందెన్ని ప్రభేదములున్నవి ? ప్రయోగ సిద్ధిని ఆశించువారు ఏ సందర్భములో ఏ అభినయమును ఎట్లు చేయవలెను ?" అని ఋషులు భరతుని ప్రశ్నించిరి. అంతట భరతుడు చతుర్విధాభినయములను గూర్చి ఋషులకు క్రింది విధముగా వివరించెను.

### అభినయము

అభినయము చతుర్విధమని చెప్పితినికదా ? ఇంక అభినయమనెడి పదమునకు అర్థమును ఇప్పుడు వివరింతును- 'అభి' అనునది ఉపసర్గ. 'ణీఞ్' (నీ) అనునది ధాతువు. 'ప్రాపణము'[2] అని ఈ ధాతువున కర్థము. ఈ 'అభినీ' అను ప్రకృతి 'ఏరచ్' అను సూత్రముచే 'అచ్' ప్రత్యయాంతమైనప్పుడు 'అభినయము' అనెడి పదము సిద్ధించును.[3]

ఈ సందర్భమున రెండు శ్లోకములు కలవు -

**అభిపూర్వస్తు ణీఞ్ ధాతు రాభిముఖ్యార్థనిర్ణయే ।**
**యస్మాత్ ప్రయోగం నయతి తస్మాదభినయః స్మృతః॥ 7**

---

1. ఇది బరోడాముద్రణ పాఠము. 'ఉపాంగ విధానము' అనునది కాశీ ముద్రణ పాఠము. 'ఉపాంగాభినయము' అని బొంబాయి ముద్రణపాఠము. 7 వ అధస్సూచికను కూడ చూడవలెను. ఈ అధ్యాయమునకు అభినవగుప్తుని వ్యాఖ్య లభించలేదు.

2. ప్రాపణము=పొందించుట, నటుడు రూపకార్థములను సామాజిక హృదయగోచరములను చేయుట అని అర్థము.

3. ఈ పేరాయందలి భాగము మూలమునందు గద్యములో ఉన్నది.

విభావయతి యస్మాచ్చ నానార్థాన్ని ప్రయోగతః।
శాఖాంగోపాంగ సంయుక్త స్తస్మా దభినయః స్మృతః॥ 8

—అభిపూర్వకమగు 'ణీఞ్' (నీ) ధాతువు 'ఆభిముఖ్యము' అనెడి అర్థమునందు ప్రయుక్తము. 'ప్రయోగమును పొందించును' అనగా రూపకార్థములను సామాజిక హృదయములకు అందజేయును' కాన ఇది 'అభినయ' మనబడినది. అంతియేకాక, శాఖా-అంగ-ఉపాంగ సంయుక్తమై ప్రయోగమునందలి వివిధార్థములను విశేషముగా భావింపజేయునది కాన దీనికి అభినయమను పేరు వచ్చెను. [ఇది భంగ్యంతర నిర్వచనము.]

ఈ నాట్యాభినయము నాలుగు విధములు. అనేక భేదములతో కూడుకొని ఉన్న నాట్యము ఈ అభినయమందే ప్రతిష్ఠితమైఉన్నది. ఆంగిక-వాచిక-ఆహార్య-సాత్త్విక భేదములచే అభినయము నాలుగు విధములు.

7 వ అధ్యాయమందు భావములను వివరించునప్పుడే సాత్త్వికాభినయమును వివరించిఉన్నాను. ఇంక ఇప్పుడు ముందుగా 'ఆంగికాభినయము' ను వివరింతును.

ఆంగికాభినయము

శాఖా-అంగ-ఉపాంగ సహితమైన ఆంగికాభినయము మూడు విధములు— శారీరము, ముఖజము, చేష్టాకృతము. నాట్యసంగ్రహము అంగ-ఉపాంగ-ప్రత్యంగ సహితమై ఉన్నది. శిరము, హస్తములు, కటి, ఉరము, పార్శ్వములు, పాదములు అను ఈ ఆరును అంగములు.[5] నేత్రములు, కనుబొమలు, నాసిక, అధరము, కపోలములు, చిబుకము అను ఈ ఆరును ఉపాంగములు. శాఖ, అంకురము, నృత్తము, అను ఈ మూడును అభినయవస్తువులు. ఆంగికము 'శాఖ' అనబడును. సూచనము 'అంకురము' అనబడును. కరణాశ్రయమును, అంగహార వినిష్పన్నమును అగునది 'నృత్త' మనబడును.*

శిరఃకర్మ

నానాభావరసాశ్రయమగు ముఖజాభినయమునకు సంబంధించిన[6] శిరఃకర్మను[7] తద్వినియోగమును ముందుగా వివరింతును. ఆకంపిత-కంపిత-ధుత-విధుత-పరివా

---

4. 'అభి' అను ఉపసర్గకు 'అభిముఖముగా' అనియును, 'నీ' ధాతువునకు 'పొందించుట' అనియును అర్థములు. 'ప్రయోగమును అభిముఖగా పొందించుట' అనగా ప్రయోగముయొక్క అర్థములను సామాజిక హృదయములకు సువ్యక్తము చేయుట. అభినయమను పదమునకు "Act of Communication" అని శ్రీ కె. యమ్. వర్మగాగు చేసిన అనువాదము బాగున్నది. సాధారణముగా "Histrionic Representation" అందురు.

5. ఇచ్చటి మూలశ్లోకము లీ క్రింది విధముగా ఉన్నవి—

త్రివిధస్త్వాంగికో జ్ఞేయః శారీరో ముఖజ స్తథా। చేష్టాకృతశ్చైవ శాఖాంగోపాంగ సంయుతః॥ 12
శిరో-హస్త-కటీ-వక్షః-పార్శ్వ-పాద సమన్వితః। అంగప్రత్యంగ సంయుక్తః షడంగో నాట్యసంగ్రహః॥ 13
తస్య శిరోహస్తోరః పార్శ్వ కటీ పాదతః షడంగాని। 14

ఈ శ్లోకముల క్రమము సరిగా ఉన్నట్లు కన్పట్టుటలేదు. నేను పై విధముగా భావించి వ్రాసినాను. ఆంగికాభినయము మూడు విధములని ఈ అధ్యాయమందు చెప్పబడినది; 22 వ అధ్యాయమందు అరు విధములని చెప్పబడినది. 8,22 అధ్యాయము లందలి విషయములను 8 వ అధ్యాయమందు సమన్వయము చేసితినని అభినవగుప్తుడు 22 వ అధ్యాయమందు పేర్కొనెను. కాని ఈ అధ్యాయమునకు 'అభినవభారతీ' వ్యాఖ్య లభించలేదు. ఇది విచారకరమైన విషయము. శారీరాదుల, శాఖాదుల వివరముల కొరకు ఈ అధ్యాయాంతమునందు గల 4 వ విశేషాంశమును చూడవలెను.

ప్రత్యంగమను పదమును భరతుడిచ్చట ఒక్కచోటనే వాడెను. కాని ప్రత్యంగములేవియో తెలుపలేదు. "స్కంధములు, బాహువులు, పృష్ఠము, ఉదరము, ఊరువులు, జంఘలు అను ఈ ఆరును ప్రత్యంగములు. మణిబంధములు, జానువులు, కూర్పరములు అను మూడును కూడ ప్రత్యంగములే అని కొందరందురు. మరికొందరు గ్రీవమును కూడ ప్రత్యంగమందురు" అని నందికేశ్వరుడు ప్రత్యంగములను వివరించెను [అభినయదర్పణము 43-44 శ్లో.]. ప్రత్యంగములని స్పష్టముగా పేర్కొనబడకపోయినను జఠరము, జంఘలు, ఊరువులు అనునవి తరువాతి అధ్యాయమందు వివరింపబడుట గమనార్హము. అంగాదులను శ్రీ అడివిబాపిరాజుగారీ క్రిందివిధముగా వివరించినారు—

"అంగాభినయంలో దేహంఅంతా వస్తువు అవుతుంది. అందులో ముఖ్యాంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాలు అని ఉన్నాయి. చేతులు, తల, కళ్ళు, కంఠము, పార్శ్వము, కాళ్ళు ముఖ్యాంగాలు. చేతికి మోచేయి ప్రత్యంగము. వ్రేళ్ళు ఉపాంగాలు. కంటికి కనుబొమ ప్రత్యంగము, కనురెప్పలు గ్రుడ్లు ఉపాంగాలు. అల్లా అన్నింటికీ. వీని కదలికతో భావం చెప్పడం అంగాభినయం" ["నారాయణరావు"-పుట. 339].

*[కాశీ - బొంబాయి ముద్రణములందు 1-15 శ్లో; బరోడా ముద్రణమునందు 1-16 శ్లో.].

6. 'శిరము' అంగమగుటచే శారీరాభినయమునకు సంబంధించి ఉన్నది. కాని ఇచ్చట "ముఖజాభినయమునకు సంబంధించినది" అని పేర్కొనబడుటకు కారణము వివరింపబడనున్న ఉపాంగములన్నియును శిరమునకు సంబంధించిఉండుటయే. ఉపాంగములు ముఖజాభినయమునకు సంబంధించినవగుటచే శిరఃకర్మకూడ తత్సంబంధముగానే పేర్కొనబడి ఈ అధ్యాయమందే వివరింపబడినది. (తక్కిన ఐదు అంగములును ఉపాంగములతోబాటు తరువాతి అధ్యాయమందు వివరింపబడును). కావుననే ఈ అధ్యాయమును 'ఉపాంగాభినయ' మనుటకంటె 'ఉత్తమాంగాభినయ' మనుట లెస్స.

7. "శిరఃకర్మ" అనగా శిరమునకు సంబంధించిన అభినయమని అర్థము. ఈ అభి

హిత-ఆధూత-అవధూత-అంచిత-నిహంచిత-పరావృత్త-ఉత్క్షిప్త - అధోగత - లోలితము అను భేదములచే శిరఃకర్మ పదుమూడు విధములు—

1. ఆకంపితము—శిరమును పైకి, క్రిందికి మెల్లగా ఊపుట 'ఆకంపిత' మనబడును. సంజ్ఞచేయుట, ఉపదేశము, ప్రశ్న, సహజభాషణము, నిర్దేశము, ఆవాహనము అను అర్థములను నిరూపించుటయందు ఆకంపితశిరము ప్రయుక్తము కావలెను. (ఆకంపితము=కొంచెముగా కంపితము)

2. కంపితము—శిరమును పైక, క్రిందికి వేగముగా పెక్కుసార్లు ఊపుట, 'కంపిత' మనబడును. రోషము, వితర్కము, విజ్ఞానము, ప్రతిజ్ఞ, ప్రశ్న, భయపెట్టుట, అతిశయముతోకూడిన వాక్యము, వ్యాధి, అమర్షము అను అర్థములను నిరూపించుటయందు కంపితశిరము ఉపయుక్తము.

3. ధుతము—మెల్లగా శిరమును రేచనము చేయుట (ఆడించుట) 'ధుత' మనబడును. ఇష్టము లేకపోవుట, విషాదము, విస్మయము, విశ్వాసము, ప్రక్కకు చూచుట, వలదనుట, శూన్యత్వము అను అర్థములందు ధుతశిరము ప్రయుక్తమగును.

4. విధుతము—పైరేచనమును త్వరితము చేయుట 'విధుత' మనబడును. చలి, భయము, త్రాసము, జ్వరము, మద్యపానప్రారంభావస్థ అను అర్థములను నిరూపించుటయందు విధుతశిరము ప్రయుక్త మగును. (విధుతము=అధికముగా లేదా వేగముగా ధుతము.)

5. పరివాహితము—శిరమును రెండు పార్శ్వములకును పర్యాయముగా త్రిప్పుట 'పరివాహిత' మన బడును. సాధనము, విస్మయము, హర్షము, స్మృతి, అమర్షము, విచారము, విహారము, లీల అను అర్థములను నిరూపించుటయందు పరివాహితశిరము ప్రయుక్తమగును.

6. ఆధూతము ('ఉద్వాహితము' అని కాశీముద్రణపాఠము)— శిరమును ఒకసారి అడ్డముగా పైకెత్తుట 'ఆధూత' మనబడును. గర్వము, స్వేచ్ఛగాచూచుట, ప్రక్కనున్నదానిని తల ఎత్తిచూచుట, ఆత్మసంభావనము (తన్నుతాను గౌరవించుకొనుట) మొదలగు అర్థములందు ఆధూతశిరము ప్రయుక్తమగును.

7. అవధూతము— శిరమును ఒకసారి క్రిందికివంచుట 'అవధూత' మనబడును. సందేశము, పిలుచుట, మాటాడుట, సంజ్ఞచేయుట అను అర్థములందు అవధూత శిరము ప్రయుక్తము.

---

నయము 13 విధములు. ఈ అభినయవిధములే శిరోభేదములుగా పేర్కొనబడినవి. కాగా శిరోభేదములు 13 అని అర్థము. ఇట్లే తక్కినచోట్లను అన్వయించుకొనవలెను.



8. అంచితము—మెడను కొంచెముగా ఒక ప్రక్కకు వంచినచో 'అంచితశిర' మగును. వ్యాధి, మూర్ఛ, మదము, చింత, హనుధారణము (చెక్కిలిని చేతి కానించుట) అను అర్థములందు అంచితశిరము ప్రయుక్తమగును.

9. నిహంచితము—బొమముడితో కూడిన శిరము పైకెత్తబడిన అంసమును అనుకొనునట్లుగా మెడను ఒక ప్రక్కకు వంచినచో అది 'నిహంచితశిర' మగును. గర్వము, మానము, విలాసము, బిబ్బోకము, కిలి (ల) కించితము, మోట్టాయితము, కుట్టమితము, స్తంభము అను అర్థములను నిరూపించుటయందు స్త్రీలచే నిహంచిత శిరము ప్రయుక్తమగును.

10. పరావృత్తము—శిరమును వెనుకకు త్రిప్పుట 'పరావృత్త' మనబడును. అనిష్టాదులచే తలను త్రిప్పివేసికొనుట, వెనుకచూపులు చూచుట మొదలగు అర్థములందు పరావృత్తశిరము ప్రయుక్తమగును.

11. ఉత్క్షిప్తము— పైకి ముఖము వచ్చునట్లు శిరమును వెనుకకు వంచుట 'ఉత్క్షిప్త'మనబడును. ప్రాంశుదర్శనము (ఎత్తైనవానిని చూచుట), దివ్యార్థయోగము (ఆకాశమునం దున్నవానిని చూచుట) అను అర్థములను నిరూపించుటయందు ఉత్క్షిప్తశిర ముపయుక్తమగును.

12. అధోగతము— ముఖమును క్రిందికి వాల్చినచో 'అధోగతశిర'మగును. లజ్జ, ప్రణామము, దుఃఖము అను అర్థములను ప్రదర్శించుటయందు అధోగతశిరము ప్రయుక్తమగును.

13. పరిలోలితము లేదా లోలితము— శిరమును అన్ని ప్రక్కలకును త్రిప్పినచో 'పరిలోలిత' మగును. మూర్ఛ, వ్యాధి, మదము, గ్రహావేశము, నిద్ర మొదలగు అర్థములను నిరూపించుటయందు ఈ శిరము ప్రయుక్తమగును.[8]

లోక వ్యవహారమునందు ఇంకను అనేక విధములుగా శిరస్సును త్రిప్పుటకలదు. వాని నెల్ల లోకస్వభావానుగుణముగా ప్రయోగించవలెను.*

### రస-భావ దృష్టులు

ఇంక దృష్టి భేదములు ముప్పది ఆరు. దృష్టులయందే నాట్యము ప్రతిష్ఠితమై ఉన్నది. నానా భావ-రసాశ్రయములైన దృష్టుల యొక్క లక్షణమును, విని

---

8. ఇచ్చట 'ప్రాకృత'మను భేద మింకొకటి చెప్పబడినది [బరోడా ముద్రణము 38 శ్లో]—

ఋజుస్వభావ సంస్థానమును, స్వభావజమును అయినది 'ప్రాకృత శిర' మనబడును. మంగల్య-అధ్యయన-ధ్యాన-స్వభావ-జయ కర్మలందిది ప్రయుక్తము.

* [కాశీ-బొంబాయి ముద్రణములందు 16-37 శ్లో: బరోడా ముద్రణమునందు 17-40 శ్లో.]

యోగమును వరుసగా వివరింతును. దృష్టిభేదములు ముప్పది ఆరింటిలో రసదృష్టు లెనిమిది, స్థాయిభావాశ్రయములైన దృష్టు లెనిమిది, సంచారిభావాశ్రయములైన దృష్టులు ఇరువది.

రస దృష్టులు

కాంత, భయానక, హాస్య, కరుణ, అద్భుత, రౌద్రి, వీర, బీభత్స - అనెడి భేదములచే రసాశ్రయములైన దృష్టులు ఎనిమిది విధములు[9]—

1. కాంత— ఇది సంతోష అనుగ్రహముల వలన జనించును. కనుబొమ లెగురవేయుటయును, క్రీగంటి చూపులును ఇందుండును. అత్యధికముగా మన్మథ భావమును వెల్లడిచేయు ఈ 'కాంత దృష్టి' శృంగార రసమునందు ప్రయుక్తమగును.

2. భయానక— ఇందు కనురెప్పలు బాగుగా విప్పారి నిశ్చలముగా ఉండును. తారకలు మెరయుచు పైకి తిరుగుచుండును. అత్యధికముగా భయమును సూచించు ఈ 'భయానకదృష్టి' భయానకరసమునందు ప్రయుక్తమగును.

3. హాస్య—కనురెప్పలను పర్యాయముగా మూయుచు, తెరచుచు ఉండవలెను. తెరచినప్పుడు తారకలు కదలుచున్నవై అల్పముగా కన్పట్టుచుండవలెను. ఇట్టిచూపు 'హాస్యదృష్టి' అనబడును. ఇది కుహకాభినయమందు ప్రయుక్తమగును.

4. కరుణ—జారిన పైరెప్పలను, మానసిక వ్యథచే చలనములేని తారకలను, బాష్పపూరిత నయనములను కలిగినదై నాసాగ్రమందు నిలుపబడిన చూపు 'కరుణదృష్టి' అనబడును. ఇది కరుణరసమందు ప్రయుక్త మగును.

5. అద్భుత—కొంచెముగా ముడువబడిన పక్ష్మముల చివరలను, ఆశ్చర్యముచే పైకి లేచిన తారకలను, వికసితమైన అంతములను (అనగా పెద్దవి చేయబడిన కనులను) కలిగినదై సౌమ్యముగా ఉండెడి చూపు 'అద్భుతదృష్టి' అనబడును. ఇది అద్భుతరసమందు ప్రయుక్తమగును.

6. రౌద్రి—చలనములేని కనురెప్పలను, తారకలను, బొమముడిని కలిగినదై క్రూరమును, పరుషమును, అరుణమును, ఉద్వృత్తమును అగు చూపు 'రౌద్రదృష్టి' అనబడును. ఇది రౌద్రరసమందు ప్రయుక్తమగును.

7. వీర—తేజోవంతమైనదియును, విప్పారినదియును, క్షోభము చెందియు గంభీరముగా ఉన్నదియును, విప్పారిన మధ్యభాగములను సమముగా ఉన్న

9. సంస్కృతమునందు 'దృష్టి' అను పదము స్త్రీలింగమగుటచే దానిముందుండెడి కాంతాది పదములుకూడ స్త్రీ లింగములే అగును. అందుచే కాంతము, హాస్యము...అని అనుటకు బదులు కాంత, హాస్య.... అని వ్రాయబడెను (కాంతదృష్టి...మొ॥).



తారకలను (బాగుగా తెరవబడిన కంటిమధ్యభాగమందున్న తారకలను) కలిగినదియును అగు చూపు 'వీరదృష్టి' అనబడును.

8. బీభత్స—ఇందు కనురెప్పలును, అపాంగములును ముడువబడును. తారకలు తిరుగుడు పడుచు పైకెగురుచుండును. పక్ష్మములు దగ్గరగా కూడినవై స్థిరముగా ఉండును. ఇట్టి చూపు 'బీభత్స' దృష్టి అనబడును. ఇది బీభత్స రసమందు ప్రయుక్తమగును.

9. [శాంత— ఇందు రెప్పపాటు ఉండదు. సగము మూయబడిన రెప్పలతో నాసాగ్రమందు చూపును నిలిపిఉంచవలెను. ఇట్టిది 'శాంత దృష్టి' అనబడును. ఇది శాంతరసమందు ప్రయుక్తమగును.][10]

స్థాయిభావదృష్టులు

స్నిగ్ధ, హృష్ట, దీన, క్రుద్ధ, దృప్త, భయాన్విత, జుగుప్సిత, విస్మిత అనెడి భేదములచే స్థాయిభావాశ్రయములైన దృష్టులు ఎనిమిది విధములు—

1. స్నిగ్ధ— ఇందు మధ్యభాగము విప్పారి ఉండును, తారకలు చలించవు. భ్రూలత ఆనందమును సూచించుచుండును; సాభిలాషమును, మధురమును అగు ఈ చూపు 'స్నిగ్ధదృష్టి' అనబడును. ఇది రతిభావసంభూతము.

2. హృష్ట— ఇందు తారకలు కొంచెముగా కనిపించుచుండును. రెప్పపాటును, చలనమును, కొంచెము వంకర చూపును కలిగినదై హాసగర్భితమగు ఈ చూపు 'హృష్టదృష్టి' అనబడును. ఇది హాసమందు ప్రయుక్తము.

3. దీన— దిగజారిన పైరెప్పలను, కొంచెముగా ఉబ్బిన తారకలను, కన్నీళ్ళను కలిగినదై మందముగా ప్రసరించెడి చూపు 'దీనదృష్టి' అనబడును. ఇది శోకమందు ప్రయుక్తము.

4. క్రుద్ధ— కనురెప్పలను, తారకలను పైకెత్తి నిశ్చలముగా ఉంచవలెను; కుటిలమైన బొమముడి కలిగినదై పరుషముగానుండు ఈ చూపు 'క్రుద్ధదృష్టి' అనబడును. ఇది క్రోధమందు ప్రయుక్తమగును.

10. భరతుడు రసదృష్టులను ఎనిమిదింటినే చెప్పెను. శాంతమునకు సంబంధించిన నిర్వచనము [బరోడా ముద్రణమునందు 55 శ్లో; బొంబాయి ముద్రణమునందు 51 శ్లో.] ప్రక్షిప్తముగా తలంపబడుచున్నది. కాశీముద్రణమందు ఈ శ్లోకములేదు.

ఇచ్చట శాంతముయొక్క స్థాయిభావదృష్టి ఏమో చెప్పబడలేదు. దీనినిబట్టి 'శాంతదృష్టి' నిర్వచించు శ్లోకముకూడ ప్రక్షిప్తమనియే చెప్పవచ్చును. మొదట భరతుడు చెప్పినవి ఎనిమిది రసములేకదా.

5. దృప్త— ఇందు తారకలు చలించవు. చూపు స్థిరమును, వికసించి నదియును అయి బలమును వెల్లడిచేయుచుండును. ఇట్టి ఈ చూపు 'దృప్తదృష్టి' అనబడును. ఇది ఉత్సాహజమైన దృష్టి.

6. భయాన్విత— రెప్పలు రెండును బాగుగా విస్ఫారవలెను. భయముచే కంపించుచున్నవై తారకలు ఒక మూలకు ఒదిగిఉండును. ఇట్టి ఈ చూపు 'భయాన్విత దృష్టి' అనబడును. ఇది భయమందు ప్రయుక్తము.

7. జుగుప్సిత— రెప్పలు తారకలను సగము కప్పివేయుచుండును. (అనగా రెప్పలు కలియరాదు.) లక్ష్యవస్తువును చూచుటవలన ఉద్వేగముతో చూపును మరలించవలెను. ఇట్టి ఈచూపు 'జుగుప్సితదృష్టి' అనబడును. ఇది జుగుప్సయందు ప్రయుక్తము.

8. విస్మిత—తారకలు బాగుగా పైకెత్తబడగా రెప్పలు రెండును నిశ్చల ములుగా ఉండవలెను. చూపు సమమును, వికసితమును కావలెను. ఇట్టి ఈ చూపు 'విస్మితదృష్టి' అనబడును. ఇది విస్మయమందు ప్రయుక్తము.*

సంచారిదృష్టులు

శూన్య, మలిన, శ్రాంత, లజ్జాన్విత, గ్లాన, శంకిత, విషణ్ణ, ముకుల, కుంచిత, అభితప్త, జిహ్మ, లలిత, వితర్కిత, అర్ధముకుల, విభ్రాంత, విప్లుత, ఆకేకర, వికోశ, త్రస్త, మదిర అనెడి భేదములచే సంచారి భావాశ్రయములైన దృష్టు లిరువది విధములు—

1. శూన్య—తారకలును కనురెప్పలును సమముగా ఉండవలెను. చూపు నిశ్చలముగను, లక్ష్యములేనిదిగను, కృశించినదిగను, బాహ్యవిషయములను గ్రహింప నేరనిదిగను ఉండును. ఇట్టి ఈ చూపు 'శూన్యదృష్టి' అనబడును.

2. మలిన— పక్ష్మములు కదలుచుండును. అంతగా ముకుళించని కను రెప్పలను, విభ్రాంతములగు తారకలను, మలినములగు అంతములను కలిగియుండు చూపు 'మలినదృష్టి' అనబడును. ఇది నిర్వేద-వైవర్ణ్యములం దుపయుక్తము.

3. శ్రాంత— శ్రమచేవాడిన కనురెప్పలను, ముడుచుకొనిన అంతము లను, దిగజారిన తారకలను, గుంటలుపడిన కనులను కలిగినచూపు 'శ్రాంతదృష్టి' అనబడును. శ్రమ-స్వేదములం దిది ప్రయుక్తము.

*[కాశీ, బొంబాయి ముద్రణములందు 37-60 శ్లో; బరోడా ముద్రణమునందు 41-61 శ్లో.]



4. లజ్జాన్విత— కొంచెముగావంగిన పక్ష్మముల చివరలను, సిగ్గుచే జారిన పై రెప్పలను, త్రపచే అధోగతములైన తారకలను కలిగినచూపు 'లజ్జాన్వితదృష్టి' అనబడును. ఇది లజ్జయందు ప్రయుక్తము.

5. గ్లాన— వాడిన కనుబొమలను కనురెప్పలను పక్ష్మములను, రెప్పల లోనికి చొచ్చుకొనిపోయిన తారకలను కలిగినదై శిథిలమును, మందముగా ప్రసరించునదియును అగు చూపు 'గ్లానదృష్టి' అనబడును. అపస్మార-గ్లాని-వ్యాధు లందిది ప్రయుక్తమగును.

6. శంకిత—తారకలు చకితములు కావలెను. చూపు కొంచెముగా చలిం చినదియును, పిమ్మట స్థిరమును, కొంచెము పైకి లేచినదియును, తరువాత అడ్డముగా ప్రసరించునదియును, మూఢమును అగుచూపు 'శంకిత దృష్టి' అనబడును. శంకయం దిది ప్రయుక్తము.

7. విషాదిని (విషణ్ణ)— విషాదముచే పెద్దవి అయిన కనురెప్పలను, పర్య స్తములైన అంతములను, ఎక్కువ చలనములేని తారకలను కలిగినదై రెప్పపాటు లేని చూపు 'విషాద దృష్టి' అనబడును. ఇది విషాదమందు ప్రయుక్తము.

8. ముకుల— కొంచెముగా ఒకదానితో ఇంకొకటి కలిసినవై అదరుచున్న పక్ష్మములను, ముకుళితములైన కనురెప్పలను, సుఖముచే కొంచెముగా కన్పట్టు చున్న తారకలను కలిగిన చూపు 'ముకుల దృష్టి' అనబడును. నిద్రా-స్వప్న-సుఖము లందు ఇది ప్రయుక్తము.

9. కుంచిత— రెప్పలు కొంచెముగా ముడుచుకొనుటచే బాగుగా వంగిన పక్ష్మముల చివరలను, వెనుకకు లాగబడిన తారకలను కలిగిన చూపు 'కుంచిత దృష్టి' అనబడును. ఇది అసూయా-అనిష్ట-దుష్ప్రేక్ష్య-అక్షివ్యథలందు ప్రయుక్తము.

10. అభితప్త— రెప్పలు బాగుగా చలించుచున్నను మందముగా కదలు చున్న తారకలను కలదై సంతాపమును వ్యథను సూచించు చూపు 'అభితప్త దృష్టి' అనబడును. చింతా-నిర్వేద-అభిఘాత-అభితాపములం దిది ప్రయుక్తము.

11. జిహ్మ— కొంచెముగా వంగి వ్రేలాడుచున్న రెప్పలను, మూయబడిన తారకలను కలిగినదై కొంచెము అడ్డముగాను, గూఢముగాను ప్రసరించు చూపు 'జిహ్మ దృష్టి' అనబడును. అసూయా-జడతా-ఆలస్యములం దిది ప్రయుక్తము.

12. లలిత— ముడుచుకొనిన అంతములను, ఎగురవేయబడుచున్న కను బొమలను కలిగినదై మధురమును, సస్మితమును, మన్మథ వికారోపేతమును అగు చూపు 'లలిత దృష్టి' అనబడును. ధృతి-హర్షములం దిది ప్రయుక్తము.

13. వితర్కిత— వితర్కముచే పైకిలాగబడిన రెప్పలను, వికసితములైన తారకలను కలిగినదై క్రిందిచూపులతోకూడినది 'వితర్కితదృష్టి' అనబడును. స్మృతి-తర్కములం దిది ప్రయుక్తము.

14. అర్ధముకుల— సంతోషముతో రెప్పలను సగము మూయుటచే సగము విడిన పక్ష్మములను, కొంచెము చెదరిన తారకలను కలిగినచూపు 'అర్ధముకుల దృష్టి' అనబడును. ఆహ్లాదజనకములగు గంధ-స్పర్శములం దిది ప్రయుక్తము,

15. విభ్రాంత--- చలించెడి రెప్పలను తారకలను, విప్పారుటచే పెద్దవి అయిన కనులను కలిగినదై ఆకులపాటుతోకూడిన చూపు 'విభ్రాంతదృష్టి' అనబడును. ఆవేగ-సంభ్రమ-విభ్రమములం దిది ప్రయుక్తము.

16. విప్లుత-- బాగుగా అదరుచు, పిమ్మట చలనరహితములగుచు క్రిందకు జారుచు ఉండెడి రెప్పలను, పైకి లాగబడినవియును మరల కదలుచున్న వియును అగు తాగకలను కలిగినచూపు 'విప్లుతదృష్టి' అనబడును. చపలతా-ఉన్మాద-దుఃఖ-ఆర్తి-మరణములం దిది ప్రయుక్తము.

17. ఆకేకర— కొంచెము ముకుళితములైన రెప్పలను, అపాంగములను, అర్ధనిమేషమును, మాటిమాటికి ప్రక్కలకుపోవుచున్న తారకలనుకలిగిన చూపు 'ఆకేకరదృష్టి' (ఓరచూపు) అనబడును. దురాలోక-విచ్ఛేదప్రేషితముల (ఆపి ఆపి చూచుట) యందిది ప్రయుక్తమగును.

18. వికోశ-- విప్పారిన రెండు రెప్పలను, చలించుచున్న తారకలను కలిగినదై వికసితమును, రెప్పపాటులేనిదియును అగు చూపు 'వికోశదృష్టి' అనబడును. విబోధా-గర్వ-అమర్ష-ఉగ్రతా-మతులం దిది ప్రయుక్తము.

19. త్రస్త— త్రాసముచే పైకెత్తబడిన రెప్పలను, ఎక్కువగా కంపించుచున్న తారకలను, సంత్రాసముచే విప్పారిన మధ్యములను కలిగినచూపు 'త్రస్త దృష్టి' అనబడును. ఇది త్రాసమందు ప్రయుక్తము.

20. మదిరదృష్టి— (1) తిరుగుడువడుచున్న మధ్యములను, వాడిన కనుకొలకులను, వికసితములైన అపాంగములను కలిగినచూపు 'మదిరదృష్టి' అనబడును. ఇది తరుణమదమందు ప్రయుక్తమగును. (2) కొంచెముగా వంగిన రెప్పలను, కొంచెము చెదరిన తారకలను, చలించుచున్న పక్ష్మములను కలిగిన 'మదిరదృష్టి' మధ్యమమదమందు ప్రయుక్తమగును. (3) కొంచెముగా కనిపించు తారకలను, క్రిందిచూపులను కలిగినదై అనిమేషమును, సనిమేషమును అగు 'మదిరదృష్టి' అధమమదమందు ప్రయుక్తమగును.



పైన వివరించిన దృష్టులలో రసదృష్టులను ఆయారసములందును, స్థాయిభావ దృష్టులను ఆయా స్థాయిభావములందును, వ్యభిచారిదృష్టులను ఆయా సంచారిభావములందును ప్రయోగించవలెను.*

### తారాకర్మ

ఇంక ఇప్పుడు తారాకర్మను, పుటకర్మను, భ్రూకర్మను వివరింతును. భ్రమణ-వలన-పాతన-చలన-సంప్రవేశన-వివర్తన-సముద్వృత్త-నిష్క్రామ-ప్రాకృత భేదములచే తారాకర్మలు తొమ్మిది విధములు. వీని లక్షణములను, వినియోగములను వివరింతును–

1. భ్రమణము— తారకలు (కనుగ్రుడ్లు) రెప్పలలోపల మండలాకారముగా తిరుగుట 'భ్రమణ' మనబడును. వీర-రౌద్రములం దిది ప్రయుక్తము.

2. వలనము— తారకలను త్ర్యస్రముగా (ముక్కోణముగా) త్రిప్పుట 'వలన' మగును. ఇది వీర-రౌద్ర రసములందు ప్రయుక్తము.

3. పాతనము లేదా పాతము— తారకలు దిగజారినట్లు లేదా వదులుగా ఉండుట 'పాతన' మగును. కరుణరసమం దిది ప్రయుక్తము.

4. చలనము— తారకలు కంపించుట 'చలన' మగును. భయానక రసమం దిది ప్రయుక్తము.

5. సంప్రవేశము లేదా ప్రవేశము— తారకలు రెప్పలలోనికి చొచ్చుకొని పోవుట 'సంప్రవేశన' మగును. హాస్య-బీభత్సములం దిది ప్రయుక్తము.

6. వివర్తనము— తారక కంటిచివరకుపోవుట (ప్రక్కచూపులు చూచుట) 'వివర్తన' మగును. ఇది శృంగారమందు ప్రయుక్తము.

7. సముద్వృత్తము—తారకలను పైకెత్తుట 'సముద్వృత్త' మగును. ఇది వీర-రౌద్ర రసములందు ప్రయుక్తము.

8. నిష్క్రామము లేదా నిష్క్రమణము— తారకలు కనుపడకుండుట 'నిష్క్రామ' మగును. ఇది వీర-రౌద్ర-అద్భుత-భయానకములందు ప్రయుక్తము.

9. ప్రాకృతము— తారకలు స్వభావ సిద్ధముగా ఉండుట 'ప్రాకృత' మనబడును. శేషించిన భావములం దిది ప్రయుక్తము.

ఈ తారక కర్మ స్వభావ సిద్ధమును, లోకక్రియాశ్రయమును అయిఉన్నది. దీనిని పై విధముగా ఆయా రసభావములందు ప్రయోగించవలెను.

*[కాశీ ముద్రణమునందు 61-92 శ్లో; బొంబాయి ముద్రణమునందు 61-94 శ్లో; బరోడా ముద్రణమునందు 61-95 శ్లో].

దర్శన ప్రకారములు

ఇంక తారక కర్మకు సంబంధించిన దర్శనభేదములను వివరింతును. సమ-సాచీ-అనువృత్త-ఆలోకిత-విలోకిత-ప్రలోకిత-ఉల్లోకిత-అవలోకిత భేదములచే దర్శనములు ఎనిమిది విధములు. వీని లక్షణములను, వినియోగములను వివరింతును—

1. సమము— తారకలను సమానముగా ఉంచి, సౌమ్యముగా చూచుట 'సమ దర్శన' మనబడును.

2. సాచీకృతము— తారకలు పక్ష్మాంతర్గతములు కాగా, అడ్డముగా చూచుట 'సాచీకృత దర్శన' మనబడును.

3. అనువృత్తము— రూపములను పరిశీలనాత్మకముగా చూచుట 'అనువృత్త దర్శన' మనబడును.

4. ఆలోకితము— హఠాత్తుగా చూచుట 'ఆలోకిత దర్శన' మనబడును.

5. విలోకితము— వెనుకకు చూచుట 'విలోకిత దర్శన' మనబడును.

6. ప్రలోకితము— ప్రక్కలకు చూచుట 'ప్రలోకిత దర్శన' మనబడును.

7. ఉల్లోకితము— మీదకు చూచుట 'ఉల్లోకిత దర్శన' మనబడును.

8. అవలోకితము— క్రిందికి చూచుట 'అవలోకిత దర్శన' మనబడును.

ఈ దర్శన విధి సర్వ రస-భావములను ఆశ్రయించిఉండును.

పుట కర్మ

తారాకర్మననుసరించియుండెడి పుట (కను రెప్పల) కర్మ నింక వివరింతును. ఉన్మేష-నిమేష-ప్రసృత - కుంచిత - సమ - వివర్తిత - స్ఫురిత - పిహిత - వితాడిత భేదములచే పుట కర్మ తొమ్మిది విధములు. వీని లక్షణములను, వినియోగములను వివరింతును—

1. ఉన్మేషము— రెప్పలు ఎడముగా ఉండుట. క్రోధమం దిది ప్రయుక్తము.

2. నిమేషము— రెప్పలు కలియుట. క్రోధమం దిది ప్రయుక్తము.

3. ప్రసృతము— రెప్పలు బాగుగా విప్పారుట. విస్మయ-హర్ష-వీరములం దిది ప్రయుక్తము.

4. కుంచితము— రెప్పలు కొంచెము ముడుచుకొని ఉండుట. అనిష్టములైన దర్శన-స్పర్శ-గంధ-రసములను నిరూపించుట యందిది ప్రయుక్తము.

5. సమము— రెప్పలు సహజముగా ఉండుట. శృంగారమం దిది ప్రయుక్తము.

6. వివర్తితము— రెప్పలు పైకి బాగుగా లాగబడుట. క్రోధమం దిది ప్రయుక్తము.



7. స్ఫురితము— రెప్పలు అదరుచుండుట. ఈర్ష్యయం దిది ప్రయుక్తము.

8. పిహితము— రెప్పలను దగ్గరగా నొక్కిపట్టుట. సుప్త-మూర్ఛితములందును గాలి, వేడి, పొగ, వర్షము, కాటుక మంట, నేత్రరోగము అనువానిని నిరూపించుట యందును ఇది ప్రయుక్తమగును.

9. వితాడితము— రెప్పలను అల్లార్చుట (అనగా రెప్పలు ఒకదాని నింకొకటి కొట్టుకొనుట). అభిఘాతమును నిరూపించుట యం దిది ప్రయుక్తము.

పై విధముగా తారా-పుట విధి రస-భావ నిష్ఠమై ఉన్నది. వాని భేదములను ఆయా రస-భావములందు ప్రయోగించవలెను.

భ్రూ కర్మ

తారాపుట కర్మల ననుసరించిఉండెడి భ్రూ (కనుబొమల) కర్మ నిప్పుడు వివరింతును. ఉత్క్షేప-పాతన-భ్రుకుటీ-చతుర-కుంచిత-రేచిత - సహజ భేదములచే భ్రూకర్మ ఏడువిధములు. వీని లక్షణములను, వినియోగములను వివరింతును—

1. ఉత్క్షేపము— రెండు కనుబొమలను ఒక్కసారిగా కాని, పర్యాయముగా కాని పైకెత్తుట 'ఉత్క్షేపభ్రువు' అనబడును. కోపము, వితర్కము, హేల, సహజ లీలలు, దర్శనము, శ్రవణము అనువానిని నిరూపించుటయందు బొమలను పర్యాయముగా పైకెత్తుచుండవలెను; విస్మయ-హర్ష-రోషములందు రెండింటిని ఒక్కసారిగా పైకెత్తవలెను.

2. పాతనము— రెండు కనుబొమలను ఒక్కసారిగా కాని, పర్యాయముగా కాని క్రిందకు వాల్చుట. అసూయ, జుగుప్స, హాసము, వాసనపీల్చుట అను వానిని నిరూపించుటయం దిది ప్రయుక్తము.

3. భ్రుకుటి— కనుబొమలయొక్క మూలములను పైకెత్తుట (అనగా నాసిక పై భాగమున రెండు కనుబొమలును ముడివడుట). క్రోధస్థానములందును, పెద్దవెలుగును చూచుటయందును ఇది ప్రయుక్తము.

4. చతురము— మధురమగు పద్ధతిలో కనుబొమలను మెల్లగాకదిలించుచు పెద్దవిచేయుట. శృంగారము, లలితము, సౌమ్యము, సుఖస్పర్శము, ప్రబోధము మొదలగు అర్థములను నిరూపించుటయం దిది ప్రయుక్తము.

5. కుంచితము— కనుబొమలు రెండును ఒక్కసారిగాకాని, పర్యాయముగాకాని మృదువుగా వంపుదేరుట. మోట్టాయిత - కిలికించిత - కుట్టమితములందును, నానావస్థాంతరాత్మకములగు స్త్రీ పురుషుల సల్లాపములందును ఇది ప్రయుక్తము.

6. రేచితము— ఒక కనుబొమను లలితముగా పై కెత్తుట. ఇది నృత్తమందు ప్రయుక్తము.

7. సహజము లేదా స్వాభావికము— కనుబొమలు రెండును సహజ స్థితిలో ఉండుట. అనావిద్ధ (వికారరహిత) భావములను నిరూపించుటయం దిది ప్రయుక్తము.*

నాసాకర్మ

ఇప్పుడు నాసాకర్మను వివరింతును. నత, మంద, వికృష్ట, సోచ్ఛ్వాస, వికూణిత, స్వాభావిక అనెడి భేదములచే నాసిక (ముక్కు) ఆరు విధములు. వీని లక్షణములను, వినియోగములను ఇప్పుడు వివరింతును—

1. నత— నాసాపుటములు (ముక్కు దొప్పలు) మాటి మాటికిని శ్లిష్టములగుచో అది 'నత నాసిక' అనబడును. మదోత్కంపముతో కూడిన నిశ్శ్వాసము నందును, ప్రియురాలిని అనునయించుటయందును, మెల్లగా ఆగి ఆగి ఏడ్చుట యందును ఇది ప్రయుక్తమగును.

2. మంద— నాసాపుటములు నిశ్చలములయినచో 'మంద' అనబడును. నిర్వేద-ఔత్సుక్య-చింతా-శోకములం దిది ప్రయుక్తము.

3. వికృష్ట— నాసాపుటములు పెద్దవి అగుచో 'వికృష్ట' అనబడును. తీవ్రగంధము నాఘ్రాణించుట యందును, రౌద్ర-వీరములందును ఇది ప్రయుక్తము.

4. సోచ్ఛ్వాస—లోనికి గాలిని పీల్చుకొనుచో 'సోచ్ఛ్వాస' అనబడును. ఇష్టమైనవానిని వాసనచూచుటయందును, ఉచ్ఛ్వాసమునందును ఇది ప్రయుక్తము.

5. వికూణిత—నాసిక సంకుచితమగుచో 'వికూణిత' అనబడును. జుగుప్సా-అసూయలం దిది ప్రయుక్తము.

6. స్వాభావిక— నాసిక సమముగా ఉండుచో 'స్వాభావిక' అనబడును. తక్కిన భావములం దిది ప్రయుక్తమగును.

గండములు

ఇంక గండ (చెక్కిలి) భేదములను వివరింతును. క్షామ-ఫుల్ల-ఘూర్ణ-కంపిత-కుంచిత-సమ భేదములచే గండము ఆరు విధములు. వీని లక్షణములను, వినియోగములను వివరింతును—

* [కాశీముద్రణమునందు 98-128 శ్లో: బొంబాయిముద్రణమునందు 94-125 శ్లో: బరోడాముద్రణమునందు 96-125 శ్లో.]



1. క్షామము— చెక్కిళ్ళు దిగజారినచో 'క్షామగండ' మనబడును. ఇది దుఃఖమందు ప్రయుక్తము.

2. ఫుల్లము—చెక్కిళ్ళు వికసితములయినచో 'ఫుల్ల' మనబడును. సంతోషమందిది ప్రయుక్తము.

3. ఘూర్ణము (పూర్ణము)—చెక్కిళ్ళు పెద్దవిఅగుచో 'ఘూర్ణ' మనబడును. ఉత్సాహ-గర్వములం దిది ప్రయుక్తము.

4. కంపితము—చెక్కిళ్ళు అదరుచో 'కంపిత' మనబడును. రోష-హర్షములం దిది ప్రయుక్తము.

5. కుంచితము— చెక్కిళ్ళు సంకుచితములగుచో 'కుంచిత' మనబడును. రోమాంచమును కలిగించు స్పర్శమందును, శీత-భయ-జ్వరములందును ఇది ప్రయుక్తమగును.

6. సమము (ప్రాకృతము)— చెక్కిళ్ళు సహజములుగా ఉన్నచో 'సమ' మనబడును. తక్కిన భావములం దిది ప్రయుక్తము.

అధర కర్మ

ఇప్పుడు అధర (క్రింది పెదవి) కర్మను వివరింతును. వివర్తన-కంపన-విసర్గ-వినిగూహన-సందష్టక-సముద్గ భేదములచే అధరకర్మ ఆరువిధములు[11]. వీని లక్షణములను, వినియోగములను వివరింతును—

1. వివర్తనము— పెదవులను ప్రక్కకు ముడుచుట 'వివర్తన' మనబడును. అసూయా-వేదన-అవమాన-హాస్యాదులం దిది ప్రయుక్తమగును.

2. కంపనము— అధరము కంపించుట 'కంపన' మనబడును. వేదనా-శీత-భయ-రోష-జవాదులం దిది ప్రయుక్తము.

3. విసర్గము— అధరమును ముందునకు పొడిగించుట 'విసర్గ' మనబడును. స్త్రీల యొక్క విలాస-బిబ్బోక-రంజనముల (పెదవులకు రంగువేసికొనుట) యందిది ప్రయుక్తము.

4. వినిగూహనము— అధరమును లోపలకులాగుట 'వినిగూహన' మనబడును. ఆయాసమందిది ప్రయుక్తమగును.

11. కుమారగిరిరెడ్డి తన వసంతరాజీయములో (అలభ్యము) పది అధర భేదములను చెప్పినట్లు శాకుంతల వ్యాఖ్యలో కాటయవేముడు పేర్కొనినాడు. ఆ శ్లోక మిది—

వివర్తితో వికాసీ చ విసృష్టశ్చ నిగూహితః । ఆయతో రేచితో వృత్తః సందష్టశ్చ సముద్గకః ॥
కంపితశ్చేతి నాట్యజ్ఞై రధరో దశధా మతః ।

వీని లక్షణ-వినియోగములు మాత్రము తెలియలేదు.

5. సందష్టకము— అవుడు కరచుట 'సందష్ట' మనబడును. క్రోధమందిది ప్రయుక్తము.

6. సముద్గము— పెదవులు సహజముగా, ఉన్నతముగా ఉండుట 'సముద్గ' మనబడును. అనుకంపా (దయ) అభినందన - చుంబనము లందిది ప్రయుక్తము.

చిబుక కర్మ

జిహ్వా-దంత-ఓష్ఠకర్మల ననుసరించిఉండెడి చిబుక (గడ్డము) కర్మ నింక వివరింతును. కుట్టన-ఖండన-ఛిన్న-చుక్కిత-లేహిత-సమ-దష్ట భేదములచే చిబుక కర్మ ఏడు విధములు. వీని లక్షణములను, వినియోగములను వివరింతును—

1. కుట్టనము— పళ్ళను కొరుకుట 'కుట్టన' మనబడును. క్రోధ-భయ-శీత-జ్వర-జరా-వ్యాధులం దిది ప్రయుక్తము.

2. ఖండనము— మాటి మాటికి పెదవులను అప్పళించుట 'ఖండన' మనబడును. జపాఽధ్యయన-సల్లాప-భక్షణములం దిది ప్రయుక్తము.

3. ఛిన్నము— పెదవులను గట్టిగా నొక్కిపట్టుట 'ఛిన్న' మనబడును. వ్యాధి-భయ-శీత-రోదన-మరణ-వ్యాయామములందును, కోపముగా చూచుట యందును ఇది ప్రయుక్తమగును.

4. చుక్కితము (చుక్షితము)— పెదవులను ఎడముగా ఉంచుట 'చుక్కిత' మనబడును. ఆవులించుటయం దిది ప్రయుక్తము.

5. లేహనము (లేహితము)— నాలుకతో పెదవులను నాకుచుండుట 'లేహన' మనబడును. లోలత్వ నిరూపణమం దిది ప్రయుక్తము.

6. సమము— రెండు పెదవులును మామూలుగా కలిసిఉండుట 'సమ' మనబడును. స్వభావ భావములను నిరూపించుటయం దిది ప్రయుక్తము.

7. దష్టము— పైపళ్ళచే క్రింది పెదవిని కరచిపట్టుట 'దష్ట' మనబడును. క్రోధమం దిది ప్రయుక్తము,*

ఆస్యకర్మ

ఇంక ఆస్య (నోరు) కర్మను వివరింతును. వినివృత్త-విధుత-నిర్భుగ్న-భుగ్న-వివృత-ఉద్వాహి భేదములచే ఆస్యకర్మ ఆరు విధములు. వీని లక్షణములను వినియోగములను వివరింతును—

*[కాశీ ముద్రణమునందు- 124-149 శ్లో; బొంబాయి ముద్రణమునందు- 125-149 శ్లో ; బరోడా ముద్రణమునందు-129-153 శ్లో.]



1. వినివృత్తము— మూతిని ప్రక్కకు త్రిప్పుట 'వినివృత్త' మనబడును. స్త్రీల యొక్క అసూయా-ఈర్ష్యా-కోప-అవమానములం దిది ప్రయుక్తమగును.

2. విధుతము— మూతిని అడ్డముగా చాచుట 'విధుత' మనబడును. అడ్డగించుట యందును, 'ఇట్లు కా' దని చెప్పుట మొదలగువాని యందును ఇది ప్రయుక్తమగును.

3. నిర్భుగ్నము— మూతిని క్రిందికి వంచుట 'నిర్భుగ్న' మనబడును. గంభీరాలోకనాదులం దిది ప్రయుక్తము.

4. భుగ్నము (వ్యాభుగ్నము)— నోరు కొంచెము పెద్దది అగుట 'భుగ్న' మనబడును. ఇది యతులకు స్వభావజము; ఇంకను లజ్జా-నిర్వేద-ఔత్సుక్య-చింతా వినయములందు కూడ ప్రయుక్తమగును.

5. వివృతము— నోరు విప్పుట 'వివృత' మనబడును. ఇది హాస్య-శోక-భయాదులందు ప్రయుక్తము.

6. ఉద్వాహి— మూతిని పైకెత్తుట 'ఉద్వాహి' అనబడును. స్త్రీల యొక్క లీలా-గర్వములందును, అనాదరగమనమునందును, కోపవాక్యములందును ఇది ప్రయుక్తమగును.

ఇంతకు ముందు వివరింపబడిన సమము, సాచీకృతము మున్నగు దృష్టి భేదముల ననుసరించియే ఈ ముఖకర్మ కూడ ప్రయుక్తము కావలయును.

ముఖరాగములు

అర్థసంశ్రయములైన ముఖరాగములు స్వాభావిక-ప్రసన్న-రక్త-శ్యామ భేదములచే నాలుగు విధములు—

1. స్వాభావికము— ఇది స్వభావాభినయాశ్రయము. మధ్యస్థాది భావ ములం దిది ప్రయుక్తము.

2. ప్రసన్నము—అద్భుత-హాస్య-శృంగారములం దిది ప్రయుక్తము.

3. రక్తము (ముఖము ఎఱ్ఱబడుట)— వీర-రౌద్ర-మద-కరుణములం దిది ప్రయుక్తము.

4. శ్యామము (ముఖము నల్లబడుట)— భయానక - బీభత్సములం దిది ప్రయుక్తము.

ఏవం భావరసార్థేషు ముఖరాగం ప్రయోజయేత్।
శాఖాంగోపాంగసంయుక్తః కృతోఽప్యభినయః శుభః॥ 165

ముఖరాగ విహీనస్తు నైవ శోభాన్వితో భవేత్
శారీరాభినయోఽల్పోఽపి ముఖరాగ సమన్వితః॥ 166

ద్విగుణాం లభతే శోభాం రాత్రావివ నిశాకరః ।
నయనాభినయోఽపి స్యాన్నానాభావరసస్ఫుటః॥ 167

ముఖరాగాన్వితో యస్మా న్నాట్యమత్ర ప్రతిష్ఠితమ్ ।
యథా నేత్రం ప్రసర్పేత ముఖభ్రూదృష్టి సంయుతమ్॥ 168

తథా భావరసోపేతం ముఖరాగం ప్రయోజయేత్ । 169

—పై విధముగా ముఖరాగములు ఆయా రస-భావ-అర్థములందు ప్రయుక్తము కావలెను. శాఖా-అంగ-ఉపాంగ-సంయుక్తమైన అభినయము చక్కగా నెరవేర్ప బడినను ముఖరాగహీనమైనచో అది శోభాన్వితము కాజాలదు. రాత్రియందు నిశాకరుడు ద్విగుణమైన శోభను పొందునట్లే ముఖరాగ సమన్వితమైన శారీరాభి నయము అల్పమైనప్పటికిని, అధికమైనశోభను పొందును. నయనాభినయము కూడ ముఖరాగాన్వితమైనప్పుడే నానాభావ-రస స్ఫోరకమగును. కావున ముఖరాగ మందే నాట్యము ప్రతిష్ఠితమైఉన్నది. ముఖ-భ్రూ-దృష్టి-సంయుతముగా నేత్రము ఎట్లు ప్రసరించునో అట్లే ముఖరాగము భావ-రసోపేతముగా ప్రయుక్తముకావలెను. భావ-రసాశ్రయమైన ముఖరాగ ప్రాముఖ్యమును ప్రయోక్తలు తప్పక గుర్తించ వలెను.

గ్రీవాకర్మ

ఇప్పుడింక గ్రీవా (మెడ) కర్మను వివరింతును. సమ, నత, ఉన్నత, త్ర్యశ్ర, రేచిత, కుంచిత, అంచిత, వలిత, వివృత్త భేదములచే గ్రీవాకర్మ తొమ్మిది విధ ములు. వీనిలక్షణములను, వినియోగములను వివరింతును—

1. సమ— స్వాభావికముగాఉండు మెడ 'సమగ్రీవ' అనబడును. ధ్యాన-స్వభావ-జపములం దిది ప్రయుక్తమగును.

2. నత— ముఖమును క్రిందికి వంచునప్పటిమెడ 'నత' అనబడును. నగలు ధరించుకొనుట, కౌగిలించుకొనుట మొదలగువానియందిది ప్రయుక్తము.

3. ఉన్నత— ముఖమును పైకెత్తుటచే ఎత్తబడిన మెడ 'ఉన్నతగ్రీవ' అనబడును. పైకి చూచుటయందిది ప్రయుక్తము.

4. త్ర్యశ్ర— ముఖముతోబాటు ప్రక్కకు త్రిప్పబడిన మెడ 'త్ర్యశ్రగ్రీవ' అనబడును. దుఃఖము నందును, అంసము మీద బరువున్నప్పుడును ఇది ప్రయుక్తము.

5. రేచిత— ఇటునటు ఆడింపబడిన మెడ 'రేచితగ్రీవ' అనబడును. భావించుట, కవ్వము త్రిప్పుట, నృత్తము అనువానియం దిది ప్రయుక్తము.



6. కుంచిత— కొంచెము క్రిందికి వంచబడిన మెడ 'కుంచితగ్రీవ' అనబడును. నెత్తిమీద బరువున్నప్పుడును, మెడను రక్షించుకొనుటయందును ఇది ప్రయుక్తము.

7. అంచిత— శిరముతోబాటు వెనుకకు వంచబడిన మెడ 'అంచితగ్రీవ' అనబడును. జుట్టు ముడివేసికొనుట, మీదకు చూచుట మొదలగువానియం దిది ప్రయుక్తము.

8. వలిత— ప్రక్కకు త్రిప్పబడిన మెడ 'వలితగ్రీవ' అనబడును. ముఖ మును త్రిప్పి చూచుటయం దిది ప్రయుక్తము.

9. వివృత్త— అభిముఖముగాఉన్న మెడ 'వివృత్తగ్రీవ' అనబడును. స్వస్థాన మందుండి ఎదుటివానిని చూచుటయం దిది ప్రయుక్తము.

ఇట్లు లోకస్వభావ ప్రదర్శకములైన 'గ్రీవాభేదము' లనేకములు కలవు. ఈ గ్రీవాకర్మ అంతయును శిరఃకర్మననుసరించి ఉండునని తెలియవలెను.

శీర్షమునకును, ఉపాంగములకును సంబంధించిన అభినయములను, లక్షణము లను వివరించితిని. ఇంక శేషించిన అంగకర్మను క్రమముగా వివరింతును.*

అష్టమాధ్యాయము సమాప్తము

## విశేషాంశములు

### 1. అభినయము

6 వ అధ్యాయమందు అభినయము నాలుగు విధములని చెప్పబడెను కదా. ఇప్పుడు అభినయములు క్రమముగా వివరింపబడుచున్నవి. అభినయమనునదియెల్ల నాట్యసంశ్రయమే అనియు, లోక సంశ్రయము కాదనియు అభినయములే నాట్యమును లోకమునుండి వేరు పరచుచున్నవనియు ప్రథమాధ్యాయమందు గుర్తించి ఉన్నాము. ఇప్పుడీ అధ్యాయమందు అభినయమనెడి పదమునకు రెండు నిర్వచనము లొసంగబడినవి. ఇందు మొదటిది పదము యొక్క వ్యుత్పత్తిని తెలుపుచున్నది. రెండవది ఆంగికాభినయముయొక్క ప్రయోజన మును తెలుపుచున్నది. ప్రయోగ సమయములో నటుడు ఈ అభినయముల సాహాయ్యమున రూపకమునందలి అర్థములను సామాజిక హృదయగోచరములను చేయుచున్నాడు. కావున నాట్యమనగా రూపకప్రయోగమనియు (వట్టినాటకరచనామాత్రము కాదనియు), అభినయ మనునది నటుని వ్యాపారమనియు స్పష్టమగుచున్నది. ప్రథమాధ్యాయమందు నాట్య స్వరూపము వివరింపబడినది. అచ్చట చెప్పినవిధముగా నాట్యము సర్వప్రకృతులను, సర్వ

*[కాశీ ముద్రణమునందు-149-172 శ్లో; బొంబాయి ముద్రణమునందు-150-174 శ్లో; బరోడా ముద్రణమునందు-153-177 శ్లో].

ఈ అధ్యాయమందలి క్లిష్టపదముల వివరణమునకు గ్రంథాంతమునగల పదముల పట్టికను చూడవలెను. (పుటలు - 912-14).

భావములను అనగా మానవవ్యాపారమునంతటిని అనుకరించుచున్నది. కావున నటుడు సర్వమానవ వ్యాపారమును ప్రదర్శించవలసి ఉన్నది. మానవ వ్యాపారమంతయును మనో-వాక్-కాయభేదములచే మూడువిధములు. ఈమూడువ్యాపారములును నాట్యమందు సాత్త్విక-వాచిక-ఆంగికములనెడి అభినయము లగుచున్నవి. నాలుగవదిఅయిన ఆహార్యాభినయము వీనియందు అంతర్గతమైఉన్నది (ఆహార్యాభినయ మనగా వేషధారణాదులు).

రూపకార్థములను సామాజికునకు సువ్యక్తముచేయుటయే అభినయ ప్రయోజనము. ఈ అభినయముచేయువాడే అభినేత (నటుడు) అనబడును. రూపకప్రయోగపరమప్రయోజనము సామాజికునియందు రసోత్పత్తిని కలిగించుటయే. ప్రయోగార్థములు సుస్పష్టముగా హృదయగోచరములై అనుభూతికి వచ్చినప్పుడే సామాజికునియందు రసోత్పత్తి కాగలదు. కావున నటుడు ఈ అభినయములసాహాయ్యమున సామాజికులయందు రసోత్పత్తిని కలిగించుచున్నాడని సారాంశము. అందుచేతనే "రసభావాదివ్యంజకమైన చేష్టావిశేషము అభినయ మనబడు"నని మల్లినాథుడు పేర్కొనియుండెను [కిరాతార్జునీయ వ్యాఖ్య-10 వ సర్గ-42 శ్లో]. 6 వ అధ్యాయమందలి 16 వ అధస్సూచికను కూడ చూడవలెను.

'నీ' ధాతువునకు 'నడిపించు' అను అర్థము కూడ కలదు. ఈ అర్థమును గ్రహించి "ఎవడైతేనడిపించగలవాడో వాడు అభినేత (నటుడు). నడిపించేదెవరిని? మానవసంఘాన్ని, మానవ సమాజాన్ని..." అని నాట్యకళాప్రపూర్ణ శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారు కృష్ణాపత్రికలో ఒకసారి వ్రాసినారు.

## 2. రూపకము : ప్రదర్శనావశ్యకత

నాట్యమనగా రూపకప్రయోగమని పైన తెలిపిఉన్నాను. రూపకమును రచించునతడు కవి, దానిని ప్రయోగించువారు ప్రయోక్తలు. వీరిలో ఎవరు ముఖ్యులు అను విషయమున విమర్శకులు భిన్నాభిప్రాయులై ఉన్నారు. ఇది భారతీయాలంకారికులలో తీవ్రసమస్య కాలేదు కాని పాశ్చాత్యులలో ఇది నేటికిని ఒక ఎడతెగని సమస్యయే.

భరతుడు నాట్యశాస్త్రమందు కవి రూపకమును రచించువిధానమునే కాక దానిని నటులు ప్రయోగించు విధానమును కూడ సమగ్రముగా తెలిపెను. అందుచేతనే భరతుడు నాట్యమండప నిర్మాణాదులను కూడ వివరించవలసివచ్చినది. ఇట్లు భరతుడు రెండింటిని ఉద్దేశించి ఉండుటచేతనే "నాట్యశాస్త్రము కవి-ప్రయోక్త లిరువురి నుద్దేశించి ప్రవర్తితమైన" దని అభినవగుప్తుడు పేర్కొనెను. "కావ్యమనగా ముఖ్యముగా దశరూపాత్మకమే. అందు, ఉచితములైన భాషా-వృత్తి-కాకు-నైపథ్యాదులచే రసవత్త సమగ్రమగుచున్నది... కావ్యమనగా నాట్యమే" అని అభినవగుప్తుడు పేర్కొనుటలో కూడ [అభినవభారతి - 1వ. సం- పుట 292] ప్రయోగింపబడెడి రూపకమే ఉద్దిష్టమైనదనుట స్పష్టము. కావున కవులకును, నటులకును సమాన ప్రాముఖ్యమును భరతాభినవగుప్తు లంగీకరించిఉన్నారనుట నిస్సంశయము. "సందర్భేషు దశరూపకం శ్రేయః. తద్ధిచిత్రం చిత్రపటవ ద్విశేషసాకల్యాత్" అని వామనుడు పేర్కొనుట గమనార్హము [కావ్యాలంకారసూత్రము-2 వ అధికరణము-1 వ అధ్యాయము].



కాని భోజుడు 'శృంగారప్రకాశ' ప్రథమాధ్యాయమందు క్రింది విధముగా పేర్కొనినాడు[డా. రాఘవన్‌గారి "భోజుని శృంగారప్రకాశము"—పుట 80 చూడవలెను].

"స (రసః) చ అనుభవైక గమ్యత్వాత్ అసర్వవిషయత్వాచ్చ దురవసేయః. సమ్యగభినయేషువా విదగ్ధ శైలూషైః ప్రదర్శ్యమానః సామాజికై రవధార్యతే. ప్రబంధేషు వా మహాకవిభిః యథావద్ ఆఖ్యాయమానః విదుషాం మనీషావిషయ మవతరతి. తత్ర న తథా పదార్థాః ప్రత్యక్షేణ ప్రతీయమానాః స్వదంతే, యథావాగ్మినాం వచోభిరావేద్యమానాః... అతోఽభినేతృభ్యః కవీనేవ బహుమన్యామహే ; అభినయేభ్యశ్చ కావ్యమేవేతి."

ఈ సందర్భమున కొన్ని పదముల అర్థములను నిర్ణయించుకొనుట ముఖ్యము. దృశ్యకావ్యము, ప్రేక్ష్యకావ్యము, నాట్యము, రూపము, రూపకము అనుపదములు పర్యాయపదములుగా వాడబడుచున్నవి. వీనిలో దృశ్య - ప్రేక్ష్యములు సమానార్థకములే. రెండును ప్రదర్శన ప్రాధాన్యమునే నొక్కి చెప్పుచున్నవి. దేవేంద్రాదులు బ్రహ్మను దృశ్యమును, శ్రవ్యమును అయిన క్రీడనీయకమును సృజించుమని ప్రార్థించిరి. ఇచ్చట దృశ్య మనగా దర్శింపదగినదనియే అర్థము. కేవలము దర్శింపదగినదియే కాక అది వినదగినదికూడ కావలెనట. అందుచే అచ్చట రెండింటికిని ప్రాధాన్యముచెప్పబడినది. నాట్య పదోత్పత్తినిగూర్చియు, దాని అర్థమును గూర్చియు, 4 వ అధ్యాయాంతమందలి 7 వ విశేషాంశములలో చర్చించి ఉన్నాను. ఇంక రూపము, రూపకము అను పదము లున్నవి. "అవస్థానుకరణము నాట్య మనబడును. అది - దృశ్యమాన మగుటచే రూప మనబడుచున్నది; రామాద్యవస్థారోపణముచే రూపక మనబడుచున్నది" అని ధనంజయ - ధనికులు పేర్కొనియున్నారు. నాట్యశాస్త్రమందు 'రూప' మను పదము కలదేకాని 'రూపక' మను పదము లేదు. అభినవగుప్తుడు మాత్రము రెండు పదములను వాడెను. భరతుడు 'దశరూపాధ్యాయ' మనగా ధనంజయుడు తన గ్రంథమును 'దశరూపక' మనెను. 10, 11 శతాబ్దముల తరువాత 'రూప' మనెడి పదము వ్యవహారమునందు లేదని చెప్పవచ్చును. నాట్య-రూపక పదములను సింగభూపాలుడీ క్రింది విధముగా నిర్వచించెను— "ఇదివరకు చెప్పిన రసమున కాధారమగునది నాట్యము, రూపకము నని చెప్పఁబడుచున్నది. మిక్కిలి నేర్పరియగు నటుని కర్మయగుటచే నాట్యమని పేరు కలిగినది. ముఖాదులయందుఁ బద్మాదులకారోప మున్నప్పుడు 'రూపకాలంకార' మని చెప్పఁబడినట్లే ఇచ్చటఁగూడ, నటునియందు నాయకారోప మున్నందున (నటుడు నాయకరూపమును ధరించినందున) దీనికి రూపకమనియుఁ బేరు" [రసార్ణవసుధాకరము—శ్రీ బులుసువారి అనువాదము-పుట 653].

పై పదముల అర్థములు ప్రదర్శనావశ్యకతను నొక్కిచెప్పుచున్నవి. ప్రదర్శనమునకిచ్చిన ప్రాధాన్యమును బట్టి కవి, నటుడు సమాన గౌరవము కలవారనుట స్పష్టము. స్మృతులు నటుని, నటకర్మను నింద్యముగా చూచినవి. భోజునిపై దాని ప్రభావముకూడ ఉండిఉండును. అందుచేతనే అతడు నటులను చిన్నచూపు చూచినాడు. నాటకమును చూచినప్పుడు కలుగునట్లే కావ్యమును కాని, నాటకమును కాని చదివినప్పుడును మనకు రసాస్వాదము కలుగుచున్నది. కాని, సంగీతాద్యుపకరణములతో కూడిన చక్కని నాటక ప్రయోగమందు అంతకంటె సులభముగా రసాస్వాదము కలుగుననుట సత్యము. అయినను

మహిమభట్టు చెప్పినట్లు కావ్య-నాట్యములు రెండును ఉపాయమాత్ర భేదములే అనియు, రెండింటి ఫలమందును భేదము లేదనియు గ్రహించుట సమంజసము. మరియు ఆతడు కావ్య-నాట్య భేదములనువివరించెడి ఒక శ్లోకమును ఉదాహరించియుండెను. [ఇది ఎవరిదో తెలియదు]—

"అనుభావవిభావానాం వర్ణనా కావ్యముచ్యతే। తేషామేవ ప్రయోగస్తు నాట్యం గీతాదిరంజితమ్॥"

— అనుభావ-విభావముల వర్ణనయే కావ్యమగును. గీతాదులతోఁ గలిపి యా యను భావాదులను ప్రయోగించుటయే నాట్యమగును" [వ్యక్తివివేకము-శ్రీ భాగవతులవారి అనువాదము-పుట 86-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక].

పాశ్చాత్యమతము: విషాద రూపకములు చక్కగా ప్రదర్శింపబడిన ప్రదర్శింపబడ వచ్చుననియు; కాని నటన, ఆహార్యము మొదలగునవి దాని ఘనత నెక్కువ చేయజాలవనియు, దాని ఘనత అంతయును రచనలోనే ఉన్నదనియు అరిష్టాటిల్ అభిప్రాయము. వాని వాక్యములు కొన్ని 13వ అధ్యాయమందలి ఒకటవ విశేషాంశములోకూడ పేర్కొం దును. మరికొన్ని వాక్యములు—

"...For the plot ought to be so constructed that, even without the aid of the eye, he who hears the tale told will thrill with horror and melt with pity at what takes place...But to produce this effect by the mere spectacle is a less artistic method..."[ Butcher's translation of "Poetics." p. 49.]

"...Tragedy like Epic poetry produces its effect even without action; it reveals its power by mere reading" [ Butcher's translation of "Poetics"—p. 109.]

కాని, ఈ అభిప్రాయమును వాని వ్యాఖ్యాతలే అంగీకరించలేదు. "ట్రాజెడీని చదువు నప్పుడును, ప్రదర్శింపగా చూచినప్పుడును ఒకేరకపు అనుభూతి కలుగుననుట సమంజసము కాదు; ప్రదర్శింపబడినచో మూఢులుకూడ గ్రహించి ఆనందింపగలరు. కాని చదివినప్పుడు విద్యావంతులు మాత్రమే గ్రహించి ఆనందింపగలరు. రూపకమనగా ప్రయోగమునకుద్దిష్ట మైనదనియే గ్రహించవలెను. రచయిత ప్రయోగదృష్టితోనే రూపకమును రచించును" అని ఎల్. కాస్టెల్‌వెట్రో [క్రీ. శ. 1570.] అను ఇటలీదేశస్థుడు పేర్కొనియున్నాడు. కాని తరువాతివారగు నటులు, నాటకకర్తలుకూడ నటనకే ఎక్కువప్రాముఖ్యమిచ్చుట జరిగినది. కొందరు నాటకకర్తను నామమాత్రముగా ఎంచియున్నారు. వివరములకు డా. రాఘవన్‌గారి వ్యాసమును పరిశీలించవలెను, [Bhoja's Sṛngara Prakasa-pp. 81-86.] స్టానిస్‌లావ్‌స్కీ కూడ కవిప్రాధాన్యమును గుర్తించినాడు.

### 3. ఆంగికాభినయ భేదములు

ఆంగికాభినయ భేదములను జాయపసేనాపతి 'నృత్తరత్నావళి'లో క్రిందివిధముగా వివరించెను ["భరతకోశము"-పుట 798 చూడవలెను.]—

శారీరాభినయమనగా శాఖా-అంగ-ఉపాంగ ప్రత్యంగాభినయము; ముఖజాభినయ మనగా కేవల ఉపాంగాభినయము; చేష్టాకృతమనగా శాఖా-అంగ-ఉపాంగ సహితమైన స్థాన-ఆసన-గత్యాది చేష్టాయుతమగు అభినయము (శారీరాభినయమందు వ్యక్తి కూర్చుండిన



లేదా నిలిచినచోటునుండి కదలకపోవచ్చును. కాని చేష్టాకృతమునందు చలనమే ప్రధానము.) [నృత్తరత్నావళి-పుటలు 12-13]

అభినయ వస్తువనగా అభినయమం దుపయుక్తములగు అంగాదులు; అంతియేకాక అభినయముచేయబడు పద్ధతి అని కూడ చెప్పవచ్చును. వీనినిగూర్చి విప్రదాసుడు క్రింది విధముగా వివరించెను—(1) శాఖ - ఇందు హస్తాభినయము ప్రధానము. (హస్తములు అంగములలోనివి. ఇందు హస్తములతోబాటు తక్కిన అంగములును కదలుచుండును. కావున ఇది శారీరాభినయమునకు సంబంధించినది). (2) అంకురము. ఇందు దృష్టివ్యాపారము ప్రధానము. భూతవాక్యార్థసూచనారూపమగుటచే ఇది అంకురమనబడినది (దృష్టికి సంబంధించిన నేత్రములు ఉపాంగములలోనివి. ఇందు నేత్రములతోబాటు తక్కిన ఉపాంగములును కదలుచుండును. ఉపాంగము లన్నియును ముఖములోనివి కాన ఇది ముఖజాభినయమునకు సంబంధించినది). (3) నృత్తము - స్థానకాదులచే ఉపక్రాంతమును, హస్తకాదులచే ప్రవర్తితమును-కరణ అంగహార నిష్పన్నమును అగునది నృత్తమనబడును. (ఇది చేష్టాకృతమగు ఆంగికాభినయములో ఒక భేదము మాత్రమే. ఇదికాక ఇంకను రెండు భేదములుకలవు వానిలో మొదటిది నృత్యాభినయమునకు సంబంధించినది. రెండవది స్థాన-ఆసన-గత్యాదులకు సంబంధించినదై నాట్యమం దుపయుక్తమగునది.) [భరతకోశము-పుట 798 చూడవలెను.]

అభినవగుప్తుని వ్యాఖ్యానము లభించియున్నచో ఇంకను వీనిని స్పష్టముగా వివరించుటకు వీలయ్యెడిది.

### 4. అభినయము : నాట్యము

ఈ అధ్యాయమందు శిరస్సుకును, ఉపాంగములకును సంబంధించిన అభినయవిధానము చెప్పబడినది. తరువాతి అధ్యాయమందు తక్కిన అంగములయొక్కయు, ఉపాంగముల యొక్కయు అభినయము వివరింపబడును.

అభినయదర్పణాదులను బట్టి చూచినచో ఈ అభినయవిధాన మంతయును నృత్యమునకు మాత్రమే సంబంధించిఉన్నట్లు తెలియుచున్నది. కాని నాట్యశాస్త్రమం దిట్టి ప్రత్యేకత కన్పట్టుటలేదు. ఇందలి అభినయవిధాన మంతయును ప్రధానముగా నాట్యమునకు అనగా రూపక ప్రయోగమునకు సంబంధించిఉన్నది. ఈ విషయమును పాఠకులందరును ముఖ్యముగా గమనించవలెను. తరువాతి అధ్యాయాంతమున ఈ విషయమునింకను వివరింతును.

ఇందు శిరోభేదాదులు కొన్నిమాత్రమే వివరింపబడినవి. ఇంకను అధిక భేదములు కలవనియు వానిని లోకమునుండి గ్రహించవలెననియు, లోకానుగుణముగా వానిని ప్రయోగించవలెననియు భరతుడు నిర్దేశించెను. ఇందు చెప్పబడిన ఉపాంగ కర్మలన్నియును ఒండొంటికి సంబంధించిఉన్నవి. గ్రీవాకర్మ శిరఃకర్మ ననుసరించిఉండును. ఆస్యకర్మ దృష్టిభేదముల ననుసరించి ఉండును. చిబుక కర్మ జిహ్వా-దంత-ఓష్ఠ కర్మల ననుసరించి ఉండును. భ్రూకర్మ తారా పుట కర్మల ననుసరించి ఉండును. దర్శన ప్రకారములు తారాకర్మకు సంబంధించి ఉండును. ఇట్లే అంగములు కూడ ఒండొంటితో సంబంధించిఉండును. కావున ఏదేని ఒక భావమును లేదా వివిధ భావములను ప్రదర్శించవలసి వచ్చినచో శరీరమంతయును కదలు

నని గ్రహించవలసి ఉన్నది. ఆయాకర్మ లొండొంటితో సంబంధించిఉన్న విషయమును అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యలో రాఘవభట్టు పేర్కొనియున్నాడు. ఉదా:

వృక్షసేచనమును నిరూపించుటకు అవధూత శిరముతో, అధోముఖ ఆస్యముతో శరీరమును కొంచెముగా వంచి, భుజములయొద్ద నలినీ-పద్మకోశ హస్తములను పట్టవలెను.

భ్రమర బాధను విధుత శిరముతో, కంపితాధరముతో, ముఖమునొద్ద పరాఙ్ముఖముగా ఉంచిన చంచలమైన పతాక హస్తముతో నిరూపించవలెను.

పై నిరూపణమంతయును కేవలము అభినయము మాత్రమే. చేతిలో జలఘటము, నేలమీద పూలమొక్కలు, తుమ్మెద, అద్దము, పూలదండ మొదలైనవి నిజముగా ప్రదర్శింపబడనక్కరలేదు. ఆయా అభినయములను చేసినచో ఆయా అర్థములను సంస్కారులైన ప్రేక్షకులు సులువుగా గ్రహింపగలరు. 'రియలిజమ్' పేరుతో ఒకవేళ పై వస్తువులను రంగస్థలముమీద ప్రవేశపెట్టినప్పుడు కూడ పై అభినయమునే, తెలియకుండగనే, నటులు చేయుచుండుట గమనార్హము. తెలిసి చేసినచో మరింత సొగసుగా ఉండుననుట నిస్సంశయము.

ఈ అధ్యాయమందు చెప్పబడిన దృష్టిభేదములును, ఆస్యరాగములును నాట్యమందు చాల ప్రధానమైనవి. వీనియందే నాట్యము ప్రతిష్ఠితమై ఉన్నదని భరతుడు పేర్కొనెను. నాట్యమండపము పెద్దదైనచో ముఖరాగాదులు స్పష్టముగా గోచరింపవనియు, అందుచే మధ్యమమండపమే శ్రేష్ఠమనియు రెండవ అధ్యాయమందు చెప్పబడినదికదా. ఇందు 36 దృష్టిభేదములు చెప్పబడినవి. ఇవి రస-భావముల పేర్లతో పిలువబడినను వానియందు కొంత భేదమున్నది. వ్యభిచారిభావములు ముప్పదిమూడుండగా అవి ఇరువది భేదములందే కుదింపబడుట గమనార్హము. దృష్టికర్మయందు నిపుణుడైన నటుడు సర్వభావములను అనాయాసముగా ప్రదర్శింపగలడు; ఆ కన్నులలో నిప్పులు కురిపింపగలడు, ప్రశాంతతను వెదజల్లగలడు, శృంగారమును లలితముగా వ్యక్తము చేయగలడు, శోకముతో హృదయములను ద్రవింపచేయగలడు. ఇట్లే ఇతర భావములనెల్ల నిరూపింపగలడు.

భారతదేశమున ప్రాచీనకాలమునుండియు అభినయవిధాన మెట్లు క్రమపరిణతినొందెనో స్పష్టముగా తెలియదు. ఆయా శాస్త్రకర్తలు మాత్రము హస్తాదుల కర్మలను కొన్నింటిని క్రొత్తగా చేర్చుచు వినియోగములను అధికముగా చెప్పుచు వచ్చిరి. కాని, పాశ్చాత్య దేశములం దిట్టి క్రమపరిణామమును విమర్శకులు స్పష్టముగా గుర్తించి ఉన్నారు— "In Greece, the tragic actor was static— a voice and a presence; in Rome he was lively, and, in the last resort, an acrobat. The Commedia dell'arte demanded above all a quick wit and a nimble body; French tragedy once again asked for a fine presence and a sonorous voice; Restoration comedy must have called for a polished brilliance and a gentlemanly insolence. The melodrama of the nineteenth century could only make its full effect when its actors 'tore a passion to tatters', and the modern comedy which replaced it gives little scope for gesture or raised voices. Yet the true actor still needs to be a little of everything—singer, dancer, mimic, acrobat, tragedian, comedian—and to have at his command a good physique, a retentive memory, an alert brain, a clear, resonant voice with good articulation and controlled breathing......Much of an actor's art must be born in him; something may be taught. The ideal is a good balance of intuition and hard work, tempered by all-round experience." [Oxford Companion to the Theatre –P. 10.]

# అధ్యాయము 9

## అంగాభినయము[1]

[కాశీ ముద్రణమునందు 9 వ అధ్యా–207 శ్లోకములును, 10 వ అధ్యా. 55 శ్లోకములును కలవు. బొంబాయి బరోడా ముద్రణములందు ఈ రెండు అధ్యాయములును కలిసి ఒకే అధ్యాయముగా (9 వ అధ్యా.) ఉన్నవి. బొంబాయి ముద్రణమునందు 267 శ్లోకములును, బరోడా ముద్రణమునందు 283 శ్లోకములును కలవు.]

### హస్తాభినయము

ఉపాంగములైన శిరో-నేత్ర-భ్రూ-నాసా-ఓష్ఠ-కపోలముల కర్మలను లక్షణసంయుక్తముగా వివరించి ఉన్నాను. నాట్యప్రయోజకములైన హస్తాదుల కర్మను అనగా దేనిచే ఏది ఎట్లు అభినయింపబడునో ఆ వివరములనెల్ల ఇంక వివరింతును. హస్తాదులనగా హస్తములు, ఉరము, జఠరము, కటి, జంఘలు, ఊరువులు, పాదములు. వీని లక్షణములను, వినియోగములను[2] వరుసగా ఇప్పుడు వివరింతును.

---

1. ఇది బొంబాయి, బరోడా ముద్రణముల పాఠము. కాశీ ముద్రణమునం దీ భాగము రెండధ్యాయములుగా ఉన్నది — 9 వ అధ్యాయము - 'హస్తాభినయము'; 10 వ అధ్యాయము - 'శరీరాభినయము'. నేను బొంబాయి, బరోడా ముద్రణముల అధ్యాయ సంఖ్యనే అనుసరించితిని. డా. ఘోష్ తన ఆంగ్లానువాదమందు కాశీ ముద్రణ అధ్యాయ సంఖ్యను అనుసరించెను.

2. అభినయము లోకధర్మి-నాట్యధర్మి భేదములచే రెండు విధములు. అందుచే హస్తాదుల వినియోగమును రెండువిధము లగుచున్నది. వీనిలో మరల లోకధర్మి రెండు విధములు—(1) చిత్తవృత్తి నిరూపణాత్మకము. ఉదా: గర్వము మొదలగువానిని నిరూపించుటయందు పతాకహస్తము లలాట దేశ పర్యంతము ఎత్తబడుట మొదలగునవి. (2) కేవల బాహ్యావయవ రూపాత్మకము. ఉదా: పద్మము మొదలగు వానిని నిరూపించుటలో పద్మకోశాది హస్తములను పట్టుట. ఇట్లే నాట్యధర్మి కూడ రెండు విధములు— (1) నాట్యమునకు ముఖ్యమగు కైశికీవృత్తిని సంపాదించుటయం దుపయుక్తమై అలౌకిక శోభా హేతువుగా ఉండుట. ఉదా: ఆవేష్టితాది చతుర్విధ కరణాదుల నుపయోగించుటచే ఇది వ్యక్తమగును. (2) ఒక అంశమున లోకానుసారిగా ఉండి, వేరొక అంశమున నటసమయమాత్రముగ అలౌకికముగా ఉండునది. జనాంతికాదులందలి హస్త వ్యవధాన కల్పన మిందుల కుదాహరణము. ఇందు హస్త వ్యవధానము రహస్యసూచక మగుచు లోకానుసారిగా ఉన్నది కాని చెప్పబడునది నాట్యధర్మియే; అనగా అచటివారు వినుచున్నను విననట్లు భావించుట! ఈ నాట్యధర్మి కేవలము నటసమయమాత్ర రూపమైనది. వివరములకు 18 వ అధ్యాయమును చూడవలెను [అభినవభారతి-2 వ సంపుట 26].

ముందుగా హస్తాభినయమును వివరింతును. హస్తములు అరువదినాలుగు[3] విధములు- ఇందులో[4] అసంయుత హస్తములు ఇరువదినాలుగు, సంయుత హస్తములు పదు మూడు, నృత్తహస్తములు ముప్పది.

### అసంయుత హస్తములు[4]

పతాక - త్రిపతాక - కర్తరీముఖ - అర్ధచంద్ర - అరాల - శుకతుండ - ముష్టి - శిఖర - కపిత్థ - కటకాముఖ - సూచీముఖ - పద్మకోశ - సర్పశిర - మృగశీర్షక - కాంగూల - అలపద్మ - చతుర - భ్రమర - హంసాస్య - హంస పక్ష్మ - సందంశ - ముకుల - ఊర్ణనాభ - తామ్రచూడము లనెడి భేదములచే అసం యుత హస్తములు ఇరువదినాలుగు విధములు. వీని లక్షణములను, వినియోగము లను వరుసగా వివరింతును.

1. పతాకము[5] (జెండా)—అన్నివ్రేళ్ళును సన్నిహితములును, ప్రసారితము

3. 'చతుష్షష్టికరాః' (64 హస్తములు) అని మూలము. కాని లెక్కించుటకు 67 (24+13+30=67) హస్తము లగుచున్నవి. కావున 'సప్తషష్టికరాః' అని ఉండుట సమంజసము.

4. 'అభినయ హస్తము' లని భరతాదులు చెప్పినపేరు. కాని, లోకమందు 'అభినయముద్ర' లేదా 'హస్త ముద్ర' అను పేరులు ప్రచారమునందున్నవి. 'ముద్ర' అను పదమును భరతాదులెవ్వరును ప్రయోగించలేదు. ఈ ముద్ర అనునది తాంత్రిక కర్మలం దుపయుక్తమగు హస్త విశేషమునకు మాత్రమే పేరు. దీనిని లలితమైన అభినయ హస్తము నకు వాడుట అసమంజసము. ఈ పదమునుగూర్చి మిస్ షైరా డెక్లీన్ అనునామె వ్రాసిన వాక్యములను పరిశీలించవలయును—"Mudra is a sanskrit word which means 'seal.' The designation of the ritual hand gestures by this word originates from a time when the priest used to pronounce certain mantras at the same time accompany-ing the sound by imitating the corresponding Sanskrit characters with their fingers, thus 'sealing the magic" [A Mono-graph on "Mudras" - Kegan Paul & Co, 1924].

కావున, 'ముద్ర' అను పదమును అభినయ హస్తమునకు వాడుట అసమంజసము; భరతాదులు దానిని వాడలేదు. కావున 'అభినయ హస్తము' లనికాని 'హస్తము' లని కాని, 'అభినయకరము'లనికాని అనుట సమంజసము.

5. పతాక ఆకారముగా ఉండునుకాన ఈ హస్తము 'పతాకహస్త' మనబడినది. అందుచేతనే దీనిచే 'పతాక'కూడ అభినయింపబడును. ఇట్లే ఇతర హస్తముల విషయ మందుకూడ నామ నిర్వచనానుసారముగా వినియోగము ప్రదర్శనీయము...లోకప్రసిద్ధి ననుసరించికాని, నాట్యాచార్య సంప్రదాయము ననుసరించికాని ఈ పతాక హస్తమును ఆయావిధములుగా ఉంచుటవలన వివిధార్థములను ప్రదర్శించవచ్చును— ఊర్ధ్వముగా





లును కాగా అంగుష్ఠము కుంచితమగుట[6] 'పతాకహస్త' మన బడును. దెబ్బకొట్టుట, చలికాగుట, ప్రోత్సాహము, సంతోషము, అహంభావపూరిత వాక్యములు (అహమపి=నేనును, మమాపి= నాకును, మయాపి=నాచేతను, మయ్యపి=నాయందును అను వానిని గర్వగర్భితముగా ప్రయోగించుట) అనువానిని నిరూ పించుటయం దీ హస్తము లలాట దేశపర్యంతమును ఉత్థితము కావలయును. అగ్నిని, వర్షధారలను, పుష్పవృష్టిని నిరూపించుట యందు ప్రవిరలములును, చలితములును అయినవ్రేళ్లుగల రెండు పతాకహస్తములను[7] సంయుతము చేయవలయును. నీటిపడియను, పుష్పములను బహూకరించుటను, పచ్చ గడ్డిని,భూమిపై నిర్మింపబడిన ద్రవ్యమును నిరూపించుటకు పతాకహస్తములను స్వస్తి కముచేసి, విచ్యుతముచేయ (విడదీయ) వలెను. కన్పించీకన్పించని సూక్ష్మవస్తువును, రక్షింపదగినదానిని, మరుగుపడియున్నదానిని, దట్టమైనదానిని, గోప్యార్థమును ప్రదర్శించుటకు పతాకహస్తములను స్వస్తిక-విచ్యుతములనుచేసి అధోముఖముగా ఉంచవలెను. పైకి, క్రిందికి ఆడింపబడుచున్న వ్రేళ్ళుగల ఈ పతాక హస్తములను వాయువును, కెరటములను, వేగమును, ఒడ్డునందు కెరటములు విరుగుటను, ప్రవాహ మును ప్రదర్శించుటకుపయోగించవలెను. ఈహస్తమును రేచనపూర్వకముగా పార్శ్వ భాగమందు పైకి క్రిందికి ఆడించుటచే ఉత్సాహమును, బహుమానమును, మహా జనమును (జనుల గుంపును), పొడవైనవారిని, పుష్కరవాద్యమును నిరూపించ

ఉంచుట (పతాకహస్తమును పైకెత్తుట), పార్శ్వమునందుంచుట, అధోముఖముగా (అరచేతిని క్రిందకు) ఉంచుట, సమ్ముఖముగా (అభిముఖముగా, అరచేతిని ముఖము నకు ఎదురుగా) ఉంచుట, పరాఙ్ముఖముగా (అరచేతిని త్రిప్పి) ఉంచుట, ఉత్తాన ముగా (వెలికిలగా=అరచేయి పైకి ఉండునట్లుగా) ఉంచుట, త్ర్యశ్రముగా (పతాక హస్తమును అడ్డముగా) పెట్టుట, చలింపజేయుట, చలనములేకుండ ఉంచుట మొదలగునవి. [అభినవభారతి-2వ సం. పుటలు 28-29].

6. ఈ అధ్యాయమందుప్రయుక్తములైన కొన్ని పదములకు అర్థములను గ్రంథాంత మునగల పదానుక్రమణికలో వివరించియున్నాను.

7. పతాకాదులు ఇరువదినాలుగును అసంయుతహస్తములైనప్పటికిని ఒక్కొక్క ప్పుడు రెండేసి (సంయుత) హస్తములయొక్క అభినయము వివరింపబడుచుండును. ఇందు రెండవ హస్తము చేరుట క్వాచిత్కమగుటచే అప్పుడుకూడ వానికి అసంయుత హస్తములనియే పేరు. సంయుత హస్తములుమాత్ర మెల్లప్పుడును సంయుతములుగానే ఉండును; అందు అసంయుతముగానుండుట అనునదియే లేదు. [అభినవభారతి-2వ సం- పుట 27].

వలెను. పరిఘృష్ట కరతలములు (రాపిడి పెట్టబడుచున్న అరచేతులు) కల పతాక హస్తములచే క్షాళనము (కడుగుట), మర్దనము(రుద్దుట), మార్జనము(శుభ్రపరచుట), పేషణము (పిండిచేయుట లేదా పచ్చడిచేయుట), పర్వతము నెత్తిపట్టుట, పర్వత శిలలను పెకలించుట మొదలగువానిని నిరూపించవలెను.[8] పది, వంద, వేయి అను సంఖ్యలనుకూడ ప్రయోక్తలు పతాక హస్తములచేతనే ప్రదర్శించవలెను.[9] స్త్రీ-పురుషు లిరువురును పై అభినయములందీ హస్తమును ఇట్లే ఉపయోగించవలెను.*

2. త్రిపతాకము (మూడు వ్రేళ్ళతో కూడిన జెండా)— పతాక హస్తమందలి అనామిక (ఉంగరపువ్రేలు) ముందునకు వంగి ఉన్నచో అది 'త్రిపతాక హస్త' మనబడును. పిలుచుట, దిగుట, విడచుట, నివారించుట, ప్రవేశించుట, గడ్డమును పట్టుకొని పైకెత్తుట, నమస్కరించుట, నిదర్శనముచూపుట, అనేకవిధములగు సంభాషణములు, మంగళద్రవ్యములను స్పృశించుట, శిరమును మూర్కొనుట లేదా స్పృశించుట, తలపాగను కిరీటమును ధరించుట, ముక్కును నోటిని చెవులను మూసికొనుట మొదలగువానిని ప్రదర్శించుటకు ఈ త్రిపతాకహస్తము నుపయోగించవలెను. పైకి, క్రిందికి ఆడింపబడుచున్న వ్రేళ్ళుగల ఈ త్రిపతాకహస్తముతో చిన్న చిన్న పక్షులు ఎగురుటలు, చిన్నప్రవాహము, పాములు, తుమ్మెదలు అనువానిని ప్రదర్శించవలెను. త్రిపతాకహస్తమందలి అనామికచే కన్నీటిని తుడుచుట, బొట్టుపెట్టుట, పత్రలేఖలను రచించుట, ముంగురులను సరిదిద్దుట అనునవి అభినయింపబడవలెను.



2

గురుపాదవందనమునందు త్రిపతాక హస్తములను స్వస్తికముగా ఉంచవలెను. ఉద్వాహమును నిరూపించుటయందు వీని చివరలు కలియవలెను. నృపదర్శనమందు ఈ హస్తములు విచ్యుతములై చలించుచుండవలెను. గ్రహదర్శన నిరూపణమందు ఈ హస్తములు తిర్యక్-స్వస్తికములు కావలయును. ఈ హస్తములు తపస్విదర్శనమునందు ఊర్ధ్వములును పరాఙ్ముఖములును, ద్వారదర్శనమునందు పరస్పరాభిముఖములును కావలయును. బడబానల-సంగ్రామ-మకర సందర్శనములయందు ఈ హస్తములు ముఖాగ్రభాగమునందు మొదట ఉత్తానములును, పిమ్మట అధోముఖములును కావలయును. ఇట్టి హస్తములతోడనే వానర-ఊర్మి-పవన-స్త్రీజనములను నిరూపించవలెను. బాలేందు దర్శనమందీ హస్తమునందలి అంగుష్ఠము అభిముఖముగా ప్రసృతముకావలెను. నరులయానమందీ హస్తములు పరాఙ్ముఖములు కావలయును.[10]

3. కర్తరీముఖము (కత్తెర)— త్రిపతాకమందలి తర్జనిని నడిమివ్రేలి వెనుకభాగమునం దుంచినచో అది 'కర్తరీముఖహస్త' మనబడును. దారిచూపుట, చరణమునందు పత్రభంగములను రచించుట, లత్తుక పూయుట, ముగ్గులుపెట్టుట అను వానిని నిరూపించుటయందీ హస్తము అధోముఖముగాను; నమలుట, జంతువుల కొమ్ములు, ఉత్తరము చదువుట మొదలగు వానిని నిరూపించుటయందు ఊర్ధ్వమును కావలయును. పడుట, మరణము, అపరాధము, వెనుకకుతిరుగుట, ఊహము, నిక్షేపము అను వానిని నిరూపించుటయందు వ్రేళ్ళను కత్తెరవలె ఆడించవలెను. రురు-చమర-మహిష-సురగజ-వృష-గోపుర-శైల శిఖరములను ప్రదర్శించుటకు అసంయుత కర్తరీముఖ హస్తమునుకాని, సంయుత కర్తరీముఖ హస్తములనుకాని ప్రయోగించవలయును.



3

4. అర్ధచంద్రము (సగము చంద్రుడు లేదా చంద్రవంక) — అంగుష్ఠము ఒక వైపునకును, తక్కినవ్రేళ్ళు కలిసి ఇంకొక వైపునకును చాచబడి ధనురాకారముగా వంపుదేరిఉన్నచో అది 'అర్ధచంద్ర హస్త' మనబడును. మొక్కలు, చంద్రలేఖ, శంఖము, కలశము, కంకణము, బలవంతముగా బైటకు నెట్టుట(మెడపట్టి గెంటుట), ఖేదము, నడుము యొక్క కార్శ్య - పీవరత్వములు అనువానిని అభినయించుటయందీ హస్తమును ప్రయోగించవలెను. నడుముయొక్క పీవరత్వమును నిరూపించుట యందు రెండు హస్తముల నుపయోగించవలెను. స్త్రీ లీ హస్తముచే రశనా-జఘన-కటీ-ఆనన-తల-పత్రభంగ-కుండలాదులను నిరూపించవలెను.



4

---

8. ఈ పతాకాది హస్తముల వినియోగమును అభినవగుప్తుడు చాల విపులముగా వివరించియుండెను.

9. ఈ వాక్యమునకు మూలమైన బరోడా ముద్రణ శ్లోకము [26 శ్లో] ప్రక్షిప్తముగా తలంపబడినది.

* [బొంబాయి ముద్రణమునందు 1-25 శ్లో; బరోడా ముద్రణమునందు 1-27 శ్లో.]

10. ఈ పేరాకు మూలములైన బరోడా ముద్రణమందలి శ్లోకములు [33-38 శ్లో.] ప్రక్షిప్తములుగా తలంపబడినవి. ఇవి కాశీ ముద్రణమునందు లేవు.

5. అరాలము (వంకరగా ఉన్నది)— తర్జని (చూపుడువ్రేలు) ధనురాకారముగను, అంగుష్ఠము కుంచితముగను ఉండి (ఈ రెండును ఒండొంటిని కలియరాదు) తక్కినవ్రేళ్ళు విడిగా పైకి చాచబడినచో అది 'అరాల హస్త' మనబడును (పైకి చాచబడిన వ్రేళ్ళు వెనుకకు వంచబడినట్లుగా కన్పట్టవలెను). స్థైర్యము, గర్వము, ఉత్సాహము, శోభ, ధైర్యము, దివ్యవస్తువు, గాంభీర్యము, ఆశీర్వాదము, హితభావములు, స్త్రీలు జుట్టుముడి వేసికొనుట విప్పుట, తన అవయవముల నన్నింటిని చూపించుట అనువానిని ఈ అరాల హస్తముచే అభినయించవలెను. వ్రేళ్ళ చివరలను స్వస్తికముగా కలుపుచు త్రిప్పుచుండుటచే కౌతుకము, వివాహము, ప్రదక్షిణక్రమము, మహాజనము, భూమిపై పుష్పాదులను వెదజల్లుట, ఆహ్వానము, నివారణము, నిర్మాణము, చెమట తుడుచుకొనుట, వాసన చూచుట మున్నగునవి నిరూపింపబడును. ఇంతకుముందు త్రిపతాక హస్తముచే అభినయింపదగినవిగా పేర్కొనబడినవానిని స్త్రీలు అభినయించునప్పుడు ఈ అరాల హస్తమునే ఉపయోగించవలెను.




6. శుకతుండము (చిలుకముక్కు)— అరాల హస్తమందలి అనామికకూడ వంగినచో అది 'శుకతుండ హస్త' మనబడును. నేను కాదు, నీవు కాదు, ఇట్లు చేయరాదు అనెడి అర్థములను నిరూపించుట యందును; పిలుచుట, విడుచుట అనువానిని సూచించుట యందును, తిరస్కారముతో 'ఛీ' అనుట యందును ఈ హస్తమును ప్రయోగించవలెను.




7. ముష్టి (పిడికిలి)— నాలుగు వ్రేళ్ళను చేర్చి అరచేతి లోనికి వంచి, అంగుష్ఠమును వానిపై నొక్కిపట్టినచో అది 'ముష్టి హస్త' మనబడును. ప్రహరించుట, వ్యాయామము (మల్ల యుద్ధము), రసము పిండుట, పాలు పిండుట మొదలగు వానిని; సంవాహనము, అసి-దండ - కుంతములను పట్టుకొనుట అనువానిని నిరూపించుట యందు ముష్టి హస్తమును ప్రయోగించవలెను.



8. శిఖరము— ముష్టి హస్తమందలి అంగుష్ఠమును నిలువుగా చాచినచో అది 'శిఖర హస్త' మనబడును. రశ్మి (కళ్ళెము లేదా కిరణము), కుశలు (దర్భలు) లేదా కశ (కొరడా), అంకుశము, ధనుస్సు అనువానిని గ్రహించుట ; తోమరమును శక్తిని ప్రయోగించుట, అధరమునకు రంగు వేసికొనుట పాదములకు లత్తుక పూసికొనుట మొదలగునవి, ముంగురులను సరిదిద్దుకొనుట అనువానిని నిరూపించుటయందు శిఖరహస్తము ప్రయుక్తము కావలెను.[11]*






9. కపిత్థము (వెలగపండు)— శిఖరహస్తమందలి ప్రదేశిని (చూపుడువ్రేలు) ముందునకు వంగి అంగుష్ఠముచే నొక్కబడినచో అది 'కపిత్థ హస్త' మనబడును. అసి-చక్ర-చాప-తోమర-కుంత - గదా - శక్తి-వజ్రాది శస్త్రములను, పథ్యములును సత్యములును అయిన కార్యములను నిరూపించుటకు ఈ హస్తమును ప్రయోగించవలెను.




10. కటకాముఖము[12]— కపిత్థ హస్తమందలి అనామికయును కనిష్ఠికయును అరచేతికి తగులకుండ వంచబడినచో అది 'కటకాముఖ హస్త' మనబడును. హోమము చేయు స్రుగాదులు, హోమ ద్రవ్యములు, ఛత్రము, కళ్ళెమును చేతితో లాగుట, తాలవృంతాదులు, అద్దమును పట్టుకొనుట, ముక్కలు చేయుట, చీరుట, పొడవైన దండమును పట్టుకొనుట, ముత్యాల హారమును కూర్చుట, హారములను దండలను పట్టుకొనుట, కొంగును ఎత్తిపట్టుకొనుట, కవ్వము త్రిప్పుట, బాణము నెక్కుపెట్టిలాగుట, పువ్వులనుకోయుట, ప్రతోదము (కొరడా)ను గ్రహించుట, అంకుశమును రజ్జువును ఆకర్షించుట, స్త్రీని దర్శించుట మొదలగువానిని నిరూపించుటయందు కటకాముఖ హస్తము ప్రయుక్తము కావలెను.




---

11. ప్రయోగానుసారముగా ఈ హస్తము ఉత్తానమును (నీళ్ళు కావలెననుటలో), ఊర్ధ్వమును (ముంగురులను సరిదిద్దుకొనుటలో), పార్శ్వగతమును (ధనుర్గ్రహణములో), అధోముఖమును (పితృతర్పణములో) అగుచుండును. [అభినవ భారతి-2 వ సం. పుట 40.]

*[బొంబాయి ముద్రణమునందు 25-54 శ్లో; బరోడా ముద్రణమునందు 27-58 శ్లో.]

12. ఇది కాశీ ముద్రణపాఠము; 'ఖటకా ముఖము' అని బొంబాయి, బరోడా ముద్రణముల పాఠము. వీనియందు 'కటకాముఖ' మనునది పాఠాంతరముగా అధస్సూ

11. సూచీముఖము (సూదిమొన)— కటకాముఖమందలి తర్జని సంప్రసారితమైనచో (బాగుగా చాచబడినచో) అది 'సూచీముఖ హస్త' మనబడును. ఊర్ధ్వముఖమగుట (పైకి చాచబడుట), అధోముఖమగుట (క్రిందికి వంచబడుట), లోలమగుట (ఈ ప్రక్కకు ఆ ప్రక్కకు ఆడింపబడుట), కంపితమగుట (ఒకచోటనే కదల్పబడుట), ముడిచి చాచబడుచుండుట, పైకివెళ్ళుట, అభినయమందు హస్తముతోపాటు చలించుట అను అవస్థలతో కూడిన ప్రదేశినిచే ఈ హస్తము అనేక అర్థములను ప్రదర్శించును. ఊర్ధ్వముఖమై ఈప్రక్కకు ఆ ప్రక్కకు ఆడింపబడుచున్న ప్రదేశినిచే చక్రమును, మెరుపును, జెండాను, మంజరులను, కర్ణపూరమును, కుటిలగతులను (మత్స్యాదులను), సాధువాదములను,పాము పిల్లలను, పొగను, దీపమును, పల్లవమును, వల్లులను (సొరతీగ మొ॥), లతలను (ద్రాక్షతీగ మొ॥), కాక పక్షములను (జనపాలను), పడుటను, వక్రత్వమును, వర్తులత్వమును అభినయించవలెను. ఇంకను అధికముగా ఊర్ధ్వముఖముగా ఉన్న ప్రదేశినిచే నక్షత్రములను, ముక్కును, ఏకసంఖ్యను, దండమును (ఇతరులను భయపెట్టునది), యష్టిని (కఱ్ఱను) నిరూపించవలెను. వంచబడిన ప్రదేశినిని ముఖమునొద్ద (సెలవుల ప్రక్కల) ఉంచుటచే కోరలుగల రాక్షసాదులను; ఊర్ధ్వముఖముగా ప్రసృతమైన ప్రదేశినిని గుండ్రముగా త్రిప్పుటచే 'సమస్తలోకము' అను అర్థమును; ప్రణతోన్నతములుకల ప్రదేశినిచే 'ముఖ్యము'అను అర్థమును, దీర్ఘమైన పగటిని, వదనసమీపమందు కుంచిత విజృంభితములుకల ప్రదేశినిచే వాక్యనిరూపణమును అభినయించవలెను. ప్రసారితమైన ప్రదేశినిచే 'వలదు' అను అర్థము; కుంచిత ప్రసారితములుగల ప్రదేశినిచే 'చెప్పుము' అను అర్థము; ప్రకంపితమైన ప్రదేశినిచే రోషము, చెమట, కుంతల-అంగద-కుండల-పత్రరచనములు అను అర్థములను అభినయింపబడవలెను. ప్రదేశినిని లలాట ప్రదేశమందుంచుటచే 'నేను' అనెడి గర్వము, రిపునిర్దేశము, చెవిగోకుకొనుట, క్రోధము, 'ఎవడురా వీడు ?' అను అర్థము మున్నగునవి అభినయింపబడవలెను. సంయుక్తములైన రెండు ప్రదేశినులచే సంయోగము; విడివడిన ప్రదేశినులచే వియోగము; స్వస్తికములుగానున్న ప్రదేశినులచే కలహము; ప్రదేశినుల పరస్పరోత్పీడనములచే




---

చికలో ఉన్నది. అభినయ దర్పణాదులందును 'కటకాముఖ' మనియే కలదు. నేనీ పాఠమునే స్వీకరించినాను. అట్లే సంయుత హస్తములలో కూడ 'ఖటకా వర్ధమానకము' అను దానికి బదులుగా 'కటకావర్ధమానకము' అను పాఠమునే స్వీకరించినాను.



బంధము అభినయింపబడవలెను. అభిముఖములైన ప్రదేశినులను విడివిడిగా (ఒక జేన దూరమున ఉండునట్లుగా) వామ పార్శ్వమునం దుంచుటచే దివసావసానమును, పరాఙ్ముఖములైనవానిని విడివిడిగా దక్షిణ పార్శ్వమునం దుంచుటచే నిశావసానమును నిరూపించవలెను.

రెండు సూచీముఖ హస్తములచే సంపూర్ణ చంద్రమండలమును నిరూపించవలెను. లలాట ప్రదేశమందు ఉత్తానముగా ఉన్న ప్రదేశినిచే ఇంద్ర ధ్వజమును అభినయించవలెను. ప్రదేశినిని మండలాకారముగా త్రిప్పుటచే చంద్రపరివేషమును (గుడి కట్టుటను), ప్రదేశినిని లలాట ప్రదేశమందు మండలాకారముగా త్రిప్పుటచే ఈశ్వరుని మూడవకంటిని, ప్రదేశినిని తిర్యక్-ఉత్తానము చేయుటచే ఇంద్రుని కనులను అభినయించవలెను. ప్రదేశిని చివరను భ్రమింపజేయుచుండుటచే రూపమును, శిలను, సుడిని, యంత్రమును, కొండను నిరూపించవలెను. ప్రదేశిని చివరను అధోముఖముగా భ్రమింపజేయు చుండుటచే పరివేషణమును (అన్నము వడ్డించుటను), ప్రదేశినిని లలాట ప్రదేశమందు అధోముఖముగా ఉంచుటచే శివుని, తిర్యక్-ఉత్తానము చేయుటచే ఇంద్రుని నిరూపించవలెను.

12. పద్మకోశము— అన్ని వ్రేళ్ళను విడివిడిగా చాచి, చివరలు కలియకుండ వంచి, అరచేతిని పల్లము చేసినచో అది 'పద్మకోశహస్త' మనబడును. స్త్రీల కుచములను, మారేడు, వెలగ మొదలగు పండ్లను పద్మకోశ హస్తముచే నిరూపించవలెను. ఈ ఫలములను కాని, ఆమిషమును కాని గ్రహించునప్పుడే హస్తాగ్రమును వంచవలెను. దేవతార్చనమును, బలిహరణమును, బరిణెను, పిండదానమును, పుష్పప్రకరమును నిరూపించుటయందు పద్మకోశ హస్తమును ప్రయోగించవలెను. చలించుచున్న వ్రేళ్ళుగల ఈ రెండు హస్తములను మణిబంధమునొద్ద కలిసి త్రిప్పబడుటచే వికసించిన కమల-ఉత్పలములు నిరూపింపబడును.




13. సర్పశిరము (పాము పడగ)— అన్ని వ్రేళ్ళను దగ్గరగాచేర్చి అరచేతిని పల్లముచేసినచో అది 'సర్ప శిరోహస్త' మనబడును. (పతాక హస్తమందలి అరచేయి దొప్పగా అగుటవలన సర్ప శిర హస్త మేర్పడును). దేవతర్పణము (దేవతలకొరకు నీళ్ళు విడుచుట), పామునడక, మొక్కలకు నీరుపోయుట, మల్లచరచుట, ఏనుగు కుంభస్థలముపై చరచుట మున్నగువానిని నిరూపించుటయందు 'సర్పశిరోహస్తము' ప్రయుక్త మగును.



14. మృగశీర్షకము (లేడితల)— సర్ప శిరోహస్తమందలి కనిష్ఠికాంగుష్ఠములను ఊర్ధ్వముఖముగా ప్రసారించి, తక్కిన వ్రేళ్ళను అధోముఖముగా వంచినచో అది 'మృగశీర్షకహస్త' మనబడును. ఇక్కడ, ఇప్పుడు, ఉన్నది, నేడు అనెడి అర్థములు ; శక్తియొక్క ఉల్లాసనము ; పాచికలువేయుట, చెమట తుడుచుకొనుట, కుట్టమితాదులు అనువానిని నిరూపించుటయందు మృగశీర్షక హస్తము ప్రయుక్తమగును.[13]



15. కాంగులము (దీనిని 'లాంగూల'మనియు అందురు) — పద్మకోశ హస్తమందలి తర్జనీ-మధ్యమ-అంగుష్ఠములు మూడును త్రేతాగ్నులవలె ఉండగా అనామికవక్రమును, కనిష్ఠిక ఊర్ధ్వమును అయినచో అది 'కాంగులహస్త' మనబడును. నానావిధములైన తరుణఫలములను, పరిమితములైన వస్తువులను నిరూపించుటలో కాంగుల హస్తము ప్రయుక్తము కావలెను. స్త్రీల రోషవచనములను నిరూపించుటలో అంగుళివిక్షేపమొనరించ (వ్రేళ్ళను విదలించ) వలెను. మరకత వైడూర్యాదులను, పుష్పములను, పిల్లి పాదమును అభినయించుటకు కూడ ఈ హస్తమును ప్రయోగించవలెను.[14]




16. అలపల్లవము (అలపద్మకము-చలించుచున్న పద్మము)—అన్ని వ్రేళ్లను విడి విడిగా అరచేతిలోనికి వంచబడినచో అది 'అలపల్లవహస్త' మనబడును. ప్రతిషేధము (అడ్డగించుట); 'నీవెవరవు ?' అనెడి ప్రశ్న ; దబాయింపు ; శూన్య వచనములు (ఆ శాస్త్రము అబద్ధము మొ॥), మాటిమాటికి స్త్రీ తన్ను నిర్దేశించి చెప్పుకొనుట మొదలగు వానిని అభినయించుటయందు అలపల్లవ హస్తమును ప్రయోగించవలెను. *




---

13. ఈ హస్తము శక్త్యుల్లాస - అక్షపాతములందు ఊర్ధ్వ ముఖమును, స్వేదాపమార్జన-కుట్టమితాదులందు అభిముఖతలముగను, మిగిలినవానియందు అధోముఖముగను ఉండవలెను [అభినవభారతి-2 వ సం-పుట 47].

14. పై చివరి వాక్యమునకు మూలమగు బరోడా ముద్రణమందలి శ్లోకము (90 శ్లో.) ప్రక్షిప్తముగా తలంపబడుచున్నది.



17. చతురము (నాలుగు)— కనిష్ఠిక ఊర్ధ్వమును, తక్కిన మూడు వ్రేళ్ళను ప్రసారితములును కాగా అంగుష్ఠమును నడిమివ్రేలి మొదట ఉండునట్లుగా వంచినచో అది 'చతుర హస్త' మనబడును. వినయ-నియమ-నైపుణ్యములు, బాలురు, ఆతురులు, సత్త్వము, కైతవము, ఉచితవాక్యము, హితము, పథ్యము, సత్యము, శాంతి అను అర్థములను నిరూపించుటలో చతుర హస్తమును ప్రయోగించవలెను. మండలాకారముగా ఉన్న రెండు చతుర హస్తములతో లేదా ఒకే హస్తముతో వివృతము (తెరవబడినది), విచారణము, సంచారము, వితర్కము, లజ్జ అనువానిని అభినయించవలెను. సంయుతములైన చతుర హస్తములచేతనే కనులను, వానికుపమానభూతములగు పద్మ దళములను, జింక చెవులను నిరూపించవలెను. లీల, రతి, రుచి, స్మృతి, బుద్ధి, విభావన (ఊహాపోహాలు), క్షమ, పుష్టి, సంజ్ఞ, ప్రణయము, విచారణము, మైత్రి, శౌచము, చాతుర్యము, మాధుర్యము, దాక్షిణ్యము, మార్దవము, సుఖము, శీలము, ప్రశ్న, వార్తాయుక్తి, వేషము, మృదుశాద్వలము, 'కొంచెము' అను అర్థము, విభవము, అవిభవము, సురతము, గుణాగుణములు, యౌవనము, గృహము, భార్య, నానావిధ వర్ణములు అనువానిని నిరూపించుటలో ఈ చతుర హస్తమునే ప్రయోగించవలెను. ఈ హస్తమును ఊర్ధ్వము చేయుటచే తెల్లని రంగును, మండలముగా త్రిప్పుటచే రక్త-పీత వర్ణములును, ఒకదానితో ఇంకొక దానిని రాచుటచే నీలవర్ణమును నిరూపింపబడును.




18. భ్రమరము (తుమ్మెద)— మధ్యమ-అంగుష్ఠములు సందష్టములును (ఒండొంటిని తాకవలెను), ప్రదేశిని వక్రమును, తక్కిన రెండు వ్రేళ్ళను విడివిడిగా ప్రసారితములును అయినచో అది 'భ్రమర హస్త మనబడును. పద్మ-ఉత్పల-కుముదములను, కర్ణపూరమును, పొడవైన కాడలుకల ఇతర పుష్పములను నిరూపించుటయందు భ్రమరహస్తము ప్రయుక్తము కావలెను. మధ్యమ-అంగుష్ఠములను సశబ్దముగా విచ్యుతము చేయుటచే (చిటిక వేయుటచే) నిర్భర్త్సనాదులు, బాలాలాపము, తొందర, తాలము, నిశ్శ్వాసము అనువానిని నిరూపించవలెను.



---

*[బొంబాయి ముద్రణమునందు 55-89 శ్లో: బరోడా ముద్రణమునందు 59-92 శ్లో.]

19. హంసవక్త్రము (హంసాస్యము)— త్రేతాగ్నులవలె ఉన్న తర్జనీ-మధ్యమ-అంగుష్ఠములు మూడింటిని చేర్చి పట్టగా తక్కిన రెండు వ్రేళ్ళను సంప్రసారితము లయినచో అది 'హంసవక్త్రహస్త' మనబడును. కొంచెము కదలుచున్న వ్రేళ్ళ చివరలు గల హంసవక్త్ర హస్తముచే శ్లక్ష్ణము (మనోహరము), అల్పము, లాఘవము, నిస్సారము, మృదుత్వము అను అర్థములను నిరూపించవలెను.




20. హంసపక్షము— కనిష్ఠిక ఊర్ధ్వమును, అంగుష్ఠము కుంచితమును, తక్కిన వ్రేళ్ళు సమములును ప్రసారితములును అయినచో అది 'హంసపక్షహస్త' మనబడును. (సర్పశీర్ష హస్త మందలి కనిష్ఠిక చాచబడినచో అది హంసపక్షహస్త మగునని చెప్పవచ్చును). తర్పణము విడుచుట, పత్రభంగ రచన, విప్రులు దానమును ప్రతిగ్రహించుట, ఆచమనము, భోజనము, ఆలింగనము, స్తంభము, రోమాంచము, స్పర్శ, చందనాదుల అనులేపనము, సంవాహనము అనువానిని నిరూపించుటయందు హంసపక్ష హస్తమును ప్రయోగించవలెను. అంతియే కాక ఈ హస్తమును స్తనమధ్యభాగమునం దుంచుటచే స్త్రీల విభ్రమ విశేషములను యథారసముగా సూచించవలెను. దుఃఖమునందు చెక్కిలిని చేతి కానించునప్పుడు కూడ ఈ హస్తమునే ప్రయోగించవలెను.




21. సందంశము (పటుకారు)— అరాల హస్తమందలి తర్జన్యంగుష్ఠములు సందష్టములును (ఒండొంటిని తాకుట), అరచేయి పల్లమును అయినచో అది 'సందంశహస్త' మనబడును. రసభావానుగుణముగా ఈ హస్తము మూడు విధములుగా ప్రయుక్తమగును-అగ్రజము (ముందుండుట), పార్శ్వగతము (ప్రక్కగానుండుట), ముఖజము (ముఖమునకు దగ్గరగానుండుట). పువ్వులనుకోయుట, గ్రుచ్చుట, తృణ-పర్ణ - కేశ - సూత్రములను గ్రహించుట, ముళ్ళను తీయుట, పట్టుకొనుట అనువానిని నిరూపించుటలో అగ్ర సందంశహస్తమును ప్రయోగించవలెను. తొడిమనుండి పూవును కోయుట, కాటుకపుడకతో సరిదిద్దుకొనుట, కోపమందు 'ఛీ' అనుట అనువానిని నిరూపించుటలో ముఖ సందంశహస్తమును ప్రయోగించవలెను, యజ్ఞోపవీతధారణము, ముత్యములు మొదలగువానికి కన్నము పొడుచుట, వింటినారి, సూక్ష్మవిషయము, బాణము, లక్ష్యము, యోగము, ధ్యానము, అల్పము అనువానిని నిరూపించుటలో






సందంశహస్తములు రెండింటిని సంయుతముగా ప్రయోగించవలెను. అసారము, నింద, అసూయ, దుష్టవచనము అను అర్థములను సూచించుటకు కొంచెము త్రిప్పబడిన అగ్రభాగముగల పార్శ్వసందంశ హస్తమును ఎడమచేతితో ప్రయోగించవలెను. ఆలేఖ్య (చిత్ర) రచనము, నేత్ర రంజనము, వితర్కము, వృంతము, ప్రవాలము, స్త్రీలు లత్తుకను పిండుట అను అర్థములనుకూడ సందంశహస్తము చేతనే నిరూపించవలెను.

22. ముకులము (మొగ్గ)— హంసవక్త్రహస్తమందలి వ్రేళ్ళు అన్నియును చివరలందు కలిసినవై దగ్గరగాచేరి ఊర్ధ్వముఖములై ఉన్నచో అది 'ముకులహస్త' మనబడును. దేవతార్చనము, బలిహరణము, పద్మోత్పలముల మొగ్గలు, విటచుంబనము, కుత్సితము, చల్లుట, భోజనము, ఆభరణములు, ఐదు అను లెక్క, మూతి ముడుచుకొనుట, ఇచ్చుట, తొందర, ముకుళించిన పుష్పములు అను వానిని నిరూపించుటయందు 'ముకులహస్తము' ను ప్రయోగించవలెను.







23. ఊర్ణనాభము (సాలెపురుగు)— పద్మకోశహస్తమందలి వ్రేళ్ళను అన్నింటిని అరచేతిలోనికి వంచినచో అది 'ఊర్ణనాభహస్త' మనబడును. కేశగ్రహణము, చౌర్యగ్రహణము, తలగోకికొనుట, కుష్ఠవ్యాధి, సింహము, పులి మొదలగు జంతువులు, రాతిని పట్టుకొనుట అనువానిని నిరూపించుటయందు ఊర్ణనాభ హస్తమును ప్రయోగించవలెను.

24. తామ్రచూడము (కోడిపుంజు)-- మధ్యమ-అంగుష్ఠములు సందష్టములును, ప్రదేశిని వక్రమును కాగా తక్కిన రెండు వ్రేళ్ళను అరచేతిని తాకుచున్నచో అది 'తామ్రచూడహస్త' మగును. నిర్భర్త్సనాదులు, తాలము, నమ్మించుట, తొందర, సంజ్ఞ అనువానిని నిరూపించుటలో ఈ హస్తము సశబ్దముగా (చిటికవేయుచు) విచ్యుతము కావలెను. కలా-కాష్ఠా-నిమేష-క్షణములనెడి అర్థములను (ఇవి కాల ప్రమాణములు), చిన్నపిల్లల మాటలను, వారిని పిలుచుటను నిరూపించుటలో తామ్రచూడహస్తము ప్రయుక్తము కావలయును.



వ్రేళ్ళు సంయుతములును, వక్రములును, పైన ఉన్న అంగుష్ఠముచే పీడితములును కాగా కనిష్ఠిక ప్రసారితమైనచో అదికూడ 'తామ్రచూడహస్త' మనియే అనబడును (అనగా ముష్టిహస్తమందలి కనిష్ఠిక ప్రసారిత మగుటవలన ఈ హస్త మేర్పడును). నూరు, వెయ్యి, లక్ష అను సంఖ్యలను, కనకమును ఈ హస్తముచే నిరూపించవలెను. వ్రేళ్లు వేగముగా విప్పబడినచో విస్ఫులింగములు, విప్రుషములు (నీటి బిందువులు) నిరూపితము లగును. *

సంయుత హస్తములు

ఇంతవరకును అసంయుత హస్తములను వివరించియున్నాను. ఇంక సంయుత హస్తములను వివరింతును. అంజలి - కపోత - కర్కట - స్వస్తిక - కటకావర్ధమానక - ఉత్సంగ-నిషధ-దోల-పుష్పపుట-మకర-గజదంత-అవహిత్థ-వర్ధమానము లనెడి భేదములచే సంయుత హస్తములు పదుమూడు విధములు. వీని లక్షణములను, వినియోగములను వరుసగా వివరింతును.

1. అంజలి— రెండు పతాకహస్తములు అభిముఖముగా కలియుటవలన 'అంజలి హస్త' మేర్పడును. దేవతా-గురు-మిత్ర అభివాదనమందు ఈ అంజలి హస్తమును ప్రయోగించవలెను. ఈ హస్తము దేవతాభివందనమందు శిరము మీదను, గురువున కభివందనము చేయునప్పుడు ముఖమున కెదురుగాను, మిత్రునకభివందనము చేయునప్పుడు వక్షము మీదను ఉండవలెను. స్త్రీల విషయమున నియమము లేదు. (తదితరులకు అభివాదనము చేయునప్పుడు నియమము లేదు అని పాఠాంతరము).


1

2. కపోతము (పావురము)— అంజలిహస్తమందలి రెండు చేతులును పార్శ్వభాగమున పరస్పరము కలియుటవలన 'కపోత హస్త' మేర్పడును. వినయముతో దరిచేరుట, నమస్కరించుట, గురువుతోడి సంభాషణము అనువానిని నిరూపించుటకు కపోతహస్తమును ప్రయోగించవలెను. స్త్రీలు శీతమును, భయమును నిరూపించుటయందు ఈ హస్తము వక్షముమీద కంపితముకావలెను. ఈ హస్తమందలి వ్రేళ్ళను ఒండొంటిని రాయుచు


2

*[బొంబాయి ముద్రణమునందు 90-123 శ్లో; బరోడా ముద్రణమునందు 93-126 శ్లో.]



పిమ్మట ఎడమచేయుటచే ఖేదవాక్యములను, ఇంతమాత్రము కార్యము, ఇంత కంటె చేయరాదు అనెడి అర్థములను నిరూపించవలెను.

3. కర్కటము (ఎండ్రకాయ)— వ్రేళ్ళ సందున వ్రేళ్ళను దూర్చుటవలన 'కర్కటహస్త' మేర్పడును. మదనభావము, అంగమర్దనము, నిద్రలేచి ఒడలువిరుచుకొనుట లేదా ఆవులించుట, పెద్ద శరీరము, చేతియందు చిబుకము నుంచుట, శంఖమును పట్టుకొనుట మున్నగువానిని నిరూపించుటకు కర్కటహస్తమును ప్రయోగించవలెను.


3

4. స్వస్తికము— రెండు అరాల హస్తములు మణికట్టులనొద్ద పరస్పరము కలిసి ఉత్తానములును, వామపార్శ్వస్థములును అగుటవలన 'స్వస్తికహస్త' మేర్పడును. ఈ హస్తమును స్త్రీలు ప్రయోగించవలెను. స్వస్తిక స్థానమునుండి విడివడిన ఈ హస్తములు దిక్కులను, మేఘమును, ఆకాశమును, వనమును, సముద్రమును, ఋతువులను, భూమిని, విస్తీర్ణమైన ప్రవాహమును అభినయించుటయందు ప్రయుక్తములగును.


4

5. కటకావర్ధమానకము— ఒక కటకాముఖ హస్తమును ఇంకొక కటకాముఖ హస్తముమీద నుంచుటవలన 'కటకావర్ధమానక హస్తము' ఏర్పడును. ప్రణామముచేయుటయందు, శృంగారార్థములను నిరూపించుటయందు కటకావర్ధమానకహస్తమును ప్రయోగించవలెను. కుముద-ఉత్పలములను, వృంతములను, ఛత్రధారణమును నిరూపించుటకు కూడ కటకావర్ధమానక హస్తమునే ప్రయోగించవలె నందురు. [ఈ చివరివాక్యమునకు మూలమగు శ్లోకము బరోడాముద్రణమునందు అధికపాఠముగా ఉన్నది.]


5

6. ఉత్సంగము— స్వస్తికముగానున్న రెండు అరాల హస్తములు ఉత్తాన


6

ములుగా ఉండుటవలన 'ఉత్సంగహస్త' మేర్పడును. స్పర్శగ్రహణము, బలముగా నూరుట, రోషామర్ష కృతకార్యములు, స్త్రీలు ఈర్ష్యతో చేసెడి పనులు అనువానిని నిరూపించుటకు ఉత్సంగహస్తమును ప్రయోగించవలెను.

7. నిషధము— కపిత్థహస్తము ముకుల హస్తమును పరివేష్టించియుండుటవలన 'నిషధహస్త' మేర్పడును. ఈ రెండు హస్తముల పరస్పర పీడనముచే సంగ్రహము, పరిగ్రహము, ధారణము, సమయము, సత్త్వవచనము, సంక్షిప్తము అను వానిని నిరూపించవలెను.


7

శిఖరహస్తము మృగశీర్ష హస్తముచే పీడింపబడుట వలనను నిషధహస్త మేర్పడును; దీనిచే భయాదులు నిరూపితములగును. [ఈ లక్షణ వినియోగములకు మూలమగు శ్లోకము ప్రక్షిప్తముగా తలంపబడినది.]

వామహస్తముతో దక్షిణ భుజమును మోచేతిదగ్గర పట్టుకొని, దక్షిణహస్తమును ఎడమ మోచేతిమీద ఉంచుటవలన నిషధహస్త మేర్పడును. ఈ దక్షిణ హస్తము ముష్టి హస్తము కావలెను. ధైర్యము, మదము, గర్వము, సౌష్ఠవము, ఔత్సుక్యము, విక్రమము, ఆటోపము, అభిమానము, ధిక్కారము, స్తంభము, స్థైర్యము మొదలగు వానిని నిరూపించుటకు ఈ నిషధ హస్తమును ప్రయోగించవలెను.[15]


8

8. దోల (=డోల)— అంసములు వదులుగాఉండి పతాకహస్తములు రెండును పార్శ్వములందు వ్రేలాడుటవలన 'దోలహస్త' మేర్పడును. సంభ్రమము, విషాదము, మూర్ఛ, మదము, అభిఘాతము, ఆవేగము, వ్యాధి, ప్లుతము, శస్త్రక్షతము అను వానిని నిరూపించుటకు దోల హస్తమును ప్రయోగించవలెను.

15. ఈ లక్షణ వినియోగములు కీర్తిధరాచార్యుని పాఠానుసారులని శ్రీ మా. రా. కవిగారు తెలిపినారు. డా. ఘోష్ తన అనువాదములో ఈ పాఠమునే స్వీకరించెను. దీని తరువాత వర్ధమాన హస్తలక్షణమే పేరుమార్పుతో నిషధహస్త లక్షణముగా నీయబడినది. ఇది రెండు ప్రతులలో మాత్రమే కలదట. లేఖకుల పొరపాటు కావచ్చును.



9. పుష్పపుటము— రెండు సర్పశిరోహస్తములు క్రిందిప్రక్కలను కలియుటవలన 'పుష్పపుటహస్త' మేర్పడును. ధాన్యము, ఫలములు, పుష్పములు మున్నగు గ్రహింపదగిన తేదగిన పదార్థములను; నీటిని తెచ్చుట, తీసివేయుట అను అర్థములను నిరూపించుటయందీ పుష్పపుట హస్తమును ప్రయోగించవలెను.


9


10

10. మకరము (మొసలి)— అంగుష్ఠములు ఊర్ధ్వములుకాగా అధోముఖములైన రెండు పతాక హస్తములను ఒకదానిపై ఇంకొకటి ఉంచుటవలన 'మకరహస్త' మేర్పడును. సింహము, వ్యాలము, వ్యాఘ్రము, నక్రము, మకరము, మత్స్యము, ఇతర క్రూరమృగములు అనువానిని నిరూపించుటకు మకర హస్తమును ప్రయోగించవలెను.

11. గజదంతము— సర్పశిర హస్తములు రెండింటిని ఎదుటి కూర్పర-అంస మధ్యభాగములందుంచుటవలన 'గజదంతహస్త' మేర్పడును. వధూవరోద్వాహము, అతిభారయోగము, స్తంభగ్రహణము, శైలశిలలను పెకలించుట మొదలగువానిని నిరూపించుటకీ గజదంత హస్తమును ప్రయోగించవలెను.


11

12. అవహిత్థ— రెండు శుకతుండ హస్తములు వక్షమునందు అభిముఖములుగా కలిసినవై, త్రిప్పబడుటచే అధోముఖములగుట వలన 'అవహిత్థ హస్త' మేర్పడును. దౌర్బల్యము, నిశ్శ్వాసము, గాత్రదర్శనము, తనుత్వము, ఉత్కంఠ అనువానిని నిరూపించుటకీ అవహిత్థ హస్తమును ప్రయోగించవలెను.


12


13

13. వర్ధమానము— రెండు హంసపక్ష హస్తములు పరస్పరము పరాఙ్ముఖములగుటవలన 'వర్ధమాన హస్త' మేర్పడును. జాలవాతాయనాదులను తెరచుటయందీ వర్ధమాన హస్తమును ప్రయోగించవలెను.*

*[బొంబాయి ముద్రణమునందు 124-153 శ్లో; బరోడాముద్రణమునందు 127-159 శ్లో.]

హస్తాభినయ విధానము

ఇంతవరకును సంయుత-అసంయుత హస్తములను సంక్షేపముగా వివరించితిని. ఈ అభినయ హస్తములను ఇచ్చట చెప్పబడిన అర్థములనే కాక, ఇతరములగు అర్థములను కూడ నిరూపించుటకు ప్రయోగించవచ్చును. ఆకృతి, చేష్ట, చిహ్నము, జాతి అనువానిని బట్టి బాగుగా ఆలోచించియు, స్వయముగా తర్కించుకొనియు బుధులు హస్తాభినయమును చేయవలెను. అభినయమందు హస్తములు ప్రదర్శింపజాలని అర్థమేలేదు. దేనిచే ఏరూపము నిరూపితమగుచున్నదో దానినెల్ల విపులముగా వివరించియున్నాను. అర్థసహితములైన ఇతర లౌకిక హస్తము లింకను చాల కలవు. ఆచార్య బుద్ధి ననుసరించి వానిని రస-భావ (స్థాయి-వ్యభిచారిభావ) సూచకము లగునట్లుగా ప్రయోగింపదగును. దేశమును, కాలమును, ప్రయోగమును, అర్థయుక్తిని విశేషముగా విచారించి స్త్రీ-పురుషులీ హస్తములను ప్రయోగించవలెను. ఈ హస్తము లన్నింటియందును రస-భావ కృతములగు కర్మ భేదములను వివరింతును— ఉత్కర్షణము (పైకి లాగుట), వికర్షణము (ఈడ్చుట), వ్యాకర్షణము (బయటకులాగుట), పరిగ్రహము (స్వీకరించుట), నిగ్రహము (తిరస్కరించుట), ఆహ్వానము (పిలుచుట), తోదనము (ప్రోత్సహించుట), సంశ్లేషము (కలయిక), వియోగము (ఎడబాటు), రక్షణము (కాపాడుట), మోక్షణము (విడుచుట), విక్షేపము (చల్లుట), ధూననము (త్రోసివేయుట), విసర్గము (త్యజించుట), తర్జనము (బెదరించుట), ఛేదనము (చీల్చుట), భేదనము (బ్రద్దలుచేయుట), స్ఫోటనము (వికసించుట), మోటనము (సంకోచమునందుట,) తాడనము (కొట్టుట) అను ఈ కర్మలెల్ల హస్తములచే అభినయింపబడును.

ఇంక నాట్యతత్త్వ సమాశ్రయమైన హస్త ప్రచారమును వివరింతును— ఉత్తానము (ఊర్ధ్వ ముఖముగా ఉండుట), పార్శ్వగతము, అధోముఖము అను భేదములచే హస్తప్రచారము మూడు విధములు. ఉత్తానము, వర్తులము, త్ర్యశ్రము (త్రిపార్శ్వగతము), స్థితము, అధోముఖము అను భేదములచే హస్తప్రచారము నాట్య నృత్తములందు ఐదు విధములని కొందరందురు.[16] ప్రయోగములందు నేత్ర-

---

16. భూమిపై ఉన్న లేదా నిర్మింపబడిన ద్రవ్యమును నిరూపించుట మొదలగు అభినయములందు పతాకము ఉత్తానముగా ఉండును. జిహ్వాభినయమున ఆస్యక్షేత్రగతమగు పతాకము కూడ అగ్రగ మనబడు ఉత్తానమునకు ఉదాహరణమే. ధనురభినయమున పిడికిలి పార్శ్వగముగ ఉండును. ఇట్లే ఇతరములను గ్రహించవలెను.

భట్టోద్భటుడు ఐదు హస్త ప్రచారములను చెప్పెను—ఉత్తాన-అధస్తల-త్ర్యశ్ర-అగ్రగ-అధోముఖములు. కాని, వీనిలో అధోముఖమున అధస్తలమును, ఉత్తానమున అగ్రగమును



భ్రూ-ముఖ రాగాదులు ఈ హస్తప్రచారముల ననుసరించుచు అర్థవ్యక్తీకరణమునందు తోడ్పడవలెను. కరణ-కర్మ-స్థాన - ప్రచారయుక్తి - క్రియలను విచారించి లోక సదృశముగా హస్తాభినయమును చేయవలెను. ఉత్తముల హస్తములు లలాట ప్రదేశమున కెదురుగా చరించవలెను. మధ్యముల హస్తములు వక్షమున కెదురుగా చరించవలెను. అధముల హస్తములు అధోగతములై ఉండవలెను.[17] ప్రయోక్తల హస్తప్రచారములు జ్యేష్ఠ (ఉత్తమ) నాట్యమందు స్వల్పముగాను, మధ్యమ నాట్య

---

అంతర్భవించును. త్ర్యశ్ర మనునది త్రిపార్శ్వగమే. కావున త్రిప్రచార మనునదియే సమంజసము. ఇంకను ఆ ప్రచారములందు ఉత్తానాదులలో సమము, విషమము, త్ర్యశ్రితము అనెడి మూడేసి అవాంతరభేదము లుండును. ఇట్టి త్రైవిధ్యము వీనికి ఉచితము.

అభినయవస్తువు రసనిష్పత్తిని కలిగించును. ఆ అభినయవస్తువు కరణానుభావాత్మకముగా ఉండును. ఆ కరణసంచయములే అంగహారములు [అభినవభారతి - 2వ సంపుట 70].

17. ఆవేష్టితాది కరణములను, కర్మను, లలాటాద్యభినయ స్థానములను, ఉత్తానాది సన్నివేశ స్థితిని, స్వల్ప - మధ్యమాది ప్రచారములను, ముఖ్య - గౌణాద్యుపపత్తులను, విధి నిషేధానుభయరూప క్రియలను చక్కగా పరిశీలించి అభినయజ్ఞులు హస్తాభినయమును లోకానుసారముగా చేయవలెను.

యుక్తి అనగా ముఖ్య - గౌణాద్యుపపత్తి. 'గౌరయం బ్రాహ్మణః' - ఇత్యాదులందు గో శబ్దార్థమగు మృగమును సూచించునట్టి కర్తరీముఖ - మృగశీర్షక ప్రాయమగు హరిణాభినయమును చేయరాదు. గౌణార్థమును ఆశ్రయించి బ్రాహ్మణుని మూర్ఖతను మాత్రమే అభినయించవలెను; ఇందు చతుర - శుకతుండ - శిఖర - నిషధప్రాయముగా అభినయము చేయవలెను. ఇట్లు శబ్దముల ముఖ్య - గౌణవృత్తులేకాక శబ్దముల విశేషణ విశేష్య భావాదులును యుక్తి శబ్దముచే గ్రహింపబడును. అది ఎట్లన తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి సమాసమందు సమాసముయొక్క అర్థమును, అన్యపదార్థమును కూడ అభినయింపబడవలెను. "సపులక స్వేదోద్గమోత్కంపయా" అనెడు రత్నావళీ పద్యభాగ మిందుల కుదాహరణము. ఇందు పులక - స్వేద - కంపములతో బాటు విశేష్యార్థమును కూడ అభినయించవలెను. ఇంక ఇతర స్థలములందు (అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహ్యాదులందు) అన్యపదార్థము (విశేష్యార్థము) మాత్రమే అభినయింపబడవలెను. అట్టిచోట వృత్త్యర్థమునుకూడ అభినయించిన అభినయించవచ్చును.

విధి, నిషేధము, అనుభయము అను భేదములచే క్రియ మూడు విధములు. 'గచ్ఛ' (వెళ్ళుము) ఇత్యాది విధి వాక్యములందు ప్రత్యయార్థములకును, 'మాగచ్ఛ' (వెళ్ళకుము) ఇత్యాది నిషేధ వాక్యములందు 'మా' అను అవ్యయార్థమునకును, అనుభయరూపమగు స్థలమున ప్రకృత్యర్థమునకును ప్రాధాన్యము కావున వానినే అభినయించవలెను. 'అవతరత్వార్యః' ఇత్యాదులందు మాత్రము విధి అభినయింపదగదు. ప్రకృత్యర్థము మాత్రమే అనగా అవతరణము మాత్రమే అభినయింపబడవలెను.

మందు మధ్యమముగాను, అధమ నాట్యమందు అధికముగాను ఉండవలెను.[18] లక్షణాను సారులైన హస్తములను ఉత్తమ- మధ్యములును, లోకక్రియా-స్వభావాను సారులైన హస్తములను నీచులును అర్థవశమున ప్రయోగించవలెను. అయినను వేరొక విధమైన ప్రయోగముకాని, కాలము కాని తటస్థించునప్పుడు బుధులు హస్తములను

ఇంక స్థానము కూడ మూడు విధములు. సువర్ణాద్యుత్తమ ద్రవ్యములందు సమీపమునను, మధ్యమ ద్రవ్యములందు మధ్యమములుగాను, అధమ ద్రవ్యములందు దూరముగను హస్తము లుండవలెనని కొంద రిచ్చట అర్థము చెప్పుదురు. లలాటము మున్నగు పదములు ఉపలక్షణములై సమీపాద్యర్థములను తెలుపునని వారి ఆశయము. [అభినవభారతి - 2 వ సం - పుటలు 66-67]

18. అభినయగతమగు విశేషాంతర మిచ్చట చెప్పబడుచున్నది. "ఉత్తమ ప్రయోగములగు నాటకాదులు ధర్మ - అర్థ - కామ - మోక్షము లనెడి ఉపాయములను ఉపదేశించునవి కావునను, ప్రత్యక్షతా ప్రధానమగుటచేతను అందు హస్తాభినయము అల్పముగా ఉండును. రంజనమాత్ర ప్రయోజనము గల మధ్యమప్రయోగములందు అనగా భాణకాదులందు హస్తాభినయము అధికముగా ఉండును. ప్రత్యక్షములు కాదగు విషయములును ఇందు ఆకాశభాషితములుగనే ఉండునుకదా. నృత్త కావ్యములును అధమప్రయోగములును అగు షిద్గకాదులందు హస్తాభినయము ప్రకీర్ణముగా ఉండును" అని కొంద రందురు. "ఒక విధనుగు వ్యవస్థ లేకుండుటచే అట్టి రీతి ఉచితము కాదు. ఏమనగా నాటకాదులందును అభినయము బహుళముగా ఉండును. ఉత్తను పాత్ర పరస్థ విషయములను అభినయించునప్పుడు ప్రధాన విషయమునే అభినయించవలెను కాని అప్రధాన విషయమును అభినయించనక్కరలేదు". అని మరికొంద రందురు.

కొంద రింకొక విధముగా చెప్పుదురు—"పదార్థ సముదాయమును అభినయించవలసినపుడు ఒక అభినయము కాని, అనేకాభినయములు కాని అవసరమగుచుండును. 'యా సృష్టిః స్రష్టురాద్యా' అను శాకుంతల శ్లోకమున ఉత్తముడు ఒక్కటియే జల - అగ్న్యాద్యభినయమును కావించును. అధముడు చలస్వభావము కలవాడు. కావున అనేకాభినయములను కావించును. మధ్యముడు మధ్యమాభినయమును చేయును."

మరికొంద రింకొక విధముగా చెప్పుదురు—"ఏ అభినయ హస్తములు పరిమిత (అల్ప) పదార్థములను మాత్రము స్ఫురింపజేయునో అయ్యవి స్ఫుటముగా అర్థములను వ్యక్తముచేయును. అచ్చట అర్థప్రకరణాదులు సాహాయ్యపడుచు సులభస్ఫూర్తిని కలిగించును. అనేకార్థజాతములను సూచించునపుడుగదా వాని స్ఫూర్తి క్లేశావహమగును? ఉత్తమ ప్రకృతుల విషయమున అట్టి స్ఫుటార్థ ప్రతీతిని కలిగించు పరిమితార్థ ప్రతీతిజనకములగు అభినయహస్తములే ఉపయోగింపదగును".

పై అభిప్రాయము లన్నింటను ఉత్తమవిధానము క్రింది విధముగా ఉండునని తెలియవలెను—ఉత్తమాభినయమున ప్రత్యక్షము, వర్తమానము, ఆత్మస్థము అగు విషయమున హస్తవ్యాపారము అల్పముగా ఉండును. ఉదా: "హృదయ! సమాశ్వసిహి" అనెడి



విపరీతముగాకూడ ప్రయోగించవచ్చును.[19] విషణ్ణత, మూర్ఛ, లజ్జ, జుగుప్స, శోకము, గ్లాని, స్వప్నము, విహస్తత (చేయిలేకపోవుట), నిశ్చేష్టత, తంద్ర (కునికిపాటు), జడత, వ్యాధి, జ్వరము, భయము, చలి, మదము, ప్రమాదము, ఉన్మాదము, చింత, తపస్సు, హిమవర్ష (మంచు) బాధ, బంధము, నీటియందు మునుగుట, కలవరింత, సంభ్రమము, గోళ్లు గిల్లుకొనుట అనువానిని నిరూపించుటయందు హస్తాభినయమును చేయరాదు. ఇచ్చట కేవలము సాత్త్వికాభినయమును మాత్రమే చూపవలెను; మరియు నానార్థరసభావకమైన కాకువిశేషమునుకూడ ప్రయోగించవలెను.[20]

యత్ర వ్యగ్రా వుభౌ హస్తౌ తత్ర దృష్టి విలోకనైః ।
వాచికాభినయం కుర్యా ద్విరామై రర్థదర్శకైః ॥ 180

—హస్తములు రెండును ఎచ్చట కార్యవ్యగ్రములై ఉండునో, అచ్చట ఆయా దృష్టివిలోకనములతో, అర్థప్రదర్శకములైన విరామములతో వాచికాభినయమును చేయవలెను.[21]*

శాకుంతల వాక్యము. ఇందు సాత్త్వికాభినయము అధికముగా ఉండును కావున ఉత్తమ మనబడును. అప్రత్యక్షము, భూత-భవిష్యత్కాలీనము, పరస్థము అగు విషయమున సాత్త్వికాభినయమునకు అవకాశము లేదు. కావున అచ్చట అభినయము అధమము. "సత్త్వహీనమైన అభినయము అధమము" అని 22 వ అధ్యాయమందు చెప్పబడును. అందు విప్రకీర్ణములు, విక్షిప్తములు అతి బహుళములును అగు హస్తము లుండును. దీని కుదాహరణము తాపసవత్సరాజమున కుంజరకునియొక్కయు, వేణీసంహారమున సుందరకునియొక్కయు పరస్థ యుద్ధవర్ణనములు. ఈ రెండింటికిని భిన్నమగు హస్తప్రయోగము మధ్యమము. ఉదా: ప్రత్యక్షదృశ్యు డగు విదూషకునిచే అవస్థావేశకారి యగు ఉద్యానాదిక వర్ణనము. [అభినవభారతి - 2 వ సం - పుట 67-68]

19. ఉత్తములగు దేవ - గురు - నృపాదులు నిర్దేశింపబడునపుడు అంజల్యాది హస్తములు లలాట క్షేత్రచారులు అగునట్లును, మధ్యములగు అమాత్యాదులు నిర్దేశింపబడునపుడు చతురాది హస్తములు వక్షఃక్షేత్రచారులు అగునట్లుగాను, అధములగు విదూషకాదులు నిర్దిష్టులగునపుడు శుకతుండాది హస్తములు అధఃక్షేత్రచారు లగునట్లును అభినయించవలెను. అయినను చంద్ర - నక్షత్రాది దర్శనమున అధమునికైనను హస్తములు లలాటక్షేత్రచరములగుట విరుద్ధము కాదు [అభినవభారతి - 2 వ సం - పుట 67].

20. పై సందర్భములందు హస్తాభినయమునే కాదు, బాహ్యద్రవ్య - గుణసూచకమైన ఏ ఇతరాభినయమును కూడ చేయరాదు; కేవలము అంతరవృత్తి సూచకమగు అభినయమును మాత్రమే చేయవలెనని అర్థము. కాకు విశేషము 17 వ అధ్యాయమందు వివరింపబడును.

21. ఉదా: సారథి హస్తములు ప్రతోద - రశ్మి వ్యగ్రములుగా ఉండును; విలోకనములును అట్లే ప్రసరించుచుండును [అభినవభారతి - 2 వ సం - పుట 69].

నృత్తహస్తములు*

ఇంతవరకును నానాభినయ సంశ్రయములైన హస్తములను (అభినయహస్తములను) వివరించితిని. ఇంక నృత్తహస్తములను వివరింతును. చతురశ్రాది భేదములచే నృత్తహస్తములు ముప్పదివిధములు. వాని లక్షణములను వరుసగా వివరింతును—

1. చతురశ్రములు—కూర్పర - అంసములు సమానముగా ఉండునట్లు చేసి, వక్షమునకెదురుగా ఎనిమిదిఅంగుళముల దూరములో ప్రాఙ్ముఖములు (ప్రేక్షకుల కభిముఖములు) అగునట్లుగా రెండు కటకాముఖహస్తములను ఉంచినచో అవి 'చతురశ్రహస్తము' లనబడును.

2. ఉద్వృత్తములు—రెండు హంసపక్ష హస్తములను వక్షమున కెదురుగా తాళవృంతమువలె క్రిందుమీదులుగా ఆడించినచో అవి 'ఉద్వృత్తహస్తము' లనబడును. వీనికి 'తాళవృంతము' లని ఇంకొక పేరు కలదు.

3. తలముఖములు— చతురశ్రహస్తములను అరచేతు లెదురెదురుగా ఉండునట్లు అడ్డముగా పట్టినచో అవి 'తలముఖహస్తము' లనబడును.

4. స్వస్తికములు— తలముఖహస్తములు మనికట్టులనొద్ద స్వస్తికాకారముగా ఉన్నచో అవి 'స్వస్తికహస్తము' లనబడును.

5. విప్రకీర్ణములు— పైన చెప్పిన స్వస్తిక హస్తములు విడివడినచో అవి 'విప్రకీర్ణహస్తము' లనబడును.

6. అరాల-కటకాముఖములు— అరచేతులు వెలికిలగా ఉన్న రెండు అలపల్లవ హస్తములను పద్మకోశహస్తములుగా మార్చి, పిమ్మట ఒకహస్తమును అరాలముగను, రెండవహస్తమును కటకాముఖముగను పట్టినచో అవి 'అరాల-కటకాముఖ హస్తము' లనబడును. ఆ విధముగనే మణికట్టుల చివర విడివడిన రెండు అరాల హస్తములు 'అరాల కటకాముఖ హస్తము' లనబడునని కొందరందురు.

---

* [బొంబాయి ముద్రణమునందు - 154-174 శ్లో; బరోడా ముద్రణమునందు - 159-182 శ్లో.]

22. ఈ నృత్తహస్తములు ప్రత్యేకముగా నృత్తమునందే ఉపయుక్తము లగును. అయినను పదార్థాభినయమందు (నాటకాదులందు) కూడ ఇవి క్వాచిత్కములుగా ప్రయుక్తములగుచునే ఉండును. సంయుత - అసంయుత హస్తముల పేర్లు ఏకవచనములో ఉండగా నృత్తహస్తముల పేర్లు ద్వివచనములో ఉన్నవి (చతురశ్రౌ, ఉద్వృత్తౌ....). ఇవి అర్థ ప్రదర్శకములు కాకపోయినను నృత్త - నాట్యములకు శోభను కలిగించుచుండును.



7. ఆవిద్ధవక్రములు (ఆవిద్ధవక్త్రిములు)— అంస-కూర్పర-భుజాగ్రములచే సవిలాసముగా ఆవర్తితములయిన (త్రిప్పబడిన) రెండు హస్తముల (పతాకహస్తములు) అరచేతులు పరాఙ్ముఖములయినచో అవి 'ఆవిద్ధవక్ర హస్తము' లనబడును.

8. సూచీముఖములు— అంగుష్ఠముచే స్పృశింపబడుచున్న రెండు సర్పశిరోహస్తములు అడ్డముగా త్రిప్పబడిన అరచేతులు కలవైనచో అవి 'సూచీముఖ హస్తము' లనబడును. ఈ సర్పశిరోహస్తవులు స్వస్తికములైనచో అవికూడ 'సూచీముఖహస్తములే' అగునని కొందరందురు.

9. రేచితములు— ద్రుతభ్రమణముకల రెండు హంసపక్షముల అరచేతులు వెలికిలగా ఉన్నచో అవి 'రేచితహస్తము' లనబడును.

10. అర్ధరేచితములు— వామహస్తము చతురశ్రమును, సవ్య (దక్షిణ) హస్తము రేచితమును అయినచో అవి 'అర్ధరేచితహస్తము' లనబడును.

11. ఉత్తానవంచితములు— కూర్పర - అంసములు కొంచెము చలించుచుండగా త్రిపతాకహస్తములు కొంచెము అడ్డముగా తిరిగి ఉన్నచో అవి 'ఉత్తానవంచితహస్తము' లనబడును.

12. పల్లవములు— రెండు పతాకహస్తములు మణికట్టులనొద్ద స్వస్తికాకారముగా ఉన్నచో అవి 'పల్లవహస్తము' లనబడును.

13. నితంబములు— అంసములపై ఉన్న రెండు పతాకహస్తములను నితంబములమీద ఉంచినచో అవి 'నితంబహస్తము' లనబడును.

14. కేశబంధములు— కేశదేశము (తల) మీద ఉన్న పతాకహస్తములు ప్రక్కలకు లేచినవై మరల తలమీదికే వచ్చినచో అవి 'కేశబంధహస్తము' లనబడును.

15. లతలు— రెండు పతాకహస్తములను పార్శ్వభాగములందు అడ్డముగా చాచిఉంచినచో అవి 'లతాహస్తము' లనబడును.

16. కరిహస్తములు— సమున్నతమైన లతాహస్తము పార్శ్వమునుండి పార్శ్వమునకు ఆడింపబడుచుండగా, త్రిపతాకహస్తమును చెవిమీద ఉంచినచో అవి 'కరిహస్తము' లనబడును.

17. పక్షవంచితకములు — ఒక త్రిపతాక హస్తము కటిమీదను, ఇంకొక త్రిపతాక హస్తము తలమీదను ఉన్నచో అవి 'పక్షవంచితక హస్తము' లనబడును.

18. పక్షప్రద్యోతకములు— పక్షవంచితక హస్తములు విపర్యయము అయినచో (కటిమీదనున్న హస్తము తలమీదకును, తలమీదనున్న హస్తము కటి మీదకును వచ్చినచో) అవి 'పక్షప్రద్యోతక హస్తము' లనబడును.

19. గరుడపక్షములు—పక్షవంచితక హస్తములు నితంబములమీదపడి వెంటనే పైకిలేచినచో అవి 'గరుడపక్ష హస్తము' లనబడును.

20. దండపక్షములు—రెండు హంసపక్ష హస్తములను క్రిందు మీదులుగా ఆడించుచు, భుజములను ప్రసారితములను చేసినచో అవి 'దండపక్ష హస్తము' లనబడును.

21. ఊర్ధ్వమండలులు—హస్తములు ఊర్ధ్వకాయమున కెదురుగా త్రిప్పబడినచో అవి 'ఊర్ధ్వమండలి హస్తము' లనబడును.

22. పార్శ్వమండలులు—పై హస్తములే పార్శ్వములందు త్రిప్పబడినచో అవి 'పార్శ్వమండలి హస్తము' లనబడును.

23. ఉరోమండలులు—రెండు హస్తములు వక్షమున కెదురుగా త్రిప్పబడిన పిమ్మట ఒకటి ఉద్వేష్టితమును (పైకెత్తబడినదియును), రెండవది అపవేష్టితమును (వ్రేలాడునదియును) అయినచో అవి 'ఉరోమండల హస్తము' లనబడును.

24. ఉరఃపార్శ్వార్ధ మండలములు— అలపల్లవ హస్తము వక్షమునుండి పార్శ్వమునకును, అదే కాలమున అరాల హస్తము పార్శ్వమునుండి వక్షమునకును వచ్చినచో అవి 'ఉరఃపార్శ్వార్ధమండల హస్తము' లనబడును.

25. ముష్టిక - స్వస్తికములు—మనికట్టులనొద్ద కుంచితమును (అరాల వర్తనముచే), అంచితమును (అలపల్లవ వర్తనముచే) అయిన హస్తములు కటకాముఖ హస్తములుగా మారి స్వస్తికముగాఐనచో అవి 'ముష్టిక - స్వస్తిక హస్తము' లనబడును.

26. నలినీపద్మకోశములు—రెండు పద్మకోశ హస్తములు క్రిందుమీదులుగా ఆడింపబడినచో అవి 'నలినీపద్మకోశ హస్తము' లనబడును.

27. అలపల్లవములు—హస్తములు చలించుచున్న వ్రేళ్ళు కలవైనచో అవి 'అలపల్లవహస్తము' లనబడును.

28. ఉల్బణములు—హస్తములను పైకెత్తి అంసములమీద వ్రేళ్ళను ఆడించినచో అవి 'ఉల్బణహస్తము' లనబడును.

29. లలితములు— పై అలపల్లవ హస్తములను తలమీదఉంచినచో అవి 'లలితహస్తము' లనబడును.

30. వలితములు— లతాహస్తములు మోచేతుల యొద్ద స్వస్తికముగా ఉన్నచో అవి 'వలితహస్తము' లనబడును.

పై నృత్తహస్తములను విశేషముగా కరణములందు ప్రయోగించవలెను; పతాకాది సంయుతాసంయుత హస్తములను అర్థాభినయమందు ప్రయోగించవలెను. అయినను ప్రయోజనవశమున వాని ప్రయోగములందు సాంకర్యము కూడ ఉండవచ్చును. ప్రాధాన్యము ననుసరించి మాత్రమే వానికి ఆయా నామవ్యవహారములు కలిగెనని తెలియవలెను. నృత్తహస్తములందు కూడ సంయుత-అసంయుత భేదములు కలవని తెలియవలెను.



కరణ సంశ్రయములైన హస్తములు[23]

పైన వివరించిన సర్వహస్తములందును 'కరణములు' నాలుగువిధములు—ఆవేష్టితము, ఉద్వేష్టితము, వ్యావర్తితము, పరివర్తితము.

1. ఆవేష్టితము—హస్తమును త్రిప్పుటలో తర్జని మొదలగు వ్రేళ్ళు నాలుగును యథాక్రమముగా అభ్యంతరావేష్టితములగుట (వక్షమువైపుతిరిగిఉండుట) 'ఆవేష్టితకరణ' మనబడును.

2. ఉద్వేష్టితము—హస్తమును త్రిప్పుటలో తర్జని మొదలగు వ్రేళ్ళు నాలుగును క్రమముగా వక్షమునుండి బహిర్ముఖముగా ఉద్వేష్టితములగుట (వెలుపలకు తిరిగిఉండుట) 'ఉద్వేష్టితకరణ' మనబడును.

3. వ్యావర్తితము—కనిష్ఠిక మొదలగు నాలుగు వ్రేళ్ళును పై విధముగా అభ్యంతరావర్తితములగుట 'వ్యావర్తితకరణ' మనబడును.

4. పరివర్తితము— క్రమముగా కనిష్ఠిక మొదలగు వ్రేళ్ళు పై విధముగా బాహ్యముగా ఉద్వర్తితములగుట (త్రిప్పబడుట) 'పరివర్తితకరణ' మనబడును.

నృత్తమునందును, అభినయమునందును ముఖ-భ్రూ-నేత్రయుక్తములైన అభినయ-నృత్తహస్తములచే కరణములు చక్కగా ప్రయుక్తములు కావలెను. కరణగతములైన బాహువుల సంచార ప్రకారములు పదివిధములు— తిర్యగ్గతి (పార్శ్వములందు చరించుట), ఊర్ధ్వగతి (తలమీదుగా చరించుట), అధోముఖగతి, అంచితగతి (వక్షమునుండి నిష్క్రమించి తలమీదకువచ్చుట), అపవిద్ధగతి (త్రోసివేయబడుట), మండలగతి (అంతటను భ్రమించుట), స్వస్తికత్వము (ఒకదానిపై ఇంకొకటి అడ్డముగాఉండుట), పృష్ఠానుసరణము (తనవెనుకభాగమునందుంచుట), ఉద్వేష్టితము (మనికట్టునొద్ద త్రిప్పుట), ప్రసారితము (చాచుట). ఇంతవరకును

---

23. క్రియాంతరాపేక్ష లేకుండునట్లు సమాప్తిచెందునపుడు అంగుళీతులనాత్మకమగు ప్రక్రియావిశేషముచే ఒక అభినయవిశేషము తనంతతాను సిద్ధించునో ఆ క్రియావిశేషమే 'కరణ' మనబడును. ఎట్లన కనిష్ఠాంగుళ్యాదుల ఆవర్తనక్రియలచే అలపల్లవ అభినయము సిద్ధించునుగదా. అట్లే ఇతరములును [అభినవభారతి - 2వ సం - పుట 79].

హస్తములయొక్క కరణవిధిని సంగ్రహముగా వివరించితిని. ఇప్పుడింక హృదయ-ఉదర-పార్శ్వముల కర్మలను, వినియోగములను వరుసగా వివరింతును.*

హృదయకర్మ[24]

ఆభుగ్న-నిర్భుగ్న-ప్రకంపిత-ఉద్వాహిత-సమ భేదములచే 'హృదయకర్మ' 5 విధములు. (దీనిని 'వక్షఃకర్మ' అనియు, 'ఉరఃకర్మ' అనియుకూడ అందురు). వీని లక్షణ-వినియోగములను వరుసగా వివరింతును—

1. ఆభుగ్నము (కొంచెము వంగినది)— వీపు ఉన్నతమును, అంసములు వ్యాభుగ్నములును(ముందునకు వంగినవియును), లేదా ఒక్కొక్కప్పుడు శిథిలములును (వదులుగా ఉన్నవియును), హృదయము నిమ్నమును (పల్లమును) అయినచో అది 'ఆభుగ్నహృదయ' మనబడును. సంభ్రమము, విషాదము, మూర్ఛ, శోకము, భయము, వ్యాధి, హృదయశల్యము, చలి, వర్షము, లజ్జ అను అర్థములను అభినయించుటకు ఆభుగ్నహృదయమును ప్రయోగించవలెను.

2. నిర్భుగ్నము (అసలువంగనిది)— వీపు నిమ్నమును, అంసములు నిర్భుగ్నములును, హృదయము స్తబ్ధమును (కదలికలేనిదియును) సమున్నతమును అయినచో అది 'నిర్భుగ్నహృదయ' మనబడును. స్తంభము, మానగ్రహణము, విస్మయదృష్టి, సత్యవచనము, గర్వము, పొగరు, 'నే' ననెడి దర్ప వచనము అనువానిని నిరూపించుటయందీ నిర్భుగ్నహృదయమును ప్రయోగించవలెను. దీర్ఘనిశ్శ్వాసము, ఆవులింత, సంకోచము, స్త్రీల బిబ్బోకము అనువానిని నిరూపించుటయందు కూడ 'నిర్భుగ్నహృదయము' ప్రయుక్తమగునని కొందరందురు.

3. ప్రకంపితము— నిరంతరముగా హృదయమును పై కెగురవేయుచున్నచో (ఎగశ్వాసగాఉన్నచో) అది 'ప్రకంపితహృదయ' మనబడును. నవ్వుట, ఏడ్చుట, శ్రమ, భయము, శ్వాసము, దగ్గు, ఎక్కిళ్ళు, దుఃఖము అనువానిని నిరూపించుటయందు ప్రకంపిత హృదయము ప్రయుక్తము కావలెను.

4. ఉద్వాహితము—హృదయము ఊర్ధ్వగతమయినచో (పైకి ఎగలాగబడినచో) అది 'ఉద్వాహితహృదయ' మనబడును. దీర్ఘోచ్ఛ్వాసము, ఎత్తైనవానిని

* [బొంబాయి ముద్రణమునందు 175-212 శ్లో; బరోడా ముద్రణమునందు - 183-222 శ్లో.]

24. ఇచ్చటనుండి కాశీ ముద్రణమునందు 10వ అధ్యాయము ప్రారంభ మగుచున్నది. ఈ భాగము కాశీ ముద్రణమునందు "శారీరాభినయము" - 10వ అధ్యాయము 1-55 శ్లో; బొంబాయిముద్రణమునందు 9వ అధ్యా. 213-267 శ్లో; బరోడాముద్రణమునందు 9వ అధ్యాయము - 223-283 శ్లో.]. 1వ అధస్సూచికనుకూడ చూడవలెను.



చూచుట, ఆవులింత అనువానిని నిరూపించుటయందు ఈ ఉద్వాహిత హృదయము ప్రయుక్తముకావలెను.

5. సమము— చతురశ్రకృతములుగా ఉన్న సర్వాంగ విన్యాసములతో హృదయము సౌష్ఠవోపేతముగా స్వస్థానమందున్నచో అది 'సమహృదయ' మనబడును.

పార్శ్వ కర్మ

నత-ఉన్నత-ప్రసారిత-వివర్తిత-అపసృత భేదములచే పార్శ్వకర్మ ఐదు విధములు. వీని లక్షణ-వినియోగములను వరుసగా వివరింతును—

1. నతము—కటి ముందునకు వంగినదియును, ఒక పార్శ్వము కొంచెము వంగినదియును, అంసము కొంచెము వెనుకకు త్రోయబడినదియును అయినచో అది 'నతపార్శ్వ' మనబడును. ఉపసర్పణమునందు (సమీపించుటయందు) నతపార్శ్వము ప్రయుక్తము కావలెను.

2. ఉన్నతము—రెండవ పార్శ్వము నతపార్శ్వమునకు విపరీతము అయినచో అనగా కటి-పార్శ్వ-భుజ-అంసములను బాగుగా ఉన్నతములను చేసినచో అది 'ఉన్నతపార్శ్వ' మనబడును. అపసర్పణమందు (తొలగిపోవుటయందు) ఉన్నత పార్శ్వము ప్రయుక్తము కావలయును.

3. ప్రసారితము— ఉభయపార్శ్వములును ఆయామములు అయినచో (సాగినచో) అది 'ప్రసారితపార్శ్వ' మనబడును. ప్రహర్షాదులను నిరూపించుటయందిది ప్రయుక్తమగును.

4. వివర్తితము—త్రికము (వెన్నెముక క్రిందిభాగము) త్రిప్పబడినచో అది 'వివర్తితపార్శ్వ' మనబడును. ఒకవైపునుండి పరివృత్తమునందు (ఇంకొకవైపునకు తిరుగుటయందు) వివర్తిత పార్శ్వము ప్రయుక్తమగును.

5. అపసృతము (ప్రసృతము)—వివర్తిత స్థానమునుండి యథాస్థానమునకు వచ్చినచో అది 'అపసృత పార్శ్వ' మనబడును. వినివృత్తమందు (మరలుటయందు) అపసృత పార్శ్వము ప్రయుక్తమగును.

జఠర కర్మ

క్షామ-ఖల్వ-పూర్ణ భేదములచే జఠర (ఉదరము=పొట్ట) కర్మ మూడు విధములు. వీని లక్షణ-వినియోగములను వరుసగా వివరింతును—

1. క్షామము—పొట్ట పల్చగా ఉన్నచో అది 'క్షామ జఠర' మనబడును. హాస్యము, రోదనము, నిశ్శ్వాసము, ఆవులింత అనువానిని నిరూపించుటయందు క్షామ జఠరము ప్రయుక్తమగును.

2. ఖల్వము—పొట్ట డొక్కలలోనికి చొచ్చుకొనిపోయినచో అది 'ఖల్వ జఠర' మనబడును. శ్రమ, తపస్సు, ఆకలి, వ్యాధి- వీనిని నిరూపించుటయందు ఖల్వ జఠరము ప్రయుక్తమగును.

3. పూర్ణము—పొట్ట ఆధ్మాత మయినచో (ఎత్తుగా నున్నచో) అది 'పూర్ణ జఠర' మనబడును. ఉచ్ఛ్వాసము, స్థూలశరీరము, జలోదరము, అమితముగా భుజించుట అను వానిని నిరూపించుటయందు 'పూర్ణజఠరము' ప్రయుక్తమగును.

'సమజఠర' మనెడి నాలుగవ భేదము కలదని కొందరందురు.

కటి కర్మ

ఛిన్న, నివృత్త, రేచిత, ప్రకంపిత, ఉద్వాహిత అనెడి భేదములచే కటి ఐదు విధములు. వీని లక్షణ - వినియోగములను వరుసగా వివరింతును.

1. ఛిన్న—కటిమధ్యము వలితమైనచో (నడుము త్రిప్పబడినచో) అది 'ఛిన్నకటి' అనబడును, వ్యాయామము, సంభ్రమము, వెనుకకు తిరిగిచూచుట అను వానిని నిరూపించుటయందు ఛిన్నకటి ప్రయుక్తమగును.

2. నివృత్త—పరాఙ్ముఖత్వమునుండి అభిముఖముగా మరలినచో అది 'నివృత్త కటి' అనబడును. ఒక వైపునుండి ఇంకొకవైపునకు తిరుగుటయందు నివృత్తకటి ప్రయుక్తమగును.

3. రేచిత— కటి అన్నివైపులకును త్రిప్పబడినచో అది 'రేచితకటి' అనబడును. గుండ్రముగా తిరుగుటయందు రేచితకటి ప్రయుక్తమగును.

4. ప్రకంపిత (కంపిత)— వేగముగా, అడ్డముగా, కటి ఇటునటు త్రిప్పబడినచో అది 'ప్రకంపితకటి' అనబడును. కుబ్జ-వామన-నీచుల గతులను నిరూపించుటయందు ప్రకంపితకటి ప్రయుక్తమగును.

5. ఉద్వాహిత— నితంబమును, పార్శ్వమును కటితోపాటు మెల్లగా పైకి లాగి ఉంచినచో (ఉన్నతము చేసినచో) అది 'ఉద్వాహితకటి' అనబడును. స్థూల వ్యక్తులగతిని, స్త్రీల లీలాగతులను నిరూపించుటయందు 'ఉద్వాహిత కటి' ప్రయుక్తమగును.



ఊరు కర్మ[25]

కంపన-వలన-స్తంభన-ఉద్వర్తన-వివర్తనభేదములచే ఊరు (తొడల) కర్మ ఐదువిధములు. వీని లక్షణ - వినియోగములను వరుసగా వివరింతును—

1. కంపనము— పార్ష్ణిని (మడమ=చీలమండ) మాటిమాటికిని పైకెత్తుట క్రిందికి దించుట చేయుచుండుటచే ఊరువులను కదల్చుచున్నచో అది 'కంపితోరువు' అనబడును. అధమపాత్రల భయగతి యందిది ప్రయుక్తమగును.

2. వలనము— నడుచునపుడు మోకాళ్ళు తొడలమధ్యలకు వచ్చుచున్నచో అది 'వలితోరువు' అనబడును. ఇది స్త్రీల స్వేచ్ఛా విహారములందు ప్రయుక్తమగును.

3. స్తంభనము— ఊరువులను చేష్టారహితముగాఉంచినచో అది 'స్తంభితోరువు' అనబడును. సాధ్వస-విషాదములందిది ప్రయుక్తమగును.

4. ఉద్వర్తనము— తొడలమధ్యలకు తగులునట్లుగా మోకాళ్ళను వంచి త్రిప్పుచున్నచో అది 'ఉద్వర్తితోరువు' అనబడును. ఇదికరణములందును, వ్యాయామ-తాండవములందును ప్రయుక్తమగును.

5. వివర్తనము— నడచుటలో చీలమండలు తొడలకుతగులుచున్నచో అది 'వివర్తితోరువు' అనబడును. సంభ్రమాది పరిక్రమములందిది ప్రయుక్తమగును.

పైనచెప్పిన ఊరుప్రకారములనేకాక లోకమునందు కనిపించు ఇతర విధములను కూడ నాట్యప్రయోక్తలు గ్రహించవలెను.

జంఘాకర్మ

ఆవర్తిత-నత-క్షిప్త-ఉద్వాహిత-పరివృత్త భేదములచే జంఘా (పిక్కల) కర్మ ఐదువిధములు. వీని లక్షణ-వినియోగములను వరుసగా వివరింతును—

1. ఆవర్తితము— కుడివైపునుండి ఎడమవైపునకును, ఎడమవైపునుండి కుడివైపునకును పాదములనువేయుచు నడిచినచో అది 'ఆవర్తిత జంఘ' అనబడును.

---

25. అంగము లారింటిలోను శిరము 8 వ అధ్యాయమందును, హస్తములు ఈ అధ్యాయ ప్రారంభమందును, ఉరః - పార్శ్వ - కటీ కర్మలు దాని తరువాతను వివరింపబడెను. పాదములు ఈ అధ్యాయాంతమందు వివరింపబడును. ఇంక వివరింపబడనున్న ఉదర (పొట్ట) - ఊరు - జంఘలు మూడింటిని ప్రత్యంగములనుగా తలంచవలెను. ఉపాంగము లన్నియును 8 వ అధ్యాయమందే వివరించబడినవి.

ఈ అంగ - ఉపాంగ - ప్రత్యంగముల వివరణములో తలనుండి పాదములవరకును గల క్రమము పాటింపబడుట గమనార్హము.

విదూషక పరిక్రమమునందిది ప్రయుక్తమగును. జంఘలను స్వస్తికముగా కూర్చుట కూడ ఆవర్తిత మనబడును. [ఇది అధిక పాఠము].

2. నతము—మోకాళ్ళను వంచినచో అది 'నత జంఘ' అనబడును. నేలమీద కాని, ఆసనమునందు కాని కూర్చుండుటయందిది ప్రయుక్తమగును.

3. క్షిప్తము—జంఘలను విసరుచు నడిచినచో అది 'క్షిప్తజంఘ' అనబడును. వ్యాయామ-తాండవములందిది ప్రయుక్తమగును.

4. ఉద్వాహితము—జంఘను మీదికెత్తినడిచినచో అది 'ఉద్వాహిత జంఘ' అనబడును. ఇది ఆవిద్ధగమనాదులందు ప్రయుక్తమగును.

5. పరివృత్తము—జంఘను వెనుకకు త్రిప్పినచో అది' పరివృత్త జంఘ' అనబడును. ఇది తాండవాదులందు ప్రయుక్తమగును.

### పాద కర్మ

ఉద్ఘట్టిత-సమ-అగ్రతలసంచర-అంచిత-కుంచిత భేదములచే పాద కర్మ ఐదు విధములు. వీని లక్షణ-వినియోగములను క్రమముగా వివరింతును—

1. ఉద్ఘట్టితము—వ్రేళ్ళపై నిలిచి, మడమలతో భూమిని అదుముచుండుట 'ఉద్ఘట్టితపాద' మనబడును. దీనిని ద్రుత-మధ్యమ ప్రచార భేదములచే ఉద్వేష్టిత కరణమందు ఒకసారి కాని, పెక్కుసార్లు కాని ప్రయోగించవలెను.

2. సమము—పాదములను భూమియందు సహజముగాఉంచుట 'సమపాద' మనబడును. ఇది స్వభావాభినయమందు ప్రయుక్తమగును. ఇది కరణభేదముల ననుసరించి స్వభావాభినయమందు స్థిరమును, పాదరేచితమందు చలితమును కావలెను.[26]

3. అగ్రతలసంచరము (=తలసంచరము)—మడమను పైకెత్తి వ్రేళ్ళను అంచితములనుచేసి అంగుష్ఠముతో ముందునకు సాగుట 'అగ్రతలసంచరపాద' మనబడును. ప్రేరణము, పొడుచుట, నిలుచుట; పీడించుట, నేలపై కొట్టుట, తిరుగుట, విక్షేపము, వివిధ రేచకములు, దెబ్బ తగులుటచే మడమలను ఎత్తి నడచుట అనువానిని నిరూపించుటయందు అగ్రతల సంచరపాదము ప్రయుక్తమగును.

26. ఇచ్చట 'త్ర్యశ్ర' మను భేదమింకొకటి చెప్పబడినది. [బరోడా ముద్రణము నందు - 270-272 శ్లో.]—సమపాదముయొక్క మడమను రెండవ పాదముయొక్క మధ్యభాగమునందుంచి, అంగుష్ఠమును వెలుపలికి ఉంచినచో అది 'త్ర్యశ్రపాద' మనబడును. అశ్వక్రాంతకరణమందును, విక్లబాద్యర్థములందును ఇది ప్రయుక్తమగును.



4. అంచితము—మడమలను నేలపైఉంచి, పాదతలములను పైకెత్తి, అన్నివ్రేళ్ళను చాచి నడచుట 'అంచిత పాద' మనబడును. పాదములయొక్క ముందు భాగమున దెబ్బతగులుట, గుండ్రముగా తిరుగుట, ఒక ప్రక్కనుండి ఇంకొక ప్రక్కకు తిరుగుట అనువానిని, వివిధ భ్రమరకములను నిరూపించుట యందు అంచితపాదము ప్రయుక్తమగును (భ్రమరము=భ్రమరి= మొత్తము శరీరముయొక్క భంగిమను. ఇవి ఆదిలో ఏడే. తరువాత పదునారైనవి. వీనిని భరతుడు చెప్పలేదు.)

5. కుంచితము— మడమను పైకెత్తి, వ్రేళ్ళను బాగుగాను మధ్యభాగమును కొంచెముగాను ముడుచుట 'కుంచితపాద' మనబడును. ఉదాత్తగమనము, వర్తితోద్వర్తితములు (క్రిందుమీదులు చేయుట), అతిక్రాంతచారి అనువానియందు కుంచితపాదము ప్రయుక్తమగును.[27]

పాదకర్మ ప్రవర్తిత మగుచున్నప్పుడు జంఘా-ఊరుకర్మలును ప్రవర్తితము లగుచుండును. అనగా పాద-జంఘా-ఊరు కర్మలు ఒకదానికొకటి అనుకూలముగా ఉండవలెను. పాదము ఎట్లు ప్రవర్తించుచుండునో ఊరువును అట్లే ప్రవర్తించుచుండును. ఆ పాద-ఊరువులయొక్క కర్మల సమన్వయముచే 'పాదచారి'ని ప్రయోగించవలెను. ఇంతవరకును అంగకర్మలను, వాని లక్షణములను వివరించితిని. ఇంక చారీవ్యాయామలక్షణమును వివరింతును. [24 వ అధస్సూచికను చూడవలెను.]

నవమాధ్యాయము సమాప్తము

## విశేషాంశములు

### 1. నాట్యశాస్త్రము : అభినయదర్పణము

4 వ అధ్యాయమందలి 9 వ విశేషాంశములో ప్రసిద్ధ భారతీయనృత్య భేదములను వివరించియున్నాను. ఈ నృత్యములకెల్ల మూల గ్రంథము 'అభినయదర్పణము'. ఇది నందికేశ్వర ప్రణీతముగా ప్రసిద్ధినంది ఉన్నది. ఈ నందికేశ్వరుడును, నాట్యశాస్త్రమందు చెప్పబడిన 'తండు మహర్షి' యును ఒకరే అని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు అభిప్రాయపడినారు [Journal of the Andhra Historical Research Society - Vol. III. PP. 4 55-459]. నందికేశ్వర ప్రణీతమగు 'భరతార్ణవము' నకు ఈ అభినయదర్పణము సంక్షిప్త గ్రంథమని కొన్ని వ్రాతప్రతులలో కలదు.

27. ఇచ్చట 'సూచీపాద' మనెడి ఇంకొక భేదము చెప్పబడినది [బరోడా ముద్రణము నందు 297-280 శ్లో.]—దక్షిణ పాదముయొక్క అంగుష్ఠముచివరనిలిచి. మడమనుపైకెత్తి, వామపాదమును స్వభావసిద్ధముగా ఉంచుట 'సూచీపాద' మనబడును. నృత్తమునందును, నూపురకరణమునందును ఇది ప్రయుక్తమగును.

అభినయదర్పణము యొక్క వ్రాతప్రతు లన్నియును తెలుగు భాషలోనే వ్రాయబడి ఉండుటచే ఈ గ్రంథము తెలుగు దేశమునందే పుట్టినదనియు, గ్రంథకర్తయును తెలుగువాడే అనియు ఊహించుట అసమంజసము కానేరదు. దీనికాలము క్రీ.శ. 4 వ శతాబ్దిప్రాంతము లని ఊహింపబడుచున్నది. [వివరములకు డా. ఘోష్ 'అభినయదర్పణ' పీఠికను చూడవలెను].

అర్వాచీన నృత్యశాస్త్ర గ్రంథము లన్నింటికిని నాట్యశాస్త్రమే మూలమైనను అవి కొన్ని లక్షణ - వినియోగములను వివరించుటలో భేదించుచున్నవి. ఇప్పుడు నాట్యశాస్త్ర-అభినయదర్పణములందు కన్పట్టు భేదములను వివరించుచున్నాను—

*శిరోభేదములు :* భరతుడు 13 శిరోభేదములను చెప్పెను. కాని నందికేశ్వరుడు 9 భేదములను మాత్రమే చెప్పెను. ఇందులో ఐదింటి పేర్లు మాత్రమే సమానములు. మరి రెండింటి పేర్లు ఇంచుమించుగా సమానములు. మరియు అధోముఖ - లోలిత - ధుత - కంపిత-పరావృత్త - పరివాహిత భేదముల లక్షణ-వినియోగములు సమానములుగా ఉన్నవని చెప్ప వచ్చును. భరతుని ఉత్క్షిప్త భేదమును, నందికేశ్వరుని ఉద్వాహిత భేదమును సమానములు.

*దృష్టిభేదములు :* భరతుడు మొత్తము ముప్పది ఆరు దృష్టిభేదములను వివరించెను. కాని నందికేశ్వరుడు ఎనిమిది దృష్టిభేదములను మాత్రమే చెప్పెను. వీనికి ఏవిధమైన సామ్యమునులేదు.

*గ్రీవాభేదములు :* భరతుడు తొమ్మిది భేదములను చెప్పగా నందికేశ్వరుడు నాలుగు భేదములనే చెప్పెను ; వీనికి సామ్య మేమియును లేదు.

*హస్తభేదములు :* హస్తములయందు అసంయుత - సంయుత - నృత్తము లనెడి మూడు భేదములను భరత - నందికేశ్వరు లిరువురును చెప్పి ఉన్నారు. వీనిలో పెక్కింటి పేర్లలో సామ్యముకన్పట్టుచున్నను లక్షణ - వినియోగములనువివరించుటయందు మాత్రము చాల భేదము కన్పట్టుచున్నది.

అసంయుతహస్తములు— భరతుడు 24 భేదములను చెప్పగా నందికేశ్వరుడు 28 భేదములను చెప్పెను. వీనిలో 22 హస్తముల పేర్లు సమానములు. పతాక - త్రిపతాక - అర్ధచంద్ర - అరాల - శుకతుండ - ముష్టి - శిఖర - పద్మకోశ - సర్పశిర - మృగశీర్ష - చతుర - భ్రమర - ముకులముల లక్షణములు సమానములు. తక్కినవాని లక్షణ - వినియోగములలో కొంత భేదముకలదు.

సంయుతహస్తములు— భరతుడు 13 భేదములను మాత్రమే చెప్పగా నందికేశ్వరుడు 23 భేదములను చెప్పెను. వీనిలో అంజలి - కపోత - కర్కట - పుష్పపుటముల లక్షణ - వినియోగములు ఇంచుమించుగా సమానములు.

నృత్తహస్తములు—భరతుడు ముప్పది భేదములను చెప్పగా నందికేశ్వరుడు పదుమూడు భేదములను మాత్రమే చెప్పెను. నృత్త హస్తములు సంయుత - అసంయుత హస్తముల కంటె భిన్న ప్రయోజనము కలవని భరతుడు చెప్పగా నందికేశ్వరు డట్టి భేదమును పాటించలేదు. కారణము వారి రెండు గ్రంథముల ప్రయోజనమును భిన్నమగుటయే (నాట్య శాస్త్రము రూపక ప్రదర్శనమును ప్రధానముగా వివరింపగా అభినయ దర్పణము నృత్య ప్రదర్శనమును మాత్రమే వివరించుచున్నది).



**2. హస్తాభినయము : కథాకళి**

నేటి కథాకళి నృత్యమునకు 'కొత్తరక్కర' రాజు (క్రీ. శ. 1575-1650) మూల పురుషుడని చెప్పుదురు. తక్కిన భారతీయ నాట్యములు నాట్యశాస్త్రమును లేదా అభినయ దర్పణమును అనుసరించుచుండగా కథాకళి మాత్రము 'హస్తలక్షణ దీపికను' అనుసరించు చున్నది. ఇందుకూడ అసంయుత హస్తములు ఇరువదినాలుగే. కాని పేర్లు, నిర్వచనములు, వినియోగములు కూడ భిన్నములుగా కన్పట్టుచున్నవి. భరతుని ముష్టిహస్తమందు బొటన వ్రేలు తక్కిన వ్రేళ్ళపైకి రాగా కథాకళియందలి ముష్టిహస్తమున బొటనవ్రేలు ముడిచిన నాల్గువ్రేళ్ళ మధ్యనుండి పైకి పొడుచుకొని వచ్చును. భరతుని సూచీముఖ హస్తము కథాకళియందు శిఖరహస్త మగుచున్నది. కాని, ఇది సమంజసముగా, లోకానుసారముగా కన్పట్టుటలేదు. భరతుని పతాక-త్రిపతాకలు తారుమారులై త్రిపతాక-పతాకలు అగు చున్నవి. ఇట్టి భేదములు కథాకళి శ్రేష్ఠతకు చిహ్నములని కొందరు భావించుచుండగా నాట్యశాస్త్రము యొక్క అంతస్తునుండి అది దిగజారినదనియు, నాట్యధర్మితోపాటు భరతుడాశించిన లోకధర్మి పూర్తిగా మృగ్యమైనదనియు డా. వి. రాఘవన్ నిరూపించి యున్నారు. [Kathakali and Bharata Natya- "Triveni"-Vol vi. No. 2.] కథాకళి నర్తకులు హస్తములను 'ముద్ర'లందురు. ఆపదము సమంజసమైనది కాదని 9 వ అధ్యాయ మందలి 4 వ అధస్సూచికలో వివరించి ఉన్నాను.

నాట్యశాస్త్ర-అభినయ దర్పణాదులందు 'నృత్తహస్తము'లను భేదము కలదు. కాని కథాకళియందు అవి 'మిశ్రముద్ర' లనబడును. సంయుత ముద్రలందు రెండు చేతులును ఒకే ముద్రను చూపును. అసంయుత ముద్రలందు ఒక చేయి మాత్రమే ఏదేని ఒక ముద్రను ప్రదర్శించును. ఇంక మిశ్రముద్రలందు రెండు చేతులును విభిన్నములగు ముద్రలను చూపును. ఇట్టి మిశ్రముద్రలు ఇంచుమించుగా తొమ్మిది వందలవరకును కలవట.

శ్రీ ప్రేమకుమార్ (సింహళము) అను ప్రసిద్ధ కథాకళి నర్తకుడు వ్రాసిన "The language of Kathakali" (1948) అను సచిత్ర గ్రంథము కథాకళి స్వరూప మును నిరూపించుచున్నది.

**3. అసంయుత హస్తములు**

లక్షణకర్త లందరును అసంయుత హస్తములను ప్రధానములనుగా తలంచుట గమనార్హము. తక్కిన హస్తభేదము లన్నింటికిని ఈ ఇరువది నాలుగే మూల భూతము లనుట స్పష్టము. ఈ ఇరువది నాలుగింటిలో మూడు హస్తములు అత్యంత ప్రధానములు; ఇవి ఒక్కొక్కటి మరికొన్నింటికి మూల భూతము లగుచున్నవి.

1. ఈ మూడింటిలో పతాక హస్తము ముఖ్యము. పతాకమునుండి త్రిపతాకము, దానినుండి కర్తరీ ముఖమును జనించినవి (ఇది భరతుడు చెప్పిన వరుసయే). మరల పతా కము నుండి అర్ధచంద్రము, దానినుండి అరాలము జనించినవి. అరాలమునుండి సందం శము, శుకతుండము వేర్వేరుగా జనించినవి. పతాకనుండియే సర్పశిరము, దానినుండి మృగశీర్షమును జనించినవి. మరల పతాకనుండియే చతురము, దానినుండి హంస పక్షమును జనించినవి.

2. ముష్టి హస్తము రెండవది. ముష్టినుండి శిఖరము, దానినుండి కపిత్థము, దానినుండి కటకాముఖము, దానినుండి సూచీముఖము ఉత్పన్నమగుచున్నవి. (ఇది భరతుడు చెప్పిన వరుసయే).

3. మూడవది పద్మకోశ హస్తము. పద్మకోశము నుండి కాంగులము, దానినుండి అలపల్లవమును జనించుచున్నవి. మరల పద్మకోశమునుండి ఊర్ణనాభమును, దానినుండి తామ్రచూడమును; అట్లే మరల పద్మకోశమునుండి భ్రమరమును, దానినుండి హంస వక్త్రమును, దానినుండి ముకులమును ఉత్పన్నమగుచున్నవి.

సంయుత హస్తములు పై అసంయుత హస్తములచేతనే ఏర్పడుచున్నవి. నృత్త హస్తములందును ఇవియే ఉపయుక్తములగుచున్నవి.

ఆయా హస్తముల పేర్లకు కొన్నింటికి అర్థములు వ్రాసి ఉన్నాను. తక్కిన పేర్లు సులభ గ్రాహ్యములు. ఆ పేర్లను పరిశీలించి చూచినచో అవి ప్రధానముగా ఏయే అర్థములను నిరూపించునో వెంటనే స్పష్టము కాగలదు.

4. లక్షణగ్రంథములందలి శిరో-హస్తాది భేదములు

ఆ యా లక్షణకర్తలు తమతమ గ్రంథములందు శిరో-హస్తాది భేదములను వివిధములుగా పేర్కొని యున్నారు. ఆ యా భేదములనెల్ల శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు ఒక పెద్ద పట్టికరూపములో కూర్చినారు. ఆ వ్రాతప్రతినుండి ముఖ్యుల గ్రంథములందలి భేదములను దిఙ్మాత్రముగా 390 పుటలో వివరించుచున్నాను.

5. అభినయము : నాట్యము

ఈ విషయమై 8 వ అధ్యాయాంతమందలి 4 వ విశేషాంశములో కొంత చర్చించి ఉన్నాను. ఇప్పుడు హస్తాభినయమును గూర్చి వివరింతును. భరతుడేవో కొన్ని హస్త భేదములను సృష్టించి, వానికి నామకరణముచేసి, నిర్వచనములు చెప్పెనని తలంచుట సమంజసముకాదు. భరతుడు చెప్పిన ప్రతి విషయమునకును లోకమే ఆధారమను సత్యమును మరవరాదు. ఎవరినైనను మెడపట్టిగెంటునప్పుడు మనము లోకమున ఉపయోగించునది అర్ధచంద్ర హస్తమే. "అర్ధచంద్ర ప్రయోగము జరిగినది" అనెడి వాడుక మనలో ప్రసిద్ధమేకదా. ఆ సమయములో మనచేయి అర్ధచంద్రుని ఆకారముగా ఉండునుకాన భరతుడా హస్తమును అర్ధచంద్ర హస్తమనెను. అదే చేతిని మనమింకను కొన్ని ఇతర విషయములందుకూడ ఉపయోగింతుము. ఏయే సందర్భములందా హస్తము ప్రయుక్తమగుచున్నదో గుర్తించి వానినెల్ల భరతుడు క్రోడీకరించెను. ఇట్లు ఆకారమునుబట్టి పేరును, ఏయే సందర్భములందుపయుక్తములగునో దానినిబట్టి వినియోగములును చెప్పబడినవి. ఇందులో భరతుడు తెచ్చిన కృతకత్వ మేదియును లేదని విజ్ఞులు స్పష్టముగా తెలిసికొనగలరు.

ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలసి ఉన్నది. ఒకే హస్తము అనేక అర్థములను నిరూపించుట కుపయుక్త మగుచున్నది. అట్టి సందర్భము లన్నింటను ఆ హస్తము ఒకే



స్థితి (Position) లో ఉండునని భావించరాదు. మంచినీళ్ళు కావలెనని సూచించుటకు శిఖర హస్తమందలి బొటనవ్రేలిని క్రింది పెదవి దగ్గరగా వంచి పెట్టుదుము. పితృతర్పణమందు ఆ బొటనవ్రేలు నేలకు అభిముఖముగా ఉండును. వింటిని చేతితోపట్టుకొనునప్పుడు ఆ బొటనవ్రేలు ఊర్ధ్వముఖముగా ఉండును. ఇట్లే ఇతర విషయములందును గ్రహించవలెను. అంజలి హస్తము దేవతాభివందనమందు శిరస్థమును, గుర్వభివందనమందు ఆస్యసంస్థితమును, మిత్రాభివందనమందు వక్షస్థమును, ఇతరులవిషయమున అనియతమునుకాదగునని భరతుడే చెప్పుట గమనార్హము.

ఇంకొక విషయమును కూడ ఇచ్చట స్పష్టము చేయవలసి ఉన్నది. ఈ హస్త భేదములు కాని, శిరో-భ్రూ-నాసికాది భేదములు కాని ఒక్క నృత్యమందే ఉపయోగపడుననియు, నాట్యమందు ఉపయోగపడవనియు తలంచరాదు. నాట్యశాస్త్రము ప్రధానముగా రూపకప్రదర్శన విధానమునే వివరించుచున్నదని నిరూపించి ఉన్నాను. 8, 9 అధ్యాయములందు భరతుడు చెప్పిన ఈ ఆంగికాభినయ మంతయును రూపక ప్రదర్శనమునకు అత్యంతమును ఉపయోగించునని పైన నేను చేసిన వివరణమును బట్టి సులువుగా గ్రహించవచ్చును. కావుననే నాట్యశాస్త్రాధ్యయనము నర్తకుల కంటెకూడ నటులకే ఎక్కువ ఉపయోగకారియును, ఆవశ్యకమును అగుచున్నది.

వాచిక సాహాయ్య మక్కరలేకయే శిరో-హస్తాద్యభినయములచేతనే ప్రయోక్తలు సమస్తార్థములను వ్యక్తముచేయ గలుగుచున్నారు. వాచిక-ఆంగికములు పరస్పరము ఎంత సహకారులో అంత విరోధులు కూడను. వాచికమును వర్జించి స్వతంత్రముగా నిలబడుటకు ఆంగికము చేసిన ప్రయత్నమే అభినయ రూపమును తాల్చినదని చెప్పవచ్చును. ప్రొఫెసర్ ఆర్. జి. మౌల్టన్ సిద్ధాంతమును 4 వ అధ్యాయాంత మందలి 15 వ విశేషాంశములో కొంత వివరించి ఉన్నాను. 18 వ అధ్యాయాంతమునమరల వివరింతును.

---

# అధ్యాయము 10

## చారీవిధానము[1]

[కాశీముద్రణమునందు 11 వ అధ్యాయము - 100 శ్లోకములు కలవు.
బొంబాయిముద్రణమునందు 10వ అధ్యాయము - 102 శ్లోకములు కలవు.
బరోడాముద్రణమునందు 10 వ అధ్యాయము - 103 శ్లోకములు కలవు.]

### చారి

ఊరు-కటీ-పాద-జంఘలయొక్క కర్మల పరస్పర సంయోజితమైన చేష్ట 'చారి' అనబడును.[2] ప్రధానభూతమైన అంగము (అభినయమందు హస్తము వలెనే గతియందు పాదము)చే ప్రవర్తితములును, ఒక నియమమును అనుసరించి కూడునవియును అగు చారుల సమావేశమునకు 'వ్యాయామము'[3] అని పేరు.

1. కాశీముద్రణమందీ భాగము ఏకాదశాధ్యాయము. బొంబాయి, బరోడా ముద్రణములందు దశమమే.

2. ఈ శ్లోకము కొన్ని ప్రతులలో లేదు.

3. "చారీవిధాన లక్షణమును వివరింతును" అని ముందు చెప్పబడును. కాని ఈ వివరణమును బట్టి "చారీవ్యాయామ లక్షణము" అని అనుట యుక్తమనియు, వ్యాయామ పదమున కర్థము 'అన్యోన్య యోజనాపతితములు లేదా అన్యోన్య సంమేళన యోగ్యములు అయిన చారులు' అనియు, కావున చారులే వ్యాయామమనియు అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను. [బరోడా ముద్రణము - 2 వ సం - పుట. 93]. చారి అను పదమునకు 'చరించుట' అనునది భావార్థము. ఇదియే ఇచ్చట అనుసంధింపబడవలెను. నృత్తమందు ఒక చారి ననుసరించి ఇంకొక చారి ప్రయుక్తమగును. అందేది ప్రధానమో దాని ననుసరించియే పేరు వచ్చును. ఇట్లు పరస్పర సంయోజితములైన చారుల మొత్తమునకు వ్యాయామమని పేరు. (వ్యాయచ్ఛంతే ఇతి వ్యాయామః—ఒక దానితో ఒకటి కలిసి ప్రయుక్తము లయ్యెడి చారులకు వ్యాయామమని పేరు.) చారు లన్యోన్యాశ్రయములగు నని ఇచ్చట శంకింప నవసరములేదు. ప్రధానముగా ఇవి ఒకే అంగముచే ప్రవర్తితములగును. ఇట మూలమందలి 'సమాయుక్తాః' అను బహు వచనమునకు ఒక చారి ప్రయత్న పూర్వకముగను, ఇంకొకటి అప్రయత్నముగను ప్రవర్తించునని అర్థమును చెప్పుట సమంజసము. కావున ఏ అంగము ప్రధానమగునో (అనగా అభినయమందు హస్తము, గతియందు పాదము) దానికి ఉపయోగించు చారి ప్రధానమగును. ప్రధానమగు ఈ పూర్వచారి తరువాతి అప్రధానచారిచే ఆశ్రయింపబడుచుండును. ఇట్లు చారులు పరస్పర నియమయుక్తములై వ్యాయామ సంజ్ఞ కలవి అగుచున్నవి. [అభినవభారతి - 2 వ సం - పుటలు 93–94.]



ఏకపాద ప్రచారము 'చారి' అనబడును. రెండు పాదముల ప్రచారము 'కరణము'[4] అనబడును. మూడు కరణముల సమావేశము 'ఖండము' అనబడును. మూడు లేదా నాలుగు ఖండముల సంయోగము ఒక 'మండలము'[5] అగును. నృత్తము, చేష్టితము (గతి ప్రచారము). శస్త్రమోక్షము (బాణాదులను విడచుట), యుద్ధము (ఖడ్గహననాదులు, బాహుయుద్ధము) అనువానియందెల్ల చారీవ్యాప్తి కలదు. ప్రస్తుతమగు నాట్యమంతయును చారీసంస్థితమే. చారీరహితమై నాట్యమందు ఏ అంగమును[6] ప్రవర్తించదు. కావున నృత్త-యుద్ధ-గతి ప్రచారములలో[7] దేనియందేచారిని ఎట్లుపయోగించవలెనో ఇప్పుడు వివరింతును. చారులు మొత్తము ముప్పదిరెండు విధములు. ఇవి భౌమీ-ఆకాశికీ భేదములచే[8] రెండు విధములు. అందు భౌమీచారులు పదునారు, ఆకాశికీచారులు పదునారు.

### భౌమీచారులు

సమపాద, స్థితావర్త, శకటాస్య, అధ్యర్ధిక, చాషగతి, విచ్యవ, ఏడకాక్రీడిత, బద్ధ, ఊరూద్వృత్త, అడ్డిత, ఉత్స్పందిత, జనిత, స్యందిత, అపస్యందిత, సమో

4. ఈ 'కరణము' 4 వ అధ్యాయమందలి 'కరణము' కంటె భిన్నమైనది. "నృత్తమందలి హస్త-పాదవిన్యాససమాయోగము అయిన ఆంగికాభినయము" అని ఆ కరణమున కర్థము. ఇచ్చటి కరణము పాదద్వయ ప్రచారము మాత్రమే.

5. మండల విధానము తరువాతి అధ్యాయమందు వివరింపబడును. ఈ మండలములకు కూడ చారులే మూలములు. సంక్షిప్త - మధ్యమ - విస్తీర్ణ భేదములచే వ్యాయామము మూడు విధములు— కరణము సంక్షిప్తవ్యాయామమునకును, ఖండము మధ్యమవ్యాయామమునకును, మండలము విస్తీర్ణవ్యాయామమునకును సంబంధించి ఉన్నవి. [అభినవభారతి 2 వ సం - పుట 94.]

6. 'అంగ' పదముచే శిరో-హస్తాదులు చెప్పబడినవని అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను. [అభినవభారతి - 2 వ సం - పుట 95.]

చారీరహితమై నాట్యమునం దే అంగమును ప్రవర్తించదనగా శిరో-హస్తాద్యంగములు కొన్ని చారితో కూడనే చరించును; కొన్ని చారులకు వెనుకముందులుగా చరించును. అనగా చారుల ననుసరించియే శిరో-హస్తాది సర్వాంగప్రవృత్తియు కలుగునని ఆశయము.

7. నృత్త విషయము 4 వ అధ్యాయమందు వివరింపబడినది. గతిప్రచారవిషయము 12 వ అధ్యాయమందు చెప్పబడును. ఇచ్చట యుద్ధ విషయము చెప్పబడుచున్నది.

8. భూమి (నేల) మీద జరుగునది. అనగా పాదములు నేలమీద ఆని ఉండునది భౌమీచారి అనబడును. అట్లే పాదములు నేలమీద ఆననిది ఆకాశికీచారి అనబడును. [అభినవభారతి - 2 వ సం - పుట 96]. అనగా రెండు పాదములును నేలమీదనే ఉన్నచో అది భౌమీచారి అనియును; చార్యంతమున ఒకపాదము పైకెత్తబడిఉన్నచో అది ఆకాశికీచారి అనియు చెప్పవచ్చును.

త్సారితమత్తల్లి, మత్తల్లి అను భేదములచే భౌమీచారులు పదునారు విధములు. వీని లక్షణములను వరుసగా వివరింతును—

1. సమపాద—గోళ్ళు సమానములుగా ఉండునట్లు రెండు పాదములను దగ్గరగా చేర్చి నిలిచినచో అది సమపాదచారి[9] అనబడును.

2. స్థితావర్త— అగ్రతలసంచర పాదముతో జానువులయొద్ద స్వస్తికము కావించి, విడదీసి, రెండవ పాదముతో మరల అట్లే చేయవలెను.

3. శకటాస్య—నిషణ్ణాంగము (సమస్థితియందున్న అంగముతో) అగ్రతల సంచర పాదమును ప్రసారితముచేసి, ఉరమును ఉద్వాహితము చేయవలెను.

4. అధ్యర్ధిక—దక్షిణపాదముయొక్క మడమమీద వామపాదమును ఉంచి, పిమ్మట దానిని తొలగించవలెను.

5. చాషగతి—పాదమును మొదట ఒక తాలము ముందునకు ప్రసారితము చేసి పిమ్మట రెండు తాలముల దూరముండునట్లు వెనుకకు చాచవలెను. అట్లే వామపాదముతో కూడ చేయవలెను.

6. విచ్యవ—సమపాదస్థానమునందలి పాదములు ఎడముకాగా పాదము యొక్క చివరిభాగముచే భూమిని గ్రుచ్చవలెను.

7. ఏడకాక్రీడిత (=ఏలకాక్రీడిత)— అగ్రతలసంచర పాదముతో మీది కెగురుచు క్రింద పడుచుండవలెను. (అనగా ఒక పాదముతో ఒకసారి, వేరొక పాద ముతో ఒకసారి పతనము పర్యాయముగా చేయుట. అజికాగతితుల్యత్వము వలన ఇది ఏడకాక్రీడిత మనబడినదని అభినవగుప్తుడు తెలిపెను.)

8. బద్ధచారి—జంఘలను స్వస్తికముగా ఉంచి, విడదీసి, మోకాలు ఊరు మధ్యమునందు తగులునట్లుగా ప్రక్కలకు నడవవలెను.

9. ఊరూద్వృత్త— అగ్రతలసంచర పాదముయొక్క మడమను రెండవ పాదముయొక్క వెనుకభాగమునందుంచి, మోకాలితోపాటు పిక్కను వంచి ఊరువును పైకి త్రిప్పవలెను.[10]

9. సమపాద మనునది ఒక చారీభేదము ఎట్లగునని ప్రశ్నించుకొని అభినవుడి క్రింది విధముగా సమాధానమిచ్చెను—సమపాదస్థితినుండి వేరొక స్థానమునకు చరణగతి వలన చారి సిద్ధించును. అందుచే ఈ సమపాదస్థితి చారీ యోగ్యస్థితి అగుచున్నది. కావున దీనికి చారీగణనము సంభవించెను. అనగా చారీ పూర్వావస్థ అయిన ఈ సమపాదస్థితి కూడ చారులలో ఒకటిగా పరిగణింపబడెనని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 97.]

10. ఊరువులయొక్క ఊర్ధ్వవివర్తనమువలన ఇది లజ్జా - ఈర్ష్యాది విషయమని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 99.]



10. అడ్డిత— అగ్రతలసంచర పాదముచే సమపాదముయొక్క అగ్రభాగ మును కాని, వెనుక భాగమును కాని రాచవలెను.

11. ఉత్స్పందిత (=ఉత్స్యందిత)—రేచకమునందు వలెనే రెండుపాదము లను క్రమముగా ప్రక్కలకు ఊపవలెను.

12. జనిత— ముష్టిహస్తమును వక్షమునందుంచి, రెండవ హస్తము చలించుచుండగా అగ్రతలసంచరపాదమును ప్రదర్శించవలెను.[11]

13. స్యందిత— వామపాదమునుండి దక్షిణ పాదమును 5 తాలముల (=జేనల) ఎడముగా ఉండునట్లు ముందునకు ప్రసారించవలెను.

14. అపస్యందిత— వామపాదమును పైవిధముగానే 5 తాలముల ఎడముగా ప్రసారించవలెను (అనగా 'స్యందితచారి' వ్యత్యస్తమగుట).

15. సమోత్సారితమత్తల్లి— అగ్రతలసంచర పాదములతో గుండ్రముగా తిరుగుచు వెనుకకు వెళ్ళుట.[12]

16. మత్తల్లి— హస్తములు ఉద్వేష్టితములును, అపవిద్ధములును కాగా రెండుపాదములతో గుండ్రముగా తిరుగుచు ముందునకు వెళ్ళుట.

భౌమీచారుల వినియోగము : ఈ భౌమీచారులన్నియును నియుద్ధమందును, కరణములందును[13] ప్రయోగింపబడును.*

**ఆకాశికీచారులు**

అతిక్రాంత, అపక్రాంత, పార్శ్వక్రాంత, ఊర్ధ్వజానువు, సూచి, నూపురపాదిక, దోలాపాద, ఆక్షిప్త, ఆవిద్ధ, ఉద్వృత్త, విద్యుద్భ్రాంత, అలాత,

11. సమస్తగతులకును జననకారణము అనగా ప్రారంభ రూపమగుటచే ఇది 'జనితచారి' అనబడినది. [అభినవభారతి - 2 వ సం - పుట 100.]

12. మదము అల్పముగా గలవారి విషయమున మత్తల్లియును, మదము మధ్య రకముగా ఉన్నవారి విషయమున సమోత్సారిత మత్తల్లియును ప్రయోగింపబడును. [అభినవభారతి - 2 వ సం - పుట 101.]

13. మూల శ్లోకమున "స్మృతాః" అని కలదు. దీనినిబట్టి ఈ చారులు ఉపవేద సంబంధులనియు, కనుకనే వీనికి మూలమగు వేదమే ప్రమాణమనియు గ్రహించవలెను. అనగా వేదోక్త విషయమునే ఋషులు ఎవ్వరేని తిరిగి చెప్పినచో వానిని స్మృతులందురు. కాన ఈ విషయములుకూడ స్మృతము లనబడుటచే ఇవి వేదోక్తములని తెలియవలెను. ఈ చారులు నియుద్ధమునందును, కరణములందును ఉపయుక్తములగునని సామాన్యముగా చెప్పి వానిని వివరించనందున ఇది దిక్ప్రదర్శనమే కాని సంపూర్ణ ఉపయోగప్రదర్శనము కాదు. [అభినవభారతి - 2 వ సం - పుట 101.]

*[కాశీ, బొంబాయి, బరోడా ముద్రణములందు - 1–29 శ్లో.]

భుజంగత్రాసిత, హరిణప్లుత, దండపాద, భ్రమరి అను భేదములచే ఆకాశికీచారులు పదునారు విధములు. వీని లక్షణములను వరుసగా వివరింతును—

1. అతిక్రాంత— కుంచితపాదమును పైకెత్తి, ముందునకుచాచి మరల పైకెత్తి, పిమ్మట క్రింద పడవేయవలెను (గంతవ్యాతిక్రమమువలన ఇది అతిక్రాంత మనబడినది).

2. అపక్రాంత— ఊరువులను వలితముల నొనర్చి, కుంచితపాదమును పైకెత్తి ప్రక్కగా ఉంచవలెను. (అపక్రమణమువలన ఇది అపక్రాంత మనబడినది).

3. పార్శ్వక్రాంత— కుంచితపాదమును పైకెత్తి, మోకాలిని స్తన సమముగా ఉంచి, రెండవపాదముతో ఉద్ఘట్టితము చేయవలెను. (రెండవది ఉద్ఘట్టిత పాదము కావలెను. దీనిని 'పార్ష్ణి చండ ఘూతచారి' అని కీర్తిధరాదులనిరి).

4. ఊర్ధ్వజానువు—జానువు(మోకాలు)స్తనసమ మగునట్లుగా కుంచితపాదమును పైకెత్తి, రెండవపాదమును నిశ్చలముగా ఉంచవలెను. పిమ్మట రెండవ పాదముతో పైవిధముగా చేసి మొదటిపాదమును నిశ్చలముగాఉంచవలెను.

5. సూచి— కుంచితపాదమును మోకాలికిపైగా ఎత్తి, పిమ్మట కొన భూమికి తగులునట్లుగా క్రింద పడవేయవలెను (సూచ్యాకారమువలన ఇది 'సూచి' అనబడినది).

6. నూపురపాదిక— అంచితపాదమును రెండవపాదముయొక్క వెనుకకు జరిపి, పాదముయొక్క కొన భూమికి తగులునట్లుగా వేగముగా క్రింద పడవేయవలెను. (నూపురములకు ఝుణంఝుణధ్వనిని కలిగించునది అగుట చేతను, ధ్వన్యర్థమయి నూపురముల నిందు ధరించుటచేతను ఈ చారి నూపురపాదిక అయ్యెను ).

7. దోలపాద—కుంచిత పాదమును పైకెత్తి, పార్శ్వమునుండి పార్శ్వమునకు ఊగులాడించి, అంచితపాదముగా క్రింద పడవేయవలెను.

8. ఆక్షిప్త— కుంచితపాదమును పైకెత్తి, ప్రక్కలకు తెచ్చి, పిక్కలు స్వస్తికములగునట్లు కావించి అంచితపాదమును భూమిపై ఉంచవలెను.

9. ఆవిద్ధ—స్వస్తికముగా ఉన్న పాదములను విడదీసి, కుంచితపాదమును ముందునకు చాచి, అంచితపాదముగా రెండవపాదము యొక్క మడమమీద ఉంచవలెను.

10. ఉద్వృత్త— ఆవిద్ధచారియందలి కుంచితపాదమును రెండవపాదము చుట్టును త్రిప్పి, పైకెత్తి, భ్రమరకమునొనర్చి, నేలమీద పడవేయవలెను.

11. విద్యుద్భ్రాంత—ఒక పాదమును ప్రక్కనుండి వెనుకకు వలితముచేసి, తలను రాచుకొనునట్లుగా చాచి, పిమ్మట అన్నివైపులకును గుండ్రముగా త్రిప్పవలెను.



12. అలాత—వెనుకకు చాచిన పాదమును వలనముతో ముందునకులాగి, మడమ నేల కానుకొనునట్లుగా క్రిందికి దించవలెను. (అలాతచక్రాకృతిచే ఇది అలాత మనబడినది.)

13. భుజంగత్రాసిత—కుంచితపాదమును రెండవపాదము యొక్క ఊరు మూలము వరకును పైకెత్తి, కటి-జానువులను త్ర్యశ్ర ఊరువును వివర్తితము చేయవలెను (పాదోపాంత భుజంగభయభావితగతి సాదృశ్యమువలన ఇది భుజంగత్రాసిత అనబడినది.)

14. హరిణప్లుత— అతిక్రాంతచారియందలి కుంచితపాదమును పైకెత్తి, పైకెగిరి క్రిందికి పడునట్లు చేసి, రెండవపాదము యొక్క అంచిత జంఘను దాని వెనుకభాగమున క్షిప్తము చేయవలెను. (ఇది విదూషకాదులగతియందు కన్పట్టును.)

15. దండపాద— నూపురపాదికయందలి కుంచితపాదమును రెండవ పాదము యొక్క మడమమీద ఉంచి, ముందునకు జరిగి, వేగముగా ఆవిద్ధము చేయవలెను. (దండాకారత్వమువలన దండపాద మనబడినది.)

16. భ్రమరి—అతిక్రాంత చారియందలి కుంచిత పాదమును పైకెత్తి త్రికమును పరివర్తముచేసి, రెండవ పాదముయొక్క అడుగు భాగమును కదలించవలెను. (సర్వశరీర పరివర్తనము మూలమున నేమిభ్రమణము కలుగుట వలన ఇది భ్రమరి అనబడినది.)

**ఆకాశికీచారుల వినియోగము :** ఈ ఆకాశికీచారు లన్నియును లలితములైన అంగక్రియారూపములు. ధనుస్సు, వజ్రము, అసి అను శస్త్రములను ప్రయోగించుట యందు ఇవి ఉపయుక్తములగును. సందర్భమునుబట్టి, ఇప్పట్ల ఔచిత్యము ననుసరించి హస్తవ్యాపారము పాదగతికి ముందుగానో, సమముగానో, వెనుకగానో ఉండును. ఎట్లు పాదము ప్రసరించునో, అట్లే హస్తమును ప్రసరించును. హస్త ప్రచార మెటువైపు సాగునో త్రికమును (తుంటిమీది భాగము లేదా ఊర్ధ్వకాయ మంతయును) అటువైపే సాగును. అట్లే పాదగతిని అనుసరించి ఉపాంగములను (భ్రూనేత్రాదులను) కూడ ప్రవర్తింపజేయ వలెను. చారీ నిర్వహణాంతమందు పాదమునకు ధరణి విశ్రమస్థానమైనట్లే వ్యాపారాంతమున హస్తమునకు కటి ప్రదేశము విశ్రమస్థానమని తెలియవలెను.[14]*

14. చారులు శరీరమునకు శోభ నెట్లు ఆపాదించుచున్నవో ఆయా లక్షణములందే చెప్పబడెను. ఇప్పు డిచ్చట వ్యాపక వినియోగము చెప్పబడినది. పాద ప్రచారము ఉన్నప్పుడు తదనుసారముగా హస్త ప్రచారము కూడ జరుగవలెను. ఇంక హస్త ప్రచారము ఉన్నప్పుడెల్ల పాద ప్రచారము జరుగవలె ననెడి నియమములేదు. కాని హస్త ప్రచారము

స్థానములు[15]

లలితాంగక్రియాత్మకములైన చారులను వివరించియున్నాను. ఇంక అన్ని రకముల శస్త్రములను ప్రయోగించుటయందును ఉపయోగింపదగు స్థానములను ఇప్పుడు వివరింతును ఇవి ఆరు విధములు. వైష్ణవస్థానము, సమపాదస్థానము, వైశాఖ స్థానము, మండలస్థానము, ఆలీఢస్థానము, ప్రత్యాలీఢస్థానము— వీని లక్షణ-వినియోగములను వరుసగా వివరింతును—

1. వైష్ణవస్థానము—రెండు పాదములయొక్క మధ్యదూరము 2½ తాలము లుండవలెను. ఒకపాదమును పైకెత్తి రెండవపాదమును పార్శ్వమందు త్ర్యశ్రముగా (పటవాలుగా) ఉంచవలెను. ఇందు జంఘ అంచితమును, అంగములు సౌష్ఠవోపేతములును కావలెను. ఇట్టిది 'వైష్ణవస్థాన' మనబడును, ఈ స్థానమునకు విష్ణువు అధిదైవతము. వివిధకార్య నిమగ్నులైన ఉత్తమ-మధ్యమ పురుషులు ఈస్థానమందు నిల్చి సహజమగు (ఆవేశరహితమగు) సంలాపము నొనర్పవలెను. అంతియే

---

ఉన్నప్పుడు త్రికపర్యంతమైన ఊర్ధ్వకాయ మంతయును కదలుట సహజము. ఒక్కొక్కప్పుడు గతికి ప్రాధాన్యముండును. మరియొకప్పుడు హస్త వ్యాపారమునకు ప్రాధాన్యముండును. ఇంకొకప్పుడు రెండింటికిని ప్రాధాన్యముండును. మొదటి పక్షమందుహస్తములు పాదవిక్షేపమునకు అగ్రగాములో లేదాదానిని అనుసరించునవియో, పశ్చాత్ప్రవర్తితములో అగును. రెండవ పక్షమందు పాదములు హస్త వ్యావారమును అనుసరించుటయో, పశ్చాత్ప్రవర్తితములగుటయో జరుగును. మూడవ పక్షమందు రెండును సమకాలికములుగాని, వినియోగ వశమున ముందువెనుక లగుటగాని సంభవించుచుండును. హస్త వ్యాపారము పాదగతి ననుసరించి ఉండునని చెప్పబడెనుగదా ? మరి పాదములు విశ్రమస్థానమందున్నప్పుడు హస్తము లెట్లుండవలెను? అను ఆశంకకు చివర సమాధానము చెప్పబడినది. నృత్తమందు కాని నాట్యమందు కాని కటిప్రదేశమందున్న హస్తములు అర్ధచంద్ర హస్తములు కావలయును. నృత్తమందు ముఖ్యముగా పక్షప్రద్యోత హస్తములు కాని, పక్షవంచిత హస్తములు కాని కావలయును (ఇవి నృత్త హస్తములు). [అభినవభారతి - 2 వ సం - పుటలు 106—107.]

*[ కాశీ ముద్రణమునందు 11 వ అధ్యా - 30-48 శ్లో; బొంబాయి ముద్రణమునందు 10 వ అధ్యా - 30-49 శ్లో; బరోడా ముద్రణమునందు 10 వ అధ్యా - 30-50 శ్లో.]

15. ప్రచారానంతరము పాదములకు భూమి విశ్రమస్థాన మైనప్పుడు ఇంక శరీర సన్నివేశ మేవిధముగా ఉండునో అను ఆశంకకు సమాధానమే స్థానముల వివరణము. ఆయాగతి - ప్రచారములకు ముందు వెనుకల నిలబడెడి విధములే ఈ స్థానములని తెలియవలెను. చారులందు గతి ప్రధానము కాగా, స్థానములందు స్థితి ప్రధానమని గ్రహించవలెను. [అభినవభారతి - 2 వ సం - పుటలు 107; 101.] ఇప్పుడు శస్త్ర ప్రయోగమునకు సంబంధించిన సామాన్య వినియోగము చెప్పబడుచున్నది.



కాక చక్రప్రయోగము, ధనుర్ధారణము, క్రోధము, ధైర్యము, ఉదాత్తములైన అంగములు అనువానిని నిరూపించుటయందుకూడ ఈస్థాన ముపయుక్తమగును. ప్రణయకోపమును నిరూపించుటయందు ఈస్థానము విపర్యస్తము కావలెను. శృంగార-అద్భుత-బీభత్స-వీర రసములు ప్రధానములైనప్పుడు ఉపాలంభ-ప్రణయ-ఉద్వేగ-శంకా-అసూయా-ఉగ్రతా-చింతా-మతి-స్మృతి-దైన్య-చపలతా-గర్వ-శక్తి-అభీష్టములను నిరూపించుటయందు కూడ ఈ స్థాన ముపయుక్తమగును.

2. సమపాదస్థానము— పాదములు సమములును, మధ్య జేనెడు ఎడము కలవియును[16], స్వభావ సౌష్ఠవోపేతములును అయినచో అది 'సమపాదస్థాన' మనబడును. దీనికి బ్రహ్మ అధిదైవతము. విప్రులనుండి ఆశీర్వాదమును పొందుట, పక్షులను నిరూపించుట, వరము, కౌతుకము, సుఖముగా కూర్చుచున్నవారు, స్యందనమందు లేదా విమానమునందు ఉన్నవారు, శైవాది లింగస్థులు, వ్రతస్థులు అనెడి అర్థములను నిరూపించుటకీ స్థానమును గ్రహించవలెను.

3. వైశాఖస్థానము— రెండుపాదముల మధ్యదూరము 3½ తాలములుండవలెను. ఊరువులు నిషణ్ణములును, పాదములు త్ర్యశ్రములును పక్షస్థితములును (వ్రేళ్ళు పార్శ్వముల కభిముఖముగా ఉండవలెను) కావలెను. ఇట్టిది 'వైశాఖస్థాన' మనబడును. దీనికి స్కందుడు (కుమారస్వామి) అధిదైవతము. అశ్వవాహనము, వ్యాయామము, నిర్గమము (బయలువెడలుట), స్థూలములగుపక్షులను నిరూపించుట, ధనురాకర్షణము (విల్లెక్కుపెట్టుట) అను వానిని నిరూపించుటయందును, రేచకములందును ఈ స్థానము ఉపయుక్తమగును. [ఊరువులు నిషణ్ణములును, త్ర్యశ్రములును అగుట మండల-ఆలీఢ స్థానములందును ఆవశ్యకమే].

4. మండలస్థానము— రెండుపాదముల మధ్యదూరము 4 తాలము లుండవలెను. పాదములు త్ర్యశ్రములును పక్షస్థితములును, కటి-జానువులు సమములును (వైశాఖస్థానమందలి జానువులు కటీసమములు) అయినచో అది 'మండల స్థాన' మనబడును. దీనికి ఇంద్రుడు అధిదైవతము. ధను-ర్వజ్ర-శస్త్ర ప్రయోగములందును, కుంజరవాహన-స్థూలపక్షి నిరూపణము లందును ఈ స్థాన ముపయుక్తమగును.

5. ఆలీఢస్థానము— మండలస్థానమునందలి దక్షిణపాదము వామపాదము నుండి 5 తాలముల దూరముగా ప్రసారితమైనచో అది 'ఆలీఢస్థాన' మనబడును. దీనికి రుద్రుడు అధిదైవతము. వీర-రౌద్ర కృతములగు వానిని, రోషామర్షకృత

---

16. కాని, రెండు పాదములును సన్నిహితములుగా ఉండుటయే లోకాచారమట. [శ్రీ లంకా సూర్యనారాయణ శాస్త్రిగారి 'భరతసార' అనువాదమునందు - పుట 128 చూడవలెను.]

మగు ఉత్తరోత్తరసంజల్పమును, మల్లుర సంఘేటమును, శత్రువులను, వారిపై చేయు దండయాత్రను, శస్త్రప్రయోగమును నిరూపించుటయం దీ స్థాన ముపయుక్త మగును.

6. ప్రత్యాలీఢస్థానము—ఆలీఢస్థానమందలి పాదములు వ్యత్యస్తములైనచో అనగా దక్షిణపాదమును కుంచితముచేసి వామపాదమును 5 తాలముల దూరముగా ప్రసారించినచో అది 'ప్రత్యాలీఢస్థాన' మనబడును. ఆలీఢస్థానమందు నిలిచి సంధించిన శస్త్రములను ఈ ప్రత్యాలీఢస్థానమందు నిలిచి ప్రయోగించవలెను. ప్రయోక్త లీ స్థానమునందే నిలిచి పలురకముల శస్త్రములను ప్రయోగించవలెను*.

న్యాయములు

ఇంక శస్త్రప్రయోగమందలి న్యాయములను వివరింతును. ఇవి నాలుగువిధములు—భారతన్యాయము, సాత్త్వతన్యాయము, వార్షగణ్యాన్యాయము, కైశిక న్యాయము. శత్రువుల కటిని ఛేదించునప్పుడు భారతన్యాయమును, పాదమును ఛేదించునప్పుడు సాత్త్వతన్యాయమును, వక్షమును ఛేదించునప్పుడు వార్షగణ్యా న్యాయమును, శిరస్సును ఛేదించునప్పుడు కైశిక న్యాయమును ప్రయుక్తమగును. అన్నిరకముల శస్త్రప్రయోగములందును నానాచారీసముత్థితములైన ఈ న్యాయములచే విచిత్రగతివిశేషములను ప్రయోక్తలు రంగమునందు చూపవలెను. న్యాయాశ్రితములును, న్యాయసముత్థితములును అయిన అంగహారములతో రంగస్థలమునందు యుద్ధములు ప్రవర్తితములగుచున్నవి కాన ఇవి 'న్యాయము' లనబడినవి.

1. భారతన్యాయము—వామహస్తముచే ఖేటకమును (డాలును), దక్షిణ హస్తముచే శస్త్రమును (కత్తిని) గ్రహించి గతిప్రచారము నొనర్పవలెను. రెండు హస్తములను చక్కగా ముందునకు చాచి, మరల వెనుకకు ఆక్షిప్తముచేసి, పిమ్మట ఖేటకమును ఒక ప్రక్కనుండి ఇంకొకప్రక్కకు త్రిప్పుచు, శస్త్రమును శిరముచుట్టును త్రిప్పి, కపోల మధ్యభాగమందు ఉద్ఘట్టితముచేయవలెను. పిమ్మట లలితమును, ఉద్వేష్టితమును అయిన ఖడ్గహస్తమును, ఖేటక హస్తమును శిరముచుట్టును త్రిప్పవలెను. భారతన్యాయమందలి శస్త్ర ప్రయోగములో పైవిధముగా ప్రవిచార మొనర్పవలెను. (విచిత్రగతి విశేషములను చూపవలెను.)

2. సాత్త్వతన్యాయము—శస్త్ర-ఖేటకముల ప్రవిచారము భారత న్యాయ మందలిదే. కాని ఇందు శస్త్ర ప్రవిచారము ప్రయోక్తయొక్క వెనుకభాగమందు మాత్రమే జరుగవలెను.

*[కాశీ ముద్రణమునందు 11 వ అధ్యా - 48-70 శ్లో; బొంబాయి ముద్రణమునందు 10 వ అధ్యా - 49-70 శ్లో; బరోడా ముద్రణమునందు 10 వ అధ్యా - 50-72 శ్లో.]



3. వార్షగణ్యా న్యాయము[17]—ఇందలిగతి సాత్త్వత న్యాయమందలి గతి వంటిదే. శస్త్ర ఖేటకములను గుండ్రముగా త్రిప్పవలెను. ఇదుకూడ సాత్త్వత న్యాయమందువలెనే శస్త్రమును శిరముచుట్టును త్రిప్పవలెను.

4. కైశిక న్యాయము—శస్త్రమును ఉరమునందు కాని, అంసమునందు కాని ఉద్వేష్టితము చేయవలెను. భారత న్యాయమందలి గతి ప్రచారమునే ఇందును అనుసరించవలెను. ఈ విధముగా శస్త్రమును త్రిప్పి శిరమునందు మాత్రమే కొట్టవలెను.

న్యాయముల వినియోగము: పై విధముగా ఈగతి ప్రచారములు అంగ విన్యాసములచే ప్రయుక్తములుకావలయును. వీనిని ధను-ర్వజ-అసి-శస్త్ర ప్రయోగములం దుపయోగించవలెను. ఈ రంగస్థల యుద్ధమునందు బ్రద్దలుచేయుట, చీల్చుట, రక్తము కారుట, గాయములగుట మొదలగునవి నిజముగా జరుగరాదు. శస్త్రప్రయోగమును సంజ్ఞామాత్రముగనే చేయవలెను. లేదా చీల్చుట మొదలగు వానిని అభినయ పూర్వకముగా ప్రయోగించవలెను. (సంజ్ఞామాత్రముగా లేదా అభినయ పూర్వకముగా చేయుటచేతనే వారు నిజముగా యుద్ధము చేయుచున్నారనెడి ఊహను సామాజికులకు కలిగించవలెను.)

సౌష్ఠవము

అంగసౌష్ఠవ సంపన్నములగు అంగహారములతో విభూషితమైన వ్యాయామమును చక్కగా లయ-తాల సమన్వితముగా చేయించవలెను. వ్యాయామ వేత్తలు అంగసౌష్ఠవము కొరకు ప్రయత్నించవలసియున్నది. నాట్య-నృత్తముల శోభ అంతయును సౌష్ఠవము మీదనే ఆధారపడిఉన్నది. నాట్య-నృత్తములందు సౌష్ఠవహీనమైన అంగము శోభించదు. చంచలములును కుబ్జములును (పొట్టివి) అంతగా ఉచ్చములును కానట్టివియును, సహజములుగా ఉన్నట్టివియును అగు అంగములచేతనే 'సౌష్ఠవము' ప్రదర్శితమగును. కటీ - కర్ణము ఒకేరేఖలోను, మోచేతులు - మూపులు ఒకేరేఖలోను ఉండగా ఉరము సమున్నతమై ఉండుట 'సౌష్ఠవ' మనబడును.[18] నాట్య-నృత్తములు రెండును సౌష్ఠవమునందే ప్రతిష్ఠితములై ఉన్నవి; కావున, ఉత్తమ-మధ్యములు దీనికొరకే నిత్యమును శ్రమించవలెను.[19] (ఇంక అధమములు మాత్రము స్వేచ్ఛగా ప్రవర్తింతురు.)

17. వార్షగణ్యము ఆరభటీ వృత్తికి సంబంధించినది. [అభినవభారతి - 2 వ సంపుట - 112.]

18. సౌష్ఠవ నిర్వచనము 4 వ అధ్యాయమందు కూడ కలదు. అందలి 16 వ అధస్సూచికను చూడవలెను.

19. ఈ వాక్యమునకు మూలమైన శ్లోకము కొన్ని ప్రతులలో లేదట.

చతురశ్రఅంగము

కటీ నాభిచరౌ హస్తౌ వక్షశ్చైవ సమున్నతమ్ ॥ 94
వైష్ణవస్థాన మిత్యంగం చతురశ్ర ముదాహృతమ్ ॥ 95

—వైష్ణవస్థానమందు నిల్చినప్పుడు హస్తములు క్రమముగాకాని, ఒకేసారి కాని కటీ-నాభిచరములును, వక్షము సమున్నతమును అగుచో అది 'చతురశ్రాంగ' మనబడును.[20]

ధనుష్కరణములు

ఇంక ధనుస్సునకు సంబంధించిన కరణములు[21] నాలుగు విధములు-ప్రమార్జనము, ఆదానము, సంధానము, మోక్షణము. వీని లక్షణములను వివరింతును—

1. ప్రమార్జనము (=పరిమార్జనము)—పరామర్శ అనగా వింటిని సరిచూచుకొనుట 'ప్రమార్జన' మనబడును.

2. ఆదానము— గ్రహణ క్రియ అనగా శరమును తూణీరమునుండి కైకొనుట 'ఆదాన' మనబడును.

3. సంధానము— శరవిన్యాసము అనగా ధనుస్సును ఎక్కుపెట్టి శరమును ఆ ధనుస్సునందు సంధించుట 'సంధాన' మనబడును.

4. మోక్షణము— విక్షేపము అనగా సంధింపబడిన శరమును ప్రయోగించుట 'మోక్షణ' మనబడును.

వ్యాయామము

నువ్వులనూనె రాచుకొని, యవలపిండితో మర్దనము చేసికొనిన శరీరము కలవానిచే భిత్తిని (గోడను) ఆనుకొనికాని, నిరాలంబము (ఆధారములేకుండ) గా కాని వ్యాయామమును చేయించవలెను. వ్యాయామమునకు గోడయే తల్లివంటిది.

20. సౌష్ఠవమునకు ప్రయోజనమగు సర్వసామాన్య భూత చాతురశ్ర్య మిచ్చట చెప్పబడినది. చాతురశ్ర్య మనగా అవయవములు హెచ్చు తగ్గులు లేక సమముగా ఉండుట: ఇది సౌందర్యలక్షణము. పూర్వోక్త సౌష్ఠవమున కిదియే ప్రయోజనము. ఈ చాతురశ్ర్యము నృత్త-నాట్యాదు లన్నింటను ఆవశ్యకమే. కాళిదాసు కుమారసంభవమునందు "చతురశ్రశోభి వపుర్విభక్తం నవయౌవనేన" అని చెప్పినచోట మల్లినాథుడు పైవిధముగానే చతురశ్ర పదమును వ్యాఖ్యానించెను. చాతురశ్ర్యమునందు హస్తాదులు వర్ణితములైనను అందు ప్రధానమైనది వక్షముయొక్క స్థితి (position) మాత్రమే.

21. ఖడ్గయుద్ధ విషయమున న్యాయములున్నట్లే ధనుర్యుద్ధ విషయమున కరణములు (కర్మలు) కలవని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 115.]



కావున వ్యాయామ సమయమున గోడనే ఆశ్రయించవలెను.[22] గోడపై అవయవములను చాచి ఆనుకొని పురుషుడు వ్యాయామమును నేర్చుకొనవలెను. బలముకొరకు నస్యమును సేవించి, దేశ-కాల-ప్రకృతుల ననుసరించి తైల-ఘృతాదులచే వస్తివిధిని (శరీరమును శుద్ధిపరచుట) ఆచరించవలెను. స్నిగ్ధములైన అన్నములను, రసకములను (మాంసరసము), పానకములను సేవించవలెను. ప్రాణములు ఆహారాధిష్ఠితములు. ప్రాణము (బలము) లందు వ్యాయామము ప్రతిష్ఠితమైయున్నది. కావున వ్యాయామ సిద్ధికొరకు ఆహార విషయమున జాగరూకుడై ఉండవలెను. వస్తివిధిచే శుద్ధి చేయబడని శరీరము కలవాడును, మార్గాయాసాదులచే అలసినవాడును, ఎక్కువ ఆకలిదప్పులతో ఉన్నవాడును, ఎక్కువగా త్రాగినవాడును, ఎక్కువగా భుజించినవాడును వ్యాయామమును చేయరాదు.

అచలములును, మధురములును (లలితములును) అగు అవయవములతో, (ఎటువంచిన అటు సులువుగా వంగి ఉండునవి, అనగా ఏయే పనులందుకూర్చిన ఆయా పనులందు పరిణతినొందినవి అని తాత్పర్యము) చతురశ్రమగు వక్షముతో అంగసిద్ధిని కోరునతడు వ్యాయామమును విధిగా చేయవలెను. ఈ విధముగా వ్యాయామమును చేసిన పిమ్మటనే చారీప్రయోగమును నేర్వవలెను.

ఇంక మండల వికల్పనమును వివరింతును.

దశమాధ్యాయము సమాప్తము

22. "యోగ్యాయాం మాతృకా భిత్తి స్తస్మా ద్భిత్తిం సమాశ్రయేత్" 98 అని మూలము భిత్తి అనగా గోడ. వ్యాయామమునందు గోడ మున్నగునవి ఆధారముగా ఉండుట కలదు; నిరాధారముగా ఆకాశమందును వ్యాయామము చేయుటకలదు. భిత్తి అనగా ఆధారమనియు, ఆధారమనగా నేల అనియు సందర్భమును బట్టి అర్థము చెప్పవచ్చునేమో.

'యోగ' మనగా విద్యావిశేష సంబంధము (అనగా విద్యయందు ఎక్కువ చాతుర్యము కలుగుట). అందులకు సమర్థమగునది అనగా విద్యాచతురత కలిగించుటకు సమర్థమగునది 'యోగ్య' అనబడును. దీనినే గుణనిక అందురు; అనగా గుణోత్కర్షమని అర్థము. [అభినవభారతి - 2 వ సం - పుట 116.]

"ప్రాణే యోగ్యాః ప్రతిష్ఠితాః" (ప్రాణమునందు వ్యాయామము ప్రతిష్ఠితమై ఉన్నది) అనుచోట కూడ పై అర్థము సరిపడును. ప్రాణమునందు గుణోత్కర్షము ప్రతిష్ఠితము. కావున గుణోత్కర్ష సిద్ధికై ఆహారవిషయమున శ్రద్ధ వహించవలెను.

## విశేషాంశములు

### 1. చారులు

స్థానములు, చారులు, నృత్తహస్తములు అనునవి కరణములకు మాతృకలని 4 వ అధ్యాయమందు చెప్పబడినది. (83 వ పుటను చూడవలెను). స్థానమనునది నిలిచెడి పద్ధతి (standing posture). నృత్తహస్తములను 9 వ అధ్యాయమందు పరిశీలించి ఉన్నాము. ఇంక చారులనునవి ముఖ్యముగా పాదప్రచారములని తెలియవలెను.

చారులు నృత్తమునందును, యుద్ధమునందును, గతిప్రచారమునందును ఉపయుక్తము లగునని భరతుడు పేర్కొనెను. నిజమునకు చారులన్నియును నృత్తమునకు సంబంధించినవే. నాట్యమందు వీనికి ప్రయోజనము అత్యల్పమని చెప్పవచ్చును. నాట్యమున లయ-తాలముల లేదా వాద్యముల ఆవశ్యకమున్న సంనివేశములందే చారులు ప్రయుక్తములగుచుండును. అనగా నాట్యమునందు యుద్ధమును ప్రత్యక్షముగా చూపరాదు; దానిని సంజ్ఞామాత్రము గానో లేదా అభినయము చేతనో ప్రదర్శించవలసి ఉన్నది. అప్పట్ల చారులు ఉపయుక్తము లగును. అట్లే ఏదేని ఊరేగింపును చూపవలసివచ్చినప్పుడును ఇవి ప్రయుక్తములగును. ఈ విధముగా నృత్తమునకు సంబంధించిన చారులు నాట్యమునందు ప్రవేశించినవి.

గతిప్రచారమనగా వివిధ భావావిష్టులైన వ్యక్తులు ఆయా సంనివేశములందు నడిచెడు పద్ధతి. ఇవి అన్నియును విధిగా చారులే కానక్కరలేదు. కావుననే గతిప్రచారము ప్రత్యేకముగా 12 వ అధ్యాయమందు వర్ణింపబడినది. కాని ఆ గతిప్రచారములందుకూడ అచ్చటచ్చట చారులు ప్రయుక్తము లగుచుండుట కలదు. అది యాదృచ్ఛిక మన్నచో అసత్యము కాజాలదు.

పాదప్రచారము చారులందే కాక కరణములందును, మండలములందును కూడ కన్పట్టు చున్నది. కరణమనగా హస్త-పాద ప్రచారముల సమాయోగమని చెప్పబడెను. కదా? అందుచే పాదప్రచారము కరణమందు విధిగా ఉండును. కరణముల నిర్వచనము లందు ఆయా చారులు గ్రహింపబడుట గమనార్హము. ఇంక మండలములనగా చారీ సముదాయరూపమైనవి, ఇవి 11 వ అధ్యాయమందు వివరింపబడును.

చారులును, మండలములును నృత్తమునకు సంబంధించిన వగుటచే న్యాయ్యముగా 4 వ అధ్యాయమునకు ముందో, తరువాతనో వివరింపబడుట సమంజసము. కాని ఇవి నాట్యమునందు కూడ ఉపయుక్తము లగుచుండుటచేత ఆంగికాభినయమందు వివరింప బడుట సంభావ్య మగుచున్నది. 4 వ అధ్యాయాంతమందలి ఒకటవ విశేషాంశమును కూడ చూడవలెను.

8 వ అధ్యాయము చివర పాదభేదములు వివరింపబడినవి. అవి ముఖ్యముగా చారీ నిర్వచనములందు గ్రహింపబడుట గమనార్హము.

### 2. స్థానములు : న్యాయములు

శస్త్రమోక్షణ సమయమున ఆయుధహస్తులు నిలిచెడి స్థానము లిందు చెప్పబడినవి. కాని ఇవి శస్త్రములను ప్రయోగించు సమయములందు మాత్రమే ప్రయుక్తమగునని తలంచ



రాదు. ఏయే భావములందు ఇవి ప్రయుక్తము లగునో భరతుడే వివరించి ఉండెను. ఇవి పురుషుల స్థానభేదములు. ఇంక స్త్రీల స్థానభేదములు 12వ అధ్యాయమందు వివరింపబడును.

ఈ స్థానములు కరణ-అంగహారములందు కూడ ఉపయుక్తములగును. కొన్ని కరణ - అంగహారముల నిర్వచనములందు స్థానములు కూడ చెప్పబడుట గమనార్హము. అసలు, కరణములకు స్థానములు కూడ మాతృకలే కదా, ఒక కరణము ప్రారంభింపబడుటకు ముందో లేదా అంతముననో ఈ స్థానములు ప్రయుక్తములగుచుండును.

స్థానము శస్త్రమోక్షణమునందు నిలిచెడి పద్ధతికాగా న్యాయము శస్త్రమోక్షణమందు పాటించెడి 'విధి' అగుచున్నది.

### 3. సౌష్ఠవము : చాతురశ్ర్యము

ఇచ్చటనేకాక 4 వ అధ్యాయమందు కూడ (పుట 83) సౌష్ఠవ నిర్వచనము కలదు. అది అచ్చటకంటె ఇక్కడ ఉండుటయే సమంజసము. అభినవగుప్తుడు కూడ దీనిని ఈ అధ్యాయమందే వ్యాఖ్యానించుట గమనార్హము.

సౌష్ఠవమనగా ఏమో నిర్వచించుటయేకాక ఆ స్థితిలో అవయవము లెట్టివిగా ఉండవలెనో కూడ భరతుడు సూచించెను. నర్తకులయందు కాని, నటులయందు కాని ఈ సౌష్ఠవము అత్యంతావశ్యకమనియు, నాట్య-నృత్తములశోభ అంతయును సౌష్ఠవము మీదనే ఆధారపడి ఉన్నదనియు భరతుడు చెప్పుట గమనార్హము.

ఇంక చాతురశ్ర్యము (చతురశ్రాంగము) నందు వక్షము ఉన్నతముగా ఉండుట ముఖ్యము. అనగా ఇందు చెప్పబడిన హస్తముల విషయమున మార్పున కవకాశమున్నను వక్షముమాత్రము ఉన్నతముగానే ఉండవలెను. ఈ చాతురశ్ర్యమే నృత్తమునకు జీవిత భూతమని అభినవగుప్తుడు నిర్దేశించెను—"తత్ర చాతురశ్ర్యమూలం నృత్తేఽంగస్య జీవితమ్" [అభినవభారతి-2 వ సంపుట 71].

### 4. డంకన్ పద్ధతి

పాశ్చాత్య నృత్త-నృత్యములందలి ప్రాథమిక స్థానములు (fundamental positions) ఆరు విధములు. ఇది 'డంకన్ పద్ధతి' (Duncan system) అను పేరుతో పిలువబడుచున్నది. వివరములకు Eleanor Elder వ్రాసిన "Dance, A National Art" (Theosophical Publishing House, Madras, 1918) అను చిన్న గ్రంథమును పరిశీలించవలెను. "Dancing" అను గ్రంథములో మొదటి ఐదు స్థితులందలి పాదప్రచారమును సంక్షిప్తముగా E. Scott క్రిందివిధముగా వివరించెను—

| | |
|---|---|
| 1 st position | Heels together. |
| 2 nd ,, | Move right foot to the side. |
| 3 rd ,, | Bring right heel to the hollow of the left foot. |
| 4 th ,, | Advance right foot. |
| 5 th ,, | Bring right heel to left toe. |

గ్రీకుల కాలములో యుద్ధభటు లెల్లరును నృత్తమును విధిగా నేర్చుకొనెడివారట. గ్రీకు విషాద రూపక రచయిత అగు సొఫోక్లిస్ నృత్త ప్రవీణుడట ! నేటి 'బాలే నృత్యము'లో కూడ ఆకాశికీ-భౌమీచారులను మనము గుర్తించవచ్చును.

# అధ్యాయము 11[1]

## మండలములు[2]

[కాశీముద్రణమునందు 12 వ అధ్యా - 57 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 11 వ అధ్యా - 63 శ్లోకములును, బరోడా ముద్రణము నందు 11 వ అధ్యా - 70 శ్లోకములును కలవు.]

శస్త్రమోక్షణమునందు ప్రయోగింపదగిన చారులను యథాతత్త్వముగా వివరించితిని. ఇంక చారీసంయోగజములైన మండలముల నిప్పుడు వివరింతును. ఆకాశగములు, భూమిగములు అనెడి భేదములచే మండలములు రెండువిధములు.[3] ఇందు ఆకాశగములైన మండలములు పది; భూమిగములైన మండలములు పది; మొత్తము మండలములు ఇరువది.

ఆకాశికీ (ఆకాశగములైన) మండలములు

అతిక్రాంత-విచిత్ర- లలితసంచర- సూచీవిద్ధ- దండపాద-విహృత-అలాతక-వామవిద్ధ-లలిత-క్రాంత భేదములచే ఆకాశగములైన మండలములు పదివిధములు—

1. అతిక్రాంతము—దక్షిణ పాదముచే క్రమముగా జనిత-శకటాస్య చారులను ఆచరింపవలెను. పిమ్మట వామ-దక్షిణ పాదములచే క్రమముగా అలాతక-పార్శ్వక్రాంత చారులను, తరువాత వామపాదముచే సూచీచారిని దక్షిణపాదముచే అపక్రాంతచారిని, మరల వామపాదముచే క్రమముగా సూచీ-భ్రమరీ చారులను, తిరిగి దక్షిణపాదముచే ఉద్వృత్తచారిని వామపాదముచే అలాతచారిని (అలాత చారిని భ్రమరీచారిగా మార్పునొందించవలెను), పిమ్మట వామ-దక్షిణ పాదములచే

1. ఈ భాగము కాశీ ముద్రణమునందు ద్వాదశాధ్యాయము. కాని, బొంబాయి-బరోడా ముద్రణములందు ఏకాదశాధ్యాయమే.

2. 'మండల విధాన' మని కాశీ ముద్రణ పాఠము, 'మండల కల్పన' మని బొంబాయి ముద్రణ పాఠము, 'మండల వికల్పన' మని బరోడా ముద్రణ పాఠము. అభినవగుప్తుడు 'మండలాధ్యాయ' మనెను.

3. చారుల సంయోగమువలన మండలము లేర్పడుచున్నవి. ఆకాశికీ - భౌమీ భేదములచే ఆచారులు రెండు విధములు కాన మండలములును రెండు విధములగుచున్నవి. అనగా ఆకాశికీచారుల ప్రాచుర్య మున్నచో అది ఆకాశగమైన మండలమగును; అట్లే భౌమీచారులకు ప్రాచుర్య మున్నచో అది భూమిగమైన మండలమగును. చారులవలెనే మండలములును యుద్ధపరిక్రమమందుపయుక్తము లగును. [అభినవభారతి - 2 వ సం. పుటలు 198-199].



క్రమముగా అతిక్రాంత-దండపాద చారులను ఆచరించవలెను— ఈ వ్యాయామ మునే 'అతిక్రాంతమండల' మందురు.

2. విచిత్రము—దక్షిణపాదముచే జనిత-పార్శ్వక్రాంతచారుల నాచరింపవలెను. పిమ్మట వామపాదముచే స్యందితచారిని దక్షిణపాదముచే పార్శ్వక్రాంత చారిని, మరల వామపాదముచే సూచీచారిని, దక్షిణపాదముచే అపక్రాంతచారిని ఆచరించవలెను. పిమ్మట క్రమముగా వామపాదముచే భుజంగత్రాసితచారిని, దక్షిణపాదముచే అతిక్రాంత చారిని, దక్షిణపాదముచే ఉద్వృత్తచారిని, వామపాదముచే అలాతచారిని, దక్షిణపాదముచే పార్శ్వక్రాంత చారిని, వామపాదముచే సూచీ చారిని, దక్షిణపాదముచే విక్షిప్తచారిని, వామపాదముచే అపక్రాంతచారిని ఆచరించవలెను—ఈ వ్యాయమము 'విచిత్రమండల' మనబడును.

3. లలితసంచరము— దక్షిణపాదమును ఊర్ధ్వజానుచరణము కావించి సూచీచారిని ప్రయోగించవలెను. వామపాదముచే అపక్రాంతచారిని, దక్షిణ పాదముచే పార్శ్వక్రాంతచారిని కావించవలెను. మరల వామపాదముచే సూచీ-భ్రమరక చారులను, పిమ్మట క్రమముగా దక్షిణపాదముచే పార్శ్వక్రాంతచారిని, వామపాదముచే అతిక్రాంతచారిని, దక్షిణపాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంత చారిని ఆచరించవలెను. తరువాత దక్షిణపాదముచే పార్శ్వక్రాంత చారిని, వామపాదముచే అతిక్రాంత చారిని ఆచరించవలెను. ఈ చివరి అతిక్రాంత చారిని భ్రమరీచారిగ మార్పునొందించవలెను. ఇట్టి చారీప్రయోగము 'లలితసంచర మండల' మనబడును.

4. సూచీవిద్ధము—వామపాదముచే వరుసగా సూచీ-భ్రమరక చారులను ప్రయోగించి, దక్షిణపాదముచే పార్శ్వక్రాంత చారిని, వామపాదముచే అతిక్రాంత చారిని కావించవలెను. మరల క్రమముగా దక్షిణపాదముచే సూచీచారిని, వామ పాదముచే అపక్రాంత చారిని, దక్షిణపాదముచే పార్శ్వక్రాంత చారిని ప్రయోగించవలెను. ఇట్టిది 'సూచీవిద్ధ మండల' మనబడును.

5. దండపాదము— క్రమముగా దక్షిణపాదముచే జనిత - దండపాద చారులను, వామపాదముచే సూచీ- భ్రమరక చారులను ప్రయోగించవలెను. మరల దక్షిణపాదముచే ఉద్వృత్తచారిని, వామపాదముచే అలాతక చారిని, పిమ్మట దక్షిణ పాదముచే పార్శ్వక్రాంత-భుజంగత్రాసిత చారులను వామపాదముచే అతిక్రాంత చారిని, తరువాత దక్షిణపాదముచే దండపాదచారిని వామపాదముచే సూచీచారిని ప్రయోగించి, త్రికమును ఆవర్తము చేయవలెను. (భ్రమరీచారి ఇందు సూచితము). ఇట్టిది 'దండపాద మండల' మనబడును.

6. విహ్వృతము— దక్షిణ పాదముచే జనితచారిని ప్రయోగించి, నికుట్ట కము చేసి (ఇచ్చట అగ్రతల సంచరపాదము సూచితము), వామపాదముచే ఆస్కందిత చారిని ప్రయోగించవలెను. మరల దక్షిణ పాదముచే ఉద్వృత్త చారిని, వామ పాద ముచే అలాతకచారిని, దక్షిణపాదముచే సూచీచారిని, వామ పార్శ్వముచే పార్శ్వ క్రాంతచారిని, దక్షిణపాదముచే ఆక్షిప్తచారిని, భ్రమరక-దండపాద చారులను క్రమముగా ప్రయోగించవలెను. వామ పాదముచే సూచీ చారిని ప్రదర్శించి, త్రిక మును పరివర్తముచేయవలెను. తరువాత దక్షిణపాదముచే భుజంగత్రాసితచారిని, వామపాదముచే అతిక్రాంతచారిని ప్రయోగించవలెను. ఇట్టి చారీ ప్రయోగము 'విహ్వృతమండల' మనబడును.

7. అలాతకము (అలాతము)— దక్షిణ పాదముచే సూచీచారిని, వామ పాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలెను. మరల దక్షిణపాదముచే పార్శ్వ క్రాంతచారిని, వామపాదముచే అలాతకచారిని ప్రయోగించవలెను. మరల ఈ చారులనే పర్యాయముగా ఆరుసార్లు కాని, ఏడుసార్లు కాని లలితపాద విన్యాసము లతో ప్రయోగించి, అంతమున దక్షిణపాదముచే అపక్రాంతచారిని, వామపాదముచే అతిక్రాంత-భ్రమరక చారులను కావించవలెను. ఇట్టిది 'అలాతక మండల' మనబడును.

8. వామవిద్ధము (వామబంధము)— దక్షిణ పాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలెను. మరల దక్షిణపాదముచే దండపాదచారిని, వామపాదముచే సూచీచారినీ, దక్షిణపాదముచే భ్రమరక-పార్శ్వ క్రాంతచారులను, వామపాదముచే ఆక్షిప్తచారిని క్రమముగా ప్రయోగించవలెను. పిమ్మట దక్షిణపాదముచే దండపాద - ఊరూద్వృత్తచారులను, వామపాదముచే సూచీ-భ్రమరకచారులను, మరల వామపాదముచే అలాతచారిని, దక్షిణపాదముచే పార్శ్వక్రాంతచారిని, వామపాదముచే అతిక్రాంతచారిని ప్రయోగించవలెను. ఇట్టిది 'వామబంధ (వామవిద్ధ) మండల' మనబడును.

9. లలితము—దక్షిణపాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంత చారిని ప్రయోగించవలెను. మరల దక్షిణపాదముచే పార్శ్వక్రాంత-భుజంగత్రాసిత చారులను, వామపాదముచే అతిక్రాంతచారిని, మరల దక్షిణపాదముచే ఆక్షిప్త చారిని, వామపాదముచే అతిక్రాంత-ఊరూద్వృత్త-అలాత చారులను, మరల దక్షిణ పాదముచే పార్శ్వక్రాంతచారిని వామపాదముచే సూచీచారిని, దక్షిణపాదముచే అపక్రాంతచారిని, వామపాదముచే లలిత సంచరపాదములతో అతిక్రాంతచారిని క్రమముగా ప్రయోగించవలెను. ఇట్టి పాద ప్రచారము కలది 'లలిత మండల' మనబడును.



10. క్రాంతము— దక్షిణపాదముచే సూచీచారిని, వామపాదముచే అపక్రాంతచారిని ప్రయోగించవలెను. పిమ్మట దక్షిణ-వామపాదములు రెండింటిచే పార్శ్వక్రాంతచారిని ఆచరించి, వీనినే మరల పర్యాయముగా ప్రయోగించవలెను. పిమ్మట వామపాదముచే సూచీచారిని, దక్షిణపాదముచే అపక్రాంతచారిని కావించ వలెను. స్వభావ గమనమునం దీ 'క్రాంత మండలము' ప్రయుక్తమగును. గమనము (క్రాంతము) కలదికాన ఇది క్రాంతమండల మనబడినదని ప్రయోక్తలు తెలియవలెను.*

## భౌమ (భూమిగములైన) మండలములు

ఇంతవరకును ఆకాశగములైన పది మండలములను వివరించియున్నాను. ఇంక భౌమ మండలములను వివరింతును. భ్రమర-ఆస్కందిత-ఆవర్త-సమోత్సారిత-ఏడకా క్రీడిత-అడ్డిత-శకటాస్య-అధ్యర్ధిక-పిష్టకుట్ట చాషగత భేదములచేభౌమమండల ములు పది విధములు—

1. భ్రమరము—క్రమముగాదక్షిణపాదముచే జనితచారిని, వామపాదముచే అస్పందితచారిని, దక్షిణపాదముచే శకటాస్యచారిని కావించి వామపాదమును ప్రసారితము చేయవలెను. పిమ్మట దక్షిణపాదముచే భ్రమరక చారిని(త్రికపరివర్తము), వామపాదముచే అస్పందితచారిని కావించవలెను. మరల దక్షిణపాదముచే శకటాస్య చారి నొనర్చి, వామపాదమును వెనుకకు చాచి భ్రమరక-అస్పందిత (=అస్కందిత= స్పందిత=స్యందిత) చారుల నొనర్పవలెను. ఇట్టిది 'భ్రమరమండల' మనబడును.

2. ఆస్కందితము (అస్పందితము-బరోడాముద్రణపాఠము)— దక్షిణ పాద ముచే భ్రమరకచారిని, వామపాదముచే అడ్డితచారిని కావించవలెను. దక్షిణపాద ముచే భ్రమర-శకటాస్య-ఊరూద్వృత్తచారులను, వామపాదముచే అపసర్పిత-భ్రమరకచారులను ప్రయోగించవలెను. పిమ్మట దక్షిణపాదముచే ఆస్కందితచారిని, వామపాదముచే శకటాస్యచారిని కావించి ఆ వామపాదముచేతనే ఆస్ఫోటనము[4] చేయవలెను. ఇట్టిది 'ఆస్కందితమండల'మనబడును. ఇది యుద్ధపరిక్రమోపయోగి యగు మండలము.

3. ఆవర్తము— దక్షిణపాదముచే జనితచారిని కావించి వామపాదముచే నికుట్టితమును చేయవలెను. మరల దక్షిణపాదముచే శకటాస్య-ఊరూద్వృత్త చారు

* [బొంబాయి ముద్రణమునందు 11వ అధ్యా— 1-36 శ్లో; బరోడా ముద్రణము నందు 11వ అధ్యా— 1-43 శ్లో.]

4. ఆస్ఫోటన మనగా పాదతలముచే భూమిని కొట్టుట. యుద్ధములందు 'ఆస్ఫాలన' మనునది ప్రసిద్ధమేకదా [అభినవభారతి - పుట 127].

లను, వామపాదమును వెనుకకు చాచి చాపగతిచారిని ప్రయోగించవలెను. పిమ్మట దక్షిణపాదముచే ఆస్కందితచారిని వామపాదముచే శకటాస్యచారిని ప్రయోగించి, దక్షిణపాదముచే భ్రమరకచారి నొనర్చి త్రికమును పరివర్తనముచేసి వామపాదమును వెనుకకు చాచవలెను. ఇట్టిది 'ఆవర్తమండల' మనబడును.

4. సమోత్సారితము—— మొదట సమపాద స్థానమందు నిలిచి, హస్తము లను చాచవలెను. సన్నిహితములును, ఊర్ధ్వతలములును అయిన ఆ హస్తములతో ఆవేష్టన-ఉద్వేష్టనముల నొనరించి పిమ్మట ఆ హస్తములను నడుముమీద ఉంచ వలెను. మొదట దక్షిణ హస్తమును, పిమ్మట వామ హస్తమును అవర్తనము చేయ వలెను. మరల దక్షిణ హస్తమును కటియందుంచి, వామ హస్తమును పరివర్తనము చేయవలెను. పిమ్మట పర్యాయముగా ఈ చారితోనే భ్రమణమొనర్చవలెను. ఇట్టిది 'సమోత్సారిత మండల' మనబడును.

5. ఏడకా (ఏలకా) క్రీడితము—— భూమిమీద ఉన్న పాదములతో సూచీ విద్ధ - ఏడకాక్రీడితచారుల నొనర్చి త్రికవివర్తనముతో భ్రమరీచారి నొనర్చవలెను. పిమ్మట పాదములను పర్యాయముగా త్రిప్పుచు సూచీవిద్ధ-అపవిద్ధచారులను ప్రయోగించవలెను. ఇట్టిది 'ఏడకాక్రీడిత మండల' మనబడును: దీనికే 'ఖండమండల' మనియు పేరు.

6. అడ్డితము——దక్షిణపాదముచే ఉద్ఘట్టితచారి నొనర్చి, ఆవర్తనముచేసి అవస్పందితచారిని ప్రయోగించి, వామపాదముచే శకటాస్యచారి నొనరించవలెను. పిమ్మట దక్షిణపాదమును వెనుకకుచాచి దానిచే చాపగతిని, వామపాదముచే అడ్డితచారిని ప్రయోగించవలెను. మరల దక్షిణపాదముచే అపక్రాంతచారిని వామ పాదముచే భ్రమరకచారిని, మరల దక్షిణపాదముచే ఆస్కందిత చారిని కావించి ఆస్ఫోటనమును చేయవలెను. ఇట్టిది 'అడ్డితమండల' మనబడును.

7. శకటాస్యము——దక్షిణపాదముచే జనిత-పార్శ్వక్రాంత-శకటాస్య చారు లను, వామపాదముచే ఆస్కందిత చారిని ప్రయోగించవలెను. పిమ్మట రెండు పాదములచే పర్యాయముగా శకటాస్యచారిని ప్రయోగించవలెను——ఇట్టిది 'శకటాస్య మండల' మనబడును. ఇది యుద్ధ పరిక్రమమం దుపయుక్తమగును.

8. అధ్యర్ధిక (అధ్యర్ధము)—— దక్షిణపాదముచే జనిత-ఆస్కందితచారులను కావించి, వామపాదముచే అపసర్పణమును చేయవలెను; పిమ్మట దక్షిణపాదముచే శకటాస్యచారిని ప్రయోగించి, మరల వానినే పర్యాయముగా ప్రయోగించవలెను. ఇట్టిది 'అధ్యర్ధ మండల' మనబడును. ఇది యుద్ధ-నియుద్ధములు రెండింటను ఉప యుక్తమగును.



9. పిష్టకుట్టము—— దక్షిణ పాదముచే సూచీచారిని, వామపాదముచే అప క్రాంతచారిని ప్రయోగించవలెను. మరల క్రమముగా దక్షిణ-వామపాదములచే భుజంగత్రాసితచారిని ప్రయోగించవలెను. ఇట్లు భుజంగత్రాసితచారితో మండల భ్రమణ మొనర్చుట 'పిష్టకుట్టమండల' మనబడును.

10. చాపగము—— చాపగతి చారీపాదములతో మండల పరిక్రమ మొన ర్చుట 'చాపగతమండల' మనబడును. ఇది యుద్ధ-నియుద్ధములు రెండింటను ఉపయుక్తము.

ఇంతవరకును నానాచారీసముత్థములైన మండలములను సంగ్రహముగా వివరించియున్నాను. ఇంక 'సమచారు' లను కూడ వివరింతును. 'సమచారు' లను[5] ప్రయోగించుటచే 'సమమండలము' లేర్పడును. వీనిని ఆచార్యబుద్ధి ననుసరించి ప్రయోగించవలెను. మండలసహితములైన ఈ ఖండములను (చారులను) యుద్ధ-నియుద్ధ-పరిక్రమములందు లీలా-అంగమాధుర్య పురస్సరముగా, వాద్యానుసార ముగా ప్రయోగించవలెను.*

ఏకాదశాధ్యాయము సమాప్తము

---

5. సమచారు లనగా పరస్పర యోజనోచితములైన చారులని అర్థము. అనగా భౌమీచారులను పరస్పరము ఒండొంటితోను, అట్లే ఆకాశికీచారులను పరస్పరము ఒండొంటి తోను సమ్మేళనము చేయుటవలన అనేకములగు చారీ భేదములు సిద్ధింపగలవు. ఈ 'సమ చారు' లను ఆచార్య బుద్ధి ననుసరించి ప్రయోగించవలెను [అభినవభారతి - 2 వ సం - పుట 128]. పరస్పరయోజనోచితములైన ఆకాశికీ - భౌమీ చారులను సమ్మిళితముచేసి ప్రయోగించుట సంప్రదాయముగా ఉన్నది.

* [బొంబాయి ముద్రణమునందు 11 వ అధ్యా—— 37-63 శ్లో; బరోడా ముద్రణము నందు 11 వ అధ్యా—— 43-70 శ్లో.]

# అధ్యాయము 12[1]

## గతిప్రచారము[2]

[కాశీముద్రణమునందు 13 వ అధ్యా - 226 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 12 వ అధ్యా - 187 శ్లోకములును; బరోడా ముద్రణము నందు 12 వ అధ్యా - 236 శ్లోకములును కలవు.]

### పాత్రల రంగప్రవేశము : లయ-తాల-కలా విధి

వ్యాయామ సంయోగముచే కలుగు మండలములను వివరించితిని. ఇంక ప్రయోగమందలి ఆయా ప్రకృతుల కుచితములగు గతులను (గతి=నడక) వివరింతును[3].

*పాత్రల రంగప్రవేశము :* యథామార్గ రసోపేతముగా[4] ఉత్తమాదిపాత్రలు రంగమును ప్రవేశించు సమయములో ముందుగా ఉపవహనమును (అంగానుసారి యగు ఆలాపమును) కావించవలెను. పిమ్మట పటమును[5] అపకర్షితముచేయ (తెరను తొలగించ) వలెను. అప్పుడు భాండవాద్య పురస్కృతముగా ధ్రువాగానము

---

1. ఈ భాగము కాశీ ముద్రణమునందు త్రయోదశాధ్యాయము. బొంబాయి-బరోడా ముద్రణములందు ద్వాదశాధ్యాయమే.

2. అభినవగుప్తుడు 'గత్యధ్యాయ' మనెను. గతిప్రచారమనగా గతులయందలి వైచిత్ర్య ప్రయోగము (గతి విశేషము) అని అర్థము [అభినవభారతి-2వసం-పుట 134].

3. ప్రకృతిని, రసమును, అవస్థను, దేశమును, కాలమును అనుసరించి ప్రకృతుల గతులు మారుచుండును. వీనిని గుర్తునందుంచుకొనియే ఆయా గతులను చెప్పవలసియున్నది. [అభినవభారతి-2వ సం-పుట 129].

4. మార్గమనగా దేశము (గృహ-ఉద్యానాదులు); రసమనగా స్థాయి చిత్తవృత్తి (రత్యాది చిత్తవృత్తులు), ఉపవహనము=ఉపోహనము (గీతాంగములు మూడింటిలోను ఒక భేదము). ధ్రువ ఆయాపాత్రల చిత్తవృత్తులను తెలుపునదిగా ఉండవలెను(దీనినే ప్రావేశికీ ధ్రువ అందురు). పాత్రల ప్రవేశము సముచిత స్థానక-దృష్టి-ముఖరాగాది సంయుక్తముగా ఉండవలెను. అప్పుడే సామాజికులయందు ముఖ్య రసవ్యాప్తి కలుగగలదు. 'యథామార్గ రసోపేత' మనుటకు బదులుగా 'యథా మార్గ కలోపేత'మని కొందరు పఠింతురు. ఇచ్చట మార్గమనగా చిత్రాదులు. కలలనగా వాద్యాక్షరములు [అభినవభారతి-2 వ సం-పుట 130].

5. 'పటమును అపకర్షితము చేయవలెను' అనగా యవనికను తొలగించవలెను అని అభినవగుప్తు డర్థము వ్రాసెను. [అభినవభారతి-2 వ సం-పుట 130].

5 వ అధ్యాయము చివరగల 7 వ విశేషాంశమును కూడ చూడవలెను.



చక్కగా ప్రయుక్తమగుచుండగా నానార్థ-రస సంభవ కారులగు పాత్రలు రంగము నందు ప్రవేశించవలెను.

అట్లు రంగమున ప్రవేశించిన ఉత్తమ-మధ్యమ పాత్రలు వైష్ణవ స్థానము నందు నిలువవలెను. ఉరము సమున్నతమును, సమమును, చతురశ్రమును కాగా మూపులు అచలములును, సమానములును కావలెను. అనగా మూపులు చెవులకు 8 అంగుళముల దూరములో ఉండునట్లు, మయూర మస్తకమువలె సుందరముగా ఉండునట్లు మెడను నిలుపవలెను. గడ్డము వక్షమునకు 4 అంగుళముల దూరమునం దుండవలెను. ఎడమచేయి నడుముమీదను, కుడిచేయి బొడ్డుమీదను ఉండవలెను.

*కలా-తాలవిధి :* రెండు పాదముల మధ్యను 2½ తాలముల ఎడము ఉండ వలెను. ఇంక పాదోత్క్షేపము (అడుగులనువేయునప్పుడు వాని మధ్యదూరము) స్వప్రమాణానురూపముగా[6] 4 తాలముల లేదా 2 తాలముల లేదా ఏకతాలము ఎడము కలిగియుండవలెను. దేవతల, రాజుల (వీరు ఉత్తమ ప్రకృతులు) పాదోత్క్షేపము 4 తాలముల అంతరము కలిగియుండవలెను. అందులకు 4 కలల కాలము పట్టును. మధ్యమ పాత్రల పాదోత్క్షేపము 2 తాలముల అంతరము కలిగి యుండవలెను. అందులకు 2 కలల కాలము పట్టును. ఇంక స్త్రీల, నీచుల (వీరు నీచపాత్రలు) పాదోత్క్షేపము ఒక తాలము అంతరమును కలిగియుండవలెను; అందు లకు ఒక కలా కాలము పట్టును. స్థిత-మధ్య-ద్రుత లయలను పరిశీలించి, నాట్యజ్ఞుడు ఆయా ప్రకృతుల గతుల కనుగుణముగా ఆయా లయలను కూర్చవలెను. ఉత్తముల గతి స్థైర్యోపేతముగను,-మధ్యముల గతి మధ్యమముగను, అధముల గతి ద్రుతము గను ఉండును. ఇట్లుమూడు లయలను సత్త్వవశముగా[7] కూర్చవలయును. ధ్రువాగాన మందలి కలా-తాల-లయల విధి పై విధముగా ఉండును.*

---

6. తాలమనగా జేన. పాత్రయొక్క జేన ననుసరించి ఆ జేనయొక్క ప్రమాణము మారుచుండును. ఆజానుబాహువుల జేన 12 అంగుళములుండినచో చిన్నవారి జేన 6 అంగు ళములే ఉండవచ్చును.

7. సత్త్వమనగా చిత్తవృత్తి. ఈ మూడు లయలను ప్రకృతియొక్క అవయవ భేదములను బట్టియేకాక వారి వారి చిత్తవృత్తులనుబట్టి కూడ కూర్చవలసియుండునని తెలియవలెను. సంగ్రామాదులందు ఉత్తముల గతి ద్రుతముగా ఉండును. శోకాదు లందు అధముల గతి విలంబితముగా ఉండును. వీనినికూడ గుర్తించి, పై విధముగా కలా-తాల-లయల నియమముతో ధ్రువాగానమును నిర్వర్తించవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 134]

*[కాశీ ముద్రణమునందు 13 వ అధ్యా— 1-14 శ్లో; బొంబాయి ముద్రణమునందు 12 వ అధ్యా— 1-13 శ్లో ; బరోడా ముద్రణమునందు 12 వ అధ్యా— 1-14 శ్లో.]

*పంచపదీ గమనము* : ఇంక, ఆయా ప్రకృతుల కుచితములగు గతి విశేషము లను వివరింతును—

ఉత్తముల సహజగతియందు మోకాలు నడుముతో సమముగా ఉండునట్లు పాదములను ఎత్తివేయుచుండవలెను. యుద్ధచారీ ప్రయోగములందు వక్షముతో సమానముగా ఉండునట్లు మోకాలిని ఎత్తవలెను. లలితములగు పార్శ్వక్రాంత చారీ పాదములతో వాద్యధ్వనుల కనుగుణముగా సరిగా 5 అడుగులు రంగ కోణ మునకు అభిముఖముగా (ఈశాన్యదిశకు) నడువవలెను. అచ్చట దక్షిణపాదముతో వామవేధమును[8], విక్షేపమును కావించి, తిరిగి యథాస్థానమునకు వచ్చి, మరల వాయవ్య దిశకు పై విధముగానే నడువవలెను. అచ్చట కూడ దక్షిణ పాదముతో వామవేధమును, విక్షేపమును చేయవలెను. తరువాత వాద్యాభిముఖుడై ఐదు అడుగులు నడచి పై విధముగానే మరల చేయవలెను. ఇట్టీ గతాగతములు ఏక వింశతి (21) పదయుతము లగుచున్నవి. ఈ గతాగతములతో వికృష్టరంగము నందు భరతుడు[9] పాదగతి ప్రచారము నొనరించవలెను. ఇంక ఈ పాదప్రచారము త్ర్యశ్రరంగమునందు త్ర్యశ్రముగానే, చతురశ్రరంగమువందు చతురశ్రముగానే ఉండవలయును[10].

*గతిభేదములు*: ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులు తమతో సమానమైన వారితో నడచునప్పుడు లయాశ్రయమైనవారి గతి క్రమముగా చతుష్కలమును, ద్వికలమును, ఏకలమును కావలయును ; ఇది 'సమగతి' అనబడును. ఉత్తముడు మధ్యములతో నడచునప్పుడు వారిగతి చతుష్కలా-ద్వికలా మిశ్రమముగాను, ఉత్తముడు నీచులతో నడచునప్పుడు వారిగతి చతుష్కలా - ఏకకలా మిశ్రమముగాను ఉండవలయును ; ఇది 'మిశ్రగతి' అనబడును. దేవ-దానవ-యక్ష-నృప-పన్నగ-రాక్షసుల గతియందు

8. వేధమనగా కాలిమడమ మీద సూచీపాదమునుంచుటయని అర్థము. వామ వేధమనగా ఎడమ కాలిమడమ మీద కుడి సూచీపాదమునుంచుట అని అర్థము.

9. 'భరత' శబ్దమునకు నటుడను అర్థము నాట్యశాస్త్రమందే కలదనుట కిదియొక ఉదాహరణము. "భరత శబ్దేన ఉపచారతః తద్విద్యా యోనిసంబంధః సూచ్యతే" అని భరత పదమును అభినవగుప్తుడు వివరించెను - భరత ప్రవర్తిత విద్యాసంబంధము కలవారి యందు ఔపచారికముగా (లక్షణచే) భరతశబ్దము వ్యవహృతమగుచున్నది. [అభినవభారతి - 2 వ సం - పుట 136]

10. దిక్కు (space) పరిమితమైనప్పుడు పంచపదీగతాగతముల విషయమున నియమము లేదు. ఒకేచోట రెండేసి పాదోత్క్షేపములు చేయవచ్చును. వికృష్టమందుమాత్రము పంచపదిని మరల మరల చేయవలెను. (పంచపదియును, త్ర్యశ్ర - చతురశ్ర పూర్వరంగమును 5 వ అధ్యాయమందు వివరింపబడెను.) ఇది యుద్ధపరిక్రమమునకు సంబంధించినది.



పాదములు చతుస్తాలాంతరములుగానే ఉండవలయును. ఇంక తక్కిన స్వర్గవాసు లందరి గతియు 'మధ్యమగతి' అనబడును; కాని వారిలో ఉద్ధతులైనవారి గతి మాత్రము దేవతల గతితో సమానముగానే ఉండును[11].

*రాజులగతి* : ఋషుల ప్రశ్న— రాజులు మనుష్యులు కదా ? వారికి దేవత లతో సమానమైన గతి ఏల చెప్పబడెను? భరతుని సమాధానము— నాట్యమందు దివ్య-దివ్యమానుష- మానుష భేదములచే ప్రకృతి మూడు విధములుగా ఉండును. అందు దేవతల ప్రకృతి దివ్యము, రాజుల ప్రకృతి దివ్యమానుషము, ఇతరుల ప్రకృతి మానుషము అని అనబడును. రాజులు దేవాంశ సంభూతులుగా వేద-అధ్యాత్మము (వేదాంతము)లందు కీర్తింపబడినారు. కాన, దేవానుకరణము రాజులవిషయమున మాత్రము దోషముకాదు.

*సంభ్రమాద్యవస్థలయందలి గతులు* : పై ప్రమాణముల నన్నింటిని స్వస్థ (సహజ) గతిలో పాటించవలెను. కాని, సంభ్రమ-ఉత్పాత-రోషములందు ప్రమాణ నియమములేదు. ఇప్పట్ల ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులందరును ఆయా అవస్థ లనుబట్టి అన్య ప్రకృతుల గతులను కూడ ప్రయోగించ వచ్చును. ఇట్టి అవస్థాంత రములందు ఉత్తములు రెండు కలల కాలమును, మధ్యములు ఒక కలాకాలమును అధములు అర్ధకలా కాలమును పాటించవలెను. అనగా ఉత్తమునిగతి చతుష్క లోపేతమైనచో మధ్యముని గతి ద్వికలోపేతము కావలయును. ఉత్తముని గతి ద్వికలోపేతమైనచో మధ్యముని గతి ఏకలోపేతమును, ఇంక మధ్యముని గతి ఏకకలోపేతమైనచో అధముని గతి అర్ధకలామాత్రమును అగును. ఇట్లు అర్ధార్ధహీన ముగా జనుల గతులను ప్రయోగించవలెను. జ్వరార్తులు, క్షుధార్తులు, తపఃశ్రాంతులు, భయాన్వితులు, విస్మితులు, అవహిత్థులు (తెచ్చిపెట్టుకొన్న ధైర్యముతో ఉన్న వారు), ఔత్సుక్యసమన్వితులు, శృంగార (విప్రలంభ) బాధితులు, శోకార్తులు, స్వచ్ఛందగమనులు (పనిఏమియునులేకయే విలాసముగా తిరుగువారు) అయినవారి గతి స్థితలయాన్వితమై ఉండవలయును ; ఇందు పాదోత్క్షేపమునకు 4 కలల కాలము పట్టును. కాని చింతాన్వితుల గతియందు పాదోత్క్షేపము నాలుగు కలల కాలమును మించినదికారాదు. ఇంక ప్రచ్ఛన్నకామితము, భయము. విత్రాసము, ఆవేగము, హర్షము, అనిష్టవార్తాశ్రవణము, అద్భుతదర్శనమందలి చిత్తవిక్షేపము తొందరపని, దుఃఖము, శత్రువునువెదకుట, అపరాధిని వెంటాడుట, క్రూరమృగ మును వేటాడుట మొదలగువానియందలి త్వరాతిశయ సూచకమగు గతియందలి

11. తక్కిన స్వర్గవాసు లనగా దేవదూతాదులు; వారిలో ఉద్ధతు లనగా మాతలి ప్రభృతులు. [అభినవభారతి - 2 వ సం - పుట 136]

పాదోత్క్షేపమునకు కలా నియమము లేదు.[12] ఈ భావములందు తప్ప ఇంకెన్నడును ఉత్తములకు నియతమైన గతిని మధ్యములయందును, మధ్యములకు నియతమైన గతిని అధములయందును ప్రయోగించరాదు.*

రసగతులు

*శృంగారము:* స్వస్థకామిత సంభవమగు శృంగార రసమందలి గతి క్రింది విధముగా ఉండవలెను. దూతికదారిని చూపుచుండగా నాయకుడు రంగస్థలమును ప్రవేశించి అర్థవంతమగు 'సూచా'[13] అభినయమును చేయవలెను. అతడు హృద్యములగు వస్త్రములచే, గంధ-ధూప-చూర్ణ-పుష్పమాలాదులచే అలంకృతుడై అతిక్రాంత చారీస్థితములగు పాదములతో లయానుసారముగా, సౌష్ఠవోపేతముగా, లలితముగా ముందునకు సాగవలెను. హస్తములెప్పుడును పాదగతి ననుసరించి ఉండవలెను—పాదములు నేలమీద పడునప్పుడు హస్తములు పైకిలేవవలెను, పాదములు పైకిలేచినప్పుడు హస్తములు వ్రేలాడవలెను. ఇంక ప్రచ్ఛన్న కామితమందలి గతిని వివరింతును. పరిజనరహితుడును, స్రస్తగాత్రుడును (వదులుగాఉన్న అవయవములు కలవాడును)అయిన నాయకుడు అల్పముగా భూషణములను, తత్కాలోచితములగు వస్త్రములను ధరించి, దీపము లేకయే, నిశ్శబ్దముగా, మందముగా, దూతిక దారి చూపుచుండ నడువవలెను. శబ్దమైనచో శంకతో అటునిటు చూచుచు, ఔత్సుక్యముతో, వణకుచున్న శరీరముతో, తొట్రుపాటుతో కూడి ఉండవలెను.

*రౌద్రము:* రౌద్రరసమందలి దైత్య - రాక్షస గణముల గతిని ఇప్పుడు వివరింతును. వారిలో రౌద్ర మొక్కటియే స్థిరముగానుండు రసము. నేపథ్యజ రౌద్రము, అంగజ రౌద్రము, స్వభావజ రౌద్రము అను భేదములచే రౌద్రము మూడు విధ

12. వికలము (కలానియమములేనిది) అని బరోడాముద్రణ పాఠము: ద్వికలము (రెండు కలల కాలములో నిర్వర్తింపబడునది కావలెను) అని కాశీముద్రణ పాఠము. ఇచ్చట "త్వరాతిశయ సూచకములగు అవస్థలు" అని చెప్పిన చాలును. కాని, కవి-నట వ్యుత్పాదనార్థము పై అవస్థలు ప్రపంచింపబడెనని తెలియవలెను. [అభినవభారతి - 2వ సంపుట 140]

* [కాశీముద్రణమునందు 13 వ అధ్యా—15-39 శ్లో; బొంబాయిముద్రణమునందు 12వ అధ్యా—14-37 శ్లో; బరోడా ముద్రణమునందు 12వ అధ్యా—15-40 శ్లో.]

13. 22 వ అధ్యాయమునందు చెప్పబడెడి ఆరువిధములగు అభినయములలోను ఈ 'సూచాభినయము' ఒక భేదము. "వాక్యమును కాని, వాక్యార్థమును కాని ముందుగా సాత్త్విక - ఆంగికాభినయములతో సూచించి పిమ్మట వాక్యమును పలుకుట 'సూచాభినయ' మనబడును.



ములు. రక్తమును ఒడలినిండను, ముఖమునిండను పూసికొని, మాంస ఖండములను చేతులలో పట్టుకొని ఉండుట నేపథ్యజమగు రౌద్ర మగును. అనేకములగు బాహువులను, ముఖములను, ఆయుధములను, ఉన్నతమును స్థూలమును అగు దేహమును కలిగియుండుట అంగజమగు రౌద్రమగును. ఎఱ్ఱని కనులను, బూడిద రంగు జుట్టును, నల్లని శరీరచ్ఛాయను. వికృతమైన కంఠస్వరమును కలిగియుండి కఠినుడును, నిర్భర్త్సనపరుడును అయియుండుట స్వభావజమగు రౌద్రమగును. ఇట్టివారు నిలిచినను, నడిచినను పాదముల మధ్యదూరము 4 తాలములుండవలెను. వీరిని పోలిన ఇతరులగతియును ఈ విధముగానే ఉండవలయును.

*బీభత్సము:* అహృద్యమగు శ్మశానభూమి యందును, జుగుప్సావహమగు యుద్ధభూమియందును బీభత్సాభినయగతిని ప్రయోగించవలెను. ఏడకాక్రీడిత చారి యందువలె దగ్గరగా, దూరముగా, ఒకదానిపై ఒకటిగా అడుగులను వేయుచు నడచుట బీభత్సరసమందలిగతియగును. హస్తములు పాదానుసారులై ఉండవలెను.

*వీరము:* వీరరసమందలి గతి అనేక విధములగు చారులతో కూడినదై ద్రుతప్రచారమును (ఒకే ప్రదేశమునందు), పాదవిక్షేపములను (స్యందిత-అపస్యందితాది చారులను) కలిగి ఉండవలెను.

కలా-తాలానుసారు లగు పార్శ్వక్రాంత-ఆవిద్ధ-సూచీ చారులతో కలా-తాల (కాల) అనుసారముగా 'ఆవేగ'మందలి గతిని ప్రయోగించవలెను.

*అద్భుత-హాస్యములు:* ఇంతవరకు ఉత్తమ ప్రకృతుల గతులను వివరించితిని. ఇంక మధ్యమ-అధమ ప్రకృతుల గతులను వివరింతును. విస్మయ-హర్షాదులందు విక్షిప్తపద విన్యాసముతో వీరి గతిని ప్రయోగించవలెను. హాస్యాభినయమందును ఈ గతిని కాని, ఇట్టివే అగు ఇతర గతులనుకాని ప్రయోగించవలెను.[14]

*కరుణము:* కరుణరసమందలి గతి విలంబితలయాన్వితమై ఉండును. ఇందు అప్రియము క్రొత్తదైనప్పుడు కన్నులనీరు నింపుచు, స్రస్తగాత్రముతో, చేతులను పైకెత్తి పడవేయుచు (బారలు సాచుచు), ఎలుగెత్తి ఏడ్చుచు, అధ్యర్ధికాచారితో

14. ఇచ్చట హర్షముతో పాటు విస్మయమును కూడ అభినవగుప్తుడు వ్యభిచారి భావముగానే పేర్కొనెను. విక్షిప్తపదవిన్యాస మనగా వ్యాకులతతో ఇటునటు లఘు-ద్రుత బహుళముగా తిరుగుట. హాస్యాభినయమందు ఉత్తముల గతి స్వస్థమును, అపహసిత-అతిహసితముల యందు మధ్యముల గతి విక్షిప్త విన్యాసమును కావలయును. ఇంక విదూషకాదుల గతి చెప్పబోవు విధముగా ఉండవలెను. [అభినవభారతి - 2 వ సంపుటలు 145-146.]

పరిక్రమించవలెను. ఇది స్త్రీ-నీచ ప్రకృతులకు సంబంధించినగతి. ఇంక ఉత్తములు దీర్ఘనిశ్వాసములతో మిన్ను చూచుచు, కన్నీళ్ళతో, ధైర్యోపేతముగా నడువవలెను. వీరి గతికి నిర్దిష్ట ప్రమాణముకాని, సౌష్ఠవముకాని ఆవశ్యకములుకావు. మధ్యమప్రకృతుల గతిని వారి వారి స్వభావాను గుణముగా ప్రయోగించవలెను. ఇష్టబంధుమరణ విషయమున ఉత్సాహమును కోల్పోయి, గుండెలు బాదుకొనుచు శోకముచే జడత్వమునుపొంది, కొద్దిగా ఎత్తివేయబడుచున్న పాదములతో పరిక్రమించవలెను. గాఢ ప్రహారాభినయమందు శిథిలాంగములతో, ఒడలు తిరుగుచుండగా బరువుగా అడుగులువేయుచు, ఇతరుల భుజములను ఆనుకొని నడువవలెను. చలిచే పీడింపబడిన, వర్షమునందు తడిసిన స్త్రీ-నీచప్రకృతులగతి క్రింది విధముగా ఉండును—అవయవములను ముడుచుకొని, వణకుచు, రెండు చేతులను గుండెలమీద ఉంచుకొని, పొట్టిగా అగునట్లు వంగి, పళ్ళు, పెదవులు అదరుచుండగా చిబుకమును మెల్లగా ఆడించుచుండవలెను.

*భయానకము* : భయానక రసమందు స్త్రీల, నీచుల, సత్త్వహీనులగు ఉత్తముల (ఉత్తరుడు మొదలగువారి) గతి క్రిందివిధముగా ఉండును— విప్పారి చలించుచున్న కనులతో, శిరస్సు నాడించుచు, భయముతో ఇటునటు ప్రక్కలకు చూచుచు, కపోతహస్తమునుపట్టి, శరీరమంతయును వణకుచుండగా, పెదవులెండిపోగా, తొట్రుపాటుతో, బరువుగా తొందరగా అడుగులను వేయుచు పరిక్రమించవలెను. శత్రువు వెన్నాడుట, బెదరుట, భయపడుట, వికృతజంతువులను చూచుట, వికృత ధ్వనులను వినుట మొదలగు వానిని అభినయించునప్పుడు కూడ పైగతినే ప్రయోగించవలెను. ఇది స్త్రీల విషయము. ఇంక పురుషుల విషయమున ధైర్యమును తెచ్చిపెట్టుకొనుచు అభినయించవలెను. ఏడకాక్రీడితమునందువలె దగ్గరగా, దూరముగా, ఒకదానిపై ఇంకొకటిగా అడుగులను వేయుచు భయపడిన పురుషుల గతిని అభినయించవలెను. హస్తములు పాదానుసారులై ఉండవలెను.*

*శాంతము*[15] : ఇంక వణిజుల, సచివుల గతి సహజముగా (ఆవేశరహితముగా) ఉండవలెను. రెండు తాలముల ఎడముగల పాదములతో, అతిక్రాంత చారిని

* [కాశీముద్రణమునందు 13 వ అధ్యా— 39-74 శ్లో; బొంబాయిముద్రణమునందు 12వ అధ్యా—37-70 శ్లో; బరోడాముద్రణమునందు 12వ అధ్యా—40-75 శ్లో.]

15. ఇది శాంతరసమందలి అభినయమని మూలమందు స్పష్టముగా లేదు. కాని, వణిజాదుల, యతిప్రభృతుల గతులు శాంతరసమునకు సంబంధించినవనియు, అంతస్సంస్కారముగల వీరందరును నాటకాదులందు శాంతరస ప్రధానులుగానే కన్పట్టుచున్నారనియు అభినవగుప్తుడు నిర్దేశించెను [అభినవభారతి - 2 వ సం - పుట - 148].



ఆచరించవలెను. కటకాముఖ వామహస్తమును వెలికిలగా బొడ్డుమీదను, అరాల దక్షిణహస్తమును వెలికిలగా ఒకపార్శ్వమునందును ఉంచవలెను. గాత్రము నిషణ్ణము, స్తబ్ధము, పరివాహితమును (అధికముగా ఊగుట) కారాదు.

యతులు, శ్రమణులు, తాపసులు, నైష్ఠికబ్రహ్మచారులు మొదలగు వారి గతి క్రింది విధముగా ఉండవలెను—చాంచల్యములేని నేత్రములు, 4 హస్తముల దూరము మాత్రమే ప్రసరించు చూపులు, హఠాత్తుగా ఏదో సంస్కారమువలన కలిగిన స్మృతి, ఏకాగ్రత, వినీతవేషము, కాషాయవస్త్రములు, నియతములైన చిహ్నములు (జటా-భస్మ-కౌపీనాదులు) కలిగిన వారై మొదట సమపాదస్థానమందు నిల్చి ఒక హస్తమును చతురహస్తముగా చేసి, రెండవ హస్తమును చాచవలెను. ప్రయోగానురూపముగా ముఖమును ప్రసన్నమునుచేసి, అనిషణ్ణ గాత్రముతో అతిక్రాంత చారిని ఆచరించవలెను. ఉత్తమవ్రతస్థులైన వారిగతి పై విధముగా ఉండవలెను. కపటవ్రతస్థుల విషయమున పై గుణములు విపరీతములుగా ఉండును. ఇంక ఇతర వ్రతస్థుల (ఆగమాదులయందు కన్పట్టు ఉన్మత్తాదివ్రతస్థుల) గతి తత్తద్వ్రతోచితమై విభ్రాంతోదాత్తము, లేదా విభ్రాంతనిభృతము కావలయును. పాశుపతులగతి శకటాస్య-అతిక్రాంత చారులతో ఉద్ధతముగాఉండును.

### దేశానుసారులైన గతులు[16]

*అంధకారమందలి గతి* : భూమిమీద మెల్లగా జరుపబడుచున్న పాదములతో, మార్గమును అన్వేషించు హస్తములతో అంధకారమందలి (లేదా అంధుని) గతిని అభినయించవలెను.

*రథస్థుని గతి* : రథస్థుని గతి చూర్ణపదయుతము కావలయును. సమపాద స్థానమును గ్రహించి రథముమీద వెళ్ళుటను నిరూపించవలెను. తాను ఒకహస్తముతో ధనువును, మరియొక హస్తములో కూబరము (నొగలు) ను గ్రహించవలెను. ఇంక సూతుడు ఒక చేతితో కళ్ళెమును, ఇంకొక చేతితో కొరడాను పట్టుకొనవలయును; మరియు అతడు రథికునకు తగినట్లుగా తురగ-బలీవర్ద-ఖర-ఉష్ట్రాది ఆలేఖ్య వాహనములను చేతియందుంచుకొని ప్రదర్శించవలెను. ఇట్లు ద్రుతలయాన్వితములైన చూర్ణపదములతో రథస్థుని గతిని అభినయించవలెను. విమానస్థుని గతినికూడ పై విధముగానే నిరూపించవలెను.

*ఆరోహణ - అవరోహణములందలి గతులు* : వాహనమును ఎక్కుటను అభినయించుటకు శరీరమును ముందునకు ఎత్తవలెను; దిగుటను అభినయించునప్పుడు

16. ఇంతవరకును రసానుసారులైన గతులు చెప్పబడినవి. ఇప్పుడు దేశానుసారులైన గతులు చెప్పబడుచున్నవి (దేశము=ప్రదేశము) [అభినవభారతి - 2వ సం - పుట 152].

శరీరమును క్రిందుగా వంచవలెను. మీదినుండి క్రిందికి చూచుట, వలయాకారముగా తిరుగుట అనువానిచే ఆకాశగమనమును నిరూపించవలెను; రథస్థుని గతి యందు వలెనే ఇందును సమపాదస్థాన - చూర్ణపదగమనము లుండును. ఆకాశమునుండి క్రిందికి దిగుచున్న వానిగతిని సరళములును లలితములును అగు జంఘలతోను, పైకి క్రిందికి ఆడింపబడుచున్న హస్తములతోను, వక్రములగు భ్రమణములతోను అభినయించవలెను. ఆకాశమునుండి అబుద్ధిపూర్వకముగా పడినవాని (ఆకస్మికముగా క్రిందికి త్రోయబడినవాని) గతిని అపవిద్ధ (వేగముగా దోలాకారముగా పడిన) భుజములతో, చెల్లాచెదరైన వస్త్రములతో, క్రిందిచూపులతో అభినయించవలెను.*

ప్రాసాద (మేడ)-ద్రుమ (చెట్టు)-శైలాద్యున్నత స్థలములను ఆరోహించుట (ఎక్కుట), నదులు మొదలగు నిమ్న ప్రదేశములలోనికి అవతరించుట (దిగుట) అనునవి ప్రయోగములందు ఆవశ్యకములగుచుండును. ప్రాసాదారోహణమందు అతిక్రాంత చారీ పదములతో దేహమును పైకెత్తి పైమెట్లపై పాదములనువేయుచున్నట్లును, ప్రాసాదావతరణమునందు శరీరమును వంచి క్రింది మెట్లపై పాదములను ఉంచుచున్నట్లును అభినయించవలెను.

ఒడ్డునుండి నదిలోనికి దిగుచున్నప్పుడును మేడ దిగుచున్నప్పుడు చూపిన గతినే చూపవలెను. ఇంక జలమధ్యమందలి గతి జలప్రమాణమును అనుసరించిఉండవలెను—నీరు తక్కువగాఉన్నచో వస్త్రమును పైకెగదీయవలెను. నీరు అధికముగాఉన్నచో చేతులు చాచుచు ఈదుటను అభినయించవలెను. నదిని దాటుటలో ఊర్ధ్వకాయము ముందునకు కొంచెము వంగిఉండవలెను.[17] ప్రవాహమునందు కొట్టుకొనిపోవుచున్నప్పుడు ఒక్కొక్క చేతినే చాచుచు నీటిని మాటిమాటికి వెనుకకు త్రోయుచు, అడ్డముగా పోవుచు, నీరు మ్రింగుచు, శరీరమంతయును వ్యాకులపాటు చెందియుండుటను అభినయించవలెను.

పర్వతారోహణమందును ప్రాసాదారోహణమందలిగతినే ప్రయోగించవలెను. ఇందుమాత్రము పాదవిక్షేపాదుల నొనర్చుచుండవలెను.

---

*[కాశీముద్రణమునందు 13 వ అధ్యా— 75-94 శ్లో; బొంబాయి ముద్రణమునందు 12 వ అధ్యా—71-88 శ్లో; బరోడా ముద్రణమునందు 12 వ అధ్యా— 76-95 శ్లో.]

17. ఇది బుద్ధిపూర్వకముగా నదిని దాటుటయందలి గతి. ఇంక అబుద్ధిపూర్వకముగా అనగా ప్రమాదవశమున ప్రవాహమునందు కొట్టుకొనిపోవుచున్నప్పటి గతి తరువాతి వాక్యములో చెప్పబడుచున్నది. [అభినవభారతి - 2 వ సం - పుట 153]



*నావప్రయాణమందలి గతి :* నావయందు ప్రయాణము చేయుచున్నవాని గతిని ద్రుతలయాన్వితములగు చూర్ణపదములతో నిరూపించవలెను. ఈ గతియందు ఒక పాదమును అతిక్రాంతముగను, రెండవ పాదమును అంచితముగను ఉంచవలెను.

అతిక్రాంత-సూచీ-అపక్రాంత-పార్శ్వక్రాంత చారులతో ద్రుమారోహణమును నిరూపించవలెను.

*అశ్వయానమందలి గతి :* వైశాఖ స్థానమందు నిల్చి, పిమ్మట ఒకదాని వెంబడి ఒకటి పడుచున్న చిత్రములగు చూర్ణపదములతో అశ్వయానమందలి గతిని నిరూపించవలెను.

*పన్నగుల గతి :* పన్నగుల గతిని స్వస్తికసంయుతములైన పాదములతో నిరూపించవలెను. ఇందులకు పార్శ్వక్రాంత చారి నాచరించి స్వస్తిక పాదములను రేచనము చేయవలెను.

పై విధముగా ఆయా గతులను నిరూపించవలెను. వీటినన్నింటిని కేవలము సంజ్ఞా (అభినయ) మాత్రముగనే ప్రదర్శించవలయును.

ప్రశ్న—ఎందుచేత ?

సమాధానము— రూపకమందు ఒక ప్రకృతి చనిపోయినట్లు చెప్పబడి ఉన్నచో దానిని ప్రయోగించు ఆ ప్రయోక్త కూడ మరణించవలసినదేనా ?[18] అది అసంభవము. ఆ ప్రయోక్త తాను వాస్తవముగా మరణింపకయే దానిని అభినయమాత్రముగా ఎట్లు నిరూపించునో అట్లే పై సందర్భములందును అభినయమాత్రముగానే నిరూపించవలెను. ఉదాహరణమునకు— అంకుశమును పట్టుకొనుటచే ఏనుగును, కళ్ళెమును పట్టుకొనుటచే గుఱ్ఱమును, పగ్గములను పట్టుకొనుటచే యానమును నిరూపితములగునని తెలియవలెను.[19]

---

18. "...మృత ఇతి ప్రోక్తే కిం మర్తవ్యం ప్రయోక్తృభిః?"— 106

—దీనినిబట్టి రూపకములందు మరణము నభినయించవలసిన ఆవశ్యకత కలదనుట స్పష్టము. 7 వ అధ్యాయమందలి 6 వ విశేషాంశమును చూడవలెను.

రంగమందు వృక్ష-ప్రాసాదాదులను కూడ రథాదుల గతులయందువలెనే పటాదులతో ప్రదర్శించవలయునా? అను ప్రశ్నకు సమాధానముగా అట్లు చేయనవసరములేదనియు, పైన చెప్పిన విధముగా గతిని అభినయించుటచేతనే వానినెల్ల నిరూపించవలెననియు అభినవగుప్తుడు పేర్కొనెను. [అభినవభారతి - 2 వ సం - పుట 154]

19. ఇట్లనుటవలన రథగమనాద్యభినయములందు పటాదులను ప్రదర్శింపకపోవుట దోషముకాదని స్పష్టమగుచున్నది; సౌకర్యము లేకపోవుటచే ప్రదర్శింపకపోవుట తటస్థించుచుండును. [అభినవభారతి - 2 వ సం - పుట 154]

### విట-కాంచుకీయుల గతులు

*విటుడు :* విటుని గతి ఒక తాలము ఎడముగల ఆకుంచితపాదములతో, విలాస విభ్రమములతో కూడినది కావలయును. కటకావర్ధమానహస్తములు పాదముల ననుసరించవలెను. వాని ప్రకృతికుచితమైనసౌష్ఠవము ప్రదర్శితముకావలెను.

*కంచుకి :* కంచుకీయుని[20] (కంచుకి) యొక్క గతిని వాని వయస్సును, అవస్థను బట్టి ప్రయోగించవలెను. వృద్ధుడుకానిచో అతడు అర్ధతాలపరిమితములుగా పైకెత్తివేయబడుచున్నవియును, విష్కంభములును (స్థిరములును), ఋజుస్థితములును అయిన పాదములతో బురదలో దిగబడినవానివలె ప్రయత్నముతో అవయవములను ఆకర్షించుచు నడవవలెను. వృద్ధుడైనచో కంపించుచున్న దేహముతో, విష్కంభనమే (ఊతకఱ్ఱయే) బలముగాకలవాడై, అడుగులు మెల్లగావేయుచుండవలెను.

కృశించినవాడు కూడ పై విధముగా మెల్లగానే నడవవలెను.

### వ్యాధిగ్రస్తాదుల గతులు

వ్యాధిగ్రస్తులు, జ్వరార్తులు, తపఃశ్రాంతులు, క్షుధాన్వితులు అయినవారు ఊతకఱ్ఱలే బలముగా కలవారై, లోతుకుపోయిన కడుపులతో, హీనస్వరములతో, ఎండిన చెక్కిళ్ళతో, దీనములైన (గుంటలు పడిన) కనులతో చేతులను కాళ్ళను మెల్లగా కదల్చుచు, శరీరమును వణికించుచు ఆయాసపడుచు నడవవలెను.

### దూరప్రయాణము చేసినవాని గతి

దూరప్రయాణము చేసినవాడు అవయవములను ముడుచుకొనుచు, కాళ్ళను మర్దించుకొనుచు మెల్లగా నడవవలెను.

### స్థూలకాయుని గతి

స్థూలకాయుడు శరీరమును ఈడ్చుకొనుచు, శరీరమును పెక్కుసార్లు పైకి ఎగురవేయుచు, మెల్లగా అడుగులను వేయుచు నడవవలెను. శ్రమచే పట్టిన చెమట కలవాడై చూర్ణపదములతో నడవవలెను.

### మత్త-ఉన్మత్తుల గతులు

*మత్తుడు :* ఇంక మత్తుని (త్రాగినవాని) గతి— తరుణ-మధ్యమ మదములందు మత్తుడు తూలుచు, తిరుగుడువడుచు నడవవలెను. అధమమదమందు అవ్యవస్థితములగు పాదములతో దేహము తిరుగుడువడుచుండ తొట్రుపాటుతో నడవవలెను.

20. 'కంచుక' మనగా నేపథ్యోచితమైన వ్యాపారము (తాను వేసికొన్న వేషమునకు అనుకూలమైన నడవడి); దానిని తాను ఆచరింపగోరువాడు కాన అతడు కంచుకీయుడనబడును. [అభినవభారతి - 2 వ సం - పుట 155]



*ఉన్మత్తుడు:* ఉన్మత్తుని (పిచ్చివాని) గతి క్రమరహితమై, బహుచారీసంయుక్తమై, లోకానుసారముగా ఉండవలెను. ఉన్మత్తుడు—బిరుసెక్కిన చింపిరిజుట్టు, దుమ్ముపట్టిన ఒడలు, కారణములేని ప్రలాపములు, అధిక ప్రసంగము, వికృత చేష్టలు కలిగియుండును. అతడు ఒక్కొక్కసారి హఠాత్తుగా పాడును, నవ్వును, ఒంటరిగా ఉండును, మరల సంతుష్టుడై ఆడును, వాయించును, జవముతో పరుగెత్తును. ఒకసారి నిలుచును, ఒకసారి కూర్చుండును, ఇంకొకసారి పరుండును. చింపిగుడ్డలు ధరించును, వీథులలో అనియతముగా బసచేయుచుండును. ఈ ఉన్మత్తుని గతిని క్రింది విధముగా అభినయించవలెను— నూపురపాదముతో నిలిచి, దండపాదమును చాచవలెను. బద్ధచారి నాచరించి, పాదములను స్వస్తికముగా ఉంచి, నాలుగు దిశలకును అట్లే తిరిగి, బాహ్య భ్రమరమండల మొనర్చి, పిమ్మట రంగమునం దొక కోణమును చేరవలెను. తరువాత త్రికమును త్రిప్పుచు లతాహస్తమును నిరూపించవలెను. హస్తములు పాదానుసారులు కాక విపరీతముగా ఉండవలెను.

### వికలాంగుల గతులు

కుహకాభినయార్థము (హాస్యరసాభినయమందు) వికలాంగులను అభినయించునప్పటి గతి మూడువిధములుగా ఉండును— ఖంజ (కుంటివాని) గతి, పంగు (సొట్టకలవాని) గతి, వామన (పొట్టివాని లేదా మరుగుజ్జువాని) గతి.

*కుంటివారు :* ఖంజగతియందు ఒకపాదము చలనములేనిదై, రెండవది అగ్రతల సంచరపాదమగును. చలనములేని పాదమును ఊతగాచేసి శరీరమును పైకెత్తుచుండవలెను. ఒకపాదమును ముందునకువేసి, దానిమీద నిలిచి, రెండవపాదమును ముందునకులాగి మొదటిపాదముప్రక్క నిలుపవలెను. ఇట్లు పాదమును తీసి పాదమును క్రమముగా వేయవలెను.

పాదతలమందు ముల్లుగ్రుచ్చుకొన్నప్పుడు లేదా గాయము తగిలినప్పుడును పై ఖంజగతినే ప్రయోగించవలెను.

*సొట్టవారు :* పంగుల గతియందు దేహము నిషణ్ణమును, జంఘలు నతములును కాగా ఒక పాదము అగ్రతల సంచరమును ఇంకొకటి అంచితమును కావలెను.

*వామనులు :* వామనుల గతియందు సర్వాంగములును సంకుచితములు కావలెను. విక్రమించుటకాని, చరణవిక్షేపముచేయుటకాని వారు చేయరాదు.*

*[కాశీ ముద్రణమునందు 13 వ అధ్యా—94-135 శ్లో ; బొంబాయి ముద్రణమునందు 12 వ అధ్యా—88-144 శ్లో; బరోడా ముద్రణమునందు 12 వ అధ్యా —96-136 శ్లో.]

### విదూషకుని గతి

ఇంక కుహకాభినయమందలి (హాస్యరసమందలి) విదూషకుని గతి. ఇందు పాదములను ఎత్తిఎత్తివేయుచు నవ్వుపుట్టించుచుండవలెను. ఈ విదూషకుని గతి మూడు విధములగు హాస్యములకు చెందియుండును—అంగకృత హాస్యము, కావ్య (వాక్య) కృతహాస్యము. నేపథ్యకృతహాస్యము.

పెద్దవగు ఎత్తుపళ్ళు, బట్టతల, గూని, కుంటి, వికృతాననము మొదలగునవి కలిగి విదూషకుడు రంగమునందు ప్రవేశించుట[21] వలన జనించెడి హాస్యము అంగకృతమగు హాస్యమగును. కొంగవలె ఉల్లోకిత-విలోకితముల నొనర్చుచు, పెద్దపెద్ద అంగలువేయుచు నడచుటవలన కూడ అంగకృత హాస్యమే జనించును. అసంబద్ధముగను, నిరర్థకముగను, వికృతముగను, అశ్లీలముగను మాటాడుట కావ్య (వాక్య) హాస్యమగును. చినిగినబట్టలను చర్మమును ధరించుట, మసి, భస్మము, జేగురు మొదలగువానిని పూసికొనుట మొదలగువానివలన నేపథ్యకృత హాస్యము జనించును.

రంగమందలి ప్రకృతుల భావ-కార్యములను అనుసరించి విదూషకుడు పై మూడు విధములగు హాస్యములలో ఒకటినికాని, అంతకు మించికాని ప్రయోగించవలెను[22]. విదూషకుని గతిప్రచారము ఆ యా అవస్థల ననుసరించి ఉండును. స్వభావగతియందు వామకరముచే కుటిలకమును (వంకరచేతి కఱ్ఱను) పట్టుకొని, దక్షిణ హస్తముచే చతుర హస్తమును ప్రదర్శించవలెను. ఒక పార్శ్వమును, హస్తమును, చరణమును శిరముతోకూడ లయ-తాలముల ననుసరించి పర్యాయముగా వంచుచుండవలెను—ఇది సహజ గతి. దీనికంటె భిన్నములైన గతులెల్ల వానికి అసహజములే అని తెలియవలెను. అలభ్యమైన భోజనము లభ్యమైనప్పుడు వాని గతి స్తబ్ధమగును.

---

21. 'ప్రవేశము' (రంగమునందు ప్రవేశించుట) అను పదముచే నాట్యమే రసమనియు, లోకము (లౌకిక విషయము) రసము కాజాలదనియు స్పష్టము చేయబడినది (లోకమునం దట్టివానిని చూచి మనము నవ్వుటకంటె ఎక్కువగా జాలినే పొందుదుము. కాని రంగమునందు అతడు మనకు హాస్యకారణ మగుచున్నాడు) [అభినవభారతి - 2 వ సం - పుట 159]

22. రంగమందున్న రాజ-అమాత్య-శ్రేష్ఠి ప్రభృతుల చిత్తవృత్తిని గ్రహించి, తదనుకూలముగా విదూషకుడు గతిని ప్రయోగించవలయును. రాజు నెదుట అశ్లీలభాషణములను చేయరాదు. ఇట్లే ఇతర విషయములందును గ్రహించవలెను [అభినవభారతి - 2 వ సం - పుట 160].



### అధములగు చేట - శకారాదుల గతులు

వివిధములగు శీలములుకల నీచుల, చేటాదుల గతియందు ఒక పార్శ్వము, చరణము, హస్తము శిరముతోపాటు వంచబడవలెను.

*చేటుడు* : చేటుని గతియందు దృష్టి అర్ధవిచారిణియై క్రిందికి ప్రసరించవలెను.

*శకారుడు* : ఇంక శకారుని గతి. ఇందు దేహము చంచలముగా ఉండవలెను. తన వస్త్రములను, ఆభరణములను మాటిమాటికిని చూచుకొనుచు, చేతితో స్పృశించుచు, వికారముగా ఊగించుచున్న అవయవములతో, వ్రేలాడుచున్న వస్త్ర-మాల్యములతో, చూర్ణ పదములతో శకారుడు[23] సగర్వముగా నడవవలెను.

*అస్పృశ్యులు* : జాతిచే నీచులైనవారు, అస్పృశ్యులగుటచే, తమ అవయవములను మరుగుపరచుకొనుచు, అటునిటు చూచుకొనుచు, నడవవలెను.

*పులింద-శబరాదులు* : పులింద-శబరాది మ్లేచ్ఛజాతులు ఆయా దేశముల కుచితములైన గతులను కలిగియుండవలెను.

### పశు-పక్ష్యాదుల గతులు

పక్షుల, క్రూరమృగముల, పశువుల గతులు ఆయా జాతుల స్వభావములను అనుసరించి ఉండవలెను. సింహ-ఋక్ష (ఎలుగుబంటి) - వానరముల గతులు విష్ణువు నరసింహరూపమును ధరించినప్పటి గతిని అనుసరించియుండవలెను[24]— ఆలీఢస్థానమందు నిల్చి, గాత్రము తదనుసారి కాగా, ఒక హస్తమును మోకాలిమీదను, రెండవ హస్తమును వక్షమునందును, గడ్డమును మూపుమీదను ఉంచి, దిశల నవలోకించుచు, మధ్యదూరము 5 తాలముల ఎడము ఉండునట్లుగా అడుగులు వేయుచు నడవవలెను. ఇంక శేషించిన జంతువుల గతి-స్థానములను అర్థానుసారముగా కల్పించవలెను.

### లోక ప్రామాణ్యము

ఇట్లు రంగప్రవేశమునందును, వాహనార్థప్రయోగములందును పై విధముగా

---

23. 'శ' కార బహుళమైన భాష కలవాడు శకారు డనబడును. హీనాశయుడయ్యును ఉత్తమ పదవియందు నిల్పబడినవాడు శకారు డనబడునని కొంద రందురు. ప్రతిజ్ఞాచాణక్యమందు మహాకవి యగు భీముడు రాజైన వింధ్యకేతువును 'శకారు' డని వ్యవహరించెను [అభినవభారతి - 2 వ సం - పుట 161].

24. జాంబవత్-సుగ్రీవ-అంగద-హనుమదాది ఋక్ష-వానరగతులు మాత్రమే పై నరసింహగతివలెనుండవలెను. తక్కినవాని గతులు స్వజాత్యనురూపముగానే ఉండవలయును. [అభినవభారతి - 2 వ సం - పుట 162]

గతులను ప్రయోగించవలెను. ఇచ్చట నేను చెప్పక విడిచిన గతులనన్నింటిని లోకము నుండి గ్రహించవలయును.*

### స్త్రీల స్థానకములు

ఇంక స్త్రీలగతులను, చేష్టలను వివరింతును. గతి-సంభాషణములందు స్త్రీలు మూడువిధములుగా నిలుచుందురు— ఆయతము, అవహిత్థము, అశ్వక్రాంతము.

1. ఆయత స్థానము—వామపాదమును సహజముగాను సమముగాను ఉంచి, ఒక తాలము దూరములో దక్షిణపాదమును త్ర్యశ్రముగా ప్రక్కకు ఉంచవలెను. ముఖము ప్రసన్నముగను, ఉరము సమముగాను సమున్నతముగను ఉండగా లతా హస్తములను నితంబప్రదేశము మీదనుంచుట 'ఆయత స్థాన' మనబడును. ప్రథమరంగ ప్రవేశము, పుష్పాంజలిని వెదజల్లుట, మన్మథేర్ష్యాజన్యమగు కోపము, చూపుడు వ్రేలిని నలుపుట, నిషేధించుట, గర్వము, గాంభీర్యము, మానము, మౌనమునవలంబించుట, దిక్కులను నిర్దేశించుట అనువానియందు స్త్రీలీ ఆయతస్థాన మందు నిలువవలెను[25].

2. అవహిత్థస్థానము— ఒక త్ర్యశ్రపాదము ముందునకు చలింపగా, రెండవ సమపాదము వెనుకకురాగా ఆ రెండు పాదముల మధ్యదూరము ఒకతాలము ఉండవలెను. ఒకటి లతాహస్తమును. రెండవది నితంబ ప్రదేశగతమును కాగా త్రికము కొంచెము ఉన్నతమగుట 'అవహిత్థస్థాన' మనబడునని ఆగమ భూషణు

*[కాశీముద్రణమునందు 13 వ అధ్యా—135-157 శ్లో; బొంబాయిముద్రణమునందు 12 వ అధ్యా—115-119 శ్లో; బరోడా ముద్రణమునందు 12 వఅధ్యా—137-159 శ్లో].

25. 'ఆయత' మనునది స్త్రీల 'స్థానక' మని కొందరందురు. రంగావతరణారంభ సమయమున పురుషులు కూడ దీనిని ప్రయోగింతురని మరికొందరందురు. ఈ స్థానక నిర్వచన-వినియోగములకు పాఠాంతరములు కూడ కలవు. ఈ పాఠాంతరములను భోజదేవుడు స్వీకరించెను. అసలు పాఠములను జాయ సేనాపతి-శార్ఙ్గదేవ-కుంభకర్ణులు స్వీకరించియున్నారు. [శ్రీ మా. రామకృష్ణకవిగారి అధస్సూచికలు - పుట 163] డా. మనోమోహన్ ఘోష్ కూడ భోజదేవుని పాఠములనే అనుసరించెను. భోజదేవుడు స్వీకరించిన ఆయతస్థాన పాఠాంతరము—"ఆయత స్థానమందు దక్షిణపాదము సమమును, రెండవ పాదము త్ర్యశ్రమును పక్షస్థితమునుకాగా వామకటి సమున్నతము అగును. ఆవాహన-విసర్జన-నిర్వర్ణన-చింతా-అవహిత్థలందు ఈ స్థానము ప్రయుక్తమగును" [బరోడా ముద్రణమునందు - 163-165 శ్లో.] పురుషుల స్థానకములు 10 వ అధ్యాయమందు వివరింపబడెను.



లందురు. శృంగారమందలి విలాస-లీలా-బిబ్బోకములను నిరూపించునప్పుడును, భర్తృమార్గమును ప్రతీక్షించునపుడును స్త్రీలు ఈ స్థానమును ప్రయోగించవలెను.[26]

3. అశ్వక్రాంత స్థానము— ఒకపాదము సమస్థితమును (సముత్థితమును-కాశీపాఠము,) రెండవది అగ్రతలాంచితమును కాగా సూచీచారిని లేదా ఆవిద్ధ చారిని ఆచరించుటకు సిద్ధముగానుండుట 'అశ్వక్రాంతస్థాన' మనబడును. తొట్రుపాటు, తిరుగుడువడుట, జారిన బట్టను సరిచేసికొనుట, పూలగుత్తులను కోయుట, పరిరక్షించుట, భయపడుట, లలితముగా తరుశాఖల నవలంబించి నిలుచుట మొదలగు వానిని నిరూపించుటయందు స్త్రీలీ అవహిత్థస్థానమును ప్రయోగించవలయును.

*స్థానక ప్రయోగ నియమము :* చేష్టప్రారంభమగువరకును స్థానకమునందు నిలువవలెను. నృత్తమందు చారీప్రయోగము ఆరంభము కాగానే స్థానకమును విడువవలెను. స్థానవిషయమున స్త్రీ - పురుషు లిరువురును ఈ విధినే పాటించవలెను.

### స్త్రీల రంగపీఠ పరిక్రమము

ఇంక ప్రకృత్యుచితములగు స్త్రీల గతి విశేషములను వివరింతును—

*యౌవనవతులు :* అవహిత్థస్థానమందు నిలిచి, వామహస్తమును అధోముఖమును చేసి, కటకాముఖ దక్షిణహస్తమును నాభిప్రదేశమునందుంచవలెను. తాలమాత్రము పై కెత్తబడిన దక్షిణపాదమును వామపాదముయొక్క బాహ్యాపార్శ్వమునందు అనగా చిటికెనవ్రేలి యొద్ద లలితముగా నిలుపవలెను. అదేకాలమందు దక్షిణపార్శ్వమును కొంచెము వంచి, లతాఖ్య వామహస్తమును నాభిప్రదేశమందును, దక్షిణహస్తమును నితంబమునందును ఉంచవలెను. వామహస్తముచే ఉద్వేష్టనమొనరించి, వామపాదమును ముందునకు వేయవలెను. తరువాత దక్షిణ హస్తమును లతాహస్తముగా ఉంచవలెను. అప్పుడు కొంచెమువంగిన గాత్రముతో, ఉద్వాహితమగు శిరముతో సవిలాసముగా 5 అడుగులు వేయవలెను (పంచపదీ గమనము).

26. అవహిత్థస్థాన పాఠాంతరము— "వామపాదము సమమును, దక్షిణపాదము త్ర్యశ్రమును పక్షస్థితమును, వామకటి సమున్నతమును అగుట 'అవహిత్థస్థాన' మనబడును. సహజసల్లాపము, నిశ్చయము, సంతోషము, లజ్జ, వితర్కము మొదలగువానిని నిరూపించుటయందు స్త్రీలీస్థానమును గ్రహించవలెను". [బరోడా ముద్రణమునందు - 167-168; 171-172 శ్లో.]

10 వ అధ్యాయమందు చెప్పబడిన పురుషుల స్థానకములు, ఇచ్చట చెప్పబడిన స్త్రీల స్థానకములును విగ్రహశిల్పమునకు చక్కని నమూనాలు (models) కాగలవు. విష్ణుధర్మోత్తర పురాణము "నృత్త-సంగీత-చిత్రలేఖనములు పరస్పరము ఆధారపడియున్న" వని కంఠోక్తిగా చెప్పుట గమనార్హము.

రంగపీఠ పరిక్రమమందు పురుషులకు చెప్పబడిన విధినే ప్రమదల విషయమున కూడ అనుసరించవలెను. కాని, స్త్రీల పాద ప్రచారమునకు 6 కలల లేదా 8 కలల కాలము పట్టరాదు (అనగా 4 కలల కాలమును మించరాదు); అట్లు ఎక్కువ కాలము పట్టినచో వారికి ఖేదముకలుగును. ఇది యౌవనవతుల గతిప్రచారము.

*స్థానీయలు* : ఇంక స్థానీయల (మధ్య వయస్కల; 'స్థవీయసుల=వృద్ధస్త్రీల' అని కాశీముద్రణ పాఠము) గతిని వివరింతును——అవహిత్థ స్థానమందు నిలిచి, వామ హస్తమును కటి మీదను, దక్షిణ అరాల హస్తమును నాభి-స్తన మధ్యభాగమందును ఉత్తానముగ ఉంచవలెను. శరీరము నిషణ్ణము కాని స్తబ్ధము కాని పరివాహితము కాని కారాదు.

*ప్రేష్యలు* : ప్రేష్యల (దాసీలు లేదా దూతికలు) గతి మదవికార సహిత ముగా ఉండవలెను. అవహిత్థ స్థానమందు నిల్చి, వామ హస్తమును అధోముఖ ముగా చేసి, కటకాముఖ దక్షిణహస్తమును నాభిప్రదేశమందుంచి. కొంచెము ఎత్తబడిన అవయవములతో చేతులు త్రిప్పుకొనుచు నడవవలెను.

*అర్ధనారి* : అర్ధనారీ గతి స్త్రీ-పురుష గతుల సమ్మేళనము కలిగినది కావలయును. పురుషుల గతియందలి ఉదాత్తతను, స్త్రీల గతియందలి లాలిత్య మును అంగములందు చూపుచు విలాసముగా వారు నడవవలెను.

*తాల-కలా ప్రమాణము* : ఉత్తమస్త్రీల గతి చతుస్తాల-చతుష్కలాయుతము కాగా అనుత్తమ (మధ్యమ) స్త్రీల గతి ద్వితాల-ద్వికలా సంయుతముగా ఉండును. ఇంక వారి యొద్ద పనిచేసెడి స్త్రీల, కాపురుషుల గతి ఏకతాల-ఏకకలాయుతము కావలయును. అనగా ఉత్తమ-మధ్యమ-అధమ పురుషుల విషయమున చెప్పబడిన గతిచేష్టితములనే క్రమముగా ఉత్తమ-మధ్యమ-అధమ స్త్రీల విషయమున కూడ ప్రయోగించవలెను; కాని, స్త్రీల పదవిక్రమము మాత్రము లలితముగా ఉండవలె ననుట మరవగాదు.*

*పులింద-శబరాంగనలు* : జాతిచే హీనలైన పులింద-శబరాంగనల గతులు తత్తజ్జాతి సహజములుగా ఉండవలెను.

*శాంతస్వభావలు* : నియమవతులు, తపస్వినులు, లింగధారిణులు, స్వస్థలును (ఆకాశమందున్న వారు లేదా స్థిమితముగా ఉన్నవారు) అగు స్త్రీల గతి సమపాద చారీసంయుతము కావలయును.

*[కాశీముద్రణమునందు 13వ అధ్యా—157-184 శ్లో; బొంబాయి ముద్రణమునందు 12 వ అధ్యా—120-148 శ్లో; బరోడా ముద్రణమునందు 12 వ అధ్యా—159-198 శ్లో.]



**బాలుర గతి**

బాలుర గతి స్వచ్ఛందముగా ఉండవలెను. వారి గతియందు సౌష్ఠవమును, ప్రమాణమును పాటింప నక్కరలేదు.

**నపుంసక గతి**

తృతీయప్రకృతి నపుంసకప్రకృతి అనబడును. కావున, నపుంసకులు పురుష స్వభావమును విడిచిపెట్టి స్త్రీ గతినే ప్రయోగించవలెను.

**ప్రకృతి విరుద్ధమగు భూమికాధారణము**

పురుష-స్త్రీ-నపుంసకులు స్వప్రకృతి విరుద్ధములగు పాత్రలను ధరించవలసి వచ్చినప్పుడు తమతమ స్వభావములను విడిచి క్రొత్తగా ఏ రూపములను ధరింతురో ఆ రూపముల కుచితములైన భావములనే ప్రదర్శించవలయును. ఏదేని వ్యాజముచే కాని, క్రీడార్థముకాని, వంచనముకొరకుకాని స్త్రీ పురుష ప్రకృతిని; పురుషుడు స్త్రీ ప్రకృతిని, స్త్రీ-పురుషులు నపుంసక ప్రకృతులను, నపుంసకులు స్త్రీ-పురుషల ప్రకృతులను అభినయించవలసియుండును. అప్పట్ల పురుషుని ధైర్య-ఔదార్యాది భావములను, చిత్తవృత్తులను, సాత్త్విక భావములను, చేష్టలను, వేషమును, పలుకు లను (సంస్కృత భాషను) స్త్రీ ప్రదర్శించవలెను; ఇంక పురుషుడు స్త్రీ సహజము లగు వేష-భాషలతోను, చూచీ చూడని చూపులతోను, సవిలాసమగు మందగతి తోను స్త్రీ ప్రకృతిని అభినయించవలెను[27].

నాట్య ప్రయోగజ్ఞుడు ఉద్ధతములగు అంగహారములను, చారులను, మండల ములను స్త్రీల గతుల విషయమున ప్రయోగించరాదు.

**ఉపవేశన విధి (కూర్చుండు పద్ధతులు)**

ఇంక స్త్రీ-పురుషుల ఆసన-శయన విధులను ఆయా భావముల కనుగుణ ముగా ప్రయోగించవలెను——

27. రూపక ప్రదర్శన సమయములో, కథావశమున స్త్రీ ప్రకృతి పురుష ప్రకృతిని, పురుష ప్రకృతి స్త్రీ ప్రకృతిని ధరించవలసి వచ్చినప్పుడు ఏమిచేయవలెననెడి ప్రశ్నకు సంబం ధించిన విషయ మిదియని తెలియవలెను. ఇంక లౌకికులగు నటులలో, అనురూపనటుల కొరతవలన, స్త్రీ పురుషభూమికను, పురుషుడు స్త్రీభూమికను ధరించవలసి వచ్చినప్పుడు ఏమిచేయవలెను అనెడి విషయము 26 వ అధ్యాయమందు వివరింపబడును.

వ్యాజము = ఏదేని కార్యమును సాధించుటయందలి మిష (సంకేతస్థానమందు విదూషకుడు చేటి కావస్త్రధారణము చేయుట మొదలగునవి); క్రీడ=నాయికలు ఇష్టజనుల ఆకృతులను ధరించుట; వంచనము=విదూషకుని వంచించుటకొరకు చేటుడు స్త్రీ వేష మును ధరించుట మొదలగునవి. [అభినవభారతి-2వ సం-పుట 168]

వైశాఖ స్థానమున కుచితములైన అంచిత పాదములను, కొంచెము ఉన్నతమైన త్రికమును కలిగి ఒక హస్తమును కటియందును, రెండవ హస్తమును తొడమీదను ఉంచి కూర్చుండుట స్వస్థమైన ఉపవేశనమగును.

చింతయందు ఒక పాదమును కొంచెము చాచి, రెండవపాదమును ఆసనమునందుంచి, శిరమును ఒక పార్శ్వమునకు వంచి కూర్చుండవలెను.

శోకమునందు గడ్డమును రెండుచేతులయందుంచి, శిరమును మూపుమీద వాల్చి, నిర్వ్యాపారములైన ఇంద్రియములను మనస్సును కలిగి కూర్చుండవలెను.

మూర్ఛా-మద-గ్లాని-శ్రమ-విషాదములందు బాహువులను వదులుగాచాచి, దేనికైన చేరబడి కూర్చుండవలెను.

వ్యాధి-వ్రీడా-నిద్రా-ధ్యానములందు పాదముల, జానువులమధ్య సర్వాంగములను పిండీకృతముచేసి కూర్చుండవలెను.

శ్రాద్ధకాల-పితృతర్పణ-జప - సంధ్యావందన-ఆచమనముల యందు పిరుదులును, మడమలును కలియునట్లుగా కూర్చుండవలెను (గొంతు కూర్చుండుట).

ప్రియురాలిని ప్రసన్నము చేసికొనుట, హోమాదుల నొనర్చుటఅనువానియందు పై ఉపవేశనమందలి ఒక జానువును చాచి భూమిమీదనుంచి, రెండవ జానువును యథాస్థితముగా ఉంచవలెను.

దేవతావందనము, కోపించినవారిని ప్రసన్నము చేసికొనుట, అధములు శోకమునందు గట్టిగా ఏడ్చుట, అధములు చనిపోయినవారిని చూచుట, అధములు నక్కలు మొదలగువానివలన భయపడుట, అధములు యాచించుట, హోమ-యజ్ఞక్రియలు, ప్రేష్యలు కూర్చుండుట అనువానియందు రెండు జానువులను భూమిమీద ఉంచి, అధోముఖముగా కూర్చుండవలెను.

మునుల యొక్క నియమములందుకూడ పై విధమగు ఉపవేశనవిధినే పరిగ్రహించవలెను.

**ఆసన విధి**

ఇంక నాటకమునందు స్త్రీ-పురుషులు కూర్చుండుట కుపయోగించు ఆసనభేదములను **(seats)** వివరింతును. బాహ్య-అభ్యంతర భేదములచే ఆసన విధి రెండు విధములు, బాహ్య మనగా సర్వజనసాధారణమైనది; అభ్యంతర మనగా రాజోచితమైనది.

*అభ్యంతరాసన విధి:* రాజసభకు చెందిన పురుషుల ఆసనములు—దేవతలకును, రాజులకును సింహాసనములను; పురోహితులకును, అమాత్యులకును వేత్రాసనములను



(ప్రేముతో చేయబడినవి); యువరాజునకును, సేనాపతికిని ముండాసనములను (చాతురీనిర్మితములు); బ్రాహ్మణులకు కాష్ఠాసనములను (కఱ్ఱతో చేయబడినవి); రాజకుమారులకు కుథాసనములను (రత్నకంబళులు) ఉపయోగించవలెను.

స్త్రీల ఆసనములు—రాజ్ఞికి సింహాసనమును; ఇతర దేవులకు ముండాసనమును; పురోహిత-అమాత్యుల పత్నులకు వేత్రాసనములను; భోగినులకు[28] వస్త్ర-చర్మ-కుథాసనములలో దేనినైనను; బ్రాహ్మణస్త్రీలకును, తాపసస్త్రీలకును పట్టాసనములను, వేశ్యలకు మసూరకాసనములను (వస్తుశూన్యములైనవి అనగా 'కుషన్సు') ఉపయోగించవలెను. ఇంక తక్కినస్త్రీలు భూమిమీదనే కూర్చుండవలెను.

*బాహ్యాసన విధి :* స్వగృహమందు, సంభాషించు సమయమున, తమకు నచ్చిన ఆసనములను పరిగ్రహించవచ్చును. మునుల ఆసనములు ఆయా నియమములననుసరించియు, లింగస్థుల (శైవ-క్షపణకాదుల) ఆసనములు వారి వారి వ్రతములననుసరించియు ఉండవలెను[29]. హోమ - యజ్ఞకార్య - పితృ కార్యాదులందు బ్రుసీ (కుశలతో చేయబడినది) - ముండాసన - వేత్రాసనములలో ఏదేని ఒక దానిని ఉపయోగించవలెను.

కుల-విద్యా సమన్వితులగు స్థానిక పురుషులకు రాజు ఈ క్రింది విధముగా ఆసనసత్కారమును చేయవలెను—కులమునందును, విద్యయందును తనతో సమానులైనవారికి సమాసనమును (తన ఆసనముతో సమానమైన ఆసనమును), మధ్యములకు మధ్యమాసనములను, అధికులకు ఉన్నతాసనములను, హీనులకు భూమ్యాసనములను ఒసంగవలెను. ఉపాధ్యాయుల, రాజుల, గురువులఎదుట బుధుడు నేలమీద కాని, కాష్ఠాసనమందు కాని కూర్చుండవలెను. కాని పడవలోను, ఏనుగుమీదను, రథముమీదను కూర్చుండునపుడు భూమిమీద కాని, కాష్ఠాసనమందు కాని గురు-నృపతి-ఉపాధ్యాయులతో కలిసి సమానముగా కూర్చుండుట దోషముకాదు.

**శయన విధి (శయనించు పద్ధతులు)**

ఆకుంచిత - సమ - ప్రసారిత-వివర్తన-ఉద్వాహిత-నతములనెడి భేదములచే శయనకర్మ ఆరువిధములు.

---

28. ఇతరదేవులనగా రాజువివాహమాడిన సేనాపతిప్రభృతుల పుత్రికలు. భోగినులనగా సంగృహీత కన్యలు. [అభినవభారతి - 2 వ సం - పుట 172] 24 వ అధ్యా. చూడవలెను.

29. స్వగృహమందు సంభాషించుట అనగా సేనాపతి అమాత్యగృహమునకు వచ్చుట మొదలగు సన్నివేశములందని అర్థము. మునులలో కొందరు అంగవిష్టరమును, కొందరు మృగాజినమును ఉపయోగింతురు. లింగస్థులలో శాక్యులు బ్రుసిని, శైవులు ముండాసనమును, క్షపణకులు వేత్ర-వల్కల-డింబకాసనములను ఉపయోగింతురు. [అభినవ భారతి - 2 వ సం - పుట 173]

1. ఆకుంచితము— అవయవములనన్నింటిని ముడుచుకొని, మోకాళ్ళను శయ్యమీద ఆన్చి శయనించుట 'ఆకుంచితశయన' మనబడును. ఇది చలిచే పీడింపబడు వారిచే ప్రయుక్తమగును.

2. సమము— ముఖమును వెలికిలగాఉంచి, చేతులను వదులుగా చాచి శయనించుట 'సమశయన' మనబడును. సుఖసుప్తియందున్న వారిట్లు శయనింతురు.

3. ప్రసారితము— ఒక భుజమును తలగడగానుంచుకొని, మోకాళ్ళను చాచుకొని శయనించుట 'ప్రసారితశయన' మనబడును. ఇదియును సుఖసుప్తియందలి పద్ధతియే.

4. వివర్తితము—బోరగిల్లబడి శయనించుట 'వివర్తితశయన' మనబడును. శస్త్రక్షతులు, మృతులు, వాంతిచేసికొను వారు, మత్తులు, ఉన్మత్తులు మొదలగు వారు ఈ విధముగా శయనింతురు.

5. ఉద్వాహితము—శిరమును మూపుపై ఉంచి, మోచేతులను ఆడించుచు శయనించుట 'ఉద్వాహితశయన' మనబడును. ప్రభువుల విలాసవాక్యములం దిది ప్రయుక్తమగును.

6. నతము— జంఘలను కొంచెముగా చాచి, హస్తములను వదులుగా పడవేసి శయనించుట 'నతశయన' మనబడును. ఆలస్య-శ్రమ-ఖేదములందు ఇది ప్రయుక్తమగును.

### లోక ప్రామాణ్యము

ఇంతవరకును గతి ప్రచారమును వివరించితిని. నే నిందు చెప్పక విడిచిన వానిని ప్రయోగానుసారముగా లోకమునుండి సాధించుకొనవలయును. ఇంక రంగ పరిక్రమమునకు సంబంధించిన కక్ష్యాంతర సంవిధానమును వివరింతును. (అనగా తరువాతి అధ్యాయమందు చెప్పబడు కక్ష్యావిశేషవిభాగము గతిప్రచారోపయోగి అని తెలియవలెను.)*

ద్వాదశాధ్యాయము సమాప్తము

---

*[ కాశీముద్రణమునందు 13 వ అధ్యా—184-226 శ్లో; బొంబాయిముద్రణమునందు 12 వ అధ్యా—147-187 శ్లో ; బరోడా ముద్రణమునందు 12 వ అధ్యా—193-236 శ్లో]



## విశేషాంశములు

### 1. 12 వ అధ్యాయము : పాఠాంతరము

ఈ ద్వాదశాధ్యాయ మంతయును రెండు మాతృకములలో భిన్నవిధముగా ఉన్నదట. దానినంతటిని బరోడా ముద్రణమునందు ఈ అధ్యాయమునకు అనుబంధముగా ముద్రించినారు. అందులో శ్లోక సంఖ్యయును, కొన్నిచోట్ల క్రమముకూడను భిన్నములుగా ఉన్నవి; చాలవరకు వరుసలో సంవాదము కలదు. దీని చివర ఒక శ్లోక మీ క్రింది విధముగా ఉన్నది-

వయోఽనురూపః ప్రథమస్తు వేషో వేషానురూపేణ గతిప్రచారః ।
గతిప్రచారానుగతం చ పాఠ్యం పాఠ్యానురూపోఽభినయశ్చ కార్యః ॥ 247

—ప్రప్రథమముగా వేషము వయస్సునకు అనురూపముగా (తగినదిగా) ఉండవలెను. పిమ్మట వేషమునకు అనురూపమైన గతిప్రచారము ఉండవలెను; పాఠ్యము ఈ గతిప్రచారానుగతముగా ఉండవలెను; ఇంక అభినయము ఈపాఠ్యమునకు అనురూపముగా ఉండవలెను.

పై శ్లోకము నటనము (acting) యొక్క సారమును తెలుపుచున్నది; లేదా ఈ శ్లోకము నాట్యశాస్త్ర సారమును ప్రతిపాదించుచున్నదని చెప్పనొప్పును. ఈ శ్లోకము 13 వ అధ్యాయమందు కూడ కలదు; కాని, అచ్చటను ఇది ప్రక్షిప్తముగానే తలంపబడినది. (13 వ అధ్యా-21 వ విశేషాంశమును చూడవలెను.) ఇంత ప్రశస్తమైన శ్లోకము అభినవగుప్తుని దృష్టినుండి తప్పిపోవుట ఆశ్చర్యకరముగా ఉన్నది.

### 2, అభినయము : గతిప్రచారము

అభినయములనెడి ప్రాతిపదికపై భరతుడు మొత్తము నాట్యశాస్త్రమును నాలుగు భాగములుగా విభజించెనని చెప్పవచ్చును. సామాజికునియందు రసనిష్పత్తి జరుగుటకు ఈ అభినయములే సాధనములగుచున్నవను సత్యమును గుర్తించిఉన్నాము. ఈ అభినయములలో ముఖ్యమైన సాత్త్వికాభినయము 6, 7 అధ్యాయములందు వివరింపబడినది. ఇంకను శేషించినది 22 వ అధ్యాయమందు (సామాన్యాభినయమందు) వివరింపబడును. మనస్సులోని భావమును చెప్పుటకు సాధనములు రెండున్నవి—ఒకటి అంగవిక్షేపము (gestures); రెండు వాక్కు. అందుచే సాత్త్వికాభినయము తరువాత ఆంగికాభినయమును (8-13 అధ్యా), అటుపిమ్మట వాచికాభినయమును (14-20 అధ్యా) వివరింపబడుచున్నవి. పిమ్మట ఆహార్యాభినయమును తదితరాంశములును, అటుపిమ్మట నాట్యమునకు రంజకత్వమును ఆపాదించు సంగీతాదులును వివరింపబడును.

గతిప్రచారము ఆంగికాభినయమునకు సంబంధించినది. చారీ-మండలాధ్యాయములు నిజమునకు నృత్తమునకు సంబంధించినవనియు, యుద్ధాదులను రంగముమీద ప్రదర్శించవలసి వచ్చినప్పుడు చారీ-మండలములు నాట్యమందుపయుక్తములగుననియు గుర్తించియున్నాము. చారీ-మండలములు నృత్తమున కెంత ముఖ్యములో గతిప్రచారము నాట్యమున కంత ముఖ్యము. స్త్రీపురుషులెల్ల ఉత్తమమధ్యమాధమ ప్రకృతులుగా ఉందురు; వారు సుఖ-దుఃఖముల ననుభవించుచుందురు. దేశ-కాల-భేదములను బట్టి వారి ఆచారసంప్రదాయములు

కట్టుబొట్లు మారుచుండును. కావున, ఆయా పాత్రల గతిప్రచారములు (నడకలు) పైఅంశములకనుగుణములుగా ఉండవలెను. ఏ పాత్ర, ఏ అవస్థలో, ఎచ్చట, ఏ విధముగా నడవవలెను, కూర్చుండవలెను, శయనించవలెను అను విషయములు ఈ అధ్యాయమందు చాల విపులముగా వివరింపబడినవి. అయినను లోకమునుండి గ్రహించవలసినవి ఇంకను అనేకములు కలవు. ఈ విషయమును భరతుడే నిర్దేశించెను.

ఇచ్చట ఇంకొక విషయమును కూడ గుర్తించవలెను. గతిప్రచారమనగా ఒక్క పాదములకు సంబంధించినది మాత్రమే అని తలంచరాదు. ఏదేని ఒక అవస్థ లో ఒకపాత్ర ఉన్నప్పుడు ఆ పాత్ర నడకలో శిరో-హస్తాదులు స్తబ్ధములుగా ఉండుట సంభవించదు. ఏ యే అవస్థలలో, లేదా ఏ యే అర్థములను నిరూపించుటలో ఏ యే శిరో-హస్తాదులు ప్రయోగింపబడవలెనో భరతుడు విపులముగా వివరించియుండెను. వాటినెల్ల ఈ 12 వ అధ్యాయమునందు అన్వయించుకొనవలసి ఉన్నది. ఉదా: వీరరసమందలి గతి ఇందు చెప్పబడినది. ఈ సందర్భమున కంపితశిరము, వీర-దృష్ట్యదృష్టులు, వలనతార, ప్రసృతపుటము, భ్రుకుటి, వికృష్టనాసిక, పూర్ణగండము మొదలైనవి ప్రయుక్తములు కావలెను. ఇట్లే ఇతర సందర్భములందును భావించుకొనవలెను.

### 3. విదూషకాదులు

ఈ అధ్యాయమందు విదూషకుని రూపమును, వాని గతియును చెప్పబడినవి. 22 వ అధ్యాయమందు అతడుపయోగించు దండకాష్ఠ లక్షణము చెప్పబడును. 35 వ అధ్యాయమందు (భూమికావికల్పము) మరల వాని స్వరూపమును గుణములును చెప్పబడును. సంస్కృత రూపకములందు, ముఖ్యముగా శృంగారరస ప్రధానములైనవానియందు విదూషకుడు కన్పట్టుచుండును. ఈతడు జాతిచే బ్రాహ్మణుడు. అంతయో ఇంతయో చదివినవాడే. శృంగార వ్యాపారములందు నాయకునకు సహాయుడుగా ఉండును. సంస్కృతరూపకములందు విదూషకుడు ముఖ్యమైనహాస్యపాత్ర. "The Vidushaka: Theory and Practice" (1953) అను చిన్న గ్రంథములో శ్రీ జె. టి. పరీఖ్ విదూషకునిగూర్చి విపులముగా చర్చించెను.

శకారాదు లేయే భాషలను మాటాడుదురో 17 వ అధ్యాయమందు చెప్పబడినది. మృచ్ఛకటికలోని శకారపాత్ర సుప్రసిద్ధమైనదే కదా. ఇతడును హాస్యపాత్రయే.

### 4. లోకప్రామాణ్యము : నాట్యాచార్య ప్రామాణ్యము

ఉత్తముల లేదా ఉత్తమనాట్యమందలి హస్తప్రచారము అల్పముగా ఉండవలెననియు, అధముల లేదా అధమ నాట్యమందలి హస్తప్రచారము ప్రకీర్ణముగా లేదా అధికముగా ఉండుననియు భరతుడు 9 వ అధ్యాయమందు చెప్పెను. ఈ నిర్దేశము లోకానుగుణముగా ఉన్నది. ఏ విషయమందైనను అధములు చేతులు త్రిప్పుచు, శరీరమును ఊగులాడించుచు ఉందురు. కాని ఉత్తములైనవారు గంభీరులై ఒకచిరునవ్వుతో, ఒకకనుసైగతో, ఒక చిన్న శిరఃకంపముతో తమ భావములనెల్ల వ్యక్తము చేయుచుందురు. 'నిండుకుండ తొణక' దను సామెత మనమెరిగినదియేకదా. నాట్యము లోకమునే అనుసరించవలెనని



భరతుని ఆశయము. నాట్యశాస్త్రమందు భరతుడు మాటిమాటికిని లోకమును గుర్తునకు తెచ్చుచుండునని తెలిపియున్నాను. ఉదా: "ఇచ్చట నేను చెప్పక విడిచినవానిని ప్రయోగానుసారముగా లోకమునుండి గ్రహించవలెను" అని ఈ అధ్యాయమందే రెండుసార్లు చెప్పుట గమనార్హము. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి క్రింది వాక్యములను పరిశీలించవలెను—"Bharata seems to have rejected much of Nandin's technique and accepted only such forms as are really found in actual life or just to suit the theatrical conventions which he calls Natya-Dharmi......So the standpoint of Bharata makes him reject much of the technical side of sangita and nṛtya." [బరోడా ముద్రణ పీఠిక - 2 వ సం - పుట vi].

నృత్త-నృత్యముల విషయమున నాట్యాచార్యుని ప్రాముఖ్య మెట్టిదో 4 వ అధ్యాయమందు వివరింపబడినది. నృత్త-నృత్యములందలి ఈ నాట్యాచార్యుడును, నాట్యమందలి సూత్రధారుడును ఇంచుమించుగా ఒకరే. ఈసూత్రధారుని మనము నేడు 'డరెక్టర్' (Derector = దర్శకుడు) అనుచున్నాము. సూత్రధారగుణాదులు 26వ, 35వ అధ్యాయములందు వివరింపబడును. నాట్యసిద్ధి అంతయును సూత్రధారుని శక్తిమీదనే ఆధారపడి ఉండునని మరవరాదు.

# అధ్యాయము 13[1]

## కక్ష్యావిభాగము, ప్రవృత్తి, ధర్మి[2]

[కాశీ ముద్రణమునందు 14 వ అధ్యా— 83 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 13 వ అధ్యా— 79 శ్లోకములును; బరోడా. ముద్రణమునందు 13 వ అధ్యా— 87 శ్లోకములును కలవు.]

### కక్ష్యావిభాగము

2 వ అధ్యాయమందు వివరింపబడిన మూడు విధములగు నాట్యమండపముల విభాగముల నెరింగి, రంగపీఠములందు కక్ష్యలను పర్వరచవలయును.[3] నేపథ్య గృహముయొక్క గోడలోని రెండు ద్వారముల మధ్యభాగమందు భాండ వాద్యములను ఉంచవలెను. పిమ్మట రంగపీఠ పరిక్రమముచే కక్ష్యావిభాగమును నిర్దేశించ వలయును.[4] ఒక కక్ష్యనుండికదలి ఈవలకు వచ్చినచో ఇంకొక కక్ష్యలోనికి వచ్చి

1. ఈ భాగము కాశీ ముద్రణమునందు చతుర్దశాధ్యాయము. బొంబాయి-బరోడా ముద్రణములందు త్రయోదశాధ్యాయమే.

2. 'ప్రవృత్తి ధర్మవ్యంజకము' అనునది కాశీ ముద్రణ పాఠము; 'కరయుక్తి ధర్మ వ్యంజకము'—బొంబాయి ముద్రణ పాఠము; 'కక్ష్యాప్రవృత్తి ధర్మవ్యంజకము' —బరోడా ముద్రణ పాఠము; కక్ష్యావృత్తి ధర్మ్యభిధానము'—అభినవభారతీ పాఠము.

3. కొన్ని వ్రాతప్రతులలో 'కక్ష' అను శబ్దమే ఉన్నప్పటికిని మరికొన్ని వ్రాత ప్రతులందును, అమరకోశాదులందును 'కక్ష్య' అను శబ్దమే ఉండుటచేత దీనినే గ్రహించినట్లు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు తెలిపినారు.

నడచుచున్న ప్రదేశమును బట్టి గతి వివిధములుగా ఉండును. జల-స్థల-సమ-విషమాది భేదములతో ప్రదేశము అనేక విధములుగా ఉండును; అట్టి ప్రదేశ విభాగమును కవి కావ్యమునందు పాత్రల మాటలచేతను, తన సూచనలచేతను నిర్దేశించుచుండును. మరి వాటిని ప్రయోగస్థానమందు అనగా రంగస్థలమునందు చూపుటకూడ ఆవశ్యకమై ఉన్నది. కాని, అట్లు ఆవశ్యకములైన ప్రాసాద-పర్వత-సముద్రాదులను రంగస్థలముమీద యథార్థముగా చూపుటకు వీలుపడదు. కావున, అట్టి వాటిని సూచించుటకు కక్ష్యావిభాగము ఆవశ్యక మగుచున్నది. ఒక కక్ష్యనుండి మరియొక కక్ష్యలోనికి వచ్చినచో నిర్దిష్టమైన ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు వచ్చినట్లు భావించుకొనవలయును. కక్ష్య అనగా గత్యుపయోగి అయిన స్థానవిశేషమని సారాంశము [అభినవభారతి-2 వ సం - పుట 197].

4. రెండు ద్వారములకును మధ్యభాగమందు భాండము లుంచబడును. దానికి వామ-దక్షిణ భాగములందు కుతప విన్యాసము జరుగును [5 వ అధ్యాయమందలి 6 వ అధస్సూచికలోని పటమును చూడవలెను]. ఇంక తక్కిన రంగపీఠమును కక్ష్యలుగా విభజించు



నట్లు అగును. గృహములు, నగరములు, ఉద్యానవనములు, ఆరామములు, నదులు, ఆశ్రమములు, అడవులు, పృథివి, సాగరములు, సప్తవర్షములు, సప్తద్వీపములు, వివిధములగు పర్వతములు, ఆకాశము, భూతలము, రసాతలము, దైత్య-నాగ లోకములు, భవనములు, మొదలగు వానినెల్ల కక్ష్యావిభాగముచేతనే నిర్దేశించ వలయును. ఇట్లు సచరాచరమగు త్రైలోక్యమెల్ల రంగస్థలమున కక్ష్యలచేతనే నిర్దిష్టము కావలసియుండును.

కథావశమున నగరము, వనము, పర్వతము, వర్షము (భూఖండము) మొదలగువానిలో ఏవి ప్రస్తుతమగునో అనగా వేటియందు కథ ప్రవర్తిల్లుచుండునో వాటినే నిర్దేశించుచు కక్ష్యలను ప్రవర్తింపజేయవలెను. అందు బాహ్యా-మధ్యమ-అభ్యంతరము లనెడి భేదములను, దూర - సన్నిహితములనెడి భేదములను కల్పించవలెను. ముందుగా రంగమును ప్రవేశించిన పాత్రలు నిలిచిన లేదా కూర్చుండిన ప్రదేశము అభ్యంతరకక్ష్య అనబడును. తరువాత ప్రవేశించినవారు బాహ్యాకక్ష్య నుండి వచ్చినట్లుగా భావించవలెను.[5] అభ్యంతరమం దున్నవారిని దర్శించుటకు వచ్చినవాడు[6] దక్షిణాభిముఖుడై తన విషయమును నివేదించుకొనవలెను.[7]

కొనవలెను. ఈ కక్ష్యాభేదములు గతిభేదములచేతనే నిర్దిష్టములగుచుండును [అభినవ భారతి 2 వ సం - పుట 197].

ఇచ్చట 'రంగశీర్ష' ప్రసక్తి లేకపోవుట గమనార్హము. "....తేన భాండేన యత్పరిత ఆక్రాంతం తద్వివర్జ్య శేషేరంగపీఠదేశే నిష్క్రమణ-ప్రవేశ-గత్యాద్యుపయోగీ స్థానవిభాగో నిర్దేశ్యః ప్రేక్షకావధిః సంక్రమయితవ్యః" [పుట - 197] అని అభినవగుప్తుడు రెండు మూడు శ్లోకముల వ్యాఖ్యానమందు వివరించెను. దీనిని బట్టి, ఇచ్చట, అభినవగుప్తుని దృష్టిలో రంగపీఠ-రంగశీర్షములు భిన్నము లను అభిప్రాయమున్నట్లే కన్పట్టుటలేదు. 2 వ అధ్యాయమం దివి రెండును భిన్నములని స్పష్టముగాచెప్పి ఇచ్చట దానిని మరచిపోవుటకు కారణము తెలియుటలేదు. ఇచ్చటి ఈ వివరణము ఆచార్య శ్రీ డి. సుబ్బారావుగారు మొదలగువారి వాదమునకు బలమొసంగుచున్నది [2 వ అధ్యాయమందలి 2, 3 విశేషాంశములను కూడ చూడవలెను].

5. అనగా వారు ఎచ్చటినుండి వచ్చిరో అది 'బాహ్యాకక్ష్య' అగునని సారాంశము. ఈ బాహ్యాకక్ష్య నిజమునకు రంగస్థలమునకు వెలుపల ఉండును. కాన, ఇది ప్రేక్షకులకు దృష్టిగోచరము కాదన్నమాట. 'ముందుగా రంగమును ప్రవేశించిన పాత్రలు' అనునప్పుడు వారు తెరఎత్తిన తరువాతనే ప్రవేశించవలెనని అర్థము చేసికొనరాదు. తెర ఎత్తునప్పటికే వారు రంగమందుండవచ్చును. మన పూర్వులకు ముందరి తెర లేనేలేదని నమ్మినచో పాత్రల ప్రవేశాదు లెల్లప్పుడును ప్రేక్షకులు చూచుచుండగనే జరుగునని భావించవలెను.

6. భరతుడు మధ్యమకక్ష్యను వివరించలేదు, కాని, "బాహ్యాకక్ష్యనుండి రంగమును ప్రవేశించినవానికిని, అంతకుముందే రంగమును ప్రవేశించి అభ్యంతరకక్ష్యయందున్న

నేపథ్యగృహద్వారములు, భాండవాద్యములు ఏ దిశకు అభిముఖముగా ఉండునో ఆదిశను ఎల్లప్పుడును నాట్యమందు 'తూర్పుదిక్కు'నుగా పరిగణించవలెను.

బాహ్య ప్రయోగము

ఎప్పుడేని యజమానుని ఆజ్ఞ ననుసరించి బాహ్యప్రయోగమును (అనగా ప్రేక్షాగృహమునందు కాక దిశలు స్ఫుటముగా తెలియని బహిరంగ స్థలమునందు ప్రయోగమును) ఏర్పాటు చేయవలసివచ్చును. అప్పుడు వాద్యములను వెనుక భాగమందుంచి భరతుడు (నటుడు) ఏ దిక్కునకు అభిముఖముగా నిలిచి ప్రయోగ

---

వానికిని మధ్య గల ప్రదేశము 'మధ్యమకక్ష్య' అగు" నని అభినవగుప్తుడు వివరించెను. [అభినవభారతి - 2 వ సం - పుట 199].

అభ్యంతరకక్ష్య అనగా ఇతివృత్తోచితమైన గృహమో లేదా ఉద్యానవనమో లేదా ఇతరమో అగును. ఇంక బాహ్యకక్ష్యనుండి వచ్చినవాడు మొదట రంగస్థలమున ఒక మూలగా లేదా ఒక ప్రక్కగా ప్రవేశించి ప్రేక్షకుల దృష్టిపథమున పడును. నిజమునకు బాహ్యకక్ష్య రంగస్థలమునకు వెలుపల ఉన్నను, సౌలభ్యార్థము ఈ ప్రదేశమునే బాహ్య కక్ష్యగా భావించుకొనవలెను. అంతియేకాక, ప్రవేశ-నిష్క్రమణాదుల కుపయుక్తమగు ద్వారముగా కూడ దీనిని భావించుకొనవలసియున్నది. ఈ బాహ్యాభ్యంతర కక్ష్యల మధ్య ఉన్న భాగమే మధ్యమకక్ష్య అగునని అభినవగుప్తుడు చెప్పియుండెను. పై విధముగా రంగస్థలమున ఒక ప్రక్కగా లేదా ఒక మూలగా ప్రవేశించిన పాత్ర స్వగతాదులను నిర్వర్తించి, పిమ్మట పరిక్రమించి అనగా మధ్యమకక్ష్యను గడచి, అభ్యంతరకక్ష్యలోనికి వచ్చును. అట్లు కలిసిన తరువాత వారిరువురును అభ్యంతరమందున్నవారే అగుదురు.

అట్లు అభ్యంతరమందున్నవారికి వార్తాదులను తెలుపుటకు ప్రతిహారి మున్నగువారు వత్తురు. వారా వార్తలను ఎట్లు నివేదించవలెనో ఇందు చెప్పబడుచున్నది.

7. బాహ్యకక్ష్య ఏదిక్కున ఉండునో ఇచ్చట స్పష్టముగా చెప్పబడలేదు. 'దక్షిణాభిముఖుడై' అనుదానినిబట్టి అది ఉత్తరదిశయం దుండుననియు, అదియే ఉత్తరద్వార మనబడుననియు, దానినుండియే ప్రవేశించి, దక్షిణదిశ కభిముఖుడై నివేదించుకొనవలసి ఉండుననియు, మరల అదే ద్వారమునుండి నిష్క్రమించవలసి ఉండుననియు భావించవలసియున్నది. ఇది ప్రదక్షిణ ప్రవేశ మనబడుననియు, దాక్షిణాత్య - ఆవంతీ ప్రవృత్తులం దిది ప్రయుక్తమగుననియు భరతుడు తరువాత వివరించును.

'దక్షిణాభిముఖుడై' అనగా ముందురంగమున ప్రవేశించిన వానియొక్క దక్షిణ భాగమును చూచుచున్నవాడై' అను అర్థమును అభినవగుప్తుడు తెలిపెను. ఉత్తర ద్వారమునుండి ప్రవేశించి మరల అక్లే నిష్క్రమించవలె నన్నప్పుడు పై విషయము కుదురదు. 'దక్షిణాభిముఖుడై' అనుటచే పాత్ర ప్రేక్షకులవైపు చూడరాదను అభిప్రాయమును అభినవగుప్తుడు వ్యక్తముచేసెను. [అభినవభారతి - 2 వ సం - పుట 198.]

అసలు ఈ దక్షిణాది దిశలను నిర్ణయించుట ఎట్లో తరువాత వివరింపబడుచున్నది.



మును నడపుచుండునో ఆ దిక్కును ఆ ప్రయోగకాలమందు తూర్పుదిక్కునుగా పరిగణించవలయును.[8]

ప్రవేశ-నిష్క్రమణాదులు

రంగమును ప్రవేశించి అట్లు ఆత్మనివేదన మొనర్చిన పిమ్మట అనగా వార్తను తెలిపిన పిమ్మట ప్రవేశించిన ద్వారమునుండియే నిష్క్రమించవలెను. అభ్యంతర కక్ష్యయం దున్నవారు కథావశమున వెలుపలికేగవలసి ఉన్నచో పై ద్వారము నుండియే నిష్క్రమించవలెను. ముందుగా రంగమును ప్రవేశించినవాడు తరువాత ప్రవేశించిన వానితోకూడకలిసి కథావశమున వెలుపలికేగి, మరల వానితో కలిసి కాని లేదా తాను ఒంటరిగాకాని రంగమును ప్రవేశించునప్పుడు అదే ద్వారము నుండి రంగముమీదికి రావలెను. అప్పుడు రంగమునందు మరియొక కక్ష్యను నిర్దేశించవలయును;[9] వాని గతిభేదముచేతనే ఈ కక్ష్యాభేదమును నిర్దేశించవలెను. ఒకపాత్ర సములతో నడుచునప్పుడు వారితో కలిసి ఉండవలెను. తనకంటె తక్కువవారితో నడుచునప్పుడు వారిచే అనుసరింపబడినవాడు కావలెను. ప్రేషణికలు (దాసీలు) ఉన్నచో వారు దారి చూపుచు ముందు నడవవలెను.[10]

ఒకేచోట ఎక్కువసేపు నడిచినచో ఎక్కువ దూరము నడిచినట్లుగా భావించవలెను. మధ్యమ - సన్నిహిత దూరములు కూడ ఇట్లే నిర్దేశింపబడును.*

---

8. ఈ పేరాకు మూలములైన రెండు శ్లోకములును ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి. కావుననే వీనిని అభినవగుప్తుడు వ్యాఖ్యానించలేదని శ్రీ మా. రామకృష్ణ కవిగారు తెల్పినారు. ఇవి కాశీ ముద్రణమునందు 64, 65 శ్లో; బొంబాయి ముద్రణమునందు 60, 61 శ్లో; బరోడా ముద్రణమునందు 65, 66 శ్లోకములు.

బాహ్యప్రయోగ మనగా **open air performance.** నేడు ప్రభుత్వము, ప్రజలు కూడ దీనిని ప్రోత్సహించుచున్నారు. నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయమందు వర్ణితమైన భరతుని ప్రథమ ప్రయోగము బాహ్యప్రయోగమే అగుట గమనార్హము [చూ. ప్రథమాధ్యాయమునందలి 23 వ అధస్సూచిక].

9. అనగా అతడు ఇప్పు డింకొక ప్రదేశమునకు వచ్చెనన్నమాట "...ఫలాని వానిని కలిసికొందును." అని చెప్పి పాత్ర నిష్క్రమించి, మరల ప్రవేశించినప్పుడు అతడు ఆ ఫలాని వాడు ఉన్నచోటునకు వచ్చినట్లుగా ప్రేక్షకులు భావించవలెను. కావున అది ఇంకొక కక్ష్య అగును.

10. ఈ పేరాకు మూలములైన నాలుగు శ్లోకములును ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి. ఇవి కొన్ని ప్రతులలో మాత్రమే పెక్కు పాఠభేదములతో కన్పట్టుచున్నవని శ్రీమా. రామకృష్ణ కవిగారు పేర్కొనిరి.

*[కాశీముద్రణమునందు 14వ అధ్యా—1-16శ్లో; బొంబాయి, బరోడాముద్రణమునందు 13 వ అధ్యా—1-17 శ్లో.]

నగర-వన-పర్వత-సాగర-వర్ష-ద్వీపములందు దివ్యులు ప్రవేశించుటను చూపవలసివచ్చినప్పుడు ఆకాశయానమున కాని, విమానమునందు కాని, మాయచే కాని, ఇతర విధములుగాకాని ప్రవేశించినట్లు చూపవలయును. వరాదుల ననుగ్రహించుట కొరకు దివ్యత్వమును మరుగు పరచిన దేవతలకు భూమి సంచారమును, మనుష్యులచే చూడబడుటయును నాటకమందు కల్పించవలయును.

భారత-హైమ-హారివర్ష - ఇలావృత-రమ్య - కింపురుష - ఉత్తరకురు వర్షములన్నింటి యందును దేవతలకు స్వచ్ఛందగమనము కలదు. కాని మానవులకు మాత్రము భారత వర్షము (భారతదేశము) నందు మాత్రమే సంచరించు శక్తి కలదు. ప్రయోగసమయమున భారతవర్షమందు పై విధముగా మానవుల గతికి సంబంధించిన కక్ష్యావిభాగమును కావించవలెను.

[అంకాంతమునందు కార్యవశమున పాత్ర దూరదేశము పోవలసివచ్చినచో తరువాతి అంక ప్రారంభమందలి ప్రవేశకమున ఆ విషయమును నిర్దేశించవలెను. ప్రవేశకమైన వెంటనే ప్రారంభమయ్యెడి అంకమునందు ఒక పగటి పూటలో గడచిన కథను ప్రదర్శించి, కార్యలాభమును నిర్దేశించవలెను. అట్లు కార్యసిద్ధి కాగానే ఆ అంకమును ముగించవలెను. బీజము (ఈ పద వివరణమునకు 19 వ అధ్యాయమును చూడవలెను.) యొక్క ప్రయోజనము ననుసరించి నాటకములో ఒక అంకమునందు ఒక క్షణము, లేదా ఒక ముహూర్తము, లేదా ఒక జాము, లేదా ఒక రోజులో జరిగిన కథను కూర్చవలెను. రెండు అంకముల మధ్య ఒక మాసము లేదా ఒక సంవత్సరము కాలము గడువవచ్చును; సంవత్సరము కంటె అధికము మాత్రము కారాదు.][11]

---

11. ఈ పేరాకు మూలములైన 4 శ్లోకములును [బరోడా ముద్రణమునందు 23-27 శ్లో.] ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి. వీటిని అభినవగుప్తుడు వ్యాఖ్యానించ లేదు. బొంబాయి ముద్రణములో ఈ భాగమే లేదు. ఈ శ్లోకములతో సంవదించు శ్లోకములు దశరూపాధ్యాయమందు (18 వ అధ్యా) కలవు. వాటి నచ్చట అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను. కావున ఈ శ్లోకము లిచ్చట ఉండుట అనవసరము.

ఈ 4 శ్లోకములకు సరిగా అన్వయము కుదురుటలేదు. ఇవి దశరూపాధ్యాయమందలి శ్లోకములకు విరుద్ధములుగాకూడ కన్పట్టుచున్నవి. నేను సమన్వయము చేయుటకు ప్రయత్నించి యున్నాను. డా. ఘోష్ మాత్రము భిన్నముగా అనువదించియున్నారు. ఆ శ్లోకములను ఉదాహరించుచున్నాను—

వికృష్టం యస్తు గచ్ఛేద్ధి దేశం కార్యవశాన్నరః। అంకచ్ఛేదే తమన్యస్మిన్నిర్దిశేద్ధి ప్రవేశకే॥ 23

అహ్నః ప్రమాణం గత్వా తు కార్యలాభం వినిర్దిశేత్। తథా లాభేతు కార్యోఽస్యా అంకచ్ఛేదో విధీయతే॥ 24

క్షణో ముహూర్తో యామో వా దివసో వాపి నాటకే। ఏకాంకే సంవిధాతవ్యో బీజస్యార్థవశానుగః॥ 25

అంకచ్ఛేదే తు నిర్వృత్తం మాసం వా వర్షమేవ వా। నోర్ధ్వం వర్షాత్ప్రకర్తవ్యం కార్యమంకసమాశ్రయమ్॥ 26



దివ్యుల విషయమున కక్ష్యావిభాగాదులు

ఇంక దివ్యుల గతికి సంబంధించిన కక్ష్యావిభాగమును వివరింతును. హిమాచలముపై ఉన్న కైలాసమనెడి ఉత్తమ పర్వతమునందు కుబేరానుచరులైన యక్షులును గుహ్యకులును, హిమాచలమునందు రక్షో-భూత-పిశాచములును, హేమకూటమునందు అప్సరోగణ సహితులైన గంధర్వులును, నిషధపర్వతమునందు శేష-వాసుకి-తక్షకాది నాగములును, మేరువునందు ముప్పదిమూడు దేవగణములును, వైడూర్యమయమగు నీలపర్వతమునందు సిద్ధులును బ్రహ్మర్షులును, శ్వేతపర్వతమునందు దైత్య-దానవులును, శృంగవత్పర్వతమునందు పితృదేవతలును సంచరించుచుందురు. ఈ ఉత్తమ పర్వతములన్నియును దివ్యుల కావాసములు. కక్ష్యావిభాగమందు మానవులకు జంబూద్వీపమునందలి ప్రదేశములను నిర్దేశించినట్లే దివ్యుల విషయమున కక్ష్యావిభాగమందు వారివారి స్థానములను నిర్దేశించవలెను[12]. రంగస్థలమునందు దివ్యుల చేష్టితములును, జ్ఞానమును, వేష-భాషలును యథాతథముగా కాక మనుష్యోచితములుగానే ప్రదర్శింపబడవలెను; దివ్యుల అనిమిషత్వమును ప్రదర్శించరాదు. నాట్యమందు సర్వ రస-భావములును[13] దృష్టియందే ప్రతిష్ఠితములై యున్నవి కదా.

ఇహ భావా రసాశ్చైవ దృష్ట్యామేవ ప్రతిష్ఠితాః॥ 35

దృష్ట్యా హి సూచితో భావః పశ్చాదంగైర్విభావ్యతే॥ 36

—భావము మొదట దృష్టిచే సూచితమై పిమ్మట అంగములచే అనగా ఆంగికాభినయముచే స్పష్టముచేయబడును.* [పుట 290 కూడ చూడవలెను.]

## ప్రవృత్తులు[14]

ఇంతవరకును కక్ష్యావిభాగమును వివరించితిని. ఇంక ప్రవృత్తుల లక్షణమును

---

12. అనగా యక్షులు కైలాసమందలివారనియు, గంధర్వులు హేమకూట వాసులనియు...నాటకమందు నిర్దేశింపబడినప్పుడు రంగస్థలమందు కక్ష్యా విభాగమున వారలకు ఆ కైలాస, ఆ హేమకూటములే నిర్దిష్టములు కావలెను. అంతియేకాని తద్భిన్నముగా నిర్దేశించరాదని గమనించవలెను.

13. భావములనగా వ్యభిచారి భావములనియును, రసములనగా స్థాయిభావములనియును అభినవగుప్తుడు పేర్కొనెను. భావము సూచితమగుట అనగా 'సూచాఅభినయ' మని అర్థము. ఇది 22 వ అధ్యాయమున వివరింపబడును. మనుష్యోచితముగనే ప్రదర్శింపబడవలెననగా అవతారపురుషులైన రామాదినాయకులు కించిదుత్కృష్టముగా, సాతిశయముగా ఉండునప్పటికిని వారి చరిత్రలు మాత్రము మనుష్యోచితములుగానే నిరూపింబబడవలెనని అర్థము [అభినవభారతి - 2 వ సం - పుట 204]

* [కాశీ ముద్రణమునందు 14 వ అధ్యా—17-35 శ్లో; బొంబాయి ముద్రణమునందు 13 వ అధ్యా—18-31 శ్లో; బరోడా ముద్రణమునందు 13 వ అధ్యా—18-36 శ్లో.]

14. 6 వ అధ్యాయమందు (20 వ శ్లోకములో) ధర్మి చెప్పబడిన తరువాతనే

వివరింతును. ప్రవృత్తి నాలుగు విధములని నాట్యప్రయోక్తలు చెప్పిరి— 1. ఆవంతి, 2. దాక్షిణాత్య, 3. పాంచాలి (పాంచాలమధ్యమ), 4. ఓఢ్రమాగధి.

ప్రశ్న : దీనికి 'ప్రవృత్తి' అను పే రేల వచ్చినది ?

సమా : పృథివిలోని వివిధ దేశములందలి వేష-భాషా-ఆచార-వార్తలను బాగుగా తెలియజేయునది కాన ఇది 'ప్రవృత్తి' అనబడినది. వృత్తి, ప్రవృత్తి అను పదములకు 'నివేదనము' (=సంపూర్ణముగా తెలియజేయుట=ప్రసిద్ధి) అని అర్థము.

ప్రశ్న : పృథివిలో అనేక దేశము లున్నవికదా ? మరి ప్రవృత్తులు నాలుగు మాత్రమే అని చెప్పుట ఎట్లు పొసగును ? అంతియే కాక ఇవి నాట్యమునందు సమాన లక్షణములు కలవిగా చెప్పబడుచున్నవి. అది ఎట్లు కుదురును ?

సమా : ఇవి సమాన లక్షణము కలవి అగుట నిజమే. దేశ-వేష-భాషా-ఆచారముల వైవిధ్యము లోకమందు సహజము. ఆ వైచిత్ర్యమును సంక్షేపించి వృత్తిసంశ్రయమైన నాట్యమునకు చతుర్విధత్వమునే చెప్పితిని. అవియే భారతీ-ఆరభటీ-సాత్త్వతీ-కైశికీ వృత్తులు [ఇవి 20వ అధ్యాయమున వివరింపబడును.] ఈ నాలుగు వృత్తుల నాశ్రయించుకొనియున్న ప్రయోగములను బట్టి దేశములకును చతుర్విధత్వమే కల్పింపబడెను. అట్టి దేశములను బట్టియే ప్రవృత్తి చతుష్టయమును, తత్ప్రయోగమును నిర్దేశింపబడినవి. [దీనికి ప్రవృత్తి అను పేరేల వచ్చినది ?' అను ప్రశ్ననుండి ఇంతవరకును మూలము గద్యములో ఉన్నది.]

---

ప్రవృత్తి చెప్పబడినది. ఒక వ్రాతప్రతిలో ఆ క్రమమే అనుసరింపబడినదనియు, కీర్తిధరప్రభృతులును ఆక్రమమునే స్వీకరించిరనియు శ్రీ మా. రామకృష్ణకవిగారు తెలిపినారు. కక్ష్యావిభాగనుచే కల్పితమైన దేశభేద ప్రసంగముచే దేశ విభాగ ప్రతిపన్నములైన ప్రవృత్తులు ప్రసక్తములగుచున్నవి కాన అవియే ముందుగా వివరింపబడుచున్నవని అభినవగుప్తుడు తెలిపెను. [అభినవభారతి - 2 వ సం - పుట 205]

ఓఢ్రమాగధి అనుటకు 'ఆంధ్రమాగధి' అను పాఠ మొక వ్రాతప్రతిలో కలదట.

ప్రవృత్తి అనగా 'వేషవిన్యాసక్రమము' (=ఆహార్యాభినయము) అని స్థూలముగా చెప్పవచ్చును. అంతియేకాదు, ఆచార-వార్తలకు కూడ అది సంబంధించియున్నది. మరియు ఇది 'వృత్తి' ని ఆశ్రయించుకొని ఉండునని తరువాత చెప్పబడును.

లోకమునందు దక్షిణాపథము, పూర్వదేశము, పశ్చిమదేశము, ఉత్తరభూమి అను విభాగములు స్థూలముగా కలవు. ఈ దేశములను బట్టియే క్రమముగా దాక్షిణాత్య-ఓఢ్రమాగధి-అవంతి-పాంచాలి ప్రవృత్తులు చెప్పబడినవి...చిత్తవృత్తి భేద-సాదృశ్యములచే లోకమునందు పై నాలుగు భేదములును సంభవమగుచున్నవని సారాంశము. [అభినవభారతి - 2 వ సం - పుట 207]



1. దాక్షిణాత్య ప్రవృత్తి— దాక్షిణాత్యులు బహునృత్త-గీత-వాద్యప్రియులును, సుకుమారమగు కైశికీ వృత్తియే ప్రధానముగా కలవారును, చతురములును, లలితములును, మనోహరములునుఅగు అంగాభినయములు కలవారును అయి ఉందురు. [ఇది కూడ గద్యమునందే ఉన్నది.] మహేంద్రము, మలయము, సహ్యము, మేకలము, పాలమంజరము (కాలపంజరము - కాశీముద్రణ పాఠము) అను పర్వతముల సమీపములందున్న దేశములు దక్షిణాపథమునకు చెందినవి. కాగా దక్షిణ సముద్రమునకును, వింధ్య పర్వతమునకును మధ్య నివసించు కోసల-తోసల-కళింగ-యవన-ఖస-ద్రమిడ-ఆంధ్ర-మహారాష్ట్ర-[15] వైణ్ణ (కృష్ణా-పినాకినీ మధ్య దేశము)- వనవాసాది దేశములందలివారు ఈ దాక్షిణాత్య ప్రవృత్తినే ఎల్లప్పుడును అవలంబించి ఉందురు.

2. ఆవంతి ప్రవృత్తి— అవంతీ - విదిశ - సురాష్ట్ర - మాలవ-సింధు-సౌవీర-ఆనర్త - అర్బుద-దశార్ణ-త్రిపుర-మృత్తికావతీ దేశస్థులు నిత్యమును ఆవంతీ ప్రవృత్తిని అవలంబించి ఉందురు. మరియు ఈ దేశస్థులు సాత్త్వతీ - కైశికీ వృత్తులను ఆశ్రయించిఉందురు. కావున ప్రయోక్తలు వీరి నిట్లే ప్రదర్శించవలెను.

3. ఓఢ్రమాగధి— తూర్పున ఉన్న అంగ-వంగ-కళింగ-వత్స-ఓఢ్ర-మగధ-పుండ్ర-నేపాల-అంతర్గిర-బహిర్గిర-ప్లవంగమ-మలద-మల్లవర్తక-బ్రహ్మోత్తర-భార్గవ-మార్గవ-ప్రాగ్జ్యోతిష-పుళింద-విదేహ-తామ్రలిప్త దేశస్థులు ఓఢ్రమాగధీ ప్రవృత్తిని అవలంబించిఉందురు. పురాణములలో ప్రాచ్యదేశములుగా పరిగణింపబడిన ఇతర దేశములందున్నవారు కూడ ఓఢ్రమాగధీ ప్రవృత్తినే అవలంబించవలెను.[16]

---

15. 'ద్రమిడాంధ్రమహారాష్ట్ర' అని మూలమందు కలదు. దీనిని .... "ఆంధ్ర - మహారాష్ట్ర అని విడదీయవచ్చును. లేదా ఆంధ్ర మహారాష్ట్ర (The Great Andhra Empire) అని ఏకపదముగా గ్రహించవచ్చును" అని డా॥ ఘోష్ తెలిపెను.

పైన ప్రత్యేకముగా దేశముల పేర్లు పేర్కొనబడుటచేత వానిమధ్య నుండెడివారిని అనగా పర్వతకచ్ఛాదులందలి మ్లేచ్ఛులను గ్రహించరాదని తెలియవలెను. ఇది అంతయును కవుల ఉపయోగార్థము చెప్పబడినది. ఇట్లే తక్కినవానియందును గ్రహించవలెను. [అభినవభారతి 2 వ సం - పుటలు 208- 209].

16. ప్రాచ్య దేశములకు సంబంధించిన 'వృత్తి'ని భరతుడు పేర్కొనలేదు. ఘటాటోప వాక్యాడంబర ప్రాధాన్యమును బట్టి ప్రాచ్య దేశములందు ఆరభటీవృత్తి (భారతీవృత్తి కూడ) ప్రయుక్తమగునని అభినవగుప్తుడు తెలిపెను. [అభినవభారతి - 2వ సం - పుట 207]. ప్రాగ్దేశములలో దక్షిణముగా సముద్ర సమీపమున ఓఢ్రులును, ఉత్తరముగా మాగధులును ఉందురు; తదుభయ మధ్యవర్తిత్వముచే అది 'ఓఢ్రమాగధి' అనబడినది. [అభినవభారతి - 2 వ సం - పుట 210]

4. పాంచాలమధ్యమ— గంగానది కుత్తరదిశయందున్నవియును, హిమాలయమును అంటిఉన్నవియును అగు పాంచాల-శూరసేన-కాశ్మీర-హస్తినాపుర-బాహ్లీక - శకల-మద్రక - ఉశీనర దేశములందలి వారు పాంచాలమధ్యమ[17] ప్రవృత్తి నవలంబించి ఉందురు. పాంచాలమధ్యమ ప్రవృత్తి సాత్త్వతీ-ఆరభటీ వృత్తులకు సంబంధించినది కాన ఇందు గానము అల్పముగాను (అనగా కైశికీవృత్తి లేశ మాత్రముగ ఉండును), గతిప్రచారము ఆవిద్ధముగాను ఉండునని తెలియవలెను.

రంగపీఠపరిక్రమద్వైవిధ్యము

ఈ ప్రవృత్తులకు సంబంధించిన రంగపీఠ పరిక్రమము రెండు విధములుగా ఉండును. 1. ప్రదక్షిణ ప్రవేశము, 2 అప్రదక్షిణ ప్రవేశము.

1. ప్రదక్షిణప్రవేశము— ఆవంతీ - దాక్షిణాత్య ప్రవృత్తులందు ప్రదక్షిణ ప్రవేశమును ప్రయోగించవలెను. ఇందు ఉత్తరద్వారమును ఉపయోగించవలెను. (అనగా ఉత్తర ద్వారమునుండి ప్రవేశించి, పరిక్రమాదులు కావించి, ఆత్మనివేదన మొనరించి, వచ్చిన ద్వారమునుండియే నిష్క్రమించవలెను).

2. అప్రదక్షిణ (అపసవ్య) ప్రవేశము— పాంచాలీ-ఓఢ్రమాగధీ ప్రవృత్తులందు అప్రదక్షిణ ప్రవేశమును ప్రయోగించవలెను. ఇందు దక్షిణద్వార ముపయుక్త మగును. (అనగా దక్షిణ ద్వారమునుండి ప్రవేశించి, పరిక్రమాదులు కావించి, ఆత్మనివేదన మొనరించి, వచ్చిన ద్వారమునుండియే నిష్క్రమించవలెను).

సభను, దేశమును, కాలమును, ప్రయోజనమును అనుసరించి ఒక్కొక్కప్పుడు వీటిని సంకీర్ణములుగాకూడ ప్రయోగింపదగును.[18] ఏదేశమునం దెట్టి ప్రవృత్తి ఉండునో చెప్పితిని; కావున, ఆ ప్రవృత్తికి సంబంధించిన వృత్తులు ప్రధానముగా కలిగిన

17. తురుష్క - అరట్ట - కదరక - ఖస ప్రభృతులు వ్యవహార బహిష్కృతు లగుట వలన ప్రత్యేకముగా పఠింపబడలేదనియు, వారు మధ్యమ దేశస్థులలో చేరుదురనియు అభినవగుప్తుడు తెలిపెను. [అభినవభారతి - 2 వ సం - పుటలు 209-210]

18. దాక్షిణాత్యుడు ఉత్తర ద్వారమునుండి ప్రవేశించి పశ్చిమముగా పరిక్రమించి తరువాత క్రమముగా దక్షిణమునకు, తూర్పునకు, ఉత్తరమునకు పరిక్రమించవలెను. అచ్చట (ఉత్తర దిశయందు) నిలిచి దక్షిణాభిముఖుడై ఆత్మనివేదనము చేయవలెను. తరువాత క్రమముగా ఉత్తరమునుండి తూర్పునకు, అచ్చటినుండి దక్షిణమునకు, అచ్చట నుండి పశ్చిమమునకు పరిక్రమించి ఉత్తర ద్వారమునుండియే నిష్క్రమించవలెను. సాత్త్వత్యాదులందును ఇట్లే చేయవలెను. ఇంక పాంచాలీ ప్రవృత్తియందు ఇది విపరీతముగా ఉండును. ఇందు దక్షిణ ద్వారమునుండియే ప్రవేశించి దానినుండియే నిష్క్రమించవలెను .... ఇది అపసవ్య ప్రవేశము. [అభినవభారతి - 2 వ సం - పుటలు 210-211]



రూపకములనే ఆ దేశములందు ప్రయోగించవలెను.[19] నాటకాదులందు భిన్న వృత్తులు పరస్పర సమ్మిశ్రితములై ఉండును. కావున, ప్రధానమైన వృత్తిని అనుసరించియే ప్రవృత్తిని నిర్ణయించుకొనవలెను.

ప్రయోగద్వైవిధ్యము

నాటకాశ్రయమైన ప్రయోగము సుకుమార - ఆవిద్ధ భేదములచే రెండు విధములు.

1. ఆవిద్ధప్రయోగము— ఉద్ధతములైన అంగహారములు, ఛేదనము, భేదనము ప్రధానముగాగల యుద్ధము, మాయా-ఇంద్రజాలములు, పుస్త-నేపథ్యములు (కాష్ఠమయ-మృణ్మయ ఆకృతి విశేషములు), పలువురు పురుషులు, కొలది మంది స్త్రీలు కలిగినదై సాత్త్వత్యారభటీ వృత్తులు ప్రధానముగా గల నాట్యము 'ఆవిద్ధ ప్రయోగ' మనబడును. డిమ-సమవకార-వ్యాయోగ-ఈహామృగములు ఆవిద్ధరూపకములు. దేవ-దానవ-రాక్షసులును, శౌర్య-వీర్య-బలాన్వితులగు ఉద్ధత పురుషులును ఈ రూపకములం దుందురు.

2. సుకుమారప్రయోగము— నాటక-ప్రకరణ-భాణ-వీథీ - అంకములు సుకుమార ప్రయోగమునకు చెందిన రూపకములు[20]. ఇవి ముఖ్యముగా మనుష్యాశ్రితములు*[21]. (అనగా వీటియందు మానవులే అధికముగా ఉందురు.)

19. కాశ్మీరాదిదేశములకు సంబంధించినట్లుగా కైశికీప్రధానములగు నాటికాదులను ప్రదర్శించుట అనుచితము కాగలదు. నాటిక దాక్షిణాత్యోచితమైనది. దేశోచితములగు చేష్టాదులు లేనిచో రసప్రతీతి కలుగక ఆ రూపకము నీరసమగును. రసమే నాట్యమునకు ప్రాణము ; వ్యుత్పత్తి అప్రధానమైనది. ఆ యా దేశవాసులకు సహజములుకాని వృత్తి-ప్రవృత్తులుప్రయుక్తములైనచో అసత్యతాశంకజనించును. అప్పుడు ప్రయోగమే నిరర్థకము అగును. ఒక్కొక్క దేశమునకు ఒక్కొక్క ప్రవృత్తి ప్రకారము చెప్పబడినది. ఏ దేశ పురుషుడు నాయకుడగునో ఆ దేశమునకు ఉచితములైన వృత్తి-ప్రవృత్తులనే ఆ రూపకమందు నిరూపించవలెనని సారాంశము. [అభినవభారతి - 2 వ సం - పుట 211]

20. దశరూపకములలో ప్రహసనము ఏ రకపు నాట్యమునకు చెందినదో తెలుపబడ లేదు. డిమాదులు నాలుగును ఉద్ధతములనియు, నాటకాదులు సుకుమార వర్గమునకు చెందినవనియు [ఏవం చత్వారి భిన్నాని డిమా ద్యుద్ధతాని (వర్గ) సుకుమారాణి నాటకాదీని] అభినవగుప్తుడు చెప్పుటచే ప్రహసనము సుకుమార వర్గమునకుచెందినదని చెప్పవచ్చును. [అభినవభారతి - 2 వ సం - పుట 213]. 26 వ అధ్యాయము కూడ చూడవలెను. అచ్చట ఈ సుకుమార - ఉద్ధతభేదములు ఇంకొక దృష్టితో మరల వివరింపబడును.

*[కాశీ ముద్రణమునందు 14 వ అధ్యా—36-62 శ్లో ; బొంబాయి ముద్రణమునందు 13 వ అధ్యా—31-58 శ్లో ; బరోడా ముద్రణమునందు 13 వ అధ్యా—36-64 శ్లో. ]

21. ఇచ్చట మూలమందున్న 5 శ్లోకములను [బరోడా ముద్రణమునందు 65-69 శ్లో.] ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి—

## ధర్మి[22]

ఇంతకు ముందు (6 వ అధ్యా.) ద్వివిధమని చెప్పిన ధర్మి యొక్క లక్షణమును ఇప్పుడు వివరింతును. లోక-నాట్య భేదములచే ధర్మి రెండు విధములగుచున్నది—

1. లోక ధర్మి—

స్వభావోపగతం శుద్ధం త్వవికృతం తథా।
లోకవార్తా క్రియోపేత మంగలీలా వివర్జితమ్॥ 71

స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్।
యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీ తు సా స్మృతా॥ 72

—సహజముగా జనించునట్టి స్థాయి-వ్యభిచార్యాది భావములతో కూడినదియును, కవిబుద్ధి కృతమైన రంజనా వైచిత్రి లేనిదై శుద్ధముగా ఉన్నదియును, లోక ప్రసిద్ధములైన వ్యవహారములతో కూడినదియును, అంగవర్తనాదులు లేనిది

---

అథ బాహ్యప్రయోగే తు ప్రేక్షాగృహవివర్జితే।
విదిక్ష్వపి భవేద్రంగం కదాచి ద్భర్తురాజ్ఞయా ॥ 65

పృష్ఠే కృత్వా కుతపం నాట్యం యుక్తే యతోముఖం భరతః।
సా పూర్వా మంతవ్యా ప్రయోగకాలేన నాట్యజ్ఞః ॥ 66

ద్వారాణి షడ్వైచ్చైవ భవంతి చాత్ర రంగస్య దిగ్భాండవినిశ్చితాని।
నాట్యప్రయోగేన ఖలు ప్రవేశే ప్రాచ్యాం ప్రతీచ్యాం చ దిశి ప్రవేశః ॥ 67

విధానముత్క్రమ్య యథాత్ర రంగే వినాప్రమాణా ద్విదిశః ప్రయోగే।
ద్వారం తు యస్మాత్ స మృదంగభాండం ప్రాచీం దిశం తాం మనసాధ్యవస్యేత్ ॥ 68

వయోఽనురూపః ప్రథమం తు వేషో వేషానురూపశ్చ గతిప్రచారః।
గతిప్రచారానుగతం చ పాఠ్యం పాఠ్యానురూపో ఽభినయశ్చ కార్యః ॥ 69

పై శ్లోకములను అభినవగుప్తుడు వ్యాఖ్యానించలేదు. ఇందలి 65, 66 శ్లోకములను ఇంతకుముందే అనువదించియున్నాను; 8 వ అధస్సూచికను చూడవలెను. తరువాతి రెండు శ్లోకములును అన్వయక్లిష్టములుగా ఉన్నవి. చివరి శ్లోకమును 12 వ అధ్యాయము చివర ఒకటవ విశేషాంశములో అనువదించినాను. ఈ శ్లోకము అభినయ సారాంశమును వివరించుచున్నదని చెప్పనొప్పును.

22. 'ధర్మి' అనగా అభినయవిధానము. ఆ అభినయము లోకానుసారిగా ఎట్లు, ఎప్పుడు ఉండవలెను? నాట్య లక్షణయుతముగా ఎట్లు, ఎప్పుడు ఉండవలెను? అను ప్రశ్నలకు సంబంధించిన చర్చయే 'ధర్మి వ్యంజనము'. 'ధర్మి' కి 'ధర్మము' అను రూపాంతరము కలదు. ధర్మము అనునది స్పష్టార్థకమే. లోక-నాట్య ధర్ములు రెండును ప్రతిరూపకమునందును ఉండును. ఈ రెండింటి సమ్మేళన-సమన్వయములు కల రూపకమే ఉత్తమమని అనిపించుకొనును.



యును, స్వభావాభినయముతో కూడినదియును, నానా స్త్రీ-పురుషాశ్రయమును[23] అగు నాట్యము 'లోకధర్మి'కి చెందినదగును.

2. నాట్య ధర్మి—

అతివాక్యక్రియోపేత మతిసత్త్వాతిభావకమ్।
లీలాంగహారాభినయం నాట్యలక్షణలక్షితమ్॥ 73

స్వరాలంకారసంయుక్త మస్వస్థపురుషాశ్రయమ్।
యదీదృశం భవేన్నాట్యం నాట్యధర్మీ తు సా స్మృతా॥ 74

—ఇతిహాసాదులందుండు అర్థములను అతిక్రమించిన కవిబుద్ధికృతరంజనా వైచిత్రి (అనగా కల్పనలు) కలదియును, సహజములగు ప్రకృతిని చిత్తవృత్తిని అతిక్రమించిన కవి కల్పితములగు ప్రకృతి-చిత్తవృత్తి విశేషములతో కూడినదియును[24], శోభాప్రధానములును మనోహరములును అగు అభినయములు కలదియును, నాట్య లక్షణములతో కూడినదియును, స్వర-అలంకార యోజనతో కూడినదియును, అస్వస్థపురుషులతో[25] కూడినదియును అగు నాట్యము 'నాట్యధర్మి'కి చెందినదగును.

---

23. అనగా స్త్రీ పాత్రలను ప్రయోగించుటకు స్త్రీలును, పురుష పాత్రలను ప్రయోగించుటకు పురుషులును కలిగిన నాట్యము 'లోకధర్మి' అనబడునని అర్థము. అప్పుడు వారివి అభ్యస్తచేష్టితములు కాజాలవు. స్త్రీ పాత్రను పురుషుడు కాని, పురుషపాత్రను స్త్రీ కాని ప్రయోగించవలసివచ్చినచో అప్పుడు వారివి అభ్యస్తచేష్టితములగును; అది నాట్యధర్మి అనబడును [అభినవభారతి - 2 వ సం - పుట 215] నాట్యశాస్త్ర కాలమునాటికే స్త్రీలు పాత్రధారణము చేయుచుండుట గమనార్హము. ఈ విషయము మరల 26 వ అధ్యాయమందు వివరింపబడును.

ఏవిధమైన వైచిత్రియు లేనిదై కేవల లోకస్వభావానుగుణముగా ఉండెడి నాట్యము లేదా రూపకభాగము 'లోకధర్మి' అగునని సారాంశము.

24. ప్రకృతి (=సత్త్వము) మార్పునకు ఉదాహరణము— రాజశేఖరుని బాలరామాయణమందు సౌమ్యప్రకృతియగు దశరథుడు రాక్షసావేశవశమున క్రూరకర్ముడగుట. చిత్తవృత్తి (=భావము) మార్పునకు ఉదాహరణము—స్వభావచపలమగు విదూషక చిత్తవృత్తిని అతిక్రమించి, వత్సరాజ మిత్రుడగు వసంతుకుని (విదూషకుడు) యందు మంత్రికుచితమైన గాంభీర్య-అవహిత్థలను కల్పించుట. [అభినవభారతి - 2 వ సం - పుట 215]

25. అస్వస్థ పురుషుడు=స్వరూపమునందు లేని పురుషుడు, అనగా స్త్రీ బలమును ఆశ్రయించిఉన్నవాడు. పురుషుడు స్త్రీ పాత్రను ధరించుటచే అస్వస్థుడు(=స్వరూపమునందు లేనివాడు) అగుచున్నాడు. అట్లే స్త్రీ పురుష పాత్రను ధరించినప్పుడు కూడ అది అస్వస్థ పురుషాశ్రయమే అగును. [అభినవభారతి - 2 వ సం - పుట 215]. స్త్రీ పాత్రలను స్త్రీలు, పురుష పాత్రలను పురుషులు ధరించుటయే కాక స్త్రీ పాత్రలను పురుషులు, పురుష పాత్ర

కేవలము అభినయముచే సూచింపదగిన దానిని మూర్తిమంతముగను, అభిలాషను రేకెత్తించునదిగాను ప్రదర్శించుట 'నాట్యధర్మి' అగును.[26]

సమీపమందు మాటాడుచున్నను వినపడనట్లుండుట (అనగా జనాంతిక-అపవారితకముల విషయము), అసలు చెప్పబడని దానిని వినినట్లు కన్పట్టుట (ఆకాశభాషిత విషయము) నాట్యధర్మి అగును.

పర్వతములు, వాహనములు, విమానములు, డాలు, కవచము, ఆయుధము, ధ్వజము మున్నగువాటిని మూర్తిమంతములనుగా (రూపములను తాల్చినట్లుగా) ప్రయోగించుట నాట్యధర్మి అగును.

నేర్పు కలిగిఉండుటచేకాని, మరియొక నటుడు లేకుండుటచేకాని ఒక భూమికను నిర్వహించి వెంటనే మరియొక భూమికను ధరించుట నాట్యధర్మి అగును.[27] అగమ్య అయిన స్త్రీ భూమికను నిర్వహించి, వెంటనే గమ్యయగు స్త్రీ భూమికను నిర్వహించుట లేదా గమ్యయగు స్త్రీ భూమికను నిర్వహించి వెంటనే అగమ్యయగు భూమికను నిర్వహించుట నాట్యధర్మి అగును.[28]

---

లను స్త్రీలు ధరించుట ఆనాడే కలదన్నమాట. ఈ పరస్పర వేషధారణ విషయము 26 వ అధ్యాయమందు మరల ప్రసక్తమగును.

కవి-నట వ్యాపారమందలి వైచిత్రియే 'నాట్యధర్మి' అని సారాంశము.

నాట్యధర్మికి చెందిన వేవియో తరువాత స్పష్టముగా చెప్పబడుచున్నవి.

26. ఇందుల కుదాహరణము—'మాయాపుష్పక' మనెడి రూపకమందలి 'బ్రహ్మశాపము' భయంకరాకారముతో ప్రవేశించుట. [అభినవభారతి - 2 వ సం - పుట 216]. అనగా ఇచ్చట భావము (idea) మూర్తిమంతమైనది. ఇంక వస్తువు (object) అనగా పర్వతము, వాహనము మొదలగునవి మూర్తిమంతములగుట తరువాత వివరింపబడును.

27. ఇట్లు ఒకదాని వెంటనే ఇంకొక భూమికను సమర్థతతో నిర్వహించిన ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులుగారినిగూర్చి శ్రీ చిలకమర్తివారు తమ స్వీయచరిత్రలో క్రింది విధముగా వ్రాసినారు—"గయోపాఖ్యాన నాటకమును మా నాటక సమాజమువారు మొట్టమొదట 1890 వ సంవత్సర మేప్రియలు నెలలో ప్రయోగించిరి.... చిత్రరేఖ పాత్రను టంగుటూరి ప్రకాశంగారు ధరించిరి. రెండవ యంకములో స్త్రీపాత్రనుధరించి మిక్కిలి యొప్పించి మూడవ యంకమున, నయిదవ యంకమున ప్రకాశముగా రర్జున పాత్రను ధరించి కన్నుల వైకుంఠముగ ప్రదర్శించెడివారు." [స్వీ. చ. పుట. 74]

28. ఈ పేరాకు మూలములైన రెండు శ్లోకములను [బరోడా ముద్రణము - 78.79] అభినవగుప్తుడు వ్యాఖ్యానించలేదు. బహుశః ఇవి ప్రక్షిప్తములై ఉండును. రెండవ శ్లోకముయొక్క అర్థము సరిగా తెలియుటలేదు. గమ్య అనగా వావియగు స్త్రీ అనియు, అగమ్య అనగా వావికాని స్త్రీ అనియు తలంచుచున్నాను. ఒకసారి భార్య భూమికను నిర్వహించి వెంటనే చెల్లెలు మొదలగు భూమికలను నిర్వహించుట మొదలగు



మామూలుగా నడిచివెళ్ళుటకు బదులు లలితములైన అంగ విన్యాసములతో, చతుస్తాలాది పరిమిత పాదగతులతో నృత్తమునందువలె నడచుట నాట్యధర్మి అగును.

సుఖ-దుఃఖ రూపమగు లోకస్వభావము అంగాభినయ సంయుక్తముగా (అనగా ఆతోద్య-హస్త విన్యాసాదులతో కూడినదిగా) ప్రదర్శింపబడుట నాట్యధర్మి అగును.[29]

దివ్యుల, మనుష్యుల ఆహ్లాదము కొరకు ఇతిహాసములనుండియు, వేదముల నుండియు బ్రహ్మ ఏ అర్థములను పర్చి కూర్చెనో అవి నాట్యధర్మి అగును.

రంగపీఠగతమగు కక్ష్యావిధానమంతయును నాట్యధర్మియే అగును.

నాట్యమెల్లప్పుడును నాట్యధర్మి సహితముగానే ప్రయుక్తము కావలెను. గీత-ఆతోద్యాదులును, అభినయములును లేనిచో సామాజికులకు ప్రీతిజనించదు. నాట్యగతమును, అంగాలంకార నిష్ఠమును, నాట్యధర్మిరూపమును అగు వాక్కు అర్థమును అపేక్షించియే ప్రయుక్తమగును.

---

నవి ఇందుల కుదాహరణము కావచ్చును. నేటి సురభినాటక సమాజములందువలె పూర్వకాలమందును నటులు ఏక కుటుంబములోనివారుగా ఉండిరి. ఈ విషయము సంస్కృత నాటకముల ప్రస్తావనను పరిశీలించినచో స్పష్టపడగలదు. అట్టియెడ ఒక నటుని భార్య ఆతని చెల్లెలు పాత్రను నిర్వహించుట, లేదా వానిచెల్లెలు భార్యపాత్రను నిర్వహించుట మొదలగునవికూడ ఇందుల కుదాహరణములు కావచ్చును. నటులకొరతచే ఇట్టిది తప్పనిసరి కావచ్చును.

29. దీనికి మూల శ్లోక మీ క్రింది విధముగా ఉన్నది—

యోఽయంస్వభావో లోకస్య సుఖ - దుఃఖ క్రియాత్మకః।
సోఽంగాభినయ సంయుక్తో నాట్యధర్మీ ప్రకీర్తితా॥ 81

ఈ శ్లోకము కొలది మార్పులతో ప్రథమాధ్యాయమందు కలదు (పుట 18). ఇచ్చట 'అంగాభినయ' మనగా అంగములు=గీత—ఆతోద్యాదులు, అభినయములు=హస్తవిన్యాసాదులు అని అర్థము. [అభినవభారతి - 2 వ సం - పుట 217]

ప్రథమాధ్యాయమందు 'అంగాద్యభినయము' లనునప్పుడు పై అర్థములే కాక ఈక్రింది అర్థములును చెప్పబడినవి— అంగములు=వ్యభిచారి భావములు, ఆది=హేతురూపములైన విభావములు, అభినయములు = అనుభావములు. ఇవియెల్ల రసాభిముఖ్యనయన హేతువులు. కావుననే 'విభావ-అనుభావ-వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః'అని చెప్పబడినది. ఉపేతము=జ్ఞానమను దర్పణమునందు ప్రతిఫలించినది. ఇట్టి అర్థమే నాట్యము=నటనీయము=నర్తనీయము=నర్తనను అగుచున్నది. [అభినవభారతి - 1 వ సం - పుట 44]

ఈ విధముగా ప్రథమాధ్యాయ శ్లోకము (128 శ్లో.) కంటె ఇందలి శ్లోకము భిన్నమైనది.

అట్లే అభినయముకూడ అర్థానుసారియే అయి ఉండును.

అందుచే సహజార్థములతో సంవదించియుండు నాట్యధర్మికి సమస్తార్థముల కును సంబంధించిన లోకస్వభావమే మూలభూతము.[30]

ఇట్లు కక్ష్యావిభాగమును, ధర్మిని, ప్రవృత్తిని సరిగా తెలిసికొని నాట్య తత్త్వజ్ఞులు వాటిని చక్కగా ప్రయోగించవలెను.

ఇంతవరకును శాఖాకృతమును, అంగహార కృతమును అయిన అభినయ మును వివరించితిని. ఇంక స్వర-వ్యంజన-వర్ణ-సంయుక్తమైన వాక్యాభినయమును వివరింతును.*

త్రయోదశాధ్యాయము సమాప్తము

## విశేషాంశములు

### 1. కక్ష్యావిభాగము : రంగప్రవేశాదులు

నాట్యశాస్త్రము నంతటిని పరిశీలించిచూచినను రంగస్థలాలంకరణము (painted scenery); దృశ్యములమార్పు (change of scenes) అను వాటిని గూర్చిన వివరణము మనకు కన్పట్టదు. దీనికి కారణము ఆనాడు అట్టి అవసరము లేకపోవుటయే.

మనమీనాడు ప్రతిరంగమునకును దృశ్యమును మార్చివేయుచున్నాము. లేదా ఒకే ఒక దృశ్యమునందు కథఅంతయును జరిగిపోవునట్లు రచింపబడిన నాటకములను స్వీకరించి 'సెట్' (set) వేసికొని నాటకమును నడిపించుచున్నాము. ఈ రెండవ పద్ధతి సినీమాల ప్రభావమును సూచింపగలదు. రంగస్థలాలంకరణమునందు నేడింకను అనేక విధములగు

30. దీనికి మూలశ్లోక మీ క్రింది విధముగా ఉన్నది—

సర్వస్యసహజో భావః సర్వోహ్యభినయోఽర్థతః ।
అంగాలంకారచేష్టాతు నాట్యధర్మీ ప్రకీర్తితా ॥ 85

కేవలము నాట్యధర్మియే నాట్యమున వ్యాపకమును ప్రధానమును కావున లోకధర్మిచే ప్రయోజనమేమి ? అని శంకించి ఈ శ్లోకముచే సమాధానము చెప్పుచున్నాడు. నాట్యధర్మికి మూలభూతమును ఆశ్రయమును అగునది లోకధర్మియే. చిత్రమునకు భిత్తి ఎట్లు ఆధారభూతమో నాట్యదర్మికి లోకధర్మియును అట్లే ఆధారభూతమైనది. సమస్తార్థముల స్వభావము లోకధర్మి. దానిని గీతాతోద్యాభినయాదులచే రంజకములగునట్లు చేయునది నాట్యధర్మి. అందుచే లోకధర్మి - నాట్యధర్ములు నాట్యమందు సమప్రాధాన్యము కలవి. [అభినవ భారతి - 2 వ సం - పుట 218]

*[కాశీ ముద్రణమునందు 14వ అధ్యా—69-82 శ్లో. బొంబాయి ముద్రణమునందు 13వ అధ్యా—65-79 శ్లో; బరోడా ముద్రణమునందు 13వ అధ్యా—70-87శ్లో.]



మార్పులు చూచుచున్నాము. నాటక ప్రదర్శనమందు 'సీనరీ' నేడు అధిక ప్రాధాన్యమును వహించుచున్నది. యథార్థ మనిపించెడి సీనరీ లేని నాటకములు నేడు రక్తికట్టుట లేదన్నను అది అతిశయోక్తి కాదేమో. ప్రదర్శనములందు 'రియలిజమ్', 'నాచురలిజమ్' అను మతములే నేడు ఆదరింపబడుచున్నవి.

మన పూర్వులు 'సీనరీ'కి ప్రాముఖ్య మేమియు ఈయలేదనుట స్పష్టము. సంస్కృత నాటకములను పరిశీలించి చూచినచో అందలి కథలు స్వర్గ - మర్త్య - పాతాళములకు సంబంధించి ఉండును; ఆ ప్రదేశములు ఆకాశ - జల - పృథివీ - వన - పర్వత - ప్రాసాద - రాజమార్గాదులై ఉండును. వీటిని రంగస్థలముమీద ప్రత్యక్షముగా చూపుటకు ప్రాచీనులెట్టి ప్రయత్నమును చేసియుండలేదు. అవియెల్ల కక్ష్యా విభాగముచేతను, అభినయముచేతను నిర్దిష్టము లగుచుండెడివి. నదిని దాటుట, ప్రాసాదమును ఎక్కుట మొదలగువాటిని ఎట్లు చూపించవలెనో 12 వ అధ్యాయమందు నిరూపితమైనది. ఇది అంతయును సూచనా మాత్రముగనే జరుగును కాన భారతీయ నాటకప్రదర్శనములందు అభినయమునకు ఎక్కువ ప్రాధాన్యము వచ్చినది.

సంస్కృత నాటకములలో ముఖ్యముగా మృచ్ఛకటికను యథాతథముగా ప్రదర్శించుటకు 'రివాల్వింగ్ స్టేజి' (Revolving stage = గుండ్రముగా తిరిగెడి రంగస్థలము) అవసరము. కాని పై విధముగా కక్ష్యా విభాగముతో, అభినయముతో ప్రదర్శించినచో అట్టి అవసరమే కన్పట్టదు. ప్రాచీనులుకూడ 'రివాల్వింగ్ స్టేజి'ని ఉపయోగించెడివారని ఊహించుటకంటె వారికి పై విధముగా దాని ఆవశ్యకతయే లేదని తలంచుట సమంజసమేమో.

ప్రాచీనులు అంకమునంతటిని ఒకేఒక రంగముగా రచించెడివారు. (నేటి నాటకములలో అంకములందలి రంగవిభజనము పాశ్చాత్యానుకరణము మాత్రమే.) అందుచే ప్రదర్శనమునందు వివిధప్రదేశములను సూచింపవలసిన అవసరము తప్పుచున్నది. ఈ విధముగా ప్రాచీనులు ప్రయోగ సౌలభ్యమును చేకూర్చుకొనుటయే కాక స్థూలముగా స్థలైక్యమును పాటించుట కూడ జరిగినది. (ఒకే అంకమున ఉద్యాన-ప్రాసాదాది భేదములున్నను అవి కక్ష్యావిభాగముచే, అభినయముచే, వర్ణనచే సూచితములగుచుండును.)

ప్రాచీన భారతీయులవలె అరిస్టాటిల్ పండితుడుకూడ దృశ్యమునకు (Spectacle) ప్రాముఖ్యము నొసంగలేదు. అరిస్టాటిల్ మొత్తము నాటకమును ఆరు అంశములుగా విభజించినాడు—1. Plot (ఇతివృత్తము), 2. Character (రామాదిపాత్రలు), 3. Diction (శైలి), 4. Thought or sentiment (భావములు), 5. Spectacle (రంగాలంకరణాదులు), 6. Song (సంగీతము). [S. H. Butcher's translation of Poetics - p. 25.] వీటిలో Spectacle ను గూర్చి అరిస్టాటిల్ వ్రాసిన వాక్యములను 8 వ అధ్యాయమందలి 8 వ విశేషాంశమునందు పేర్కొని ఉన్నాను. ఇంక మరికొన్ని వాక్యములు—

"The spectacle has, indeed, an emotional attraction of its own, but, of all the parts, it is the least artistic, and connected least with the art of poetry. For the power of Tragedy, we may be sure, is felt even apart from representation and

actors. Besides, the production of spectacular effects depends more on the art of the stage machinist than on that of the poet." [Butcher's Translation of Poetics - Pp. 29-31]

రూపకము విధిగా ప్రదర్శనీయము కానక్కరలేదనియే అరిస్టాటిల్ అభిప్రాయము. ఇది ఆధునిక కాలములో వివాదాస్పదమైన అంశము.

కక్ష్యావిభాగమనగా అక్కడ గిరిగీసి అడ్డుకట్టుదురని భావముకాదు. ఈ ప్రక్క ప్రాసాదము, దానివెనుక ఉద్యానవనము, ఆ ప్రక్క రాజవీధి...అని ఇట్లు పాత్రల మాటలనుబట్టి ప్రేక్షకు లూహించుకొనవలసియుండును.

ప్రాచీనకాలపు రోమన్ నాటకశాలలలో పాత్ర ప్రవేశాదు లీ క్రింది విధముగా ఉండెడివట—

"...The whole structure was a temporary affair during the productive period of Latin drama. There was no curtain; the back scene, with its regulation three doors, was open to view throughout the play. Characters could enter from any one of the house-doors, each of which might represent a different house in the play, or from the side-entrances in the wings; the side-entrance to the spectators' right denoted the near distance, that to their left the farther distance. Thus, if the scene was laid in a town, a character going off to the spectators' right was supposed to be going to the forum; if he went off to their left he might, according to circumstances, be supposed to be on his way to the country or the harbour......" [The Oxford Companion to the Theatre - P. 675]

పై గ్రంథమునందే చైనీయుల పద్ధతికూడ క్రింది విధముగా వర్ణితమైనది—

"Chinese actors have developed a technique that renders scenery superfluous. To indicate change of place they have only to tread in a circle. The projecting stage is almost square with an embroidered curtain or flat painted background, flanked by two curtained doors, the left for entrances and the right for exits...The position of chairs is also significant: circumstance and social status are conveyed by the manner of sitting, the left being invariably the place of honour..." [The Oxford Companion to the Theatre - Pp. 125-126.]

ఆంగ్లదేశమున ఎలిజబెత్ కాలములో పాత్ర రంగస్థలమునందలి నిష్క్రమణస్థానమునకు వెళ్ళి ఒక 'కప్‌లెట్' (complet) ను చదువుటవలన రంగాంతము సూచింపబడెడిది. [నాటక మంతయును 'బ్లాంక్ వెర్స్' (Blank Verse) లోనే ఉండెడిది]

## 2. ధర్మి

లోక-నాట్య ధర్ములు రెండును లోక స్వభావమునే అనువర్తించుచుండును. లోకమనగా జనపదవాసులైన జనులు; ఆలోకము ప్రవృత్తి క్రమముచే విభజింపబడి ఉన్నది. ఆ ప్రవృత్తుల ప్రసంగమునకు సంబంధించియే ధర్మియును వివరింపబడుచున్నది. ధర్మి ఆంగికాభినయనమునకు శేషభూతమైనది; అయినను తుల్య లక్షణములు కలిగి ఉండుటచే



ప్రసంగవశమున వాచిక ఆహార్యాది విషయములు కూడ చెప్పబడుచున్నవి. నిజమునకు లౌకిక ధర్మ వ్యతిరేకమైన ధర్మమేదియును నాట్యమందుండదు; కాని, లోక గత ప్రక్రియా క్రమమే రంజనాధిక్యప్రాధాన్యమును పొందుటకు కవి-నట వ్యాపారమందలి వైచిత్ర్యమును స్వీకరించి 'నాట్యధర్మి' అనబడుచున్నది. [అభినవభారతి - 2 వ సం - పుట 213]

'నాచురలిజమ్', 'రియలిజమ్' అనునవి ఎంత ప్రాబల్యమును వహించినను నాటక ప్రదర్శన మన్నంతనే అయథార్థత, అసహజత్వము అనునవి కొంత ఉండక తప్పవు. ఎంత 'సెట్' వేసికొన్నను రంగముమీద గదికి నాలుగు గోడలను చూపలేముకదా? ఉద్యానవనమనెడి భ్రమను మాత్రమే కల్పింపగలము కాని యథార్థమగు ఉద్యానవనమును రంగముమీద చూపలేముకదా? ఇట్లే ఇతర విషయములందును భ్రమ మాత్రమే కల్పింపబడుచుండును. అసలు ఈ భ్రమయే (make-believe) నాట్యమునకు ప్రాణమని చెప్పదగును. ఈ దృష్టితో చూచినచో కక్ష్యావిభాగ ప్రాధాన్యము స్పష్టపడగలదు. రసపోషణముమీదను' అభినయము మీదను దృష్టిని కేంద్రీకరించువారికి పై మతములమీద అంతగా ఆసక్తి ఉండదు. అనగా వారు కేవల యథార్థతకు ఎక్కువ ప్రాధాన్యము నొసంగరు.

నాట్యము లోకానుసారిగా ఉండుట ఎంతముఖ్యమో నాట్యలక్షణ లక్షితమగుటయు అంతియే ముఖ్యము. లేనిచో నాట్యముకూడ మన దైనందిన వ్యవహారరూపమాత్రమే కాగలదు. అప్పుడు నాట్యమందలి విశిష్టతయే నశించును.

లోకధర్మి అనగా నాట్యము లోకానుసారిగా ఉండుట అనియు, నాట్యధర్మి అనగా నాట్యము నాట్యలక్షణలక్షితమగుట అనియు గ్రహించవలెను. లోకధర్మి అనునది లోకమునందును, నాట్యమునందును కూడ కన్పట్టును. నాట్యధర్మి అనునది నాట్యమునందు మాత్రమే కన్పట్టును. అది లోకమందు ఎవరిలోనైన కన్పట్టినచో వారిని వింతగా చూచి affected persons అని మనము హేళన చేయుచుందుము.

9 వ అధ్యాయమందు చెప్పబడిన హస్తాభినయ మంతయును నాట్యధర్మికి చెందినదే. ఏవేవి నాట్యధర్మికి చెందినవో మూలమందే విపులముగా చెప్పబడెనుకదా.

అనురూప భూమికాధారణము, పాత్రోచితభాష, అవస్థా-ప్రకృత్యుచితమగు గతిప్రచారము, పాత్రోచితమగు ఆహార్యము మొదలగునవి లోకధర్మికి చెందియున్నవి.

అసలు నాట్యమునకు లోకమే మూలభూతము; అనగా లోకధర్మి భిత్తి స్థానీయమైనది. దానిమీది చిత్రమే నాట్యధర్మి. భిత్తి (=గోడ) ఉన్నంత మాత్రమున చిత్రము సిద్ధనుకానట్లే లోకమును యథాతథముగా చూపినంతమాత్రమున అది నాట్యము కాజాలదు. కావున లోకధర్మియును, నాట్యధర్మియును—రెండును నాట్యమందుఉండునని తెలియవలెను. నాటకాదులందు నాట్యధర్మి అధికముకాగా ప్రకరణాదులందు లోకధర్మి అధికము. ఇంకొక దృష్టితో చూచినచో నృత్త-నృత్యములందు నాట్యధర్మి అధికముకాగా, నాట్యమునందు లోకధర్మి అధికము. ఈ రెండును ఇట్లే తర-తమ భేదములతో సర్వరూపకములందును ఉండును. ఈ విషయమును భరతుడు పదేపదే స్పష్టముచేయుచునే ఉండును.

"నాట్యధర్మి – లోకధర్మి" (Idealism and Realism of Bharata's Stage) అను పేరుతో డా. వి. రాఘవన్‌గారు రెండు వ్యాసములను వ్రాసియున్నారు. వివరములకు వానిని పరిశీలించవలెను. [Journal of Oriental Research, Madras – Vol. VII Part IV-Pp. 359-375 - (Oct - Dec. 1933) ; Vol. VIII. Part I - Pp. 57-74 (Jan - March - 1934.)]

పాశ్చాత్యుల వాదముల (isms)లో ముఖ్యములైన మూడింటిని ఇప్పుడు వివరింతును—

(1) రియలిజమ్ (స్వభావవాదము – Realism) — 19 వ శతాబ్ది రెండవ భాగమందు ప్రఖ్యాత నాటకరచయిత అయిన ఇబ్సెన్ ఈ వాదమును ప్రచారములోనికితెచ్చెను. ఈ వాదము ననుసరించి నాడును, తరువాతి కాలమందును నాటకములలో 'లోకధర్మి' కే అధిక ప్రాధాన్య మొసంగబడెను. " Dramas...should approximate in speech and situation to the social and domestic problems of every day, played by actors who rejected all artifice and spoke and moved naturally, against scenery which reproduced with fidelity the usual surroundings of the people they represented." [ Oxford companion to the Theatre - p. 660 ] ఇట్టి క్రొత్తనాటకములను ప్రదర్శించుటకు తగిన క్రొత్తనటులను ఆ నాడు నాటకరచయితలు వలవేసి వెదకవలసి వచ్చినదట.

(2) నాచురలిజమ్ (యథార్థతావాదము – Naturalism) — ఇది 19 వ శతాబ్ది చివర ప్రాధాన్యమునకు వచ్చినది. ఇది రియలిజమునందుకంటెను అధికమైన యథార్థతను వాంఛించుచున్నది. రియలిజమ్ కొంతలో కొంత సంభావ్యతకు స్థానమిచ్చుచుండగా, ఇది అట్టిదానినికూడ ఏమాత్రమును అంగీకరించదు. వ్యావహారిక భాషతోపాటు లోకవ్యవహారమును ఉన్నదానిని ఉన్నట్లుగా ప్రదర్శించవలెనని దీని భావము. అనగా 'లోకధర్మి' ఇందు మితిమీరినది.

ఈ వాదమునుభారతీయ నాట్యవేత్తలంగీకరించరు. కొందరు పాశ్చాత్య విమర్శకులే ఈ వాదమును ఖండించి యున్నారు—

"...The actor seeks for the pointed word, the crystalline word, the lyrical word, the inevitable word. Can the naturalistic drama offer these? Seldom indeed." ["Drama" by Ashley Dukes.]

గోథే (Goethe) కూడ దీనిని ఖండించియున్నాడు. ("Criticisms, Maxims and Reflections"—Scott Library Edition)—

"It is only to the entirely uncultured spectator that a work of art can appear as a work of nature...It is the uncultured lover of art who demands that the work should be natural, so that he too may be enabled to enjoy it in a natural, yet often crude and vulgar way...spectators are of two types—the cultured and the amateur; the former enjoys a piece of art on grounds of 'its own laws' and acccording to its own properties, while the latter demands things on the stage to be natural." [Quoted by Dr. Raghavan in the Journal of Oriental Research, Vol. VII Part IV - Pp. 363-364]



3. సింబాలిజమ్ (ప్రతీకవాదము = Symbolism)— నాటకములు పుట్టినప్పుడే ఈ వాదమును పుట్టినదని చెప్పవచ్చును. రంగమునందు ఒక సింహాసనమును ఏర్పాటుచేసి అదియే దర్బారు అనుట, ఒక గుడారమును నిర్మించి అదియే యుద్ధభూమిఅనుట మొదలగునవి ఈ వాదమునకు సంబంధించినవే. 20 వ శతాబ్ది ప్రారంభములో రియలిజమ్‌కు వ్యతిరేకముగా ఈ వాదమును బహుళ ప్రచారములోనికి తెచ్చినవాడు మారిస్ మేటర్‌లింకు. ఆతడు సృష్టించిన పాత్రలకొక ప్రత్యేక వ్యక్తిత్వములేదు. అవి వాని అంతర జీవితమునకు సంబంధించిన ప్రతీకలుమాత్రమే. చైనీయుల నాటకరంగమునందు కూడ ప్రతీకవాదమునకే ప్రాముఖ్యమధికము- "Stage properties are symbolic and, like almost everything connected with the Chinese Theatre, strictly conventional. An ordinary table may represent an altar, a judge's bench, a bridge, a banquet board etc. and can serve for climbing mountains or scaling battlements; by jumping over it the actor may be jumping over a wall..." [ Oxford companion to the Theatre - Pp. 125-126. ]

3. ప్రవృత్తి

"వేష-భాషానుకరణమును, ఆచారప్రవర్తకమును, వృత్త్యాశ్రయమును అయినదే ప్రవృత్తి అనబడు" నని విష్ణుధర్మోత్తర పురాణ నిర్వచనము.

"...వేష విన్యాస క్రమ మేది కలదో అదియే ప్రవృత్తి యని, విలాస విన్యాస క్రమ మేది గలదో అదే వృత్తియని యనంబడును. వచనవిన్యాస క్రమమేదిగలదో అదియే రీతినాఁ బడెను" అని రాజశేఖరుడు పేర్కొనెను. [ కావ్యమీమాంస - శ్రీ పంచాగ్నులవారి అనువాదము - పుట 39 ]

"తత్తద్దేశోచిత భాషా-క్రియా-వేషములే ప్రవృత్తులగు" నని సింగభూపాలుడు పేర్కొనెను. [రసార్ణవసుధాకరము - శ్రీ బులుసువారి అనువాదము - పుట 266]

"వేషవిన్యాసక్రమమే ప్రవృత్తి"అని రాజశేఖరు ననుసరించి భోజుడుకూడ చెప్పెను. [శృంగారప్రకాశము - 12 వ అధ్యా.]

ప్రవృత్తి అనగా దేశవిశేషగతమగు వేష-భాషా-ఆచార-వార్తా వైచిత్ర్య ప్రసిద్ధి అని సారాంశము. ఏయే దేశములందు ఏయే విధములగు వేష-భాషా-ఆచార (లోక-శాస్త్ర వ్యవహారము)-వార్త (కృషి-పాశుపాల్యాది జీవికలు) లుప్రసిద్ధములై ఉండునో వాటి నెల్ల తెలియజేయునవి ప్రవృత్తులు అనబడును.

ప్రవృత్తియందు ప్రధానమగు వేషము (కట్టు, బొట్టు మొ.) ఆహార్యాభినయమునకు సంబంధించిఉన్నది. ప్రవృత్తి విపులముగా మూలమందే వివరింపబడినదికదా? [ఇంకను వివరములకు డా. రాఘవన్‌గారి Bhoja's Sṛngara Prakasa Pp. 207-215 చూడవలెను]

4. ఈపదు మూడవ అధ్యాయముతో ఆంగికాభినయచర్చ ముగిసినది. పుట 324 లోని 4 వ విశేషాంశములో చెప్పబడిన శిరో - హస్తాది భేదముల పట్టికను ప్రక్కపుటలో ఒసంగుచున్నాను.

---

| అంగ - ఉపాంగ - ప్రత్యంగ భేదములు | శిరో | హస్త | హృదయ | పార్శ్వ | కటి | పాద | గ్రీవ | బాహు | జఠరం | ఊరు | జంఘా | దృష్టి | భ్రూ | పుట | తార | నాసా | అధర | గండ | చిబుక | ముఖరాగ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| భరతుడు - నాట్యశాస్త్రము (క్రీ. పూ. 200 - క్రీ. శ. 300) | 1 3 | 24+13+30 | 5 | 5 | 5 | 5+1 | 9 | .... | 3+1 | 5 | 5 | 36 | 7 | 9 | 9 | 6 | 6 | 6 | 7 | 4 |
| సోమేశ్వరుడు-అభిలషితార్థ చింతామణి (1140 ప్రాంతము) | 13 | 64 | 5 | 5 | 5 | 9 | .... | 8 | 4 | .... | 5 | 8+8+26 | 7 | .... | .... | 6 | 18 (?) | 6 | .... | 5 |
| జగదేకమల్లుడు-సంగీత చూడామణి (1134-43 రాజ్యకాలము) | 13 | 64 | 5 | 5 | 5 | 5 | .... | 10 | 3 | 5 | 5 | 36 | .... | .... | 9 | 6 | 6 | 6 | .... | 4 |
| అశోకమల్లుడు - సంగీత గ్రంథకర్త (1300 తరువాత) | .... | 67 | 5 | 5 | 5 | 6+7 | 9 | 10+6 | 4 | 5 | 5+5 | 28 | 7 | 9 | 8+8 | 6 | 6+4 | 6 | 8 | 4 |
| సోమరాజు - సంగీతరత్నావళి (రచన - 1180) | 13 | 64 | 5 | 5 | 5 | 6 | 9 | 10 | 3 | 5 | 5 | 36 | .... | .... | .... | 6 | 6 | 7 | .. | 4 |
| హరిపాలుడు - సంగీతసుధాకరము (1175 ప్రాంతము) | 9+13 | 33+16+21 | 3+5 | 5 | 3+5 | .... | .... | .... | 2 | .... | .... | 28+36 | 3 | .... | .... | 2+5 | 2+6 | .... | .... | .... |
| జాయన - నృత్తరత్నావళి (రచన - 1253) | 13 | 64 | 5 | 5 | 5 | 5 | 9 (?) | 10+6 | 3 | 5 | 5 | 36 | .... | .... | .... | .... | 6+4 | 6 | 7 | 4 |
| శార్ఙ్గదేవుడు - సంగీతరత్నాకరము (1230 ప్రాంతము) | 14+15 | 67 | 5 | 5 | 5 | 13 | 9 | 16 | 4 | 5 | 10 | 36 | 7 | 9 | 9 | 6 | 10 | 6 | 8 | 7 |
| నందికేశ్వరుడు - అభినయదర్పణము (4వ శతాబ్ది తరువాత) | 9 | 32+23 | .... | .... | .... | .... | 4 | .... | .... | .... | .... | 8 | .... | .... | .... | .... | .... | .... | .... | .... |
| మోక్షదేవుడు - సంగీతసార కలికము (1320 ప్రాంతము) | 14 | 67 | 5 | 5 | 5 | 6 | 9 | 10+6 | 4 | 5 | 5 | 36 | 7 | 9 | 9+9 | 6 | 10 | 6 | 8 | 4 |
| పార్శ్వదేవుడు-సంగీతసమయసారము (1300 ప్రాంతము) | 13+9 | 64 | 5+4 | 5+4 | 5+5 | 6+5 | 9 | 10+5 | 5 | 5 | 5 | 36 | 7 | 9 | 9 | 6 | 6 | 6 | 7 | .... |
| వేమభూపాలుడు-సంగీతచింతామణి (1400 ప్రాంతము) | .... | 27+13+30 | 5 | 5 | 5 | 13 | 9 | 16 | 4 | 5 | 16 | 36 | 7 | 9 | 17 | 6 | 5 | 6 | 8 | 8 |
| కుంభకర్ణుడు - సంగీతరాజము (రచన - 1449) | 13 | 80 | 5 | 5 | 5 | 13 | 9 | 16 | 4 | 5 | 9 | 36 | 7 | 9 | 9+8 | 6 | 10 | 6 | 8 | 4 |
| శ్రీకంఠుడు - రసకౌముది (రచన - 1583) | 13 | 63 | 5 | 5 | 5 | 13 | 9 | 16 | 4 | 5 | 10 | 28 | 7 | 9 | 17 | 6 | 10 | 6 | 8 | 4 |
| లక్ష్మీనారాయణుడు - సంగీత సూర్యోదయము (రాయల కాలము) | 14+5 | .... | 5 | 5 | 5 | 13 | 9 | 16 | 4 | 5 | 10 | 36 | 7 | 9 | 9+8 | 6 | 6 | 6 | 8 | 4 |
| బసవరాజు - శివతత్త్వరత్నాకరము (1700 ప్రాంతము) | 8+5 | .... | 5 | 5 | 5 | 6 | .... | 10 | 6 | 5 | 5 | 36 | 7 | 9 | 9 | 6 | 6 | 6 | 7 | 5 |
| హమ్మీరుడు-శృంగారహారము (12 వ శతాబ్ది ప్రాంతము) | 14+5 | 24+13+30+3 | 5 | 5 | 5 | 6 | 9 | 10 | 4 | 5 | 5 | 36 | .... | .... | 9+8 | 6 | 6+10 | 6 | 8 | 4 |

# అధ్యాయము 14[1]

## వ్యాకరణము : ఛందస్సు[2]

[కాశీముద్రణమునందు 15 వ అధ్యా - 119 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 14 వ అధ్యా - 120 శ్లోకములును; బరోడా ముద్రణమునందు 14 వ అధ్యా - 133 శ్లోకములును కలవు.]

6 వ అధ్యాయమందు వాగభినయమును (వాచికాభినయమును) పేర్కొని యున్నాను. స్వర-వ్యంజన సంభవమగు ఆ వాచికాభినయ లక్షణము నిప్పుడు వివరింతును—

### వ్యాకరణము

వాచికాభినయ ప్రాధాన్యము

> వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషా తనుః స్మృతా ।
> అంగనైపథ్యసత్త్వాని వాక్యార్థం వ్యంజయంతి హి ॥ 2
> వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవ చ ।
> తస్మా ద్వాచఃపరం నాస్తి వాగ్ఘి సర్వస్యకారణమ్ ॥ 3

—వాక్కు నాట్యమునకు తనువు; కావున దానిని గూర్చి అధికమగు శ్రద్ధను తీసికొనవలెను[3]. ఆంగిక-ఆహార్య-సాత్త్వికాభినయములు మూడును వాక్యార్థమునే అభివ్యక్తము చేయును. సమస్త శాస్త్రములును వాక్స్వరూపములే; అంతియేకాక

1. ఈభాగము కాశీ ముద్రణమునందు పంచదశాధ్యాయము. బొంబాయి-బరోడా ముద్రణములందు చతుర్దశాధ్యాయము.

2. 'వాచికాభినయమందు ఛందో విభాగము లేదా విధానము'- అని కాశీ-బొంబాయి-బరోడా ముద్రణముల పాఠము.

సూచన : 13 వ అధ్యాయముతో 'ఆంగికాభినయ' చర్చ పూర్తియైనది. ఇంక వాచికాభినయ చర్చ ప్రారంభింపబడుచున్నది. ఆ వాచికాభినయమునకు సంబంధించినవే ఈ వ్యాకరణ-ఛందో విభాగములు.

3. 19 వ అధ్యాయమందు 'ఇతివృత్తము నాట్య శరీరము' అని చెప్పబడినది. వాక్కుచే సర్వాకారమును కాన ఇతివృత్తముకూడ వాక్స్వరూపమే అగుచున్నది. కావున 'వాక్కు నాట్యమునకు తనువు(=శరీరము)' అనుట పై దానికి విరుద్ధముకాదని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం. పుట 225] సకల ప్రయోగమునకును భిత్తివంటిదియును, ఆతోద్య - గీత - అభినయములకు ఆశ్రయమైనదియును, స్వయమభినయరూపమైనదియును అగుటచే వాచికాభినయము నాట్యతనువుగా చెప్పబడినది. [అభినవభారతి - 2 వ సం - పుటలు 220-221]

| అంగ - ఉపాంగ - ప్రత్యంగ భేదములు | భరతుడు - నాట్యశాస్త్రము (క్రీ. పూ. 200 - క్రీ. శ. 300) | సోమేశ్వరుడు-అభిలషితార్థ చింతామణి (1140 ప్రాంతము) | జగదేకమల్లుడు-సంగీత చూడామణి (1134-43 రాజ్యకాలము) | అశోకమల్లుడు - సంగీత (గ్రంథకర్త (1300 ప్రాంతము) | సోమరాజు - సంగీతరత్నావళి (రచన - 1180) | హరిపాలుడు - సంగీతసుధా కరము (1175 ప్రాంతము) | జాయన - నృత్తరత్నావళి (రచన - 1253) | శార్ఙ్గదేవుడు - సంగీతరత్నా కరము (1230 ప్రాంతము) | నందికేశ్వరుడు - అభినయ దర్పణము (4వ శతాబ్దికావచ్చు) | మోక్షదేవుడు - సంగీతసార కలికము (1320 ప్రాంతము) | పార్శ్వదేవుడు-సంగీతసమయ సారము (1300 ప్రాంతము) | వేమభూపాలుడు-సంగీతచింతా మణి (1400 ప్రాంతము) | కుంభకర్ణుడు - సంగీతరాజము (రచన - 1449) | శ్రీకంఠుడు - రసకౌముది (రచన - 1583) | లక్ష్మీనారాయణుడు - సంగీత సూర్యోదయము (రాయల కాలము) | బసవరాజు - శివతత్త్వరత్నా కరము (1700 ప్రాంతము) | హమ్మీరుడు-శృంగారహారము (12 వ శతాబ్ది ప్రాంతము) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శిరో | 1 3 | 13 | 13 | .... | 13 | 9+13 | 13 | 14+15 | 9 | 14 | 13+9 | .... | 13 | 13 | 14+5 | 8+5 | 14+5 |
| హస్త | 24+ 13+30 | 64 | 64 | 67 | 64 | 33+ 16+21 | 64 | 67 | 32+ 23 | 67 | 64 | 27+13 +30 | 80 | 63 | .... | .... | 24+13 +30+3 |
| హృదయ | 5 | 5 | 5 | 5 | 5 | 3+5 | 5 | 5 | .... | 5 | 5+4 | 5 | 5 | 5 | 5 | 5 | 5 |
| పార్శ్వ | 5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 | .... | 5 | 5+4 | 5 | 5 | 5 | 5 | 5 | 5 |
| కటి | 5 | 5 | 5 | 5 | 5 | 3+5 | 5 | 5 | .... | 5 | 5+5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 |
| పాద | 5+1 | 9 | 5 | 6+7 | 6 | .... | 5 | 13 | .... | 6 | 6+5 | 13 | 13 | 13 | 13 | 6 | 6 |
| గ్రీవా | 9 | .... | .... | 9 | 9 | ... | 9 (?) | 9 | 4 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | .... | 9 |
| బాహు | .... | 8 | 10 | 10+6 | 10 | .... | 10+6 | 16 | .... | 10+6 | 10+5 | 16 | 16 | 16 | 16 | 10 | 10 |
| జఠరం | 3+1 | 4 | 3 | 4 | 3 | 2 | 3 | 4 | .... | 4 | 5 | 4 | 4 | 4 | 4 | 6 | 4 |
| ఊరు | 5 | .... | 5 | 5 | 5 | .... | 5 | 5 | .... | 5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 | 5 |
| జంఘా | 5 | 5 | 5 | 5+5 | 5 | .... | 5 | 10 | .... | 5 | 5 | 16 | 9 | 10 | 10 | 5 | 5 |
| దృష్టి | 36 | 8+8 +26 | 36 | 26 | 36 | 28+36 | 36 | 36 | 8 | 36 | 36 | 36 | 36 | 26 | 36 | 36 | 36 |
| భ్రూ | 7 | 7 | .... | 7 | .... | 3 | .... | 7 | .... | 7 | 7 | 7 | 7 | 7 | 7 | 7 | .... |
| పుట | 9 | .... | .... | 9 | .... | .... | .... | 9 | .... | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | .... |
| తారా | 9 | .... | 9 | 8+8 | .... | .... | .... | 9 | .... | 9+9 | 9 | 17 | 9+8 | 17 | 9+8 | 9 | 9+8 |
| నాసా | 6 | 6 | 6 | 6 | 6 | 2+5 | .... | 6 | .... | 6 | 6 | 6 | 6 | 6 | 6 | 6 | 6 |
| అధర | 6 | 18 (?) | 6 | 6+4 | 6 | 2+6 | 6+4 | 10 | .... | 10 | 6 | 5 | 10 | 10 | 6 | 6 | 6+10 |
| గండ | 6 | 6 | 6 | 6 | 7 | .... | 6 | 6 | .... | 6 | 6 | 6 | 6 | 6 | 6 | 6 | 6 |
| చిబుక | 7 | .... | .... | 8 | .. | .... | 7 | 8 | .... | 8 | 7 | 8 | 8 | 8 | 8 | 7 | 8 |
| ముఖరాగ | 4 | 5 | 4 | 4 | 4 | .... | 4 | 7 | .... | 4 | .... | 8 | 4 | 4 | 4 | 5 | 4 |

# అధ్యాయము 14[1]

## వ్యాకరణము : ఛందస్సు[2]

[కాశీముద్రణమునందు 15 వ అధ్యా - 119 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 14 వ అధ్యా - 120 శ్లోకములును; బరోడా ముద్రణమునందు 14 వ అధ్యా - 133 శ్లోకములును కలవు.]

6 వ అధ్యాయమందు వాగభినయమును (వాచికాభినయమును) పేర్కొనియున్నాను. స్వర-వ్యంజన సంభవమగు ఆ వాచికాభినయ లక్షణము నిప్పుడు వివరింతును—

### వ్యాకరణము

**వాచికాభినయ ప్రాధాన్యము**

వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషా తనుః స్మృతా ।
అంగనైపథ్యసత్త్వాని వాక్యార్థం వ్యంజయంతి హి ॥ 2

వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవ చ ।
తస్మా ద్వాచఃపరం నాస్తి వాగ్ఘి సర్వస్యకారణమ్ ॥ 3

—వాక్కు నాట్యమునకు తనువు; కావున దానిని గూర్చి అధికమగు శ్రద్ధను తీసికొనవలెను[3]. ఆంగిక-ఆహార్య-సాత్త్వికాభినయములు మూడును వాక్యార్థమునే అభివ్యక్తము చేయును. సమస్త శాస్త్రములును వాక్స్వరూపములే; అంతియేకాక

1. ఈభాగము కాశీ ముద్రణమునందు పంచదశాధ్యాయము. బొంబాయి-బరోడా ముద్రణములందు చతుర్దశాధ్యాయము.

2. 'వాచికాభినయమందు ఛందో విభాగము లేదా విధానము'- అని కాశీ-బొంబాయి-బరోడా ముద్రణముల పాఠము.

సూచన : 13 వ అధ్యాయముతో 'ఆంగికాభినయ' చర్చ పూర్తిఅయినది. ఇంక వాచికాభినయ చర్చ ప్రారంభింపబడుచున్నది. ఆ వాచికాభినయమునకు సంబంధించినవే ఈ వ్యాకరణ-ఛందో విభాగములు.

3. 19 వ అధ్యాయమందు 'ఇతివృత్తము నాట్య శరీరము' అని చెప్పబడినది. వాక్కులే సర్వాకారములను కాన ఇతివృత్తముకూడ వాక్స్వరూపమే అగుచున్నది. కావున 'వాక్కు నాట్యమునకు తనువు(=శరీరము)' అనుట పైదానికి విరుద్ధము కాదని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం. పుట 225] సకల ప్రయోగములనకును భిత్తివంటిదియును, ఆతోద్య - గీత - అభినయములకు ఆశ్రయమైనదియును, స్వయమభినయరూపమైనదియును అగుటచే వాచికాభినయము నాట్యతనువుగా చెప్పబడినది. [అభినవభారతి - 2 వ సం - పుటలు 220-221]

వాఙ్నిష్ఠములుకూడను. కావున వాక్కునకతీతమైనది వేరొకటి లేదు. వాక్కే సమస్తమునకును కారణము[4].

నామములు, ఆఖ్యాతములు (క్రియలు), నిపాతలు, ఉపసర్గలు, తద్ధితములు, సమాసములు, సంధులు, విభక్తులు అనువాని జ్ఞానము వాచికాభినయమందు ఆవశ్యకము.

పాఠ్యము సంస్కృత-ప్రాకృత భేదములచే రెండు విధములు. వాని విభాగమును యథాక్రమముగా వివరింతును. ముందుగా సంస్కృత పాఠ్యమును వివరింతును [ప్రాకృత పాఠ్యము 17 వ అధ్యాయమందు వివరింపబడును.]

## సంస్కృత పాఠ్యము

సంస్కృత పాఠ్యము వ్యంజనములు, స్వరములు, సంధులు, విభక్తులు, నామములు, ఆఖ్యాతములు, ఉపసర్గలు, నిపాతలు, తద్ధితములు అను అంగములతోను, సమాసములతోను, వివిధ ధాతువులతోను కూడిఉండును.

*స్వరములు :* అఆ, ఇఈ, ఉఊ, ఋౠ, ఌౡ, ఏఐ, ఓఔ-అను ఈ పదునాలుగును స్వరములు[5] (=అచ్చులు).

*వ్యంజనములు :* క ఖ గ ఘ ఙ (=క వర్గము), చ ఛ జ ఝ ఞ (=చ వర్గము), ట ఠ డ ఢ ణ (=ట వర్గము), త థ ద ధ న (=త వర్గము), ప ఫ బ భ మ (=ప వర్గము), య ర ల వ శ ష స హ—అను ఈ ముప్పదిమూడును వ్యంజనములు (=హల్లులు).

---

కవిరూపక నిర్మాణ కాలమునందును, నటుడు ప్రయోగ కాలమునందును వాగ్విషయమున శ్రద్ధవహించవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 220]

4. వాక్కులను మించినది లేదని సారాంశము. 'వాగేవ విశ్వా భువనాని' అను శ్రుతి ననుసరించి సమస్త జగత్తును శబ్దవివర్తమే అని వాక్యపదీయాదులందు భర్తృహరి ప్రభృతులు నిరూపించియున్నారు. దాని నిచ్చట అనుసంధించుకొనవలెనని అభినవగుప్తుడు తెలిపెను. [అభినవభారతి - 2 వ సం - పుటలు 224-225]

నిర్దుష్టమును స్పష్టమును అగు అర్థజ్ఞానము కొరకును, శబ్దరూప సౌందర్య జ్ఞానము కొరకును వ్యాకరణ మావశ్యకమగుచున్నది [అభినవభారతి - 2 వ సం. పుట 225]

5. స్వరములు హ్రస్వ-దీర్ఘ-ప్లుత భేదములచే త్రివిధములు (ఉదా : అ, ఆ, ఆ̄). అవి మరల ఒక్కొక్కటి ఉదాత్త-అనుదాత్త-స్వరిత భేదములచే త్రివిధములు. ఇట్లు ఒక్కొక్క స్వరము తొమ్మిది విధములగుచున్నది. ఇవి అనునాసిక-నిరనునాసిక భేదములచే మరల రెండేసి విధములు. కాగా, ఒక్కొక్కస్వరమునకు మొత్తము 18 భేదములుండును. ఏ, ఐ, ఓ, ఔ లకు హ్రస్వములు లేకపోవుటచే వాటికి పన్నెండేసి భేదములే కలుగును. వ్యాకరణమునందు ఌ కారమునకు దీర్ఘము లేదు. కాని, ఇందు చెప్పబడినది.



*స్థానములు :* వర్ణోత్పత్తి స్థానములు ఎనిమిది—ఉరము, కంఠము, శిరము, జిహ్వామూలము, దంతములు, నాసిక, ఓష్ఠములు, తాలువు.

అ, క వర్గము, హ, ః—ఇవి కంఠ్యములు (వీనికి స్థానము కంఠము; అనగా ఇవి కంఠమునుండి పుట్టును. ఇట్లే ఇతరముల విషయముననను గ్రహించవలెను.)

ఇ, చ వర్గము, య, శ—తాలవ్యములు (వీనికి స్థానము తాలువు).

ఋ, ట వర్గము, ర, ష—మూర్ధన్యములు (వీనికి స్థానము మూర్ధము).

ఌ, త వర్గము, ల, స—దంత్యములు (వీనికి స్థానము దంతములు. దంతములనగా ఇచ్చట తెలుగు అర్థముకాదు, సంస్కృతమున దంతములనగా 'పళ్ళు=teeth' అని మాత్రమే అర్థము).

ఉ, ప వర్గము, ఉపధ్మానీయము (= ≍ ప)— ఓష్ఠ్యములు (వీనికి స్థానము ఓష్ఠము)

≍ క—జిహ్వామూలీయము (దీనికి స్థానము జిహ్వామూలము).

ఏ, ఐ—కంఠ-తాలవ్యములు (వీనికి స్థానములు కంఠ-తాలువులు రెండును).

ఓ, ఔ—కంఠోష్ఠ్యములు (వినికి స్థానములు కంఠ - ఓష్ఠములు రెండును.)

వ—దంతోష్ఠ్యము (దీనికి స్థానములు దంత-ఓష్ఠములు రెండును).

ఙ, ఞ, ణ, న, మ—అనునాసికములు (వీనికి స్థానము నాసిక).

విసర్గ (=ః)—ఇది ఔరస్యము (దీనికి స్థానము ఉరము) అని కొందరందురు. 'అ' వర్ణమునకు ముఖమంతయును ఉత్పత్తిస్థానమని మరికొందరందురు.[6]

వ్యంజనములయందు ఘోషములు, అఘోషములు, కంఠ్యములు, ఓష్ఠ్యములు, దంత్యములు, జిహ్వ్యములు (=మూర్ధన్యములు), అనునాసికములు, ఊష్మములు, తాలవ్యములు, విసర్జనీయము అను విభాగములు కలవు.

కఖ, చఛ, టఠ, తథ, పఫ, శషసహ—ఇవి అఘోషములు.

గఘఙ, జఝఞ, డఢణ, దధన, బభమ, యరలవ—ఇవి ఘోషములు. స్వరములన్నియును, శషసహ లును వివృతప్రయత్నము కలవి. క మొదలు మ వరకునుగల వ్యంజనములు స్పృష్టప్రయత్నము కలవి. యరలవలు నాలుగును సంవృతప్రయత్నము కలవి. క మొదలు మ వరకును గల వర్ణములు—స్పర్శములు.

---

6. 'స్వరములు... అ ఆ, ఇ ఈ... అనునది మొదలు ఇంతవరకును మూలము గద్యములో ఉన్నది. ఇందులో స్థానము లెనిమిదింటిని వివరించిన భాగము మాత్రము శ్లోకము.

శ ష స హ—ఊష్మములు. య ర ల వ—అంతస్థములు.

ᳵ క—జిహ్వామూలీయము. ᳵ ప—ఉపధ్మానీయము.

పాఠ్యప్రయోగమునందు 'క చ ట త ప' అను (వీనినే తెలుగులో పరుషము లందురు) స్వరితములుగను; 'ఖ ఛ ఠ థ ఫ' అను కంఠ్యములుగను, 'గ జ డ ద బ' అను (వీనినే తెలుగులో సరళములందురు) కంఠోర్యోరస్యములుగను తెలియవలెను.

విసర్జనీయము (=ః)—ఇది జిహ్వామూలస్థితమైన వర్ణము.

సవర్ణములు : ఇంతవరకును వ్యంజనవిభాగమును చెప్పితిని. ఇంక శబ్దప్రయోగమునందు స్వరముల విషయమును విరింతును. ఏస్వరములు స్థానసామ్యమును కలిగి ఉండునో అవి సవర్ణములు. 14 అచ్చులలోను మొదటి పది అచ్చులను సవర్ణములగు 5 జంటలుగా ఏర్పడును (ఉదా—అ ఆ, ఇ ఈ...) వానిలో మొదటిది హ్రస్వము, రెండవది దీర్ఘము.*

శబ్దలక్షణము

వ్యంజన సంయుక్తములగు స్వరములచే ఏర్పడిన నామ-అఖ్యాత-నిపాత-ఉపసర్గ-ధాతువులచే కావ్యములు నిర్మింపబడుచున్నవి. పూర్వాచార్యులచే విపులముగా చెప్పబడిన శబ్దలక్షణమును ఇప్పుడు నేను సంగ్రహాముగా వివరింతును—

నామము : సు, ఔ, జస్ మొదలగు విభక్తి ప్రత్యయములతో కూడి అర్థ విశేషములను ప్రతిపాదించునదియును ; ప్రాతిపదికార్థములతో (basic meanings) లింగముతో, వచనముతో కూడినదియును ; ఉణాద్యంత-కృదంత-తద్ధితాంత-సమాసజ-శబ్దానుకరణభేదములచే ఐదు విధములుగా ఉండునదియును 'నామము' అనబడును. ఇందు ఏడు విభక్తులును, ఆరు కారకములును (నిర్దేశ, అపాదాన, సంప్రదానాదులు) ఉండును. మరియు ఇది ప్రథితము (అవ్యుత్పన్నము లేదా రూఢము), సాధ్యము (వ్యుత్పన్నము లేదా యౌగికము) అను భేదములచే రెండు విధములుగా ఉండును.

అఖ్యాతము(క్రియ) : నామము యొక్క వచనముచే నియమితమైన వచనము కలదియును, ఉత్తమ-మధ్యమ-ప్రథమ పురుషలచే విభక్తమును, భూత-భవిష్య ద్వర్తమాన కాలములతో కూడినదియును 'అఖ్యాతము' అనబడును.

ఉపసర్గ : తన కలయికచే ప్రాతిపదికల యొక్క, ధాతువుల యొక్క అర్థములను మార్పుచెందించునది 'ఉపసర్గ' అనబడును.

* [కాశీ ముద్రణమునందు 15 వ అధ్యా— 1-20 శ్లో; బొంబాయి ముద్రణమునందు 14 వ అధ్యా— 1-20 శ్లో; బరోడా ముద్రణమునందు 14 వ అధ్యా— 1-23 శ్లో.]



నిపాతము (అవ్యయము - 'అహో' మున్నగునవి) :— ప్రాతిపదికార్థమును, ఛందమును, ధాతువును, నిరుక్తమును పోషించుటకై పదములతో కూడిఉండునది 'నిపాతము' అనబడును.

ప్రత్యయము : అర్థపూర్తిని చేయుచు దానికి ప్రకర్షమునుకాని, అర్థాంతరమును కాని, భావవాచకత్వమును కాని కలిగించునది 'ప్రత్యయము' అనబడును.

తద్ధితము : ప్రాతిపదికార్థపూర్తినిచేయుచు, ప్రకృతి-ప్రత్యయ విభాగమును, అర్థాంతర సంబంధమును, భావవాచకత్వమును కలిగించునదై, ప్రకృతి-ప్రత్యయముల విభాగ-సంయోగములను చేయునది 'తద్ధితము' అనబడును.

విభక్తి : ఒక పదమునకు కాని చాల పదములకు కాని చేర్పబడునదియును ధాతుసంబంధి కాని లింగసంబంధి కాని అగునదియును, అర్థములను విభజించునదియును 'విభక్తి' అనబడును.

సంధి : విశిష్టములైన స్వరములు కాని, వ్యంజనములు కాని సంహితలో సంయుక్తములగుట 'సంధి' అనబడును.

సమాసము : అనేక పదములు విభక్తిలోపముచే ఏకమై ఏకార్థమును ప్రతిపాదించుట 'సమాసము' అనబడును. ఇది తత్పురుషాది భేదములచే షడ్విధము.

## ఛందస్సు

కావ్య ద్వైవిధ్యము

పైన వివరింపబడిన శబ్దవిధానముల ననుసరించి నిబద్ధబంధము (=పద్యము)గా కాని, చూర్ణము (=గద్యము) గా కాని పదబంధములను కూర్చవలెను. ఈ పదబంధములు విస్తృతార్థద్యోతకములు కావలయును.

విభక్త్యంతమైనదానిని పదమందురు. అట్టి పదములు రెండు విధములు— నిబద్ధము (ఛందోబద్ధము), చూర్ణము (గద్యము)—

చూర్ణము : వృత్తబద్ధము కానిదియును, అక్షరసంఖ్యా నియమము కాని గురు-లఘునివేశనియమము కాని లేనిదియును, అర్థాపేతగల (వీర-శృంగారాది రసములను అభివ్యక్తము చేసెడి) అక్షరముల కూర్పు కలిగినదియును 'చూర్ణపద' మనబడును.[7]

7. 'కేవల పఠనకర్మ వలన ఇది గద్య' మనబడుచున్నదని అభినవగుప్తుడు తెలిపెను. [అభినవభారతి - 2 వ సం - పుట 234]

నిబద్ధము : నిబద్ధమైన (అనగా ఛందోబద్ధమైన) అక్షరములయొక్క కూర్పు కలదియును, యతియు[8] అక్షరసంఖ్యా నియమము కలదియును 'నిబద్ధపద' మనబడును.

ఈ విధముగా వివిదార్థములను బోధించెడి వివిధవర్ణములచే అలంకృతములగు నాలుగు పాదములతో కూడిన ఛందస్సు 'వృత్త' మనబడును. అక్షరసంఖ్యా భేదములచే ఈ ఛందస్సు 26 విధములు. వానినుండియే వివిధములగు వృత్తము లేర్పడినవి. సమము, విషమము, అర్ధసమము[9] అను భేదములచే వృత్తములు మూడు విధములు. వృత్తరూపముగానుండు ఈ ఛందస్సు శబ్దమునకు శరీరము.

ఛందోహీనో న శబ్దోఽస్తి న ఛ్ఛందశ్శబ్ద వర్జితమ్ ।
ఏవం తూభయసంయోగో నాట్యస్యోద్యోతకః స్మృతః[10] ॥ 45

—ఛందస్సునకు కట్టుబడని శబ్దముకాని, శబ్దములేనిదే ఛందస్సుకాని ఉండదు. ఈ రెండింటి సంయోగమే నాట్యమునకు వన్నె తెచ్చునని తెలియవలెను.[11]*

ఛందములు

1. పాదమునకు ఒక అక్షరముమాత్రమే ఉన్నచో ఆ ఛందము 'ఉక్తము' అనబడును.
2. ,, 2 అక్షరములు ,, 'అత్యుక్తము' ,,
3. ,, 3 ,, ,, 'మధ్యము' ,,
4. ,, 4 ,, ,, 'ప్రతిష్ఠ' ,,

8. 'యతి' అనగా విరామము, ఇచ్చట పదచ్ఛేదము మాత్రమే ఉండును. తెనుగు నందలి 'యతి' ఇట్టిదికాదు. అచ్చటి యతి అక్షరమైత్రికి సంబంధించిఉండును ; పదచ్ఛేదమును కూడ పాటించిన పాటించవచ్చును.

9. నాలుగు పాదములును సమాన లక్షణోపేతములైనచో అది 'సమ వృత్తము'. 4 పాదములును పూర్తిగా భిన్నములైనచో అది 'విషమవృత్తము'. 1, 2 పాదములు, 2, 4 పాదములు సమానములుగా ఉన్నచో అది 'అర్ధసమవృత్తము.'

10. ఈ శ్లోకమును 6 వ అధ్యాయమందలి 36 వ శ్లోకముతో (నభావహీనోఽస్తి రసో...) పోల్చి చూడవలెను. రస-భావ సంబంధము ఆత్మ విషయము ; శబ్ద-చ్ఛందస్సంబంధము శరీర విషయము అని తెలియవలెను.

11. నాట్యము అర్థాశ్రయము, అర్థము శబ్దాశ్రయము, శబ్దము వృత్తనిబద్ధము, అవృత్తములు ఛందః పరిణామములే. అందుచేతనే 'ఛంద-శ్శబ్ద సంయోగము నాట్య' మని పేర్కొనబడినది.

*[కాశీ ముద్రణమునందు 15 వ అధ్యా - 21-40 శ్లో ; బొంబాయి ముద్రణమునందు 14 వ అధ్యా - 21-40 శ్లో; బరోడా ముద్రణమునందు 14 అధ్యా - 28-45 శ్లో.]



పాదమునకు .. అక్షరములు మాత్రమే ఉన్నచో ఆ ఛందము ..... అనబడును.
5. ,, 5 ,, ,, 'సుప్రతిష్ఠ' ,,
6. ,, 6 ,, ,, 'గాయత్రి' ,,
7. ,, 7 ,, ,, 'ఉష్ణిక్కు' ,,
8. ,, 8 ,, ,, 'అనుష్టుప్' ,,
9. ,, 9 ,, ,, 'బృహతి' ,,
10. ,, 10 ,, ,, 'పంక్తి' ,,
11. ,, 11 ,, ,, 'త్రిష్టుప్' ,,
12. ,, 12 ,, ,, 'జగతి' ,,
13. ,, 13 ,, ,, 'అతిజగతి' ,,
14. ,, 14 ,, ,, 'శక్కరి' ,,
15. ,, 15 ,, ,, 'అతిశక్కరి' ,,
16. ,, 16 ,, ,, 'అష్టి' ,,
17. ,, 17 ,, ,, 'అత్యష్టి' ,,
18. ,, 18 ,, ,, 'ధృతి' ,,
19. ,, 19 ,, ,, 'అతిధృతి' ,,
20. ,, 20 ,, ,, 'కృతి' ,,
21. ,, 21 ,, ,, 'ప్రకృతి' ,,
22. ,, 22 ,, ,, 'ఆకృతి' ,,
23. ,, 23 ,, ,, 'వికృతి' ,,
24. ,, 24 ,, ,, 'సంకృతి' ,,
25. ,, 25 ,, ,, 'అభికృతి' ,,
26. ,, 26 ,, ,, 'ఉత్కృతి' ,,

ఒక పాదమునందు 26 అక్షరములకంటె మించి అక్షరములున్నచో అది 'మాలావృత్త' మనబడును.

ఛందో భేదములను పైన వివరించితిని. వీనిని ప్రస్తరించుటవలన లెక్కలేనన్ని వృత్తము లేర్పడుచున్నవి. గాయత్రి మొదలగు ఛందములకు[12] ప్రమాణములను ఇంక వివరింతును. కాని ఇవి అన్నియును వాడుకలో లేవని తెలియవలెను.

12. ఉక్తము మొదలు సుప్రతిష్ఠ వరకును గల ఐదు ఛందములును ప్రసిద్ధములు కావు. ప్రయోగార్హములును కావు. అందుచే వాటి ప్రమాణము వివరింపబడుటలేదు.

'లెక్కలేనన్ని వృత్తము లేర్పడుచున్నవి'— వివిధ ఛందో భేదముల సంఖ్య - 13,42,17,726 అని ముందు చెప్పబడును. ఇవిఅన్నియును వాడుకలోలేవనుట స్పష్టమే.

### వృత్త సంఖ్య

గాయత్రీచ్ఛందమును ప్రస్తరించుటవలన కలిగిన వృత్తభేదములు 64. అట్లే ఉష్ణిక్ భేదములు-128, అనుష్టుప్ భేదములు-256, బృహతీ భేదములు-512, పంక్తి భేదములు-1024, త్రిష్టుప్ భేదములు-2048, జగతీ భేదములు-4096, అతిజగతీ భేదములు-8192, శక్కరీ (శక్వరీ) భేదములు-16384, అతిశక్కరీ (శక్వరీ) భేదములు-32768, అష్టి భేదములు-65536, అత్యష్టి భేదములు-131072, ధృతీ భేదములు-262144, అతిధృతీ భేదములు-524288, కృతి భేదములు-1048576, ప్రకృతి భేదములు-2097152, ఆకృతి భేదములు-4194304, వికృతి భేదములు-8388608, సంకృతి భేదములు-16777216, అభికృతి భేదములు-33554432, ఉత్కృతి భేదములు-67108864.

పైని పేర్కొనిన వివిధ ఛందోభేదముల మొత్తము-13,42,17,726.*

### త్రికములు

అక్షరసంఖ్యాగణనము ననుసరించి సమవృత్తములను పైని వివరించి యున్నాను. అన్ని ఛందస్సులందును వృత్తములను త్రికములచే కూడ వివరించ వచ్చును. ఆ త్రికములు (మూడేసి అక్షరముల గణములు) ఎనిమిది విధములు. కేవలము గురువులచే కాని, కేవలము లఘువులచే కాని, గురు-లఘు సంయోగముచే కాని ఈ త్రికము లేర్పడుచున్నవి—

1. 'భ' కారము (భ గణము)—గురుపూర్వము (ు।। )
2. 'మ' కారము (మ గణము)—గురుత్రయము (ుుు)
3. 'జ' కారము (జ గణము)—గురుమధ్యము (।ు। )
4. 'స' కారము (స గణము)—అంత్యగురువు (।।ు )
5. రేఫము (ర గణము)—లఘుమధ్యము (ు।ు )
6. 'త' కారము (త గణము)—అంత్యలఘువు (ుు। )
7. 'య' కారము (య గణము)—లఘుపూర్వము (।ుు )
8. 'న' కారము (న గణము)—లఘుత్రయము (।।। )

---

కావుననే నాట్యోపయోగులైన వృత్తములు మాత్రమే తదువాతి అధ్యాయమందు లక్ష్య-లక్షణ సహితముగా నిరూపింపబడినవి.

*[కాశీ ముద్రణమునందు 15 వ అధ్యా-41-82 శ్లో; బొంబాయి ముద్రణము నందు 14వ అధ్యా-41-82 శ్లో; బరోడా ముద్రణమునందు 14 వ అధ్యా-46-82 శ్లో.]



*గురు లఘువులు* : ఈ ఎనిమిది త్రికములను బ్రహ్మసంభవములని తెలియవలెను. వీనిచేతనే సమ-విషమ-అర్ధసమజాతు లేర్పడుచున్నవి. లాఘవము కొరకును, ఛందఃప్రమాణము ననుసరించియును ఈ త్రికము లుపయుక్తములగుచున్నవి. ఇవి స్వరసహితములుగను, స్వరరహితములుగను కూడ ఉండును. ఒక గురువును 'గ' అనియు, ఒక లఘువును 'ల' అనియు వ్యవహరింతురు. రెండు గురువులను 'గా' అందురు, రెండు లఘువులను 'లా' అందురు.

దీర్ఘము, ప్లుతము, సంయోగపరకము, అనుస్వారసహితము, విసర్గసహితము అగు వర్ణము 'గురువు' అనబడును. పాదమునందలి చివరి లఘువుకూడ ఒక్కొక్కప్పుడు గురువు అగును.[13]

### ఛందములు : త్రికములు

ఇంక ఆయా ఛందములందలి త్రికముల సంఖ్యను వివరింతును— గాయత్రీచ్ఛందమున ఒక్కొక్క పాదములో 2 త్రికములుండును. అట్లే తక్కినవానిలో ఈ క్రింది విధముగా ఉండును— ఉష్ణిక్‌లో -2 త్రి + ఒక అక్షరము, అనుష్టుప్‌లో -2 త్రి +2 అక్షరములు, బృహతిలో -3 త్రికములు, పంక్తిలో -3 త్రి +1 అక్షరము, త్రిష్టుప్‌లో -3 త్రి +2 అక్షరములు, జగతిలో -4 త్రికములు, అతిజగతిలో -4 త్రి +1 అక్షరము, శక్వరిలో -4 త్రి +2 అక్షరములు, అతిశక్వరిలో -5 త్రికములు, అష్టిలో -5 త్రి +1 అక్షరము, అత్యష్టిలో -5 త్రి +2 అక్షరములు, ధృతిలో -6 త్రికములు, అతిధృతిలో -6 త్రి +1 అక్షరము, కృతిలో 6 త్రి +2 అక్షరములు, ప్రకృతిలో -7 త్రికములు, ఆకృతిలో -7 త్రి +1 అక్షరము, వికృతిలో -7 త్రి +2 అక్షరములు, సంకృతిలో -8 త్రికములు, అభికృతిలో -8 త్రి +1 అక్షరము, ఉత్కృతిలో -8 త్రి +2 అక్షరములు.

ఋక్కులయందలి రెండుపాదములలో రెండేసి అక్షరములు అధికముగాను, మిగిలిన పాదములు సమముగాను ఉన్నచో అది 'స్వరాట్టు' అనబడును; అట్లే రెండు అక్షరములు తక్కువగా ఉన్నచో అది 'విరాట్టు' అనబడును. ఒక పాదము నందొక అక్షరము అధికముగా ఉండి తక్కిన మూడు పాదములును సమముగా ఉన్నచో అది 'భురుక్కు' అనబడును; అట్లే ఒక అక్షరము తక్కువగా ఉన్నచో అది 'నివృత్తు' అనబడును.

---

13. ఇచ్చటినుండి ఈ అధ్యాయాంతమువరకును గల శ్లోకములు మూడు ముద్రణములందును ఒకే క్రమములో లేవు.

సంపదాదులు

ఇంక ఛందముల యొక్క సంపదాదులను వివరింతును. సంపత్తు, విరామము, పాదము, దేవత, స్థానము, అక్షరము, వర్ణము, స్వరము, విధి, వృత్తము-అనునవి ఛందోవిధికి సంబంధించిన విభాగములు.

ఏ వృత్తమునందు ఒక అక్షరమైనను అధికము కాని తక్కువ కాని, కాదో అది 'సంపత్తు' అనబడును.

ఎచ్చట అర్థసమాప్తి (అర్థవంతమైనపదముపూర్తి) అగునో అది 'విరామము' (యతి) అనబడును. నియమితమైన పదవిచ్ఛేదము (పదము విరుగుట) 'యతి' అనబడును.

'పద్' అను ధాతువునుండి 'పాద' శబ్దము నిష్పన్నమైనది. పాదమనగా నాలుగవభాగము.

అగ్న్యాదులు దైవతములు[14].

స్థానము రెండు విధములు—శరీరాశ్రయము, దిగాశ్రయము[15].

అక్షరములు హ్రస్వ-దీర్ఘ-ప్లుత భేదములచే మూడువిధములు.

ఛందములకు శ్వేతాది వర్ణములు కలవు[16].

స్వరము తార-మంద్ర-మధ్యమ భేదములచే మూడువిధములు. వీటి లక్షణములను ధ్రువావిధానమందు వివరింతును [వీని వివరణము కొంత 17 వ అధ్యాయమందు కూడ కలదు.]

---

14. భరతుడు దైవతములను వివరించలేదు. గాయత్రి మొదలు జగతి వరకును గల ఛందములకు వరుసగా అగ్ని, సవిత, సోముడు, బృహస్పతి, మిత్రావరుణులు, శక్రుడు, విశ్వదేవులు దైవతములని శ్రీ మా. రామకృష్ణకవిగారు తెలిపినారు. [2వ సం - పుట 245 లోని అధస్సూచిక.]

15. వీనికి ఉదాహరణములను కాత్యాయనుని నుండి అభినవగుప్తుడు పేర్కొనెను—

శరీరాశ్రయము- ఉదా: నాయికా వర్ణనమున వసంతతిలక వృత్తము, వీరుల భుజదండ వర్ణనమున స్రగ్ధరావృత్తము మొ॥

దిగాశ్రయము- ప్రాచ్యదేశములందు శార్దూలవిక్రీడితము, దక్షిణదేశమందు మందాక్రాంతము మొ॥ [అభినవభారతి - 2 వ సం - పుటలు 245-246]

16. వర్ణములను భరతుడు వివరించలేదు. ప్రాతిశాఖ్యాదులందు ఇవి వివరింపబడినవనియు, కాని అనుపయుక్తములగుటచే తాను వివరించుటలేదనియు అభినవగుప్తుడు పేర్కొనెను. గాయత్రి మొదలు జగతివరకును గల ఛందములకు వరుసగా సిత-సారంగ-పిశంగ-కృష్ణ-నీల-లోహిత-గౌరములు వర్ణములని శ్రీ మా. రామకృష్ణకవిగారు తెలిపినారు. [2 వ సం - పుట 246 లోని అధస్సూచిక.]



విధి రెండు విధములు— గణకృతము, అర్థకృతము.

వృత్తములు అర్ధసమ-సమ-విషమ భేదములచే మూడువిధములు.

త్రికగణములే ఈ వృత్తములన్నింటి యందును ఉపయుక్తములగును.

ఇంక ఈ ఛందములందు దివ్య-దివ్యేతర-దివ్యమానుష భేదములు కలవు— గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి-అను ఈ ఏడు ఛందములును 'దివ్యఛందము' లనబడును. అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి-అను ఈ ఏడు ఛందములును 'దివ్యేతర (=మానుష) ఛందము' లనబడును. కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి-అను ఈ ఏడు ఛందములును 'దివ్యమానుషఛందము' లనబడును*.

ఇంక ప్రస్తారవిధి లక్షణమును నష్ట-ఉద్దిష్టముల క్రమమును వివరింతును. అక్షర వృత్తములకు సంబంధించినది, మాత్రా వృత్తములకు సంబంధించినది అనెడి భేదములచే ప్రస్తారము రెండు విధములు. అక్షరగణవృత్తములందు ద్వికములు అనగా గురు-లఘువులు రెండు వర్ణములుగను, మాత్రా వృత్తములందు మిశ్రితములుగను ఉండును.

ప్రస్తారము[17]

ప్రస్తారమునకు ఎన్నవ ఛందమును గ్రహింతుమో అన్నిగురువులను మొదట వరుసగా ఉంచవలెను. తరువాత మొదటి గురువు క్రింద లఘువు నుంచవలెను. మిగిలిన చోట్ల గురువుల క్రింద గురువులను, లఘువుల క్రింద లఘువులను ఉంచవలెను. మొదటి గురువునకు పూర్వమందు మాత్రము గురువులనే ఉంచవలెను[18].

---

*[కాశీముద్రణమునందు 15వ అధ్యా-83-101 శ్లో; బొంబాయిముద్రణమునందు 14 వ అధ్యా-82-101 శ్లో; బరోడా ముద్రణము నందు 14 వ అధ్యా-82-116 శ్లో.]

17. ఇచ్చటినుండి ఈ అధ్యాయాంతమువరకును గల భాగమును ప్రక్షిప్తముగా తలంచి డా. ఘోష్ అనువదించలేదు. ఒక్కొక్క ఛందమున ఎన్నెన్ని వృత్తములు సంభావ్యములగునో తెలిసికొనెడు పద్ధతికి 'ప్రస్తార' మని పేరు.

18. ఉదా : మూడవ ఛందమును గ్రహించినచో ప్రస్తారము క్రిందివిధముగా ఉండును—

మొదట మూడు గురువులను వ్రాయవలెను. ऽ ऽ ऽ (మ)

రెండవ వరుసలో మొదటి గురువుక్రింద లఘువును వ్రాసి, మిగిలినచోట్ల పైని ఉన్నట్లే వ్రాయవలెను. । ऽ ऽ (య)

ఇట్లు ప్రస్తరింపగా సర్వచ్ఛందములందును ప్రథమ వృత్తము సర్వగురుకమును (వృత్తమునందంతటను గురువులే ఉండును), చివరి వృత్తము సర్వలఘువును (వృత్తమంతయును లఘువులతోనే నిండిఉండును), మిగిలినవృత్తములు గురు-లఘు మిశ్రితములును అగును.

*మాత్రాగణ ప్రస్తారము*: అక్షరగణ ప్రస్తారమున ప్రథమగురువుక్రింద లఘువును ఉంచవలెనని చెప్పితిని. మాత్రాగణ ప్రస్తారమున అట్టి గురువులక్రింద రెండేసి లఘువులను ఉంచవలెను. అక్షరవృత్త ప్రస్తారమందువలెనే మాత్రా సంఖ్యానుసారముగా అక్షరములను నిర్దేశించి పూర్వోక్త విధముననే ప్రస్తరించవలెను. వేర్వేరుగా లక్ష్యములను అనుసరించి గురు లఘువులు మిశ్రములై ఉండునని తెలియదగును. మాత్రాగణమున ఒక గురువు రెండు లఘువులని తెలియవలెను.

ఆర్యావృత్తమునకు నాలుగు మాత్రల గణములు ఉండవలెను. కావున అందు నాలుగు మాత్రలకు ప్రస్తారమును కావించవలెను. గీతకములు మున్నగువానియందు పంచమాత్రాప్రస్తారము చేయవలెను. వైతాలీయ ప్రభృతులు[19] షణ్మాత్రకములు. అక్షరగణములందు మూడేసి అక్షరములతో గణములుండును; అందు లఘువులును, గురువులును అగు అక్షరములు యథాసంభవముగా ఉండును. మాత్రాగణములు మాత్రము గురు-లఘ్వక్షరములనుబట్టి ఉండును; అనగా అక్షర త్రికరూపములగు గణములకు సంబంధించి ఉండవు.

---

ఇట్లే మరల వ్రాయునప్పుడు రెండవ స్థానమున మొదటి గురువు ఉన్నది కాన దాని క్రింద లఘువును వ్రాసి, పూర్వస్థానమున గురువునుంచి తరువాతి స్థానములందు పైని ఉన్నట్లే వ్రాయవలెను. U I U (ర)

మరల వ్రాయునప్పుడు మొదటి స్థానమున గురువున్నది కాన దాని క్రింద లఘువును ఉంచి తరువాతి స్థానములందు పైని ఉన్నట్లే వ్రాయవలెను. I I U (స)

మరల ఇట్లు ప్రస్తరించుటకు మొదటిగురువు మూడవ స్థానమునందున్నది కాన దానిక్రింద లఘువును వ్రాసి తత్పూర్వమందు రెండింటిని గురువులుగానే వ్రాయవలెను. U U I (త)

ఇట్లు మూడు స్థానములందును లఘువులు వచ్చువరకును I U I (జ)

ప్రస్తరించవలయును - అట్లు ప్రస్తరింపగా మూడవ U I I (భ)

ఛందమున మొత్తము 8 సమవృత్తములు పుట్టును. I I I (న)

మరికొన్ని ప్రస్తారోదాహరణములకు అప్పకవీయమును చూడవలెను [వావిళ్ళవారి ముద్రణము, 1924 - పుటలు 210-214]

19. వైతాలీయ ప్రభృతుల లక్షణోదాహరణములు అప్పకవీయమందు కలవు [పుటలు 258-259].



ఉద్దిష్టము

ఒక ఛందమున ఒక శ్లోకపాదమును చూపి అది ఆ ఛందమున ఎన్నవ వృత్తమని అడిగినచో తెలిసికొను మార్గము 'ఉద్దిష్ట' మనబడును.

అక్షర వృత్తమునందు ఆద్యక్షరమునుండి ఆరంభించి ద్విగుణితముగ సంఖ్యలు వేయవలెను. అనగా మూడవ ఛందమునందలి 'కేశవా' అను పాదమున వరుసగా 1, 2, 4 అంకెలను వేయగా కే¹ శ² వా⁴ అని అగును. ఇందు గుర్వక్షరముల మీది సంఖ్యలను విడువవలెను. లఘ్వక్షరములపై ద్విగుణితములుగా వ్రాయబడిన అంకెలను మొత్తముచేయగా ఉద్దిష్టవృత్త పూర్వవృత్త సంఖ్య వచ్చును. పైని చూపబడిన పాదమున రెండవ అక్షరము లఘువు. దానిమీది సంఖ్య రెండు. కాన దీనికి ముందు రెండు వృత్తములు గడచెనని తెలియవలెను. అనగా ఇది మూడవవృత్తము.

ఆయా ఛందములందు పుట్టు వృత్తముల ఏకాది సర్వసంఖ్యలను కూడి ఒక రాశిని తీసివేయగా మిగిలిన సంఖ్యల నన్నింటిని కూడినచో ఆ ఛందమునందలి అర్ధసమవృత్తముల సంఖ్య ఏర్పడును[20]. ఇట్లే సమవృత్తముల సంఖ్యను, అర్ధసమవృత్తముల సంఖ్యను కలిపి చివరిసంఖ్యను తగ్గించినచో సంగ్రహముగా విషమ వృత్తముల సంఖ్య ఏర్పడును.

ఆయా ఛందములందు పుట్టు వృత్తసంఖ్యా తెలియు మార్గము: ఛందోక్షరములందు వరుసగా ఏకాది ద్విగుణ సంఖ్యను వేసి పూర్వ పూర్వ సంఖ్యను ఉత్తరోత్తర సంఖ్యతోకూడి అనగా సంఖ్యల నన్నిటిని కలిపికూడి, ఒకటి కలిపిన అందలి వృత్తసంఖ్య లభించును.[21]

ఇట్లు సమవృత్తముల సంఖ్యను సంక్షేపముగ తెలియవలెను.

---

20. నాల్గవ ఛందమున 16 వృత్తములు పుట్టును. అందు చివరిరాశిని అనగా 16 వ సంఖ్యను విడిచి మిగిలిన వాటిని అనగా ఒకటి మొదలు పదునైదువరకును గల సంఖ్యలను కూడినచో మొత్తము 120 వచ్చును. ఇది నాల్గవ ఛందమున పుట్టు అర్ధసమవృత్తముల సంఖ్య అగును. అదెట్లన మొదటి వృత్తము శేషించిన 15 వృత్తములతో క్రమముగా కూడెనేని 15 అర్ధసమవృత్తము లగును. అట్లే రెండవవృత్తము మిగిలిన 14 వృత్తములతో క్రమముగా కూడిన 14 అర్ధసమవృత్తము లగును. ఇట్లన్నియును కలిసి 120 అర్ధసమ వృత్తము లగును.

21. నాల్గవ ఛందమందలి 1, 2, 4, 8 అను అంకెలను కూడిన 15 అగును. దానికి ఒకటిని కలిపినచో 16 అగును; అనగా 4 వ ఛందమున 16 వృత్తములు పుట్టునని భావము.

నష్టవృత్త జ్ఞానము

ఫలాని ఛందమున ఇన్నవ వృత్తమున గురు-లఘు విన్యాస మెట్లుండునో తెలిసికొను మార్గము 'నష్టవృత్త జ్ఞాన' మనబడును. వృత్త సంఖ్యను అర్ధముచే అనగా రెండుచే విభజించుచు, విభాజ్యము సమసంఖ్య అయినచో లఘువును, విభాజ్యము విషమ సంఖ్య అయినచో అది రెండుచే విభజింప బడదు కావునను ఒకటి కలిపి విభజించవలసి ఉండునుకావునను అట్టి విషమ సంఖ్యాస్థానమున గురువును వేయుచు ఛందస్సంఖ్య ఎంతయో అన్ని పర్యాయములు విభజింపగా వృత్తపాదము లభించును.[22]

ఇట్లు వృత్తములకు నష్టోద్దిష్టానుసారముగా గురు-లఘ్వక్షరములను విన్యసించ వలయును.

పైని వివరింపబడిన ఛందములందలి వృత్తములనే నాట్యమందు ప్రయోగించ వలెను.*

చతుర్దశాధ్యాయము సమాప్తము

---

22. నాల్గవ ఛందమున నాల్గవ వృత్తము సంఖ్య నాలుగు కావున దానిని రెండుచే భాగించి విభాజ్యము సమసంఖ్య కావున మొదట ఒక లఘువును వేయవలెను. మరల ఆ రెండును విభజింపగా ఇంకొకలఘువు వచ్చును. మరల ఆ ఒక్కటిని ఒక్కటి కలిపి విభజింప వలెను. ఇచ్చట విభాజ్యము విషమసంఖ్య కావున గురువు వచ్చును. మరల ఒక్కటి కలిపి విభజించుటలో ఇంకొక గురువు వచ్చును. కాగా నాల్గవవృత్తమున వరుసగా రెండు లఘువులును రెండు గురువులును ఉండునని తెలియవలెను. ప్రస్తరించిచూచినప్పుడు కూడ పై విధముగానే వచ్చును—

ऽ ऽ ऽ ऽ
। ऽ ऽ ऽ
ऽ । ऽ ऽ
నాల్గవ వృత్తము. । । ऽ ऽ

*[కాశీముద్రణమునందు 15 వ అధ్యా-101-119 శ్లో ; బొంబాయిముద్రణమునందు 14 వ అధ్యా-101-120 శ్లో ; బరోడా ముద్రణమునందు 14 వ అధ్యా-116-133 శ్లో.]



## విశేషాంశములు

### 1. వ్యాకరణము

నాట్యశాస్త్రమందు పదునాలుగు స్వరములు పేర్కొనబడెను. ఆయా శిక్షల యందును, ప్రాతిశాఖ్యల యందును స్వరముల మొత్తములు భిన్నభిన్న విధములుగా కన్పట్టుచున్నవి— పాణినీయ శిక్షయందు 22 స్వరములును, వాజసనేయియందు 16 స్వరములును, ఋక్తంత్ర వ్యాకరణమందు 23 స్వరములును చెప్పబడెను. వ్యంజనముల ఉత్పత్తి స్థానముల విషయమునను మతభేదములు కలవు. [డా. మనోమోహన్ ఘోష్ సంపాదించిన "పాణినీయ శిక్ష"ను పరిశీలించవలెను]. ప్రాతిపదికార్థసంఖ్యా విషయమునందు కూడ ఆయా వ్యాకరణకర్తలలో మతభేదములు కలవు— పాణిని జాతి-ద్రవ్యములను రెండింటిని చెప్పెను. కాత్యాయనుడు 'లింగము' ను కూడ చేర్చెను. వ్యాఘ్రపాదుడు జాతి-ద్రవ్య-లింగ-వచన భేదములను నాలుగింటిని చెప్పెను. ఇంక పతంజలి ఐదింటిని పేర్కొనెను— జాతి-ద్రవ్య-లింగ-వచన-కారకములు.

మొత్తము 500 ఆఖ్యాతములు కలవనియు, అవి 25 విధములుగా విభజింపబడెననియు మూలమందు కలదు [బరోడా ముద్రణము నందు 27 వ శ్లోక ద్వితీయ పాదము]. ఆయా వ్యాకరణ గ్రంథములందలి ధాతు పాఠములు భిన్నవిధములుగా గోచరించుచున్నవి. పై విషయ మెందున్నదో తెలియదు. ఇట్టివే మరికొన్ని మతభేదములు కలవు. ఇట్టి భేదములను కొన్నింటిని డా. ఘోష్ తన ఆంగ్లానువాదములోని అధస్సూచికలలో నిర్దేశించియుండెను.

నాట్యశాస్త్రమునకు 'నాట్యవేద' మను పేరున్నను, వేదములందలి భాషలోని 'ఆర్షత్వము' ఇందలి భాషలో గోచరింపదు. రామాయణ-మహాభారతములందును, పురాణములందును కన్పట్టు ఆర్షప్రయోగములు (వ్యాకరణమునకు సంబంధించినవి) కూడ ఇందు కన్పట్టుటలేదని విమర్శకుల అభిప్రాయము. ఇందలిది చాల సరళమైన భాష.

### 2. ఛందస్సు

"ఛందోహీనో న శబ్దో ఽస్తి న చ్ఛంద శ్శబ్ద వర్జితమ్" అని భరతుడు పేర్కొనియుండెను. ఆరు వేదాంగములలోను 'ఛందస్సు' ఒక అంగముగా పరిగణింపబడినది. ఛందస్సు వేదమునకు మూలభూతమట (ఛందః పాదౌతు వేదస్య). సాంఖ్యాయన 'శ్రౌత సూత్రము', 'ఋక్ ప్రాతిశాఖ్య', కాత్యాయనుని 'ఋగ్వేద-యజుర్వేదానుక్రమణికలు' మొదలగువాని యందు ఛందస్సు ప్రత్యేకాధ్యాయములందు వివరింపబడినది ; ఇవి వేదములందలి ఛందస్సునకు సంబంధించినవి. భరతుడు ముఖ్యముగా లౌకిక దృష్టితో ఛందస్సును వివరించెను; మరియు ముఖ్యముగా నాటకాదులందు ఉపయుక్తములగు వృత్తములను మాత్రమే వివరించెను. 14, 15 అధ్యాయములకు సంబంధించిన ఛందో విశేషములను పట్టికరూపములో ప్రక్కపుటలో ఒసంగు చున్నాను (అప్రసిద్ధములగుటచే మొదటి ఐదింటిని పేర్కొనుటలేదు.)

| ఛందము పేరు | [illegible] | ఒక్కొక్క ఛందము నందలి వృత్త సంఖ్య | [illegible] | దైవతములు (కవిగారు చెప్పినవి) | వర్ణములు (కవిగారు చెప్పినవి) | 15 వ అధ్యాయమందు వివరింపబడిన ఆయా ఛందములందలి వృత్తముల సంఖ్య, వాని పేర్లు |
|---|---|---|---|---|---|---|
| గాయత్రి | 6 | 64 | ఈ ఏడును "దివ్యఛందము"లు | అగ్ని | సిత | 1. తనుమధ్య, 2. మకరక శీర్ష, 3. మాలిని, 4. మాలతి; |
| ఉష్ణిక్ | 7 | 128 | | సవిత | సారంగ | 5. ఉద్ధత, 6. భ్రమరమాలిక; |
| అనుష్టుప్ | 8 | 256 | | సోముడు | పిశంగ | 7. సింహరేఖ, 8. మత్తచేష్టితము, 9. విద్యున్మాల, 10. చిత్రవిలాసితము; |
| బృహతి | 9 | 512 | | బృహస్పతి | కృష్ణ | 11. మధుకరి; |
| పంక్తి | 10 | 1024 | | మిత్రావరుణులు | నీల | 12. ఉత్పలమాలిక, 13. శశిసారిణీ; |
| త్రిష్టుప్ | 11 | 2048 | | శక్రుడు | లోహిత | 14. దోధకము, 15. మోటకము, 16. ఇంద్రవజ్ర, 17. ఉపేంద్రవజ్ర, 18. రథోద్ధత, 19. స్వాగత, 20. శాలిని ; |
| జగతి | 12 | 4096 | | విశ్వదేవులు | గౌర | 21. తోటకము, 22. కుసుమ విచిత్ర, 23. చంద్రలేఖ, 24. ప్రమితాక్షర, 25. వంశస్థ, 26. హరిణప్లుత, 27. కామదత్త, 28. అప్రమేయ, 29. పద్మిని, 30. పుటము; |
| అతిజగతి | 13 | 8192 | ఈ ఏడును "దివ్యేతర(=మానుష)ఛందము"లు | | | 31. ప్రభావతి, 32. ప్రహర్షిణి, 33. మత్త మయూరకము; |
| శక్కరి | 14 | 16384 | | | | 34. వసంతతిలక, 35. అసంబాధ, 36. శరభ; |
| అతిశక్కరి | 15 | 32768 | | | | 37. నాందీముఖి; |
| అష్టి | 16 | 65536 | | | | 38. ఇభలలితము, 39. ప్రవరలలితము; |
| అత్యష్టి | 17 | 131072 | | | | 40. శిఖరిణి, 41. వృషభచేష్టితము, 42. శ్రీధర, 43. వంశపత్రపతితము, 44. విలంబిత గతి ; |
| ధృతి | 18 | 262144 | | | | 45. చిత్రలేఖ; |
| అతిధృతి | 19 | 524288 | | | | 46. శార్దూల విక్రీడితము; |
| కృతి | 20 | 1048576 | ఈ ఏడును దివ్యమానుష ఛందములు | | | 47. సువదన; |
| ప్రకృతి | 21 | 2097152 | | | | 48. స్రగ్ధర; |
| ఆకృతి | 22 | 4194304 | | | | 49. మద్రకము; |
| వికృతి | 23 | 8388608 | | | | 50. అశ్వలలితము; |
| సంకృతి | 24 | 16777216 | | | | 51. మేఘమాల; |
| అభికృతి | 25 | 33554432 | | | | 52. క్రౌంచపాది, 53. భుజంగవిజృంభితము. |
| ఉత్కృతి | 26 | 67108864 | | | | |
| వృత్తముల మొత్తము సంఖ్య | | 13,42,17,726 | | | | |



15 వ అధ్యాయమందు వివరింపబడిన పథ్యావృత్త భేదములు(అనుష్టుప్ ఛందము)— 54. అర్ధసమపథ్య, 55. విషమపథ్య, 56. విపరీతపథ్య, 57. చపల, 58. విపుల, 59. వక్త్రము, 60. వానవాసిక, 61. కేతుమతి, 62. అపరవక్త్రము, 63. పుష్పితాగ్ర, 64. ఉద్గత, 65. లలితము.

15 వ అధ్యాయమందు వివరింపబడిన ఆర్యావృత్త భేదములు— 66. పథ్య, 67. విపుల, 68. చపల, 69. ముఖచపల, 70. జఘనచపల.

ఇట్లు మొత్తము 70 వృత్తములు లక్ష్య - లక్షణసహితములుగా 15 వ అధ్యాయమందు వివరింపబడును.

---

# అధ్యాయము 15

## వృత్తములు[1]

[కాశీముద్రణమునందు 16 వ అధ్యా - 169 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 15 వ అధ్యా - 172 శ్లోకములును, బరోడా ముద్రణము నందు 15 వ అధ్యా - 227[3] శ్లోకములును కలవు.]

పూర్వాధ్యాయమున వివరింపబడిన ఛందములకు సంబంధించినవియును, నాట్యమందు ప్రయోగింపదగినవియును అగు వృత్తముల నిప్పుడు వివరింతును.

*గాయత్రి* : ఈ ఛందమునందలి వృత్తములు[4] (పాదమునకు 6 అక్షరములు)—

1. తనుమధ్య— పాదమునందలి మొదటి రెండక్షరములును, చివరి రెండక్షరములును గురువులు ; మధ్య రెండక్షరములును లఘువులు (ऽऽ।, ।ऽऽ- త, య).—

సం త్యక్త విభూషా
భ్రష్టాంజన నేత్రా ।
హస్తార్పిత గండా
కిం త్వం తనుమధ్యా ॥ 3

—ఓ తనుమధ్యా! భూషణములను తీసివేసితివి, నేత్రాంజనము చెరిగిపోయినది, చెక్కిలిని చేతికర్పించినావు, కారణమేమి ?

2. మకరకశీర్ష[5]— పాదమునందలి మొదటి నాలుగు అక్షరములును లఘువులు, చివరి రెండు అక్షరములును గురువులు (।।।, ।ऽऽ-న, య)—

స్వయముపయాంతం, భజసి న కాంతమ్ ।
భయకరి కిం త్వం, మకరకశీర్షే[6] ॥ 5

—మకరక మను అభినయహస్తమును శిరమున ధరించిన ఓ సుందరీ! నీవు భయకరివై తనంతతానుగ వచ్చిన ప్రియుని ఆదరించవేల ?

3. మాలిని[7]— పాదమునందలి రెండవ అక్షరము మాత్రము లఘువు, తక్కిన వన్నియును గురువులు (ऽ।ऽ, ऽऽऽ-ర, మ)—

స్నానగంధాధికైర్యైః, వస్త్ర-భూషాయోగైః ।
వ్యక్తమేవాసౌ త్వం, మాలినీ ప్రఖ్యాతా ॥ 8

—ఓ మాలినీ ! పన్నీటి జలకము, చందనానులేపనము, శుభ్రవస్త్ర-అలంకరణములు అనువానిచే "ఈమె మాలిని" అని గుర్తింపబడుచున్నంత ఖ్యాతిని కాంచినావు.

---

1. ఈ భాగము కాశీ ముద్రణమునందు షోడశాధ్యాయము. బొంబాయి - బరోడా ముద్రణములందు పంచదశాధ్యాయము.

2. 'ఛందో విచితి'- అనునది కాశీ - బరోడా ముద్రణముల పాఠము, అభినవభారతీ పాఠమును ఇదియే. 'ఛందోవృత్తవిధి'- అనునది బొంబాయి ముద్రణ పాఠము.

3. బరోడా ముద్రణమునందు కొన్ని వృత్తములకు భంగ్యంతర నిర్వచనములు కలవు. అచ్చటచ్చట వృత్తములకు రెండేసి ఉదాహరణములు కలవు. అందుచే ఈ ముద్రణమునందు శ్లోక సంఖ్య అధికమైనది. ఇట్లు రెండు విధములగు పాఠములు అభినవ గుప్తుని కాలముననే ఉన్నవి. [అభినవభారతి- 2వ సం-పుట 252.]

ఈ అధ్యాయమున వృత్తలక్షణములు కొన్నిమాతృకలందు అక్షరగణములగు మగణాదులతోడనే చెప్పబడెను. కొన్నిటియందు గురు-లఘు నియమమునుబట్టి వ్రాయబడెను. రెండు పాఠములందును అనేక పాఠభేదములుండుటచే సౌకర్యమునకై రెండు పాఠములును బరోడా ముద్రణమునందీయబడెను. పింగళునికి పూర్వము గురు లఘువుల సంఖ్యచేతనే వృత్తలక్షణములు వ్యవహరింపబడినట్లు తోచుచున్నది. అనగాఆనాడు అక్షరత్రిక రూపములగు మగణాదిరూపవ్యవహారము లేదని భావము, ఈ అధ్యాయమున కొన్ని చోట్ల ఏ వృత్తలక్షణము ఆవృత్తముచేతనే చెప్పబడెను. కొన్నిచోట్ల అనుష్టుప్ ఛందమున చెప్పబడెను. ఇట్టి విశేషము ధ్రువాధ్యాయమునను కానవచ్చును. [శ్రీ మా. రామకృష్ణ కవిగారి అధస్సూచిక- 2వ సం-పుట 252]

4. గాయత్రీచ్ఛందోవృత్తముల మొత్తము అరువది నాలుగు. కాని ఇచ్చట 4 వృత్తములు మాత్రమే చెప్పబడినవి. అట్లే ఇతర ఛందముల విషయమునను గ్రహించవలెను. మొత్తము వృత్తములు 13 కోట్లకు పైగా ఉండగా నాట్యశాస్త్రమందు 70 వృత్తములు మాత్రమే చెప్పబడినవి (వీనిలోని మొదటి 53 సమ వృత్తములు). ఇవి మాత్రమే నాటకాదులందుపయుక్తములగుటకు తగిఉన్నవి. కావుననే 'నాట్యమందు ప్రయోగింపదగిన' వృత్తములను పేర్కొందునని భరతుడు చెప్పెను. ప్రతి ఉదాహరణమునందును ఆ వృత్తము పేరు ఉన్నది. దీనిని అర్వాచీనులు 'ముద్రాలంకార' మందురు. పెక్కు వృత్తముల లక్షణ శ్లోకములే వానికి ఉదాహరణములుగాకూడ ఉన్నవి.

5. వృత్తరత్నాకరాదులందు దీనికి 'శశివదన' అని పేరు.

6. చిన్ని వృత్తములందు మొదటి రెండు పాదములను కలిపి ఏక పాదముగ వ్రాయుట ఆచారము. అందుచే ఇచ్చట రెండు పాదములే ఉన్నట్లుగా కన్పట్టును, కాని నాలుగు పాదములును కలవు. పాదాంతములు తెలియుటకు 'కామాలు' పెట్టినాను.

"మకరశీర్ష" అనగా "dull-headed one" అని డా. ఘోష్ వ్రాసిన అర్థముకూడ ఇచ్చట గ్రాహ్యమే. "మందురాలు" అని దీని అర్థము.

7. పింగలుని 'ప్రాకృత చ్ఛందస్సు' మొదలగువానియందు 'మాలినీ' వృత్తమందలి గణములు భిన్నముగా ఉన్నవి. వారి మాలినియు, నాట్యశాస్త్రమందలి నాందీముఖియు సమానములు.

4. మాలతి—పాదమునందలి రెండు - ఐదు అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు. (ऽ।ऽ, ऽ।ऽ-ర, ర)—

శోభతే బద్ధయా, షట్పదావిద్ధయా
మాలతీ మాలయా, మానినీ లీలయా॥ 10

—కుపిత అగు నాయిక తుమ్మెదపంక్తితో ప్రకాశించు మాలతీ పుష్ప మాలికచే అలంకరింపబడి సవిలాసముగా ప్రకాశించుచున్నది.

ఉష్ణిక్ ఛందమునందలి వృత్తములు (పాదమునకు 7 అక్షరములు)—

5. ఉద్ధత—పాదమునందలి రెండు, నాలుగు, ఐదు అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు. (ऽ।ऽ, ।।ऽ, ऽ-ర, స, గ)—

దంతకుంత కృతాగ్రమ్, వ్యాకులాలక శోభమ్ ।
శంసతీవ తవాస్యమ్, నిర్దయమ్ రతయుద్ధమ్॥ 13

—ప్రియుని దంతములనెడి కుంతములచే చేయబడిన చిహ్నములు కలదై, వ్యాకులములైన అలకలతో శోభించుచున్న నీ ఆస్యము నిర్దయమగు రతయుద్ధమును చెప్పుచున్నదివలె ఉన్నది.

6. భ్రమర మాలిక (=భ్రమరమాల)—పాదమునందలి మొదటి రెండక్షరములును చివరి రెండక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (ऽऽ।, ।।ऽ, ऽ-త, స, గ).

నానాకుసుమచిత్రే, ప్రాప్తే సురభిమాసే ।
ఏషా భ్రమతి మత్తా, కాంతే భ్రమరమాలా॥ 16

—ఓ కాంతా! వివిధ పుష్పములచే చిత్రవర్ణమైన సురభిమాసము (చైత్రమాసము) వికసించినతోడనే తుమ్మెదలగుంపు మదించి స్వేచ్ఛా విహారము చేయుచున్నది.

అనుష్టుప్ ఛందమునందలి వృత్తములు (పాదమునకు 8 అక్షరములు)—

7. సింహలేఖ (సింహలీల - కాశీముద్రణ పాఠము) —పాదమునందలి 1, 3, 5, 7, 8 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (ऽ।ऽ, ।ऽ।, ऽऽ-ర, జ, గగ)—

యత్త్వయా హ్యనేకభావై, శ్చేష్టితం రహః సుగాత్రి ।
తన్మనో మమ ప్రవిష్టమ్, వృత్త మత్ర సింహలేఖమ్॥ 19

—ఓ సుందరీ! ఏకాంతమున వివిధ భావగతులతో నీవొనర్చిన శృంగార చేష్టలు నా మనమున ప్రవేశించి సింహలేఖ (సింహముగీరిన గీత) వలె స్థిరములై ఉన్నవి.

8. మత్తచేష్టితము—పాదమునందలి 2, 4, 6, 8 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (।ऽ।, ऽ।ऽ, ।ऽ-జ, ర, లగ)—



చరావ ఘూర్ణితేక్షణం, విలంబితాకులాలకమ్ ।
అంసస్థితైః పదైః ప్రియా, కరోతి మత్తచేష్టితమ్ ॥ 22.

—ప్రియురాలు నిలుకడలేక తొట్రిలుచున్న పదములతో, శరావము (మూకుడు) వలె గుండ్రముగా గ్రుడ్లను త్రిప్పుచు, చెదరి వ్రేలాడుచున్న ముంగురులతో మత్త చేష్టితమును (మదించినవారివలె చేష్టలను) చేయుచున్నది.

9. విద్యున్మాల (=విద్యుల్లేఖ)— పాదమునందలి అన్ని అక్షరములును గురువులే. (ऽऽऽ, ऽऽऽ, ऽऽ-మ, మ, గగ)—

సాంభోభారై రానర్దద్భిః, శ్యామాంభోదై ర్వ్యాప్తే వ్యోమ్ని ।
ఆదిత్యాంశు స్పర్ధిన్యేషా, దిక్షు భ్రాంతా విద్యున్మాలా ॥ 25

—జలపూర్ణములై గర్జించు శ్యామలములగు వర్షాకాల మేఘము లావరించుకొని ఉన్న ఆకసమునందు సూర్యకాంతులతో పోటీచేయుచు విద్యున్మాల (మెరుపుతీగ) దశదిశల భ్రమించుచున్నది.

10. చిత్తవిలాసితము— పాదమునందలి 5, 7, 8 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (।।।, ।ऽ।, ऽऽ-న, జ, గగ)—

స్మితవశ విప్రకాశై, ర్దశనపదై రమీభిః ।
వరతను! పూర్ణచంద్రమ్, తవ ముఖ మావృణోతి ॥ 27

—ఓ సుందరాంగీ! నీ ముఖము, మందహాసవశమున వికసించు నీ దంత కాంతులచే పూర్ణచంద్రుని కప్పివేయుచున్నది.

బృహతి ఛందమునందలి వృత్తము (పాదమునకు 9 అక్షరములు)—

11. మధుకరి— పాదమునందలి చివరి మూడు అక్షరములును గురువులు (।।।, ।।।, ऽऽऽ-న, న, మ)—

కుసుమితమభిపశ్యంతీ, వివిధతరుగణైశ్ఛన్నమ్ ।
వన మతిశయగంధాఢ్యమ్, భ్రమతి మధుకరీ హృష్టా ॥ 30

—బహువిధ వృక్షములచే ఆవరింపబడి, పుష్పించి, సుగంధములను వెదజల్లు వనమును కాంచి సంతసించిన మధుకరి (ఆడుతుమ్మెద) హాయిగ భ్రమించుచున్నది.

పంక్తి ఛందమునందలి వృత్తములు (పాదమునకు 10 అక్షరములు)—

12. ఉత్పలమాలిక (=కువలయమాల)— పాదమునందలి మొదటి మూడు అక్షరములును చివరి మూడు అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (ऽऽऽ, ।।।, ।ऽऽ, ऽ-మ, న, య, గ)—

అస్మింస్తే శిరసి తదా కాంతే, వైడూర్య-స్ఫటిక సువర్ణాఢ్యే ।
శోభాం స్వాం న వహతి తాం బద్ధా, సుశ్లిష్టా కువలయమాలేయమ్॥ 33

—ఓ ప్రియురాలా! వైడూర్య - స్ఫటిక-సువర్ణములతో అలంకరింపబడి యున్న నీ శిరస్సునందు ఆనాడు కూర్చబడిన కువలయమాల సహజ సౌందర్యముతో ప్రకాశించలేదు. (అనగా తన అందమును విడిచి క్రొత్త అందమును పొందినదని భావము).

13. శిఖసారిణి (=మయూరసారిణి)—పాదమునందలి 2, 4, 6, 8 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (UIU, IUI, UIU, U-ర, జ, ర, గ)—

నైవ తేఽస్తి సంగమో మనుష్యై, ర్నాపి కామభోగ చిహ్న మన్యత్ ।
గర్భిణీవ దృశ్యసే హ్యనార్యే, కిం మయూరసారిణీ త్వమేవమ్॥ 36

—ఓ అనార్యురాలా! నీకు మానవసాంగత్యమా లేదు. ఏ ఇతర కామభోగ చిహ్నములును కన్పట్టుటలేదు. అయినను నీవు గర్భిణివలె కన్పట్టుచున్నావు. ఇది ఎట్లు?

త్రిష్టుప్ ఛందమునందలి వృత్తములు (పాదమునకు 11 అక్షరములు)—

14. దోధకము—పాదమునందలి 1, 4, 7, 10, 11 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UII, UII, UII, UU-భ, భ, భ, గగ)—

ప్రస్ఖలితాగ్రపదప్రవిచారం, మత్తవిఘూర్ణిత గాత్రవిలాసమ్ ।
పశ్య విలాసిని కుంజరమేతం, దోధకవృత్త మయం ప్రకరోతి॥ 39

—ఓ విలాసినీ! ఈ గజము తొట్రుపడుచున్న ముంగాళ్ళతో, మత్తెక్కితిరుగుడు పడుచున్న శరీరవిలాసముతో దోధకవృత్తము[8] నెట్లాచరించుచున్నదో చూడుము.

15. మోటకము—పాదమునందలి 1, 2, 5, 8, 11 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UUI, IUI, IUI, IU-త, జ, జ, లగ)—

ఏషోఽమ్బుదనిస్వనతుల్యరవః, క్షీబః స్ఖలమానవిలంబగతిః ।
శ్రుత్వా ఘనగర్జిత మద్రితటే, వృక్షాన్ ప్రతిమోటయతి ద్విరదః॥ 41

—మేఘ గర్జనముతో సమానమగు రవమును కలిగినదియును, మదించినదియును, స్ఖలితములగుచున్న విలంబ (మంద) గమనములు కలదియును అగు ఈ ఏనుగు పర్వత సానువులయందు మేఘగర్జనమును విని వృక్షములను పెకలించుచున్నది.

16. ఇంద్రవజ్ర—పాదమునందలి 3, 6, 7, 9 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (UUI, UUI, IUI, UU-త, త, జ, గగ)—

త్వం దుర్నిరీక్ష్యా దురతిప్రసాదా, దుఃఖైకసాధ్యా కఠినైకభావా ।
సర్వాస్వవస్థాసు చ కామతంత్రే, యోగ్యాసి కిం నా ఖహానేంద్రవజ్రా॥ 43

8. మందము మందముగా దోధకముచే గీయమానమగు వృత్తములు దోధకవృత్తములు [అభినవభారతి - 2వ సం - పుట 257.]



—ఓ కామినీ! ఏ అవస్థయందును నిన్నుచూడ శక్యముకాదు. నీ అనుగ్రహముదుర్లభము. నీవు దుఃఖైకసాధ్యవు. అతి కఠినస్వభావురాలవు. కావున కామ తంత్రమునకును నీవు అయోగ్యురాలవే. వేయేల? నీవు ఇంద్రవజ్రవు.

17. ఉపేంద్రవజ్ర—పాదమునందలి 1, 3, 6, 7, 9 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (IUI, UUI, IUI, UU-జ, త, జ, గగ)—

ప్రియే శ్రియా వర్ణవిశేషణేన, స్మితేన కాంత్యాసుకుమారభావాత్ ।
అమీ గుణా రూపగుణానురూపా, భవంతి తే కిం త్వముపేంద్రవజ్రా॥ 45

—ఓ ప్రియురాలా! శోభచేతను, దేహచ్ఛాయావిశేషముచేతను, మందహాసముచేతను, కాంతిచేతను, సుకుమార భావముచేతను నీ గుణములు రూపగుణానురూపములుగా ఉన్నవి. నీవు ఉపేంద్రవ్రజవా ఏమి? (ఇంద్ర ధనుస్సువా ఏమి?)

18. రథోద్ధత—పాదమునందలి 1, 3, 7, 9, 11 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UIU, III, UIU, IU-ర, న, ర, లగ)[9]—

కిం త్వయా సుభట దూరవర్జితమ్, నాత్మనో న సుహృదాం ప్రియం కృతమ్ ।
యత్పలాయనపరాయణస్య తే, యాతి ధూలి రధునా రథోద్ధతా॥ 47

—ఓ వీరుడా! నీవేల యుద్ధభూమిని వీడి వచ్చితివి? నీకుగాని, నీ స్నేహితులకు గాని ప్రియమైనదానిని నీవు చేయలేదు. పలాయన పరాయణుడవైన నీ రథోద్ధత (రథమువలన ఎగిరిన) ధూళి ఇంకను వ్యాపించుచునే ఉన్నది.

19. స్వాగత(=స్వాగతము)—పాదమునందలి 1, 3, 7, 10, 11 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UIU, III, UII, UU-ర, న, భ, గగ)—

అద్య మే సఫలమాయతనేత్రే, జీవితం మదనసంశ్రయభావమ్ ।
ఆగతాసి భవనం మమ యస్మా, త్స్వాగతం తవ వరోరు నిషీద॥ 50

—ఓ విశాలనేత్రా! నేడు నీవు నా భవనమునకు వచ్చుటచే మదన సంశ్రయ భావమగు నాజీవితము సఫలమైనది. ఓ వరోరూ! నీకు స్వాగతము, కూర్చుండుము.

20. శాలిని—పాదమునందలి 6, 9 అక్షరములు మాత్రమే లఘువులు, తక్కినవన్నియును గురువులు (UUU, UUI, UUI, UU-మ, త, త, గగ).—

9. ఈ వృత్తమునకు రెండుదాహరణము లొసంగబడినవి. రెండవ ఉదాహరణము-
కిం త్వయా కుమతిసంగయా సదా, నాజ్ఞయేవ సుహృదాం ప్రియం కృతమ్ ।
యద్గృహా ద్వచనరోషకంపితా, యాతి తూర్ణమబలా రథోద్ధతా ॥- 48
—"కుమతుల సహవాసముచే నీవు నీ మాటను పాటించి స్నేహితులకు ప్రియము నాచరింపజాలకున్నావు." అని అనగానే ఆ అబల సఖీవచనరోషకంపితయై, రథోద్ధతయై గృహమునుండి వేగముగా వెలికిపోవుచున్నది.

దుశ్శీలం వా నిర్గుణం వాపరం వా, లోకే ధైర్యా దప్రియం న బ్రవీషి।
తస్మా చ్ఛీలం సాధుహేతోః సువృత్తం, మాధుర్యాత్స్యా త్సర్వథా శాలినీ త్వమ్॥ 52

—ఓ శాలినీ! దుశ్శీలునిగాని, గుణరహితునిగాని, అన్యులనెవ్వరినిగాని ఉద్దేశించి ధైర్యముతో నీ వప్రియమును పలుకవు. అందుచే మధుర మగుటవలన నీ స్వభావమును, నీ నడవడియు సాధువులు. నీవు అన్ని విధములచేతను శాలినివి.*

_జగతి_ ఛందమునందలి వృత్తములు (పాదమునకు 12 అక్షరములు)—

21, తోటకము— పాదమునందలి 3, 6, 9, 12 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (IIU, IIU, IIU, IIU-స, స, స, స)—

కిమిదం కపటాశ్రయ దుర్విషహమ్, బహుశాఠ్యమథోల్బణరూక్షకథమ్ ।
స్వజన-ప్రియసజ్జనభేదకరమ్, నను తోటకవృత్త మిదం కురుషే ॥ 55

—కపటముకలదగుటచే దుర్విషహమును, గూఢవిప్రియకారియును, అధికపరుష కథనము గలదియును, స్వజన-ప్రియసజ్జనులను భేదింపజేయునదియును అగు ఇట్టి తోటక (కలహప్రియ) వృత్తమును ఆచరించుచున్నావేమి!

22. కుముదనిభ (=కుముదప్రభ)— పాదమునందలి 1,3,5,6,11,12 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UIU, IUU, III, IUU-ర, య, న, య —ఇందు 6 అక్షరములతరువాత యతి.)[10]—

మన్మథేన విద్ధా సలలితభావా, నృత్తగీతయోగా ప్రవికసితాక్షీ ।
నింద్య మద్య కిం త్వం విగలితశోభా, చంద్రపాదయుక్తా కుముదవతీ చ ॥ 58

—మన్మథపీడితురాలవును, సలలితశృంగారభావవతివియును, నృత్తగీత సక్తురాలవును, వికసితనేత్రవును అగు నీవును, చంద్రకిరణ సంయుక్తయగు కుముదవతియును (కుముదిని) శోభారహితములగుటెట్లు?

---

*[కాశీముద్రణమునందు 16వ అధ్యా - 1-37 శ్లో ; బొంబాయి ముద్రణమునందు 15 వ అధ్యా - 1-37 శ్లో ; బరోడా ముద్రణమునందు 15 వ అధ్యా - 1-52 శ్లో.]

10. కుముదనిభా వృత్తమునకు మతాంతర నిర్వచనము, అందులకు ఉదాహరణము కూడ కలవు—పాదమునందలి 1,2,3,4,8,10 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (III, IUU, UIU, IUU -న, య, ర, య)—

కుముదనిభా త్వం కామబాణవిద్ధా, కిమసి నతభ్రూః శీతవాతదగ్ధా ।
మృదునలినీ వా పాండువక్త్రశోభా, కథమపి జాతా హ్యగ్రతః సఖీనామ్ ॥- 60

—కుముదనిభవగు నీవు కామబాణవిద్ధవు, శీతవాత దగ్ధవు, నతభ్రువు అయితివేల? నీ వక్త్రశోభ నీ చెలుల ఎదుట సుకుమారమగు నళినివలె పాండుర మయ్యెనేమి?



23. చంద్రలేఖ— పాదమునందలి 7, 10 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (UUU, UUU, IUU, IUU-మ, మ, య, య)— మొదటి 5 అక్షరముల తరువాత యతి—

వక్త్రం సౌమ్యం తే పద్మపత్రాయతాక్షమ్, కామస్యావాసం సుభ్రు నోచ్చప్రహాసమ్ ।
కామస్యాపీదం కామమాహర్తుకామం, కాంతే కాంత్యా త్వం చంద్రలేఖేవ భాసి ॥ 62

—ఓ సుభ్రూ! పద్మపత్రముల బోలు కనులు, మందస్మితముతో కూడిన కామావాసమగు నీసౌమ్యముఖము కామునకు కూడ కామము నుద్రేకింప జేయుచున్నవి. ఓ కాంతా! నీవు కాంతిచే చంద్రలేఖవలె భాసించుచున్నావు.

24. ప్రమితాక్షర—పాదమునందలి 3, 5, 9, 12 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (IIU, IUI, IIU, IIU-స, జ, స, స)—

స్మితభాషిణీ హ్యచపలాపరుషా, నిభృతాపవాదవిముఖీ సతతమ్
అపి కస్యచిద్యువతి రస్తి సుఖా, ప్రమితాక్షరా స హి పుమా న్జయతి ॥ 64

—ఎవని యువతి (భార్య) ఎల్లప్పుడును స్మితభాషిణియు, అచపలయు, అపరుషయు, నిభృతాపవాదవిముఖియు (రహస్యముగా అపవాదములు మోపుటయందు విముఖురాలు), సంతుష్టయు, ప్రమితాక్షరయును అగునో ఆ పురుషుడు సర్వోత్కర్ష లభించినవాడు.

25. వంశస్థ (వంశస్థము)—పాదమునందలి 2, 4, 5, 8, 10, 11 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (IUI, UUI, IUI, UIU-జ, త, జ, ర)—

న మే ప్రియా త్వం బహుమానవర్జితమ్, ప్రియం ప్రియా తే పరుషాభిభాషిణీ।
తథా చ పశ్యా మ్యహ మద్య సా ధ్రువం, క్షణేన వంశస్థగతిం కరిష్యతి ॥ 67

—గౌరవరహితమగు నా ప్రియాత్వము నీకు ప్రియముకాదు. పరుషముగా భాషించు ఈమెయే నీకు ప్రియురాలు. ఆ అన్యకాంత నాకు ఇపుడు క్షణములో వంశస్థగతిని (భ్రమణమును) కల్గించుచున్నది.

26, హారిణప్లుత[11]—పాదమునందలి 4, 7, 10, 12 అక్షరములు గురువులు, తక్కివవి లఘువులు (III, UII, UII, UIU-న, భ, భ, ర)—

పరుషవాక్యకశాభిహతా త్వయా, భయవిలోకనపార్శ్వ నిరీక్షణా ।
వరతనుః ప్రతతప్లుతసర్పణై, రనుకరోతి గతైర్హారిణప్లుతమ్॥ 69

—నీ పరుషవాక్య మనెడికశా (కొరడా) ఘాతములకు తాళలేనిదై భయముతో ఇటునటు చూచుచు వితతప్లుతగతులచే ఆ వరతనువగు యువతి హారిణప్లుతమును అనుకరించుచున్నది.

---

11. 'హారిణప్లుతము'ను పింగలాదులు 'ద్రుతవిలంబిత' మనినారు.

27. కామదత్త—పాదమునందలి 7, 9, 11, 12 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (III, III, UIU, IUU-న, న, ర, య)—

కరజపదవిభూషితా యథా త్వం, సుదతి! దశనవిక్షతాధరా చ।
గతిరపి చరణావలగ్నమందా, త్వమసి మృగనిభాక్షి కామదత్తా ॥ 71

—ఓ సుదతీ! నీవు నఖక్షతముచే అలంకరింపబడితివి. నీ అధరములు దంతక్షతముల నందియున్నవి. నీ గతియును చరణావలగ్నమందమై ఉన్నది. ఓ మృగనిభాక్షీ! నీవు నిజముగ కామదత్తవు.

28. అప్రమేయ[12]— పాదమునందలి 1, 4, 7, 10 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (IUU, IUU, IUU, IUU—య, య, య, య)—

న తే కాచిదన్యా సమా దృశ్యతే స్త్రీ, నృలోకే విశిష్టా గుణైరద్వితీయైః।
త్రిలోక్యాం గుణాగ్ర్యాన్ సమాహృత్య సర్వాన్, జగత్యప్రమేయాసి దృష్టా విధాత్రా ॥ 73

—అద్వితీయములగు గుణములలో నీకు ఈడు అగు వేరొక యువతి ఈ లోకమున లేదు. ముల్లోకములందలి మంచిగుణములను ప్రోగుచేసి అప్రమేయవగు నిన్ను విధాత సృజించినాడు.

29. పద్మిని[13]— పాదమునందలి 2, 5, 8, 11 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (UIU, UIU, UIU, UIU— ర, ర, ర, ర.)—

దేహతోయాశయా వక్త్రపద్మోజ్జ్వలా, నేత్రభృంగాకులా దంతహంసస్మితా।
కేశపాశచ్ఛదా చక్రవాకస్తనీ, పద్మినీవ ప్రియే! భాసి మే సర్వదా ॥ 76

—ఓ ప్రియురాలా! నీ దేహము ఒక జలాశయము, నీముఖమే అందలి పద్మము, నీ నేత్రములే దానిపై ప్రాలిన తుమ్మెదలు, నీ మందహాసమే అంచలపిండు. నీ కేశపాశమే పద్మచ్ఛదములు, నీ స్తనములే చక్రవాకములు, నీవు ఒక పద్మినివలె భాసించుచున్నావు.[14]

30. పుటము (=పటువు)— పాదమునందలి మొదటి ఆరు అక్షరములును, పదియవ అక్షరమును లఘువులు, తక్కినవి గురువులు (III, III, UUU, IUU-న, న, మ, య)—

---

12. 'అప్రమేయ'ను పింగలాదులు 'భుజంగప్రయాత' మనినారు.

13. 'పద్మిని'ని పింగలాదులు 'స్రగ్విణి' అనినారు.

14. దీనికి రెండవ ఉదాహరణము కూడ కలదు. (ఇది ఒక ప్రతిలో మాత్రమే కలదట)—

ఫుల్లపద్మాననా త్వం ద్విరేఫేక్షణా, కేశపత్రచ్ఛదా చక్రవాకస్తనీ।
పీతతోయావలీ బద్ధకాంచీగుణా, పద్మినీవ ప్రియే భాసి నిరేక్షితా ॥ 77



ఉపవనసలిలానాం బాలపద్మైః, భ్రమరపరభృతానాం కంఠనాదైః।
మదనమదవిలాసైః కామినీనాం, కథయతి పుటవృత్తం పుష్పమాసః[15] ॥ 80

—ఉద్యానవన సలిలములందలి బాలపద్మముల చేతను, భ్రమర-పరభృతముల కంఠనాదములచేతను, కామినుల మదనవిలాసములచేతను, వసంతర్తువు తన వృత్తమును ప్రకటించుకొనుచున్నది.

అతిజగతి ఛందమునందలి వృత్తములు (పాదమునకు 13 అక్షరములు)—

31. ప్రభావతి— పాదమునందలి 2, 4, 9, 11, 13 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (IUI, UII, IIU, IUI, U-జ, భ, స, జ, గ)—

కథం న్విదం కమలవిశాలలోచనే, గృహం ఘనైః పిహితకరే దివాకరే।
అచింతయంత్యభినవవర్షవిద్యుత, స్త్వమాగతా సుతను యథా ప్రభావతీ ॥ 82

—ఓ కమలవిశాలలోచనా! మేఘములచే సూర్యుడు ఆవరింపబడి ఉండగా అభినవవర్ష-విద్యుత్తులను లెక్కచేయక ప్రభావతివలె ఈ గృహమునకు నీవు ఎట్లు వచ్చితివి?

32. ప్రహర్షిణి— పాదమునందలి 1, 2, 3, 8, 10, 12, 13 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UUU, III, IUI, UIU, U-మ, న, జ, ర, గ)—

భావస్థైర్మధురకథైః సుభాషితైస్త్వం సాటోపస్ఖలితవిలంబితైర్గతైశ్చ।
శోభాఢ్యైర్హరసి మనాంసి కాముకానాం, సువ్యక్తం హ్యతిజగతీ ప్రహర్షిణీవ ॥ 84

—భావస్థములగు మధుర కథలచేతను, సుభాషితములచేతను, శోభాఢ్యములగు సాటోప-స్ఖలిత-విలంబిత గమనములచేతను కాముకుల మనస్సుల నాకర్షించుచున్నావు. నిజముగ నీవు అతిలోకవగు ప్రహర్షిణివి.

33. మత్తమయూరకము (=మత్తమయూరము)—పాదమునందలి 6, 7, 10, 11 అక్షరములు లఘువులు, తక్కినవి గురువులు (UUU, UUI, IUU, IIU, U-మ, త, య, స, గ)—

విద్యున్నద్ధాః సేంద్రధనూరంజితదేహా, వాతోద్ధూతాః శ్వేతబలాకాకృతశోభాః।
ఏతే మేఘా గర్జితనాదోజ్జ్వలచిహ్నాః ప్రావృట్కాలం మత్తమయూరం కథయంతి ॥ 86

—విద్యున్నద్ధములును, ఇంద్రధనుస్సుచే రంజితములును, వాతోద్ధూతములును, శ్వేత బలాకాలంకృతములును, గర్జితధ్వనులచే ఉజ్జ్వలములును అగు ఈ మేఘములు మత్తమయూర మగు ప్రావృట్కాలమును సూచించుచున్నవి.

---

15. ఈ శ్లోకము 'జనాశ్రయి' యందుకూడ ఉదాహృతమైనది.

*శక్వరీ* ఛందమునందలి వృత్తములు (పాదమునకు 14 అక్షరములు)—

34. వసంతతిలక[16]—పాదమునందలి 1, 2, 4, 8, 11, 13, 14 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (ऽऽ।, ऽ।।, ।ऽ।, ।ऽ।, ऽऽ-త, భ, జ, జ, గగ).

చిత్రై ర్వసంతకుసుమైః కృతకేశహస్తా, స్రగ్దామమాల్యరచనాసువిభూషితాంగీ।
నానావతంసకవిభూషితకర్ణపాశా, సాక్షాద్వసంతతిలకేవ విభాతి నారీ॥ 88

విచిత్రములగు వసంత కుసుమములచే అలంకరింపబడిన కేశపాశము, మాల్యరచనలచే విభూషితమగు దేహము, వివిధకర్ణభూషణభూషితమగు కర్ణపాశమును గల ఈ నారీమణి సాక్షాత్తుగా వసంతతిలకమువోలె భాసిల్లుచున్నది.

35. అసంబాధ—పాదమునందలి మొదటి అయిదు అక్షరములును, చివరి మూడు అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (ऽऽऽ, ऽऽ।, ।।।, ।।ऽ, ऽऽ-మ, త, న, స, గగ). 5 అక్షరముల తరువాత యతి—

మానీ లోకజ్ఞః శ్రుతబలకులశీలాఢ్యో, యస్మిన్సమ్మానం న సదృశ మనుపశ్యేద్ధి।
గచ్ఛేత్త్యం త్యక్త్వా తం ద్రుతగతి రపరం దేశం, కీర్ణా నానార్థై రవనిరియ మసంబాధా॥ 90

—మానవంతుడు, లోకజ్ఞుడు, శ్రుత-బల-శీలాఢ్యుడును అగువాడు ఏదేశమందు తనకు అర్హమగు సంమానమును కాంచడో ఆదేశమును విడనాడి శీఘ్రముగా మరియొక దేశమున కేగవలెను. ఈ అవని నానార్థకీర్ణమై, అసంబాధయై అలరారుచున్నదికదా!

36. శరభ—పాదమునందలి మొదటి నాలుగు అక్షరములును 10, 11, 13, 14 అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (ऽऽऽ, ऽ।।, ।।।, ऽऽ। ऽऽ-మ, భ, న, త, గగ)—

ఏషా కాంతా వ్రజతి లలితం వేపమానా, గుల్మైశ్ఛన్నం వన మభినవైః సంప్రవిద్ధమ్।
హా హా కష్టం కిమిద మితి నో వేద్మి మూఢో, వ్యక్తం కాంతే శరభలలితాత్వం కరోషి॥ 92

—ఈ కాంత అభినవములగు గుల్మములచే ఛన్నమైన వనమును ప్రవేశించుచున్నది. ఏమిది? ఎంతకష్టము? నాకేమియు తెలియకున్నది. ఓ కాంతా! నిజముగా నీవు శరభలలితవలె ఆచరించుచున్నావు.

---

16. వసంత తిలకమును సైతవాచార్యుడు 'ఉద్ధర్షిణి' అనియు, కాశ్యపుడు 'సింహోన్నత' అనియు, గోమానసుడు 'మధుమాధవి' అనియు, రామకీర్తి 'చేతోహిత' అనియు వ్యవహరించిరి. సైతవాచార్యుని మతమున 'ఉద్ధర్షిణి' అని పింగళుడు చెప్పినను "జనాశ్రయి" యందు మాత్రము సైతవుడు 'ఇందుముఖి' అని వ్యవహరించినట్లు చెప్పబడెను. [శ్రీ మా. రామకృష్ణ కవిగారి అధస్సూచిక- 2వ సం- పుట 267.]



*అతిశక్వరీ* ఛందమునందలి వృత్తము (పాదమునకు 15 అక్షరములు)—

37. నాందీముఖి[17]— పాదమందలి మొదటి ఆరు అక్షరములును, 10, 13 అక్షరములును లఘువులు, తక్కినవి గురువులు (।।।, ।।।, ऽऽऽ, ।ऽऽ, ।ऽऽ-న, న, మ, య య,)—

న ఖలు తవ కదాచిత్క్రోధతామ్రాయతాక్షం
భ్రుకుటివలితభంగం దృష్టపూర్వం మయాస్యమ్।
కిమిహ బహుభిరుక్తైర్యా మమేచ్ఛా హృదిస్థా
త్వమసి మధురవాక్యా దేవి। నాందీముఖీవ॥ 94

—ఓ దేవీ! క్రోధతామ్రాయతాక్షమును, భ్రుకుటివలితభంగమును అగు ఇట్టి నీ మోమును నే నింతకు ముందెన్నడును చూడలేదు. పెక్కుమాట లేల? నాందీముఖివలె మధురవాక్యవగు నీవే నా హృదయస్థమగు కోరికవు.

*అష్టి* ఛందమునందలి వృత్తములు (పాదమునకు 16 అక్షరములు)—

38. ఇభలలితము (=గజవిలసితము)[18]— పాదమునందలి 1, 4, 6, 16 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు. (ऽ।।, ऽ।ऽ, ।।।, ।।।, ।।।, ऽ-భ, ర, న, న, న, గ)—

తోయధరైః సుధీరఘనపటుపటహరవైః
సర్జ-కదంబ-నీప-కుటజ కుసుమసురభిః।
కందలసేంద్ర గోపకరచితమవనితలం
వీక్ష్య కరోత్యసౌ వృషభగజ విలసితకమ్॥ 97

—గంభీరములగు పటుపటహారవములవంటి రవములు గల తోయధరములను, కందలసేంద్రగోపకమును సర్జ-కదంబ-నీప-కుటజ కుసుమములచే సురభిళమును అగు ఈ అవనితలమును వీక్షించి ఇతడు వృషభగజవిలసితము నాచరించుచున్నాడు.

39. ప్రవరలలితము (=లలిత ప్రవరము)— పాదమునందలి 2, 3, 4, 5, 6, 12, 13, 15, 16 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (।ऽऽ, ऽऽऽ, ।।।, ।।ऽ, ऽ।ऽ, ऽ-య, మ, న, స, ర, గ)—

నఖాలీఢం గాత్రం దశనఖచితం చోష్ఠగండం
శిరః పుష్పోన్మిశ్రం ప్రవిలులితకేశాలకాంతమ్।
గతిః ఖిన్నా చేయం వదనమపి సంభ్రాంతనేత్రం
అహో శ్లాఘ్యం వృత్తం ప్రవరలలితం కామచేష్టమ్॥ 100

---

17. 'నాందీముఖి'నే పింగలాదులు 'మాలిని' అనినారు. 7వ అధస్సూచికను కూడ చూడవలెను.

18. 'వృషభగజవిలసిత' మనియు దీనికి పేరు కన్పట్టుచున్నది.

—ఈమె గాత్రము నఖాలీఢము, ఓష్ఠ-గండములు దంతక్షతాంకితములు, శిరము పుష్పోన్మిశ్రము, కేశాలకాంతములు విలులితములు, గతి ఖిన్నము, వదనము సంభ్రాంతనేత్రము— అహో! శ్లాఘ్యమును, ప్రవరలలితమును అగు కామచేష్టితము వెల్లడి అగుచున్నది.*

అత్యష్టి ఛందమునందలి వృత్తములు (పాదమునకు 17 అక్షరములు)—

40. శిఖరిణి—పాదమునందలి 2, 3, 4, 5, 6, 12, 13, 17 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (।ऽऽ, ऽऽऽ, ।।।, ।।ऽ, ऽ।।, ।ऽ-య, మ, న, స, భ, లగ) 6 అక్షరములతరువాత యతి—

మహానద్యాభోగం పులినమివ తే భాతి జఘనం
తథాస్యం నేత్రాభ్యాం భ్రమరసహితం పంకజమివ।
తనుస్పర్శచ్ఛాయం సుతను సుకుమారో న పరుషః
స్తనాభ్యాం తుంగాభ్యాం శిఖరిణినిభాభాసి వనితే॥ 103

—ఓ వనితా! నీజఘనము మహానదీ తటమందలి పులినమువలె ఉన్నది. నేత్రములతోడి నీ ఆస్యము భ్రమర సహితమైన పంకజమువలె ఉన్నది. ఈ నీ తను స్పర్శ సుకుమారముగా ఉన్నదేకాని పరుషముగా లేదు. ఎత్తైన నీ స్తనములచే నీవు శిఖరిణి (శిఖరముగల పర్వతము) వలె కన్పట్టు చున్నావు.

41. వృషభచేష్టితము[19]— పాదమునందలి మొదటి ఐదు అక్షరములును, 11, 13, 14, 16 అక్షరములును లఘువులు, తక్కినవి గురువులు (।।।, ।।ऽ, ऽऽऽ, ऽ।ऽ, ।।ऽ, ।ऽ-న, స, మ, ర, స, లగ)—

జలధరరవం శ్రుత్వా శ్రుత్వా మదోచ్ఛ్రియదర్పితో
విలిఖతి మహీం శృంగాక్షేపైర్వృషః ప్రతినర్ద్య చ।
స్వయువతివృతో గోష్ఠాద్గోష్ఠం ప్రయాతి చ నిర్భయో
వృషభలలితం చిత్రం వృత్తం కరోతి చ శాద్వలే॥ 106

—జలధర గర్జితమును విని విని మదోచ్ఛ్రయముచే దర్పముగల వృషభము తన కొమ్ములతో భూమిని గోరాడుచు, ప్రతిగర్జనమును చేయుచు, స్వయువతి పరివృతమై గోష్ఠమునుండి గోష్ఠమునకు నిర్భయముగా పోవుచున్నది. శాద్వలమున చిత్రముగ వృషభలలితవృత్తము నాచరించుచున్నది.

*[కాశీముద్రణమునందు 16వ అధ్యా—38-75 శ్లో; బొంబాయి ముద్రణమునందు 15వ అధ్యా—38-71 శ్లో; బరోడా ముద్రణమునందు 15వ అధ్యా—53-100 శ్లో.]

19. 'వృషభచేష్టితము'ను పింగలాదులు 'హరిణి' అనినారు.



42. శ్రీధర[20]—పాదమునందలి మొదటి నాలుగు అక్షరములును, 10, 11, 13, 14, 16, 17 అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (ऽऽऽ, ऽ।।, ।।।, ऽऽ।, ऽऽ।, ऽऽ-మ, భ, న, త, త, గగ)—

స్నానైశ్చూర్ణైః సుఖసురభిర్గంధవాసైశ్చ ధూపైః
పుష్పైశ్చాన్యైః శిరసిరచితైర్వస్త్రయోగైశ్చ తైస్తైః।
నానారత్నైః కనకఖచితైరంగసంభోగసంస్థై
ర్వ్యక్తం కాంతే కమలనిలయా శ్రీధరేవాతిభాసి॥ 110

—ఓ కాంతా! స్నానములచేతను, చూర్ణములచేతను, సుఖపరిమళముగల గంధవాసములచేతను, ధూపములచేతను, శిరస్సునందు ధరించిన అనేకవిధములగు పుష్పములచేతను, వస్త్రములచేతను, దేహాస్థితములగు కనకఖచితనానారత్నముల చేతను నీవు నిజముగ కమల నిలయ అగు శ్రీధరవలె భాసించుచున్నావు.

43. వంశపత్రపతితము— పాదమునందలి 1, 4, 6, 10, 17 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (ऽ।।, ऽ।ऽ, ।।।, ऽ।।, ।।।, ।ऽ-భ, ర, న, భ, న, లగ)—

ఏష గజో ఒద్రిమస్తకతటే కలభపరివృతః
క్రీడతి వృక్షగుల్మగహనే కుసుమభరనతే।
మేఘరవం నిశమ్య ముదితః పవనజవసమః
సుందరి! వంశపత్రపతితం పునరపి కురుతే॥ 112

—ఓ సుందరీ! వృక్ష-గుల్మ గహనమును, కుసుమభరనతమును అగు ఈ పర్వత శిఖరమున ఈ గజము కలభపరివృతమై క్రీడించుచున్నది. మేఘ గర్జనమును విని సంతోషముకలదై మరల పవనజవముతో వంశపత్రపతితము నాచరించుచున్నది.

44. విలంబితగతి[21]—పాదమునందలి 2, 6, 8, 12, 14, .5, 17 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (।ऽ।, ।।ऽ, ।ऽ।, ।।ऽ, ।ऽऽ, ।ऽ-జ, స, జ, స, య, లగ)—

విఘూర్ణితవిలోచనా పృథువికీర్ణహారా పునః
ప్రలంబరశనా చలత్స్ఖలితపాదమందక్లమా।
న మే ప్రియమిదం జనస్య బహుమానరాగేణ య
న్మదేన వివశా విలంబితగతిః కృతా త్వం ప్రియే॥ 116

20. 'శ్రీధర' ను పింగలాదులు 'మందాక్రాంత' మనినారు.

21. 'విలంబితగతి' ని పింగలాదులు 'పృథ్వి' అనినారు.

—ఓ ప్రియురాలా! ఘూర్ణిత నయనవును, వికీర్ణపృథుహారవును, ప్రలంబమాన రశనవును, స్ఖలితపాదవును, నాప్రియురాలవును అగు నీవు జనుల బహుమానరాగము తోడి మదముచే వివశవై విలంబితగతివిగా చేయబడుట నాకు ప్రియము కాదు.

ధృతి ఛందమునందలి వృత్తము (పాదమునకు 18 అక్షరములు)—

45. చిత్రలేఖ[22]—పాదమునందలి మొదటి ఐదు అక్షరములును 11, 12, 14, 15, 17, 18 అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (UUU, UU|, |||, |UU, |UU, |UU-మ, త, న, య, య, య)—

నానారత్నాఢ్యై ర్బహుభిరధికం భూషణై రంగసంస్థై
ర్నానాగంధాఢ్యై ర్మదనజననై రంగరాగైశ్చ హృద్యైః।
కేశైః స్నానాఢ్యైః కుసుమభరితై ర్వక్త్రరాగైశ్చ తైస్తైః
కాంతే సంక్షేపాత్ కిమిహ బహునా చిత్రలేఖేవ భాసి॥ 118

—ఓ కాంతా! అంగస్థితములగు నానారత్నాఢ్యములగు బహుభూషణములచేతను, మన్మథోద్దీపకములును నానా గంధాఢ్యములును అగు హృద్యాంగ రాగములచేతను, స్నానాఢ్యములును కుసుమభరితములును అగు కేశపాశముల చేతను, ఆయావక్త్ర రాగములచేతను నీవు నిజముగా చిత్రలేఖవలెభాసించుచున్నావు.

అతిధృతి ఛందమునందలి వృత్తము (పాదమునకు 19 అక్షరములు)—

46. శార్దూలవిక్రీడితము— పాదమునందలి 1, 2, 3, 6, 8, 12, 13, 14, 16, 17, 19 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UUU, ||U, U|, ||U, UU| UU| U-మ, స, జ, స, త, త, గ)[23]—

నానాశస్త్రశతఘ్నితోమరహతాః ప్రభ్రష్టసర్వాయుధాః
నిర్భిన్నోదరపాదబాహువదనా నిర్ణాశితాః శత్రవః।
ధైర్యోత్సాహపరాక్రమప్రభృతిభి స్తైస్తైర్విచిత్రైర్గుణై
ర్వృత్తం తే రిపుఘాతి భాతి సమరే శార్దూలవిక్రీడితమ్॥ 122

—నానాశస్త్ర-శతఘ్ని-తోమరహతులుగా, నిర్భిన్నోదర-పాద-బాహు వదనులుగా, ప్రభ్రష్ట సర్వాయుధులుగా నీ శత్రువులు నాశనము చేయబడిరి. ధైర్యోత్సాహపరాక్రమాదులగు నీ విచిత్ర గుణములచే రిపుసంహారియగు నీవృత్తము శార్దూలవిక్రీడితముగా భాసించుచున్నది.

కృతి ఛందమునందలి వృత్తము (పాదమునకు 20 అక్షరములు)—

47. సువదన—పాదమునందలి మొదటి నాలుగు అక్షరములును, 6, 7, 14, 15, 16, 20 అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (UUU, U|U, U||, |||, |UU, U||, |U-మ, ర, భ, న, య, భ, లగ)—

నేత్రే లీలాలసాంతే కమలదలనిభే భ్రూచాపవినతే
గండోష్ఠం పీనమధ్యం సమసహితఘనాః స్నిగ్ధాశ్చదశనాః।
కర్ణావంసప్రలంబౌ చిబుకమపి నతం ఘోణా సురుచిరా
వ్యక్తం త్వం మర్త్యలోకే వరతను విహితాస్యేకా సువదనా॥ 127

—లీలాలసాంతములైన నీ నేత్రములు కమలదల నిభములు, నీ భ్రువులు చాపమువలె వినతములు, గండోష్ఠములు మధ్యభాగమున బలిసి ఉన్నవి, నీ దంతము లన్నియు సమసహిత ఘనములును స్నిగ్ధములును, చెవులు అంసప్రలంబములు, చిబుకము నతము, నాసిక రుచిరము- ఓ వరతనూ! నిజముగ నీవొకతెవే ఈ మర్త్య లోకమున సువదనవు.

ప్రకృతి ఛందమునందలి వృత్తము (పాదమునకు 21 అక్షరములు)—

48. స్రగ్ధర— పాదమునందలి మొదటి నాలుగు అక్షరములును, 6, 7, 14, 15, 17, 18, 20, 21 అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (UUU U|U, U||, |||, |UU, |UU, |UU-మ, ర, భ, న, య, య, య)—

చూతాశోకారవిందైః కురవకతిలకైః కర్ణికారైః శిరీషైః
పున్నాగైః పారిజాతై ర్వకులకువలయైః కింశుకైః సాతిముక్తైః।
ఏతైర్నానాప్రకారైః కుసుమసురభిభి ర్విప్రకీర్ణైశ్చ తైస్తై
ర్వాసంతైః పుష్పబృందై ర్నరవర వసుధా స్రగ్ధరే వాద్య భాతి॥ 131

—ఓ నరవర! చూత-అశోక-అరవింద-కురవక-తిలక-కర్ణికార-శిరీష పున్నాగ-పారిజాత-వకుల-కువలయ-హింశుక-అతిముక్తాది నానాప్రకారములగు వాసంత కుసుమ బృందములచే ఈ వసుధ స్రగ్ధరవలె భాసించుచున్నది,

ఆకృతి ఛందమునందలి వృత్తము (పాదమునకు 22 అక్షరములు)—

---

22. 'చిత్రలేఖ' ను పింగలాదులు 'కుసుమితలతావేల్లిత' మనినారు.

23. దీనికి రెండు ఉదాహరణము లొసంగబడినవి. రెండవ ఉదాహరణము—

తావత్త్వం విజితేంద్రియః శుభమతే సర్వాత్మనా ప్రత్యహం
దానే శీలవిధౌ చ యోజయ మనః స్వర్గాపవర్గావహమ్।
యావద్వ్యాధిజరాప్రచండనఖరో వ్యాయత్పటాభి ర్భృశం
మృత్యు స్తే న కరోతి జీవితమృగైః శార్దూలవిక్రీడితమ్॥ 123

—ఓ శుభమతీ! వ్యాధి-జరలనెడి ప్రచండ నఖములతో, వ్యాయత్సటలతో మృత్యువు నీ జీవిత మృగములతో శార్దూలవిక్రీడిత మొనర్చునంతలోనే అన్ని విధముల విజితేంద్రియుడవై, ప్రతి దినమును స్వర్గాపవర్గావహమగునట్లుగా దానవిధియందును, శీలవిధియందును నీ మనస్సు నెల్లప్పుడును నిలుపుము.

49. మద్రకము— పాదమునందలి 1, 4, 6, 10, 12, 16, 18, 22 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UII, UIU, III, UIU, III, UIU, III, U-భ, ర, న, ర, న, ర, న, గ)—

ఉత్ప్లుతమేకహస్తచరణం ద్వితీయకరరేచితం సువినతం
వంశమృదంగవాద్యమధురం విచిత్రకరణానుగం బహువిధమ్ ।
మద్రకమేతదద్య సుభగే విదగ్ధగతిచేష్టితైః సులలితై
ర్నృత్యసి విభ్రమాకులపదం వివిక్తరసభావితం శశిముఖి ॥ 135

—ఓ శశిముఖి! ఒక హస్తమును ఒక పాదమును ఉత్ప్లుతమునుకావించి, రెండవ చేతితో రేచితమును ఆచరించి, వంశమృదంగవాద్య మధురముగ, విచిత్ర కరణాన్వితముగ, లలితవిదగ్ధగతి చేష్టితములతో, విభ్రమాకుల పదములతో, వివిక్తరస భావములు కలుగునట్లు మద్రకనృత్యమును కావించుచున్నావు.

<u>వికృతి</u> ఛందమునందలి వృత్తము (పాదమునకు 23 అక్షరములు)—

50. అశ్వలలితము—పాదమునందలి 5, 7, 11, 13, 17, 19, 23 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (III, IUI, UII, IUI, UII, IUI, UII, IU-న, జ, భ, జ, భ, జ, భ, లగ)—

వివిధతురంగనాగరథయోధసంకులమలం బలం సముదితం
శరశతశక్తికుంతపరిఘాసియష్టివితతం బహుప్రహరణమ్ ।
రిపుశతముక్తశస్త్రరవభీతశంకితభటం భయాకులదిశం
కృతమభివీక్ష్య సంయుగముఖే సమర్పితగుణం త్వయాశ్వలలితమ్॥ 139

—వివిధ తురంగ-గజ-రథ-యోధ సంకులమును, శరశత-శక్తి-కుంత-పరిఘ-అసి-యష్టి వితతమును, బహుప్రహరణమును, అనేక శత్రుముక్తాస్త్రశస్త్రరవ భీతశంకితభటమును, భయాకులదిశమును అగునట్లు నీవు యుద్ధభూమియందు అశ్వ లలితము నాచరించితివి.

<u>సంకృతి</u> ఛందమునందలి వృత్తము (పాదమునకు 24 అక్షరములు)—

51. మేఘమాల—పాదమునందలి మొదటి ఆరు అక్షరములును, 8, 11, 14, 17, 20. 23 అక్షరములును లఘువులు, తక్కినవి గురువులు (III, III, UIU, UIU, UIU, UIU, UIU, UIU-న, న, ర, ర. ర, ర, ర, ర)—

పవనబలసమాహృతా తీవ్రగంభీరనాదా బలాకావలీమేఖలా
క్షితిధరసదృశోచ్ఛ్రయాపా మహానీలధూమాంజనాభాంబుగర్భోద్భవా ।
సురపతిధనురుజ్జ్వలాబద్ధకక్ష్యా తడిద్ద్యోతసన్నాహపట్టోజ్జ్వలా
గగనతలవిసారిణీ ప్రావృషేణ్యా దృఢం మేఘమాలాధికం శోభతే ॥ 143



—పవనబలసమాహృతయును, తీవ్రగంభీరనాదయును, బలాకావలి మేఖలగా కలదియును, పర్వతసదృశోన్నతాకారయును, మహానీల ధూమాంజన-అంబు గర్భయును, ఇంద్రధనుర్నిర్మితవిచిత్రకక్ష్యయును, తడిత్ప్రకాశసన్నాహపట్టోజ్జ్వల యును, గగనతల విసారిణియును అగు ప్రావృషేణ్యమగు మేఘమాల అధికముగా శోభించుచున్నది.

<u>అభికృతి</u> ఛందమునందలి వృత్తము (పాదమునకు 25 అక్షరములు)—

52. క్రౌంచపాది—పాదమునందలి 1, 4, 5, 6, 9, 10, 25 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు (UII, UUU, IIU, UII, III, III, III, III, U-భ, మ, స, భ, న, న, న, న, గ)[24]—

యః కిల దాక్షం విద్రుతసోమం క్రతువర మచమస మపగతకలశం
పాతితయూపం క్షిప్తచషాలం విచయన మసమిధ మపశుకచరుకమ్ ।
కార్ముకముక్తేనాశు చకార వ్యపగతసురగణపితృగణమిషుణా
నిత్యమసౌ తే దైత్యగణారిః ప్రదహతు మఖమివ రిపుగణమఖిలమ్ ॥ 147

—ఏ దైత్యగణారి (శివుడు) స్వీయకార్ముకముక్తమగు ఒక బాణముతో దక్షయజ్ఞమును విద్రుతసోమముగను, అచమసముగను, అపగతకలశముగను, పాతితయూపముగను, క్షిప్తచషాలముగను, విచయనముగను, అసమిధముగను, అపశుకముగను, చరురహితముగను, వ్యపగతసుర-పితృగణమును కావించెనో అతడు ఆ మఖమునువలె మీ అఖిలరిపుగణమును దహించునుగాక!

<u>ఉత్కృతి</u> ఛందమునందలి వృత్తము (పాదమునకు 26 అక్షరములు)—

53. భుజంగవిజృంభితము— పాదమునందలి మొదటి ఎనిమిది అక్షరములును, 19, 21, 24, 26 అక్షరములును గురువులు, తక్కినవి లఘువులు (UUU, UUU, UUI, III, III, III, UIU, IIU, IU-మ, మ, త, న, న, న, ర, స, లగ)—

---

24. దీనికి రెండవ ఉదాహరణము కూడ కలదు—

యా కపిలాక్షీ పింగలకేశీ కలిరుచిరనుదినమనునయకఠినా
దీర్ఘతరాభిః స్థూలసిరాభిః పరివృతవపురతిశయకుటిలగతిః ।
ఆయతజంఘా నిమ్నకపోలా లఘుతరకుచయుగపరిగతహృదయా
సా పరిహార్యా క్రౌంచపదా స్త్రీ ధ్రువమిహ నిరవధి సుఖమభిలషతా॥ 148

— కపిల నేత్రములు, పింగళ కేశములు, దీర్ఘములును స్థూలములును అగు సిరలు, పరివృత శరీరము, అతిశయ కుటిలగతి, ఆయత జంఘలు, నిమ్నకపోలములు, లఘుతర కుచ యుగపరిగతహృదయమును కలదై క్రౌంచపదయును, ప్రతిదినకలహప్రియయును, అనునయముచే బిగియునదియును అగు స్త్రీని నిరవధికసుఖమును అభిలషించు నరుడు విడువవలెను.

రూపోపేతాం దేవైః సృష్టా సమదగజవిలసితగతిం నిరీక్ష్య తిలోత్తమాం
ప్రాదక్షిణ్యాత్ప్రాప్తాం ద్రష్టుం బహువదనమచలనయనం శిరః కృతవాన్హరః ।
దీర్ఘం నిశ్వస్యాంతర్గూఢం స్తనవదనజఘనరుచిరాం నిరీక్ష్య తథా పునః
పృష్ఠే న్యస్తం దేవేంద్రేణ ప్రవరమణికనకవలయం భుజంగవిజృంభితమ్ ॥ 152

— దేవతలచే రూపోపేతముగా సృష్టింపబడినదియును, సమదగజ విలాసగతి కలిగినదియును, తనకు ప్రదక్షిణము చేయవచ్చినదియును అగు తిలోత్తమను చూచుటకు హరుడు తన బహువదన-నేత్రములను అచంచలములుగా చేసెను. అట్లు స్తన-వదన-జఘన రుచిరయైన ఆమెను నిరీక్షించి, అంతర్గూఢముగా దీర్ఘ నిశ్వాసను నిగిడించి (వ్యర్థము అను ఊహతో తన) భుజంగవిజృంభితమైన ప్రవరమణి కనక వలయమును పృష్ఠభాగమునం దుంచెను.*

ఇంతవరకును సమవృత్తములను వివరించియున్నాను. ఇంక విషమ - అర్ధ సమవృత్తమ లను వివరింతును. వివిధవృత్తసముద్భవములగు పాదములు విషమము లుగా కూర్చబడినచో అది విషమవృత్తమగును. (అనగా ఒక పాదమును పోలి ఇంకొక పాదము ఉండదు). రెండు పాదములు సమముగను (1, 3 పాదములు;

---

*[కాశీముద్రణమునందు 16 వ అధ్యా—76-111 శ్లో; బొంబాయి ముద్రణమునందు 15 వ అధ్యా—72-109 శ్లో; బరోడా ముద్రణమునందు 15 వ అధ్యా—101-152 శ్లో].

ఇచ్చట దండకమును వివరించెడి రెండు శ్లోకములు కలవు (153-154 శ్లో). ఇవి ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి. ఉదాహరణము మాత్రము 'జనాశ్రయి' యందు కలదు. ఆ గ్రంథకారుడగు రుద్రస్వామి ఎచ్చట నుండి దీనిని గ్రహించెనో తెలియదు. ఈ దండకము 'చండవృష్టి ప్రయోగ' మను పేరుతో కూడ వ్యవహరింపబడుచున్నది [శ్రీ మా. రామకృష్ణ కవిగారి అధస్సూచిక పుట - 281].

దండకము—ఉత్కృతి ఛందమునందుకంటె అధికాక్షరముగా ఉన్నచో దండక మగును. ఇది మేఘమాలాదిభేదములను కలిగిఉండును. పాదమునకు 27 అక్షరములు, అందులో మొదట రెండు న గణములు పిమ్మట ఏడు ర గణములును ఉండును—

ముదితజనపదాకులా స్ఫీతసస్యాకరా భూతధాత్రీ భవంతం సమభ్యర్చతి
ద్విరదకరవిలుప్తహింతాలతాలీవనాస్త్వాం నమస్యంతి వింధ్యాదయః పర్వతాః ।
స్ఫుటితకలశశుక్తినిర్గీర్ణముక్తాఫలైరూర్మిహస్తైర్నమస్యంతి వః సాగరాః
ముదితజలచరాకులాః సంప్రకీర్ణామలాః కీర్తయంతీవ కీర్తిం మహానిమ్నగాః ॥ 154

—ముదితజనపదాకులయు, సమృద్ధ సస్యాకరయు అగు ఈ భూదేవి నిన్ను పూజించు చున్నది. ద్విరదకరములచే త్రుంపబడిన హింతాల-తాలీ వనములు కల వింధ్యాది పర్వత ములు నిన్ను నమస్కరించుచున్నవి. బద్దలైన విమలములగు శుక్తులనుండి బయల్వెడలిన ముక్తాఫలములతో కూడిన ఊర్మిహస్తములతో సముద్రములు నిన్ను నమస్కరించుచున్నవి. ముదితజలచరాకులములును, సంప్రకీర్ణములును, అమలములును అగు మహానదులు నీకీర్తిని కీర్తించుచున్నవివలె ఉన్నవి.



2, 4 పాదములు), రెండు పాదములు విషమముగను (1, 2 పాదములు; 3, 4 పాదములు) అనగా 1, 3 పాదములు ఒక విధముగను; 2, 4 పాదము లింకొక విధముగను ఉన్నచో అది 'అర్ధ విషమ' (లేదా అర్ధ సమ) వృత్త మనబడును. అన్ని పాదములును ఒక పాదము నింకొక పాదము పోలిఉండనిచో అది సర్వ విషమ వృత్తము. అర్ధసమవృత్తమునందు ప్రథమ-తృతీయ పాదములును, ద్వితీయ-చతుర్థ పాదములును వరుసగా హ్రస్వదీర్ఘములుగాని, దీర్ఘహ్రస్వములుగాని అగుచుండును. ఒక పాదమునకు గణవిభజనమును చెప్పినచో సమవృత్తమంతటికిని గణవిభజనము చెప్పినట్లగును. విషమ వృత్తమున పాదము లన్నింటికిని వేరువేరుగా గణములను చెప్పవలయును. అర్ధసమవృత్తమున రెండు పాదములకు (1, 2 పాదములకు) గణములను చెప్పినచో చాలును.

### పథ్యావృత్త భేదములు

సమవృత్తముల గణవిభజనమును ఇంతకుముందే వివరించియున్నాను. ఇంక విషమ వృత్తములకు గణవిభజనపూర్వకముగా లక్షణములను వివరింతును—

అనుష్టుప్ ఛందమునందలి వృత్తములు (పాదమునకు 8 అక్షరములు)—

54. అర్ధసమపథ్యా— 1, 3 పాదములందు - 'స, స, గగ' ములును; 2, 4 పాదములందు- 'స, ర, లగ' లును ఉండును—

ప్రియ దైవత మిత్రాసి, ప్రియ సంబంధి బాంధవా ।
ప్రియదానరతా పథ్యా, దయితే । త్వం ప్రియాసి మే ॥ 163

—ఓ దయితా! దైవమునందు, మిత్రులందు, సంబంధులందు, బాంధవుల యందు ప్రీతికలదానవై, ప్రియదానరతవై నీవు నాకు పథ్యవు, ప్రియవు అయితివి.

55. విషమపథ్యా— 1 వ పాదమునందు- 'మ, ర, గగ' లును; 2 వ పాదమునందు- 'య, స, లగ' లును; 3 వ పాదమునందు- 'ర, భ, లగ' లును; 4 వ పాదమునందు- 'త, స, లగ' లును ఉండును—

నైవాచారో న తేమిత్రం, న సంబంధిగుణప్రియా ।
సర్వథా సర్వవిషమా, పథ్యా న భవసి ప్రియే ॥ 165

—ఓ ప్రియురాలా! నీకు ఆచారమా లేదు, మిత్రులా లేరు, సంబంధిగుణ ముల యందు ప్రీతియా లేదు. ఇట్టి నీవు నాకు అన్నివిధముల సర్వవిషమవై పథ్యవు కాకున్నావు.

56. విపరీతపథ్య— ఈ బేసి పాదముల లక్షణము ఎచ్చట విపరీతముగా ఉండునో అది 'విపరీత పథ్య' అగును.[25]

కృతేన రమణస్య కిం, సఖి ! రోషేణ తే ఉప్యర్థమ్ ।
విపరీతా న పథ్యాసి, త్వం జడే ! కేన మోహితా॥ 167

—ఓ చెలీ! రమణునిపై రోషము తెచ్చుకొనినందువలన ప్రయోజనమేమి? నీవు విపరీతవగుటచే పథ్యవు కావైతివి. ఓ జడురాలా! నీ వెవ్వరిచే మోహింపబడుదువు ?

57. చపల—బేసి పాదములందు 4 వ అక్షరము తరువాత మూడు లఘువు లుండవలెను.[26] ( 5, 6, 7 అక్షరములు లఘువులు) దీనికి 'అనుష్టుప్ చపల' అని పేరు.

న ఖల్వస్యాః ప్రియతమః, శ్రోతవ్యం వ్యాహృతం సఖ్యా ।
నారదస్య ప్రతికృతిః, కథ్యతే చపలా హీయమ్॥ 169

—'ఈమెకు ప్రియతముడు లేడు' అని చెలికత్తె చెప్పినమాట వినదగినది. ఈ చపల నారదుని ప్రతికృతిగా చెప్పబడుచున్నది.

58. విపుల—సరిపాదములందలి 7 వ అక్షరము లఘువు కావలెనని కొందరందురు.

సంక్షిప్తా వజ్రవన్మధ్యే, హేమకుంభనిభ స్తనీ ।
విపులాసి ప్రియే ! శ్రోణ్యాం, పూర్ణచంద్రనిభాననే॥ 171

---

25. ఇచ్చటి లక్షణము స్పష్టముగాలేదు. ఉదాహరణమున 1, 4 పాదములు భిన్నములుగను, 2, 3 పాదములు సమములుగను కన్పట్టుచున్నవి.

26. తక్కిన అక్షరముల విషయమున నియమము చెప్పబడలేదు. రెండు ప్రతులందు మాత్రము 'చపల' అనియే పాఠము. చాల గ్రంథములందు 'విపుల' అని కలదు. పింగలాదులు 'చపల' అనియే చెప్పిరి. రుద్రస్వామి 'చపల' అని సూత్రించి, ఈ "వక్త్రము" నందే విషమ పాదములందు చివరి వర్ణమునకు పూర్వము నకారము (క కారమని ముద్రణమున తప్పు పడినది) ఉన్నచో 'చపల' అనబడును అని చెప్పి "భాత్యశోకః కిసలయః కుసుమ స్తబకై రమ్యైః శ్రియం హస్తాధరగతాం లజ్జయన్నివ చ స్త్రీణామ్" అని ఉదాహరించెను. ఈశానదేవుడును ఛందః స్తుతియందు ఇట్టి ఉదాహరణమునే ఇచ్చెను. సైతవాచార్యమతమున ఇది నకార విపుల. మందార మరందమున "చపలా వక్త్రిమయుజోస్సముద్రా న్నగణోయది" (విషమ పాదములందు 4 అక్షరముల తర్వాత నగణమున్నచో చపలావక్త్రిము) అని చెప్పబడెను. పై కారణములచే "చపల" అను పాఠమే గృహీతము. [శ్రీ మా. రామకృష్ణకవిగారి అధస్సూచిక - 2 వ సం - పుట 283.]



—ఓ పూర్ణచంద్రనిభాననా! ప్రియా! వజ్రమువలె నీవు మధ్యభాగమందు సంక్షిప్తవు, హేమకుంభనిభ స్తనములు కలదానవు, శ్రోణియందు విపులవు అయి ఉన్నావు.

'విపుల' యందలి అన్ని పాదములందును 7 వ అక్షరము లఘువు కావలెనని మరి కొందరందురు[27]—

గంగేవ మేఘోపగమే, ఆప్లావిత వసుంధరా ।
కూలవృక్షానారుజంతీ, స్రవంతీ విపులాచలాత్॥ 172

—మేఘాగమనమునందు విపులాచలములనుండి స్రవించుచు, కూలవృక్షములను పీడించుచు, వసుంధర నాప్లావిత మొనర్చుచు ప్రవహించు గంగవలె భాసించుచున్నావు.[28]

ఇట్లు పథ్యాపాదములు విభిన్న పాదసంయోగములతో ఏర్పడుచున్నవి. ఇంక తక్కిన అనుష్టుప్ ఛందో భేదముల సరి-బేసి పాదములను ఇతర త్రికములతో కల్పించవలెను. గుర్వంతత్రికము అగు సగణము కాని (గుర్వంతత్రికము అనగా 'స' గణముమాత్రమే అని అభినవగుప్తుడు), సర్వలఘు త్రికము (నగణము) కాని ప్రథమాక్షరము తరువాత ఉండరాదు. నాలుగవ అక్షరము తరువాత ప్రాగ్లఘువు అగు 'య' గణము ఉండవలెను.

59. వక్త్రిము—పథ్యాపాదాంతమందు మూడు గురువులున్నచో అది 'వక్త్రి' మనబడును—

దంతక్షతాధరం సుభ్రు, జాగరగ్లాననేత్రాంతమ్ ।
రతిసంభోగఖిన్నం తే, దర్శనీయతరంవక్త్రమ్ ॥ 177

—ఓ సుభ్రూ! దంతక్షతాధరము, జాగరగ్లాన నేత్రాంతము, రతిసంభోగ ఖిన్నమును అగు నీ వక్త్రము (ముఖము) దర్శనీయతరమై ఉన్నది.

ఇవి అనుష్టుప్ ఛందమునందలి విషమవృత్తభేదములు. ఇందలి త్రికముల విషయమున మతభేదములు కలవు.

### ఇతర వృత్తములు

60. వానవాసిక— ఒక్కొక్క పాదమునందు 16 మాత్రలుండును. ఒక్కొక్క గాథ 4 అంశకములు (పాదములు)గా విభక్తమై ఉండును—

---

27. సైతవాచార్యుని మతమునందు రకార-తకార-భకార-మకార-నకార విపులలు ప్రసిద్ధములుగా ఉన్నవి [శ్రీ కవిగారి అధస్సూచిక - 2 వ సం - పుట 254.]

28. ఇచ్చట ఇంకొక ఉదాహరణము ఒక వ్రాతప్రతియందు మాత్రమే కలదట—

అగతా మేఘసమయే, భీరుభీరుకులోద్గతే । ఏకరాత్రౌ పరగృహం చోరి బంధనమర్హసి॥ 173

అసంస్థితపదా సువిహ్వలాంగి, మదస్ఖలితచేష్టితైర్మనోజ్ఞా।
క్వ యాస్యసి వరోరు। సురతకాలే, విషమా కిం వానవాసికా త్వం॥ 180

—ఓ వరోరూ! అసంస్థితపదవు, సువిహ్వలాంగివి, మదస్ఖలితచేష్టితములచే మనోజ్ఞవు అగు నీవు సురత కాలమందు విషమవై ఎచ్చటకు వెళ్ళుచున్నావు? ఏమి నీవు వానవాసికవా ?

61. కేతుమతి— 1, 3 పాదములందు - 'స, జ, స, గ' లును; 2, 4 పాదములందు - 'భ, ర, న, గగ' లును ఉండును—

స్ఫురితాధరం చకితనేత్రం, రక్తకపోల మంబుజదలాక్షమ్।
కిమిదం రుషాపహృతశోభం, కేతుమతీసమం వద ముఖం తే॥ 182

—స్ఫురితాధరమును, చకితనేత్రమును, రక్తకపోలమును, అంబుజదళాక్షమును అగు నీ ముఖము కోపముచే అపహృతశోభమై కేతుమతీ సమమైనది. ఏమిది చెప్పుము.

62. అపరవక్త్రము— 1, 3 పాదములందు- 'న, న, ర, లగ' లును; 2, 4 పాదములందు- న, జ, జ, ర' లును ఉండును—

సుతను। జలపరీతలోచనం, జలదనిరుద్ధమివేందుమండలమ్।
కిమిదమపరవక్త్రమేవ తే శశివదనే ఉద్య ముఖం పరాఙ్ముఖమ్॥ 185

—ఓ సుతను! జలపరీతలోచనమగు నీ ముఖము మేఘనిరుద్ధమైన ఇందు మండలమువలె పరాఙ్ముఖమైనది. ఏమిది? నీ ముఖము అపరవక్త్రమైనదా ?

63. పుష్పితాగ్ర— 1, 3 పాదములందు- 'న, న, ర, య' లును; 2, 4 పాదములందు- 'న, జ, జ, ర, గ' లును ఉండును—

పవనబల విధూతచారుశాఖం, ప్రముదితకోకిలకంఠనాదరమ్యమ్।
మధుకరపరిగీయమానశబ్దం, వరతను। పశ్య వనం సుపుష్పితాగ్రమ్॥ 178

—ఓ వరాంగీ! పవనబల విధూత చారు శాఖమును, ప్రముదితకోకిలకంఠనాద రమ్యమును, మధుకరపరిగీయమాన శబ్దమును, సుపుష్పితాగ్రమునుఅగు ఈ వనమును చూడుము.

64. ఉద్గత— 1 వ పాదమునందు-'స, జ, స, ల'; 2 వ పాదమునందు- 'న, స, జ, గ'; 3 వ పాదమునందు-'భ, న, జ, లగ', 4 వ పాదమునందు- 'స, జ, స, జ, గ'—

తవ రోమరాజిరతిభాతి, సుతను। మదనస్య మంజరీ।
నాభికమలవివరోత్పతితా, భ్రమరావలీవ కుసుమాత్సముద్గతా। 189



—ఓ శోభనాంగీ! మదనమంజరి అగు నీ రోమరాజి నాభికమలవివరోత్పతితమై కుసుమ సముద్గతమైన భ్రమరావలివలె ప్రకాశించుచున్నది.

65. లలిత— 1 వ పాదమునందు-'స, జ, స, ల'; 2 వ పాదమునందు- 'న, స, జ, గ'; 3 వ పాదమునందు-'న, న, స, స'; 4 వ పాదమునందు-'స, జ, స, జ, గ'—

లలితాకులభ్రమిత చారు, వసనకరచారుపల్లవా।
ప్రవికసితకమలకాంతిముఖీ, ప్రవిభాసి దేవి। సురతశ్రమాతురా॥ 191

—ఓ దేవీ! లలితాకులముగ భ్రమితమైన చారువసనమును కరపల్లవముచే గ్రహించి ప్రవికసితకమలకాంతిముఖివై సురతశ్రమాతుర వగు నీవు భాసించు చున్నావు.

ఈ విధముగా నాటకాది కావ్యములందు ప్రయోగింపదగు సమ-విషమ వృత్తములను వివరించితిని. ఇవికాక సామూహికముగా పేర్కొనబడిన ఇతర వృత్తములు శోభను కలిగించవు కాన వాటిని నాటకాదులందు ప్రయోగించరాదు. వాటిని గీతకాదులందు మాత్రమే ప్రయోగింపదగును; వాటి విభాగమును ధ్రువాగాన నిరూపణ సమయమున వివరింతును.*

## ఆర్యావృత్తములు

ఇంతవరకును సంగ్రహముగా వృత్తలక్షణములను వివరించితిని. ఇంక ఆర్యా లక్షణమును వివరింతును. ఆర్య ఐదు విధములు—పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల. ఈ ఆర్యలకు సంబంధించిన యతిని, మాత్రావిభాగమును, గణములకు సంబంధించిన వికల్పమును ఇంక వివరింతును.

ఇందు గణమునకు నాలుగుమాత్ర లుండును. యతి అనగా పదచ్ఛేదము (పదము అచ్చటికి విరుగుట). 2, 4 పాదములను 'యుగ్మము' (సరి పాదము) లనియు; 1, 3 పాదములను 'అయుగ్మము' (బేసి పాదము) లనియు అందురు. నాలుగు మాత్రలతో కూడిన జగణము బేసి గణముగా ఉండరాదు. సరిగణములను మాత్రము కవి యథేష్టముగా కూర్పదగును. 6 వ గణము ద్వివికల్పముగా అనగా రెండు విధములుగా ఉండును. చివర ఒక గురువు ఉండును. ఉత్తరార్ధమున ఉన్న ఆరవగణము ఒక్క మాత్రయే అనగా ఒక్క లఘువే అయి ఉండును. ద్వివికల్పమగు ఆరవగణము మధ్య గురువుగల జగణముగాకాని, లేదా ముందు

* [కాశీముద్రణమునందు 16 వ అధ్యా—112-151 శ్లో: బొంబాయి ముద్రణమునందు 15వ అధ్యా-110-149 శ్లో; బరోడాముద్రణమునందు 15 వ అధ్యా—153-195 శ్లో.]

చెప్పబోవు యతి నియమముతో కూడి సర్వ లఘు గణము (నలము)గా కాని ఉండవచ్చును. పూర్వార్ధమున ఏడవ గణము నలము అయినచో రెండవ అక్షరమును, అయిదవగణము నలము అయినచో అందు మొదటి లఘువును యతి స్థానములు." ఉత్తరార్ధమున అయిదవ గణము నలమయినచో ప్రథమాక్షరాదియందు అనగా నాలుగవగణము చివర యతి ఉండవలయును.

ఆర్యావృత్తమున మూడు గణములతో పాదము ఉన్నచో అది 'పథ్యార్య' అనబడును. అంతకు భిన్నమగురీతిగా పాదములున్నచో అది 'విపులార్య' అనబడును. విషమగణములు సర్వ గురువులు (=మ గణములు)గా, సమగణములు మధ్య గురువులు (=జ గణములు) గా ఏ ఆర్యాపాదములందుండునో అది 'చపలార్య' అనబడును.[30]

ఈ ఆర్యా వృత్తమున పూర్వార్ధమునకు ముప్పది మాత్రలును, ఉత్తరార్ధమునకు ఇరువదిఏడు మాత్రలును ఉండవలయును. ఇది ఆర్యా సామాన్య లక్షణము. ఇంకొక మూడు లఘ్వక్షరములనుకూడ చేర్చి ఉత్తరార్ధమునకూడ ముప్పది మాత్రలను కూర్చినచో ఆర్యయందు మొత్తము 60 మాత్రలు ఉండును. భంగ్యంతరముగా చెప్పవలెనన్నచో ఆర్య లన్నింటియందును ఒక్కొక్క అర్ధమునందు ఏడు పూర్ణ గణములును ఒక అర్ధ గణమును ఉండును. పూర్వార్ధమున ఆరవగణము మాత్రము ద్వివికల్పము, అనగా జగణ-నలములలో ఏదియో ఒకటి ఉండదగును. ఉత్తరార్ధమున మాత్రము ఒకేతీరున ఒక్క లఘువుగానే ఉండును. బేసిగణములందు జగణము ఉండరాదు కాన వానియందు భ, స, నల, గగములు అను నాలుగు గణములు మాత్రమే ఉండును. సరిగణములందు ఐదు గణములును ఉండును.

66. పథ్యార్య—వెనుక చెప్పబడిన లక్షణములతో కూడిన ఆర్యావృత్తము యొక్క ప్రథమ తృతీయ పాదములందు పండ్రెండేసి మాత్రలుండినచో 'పథ్యార్య' అనబడును. (బేసి పాదములందు మూడేసి గణములుండవలెను)—

> రక్తమృదుపద్మనేత్రా, సితదీర్ఘ బహులమృదు (కుటిల) కేశీ।
> కస్య తు పృథుమృదుజఘనా, తనుబాహ్వంసోదరీ (న) పథ్యా[31] ॥ 213

---

29. ఈ శ్లోకమును బట్టి ఇట్టి అర్థమువచ్చుచున్నను వృత్త రత్నాకరాదులను బట్టి-ఆరవగణము నలమయినచో ద్వితీయ లఘువును, ఏడవ గణము నలమయినచో మొదటి లఘువును యతిస్థానములు.

30. 215వ శ్లోకములో చపలా లక్షణము మరల చెప్పబడును. అది దీనికి కొంత భిన్నముగా ఉన్నది, ఆ లక్షణమే వృత్త రత్నాకరాదులందు చెప్పబడినది.

31. రెండు, నాలుగు పాదములు ముద్రణమునందు సరిగా లేవు. శ్లోకమునందు కుండలీకరణములలో ఉన్న అక్షరములు డా. ఘోష్ పూరించినవి.



—రక్తమృదుపద్మనేత్రయు, అసితదీర్ఘబహులమృదు కేశియు, పృథుమృదు జఘనయు, తనుబాహ్వంసోదరియు అగు ఈ యువతి ఎవనికి పథ్య(సాధువు) కాదు?

67. విపులార్య—బేసి పాదములు మూడు గణములకంటె హెచ్చు గణములుకలిగి ఉండవలెను—

> విపుల జఘనవదన స్తన నయనై, స్తామ్రాధరోష్ఠకరచరణైః।
> ఆయతనాసాగండై ర్లలాట, కర్ణైః శుభా కన్యా ॥ 214

—విపులములగు జఘన-వదన-స్తన-నయనములచే తామ్రములగు అధరోష్ఠ కర-చరణములచే, ఆయతములగు నాసా - గండ - లలాట - కర్ణములచే ఈ కన్య శుభమైనది.

68. చపలార్య—పూర్వోత్తరార్ధములు రెండింటియందును ద్వితీయ చతుర్థ గణములు జగణములైనచో అది చపలార్య అనబడును. దీనినే సర్వతశ్చపల అని కూడ అందురు—

> ఉద్వృత్తగామినీ పరుషభాషిణీ కామచిహ్నకృతవేషా।
> యా నాతిమాంసయుక్తా సురాప్రియా సర్వతశ్చపలా[32] ॥ 216

—భర్తనతిక్రమించి తిరుగునదియును, పరుష భాషిణియును, కామచిహ్నములతో కూడిన వేషముకలదియును, మాంస-సురాప్రియయును అగు ఈ యువతి పూర్తిగా చపల.

పూర్వార్ధమున మాత్రమే చపలాలక్షణము కలదేని ముఖచపల అనియు, ఉత్తరార్ధమునమాత్రమే చపలాలక్షణము కలదేని జఘనచపల అనియు అనబడును. రెండర్ధములందును చపలాలక్షణము కలదేని అది సర్వతశ్చపల అగును.

69. ముఖచపలార్య — చపలా లక్షణము పూర్వార్ధమందు మాత్రమే ఉండుట—

> ఆర్యా ముఖే తు చపలా తథాపి చార్యా న మే యతః సా తు।
> దక్షా గృహకృత్యేషు తథా దుఃఖే భవతి దుఃఖార్తా ॥ 218

—ఆమె ముఖమందు చపలయే (నోటి దురుసుతనము కలది), కాని ప్రవర్తనచే మాత్రము చపలకాదు. ఏలనన ఆమె గృహకృత్యములందు దక్షయు, భర్త దుఃఖమునందు దుఃఖార్తయును అగుచున్నది.

70. జఘనచపల—చపలా లక్షణము ఉత్తరార్ధమందు మాత్రమే ఉండుట—

> వనమృగనయనే చపలాసి వరోరు శశాంకదర్పణనిభాస్యే।
> కామస్య సారభూతే న పూర్వమదచారుజఘనేన ॥ 219

---

32. ముద్రణమునందున్న దోషములను డా. ఘోష్ సవరించెను. దానిని అనుసరించితిని.

—ఓ వరోరూ! శశాంకదర్పణ నిభాస్య! వరమృగనయన! కామునకు సారభూతమగు యౌవనమదచారుజఘనముచే చపలవైతివి.

ప్రథమ - తృతీయ పాదములు పండ్రెండేసి మాత్రలు కలవియును, ద్వితీయ పాదము పదునెన్మిది మాత్రలు కలదియును, చతుర్థపాదము పదునైదు మాత్రలు కలదియును 'ఆర్య' అగునని తెలియవలెను.

చతుష్కము లనగా చతుర్మాత్రక గణములు. అవి సరిస్థానములందు అయిదు విధములు (భ, జ, స, నల, గగ); బేసిస్థానములందు నాల్గు విధములు (భ, స, నల, గగ). బేసిస్థానమందు జగణము ఉండదు. ఇట్టి గణముల స్థానభేదమునుబట్టి ప్రస్తార సంబంధముచే ఈ ఆర్యా వృత్తములు పలువిధములుగా ఉండును. ప్రస్తారమున చివరి వృత్తము సర్వ లఘువుగా ఉండును. అందు ఏబదిఐదు అక్షరము లుండును. మొదటి వృత్తమున ముప్పది అక్షరము లుండును. ఇట్లక్షర సముదాయమును ఆర్యావృత్తప్రయోక్త లెరుంగవలెను. సర్వలఘువృత్తమున పూర్వార్ధమందు ఇరువది తొమ్మిది అక్షరములును, ద్వితీయార్ధమున ఇరువది ఆరు అక్షరములును ఉండును. పూర్వార్ధమున చివరి గురుస్థానమున ఒక్క లఘువుమాత్రమే ఉండుటచే ఒకమాత్ర తగ్గి ఇరువది తొమ్మిదిమాత్రలును, ఇరువదితొమ్మిది లఘ్వక్షరములును అగుచున్నవి. ఉత్తరార్ధమున ఆరవగణమున ఒక్క లఘువే ఉండును కాన మూడు మాత్రలును, చివరి గురువుస్థానమున లఘువుండుటచే ఒక మాత్రయును తగ్గి ఇరువది ఆరు మాత్రలయినవి. ఆ ఇరువదిఆరు మాత్రలును ఇరువది ఆరు అక్షరములుగా ఉండును.[33]

మొదటి వృత్తమగు సర్వగురువృత్తమున ముప్పది అక్షరములలో మూడు అక్షరములు మాత్రము లఘువులును, తక్కినవన్నియును గురువులును అగును. అనగా ఆరవస్థానమున జగణము ఉండవలయును కాన అచ్చట రెండు లఘువులుండక తప్పదు. ఇది పూర్వార్ధ విషయము. ఉత్తరార్ధమున ఆరవస్థానమున ఒక లఘువు ఉండవలయును. కాన పద్యమున మూడు లఘువులుండునని తెలియవలెను. ఆర్యా వృత్తములన్నింటి లక్షణములను పై విధముగా గ్రహించవలెను. ఛందములన్నియును జాతులు, వృత్తములు అను భేదములచే రెండు విధములు. ఆ రెండింటియందును వికల్పవిధానమునగల రెండు విధములగు భేదములలో పూర్వ సంఖ్యను ఉత్తర సంఖ్యచే గుణింపగా వచ్చిన మొత్తపు సంఖ్యగా నిర్దేశించవలెను.[34]

---

33. దీనికి ఉదాహరణము అభినవభారతి యందు కలదు [2 వ సం - పుట 291]—
శిశిరతరకిరణపరికర, సకలకలవిరచితకవిశకచనిచయ।
సమహృదయతనువినిహితధరణి, ధరవరసుత జయజయ శివ॥

34. అనగా ఆర్యావృత్తములలో సరిస్థానములలో గణములు అయిదు విధములుగా బేసి స్థానములలో నాలుగు విధములుగా ఉండునుకదా, కావున వీనితో కూడిన మొత్తపు సంఖ్య (4×5=) 20 అగును. ఇట్లే వికల్ప సంఖ్యలను మొత్తము చేయగా మొత్తము సంఖ్య లబ్ధమగును. ఇట్లు వాని అవాంతర విభాగము వలన ఆర్యలమొత్తము ఎనిమిదికోట్ల పందొమ్మిది లక్షల ఇరువది వేలు (=8,19,20,000) అని చెప్పబడుచున్నది [అభినవభారతి-2 వ సం - పుట 292].



ఆర్యాగీతి లక్షణము

ఒక్కొక్క అర్ధమున ఎనిమిదేసి గణము లుండినచో అది 'ఆర్యాగీతి' అనబడును. ఆర్యయందువలె ఇందు ఉత్తరార్ధమున ఆరవస్థానము ఒక్క లఘువుగల గణముగా ఉండరాదు; ఆర్యాపూర్వార్ధమునందువలె నలము కాని, జగణము కాని ఉండవలెను.

ఇట్లు అనేకఛందములందు పుట్టిన వివిధ వృత్తములతో, తరువాత చెప్పబడనున్న ముప్పదిఆరు లక్షణములతో కూడి ఉండునట్లుగా కావ్యములను రచించవలెను.*

పంచదశాధ్యాయము సమాప్తము.

## విశేషాంశములు

### 1. ఛందస్సు

వృత్తముల మొత్తము సంఖ్య కోట్లమీద ఉన్నను నాట్యశాస్త్రమందు (15 వ అధ్యా.) మొత్తము 70 వృత్తభేదములకు మాత్రమే లక్షణ-ఉదాహరణములు కలవు. అందులో 53 సమవృత్తములు, 12 పథ్యాదిభేదములు, 5 ఆర్యా భేదములు. ఇందులో ప్రతి ఉదాహరణమునందును చివరిపాదములో ఆ వృత్తము పేరుకూడ ఇముడ్చబడినది (దీనినే అర్వాచీనాలంకారికులు 'ముద్రాలంకార' మందురు). ఈ ఉదాహరణము లేవియును ప్రాచీనములు కావు; ఇందుకొరకు ఇవి ప్రత్యేకముగా నాట్యశాస్త్రకర్తచే రచింపబడినవని విశ్వసింపవచ్చును. ఈ శ్లోకములు చక్కని కవిత్వధోరణిని కలిగి ఉన్నవి. కొన్ని సప్తశతియందలి గాథలను తలపించునట్లుగా ఉన్నవి. సంస్కృతమునందలి పెక్కు వృత్తముల పేర్లు 'ప్రియా సంబోధనములు' (epithets of Beloveds) అగుట గమనార్హము.

కొన్ని వృత్తములకు లక్షణము రెండు విధములుగా చెప్పబడెను— ఒకటి, గురు-లఘువులను అక్షర సంఖ్యా క్రమములో పేర్కొనుట; రెండు, త్రికములలో వివరించుట. ఈ రెండవ పద్ధతి బరోడా ముద్రణమునందు కుండలీకరణములందున్నది. పింగళాదులు రెండవ పద్ధతిని అవలంబించిరి. నేను అన్ని వృత్తములను రెండు పద్ధతులలోను వివరించి ఉన్నాను.

---

* [కాశీముద్రణమునందు 16 వ అధ్యా—150-169 శ్లో; బొంబాయిముద్రణమునందు 15వ అధ్యా—150-172 శ్లో; బరోడాముద్రణమునందు 15వ అధ్యా—196-227 శ్లో.]

పింగళాదుల ఛందశ్శాస్త్రములందు, నాట్యశాస్త్రమందు చెప్పబడిన వృత్తములకంటె అధిక వృత్తములు చెప్పబడినవి. కవులుకూడ తమ కావ్యములందు క్రొత్త వృత్తములను వాడియున్నారు. నాట్యశాస్త్రమందు చెప్పబడని 5 క్రొత్త వృత్తములు రామాయణమందు కలవట; అట్లే భారతమందు 4 క్రొత్త వృత్తములు కలవట. అశ్వఘోషుడు ఏడింటిని, భాసుడు రెండింటిని, కాళిదాసు ఐదింటిని, భారవి పదింటిని, భట్టి ఎనిమిదింటిని, మాఘుడు ఇరువది రెండింటిని క్రొత్త వృత్తములను వాడియున్నారట [వివరములకు డా. ఘోష్ వ్యాసమును పరిశీలించవలెను— ["The date of Bharata Natya Sastra" —Journal of the Department of letters-Calcutta University, 1933.] ఈ క్రొత్త వృత్తములన్నియును ఆర్వాచీన కాలములో ప్రచారములోనికి వచ్చినవనుట స్పష్టము.

భరతుడు వివరించిన కొన్ని వృత్తముల పేర్లు ఇతర ఛందశ్శాస్త్రములందలి పేర్లకంటె భిన్నములుగా ఉన్నవి—

| నాట్యశాస్త్రమునందు | | ఇతర ఛందశ్శాస్త్రములందు |
|---|---|---|
| హరిణప్లుత | — | ద్రుతవిలంబిత |
| అప్రమేయ | — | భుజంగప్రయాత |
| పద్మిని | — | స్రగ్విని |
| నాందీముఖి | — | మాలిని |
| వృషభచేష్టితము | — | హరిణి |
| శ్రీధర | — | మందాక్రాంత |
| విలంబితగతి | — | పృథ్వి |
| చిత్రలేఖ | — | కుసుమితలతావేల్లిత |
| మకరకశీర్ష | — | శశివదన |
| చంద్రలేఖ | — | వైశ్వదేవి |
| ప్రభావతి | — | రుచిర |

పింగళుని 'ఛందసూత్రము' ముందా ? నాట్యశాస్త్రము ముందా ? అను విషయమున భిన్నాభిప్రాయములు కన్పట్టుచున్నవి. పింగళుడు అర్వాచీనుడని డా. ఘోష్ తలంపగా, ప్రాచీనుడని డా. సూర్యకాంత తలంచెను [Kshemendra Studies - p. 80]. పింగళుడొక ప్రాచీన మహర్షి అనియు, ఆతడు పతంజలియే అని కొందరు తలంతురనియు ఆయన పేర్కొనెను.

శ్లోకము : తెలుగులో ఛందోబద్ధములైనవానినెల్ల 'పద్యము'లనునట్లే సంస్కృతమున ఛందోబద్ధములైన వానినెల్ల 'శ్లోకము'లనుచుండుట సుప్రసిద్ధము. కాని 'శ్లోక'మనునది ఒక వృత్తముయొక్క పేరు. ఇది 'అనుష్టుప్' జాతికి చెందినది. ఇందు పాదమునకు ఎనిమిదేసి అక్షరములుండును. "ప్రతిపాదమునందును 5 వ అక్షరము లఘువు. అట్లే ప్రతిపాదమునందును 6 వ అక్షరము గురువు. 2, 4 పాదములందలి 7 వ అక్షరములు లఘువులు. ఇట్టిది శ్లోక మనబడును. అనుష్టుప్ భేదము లనంతములు. ఇందు శ్రావ్యతయే



(Appeal to the ear) ప్రధానముగా ఎంచి ఆ వృత్తములను ఎంచుకొనవలయును." అని క్షేమేంద్రుడు 'శ్లోక' మును నిర్వచించియుండెను [సువృత్తతిలకము—14-15 శ్లో.]

'శ్లోక' మనగా 'స్తుతి' అను అర్థముకూడ కలదు. ఆదిలో ఇది స్తుతిపరములైనవానికే ఉపయుక్త మగుచుండెడిది. రామాయణ-భారతములు, పెక్కు పురాణములు, అనేక శాస్త్రములు 'శ్లోకము' లందే రచింపబడుట గమనార్హము.

## 2. సువృత్తతిలకము : వృత్తౌచిత్యము

క్షేమేంద్రుడు తన "సువృత్తతిలకము" నందు వృత్తౌచిత్యమును గూర్చి చర్చించి, ఆయా వృత్తములు క్రింది విధముగా ఆయా సందర్భములందు ప్రయుక్తములు కావలెనని నిర్దేశించియుండెను [సువృత్తతిలకము-తృతీయవిన్యాసము] వాని అభిప్రాయ సారమును క్రింద వివరించుచున్నాను—

"నిర్దోషములును, గుణసంయుక్తములునుఅయిన వృత్తములు యథాస్థాననివేశితములైనప్పుడు ముత్యములతో అలంకరింపబడినట్లుగా ప్రబంధము మిక్కిలిగా శోభించును... శాస్త్రములను, నీతి కావ్యములను, పురాణములను ప్రసన్నార్థమైన అనుష్టుప్‌ఛందమునందు వ్రాయవలెను...ఛందశ్శాస్త్రవిదులు వృత్తములను రసానుసారముగా, వర్ణనానుగుణముగా ఉపయోగించుచుందురు. 'శాస్త్రకావ్యము' నందు (Poetry in Science) దీర్ఘవృత్తములను వాడరాదు. ఇంక 'కావ్యశాస్త్రము' లందు ( Science in Poetry - భట్టి కావ్యాదులు ) వృత్తములు రసానుగుణములుగా ఉండును. ఒక్కొక్కప్పుడు శక్తిమంతుడైన కవిచే ప్రయుక్తములైనప్పుడు అయోగ్యములైన వృత్తములు కూడ యోగ్యములుగానే కన్పట్టును...మేఖలను గళమునందలంకరించుకొన్నట్లుగా వృత్తరత్నావళిని అస్థానమందు వినివేశితమును చేసినచో అది అజ్ఞతను వెల్లడించును. నవోన్మేషికుచములతో, చారుచక్షువులతో ఒప్పుచున్న యువతికి చిరత్యక్తస్మరచారుడును, జరాజీర్ణకేశియును అయిన పురుషుడు ఎట్లు రుచించును ? కావున దిఙ్మాత్రముగా కొన్ని వృత్తముల యథాస్థాన వినియోగమును వివరింతును—

అనుష్టుప్ —దీని వినియోగము పైన చెప్పబడినది.

ఉపజాతి— శృంగారమునకు ఆలంబనమైన ఉదారనాయికారూప వర్ణనమునందును, వసంతాది వర్ణనములందును 'ఉపజాతి' సరసముగా ఉండును.

రథోద్ధత— చంద్రోదయాది విభావాదులందు

వంశస్థను— షాడ్గుణ్యప్రయోగాదులందు

వసంతతిలక— వీర-రౌద్ర రసములు సమ్మిశ్రితములైనప్పుడు

మాలిని— ద్రుతతాలము కలిగిన 'మాలిని' సర్గాంతమందు

శిఖరిణి— ఉపపన్న పరిచ్ఛేద కాలమందు

హరిణి— ఔదార్యరుచిరమైన ఔచిత్యవిచారమందు

పృథ్వి— సాక్షేప-క్రోధ-ధిక్కారములందు

మందాక్రాంత— ప్రావృట్ప్రవాసవ్యసనమందు (మేఘదూతమందువలె)

శార్దూలవిక్రీడితము— నృపుల శౌర్యస్తవమునందు

స్రగ్ధర— సావేగపవనాదులను (ఝంఝామారుతాదులను) వర్ణించుటయందు

దోధక-తోటక-నర్కుటములను ముక్తకములుగా వాడవలెను. అవి నిర్విషయము లగుటచే రసాదులందు వానిని నియమము లేకుండగనే వాడవచ్చును.

....వశ్యవాక్కును, సర్వవృత్త ప్రసంగియును సద్వృత్తవినివేశవిశేషజ్ఞుడును అయిన వానికొరకే పై విభాగము చెప్పబడినది. దరిద్రునకు ఉత్సవమువలెనే ఒకటి రెండు మూడు వృత్తములను మాత్రమే నేర్చినవానికి పై వృత్తములు వినియోగార్హములు కాజాలవు. ఏ వృత్తమునం దెవనికి అభ్యాసమును, ప్రగల్భతయును ఉన్నదో అతడు దానిచేతనే తన సర్వ ప్రబంధమును విశిష్టముగా నిర్మించవచ్చును. ఏక వృత్తమునం దాదరము ప్రాయికముగా పూర్వులందును కన్పట్టుచున్నది... వృత్తశ్రేష్ఠమైన 'వంశస్థ'మందు ఒకానొక విచిత్రత కలదు; భారవిప్రతిభ దీనిచేతనే ఆధిక్యమును పొందెను......భవభూతి 'శిఖరిణి' నిరర్గళతరంగిణియై మేఘోదయకాలమందలి మయూరివలె నృత్య మొనర్చును. సువశమైన కాళిదాసు 'మందాక్రాంత' మంచిరౌతుచేతిలోని కాంభోజతురంగమువలె ప్రవల్గతి కలదయ్యెను. రాజశేఖరుడు శార్దూల విక్రీడితముచేతనే ప్రఖ్యాతుడయ్యెను..."

పూర్వాంధ్రకవుల వృత్తౌచిత్యమును గూర్చి శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు క్రింది విధముగా వ్రాసియున్నారు— "....దోధక వృత్తము హాస్యరస వ్యంజకము. కరుణమునకుఁ దగిన వృత్తములు వియోగినీ-మందాక్రాంతా-పుష్పితాగ్రాదులు. శృంగారమునకుఁ బృథ్వీ-శిఖరిణ్యాదులు, రౌద్ర-వీరములకు శార్దూలము మొ॥

ఆంధ్రమునఁ బూర్వకవు లెవ్వరును నీ వృత్తములకును రసములకును సంబంధము గలుపలేదు. సామాన్యముగా వీర-రౌద్రములకు మత్తేభ శార్దూలములు వాడిరి. కాని, శృంగారాదులకుఁ గూడ నావృత్తములను వాడిరి. మొత్తముమీఁద నాంధ్రమున రస నియమము లేకుండనే వృత్తములను వాడిరి. కాని... కరుణాదులలో హాస్యాది విరుద్ధరస వ్యంజకములగు వృత్తములను వాడి రసదోషమును జేయలేదు. ఏలనఁ గవులెల్లరును గ్రావిత్కముగా భుజంగ ప్రయాతము, పృథ్వీవృత్తము మొదలగువానిని వాడినను నత్యధికముగా ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము, కందము, గీతము, ఆటవెలఁది, సీసము అను నీ యెనిమిది వృత్తములనే వాడిరి. వీనిలో రసభంగ మొనర్చు వృత్తములు లేవు." [కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్య - పుటలు 482-483]

ఛందస్సుయొక్క ఉపయోగమును గూర్చి "Rhetoric Notes" అనెడి చిన్ని గ్రంథములో క్రింది విధముగా చెప్పబడినది —

"Metre is instinctively used by all poets, and distinguishes poetry from prose. Its uses may be specified as follows:

1. It is the survival of music and dancing in poetry, and gives the pleasure and thrill of both by its rhythmical flow.

2. It is the spontaneous out-pouring of emotion, which it sooths by its regularity.



3. It is easy to remember and thus aids in the preservation of great literature; this was very important in ancient times, when sacred writings were handed down orally.

4. By its fixity and short compass, it compels style to become terse and choice in expression; and thus contains the finest speech of man."

### 3. పాశ్చాత్యులు : వృత్తౌచిత్యము

ప్రాశ్చాత్యులు కూడ వృత్తౌచిత్యాదులను చక్కగా గమనించియున్నారు. పై "Rhetoric Notes" లోనే ఈ విషయము క్రిందివిధముగా వివరింపబడినది:

"Aesthetic use of metre: careful artists, like Milton or Tennyson, always use metre with perfect taste and propriety and load it with all possible beauty. The following points may be noted—

1. The metre should fit the subject or mood - thus, the five-foot Iambus is suited for long narrative and drama; and also for didactic and reflective poetry [క్షేమేంద్రుడు 'అనుష్టుప్' కు చెప్పిన ఉపయోగములివియే]. The Ballad measure suits short narrative. The lyric stanzas express emotion. The longer stanzas deal with romantic narrative, or meditation and reflection, as in the Elegy.

Rapid or passionate action is exprpssed by anapaest; a light tripping movement by trochee and dactyl; while all sorts of work is done by Iambus, which is the jack-of-all trades in prosody.

2. In odes, the lines are varied in length according to the emotion or thought to be conveyed. And in all verse, the normal rhythm is disturbed for the same reason.

3. Dexterity in manipulating sounds to echo or suggest the sense adds to the beauty of verse; it is called Tone-colour."

### 4. తెలుగు నాటకములు : పద్యములు

నాటకాదులందు పద్యములుండుట భరతాదుల కిష్టమని స్పష్టముగుచున్నదికదా. సంస్కృత కవులందరును తమతమ నాటకాదులందు పద్యములను వ్రాసియున్నారు. భావ ముత్తేజనము పొందినప్పుడును, వర్ణనములందును వారు ప్రధానముగా పద్యములను వ్రాసినారు. ఇట్టి వాడుకను సహృదయులందరును ఆమోదించియున్నారు. కాని ఆ పద్యములను ప్రదర్శన సమయమున ఎట్లు చదివెడివారో మనకు తెలియదు. కాని, నాట్యశాస్త్రమున 17 వ అధ్యాయమందు కొన్ని సూచనలు మాత్రము కలవు.

సంస్కృత నాటకములను అనుసరించి తెలుగులో కూడ గద్య-పద్యాత్మకములైన స్వతంత్ర నాటకములు విరివిగా బయలుదేరినవి. ఇంక సంస్కృత నాటకములు యథాతథముగా గద్య-పద్యాత్మకములుగానే ఆంధ్రీకరింపబడినవి. వీటిని సంగీతముతో మేళవించి

తెలుగునటులు పాడుచున్నారు; చదువుటలేదు. పద్యములను రంగస్థలమందు చదువ వలెనా? లేక పాడవలెనా? అను విషయమునుగూర్చి తెలుగుదేశమున వాదోప వాదములు బయలుదేరినవి. నేటికిని ఇదొక సమస్యయే. సంస్కృతమున 'పాఠ్యము' అను పదముపయుక్తమగుట ఇచ్చట గమనార్హము. అనగా పద్యములను పఠించవలయునేకాని గానము చేయరాదని అర్థము. కొందరు అర్థవంతముగా చదువుచు కొంచెము రాగమును చేర్చుట కంగీకరింతురు. మరికొందరు రంగస్థలముమీద 'సంగీత కచేరీ' యే చేయుచున్నారు. వృత్తములు నాటకమందు ఉండరాదని శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి అభిప్రాయము. నడకయందు వచనమునకంటె విశేషభేదములేని సీస-గీత-ఆటవెలదులను మాత్రమే నాటకరచయిత వ్రాయవలెననియు, ఆంగ్ల నాటకములందలి Blank verse మొదలగునవి ఇట్టివే అనియు వారు 'సాక్షి' వ్యాసములలో వ్రాసియున్నారు.

"పద్యమును పాడరాదు" అనెడి వాదమును ఒక ఉద్యమముగా సాగించినవారు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు. వారిటీవల ప్రకటించిన "ఆంధ్రనాటకపద్య పఠనం" వారి ఈ వాదమునకు శాస్త్ర గ్రంథము.

పద్యపఠనమందు అర్థవ్యక్తికి లోపము వచ్చుట క్షంతవ్యముకాని అపరాధమనుట నిర్వివాదము. పద్యములను పాడెడుపద్ధతి ఒక్క తెలుగునాటకరంగమందే కన్పట్టుననియు, తక్కిన భారతీయ నాటకరంగములందు లేదనియు చెప్పుదురు.

# అధ్యాయము 16[1]

## లక్షణ-అలంకార-గుణ-దోషములు[2]

[కాశీముద్రణమునందు 17 వ అధ్యా-123 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 16 వ అధ్యా—124 శ్లోకములును, బరోడాముద్రణము నందు 16 వ అధ్యా—128 శ్లోకములును కలవు.]

### లక్షణములు

కావ్యము[3]లందు ముప్పది ఆరు 'లక్షణములు'[4] ఉండును. ఇవి భావములను (విభావానుభావ వ్యభిచారులను), అర్థములను ఆశ్రయించి ఉండును; కావ్యమునకు ఇవి భూషణ సదృశములు. వీనిని రసానుగుణముగా ప్రయోగించవలెను. ఈ ముప్పది ఆరు లక్షణములను ఇప్పుడు వివరింతును[5]—

---

1. ఈ భాగము కాశీముద్రణమునందు సప్తదశాధ్యాయము. బొంబాయి-బరోడా ముద్రణములందు షోడశాధ్యాయము.

2. 'వాగభినయ' మని కాశీముద్రణ పాఠము, 'అలంకారలక్షణ' మని బొంబాయి ముద్రణ పాఠము, 'వాగభినయమందు కావ్యలక్షణ' మని బరోడా ముద్రణ పాఠము, 'లక్షణాలంకార దోషగుణాధ్యాయ' మని అభినవభారతీపాఠము.

3. అచ్చటచ్చట 'నాటకాశ్రయ'మని ఉన్నను 'కావ్య' మను పదమే ఈ అధ్యాయమందు బహుళముగా కన్పట్టుచున్నది. కొందరు కావ్య మనగా శ్రవ్యకావ్యమే అని చెప్పుదురు. కాని, కావ్య మనగా 'రూపకరచనామాత్ర' మని మరికొందరు అర్థము చెప్పుదురు. ఈ లక్షణములన్నియును కవి శిక్షార్థము చెప్పబడినవని తెలియవలెను.

4. 'మహాపురుషలక్షణము', 'చక్రవర్తిలక్షణోపేతుడు' అనునప్పుడు 'లక్షణ' పదమున కేమిఅర్థమో కావ్యలక్షణ మనునప్పుడును అదియే అర్థము. ఈ లక్షణములు కావ్యమునకు సహజధర్మములు. ఇంక అలంకారాదులు వీనికంటె భిన్నములు; ఇవి కల్పితములు. శౌర్య-పరాక్రమాదులు పురుషునకును, సౌందర్య లావణ్యాదులు స్త్రీకిని ఎట్లు సహజధర్మములో కావ్యమునకును లక్షణములు అట్లే సహజధర్మములు. సహజసౌందర్యవతి రత్నాభరణాద్యలంకారములచే మరింత శోభించునట్లే లక్షణోపేతమైన కావ్యము అలంకారాదులచే మరింతగా శోభించును. ఒకవేళ కావ్యము అలంకార విరహితమైనను లక్షణోపేతమైనచో మాత్రము తప్పక శోభించును. కాని లక్షణ విరహితమైన కావ్యము గుణాలంకారోజ్జ్వలమైనను నీరసమే అగునని తెలియవలెను. అయినను లక్షణ-అలంకారములు రెండును కావ్యమునకు శోభాదాయకములే అని మరవరాదు. కాలక్రమమున లక్షణము లన్నియును అలంకారములుగా మార్పుచెందినవి. వివరములకు 2 వ విశేషాంశమును చూడవలెను.

5. లక్షణములను వివరించినభాగమునకు పాఠాంతరముకూడకలదు. మొదటిపాఠము 'ఉపజాతి' వృత్తములందున్నది. దీనిని అభినవగుప్తుడు అనుసరించెను; కీర్తిధర-ధనంజయ-

లక్షణములు

| | | |
|---|---|---|
| 1. భూషణము | 13. మిథ్యాధ్యవసాయము | 25. ఆశీస్సు |
| 2. అక్షరసంహతి | 14. సిద్ధి | 26. ప్రియము |
| 3. శోభ | 15. పదోచ్చయము | 27. కపటము |
| 4. అభిమానము | 16. ఆక్రందము | 28. క్షమ |
| 5. గుణకీర్తనము | 17. మనోరథము | 29. ప్రాప్తి |
| 6. ప్రోత్సాహనము | 18. ఆఖ్యానము | 30. పశ్చాత్తాపము |
| 7. ఉదాహరణము | 19. యాచ్ఞ | 31. అనువృత్తి |
| 8. నిరుక్తము | 20. ప్రతిషేధము | 32. ఉపపత్తి |
| 9. గుణానువాదము | 21. పృచ్ఛ | 33. యుక్తి |
| 10. అతిశయము | 22. దృష్టాంతము | 34. కార్యము |
| 11. హేతువు | 23. భాసనము | 35. అనునీతి |
| 12. సారూప్యము | 24. సంశయము | 36. పరిదేవనము[6] |

1. భూషణము— దేశ-స్థాన-కాలాద్యౌచిత్యము నెరింగి కటకాద్యాభరణములను శరీరమునందలంకరించునట్లుగా రసౌచిత్యము నెరింగి గుణ-అలంకారములచే కావ్యము నలంకరించుట 'భూషణ' మనబడును[7]. [ఈ నిర్వచనమును అనుష్టుప్‌వృత్తపాఠమందలి 'భూషణ' (1) నిర్వచనమును సమానములే.]

2. అక్షరసంహతి (అక్షరసంఘాతము) — పరస్పర సమ్మిళితములగు అల్పాక్షరములచే విచిత్రార్థ వర్ణన మొనర్చుట 'అక్షరసంహతి' అనబడును[8] [పేరును, నిర్వచనమును రెండు పాఠములందును సమానమే.]

---

సర్వేశ్వరాదులును ఈ మొదటి పాఠమునే అనుసరించిరి. రెండవపాఠము 'అనుష్టుప్' వృత్తములందున్నది. దీనిని అభినవగుప్తునకు పూర్వమందున్న వ్యాఖ్యాత లనుసరించిరట. ఈ రెండు పాఠములందును చాల భేదములు కలవు. వీనిలో 17 లక్షణముల పేర్లు సమానములుగా ఉన్నవి; అందులో ఎనిమిది లక్షణముల నిర్వచనములు మాత్రమే సంవదించుచున్నవి. తక్కిన పేర్లును, నిర్వచనములును కూడ భిన్నములే. రెండు పాఠములకును ఇంత భేదమున్నను వానిని సమన్వయించుటకే అభినవగుప్తుడు ప్రయత్నించియుండెను. అనుష్టుప్ వృత్తముల పాఠమును విశ్వనాథుడును [సాహిత్యదర్పణము —శ్రీ వేదంవారి అనువాదము-434-470 సూ.], సింగభూపాలుడును [రసార్ణవసుధాకరము —శ్రీ బులుసువారి అనువాదము పుటలు 833-895] అనుసరించి యున్నారు. సింగభూపాలుడు నాట్యశాస్త్ర నిర్వచనములనే కొన్నింటిని యథాతథముగా స్వీకరించెను. కాశీ-బొంబాయి ముద్రణములందు అనుష్టుప్ వృత్తపాఠము ప్రధానముగా గ్రహింపబడి, ఉపజాతి వృత్తపాఠము పాఠాంతరముగా అధస్సూచికలందొసంగబడెను. డా. ఘోష్ తన ఆంగ్లానువాదమం దీపద్ధతినే అనుసరించెను. బరోడా ముద్రణమునందు అనుష్టుప్ వృత్తపాఠము 15వ అధ్యాయమునకు అనుబంధముగా (1-42 శ్లో.) ఒసంగబడినది. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఈ అనుష్టుప్ వృత్తపాఠమునకు స్వీయవ్యాఖ్యానమును కూర్చియున్నారు.

6. ఇవి ఉపజాతివృత్త పాఠమందలి పేర్లు. అనుష్టుప్ వృత్తపాఠమందలి లక్షణముల పేర్లను క్రింద పేర్కొనుచున్నాను. వానితో సంవదించెడు ఉపజాతివృత్తపాఠమందలి లక్షణముల సంఖ్యలను, నిర్వచనములను కుండలీకరణములం దొసంగినాను—



| | | |
|---|---|---|
| 1. భూషణము (1) | 13. విశేషణము (28) | 25. దాక్షిణ్యము (19) |
| 2. అక్షరసంఘాతము (2) | 14. గుణాతిపాతము (9) | 26. గర్హణము (27) |
| 3. శోభ (3) | 15. అతిశయము (10) | 27. అర్థాపత్తి (34) |
| 4. ఉదాహరణము (7) | 16. తుల్యతర్కము (16) | 28. ప్రసిద్ధి (18) |
| 5. హేతువు (11) | 17. పదోచ్చయము (15) | 29. పృచ్ఛ (21) |
| 6. సంశయము (24) | 18. దృష్టము (12) | 30. సారూప్యము (4) |
| 7. దృష్టాంతము (22) | 19. ఉపదిష్టము (32) | 31. మనోరథము (17) |
| 8. ప్రాప్తి (29) | 20. విచారము (30) | 32. లేశము (20) |
| 9. అభిప్రాయము (33) | 21. విపర్యయము (13) | 33. క్షోభము (36) |
| 10. నిదర్శనము (25) | 22. భ్రంశము (26) | 34. గుణకీర్తనము (5) |
| 11. నిరుక్తము (8) | 23. అనునయము (31) | 35. అనుక్తసిద్ధి (36) |
| 12. సిద్ధి (14) (35) | 24. మాల (23) | 36. ప్రియోక్తి (6) |

నేను అభినవగుప్తుని అనుసరించి ఉపజాతివృత్తపాఠమునే ప్రధానముగా స్వీకరించినాను; అనుష్టుప్‌వృత్తపాఠమునందలి నిర్వచనములను ఆ యా సందర్భములందే పేర్కొనియున్నాను.

7. మూలమందు అలంకారాదులు సోదాహరణముగా నిర్వచింపబడినవి; కాని లక్షణములకు ఉదాహరణములు లేవు. అయినను, అభినవగుప్తుడు ఉపజాతివృత్తపాఠవ్యాఖ్యానమందును, శ్రీ కవిగారు అనుష్టుప్‌వృత్తపాఠవ్యాఖ్యానమందును విపులముగా ఉదాహరణముల నొసంగి యున్నారు. రత్నావళి ప్రథమాంకమునందలి యౌగంధరాయణ వాక్యములను శ్రీ కవిగారు భూషణమునకు ఒక ఉదాహరణముగా ఒసంగిరి. [పుట- 349.]—

"శమిత విగ్రహుడై రతి సహితుడగుచు, జనమనోవర్తి వత్సభూజాని వచ్చె
నిజమహోత్సవ దర్శనోన్మేషియగుచు, ప్రియవసంతుకుఁ డపరపుష్పేషుడనగ."

—(శ్రీయుతలు గ. శ్రీ. న. ఆచార్య, మానాప్రగడ శేషశాయిగార్ల అనువాదమునుండి)

8. ఉదాహరణము : అభిజ్ఞానశాకుంతల సప్తమాంకమున తాపసి "సర్వదమనా! ఈ శకుంత (పక్షి) లావణ్యమును చూడుము" అనుటలో శకుంతలానామము సూచితమగుట.

3. శోభ— ప్రసిద్ధములగు అర్థములతో పాటు, సమముగా, అప్రసిద్ధములు లేదా అనుచితములు అయిన అర్థములు కూడ ఉచితముగ, విచిత్రముగ, హృద్యముగ నిబంధింపబడుట 'శోభ' అనబడును. [పేరును, నిర్వచనమును రెండు పాఠములందును సమానము.]

4. అభిమానము— ఒక అర్థమునకు వేరొక అర్థముతో గల సంబంధమును నిశ్చయముగా ఎరింగియు ఫలము విరుద్ధముగా ఉండుటచే ఆ సంబంధమును అనేక విధములగు యుక్తులతో శంకించుట 'అభిమాన' మనబడును. [అభినవగుప్తుడు దీనిని అనుష్టుప్ వృత్తపాఠమందలి 'సారూప్యము' (౩౦) అనెడి లక్షణముతో సమన్వయించెను. దాని లక్షణ మీ విధమ గా ఉన్నది'— "తా నింతకుముందు చూచి, విని, అనుభవించియున్న విషయములను చెప్పుటచే కలిగిన సాదృశ్యము క్షోభజననము అనగా హృదయమందు స్థిరముగా నిలువనిది అగుట 'సారూప్య' మనబడును."]

5. గుణకీర్తనము— వివిధార్థసముద్భవములగు గుణములను కీర్తించుచు దోషములను కల్పించకుండుట 'గుణకీర్తన' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'గుణకీర్తనము' (34)తో సమన్వయింపబడినది. పేరు ఒకటేఅయినను అందలి నిర్వచనము మాత్రము భిన్నముగా కన్పట్టుచున్నది— "లోకమునందలి గుణాతిశాయులైన అనేకులనామములతో ఒకనినే నిర్దేశించుట 'గుణకీర్తన'మనబడును."]

6. ప్రోత్సాహనము— ఉత్సాహ వర్ధకములును, స్పష్టములును, సాదృశ్యముతో కూడినవియును, ప్రసిద్ధములును అగు వచనములచే ఒక అజ్ఞాతవిషయమందు ఉత్సాహమును కల్పించుట 'ప్రోత్సాహన' మనబడును [ఇది 'ప్రియోక్తి' (36) తో సమన్వయింపబడినది— "ప్రసన్నమైన మనస్సుతో పూజ్యులను పూజించునప్పుడు తన మనస్సులోని హర్షమును వెల్లడిచేయుటకు చెప్పెడి మాటలు 'ప్రియోక్తి' అనబడును."]

7. ఉదాహరణము— ఒక అర్థమును ప్రతిపాదించుట కుపయుక్తమైన శబ్దముచే తత్సంబద్ధములును, అనుక్తములును అగు అనేకార్థములు స్ఫురించుట 'ఉదాహరణ' మనబడును. [అనుష్టుప్‌వృత్తపాఠమందును దీనిపేరు ఉదాహరణమే. నిర్వచనము కొంత భిన్నముగా ఉన్నట్లు కన్పట్టినను అంతస్సారమున రెండును ఒకటియే—"తుల్యార్థయుక్తమగు వాక్యముచే వేరొక అర్థమును సాధించుట 'ఉదాహరణ' మనబడును"]

---

9. అభినగుప్తుడీ విధముగా రెండు పాఠములను సమన్వయము చేయుటకు ప్రయత్నించెనని తెలిపియున్నాను. పై 6 వ అధస్సూచికను చూడవలెను. ఉపజాతి వృత్తపాఠమందలి లక్షణములు అనుష్టుప్‌వృత్తపాఠమందలి ఏయే లక్షణములతో సమన్వయింపబడెనో వాని పేర్లను, లక్షణములను ఆయా సందర్భములందే వివరించుచున్నాను.



8. నిరుక్తము— ఇది రెండు విధములు— తథ్యము, అతథ్యము. ప్రసిద్ధి నాశ్రయించి ఒక శబ్దము యొక్క నిర్వచనమును సాధించినచో అది 'తథ్యనిరుక్త' మనబడును; దీనికి విపరీతమైనది 'అతథ్యనిరుక్తము'. [అనుష్టుప్ వృత్తపాఠమందలి 'నిరుక్తము' (11) తోడనే, ఆ పాఠము భిన్నమయినను, ఇది సమన్వయింపబడినది— "పూర్వోక్తమయిన అర్థప్రసిద్ధికొరకు దోషరహితమైన వాక్యమును చెప్పుట 'నిరుక్త' మనబడును"]

9. గుణానువాదము— హీనులను ఉత్తములతో పోల్చుట 'గుణానువాద' మనబడును. [ఇది అనుష్టుప్‌వృత్తపాఠమందలి 'గుణాతిపాతము' (14) తో సమన్వయింపబడినది— "ఉపమానభూతములగు వివిధార్థములందున్న మధురోదాత్తగుణముల సాదృశ్యముచే ఉపమేయమునందు గుణములను కల్పించుట 'గుణాతిపాత' మనబడును"]

10. అతిశయము— కొంత విషయమును చెప్పి, చెప్పుట కలవికాని విశేషమింకను కలదని సూచించుట 'అతిశయ' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'అతిశయము' (15) తోడనే, ఆ పాఠము భిన్నమయినను, సమన్వయింపబడినది— "సర్వజన సాధారణములగు గుణములను మొదట కీర్తించి, పిమ్మట విశేషమును చెప్పుట 'అతిశయ' మనబడును"]

11. హేతువు—వాడుకలో ఉన్న అనేకార్థములను ప్రతిపాదించి, వానియందనాదరము చూపి, అసాధారణమగు ఒక అర్థమును ప్రమాణవచనపురస్సరముగా నిర్ణయించుట 'హేతు' వనబడును. [ఇది అనుష్టుప్ వృత్తమందలి 'హేతువు' (5) తోడనే, అది పాఠాంతరమైనను, సమన్వయింపబడినది— "ప్రయోజనవశమున ఇష్టార్థమును సాధించుటకు మనోగ్రాహి అగునట్లు ఉపపత్తి సహితముగా చెప్పెడి వాక్యము 'హేతు' వనబడును"]

12. సారూప్యము— పరోక్షమందు అనుకరణముచే లక్షణసామ్యమును కల్పించి అపదేశమును (అదే ఇది అని) చెప్పుట 'సారూప్య' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'దృష్టము' (18) తో, పాఠములు భిన్నములయినను, సమన్వయింపబడినది— "ప్రత్యక్ష వస్తువును పరోక్షముగా కాని, పరోక్ష వస్తువును ప్రత్యక్షముగా కాని వర్ణించుట 'దృష్ట' మనబడును"]

13. మిథ్యాధ్యవసాయము—పారమార్థికములుకాని అర్థములచే వానితో సమానములగు అర్థాంతరములను నిర్ణయించుట 'మిథ్యాధ్యవసాయ' మనబడును. [ఇది అనుష్టుప్‌వృత్తపాఠమందలి 'విపర్యయము' (21)తో సమన్వయింపబడినది— "విచారమును (ఊహించినది), దృష్టమును (చూచినది), ఉపదిష్టమును (ఒకరిచే చెప్ప

బడినది) అయిన అర్థముల యొక్క తత్త్వమును సందేహమువలన అన్యథాపరికల్పించుట విపర్యయ మనబడును"]

14. సిద్ధి— ప్రసిద్ధార్థములమధ్య ఒక అప్రసిద్ధార్థమును చొనిపి హేతు పురస్సరముగా వానికి సాధారణ్యమును కల్పించుట 'సిద్ధి' అనబడును. [ఈ నిర్వచనము అనుష్టుప్ వృత్తపాఠమందలి 'సిద్ధి' (12) నిర్వచనముతో కొంతవరకు సరిపోలుననికాబోలు ఇచ్చట అభినవగుప్తుడేమియును చెప్పలేదు— "తానుకోరిన అర్థము సిద్ధించుటకొరకు స్పృహణీయములును, అతర్కితోపలబ్ధములును అయిన ప్రయోజనాంతరములను కీర్తించుట 'సిద్ధి' అనబడును"]

15. పదోచ్చయము—తాత్పర్యార్థము సమానముగా ఉండియు, వాచ్యార్థము భిన్నముగా ఉండుపదములచే నానార్థగ్రథితముగా ఒకవస్తువును ప్రశంసించుట 'పదోచ్చయ' మనబడును. [దీని నిర్వచనము అనుష్టుప్ వృత్తపాఠమందలి 'పదోచ్చయ' (17) నిర్వచనముకంటె భిన్నముగా కన్పట్టుచున్నను అర్థము మాత్రము సమానమే అని అభినవగుప్తుడు చెప్పెను—"బహుపదములను మరికొన్ని పదములతో కూడ సదృశార్థముగా ప్రయోగించుట 'పదోచ్చయ' మనబడును"]

16. ఆక్రందము— సాక్షాద్వాచ్యముకారాని తీవ్రమగు అర్థమును చెప్పునప్పుడు సాదృశ్య యోజనముచే ఆత్మాభిప్రాయమును ఇతరు లెరుంగున ట్లుపన్యసించుట 'ఆక్రంద' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి "తుల్యతర్కము' (16) తో, నిర్వచనము భిన్నమయినను, సమన్వయింపబడినది— "తుల్యార్థములగు రూపకములను, ఉపమలను ప్రయోగించి, అప్రత్యక్షార్థమును గోచరింపజేయుట 'తుల్యతర్క' మనబడును."]

17. మనోరథము— హృదయస్థమగు భావమును సుశ్లిష్టార్థముగ అన్యాపదేశ కథనములచే ప్రకాశింపజేయుట 'మనోరథ' మనబడును. [దీని నిర్వచనమును అనుష్టుప్ వృత్తపాఠమందలి మనోరథ (31) నిర్వచనమును సమానములే.]

18. ఆఖ్యానము— ప్రశ్నపూర్వకముగా కాని, అప్రశ్నపూర్వకముగా కాని ఒక నిర్ణయమును చేయుట 'ఆఖ్యాన' మనబడును. [దీని నిర్వచనమును అనుష్టుప్ వృత్తపాఠమందలి 'ప్రసిద్ధి' (28) నిర్వచనమును భిన్నములుగా కన్పట్టినను సమన్వయము సులభము. అందుచే అభినవగుప్తుడు శ్లోకము నుదాహరించి వదలివేసెను— "లోక ప్రసిద్ధములును, సాతిశయములును అయిన బహువాక్యములతో వాక్యార్థమును సాధించుట 'ప్రసిద్ధి' అనబడును."]

19. యాచ్ఞ— ఆదిలో కోపమును కలిగించునవియైనను అంతమున హర్షమును కలిగించు హితవాక్యములను ప్రియవాక్యములతో మేళవించి, ప్రబోధించుట 'యాచ్ఞ' అనబడును. [ఈ నిర్వచనమును, అనుష్టుప్ వృత్తమునందలి 'దాక్షిణ్య' (25) నిర్వచనమును భిన్నములుగా కన్పట్టినను అర్థమునందు సమానములే— "హితములును, ప్రసన్నములును అయిన వాక్యములతో లేదా చేష్టలతో ఇతరులను అనువర్తించుట 'దాక్షిణ్య' మనబడును."]



20. ప్రతిషేధము— విపరీత కార్యములందు ప్రవర్తించువానిని కార్యజ్ఞులు నివారించుట 'ప్రతిషేధ' మనబడును. [ఇది "అనుష్టుప్ వృత్తపాఠమందలి 'లేశము' (32) తో సులభముగా సమన్వయింపబడినది- "వాక్యకుశలులు సదృశార్థములను ప్రతిపాదించుచు ఉపాయసహితముగా వాక్యార్థమును చెప్పుట 'లేశ' మనబడును"]

21. పృచ్ఛ—అభిప్రాయద్యోతకములగు కాక్వాదులతో కూడిన వాక్యములచే తన్నుగాని, ఇతరులనుగాని ప్రశ్నించుచున్నట్లు మాటాడుట 'పృచ్ఛ' అనబడును. [ఈ నిర్వచనమును, అనుష్టుప్ వృత్తపాఠమందలి 'పృచ్ఛ' (29) నిర్వచనమును సమానములే.]

22. దృష్టాంతము— పూర్వము ఉపలబ్ధమైన విషయముల నిదర్శనముచే ప్రకృతమునకు వాని సామ్యము నుపపాదించుట 'దృష్టాంత' మనబడును. [ఈ నిర్వచనమును అనుష్టుప్ వృత్తపాఠమందలి 'దృష్టాంత' (7) నిర్వచనమును భిన్నములగుటచే సమన్వయముచేయబడలేదు—"హేతువుచే పక్షమునందు సాధ్యమును సాధించునప్పుడు సహాయకారియును, సర్వలోక మనోగ్రాహియును అగు నిదర్శనము 'దృష్టాంత' మనబడును"]

23. భాసనము— అనేకార్థములను ప్రకాశింపజేయునదియును, పెక్కు ఉక్తులను యుక్తులను కలిగిఉండునదియును అయి, ఒక భావమును భాసింపజేయు వాక్యము 'భాసన'మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'మాల' (24)తో సులభముగా సమన్వయింపబడినది—"ఈప్సితార్థసిద్ధికొరకు అనేక ప్రయోజనములను కీర్తించుట 'మాల' అనబడును."]

24. సంశయము— అనేక విధములగు విచారణములనుచేసి తత్త్వార్థము పరిజ్ఞాతము కాకుండగనే వాక్యమును పూర్తిజేయుట 'సంశయ' మనబడును. [ఈ నిర్వచనమును అనుష్టుప్ వృత్తపాఠమందలి 'సంశయ' (6) నిర్వచనమును సమానములే.]

25. ఆశీస్సు— శాస్త్రీయార్థ సంపన్నమును, మనోరథ సముద్భవమును అయిన ప్రార్థనీయమును కాని, అప్రార్థనీయమును కాని ఆకాంక్షించుట 'ఆశీస్సు' అనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'నిదర్శన' (10) నిర్వచనముకంటె భిన్నముగా కన్పట్టుచున్నను సమన్వయింపబడినది— "ఇతరాపేక్షను అనగా వ్యతిరేక

మును నిరసించుటకు ప్రసిద్ధార్థములను కీర్తించుట 'నిదర్శన' మనబడును" దీనిని అభినవగుప్తు డింకొక విధముగా పఠించియుండెను— "సాధ్యవస్తువిషయకమగు ఆకాంక్ష తత్సంపత్తిచే శమించుటకు ప్రసిద్ధులగు దేవతాదులను కీర్తించుట 'నిదర్శన' మనబడును"]

26. ప్రియము— ఆది యందు క్రోధజనకమును, అంత మందు హర్ష ప్రవర్ధకమును, ఆశీర్వాద సమన్వితమును అగు వచనము 'ప్రియ' మనబడును. [నిజమున కీ నిర్వచనమును యాచ్ఞా నిర్వచనమును సమానములే. యాచ్ఞ ప్రబోధ పర్యవసాయియును, ప్రియము ఆశీర్వాద పర్యవసాయియును అగుటయే భేదము. అభినవగుప్తు డీ నిర్వచనమును అనుష్టుప్ వృత్తపాఠమందలి 'భ్రంశ' (22) నిర్వచన ముతో కష్టపడి సమన్వయించెను— "వాచ్యార్థమును విడిచిపెట్టి, అన్యార్థమును ఆశువుగా చెప్పుట 'భ్రంశ' మనబడును."]

27. కపటము— ఇతరుల వచనములను ఛలముచే అన్యథా గ్రహించుట లేదా అపలపించుట (punning) 'కపట' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠ మందలి 'గర్హణ' (26) నిర్వచనముతో, పాఠము భిన్నమయినను, సమన్వయింప బడినది— "ప్రయోజనవశముచే దోషములను గుణములుగాను, గుణములను దోషములుగాను కీర్తించుట 'కపట' మనబడును."]

28. క్షమ— దుర్జనోదాహృతములును, పరుషములును, క్రోధజనక ములును అగు వాక్యములచే సభలో పీడితుడయ్యును క్రోధమును తెచ్చికొన కుండుట 'క్షమ' అనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'విశేషణ' (13) నిర్వచనముతో, పాఠము భిన్నమయినను, సమన్వయింపబడినది— "ప్రసిద్ధములును, ప్రధానములును అయిన పెక్కు అర్థములను విడిచి, విశేషముగా ఒక్కదానిని పేర్కొనుట (అనగా క్రోధముచే చేయబడిన నింద) 'విశేషణ' మనబడును."]

29. ప్రాప్తి— అవయవచిహ్నమునుచూచి భావమును అనుమానించుట 'ప్రాప్తి' అనబడును. [ఈ నిర్వచనమును అనుష్టుప్‌వృత్తపాఠమందలి 'ప్రాప్తి' (8) నిర్వచనమును సమానములే.]

30. పశ్చాత్తాపము— తొందరపాటుతో అకార్యమును చేసికాని, కార్య మును చేయకకాని మనస్సులో సంతాపమును చెందుట 'పశ్చాత్తాప' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'విచారము' (20) తో సమన్వయింపబడినది— "అప్రత్యక్షార్థములను సాధించుటకు చెప్పబడిన అర్థము ననుసరించి అనేకోపాయ సహితమైన విచారమును చేయుట 'విచార' మనబడును". కాని, అభినవగుప్తుడు సమన్వయముచేసిన పాఠముమాత్ర మింకొకవిధముగా ఉన్నది— "అనేకార్థ విచారము 'విచార' మనబడును."]



31. అనువృత్తి— స్నేహమువలన కాని, దాక్షిణ్యమువలన కాని అర్థ సంయుక్తముగా వినయముతో పరుని అనువర్తించుట 'అనువృత్తి' అనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'అనునయము' (23) తో, పాఠము భిన్నమైనను, సమన్వయింపబడినది- "విరుద్ధాభినివేశులైన ఇరువురకు ప్రీతిని కలిగించునదియును, అర్థసాధకమగునదియును అగు వాక్యము 'అనునయ' మనబడును."]

32. ఉపపత్తి— ప్రాప్తములైన దోషములను ఉపపత్తి సహితముగా శమింపజేయుట 'ఉపపత్తి' అనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'ఉప దిష్టము' (19) తో, పాఠము భిన్నమైనను, సమన్వయింపబడినది— "శాస్త్రార్థమును పరిగ్రహించి, విద్వన్మనోహరమగునట్లు చక్కగా ఉపదేశించుట 'ఉపదిష్ట' మనబడును."]

33. యుక్తి— పరస్పరశోభారూపమగు ఆనుకూల్యముకలిగిన ఉత్కృష్ట ములగు అర్థముల సంబంధము సాధింపబడుట 'యుక్తి' అనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'అభిప్రాయము' (9) తో, పాఠము భిన్నమైనను, సమన్వయింప బడినది- "సాదృశ్యమువలన అభూతపూర్వమగు ఒక అర్థమును లోకహృదయగ్రాహి అగునట్లుగా కల్పించుట 'అభిప్రాయ' మనబడును."]

34. కార్యము— ఒకదానియందలి దోషమును తొలగించి, గుణములను కూర్చుట లేదా గుణములను తొలగించి దోషములను కూర్చుట 'కార్య' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'అర్థాపత్తి' (27) తో, పాఠము భిన్నమైనను, సమన్వయింపబడినది— "వాక్యమాధుర్యసంపన్నముగా ఒక అర్థమును చెప్పినప్పుడు వేరొక అర్థము ప్రతీయమానమగుట 'అర్థాపత్తి' అనబడును."]

35. అనునీతి— అపూర్వక్రోధజనకమగు అపరాధమును తొలగించుటకై మధురవాక్యములను పల్కుట 'అనునీతి' అనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠ మందలి 'ప్రసిద్ధి' (28) తో, పాఠము భిన్నమైనను, సమన్వయింపబడినది—" లోక ప్రసిద్ధములును, సాతిశయములును అయిన బహువాక్యములతో వాక్యార్థమును సాధించుట 'ప్రసిద్ధి' అనబడును."]

36. పరిదేవనము— ప్రయోజనవశమున మరియొక పేరుతో చెప్పబడినవి యును, ప్రసిద్ధార్థములును అగు దోషములను అన్యసంబద్ధములుగా కల్పించుట 'పరిదేవన' మనబడును. [ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'క్షోభము' (33) తో, పాఠము భిన్నమైనను, సమన్వయింపబడినది—" తాను దోషరహితుడైనను విచిత్రా ర్థములైన పరదోషములను తనయందాపాదించుకొనుట 'క్షోభ' మనబడును." దీనినే భోజుడు 'పరివాదన' మనెను. ఇది అనుష్టుప్ వృత్తపాఠమందలి 'అనుక్తసిద్ధి'తోకూడ

సమన్వయింపబడినది—"ఒక విషయము యొక్క ప్రస్తావముచే మిగిలిన అర్థమంతయును చెప్పనవసరములేకయే ప్రతీతమగుట 'అనుక్తసిద్ధి' అనబడును."]

ప్రబంధ శోభాకరములైన ఈ ముప్పది ఆరు కావ్యలక్షణములను యథారసముగా చక్కగా ప్రయోగించవలెను*.

## అలంకారములు

ఇంక కావ్యములందలి అలంకారములు[10] ఉపమ, దీపకము, రూపకము, యమకము అనెడి భేదములచే నాలుగువిధములు[11]. వీని నిప్పుడు వివరింతును—

1. ఉపమ— కావ్యబంధము[12] లందు ఏదేని ఒక వస్తువును (ఉపమేయము) సాదృశ్యము (ఉపమానము) చే ఉపమించుట 'ఉపమ' అనబడును. ఈ ఉపమ గుణ-ఆకృతిసమాశ్రయము[13]. ఈ ఉపమాన - ఉపమేయ భావము నాలుగు విధములని తెలియవలెను— (1) ఒక ఉపమేయమును ఒక ఉపమానముతో పోల్చుట; ఉదా: నీ ముఖము శశితుల్యము. (2) అనేక ఉపమేయములను ఒక ఉపమానముతో పోల్చుట; ఉదా: నక్షత్రములు శశాంకునివలె ప్రకాశించుచున్నవి. (3) ఒక ఉపమేయమును అనేక ఉపమానములతో పోల్చుట; ఉదా: శ్యేన-బర్హిణ-గృధ్రముల కనులవంటి కన్ను కలిగిఉన్నది. (4) అనేక ఉపమేయములను అనేక ఉపమానములతో పోల్చుట; ఉదా: గజనులు మేఘములవలె ఉన్నవి. ఇది ఉపమానోపమేయసంఖ్యాభేదములచే ఏర్పడిన విభజనము.

ఇంక స్వరూపభేదముచే ఏర్పడు విభజనమును వివరింతును: ఇది ప్రశంస, నింద, కల్పితము, సదృశము, కించిత్సదృశము అనెడి భేదములచే ఐదు విధములు— (1) ప్రశంసోపమ— ఉదా: 'బహుకష్టసాధ్యమై, మూర్తిమంతమైన సిద్ధిని చూచి సంతోషించెడి మునివలె ఆ విశాలాక్షిని జూచి రాజు సంతోషించెను[14] (ఇందు ఉపమానము ప్రశంసింపబడినది). (2) నిందోపమ— ఉదా: వనమునందు దావదగ్ధమైన కంటకితద్రుమమును లత ఆశ్రయించుకొన్నట్లు ఆమె సర్వగుణహీనుడైన కర్కశస్వరూపుని ఆశ్రయించి ఉన్నది (ఇందు ఉపమానముయొక్క నింద కలదు). (3) కల్పితోపమ— ఉదా: దానసలిలములను స్రవింపజేయుచున్నవియును, లీలామంథరగాములును అయిన మతంగజములు జంగమపర్వతములవలె విరాజిల్లుచున్నవి (ఉపమానము లిందు కల్పితములు). (4) సదృశోపమ— ఉదా: పరచిత్తానురోధి వగు నీవు నేడుచేసిన పని అతిమానుషకర్ముడ వగు నీకే తగిఉన్నది (ఇచ్చట ఉపమేయమునకే ఉపమానత్వము కల్పింపబడినది). (5) కించిత్సదృశోపమ— ఉదా: సంపూర్ణచంద్రవదనయు, నీలోత్పలదళేక్షణయు, మత్తమాతంగగమనయును అయిన ఈ నా సఖి ఇదే వచ్చినది (ఇచ్చట సాదృశ్యము సమాసమునందు ఇముడ్పబడినది).

సంగ్రహముగా ఉపమాభేదములను వివరించితిని. నేను చెప్పని లక్షణములను, అనగా శేషించిన భేదములను కావ్యములనుండియు, లోకమునుండియు గ్రహించవలెను.

---

*[కాశీ ముద్రణమునందు 17 వ అధ్యా - 1-42 శ్లో; బొంబాయి ముద్రణమునందు 16 వ అధ్యా - 1-42 శ్లో; బరోడా ముద్రణమునందు 16 వ అధ్యా - 1-39 శ్లో; బరోడా ముద్రణమున 16 వ అధ్యాయానుబంధమందు 1-42 శ్లో.]

10. 'అలంకారో నాటకాశ్రయాః' అని కాశీముద్రణ పాఠము. లక్షణాలంకారములకు గల భేదమును నాలుగవ అధస్సూచికలో పేర్కొనియున్నాను. అలంకారచరిత్రకు 2వ విశేషాంశమును చూడవలెను. "లక్షణబలమువలననే అలంకారములు వైచిత్ర్యయుతములగు" నని ఉపాధ్యాయ భట్టతౌతుని అభిప్రాయము. ఉదా:- గుణానువాదన మనెడి లక్షణయోగముచే 'ప్రశంసోపమ' యును, అతిశయమనెడి లక్షణముచే 'అతిశయోక్తి' యును, మనోరథమనెడి లక్షణముచే 'అప్రస్తుతప్రశంస' యును, మిథ్యాధ్యవసాయమనెడి లక్షణముచే 'అపహ్నుతి'యును, సిద్ధిఅనెడి లక్షణముచే 'తుల్యయోగిత'యును వైచిత్ర్యయుతములగుచున్నవి.ఇట్లే ఇతరవిషయములందును ఊహించవలెను. లక్షణముల పరస్పర వైచిత్ర్యముచే కూడ అనంతములగు విచిత్రభావములు సిద్ధించుచున్నవి. ఉదా:-ప్రతిషేధ-మనోరథముల సంమేళనమువలన 'ఆక్షేపము' సిద్ధించుచున్నది. [అభినవభారతి - 2 వ సం - పుట 321]

11. కవివ్యాపారబలముచే లౌకికస్వభావముకంటె భిన్నమైన అర్థజాత మేదిసిద్ధించునో అది యెల్ల లక్షణ మనబడును. కావ్యములో ఈ లక్షణము శరీరభూతమైనది. ఉపమాదులు మూడును దాని అర్థభాగమందుండునవి (యమకము శబ్దభాగము). ఇట్టి అలంకారము ముివ్విధములు—స్ఫుటమైన ఉపమాన-ఉపమేయత్వములు కలది 'ఉపమ' అనబడును; ఇందు ఉపమానము, ఉపమేయము, ద్యోతకము, సాధారణ ధర్మమును స్పష్టముగా ఉండును. వీటి నన్నింటిని మరుగుపరచుటచే ఉపమానోపమేయములను రెండింటిని ఏకముగాచేసి చెప్పుట 'రూపక' మనబడును; ఒకేచోటనుండు క్రియా-గుణ-జాత్యాది సాధారణధర్మము పలుచోటులనుండు ఉపమానోపమేయములతో అన్వయించుట 'దీపక' మనబడును.

ఇట్లు సాదృశ్యము ప్రధానముగా గల మూడు అలంకారములే ఆనాడు గ్రహింపబడెనని తెలియవలెను...సాదృశ్యము స్ఫుటముగాగల ఉపమాప్రపంచమే సర్వాలంకారములని విద్వాంసులు ప్రతిపాదించుట ఎరుంగవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 321]

12. బంధము, గుంఫము, భణితి, వక్రోక్తి, కవివ్యాపారము అనునవి పర్యాయపదములు. [అభినవభారతి - 2 వ సం - పుట 322]

13. అనగా ఉపమాన - ఉపమేయములకు గల సంబంధమును ద్యోతనముచేయు 'ఇవాది' ('వలె' మొదలగు) సాదృశ్యవాచకములతో కూడి ఉండునవి.

14. ప్రశంసాది ఉపమాభేదములకు మూలమందు నిర్వచనములు లేవు. సులభగ్రాహ్యములగుటచే ఉదాహరణములు మాత్రమే ఒసంగబడినవి.

2. దీపకము— ఒక అవాంతర వాక్యమున కూర్పబడిన జాతి-గుణ-క్రియా వాచకశబ్దము సాకాంక్షములగు అనేకపదముల ఆకాంక్షను పూరించుచు అన్వయించుట 'దీపక' మనబడును. (దీపమువలె ఒకేచోటు నుండి పెక్కుచోటులకు వ్యాపించుశక్తి కలదగుటచే ఈ పేరు సార్థకము). ఉదా : సరస్సులు హంసలచే, వృక్షములు కుసుమములచే, సరోరుహములు మత్తద్విరేఫములచే, ఉద్యానవనములు గోష్ఠులచే ఆ పట్టణమందెన్నడును శూన్యములుచేయబడలేదు.

3. రూపకము — స్వవికల్పముచే ఉపమేయమునకు రూపాంతరకల్పనము 'రూపక'మనబడును. అట్టి రూపాంతరకల్పనము ఉపమేయోపమానములకు సంబంధించిన అన్ని అవయవములందును ఉండుట, కొన్ని అవయవములందే ఉండుట (ఏకదేశవివర్తిరూపకము) అనెడి భేదములచే రూపకము రెండు విధములు. ఔపమ్యమును అప్రధానముచేసి పరస్పర భిన్నములగు ఉపమానోపమేయములలో ఉపమానముయొక్క అనురంజకత్వశక్తిచే ఉపమేయముయొక్క రూపమును ఉపమాన రూపమునుగా నిర్ణయించి వర్ణించుటయును 'రూపక' మనబడును,

ఉదా :- పద్మాననలు, కుముద ప్రహాసలు, వికోశనీలోత్పలచారునేత్రలు అగు ఈ వాపీస్త్రీలు రొదచేయుచున్న హంసకులములచే అన్యోన్య మాలపించుకొనుచున్నవి.

4. యమకము[15] —శబ్దావృత్తి 'యమక' మనబడును. నాటకాశ్రయమైన ఈ యమకము పాదాంతయమకాదిభేదములచే పది విధములు—

(1) పాదాంతయమకము— నాలుగు పాదముల అంతములందును ఒకటి కాని, అంతకు మించి కాని సమాక్షరములు గల శబ్దములున్నచో అది 'పాదాంత యమక' మనబడును. ఉదా :—

దినక్షయా త్సంహృత రశ్మిమండలం, దివీవ లగ్నం తపనీయమండలమ్ ।
విభాతి తామ్రం దివి సూర్యమండలం, తథా తరుణ్యాః స్తనభారమండలమ్॥ 64

—దినక్షయము వలన సంహృతమగు రశ్మిమండలము గల తామ్రమగు సూర్యమండలము ఆకాశలగ్నమగు సువర్ణమండలము వలెను, తరుణి యొక్క స్తన భారమండలము వలెను ప్రకాశించుచున్నది.[16]

---

15. కవలలవలె జంటగానుండు స్వభావము కలదికాన ఇది యమకమనబడినది. [అభినవభారతి - 2 వ సం. పుట 326]. ఉపమా దీపక-రూపకములు మూడును అర్థాలంకారములనియు, యమకము శబ్దాలంకారమనియు తెలియవలెను.

16. దీనికి ఇంకొక ఉదాహరణము కూడ కలదు—

లోకానాంప్రభవిష్ణు ర్దైత్యేంద్రగదానిపాతనసహిష్ణుః ।
జయతి సురదైత్యజిష్ణు ర్భగవా నసురవరమథనకారీ విష్ణుః ॥ 65



(2) కాంచీయమకము— పాదాదిని, పాదాంతమున రెండేసి పదములు సమానముగా ఉన్నచో అది 'కాంచీయమక' మనబడును. ఉదా :

యామం యామం చంద్రవతీనాం ద్రవతీనాం, వ్యక్తావ్యక్తా సారజనీనాం రజనీనామ్ ।
ఫుల్లే ఫుల్లే సభ్రమరే వా భ్రమరే వా, రామారామా విస్మయతే చ స్మయతే చ॥ 67

—చంద్రునితో కూడినవై, ద్రవించుచున్న రజనులయందలి జాములు యువతులతో కూడిన యువకులకు తెలిసీ తెలియకయే గడచిపోవుచున్నవి. సభ్రమరము లేదా అభ్రమరము అగు వికసించిన పుష్పముతో యువతి విస్మయముచెందుచున్నది. ఆరామము నవ్వుచున్నది.

(3) సముద్గయమకము— వృత్తమందలి పూర్వార్ధ-ఉత్తరార్ధములు సమానముగా ఉన్నచో అది 'సముద్గయమక' మనబడును (ఒకటి రెండు పాదములే అర్థభేదముతో మూడు నాలుగు పాదములగుట). ఉదా :

కేతకీకుసుమపాండురదంతః, శోభతే ప్రవరకాననహస్తీ ।
కేతకీకుసుమపాండురదంతః, శోభతే ప్రవరకాననహస్తీ ॥ 69

—శ్రేష్ఠమైన కాననమను హస్తి కేతకీకుసుమములనెడి పాండురదంతములు కలదై శోభించుచున్నది; కేతకీకుసుమపాండురదంతమగు ప్రవరకాననహస్తి శోభించుచున్నది.

(4) విక్రాంతయమకము— పాదమునువిడిచి, పాదముచొప్పున రెండు పాదములు (2, 4 పాదములు) సమములుగా ఉన్నచో అది 'విక్రాంతయమక' మనబడును. ఉదా :

స పూర్వం వారణో భూత్వా, ద్విశృంగ ఇవ పర్వతః ।
అభవద్దంతవైకల్యా, ద్విశృంగ ఇవ పర్వతః ॥ 71

—పూర్వము ఆ వారణము ద్విశృంగమగు పర్వతమువలె ఉండి ఇప్పుడు దంతవైకల్యముచే విశృంగ పర్వతమువలె ఉండెను.

(5) చక్రవాలయమకము— పూర్వపాదాంతపదమే పరపాదాది పదమయి చక్రమువలె ఉండునది 'చక్రవాలయమక' మనబడును. (దీనినే 'ముక్తపదగ్రస్త' మందురు). ఉదా :

శరైస్తథా శత్రుభి రాహతాహతా, హతాశ్చ భూయస్త్వనుపుంఖగైః ఖగైః ।
ఖగైశ్చ సర్వైర్వ్యుధి సంచితాశ్చితా, శ్చితాధిరూఢా నిహతాస్తలైస్తలైః ॥ 74

—శత్రువులచే బాణములతో కొట్టబడి, ఆ బాణముల వెంటవచ్చిన పక్షులచే కూడ కొట్టబడుచున్నారు. అట్టి పక్షులచే యుద్ధభూమి వ్యాప్తమైఉన్నది. అట్లు వ్యాపించిన పక్షులు చితాధిరూఢులనుగూడ తమ పాదతలములచే కొట్టుచున్నవి.

(6) సందష్టయమకము— ప్రతిపాదముయొక్క ఆదియందును రెండేసి అక్షరములు సమానములుగా ఉన్నచో అది 'సందష్టయమక' మనబడును ఉదా:

పశ్య పశ్య రమణస్య మే గుణాన్, యేన యేన వశగాం కరోతి మామ్ ।
యేన యేన హి మమైతి దర్శనం, తేన తేన వశగాం కరోతి మామ్ ॥ 76

—చూడు, నా ప్రియుని గుణములను చూడు. వేనివేనిచే నన్ను వశపరచు కొనుచున్నాడో, ఎటులెటుల దర్శనమిచ్చునో అటులటులనే నన్ను ఆకర్షించు చున్నాడు.

(7) పాదాదియమకము— నాలుగు పాదములందును ఆది పదములు సమానములుగా ఉన్నచో అది 'పాదాదియమక' మనబడును. ఉదా:

విష్ణుః సృజతి భూతాని, విష్ణుః సంహరతే ప్రజాః ।
విష్ణుః ప్రసూతే త్రైలోక్యం, విష్ణు ర్లోకాధిదైవతమ్ ॥ 78

—విష్ణువు భూతములను సృజించుచున్నాడు. విష్ణువు ప్రజలను సంహరించు చున్నాడు. విష్ణువు త్రైలోక్యమును పుట్టించుచున్నాడు. విష్ణువు లోకాధిదైవతము.

(8) ఆమ్రేడితయమకము— పాదాంతమందు పదము ద్విరుక్తమయినచో (రెండుసార్లు చెప్పబడినచో) అది 'ఆమ్రేడితయమక' మనబడును. ఉదా:

విజృంభితం నిఃశ్వసితం ముహుర్ముహుః, కథం విధేయంస్మరణం పదేపదే ।
యథా చ తే ధ్యానమిదం పునః పునః, ధ్రువం గతా తే రజనీ వినావినా ॥ 80

—నిశ్శ్వసితము మాటిమాటికిని వృద్ధిపొందుచున్నది; స్మరణము మాటి మాటికిని ఎట్లు చేయనగును? నీ ధ్యానము మాటిమాటికిని చేయుచుండగా రాత్రియే గడచిపోయెను.

(9) చతుర్వ్యవసితయమకము— సర్వపాదములును నియతాక్షరములై సమముగా (అన్ని పాదములును ఒకేరకముగా) ఉన్నచో అది 'చతుర్వ్యవసిత యమక' మనబడును.

వారణానామయమేవకాలో, వారణానామయమేవకాలః ।
వారణానామయమేవకాలో, వా రణానామయమేవకాలః ॥ 82

—ఇది వారణపుష్పములు వికసించుటకు తగిన కాలము. ఇది ఏనుగులు విజృంభించుటకు తగిన కాలము. ఇది శత్రువులకు అనుకూలమైన కాలము. ఇది యుద్ధములకు అనుకూలమైన కాలము.

(10) మాలాయమకము— ఒకే వ్యంజనము భిన్నస్వరసంయోగముతో పెక్కుపదములందువచ్చినచో అది 'మాలాయమక' మనబడును. ఉదాహరణములు:

హలీ బలీ హలీ మాలీ ఖేలీ మాలీ సలీ జలీ ।
జలో బలో బలో మాలో ముసలీ త్వభిరక్షతు ॥ 84



—హలముధరించినవాడును, బలవంతుడును, శూలధారియును, మాలాధారి యును, విలాసయుతుడును, సలియును, జలియును, బలవంతుడును, ముసలధారి యును అగు బలరాముడు రక్షించుగాక.

అసౌ హి రామా రతివిగ్రహప్రియా, రహఃప్రగల్భా రమణం మనోగతమ్ ।
రతేన రాత్రౌ రమయేత్పరేణ వా, న చేదుదేష్యత్యరుణః పురోరిపుః ॥ 85

—రతివిగ్రహమందు ప్రీతికలదియును, ప్రగల్భయును అగు ఈ రామ తన మనస్సునకునచ్చిన రమణుని రాత్రియందు రహస్యముగా పరరతముతో, శత్రుతుల్యు డగు సూర్యుడే ఉదయించకపోయినచో, ఇంకను తృప్తునిచేసిఉండెడిది.

సపుష్కరాక్షః క్షతజోక్షితాక్షః, క్షరత్క్షతేభ్యః క్షతజం దురీక్షమ్ ।
క్షతైర్గవాక్షైరివ సంవృతాంగః సాక్షాత్సహస్రాక్ష ఇవావభాతి ॥ 83

—పుష్కరాక్షుడును, క్షతజోక్షితాక్షుడునుఅగునతడు క్షతము(గాయము)ల నుండి స్రవించుచున్న దుర్నిరీక్షమగు క్షతజము (రక్తము) కలిగి గవాక్షములవంటి క్షతములచే ఆవృతమైన శరీరము కలవాడై సాక్షాత్ సహస్రాక్షునివలె భాసించు చున్నాడు.

పైలక్షణములెల్ల (ఇందలంకారములు కూడ అంతర్భూతములు చేయబడినవి) అర్థక్రియాయుక్తములుగా కావ్యములందు ప్రయుక్తములు కావలయును. ఇంక కావ్యదోషములను, గుణములను వివరింతును*.

## దోషములు

గూఢార్థము, అర్థాంతరము, అర్థహీనము, భిన్నార్థము, ఏకార్థము, అభిప్లుతార్థము, న్యాయాపేతము, విషమము, విసంధి, శబ్దచ్యుతము అను భేదములచే దోషములు పది విధములు.[17] వీనిలక్షణములను వివరింతును (ఉదాహరణము లీయలేదు)—

* [కాశీముద్రణమునందు 17 వ అధ్యా—46-67 శ్లో; బొంబాయి ముద్రణము నందు 16 వ అధ్యా—33-88 శ్లో; బరోడా ముద్రణమునందు 16 వ అధ్యా—40-87 శ్లో.]

17. అభినవగుప్తుడీ పదిదోషములను స్థూలదోషములనుగా పేర్కొనెను. కవులు వీనిని ప్రయోగించరాదు. కాని, వీనిలో కొన్ని ఒక్కొక్కప్పుడు సందర్భవశమున ప్రయో గార్హములు కూడ కాగలవు. ఉదా:- అర్థహీనము హాస్యాదులందు, భిన్నార్థము శ్రోత్రి యాది పక్తుల విషయమున, అభిప్లుతార్థము ఉన్మాదాదులందు దోషములు కావు. ఇట్టివానిని అనిత్యదోషములనవచ్చును. ఇంక అపశబ్దము, విసంధి, వృత్తభేదము మొదలగునవిమాత్రము నిత్యదోషములు. [అభినవభారతి - 2 వ సం - పుట 333]

1. గూఢార్థము—ప్రసిద్ధములైన పదములను విడిచి పర్యాయపదములతో చెప్పుట 'గూఢార్థ' మనబడును. (ఉదా : 'దశరథు' డనుటకు బదులుగా 'అధికనవ విమానుడు' అనుట.)

2. అర్థాంతరము— అవర్ణ్యము (చెప్పనవసరములేనిది) వర్ణింపబడుట 'అర్థాంతర' మనబడును. (ఉదా : 'చింతామోహమనంగమంగతనుతే విప్రేక్షితుం సుభ్రువః'—కామమిచ్చుట వర్ణనీయము ; అందుచే చింతావర్ణన మనావశ్యకము )

3. అర్థహీనము—పూర్వాపరసంబంధము లేనట్లు చెప్పుట లేదా చెప్పవలసిన దింకను మిగిలిపోవుట 'అర్థహీన' మనబడును.

4. భిన్నార్థము—అర్థము అసభ్యముకాని గ్రామ్యముకాని అగుట, లేదా చెప్పదలచినదానికి విపరీతార్థము వచ్చుట 'భిన్నార్థ' మనబడును.

5 ఏకార్థము—అవిశేషాభిధానము (ఏకప్రయోజనముగల పెక్కు పదములను విశేషరహితముగా ఉపయోగించుట) 'ఏకార్థ' మనబడును.

6. అభిప్లుతార్థము— ఏ పాదమున కా పాదము ప్రత్యేకార్థము కలిగి ఉండుటచే పద్యమునందలి నాలుగు పాదములకును ఏకవాక్యత లేకపోవుట 'అభిప్లుతార్థ' మనబడును.

7. న్యాయాపేతము—ప్రమాణవర్జితమైన (దేశ-కాల-కలా-శాస్త్ర విరుద్ధమైన) అర్థము 'న్యాయాపేత' మనబడును.

8. విషమము— వృత్తభేదము అనగా ఛందోభంగము 'విషమ' మనబడును.

9. విసంధి— అనుపశ్లిష్టశబ్దము (సంధి చేయబడకుండుట) 'విసంధి' అనబడును.

10. శబ్దచ్యుతము—అవర్ణస్వరయోజనము (మధ్యలో కొన్ని వర్ణములు లేదా అచ్చులు కూర్పబడకఉండుట) 'శబ్దచ్యుత'మనబడును.

## గుణములు

ఇంతవరకును కావ్యదోషములను వివరించియున్నాను. ఇంక కావ్యగుణములను వివరింతును. పైని వివరించిన దోషములు లేకుండుట, మాధుర్య-ఔదార్యలక్షణయుతమగుట 'గుణ' మనబడును.[18] శ్లేషము, ప్రసాదము, సమత, సమాధి, మాధుర్యము, ఓజస్సు, సౌకుమార్యము, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి అను భేదములచే గుణములు పదివిధములు—

1. శ్లేషము— ఈప్సితము (కవిసముత్ప్రేక్షితము) అగు అర్థజాతముతో సంబద్ధములగు పదములయొక్క పరస్పర సంశ్లిష్టత 'శ్లేష' మనబడును. [స్వభావముచే స్ఫుటమైనను విచారగహనమును, సహజముగా సుప్రతిబద్ధమును అగునది 'శ్లేష' మనబడును.][19]

2. ప్రసాదము— పెద్దలచే వ్యాఖ్యానింపబడకపోయినను సుఖశబ్దార్థ సంయోగమువలన శబ్దముకాని, అర్థముకాని సులువుగా ప్రతీతమగుట 'ప్రసాద' మనబడును.

3. సమత— వ్యస్తములును (విడివిడిగా ఉన్నవి), వ్యర్థములును, దుర్జ్ఞేయములును అగు పదములతో కూడినది కాక సమత్వము కలిగి ఉండుట 'సమత' అనబడును. [అన్యోన్యసదృశములును, అన్యోన్యభూషణములును అగు అలంకారములును, గుణములును సమములై ఉండుట 'సమత' అనబడును.]

4. సమాధి— ప్రతిభాతిశయకుశలురు మాత్రమే తెలిసికొనగలిగిన అర్థవిశేషములతో కూడి ఉండుట 'సమాధి' అనబడును. [ఉపమాదులచే చెప్పబడినవియును, ప్రయత్నముచే ప్రాప్తించునవియును అగు అర్థములను ఒకచోట కూర్చుట 'సమాధి' అనబడును].

5. మాధుర్యము— చాలసార్లు విన్నను, మరలమరల చెప్పబడినను మనస్సునకు ఉద్వేగమును కలిగింపకుండుట 'మాధుర్య' మనబడును.

6. ఓజస్సు—విచిత్రములును, సానురాగములును (వర్ణము వర్ణాంతరమును అపేక్షించుట), సమాసవంతములును, ఉదారములును అగు బహుపదములతో కూడి ఉండుట 'ఓజస్సు' అనబడును. [నింద్యము లేదా హీనము అయిన విషయమునకు శబ్దార్థసంపత్తిచే ఉదాత్తతను కల్పించుట 'ఓజస్సు' అనబడును].

---

18. అనగా దోష విహీనత్వము, శ్రుతిసుఖత్వము (మాధుర్యము), దీప్తరసత్వము (ఔదార్యము) అనునవి కలిగిఉండుట గుణమగును. [అభినవభారతి - 2 వ సం - పుట 334]. కావున దోషము లేనంతమాత్రమున అది గుణమగునని తలంచరాదు. మాధుర్యౌదార్యములు ప్రత్యేకగుణములే కాక సర్వగుణసామాన్యధర్మములనియును తెలియవలెను. వామనాదులు గుణములందు శబ్ద - అర్థభేదములను కల్పించి మొత్తము 20 గుణములను వివరించిఉన్నారు. అభినవగుప్తుడీ విభజనమును ఆదరించి తన వ్యాఖ్యానమందు విపులముగా వివరించెను.

19. ఇందు శ్లేషము, సమత, సమాధి, ఓజస్సు, అర్థవ్యక్తి, ఉదారత అను 6 గుణములకును రెండేసి నిర్వచనములు కలవు. ఇది శ్లేషముయొక్క రెండవ నిర్వచనము; ఇది మూలమునందును కుండలీకరణములందున్నది. ఇట్లే తక్కినవాటి విషయమునను గ్రహించవలెను.

7. సౌకుమార్యము—సుఖప్రయోజ్యములును, సుశ్లిష్టసంధియుక్తములును అయిన శబ్దములతో, సుకుమారార్థములతో కూడిఉండుట 'సౌకుమార్య' మనబడును.

8. అర్థవ్యక్తి— లోకప్రసిద్ధమైన అర్థమును సుప్రసిద్ధములగు పదములతో కావ్యమందు ప్రతిపాదించుట 'అర్థవ్యక్తి' అనబడును. [ఒక అర్థమును మనస్సులో బాగుగా అవగాహనము చేసికొనిన పిమ్మట అనంతర ప్రయోగము నిర్ణయింపబడుట 'అర్థవ్యక్తి' అనబడును]

9. ఉదారత— కావ్యము శృంగారాద్భుతయోజితమును, అనేక భావ సంయుక్తమును, దివ్యభావ పరీతమును అగుట 'ఉదారత' అనబడును. [అనేకార్థ విశేషములు కలిగినవియును, సౌష్ఠవ సంయుతములును అగు శబ్దములతో, అతి చిత్రార్థములతో కూడిఉండుట 'ఉదారత' అనబడును]

10. కాంతి—చంద్రునివలె మనః-శ్రోత్రములకు ఆహ్లాదమునుకలిగించుచు, లీలాది చేష్టాలంకార సుందరమగుట 'కాంతి' అనబడును.

### వృత్తాదులరసానుకూలసంయోజనము

ఇంతవరకును అలంకార-గుణ-దోషముల లక్షణములను వివరించితిని. ఇంక, రససంశ్రయమగు వీని ప్రయోగమును ఇప్పుడు వివరింతును— వీర-రౌద్ర-అద్భుత రసములందు కావ్యమున లఘ్వక్షరప్రాయమగు వృత్తరచనయును, ఉపమా-రూపకాలంకారములును ఉండవలెను. బీభత్స-కరుణములందు ఉపమా-రూపకాలంకారములును, గుర్వక్షరప్రాయమగు వృత్తరచనయును ఉండవలెను. వీర-రౌద్రములందు ధర్షణము వర్ణింపబడినప్పుడు ఒక్కొక్కప్పుడు పైవిధముగానే గుర్వక్షరప్రాయమగు వృత్తరచన ఉండవలెను. శృంగారరసమునందు రూపక-దీపకాలంకారములను, ఆర్యాది మృదువృత్తములను ప్రయోగించవలెను. వీరమందలి ఉత్తర-ప్రత్యుత్తర రూపమగు పాఠ్యమును జగతి, అతిజగతి, సంకృతి ఛందములందలి వృత్తములతో నిబంధించవలెను. యుద్ధ-సంఘేట వర్ణనములందు ఉత్కృతిఛందమును ఉపయోగించవలెను. కరుణరసమునందు శక్వరి, అతిధృతి ఛందములందలి వృత్తములనుపయోగించవలెను. వీరమునందువలెనే రౌద్రమునందును వృత్తములను కూర్చవలెను. ఇంక మిగిలిన రసములందు అర్థానుసారముగా ఛందములను ప్రయోగించవలెను.

పైవిధముగా పూర్వోక్తములైన విషమ-అర్ధసమ-సమ వృత్తములను రసానుసారముగా, ఉదారమధురములైన శబ్దములతో ప్రయోగించవలెను. ఉదార-మధురములును, ప్రమదాభిధేయములును అయిన శబ్దములనే నాట్యాశ్రయములైన కృతులందు కూర్చుటకు ప్రయత్నించవలెను. రాజహంసములచే వికసితములైన



పద్మాకరములు ప్రకాశించునట్లే ఇట్టి శబ్దములచే కావ్యబంధములు విభూషితములై ప్రకాశించును.[20]

హ్రస్వ-దీర్ఘ-ప్లుత భేదములచే అక్షరములు మూడు విధములు. కవులు ఈ మూడు విధములగు అక్షరములను గుర్తించి యథారసముగా, యథాభావముగా కావ్యబంధములన్నింటను కూర్చవలెను. ఒకమాత్ర హ్రస్వమగును, రెండు మాత్రలు దీర్ఘమగును, మూడుమాత్రలు ప్లుతమగును. స్మృతి-అసూయా-పరిదేవన-వేద పఠనములందు ప్లుతము వచ్చును. 'ఆ' కారము స్మృతియందును, 'ఊ' కారము అసూయయందును, 'హా' కారము పరిదేవనమందును, 'ఓం' కారము అధ్యయనమందును ప్రయుక్తములు కావలయును. (ఈ నాల్గుఅక్షరములును ప్లుతములు.)

కృష్ణాజినాక్షమాలాధరులు, రురుచర్మధరులు, ఘృతాక్తులు, కమండలు-దండహస్తులును అగు బ్రాహ్మణులతో యజ్ఞక్రియయే ప్రకాశించును కాని వేశ్య ప్రకాశించదు. అట్లే 'చేక్రీడితము' మొదలగు పరుషశబ్దములతో లలితములైన భరత (నటోచితములైన) ప్రయోగములు ప్రకాశించవు (అనగా 'చేక్రీడి'తాది పరుష పదములను రూపకమునందు కవి వాడరాదు). సుకుమారమును మనోజ్ఞమును అగు ఇతివృత్తము కలదియును, గూఢములైన శబ్దములును అర్థములును లేనిదియును, జనపదులు సుఖముగా అనుభవించుటకు యోగ్యమైనదియును, నృత్తముతో కూడినదియును, అనేక రససంయుక్తమును, సంధులతో సంధింపబడినదియును అగు నాటకమే ప్రేక్షకులఎదుట ప్రదర్శించుటకు యోగ్యమైనది.

షోడశాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

**1. లక్షణములు**

లక్షణమనగా ఏమో ఈ అధ్యాయమందలి నాలుగవ అధస్సూచికలో వివరించియున్నాను. డా. వి. రాఘవన్ "The History of Lakshana," అనుపేర ఒక విపుల

---

20. ఔదార్య-మాధుర్యములు— ప్రత్యేక కావ్యగుణములైన ఈ రెండును శబ్దములన్నింటికిని సామాన్య ధర్మములుగా చెప్పబడినవి; ప్రమదాభిధేయములు=హర్షజనకములైన అర్థములను ప్రతిపాదించునవి లేదా స్త్రీలు పలుకుటకుకూడ తగినవి, 'ప్రమదాభినేయములు' (సుఖముగా అభినయింపదగినవి) అని దీనికి పాఠాంతరము కూడ కలదు. భరతుని దృష్టిఅంతయును అభినయముమీదనే ఉండును కాన ఈ పాఠాంతరము చాల సమంజసముగా ఉన్నది. ఇంక శ్రవ్యకావ్యముల విషయమున అభినయ ప్రసక్తిలేదు కాన అందలి రచన దీనికి భిన్నముగా ఉండవచ్చును.

వ్యాసమును వ్రాసియున్నారు. [Some Concepts of Alankara Sastra, 1942-pp 1-47] దానిని పరిశీలించవలెను.

కావ్యమునందు లక్షణాదుల స్థానములను అభినవగుప్తుడు క్రింది విధముగా వివరించెను— కావ్యనిర్మాణము ప్రాసాదనిర్మాణ తుల్యము. శబ్ద-చ్ఛందోవిధి భూమి (పునాది) కల్పము, వృత్తసమాశ్రయణము క్షేత్రపరిగ్రహము, లక్షణయోజన భిత్తి (గోడల) స్థానీయము, అలంకార-గుణ నివేశనము చిత్రకర్మ ప్రతిమము, దశరూపక విభాగము గవాక్ష-వాతాయనాదిదేశీయము, కాక్వాదిప్లుతి ఉపయోగనిరూపణ తుల్యము. ఇట్టి వాచికాభినయ స్వరూపము 14 వ అధ్యాయమునుండి 20 వ అధ్యాయమువరకును నిరూపింపబడును. [అభినవభారతి-2వ సం- పుట 292.]

లక్షణముల విషయమున రెండు పాఠములున్నవని తెలిపి ఉన్నాను. వీటిలో ఉపజాతివృత్త పాఠమును అభినవగుప్తుడు అనుసరించెను; ఇది వానికి ఉపాధ్యాయ పరంపరాగతమట. దీనితో అనుష్టుప్ వృత్తపాఠమును సమన్వయింతునని చెప్పి అభినవగుప్తుడు ఆయా సందర్భములందే ఆ సమన్వయమును చేసియుండెను. నేను ఆ సమన్వయమును వివరించుచు అనుష్టుప్ వృత్తపాఠములందలి నిర్వచనములనుకూడ కుండలీకరణములందు పేర్కొనియున్నాను.

ఈ రెండు విధములగు పాఠములందును 17 లక్షణముల పేర్లు సమానములు; అందులో ఎనిమిదింటి నిర్వచనములు మాత్రమే సమానములు— భూషణ-అక్షరసంఘాత-శోభా-గుణకీర్తన-మనోరథ-పృచ్ఛా-సంశయ- ప్రాప్తులు. ఉపజాతివృత్త పాఠములోని కార్య నిర్వచనమును, అనుష్టుప్ పాఠములోని గ్రహణ నిర్వచనమును సమానములు. రెండు పాఠములందలి ఉదాహరణ-నిరుక్త-సిద్ధి-పదోచ్చయ-దృష్టాంతము లనెడు ఐదింటి నిర్వచనములును భావమునందు సమానములు. ఉపజాతి పాఠములోని అనువృత్తి నిర్వచనము అనుష్టుప్ పాఠములోని దాక్షిణ్య నిర్వచనముతో సంవదించుచున్నది. ఉపజాతిపాఠములోని యాచ్ఞా-ప్రియవచనముల నిర్వచనములు సమానములు; అయినను కొంత భేదమును చెప్పవచ్చును.

అభినవగుప్తునకు పూర్వము లక్షణముల విషయమున ఆలంకారికులలో ఒక నిర్దిష్టాభిప్రాయమున్నట్లు కన్పట్టదు. అభినవగుప్తుడు పది అభిప్రాయములను పేర్కొనెను. కొందరు లక్షణములను సంధ్యంగములను ఒకే విధముగా పరిగణించిరి. ఇంకొకరు లక్షణ-అలంకారములను సమానముగా గణించిరి. ఇట్లే పది విధములైన అభిప్రాయములు కలవు. వాటినెల్ల అభినవగుప్తుడు చర్చించి కొన్ని పక్షములందలి ముఖ్యాంశములను గ్రహించెను. వాని అభిప్రాయసారమును క్రిందివిధముగా పేర్కొనవచ్చును— లక్షణములు కావ్య శరీరమునకు సంబంధించినవి. ఇవి కావ్యమునకు శోభాదాయకములు. అలంకారములవలె ఇవి పృథక్సిద్ధములుకాక కావ్యశరీరమునందు అంతర్గతములై ఉండును. త్రివిధమైన అభిధావ్యాపారమంతయును లక్షణ విషయమే. లక్షణమును కవివ్యాపారమునకు పర్యాయముగా పేర్కొనవచ్చును. అట్టియెడ లక్షణము లనంతములగుట సంభవించును. నిజమునకు లక్షణము లనంతములే. ప్రస్ఫుటములైన ముప్పది ఆరింటినిమాత్రమే భరతుడు



పేర్కొనెను. రెండవపాఠము భిన్నముగా ఉండుట లక్షణము లనంతములను విషయమును సూచించుచునే ఉన్నది.

ఈ లక్షణములు అర్వాచీనకాలములో అలంకారములుగా మారిపోయినవని సూచించియున్నాను. పెక్కురు ఆలంకారికులు లక్షణములను వివరించనేలేదు. లక్షణములను వివరించిన కొందరు అర్వాచీనాలంకారికులు పేరునుకూడ మార్చివేసినారు. సింగభూపాలుడు లక్షణములను 'భూషణము'లను పేరుతో వ్యవహరించెను. శారదాతనయుడు భూషణములని ఆదిలోచెప్పి అంతమందు అలంకారము లనినాడు. విశ్వనాథాదులు 'నాట్యాలంకారము' లనినారు. భోజుడు 64 లక్షణములను వివరించెను.

నాట్యశాస్త్రమందు లక్షణములకు ఉదాహరణములులేవు. కాని సింగభూపాలుడు, విశ్వనాథుడు మొదలగువారు ఉదాహరణముల నొసంగినారు. అభినవగుప్తుడుకూడ ఉదాహరణముల నొసంగెనని తెలిపియున్నాను.

ఈ లక్షణములు కేవలము రూపకములకు సంబంధించినవి మాత్రమే కావు. భరతుడు కావ్యలక్షణములని వ్యవహరించుట గమనార్హము. అచ్చటచ్చట మాత్రమే 'నాటకాశ్రయ' మని కలదు. కొందరివి కేవలము రూపకములకు సంబంధించినవనియే తలంచిరి. అందున భోజ-శారదాతనయ-సింగభూపాల-విశ్వనాథులు కేవలము నాటకమునకు మాత్రమే వీటిని పరిమితము చేసియున్నారు. ఇది సమంజసమైన పద్ధతి కాదు. "కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః", "ఏభిరర్థ క్రియాయుక్తైః కార్యః కావ్యం తు లక్షణైః", "ఏతాని వా కావ్య విభూషణాని.... కావ్యే ప్రయోజ్యాని" అనెడి ప్రయోగములను బట్టి భరతుడు వీటిని కావ్య సామాన్య లక్షణములనుగా పరిగణించెననుట స్పష్టము. భట్టతౌతుడును, అభినవగుప్తుడును అట్లే గ్రహించిరి.

## 2. అలంకారములు

భరతుడు నాలుగే అలంకారములను చెప్పెను. ఇందు మొదటి మూడును అర్థాలంకారములు, నాలుగవది శబ్దాలంకారము [ఇట్టి ఈ విభజన మర్వాచీనాలంకారికులది; భరతుడు సూచింపలేదు. మిశ్ర (ఉభయ) అలంకారము లనెడి మూడవ భేదము కూడ తరువాత వచ్చినది]. అర్వాచీన కాలములో అలంకారముల సంఖ్య విపరీతముగా పెరిగిపోయినది. ఆశీస్సు మొదలగు కొన్ని లక్షణములే అర్వాచీన కాలములో అలంకారములుగా మారిపోయినవి. లక్షణములవలన అలంకారము లెట్లు వృద్ధిని, పుష్టిని పొందుచున్నవో భట్టతౌతుడు సూచించియుండెను. [ఈ అధ్యాయమందలి 10 వ అధస్సూచికను చూడవలెను. ఈ పద్ధతి కూడ భరతుడు సూచించినది మాత్రము కాదు]

అలంకారనిర్వచనము: 'అలం' అనగా భూషణము (ornament) అని అర్థము. దీని నుండియే 'అలంకార' మనెడి పదము వచ్చినది. దీనికి కూడ భూషణ మనియే అర్థము. కావున కావ్యాలంకారము లనగా కావ్యమునకు భూషణము లనుట స్పష్టము. అలంకార పదమును నిర్వచించిన ప్రథముడు దండి— "కావ్య శోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్షతే" [కావ్యాదర్శము - 2 వ పరిచ్ఛేదప్రారంభశ్లోకము]. వామను డింతకంటె మేలైన

నిర్వచనమును చేసెను; అందు గుణములకును, అలంకారములకును గల భేదము కూడ చెప్పబడెను—"కావ్య శోభాయాః కర్తారో ధర్మా గుణాః. తదతిశయ హేతవస్త్వలంకారాః" [కావ్యాలంకార సూత్రము - 8వ అధికరణ ప్రారంభము]. కావ్యాలంకార సూత్ర ప్రారంభములో "కావ్యం గ్రాహ్య మలంకారత్. సౌందర్య మలంకారః" అని వామనుడు చెప్పుటలో అచ్చట "Poetic beauty in general" అని అర్థము.

వనితకు భూషణము లెట్టివో కావ్యమునకు అలంకారము లట్టివని ఆలంకారికుల నిర్ణయము. ఈ అభిప్రాయమును పెంచి శబ్దార్థోభయాలంకారములను భోజుడు క్రింది విధముగా వివరించెను—1. బాహ్య (శబ్ద) అలంకారములు—వస్త్ర-మాల్య - విభూషణాదులవంటివి. 2. అభ్యంతర (అర్థ) అలంకారములు—దంతపరికర్మ - నఖచ్ఛేద - అలకకల్పనాదులవంటివి. 3. బాహ్యాభ్యంతర (ఉభయ) అలంకారములు—స్నాన - ధూప - విలేపనాదులవంటివి.

*అలంకార ధ్వని :* ఆనందవర్ధనుడు కావ్యాత్మ 'ధ్వని' అని సిద్ధాంతించెను. అనగా అర్థము ప్రతీయమానము కావలెనే కాని వాచ్యము కారాదని ఆ సిద్ధాంతసారము. ఆ ప్రతీయమానార్థము రస-వస్తు-అలంకార భేదములచే మూడు విధములుగా ఉండును. ఇందు రసము వాచ్య మెన్నడును కారాదు. వస్తు-అలంకారములు రెండును వాచ్యరూపమున కూడ ప్రతిపాదితములు కావచ్చును. అలంకారము వాచ్యముఖమున ప్రతిపాదిత మైనప్పుడు కేవల అలంకారమగును. (expressed figure of speech). ఇంక, అలంకారము ప్రతీయమాన మైనప్పుడు అది 'అలంకార ధ్వని' అగును (implied or suggested figure of speech). కాని, ప్రతీయమానావస్థయందు అది సాక్షాత్తుగా అలంకారము కాదు. అయినను అట్లు స్ఫురించిన అర్థమును తగినంత పదజాలముతో వ్యక్తము చేసినప్పుడు మాత్రము అది అలంకారము కాగలదు. అట్లు వాచ్యావస్థలో దాని రూపము అలంకారము కావునను, ఇప్పుడు ప్రతీయమాన (ధ్వని) రూపమున ఉండుటచేతను అది 'అలంకారధ్వని' అయినది (దీనినే 'బ్రాహ్మణ శ్రమణ' న్యాయమందురు). కాగా ప్రతీయమానార్థమందు అలంకారము స్ఫురించుట అలంకారధ్వని అగునని పిండితార్థము; ఇది కేవల అలంకారము కంటె రమ్యమైనది.

*అలంకారసంఖ్యాభివృద్ధి :* నాట్యశాస్త్రమందు వివరింపబడిన నాలుగు అలంకారములను కువలయానందమందు 124 అలంకారములైనవి. ఒకే పేరుగల అలంకారమును పేర్కొనినను నిర్వచనమునందు కొందరు పరస్పరము భేదించుచున్నారు. కొందరుచెప్పిన అలంకారములను మరికొందరు చెప్పలేదు. ఇంక కొందరు వినూత్నములైన ఆలంకార ములను సృష్టించిరి. కువలయానందమందలి గరిష్ఠసంఖ్య 124 అయినను, అలంకారికు లందరును విడివిడిగా పేర్కొనిన అలంకారముల మొత్తము సంఖ్య 200 దాటిఉండును. ఇందులో మరల ఒక్కొక్క అలంకారమందు పెక్కు ప్రభేదములు కలవు. ఉపమాలంకార మందు భరతు డైదు భేదములను చెప్పగా దండి ఇంచుమించుగా ముప్పది భేదములను వివరించెను; ఈ ప్రభేదములలో కొన్ని తరువాతి కాలములో ప్రత్యేకాలంకారములైనవి కూడను. ఈ అలంకారసృష్టి అంతయును ఆలంకారికుల నిశితమేధాశక్తికిని, సూక్ష్మ



విశ్లేషణశక్తికిని తార్కాణమని చెప్పనొప్పును. అలంకార సంఖ్యాభివృద్ధిని పట్టికరూపములో క్రింద వివరించుచున్నాను—

| కర్త | కాలము | గ్రంథము | శబ్ద | అర్థ | మిశ్ర | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| భరతుడు | క్రీ.పూ. 200 - క్రీ. శ. 300 | నాట్యశాస్త్రము | 1 | 3 | - | 4 |
| భామహుడు | క్రీ. శ. 600 - 750 | కావ్యాలంకారము | 2 | 36 | - | 38 |
| దండి | క్రీ. శ. 600 - 750 | కావ్యాదర్శము | 2 | 35 | - | 37 |
| ఉద్భటుడు | .. 750 - 850 | కావ్యాలంకారసార సంగ్రహము | 4 | 37 | - | 41 |
| వామనుడు | .. 779 - 813 | కావ్యాలంకారసూత్రము | 2 | 31 | - | 33 |
| రుద్రటుడు | .. 825 - 875 | కావ్యాలంకారము | 5 | 68 | - | 73 |
| భోజుడు | .. 1005 -1054 | సరస్వతీకంఠాభరణము | 24 | 24 | 24 | 72 |
| మమ్మటుడు | .. 1050 -1101 | కావ్యప్రకాశము | 6 | 59 | 2 | 67 |
| రుయ్యకుడు | .. 1135 -1150 | అలంకారసర్వస్వము | 9 | 73 | 2 | 84 |
| జయదేవుడు | .. 1200 -1250 | చంద్రాలోకము | 6 | 100 | - | 106 |
| విద్యానాథుడు | 14వ శ. ప్ర. భాగము | ప్రతాపరుద్ర యశోభూషణము | 5 | 66 | 2 | 73 |
| విశ్వనాథుడు | .. 1300 -1380 | సాహిత్యదర్పణము | 11 | 75 | 2 | 88 |
| అప్పయ్యదీక్షితుడు | .. 1554 -1628 | కువలయానందము | | 124 | | 124 |

క్రీ. శ. 500-800 మధ్యకాలమందు మాత్రమే అలంకారముల సంఖ్య 40 ప్రాంతములందున్నది. 10 వ శతాబ్దమునాటికి అలంకారముల సంఖ్య విపరీతముగా పెరిగిపోయినది. అయినను 12 వ శతాబ్దివాడైన నన్నిచోడుడే కాక ("షట్త్రింశదలంకారాలంకృతంబై" —కుమారసంభవము-ప్ర. ఆశ్వా-45) 14 వ శతాబ్దివాడైన విన్నకోట పెద్దనకూడ 36 అలంకారములనుమాత్రమే పేర్కొనుట గమనార్హము. ఆంధ్రుల మీద దండి-భామహుల ప్రాబల్యమట్టిది.

రుయ్యకుడు అలంకారములను పది వర్గములుగా విభజించి యున్నాడు—1.సాదృశ్య గర్భములు - 28 (ఇందు మరల పలుభేదములు కలవు.); 2. విరోధగర్భములు - 12; 3. శృంఖలాబంధములు - 4; 4. తర్కన్యాయమూలకములు - 2; 5. వాక్య (కావ్య) న్యాయమూలకములు - 8; 6. లోకన్యాయమూలకములు - 7; 7. గూఢార్థప్రతీతి మూలకములు - 6; 8. రసాలంకారములు - 4; 9. పృథగలంకారములు - 3; 10. సంకరాలంకారములు - 2. [(శ్రీ) కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు అలంకారములను గూర్చి "ఆంధ్రవిజ్ఞానసర్వస్వము"లో చక్కని వ్యాసము వ్రాసియున్నారు.]

ఈ అలంకారములందు ఏది ప్రధానమనెడి విషయమును కొందరు చర్చించినారు. వామనుడు 'ఉపమ' ను సర్వాలంకార బీజభూతముగా పరిగణించి, తక్కిన అలంకారములను తత్సంబంధులనుగా నిరూపించెను. మమ్మట-హేమచంద్రుల దృష్టిలో 'అతిశయోక్తి' సర్వాలంకార బీజభూతము. అప్పయ్య దీక్షితుడు మరల వామన మతానుసారియై "ఉపమ ఒక్కటియే శైలూషి (నాట్యకత్తె) వలె చిత్రభూమికలు ధరించి, కావ్యరంగమున నృత్యము చేయు" నని పేర్కొనినాడు—

ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్ ।
రంజయంతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః ॥

'ముఖము చంద్రుని వలె ప్రకాశించుచున్నది' అనెడి ఉపమాలంకారము ఉక్తిభంగీ
భేదముచే పెక్కు అలంకారములుగా మారగలదు. ఉదా : 'ముఖచంద్రుడు' అనునప్పుడు
రూపకము, 'ముఖమా ?, చంద్రుడా ?' అనునప్పుడు సందేహము... మొదలగునవి.

### అలంకార సంప్రదాయము

ఈ అలంకార సంప్రదాయమునకు ప్రధానాచార్యుడు భామహుడు. అతని 'కావ్యా
లంకార' మీ సంప్రదాయమును స్థాపించిన ప్రథమగ్రంథము. ఉద్భటుడు ఈ సంప్రదాయ
మును పోషించియున్నాడు. ఈతడు స్వయముగా కావ్యాలంకారమునకు "వివరణము"ను
(ప్రతీహారేందు రాజు మొదలగువారు పేర్కొనినది) వ్రాయుటతో తృప్తిచెందక, తత్సంప్ర
దాయ వ్యాప్తికై తాను ప్రత్యేకముగా "కావ్యాలంకార - సార - సంగ్రహము"ను వ్రాసి
యున్నాడు. దండి-రుద్రటు లిరువురిని కూడ ఈ సంప్రదాయ పోషకులనుగా పేర్కొన
వచ్చును. దండి కావ్యాదర్శ ప్రథమ పరిచ్ఛేదమందు "గుణము" ల యెడ అధికాభిమానమును
చూపించినను గ్రంథమునందు మూడింట రెండువంతులు "అలంకార చర్చ"నే చేసినాడు.
ఇంక రుద్రటుడు ప్రప్రథమముగా అలంకారములను కొన్ని నిర్దిష్ట వర్గములుగా విభజించిన
వాడు. కావుననే వీరిని పోషకులని పేర్కొనియున్నాను. ఈ అలంకార సంప్రదాయ
మహత్త్వమును గుర్తించినవాడు కావుననే ధ్వన్యాచార్యుడు కూడ అలంకారమునకు
"కావ్యాత్మ" లో స్థాన మంగీకరించి, ఈ సంప్రదాయమునకు ఉదాత్తత నాపాదించియుం
డెను. ఈతడు ప్రత్యేకముగా అలంకార చర్చ చేసిఉండలేదు. కాని ధ్వనివాదియే అయిన
మమ్మటుడును, రసవాది అయిన విశ్వనాథుడును, రసధ్వని వాదిఅయిన జగన్నాథుడును
సవిస్తరముగా, ప్రత్యేకముగా అలంకార నిరూపణమును చేసిఉన్నారు. ఇంచుమించుగా
ఆలంకారికులెల్లరును (ధనంజయుడు, సింగభూపాలుడు మొదలగువారు కాక) అంతయో,
ఇంతయో "అలంకార చర్చ" చేసినవారే అనెడి సత్యము ఈ సంప్రదాయ మహత్త్వమును
నిరూపించుచున్నది.

దశరూపకాది గ్రంథములు కేవలము రూపకచర్చకొరకు ఉద్దిష్టములైనట్లే అలంకార
సర్వస్వము, కువలయానందము మొదలగు గ్రంథములు కేవలము అలంకార నిరూపణము
నకు బయలుదేరినవి. భామహ-ఉద్భటుల తరువాత అలంకార సాంప్రదాయికులలో ప్రధాన
ముగా ఎన్నదగిన రుయ్యకుడు, అప్పయ్య దీక్షితుడు క్రమముగా పై గ్రంథములను రచిం
చిరి. వీరందరి దృష్టిలో "కావ్యము" నకు "జీవితము" అలంకారములే. నిరలంకారమైన
కావ్యము వారి దృష్టిలో కావ్యమే కాదు. "కాంతమైనప్పటికిని నిర్భూషమైన వనితాననము
విభాసించనట్లే నిరలంకారమైన కావ్యము శోభించదు." (1-13) అని భామహుడు పేర్కొని
యుండెను. కావ్య నిర్వచనమునందు "...అనలంకృతీ పునః క్వాఽపి" అనిన మమ్మటునిపై
ఆగ్రహించి "కావ్యము అనలంకృతిగా ఉండవచ్చునని అంగీకరించునతడు అగ్ని ఉష్ణరహిత
ముగా ఉండునని ఎందుల కంగీకరింపడు ?" అని జయదేవుడు ప్రశ్నించియుండెను.



అలంకారౌచిత్యము : పైని వివరించినట్లుగా పెక్కు అలంకారములున్నను, అవి
అన్నియును ఎల్లప్పుడును ప్రయుక్తములు కావలయుననెడి నియమములేదు. "పెక్కు అలం
కారము లున్నను, సమర్థుడైన కవి కూడ ఆనందావహములైన ఉపమాది బహుస్వల్పాలం
కారములను మాత్రమే వాడుచుండును" అని మహిమభట్టు పేర్కొనుట గమనార్హము.
కాళిదాసు ఉపమాలంకారమునకు ప్రసిద్ధి కెక్కెనుకదా. అలంకారము లెప్పుడును అంగ
భూతములుగానే ఉండవలెను; కావ్యమందు అవియే ప్రధానములు కారాదు. "అలంకార
ములు అతిమాత్రముగా ప్రయుక్తముకారాదు. ప్రయుక్తమైనంతవరకును అవి ప్రతీయ
మానములే అగుచు రసపోషకముగా మాత్రమే ఉండవలెను"— ఇది ధ్వన్యాచార్యుని అభి
ప్రాయసారము. క్షేమేంద్రుడు "ఔచిత్యవిచారచర్చ" లో 'అలంకారౌచిత్యము' ను
వివరించి ఔచిత్యవంతములైన శ్లోకములను, ఔచిత్యము లోపించిన శ్లోకములనుకూడ
ఉదాహరించెను. ఈవిధముగా ఔచిత్యము అనెడి పరిధిని దాటనంతవరకును అలంకారములు
కావ్యమునకు నిజముగా అలంకారములే! వాచ్యముఖమున ప్రతిపాదితములైన అలంకార
ములు లౌకికములైన భూషణములవలె రసమునకు బహిరంగములుగా పరిగణింపబడినను
ప్రతీయమానములైన అలంకారములుమాత్రము అట్టివి కావు. అవి కర్ణనికవచకుండలములవలె
సహజములు; పెట్టెలోనుండి తీసి ధరించుకొనునట్టివి కావు. అవి రసములో లీనములై
ఉండును. మహాకవి వీటికొరకు ప్రయత్నింపడు; యథావసరముగా అవియే వాక్కును
అనుసరించి వచ్చును.

"ఉపమాద్యలంకారములు కొన్ని అప్రత్యక్షమై, అనుభూతముకాకున్న వస్తువును
ప్రత్యక్షముచేసి మన అనుభూతికి తెచ్చును. ఎట్లన 'ముఖము చంద్రునివలె ఉన్నది' అనెడి
ఉపమ ముఖమునందు మనకు ప్రత్యక్షము కాని సౌందర్యమును ప్రత్యక్షము చేయుచున్నది.
ఇది కావ్యమునందేకాక వ్యవహారమునందును పరమసత్యమే, 'ఆ ఇల్లు సీతలేని పర్ణ
శాల'; 'ఆ దంపతులు చిలకా గోరింకలలాగా ఉన్నారు'... అని ఈ విధముగా ప్రతి
మాటలోను అలంకారమే. అందున ఆవేశము వచ్చినచో విశేషించియు అవి వెలువడును.
అలంకారమన నేమియో తెలియకయే ఆబాలగోపాలమును అలంకారయుక్తముగానే
భాషింతురు. అలంకారయుక్తమగు భాష జీవద్భాష" అని శ్రీ సన్నిధానము సూర్య
నారాయణ శాస్త్రిగారు పేర్కొనియున్నారు. [కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య-
పుట 711].

"Use and abuse of Alankara in Sanskrit" అనెడి వ్యాసములో డా. వి.
రాఘవన్ క్రింది విధముగా నిర్దేశించినాడు— "To conclude, poetry is neither pure
emotion and thought nor mere manner. A beautiful idea must appropriately in-
carnate itself in a beautiful expression. This defines Alankara and its place and
function" [Some Concepts of Alankara Sastra - P. 89]

అలంకారముల కింత ప్రాధాన్యము ఉండుటచేతనే సంస్కృత సాహిత్య విమర్శకులు
'ఆలంకారికు' లనబడినారు. వారి సాహిత్యవిమర్శ 'అలంకారశాస్త్ర' మనబడినది. ఇట్లు
దీని విశిష్టతను గుర్తించినచో అలంకార శాస్త్ర పఠనమువలన 'చమురు నష్టియే కాని
కవితకుఁ బుష్టి తక్కువ' అనునట్టి విమర్శలకు తావుండదు.

ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలెను. అక్షరములను, గణములను లెక్క పెట్టుకొనుచు కవి కావ్యమును వ్రాయడు; అట్లే అలంకారముల నిర్వచనములను నెమరువేసి కొనుచు కవి కావ్యమును వ్రాయడు. కవి ఒక మనోహరమైన ఊహచేయును; దానిని అక్షరరూపమున వ్యక్తముచేయును. అట్లు వ్యక్తమైన భావమును సహృదయుడు చదివి గ్రహించును. ఆ గ్రహించుటలో అది ఫలానా అలంకారము అనియు, దాని ప్రయోజనము ఫలానా అనియు ఎరింగియున్నచో వాని గ్రహణము మరింత ఆనందదాయకము కాగలదు. కావున అలంకారశాస్త్రపఠనము కవి కెంత ముఖ్యమో పఠితకును అంతే ముఖ్యము.

## 3. దోషములు

కావ్యము దోషరహితముగా ఉండవలెనునట ప్రాథమిక సూత్రము; ఆపైని కావ్యము గుణసహితముగా ఉండవలెను—ఇది పూర్వాలంకారికుల అభిప్రాయమును. "ఏకః శబ్దః సుష్ఠుప్రయుక్తః, సమ్యక్ జ్ఞాతః స్వర్గే లోకే చ కామధుక్ భవతి" అని శ్రుతివాక్యము. ఈ విషయమున దండి-భామహులు వ్యక్తీకరించిన అభిప్రాయములు గమనార్హములు—

> గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః।
> దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి॥
> తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన।
> స్యాద్వపుః సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్॥

[దండి కావ్యాదర్శము-1వ పరిచ్ఛేదము-6,7 శ్లో.]

—చక్కగా ప్రయుక్తమైన వాక్కు కామితములను పిండి ఇచ్చెడి ధేనువువంటిదే అగును. ఇంక దుష్ప్రయుక్తమైన వాక్కు ప్రయోక్తయొక్క పశుత్వమునే తెలుపగలదు. కావున అల్పమైన దోషమునుకూడ కావ్యమునందు సహించరాదు. శరీరము సుందరముగా ఉన్నను ఎచ్చటనేని బొల్లి ఉన్నచో ఆ శరీరము దుర్భరమే అగునుకదా.

అందుచేతనే భామహుడు క్రింది విధముగా పేర్కొనెను. [కావ్యాలంకారము-1వ పరిచ్ఛేదము-12 శ్లో.]—

> నాకవిత్వమధర్మాయ వ్యాధయే దండనాయ వా। కుకవిత్వం పునః సాక్షాన్మృతి మాహుర్మనీషిణః॥

—అకవిత్వము (కవి కాకపోవుట) అధర్మమునుకాని, వ్యాధినికాని, దండనమును కాని పొందించదు. ఇంక కుకవిత్వమన్నచో సాక్షాన్మృతియే అని మనీషులందురు.

దోషములు అనేకవిధములు— శబ్దము దుష్ప్రయుక్తము కావచ్చును; ఇందు వ్యాకరణ-ఛందోభంగాదులు చేరును. అర్థము అనుచితముగా ఉండవచ్చును; ఇందు రసభంగాదులు చేరును. స్థూలముగా చెప్పవలెనన్నచో అనౌచిత్యమునునదియెల్ల దోషభూయిష్ఠమే. ఔచిత్యమునుగూర్చి ఇంకొకచోట వివరింతును.

భరతుడు పది దోషములను వివరించియుండెను. భామహాదులంతకంటె అధికముగా దోషములను వివరించియున్నారు. భామహుడు మూడు వర్గములుగా మొత్తము 21 దోషములను పేర్కొనెను— 1. మొదటి వర్గము- నేయార్థము, క్లిష్టత, అన్యార్థము, అవాచకము, అయుక్తిమంతము, గూఢశబ్దాభిధానము; 2. రెండవవర్గము- శ్రుతిదుష్టత,



అర్థదుష్టత, కల్పనాదుష్టత, శ్రుతికష్టత. ఇంతవరకును చెప్పబడిన షడి దోషములను సామాన్య దోషములు. ఇవి గుణములుగా పరిగణింపబడు సందర్భములనుకూడ భామహుడచ్చటనే పేర్కొనెను. ఇవి అన్నియును ప్రథమ పరిచ్ఛేదాంతమున వివరింపబడినవి. 3. మూడవ వర్గము- ఇంక చతుర్థ పరిచ్ఛేదము ప్రత్యేకముగా దోషప్రకరణము. ఇందు మరి పది విశేషదోషములు వివరింపబడెను. పంచమ పరిచ్ఛేదమునందు పదునొకండవ దోషము-ప్రతిజ్ఞాహేతుదృష్టాంతహీనత్వము— విపులముగా వివరింపబడెను. వీటినే కాక 'ఉపమాదోషములు' ఇంకొక ఏడింటినికూడ ద్వితీయ పరిచ్ఛేదమందు పేర్కొనెను. అట్లే ప్రథమ పరిచ్ఛేదమందు 'వైదర్భరచన' సందర్భమున కూడ కొన్ని దోషములను పేర్కొనెను. అర్వాచీనాలంకారికులు పెక్కు రసదోషములను కూడ వివరించియున్నారు.

సంస్కృత సాహిత్య విమర్శలో దోషముల చరిత్రయందు కొన్ని ఘట్టములను క్రింది విధముగా గుర్తించవచ్చును— భరతుడును, వామనుడును దోషములను గుణవిపర్యయములుగాను, గుణములను దోషవిపర్యయములుగాను నిర్వచించియున్నారు. ఆనందవర్ధనుడు దోషములను కావ్యాత్మ అయిన రసమునకు కూడ అన్వయించెను. ఆనందవర్ధనుని తరువాతి కాలములో రసదోషములును, సంఘటనా దోషములును విపులముగా వివరింపబడెను. దోషము లొక్కొక్కప్పుడు గుణములగునని భామహుడు కావ్యాలంకార ప్రథమపరిచ్ఛేదమందు పేర్కొనెను; దండియును ఈ భావమునే విపులీకరించెను. ఇట్టి దోషములను ఆనందవర్ధనుడు 'అనిత్యదోషము' లనెను. భోజుడు వీటిని వైశేషిక దోషములనెను. ఇట్లు దోషములు సహృదయోద్వేజకములుగా పరిగణింపబడినవి. వామనుడు ప్రప్రథమముగా శబ్ద-అర్థ-పద-వాక్యదోషములనెడి విభాగ మొనర్చెను. రుద్రటుడు ప్రప్రథమముముగా 'విరస' మనెడి రస దోషమును పేర్కొనెను. మహిమభట్టు 'అనౌచిత్యమే దోషము' అని నిర్వచించి అవిమృష్ట విధేయము, ప్రక్రమభంగము, క్రమభంగము, అవాచ్యవచనము అనెడు దోషముల నధికముగా వివరించెను. భోజుడింకను కొన్ని దోషములను అధికముగా వివరించి, ప్రబంధదోషమనెడి క్రొత్తదోషమును సృష్టించెను. రసదోషములను క్రోడీకరించిన ప్రథముడు మమ్మటుడు. భామహాదులు ఉపమాదోషములను పేర్కొనగా మమ్మటుడు ఇతర అలంకార దోషములనుకూడ వివరించెను. ఇంకను వివరములకు డా. రాఘవన్ గారి "The History of Doṣas" అను వ్యాసమును చూడవలెను. ["భోజుని శృంగారప్రకాశము"- పుటలు 216-257.]

## 4. గుణములు

గుణదృష్టితో సాహిత్యమును మెచ్చుకొనుట ప్రాచీనకాలమునుండియు కలదు. 'అతడు మధురముగా పాడుచున్నాడు'; 'ఆ కావ్యము మధురభావపూరితము' మొదలగు వాక్యము లిందులకు సామాన్యములైన ఉదాహరణములు. కుశలవుల రామాయణ గానమును విని 'పాఠ్యే గేయే చ మధురమ్' అని ఋషు లనుకొనిరట! దీనినిబట్టి మధురత లేదా 'మాధుర్యము' అనెడిది గుణముగా అతి ప్రాచీనమైన కాలమందే గుర్తింపబడినదన్నమాట.

గుణములను కూడ ఆలంకారికముగా వివరించి చెప్పిన ప్రథముడు భరతుడే. నాట్య శాస్త్రమందు దోషచర్చ ముగిసిన తరువాత గుణచర్చ ప్రారంభమైనది. ప్రారంభములో 'దోషముల విపర్యయములే గుణములు' అని భరతుడు పేర్కొనెను. కాని భరతుడు వివరించిన దశ కావ్యగుణములును, ఆతడే వివరించిన దశదోషములకును విపర్యయములని చెప్పుటకు వీలులేదు. దోషవిపర్యయము లేదా దోషాభావము 'గుణ' మగుట సామాన్య లక్షణము మాత్రమే. కావున భరతుడు చెప్పిన దశగుణములును విశిష్టములును, స్వతంత్రములును అనుట స్పష్టము. వీటినే కాక మాధుర్య-ఔదార్యములను ప్రత్యేకముగా కావ్య మంతటికిని చెందిన గుణములనుగా భరతుడు సూచించుటగమనార్హము. "మాధుర్య మనగా శ్రుతిసుఖత్వము లేదా శ్రావ్యత— ఇది శబ్దమునకు సంబంధించిన గుణము, ఔదార్యమనగా దీప్తరసత్వము— ఇది అర్థమునకు సంబంధించిన గుణము" అని అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను. ఇట్లీ రెండును ఏ కావ్యమునకైనను ఆవశ్యకధర్మములే.

తరువాత భామహుడు మాధుర్య - ప్రసాద - ఓజస్సులను మూడింటిని మాత్రమే చెప్పెను. అనగా భరతుని తరువాత గుణముల సంఖ్యను పరిమితముచేసిన మరియొక మతము బయలుదేరినదన్నమాట. భామహుడీ మతమును అనుసరింపగా, దండి మరల పూర్వుల మార్గమునే అనుసరించి దశగుణములను నిరూపించెను. అటుపిమ్మట రీతిమతమువాడైన వామనుడు ఆ రీతులకు మూలములగు గుణములను గూర్చి విపులమగు చర్చ చేసి ప్రతి గుణమునందును శబ్ద-అర్థ భేదములను పేర్కొనెను. ఇట్లు వామనుని చేతిలో గుణములు ఇరువది అయినవి. తరువాత ఆనందవర్ధనుడు మరల గుణత్రయమునే ఆదరించి, వాటిని రసధర్మములనుగా నిరూపించెను. ఆనందవర్ధనాదుల మతములో తక్కిన గుణము లన్నియును ఈ మూటియందే అంతర్భవించును. అప్పటినుండియే గుణత్రయ సిద్ధాంతము బహుజన సమ్మతమైనదని చెప్పవచ్చును. సామాజికుని చిత్తమందు కలుగు ద్రుతి-దీప్తి-వికాసము లనెడి ధర్మములనుబట్టి క్రమముగా మాధుర్య-ఓజః-ప్రసాదములనే జగన్నాథుడు ఆదరించెను.

వామనుని దృష్టిలో కావ్యము చిత్రమువంటిది. చిత్రమునకు మూలాధారములైన రేఖ లెటువంటివో కావ్యమునకు గుణములటువంటివి. ఇంక రంగులు చిత్రమునకెట్లు శోభాతిశయహేతువులో అలంకారములు కావ్యమునకట్లే శోభాతిశయహేతువులు.

కావ్యమునకు ఆత్మ రసధ్వనికదా! ఆ రసధర్మములే గుణములని ఆనందవర్ధనుని మతము. ఈ విషయము ధ్వన్యాలోకమందు క్రిందివిధముగా వివరింపబడినది— "శౌర్యాదిగుణము లాత్మనిష్ఠములగుటయు, కటకకుండలహారాదు లవయవముల నాశ్రయించి యుండుటయు లోకప్రసిద్ధమేకదా! అట్లే రసాదిరూపమగు నర్థము అంగి (ఆత్మ) యగునపుడు దాని నవలంబించి యుండునవియే గుణములు. వాచ్య వాచకరూపము లగు నంగముల నాశ్రయించి యుండునవియే యలంకారములు ననుట యుక్తియుక్తము. (పుట. 198)...గుణములు శబ్దధర్మము (సంఘటనాశ్రయము) లనుట యౌపచారికము మాత్రమే (పుట 350) ..... విప్రలంభశృంగార కరుణముల విషయమున మాధుర్య ప్రసాదము లధికముగా నుండవలయును. రౌద్రమువిషయమున నోజస్సును నట్లే, తదితర రసభావాది విషయమున మాధుర్య ప్రసాదములును నియమితములు. కావున



గుణముల స్వరూపము స్వవిషయము ననుసరించి నియతమే కాని వ్యభిచరింపదు. శృంగారమున నోజస్సుకాని, రౌద్రమున మాధుర్యముకాని పొడసూపదు. కాని, సంఘటనము (శబ్దములకూర్పు) మాత్ర మనియతము (పుట 353)....శృంగారమునయందు దీర్ఘసమాసము లగు సంఘటనలు, రౌద్రాదులందుగూడ సమాసశూన్యములగు సంఘటనలును కన్పట్టు చున్నవి. కావున గుణములు సంఘటనాధర్మములు కావు. అంగియగు రసాదిరూపమగు నర్థధర్మములు మాత్రమే (పుట 358.)" [శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారి ఆంధ్ర ధ్వన్యాలోకము.]

నాట్యశాస్త్రమందు శ్లేష, సమత, సమాధి, ఓజస్సు, అర్థవ్యక్తి, ఉదారత అను గుణములకు రెండేసి నిర్వచనములు కలవు. లక్షణముల విషయమున అభినవగుప్తుడు రెండవ పాఠమును గుర్తించియుండెను. కాని, గుణముల విషయమున ఆతడు రెండవ పాఠము యొక్క ఉనికిని గుర్తించినట్లే కన్పట్టదు. మరియు అభినవగుప్తుడు వామనమతానుసారియై ప్రతిగుణము నందును శబ్ద-అర్థ భేదములను నిరూపించుటకు ప్రయత్నించెను. ఇచ్చట ఇంకొక విషయమును గ్రహించవలసియున్నది— భరత - దండి - వామనాదులు దశగుణములనే చెప్పి నప్పటికిని నిర్వచనములందు వారు పరస్పరము భేదించుచున్నారు.

5. పాశ్చాత్య సాహిత్యవిమర్శ : అలంకారములు (Figures of Speech)

పాశ్చాత్యులు కూడ కావ్యమందు అలంకారముల ప్రాముఖ్యమును గుర్తించి ఉన్నారు—

"The practical value of figures of speech may be stated as follows:—they aid the understanding by verifying and illustrating our theme; they stir the emotions by touching the reader with our own mood and feeling; by saying more in a given space, they secure brevity and vigour; by their freshness and picturesqueness, they give pleasure and beauty and elevation to style." [Rhetoric Notes - P. 12]

పాశ్చాత్యుల అలంకారములు కొన్ని క్రింది విధముగా వర్గీకరింపబడినవి. [Rhetoric Notes - Pp. 12-13] రుయ్యకుని అలంకార వర్గీకరణమును మనము గుర్తించి ఉన్నాము. దానితో దీనిని పోల్చిచూడవలెను—

1. According to Origin and Function :
   (1) Based on Intellect and having illustrative value—
      (a) Resemblance—Simile (ఉపమ), Metaphor (రూపకము), Allegory.
      (b) Difference—Antithesis, Epigram.
      (c) Association—Metonymy, Synecdoche.
   (2) Based on Imagination and having emotional value—Apostrophe, Personification, Vision (భావికము), Pathetic fallacy, Hyperbole (అతిశయోక్తి).

(3) Based on Reserve in statement and having suggestive value—Innuendo, Irony (వ్యాజస్తుతి), Euphemism, Allusion (దృష్టాంతము).

2. According to Form - Some device arresting attention :

(1) Deviation from normal structure—Exclamation, Transferred Epithet, Climax (సారము), Anti-climax or Bathos.

(2) Deviation in the meaning of words: Using words in meaning other than literal—Metaphor, Synecdoche, Oxymoron, Litotes, Irony.

(3) Special use of words for sound—Onomatopeia, Alliteration (యమకము), Assonance, Rhyme (అంత్యానుప్రాస).

పై వాటిలో Simile, Metaphor, Allegory, Metonymy, Senecdoche, Epigram, Irony, Innuendo, Hyperbole, Climax అను పది అలంకారములును ముఖ్యములు.

6. సంస్కృత సాహిత్యవిమర్శ

సంస్కృత సాహిత్య విమర్శనమునకు అలంకారశాస్త్రమను పేరుకలదని గుర్తించినాము. ఇది ఒక అనుపమనిధి అను సత్యము వేత్తలకు మాత్రమే సువిదితము. కాని, తత్పరిచయము లేనివారికి 'అలంకారశాస్త్ర' మనగా అనుప్రాస - యమక - ఉపమా - రూపకాది శబ్దార్థాలంకారములను గూర్చిన వివరణము అనెడి అభిప్రాయము మాత్రమే కలుగుచుండును. బహుశః ఈ భావముతోనే వారు పాశ్చాత్య విమర్శగ్రంథములను అభిమానించుటయును, భారతీయాలంకారశాస్త్ర గ్రంథములను పరిహసించుటయును చేయుచుందురు. అలంకారశాస్త్రమును గూర్చిన పై ఊహ సత్యదూరమనుటకెట్టి సంశయమును లేదు. ఓపికతోకాని, అభిమానముతోకాని అలంకార శాస్త్రగ్రంథములందు చర్చింపబడిన విషయములను ఒకసారి పరిశీలించినచో అవి కేవలము బాహ్యస్వరూపమును చర్చించునవి మాత్రమే కావనియు, కావ్యమునకు ప్రధానములైన అంతస్తత్వములను వైజ్ఞానిక దృష్టితో తార్కికముగా వివేచనము చేయు శాస్త్రగ్రంథములనియు బోధపడగలదు.

అలంకారశాస్త్రప్రమేయము: అలంకార శాస్త్ర ప్రమేయమును (అలంకారశాస్త్రములందు చర్చింపబడిన అంశములను) క్రింద పేర్కొనుచున్నాను—

అలంకారశాస్త్ర ప్రథమకర్తవ్యము కావ్యప్రయోజనములను వివరించుట. పిమ్మట కావ్యహేతువును గూర్చిన చర్చ. తరువాత కావ్యమును నిర్వచించు ప్రయత్నము; ఇందు శబ్దమునకో, అర్థమునకో ప్రాధాన్య మొసగినపిమ్మట కావ్యమునకు అత్మ ఏమో నిర్దేశింపబడును. కావ్యాత్మ విషయములో చాల మతభేదములు కలవు. శబ్దార్థములు రెండును కావ్యాంగములే కాన శబ్దశక్తులు, శబ్దార్థముల సంబంధము నిరూపింపబడును. ఈ ప్రసంగమునందే అభిధాది శబ్దశక్తులు, వాటిభేదములు, వాచ్యాది అర్థములు, వ్యంగ్యభేదములు నిరూపింపబడును. తరువాత కావ్యభేదములను గూర్చిన చర్చ—బాహ్యస్వరూపమునుబట్టి గద్య - పద్య - మిశ్రాది భేదములు; భాషనుబట్టి సంస్కృత - ప్రాకృతాదులు; ధ్వనినిబట్టి ఉత్తమ - మధ్యమ - అధమములు; ప్రదర్శనాది భేదములనుబట్టి దృశ్య - శ్రవ్య



భేదములు మొదలగునవి. దృశ్య విభజనము విశాలమైన రూపక చర్చకు దారితీయుచున్నది. ఏ కావ్యమైనను గుణసహితముగా ఉండవలయును కాన ఆ కావ్యగుణములు, ఆగుణములచే ఏర్పడురీతులు తరువాత చర్చింపబడును. కావ్యములు దోషరహితములుగా ఉండవలయును కాన పిమ్మట పద - వాక్య - అర్థాదిదోషములు నిరూపింపబడును. చిట్టచివర కావ్యము నలంకరించెడి శబ్ద - అర్థ - మిశ్రాలంకారములు వివరింపబడును. కొన్ని గ్రంథములు కవి శిక్షాదులను గూర్చి వివరించుటయే కాక అలంకారశాస్త్రమునకు సంబంధించిన పెక్కు ఇతర విషయములను (ఉదా: భూగోళజ్ఞానము మొ॥) కూడ వివరించినవి. కావ్యజీవితము 'రసమే' అనువారు ప్రారంభమునందు ప్రత్యేకముగాను, కేవలము రూపకచర్చ చేయువారు దాని కన్వయించియు, ధ్వని వాదులు రసధ్వనినిగూర్చి చర్చించునప్పుడును సమగ్ర "రస" చర్చ చేయుదురు. రస చర్చకంటె ముందుగా వివిధ నాయకులను, నాయికలను గూర్చిన విపుల వివరణము ఉండును. అంతేకాక ఆ యా సందర్భములందు కావ్య - శాస్త్ర తారతమ్యము, కవిలక్షణము, వాని సామగ్రి, కావ్య సౌందర్య నిర్ణయము, "ఆనంద" స్వరూపము, కావ్యానందమునకు అధికారి అగు సహృదయుని లక్షణము మొదలగు పెక్కు విషయములు సూక్ష్మాతిసూక్ష్మముగా వివేచింపబడుచుండును. ఇచ్చట ఒక విషయమును గుర్తించవలెను— ఈ సర్వవిషయములు అన్ని గ్రంథములందును సంపూర్ణముగా వివరింపబడలేదని మాత్రము గుర్తించవలసి ఉన్నది. ఆయా గ్రంథకర్తలు తమ తమ అభిరుచినిబట్టి కొన్ని అంశములనుకాని, పెక్కు అంశములను కాని వివరించుచు వచ్చిరి. అంతియేకాక పైక్రమముకూడ భేదించుచుండును.

అలంకారశాస్త్రమందు చర్చనీయాంశములైన పై విషయములను పాశ్చాత్య విమర్శ గ్రంథములతో పోల్చిచూచినచో అలంకారశాస్త్రము కేవలము "అలంకారము" లను గూర్చి చర్చించునది మాత్రమే కాదనియు, అది కావ్యతత్త్వ వివేచనమునకు సంబంధించిన సమగ్రశాస్త్రమగుటయే కాక పాశ్చాత్య విమర్శ గ్రంథములకంటె ఎంతో గంభీరమైనదనియు, ఎంతో అభివృద్ధిని పొందినదనియు బోధపడగలదు. కావ్యమునకు ఆత్మభూతమైనది రసము. ఆ రసముయొక్క సాంగోపాంగ వివేచనమే అలంకార శాస్త్రోద్దేశము. అలంకారశాస్త్రమనగా "రస శాస్త్రము" లేదా "సౌందర్య శాస్త్రము" అని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ శాస్త్రానుశీలన-మననములు రెండువేల సంవత్సరములనుండి భారతదేశమున జరుగుచు వచ్చినవి.

మొగట పేర్కొన్నట్లు అలంకార శాస్త్రము అపరిచితులకు అపోహను కలిగించుచుండుటయేకాక భయమునుకూడ కలిగించుచుండును. తక్కిన భారతీయ శాస్త్రములవలె అలంకార శాస్త్రముకూడ తర్కవాదముతో నిండిఉండుట, భాష సంస్కృతమగుట— ఈ రెండును ఈ భయమునకు కారణములు. ప్రథమ భయకారణమునుగూర్చి శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారీ క్రిందివిధముగా పేర్కొని యున్నారు— "పూర్వాచార్యులు తమ సిద్ధాంత స్థాపనమునకుఁ దర్క సాహాయ్య మపేక్షించిరి. కావుననే మన భారతీయ శాస్త్రములన్నియు దర్క న్యాయములను నినుప పునాదులమీఁద నిర్మింపఁబడిన వజ్రపు కోటలు. ప్రత్యల్ప విషయముకూడ హేతుబద్ధమై, సామాన్య బుద్ధులకు గహనమై,

దుర్భేదమై యుండును. దేని కేని లక్షణము సెప్పవలయునన్నచో నవ్యాప్తి, అతివ్యాప్తి, అసంభవాది దోషరహితముగా నుండవలెను. అట్టి నిర్వచనము తార్కికునకే సాధ్యమగును. తర్కవాసన గిట్టనివారికిని, అది లేనివారికిని నీ శాస్త్రము తలదిమ్ము కలిగించును"—కాని సహృదయముతో సమ్యక్పరిశీలనము చేసినవారి కిది బుద్ధివికాసమును, ఆశ్చర్యమును, ఆత్మానందమును కలిగించుననుట నిస్సందేహము. పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతగ్రంథము లిట్లు తర్కయుక్తి పరిష్కృతములు కావని చెప్పుటలో అతిశయోక్తి లేదు. వాని కలవాటు పడిన మన కిది నూత్నముగా గోచరింపవచ్చునుకాని బాధాజనకము మాత్రము కాదు. ఆదిలో పాశ్చాత్య విమర్శకులే సంస్కృతమున శ్రద్ధతో చదివికొని ఉత్తమవిమర్శలను, అనువాదములను ప్రకటించియున్నారు. పిమ్మట శ్రీ యమ్. ఆర్. కవి, శ్రీ పి. వి. కాణే, శ్రీ ఎస్. కె. డే, డా. వి. రాఘవన్ మొదలగు భారతీయులు అలంకార శాస్త్రమును గూర్చి దీర్ఘ పరిశోధనలు చేసి ఆంగ్లమున గ్రంథములు రచించి ఉన్నారు. అలంకార శాస్త్ర గ్రంథములను, అందుపై వచ్చిన వివిధాంగ్ల విమర్శలను హిందీ భాషలోని కనువ దించి సులభగ్రాహ్యము చేయుటకై హిందీ విమర్శకులు పూనుకొని, సాధించుచున్నారు. అంతేకాక ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంత సమన్వయమునకై వారు ప్రయత్నించుచు "తులనాత్మకము"లైన విమర్శలు వెలయించుచున్నారు. తెలుగులో ఈ రెండు విధములైన ప్రయత్నములు ఏకత్ర చేసినవారిలో ముఖ్యముగా శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారిని పేర్కొనవచ్చును.

*శాస్త్ర నామము :* ఇంతకును "అలంకార" పదమే పై అపోహకు కారణమని చెప్పవచ్చును. భామహాది ప్రాచీనాలంకారికులు తమ గ్రంథములను "అలంకార" పదముతో వ్యవహరించి ఉన్నారు— భామహుని "కావ్యాలంకారము", ఉద్భటుని "కావ్యాలంకార సార సంగ్రహము", వామనుని "కావ్యాలంకార సూత్రము", రుద్రటుని "కావ్యాలంకారము" మొ॥ అందులకు కారణము వారి గ్రంథములం దలంకారములకు ఎక్కువ ప్రాధాన్యము ఉండుటయే. ప్రాధాన్యమునుబట్టియే పేరేర్పడుచుండుట సహజము. (ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి). తమ గ్రంథములకు "అలంకార" నామము పెట్టక పోయినను దండి మొదలగువారు కూడ తమ గ్రంథములందు నాల్గింట మూడువంతులు అలంకారములను గూర్చియే చర్చించి ఉన్నారు. ఆదిలో ఇట్లు అలంకారములు ప్రాధాన్య మును వహించుటచే ఈ శాస్త్రమునకు "అలంకారశాస్త్ర" మనియు, తత్కర్తలకు "ఆలంకారికు"లనియు వ్యవహారము వ్యాప్తమైనది.

పై విమర్శకులందరును తమ గ్రంథనామములకు మొదట "కావ్య" పదమును చేర్చుకొని ఉండుట గమనార్హము. ఈ "అలంకార" పదమునకు రెండర్థము లున్నవి.— "కావ్యం గ్రాహ్య మలంకారాత్"; "సౌందర్య మలంకారః" అనెడు నిర్వచనములను బట్టి అలంకారమనగా "సౌందర్య" మనియు (వ్యవహారమునందును ఇంచుమించు ఇదే అర్థము), సౌందర్య మున్నపుడే కావ్యము గ్రాహ్యమనియు, కావ్యాలంకార మనగా కావ్యమునకు సౌందర్యాపాదకములైన ధర్మములను (Poetic beauty in general) నిర్దేశించు. శాస్త్ర



మనియు అర్థము. ఇంక రెండవ అర్థము ఉపమాది అలంకారములనియే. ఈ ఉపమా ద్యలంకారములవలన కావ్య మలంకరింపబడును (అలంక్రియతే అనేన ఇతి.)

అలంకార శాస్త్రమునకు "సాహిత్య శాస్త్ర" మని ఇంకొక పేరు కలదు. దీనినే రాజశేఖరుడు కావ్యమీమాంసయందు "సాహిత్యవిద్య" (పంచమీ సాహిత్యవిద్యా ఇతి యాయావరీయః) అని వ్యవహరించెను. అట్లే "సాహిత్యదర్శన" మనియు అందురు. "సహితము" యొక్క భావమే సాహిత్యము. "శబ్దార్థముల సాహిత్యమే కావ్యము" (శబ్దార్థౌ సహితౌ కావ్యం —భామహుడు) అనెడి నిర్వచనమునుబట్టి శబ్దార్థ సహితమగు కావ్యమునుగూర్చి చర్చించు ఈ శాస్త్రమునకు "సాహిత్యశాస్త్ర" మను పేరు వచ్చియుండు నని విమర్శకుల నిర్ణయము. ఇందులకు రాజశేఖరుని "శబ్దార్థములను ఉన్నవానిని ఉన్నట్టులుగ సహభావముతో ప్రవర్తిల్ల జేయునట్టి విద్య కావుననే ఇయ్యది సాహిత్యవిద్య అనబడినది." (శబ్దార్థయో ర్యథావత్సహభావేన విద్యా సాహిత్యవిద్యా) అనెడి నిరుక్తిబలము నొసగు చున్నది. ఇంక కావ్య-సాహిత్య శబ్దములు రెండును పర్యాయపదము లనియే చెప్పవచ్చును. (కావుననే హిందీ విమర్శకులు "Poetics" ను "కావ్యశాస్త్ర" మని అనువదించి ఉన్నారు.) మమ్మటుడు తన గ్రంథమును "కావ్యప్రకాశ" మనగా విశ్వనాథుడు "సాహిత్య దర్పణ" మని తన గ్రంథమునకు పేరిడుట గమనార్హము. సారాంశ మేమనగా ఈ వాఙ్మ యమును అలంకార శాస్త్రమని పిలుచుటకంటె "సాహిత్యశాస్త్ర" మనుటయే ఉచితము. క్రీ. శ. 900 (రాజశేఖరునకు) ముందే "సాహిత్య శాస్త్రము" అను పేరు వ్యవహారములోనికి వచ్చి ఉండునని శ్రీ పి. వి. కాణే నిర్ణయించెను. (Introduction to Sahityadarpana— P. 329.) అంతేకాక "భారతీయసాహిత్యశాస్త్ర"మందు శ్రీ బలదేవ్ ఉపాధ్యాయ పేర్కొన్నట్లు "సౌందర్యశాస్త్రము" (Aesthetic అను అర్థమందు) అనియు, "రసశాస్త్ర" మనియు చెప్పవచ్చును. "Literary Criticism" అను అర్థమునందు "సాహిత్యాలోచనము" లేదా "సాహిత్య సమీక్ష" అనియు, "సమీక్షాశాస్త్ర" మనియు పేర్కొనవచ్చును.

*సాహిత్యశాస్త్ర దశలు :* సాహిత్యశాస్త్రరచన ఎప్పుడు ప్రారంభమైనదో స్పష్టముగా నిర్ణయించి చెప్పుట చాల కష్టము. ఋగ్వేదమునందు ఉపమాద్యలంకారములు బహుళముగా ఉన్నట్లు Prof. H. D. Velankar [J. B. B. R. A. S.—Vol. 14-pp 1-47 and Vol. 16-pp 1-42] మొదలగు విమర్శకులు నిరూపించి ఉన్నారు. ఆలక్ష్యములకు లక్షణము (అలంకార శాస్త్రము) ఎప్పుడు జనించినదో తెలియదు. ఋగ్వేద కాలమునుండి క్రీస్తు శకము వరకును గల మధ్యకాలములో ఈ శాస్త్రాభివృద్ధి - వికాసములను నిర్ణయించుటకు విమర్శకులు ప్రయత్నించియున్నారు. ఆ ప్రయత్నము లెట్లున్నను, మనకు లభ్యమైన ప్రథమాలంకారిక గ్రంథము భరతుని "నాట్య శాస్త్రము" ఇది క్రీస్తుశక ప్రాంతమున రచింపబడినదని అంగీకరించినచో అప్పటినుండి పందొమ్మిదవ శతాబ్దివరకును రూపక-రస-భావ-అలంకార-గుణ-రీతి-వృత్తి-పాక-శయ్యా-ధ్వని-వక్రోక్తి-అనుమితి-ఔచిత్య-కవి శిక్షాది వివిధ కావ్య-నాట్య విషయములనుగూర్చి ఆలంకారికులు రచించిన సాహిత్య శాస్త్ర గ్రంథములును, తద్విమర్శలును కలిసి సుమారు "వేయి" ఉండునని శ్రీ పి. వి. కాణే [Introduction to Sahityadarpana - pp. 377-423—ఈ పుటలయందు తెలిపియున్నారు.

అకారాదిగా ఏతద్గ్రంథములపేర్లును, వానిని గూర్చిన లఘు వివరములును కలవు]. వీటిలో ముద్రణ భాగ్యమును పొందినవి (వ్యాఖ్యలు కాక) ఇంచుమించు ఒక వంద ఉండును. వీటిలో పఠన-పాఠన వ్యవహారమునందున్నవి సుమారు ఒక నలుబది ఉండును. ఇందులో రూపకవిమర్శ కుద్దేశింపబడిన గ్రంథముల వివరము లింతకుముందే పేర్కొనబడినవి కదా].

అజ్ఞాతకాలమునుండి 19 వ శతాబ్దివరకును గల కాలములో సాహిత్య శాస్త్ర వికాసమును డా. యస్. కే. డే నాలుగు యుగములుగా విభజించినారు. [History of Sanskrit Poeties-Vol. I-pp. 336-337]

1. ప్రారంభ కాలము— అజ్ఞాత కాలమునుండి భామహుని వరకును. ఈ కాల మున తెలిసినవా డొక్క భరతుడు మాత్రమే.

2. రచనాత్మక కాలము (600-850)—భామహునినుండి ఆనందవర్ధనుని వరకును—

(అ) భామహ-ఉద్భట-రుద్రటులు— "అలంకార" సంప్రదాయము.

(ఆ) దండి-వామనులు—"రీతి" సంప్రదాయము.

(ఇ) ఆనందవర్ధనుడు—"ధ్వని" సంప్రదాయము.

3. నిర్ణయాత్మక కాలము (850-1050)—ఆనందవర్ధనునినుండి మమ్మటుని వరకును—

అభినవగుప్తుడు, కుంతకుడు, మహిమభట్టు, ధనంజయుడు, భోజరాజు మొ॥

4. వ్యాఖ్యానాత్మక కాలము (1050-1750)—మమ్మటుని మొదలు జగన్నాథుని వరకును—

(అ) మమ్మట-రుయ్యక-విశ్వనాథ-హేమచంద్ర - విద్యాధర-విద్యానాథ - జయదేవ-అప్పయ్య దీక్షితులు (ధ్వని వాదులు)

(ఆ) శారదాతనయ-సింగభూపాల-భానుదత్త-రూపగోస్వాములు (రసవాదులు)

(ఇ) రాజశేఖర-క్షేమేంద్రులు (కవి శిక్ష)

(ఈ) జగన్నాథుడు (రసధ్వని)

## 7. సాహిత్యశాస్త్ర సంప్రదాయములు

సంస్కృత భాషయందు సుమారు వేయి సాహిత్యశాస్త్ర గ్రంథము లున్నట్లు గుర్తించితిమి. సంస్కృతమందే కాదు, మరి ఏ ఇతర భాషయందైనను పెక్కు గ్రంథ ములు (ఒకే శాస్త్రమునకు సంబంధించినవి) బయలుదేరుటకు కారణమేమను ప్రశ్నకు సమాధానమును అరయవలసి ఉన్నది. భరతుడు నాట్యశాస్త్రమందు ప్రధానముగా "రూపక చర్చ" చేసినను, ఆ చర్చ అంతయును "రస" మును కేంద్రీకరించుకొని ఉన్నది. అనగా, కావ్య - నాట్యములందు "రసము" ప్రధానమని సారాంశము. ఈ ప్రాధాన్యమును పురస్కరించుకొనియే రసము కావ్యమునకు "జీవిత" మనియు, కావ్యమునకు "ఆత్మ" అనియు పేర్కొందురు. అనగా భరత మతములో కావ్యాత్మ "రసము". ప్రాసంగికముగా, సంక్షిప్తరూపమున, అలంకార - గుణ - దోషములనుకూడ



భరతుడు నాట్యశాస్త్రమందు చర్చించియుండెను. కావున భరతమతములో వీటికి ప్రాధాన్యములేదు. ఈ సంప్రదాయము తరువాతి వారికి నచ్చలేదు. నాట్యమున వాటికి ప్రాధాన్యము లేకపోవచ్చును; కాని, కావ్యమునందు వానికే ప్రాధాన్యము కలదని నిర్దేశించుచు తరువాతి ఆలంకారికులు అలంకారాదులను విస్తరించుటకు పూనుకొనినారు. అట్లు బయలుదేరినదే "అలంకార సంప్రదాయము". దీనికి మూలపురుషుడు భామహుడు. వీనిని కొంద రనుసరించిరి. ఇదియును కొందరకు నచ్చలేదు. "గుణము", లేదా "రీతి" ప్రధానమని వారి (దండి, వామనుల) అభిప్రాయము. వీరందరును రసమును పూర్తిగా విస్మరించినట్లే. అటుపిమ్మట రసము నంగీకరించిన "ధ్వని" సంప్రదాయము ప్రారంభమైనది. దీనిని ప్రతిష్ఠించి, పోషించినవారు ఆనందవర్ధన - అభినవగుప్తులు. వెంటనే ధ్వనిధ్వంసక మతములు బయలుదేరినవి. రసము అంగీకార్యమే; ధ్వనికి మాత్రమే ఇవి వ్యతిరేకము— "అనుమితి" మొ. కాని ఈ మతములకు అనుయాయులు లేకపోవుటచే ఇవి నామమాత్రావ శిష్టములైనవి. తరువాతివారందరును "ధ్వని మతమును" శిరసావహించి "రసధ్వని"ని కావ్యాత్మగా అంగీకరించిరి. ఈ రస - ధ్వనులకు మెరుగుపెట్టినది "ఔచిత్యము". ఈ మతములకు సాహిత్య సంప్రదాయము లనియు, సాహిత్య ప్రస్థానములనియు పేర్లు కలవు. ఆంగ్లమున వీనిని స్థూలముగా "Schools" అందురు. (నేను "సంప్రదాయ" పదమును వాడుచున్నాను.) వీనిని, కాలక్రమములో, సంగ్రహముగా క్రింద వివరించుచున్నాను—

1. *రస సంప్రదాయము :* దీనిని గూర్చి 6 వ అధ్యాయము చివర విశేషాంశము లందు సమగ్రముగా వివరించి ఉన్నాను.

2. *అలంకార సంప్రదాయము :* దీనినిగూర్చి ఈ అధ్యాయము చివర 2 వ విశేషాం శమునందు వివరించితిని.

3. *గుణ సంప్రదాయము :* దీనినిగూర్చి ఈ అధ్యాయము చివర 4 వ విశేషాం శమునందు కొంత వివరించితిని. గుణములను వివరించిన ప్రథముడు భరతుడే అయినను దానికి ఒక సంప్రదాయస్థితిని కల్పించినవాడు దండి. భామహుని దృష్టిలో అలంకారములు కావ్యప్రాణము లైనట్లే దండి దృష్టిలో "గుణములు" సర్వముఖ్య మని చెప్పవచ్చును. గుణములను సవిస్తరముగా నిరూపించిన ప్రథము డితడు. వీని దృష్టిలో అలంకారములు బాహ్యసౌందర్య హేతువులనియు (కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే), గుణములు అంత స్సౌందర్య హేతువులనియు పేర్కొనవచ్చును. ఈతడు దశగుణములను (శ్లేషము, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత, ఓజస్సు, కాంతి, సమాధి) పేర్కొని ఇవి "వైదర్భీ" మార్గమునకు ప్రాణము లనియు, ప్రాయశః తద్విపర్యయమే "గౌడీ" మార్గమనియు నిర్దేశించెను. మార్గ-రీతి పద ములు పర్యాయపదములు. కాగా "మార్గ" ములను గూర్చిన చర్చ అధిక మగుటచేత దండ "రీతివాది" అని యస్. కే. డే ప్రభృతులును, గ్రంథమున నాల్గింట మూడు వంతులు అలంకార చర్చ ఉండుటచే దండి "అలంకార వాది" అని డా. రాఘవన్ ప్రభృతులును, ఈ రెండింటికిని చెందినవాడని శ్రీ పి. వి. కాణేయును పేర్కొనుచున్నారు. దండి "గుణ" వాది అని యంగీక రించినను మరికొందరు దీనిని ఒక సంప్రదాయముగా గణించుట లేదు. భోజుడు కూడ గుణ

ములయందు అధికాదరమును చూపించియున్నాడు. ఇతడు 24 గుణములను పేర్కొని అందు మరల అర్థ - శబ్ద భేదములను చూపించెను.

4. *రీతి సంప్రదాయము :* ఈ సంప్రదాయ స్థాపకుడు వామనుడు. భరతుడు, భామహుడు, దండి—ఈ ముగ్గురునుగూడ కావ్యాత్మను గూర్చిన విచారమును సూటిగా చేయలేదు. కావ్యాత్మను గూర్చి స్పష్టముగా నిర్దేశించిన ప్రథము డితడు. ఈతడు మార్గ పదమును వాడక "రీతి" పదము నుపయోగించి, ఆ రీతియే కావ్యాత్మ అనెను (రీతి రాత్మా కావ్యస్య). దండి వైదర్భీ - గౌడీ రీతుల కీతడు మూడవదియగు పాంచాలీరీతిని చేర్చెను. రీతి అనగా విశిష్ట పదరచన (ఆ విశిష్టత గుణములవలన కలుగును). ఆ యా దేశీయు లాశ్రయించిన విశిష్ట పదరచనకు (రీతికి) ఆ యా దేశనామము లేర్పడినవి (విదర్భ దేశీయు లాశ్రయించినది "వైదర్భి" మొ.). గుణ-అలంకారముల భేదమును స్పష్టముగా నిరూపించిన ప్రథముడు వామనుడు—"కావ్యమునకు శోభను కలిగించు ధర్మములు గుణములు, తదతిశయ హేతువులు అలంకారములు". ఇట్లు వామనుడు గుణముల కిచ్చిన ప్రాధాన్యమును బట్టి గుణసంప్రదాయమును, రీతిసంప్రదాయమును ఒకటే అనువారును కలరు. ఈతడును రసమును "కాంతి" అను గుణములో అంతర్భవింపజేసెనే కాని దాని ప్రాధాన్యమును గుర్తించలేదు. అట్లే "ధ్వని" ని కూడ వక్రోక్తిలో అంతర్భవింపజేసి ఊరకొనెను. పై మూడు రీతులకును రుద్రటుడు "లాటియా" రీతిని, భోజుడు "మాగధీ-ఆవంతీ" రీతులను చేర్చిరి. మొత్తము రీతు లారైనవి. శారదాతనయుడు 105 రీతులను పేర్కొని చివరకు నాల్గింటిని మాత్రమే అంగీకరించెను. కాని, రీతిత్రయ సిద్ధాంతమే బహుజన సమ్మతమైనది.

5. *ధ్వని సంప్రదాయము :* ఈ సంప్రదాయ స్థాపకు డానందవర్ధనుడు. రూపకతత్త్వమును ప్రదర్శించినఖ్యాతి భరతునకు చెందగా కావ్యతత్త్వమును ప్రదర్శించిన ఖ్యాతి ఆనందవర్ధనునకు దక్కినది. ఇంతవరకును "నాట్య రసములు"గానే ఉన్న రసములు ఇప్పటినుండి "కావ్యరసములు" కూడ అయినవి. "ధ్వని" విచారము ఆనందవర్ధనునకు పూర్వముకూడ లేకపోలేదు. కాని దానిని పూర్వపక్ష రహితముగా సిద్ధాంతించి, స్థాపించినవాడీతడే. "కావ్యమునకు ధ్వని ఆత్మ" అని వాని సిద్ధాంతము. శబ్దమునకు మూడు శక్తులున్నవి. మొదటిది (అభిధాశక్తి) వాచ్యార్థమును బోధించును. వాచ్యార్థము కుదురనప్పుడు రూఢినిబట్టి కాని, ప్రయోజనమునుబట్టి కాని వాచ్యార్థముతోనే సంబంధముగల వేరొక అర్థమును (లక్ష్యార్థము) బోధించునది రెండవశక్తి (లక్షణాశక్తి). ఇంక వాచ్యార్థము పొసగినపిమ్మట రమణీయమైన అర్థాంతరమును స్ఫురింపజేయునది మూడవశక్తి ; ఇదియే వ్యంజనాశక్తి. ఇది ఆనందవర్ధనుని సృష్టి. ఈ అర్థాంతరమునే "ప్రతీయమానార్థ" మనియు, "వ్యంగ్యార్థ" మనియు, "ధ్వని" అనియు పేర్కొందురు.

**యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ ।**
**వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వని రితిసూరిభిః కథితః ॥**

—"ఎందు శబ్దములుగాని, అర్థములుగాని, ఉపసర్జనీకృత (అప్రధానముగా జేయబడిన) స్వార్థములై ప్రతీయమానార్థమును అభివ్యక్తముచేయునో ఆ కావ్యవిశేషము ధ్వని అగునని పండితులు చెప్పుదురు" అని ఆనందవర్ధనుడు ధ్వనిని నిర్వచించెను.



ఇట్టి ధ్వని మూడు విధములు—వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని. (వీనిలో మరల భేదములు కలవు). వీనిలో రసధ్వని" ప్రధానము. అదియే నిజమునకు కావ్యాత్మ. వస్త్వలంకార ధ్వనులును తత్పర్యవసాయులే కావలయును. ఇట్లానందవర్ధనుడు భామహ, దండి, వామనులు స్పష్టముచేయలేకపోయిన వాచ్య-వ్యంగ్యభేదములను వివరించి (ఇవి రెండును భిన్నములైనను వ్యంగ్యమునకుగూడ వాచ్యమే మూలమను విషయమును గుర్తించవలసి ఉన్నది ; కావుననే వ్యంగ్యమును "వాచ్యసామర్థ్యాక్షిప్త" మని పేర్కొనినాడు), ధ్వని స్వరూపమును నిర్ణయించుటయేకాక మూలబడిన భరతుని "రస సిద్ధాంతము"నకు తిరిగి ప్రాణముపోసెను. అసలు ధ్వనిమతము రసమతమునకు భాష్యమనియు. తద్భిన్నము కాదనియు విజ్ఞుల ఆశయము. "రసము వాచ్యరూపముగా కాక వ్యంగ్యరూపముగా ఉండవలయు" ననుటయే ఆనందవర్ధనుడు ప్రతిపాదించిన విశేషములలో ప్రధానమైనది. నాట్యశాస్త్ర-ధ్వన్యాలోకములు రెండింటిని లోకోత్తరముగా వ్యాఖ్యానించిన అభినవగుప్తుడు ఈ "రసధ్వని"నే అభిమానించి అదొక్కటియే కావ్యాత్మ అనెను. అర్వాచీనులపై ఈ మతమే ప్రాబల్యము వహించినది. (ఈ ధ్వని సిద్ధాంతము వైయాకరణుల 'స్ఫోటవాదము'నకు రూపాంతరము.) పైని పేర్కొన్న త్రివిధములగు ధ్వని "అభిధామూలక" మైనది. ఇంక "లక్షణామూలక"మైన ధ్వని రెండు విధములు. ఇట్లు ధ్వని ప్రధానముగా పంచాత్మకమని జగన్నాథుడు పేర్కొనెను—




**మొత్తము 51 ప్రధానధ్వనిభేదములు కలవు. ఇవి మరల పెక్కు ప్రభేదములను కలిగి ఉన్నవి.**
**మమ్మటుడు చూపిన ధ్వని భేదముల మొత్తము 10,455.**

6. *వక్రోక్తి సంప్రదాయము :* ఈ సంప్రదాయస్థాపకుడు కుంతకుడు. అతడు తన గ్రంథమునకు "వక్రోక్తి జీవిత" మనియే పేరిడుకొనెను. వక్రోక్తి అనగా (వక్ర+ఉక్తి) సర్వసాధారణమైన ఉక్తికంటె భిన్నమును, అలౌకిక చమత్కారయుక్తమును అయిన ఉక్తి **(A certain striking or deviating expression).** అలంకారములకెల్ల వక్రోక్తియే జీవనాధాయకమని భామహుడు ప్రతిపాదించెను. వక్రోక్తి-స్వభావోక్తుల (ఈ రెండును పరస్పర విరుద్ధములు) రూపమున వాఙ్మయము ద్వివిధమని దండి పేర్కొనెను. ఇట్టి వక్రోక్తిని చేకొని కుంతకు డదియే కావ్యజీవితము (ఆత్మ) అని ప్రతిపాదించి స్వభావోక్తిని తిరస్కరించెను.

కుంతకుడు ధ్వనిమతమును ఎరుగకపోలేదు. ఎరిగియు ధ్వని ప్రపంచమునంతటిని ఈత డీ వక్రోక్తియందే అంతర్భవింపజేసి తన స్వతంత్ర కల్పనాశక్తిని వెలయించినాడు. "కవి వ్యాపారవక్రతయే వక్రోక్తి" అని కుంతకుని ఆశయము. దీనినే ఆతడు "వైదగ్ధ్యభంగీ ఫణితి" అనెను. ఈ వక్రోక్తి 6 విధములు— 1. వర్ణవిన్యాసవక్రత; 2. పదపూర్వార్ధ వక్రత, 3. ప్రత్యయవక్రత, 4. వాక్యవక్రత, 5. ప్రకరణవక్రత, 6. ప్రబంధవక్రత. వక్రోక్తి చమత్కారకారి అనుట అందరకును ఇష్టమే ; కాని అదే కావ్యజీవితమనుట కంగీకరింపరు. కావుననే ఈ సంప్రదాయమున కనుయాయులు లేరు. కుంతకుని తరువాత వక్రోక్తి కేవలము ఒక అలంకారముగా మాత్రమే నిలిచినది.

7. *అనుమితి సంప్రదాయము :* ఈ సంప్రదాయ స్థాపకుడు మహిమభట్టు. కావ్యాత్మ రసమనుటలో మహిమభట్టునకు విప్రతిపత్తిలేదు. ధ్వనికి మాత్రమే అతడు విరోధి. ఎల్లధ్వనులను "అనుమానము" నం దంతర్భవింప జేయుటకే తాను "వ్యక్తివివేకము" ను రచించుచున్నట్లు తెలుపుకొనినాడు. "నాట్యవిషయములను విస్తరించి చెప్పుట అసాధ్యము. కాన వాని సంగ్రహమును గ్రంథార్థబోధకములైన అల్పసూత్రములందు వివరింతును. అవి అల్పసూత్రములైనను అనుమాన ప్రసాధకములే (కింత్వల్పసూత్రగ్రంథార్థ మనుమానప్రసాధకమ్- నాట్యశాస్త్రము 6 వ అధ్యా–8 వ శ్లో.)" అనుచు భరతుడు "అనుమాన"పదము నుపయోగించుట గమనార్హము. ఆనందవర్ధనుడు ధ్వనికి మూడుశక్తులు ( అభిధా - లక్షణా వ్యంజనలు ) ఉన్నవనెను. మహిమభట్టు అభిధాశక్తిని మాత్రమే అంగీకరించి (లక్షణను అనుమానములోనే కలిపి వేసినాడు) ప్రతీయమానము లగుననెడి అర్థాంతరములన్నియును అభిధాశక్తి మూలముననే "అనుమానింపబడు" ననియు, అర్థముకాని, శబ్దముకాని వ్యంజకములు కాజాలవనియు, కావున "వ్యంజనాశక్తి" కల్పనము అనావశ్యకమనియు సిద్ధాంతించెను. ఈ అనుమానము కార్యకారణ భావము నాశ్రయించి ఉండుననియు, కాన ఉత్తమకావ్యములన్నియును కార్యకారణసుబద్ధములై ఉండవలయుననియు వాని నిర్దేశము. వాచ్యార్థమునుండి ఏ అర్థాంతర మనుమానింపబడునో అది "అనుమేయము". ఈ అనుమేయము (ఇచ్చటినుండి ధ్వని వివరణమును, ఇదియును ఒక్కటియే,) వస్త్వలంకార రసరూపమున త్రివిధముగా ఉండును. అందు వస్త్వలంకారములు వాచ్యరూపముగా కూడ ఉండును. రసముమాత్ర మెప్పుడును అనుమేయ రూపముననే ఉండును— ఈ సంప్రదాయమునకు కూడ అనుయాయులు లేరు. దీనికి వ్యాఖ్య వ్రాసిన రుయ్యకుడు కూడ ధ్వనిమతమునే ఆదరించి మూలకర్త మతమునెడ అనాదరముచూపెను. వ్యాఖ్యాన చరిత్రలో ఇది విచిత్రవిషయము.

8. *ఔచిత్య సంప్రదాయము :* ఈ సంప్రదాయ స్థాపకుడు క్షేమేంద్రుడు. రస సంప్రదాయమే సర్వోత్కృష్టమైనదని గుర్తించి ఉన్నాము. అట్టి రసమునకుకూడ. ఔచిత్యము జీవితభూతమని (రసజీవితభూతస్య) ఈతడు ప్రతిపాదించెను. "దేని కేది తగునో అది ఉచితమనియు, ఆ ఉచితముయొక్క భావమే ఔచిత్య" మనియు క్షేమేంద్రుడు వివరించెను. పద-వాక్య-అర్థ-గుణ-అలంకార-రస-క్రియా-కారక-దేశ-కాల-లింగ-వచన-నామాది బహుస్థలములందు ఔచిత్య స్వరూపమును ఈతడు నిరూపించెను. ఇంతకు



ముందువారు ఔచిత్యమును గుర్తించకపోలేదు. కాని అదే సర్వముఖ్యమని నిరూపించినవాడీత డొక్కడే. "అనౌచిత్యము వినా రసభంగకారణ మింకొకటి లేదనియు, ఔచిత్య నిబంధనమే రసముయొక్క పరమరహస్యమనియు" నిర్దేశించెడి ధ్వన్యాలోక కారిక క్షేమేంద్రుని ఔచిత్య సంప్రదాయమునకు మూలకంద మనవచ్చును. పాత్రల వేషవిన్యాస నిర్దేశమందు భరతుడుచేసిన వివరణమునుకూడ క్షేమేంద్రు డనుసరించి ఉన్నాడు. ఔచిత్య తత్త్వమును సుస్పష్టముగా ప్రదర్శించిన ఖ్యాతి క్షేమేంద్రునకు దక్కినది.

పైని పేర్కొన్నట్లు సాహిత్యశాస్త్రసంప్రదాయములు ఎనిమిది విధములుగా గోచరించుచున్నను అందు ప్రధానమైనవి మూడే—ఔచిత్యము, రసము, ధ్వని. వీనిలో ఔచిత్యము తక్కిన రెండింటికంటె విశిష్టమైనది. రసము, ధ్వని—ఇవి రెండును దీనికి లోబడి (ఔచితీ సహితములై) తమ గౌరవ మర్యాదలను నిలుపుకొనుచున్నవి. ఔచిత్యహీనములైనచో రసమునందు సరసతకాని, ధ్వనియందు మహత్త్వము కాని శూన్యమగును. ఇవియేకాక సర్వ సాహిత్యశాస్త్రసంప్రదాయములును ఔచిత్యమునకు లోబడి ఉండునని మహామహోపాధ్యాయ శ్రీ ఎస్. కుప్పుస్వామి శాస్త్రిగారు ఒక కారికలోను, తన్నిరూపకమైన పటములోను వివరించి ఉన్నారు. ["Highways and Byways of literary criticism in Sanskrit"-pp 27-29] వానిని క్రింద వివరించుచున్నాను—




ఔచిత్యమనుధావంతి సర్వే ధ్వనిరసోన్నయాః ।
గుణాలంకృతిరీతీనాం నయాశ్చానృజువాఙ్మయాః ॥
(ఉన్నయము = అనుమానము = అనుమితి; అలంకృతి = అలంకారము; అనృజువాక్ = వక్రోక్తి)

పై పటములోని పెద్ద వృత్తము క్షేమేంద్రుని "ఔచిత్యము". అందిమిడియున్న పెద్ద త్రిభుజము మూడు సంప్రదాయములను సూచించుచున్నది. దీని శీర్షకోణము భరతుని "రసము". దీని విషయమున భేదాభిప్రాయము లేదు. ధ్వని మతము, తద్విరోధిమతములు

కూడ రసమును కావ్యాత్మగా అంగీకరించినవి. క్రింది కోణములు రెండును పరస్పర విరుద్ధములైన రెండు ప్రసిద్ధమతములు—ఆనందవర్ధనుని "ధ్వని"; మహిమభట్టు "అనుమితి" (అనుమితి ధ్వనివిరోధిమతముల కుపలక్షణము.)—వీని వైరుద్ధ్యము "రసాభివ్యక్తి"కి సంబంధించినది మాత్రమే. పెద్ద త్రిభుజములోపలనున్న చిన్నివృత్తము కుంతకుని "వక్రోక్తి". దీనియం దిమిడియున్న చిన్ని త్రిభుజముయొక్క శీర్షకోణము వామనుని "రీతి". ఇది క్రింది కోణములు రెండింటికంటె—దండి "గుణము", భామహుని "అలంకారము"—గుణాతిశాయి అనుట నిస్సందేహము. "అలంకారము" నుండి ఈ సంప్రదాయములు ఒకదానికంటె ఇంకొకటి విశిష్టమును, విస్తృతమును అగుచున్నవి. అలంకార-గుణ-రీతుల విమర్శనా పద్ధతులు వాగ్విన్యాసమునకు సంబంధించినవై, "వక్రోక్తి"పై ఆధారపడి ఉన్నవి—ఇవి అన్నియును కావ్య బహిరంగ సాధనములు మాత్రమే. ఇంక పెద్ద త్రిభుజము కావ్య అంతస్తత్త్వమునకు సంబంధించినదై రసమును, కవి దానిని సాధించు విధానమును, సహృదయుడు దాని ననుభవించు విధమును వివరించుచున్నది. (రసాభివ్యక్తి "వ్యంగ్య" మార్గముననా? "అనుమాన" మార్గముననా? అనెడి చర్చ). ఇందలి మూడు కోణములును (రస-ధ్వని-అనుమితులు) పెద్ద వృత్తమైన ఔచిత్యమును ఆశ్రయించుకొని ఉన్నవి. సర్వ కావ్య విషయములకును సంబంధించిన ఆ ఔచిత్యమును తక్కిన సంప్రదాయము లన్నియును వెంటనంటి ఉండును. ప్రతి కావ్యాంగమందును అనురూప్యము, సౌందర్యము సహజములై ఉన్నవన్నచో, అది ఈ "ఔచితీ" మహత్త్వమే.



# అధ్యాయము 17[1]

## భాషా-సంబుద్ధి-నామ-కాకుస్వర విధానములు[2]

[కాశీ ముద్రణమునందు 18 వ అధ్యా—49 శ్లోకములును, 19 వ అధ్యా—78 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 17 వ అధ్యా—137 శ్లోకములును; బరోడా ముద్రణమునందు 17 వ అధ్యా—150 శ్లోకములును కలవు. ఈ అధ్యాయమునందు కొన్ని గద్యభాగములుకూడ కలవు. బరోడాముద్రణమునందు శ్లోకములును, గద్యములును కలిపి లెక్కింపబడినవి.]

### ప్రాకృత పాఠ్యము

ఇంతవరకును సంస్కృత పాఠ్యమును వివరించియున్నాను. ఇప్పుడు ప్రాకృత పాఠ్యమును వివరింతును. సంస్కృతమే వ్యత్యస్తమును, సంస్కార గుణవర్జితమును అయినప్పుడు అది 'ప్రాకృత' మనబడును; మరియు ఇది నానావస్థాంతరాత్మకముగా ఉండును[3]. నాట్యప్రయోగమందు ప్రాకృతపాఠ్యము, సంగ్రహముగా మూడు విధములు— సమానము (తత్సమము), విభ్రష్టము (తద్భవము), దేశీగతము (దేశి లేదా గ్రామ్యము). ఇంక వీని స్వరూపములను వివరింతును—

సమానము

1. సమానము— కమల-అమల-రేణు-తరంగ-లోల-సలిలాది పదములను వ్యస్తముగా (విడివిడిగా) కాని, సమస్తముగా (సమాసమునందు) కాని యథాతథ

---

1. ఈ భాగము కాశీముద్రణమునందు రెండు అధ్యాయములలో (అష్టాదశ-ఏకోనవింశత్యధ్యాయములందు) ఉన్నది. బొంబాయి-బరోడా ముద్రణములందు మాత్రము సప్తదశాధ్యాయము.

2. కాశీముద్రణమునందలి 18 వ అధ్యాయమునకు 'భాషావిధాన' మనియు; 19 వ అధ్యాయమునకు 'వాగంగాభినయమందు కాకుస్వరవ్యంజన' మనియు పేర్లు. 'వాగంగాభినయమందు కాకువిధాన'మని బొంబాయి ముద్రణపాఠము. 'వాగభినయమందు కాకుస్వరవ్యంజన' మని బరోడాముద్రణపాఠము. 'కాకువిధాన' మని అభినవభారతీపాఠము.

3. సంస్కారగుణవర్జితము=ప్రయత్నముతో రక్షింపబడనిది; నానావస్థాంతరాత్మకము=ఆ యా దేశములందు ఆ యా రూపములతో ఉండునది; ప్రకృతి=సంస్కారము లేకపోవుట; కావున అట్టిది ప్రాకృతమనబడినది. పాఠ్యము=స్వప్రయత్నముచే పఠింపదగినది, లేదా విశిష్టరూపముతో పఠింపదగినది, లేదా తన మనస్సులోని కోరికచే పఠింపదగినది, లేదా ఆచార్యశిక్షచే పఠింపదగినది. [అభినవభారతి - 2 వ సం - పుటలు 365-366]

ముగా ప్రాకృత వాక్యములతో చేరి ప్రాకృతబంధము (ప్రాకృతరచన) లందు ప్రయుక్తములైనచో ఆ శబ్దములు సంస్కృతసమానములగును.

విభ్రష్టము

2. విభ్రష్టము— సంయోగ స్వరములును, వర్ణములును పదమధ్యమందు వేరువిధముగా మారిపోవుట లేదా లోపించుట అనునది ఏ సంస్కృత పదములకు సంభవించునో ఆ పదములు విభ్రష్టములనబడును. సంస్కృతపదములలోని వర్ణములును, వ్యంజనసంయుక్తములగు స్వరములును ప్రాకృతమునం దెట్లు మార్పుచెందునో వివరింతును—

స్వరములు: ఐ, ఔ, ః - అనునవి ప్రాకృతమునందుండవు[4]. జ, ఞ, న, శ, ష- అను వర్ణములు కూడ ప్రాకృతమునందుండవు.

అసంయుక్త వర్ణములు: క, గ, త, ద, య, వ- అను వర్ణములు ప్రాకృతమునందు లోపించును; వానితో కూడిన స్వరములే వాని అర్థములను కలిగి ఉండును.

ఖ, ఘ, థ, ధ, భ— ఇవి పదాదియందుండనిచో 'హ' కారముగా మారిపోవును; అవి వాని అర్థమునుకూడ విడిచిపెట్టును. ఉదా: ముఖ-ముహ, మేఘ-మేహ, కథా-కహా, వధూ-వహూ, ప్రభూత-పహూఅ.

వ్యంజనముమీదకాని, క్రిందకాని రేఫము ఉండదు; కాని, భద్ర, వోద్రహ, ద్రహ, చంద్ర, ధాత్రి అనెడి శబ్దములందు మాత్రము పై నియమము వర్తించదు.[5]

'ష' కార మెల్లప్పుడును 'ఛ' కారముగా మారును; ఉదా: షట్పద-ఛప్పఅ.

'కిల' శబ్దములోని చివరి 'ల' రేఫముగా మారును; ఉదా: కిల-కిర.

'ఖలు' శబ్దము 'ఖుత్తి' గా మారును.

భట, కటక, కుటీ, తటాది శబ్దములందలి 'ట' కారము 'డ'కారముగా మారును.

'శ' కార, 'ష' కారము లంతటను 'స' కారముగా మారిపోవును. ఉదా: శంకా-సంకా, విషం-విసం.

4. పై మూడే కాక ఋ ౠ, ఌ ౡ అనునవి కూడ ఉండవు. [అభినవభారతి - 2 వ సం - పుట 367]

5. 'ఐ, ఔ, ః' అనుచోటనుండి ఇంతవరకును గల భాగమునకు మూలము ప్రాకృత గాథలందున్నది. [బరోడా ముద్రణమునందు 7 - 10]



'ఇతర' మొదలగు వానిలోని అపదాదయగు 'త' కారమును అస్పష్టోచ్చారణముగల 'ద' కారమునువలె పలుకవలెను.

బడబా-తడాగాది పదములందలి 'డ' కారము 'ల' (క ?) కారమగును.

'వర్ధన' మున్నగు శబ్దములందలి 'ధ' కారము 'ఢ' కారమగును. ఉదా: వర్ధన-వడ్ఢణ.

సర్వత్ర 'న' కారము 'ణ' కారముగను, 'ప' కారము 'వ' కారముగను మారిపోవును. ఉదా: ఆపానం-ఆవాణం.

యథా, తథా మున్నగు శబ్దములలో తప్ప మిగిలినచోట్ల 'థ' కారము 'ధ' కారముగా మారును.

'ప' కారము 'ఫ' కారమగును. ఉదా: పరుషం-ఫరుసం.

'మృతః' పదము 'మఓ' అగును, అట్లే 'మృగః' పదమును 'మఓ' అగును.

ఔషధాదులందలి 'ఔ' కారము 'ఓ' కారమగును.

ప్రచల, అచిర, అచల మున్నగు పదములందలి 'చ' కారము 'య' కారముగా మారిపోవును.

సంయుక్తవర్ణములు: ఇంతవరకును ప్రాకృతమునందలి అసంయుక్త వర్ణములకు సంబంధించిన మార్పులను వివరించితిని. ఇంక సంయుక్త వర్ణములందు వచ్చెడి మార్పులను వివరింతును. (క్రింది సంయుక్తాక్షరములు, పదములందున్నను లేదా విడిగాఉన్నను, వాని కెదురుగా చూపిన అక్షరములుగా మారిపోవుచుండునని తెలియవలెను.)—

శ్చ, ప్స, త్స, థ్య— ఇవి 'ఛ' కారముగా మారిపోవును.

భ్య, హ్మ, ధ్య— ఝ.

ష్ట-ఠ్ఠ, స్త-త్థ, ష్మ-మ్హ, క్ష్ణ-ణ్హ, ష్ణ-ణ్హ, క్ష-ఖ.

ఆశ్చర్య-అచ్ఛరియ, నిశ్చయ-ణిచ్ఛయ, వత్స-వచ్ఛ, అప్సరస-అచ్ఛరఅ, ఉత్సాహ-ఉచ్ఛాహ, పథ్య-పచ్ఛ, తుభ్యం-తుజ్ఝం, మహ్యం-మజ్ఝం, వింధ్య-వింజ్ఝ, దష్ట-దఠ్ఠ, హస్త-హత్థ, గ్రీష్మ-గిమ్హ, శ్లక్ష్ణ-సణ్హ, ఉష్ణ-ఉణ్హ, యక్ష-జఖ, పర్యంక-పల్లంకు, యజ్ఞ-జన్న, భీష్మ-భిమ్హ.

'బృహస్పతి' లోని 'స్ప' కారమునకు 'ఫ' కారమువచ్చును.

బ్రహ్మాది శబ్దములందలి 'హ, మ' లు విపరీతములగును.

కకారాది వర్ణములు సంయోగమున ఊర్ధ్వగతములుకాని, అధోగతములుకాని అయినప్పుడు ఆ కకారాది వర్ణములు సంయోగవిహీనములుగా శుద్ధములై ఉండును.

ఇంతవరకును సంస్కృత-ప్రాకృత భాషలందలి ఉచ్చారణ విధానమును వివరించితిని.*

## భాషా భేదములు

### దేశభాషా భేదములు

ఇంక ఇప్పుడు దేశభాషాభేదములను వివరింతును. దశరూపములందు వక్తృభేదమును బట్టి ప్రయోగింపబడెడి సంస్కృత-ప్రాకృత రూపమగు భాష నాలుగు రూపములుగా ఉండును—1. అతిభాష, 2. ఆర్యభాష, 3. జాతిభాష ('జాత్యంతరీ భాష' అని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము), 4. యోన్యంతరీభాష.

1. అతిభాష—స్వరభేదాది పూర్ణసంస్కారోపేతమై, వైదికశబ్దబహుళమగు భాష—'అతిభాష' అనబడును. ఇది దేవతల కుపయోగింపబడును.

2. ఆర్యభాష—స్వరభేదాది పూర్ణసంస్కారోపేతమైనను వైదికశబ్దములు విరళముగా ఉండు భాష 'ఆర్యభాష' అనబడును. ఇదికూడ నిత్యవ్యవహృత సంస్కృత భాషకంటె విలక్షణమయినదే. ఇది రాజుల కుపయోగింపబడును[6].

3. జాతిభాష—సంస్కార గుణోపేతమును, లక్షణ సమన్వితమును అగు జాతిభాష రెండువిధములు. ఈ రెండువిధములగు జాతిభాషయే ప్రయోగములందు (రూపకములందు) ఉపయోగింపబడును. ఇందు ఒకటి ప్రాకృతము, రెండవది సంస్కృతము. మొదటిది మ్లేచ్ఛ శబ్దముచే కూడ వ్యవహృతమగుచుండును; అనగా ప్రాకృతభాష మ్లేచ్ఛభాష అనియును వ్యవహరింపబడును. ఇంక రెండవది అగు సంస్కృతము భారతవర్షాశ్రితమగు భాష.

4. యోన్యంతరీభాష— నాట్యధర్మిచే రూపకములందు ప్రయుక్తమగు గ్రామ్యారణ్య పశూద్భవమును, విహంగజమును అగు భాష (అనగా పశు-పక్ష్యాదుల సాంకేతిక భాష[7]) 'యోన్యంతరీభాష' అనబడును.

* [కాశీముద్రణమునందు 18 వ అధ్యా - 1–22 శ్లో; బొంబాయి ముద్రణమునందు 17 వ అధ్యా - 1–24 శ్లో; బరోడా ముద్రణమునందు 17 వ అధ్యా - 1–25 శ్లో]

6. స్వరభేదాది పూర్ణ సంస్కారోపేతమైనది 'సంస్కృతభాష' అనబడును. అందు వైదిక శబ్దబాహుల్యము కలది అతిభాష. ఇదియే ఆర్యభాషకంటె అతిభాష విలక్షణమని ఎరుంగుటలో హేతువు అని కొందరు తలంతురు. [అభినవభారతి— 2 సం - పుట 372]. ఇచ్చటి శ్లోకములు [బరోడాముద్రణమునందు 26-31] కొంత క్లిష్టములుగా ఉన్నవి. అభినవభారతీ సాహాయ్యమున వాటిని అనువదించితిని.

7. 'యోన్యంతరీ భాష' ఎట్లుండునో భరతుడు చెప్పలేదు; అది నాట్యధర్మిప్రవర్తిత మనుటచే పశు-పక్ష్యాదులుకూడ మనుష్యులవలెనే మాటాడునని చెప్పవచ్చును.



### ప్రకృతిభేదము ననుసరించి పాఠ్యభేదము

పైని చెప్పబడిన జాతిభాష సంస్కృత-ప్రాకృత భేదములచే రెండువిధములు కదా. ఆ జాతిభాష చాతుర్వర్ణ్యముచేతను వ్యవహరింపబడును. అందు ధీరోదాత్త-ధీరోద్ధత-ధీరలలిత-ధీరప్రశాంతులనబడెడి నలుగురు నాయకులును సంస్కృతమును ఉపయోగించవలెను. కాని, ప్రచ్ఛన్నరూపమును స్వీకరించుట (ఉదా: అర్జునుని బృహన్నలరూపము), దారిద్ర్యము, అధ్యయనాభావము, యదృచ్ఛ మున్నగు కారణములచే ఈ నాయకులు కూడ ప్రయోగమునందు ప్రాకృతమును ఉపయోగించవలసియుండును.

ఐశ్వర్యముచే మదించినవారును, దారిద్ర్యముచే పీడింపబడుచున్నవారును, అధ్యయనముచేయని ఉత్తమవంశసంజాతులును సంస్కృతపాఠ్యమును ప్రయోగించరాదు. జీవికాదుల కొరకు వేషాంతరమును ధరించినవారును, శ్రమణులును, తాపసులును, భిక్షువులును, దేశద్రిమ్మరులును ప్రాకృతమునే ఉపయోగించవలెను.

భాగవతులు (అర్చకులు, పూజారులు), తాపసులు, ఉన్మత్తులు, బాలురు, నీచగ్రహగ్రస్తులు[8], స్త్రీలు, నీచులు, స్త్రీప్రకృతులు (నపుంసకులు), మత్తులు, లింగస్థులు ప్రాకృతమునే ఉపయోగించవలెను. కాని, పరివ్రాజకులు (బౌద్ధులు), మునులు, శాక్య (జైన) భిక్షువులు, చోక్షులు (భాగవతులలో ఏకాయనులు మొదలగువారు), శ్రోత్రియులు, ఇంకను మిగిలిన యతిప్రభృతి లింగస్థులు సంస్కృతమునే ఉపయోగించవలెను.

పట్టపురాణి, గణిక, శిల్పకారిక అను వీరు కాల-అవస్థా విశేషములందు సంస్కృతము నుపయోగించవచ్చును. నృపపత్ని కూడ రాజువలె సంధి-విగ్రహ సంబంధమైన సంభాషణములను, శుభాశుభరూపములైన గ్రహనక్షత్రముల నడకను, ఖగముల రుతమును (పక్షిశకునములను) ఎరుంగవలసియున్నది కాన ఆమె సంస్కృత పాఠ్యమును కూడ ఉపయోగించవలసియుండును.

సర్వలోకములకును వినోదము కలిగించుటకు సుఖముగా ఉండునట్టిదియును[9], కలాభ్యాసమున కవసరమైనట్టిదియును అగు సంస్కృతపాఠ్యమును వేశ్యలు ప్రయోగమునం దుపయోగించవలెను. కలోపచారజ్ఞానమునకును, రాజులకు వినోదమును కల్గించుట కొరకును శిల్పకారికలు సంస్కృతము నుపయోగించవలెను. దేవతా సంసర్గమువలన అప్సరసలందరును కూడ సంస్కృతమునే ఉపయోగించుట పురాణ

8. పిశాచాది నీచగ్రహములు కాక, దేవ-గంధర్వాది గ్రహములు పట్టినప్పుడు సంస్కృతమునే ఉపయోగించవలసిఉండునని దీనినిబట్టి గ్రహించవచ్చును.

9. 'సుఖముగాఉండునది' అనుటచే విశేషలక్షణ ప్రయోగాదులు నిషేధింపబడినవి.

ప్రసిద్ధము. అదియే లోకమునందును వర్తించును. అప్సరసలు, ఏదేని కారణముచే, మనుష్య స్త్రీలుగా అవతరించినచో, వారి ఇష్టానుసారముగా ప్రాకృతమునుకూడ ఉపయోగించవచ్చును.

బర్బర-కిరాత-ఆంధ్ర-ద్రమిడ (ద్రమిల లేదా ద్రవిడ) ప్రభృతి జాతులకు భాషలను[10] (ప్రాకృతమునందలి శుద్ధములగు దేశభాషలను అనగా శౌరసేన్యాదులను) ఉపయోగించరాదు.

సమస్త శుద్ధజాతులకును[11] శౌరసేనీభాషను కావ్యమం దుపయోగించవచ్చును; లేదా నాటకమునందు కావ్యవస్తువు (ఇతివృత్తము) నానాదేశోద్భవమైనది కాన ఆయా దేశభాషలనే వారివారికి ఉపయోగించవలెను.

---

10. న బర్బర కిరాతాంధ్ర ద్రమిలాద్యాసు జాతిషు ।
నాట్యప్రయోగే కర్తవ్యం పాఠ్యం భాషాసమాశ్రయం ॥ 48

అని మూలశ్లోకము. ఇదియే మరల 58 వ శ్లోకముగా తరువాతకూడ కలదు. భాషాసమాశ్రయమనగా బర్బర-కిరాత-ఆంధ్రాది భాషలని కొందరు విమర్శకు లర్థముచెప్పినారు. అది సమంజసముకాదు. ఇచ్చట భాషాపదమునకు పైని కుండలీకరణములందు సూచించినట్లుగా 'ప్రాకృతమునందలి శుద్ధములగు దేశభాషలు అనగా శౌరసేని మొదలగు ఏడు భాషలు' అని అర్థము. కిరాతాంధ్రాది భాషలను విభాషలందురు. "భాషా సంస్కృతాపభ్రంశః; భాషాపభ్రంశస్తు విభాషా, సా తత్తద్దేశ ఏవ గహ్వరవాసినాం ప్రాకృతవాసినాం చ." [అభినవభారతి - 2 వ సం-పుట 376] అని అభినవగుప్తుడు చెప్పుట గమనార్హము. భాషా-విభాషాభేదము 49-50 శ్లోకములలో మూలమందే చెప్పబడినది. దీనిని డా ఘోష్ కూడ గమనించకపోవుట విచార్యము. సమన్వయము కుదురక తరువాతి శ్లోకములు పదునాల్గింటిని (50-63 శ్లో.) వారు ప్రక్షిప్తములని తలంచిరి. [నా. శా- ఆంగ్లానువాదము - పుట 331. అధస్సూచిక.] బర్బరాది భాషలను వాడవచ్చుననియే ఇచ్చటి అర్థము. అసలిచ్చటి సందర్భమును సరిగా పరిశీలించినచో, ఇక్కడ సంస్కృత - ప్రాకృతముల విషయమే చెప్పబడుచున్నదనియు, ప్రాకృతమును (శౌరసేన్యాదులును) బర్బరాదులకు వాడకూడదని ప్రసంగవశమున చెప్పబడెననియు గ్రహింపగలరు. ఈ విషయము 58 వ శ్లోకములో మరలనొక్కిచెప్పబడినది. ఆ 58 వ శ్లోకమును అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను.

11. అనులోమవశమున (బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీకి, బ్రాహ్మణునకు వైశ్యస్త్రీకి... ఈ విధముగా) జనించి, సంస్కారముకలవారు శుద్ధజాతికి చెందినవారు. వీరును, బర్బరాదులును కూడ హీనులే. వీరు చాతుర్వర్ణ్యములోనికి రారు. అయినను, అనులోమవశమున జనించినవారు సంస్కారవంతులగుటచే వారికికూడ భాషా (శుద్ధప్రాకృతభాషా) భేదమగు 'శౌరసేని' ని ఉపయోగించవచ్చును; లేదావారివారి దేశభాషలనుపయోగించవచ్చును. ఇంక అసంస్కృతులై గుహలలోను, అడవులలోను వసించు బర్బరాదులకు శౌరసేన్యాది భాషలనెన్నడును ఉపయోగించరాదు; వారివారి దేశభాషలను మాత్రమే ఉపయోగించవలెను.



భాషలు : విభాషలు

మాగ ధ్యవంతిజా ప్రాచ్యా శౌరసే న్యర్ధమాగధీ ।
బాహ్లికా దాక్షిణాత్యా చ సప్తభాషాః ప్రకీర్తితాః ॥ 49

—నాటకమునం దుపయోగింపదగు 'భాష' లు ఏడు విధములు— మాగధి, అవంతిజ (ఆవంతి), ప్రాచ్య, శౌరసేని, అర్ధమాగధి, బాహ్లీక, దాక్షిణాత్య.

శకా రాభీర చండాల శబర ద్రమి లాంధ్రజాః ।
హీనా వనేచరాణాం చ విభాషా నాటకే స్మృతా ॥ 50

—నాటకమందుపయోగింపదగు 'విభాషలు' ఏడువిధములు— శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్రి, హీనులైన వనచరులు వాడెడి వనౌకసి[12].

---

12. సంస్కృతాపభ్రంశములై, ఆయా మండలములలో సామాన్యజనవ్యవహారమునందు కన్పట్టు శౌరసేన్యాది ప్రాకృత భేదములు 'భాష' లనబడుననియు, ఈ భాషాపభ్రంశములై వన-పర్వత సంచారులచే ఉపయోగింపబడునవి 'విభాష' లనబడుననియు గ్రహించవలెను. 'ప్రవృత్తి' ని వివరించుచు సింగభూపాలుడు చెప్పిన వాక్యములు గమనార్హములు—"ఆయా దేశోచితములగు భాషలు, క్రియలు, వేషములు ప్రవృత్తు లనబడును. అందు భాష, విభాష అను భేదములచే భాష రెండు విధములు. వీనిలో భాష ప్రాచ్య, ఆవంతి, మాగధి. బాహ్లీక, దాక్షిణాత్య. శూరసేని. ఆంధ్రమాగధి అని ఏడు విధములు. ఇంక విభాషయు శబర-ద్రమిళ-ఆంధ్ర-శకార-ఆభీర-చండాల-వనేచర (కోయ) భేదములచే ఏడు విధములు. ఆ యా దేశస్థుల కుచితములైన భాషా విభాష లింకను చాల కలవు. కాని, నాటకమునందు వాని కుపయోగము లేకపోవుటచే లక్షణము చెప్పబడుట లేదు. [రసార్ణవ సుధాకరము - శ్రీ బులుసువారి అనువాదము - పుటలు 267-269]—

దశరూపకములందలి భాషలు



ఈ భాషా-విభాషలను ఎవరెవరికి ఉపయోగించవలెనో వివరింతును—

రాజాంతఃపురములోని జనులకు మాగధిని, చేట-రాజపుత్ర శ్రేష్ఠులకు అర్ధమాగధిని, విదూషకాదులకు ప్రాచ్యను, ధూర్తులకు ఆవంతిని, నాయికలకు వారి సఖులకు శౌరసేనిని, యోధ-నాగర-కితవాదులకు దాక్షిణాత్యను, ఉదీచ్యులకు బాహ్లీకను ఉపయోగించవలెను. ఖసజాతి వారికి వారి దేశభాషను, శకార-ఘోషకాదులకును తత్స్వభావముగల ఇతరులకును శకారభాషను, పుల్కసాదులకు చాండాలిని, అంగారకారక-వ్యాధ-కాష్ఠయంత్రోపజీవులకు శకారభాషను లేదా ఏదేనిఒక వనౌకసిని, గజ-అశ్వ-అజావిక-ఉష్ట్రాది ఘోషస్థాన నివాసులకు ఆభీరిని, వనచారులకు శాబరిని లేదా ద్రామిడిని, సురంగ ఖనకాదులకు సంధికారులకు అశ్వరక్షకులకు మాగధిని ఉపయోగించవలెను. వ్యసన పీడితుడగు నాయకుడు ఆత్మరక్ష చేసికొనునప్పుడుమాగధిని ఉపయోగించవలెను.

'ఏ' కార బహుళమైన భాషను గంగా-సాగరమధ్య (తూర్పు) దేశస్థులకును, 'న' కార బహుళమైన భాషను వింధ్య-సాగరమధ్య దేశస్థులకును, 'చ' కార ప్రాయమైన భాషను సురాష్ట్ర-అవంతి దేశస్థులకును, 'ఉ' కార బహుళమైన భాషను హిమవత్-సింధు-సువీర దేశస్థులకును, 'ఓ' కార బహుళమైన భాష చర్మణ్వతీనదీ తీరస్థులకును అర్బుదపర్వతసమాశ్రయులకును ఉపయోగించవలెను.

పై విధముగా నాటకములందు భాషలను కూర్చవలెను. ఇచ్చట నేను వివరించనివానినెల్ల బుధులు లోకమునుండి గ్రహించవలెను.*

## సంబుద్ధి విధానము

ఇంతవరకును భాషా విధానమును వివరించితిని. ఇంక ఉత్తమ-మధ్యమ-అధములు పరస్పరము సంభాషించుకొనునప్పటి వాక్యవిధానమును (సంబుద్ధి విధానమును అనగా సంబోధించు[13] లేదా పేర్కొనిచెప్పు విధానమును) వివరింతును—

---

* [కాశీ ముద్రణమునందు 18 వ అధ్యా—23-49 శ్లో; బొంబాయి ముద్రణమునందు 17 వ అధ్యా—24-62 శ్లో; బరోడా ముద్రణమునందు 17 వ అధ్యా—26-64 శ్లో]. ఇంతటితో కాశీ ముద్రణమునందు 18 వ అధ్యాయము ముగిసినది.

13. ఈ సంబుద్ధి విధానమును సింగభూపాలుడు పరిభాష అనెను. "పేరు పెట్టి పిలుచుటకు వీలుకాని వారిని వేరొక నామముతో పిలుచు పద్ధతియే పరిభాష అని నాట్యవేత్తలు పలుకుదురు" అని ఆతడు వివరించెను. [రసార్ణవసుధాకరము - శ్రీ బులుసువారి అనువాదము - పుట 1011]



మహాత్ములైన మహర్షులు దేవతలకుకూడ పూజ్యులు కాన వారిని స్త్రీ-పురుషులందరును 'భగవానుడ!' అని సంబోధించవలెను. ద్విజులు పూజ్యులు కాన వారు పేరుపెట్టి పిలుచుటను మహీపాలురు సహించవలెను.

| నిర్దేశకులు (పిలుచువారు) | నిర్దిష్టులు (పిలువబడువారు) | నిర్దేశవచనము |
|---|---|---|
| పురుషులను సంబోధించు విధములు : | | |
| స్త్రీపురుషులందరును | మహర్షులను | భగవానుడ! (భగవన్!) అని సంబోధించవలెను. |
| ,, | మహర్షిపత్నులను | భగవతి ! |
| ,, | దేవతలను, లింగస్థులను, వేద-వేదాంగవేత్తలను | భగవానుడ ! |
| ,, | బ్రాహ్మణుని | ఆర్య ! |
| ,, | పార్థివుని | మహారాజ ! |
| ,, | ఆచార్యుని | ఉపాధ్యాయ! |
| ,, | వృద్ధుని | తాత ! |
| బ్రాహ్మణులు | రాజును | రాజ! (లేదా పేరుపెట్టి పిలువవలెను) |
| ,, | అమాత్యుని | సచివ! లేదా అమాత్య! |
| హీనజనులు | సచివుని | ఆర్య ! |
| ఇది ఉత్తముల విషయము } సములు | సములను | పేరుపెట్టి పిలువవలెను. |
| హీనజనులు | ఉత్తముని | సంతోష సమయములందుపయోగించు చాటు పద్యాదులందు పేరుపెట్టి పిలువవచ్చును. |
| అందరు | నియోగాధికృతులైన స్త్రీపురుషులను, కారుకులను, శిల్పులను | వారివారి ఉద్యోగముల పేర్లతో పిలువవలెను. |
| ,, | మాన్యులను | భావ ! |
| ,, | కొంచెము తక్కువవారిని | మార్షక ! (లేదా మారిష!) |
| ,, | సములను | వయస్య ! |
| ,, | అధములను | హంహో ! |

| నిర్దేశకులు (పిలుచువారు) | నిర్దిష్టులు (పిలువబడువారు) | నిర్దేశవచనము |
|---|---|---|
| సూతుడు | రథికుని (ఎల్లప్పుడును) | ఆయుష్మంతుడ! (ఆయుష్మన్!) |
| అందరు | తపస్విని, ప్రశాంతుని | 'సాధు' శబ్దముచే సంబోధించవలెను. |
| ,, | యువరాజును | స్వామి! |
| ,, | ఇతర రాజకుమారులను | భర్తృదారక! |
| ,, | రాజకుమారులకంటె తక్కువవారిని | ఓ సౌమ్య! ఓ భద్రముఖ! |
| ,, | నాటకమండలి ఇతర వ్యక్తులను | కర్మ-శిల్ప-విద్యా-జాతులను బట్టితత్తదుచితనామములతో |
| తండ్రి లేదా గురువు | సుతుని లేదా శిష్యుని | వత్స! పుత్రక! తాత! లేదా పేరుపెట్టి, లేదా గోత్రము పేరుతో |
| అందరు | శాక్య (సౌగత) - నిర్గ్రంథు (క్షపణకు) లను | భదంత! |
| ,, | పాశుపతాదులను | వారివారి సంప్రదాయములను బట్టి (ఉదా : పాశుపతులను 'భాపూషన్!', 'భాసర్వజ్ఞ!') |
| భృత్యులు, ప్రజలు | నృపతిని | దేవ! |
| పరిజనులు | సార్వభౌముని | నిత్యమును 'భట్ట!' |
| ఋషులు | నృపతిని | రాజ! లేదా అపత్యప్రత్యయాంత శబ్దముతో |
| విదూషకుడు | మహీపతిని | రాజ! లేదా వయస్య! |
| ,, | రాజ్ఞిని, చేటిని | భవతి! |
| రాజు | విదూషకుని | వయస్య! లేదా పేరుపెట్టి |
| యౌవనవతులైన స్త్రీలందరును | పతిని | ఆర్యపుత్ర! |
| తక్కినవయస్సులలో | పతిని | ఆర్య! |
| ,, | పతి రాజైనప్పుడు | మహారాజ! |



| నిర్దేశకులు (పిలుచువారు) | నిర్దిష్టులు (పిలువబడువారు) | నిర్దేశవచనము |
|---|---|---|
| తమ్ముడు | అన్నను | ఆర్య! |
| అన్న | తమ్ముని | పుత్రునివలె (వత్స! తాత!) |

స్త్రీలను సంబోధించు విధములు :

| నిర్దేశకులు (పిలుచువారు) | నిర్దిష్టులు (పిలువబడువారు) | నిర్దేశవచనము |
|---|---|---|
| అందరును | తపస్వినులను, దేవతలను | భగవతి! |
| ,, | గురుభార్యను, స్థానీయను | భవతి! |
| ,, | గమ్యను | భద్ర! |
| ,, | వృద్ధురాలిని | అంబ! |
| సర్వపరిజనులు | రాజపత్నిని | భట్టిని! స్వామిని! దేవి! |
| రాజు లేదా పరిజనులు | పట్టమహిషిని | ఓ దేవి! |
| ,, | భోగినులను | స్వామిని! |
| ప్రేష్యలు | రాకుమారిని | భర్తృదారిక! |
| అందరును | స్వసను (అక్క) | భగిని! |
| ,, | యవీయసిని (చెల్లెలిని) | వత్స! |
| ,, | బ్రాహ్మణిని, లింగస్థను, వ్రతినిని | ఆర్య! |
| ,, | పత్నిని[14] | ఆర్య! లేదా ఆమె తండ్రి పేరుతో కాని, పుత్రుని నామముతో కాని |
| సమానులు | సఖులను | పరస్పరము హాలా! |
| స్త్రీలు | ఉత్తమప్రేష్యను | హంజా! |
| పరిజనులు | వేశ్యను | అజ్జుక! |
| ,, | గణికామాతను | అత్త! |
| రాజు లేదా ఇతరులు | భార్యను | శృంగారమందు ప్రియ! |
| పురోధస-సార్థవాహులు | భార్యను | (ఎల్లప్పుడును) ఆర్య! |

---

14. 'పత్ని' అనగా సహధర్మచారిణి. కావుననే నాట్యవేదమహాసత్రదీక్షితుడైన సూత్రధారుడు నటిని 'ఆర్య!' అని మన్నించుచున్నాడు. [అభినవభారతి - 2 వ సం-పుట 383]. నియోగాధికృతులు=ఆయా పనులయందు నియమింపబడిన అధికారులు, కారుకులు = స్థాపకారాదులు, శిల్పులు = చిత్రకారాదులు, కర్మ = పాకాది కర్మలు, స్థానీయ= ఈషత్ వృద్ధ=పూజ్య, గమ్య=పొందదగిన స్త్రీ (సంభోగమునకు నిషేధములేనిది).

పైని చెప్పబడిన సంబోధన విధానములలో చాలవానికి సంస్కృత రూపకములందు ఉదాహరణములు కలవు. డా. ఘోష్ అధస్సూచికలందు పెక్కింటికి ఉదాహరణములను పేర్కొనెను.

## నామ విధానము

ఇంక నామ విధానమును వివరింతును. నాటకమునందు కవు లెల్లప్పుడును ప్రకృతులకు ఔత్పత్తిక (కల్పిత) ములును, అప్రఖ్యాతములును అయిన పేర్లను ప్రస్తుతార్థసూచకములగునట్లుగా పెట్టవలెను—

బ్రాహ్మణ-క్షత్రియుల పేర్లు గోత్ర-కర్మానురూపముగా 'శర్మ', 'వర్మ' అని అంతము కావలెను.

వణిజులకు 'దత్త' మొదలగు పదములతో అంతములగు పేర్లు సముచితములు. [ఉదా: చారుదత్త].

కాపాలికుల పేర్లు 'ఘంటా' పద మంతమందు కలిగిఉండవలెను. [ఉదా: అఘోరఘంట మొ॥].

శూరులకు శౌర్యోదాత్తసూచకములును, రాజస్త్రీల కెల్లప్పుడును విజయార్థములును (శుభలక్షణ సూచకములును) అయిన పేర్లు పెట్టవలయును.

వేశ్యల పేర్లకు 'దత్త-మిత్ర-సేన' అనెడి పదము లంతమందుండవలెను. [ఉదా: వసంత సేన మొ॥].

ప్రేష్యలకు నానాకుసుమముల పేర్లు పెట్టవలయును [ఉదా: పద్మిని, మాలతి, మల్లిక మొ॥ చూతలతికాది పదములుకూడ కన్పట్టుచున్నవి-అభినవభారతి-పుట 384].

చేటులకు మంగళార్థములయిన పేర్లు పెట్టవలెను.

ఉత్తములకు, వారి కర్మ - నామసదృశముగా ఉండునట్లు, గంభీరార్థ స్ఫోరకమగునట్లు పేర్లు పెట్టవలెను.

తక్కిన స్త్రీ పురుషులకు తత్తజ్జాతి - చేష్టానురూపములైన పేర్లు పెట్టవలెను.[15]*

---

15. పై నామవిధానము ఎక్కువగా కల్పితేతివృత్తములకు సంబంధించినదని చెప్పవచ్చును. ప్రాచీన సంస్కృత రూపకములందు పై విధముగా కొన్ని పేర్లు కన్పట్టుచున్నవి. కొన్నింటికి ఉదాహరణములు లేవు. రాణియును, రాజకన్యయును అయిన వాసవదత్తకు 'దత్త' అను పేరుండుట పై సూత్రమునకు విరుద్ధమనక తప్పదు. భాసుడు నాట్యశాస్త్ర సూత్రము నుల్లంఘించిన ఘట్టములలో ఇది ఒకటి.

* [కాశీముద్రణమునందు 19 వ అధ్యా—1-86 శ్లో; బొంబాయి ముద్రణమునందు 17వ అధ్యా-68-98 శ్లో; బరోడాముద్రణమునందు 17 వ అధ్యా-65-102 శ్లో.]



## కాకుస్వర విధానము

ఇట్లు భాషా విధానమును అశేషముగా తెలిసికొనిన పిమ్మట పాఠ్యమును షడలంకార సంయుక్తముగా ప్రయోగించవలెను. పాఠ్య గుణముల నిప్పుడు వివరింతును.[16] —స్వరములు ఏడు, స్థానములు మూడు, వర్ణములు నాలుగు, కాకువు రెండు విధములు, అలంకారములు ఆరు, అంగములు ఆరు. వీని లక్షణములనిప్పుడు వివరింతును—

1. స్వరములు—షడ్జ-ఋషభ-గాంధార-మధ్యమ-పంచమ-ధైవత-నిషాదములు ఏడును స్వరములు. ఇవి ఆయా రసములందు ప్రయుక్తములు కావలెను. హాస్య-శృంగార రసములందు పంచమ-మధ్యమ స్వరములును, వీర-రౌద్ర-అద్భుత రసములందు షడ్జ-ఋషభ స్వరములును, కరుణరసమందు గాంధార-నిషాద స్వరములును, బీభత్స-భయానక రసములందు ధైవత స్వరమును ప్రయుక్తములు కావలెను.

2. స్థానములు— ఉరము, కంఠము, శిరము అనునవి మూడును స్థానములు. శరీరరూపమగు వీణయందు ఉరము, శిరము, కంఠము అను ఈ మూడే స్థానములు. ఈ మూడు స్థానములనుండియే 'కాకు స్వరము' ఉత్పన్నమగును.[17] (ఈ కాకు

---

16. వాగభినయమం దింతవరకును 'కవి'కి మాత్రమే సూచనలొసంగబడినవి. ఇంక ప్రయోక్తను దృష్టిలో పెట్టుకొని పాఠ్యగుణములు అనగా పాఠ్యమునకు ఉపకారకములైన ఆరు అలంకారములు వివరింపబడుచున్నవి.

ఇచ్చటనుండి అధ్యాయాంతమువరకును గల భాగములో సగము శ్లోకములును, సగము గద్యములును కలవు.

17. ఇచ్చటి మూలశ్లోకము క్రిందివిధముగా ఉన్నది—

శారీర్యామథ వీణాయాం త్రిభ్యఃస్థానేభ్య ఏవతు । ఉరసః శిరసః కంఠాత్స్వరః కాకుః ప్రవర్తతే ॥ 106

ఈ శ్లోకమునందు కాకుస్వరము యొక్క ఆశ్రయములు వివరింపబడినవి. మూర్ధస్థానీయమగు వర్ణమునకు ఉరమెట్లు స్థానము కాగలదు ? అనెడి సందేహము కలుగవచ్చును. కాని, వర్ణోత్పత్తి స్థానము వేరు, నాదోత్పత్తి స్థానము వేరు అని తెలియవలెను. ఏవర్ణమునైనను మంద్రనాదమున, మధ్యనాదమున, తారనాదమున కూడ పలుకవచ్చును. మూర్ధన్యమైన వర్ణము ఎల్లప్పుడును తారముగానే ఉండదు. ఉరఃస్థానమున పలుకబడి మంద్రనాదము కలదియును అగును. కావునే ఈ శ్లోకమున చెప్పబడిన స్థానములు నాదమునకు సంబంధించినవని తెలియవలెను. అంతియేకాక ఇవి గానమునందలి స్వరముల స్థానములకంటె భిన్నములనియు, పాఠ్యమం దుపయోగింపబడు స్వరములకు ఉత్పత్తిస్థానములనియు కూడ గ్రహించవలసియున్నది.

గానమున మూడు స్థానములయందును ఒక్కొక్క స్థానమున 22 శ్రుతులు చొప్పున 66 శ్రుతులు ఉత్పన్నములగును. అట్లు 66 స్థానభేదములు కేవలము రంజనాత్మక

స్వరము మంద్ర-మధ్య-తార భేదములచే మూడు విధములుగా ఉండును.) దూరస్థుని పిలుచుటయందు శిరఃస్థానగతమైన తార స్వరమును ప్రయోగించవలెను. అట్లే నాతిదూరమందున్న వానిని పిలుచుటకు కంఠస్థానగతమైన మధ్య స్వరమును, పార్శ్వమందున్న వానిని పిలుచుటయందు ఉరఃస్థానగతమైన మంద్ర స్వరమును ప్రయోగించవలెను. పాఠ్యమం దెల్లప్పుడును ఉరఃస్థానగతమైన మంద్ర స్వరముతో

---

గానమునందే ఉండుననియు, పాఠ్యస్వరములం దుండవనియు చెప్పుటకే ఈమూడు స్థానముల నుండియే కాకుస్వరము ఉత్పన్నమగునని పేర్కొనబడినది. మరియు ఇచ్చట 'శారీరమగు వీణ' అని చెప్పబడినదికదా. శరీరగతమగు వివృతమధ్యాకాశదేశము ఇచ్చట వీణాస్థానీయము. ఆ ఆకాశమునుండియే స్వరము జనించునుకాని శరీర మాత్రమునుండి జనింప నేరదుకదా? బాహ్యవీణయందు సోపానములు (మెట్లు) ఉన్నట్లే ఇందును ఉరము, కంఠము, శిరము అనునవి స్వరములు పలుకు మెట్లు. ఇట్లు ఈ శ్లోకమున కాకుస్వర నిష్పత్తి స్థానములు తెలియజేయబడెను.

ఈ శ్లోకమున 'వీణాయాం' అని ఉండుటచే గానమందలి స్వరముల స్థానములే ఇచ్చట చెప్పబడెననియు, కాకువు మూడు విధములనియు, స్వరకాకువు ఇచ్చట చెప్పబడెననియు కొందరు తలంచిరి. వారి అభిప్రాయమున కాకువు 3 విధములు—1. అర్థకాకువు, 2. రసకాకువు, 3. స్వరకాకువు. ఇందు అర్థకాకువు విధి నిషేధాద్యర్థములను సూచించును. రసకాకువు చిత్తవృత్తి సూచకము. పై రెండు విధములగు వ్యాపారములకును భిన్నమై, కేవలము శోభా సంపాదకమును, దూరశ్రవణము మొదలగునవి మాత్రమే ప్రయోజనముగా కలదియును, నేపథ్యపాఠ - వైతాళీయ పాఠాదులందును, దూరస్థాభాషణాదులందును ఉపయోగింపబడునదియును స్వరకాకువు అనబడును. ఇది గాన రూపమున ఉండుననియు, ఇచ్చట ఆ స్వరకాకువే నిరూపింపబడినదనియు వారి అభిప్రాయము.

పై అభిప్రాయము సమంజసము కాదు. ఈ శ్లోకమున కాకుస్వరసామాన్యమునకు సంబంధించిన స్థానములే చెప్పబడినవని తెలియవలెను. పై అభిప్రాయము ప్రకారము వైతాలీయ - నేపథ్యపాఠాదులందు స్వరకాకువు ఉండును అని చెప్పుటయును పొసగదు. నేపథ్యపాఠము చిత్తవృత్తి ప్రతిపాదకముగానే ఉండును కాన అచ్చట రసకాకువుకంటె భిన్నముగ స్వరకాకువును కల్పించవలసిన అవసరములేదు. ఇంక వైతాలీయపాఠము సముచితావసర నివేదన ప్రధానమై అర్థమును సూచించునది అగుటచే ఇచ్చట కూడ అర్థకాకువు కంటె భిన్నముగా స్వరకాకువును కల్పించవలసిన అవసరములేదు. ఇంక దూరస్థాభాషణములందు మాత్రమే స్వరకాకువు ఉపయుక్తమగును. అదియును పాఠ్యరూపమే కాని గానరూపమైనది కాదు. కావున, ఇందు చెప్పబడిన స్థానములు సర్వకాకు సామాన్యమైనవే కాని వైతాలీయ - నేపథ్యగాన విషయములు కావని ఎరుంగవలెను. [అభినవభారతి - 2 వ సం - పుటలు 387-388] (ఇచ్చట వ్యాఖ్యానమందు ముద్రణదోషములు చాలకలవు; వాటిని సరిపెట్టుకొని అనువదించినాను).



ప్రారంభింపబడిన వాక్యమును శిరఃస్థానగతమైన తార స్వరముతో దీపింపజేసి కంఠస్థానగతమైన మధ్య స్వరముతో పరిసమాప్తి నొందించవలెను.[18]

3. వర్ణములు—పాఠ్యమునందు వర్ణములు నాలుగు విధములు—ఉదాత్త-అనుదాత్త-స్వరిత-కంపితములు. హాస్య-శృంగార రసములందు స్వరిత-ఉదాత్త వర్ణములతోడను, వీర-రౌద్ర-అద్భుతములందు ఉదాత్త-కంపిత వర్ణములతోడను, కరుణ-బీభత్స-[19]భయానకములందు అనుదాత్త-స్వరిత-కంపిత వర్ణములతోడను పాఠ్యమును ప్రయోగించవలెను.

4. కాకువు[20]—వాక్యముయొక్క సాకాంక్షత్వ-నిరాకాంక్షత్వముల వలన

---

18. అనగా మంద్రస్వరముతో పాఠ్యము నారంభించి, క్రమముగా తారస్వరమును చేరి, మధ్యస్వరముతో సమాప్తము చేయవలెనని సారాంశము [అభినవభారతి - 2వ సం - పుట 349]

19. ఇది అభినవగుప్తుని పాఠము. కాని, కాశీ-బొంబాయి ముద్రణములందు 'కరుణ-వాత్సల్య-భయానకము' అనెడి పాఠాంతరము గ్రహింపబడినది. ఈ పాఠమును స్వీకరించియే కాబోలు "అథ మునీంద్రసమ్మతో వత్సలో రసః" అనుచు విశ్వనాథుడు 'వత్సలరసము'ను పదియవ రసమునుగా, భరతముని సమ్మతమైనదానినిగా నిర్దేశించియుండెను. [(శ్రీ) వేదంవారి అనువాదమునందు 241 వ సూత్రమును చూడవలెను]

20. 'కాకు' శబ్దమునకు అభినవగుప్తుడు మూడు విధములగు వ్యుత్పత్త్యర్థములను చెప్పెను. [అభినవభారతి - 2 వ సం - పుట 389. ఇదే వివరణము ధ్వన్యాలోకలోచనమందును కలదు] —

(1) 'కక' అనునది 'లౌల్యము' అను అర్థమునందు ప్రయుక్తము. లౌల్యమనగా శోక - భయాది భావ విశేషములవలన ఏర్పడు స్వరవైచిత్రి. ఇట్టి స్వరవైచిత్రియే 'కాకువు' అనబడును.

(2) 'కు' శబ్దమునకు 'ఈషత్' అనియు, 'వాచ్యభూమి' అనియు అర్థములు. (కు+కు) ఈషదర్థమందు 'కు' శబ్దమునకు 'కా' ఆదేశముగా వచ్చినది. 'వాచ్యభూమి' అనగా హృదయస్థమైన అర్థము ప్రతీతమగుటకు స్థానము లేదా సాధనము. వాచ్యభూమి కొంచెముగా సంపద్యమాన మగును కాన ఇది 'కాకువు' అనబడినది.

(3) 'కాకువు' అనగా జిహ్వ. జిహ్వావ్యాపారసంపాద్యమగుటవలన ఇది 'కాకువు' అయినది. అర్థాంతరస్ఫూర్తి కలిగించునది 'కాకువు' అనబడునని సారాంశము. ఈ స్ఫూర్తికి స్వరము (అనగా ఉచ్చారణలోని భేదములు) సాహాయ్యపడును కాన ఇది 'కాకుస్వర' మనబడినది. ఇట్టి కాకుస్వరముచే కలిగిన అర్థాంతరస్ఫురణమును ఆలంకారికముగా 'గుణీభూత వ్యంగ్య' మందురు.

ఈ కాకువునకు తక్కిన ఐదు అలంకారములును చేరి సమగ్రత నాపాదించుచున్నవి; అందుచేతనే వాటిని కూడ 'కాకు' శబ్దమునం దంతర్గతముచేసి ఈ భాగమునంతటిని 'కాకుస్వర వ్యంజన' మనుట సమంజసమే అగుచున్నది.

కాకువుకూడ సాకాంక్ష-నిరాకాంక్షములనెడి భేదములచే రెండు విధములుగా ఉండును. అనియుక్తార్థము సాకాంక్ష మనబడును; అనగా సంకేతితమైన అర్థమునేకాక న్యూనార్థమును కాని, అధికార్థమును కాని చెప్పుటకు వీలుకలది సాకాంక్ష వాక్య మనబడును. ఇంక నియుక్తార్థమైనది అనగా సంకేతితార్థమును మాత్రమే ప్రతిపాదించునది నిరాకాంక్ష వాక్య మనబడును.

(1) పరిసమాప్తములు కాని ఉదాత్తానుదాత్తాది వర్ణములను ఉచ్చనీచాద్యలంకారములను కలిగినదియును, తార స్వరముతో ప్రారంభింపబడి మంద్ర స్వరముతో అంతమగునట్టిదియును, కంఠోరస్థానములందు జనించునదియును, అనియుక్తార్థమును అగు వాక్యమునకు సంబంధించిన స్వరము 'సాకాంక్షకాకువు' అనబడును,

(2) పరిసమాప్తములైన వర్ణాలంకారములు కలదియును, మంద్రస్వరముతో ప్రారంభింపబడి తారస్వరముతో అంతమగునదియును, శిరస్సునందు జనించునదియును, నియుక్తార్థమును అగు వాక్యమునకు సంబంధించిన స్వరము 'నిరాకాంక్ష కాకువు' అనబడును.

5. అలంకారములు[21]— ఉచ్చ-దీప్త-మంద్ర-నీచ-ద్రుత-విలంబిత భేదములచే పాఠ్యాలంకారములు ఆరు విధములు. వీని లక్షణములను వివరింతును—

(1) ఉచ్చము— ఇది శిరఃస్థానముయొక్క అధోభాగమందు[22] జనించు తారస్వరము. దూరమునందున్నవానిని పిలుచుట, ఆశ్చర్యము, ఉత్తర-ప్రత్యుత్తర రూపమైన సంభాషణము, దూరమున ఉండి పిలుచుట, భయపెట్టుట, బాధ మొదలగు వానియందు ఈ స్వరమును ప్రయోగించవలెను.

(2) దీప్తము— ఇది శిరఃస్థానముయొక్క ఊర్ధ్వభాగమందు జనించు తారతరస్వరము. ఆక్షేపించుట, కలహము, వివాదము, అమర్షము, కోపముగలవాని ధిక్కారము, క్రోధము, శౌర్యము, దర్పము, తీక్ష్ణముగను పరుషముగను మాటా

'ఆకాంక్ష' అనగా సంకేతబలమున వచ్చు అర్థమునే కాక న్యూనాధికములగు అర్థములను కూడ ప్రతిపాదించవలెననెడి వక్తృగతమైన ఆకాంక్ష (=కోరిక). ఇట్టి ఆకాంక్ష లేకపోవుట నిరాకాంక్ష అగును.

21. 'అలం' అనగా పర్యాప్తమని అర్థము. 'కాకు స్వరూపము దీనిచే పర్యాప్తముగా సంపద్యమానమగును కాన ఇవి 'అలంకారము' లనబడెను. అనగా ఇవి కాకుస్వరమును ప్రస్ఫుటము చేయునని గ్రహించవలెను. అలంకారమనగా భూషణమని ఇచ్చట అర్థము చెప్పరాదు. [అభినవభారతి - 2వ సం - పుట 392]

22. ఉరము, కంఠము, శిరము అనెడి మూడు స్థానములును ఊర్ధ్వ-అధో భేదములచే ఆరు విధములు అగుచున్నవి. ఇట్లేర్పడిన 6 స్థానములందును జనించు స్వరములు (అలంకారములు) కూడ ఆరు విధములగుచున్నవి. [అభినవభారతి - 2వ సం - పుట 393]



డుట, నిర్భర్త్సనము (మాటలతో బెదరించుట), ఆక్రందనము మున్నగువానియందు ఈ స్వరమును ప్రయోగించవలెను.

(3) మంద్రము— ఇది ఉరఃస్థానముయొక్క ఊర్ధ్వభాగమందు జనించు స్వరము. నిర్వేదము, గ్లాని, చింత, ఔత్సుక్యము, దైన్యము, వ్యాధి, క్రీడ, గాఢమగు శస్త్రక్షతములు, మూర్ఛ, మదము, రహస్యమును చెప్పుట మొదలగువానియందు దీనిని ప్రయోగించవలెను.

(4) నీచము— ఇది ఉరఃస్థానముయొక్క అధోభాగమందు జనించు మంద్రరస్వరము. సహజ సంభాషణము, వ్యాధి, శమము, శ్రమచే పీడింపబడుట, భయపడుట, పడిపోవుట, మూర్ఛనొందుట మున్నగువానియందు ఈ స్వరమును ప్రయోగించవలెను.

(5) ద్రుతము— ఇది కంఠముయొక్క ఊర్ధ్వభాగమందు నిష్పన్నమగు స్వరము. ఇది ద్రుత లయకు సబంధించినది. లల్లనము (స్త్రీ పిల్లలను బుజ్జగించుట), మన్మనము (ఇతరుల బలాత్కారమును అంగీకరింపక 'విడువిడు' అని చెప్పెడి మాటలు), భయము, శీతము, జ్వరము, ఆయస్తము (ఆవేగము), శీఘ్రముగా పనులను నెరవేర్చుట, ఆవేదనము మొదలగు వానియందు ఈ స్వరమును ప్రయోగించవలెను.

(6) విలంబితము —ఇది కంఠస్థానముయొక్క అధోభాగమునందు జనించు తనుమంద్ర స్వరము. శృంగారము, కరుణము, ఆలోచన, విచారము, అమర్షము, అసూయ, అవ్యక్తముగా పలుకుట, లజ్జ, చింత, తర్జనము (చేష్టలతో బెదరించుట), విస్మయము, దోషములను పేర్కొనుట, దీర్ఘరోగము, పీడించుట మున్నగువానియందు ఈ స్వరము ప్రయుక్తమగును.

పై విషయములను వివరించెడి ఆనువంశ్య శ్లోకములు కొన్ని కలవు— ఉత్తర-ప్రత్యుత్తరములతో సంభాషించుట, పరుషముగా ఆక్షేపించుట, తీక్ష్ణములైనవానిని పరుషములైన వానిని అభినయించుట, ఆవేగము, ఆక్రందనము, పరోక్షమునందున్న వానిని పిలుచుట, తర్జనము, త్రాసనము, దూరస్థునితో మాటాడుట, నిర్భర్త్సనము అనెడి భావములం దెల్లప్పుడును నానారససమాశ్రయములగునట్లుగా ఉచ్చ-దీప్త-ద్రుతకాకువులను ప్రయోగించవలెను.

వ్యాధి, జ్వరము, భయము, శీతము, నియమము, వితర్కము, గాఢమగు శస్త్రక్షతము, రహస్యమునుచెప్పుట, చింత, తపస్సు అనెడి భావములందు మంద్ర-నీచకాకువులను ప్రయోగించవలెను.

లల్లనము, మన్మనము, భయము, శీతము అనువానియందు మంద్ర-ద్రుత కాకువులను ప్రయోగించవలెను.

కన్పించి మాయమైనదానిని అనుసరించుట, ఇష్టానిష్టములను వినుట, ఇష్టార్థమును నిరూపించుట, చింత, ధ్యానము, ఉన్మాదము, అసూయ, నింద, అవ్యక్తార్థమును చెప్పుట, కథాకథనము, ఉత్తర-ప్రత్యుత్తరములతోడి సంజల్పము, సాతిశయమైన కార్యము, వికారము, వ్యాధి, క్రోధము, దుఃఖము, శోకము, విస్మయము, అమర్షము, ప్రహర్షము, పరిదేవనము అనువానియందు విలంబిత-దీప్త-మంద్ర కాకువులను ప్రయోగించవలెను.

లఘ్వక్షరములు ఎక్కువగా కలిగిన వాక్యమందు ఉచ్చకాకువును, గుర్వక్షర ప్రాయమగు వాక్యమందు దీప్తకాకువును ప్రయోగించవలెను.

సౌమ్యార్థములందును, సుఖభావములందును మంద్ర-విలంబిత కాకువును ప్రయోగించవలెను.

తీక్ష్ణములును, పరుషములును అయిన భావములందు దీప్త-ఉచ్చకాకువులను ప్రయోగించవలెను.

ఇట్లు భావభేదము ననుసరించి అనేక విధములగు కాకువులతో పాఠ్యమును ప్రయోగించవలెను.

హాస్య-శృంగార-కరుణములందు విలంబిత కాకువు, వీర-రౌద్ర-అద్భుతములందు ఉచ్చ-దీప్త కాకువులు, భయానక-బీభత్సములందు ద్రుత-నీచకాకువులు ప్రశస్తములు. ఇట్లు భావ-రసోపేతముగా కాకువును ప్రయోగించవలెను.[23]

6. అంగములు— విచ్ఛేద-అర్పణ-విసర్గ-అనుబంధ - దీపన - ప్రశమనములు అనెడి భేదములచే అంగములు ఆరు విధములు[24]—

---

23. కాకువు (intonation) పాఠ్యమునకు ప్రాణమువంటిది. దాని విషయమున చక్కని శిక్షణ, అభ్యాసము ఆవశ్యకములు. అమెరికాలోని ప్రతి విశ్వవిద్యాలయమునందును 'నాటకశాఖ' కలదు. దానిని "Department of Drama and Speech" అందురట. దీనిని బట్టి పాఠ్యమునకు (speech) వారు ఎంత ప్రాముఖ్య మిచ్చుచున్నారో తెలియగలదు. కాకువనునది పద్యమునందును, వచనమునందును చక్కగా ప్రయుక్తము కావలయును. ఇంకను వివరములకు 3వ విశేషాంశమును చూడవలెను.

ఇచ్చట ఉచ్చ-దీప్తాద్యలంకారములే కాకు శబ్దముచే వ్యవహరింపబడినవి.

24. ఈ అంగములు నాదమునకు సంబంధించినవే కాని లయకు సంబంధించినవి కావని తెలియవలెను. పాఠ్యమునందలి నాదముయొక్క స్థితి భేదముల ననుసరించియే ఈ ఆరు అంగములును ప్రవర్తించును—

అర్పణము - నాదముయొక్క ఉపచయము (వృద్ధి)
విసర్గము - నాదముయొక్క అపచయము (తగ్గింపు)
విచ్ఛేదము - నాదముయొక్క త్రుటితత్వము (అభావస్థితి)
అనుబంధము - నాదముయొక్క అత్రుటితత్వము (భావస్థితి)
దీపనము - నాదముయొక్క ఆరోహణము
ప్రశమనము - నాదముయొక్క అవరోహణము
[అభినవభారతి - 2 వ సం - పుట 397].



(1) విచ్ఛేదము— విరామకృతమైనది 'విచ్ఛేద'మనబడును (అనగా నాదము యొక్క సమాప్తి).

(2) అర్పణము— లీలాసహితమును, సుందరమును, మనోహరమును అగు స్వరముతో రంగమును పూరించునట్లు పఠించుట 'అర్పణ' మనబడును.

(3) విసర్గము— వాక్యన్యాసము (అనాదరణము) 'విసర్గ' మనబడును.

(4) అనుబంధము—పదాంతరములందుకూడ అవిచ్ఛేదముగా లేదా గ్రుక్క త్రిప్పకుండగా పఠించుట 'అనుబంధ' మనబడును.

(5) దీపనము— మూడు స్థానములందును క్రమముగా స్వరమును ఆరోహణమును పొందించుట 'దీపన' మనబడును.

(6) ప్రశమనము— తారగతస్వరములకు విస్వరత్వము లేకుండునట్లుగా అవరోహణముచేయుట ప్రశమన మనబడును.

రసగతమైన వీని ప్రయోగమును ఇంక వివరింతును— హాస్య-శృంగారములందు అర్పణ-విచ్ఛేద-దీపన-ప్రశమన సహితమగు సాకాంక్ష కాకువుతో పాఠ్యమును ప్రయోగించవలెను. కరుణమందు దీపన-ప్రశమన యుక్తముగా, వీర-రౌద్ర-అద్భుతములందు విచ్ఛేద-ప్రశమన-దీపన-అనుబంధ బహుళముగా, బీభత్స-భయానకములందు విసర్గ-విచ్ఛేద యుక్తముగా పాఠ్యమును ప్రయోగించవలెను.

ఈ అంగము లన్నింటిని మూడు స్థానములందును మంద్ర-మధ్య-తారములతో ప్రయోగించవలెను. దూరస్థునితో మాటాడుటయందు శిరోగతమైన తారస్వరమును, నాతిదూరస్థునితో సంభాషించునప్పుడు కంఠగతమైనమధ్యస్వరమును, పార్శ్వస్థునితో మాటాడునప్పుడు ఉరోగతమైన మంద్రస్వరమును ప్రయుక్తములు కావలయును మంద్రస్వరమునుండి తారస్వరమునకును, అట్లే తారస్వరమునుండి మంద్రస్వరమునకును సూటిగా పోరాదు. ఈ స్వరములకు సంబంధించిన ద్రుత-మధ్య-విలంబిత లయలు మూడును రసానుగుణములుగా ప్రయుక్తములు కావలెను. హాస్య-శృంగారములందు మధ్యలయ, కరుణమందు విలంబితలయ, వీర-రౌద్ర-అద్భుత-బీభత్స-భయానకములందు ద్రుతలయ ప్రయుక్తములు కావలయును.*

### విరామము

ఛందోవశమున కాక కార్యవశమున అర్థసమాప్తిఅగుటచే విచ్ఛేదము కలుగుట 'విరామ' మనబడును. అనగా పదములను అర్థవంతముగా విడదీసి చదువవలెనేకాని

---

*[కాశీ ముద్రణమునందు 19 వ అధ్యా—36-58 శ్లో.వ ; బొంబాయి ముద్రణమునందు 17 వ అధ్యా—98-119 శ్లో. వ; బరోడా ముద్రణమునందు 17వ అధ్యా—103-131 శ్లో. వ.]

గణములనుబట్టి విడదీసి చదువరాదు. ఏలనన పాదమునందు ఒకటి, రెండు, మూడు, నాలుగుగేసి అక్షరముల తరువాతకూడ విరామములు కన్పట్టుచున్నవి. ఉదా :

కిం? గచ్ఛ. మావిశ. సుదుర్జన। వారితోసి।
కార్యం త్వయా న మమ సర్వజనోపభుక్త॥ 132

—ఏం? వెళ్ళు. రావద్దు. దుర్జనుడ! రాకూడదు. సర్వజనోపభుక్తుడవు, నీతో నాకు పని లేదు (ఇందు మొదటిపాదమున ఒకటి, రెండు, మూడు, నాలుగేసి అక్షరముల తరువాత వచ్చెడి విరామములకు ఉదాహరణములు కలవు). పై విధముగా అసమస్త (చిన్న చిన్న) పదములుగల పాఠ్యమునందే అంకుర-సూచాభినయముల ప్రయోగమునకు అవకాశము ఎక్కువగా ఉండునని తెలియవలెను. కావున విరామమును గూర్చి ప్రయత్నించవలసి ఉన్నది. ప్రశ్న : ఎందువలన? సమా : విరామమే అర్థానుదర్శకము కావున. ఇందును గూర్చి ఒక శ్లోకముకలదు— ప్రయోక్తలు విరామమునుగూర్చి నిత్యమును ప్రయత్నించవలెను. అర్థానుసారియగు అభినయము విరామమునందే ప్రతిష్ఠితమై ఉన్నది.

యత్ర వ్యగ్రా వుభౌ హస్తౌ తత్రదృష్టిసమన్వితః।
వాచికాభినయః కార్యో విరామై రర్థదర్శకైః[25]॥ 134

—ఎచ్చట రెండు హస్తములును అభినయవ్యగ్రములై ఉండునో అచ్చట అర్థదర్శకములగు విరామములతో దృష్టిసమన్వితమగు వాచికాభినయము నొనరించవలెను.

హస్తములు వీర-రౌద్రములందు ప్రాయికముగా ప్రహరణాకులములుమ, బీభత్సమందు కుత్సితత్వమువలన కుంచితములును, హాస్యమందు ఉద్దేశమాత్రముచే కుంచితములును, కరుణమునందు ప్రలంబితములును, అద్భుతమందు విస్మయమువలన భయానకమందు భయమువలన స్తబ్ధములును కావలయును. పై విధముగా కాని, ఇంకొక విధముగా కాని హస్తప్రచారమున్నప్పుడు అలంకార-విరామములచేతనే అర్థములను స్పష్టముచేయవలెను. విరామములనునవి వృత్తమునకు అలంకారములని తెలియవలెను.

వృత్తమునందు అర్థము సమాప్తమైనప్పుడుకాని, ప్రాణవశమునకాని (రస-భావాద్యౌచిత్యముచేకాని) పదములతరువాత పాటింపబడు విరామములందు

25. పుట 311 చూడవలెను. పూర్వము (బరోడా ముద్రణమునందు 9 వ అధ్యా— 180 శ్లో.) ఈ శ్లోకముదృష్టి ప్రాధాన్యమును నిరూపించుటకు చెప్పబడినది. ఇప్పుడు విరామప్రాధాన్యమును నిరూపించుటకు చెప్పబడినది. అందుచే పునరుక్తిదోషము లేదు. [అభినవభారతి - 2 వ సం - పుట 400]



ఉచ్చ-దీప్తాద్యలంకారములను తప్పక పాటించవలెను[26]. పదవర్ణ సమాసమందును, ద్రుతముగా ఉచ్చరింపవలసిన చోటను, అనేకార్థములు సంకీర్ణములైనప్పుడును, పాదాంతమందు కాని ప్రాణవశమున కాని విరామమును పాటించవలయును. ఇంక తక్కినచోట్ల (అనగా చిత్తవృత్తికి కాక, విభావాదులకు మాత్రమే ప్రాధాన్యమున్న చోట) అర్థము ననుసరించి విరామమును పాటించవలెను.

ఇప్పుడింక భావ-రసగతములగు కృష్యాక్షరములను వివరింతును. ఆ, ఏ, ఐ, ఔ అనెడి ఈ దీర్ఘస్వరములతోకూడిన వ్యంజనము 'కృష్యము[27]' అనబడును. విషాదము, వితర్కము, ప్రశ్న, అమర్షము అనువానియందు పై కృష్యాక్షరములను కలా-కాల ప్రమాణముతో (విలంబితముగా) పఠించవలెను. ఇంక తక్కిన అక్షరముల విషయమున అర్థానుసారముగా విరామమును పాటించవలెను. విలంబితముగానుండు విరామము ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు లేదా ఆరు కలల కాలమునందు ప్రయుక్తము కావలయును. ఈ విలంబితవిరామమునం దెల్లప్పుడును గుర్వక్షరములే (కృష్యాక్షరములే) ప్రయుక్తములు కావలెను. వీనిని ప్రయోగించుటకు 6 కలల కాలముకంటె అధిక కాలమును తీసికొనరాదు. కాని, ఆయా కారణముల ననుసరించి ఈ విరామమును అంతకంటెను ఎక్కువ విలంబితముగా కూడ చేయవచ్చును (ఉదా : వ్యాధి-అపస్మార-చింతనాదులందలి దీర్ఘకాలస్మరణము). పై విధముగా రస-భావానుగుణముగా వృత్తమునందు విరామమును పాటించవలెను. తద్‌జ్ఞులు వృత్తపాదములందు క్రమము నతిక్రమించి కూడ అర్థవశముననే విరామమును పాటించవలసియున్నది[28].

26. ప్రాణవశమున అనునప్పుడు 'గ్రుక్కపట్టలేకపోవుటచే అగతికముగా విరామమును పాటించినప్పుడు' అని కొందరు అర్థము చెప్పుదురు. అది సరికాదు. ప్రాణములనగా రస-భావములు; రస-భావౌచిత్యమును అనుసరించియే విరామములను పాటించవలెను. శిక్షావశమున గ్రుక్కపట్టి చదువుట నేర్చుకొనవలయునేకాని విరామములను యథేచ్ఛముగా పాటించరాదని తెలియవలెను. [అభినవభారతి - 2వ సం - పుట 401]

27. 'కృషము' అనగా విలంబిత లయ. దీనియందుపయుక్తములగుటకు యోగ్యములు కాన ఇవి కృష్యములు; ఇవి సంధ్యక్షరములు [అభినవభారతి - 2వ సం - పుట 402]. అభినవగుప్తుడిచ్చట ఈ, ఊ లను కూడ చేర్చెను.

28. ఇంతవరకును పద్యమును చదువు విధానము నిర్దిష్టమైనది. పద్యపఠనమునందు అర్థానుసారముగా రస-భావ సూచనము మాత్రమే ముఖ్యము; అంతియేకాని సంగీతమునకు ప్రాధాన్యమిచ్చుటయును ఎదుటి 'హార్మోనిస్టు' ముఖముమీద దృష్టిని నిలుపుటయును చేయరాదు.

పాఠ్యమందు అపశబ్దమును[29] పఠించరాదు. వృత్తభంగముకలుగునట్లు చదువ రాదు. విరామము ఆవశ్యకముకానిచోట అనవసరముగా ఆపి చదువరాదు. దైన్యమునందు కాకుస్వరమును దీప్తము చేయరాదు.

ఇట్లు కావ్యదోష వర్జితమును, లక్షణాఢ్యమును, గుణాన్వితమును, అయిన పాఠ్యమును స్వర-అలంకార సంయుక్తముగా, యథావిధిగా పఠించవలెను. సంస్కృత పాఠ్యమునందు విధింపబడిన అలంకార-విరామములనే స్త్రీల ప్రాకృత పాఠ్యమునందును పాటించవలెను.

ఇట్లు స్వరకృతమును, కలా-కాల-లయాన్వితమును అగు పాఠ్యమును ప్రయోక్తలు దశరూపములందు ప్రయోగించవలెను. ఇంతవరకును కాకు విధాన మును వివరించితిని.[30] ఇంక దశరూప విభాగమును వివరింతును.*

సప్తదశాధ్యాయము సమాప్తము

---

29. పదములను సరిగా విడదీసి చదువనిచో అవి కలిసిపోయి ఇంకొక పదముగా భాసించును. ఉదా : 'రామునితో కపివరుం డిట్లనియె' అనుటకు బదులు 'రామునితోక పివరుండిట్లనియె' అని చదువుట. ఇట్లు చేయుటవలన అర్థస్ఫూర్తి చెడుటయేకాక అపార్థ మును సంభవించును. ఉచ్చారణము సరిగా లేనిచో కూడ అపార్థము సంభవించును. ఉదా:- 'ఎందు దాగినావురా రామా!' అనుటకు బదులుగా 'ఎంత తాగినావురా రామా!' అని 'సంగీత కచేరీ' లందు పాడుచుండుట. కావున పై విధముగా అశ్రద్ధగా పఠించరాదు.

"వెడలెను కో-దండపాణి"— ఇందు సంగీతవశమున కోదండపాణి 'దండపాణి'అగు టయును మనము వినుచుందుము.

30. కావ్యములలో ముఖ్యముగా రూపకములన్నియును సంభాషణ ప్రధానములును, అభినేయములును అగుటచే 'కాకు స్వరము' వీనికి ప్రాణమనుట స్పష్టము పైని వివరించిన ఆరు అలంకారములే కాక భాషావిధానము, సంబుద్ధి విధానము కూడ కాకుస్వరమును వ్యక్తము చేయునవియే అగుటచే ఈ అధ్యాయము నంతటిని 'కాకుస్వరవ్యంజన' మను టయు, అధ్యాయాంతమున 'కాకువిధానము'ను వివరించితినని పేర్కొనుటయు సమంజస ములగుచున్నవి.

*[కాశీముద్రణమునందు 19 వ అధ్యా—58-78 శ్లో. వ., బొంబాయిముద్రణము నందు 17వ అధ్యా—119–137 శ్లో. వ., బరోడా ముద్రణమునందు 17వ అధ్యా-— 132–150 శ్లో. వ,]



## విశేషాంశములు

### 1. ప్రాకృత భాష

నాట్యశాస్త్రమందలి సంస్కృతమును గూర్చిన వివరణము కాని, ప్రాకృతమును గూర్చిన వివరణము కాని వ్యాకరణమని చెప్పదగినంతగా లేవు. మరియు సంస్కృతమును గూర్చి చేయబడినంత వివరణము కూడ ప్రాకృత విషయమున కన్పట్టదు. సంస్కృత పద ములు ప్రాకృతపదములుగా ఎట్లు మారుచున్నవి? అను విషయమే ఇందు చెప్పబడినదని తెలియవలెను. "సంస్కృతమే వ్యత్యస్తమును, సంస్కారగుణ వర్జితమును అయినప్పుడు అది ప్రాకృత మనబడును" అని భరతుడే చెప్పెనుకదా. మరియు "సంస్కృత పదముల లోని వర్ణములును, వ్యంజనసంయుక్తములగు స్వరములును ప్రాకృతమునందెట్లు మార్పు చెందునో వివరింతును" అని భరతుడు పేర్కొనుటయు పై విషయమును స్పష్టము చేయు చున్నది. "మునినా దిగ్దర్శితా, విస్తారవిజిజ్ఞాసుః ప్రాకృతదీపికాదిక మవలోకయేత్. ఉత్పల విరచితాయాం చ సూత్రవృత్తౌ పద్ధతే చ స్ఫుటం పూర్ణం చ సర్వమస్తీతి తత్రాదరః కార్యః" అని అభినవగుప్తుడు కూడ పేర్కొనుట గమనార్హము. [అభినవభారతి - 2వ సం - పుటలు 371-372]

నాట్యశాస్త్రమందు 7 భాషలును (మాగధి మొ॥), 7 విభాషలును పేర్కొన బడినవి. భరతుడు వివరించిన 'ప్రాకృతభాష' అనునది వీటి అన్నింటికిని సామాన్య వాచకమా? లేక ఈ పదునాలుగు భేదములలోను ఒకటియా? అను విషయమును డా. ఘోష్ చర్చించి ఉన్నారు [The Date of Natya Sastra - Journal of the Dept. of Letters, Calcutta University]. ఈ అధ్యాయప్రారంభమున చేయబడిన 'విభ్రష్ట' పద వివరణము కేవలము శౌరసేనీభాషకు మాత్రమే చెందునని వారు నిర్ణయించినారు. శుద్ధ జాతులవారందరికిని శౌరసేనీభాషనే వాడవలెనని భరతుడు కూడ చెప్పుట గమనార్హము.

మొత్తమునకు రూపకములం దుపయుక్తములగు భాషలు క్రిందివిధముగా ఉండునని చెప్పవచ్చును. 12 వ అధస్సూచికను కూడ చూడవలెను— అతిభాష, ఆర్యభాష, లౌకిక సంస్కృతభాష. శౌరసేన్యాది ప్రాకృతభాషలు ఏడు. ఆభీరాది విభాషలు ఏడు.

"న బర్బర కిరాతాంధ్ర..." అనెడి శ్లోకమును కొందరు పెద్ద పండిత-విమర్శకులే సరిగా అర్థముచేసికొన్నట్లు కన్పట్టదు. ఆ ఒక్క శ్లోకమును మాత్రమే విడదీసి చూచినచో అట్టి అభిప్రాయమే కలుగుట కవకాశమున్నది. కాని ఆ శ్లోకమును అట్లు చూచుటకు వీలు లేదు. అందలి 'భాషా' శబ్దమునకు శౌరసేన్యాది శుద్ధ భాషలని అర్థము. బర్బర-కిరాతాదు లకు శౌరసేన్యాది భాషలను వాడరాదనియు, బర్బర-కిరాత-ఆంధ్రాది విభాషలనే వాడ వలెననియు దాని కర్థము. 10, 11, 12 అధస్సూచికలను కూడ చూడవలెను.

నాడు ఆంధ్రము విభాషగా మాత్రమే పరిగణింపబడినదని తెలియవలెను.

రూపకములందు ఆ యా వ్యక్తులు ఏయే భాషలను మాటాడవలయునో భరతుడు వివరించియుండెను—

సంస్కృతమును మాటాడువారు— ధీరోదాత్తాది నలుగురునాయకులు, ఉత్తమ గ్రహగ్రస్తులు, పరివ్రాజకులు, మునులు, శాక్యభిక్షువులు, చోక్షులు, శ్రోత్రియులు, యతులు.

పట్టపురాణి (కాల-అవస్థా విశేషములందు), గణిక (కలాభ్యాసవశమున సరళ సంస్కృత ముమ), శిల్పకారిక (రాజును వినోదింపజేయుటకు), అప్సరసలు.

ప్రాకృతమును మాటాడువారు— ధీరోదాత్తాదులు (ప్రచ్ఛన్న రూపమునందున్న ప్పుడు), ఐశ్వర్యమత్తులు, దరిద్రులు, అధ్యయనముచేయని ఉత్తమవంశసంజాతులు, భాగవతులు, తాపసులు, ఉన్మత్తులు, బాలురు, నీచగ్రహాగ్రహస్తులు, స్త్రీలు, నీచులు, నపుంసకులు, ధూర్తులు, లింగస్థులు, అప్సరసలు (మనుష్య స్త్రీలుగా అవతరించినప్పుడు).

ఇంక శౌరసేన్యాది భాషలను, ఇతర విభాషలను ఎవరెవరికి ఉపయోగించవలెనో భరతుడే స్పష్టముగా వివరించెను.

2. పాత్రోచిత భాష

ఈ 17 వ అధ్యాయమందు చేయబడిన భాషా వివరణమును పరిశీలించి చూచినచో భరతుడు పాత్రోచిత భాషకు ప్రాధాన్య మిచ్చినాడనుట స్పష్టము కాగలదు. సంస్కృత రూపకము లన్నింటియందును ఇట్టి ఔచిత్యము పాటింపబడినది. తెలుగుభాషలో మాత్రము ఇది ఒక తీవ్ర సమస్య అయినది. ఏ భాషయందైనను రూపకములందు పాత్రోచిత భాష ఆవశ్యక మనెడి వాదమును నెలకొల్పి, దానిని ఒక ఉద్యమముగా సాగించినవారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు. వారు కృతకృత్యులైనారనియే చెప్పవచ్చును. తెలుగులో పాత్రోచితభాష అనగా- ఆ యా వ్యక్తులకు ఆయా మాండలికముల నుపయోగించుట, అసంస్కారులును విద్యాహీనులును అయినవారికి గ్రామ్యమును లేదా వ్యావహారిక భాషను ఉపయోగించుట.

'అవస్థానుకృతిర్నాట్య' మని కదా ఆలంకారికుల నిర్వచనము. మరి, అది పాత్రోచిత భాషాసహితమైనప్పుడే ఈ నిర్వచనము సార్థకము కాగలదు. "దేశోచిత వేష-భాషారహితమైన దుష్టమగు నాట్యమును ప్రదర్శించినచో దానిని ఘాతముగా పరిగణించవలె" నని భరతుడు 27 వ అధ్యాయమందు చెప్పుట గమనార్హము.

3. కాకు స్వరము

రూపకములందు సంభాషణము ప్రధానము. ఏ యే అవస్థలందు ఎవరెవరు ఏ యే విధములుగా మాటాడవలయునో నిర్దేశించు విధానమే ఈ కాకుస్వరవ్యంజనము. 'కాకువు' అను పదము యొక్క అర్థమునకు 20 వ అధస్సూచికను, తదితర వివరణమునకు 17 వ అధస్సూచికను చూడవలెను.

పాఠ్యము షడలంకార సంయుక్తముగా ప్రయుక్తము కావలెనని భరతుడు చెప్పియుండెను. ఈ ఆరును పాఠ్యమునకు భూషణములనియు, ఉపకారకములనియు తెలియవలెను. మరియు స్వరాదులు ఏయే రసములం దుపయుక్తము లగునో కూడ వివరింపబడుట గమనార్హము.

శోకము, భీతి మొదలగు భావ విశేషములవలన కంఠస్వరమున ఏర్పడు వికారము లేదా మార్పు 'కాకువు' అనబడునని తెలియవలెను. దీనినే ఆంగ్లమున **'Intonation'** లేదా



**'Modulation of Voice'** అని అందురు. 'కాకువు'ను ప్రయోగించినవెంటనే శబ్దము స్పష్టార్థకమగును. ఇందులకు మూడు ఉదాహరణములను శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారి ధ్వన్యాలోకానువాదమునుండి ఒసంగుచున్నాను. [పుటలు-584, 587, 588]

> లక్కయిల్లు గాల్చి, విషాన్నము పెట్టి, జూదపుం
> గొలువు ప్రవేశపెట్టి, మముఁ గ్రూరత జీవధనంబులందుఁ జే
> దల నొనరించి, చాలక పాంచాలిఁ గొప్పునుబట్టి యీడ్చి, చీ
> రల సభ నొల్చినట్టి ధృతరాష్ట్రజు లేఁ గలుగంగ స్వస్థులే ?
>
> —[శ్రీ వద్దాది సుబ్బారాయుడుగారి వేణీసంహారానువాదము - పుట 3.]

పై పద్యమునందు 'స్వస్థులు' అనుచోట (ధృతరాష్ట్రజులు అను) పదాంతరార్థ సాపేక్షము కావున ఆ పదాంతరార్థస్మరణమువలన విజృంభితమగు క్రోధముచే కాకువు దీప్తమగును. 'స్వస్థులే' (అగుదురా?) అనుచోట భీముని అభిప్రాయానుసారముగా ధృతరాష్ట్రజులు స్వస్థులగుట అసంభావనీయమగు నర్థము కావున దానిని వినుటవలన నేర్పడు సంకోచమున కాకువు గద్గదమగును. 'ఏ కలుగంగ' అనుటలో 'ఏను' అని దర్పమాత్సర్యాది స్ఫూర్తివలన కాకువు తార (ఉచ్చైఃస్వరయుక్త) మగును. 'కలుగంగ' అనుటలో వారింత అపకార మొనర్చి యుండగా వారిని నాశన మొనర్పక తానిక జీవించియుండుట అసహ్యమను తలంపున కాకువు ప్రశాంతమును, తాను బ్రతికియుండుట వారిని నాశనమొనర్చుటకే అను తలంపాదవుటవలన ఉద్దీపితమును అగును.

ఇట్లు విచిత్రమగు కాకువు వ్యంగ్యార్థమును స్ఫురింపజేయుచు, దాని సహాయమును గొనుచు, తదుపస్కృతమగు వాచ్యార్థమును క్రోధమున కనుభావముగా నొనర్చును. ఇట్లు కాకువు వలననే వ్యంగ్యమగు అర్థము స్పష్టపడుచున్నది.

ఇంకొక ఉదాహరణము—

> ఔనే ! పరే ! మే మసతుల
> మౌనే ! అపవే ! పతివ్రతా ! ఏ శీలం
> బేనే చెడనిది, విను ; లో
> కానికిఁ జెండ్ల మన తీరకుఁ గామింపములే.

'స్వస్థులే' అనుచోట నున్నట్టి తీరున 'పతివ్రతా' అను వెడల కాకువు ఉండదు. 'ఔనే' అని ద్విరుక్తము జాతి-ప్రకరణ-విషయానుగుణము. మొదటి స్థలమున కాకువు లేదు కాని రెండవ యెడ ఉన్నది. ఇది అనుభవైక వేద్యము కాని నిరూపింప వలనగునది కాదు.

'వ్యభిచారిణి' అని ఒకతెచే అధిక్షేపింపబడిన మరియొక వనిత మొదటి ఆమెతో వాదాడుట ప్రకరణము. జాతి—లోకభయమును వీడి కించిత్ప్రౌఢావస్థయగు నీర్ష్యాళు స్త్రీ జాతి. విషయము— స్త్రీ జాతి పరస్పర ముద్ఘోషింపరాని అసతీత్వము. 'అసతుల మౌనే', అని ఆ కాంక్షోపహాసములతో కూడిన అంగీకార కాకువు, 'అపవే' అనుచోట ఇక మాటాడ నక్కరలేదని నిరాకాంక్షత్వమును సూచించుట నిముడ్చుకొన్న కాకువు. 'పతివ్రతా' అనునది చిరునవ్వుతోకూడి దీప్తమగు కాకువు. 'నీ శీలంబేనే చెడనిది' అని గద్గదస్వరముతో

సాకాంక్షమగు కాకువు. 'లోకానికి...గామింపముతే' అని నిరాకాంక్షమును, గద్గదోపహాస గర్భమును అగు కాకువు. ఇట్లు కాకు విశేషములను గుర్తించునది.

ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలెను. అన్నివిధములగు కాకువులును వ్యంజకములు కావు. ప్రశ్నమాత్రాదులం దుపయోగింపబడు కాకువులు వ్యంజకములు కాజాలవు. అవి ప్రశ్నాదులవరకే విశ్రాంతములగును. ఉదా:

ఏవనితల్ మముం దలప నేమిపనో? తమరాడువారు కా
రో? వలపించు నేర్పెరుగరో? తమ కౌగిటిలోన నుండగా
రావదియేమిరా విజయరాఘవ? యం చిలదూరి బల్కిమై
దీవరకత్తెనై పెనగి తీసుకవచ్చితినా? తలోదరీ!

—(తంజావూరు విజయరాఘవరాయలమీద చాటుధార)

ఇచ్చటి కాకువులు పైవానికన్న భిన్నవిధములు. ఈ వైవిధ్య ముచ్చారణ సమయమున గన్పెట్టవలసినదే కాని వ్రాయ వీలుకాదు. ఇవి ప్రశ్నాదిమాత్రవిశ్రాంతములు. ఇవి అర్థాంతరవ్యంజకములు కావు. మొదటిది వితర్క కాకువు. రెండవది ధిక్కార కాకువు. మూడవది సోత్ప్రాసకాకువు. నాలవది ప్రశ్నకాకువు. అయిదవది నిషేధకాకువు.

ఇచ్చట ఇంకొక విషయమును కూడ గుర్తించవలసి ఉన్నది. పై మూడు ఉదాహరణములును పద్యములే. అంతమాత్రమున కాకువు వచనమునం దుపయుక్తము కాదని తలంచరాదు. కాకువు పద్యమునం దెంత ముఖ్యమో వచనమునందును అంతియే ముఖ్యము. ఇంతకును ఈ కాకు వైవిధ్యములను వ్రాసి చెప్పుట కలవికాదు; సమర్థుడగు నాట్యాచార్యుడు చదివి వినిపించవలసినవి మాత్రమే.

నటుని వాచికాభినయము నాట్యశాలా నిర్మాణ పద్ధతిమీద కూడ ఆధారపడి ఉండు ననెడి విషయమును మరవరాదు. అంతియేకాక బాహ్యప్రయోగమునకును, నాట్యశాలయందలి ప్రయోగమునకును భేదము కలదు. వివరములకు "Accoustics, Theatre" అను వ్యాసమును పరిశీలించవలెను. [The Oxford Companion to the Theatre - PP 3 - 9]

వాచికాభినయమందు (delivery of speech)— vocabulary, pronounciation articulation, utterance, significant phrasing by stress, pause and pitch అనునవి ముఖ్యాంగములని పాశ్చాత్యులు కూడ గుర్తించియున్నారు—

Vocabulary may be defined as a knowledge of words and the custom of using them with the most perfect sense of their accepted significance......

Pronounciation is based on phonetic standard and customary use....

Articulation is the muscular action of jaw, lips and tongue in framing rhythm of speech. Its characteristics are lightness, precision, and unconscious control.....

Utterance implies the addition of vocal tone to the perfect articulatory action. It calls for the co-ordination of breath, phonation, resonation, and pitch variety, with the previous qualities of speech listed above....



Phrasing links all preceeding qualities into the significant expression of a complete thought: a sentence, affirmative or interrogative; a command, or a plea; a perenthisis or a contradiction....It is the basis of all team-work in speech. The unending study of rhythmic speech in great prose or verse is the basis of the whole achievement. The aim is unconscious automatic perfection.... [The Oxford Companion to the Theatre - P. 761]

### 4. నామ-సంబుద్ధి విధానములు

ప్రసిద్ధములైన పురాణేతిహాసములనుండి కథలను గ్రహించినప్పుడు వ్యక్తుల పేర్లను కవి క్రొత్తగా కల్పించవలసిన అవసరము అంతగా ఉండదు. కావున ఇందు చెప్పబడిన నామ విధానము కల్పితేతి వృత్తముల విషయకమని చెప్పవచ్చును. ఇంక సంబుద్ధివిధానము అనునది, సింగభూపాలుడు చెప్పినట్లుగా, పేరుపెట్టి పిలుచుటకు వీలుకానివారిని వేరొక నామముతో పిలుచు పద్ధతి. ఇచ్చట చెప్పిన సంబోధనలు సంస్కృత మర్యాదకు సంబంధించినవి. దేశ-భాషా-ఆచారములను బట్టి ఇవి మారుచుండును.

---

# అధ్యాయము 18[1]

## దశరూపములు[2]

[కాశీముద్రణమునందు 20 వ అధ్యా—154[3] శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 18 వ అధ్యా—198[4] శ్లోకములును, బరోడాముద్రణము నందు 18 వ అధ్యా—127 శ్లోకములును కలవు.]

ఇంక దశరూప[5] విభాగమును, అనగా, దశరూపముల నామములను, లక్షణములను,[6] ప్రయోగ పద్ధతి[7]ని వివరింతును.

నాటకం-సప్రకరణ-మంకో-వ్యాయోగ ఏవచ ।
భాణః-సమవకారశ్చ-వీథీ-ప్రహసనం-డిమః ॥ 2
ఈహామృగశ్చ విజ్ఞేయో దశమో నాట్యలక్షణే । 3

---

1. ఈ భాగము కాశీముద్రణమునందు వింశాధ్యాయము. కాని, బొంబాయి - బరోడా ముద్రణములందు అష్టాదశాధ్యాయము.

2. 'దశరూప విధానము' అని కాశీ ముద్రణ పాఠము, 'దశరూప లక్షణ' మని బొంబాయి ముద్రణ పాఠము. 'దశరూప నిరూపణ' మని బరోడా ముద్రణ పాఠము. అభినవగుప్తుడు 'దశరూప విధాన' మనెను.

3. కాశీముద్రణమునందు అధ్యాయాంతమున 18 శ్లోకములలో లాస్యాంగములు వివరింపబడెను (136-153 శ్లో). ఈ 18 శ్లోకములును బరోడా ముద్రణమునందు 19వ అధ్యాయము చివర కలవు.

4. బొంబాయి ముద్రణమునందు కూడ లాస్యాంగములు ఈ అధ్యాయాంతముననే వివరింపబడెను. మరియు ఈ ముద్రణమునందు అధ్యాయ ప్రారంభ భాగమున వాచికాభినయమునకు సంబంధించిన వ్యాకరణ-ఛందో విషయములను వివరించెడి 46 శ్లోకములు కలవు (38-83 శ్లో). ఈ 46 శ్లోకములును కాశీ-బరోడా ముద్రణములందు లేవు.

5. దశ రూపములనునవి ప్రధాన రూపకములు. ఇవి కాక ఉపరూపకము లెన్నియో కలవు. ప్రధానములగు దశరూపకముల పరస్పర సంకీర్ణతచే జనించిన రూపకములు మరికొన్ని కలవు. వానిలో 'నాటి' (నాటిక) అను భేదమును భరతుడే వివరించెను. తక్కిన తోటక-సట్టక-రాసకాదులను కోహలాదులు వివరించియున్నారు [అభినవభారతి - 2 వ సం - పుట 407]. "ఏ అర్థము ప్రత్యక్షముగా చేయబడునో ఆ అర్థము రూప మనబడును" (రూప్యతే=ప్రత్యక్షీ క్రియతే యోఽ అర్థః స రూపం). తద్వాచకమైన కావ్యము కూడ 'రూప' మనియే అనబడును [అభినవభారతి - పుట 408] తరువాతి కాలములో 'రూప' మను పదమునకు 'క' ప్రత్యయము చేరుటచే 'రూపక' మను పదము వచ్చి ఉండును. 'రూప' మనెడి పదమునకును, 'రూపక' మనెడి పదమునకు ధనంజయ - ధనికుల



నిర్వచనములను ఈ అధ్యాయాంత మందలి 1 వ విశేషాంశములో వివరించియున్నాను. భరతుడు 'రూప' మను పదమునే వాడియుండెను. అభినవగుప్తుడు రూప-రూపకపదములను రెండింటిని వాడియుండెను. ధనంజయుని తరువాత 'రూపక' మనెడి పదమే వ్యవహారము నందు స్థిరపడినది.

"దశానాం రూపాణాం విభాగః కల్ప్యతే ఇతి దశరూప వికల్పనం"- పదిరూపముల యొక్క విభాగము ఇందు చెప్పబడును కాన ఇది దశరూపవిభాగమనబడినది. దశరూప పదమునకు పైవిధముగా షష్ఠీ సమాసముచే అర్థమును చెప్పుకొనవలెను. పది రూపములు కల కావ్యము కాన ఇది దశరూపమనబడినది అని కూడ కొందరు అర్థము చెప్పుదురు. అనగా ఇచ్చట దశరూపపదమునకు బహువ్రీహిసమాసముచే అర్థము చెప్పబడినది. వీరి అభిప్రాయమీ క్రిందివిధముగాఉన్నది—ప్రతిరూపకమునకును పదేసి రూపములు సంభవించును. ఉదాహరణమునకు వీథ్యంగము లన్నిరూపకములందును కలవుకదా ? ఆకాశభాషితములందు భాణము కన్పట్టుచునే ఉన్నది. ఇట్లే నాటకాది దశరూపములందును తక్కిన రూపములను కాంచనగును. అందుచే నాటకమనునది సకల ప్రబంధమునకును పేరు కాదు. అందులో ఒక భాగము మాత్రమే నాటకము; తక్కిన భాగములందు ప్రకరణాది రూపములుండును. కాని అందు నాటకాంశము అధికమగుటచే దానిని నాటకమని వ్యవహరించుచున్నారు. అట్లే ప్రకరణాంశ మధికము కలది ప్రకరణమనబడినది. ఇట్లే ఇతర రూపముల విషయమునను గ్రహించవలెను. కావున దశరూపమనునది దశ సంఖ్యా విభాగము కాదు. ఇట్లు చెప్పుటవలన దశరూప లక్షణయోగము కలిగిన నాటీ-సట్టకాదులు కూడ సంగృహీతములు కాగవలవు. వీనిని భరతుడు నిరసించెనని చెప్పుకోనక్కరలేదు. వీనియందు కూడ దశరూపలక్షణములు కన్పట్టుచుండును కాన ఇవియును రూపములే అనబడును. [అభినవభారతి - 2 వ సం - పుట 408]. ఈ దశరూపములును ప్రధానములైన నాటక-ప్రకరణములందు కన్పట్టగలవనియు, తక్కినవానియందు అన్నియును కన్పట్టవనియు తెలియవలెను.

ఈ దశరూప వికల్పనము అభినయ చతుష్టయమందలి వాగ్భాగమునకు విస్తృత వర్ణనమని తెలియవలెను. అనగా ఈ అధ్యాయము వాచికాభినయమునకు సంబంధించినదని అర్థము.

6. 'కర్మ' లని మూలము. కర్మ అనగా లక్షణమని అభినవగుప్తు డర్థముచెప్పెను. లక్షణ మనునది ఆ యా రూపములందలి ఇతి వృత్త-రస-నాయక-వృత్త్యాది వివరములకు సంబంధించినది.

7. ప్రయోగ మనగా నాటక ప్రయోగ విధానమని సామాన్యార్థము. నాటకమందు బహు పాత్ర లుందురు. కాని భాణమందు ఒక పాత్రయే ఉండును—ఇది ప్రయోగ విధానమునకు సంబంధించినది. కాని, ప్రయోగ పదమునకు అభినవగుప్తు డిచ్చట ఒక విశిష్టార్థమును చెప్పెను—"ప్రకృష్టః ఉచితో యోగః ప్రయోగః" ; ప్రకృష్ట మనగా ఉచితము, యోగ మనగా పరస్పర సంబంధము. కావున ప్రయోగ పదమునకు 'సముచితమైన యోగ' మని అర్థము. నాటక-ప్రకరణలక్షణముల సంయోగముచే నాటిక ఉద్భవించినట్లే రెండు లేదా అంతకు మించిన ప్రధానరూపకముల ఉచితసంయోగముచే పెక్కు రూపక

—లక్షణభేదములచే నాట్యము[8] దశ (పది) విధములు: నాటకము[9], ప్రకరణము[10], అంకము[11], వ్యాయోగము, భాణము, సమవకారము, వీథి, ప్రహసనము, డిమము, ఈహామృగము[12]. వీని లక్షణములను వరుసగా వివరింతును.

### వృత్తులు

సర్వ కావ్యములకును వృత్తులు మాతృకలు. ప్రయోగమునుబట్టి దశరూపములును ఈ వృత్తులనుండి జనించినవే[13]. జాతులచేతను, శ్రుతులచేతను స్వరములు

---

ములు జనించును. వీనిని జన్యరూపకములు (Derivative types) అందురు. ఇట్లు చెప్పుట వలన కోహలాదులు చెప్పిన తోటక-సట్టక-రాసకాదులకు భరతుని అంగీకారము లభించిన దని చెప్పవచ్చును. [అభినవభారతి - 2 వ సం - పుట 407]

8. నాట్యము=రూపము=రూపకము=**drama intended for presentation on the stage.**

9. దశవిధ రూపములలో 'నాటకము' మొదటిది. ఇది ఉత్తమమైనది కూడను. అతి ప్రధానమైన ఈ 'నాటక' పదము 'drama' అను అర్థమందు రూపక సామాన్య పదముగా కూడ వాడబడుచున్నది. ఇట్టి వ్యవహారము అభినవగుప్తునినాటికే కలదు. 19 వ అధ్యాయములో [అభినవభారతి - 2 వ సం - పుట 211] నాటక శబ్దమును వివరించుచు "ఇచ్చట నాటక శబ్దము రూపక విశేష పరముగా ప్రయుక్తము కాలేదు; మరి 'నాట్య' మను అర్థమందే ప్రయుక్తమైనది" అని అభినవగుప్తుడు చెప్పెను.

10. మూలమందు 'నాటకం-సప్రకరణం' అని కలదు. అనగా ప్రకరణముతో కూడిన నాటకమని అర్థము. ఇందలి 'స' (సహ) శబ్దముచే అంక-ప్రవేశక-సంధ్యాదుల విషయమున ప్రకరణమునకు నాటకముతోడి సామ్యము చెప్పబడినది. [అభినవభారతి - 2వ సం - పుట 407.]

11. నాటకాదులందలి 'అంకము' (act) నకును దీనికిని భేదమును చూపుటకై దీనిని 'ఉత్సృష్టికాంక' మనియు అందురు.

12. ఈ దశరూపములును ఇతిహాసాదుల కంటె విలక్షణములు. "పురాణాదులందు ఉపదేశదాయికత్వము ఉన్నది. కర్మఫల సంబంధ ప్రదర్శనమున్నది. అది ఇందు కొంత ప్రయోజ్యముగా ఉండును, కొంత సూచ్యముగా ఉండును, కొంత ఊహ్యముగా ఉండును, తక్కినది ఉపేక్ష్యముగా ఉండును. అంతియేకాక సంధ్యాది వ్యవస్థ ఉండుటయు, స్వప్రయోజనమగుటయు కూడ భేదకారణములు" అని కొందరందురు. సత్యమేమనగా ఈ దశరూపము రసావేశమును ప్రత్యక్షమొనరించును; అందుచే ఇది ఇతిహాసాదులకంటె విశిష్టమగుచున్నది. సూచ్యాది విభాగము ఇతిహాసాదులయందు కూడ ఉండవచ్చును. కాని వానివలెనే దశరూపము పాఠఫల మాత్రము కాదు. ఈ దశరూపము ప్రయోగమును కూడ పొందును. అందుచే కావ్యముగా మహాసామాన్యరూపము ఉన్నను, అవాంతర సామాన్యలక్షణ మిప్పుడు చెప్పబడుచున్నది. [అభినవభారతి - 2 వ సం - పుట 407.]

13. ఇచ్చట 'కావ్యము' అనగా అభినేయ కావ్యములే అని కొందరందురు. కాని, అది సమంజసము కాదు. ఈ సంసారమంతయును వృత్తి చతుష్కముతోనే నిండిఉన్నది.



'గ్రామ' భేదములకు కారణములగుచున్నట్లే వృత్తిభేదములచే కావ్యబంధ భేదములు సిద్ధించుచున్నవని తెలియవలెను[14]. షడ్జ-మధ్యమ గ్రామములు రెండును పూర్ణస్వరములు (సర్వస్వరసహితములు) అయినట్లే నాటక-ప్రకరణములనెడి కావ్యబంధములు

---

కాన అనభినేయ కావ్యములు కూడ వృత్తిప్రభవములే అగును. అభినేయ, అనభినేయ కావ్యములు రెండును కవిహృదయ వ్యవస్థితములగు వృత్తులవలన అనగా చేష్టలవలన ఉత్పన్నములగుచున్నవి. కాని, ఈ వృత్తులు నటులచే ప్రయుజ్యమానములగుటవలన అభినేయ కావ్యములందు ప్రయోగ (ప్రత్యక్ష భావనా) యోగ్యతను పడయుచున్నవి; ఇది ఇందలి విశిష్టత. వృత్తులు, వృత్త్యంగములు సర్వ కావ్యములందును ఉండునని సారాంశము. [అభినవభారతి - 2 వ సం - పుటలు 407-408.]

14. స్వర సముదాయము 'గ్రామ' మనబడును. ఆ స్వరములకు సంబంధించిన జాతి-శ్రుతుల యొక్క ప్రాథమ్య-ప్రాధాన్యాది భేదములచే షడ్జాదిగ్రామము లేర్పడుచున్నట్లే వృత్తుల యొక్క ప్రాథమ్య-ప్రాధాన్యాది భేదములచే రూపక భేదములు సిద్ధించుచున్నవి. (ప్రాథమ్యము, ప్రాధాన్యము, అల్పత్వము, భూయస్త్వము, పూర్ణత్వము, అపూర్ణత్వము, ఆరోహము, అంత్యత్వము, మధ్యత్వము అనునవి భేదములు.)

'శ్రుతి' అనునది నాద విశేషము; స్పష్టముగా చెవికి వినబడునంత చిన్న ధ్వనిని శ్రుతిఅందురు. శ్రుతులు ఇరువది రెండు కలవు. రెండు లేదా మూడు లేదా నాలుగు శ్రుతులచే 'స్వరము' లేర్పడుచున్నవి. షడ్జ-ఋషభాదు లేడును స్వరములు. గ్రహము, అంశము, తారము, మంద్రము, న్యాసము, ఉపన్యాసము, అల్పత్వము, బహుత్వము, షాడవము, ఔడవితము అను పది భేదములతో కూడినదై స్వరాశ్రయమగునది 'జాతి' అనబడును. షడ్జాది స్వరసముదాయము గ్రామమనబడును. ఈ గ్రామము షడ్జ-మధ్యమ భేదములచే రెండు విధములు. పంచమ స్వరము షడ్జగ్రామములో 4 శ్రుతులు కలదికాగా మధ్యమ గ్రామములో మూడు శ్రుతులు కలది అగుచున్నది. అనగా ఒకే స్వరము శ్రుతిభేదముచే గ్రామ భేదమునకు కారణమగుచున్నది. దశరూపమందలి వృత్తి స్వరస్థానీయము; శ్రుతులు వృత్త్యంగ స్థానీయములు. ఒకే వృత్తి-అంగములతో సంపూర్ణమై ఒక రూపకమును సూచించును, న్యూనాంగమై ఇంకొక రూపకమును సూచించును. ఈ విధముగా వృత్తులు, వృత్త్యంగములు రూపక భేదములకు కారణములగుచున్నవి. శ్రుతుల వలెనే జాతులును గ్రామములందు భిన్నములుగా ఉండును. జాతులు పదునెనిమిది విధములు. షడ్జగ్రామమందు షాడ్జీ ప్రభృతి శుద్ధజాతులు ఏడు ఉండగా మధ్యమ గ్రామమందు గాంధారీ ప్రభృతి వికృతజాతులు పదునొకండు ఉండును. (1. శుద్ధజాతులు—షాడ్జి, ఆర్షభి, ధైవతి, నిషాది, షడ్జోదీచ్యవతి, షడ్జకైశికి, షడ్జమధ్య; 2. వికృతజాతులు—గాంధారి, మధ్యమ, గాంధారోదీచ్యవ, పంచమి, రక్తగాంధారి, గాంధారపంచమి, మధ్యమోదీచ్యవ, నందయంతి, కర్మారవి, ఆంధ్రి, కైశికి.) [అభినవభారతి - 2 వ సం - పుట 409]

రెండును సర్వవృత్తి నిష్పన్నములు (లేదా అన్ని వృత్తులును కలవి) అగుచున్నవి[15]. అంతియేకాక ఇవి రెండును నానాబంధసమాశ్రయములుగా ఉండును (ఇతివృత్త-నాయకాది భేదములు కలిగిఉండును). తక్కిన వీథీ-సమవకార-ఈహామృగ-ఉత్సృష్టికాంక-వ్యాయోగ-భాణ-ప్రహసన-డిమముల నెనిమిదింటిని కైశికీవృత్తి హీనములనుగా రచించవలెను. ఇంక ఈ కావ్యబంధముల విశేష లక్షణములను వివరింతును.

నాటకము

1. నాటకము— ప్రఖ్యాతమైన వస్తువు, ప్రఖ్యాతుడును ఉదాత్తుడును అయిన నాయకుడును నాటకమునందుండవలెను. రాజర్షుల (ఋషితుల్యులైన రాజులయొక్క) వంశములందు జనించిన వారి చరిత్రలు ఇందు వర్ణితములు కావలయును. పతాకా-ప్రకరీ నాయకులు దివ్యులు కావచ్చును, అనగా అముఖ్య కథాభాగము దివ్యాశ్రయముగా ఉండవచ్చును (దేవతాదులు ప్రసన్నులగుట మొ॥). ఫలభూతములును, విచిత్రరూపములును అగు ధర్మ-అర్థ-కామ-మోక్షములతో కూడినది కావలయును; వీనిలోను సర్వజనాభిలషణీయములైన అర్థ-కామములు అనగా బుద్ధి-విలాసాదులును, గుణములును అధికముగా ఇందునిరూపింపబడవలెను. అంకములతో ప్రవేశకములతో కూడిఉండవలెను. ఇట్టిది నాటకమనబడును. నానారస-భావ చేష్టితములు కలదియును, బహువిధములగు సుఖ-దుఃఖములతో కూడినదియును అగు రాజుల చరితము నిబంధింపబడినదే నాటకమనబడును[16].

---

15. నాటక - ప్రకరణములు రెండును పూర్ణవృత్తి రూపకములును, తక్కిన ఎనిమిదియును అపూర్ణవృత్తి రూపకములును అగుచున్నవి. నాటక - ప్రకరణములందు శృంగారము ప్రధానరసముగాను, తక్కినవి అంగరసములుగాను ఉండును. శృంగారోచితమైన వృత్తి 'కైశికి'. అందుచే కైశికీవృత్తి ప్రధానముగాగల వీనిని కైశికీవృత్తిరూపకములని చెప్పవచ్చును. అప్పుడు తక్కిన ఎనిమిదియును అకైశికీవృత్తిరూపములగును. అకైశికీవృత్తిరూపములనునప్పుడు వీనియందు కైశికీవృత్తి ప్రధాన మెన్నడును కాదనియు, హాస్యమునకు ప్రవేశమున్నచోట అది అప్రధానముగా ఉండుననియు తెలియవలెను. వీరరసప్రధానములైన నాటకములు మాత్రము కొన్ని కైశికీవృత్తిహీనములుగా కన్పట్టుచున్నవి (ముద్రారాక్షసాదులు). డా. వి. రాఘవన్‌గారు వృత్తిని క్రిందివిధముగా వివరించినారు—

"Nātya is the imitation of action and each action has its characteristic mood or atmosphere or disposition, with respect to the man in action as well as to the Sahṛdaya who sees the Nātya. This mood or atmosphere or disposition is Vṛtti". ("The Vṛttis" - journal of Oriental Research - Vol. VI. Part IV P. 352)

16. వస్తువనగా కథ. ప్రఖ్యాతమనగా పురాణ - ఇతిహాసాది ప్రసిద్ధము. ఉదాత్తత వీరరసయోగ్యతా సూచకము; ప్రఖ్యాతోదాత్త నాయకమనుటచే ధీరోదాత్త - ధీరోద్ధత -



అంకము: ప్రారంభాది పంచావస్థలతో కూడిన నాటకకార్యము బిందువుచే విస్తృతము చేయబడుచుండును. అందు బీజనిష్పత్తిసహితమగు ప్రారంభావస్థ పరిపూర్ణమైన వెంటనే మొదటి అంకమును ముగించవలెను. ఇట్లు నాట్యాతత్త్వజ్ఞులు అవస్థానుగుణముగా తక్కిన అంకములను కూడ కల్పించవలెను[17]. 'అంక' మనునది రూఢి శబ్దము. రస-భావయుక్తములగు అర్థములను అనేకవిధములుగా ప్రరోహింపజేయును[18] (ప్రత్యక్షభావనాయోగ్యములనుగా చేయును) కాన ఇది 'అంక' మన

---

ధీరలలిత - ధీరప్రశాంతనాయకులు నలుగురును గ్రాహ్యులు. రాజర్షి అనగా ఆర్షజీవనము కలరాజు. గుణములు అనగా అప్రధానభూతములును, హేయములును, అపాయప్రధానములును అయిన ప్రతినాయకగతచేష్టితములు. బుద్ధిఅనగా రాజ్యాది సమృద్ధి. సుఖ-దుఃఖములతో కూడినదగుటచే నిత్యసుఖులైన దివ్యులు ఇందు నాయకులు కారాదని తెలియవలెను. ప్రఖ్యాతనాయకుడనుటచే వర్తమానరాజచరితము కూడ ఇందు వర్ణితముకారాదు.

ఇట్లన్ని విధముల సర్వలక్షణసంపన్నమైన నాటకము సామాజికుల హృదయములను ఆకర్షించి అవినీతులను కూడ వినీతులను చేయజాలుచున్నది. కావుననే 'నాటక' శబ్దము సర్వరూపక సామాన్యవాచకమైనది (9 వ అధస్సూచికను కూడ చూడవలెను). 'రాజుల చరితము' అని అనుటలో బహువచనముచే విజిగీషువు, శత్రువు, మధ్యస్థుడు, ఉదాసీనుడు మిత్రుడు, మిత్రుని మిత్రుడు అనువారలు గ్రహింపబడుదురని శ్రీశంకుకుడు వ్యాఖ్యానించినది యుక్తియుక్తముగా ఉన్నది. [అభినవభారతి - 2 వ సం - పుటలు 413-414]

17. అవాంతరవస్తుసమాప్తియందుకాని, విశ్రాంతికొరకుకాని చేయబడెడి విచ్ఛేదములు అంకములనబడును [అభినవభారతి - 2 వ సం - పుట 413]. ప్రారంభ-ప్రయత్న - ప్రాప్తిసంభవ - నియతఫలప్రాప్తి - ఫలయోగము అనునవి పంచావస్థలు. ఈ ఐదు అవస్థలకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క అంకము చొప్పన ఐదు అంకములను నిబంధించుట ముఖ్యము. అట్లుకాక ఒక్కొక్క అవస్థలో ఉపక్రమ - ఉపసంహారములనెడి రెండేసి భాగములను కల్పించుకొని ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క అంకమును కూడ నిబంధించవచ్చును. ఒక్క అవస్థను మాత్రమే ద్వైవిధముగా రెండంకములందు నిబంధించినచో మొత్తము ఆరు అంకములగును. రెండు అవస్థలను చెరి రెండేసి అంకములందు నిబంధించినచో మొత్తము ఏడు అంకములగును. ఈవిధముగా అన్ని అవస్థలకును ఉపక్రమ - ఉపసంహారములను రెండింటిని కల్పించినచో మొత్తము పది అంకములు రాగలవు. నాటక - ప్రకరణములు రెండును 5 నుండి 10 అంకముల వరకును నిబంధింపబడవలెనని తరువాత చెప్పబడును. ఒక అవస్థను ప్రధానముచేసి తరువాతి అవస్థను దానితోనే కలిపివేసి రెండింటిని ఒకే అంకమునందు నిబంధించవచ్చును. ఈ విధముగా నాటికాదులందు నాలుగే అంకములుండుట సంభావ్యమగున్నది. [అభినవభారతి - 2 వ సం - పుట 415]

18 ఇచ్చట మూలశ్లోకము క్రిందివిధముగా ఉన్నది.

అంక ఇతి రూఢి శబ్దో భావైశ్చ రసైశ్చ రోహయత్యర్థాన్ ।
నానావిధానయుక్తో యస్మాత్తస్మాద్భవేదంకః ॥ 14

ఇచ్చట 'గూఢ శబ్దః' అనియు, 'రూఢ శబ్దః' అనియు పాఠాంతరములుకలవు—

బడినది. ప్రారంభాద్యవస్థారూపమగు అర్థసమాప్తియును, బీజసంహారమును ఎచ్చట జరుగునో అచ్చట అంకమును ముగించవలెను; కాని కావ్యమందలి బిందువు మాత్రము కథయందంతటను వ్యాపించిఉండవలెను. ఇట్లు అర్థసమాప్తియును, బీజసంహారమును కలదియును, కించిదవలగ్నబిందువు అగునదియును 'అంక' మన బడునని తెలియవలెను[19]. నాయకులని పేర్కొనబడినవారియొక్క చరితమును, సంభోగమును అంకమునందు ప్రత్యక్షముగా ప్రదర్శితములు కావలెను. ఇట్లు నానావస్థోపేతమైనను అంకము సుదీర్ఘము కారాదు[20]*.

నాయక-దేవీ-గురుజన-పురోహిత-అమాత్య-సార్థవాహుల వృత్తములకు సంబంధించినదై విచిత్రరస విశేషయుక్తమగునది 'అంక' మనబడునని తెలియవలెను.[21] కేవలచరిత-సంభోగములు ప్రత్యక్షములగుటయేకాక రంజనాతిశయము గల క్రోధ-ప్రసాద-శోక-శాపోత్సర్గ (శాపకృతమైన అనర్థము నశించుట)-విద్రవ (శంకా-భయ-త్రాసకృతమైనది)-ఉద్వాహ(వివాహము)-అద్భుత సంభవదర్శనములు కూడ అంకమునందు ప్రత్యక్షములుగా ప్రదర్శితములు కావలెను.

*అంక కాలపరిమితి :* ఆవశ్యక కార్యములకు (సంధ్యావందన-భోజనాదులకు)

---

(1) భావములచేతను, రసములచేతను వ్యాప్తమగు అర్థము 'అంక' మనబడునని భట్టలోల్లటాదు లందురు.

(2) మరికొందరు 'రూఢి శబ్దః' అని పఠించిరి. రూఢి అనగా రోహణధర్మము కలది అనగా ఉత్సంగము (ఒడి).

ఏ నాటకభాగము శృంగారాది రసములచేతను, భావములచేతను విభావానుభావ వ్యభిచారిరూపములగు అర్థములను హృదయము నారోహింపజేయునో, ఏది నానా విధములగు వక్ష్యమాణవిధానములతో కూడి ఉండునో అట్టి నాటకభాగము ఉత్సంగమువలె ఆరోహణసంబంధము కలది కావున 'అంక' మని పేర్కొనబడుచున్నది.

(3) అంక మనగా లక్షణము. ఈ అర్థమున అంక శబ్దము రూఢము. లక్షణ మనగా ఇతర పదార్థములనుండి వేరుచేసి చూపునది (అన్యవ్యవచ్ఛేదకము); అనగా అనభినేయములగు ప్రవేశకాదులనుండి వేరుచేయునది. అంకములవలన రూపకములందు నానాత్వము సిద్ధించుచున్నది. నాటకాదులందలి అభినేయభాగమున ఏకదేశమగు అంకము రస-భావోపలక్షితములగు అర్థములను హృదయసంవాదసాధారణతాకరణముచే, ప్రత్యక్షభావనచే బీజములకు అంకురరూపత కలుగునట్లు రసాకారతను కల్గించుచున్నది.

పై విధముగా అంకము అనభినేయములగు చూళికా-ప్రవేశక-అంకాస్యాదులనుండి అభినేయాంశమును వేరుచేయునది కాన లక్షణము లేదా అన్యవ్యవచ్ఛేదకము అయ్యెను. ఇట్లు అంకశబ్దము సార్థకము. [అభినవభారతి - 2 వ సం - పుటలు 415-416]

19. బీజసంహారమనుటలో 'సంహార' శబ్దముచే ముఖాది సంధులందు యథాక్రమముగా నిరూపింపదగిన ఉత్పత్తి-ఉద్ఘాటన-ఉద్భేద-గర్భనిర్భేద-ఫలసమానయనములనెడు బీజముయొక్క దశావిశేషములు సూచింపబడినవని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 416]. ఇచ్చట మూలశ్లోకము క్రిందివిధముగా ఉన్నది.

యత్రార్థస్య సమాప్తిః యత్ర చ బీజస్య భవతి సంహారః ।
కించిదవలగ్నబిందుః సోఽంక ఇతి సదావగంతవ్యః ॥ 16

ఈ శ్లోకమునందు అంక స్వరూపము నిరూపిత మగుటయే కాక అంకత్రైవిధ్యము కూడ నిరూపితమైనది. అంకము మూడు విధములు—చూళికాంకము, అవతారాంకము, అంకముఖము (ఈ విభజనము కోహలాదులచే చెప్పబడినదట).

చూళికాంకము— ఒకానొక అర్థము అనభిసంధానపూర్వకముగా ఇతరులవలన ప్రాప్తించుట.



అవతారాంకము.—అన్ని అంకముల బీజభూతమగు అర్థమును సమ్మిళితముగా ఒకే చోట నిర్దేశింపబడుట.

అంకముఖము— ఇతివృత్తానుసంధానప్రధానముగా పూర్వాంకాంతమున ప్రకృతోపయోగి అగు ఉత్తరాంకేతివృత్తము నిబంధింపబడుట. [అభినవభారతి - 2 వ సం - పుట 217]

20. అంకము సుదీర్ఘమైనచో ప్రయోక్తలకును, ప్రేక్షకులకును కూడ ఖేదము కలుగును. 'కించిదవలగ్న బిందువు' అనగా సూత్రమువలె అంతటను వ్యాపించిఉన్న బిందువు అని అర్థము. ఫలమును పొందువాడు నాయకుడనబడును. సంభోగ మనగా రాజ్యప్రాప్త్యాది ఫలానుభవమని అర్థము. ఈ ఫలానుభవము ప్రధాననాయకగతమే కావలెను. ప్రత్యక్షముగా ప్రదర్శితములు కావలెననుటవలన ప్రవేశకాదులచే సూచితము కారాదని అర్థము. చరితమనగా నాయకుడు ఫలమును పొందుటకై చేయు ఉపాయానుష్ఠానము. నానావస్థలనుటచే నాయక - ప్రతినాయకు లిరువురి అవస్థలను క్రమముగా ఉపాదేయములుగాను, హేయములుగాను నిరూపింపబడవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 418]

* [కాశీముద్రణమునందు 20 వ అధ్యా - 1–17 శ్లో; బొంబాయి - బరోడా ముద్రణములందు 18 వ అధ్యా - 1–17 శ్లో.]

21. ఇంతవరకును ప్రధానముగా వర్ణనీయమైన నాయక వృత్తమును గూర్చి వివరింపబడినది. ఇంక ఇప్పుడు తదుపయోగి వృత్తములను గూర్చి కూడ వివరింపబడుచున్నది. ఇచ్చట నాయక శబ్దమునకు ముఖ్యులగు పతాకాది నాయకులని అర్థము. 'నాయకుని యొక్క దేవి, గురుజనులు......"అనుచు కొందరు పఠింతురు. 'దేవి' శబ్దమునకు మహాదేవీ - భోగినీ ప్రభృతులని అర్థము. గురుజనులనగా మాతృ - పితృ - భ్రాతృ - ఆచార్యాదులు. సార్థవాహుడనగా ఇచ్చట సేనాపతి అని అర్థము, లేదా ఇతివృత్తవశమున వణిజుడు కూడ కాదగును. వీరందరి వృత్తములు కలది అంకమని తెలియవలెను. విచిత్ర రస విశేషయుక్తమనుటచే ఇందు వివిధరసముల సమ్మేళన ముండునని తెలియవలెను— దేవీయోగమునందు శృంగారము, నాయకునియందు వీరము మొదలగునవి. [అభినవ భారతి - 2 వ సం - పుట 418]

విరోధము లేకుండునట్లుగా ఒక దినములో జరిగిన వృత్తమును ప్రయోజన-బీజాను సారముగా ఒక అంకమునందు నిబంధించవలెను." ధీమంతు డెన్నడును ఒకే అంకము నందు బహు కార్యములను కూర్చరాదు; ఆవశ్యక కార్యములకు విరోధము కలుగకుండ కార్యములను (సన్నివేశములను) కూర్చవలెను.[23] అంకమునందు రంగమున ప్రవేశించిన వారందరును బీజార్థయుక్తి యుక్తముగా, అర్థ-రసానుగుణముగా కార్యమును (ప్రయోజనమును) నిర్వర్తించి అంకాంతమునందు నిష్క్రమించవలెను. క్షణ-యామ-ముహూర్తములచే దినము విభక్తమైఉండును; అట్లే ఆయా కార్యములును (సంధ్యావందన - భోజనాదులును) కాలనియమముతో కూడిఉండును. అట్టి దిన విభాగమును గుర్తెరింగి సర్వకార్యములను, ప్రత్యేకముగా, పరిపూర్ణముగా, ఏకాలమం దేకార్యము నెరవేర్పదగినదో అట్లే వాని వాని విభాగములతో ప్రదర్శించవలెను.

ఒకనాడు జరిగిన కార్యమును సర్వమును అంకమునందు కూర్చుటకు వీలు పడనిచో అంకమును ముగించి, పిమ్మట మిగిలినదానిని ప్రవేశకములచే[24] సూచింప

---

22. పుట 374ను చూడవలెను. అరిస్టాటిల్ కూడ కాలపరిమితిని నిర్ణయించి యున్నాడు. కాని, భరతుడు ఒక అంకమునందలి వృత్తము ఒకరోజులో జరిగినది కావలెననగా అసలు విషాదరూపకేతివృత్తమే ఒకరోజులో జరిగినది కావలెనని అరిస్టాటిల్ నిర్దేశించెను—

"…..They (Epic poetry and Tragedy) differ, again, in the length of the action: for Tragedy endeavours, as far as possible, to confine itself to a single revolution of the sun, or but slightly to exceed this limit; where as the Epic action has no limits of time. This, then, is a second point of difference; though at first the same freedom was admitted in Tragedy as in Epic Poetry" [Butcher's translation of Poetics - P. 23)

23. "ఏకాంకే న కదాచిద్బహూని కార్యాణి యోజయేద్ధీమాన్", 22

అని మూలము. 'ఏకాంకే న కదాచిత్' అని నిషేధ పరముగా పై అర్థమును కొందరు చెప్పుదురు. 'ఏకాంకేన కదాచిత్' (ధీమంతుడెన్నడేని ఒకే అంకమునందు బహు కార్యములను కూర్చవచ్చును.) అని విధిపరమైన అర్థమును మరికొందరు చెప్పుదురు. [అభినవభారతి - 2 వ సం - పుట 419]

24. అంకమునందలి కార్యములన్నియును ప్రత్యక్షప్రదర్శనీయములు. అట్లు ప్రత్యక్షముగా ప్రదర్శించుటకు వీలుపడని కార్యములను ప్రవేశకములచే సూచింపవలెను. "అదృష్టమైన (ప్రత్యక్షముగా కనుపించని) అర్థమును కూడ హృదయమునందు ప్రవేశించునట్లు చేయునది కాన ఇది ప్రవేశక మనబడినది". ఈ ప్రవేశక శబ్దముచే చూళిక, అంకావతారము, అంకముఖము, ప్రవేశకము, విష్కంభము అనెడి అర్థోపక్షేపకములైదును గ్రహింపబడినవని తెలియవలెను. [అభినవభారతి—2 వ సం - పుట 421]



వలెను. నాటక-ప్రకరణములలో ప్రతి అంకమునందును నాయకుడు సన్నిహితుడు కావలయును. ఇంక ప్రవేశకాదులు వాని పరిజనుల ప్రసంగములతో కూడి ఉండును. నాటక-ప్రకరణములందు ఐదు మొదలుకొని పది వరకును అంకము లుండును (17వ అధస్సూచికను చూడవలెను). అంకమునకును అంకమునకును మధ్య కథాసంధాన మొనర్చుచు ఈ ప్రవేశకములను కూర్చవలెను.

ప్రవేశకము : అంకము ముగించిన పిమ్మట ఒక మాసములోపల, లేదా ఒక సంవత్సరములోపల జరిగిన కార్యమునంతటిని ప్రవేశకములందు సూచించవలెను. సంవత్సరమును మించిన కార్యము నెన్నడును ప్రవేశకములందు కూర్చరాదు[25]. ఏదేని కార్యవశమున పురుషుడు (నాయకుడు) దూరదేశము వెళ్ళవలసివచ్చినప్పుడు కూడ వెనుకటివలెనే అంకమును ముగించవలెను. ప్రవేశకము రెండంకముల మధ్య కూర్చబడవలెను. ప్రతి అంకాంతమునందును బిందువు సూచితమగుచుండును; ఆ బిందువిషయమును ప్రేక్షకులకు విస్తరించి చూపుటకై ప్రకరణ-నాటకములలో అంకముల మధ్య ప్రవేశకము కల్పింపబడుచుండును. ప్రవేశకము ఉత్తమ-మధ్యమ పురుషులచే ప్రయుక్తము కారాదు; ఉదాత్తవచనసహితమును కారాదు; ప్రయో

---

25. ఒక నెలలోపల లేదా ఒక సంవత్సరములోపల జరిగిన కార్యములను మాత్రమే ప్రవేశకములందు సూచింపవలెనని తాత్పర్యము. ఇంక పరిమితమైన కార్యము అనుసంధేయమైనప్పుడు అంకముఖమును, అల్పమైనది అనుసంధేయమైనప్పుడు చూళికయును, అల్పతమ విషయమున అంకావతారమును ప్రయుక్తములు కావలెను.

ఒక వర్షమును మించిన కార్యము సూచితము కారాదనుటలో మాస-వర్ష పదములకు కొందరు బహువచనము చెప్పుదురు. అది సమంజసము కాదు. వానిని ఏకవచనమందే గ్రహించవలెను. అంతమాత్రమున రామాయణ-భారతాదిచరితత్యాగ ప్రసంగము రాదు. ఇందు ప్రధానమైనది 'కార్య' మను పదము. దీనిని భరతముని సార్థకముగా వాడియుండెను. యత్ననిష్పాద్యమైనదే వర్షముగా గణింపబడునని తెలియవలెను. ప్రవేశకమందలి కథ ఒక వర్షమును మించరాదను నిషేధము ఇందులకు వ్యతిరేకము కాదు. అంకము ముగిసిన తరువాత యత్ననిష్పాద్యమగు కార్యము జరుగనిచో ఎంతకాలము గడచినను గణనీయము కాదు; వర్షాంతరములు గడచినను గడవనట్లే ఎంచవలయును. రామాదుల అరణ్యవాసము చతుర్దశవర్షపర్యంతమైనను మారీచవధా-సుగ్రీవరాజ్యదానాది అవాంతర కార్యములు కలమూడు, నాలుగు సంవత్సరములు మాత్రమే గణనీయములు; అప్రధానముగా నూరేండ్లు గడచినవన్నను దోషము లేదు. కావున పంచాంక నాటకమందు పంచకార్యదినములనియు, అట్లే దశాంకనాటకమందు దశకార్యదినములనియును గ్రహించవలెను. (ఈ దృష్టితో చూచినచో ఉత్తరరామచరితాదులందు అంకముల మధ్య బహుసంవత్సరములు గడచినవని చెప్పబడుట దోషము కాజాలదు). [అభినవభారతి - 2 వ సం - పుటలు 422-423]

గమునననుసరించి ప్రాకృత భాషా-వ్యవహారములె ఇందు కర్తవ్యములు.

*ప్రవేశక ప్రయోజనములు :* ప్రవేశకము—(1) కాలోదయ సూచకమును, (2) గూఢార్థ వ్యాఖ్యాయకమును, (3) కార్యవిశేషద్యోతకమును, (4) పంచాంగానుష్ఠాన సూచకమును, (5) భావి అంకమందలి ఇతివృత్త సూచకమును కావలయును. ఇట్లు ప్రవేశకము అనేకార్థకమై ఉండునని తెలియవలెను.

కార్యము భావి అంకమునకు సంబంధించినదై బహుధా విస్తరించి చెప్పదగియున్నను వెనుకటి కథను ముందరి కథతో సమన్వయము చేయుటకు తగినంత మాత్రముగా సంక్షేపించి ప్రవేశకమందు నిబంధించవలెను. ప్రవేశకము బహు చూర్ణపదయుక్తము (విడివిడి పదములతో కూడిన ప్రాకృతరచనతో కూడినది) అయినచో ప్రయోగమునకు (సామాజికులకును, ప్రయోక్తలకును) ఖేదముకలుగును. అంకమునందు ప్రత్యక్షముగాచూపదగియున్నను ప్రయోగబాహుళ్యమువలన ఆ అంకములో చూపదగినదంతయును చూపుటకు వీలులేనిచో అట్లు శేషించిన వృత్తాంతమును కూడ స్వల్పకథనముతో ప్రవేశకమునందు నిబంధించవలెను.

యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము,[26] నగరపు ముట్టడి— అను వీనిని అంకమునందు ప్రత్యక్షముగా చూపరాదు; వానిని ప్రవేశకములచే సూచింపవలెను.

---

26. 7వ అధ్యాయాంతమందు గల 6వ విశేషాంశమును చూడవలెను. సంస్కృతాలంకారికులు మరణమును పూర్తిగా నిషేధించిరనెడి ఆధునికాభిప్రాయము యుక్తము కాదు. మరణమును ప్రత్యక్షముగా ప్రదర్శించుటను మాత్రమే వారు నిషేధించిరి. అది ప్రవేశకముచే సూచితము కావచ్చును. ఇంక అభ్యుదయమును పొందవలసిన నాయకమరణమును మాత్రమే వారు నిషేధించిరని తెలియవలెను. వెంటనే తిరిగి బ్రదుకుట కవకాశమున్నచో నాయక విషయమున కూడ వారు అపవాదమును అంగీకరించియున్నారు. ఈ విషయములను గూర్చి అభినవగుప్తుడీ క్రింది విధముగా వివరించెను—

మరణము జుగుప్సావహమగుటయే కాక ప్రదర్శించుట కూడ కష్టము. మృతుడు రంగమునుండి నిష్క్రమించుట ఎట్లు? లేదా రంగమునందల్లే ఉన్నచో తక్కినప్రదర్శనము సాగుటెట్లు? ఇట్టి మరణమువలన నాట్యోపయోగులగు సమస్త ధ్రువాగానాది ప్రక్రియలకును లోపము కలుగును. సామాజికులకు వైరస్యమొదవును. కాన మరణమును రంగమునందు ప్రత్యక్షముగా చూపరాదు. కొందరీవిధముగా చెప్పుదురు— "అన్యకృతము (ఇతరులచే శిరచ్ఛేదాదులు కావింపబడుట), వ్యాద్యభిఘాతాదిప్రభవము అను భేదములచే మరణము రెండు విధములు. వీనిలో మొదటిదానినిమాత్రమే రంగమునందు ప్రత్యక్షముగా చూపరాదు"—కాని, ఇది సమంజసముకాదు. ఝుడితిప్రత్యాపత్తిశూన్యమైన (వెంటనే పునర్జీవితాశలేని)మరణము నెన్నడును రంగమందు ప్రదర్శించరాదు. జీమూతవాహనుని విషయమునందువలెనే మరణము క్షణమాత్ర-అనిశ్చితచేష్టాత్మకమైనచో, అప్పుడది ప్రత్యక్షముగా ప్రదర్శనీయము కావచ్చును. ఇంక తక్కినచోట్ల నాయకవధ ఎన్నడును వర్ణితము కారాదు, ప్రదర్శింపబడరాదు. [అభినవభారతి - 2 వ సం - పుటలు 426-427]



నాటకమందైనను, ప్రకరణమందైనను అంకమునందుకాని, ప్రవేశకమునందుకాని అభ్యుదయమును పొందదగిన నాయకునివధను ప్రదర్శించరాదు, వర్ణించరాదు; అప్పట్ల నాయకుడు పారిపోవుట, లేదా బంధింపబడుట, లేదా సంధిచేసికొనుట అను వానిని అనేక కావ్య (లేదా కార్య) విశేషములచే ప్రధాన రసానుకూలముగా నాట్యతత్త్వజ్ఞులు కల్పించవలెను. నాటక-ప్రకరణములు మహాజనపరివారములు కారాదు (పాత్రలధికముగా ఉండరాదు); నలుగురైదుగురు కార్యపురుషు లున్నచో చాలును.[27]

[వ్యాయోగ-ఈహామృగ-సమవకార-డిమములందు పది-పన్నెండుగురు పాత్రలుండవచ్చును. రథ-గజ-వాజి-విమానములను యథాతథముగా రంగమునందు ప్రదర్శించరాదు. వానిని ఆకార విశేషముచేకాని, గతిప్రచారముచేకాని నిరూపించవలెను. లేదా గజ-అశ్వ-విమాన-ప్రహరణ-శైలాదులను పుస్త విధానముచే (ఇది 21వ అధ్యాయమందు వివరింపబడును) ఆ విధానము నెరింగినవారు ప్రదర్శించవలెను. కార్యవశమున స్కంధావారమును రంగమునందు ప్రదర్శించవలసివచ్చినచో నలుగురు, ఆరుగురు పురుషులు మాత్రమే రంగమునందు ప్రవేశించవలెను. ఇట్లు అల్పపురుషయుక్తముగా, అల్పపరిచ్ఛదముతో, అల్పసంచారముతో సైన్యమును నిరూపించవలెను.]

---

27. 'మహాజనపరివారములు కారాదు' అనుటచే బహుతరపురుషసాధ్యము లగు సేతుబంధనాదులను ప్రత్యక్షముగా ప్రదర్శించరాదు. మహాజనులగు పితా-పుత్ర-శ్వశ్రూ-స్నుషా-గురు-శిష్యాది సభ్యులకు పరివరణమును అనగా చిత్తసంకోచాదులను కలిగించు చుంబనాదులను ప్రత్యక్షముగా ప్రదర్శించరాదుఅనికూడ అర్థమును చెప్పవచ్చును. ప్రత్యక్షముగా ప్రదర్శించితీరవలసినవాటిని కూడ ఏ నలుగురైదుగురు పురుషులచేతనే ప్రదర్శింపవదగును.

కార్యపురుషులనగా నాయకసహాయులగు ప్రధానపాత్రలు. ఆధికారికేతివృత్తమునకు సంబంధించిన నలుగురైదుగురు కార్యపురుషులును, పతాకా-ప్రకరులకు సంబంధించిన మరి నలుగురైదుగురును - మొత్తము ఎనిమిది, పదిమంది మాత్రమే అవసరమునుబట్టి నాటక-ప్రకరణములందు ఒకేసారి రంగమునందు ప్రవేశించవచ్చును. అంతకుమించి జనమున్నచో అభినయచతుష్టయము అసంభావ్యమగును. సేతుబంధనమునందువలె, జాతరలందువలె రంగము నెన్నడును జనసమూహముతో నింపరాదని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం - పుట 428]

పైని కుండలీకరణములందున్న భాగము బరోడా ముద్రణమునందు లేదు. ఇది కాశీముద్రణమునందు కలదు [41-45 శ్లో.]. ఇందలి శ్లోకములు విస్పష్టముగాలేవు.

కావ్యమునందు ఇతివృత్త నిర్మాణము గోపుచ్ఛాగ్రతుల్యము[28]గా ఉండవలెను. ఉదాత్తభావము లన్నియును అంతమునందుండవలెను. వివిధ-రసభావములతో కూడిన కావ్యము లన్నింటియందును అద్భుతరస మెల్లప్పుడును నిర్వహణసంధిలో ఉండవలెను. నాటక లక్షణమును యథావిహితముగా, సంగ్రహముగా ఇంతవరకును వివరించియున్నాను.*

ప్రకరణము

2. ప్రకరణము— ఎందు కవి స్వీయప్రతిభచే వస్తువును, శరీరమును, నాయకుని కల్పించునో అది ప్రకరణమనబడును. కవి అనార్షము లేదా ఆహార్యము అయిన వస్తువును (కథను) గ్రహించి, దానిని అభూతగుణయుక్తముగా, కల్పిత బీజ-వస్తు యుతముగా చేసినచో అదికూడ ప్రకరణమనబడును.[29] నాటక విషయమున చెప్పబడిన వస్తువు, శరీరము, వృత్తిభేదములు మున్నగునవి ప్రకరణమునందు కూడ సలక్షణముగా సర్వసంధులయందును కూర్పబడవలెను ('నాటకం-సప్రకరణం' అనుటలోని అర్థమిదియే). నానా రసయుక్తములైన విప్ర-వణిక్-సచివ-పురోహిత-అమాత్య-సార్థవాహుల చరితములు కలది ప్రకరణమనబడునని తెలియవలెను. ప్రకరణమునందు ఉదాత్తుడు నాయకుడు కారాదు; ఇందు దివ్యులచరితము వర్ణితము కారాదు; రాజోచితసంభోగము ప్రదర్శింపబడరాదు; ఇది బాహ్యజనులతో (చేట-

28. గోపుచ్ఛము (ఆవుతోకచివరి కుచ్చు) మొదట సన్నముగా, మధ్య లావుగా, అంతమున చాల సన్నముగా ఉండునట్లే బీజము ఆదిలో అల్పమైనను పిమ్మట విస్తరించినదై నిర్వహణమందు సమాప్తినందవలెను. గోపుచ్ఛాగ్రమనగా క్రమసూక్ష్మాంగమని కొందరందురు. మరికొందరు గోపుచ్ఛమందు కొన్ని వెంట్రుకలు పొట్టిగా, మరికొన్ని దీర్ఘములుగా ఉండునట్లే కొన్ని కార్యములు ముఖసంధియందే సమాప్తి నందును, మరికొన్ని ప్రతిముఖ-గర్భములందును, కొన్ని అవమర్శ సంధియందును, సారభూతములైనవి నిర్వహణమందును పరిసమాప్తినందును అనిఅందురు. [అభినవభారతి - 2 వ సం - పుటలు 428 - 429]

* [కాశీముద్రణమునందు 20 వ అధ్యా— 17–48 శ్లో. (సైన్య ప్రదర్శనమును గూర్చిన శ్లోకములును, విష్కంభకమును గూర్చిన శ్లోకములును ఈ భాగమందధికముగా గలవు); బొంబాయి ముద్రణమునందు 18 వ అధ్యా - 17–37 శ్లో + 87–95 శ్లో; బరోడా ముద్రణమునందు 18 వ అధ్యా - 18–44 శ్లో].

29. వస్తువు=సాధ్యఫలము=నాయకుడు సాధింపదలచిన ప్రయోజనము; శరీరము= కథ లేదా ఇతివృత్తము; నాయకుడు = ఫలభోక్త; అనార్షము = పురాణేతరములైన బృహత్కథాదులనుండి గ్రహింపబడినది ; ఆహార్యము = పూర్వకవికావ్యములనుండి గ్రహింపబడినది; అభూతగుణయుక్తము=ఆశ్చర్యకరము అగునది [అభినవభారతి - 2 వ సం - పుట 430]



దాసాదులతో) కూడినది కావలయును. ప్రకరణమందలి కావ్యము (ఇతివృత్తము) దాస-విట-శ్రేష్ఠియుతమును[30] వేశ్యాస్త్రీకృత శృంగారోపేతమును, మందకుల స్త్రీ చరిత సంయుక్తమును[31] కావలయును. సచివ-శ్రేష్ఠి-బ్రాహ్మణ-పురోహిత-అమాత్య-సార్థవాహులకు సంబంధించిన గృహవార్తను (గార్హస్థ్యోచిత పురుషార్థ సాధకమైనఇతివృత్తమును)కూర్చినప్పుడు వేశ్యాంగన నాయిక కారాదు. ఒకవేళ వేశ్యయువతి నాయిక అగుచో కులస్త్రీ సంగమమును వర్ణించరాదు. అట్లే నాయకులు గార్హస్థ్య చింతతో కూడినవారైనచో వేశ్యా సంగమమును వర్ణించరాదు ; అయినను, కారణవశమున వేశ్యాకులస్త్రీ కృతములగు శృంగారములను అచ్చట వర్ణించవలసివచ్చినచో పాఠ్యమును అవికృత భాషా-ఆచారముగా ప్రయోగించవలెను[32].

విష్కంభకము[33] : విష్కంభకము నెల్లప్పుడును మధ్యమపాత్రలే ప్రయోగించ

30. నాటకమందలి కంచుకి స్థానములో దాసుడును, విదూషకుని స్థానములో విటుడును, అమాత్య స్థానములో శ్రేష్ఠియును ప్రకరణమందు ఉందురు. [అభినవభారతి - 2 వ సం - పుట 431]

31. కులస్త్రీ విషయకమైన చేష్టితము తక్కువగాను, వేశ్యావిషయకమగు శృంగారమధికముగాను వర్ణింపబడవలెనని దీని కర్థముగా గోచరించుచున్నది. కాని, 'మందకులమందలి స్త్రీ యొక్క చరిత మిందు వర్ణింపబడవలెను (అనగా కులాంగనయు మందకుల ప్రసూతయే అగును) అను అర్థమును తన ఉపాధ్యాయుడగు భట్టతౌతుడు చెప్పినట్లు అభినవగుప్తుడు పేర్కొనెను [అభినవభారతి - 2వ సం - పుటలు 431-432]. కార్యవశమున వేశ్యా - కులాంగన లిరువురును వర్ణితలైనప్పుడు కులాంగన మందకులమందలి స్త్రీయే కావలెను అను అభిప్రాయమును సాగరనంది తెలిపియున్నాడు. [నాటకలక్షణరత్నకోశము - పుట 115]

32. కులస్త్రీ భాష శౌరసేని, వేశ్యభాష సంస్కృతము ; కులస్త్రీ ఆచారము వినయప్రధానము, వేశ్య ఆచారము తద్విపరీతము—కవి ఇట్టిభేదములను గుర్తించి వారిరువురను వర్ణించవలయును. [అభినవభారతి - 2 వ సం - పుట 433]

ఇచ్చట మూడు విధములుగా గ్రహించవలసి ఉన్నది—

(1) గార్హస్థ్యచింత ఉన్నచోట కులస్త్రీయే నాయిక కావలెను;

(2) గార్హస్థ్యచింత లేనిచోట సచివశ్రేష్ఠ్యాదులకు కూడ వేశ్యా సంబంధమును కల్పించవచ్చును ;

(3) గార్హస్థ్యచింతయున్న విటాదులు నాయకులైనప్పుడు కులస్త్రీయు, వేశ్యయు కూడ ఉండవచ్చును. అంతకు ముందు ప్రకరణము సప్త విధములని చెప్పి, ఇప్పుడీ మూడు భేదములచే ప్రకరణమునందు మొత్తము 21 భేదము లుండునని అభినవగుప్తుడు పేర్కొనెను. కాని, ఆ సప్త విధము లేవో అతడు స్పష్టముగా నిర్దేశించలేదు.

33. ఈ విష్కంభక నిర్వచనము న్యాయ్యముగా ప్రవేశకము వెంటనే ఉండవలయును. 'విష్కంభయతి=ఉపస్తంభయతి=స్పష్టముగా నిర్దేశించునది' కాన ఇది విష్కంభకమనబడినది. ప్రవేశక-విష్కంభములకు గల భేదములను గమనించవలెను.

వలెను. మరియు అది సంస్కృత వచనములతో (నాగరక సంభాషణములతో) కూడినదియును, ప్రవేశకమువలె సంక్షేపార్థమును కావలయును. శుద్ధ-సంకీర్ణభేదములచే విష్కంభకము రెండు విధములు— కేవల మధ్యమపాత్రప్రయోజితము శుద్ధ విష్కంభక మనబడును; నీచ-మధ్యమ పాత్రలచే ప్రయోజితమగునది సంకీర్ణ విష్కంభక మనబడును. ప్రయోజనము ననుసరించి మొదటి అంకముయొక్క మధ్య (ప్రస్తావనా-అంకప్రారంభములమధ్య) కాని, రెండంకములమధ్య కాని ముఖాది సంధులను, అర్థములను సంక్షేపముగా సూచించుటకు విష్కంభమును ప్రయోగించవలెను*

నాటిక[34]

నాటక-ప్రకరణముల లక్షణసమ్మేళనమువలన ప్రసిద్ధమైన ఇంకొక భేదము (అనగా 'నాటిక' అనెడి జన్యరూపకము) సంభవమగుచున్నది. ప్రకరణ-నాటకముల కంటె భిన్నమైన ఈ నాటికయందు వస్తువు ఉత్పాద్యమును, నాయకుడు రాజును కావలయును. నాయిక అంతఃపురకన్య కాని, సంగీతశాలాకన్య కాని కావలయును. ఇందు నాలుగు అంకములుండును, స్త్రీలు అధికముగాఉందురు. మరియు ఇది లలితాభినయాత్మకమును (కైశికీవృత్తి ప్రధానమును), సర్వాంగసంపన్నమును (నాలుగు కైశికీవృత్త్యంగములతో కూడినదియును), బహునృత్త-గీత-పాఠ్యయుక్తమును, రతిపురస్సరమగు రాజ్యప్రాప్త్యాది ఫలసంయుక్తమును, రాజవ్యవహారయుక్తమును, క్రోధ-ప్రసాదన-దంభ (వంచనా) సంయుక్తమును (ఇది పూర్వనాయికాగత విషయము), నాయక-దేవీ-దూతీ-పరిజనయుక్తమును కావలయును. ఇట్టిది 'నాటిక' అనబడును. ఈ నాటిక ప్రకరణ-నాటకముల లక్షణములందంతర్గతమై ఉండుటచే

*[కాశీముద్రణమునందు 20 వ అధ్యా—49-65 శ్లో; బొంబాయిముద్రణమునందు 18 వ అధ్యా—95-113 శ్లో; బరోడా ముద్రణమునందు 18 వ అధ్యా—44-62 శ్లో.]

34. భరతుడు దశరూపములను మాత్రమే ఆదిలో పేర్కొనియుండెను; సంగ్రహశ్లోకమునందు నాటికా ప్రసక్తియే లేదు. అందుచే ఈ భాగము ప్రక్షిప్తమై ఉండునని కొందరు తలంచిరి. ఈ భాగమును అభినవగుప్తుడు వ్యాఖ్యానించియుండుటచే అభినవగుప్తునకు పూర్వమే కోహలుని తరువాతివా రెవ్వరో దీని నిందు చేర్చియుండవచ్చును. ఈ నాటిక (నాటి) జన్యరూపక భేదమని తెలియవలెను; 7 వ అధస్సూచికను కూడ చూడవలెను. నాటికవలెనే 'ప్రకరణిక' అను రూపక భేదము కూడ సిద్ధింపగలదనియు, అందు సార్థవాహాదులు నాయకులుగా ఉందురనియు, అది కైశికీవృత్తి ప్రధానముగా ఉండుననియు కొంద రందరు. [అభినవభారతి - 2 వ సం - పుట 436]



వేరుగా గణింపబడలేదు; కావున రూపకములు పది అనుట సత్యదూరము కాదు. [ఈ చివరి వాక్యమునకు మూలమగు శ్లోకము రెండు వ్రాతప్రతులలో మాత్రమే కలదట.] పైన ప్రకరణ-నాటకముల లక్షణములను సంగ్రహముగా వివరించియున్నాను. ఇంక సమవకారలక్షణమును నిరూపింతును.

సమవకారము

3. సమవకారము— దేవ-అసురులకు సంబంధించిన ఫలసంపాదనమందలి ఉపాయము ఇందు బీజముగా ఉండును: నాయకులు ప్రఖ్యాతులును, ఉదాత్తులును కావలయును. ఇందు 12 గురు నాయకులుందురు, మూడు అంకములుండును. మరియు ఇందు మూడు కపటములు, మూడు విద్రవములు, మూడు శృంగారములు ఉండవలయును[35]. సమవకారము 18 నాడికల కాలములో ప్రయోగింపదగినదిగా ఉండవలెను. ఏ అంకమున కెన్ని నాడికలుండునో ఇంక వివరింతును.

నాడికాప్రమాణము: (నాడిక లేదా నాడి = 24 నిమిషములు)— ప్రహసన-విద్రవ-కపట-వీథీ-క్రియా సహితమైన ప్రథమాంకమును 12 నాడికల కాలములో ప్రయోగించవలెను. ద్వితీయాంకమును 4 నాడికల కాలములో ప్రయోగించవలెను; మొదటి అంకమునందువలెనే ఇందును కపట- విద్రవములు ప్రయుక్తములు కావలయును. ఇంక తృతీయాంకమున వస్తువు సమాప్తముకావలెను; ఇది 2 నాడికల కాలములో ప్రయుక్తముకావలెను[36]. ముహూర్తార్ధము (ముహూ

35. ఒక్కొక్క అంకమునందు ఒక కపటము, ఒక విద్రవము, ఒక శృంగారమును ఉండవలయును. ఉపాయ విషయమున కపటమును, వ్యాపత్తిసంభావనావిషయమున విద్రవమును, ఫలవిషయమున శృంగారమును ప్రయుక్తమగును. ప్రతి అంకమునందును 12 గురు నాయకులు చొప్పున ఉండవలెనని కొందరందురు. నాయక-ప్రతినాయక-తత్సహాయులతో కలిపి మొత్తముమీద అంకమునకు నలుగురేసి నాయకులుండవలెననియు, సముదాయముమీద 12 గురు అగుదురనియు మరికొందరందురు. 'సం' శబ్దమునకు నాతిసంబద్ధమనియు, 'అవ' శబ్దమునకు కించిత్సంబద్ధమనియు అర్థములు; అనగా సమవకారమందలి ఇతివృత్తమున ఏకతఉండదని సారాంశము. మూలశ్లోకమందు నాటక-ప్రకరణముల తరువాత అంకము చెప్పబడినది. కాని ఆ వరుసను వీడి ఇచ్చట వేరువిధముగా చెప్పబడుచున్నది. అంకాదు లేకాంకములైనందున అవి త్రివర్గోపాయములుకలవి కాజాలవు. కావున త్రివర్గోపాయవ్యుత్పాదకమైనందునను, అనేకాంకములుండుటచేతను ముందు సమవకారము చెప్పబడుచున్నదని తెలియవలెను. [అభినవభారతి - 2 వ సం - పుటలు 436-437]

36. ఏకతలేని సమవకారేతివృత్తము బాగుగా పెరిగిపోకుండుటకై కాలనిర్ణయము చేయబడినది అని గ్రహించవలెను. ప్రహసనమనగా కామశృంగారసంబంధిఅయినది. వీథి

ర్రము=48 నిముషములు) 'నాడిక' అనబడును. పైన చెప్పిన నాడికా ప్రమాణములను యథోక్తముగా ఆయా అంకములందు పాటించవలెను. ఈ కావ్యబంధమునందు ప్రతి అంకమును భిన్నార్థమును కలిగిఉండునట్లుగా రచింపవలెను; అనగా సమవకారమందలి అర్థములు అప్రతిసంబద్ధములుగా ఉండవలెను.

విద్రవములు : (1) యుద్ధ- జలసంభవము (వరదలు) ; (2) వాయు-అగ్ని-గజేంద్రసంభ్రమకృతము ; (3) నగరపుముట్టడి అనునవి మూడును విద్రవములు. (ఎందు జనులు 'విద్రవంతి=చెదరిపోదురో' అది విద్రవమనబడును. ఇందు జలవాయ్వగ్ని కృతము అచేతనకృతము, గజేంద్రకృతము చేతనకృతము, యుద్ధనగరోపరోధజములు ఉభయకృతములు.

కపటములు : సుఖ-దుఃఖోత్పత్తి కృతమైన కపటము (వంచన) మూడు విధములు— (1) వస్తుగతక్రమవిహితము ; (2) పరప్రయుక్తము ; (3) దైవవశాగతము. (కార్యమును సాధించువాని దోషము లేకపోయినను వంచకుడు చేయు మోసము మొదటిది, కార్యమును సాధించువాని అపరాధముచే వంచకుడు కావించు మోసము రెండవది. ఇరువురి దోషము లేకుండగనే దైవవశమున కాకతాళీయముగా సంభవించు మోసము మూడవది.)

శృంగారములు: ఇంక శృంగారము— 1. ధర్మ, 2. అర్థ, 3. కామసంబంధ భేదములచే మూడు విధములు. ఇవి వేర్వేరు కార్యములందు ప్రయుక్తములు కావలయును. ఏ శృంగారమందు సాధనము వ్రత-నియమ-తపోయుక్తమై ధర్మప్రాపకమును, ఆత్మహితమును అగునో అది ధర్మశృంగార మనబడును (అనగా నాయికా లాభమందు ధర్మము హేతువుకాని, సాధ్యముకాని కావలెను). ఎందు అర్థమునందలి ఇచ్ఛవలన కాని, బహుప్రయోజనముల నాశించి కాని స్త్రీ సంయోగ విషయమగు రతి కలుగునో అది అర్థశృంగార మనబడును. కన్యావిలోభనకృతము లేదా రమ్యము, సావేగము, నిభృతమును (తన్ను మరుగుపరచుకొనుట) అయిన సంయోగము కామశృంగార మనబడును. ఇందు మొదటిది (కన్యావిలోభన కృతము) కన్యా-నాయకుల పరస్పరానురాగముచే జనించిన సంయోగము ;

అనగా వీథ్యంగములలోనిది. ప్రథమాంకమున బీజమునందే మూడు అంకముల అర్థమును ఉపక్షేపింపవలెను. మొదటి రెండంకములందును అవాంతర వాక్యార్థములు రెండును సమాప్తములగును. ఇంక మూడవదానియందు మహావాక్యార్థ నిర్వాహము జరుగును. కాన అచట 'వస్తుపరిసమాప్తి' అని చెప్పబడినది. ఏకతలేని దీనియందు మొత్తమునకు ప్రతి అంకమునందును వస్తుపరిసమాప్తి జరుగును. ఇట్లు అంకములు భిన్నార్థములు కలవి అయినను మూడు అంకములకును మొత్తముమీద విశిష్టమగుసంబంధమొకటి మాత్రము ఉండునని గ్రహించవలెను.



రెండవది (రమ్యసావేగనిభృత శృంగారము) పరస్త్రీ విషయకము. ఉష్ణిక్-గాయత్రి మొదలగు ఛందస్సంభవములగు వృత్తములను, బంధ కుటిలములయిన (విషమ-అర్ధసమాది) వృత్తములను కవులీ సమవకారమందు రచింపవలెను[37]. ఇట్లు నానా రసాశ్రయముగా సమవకారమునురచింపవలెను.

ఈహామృగము

4. ఈహామృగము—దివ్యపురుషులిందు నాయకులుగాఉందురు. దివ్యస్త్రీ నిమిత్తముగా యుద్ధములు సంభవించును. సమవకారమునందువలె కాక ఇందు వస్తువు సుశ్లిష్టమైఉండును. ఇతివృత్తము నమ్మదగిన కారణము లేనిదై ఉద్ధత పురుషప్రాయమును, స్త్రీనిమిత్తకమైన రోషముతో కూడినదియును కావలయును. సంఫేట-విద్రవ-సంక్షోభములిందుండును. భేదన-అపహరణ-అవమర్దనములచే పొందబడిన స్త్రీకి సంబంధించిన శృంగారమిందుండును. వ్యాయోగమందు చెప్పబడు విధముగా ఇందును అంకము, పురుషులు, వృత్తులు, రసములు అనుసంధింపబడవలెను[38]. ఇందు కేవలము అమరస్త్రీ సంయోగమే వర్ణితము కావలయును. చంపదలచిన పురుషుల వధ తప్పనిసరి అగునప్పుడు ఏదోఒక మిషచే పలాయనాదులను కల్పించి యుద్ధమును శమింపజేయవలెను.

డిమము

5. డిమము[39]—ఇందు వస్తువు ప్రఖ్యాతమును, నాయకుడు ప్రఖ్యాతుడును

37. ఇది అభినవగుప్తుని పాఠము. కాని, ఉష్ణిక్-గాయత్రి మొదలగు చిన్న వృత్తములను కాక స్రగ్ధరాది బంధకుటిలములైన వృత్తములను సమవకారమందు ప్రయోగించవలెనని ఉద్భటుని అభిప్రాయము. ఆయా దేవోత్సవములందు శ్రద్ధాళువులైన దేవతాభక్తులు ఈ సమవకార ప్రయోగముచే అనుగృహీతులు కాగలరు. నిరనుసంధానహృదయులైన స్త్రీ-బాల-మూర్ఖులును విద్రవాదుల ప్రయోగముచే ఆకర్షింపబడుదురు. [అభినవభారతి—2 వ సం - పుట 441]

38. అనగా ఈహామృగము కూడ వ్యాయోగమువలెనే ద్వాదశనాయకమును, ఏకాంకమును కావలయును. 'ఈహా' అనగా చేష్ట. 'మృగము' యొక్క చేష్టవంటి చేష్టను అనగా స్త్రీమాత్రపరమగు చేష్టను ప్రదర్శించునది కాన ఇది 'ఈహామృగ' మనబడినది. [అభినవభారతి—2 వ సం - పుట 442]

39. డిమము, డింబము, విద్రవము అనునవి పర్యాయపదములు. అనగా విద్రవయుక్తమైనది డిమ మనబడును. "డయంతే ఇతి డియః-అనగా ఉద్ధతనాయకులు, వారి ఆత్మవ్యాపారము ఎచ్చటఉండునో అది డిమ మనబడు" నని కొందరందురు. [అభినవభారతి—2 వ సం - పుటలు 443-444]

ఉదాత్తుడును కావలయును. ఇందు 4 అంకములును, శృంగార-హాస్యములు కాక తక్కిన ఆరు రసములును ఉండును. కావ్యవస్తువు దీప్తరసమును, నానా భావోప సంపన్నమును కావలెను. నిర్ఘాత-ఉల్కాపాత-సూర్యేందు గ్రహణములు, యుద్ధ-నియుద్ధ-ఆధర్షణ-సంఘేటములును ఇందు ప్రయుక్తములగును. అంతియే కాక మాయా-ఇంద్రజాలములు, నానావిధములగు పుస్తములు ఇందుండును. మరియు ఇది దేవ-భుజగేంద్ర-రాక్షస-యక్ష-పిశాచముల చరిత్రలతో నిండినదై సాత్త్వత్యారభటీవృత్తి సంపన్నము కావలయును. ఇందు నాయకులు 16 గురు ఉందురు.

వ్యాయోగము

6. వ్యాయోగము[40]— ఇందు వస్తువు ప్రఖ్యాతమును, నాయకుడు ప్రఖ్యాతుడును కావలయును. స్త్రీలు తక్కువగా ఉండవలెను. ఇతివృత్తము ఒక రోజులో జరిగినది కావలెను (అనగా ఇందు ఒకే అంకముఉండును) సమవకారమునందు వలెనే ఇందును బహు పురుషులు (12 గురు నాయకులు) యుద్ధాభిముఖులగుదురు; కాని వ్యాయోగము సమవకార ప్రమాణయుక్తము కారాదు (అనగా ఇందు ఒకే అంకముఉండును). ఇందు దివ్యుడు నాయకుడు కారాదు; రాజర్షియే నాయకుడు కావలెను. యుద్ధ-నియుద్ధ-ఆధర్షణ-సంఘర్షణము లిందుండును. మరియు కావ్యము దీప్తమును (ఓజోగుణయుక్తమును), దీప్తరసమును (వీర-రౌద్రయుతమును) కావలయును.*

ఉత్సృష్టికాంకము

7. ఉత్సృష్టికాంకము[41]— ఇందు సాధారణముగా వస్తువు ప్రఖ్యాతముగా ఉండును; ఎప్పుడేని వస్తువు అప్రఖ్యాతముకూడ కాదగును. ఇందు దివ్యపురుషులుండరాదు. కరుణరసము ప్రచురముగా ఉండును. యుద్ధమునుండి మరలిన వారును, గాఢముగా దెబ్బలుతినినవారును ఇందుందురు. స్త్రీలు దైవమును,

---

40. యుద్ధప్రాయమగు వ్యాయోగమున పురుషులు నియోగింపబడుదురు కాన ఇది వ్యాయోగమనబడినది. [అభినవభారతి—2 వ సం - పుట 445]

*[కాశీముద్రణమునందు 20 వ అధ్యా - 65-97 శ్లో; బొంబాయి ముద్రణమునందు 18 వ అధ్యా - 114-145 శ్లో; బరోడాముద్రణమునందు 18 వ అధ్యా-62-98 శ్లో.]

41. 'ఉత్సృష్టికలు' అనగా ఉత్క్రమణీయమైన సృష్టి (జీవితము లేదా ప్రాణము) కలవారు. ప్రాణము పోవునా అన్నంతగా దుఃఖించుచున్న స్త్రీలచే చిహ్నితమైనది కాన ఇది ఉత్సృష్టికాంకము అనబడినది (అంకము=చిహ్నము=గుర్తు). వృత్తులచే ఉత్సృష్టము (విడువబడినది) అయినది కాన ఇది ఉత్సృష్టికాంక మనబడినదని కొందరందురు. [అభినవభారతి-2 వ సం - పుట 446]



తమ్మును నిందించుకొనుచు విచారించుట, నిర్వేదముతోకూడిన ఆలాపములు, వ్యాకులచేష్టలు (భూమిపై పడి దొర్లుట మొదలగునవి) ఇందు ప్రదర్శింపబడవలెను. సాత్త్వత్యారభటీ కైశికీ వృత్తు లిందుండరాదు.

దివ్యనాయక కృతములగు సంగ్రామ-బంధ-వధాదులను కావ్యములో నిర్దేశించవలసినప్పుడు భారతవర్షమునే ఆశ్రయముగా చేయవలెను. దేవతలకు భోగభూములుగా విహితములైన వర్షములన్నింటిలోను భారతవర్షమే ప్రియమైనదగుటకు కారణము ఇచ్చటి భూమి అంతయును హృద్యమును, శుభగంధమును, కాంచనమయమును అగుటయే. కావున వారి ఉపవనగమన-క్రీడా-విహార-నారీరతి ప్రమోదములు భారతవర్షమందే వర్ణింపబడవలెను. ఇతర వర్షములందు దుఃఖముకాని, శోకముకాని ఉండదుకదా. కావున, పురాణములందు ఆయా దేవతల కధివాసములుగా చెప్పబడిన ఆయాపర్వతములందు వారి సంభోగమును, ఇంక భారతవర్షమునందు తక్కిన కర్మారంభములన్నియును (యుద్ధాదులు) వర్ణితములు కావలెను.

ప్రహసనము

8. ప్రహసనము[42]—శుద్ధ-సంకీర్ణ భేదములచే ప్రహసనము రెండు విధములు. భగవత్-తాపస-విప్ర-శాక్యాదులను గూర్చిన హాస్యవాదములతో కూడినదియును, కుత్సిత పురుషులతో కూడినదియును, పరిహాస భాషణములతో నిండినదియును, వారి భాషా-ఆచారములను యథాతథముగా ప్రదర్శించునదియును, విశిష్టభావ ద్యోతకములగు కథాఖండములను, నియతగతి కల ఇతివృత్తమును (ఒకే ఒకని చరిత్రము) కలదియును శుద్ధప్రహసనమనబడును. అనిభృతములైన వేష-పరిచ్ఛద-చేష్టితములు కల వేశ్యా-చేట-నపుంసక-విట-ధూర్త-బంధకీసంకుల మగునది సంకీర్ణ ప్రహసన మనబడును. లోకవ్యవహారసిద్ధమగు వార్తయును, దంభమును, ధూర్తుల (కృత్రిమతాపసుల, విటుల) ప్రవివాదములును ప్రహసనములందు ఉండవలెను. మరియు ఇందు అవసరమునుబట్టి వీథ్యంగములను కూర్చవలెను.

---

42. ప్రహసనీయమైనది అనగా పరిహాస ప్రధానములైన ఆభాషణము లధికముగా కలది 'ప్రహసన' మనబడును. ప్రహసనమందు అంక సంఖ్య నిర్దేశింపబడలేదు. శుద్ధ ప్రహసనము ఏకాంకమనియు, వేశ్యాది చరిత సంఖ్యాబలముచే సంకీర్ణప్రహసన మనేకాంకమనియు కొందరందురు. కాని ఇది ఏకాంక రూపకములమధ్య పఠింపబడుటచే ఇదియును ఏకాంకమే అని మరికొందరందురు. [అభినవభారతి-2 వ సం— పుట 449]

**భాణము**

9. భాణము[43]—ఇందు రంగమును ప్రవేశించిన ఒకే ఒక పాత్ర తాననుభవించిన విషయములను చెప్పును; లేదా, ఇతరులు అనుభవించిన విశేషవిషయములను వర్ణించును. ఇట్టిది ఏకహార్యము (ఒకే పాత్రచే ప్రయోగింపబడునది) అగుచున్నది. ఆకాశమునందు ఒక పురుషుడు చెప్పిన మాటలను (ఆకాశపురుష భాషితములను) విని వానిని, అందులకు తన ప్రతివచనములను ఆ పాత్ర అభినయపూర్వకముగా పెక్కు చేష్టలతో నివేదించవలెను. ఇట్టి పాత్ర ధూర్తుడు లేదా విటుడు అయి ఉండవలెను. అనగా, ఇతడు నానావిధములగు అవస్థాభేదములతో కూడినవాడును, పెక్కుచేష్టలు చేయువాడును కావలయును. ఇందు ఒకే అంకము ఉండును.

**వీథి**

10. వీథి[44]— ఇందును ఒకే అంకము ఉండును. ఇది ఏకహార్యము లేదా ద్వహార్యము కావచ్చును (ఒకే పాత్రచేకాని, ఇరువురు పాత్రలచేకాని ప్రయుక్తము కావలెను). ఇందు రసములన్నియును ఉండును. అధమ-ఉత్తమ-మధ్యమ ప్రకృతులు మువ్వురును ఇందుందురు[45]. మరియు ఇందు త్రయోదశాంగము లుండును.

*వీథ్యంగములు* : త్రయోదశ వీథ్యంగముల నిప్పుడు వరుసగా వివరింతును—

(1) ఉద్ఘాత్యకము— ఆదరసహితములును, ప్రశ్నరూపములును అగు పదములకు తత్పర్యాయములైన పదములతో సమాధానము చెప్పుట 'ఉద్ఘాత్యక' మనబడును. కాగా ఉద్ఘాత్యకము ప్రతివచనాత్మకమని తెలియవలెను.[46]

(2) అవలగితము— ఒక విధమగు ప్రశ్న కొసంగబడిన సమాధానము మరియొక కార్యమును (అర్థమును) సాధించుట అవలగిత' మనబడును.

(3) అవస్పందితము— దైవికముగా వచ్చిన ఒక అర్థమును కప్పిపుచ్చి వేరొక అర్థము వచ్చునట్లుగా సమాధానము చెప్పుట 'అవస్పందిత' మనబడును.

(4) నాళిక— ఇతరులను వంచించునదియును (ప్రహేళికయును), హాస్య సంయుక్తమును అగు సమాధానము నాళిక అనబడును.

(5) అసత్ప్రలాపము— విద్వాంసుడు చెప్పిన సమాధానము హితమైనదైనను ఛలమువలన (మూర్ఖతచే) మూర్ఖుడు దానిని హితముగా గ్రహించక పోవుట 'అసత్ప్రలాప' మనబడును.[47]

---

43. ఒక పాత్రచేతనే రూపకార్థములను సామాజిక హృదయములను పొందించునది కాన ఇది భాణమనబడినది. అనగా రంగమునందు ప్రవేశించని పాత్రలుకూడ ఒకేఒక పాత్ర ముఖమున మాటలాడునవిగా చేయబడును కాన ఇది భాణమనబడినది (భాణ్యంతే ఇతిభాణః.) [అభినవభారతి - 2 వ సం - పుటలు 449-450].

ఉత్సృష్టికాంక-ప్రహసన-భాణములు కరుణ-హాస్య-విస్మయ ప్రధానములై రంజక రసప్రధానములగుచున్నవి. అందువలననే వానియందు స్త్రీ-బాల మూర్ఖాదు లధికారులుగా ఉన్నారు. వీనియందు వృత్తము విస్తృతముగా ఉండదు; అంతియేకాదు ఇతివృత్త వైచిత్ర్యముకూడ ఉండదు. [అభినవభారతి-2 వ సం - పుట 451].

44. వీథిఅనగా పంక్తి. ఇది విచిత్రోక్తిప్రత్యుక్తిగర్భితము. "వీథివలె నానా రసము లిందు మాలగా ఉండును కాన ఇది వీథి అనబడిన"దని విశ్వనాథుడు పేర్కొనెను.

ప్రశ్న - ప్రతివచనములకు అన్యాభిప్రాయ రూపమగు సంబంధముచే కలుగు వైచిత్ర్యము 'వీథ్యంగ' మనబడును. లక్షణ-అలంకారాదుల కిట్టి ఉక్తినియతమగు రూపము లేదు; కావున ఉక్తినియతమగు వైచిత్ర్యముకల వీథ్యంగములు వానికంటె భిన్నములని తెలియవలెను [అభినవభారతి-2వ సం-పుట 454]. అంగమనగా ఒక భాగమని అర్థము చెప్పుటకంటె 'ఒక విధ' మని అర్థము చెప్పుట సమంజసము. కావున వీథ్యంగములనగా వీథీ భేదములని అర్థము. అట్లే లాస్యాంగము లనునప్పుడు కూడ లాస్యముయొక్క అంగములని కాక లాస్యము అంగముగా కలవి అని అర్థము చెప్పవలసిఉన్నది. అనగా లాస్యాంగములు దేనికిని అంగభూతములు కావు, అవి స్వతంత్రములు. [డా. ఘోష్ ఆంగ్లానువాదము - అథసూచిక - పుట 377].

45. వీథి సర్వరస సంపన్నమగుటచే అన్నిరకముల ప్రకృతులును ఇందు నాయకులు కావచ్చును. అధమ ప్రకృతి నాయకుడగుటకు కొంద రంగీకరించరు. మరి ప్రహసన భాణాదుల విషయమున వారికిట్టి అభ్యంతరము లేదేమి? హాస్యరసము ప్రధానముగా ఉన్నప్పుడు అధముడే నాయకుడగును. కోహలుడు కూడ "ఉత్తమాధమమధ్యాభిర్యుక్తా ప్రకృతిభిస్తథా। ఏకహార్యా ద్విహార్యా వా సా వీథీ త్యభిసంజ్ఞితా॥" అనుచు అధమ నాయకత్వము నంగీకరించియుండుట గమనార్హము. ముఖ్యఫలముతో ప్రధానముగా సంబంధించిఉన్న వ్యక్తి నాయకుడనబడునుకదా?

అధముడట్లు ఒకవేళ నాయకుడు కాకపోయినను వానియందు అధమత్వము అనుపాదేయము కాజాలదు; పరివార రూపముననైనను వానికి ప్రవేశము ఉండనే ఉన్నది [అభినవభారతి—2వ సం-పుట-459].

46. కుమారగిరిరెడ్డి తన వసంతరాజీయములో ఉద్ఘాత్యక లక్షణమును క్రింది విధముగా వివరించెనని కాటయవేముడు శాకుంతల వ్యాఖ్యలో పేర్కొనెను [కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తులోని వ్రాతప్రతి - నం. 1864]"—

"సూచినీ ప్రస్తుతార్థస్య యా ప్రశ్నోత్తరమాలికా।
ఉద్ఘాత్యకమితి ప్రాహుస్తదేతన్నాట్యవేదినః॥"

47. "అడిగిన ప్రశ్నయును, చెప్పిన సమాధానమును అసంబద్ధములే అగుట కూడ 'అసత్ప్రలాప' మనబడును— ఈ పాఠము బరోడా ముద్రణమునందు లేదు.

(6) వాక్కేళి — రెండు లేదా అంతకుమించిన ప్రశ్నలకు ఒకే సమాధానమొసంగుట 'వాక్కేళి' అనబడును.

(7) ప్రపంచము — అసత్యములును, పరస్పరసంస్తవయుక్తములును, హాస్యజనకములును, ఒకే ప్రయోజనమును సాధించునవియును అగు సమాధానములు 'ప్రపంచ' మనబడును.

(8) మృదవము — కథాప్రసక్తిలో కలిగిన వివాదము హేతువుగా, గుణములను దోషములుగా, దోషములను గుణములుగా నిరూపించెడి సమాధానములను చెప్పుట 'మృదవ' మనబడును.

(9) అధిబలము — స్వపక్ష బలసాధనమునకై ఉక్తి-ప్రత్యుక్తులు రెండును సాగుట 'అధిబల' మనబడును.

(10) ఛలము — ప్రయోజనాంతరమునుఉద్దేశించిన సమాధానము ఒకరికి రోష జనకమును, మరియొకరికి హాస్యజనకమును, ఇంకొకరికి అభిసంధిజనకమును అగుట 'ఛల' మనబడును.[48]

(11) త్రిగతము — ఒకే ప్రతివచనమునకు శబ్దసారూప్యముచేతను, కాక్వాదులచేతను అనేకార్థములు తోచుట 'త్రిగత' మనబడును.[49] ఇది హాస్యము లేదా అహాస్యము కానగును.

(12) వ్యాహారము — భావికాలమందు ప్రత్యక్షము కాబోవు అర్థమును దైవవశమున స్ఫురింపజేయు సమాధానము 'వ్యాహార' మనబడును. ఇందు హాస్యలేశము ఉండవచ్చును.[50]

(13) గండము — సంరంభకృతమైన ఆవేగము, వివాదము, అపవాదము అనువానిచే ఈయబడిన ఈషదసమాప్త సమాధానము 'గండ' మనబడును.[51]

---

48. "ఆదిలో వేరు అర్థమునిచ్చు జవాబులచే విలోభింపజేసి, పిమ్మట వానినే అర్థరహితములనుగా చేసి చెప్పుట 'ఛల' మనబడును"—ఇది కాశీ పాఠము (129వ శ్లో.). ఇది "Socratic irony" కి కొంత సన్నిహితముగా ఉన్నది. (Socratic irony = pose of ignorance in order to entice others into display of supposed knowledge- The Concise Oxford Dictionary—p. 1194)

49. "ఉదాత్తమైన వచనములు హాస్యరస సంయుక్తములుగా ముగ్గురిచే పలుకబడుట 'త్రిగత' మనబడును"—ఇది కాశీముద్రణ పాఠము (132 వ శ్లో.).

50. "నాయకుని ఎదుట స్పష్టముగా చెప్పి దానిని అశంకితమగునట్లుగా చేయుట 'వ్యాహార' మనబడును"—ఇది కాశీముద్రణ పాఠము (130 వ శ్లో.).

51. కాశీ-బొంబాయి ముద్రణములందు వీథ్యంగములు నిర్వచింపబడినపిమ్మట వెంటనే లాస్యాంగములు కూడ నిర్వచింపబడినవి. కాని, బరోడాముద్రణమం దివి తరువాతి అధ్యాయములో కలవు. అభినవగుప్తుడు వాని నచ్చటనే వ్యాఖ్యానించెను. అందుచే నేను వానిని 19 వ అధ్యాయమందే తెనిగించియున్నాను.



ఇంతవరకును దశరూప విధానమును సర్వమును లక్షణయుక్తముగా వివరించితిని. ఇంక తచ్ఛరీరగతమగు సంధివిధిని లక్షణపూర్వకముగా వివరింతును.*[52]

అష్టాదశాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

**1. రూప - రూపకపదములు :**

నృత్త - నాట్య - నృత్యములను గూర్చి ప్రథమాధ్యాయము చివర ఒకటవ విశేషాంశములోను, 4 వ అధ్యాయము చివర 7 వ విశేషాంశములోను వివరించి యున్నాను. ఈ దశరూపములును 'నాట్యము' నకు చెందినవి. రూప - రూపకపదములను గూర్చి కూడ 8 వ అధ్యాయము చివర 2 వ విశేషాంశములో వివరించియున్నాను. భరతుడు 'రూప' మనెడి పదమును మాత్రమే వాడెను. అభినవగుప్తుడు రూప - రూపకపదములను రెండింటిని వాడెను. ధనంజయుని నాటికి 'రూప' మనెడి పదము ప్రచారమునుండి మరుగుపడినదని చెప్పవచ్చును. భరతుడు ఈ అధ్యాయమును 'దశరూపములు' అని పేర్కొనగా వామనుడు 'దశరూపక' మనుటయు("సందర్భేషు దశరూపకం శ్రేయః"), ధనంజయుడు తన గ్రంథమును 'దశరూపక' మనుటయు గమనార్హములు. ధనంజయుడు రూప - రూపక పదములను క్రిందివిధముగా వివరించెను. [దశరూపకము - ప్ర. ప్రకాశము - 7 శ్లో.]—

> అవస్థానుకృతి ర్నాట్యం, రూపం దృశ్యతయోచ్యతే।
> రూపకం తత్సమారోపాత్, దశధైవ రసాశ్రయమ్॥

—అవస్థానుకరణము నాట్యము. అది దృశ్యమానమగుటచే 'రూప' మనబడును; రూపఆరోపము కలదగుటచే 'రూపక' మనబడును. రసాశ్రయమైన ఈ నాట్యము పది విధములు.

"నీల - పీతాదివర్ణములవలె చూడదగినది కాన 'రూప' మనబడుచున్నది. నటుని యందు రామాద్యవస్థల ఆరోపణము ఉండుటచే ఇది రూపకమనబడినది. అనగా, ముఖము నందు చంద్రత్వమువలెనే నటునియందు రామాదినాయకత్వము ఆరోపింపబడుటచే అది 'రూపక' మనబడుచున్నదని తెలియవలెను. ఇంద్ర - పురందర - శక్ర శబ్దములు ఏకార్థములైనట్లే నాట్య-రూప-రూపకములనెడు ఈ మూడు శబ్దములును ఏకార్థకములగుచున్నవి; ప్రవృత్తినిమిత్త భేదముచే మూడు పేర్లు వచ్చినవి" అని పై శ్లోకమును ధనికుడు వ్యాఖ్యానించెను.

---

* [కాశీముద్రణమునందు 20 వ అధ్యా—97-133 శ్లో; బొంబాయిముద్రణమునందు 18 వ అధ్యా—145-181 శ్లో; బరోడాముద్రణమునందు 18 వ అధ్యా—93-127 శ్లో.]

52. "నాటకభేదములు' ఇన్ని ' అని గణించుటకు శక్యముకాదు. కాన సంక్షిప్తముగా ఈ దశరూపములను తజ్ఞులెరుంగవలయును"— ఇది బరోడా ముద్రణమునందు అధ్యాయాంతమున అధస్సూచికలో ఉన్న అధికపాఠము [పుట 459].

## 2. రూపకరచనము : రూపకప్రదర్శనము

పై మూడు శబ్దములను కూడ విడిచివేసి, 'దృశ్యకావ్యము' అనెడి శబ్దమును ఆలంకారికు లధికముగా వాడియున్నారు (ప్రాచీనులు 'ప్రేక్ష' అనెడి శబ్దమును కూడ వాడియున్నారు). ఇచ్చట ఒక విషయమును గుర్తించవలెను. సాహిత్యమునందలి రచనా ప్రక్రియలనెల్ల మనవారు 'కావ్య'పదముతోనే వ్యవహరించినారు—అది పద్యమైనను, గద్యమైనను, గద్య-పద్య సమ్మిశ్రితము (చంపువు) అయినను, రూపకమైనను సరే—అన్నియును కావ్యములే. అట్లే ఏ రచయిత అయినను 'కవి' నామముచేతనే వ్యవహరింపబడెను. రూపక నిర్మాతను తెలుపుటకు ఆంగ్లమునందలి Dramatist అను శబ్దమువలె సంస్కృతమున ప్రత్యేకమైన శబ్దము లేదు ; అతడును కవియే. 'నాటక కర్త', 'నాటక రచయిత' మొదలగునవి ఇటీవల కల్పింపబడినవి మాత్రమే.

శ్రవ్యకావ్యములనుండి నాటకాదులను వేరుపరచెడి భేదములలో ప్రధానమైనది 'దృశ్యత్వము'. మహేంద్రాదులు నాట్యముకొరకు బ్రహ్మను అర్థించుటలో 'దృశ్యం శ్రవ్యంచ' అని పేర్కొనుట గమనార్హము. కావున నాటకాదులు కేవలము చదువబడుట కొరకే కాక ప్రదర్శింపబడుటకును ఉద్దిష్టములు కావలయును. ఈ రెండు ధర్మములను దృష్టిలో పెట్టుకొని నాటకమును రచించినప్పుడే అది ఉత్తమ నాటకము అనిపించుకొనును. గ్రీకు నాటకకర్తల, కాళిదాసాదుల, షేక్స్పియరు ప్రభృతుల రూపకము లట్టివి. కొందరు విమర్శకులు ప్రదర్శన విషయమును పూర్తిగా విస్మరించి సాహిత్య గౌరవమును మాత్రమే వాంఛింతురు ; ఇది వివాదాస్పదమైన విషయము.

ఒంటరిగా కూర్చుండి ఒకడు రూపకమును చదువుకొనవచ్చును; లేదా పదిమంది వినుచుండగా ఒకడు చదువవచ్చును. కాని, రూపకప్రయోజన మింతమాత్రమే కాదు; అది ప్రదర్శితమైనప్పుడే రూపకమనెడి శబ్దమును, రూపక రచనయును సార్థకములు కాగలవు. ప్రదర్శన దృష్టితో చూచినచో కేవల రూపకరచనము అస్థిపంజరమువంటిదనుట సాహసము కానేరదేమో. దానికి రంగస్థలము దేహము, నటులు రక్తమాంసములు, సూత్రధారుడు ప్రాణము, ప్రేక్షకులు శోభ. రంగస్థలమునందు చక్కగా ప్రదర్శితమైనప్పుడే రూపకము సార్థకమై సంపూర్ణము కాగలదని చెప్పగలము. అంతమాత్రమున రూపకరచనము స్వతంత్రముగా నిలువజాలదని చెప్పుటకు వీలులేదు. నిజమునకు, ప్రదర్శించుటకువీలులేని, ప్రదర్శింపబడని పెక్కు రూపకములు కలవు. అవి కేవలము చదువుకొనుటకు మాత్రమే ఉపయోగించును; ఇవి ఇంచుమించుగా శ్రవ్యకావ్యములవంటివే. వీటినే ఆంగ్లమున "Closet Dramas" అందురు. రోమ్ దేశమందలి సెనీకా ( Seneca - C. 4 B. C. - A. D. 65 ) రూపకములిట్టివే. అవి ఆలంకారికముగా రచింపబడినవే కాని రంగస్థలమును దృష్టిలో పెట్టుకొని రచింపబడినవి కావు; అవి ప్రదర్శింపబడినసూచనలు కూడ లేవు. [అయినను, పునరుజ్జీవన కాలమందలి (Renaissance) రూపకములపై వాటి ప్రభావము అపారమగుట ఆశ్చర్యకరమైన విషయము]. సంస్కృతమునందలి అనర్ఘ రాఘవాదులను ఇట్టి జాతిలోనే చేర్చవచ్చును.



నటులు రూపకములకు వ్యాఖ్యాతలవంటివారు. వారు తమ అభినయసామర్థ్యముతో రూపకమునకు ఎనలేని ఖ్యాతిని, అందమును చేకూర్పగలరు. ఒక్కొక్కప్పుడు మంచి రూపకమును పాడుచేయుటయు, అధమ రూపకమును ఉత్తమముగా ఒప్పించుటయు కూడ కలదు. నటులు రచయితహృదయమును అర్థముచేసికోలేనిచో అది విజయవంతమగుట చాల అరుదు. మరియు సమర్థులగు నటులు లేకపోవుటచే ఒక్కొక్కప్పుడు ఉత్తమరూపకము కూడ తాత్కాలికముగా మరుగున పడిఉండవచ్చును. నటుల అభినయములలో కూడ కాలమును బట్టి మార్పులు వచ్చుచుండును. ఉదా : హిరణ్యకశిపుడు మొదలగు రాక్షసపాత్రలను మన వారు భయంకరముగా, రౌద్రమూర్తులనుగా ప్రదర్శించుచుండెడివారు. కాని, కళాప్రపూర్ణ శ్రీ టి. రాఘవాచార్యులుగారు ఈ పద్ధతిని విడనాడిరి. హిరణ్యకశిపుడు ఎంత రాక్షసుడైనను వానికిని పుత్రవాత్సల్యము, దయాంతఃకరణములు లేకపోలేదు. రావణుడు పరమమాహేశ్వరుడు, వేదములను విభజించిన మహాపండితుడు. యముడు ధర్మమూర్తి, సమవర్తి. ఇట్టివారిని కేవలము రాక్షసులనుగానో, భయంకరాకారులనుగానో ప్రదర్శించుట న్యాయ్యము కాదు. అందుచే శ్రీ రాఘవాచార్యులుగారు భిన్నదృక్పథముతో ఈ పాత్రలను అభినయించెడివారు. తెలుగుదేశమున ఇట్టి మార్గమునకు వారు ఆచార్యులు.

'Dramatist' అను పదము నేడు 'రూపక రచయిత' అను అర్థమునందు మాత్రమే ప్రచారములో ఉన్నది. 'Play-wright' అను పదముకూడ నేడు బహుళ ప్రచారములో ఉన్నది. ఈ పదము పై పదముకంటె విస్తృతమైన అర్థమునందు ('రూపక కర్త ప్రదర్శనములో భాగస్వామి' అనెడి అర్థమునందు) ప్రయుక్తమగుచున్నదని చెప్పవచ్చును. నిజమునకు, రూపకరచయితకూడ అభ్యాససమయమున, ప్రదర్శనకాలమందు నటులు, సూత్రధారుడు, తదితర ప్రయోక్తలు మొదలగు వారితోపాటు సమానముగా పాటుపడవలసియున్నది [4 వ అధ్యాయమందలి 5 వ అథస్సూచికను చూడవలెను]. రంగానుభవములేని నాటకకర్త నాటకము అంతగా రాణించదు. గ్రీకు విషాదరూపకకర్తలు ముఫ్వురును రూపకరచయితలేకాక స్వయముగా దర్శకులును, నటులునుకూడ. షేక్స్పియరు అట్టివాడే. మరి కాళిదాసాదు లెట్టివారో మనకు తెలియదు. కొన్ని సంస్కృతరూపకములందలి ప్రస్తావనలనుబట్టి ఆ రూపకకర్తలు నటులకు సన్నిహితులనెడి విషయము సూచితమగుచున్నది. భావప్రకాశకర్తయగు శారదాతనయుడు భావాభినయకోవిదులైన నటులు ప్రదర్శించిన ముప్పది నాటకములు చూచెనట! రూపకకర్తలే కాక, లాక్షణికులుకూడ ప్రదర్శనములందు శ్రద్ధవహించినట్లు దీనినిబట్టి గ్రహించవచ్చును. తెలుగుదేశమున ఆధునికులలో ఆంధ్రనాటకపితామహులు శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులుగారు రచనలో, నటనలో, దర్శకత్వములో సాటిలేని మేటి అనిపించుకొన్నవారు.

## 3. కొన్ని పారిభాషిక పదములు

'Drama' అనెడి పదము గ్రీకు పదము. " A thing done " అని దీనికి అర్థము. గ్రీకుల కాలమునుండి ఇంచుమించుగా 18 వ శతాబ్ది వరకును 'drama' అను పదమునే పాశ్చాత్యులందరును వాడెడివారు. ఇప్పుడు 'play' అను పదముకూడ వ్యవహారములోనికి వచ్చినది. ఈ పదమెంత విస్తృతమైనదో క్రింది వివరణము తెలుపగలదు—

"Play is a generic term applied to any work written to be acted, and covering such more limiting terms as tragedy, comedy, farce, drama etc. It may range from a spirited exchange of backchat between two mounte banks in the market place to a full-length work given in a special building—a theatre—with a cast of highly trained professional actors aided by all the appurtenances of lighting, costuming, and production. The one essential requisite is that it should be entirely or mainly spoken ; if given without dialogue it ranks as mime or ballet, if all the dialogue is sung, as opera. Hybrid forms give rise to Ballad Opera, Burletta, Musical Comedy etc. [The Oxford Companion to the Theatre—p. 618].

నేడు 'Play', 'Play-wright' అను పదములే అధికముగా ప్రచారమునందున్నవి. సామూహికార్థమందు (Greek Drama, British Drama, Indian Drama, Restoration Drama అనెడి అర్థములందు) నేడు 'Drama' పదము వ్యవహృతమగుచున్నది.

రూపకమనగా విధిగా ('దృశ్యమానము కావలెను' అనెడి సూత్రమునకు రేడియో రూపకము (Radio - play) అపవాదముగా కన్పట్టుచున్నది. ఒకరే చదువుటకుమారుగా పలువురు చదువుట, పెక్కు కంఠస్వరములు వినిపించుట, అవస్థానుకూలములైన ధ్వనులను పుట్టించుట అనెడి విశేషములను విడిచివేసినచో దీనికిని, Closet drama కును భేదమేలేదు. (Closet drama ను పదిమంది కూర్చున్నప్పుడు ఒకరు చదివి వినిపించెడివారట). దృశ్యత్వ మనెడి ప్రధానధర్మమునే కోల్పోయిన ఈ ప్రక్రియను 'రూపక' పదముతో వ్యవహరించుటకంటె వేరొక పదమును కల్పించుట సమంజసము కాగలదేమో.

'Stage' and 'Theatre' అనెడి పదములను కూడ మనము నేడు ఎక్కువగా వాడుచున్నాము. 'Stage' అనగా రంగస్థలము. దానికి పరిమితమైన అలంకరణాదులు అని అర్థము. ఇంక 'Theatre' అను పదము చాల విశాలమైనది. నాట్యశాల అనెడి అర్థమునే కాక ప్రదర్శనమునకు సంబంధించిన సర్వకార్యకలాపములను ఈ పదము వ్యక్తము చేయుచున్నది. బాలే, ఒపెరా, సంగీతకచేరీ, మొదలగునవి జరిగెడి స్థలమును కూడ 'Theatre' అనియే అందురు. అందుచే కేవలము రూపక ప్రదర్శనములకు పరిమితమైన దానిని 'play-house' అనుట సమంజసము. 'Theatre' అనునదికూడ గ్రీకుపదమే; 'a seeing place' అని దీనికి అర్థము. కాని గ్రీకులకాలములో మాత్రము దీనికి 'Auditorium' (రంగమండలము) అని మాత్రమే అర్థము. 'Audience' అనునది లాటిన్ భాషా పదము; 'Those who listen' (శ్రోతలు) అని దీనికి అర్థము. 'spectator' అనునది కూడ లాటిన్ భాషాపదమే; 'one who looks on' (ప్రేక్షకుడు) అని దీనికి అర్థము. అందుచే రూపకప్రదర్శనమును చూచెడివారిని 'Audience' అనుట సమంజసము కాదు; 'spectators' (ప్రేక్షకులు) అనియే అనవలెను.

### 4. రూపక-ఉపరూపక భేదములు

భరతుడు పది రూపకములను, నాటికను పేర్కొనెను. భరతుడు ఉపరూపకములను చెప్పనేలేదు. అభినవగుప్తుడు 4 వ అధ్యాయమందును, 18 వ అధ్యాయమందును డోంబికా-భాణ-ప్రస్థాన-షిద్గక-భాణికా-ప్రేరణ-రామాక్రీడ-హల్లీసక-రాసకము లనెడి ఉపరూపకము



లను పేర్కొనెను. కాని, అభినవగుప్తుడు వాటిని ఆ పేరుతో పేర్కొనలేదు; గేయ రూప కము లనియు, నృత్త ప్రకారములనియు, రాగ కావ్యములనియు పేర్కొనెను. అంతియే 'కాక 'నాటికా' భేదమున్నట్లే 'ప్రకరణికా' భేదము కూడ ఉండునని కొందరభిప్రాయ పడినట్లు 18 వ అధ్యాయములో పేర్కొనెను. మరియు భరతుడు నాటికను కూడ పేర్కొనుటచే కోహలాది లక్షిత తోటక-సట్టక-రాసకాదులు కూడ గ్రహణీయములే అని అభిప్రాయపడెను.

అగ్నిపురాణము 'నాటకములు' అను పేర 27 భేదములను పేర్కొనెను. ఇందు మొదటి పదియును భరతుని దశరూపములు. తక్కినవి ఉపరూపకములు—తోటక-నాటికా-సట్టక-శిల్పక-కర్ణ-దుర్మల్లికా-ప్రస్థాన-భాణికా-భాణి-గోష్ఠి హల్లీశక-కావ్య-శ్రీగదిత-నాట్య రాసక-రాసక-ఉల్లోప్యక-ప్రేక్షణములు.

ఉపరూపకములను పెంపొందించిన ఖ్యాతి కోహలునికి దక్కినది. ఆతడు ఉపరూప కములందు మార్గ దేశి భేదములను చెప్పియున్నాడు—నాటిక, ప్రకరణిక, భాణిక, హాసిక, వ్యాయోగిని, డిమిక, కలోత్సాహవతి, చిత్ర, జుగుప్సిత, చిత్రతాల అను పదియును మార్గ భేదములు. వీటియందు నృత్త-గానము లుండవు; ఇవి రూపకతుల్యములే. ఇంక డోంబిక, భాణము, ప్రస్థానము, షిద్గకము, భాణిక, ప్రేరణము, రామక్రీడము, రాగకావ్యము, హల్లీసకము, రాసకము అను పదియును దేశిభేదములు; ఇందులో చివరి ఆరును నృత్త ప్రకారములు.

హేమచంద్రుడు కావ్యానుశాసనమందును, భోజుడు శృంగారప్రకాశమందును నాటికా-సట్టకములను రూపకములనుగానే పేర్కొనిరి. అనగా రూపకములు 12 అగుచున్నవి. నాట్యదర్పణకర్తలు ప్రకరణీ-నాటికలను చేర్చి మొత్తము 12 రూపకములను చెప్పినారు.

బోధాయన విరచితమగు 'భగవదజ్జుకీయ' మనెడు ప్రహసనములో "అథ తు నాటక ప్రకరణోద్భవాసు పార-ఈహామృగ-డిమ-సమవకార-వ్యాయోగ-భాణ-సల్లాపక-వీథీ-ఉత్సృష్టికాంక-ప్రహసనాదిషు దశజాతిషు నాట్యరసేషు హాస్యమేవ ప్రధానమితి పశ్యామి" అని సూత్రధారుడు పేర్కొనెను. ఇందు పార-సల్లాపకములు రూపకజాతిలో క్రొత్తగా చెప్పబడినవి. ఇప్పుడు కూడ రూపములు 12 అగుచున్నవి. 'పార' అనుదాని పూర్తి పేరు 'నృత్తపారము'. దీనినిగూర్చి శ్రీ మా. రామకృష్ణకవిగారు ఒక వ్యాసమును వ్రాసియున్నారు.

ఉపరూపకములనెడి పదమును సుస్పష్టముగా వాడిన ప్రథముడు విశ్వనాథుడని చెప్పవచ్చును. ఆతడు 18 ఉపరూపకములను పేర్కొనెను. శారదాతనయుడు 20 ఉపరూపక ములను పేర్కొనెను. రూపక-ఉపరూపక భేదములు రెండింటినేకాక అన్యరూపకములనెడి మూడవ భేదమును కొందరు చెప్పిరి; నాటికా-సట్టకాదులిట్టివి.

ఆయా లక్షణకర్తలు పేర్కొనిన మొత్తము రూపకములను క్రింద పేర్కొనుచున్నాను-

రూపకములు— భరతుడు పేర్కొనిన పది.

అన్యరూపకములు— నాటికా-ప్రకరణీ-తోటక(త్రోటక)-సట్టకములు.

అన్యరూపకములు— భరతుడు చెప్పిన పదియును కాక మరి

కోహలుడు చెప్పిన మార్గరూపకములు— నాటికా-... 

పది రూపకములు చిత్రతాలాదులు. [ఇప్పటికి (10+4+10=)24 రూపకములైనవి. ఇంక ఉపరూపకములు 28 కలవు. కావున, రూపక-ఉపరూపకముల మొత్తము - 24+28=47].

ఉపరూపకములు— 1. రాసకము, 2. నాట్యరాసకము, 3. భాణము, 4. డోంబి (డోంబిక), 5. భాణిక, 6. ప్రస్థానకము (ప్రస్థానము), 7. ప్రేఙ్ఖణికము (ప్రేంఖణము), 8. హల్లీసకము, 9. కావ్యము, 10. పారిజాతకము (పారిజాత లత), 11. గోష్ఠి, 12. శ్రీగదితము, 13. విలాసిక, 14. ఉల్లోప్యకము, 15. నర్తనకము, 16. ప్రేరణము, 17. సల్లాపకము. 18. శిల్పకము, 19. కల్పవల్లి, 20. పిద్గకము, 21. దుర్మల్లికా (మత్తల్లి), 22. మల్లిక (మణికుల్య), 23. రామాక్రీడము.

భరతుడు చెప్పిన దశరూపములలో ఐదు ఏకాంకములు (ఏకాంకికలు). ఇంక ఉపరూపకములలో మొదటి పదునాలుగును ఏకాంకములు.

5. రూపకములు పాఠ్యప్రధానములు

రూపక-ఉపరూపకముల విభాగ విషయమున హేమచంద్రుడు చేసిన వివరణము గమనార్హము— కావ్యము ప్రేక్ష్య-శ్రవ్య భేదములచే రెండు విధములు. ప్రేక్ష్యము అభినేయము, శ్రవ్యమనభినేయము. ప్రేక్ష్యము పాఠ్య-గేయ భేదములచే రెండు విధములు. నాటక-ప్రకరణ-నాటికా-సమవకార-ఈహామృగ-డిమ-వ్యాయోగ-ఉత్సృష్టికాంక-ప్రహసన-భాణ-వీథీ-సట్టకాదులు పాఠ్యములు. ఆది శబ్దముచే కోహలాది లక్షిత తోటకాదులు గ్రాహ్యములు. నాటకాది వీథ్యంతములైన పదునొకండును వాక్యార్థాభినయ స్వభావములు; వీటిని భరతుడే నిర్దేశించెను. సట్టకము నింకొకరు పేర్కొనిరి. డోంబికా-భాణ-ప్రస్థాన-శింగక-భాణికా-ప్రేరణ-రామాక్రీడ-హల్లీసక-రాసక-గోష్ఠి-శ్రీగదిత-రాగకావ్యాదులు గేయములు. ఆది గ్రహణముచే శంపా-ఛలిత-ద్విపద్యాదులు పరిగ్రాహ్యములు... మసృణ-ఉద్ధత-మిశ్ర భేదములచే గేయకావ్యములు మూడు విధములు...పాఠ్యమునందు అంగ-గీతములు అనియతములు; ఇతివృత్తము, సంభాషణము, రూపారోపణము, వ్యుత్పత్త్యభిసంధానమును ప్రధానములు. ఇంక గేయ కావ్యమందు అంగ-గీతములు సుప్రతిష్ఠితములై ఉండును. ఇతివృత్తాదులకు ప్రాధాన్యములేదు. ఇందు కొన్నింటిలో గీతికి ప్రాధాన్యము, కొన్నింటిలో నృత్తమునకు ప్రాధాన్యము, మరికొన్నింటిలో రెండింటికిని ప్రాధాన్యము, తక్కినవానిలో వాద్యములకు ప్రాధాన్యము." [కావ్యానుశాసనము-8వ అధ్యాయము].

రూపకములు పాఠ్య ప్రధానములని ఇంత స్పష్టముగా ఆలంకారికులు చెప్పియున్నను కొందరు విమర్శకులు దీని విషయమై శంకించుచున్నారు. ఈ సందర్భమున డా. మనో మోహన్ ఘోష్ వాక్యములు గమనార్హములు— "The word Natya, which is also a synonym for a Rūpa or Dṛśya Kāvya and points to its lyrical nature, throws further light on the point. In accordance with the etymological meaning of this word which is derived from the root Naṭ (=Nṛt) meaning 'to dance', Hindu plays are compositions in which rhythm and lyrical elements preponderate and action is given a very minor scope. All these go to show that realism in the ordinary sense has no place in Hindu plays. And after a closer examination



of them, one is sure to discover their suggestive Character and the consequent demand on the imagination of the spectators...Having regard to these Charcteristics of Hindu plays, they may perhaps suitably be called 'lyrico-dramatic-spectacles', but not 'dramas' from which their aim and object as well as the attitude of their actors and spectators greatly differ" [Introduction to his translation of Abhinaya Darpana—Pp. 6—7]

నాట్యశాస్త్రమును ఆంగ్లములోనికి అనువదించిన డా. ఘోష్ కూడ సంస్కృత రూపక స్వరూపమును సరిగా అర్థము చేసికోలేదని పైవాక్యములు నిరూపించుచున్నవి. అంకాది విభజనములేని, బృందగీతి ప్రాధాన్యము వహించిన, ప్రతిశీర్షములచే (కృత్రిమ ముఖములు - Masks) ముఖరాగాది ప్రదర్శనములకు వీలులేని గ్రీకు విషాదరూపకములను 'Lyrico-dramatic spectacles' అని కొందరు పేర్కొందురు. [see Everyman's Library Edition of Aeschylus' Tragedies]. ఆపదమును, ఆ అర్థమును భారతీయరూపకములకు అన్వయించుట సమంజసము కానేరదు.

6. దశరూప పరిణామము

"Drama is a term applicable to any situation in which there is conflict and, for theatrical purposes, resolution of that conflict with assumption of Character" [The Oxford Companion to the Theatre—P. 124].

పై వాక్యము రూపక లక్ష్యమును వివరించుచున్నది. గ్రీకు రూపకముల ఉత్పత్తి-పరిణామములను ప్రథమాధ్యాయము చివర 8 వ విశేషాంశములో పేర్కొనియున్నాను. భారతీయరూపకోత్పత్తిని గూర్చి ఈ విధముగా ఖచ్చితముగా చెప్పుటకు తగిన ఆధారములు లేవు. అరిస్టాటిల్ తాను poetics వ్రాయునప్పటికి గ్రీకు విషాదరూపకములు ప్రసిద్ధి నందియున్నవి: అతడు వాటి రచనమును, ప్రదర్శనమును కూడ పరిశీలించియుండెను. కాని, భరతునకు ముందెట్టి రూపకము లుండెడివో మనకు తెలియదు. భరతుడు కూడ ఎట్టి రూపకమును కాని, రూపకరచయితను కాని స్మరించనేలేదు [అందుచేతనే కాలనిర్ణయము మరింత క్లిష్టసమస్య అయినది]. ఇది చాల విచిత్రమైన విషయము. నాట్యశాస్త్రమునకు వేదత్వమును సిద్ధింపజేయుటకు కాబోలు లౌకిక కావ్య-కావ్యకర్తల నామములు పూర్తిగా విడువబడినవి.

దశరూపములను వివరించునప్పుడు ఆలంకారికు లందరును మొదట నాటక-ప్రకరణములను వరుసగా చెప్పియున్నారు. తరువాతి రూపముల వరుసలో కొంత క్రమభేదము కన్పట్టుచున్నది. 'భగవదజ్జుకీయము' లో బోధాయనుడు పార-ఈహామృగాదులను నాటక-ప్రకరణోద్భవములనుగా పేర్కొనెను. సింగభూపాలుడు నాటకమును 'ప్రకృతి రూపము' నుగా నిర్దేశించెను—"సాక్షాదుపదేశముచే ధర్మ సమన్వయము పొందుటవలనను, అంగాంగిభావరూపమున అన్నిరసములును సంపన్నములై ఉండుటవలనను, ప్రకృతులు, అవస్థలు, సంధులు మున్నగువానితో కూడియుండుటవలనను, ప్రకరణాదులగు దృశ్యముల కన్నిటికిని నాటకమే 'మూల' మని పండితు లందురు. అతిదేశబలమున వచ్చిన నాటకపు టంగముల

ననుసరించిఉండుటచే తక్కిన రూపకము లన్నియును నాటకముయొక్క వికారము లగుచున్నవి." [రసార్ణవసుధాకరము - శ్రీ బులుసువారి అనువాదము - పుట 397]

మరికొంద రాలంకారికులును పై విధముగానే తలంచియున్నారు. 'దశరూప' పదమున కర్థమేమో ఈ అధ్యాయ ప్రారంభమందు 5 వ అధస్సూచికలో వివరించియున్నాను. అందులో ఉదాహృతములైన 'కొందరి' వాక్యములనుబట్టి కూడ పై అభిప్రాయమే సూచితమగుచున్నది. అయినచో పై వివరణములనుబట్టి నాటకమునుండియే తక్కిన రూపము లన్నియును జనించినవని చెప్పవలసివచ్చును. కాని, ప్రతి విషయమున ఉత్పత్తి-వికాసములు (Origin and Development) నిశితముగా, నిష్కర్షగా నిరూపింపబడుచున్న ఈ కాలములో ఆధునిక విమర్శకులు పై అభిప్రాయమును (అనగా రూపము లన్నింటిలోను ఉత్తమోత్తమమైన నాటకము మొదట ఆకస్మికముగా ఆవిర్భవించెననియు, తక్కిన రూపకములు దాని పరిణామములే అనియు) ఆమోదించరు. అందుచే వారు దశరూప పరిణామమును నిర్ణయించుటకు ప్రయత్నించియున్నారు. ఇట్టి వారిలో డా. వి. రాఘవన్, శ్రీ డి. ఆర్. మాంకడ్ అనువారిని ముఖ్యులనుగా పేర్కొనదగును. డా. రాఘవన్ "A Note on the name Dasarupaka" అనెడి వ్యాసమును "Journal of the Oriental Research, Madras" అనెడి పత్రికలో ప్రకటించినారు. ఇంక శ్రీ మాంకడ్ "Types of Sanskrit Drama" (1936) అను పేర ఒక పరిశోధక గ్రంథమును ప్రకటించినారు. అందులో రూపక-ఉపరూపకముల లక్షణములును, వాటి పరిణామములును విపులముగా చర్చింపబడినవి. ఈ గ్రంథము ననుసరించియే తెలుగులో శ్రీ తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులుగారు "గీర్వాణరూపకము" ను రచించియున్నారు.

'దశరూపపదమును' అభినవుడు క్రింది విధముగా వివరించెను— దశరూపమనగా కావ్యముయొక్క పదిరూపములని అర్థము; అనగా నాటకాదులు పదియును పదిరూపములు (ten kinds of dramatic tendencies or ten aspects of drama). 'నాటకరూపము' దేనియందు ప్రాధాన్యమును వహించునో అది 'నాటక' మనబడును. అట్లే 'ప్రకరణరూపము' దేనియందు ప్రాధాన్యమును వహించునో అది 'ప్రకరణ' మనబడును. ఇట్లే ఇతర రూపకములకును ప్రాధాన్యమునుబట్టి పేర్లు వచ్చినవి. ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలెను. 'నాటక' మన్నంతమాత్రమున సకల ప్రబంధమును 'నాటక' లక్షణయుతము కానాలదు. అందులో ప్రకరణ - ప్రహసన - భాణాది లక్షణములు కూడ ఆయా భాగములందు కన్పట్టుచుండును. కాని నాటకలక్షణము అధికముగా ఉండుటచే అది 'నాటక' మనబడినది. ఇట్లే ప్రతి రూపమందును తక్కినరూపములు కన్పట్టుచునే ఉండును. సట్టకాదులు ఈ దశరూపములనుండి జనించినవే కాన నిజమునకు అవికూడ 'దశరూపము' లోనివే.

ఉత్సృష్టికాంకము కరుణ ప్రధానమైన ఏకాంకము కదా. అది ఏ పెద్దనాటకమందైనను ఒక భాగముగా ఇముడగలదు; అట్లే భాణ-ప్రహసన-వీథులును. మృచ్ఛకటికమందలి 'ద్యూతకరసంవాహకాంకము' నిజమునకు ఒక ప్రహసనమే. వీథ్యంగములలో మూడు (త్రిగత-ఉద్ఘాత్యక-అవలగితములు) నాటకమున ప్రస్తావాంగములగుట గమనార్హము. మరియు, లాక్షణికులందరును నాటక-ప్రకరణములనుండియే వీథ్యంగముల



కుదాహరణములొసంగియుండుటకూడగమనార్హము. ఇంక భాణము ఏకహార్యమును, ఆకాశభాషిత సంయుతమును కదా? ఈ లక్షణములు సర్వనాటక-ప్రకరణములందును ఏదో ఒకచోట కన్పట్టుచునే ఉండును. ఇచ్చట ఇంకొక విషయమునుకూడ గుర్తించవలసియున్నది. ఈ దశరూపములందును నాటక-ప్రకరణములు ఉత్తమములే కాక సువిశాలములును. అందుచే వీటియందు తక్కిన రూపములెల్ల ఉండుట కవకాశములున్నవి. వ్యాయోగాదులయందు అట్లు తక్కినరూపములెల్ల ఉండుట కవకాశములేదు.

మూలమందు భరతుడే వీటికి కొంత పరస్పర సంబంధమును సూచించి యుండెను. ఈహామృగము వ్యాయోగతుల్యమనియు, వ్యాయోగము సమవకారతుల్యమనియు ఆతడు పేర్కొనెను. ఇందు వ్యాయోగమును 'ఏకాంక సమవకారము'నుగా పేర్కొనవచ్చును. 'నాటకం సప్రకరణం' అనుటలో పెక్కు విషయములందు ప్రకరణము నాటకతుల్యమని అభినవగుప్తుడు వ్యాఖ్యానించి యుండుట గమనార్హము.

శ్రీ మాంకడ్ దశరూప పరిణామమును క్రింది విధముగా వివరించెను—

(1) దశరూపములలోను భాణ-వీథీ-ప్రహసన-అంక-వ్యాయోగములు ఏకాంకములు. ఇందు ఇతివృత్తము స్వల్పము. నిర్మాణదృష్టితో చూచినచో వీటి రచన చాల సులభము. అందుచే ఇవి తక్కినవాటికంటె ఆదిమరూపములై యుండును.

(2) వీటిలో భాణము పూర్తిగా ఏకహార్యము. కేవలము నృత్య ప్రకారము కాకుండుటకై ఆకాశ భాషితమును చేర్చుకొని, అందుమూలమున ఆభాసముగా సంవాదాత్మకమై కొంత నాటకీయతను తెచ్చుకొన్నది. (నిజమునకిది శ్రవ్యకావ్యతుల్యమే). అందుచే దీనిని ప్రాథమిక రూపమనుట సమంజసము.

(3) వీథి ఇంచుమించుగా భాణమువంటిదే. కాని, ఇందు ఇరువురు పాత్రలుండవచ్చును; నాయకుడు ఉత్తమ - మధ్యమ - అధమములో ఎవరైనను కావచ్చును. అందుచే ఇది భాణముకంటె అభివృద్ధిని సూచించుచున్నది.

(4) పాత్రబాహుళ్యము, ఇతివృత్త విస్తృతి ప్రజలనాకర్షించియుండును. ఈస్థితిలో భాణమునుండి ప్రహసనమును, వీథినుండి అంకమును ఉద్భవించియుండును. అనగా భాణమునందు అంగిరసమగు శృంగారము ప్రహసనమందు అంగరసమై, హాస్యము అంగిరసమైనదన్నమాట.

(5) అట్లే కరుణరసము ప్రాధాన్యము వహించిన అంకమును ఉద్భవించియుండును.

(6) వ్యాయోగము పైవాటితో సమానమే అయినను యుద్ధాదులతో కూడియుండుటవలన భిన్నమైనది. ఇది ఇంకొకరకమైన అభివృద్ధి.

(7) ఈ ఐదును ఏకాంకములే అయినను భాణమును వీథిలోని ఒక భేదమును ఏకహార్యములును, వీథిలోని రెండవ భేదము ద్విహార్యమును కాగా తక్కినవి బహుపాత్రసమన్వితములుగా ఉండును. పాత్రబాహుళ్యముతో కథయును పెరిగి అంకములును అధికము కాజొచ్చినవి. డిమ - ఈహామృగ - సమవకారములు ఈస్థితికి సంబంధించినవి.

(8) ఈహామృగము సర్వవిధముల వ్యాయోగతుల్యమే, కాని ఇది స్త్రీపాత్రబహులమైనది.

(9) డిమము కూడ ఒకవిధమగు వ్యాయోగమే. కాని వ్యాయోగమందలి యుద్ధాలకంటె ఇందలి యుద్ధములు చాల భయావహములుగా ఉండును. ఇట్లి రెండును వ్యాయోగముకంటె అభివృద్ధిని సూచించుచున్నవి.

(10) వ్యాయోగము సమవకార ప్రమాణము కలిగి ఉండరాదని భరతుడే చెప్పుటను బట్టి సమవకారము వ్యాయోగముకంటె అభివృద్ధిని చెందినదనుట స్పష్టము.

(11) ఇన్ని రకములుగా అభివృద్ధిచెందిన రూపకము క్రమముగా ఉత్తమములైన ప్రకరణ-నాటకములుగా పరిణతి చెందియుండును.

దశరూప పరిణామమును డా. రాఘవన్ ఇంకొక విధముగా ఊహించెను—

(1) వీథి ప్రథమదశ. మొదట ఇది ఏకహార్యము. తరువాత రెండవ నటుడుచేరి ద్విహార్యమైనది. ఏకహార్యమైన వీథినుండియే శృంగార ప్రధానమైన భాణము జనించినది. ఇంక ద్విహార్యమైన వీథినుండి ప్రహసనము జనించియుండును. ప్రాచీన వీథీరూపము లేవియును మనకు లభించకపోవుటచేతను, వీథ్యంగములు ప్రస్తావనయందును, నాటక-ప్రకరణములయందును చేరిపోవుటచేతను అతిప్రాథమికమైన వీథీరూపము నశించినదనియే చెప్పవచ్చును. [లీలావతీవీథులవంటివి అర్వాచీనములు రెండు మూడు మాత్రమే కలవు.] భాణ-ప్రహసనముల అంశములుకూడ నాటక-ప్రకరణములందు చేరినవి; కాని, అవి వ్యక్తిత్వమును మాత్రము కోల్పోవలేదు.

ఈ విధముగా సంఘములోని వ్యక్తులను, వారి ఆచారాదులను, అవకతవకలను ప్రదర్శించవలెననెడి మానవుని అభిలాషయే వీథీరూప మావిర్భవించుటకు హేతువై యుండును. వీథి ప్రహసనమునకు తావిచ్చినది; ప్రహసనముమీది సంపూర్ణాభివృద్ధియే ప్రకరణము.

(2) సమవకార-ఈహామృగ-వ్యాయోగ-డిమములు ఉద్ధతరూపకములు; అనగా ఇవి వీరతా (heroic element) ప్రధానములు. ప్రప్రథమముగా ప్రదర్శింపబడిన రూపకములు అసురపరాజయ-అమృతమంథన (సమవకారము)-త్రిపురదాహము (డిమము) లని నాట్యశాస్త్రమునుబట్టి తెలియుచున్నది. దేవాసురులమధ్య జరిగిన సంగ్రామములతోకూడిన ఈ రూపములు ప్రాథమిక దశకు చెందినవి. వీటిలో కొన్ని సమానగుణము లున్నవి. ఈహామృగ-వ్యాయోగ-సమవకారములు పరస్పరము సంబంధించియున్నట్లు భరతుడే పేర్కొనెను కదా. ఇవియే క్రమముగా మార్పులు చెందుచు నాటకముగా పరిణతినందియుండును. ఇంక, యుద్ధాదులైన పిమ్మట, వితంతువుల విలాపాదులతోకూడి ఉండునది అంకము. కాన ఇది సమవకారాదులకు పుచ్ఛభూతమైనదని చెప్పవచ్చును.

పై విధముగా "Heroic and lighter themes" వేర్వేరు శాఖలుగా అభివృద్ధినందుటచే క్రమముగా నాటక-ప్రకరణములు ఉద్భవించినవి. ఇవి స్థిరపడుటతోడనే వీథ్యాదులు ప్రాముఖ్యమును కోల్పోయిఉండును. కావుననే వాటికి ప్రాచీన లక్ష్యములు నశించినవి.

భారతీయ లాక్షణికులు, చారిత్రక పరిణామమును గుర్తించి నిర్దేశించుట చాల అరుదుగా కానవచ్చును. కావుననే వారు ఈ దశరూపముల విషయముననుక్రమపరిణామమును గుర్తించలేదు. సర్వలక్షణ సంపన్నమైన నాటకమును మొదట వివరించి, తక్కిన వాటిలో చూపట్టు ప్రధాన భేదములను వరుసగా పేర్కొనుట లక్షణకర్తకు సులువు; అందరును అట్లే చేసిరి.



సర్వలక్షణ సంపన్నమైన నాటకమే మొదటిదనియు, దానినుండియే తక్కినవి జనించి ఉండుననియు ఏల తలంచరాదని కొందరు ప్రశ్నించవచ్చును. ఇది శాస్త్రీయ దృక్పథము కాదని మొదటనే తెలిపియున్నాను.

## 7. దశరూప లక్షణములు

దశరూపముల లక్షణములను, సౌలభ్యార్థము, ప్రక్కపుటలలో పట్టిక రూపములో వివరించుచున్నాను.

సూచన : ఇందు నాటక - ప్రకరణ - భాణ - వీథీ - అంక - ప్రహసనములు సుకుమారరూపకములు.
ఇంక సమవకార - ఈహామృగ - డిమ - వ్యాయోగములు ఉద్ధత రూపకములు.
వ్యాయోగ - అంక - ప్రహసన - భాణ - వీథులు ఏకాంకములు లేదా ఏకాంకికలు.

కలోత్సాహవతి మొదలగునవి కోహలుడు చెప్పిన మార్గ-రూపకములు. ఇవి ఆయా రూపకములనుండి జనించినవగుటచే 'జన్యరూపకము' లగుచున్నవి.

## 8. నాటకాదులకు ఉదాహరణములు

1. నాటకము : రూపకములన్నింటిలోను నాటకము ఉత్తమమైనదనుట స్పష్టము. మహాకవులందరును నాటకములనే రచించి 'ఔ' ననిపించుకొనుటకు ప్రయత్నించియుండిరి. కాళిదాసు 'శాకుంతలము', భవభూతి 'ఉత్తరరామచరితము' మొదలగునవి ఉత్తమ సంస్కృత నాటకములకు ఉదాహరణములు. అన్నింటిలోను నాటకము ఉత్తమమైనది కావుననే 'నాటక' మనెడి పదము 'నాట్య-రూపక' పదములకు పర్యాయపదమైనది. ఇందులకు ఉదాహరణములు నాట్యశాస్త్రమందే కలవు ; ఈ విషయమును ఇదివరకే నిర్దేశించియున్నాను. నాటకతుల్యమైనదే ప్రకరణమును. ఇవి రెండును పూర్ణవృత్తిరూపకములు.

సుబంధువు నాటకమునందు ఐదు భేదములను చెప్పియుండెనని శారదాతనయుడు పేర్కొనెను— పూర్ణము, ప్రశాంతము, భాస్వరము, లలితము, సమగ్రము.

పూర్ణనాటకము—ఇందు సంధులైదును, తదంగములును ఉండును. 'కృత్యారావణ' మిందుల కుదాహరణము.

ప్రశాంత నాటకము— ప్రశాంత రసభూయిష్ఠమైన ఈ భేదమందు సాత్త్వతీవృత్తి ప్రధానము. "స్వప్నవాసవదత్త" ఇందులకు ఉదాహరణము.

భాస్వర నాటకము— ఇందు భారతీవృత్తి ప్రధానము; వీరాద్భుతములు అంగిరసములు. 'బాలరామాయణ'మిందులకు ఉదాహరణము.

లలిత నాటకము—ఇందు కైశికీవృత్తి ప్రధానము. శృంగారము ఒక్కటియే ప్రధాన రసము. 'విక్రమోర్వశీయ' మిందులకుదాహరణము (కాని, విక్రమోర్వశీయము 'త్రోటకము' లేదా 'తోటకము' అనబడును).

సమగ్రనాటకము— సర్వవృత్తి నిష్పన్నమును, సర్వలక్షణ సంపన్నమును అయిన నాటకమును 'సమగ్రనాటక' మందురు. 'మహానాటక' మిందుల కుదాహరణము.

శారదాతనయుడు 'నృత్తపార' మనెడి నాటకమును సమగ్రనాటకమున కుదాహరణముగా నొసంగెను—"Nrittapara represents a type of Nataka in which all types of

## దశరూప లక్షణములు

| | రూపకము | ఇతివృత్తము | నాయకుడు | అంకములు | సంధులు | వృత్తులు | రసములు | విశేషములు | కోహలుడు చెప్పిన మార్గ రూపకములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | నాటకము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతుడును, ఉదాత్తుడును అయిన రాజర్షి. | 5 నుండి 10 వరకును | 5 | 4 | శృంగారము లేదా వీరము అంగిరసము. తక్కినవి అంగ రసములు. | పతాకా - ప్రకరీ నాయకులు దివ్యులు కావచ్చును. నాటక-ప్రకరణము లందలి అంకములు మహాజన పరివారములు కారాదు: నలుగు రైదుగురు కార్యపురుషులున్నచో చాలును. బహువిధములగు సుఖ-దుఃఖములతో కూడిన రాజుల చరితమే ఇందుండవలెను. నాటకమునందు సర్వరూపముల అంశములును ఇమిడిఉండును. | నాటిక |
| 2. | ప్రకరణము | కల్పితము. (అనార్షము, లేదా ఆహార్యము కూడ) కావచ్చును. | విప్ర - వణిక్ - సచివ - పురోహిత - అమాత్య-సార్థవాహులలో ఎవరో ఒకరు. | 5 నుండి 10 వరకును | 5 | 4 | శృంగారము అంగిరసము | ఇది పెక్కు విషయములందు నాటకతుల్యము. కాని, దివ్యుల చరితము వర్ణితముకారాదు. రాజోచిత సంభోగము ప్రదర్శింపబడరాదు. ఇది దాస - విట - శ్రేష్ఠియుతమును, వేశ్యాస్త్రీకృత శృంగారోపేతమును కావలయును. | ప్రకరణిక |
| 3. | సమవకారము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతులును, ఉదాత్తులును అయిన 12 గురు నాయకులు. | 3 | 4 (అవమర్శము ఉండదు) | కైశికి ఉండదు. | వీరము (శృంగారము అంగము) | 3 కపటములతో, 3 విద్రవములతో, 3 శృంగారములతో కూడినదై మొత్తము 18 నాడికల కాలములో ప్రయుక్తమగును. ప్రతి అంకమును భిన్నార్థములనుకలిగిఉండును. | చిత్ర |
| 4. | ఈహామృగము | ప్రఖ్యాతము | దివ్యపురుషుడు(దివ్య నాయిక) | 1 లేదా 4 | 3 (గర్భ-అవమర్శలు ఉండవు) | కైశికి ఉండదు. | శృంగారము | వస్తువు సుశ్లిష్టముగా ఉండును. 12 గురు దివ్యపురుషులుందురు. భేదన-అపహరణ-అవమర్దనములచే పొందబడిన స్త్రీకి సంబంధించిన శృంగారము ఇందుండును. | చిత్రతాల |
| 5. | డిమము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతుడును, ఉదాత్తుడును. | 4 | 4 (అవమర్శము ఉండదు) | సాత్త్వతి-ఆరభటి | శృంగార హాస్యములుకాక తక్కిన ఆరు రసములును | కావ్య వస్తువు దీప్తరసమును, నానాభావోపసంపన్నమును, దేవ - భుజగేంద్ర-రాక్షస-యక్ష - పిశాచచరిత్రసంయుక్తమును కావలయును, ఇందు 16గురు పురుషులుందురు. | డిమిక |
| 6. | వ్యాయోగము | ప్రఖ్యాతము | ప్రఖ్యాతుడగు రాజర్షి (దివ్యుడు నాయకుడు కారాదు) | 1 (ఒకరోజులో జరిగిన కథ) | 3 (గర్భ-అవమర్శలు ఉండవు) | కైశికి ఉండదు. | వీర-రౌద్రములు (ఇవి దీప్తరసములు) | స్త్రీలు తక్కువగా ఉండవలెను. 12గురు పురుషులుందురు. యుద్ధ-నియుద్ధ-ఆధర్షణ-సంఘర్షణము లిందుండును. | జుగుప్సిత |
| 7. | అంకము (ఉత్సృష్టికాంకము) | సాధారణముగా ప్రఖ్యాతము | దేవతలు నాయకులు కారాదు | 1 | 2 (ముఖ-నిర్వహణములు) | భారతి | కరుణము | యుద్ధము నుండి మరలినవారు, గాఢముగా గాయములు తగిలినవారు ఇందు ఉందురు. స్త్రీల విలాపాదులు ఇందు అధికముగా ఉండును. | వియోగిని |
| 8. | ప్రహసనము | కల్పితము | శుద్ధమునందు భగవత్తాపసాదులు సంకీర్ణమునందు వేశ్యా - చేట - నపుంసకాదులు. | 1 | 2 (ముఖ-నిర్వహణములు) | భారతి | హాస్యము | శుద్ధ - సంకీర్ణ భేదములచే రెండు విధములు. వీటియందు వీథ్యంగములు కూడ ఉండును. లోక వ్యవహార సిద్ధమగు వార్త, దంభము, ధూర్తుల ప్రవిలాపములును ఇందుండును. | హాసిక |
| 9. | భాణము | కల్పితము | ధూర్తుడు లేదా విటుడు | 1 | 2 (ముఖ-నిర్వహణములు) | భారతి | శృంగారము (విస్మయము అంగము) | ఇందు లాస్యాంగములు విధిగా ఉండును. ఏకపాత్ర హార్యము. అతడు తా ననుభవించిన విషయములను లేదా ఇతరు లనుభవించిన విషయములను ఆకాశపురుషభాషితయుక్తముగా వర్ణించును. | భాణిక |
| 10. | వీథి | కల్పితము | ఉత్తమ - మధ్యమ - అధమ ప్రకృతులు ముప్పురిలో ఎవరైనను. | 1 | 2 (ముఖ-నిర్వహణములు) | కైశికి అల్పముగా | అన్ని రసములును ఉండును. | ఏకహార్యము కాని, ద్విహార్యము కాని కావచ్చును. 13 సంధ్యంగములు ప్రయుక్తమగును. | కలోత్సాహవతి |
| 11. | నాటిక | ఉత్పాద్యము | రాజు | 4 | 5 | కైశికి | శృంగారము | ప్రకరణ - నాటకముల సమ్మేళనము వలన కలిగినది. నాయిక అంతఃపుర కన్య లేదా సంగీతశాలాకన్య. | |

Nayakas and Nayikas occur in varied situations under a variety of emotions well laid out presenting all the unities and their angas." అని శ్రీ మా. రామకృష్ణకవిగారు నృత్తపారమును వివరించి యున్నారు. ["Journal of the Oriental Research", Tirupati]

నాటకమునకు కొన్ని ఉదాహరణములు పైన పేర్కొనబడినవి. ముద్రారాక్షసము, వేణీసంహారము, నాగానందము, అనర్ఘరాఘవము మొదలగునవికూడ నాటకములే. ఇంక తక్కినరూపములకుకూడ కొన్నిఉదాహరణములను పేర్కొనుచున్నాను—

2. *ప్రకరణము* : దీనికి 'మృచ్ఛకటికము' సుప్రసిద్ధమైన ఉదాహరణము. విప్రచరిత కలిగిన 'పద్మావతీపరిణయము'ను, కులస్త్రీతోకూడిన 'మాలతీ మాధవము'ను, గణిక నాయికగాగల 'తరంగదత్తయు'ను ప్రకరణములే.

3. *సమవకారము* : శారదాతనయుడు 'అమృతమంథనము'ను, సింగభూపాలుడు 'పయోధిమంథనము'ను ఉదాహరణములనుగా పేర్కొనిరి. ఇవి అలభ్యములు. రెండును ఒకదానికే భిన్ననామములై ఉండవచ్చును.

4. *డిమము* : శారదాతనయుడు 'తారకోద్ధరణము'ను, ధనంజయుడు 'త్రిపురదాహము'ను, సింగభూపాలుడు 'వీరభద్ర విజృంభణము'ను పేర్కొనిరి. ఇవియును అలభ్యములే.

5. *ఈహామృగము* : సింగభూపాలుడు 'మాయాకురంగము'ను, విశ్వనాథుడు 'కుసుమశేఖర విజయము'ను ఉదాహరణములనుగా పేర్కొనిరి. ఇవియును అలభ్యములే.

6. *వ్యాయోగము* : ధనంజయుడు 'జామదగ్న్య విజయము'ను, సింగభూపాలుడు 'ధనంజయ విజయము'ను పేర్కొనిరి. ధనంజయ విజయము ముద్రితమైనది. 'నరకాసుర విజయము' అనునదికూడ ప్రసిద్ధమైన వ్యాయోగమే (ముద్రితము).

7. *ఉత్సృష్టికాంకము* : సింగభూపాలుడు 'కరుణకుండల'ను, విశ్వనాథుడు 'శర్మిష్ఠా యయాతి'ని ఉదాహరించిరి. రెండును అలభ్యములే.

8. *ప్రహసనము* : సైరంధ్రిక, సాగరకౌముది, కందర్పకేలి, ధూర్తచరితము, లటకమేలకము అనువానిని లాక్షణికు లుదాహరించి యున్నారు. హాస్యార్ణవ-భగవదజ్జుకీయ-మత్తవిలాసములు కూడ ప్రసిద్ధములైన ప్రహసనములే.

9. *భాణము* : పదిలాస్యాంగములను కలిగియున్న శృంగార మంజరిని సింగభూపాలు డుదాహరించెను. అర్వాచీనులచే రచింపబడి ముద్రితములైన భాణము లనేకములు కలవు. శ్రీ మా. రామకృష్ణకవిగారు 'చతుర్భాణి' ని ప్రకటించియున్నారు.

10. *వీథి* : వకులవీథి, ఇందులేఖ మొదలగువాటిని లాక్షణికు లుదాహరించి యున్నారు. ఇవి అలభ్యములు. అర్వాచీనములైన 'లీలావతీవీథి' మొదలగునవి ముద్రితములు.

క్రీ. శ. 13వ శతాబ్ది ప్రాంతముల వత్సరాజుఅను నతడు 'రూపకషట్క' మను పేర 'కిరాతార్జునీయ' వ్యాయోగమును, 'కర్పూరచరిత' భాణమును, 'రుక్మిణీ పరిణయ' ఈహామృగమును, 'త్రిపురదాహ'డిమమును, 'హాస్యచూడామణి' ప్రహసనమును, 'సముద్ర మంథన' సమవకారమును రచించెను. ఇవి ముద్రితములు. ఇన్నింటికి ఉదాహరణములను రచించిన వత్సరాజుకూడ 'వీథి'కి ఉదాహరణమును రచింపలేదు!



9. తెలుగుభాషలో నాటక లక్షణము

తెలుగుకవులు ప్రాచీనకాలమునుండియు నాటకాదులను స్వతంత్రముగా సంస్కృత భాషలో రచించుచుండినను తెలుగుభాషలో మాత్రము రచించుటకు పూనుకొనలేదు. ఇందులకు, తెలిసినంతలో వల్లభరాయల 'క్రీడాభిరామము' ఒక్కటియే అపవాదము. ఆంగ్లసాహిత్యప్రభావమునకు లోనైనపిమ్మటనే తెలుగుభాషలో రూపకరచన ఆరంభమైనది (1860 ప్రాంతముల). అంతకుముందు మనకు యక్షగానాదులున్నవి. కాని అవి మార్గరూపకములు లేదా రంగస్థల రూపకములు (modern Stage plays) కావు. తెలుగు భాషలో ఈ నాటకాభావమునకు కారణమేమి ? అనునది ప్రస్తుత విషయము కాదు. లక్ష్యములు లేకపోవుటచేతనే కాబోలు తెలుగు ఆలంకారికులు కూడ తమ గ్రంథములందు రూపకలక్షణమును పూర్తిగా విడిచివేసిరి. కాని, ఇందులకుకూడ ఒక అపవాదము లేకపోలేదు; అదియే చిత్రకవి పెద్దనార్యుని "లక్షణసార సంగ్రహము". ఇతడు క్రీ.శ. 1550 ప్రాంతమువాడని ఉపోద్ఘాతములో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు నిరూపించి యున్నారు. లక్షణసారసంగ్రహమందలి తృతీయాశ్వాసమున, మధ్యభాగమందు, 49 గద్య-పద్యములలో నాటక లక్షణము వివరింపబడినది. ఇతడు నాటక పదమును రూపక పదమునకు పర్యాయముగా వాడియుండెను. వీని నిర్వచనము లన్నియును సంక్షిప్తముగా, బిగువుగా ఉన్నవి. ఈతడు చెప్పిన నాటకలక్షణము ప్రత్యేకముగా దేనికిని అనువాదమని చెప్పుటకు వీలులేదు. ఇందు లక్ష్యములులేవు. ఆతడీ క్రిందివిధముగా చెప్పుకొనెను.

[ఈ గ్రంథము ఆంజనేయునకు అంకితము]—

తెలుఁగున నాటకలక్షణ
మిలనెవ్వరుఁ జేయలేదు వృషదశ్వసుతా !
లలితమతి నీదు కృపచేఁ
దెలిసిన యంతయు నొనర్తు దితిజధ్వంసీ ! 57

పెద్దనార్యుడు 16 ఉపరూపకముల పేర్లను చెప్పి లక్షణములకు 'పూర్వ లసదలంకృతు'లను చూడుడనెను— నాటికా-సట్టక-త్రోటక-ఉపేక్షణ-గోష్ఠీ-భాణికా-సల్లాపక-ప్రస్థాన-కావ్య-భల్లిస-రాసక-శ్రీగదిత-లాసికా-దుర్మల్లి-నాట్య రాసక-ఉల్లాప్యములు.

పెద్దనార్యుడు లక్షణము చెప్పిన పిమ్మటనైనను తెలుగులో రూపక రచనము వృద్ధి పొందకపోవుట విచారకరము.

10. పాశ్చాత్య రూపకములు

ప్రాచీన గ్రీసుదేశమున ముఖ్యముగా 'విషాద-ఆహ్లాదరూపకములు' (Tragedy and Comedy) రెండుమాత్రమే అభివృద్ధి చెందినవి. తరువాతి కాలములందు, ఇతర పాశ్చాత్య దేశములలో అనేక రూపక భేదములు ఉద్భవించి వర్ధిల్లినవి.

పాశ్చాత్య రూపకములను రెండు ప్రధాన శాఖలుగా విభజించుట పరిపాటి—
(1) 'క్లాసికల్ డ్రామా' (Classical Drama-ప్రాచీన సంప్రదాయవిహితరూపకములు);
(2) 'రొమాంటిక్ డ్రామా' (Romantic Drama- కాల్పనిక రూపకములు). ప్రాచీన గ్రీకు-

రోమన్ రూపకములును; ఇటలీకి (Alfieri), ఫ్రాన్సుకు (Corneille and Racine), జర్మనీకి (Goethe and Schiller) చెందిన 'నియో - క్లాసికల్' రూపకములును మొదటిశాఖకు చెందినవి. స్పెయిన్ దేశమునకు (Calderon, Lope de Vega), ఇంగ్లీషు దేశమునకు (Shakespeare etc.), జర్మనీకి (some dramas of Goethe and Schiller), ఫ్రాన్సు దేశమునకు (Victor Hugo and his followers) చెందిన కాల్పనిక రూపకములును; స్ట్రౌనింగు, ఇబ్సెన్ మొదలగువారి రూపకములును రెండవశాఖకు చెందినవి. వస్తువు, కథాగతి, పాత్రపోషణము, శైలి అనువానియందలి భేదములే పై రెండు శాఖలను వేర్పరచుచున్నవి.

ప్రొఫెసర్ ఎ. నికాల్ అను ప్రసిద్ధపాశ్చాత్యరూపకతత్త్వవేత్త పాశ్చాత్యవిషాద-అహ్లాదరూపక భేదములను క్రింగి విధముగా స్థూలముగా వివరించెను. [Introduction to Dramatic Theory - Pp. 144 - 145]—

1. The tragedies unrelieved by comic elements (Othello, Oedipus, Tyrannus, Ghosts).

2. The tragedies with a slight introduction of mirth, never formed into a regular under-plot, and presented mostly for the sake of relief or of contrast (Macbeth, Hamlet).

3. The tragi-comedies where tragic and comic elements have an almost equal balance (The Changeling).

4. The tragi-comedies where a comic under-plot holds a subordinate position (The English Traveller).

5. The tragi-comedies where the comic mirth is the main theme, and the tragic forms an under-plot (The Winter's Tale, Much Ado About Nothing).

6. The Poetic justice plays, where good characters are preserved and evil characters are destroyed (The Conquest of Granada).

7. The drames which end happily (The Road To Ruin).

8. The drames which have not a completely happy solution (The Merchant of Venice).

9. The drame-comedies, where a serious plot mingles with comic elements (Secret Love, The Spanish Fryar).

10. The satiric comedies, where the ending may be and usually is, of the poetic justice order (Volpone).

11. The comedies, where the ending is happy and where the dialogue and the theme are wholly laughable (The Way Of The World, The Merry Wives of Windsor.)

పై వాటిలో మొదటిది శుద్ధ విషాదరూపకము (pure tragedy). 3, 4 భేదములు విషాద-అహ్లాద రూపకముల సంమేళనమువలన కలిగినవి; వీటికి 'Mixed Tragedy' లేదా 'Tragi-comedy' అని పేరు. 5 వ భేదముకూడ మిశ్రరూపకమే; దీనిని 'mixed comedy' లేదా 'Romantic comedy' అందురు. 9 వ భేదము శుద్ధ అహ్లాదరూపకము; ఇందు విషాదము



ఛాయామాత్రముగా కూడ ఉండరాదు. ఇంక 11 వ భేదము అహ్లాదరూపకములలో తక్కువరకము; దీనిని 'Low comedy' లేదా 'farce' అందురు. డ్రేమ్-కామెడీల భేదము క్రింది విధముగా పేర్కొనబడినది—

"Drame invariably deals with personalities, while true comedy deals with types and with classes....Comedy is seperated from the drame by the substitution of type for individual, insensibility for emotion, moral sentiment (the relating of art to life and the consequent presentation of a problem) for pure artificiality."

పాశ్చాత్య దేశములందలి కొన్ని ప్రధానరూపక భేదములను ఇప్పుడు వరుసగా వివరింతును—

(1) *Tragedy* (విషాదరూపకము)—ప్రథమాధ్యాయము చివర 8 వ విశేషాంశము నందు గ్రీకు నాటకోత్పత్తిని వివరించియున్నాను. గ్రీకు విషాదరూపక ప్రథమ నిర్మాత ఎవరో నేటికిని సరిగా తెలియదు. అరిస్టాటిల్ నుండి నేటివరకును ఆ విషయముపై ఒక నిర్ణయము జరుగలేదు. మొదట కేవలము బృందగీతులే ఉండెడివి. థెస్పిస్ అనునతడు ప్రప్రథమముగా నటుని ప్రవేశపెట్టెను. ఎస్కిలస్ రెండవ నటుని, సాఫోక్లిస్ మూడవ నటుని ప్రవేశపెట్టిరి. ఎందరు నటులున్నను రూపకమున బృందగీతి ప్రాముఖ్యము అధికము; ముందు వెనుకల సమన్వయము, జరిగినసంఘటనలకు తాత్త్వికమైన వ్యాఖ్యానము అనునవి బృందగీతి ప్రయోజనములలో ముఖ్యమైనవి. డయొనిసస్ ఉత్సవములలో జరిగెడి నాటక పోటీలలో పాల్గొను నిమిత్తము వ్రాయబడు నాటకములు రచనయందును, ప్రదర్శనము నందును ఉత్తమముగా పరిగణింపబడెడివి. ఆ నాటకముల ఉత్తమత్వమును నిర్ణయించుటకు న్యాయాధికారులు కొన్ని సూత్రములను ప్రవచించుటయే కాక కొన్ని నిబంధనలను కూడ విధించియుండిరి. అందుచేతనే ఆ విషాదరూపకకర్తలు ఒకేవిషయముపై నాటకత్రయమును (Triology), దానితోపాటు ఒక సాటిర్ రూపకమును కలిపి వ్రాయుట పరిపాటి అయినది. (Satyr play—సాటిర్ అనగా మానవాకారమును, తోకయును, అశ్వముఖమును కలిగిన అరణ్యదేవతారూపము). ఎస్కిలస్, సాఫోక్లిస్ మున్నగువారి రూపకములందలి పాత్రలు ఉదాత్తులగుటచే, ఇతివృత్తమునకును ఉదాత్తత చేకూరినది. యురిపిడస్ రూపకములందు వాస్తవికతకు ప్రాధాన్య మీయబడినది.

అరిస్టాటిల్ విషాదరూపకమును క్రింది విధముగా నిర్వచించెను—"Tragedy is an imitation of an action that is serious, complete, and of a certain magnitude; in language embellished with each kind of artistic ornament, the several kinds being found in seperate parts of the play; in the form of action, not of narrative; through pity and fear effecting the proper purgation (catharsis) of these emotions." (గంభీరమును, స్వయంసంపూర్ణమును, సమగ్రమును, నియతపరిణామాత్మకమును అయి; రూపకమునందలి వివిధములైన భాగములందు వేరువేరుగా కన్పట్టెడి కళాత్మకమైన భాషా-అలంకారములతో అలంకరింపబడి; కథనాత్మకము కాక క్రియాత్మకమై; శోక-భయముల మూలమున ఆయా ఉద్వేగములకు ఉచితమైన శాంతనమును కలిగించునది 'విషాదరూపక' మనబడును.)

నాయకునియందలి 'అసాధారణమగు లోపము' ఒకటి విషాదరూపమున కలుగు సంఘర్షణమునకు మూలము (సాధారణముగా నేటి రూపకములందు ఈ లోపము సాంఘిక వ్యవస్థయందో, వాతావరణమునందో సూచింపబడుచుండును). ఇంకను వివరములకు 6 వ అధ్యాయము చివరి 11వ విశేషాంశమును, 7 వ అధ్యాయము చివరి 6 వ విశేషాంశమును చూడవలెను.

గ్రీకుల తరువాతి కాలములో విషాదరూపకమును గూర్చిన భావములం దెన్నియో మార్పులు వచ్చినవి ; కాని, అరిష్టాటిల్ నిర్వచనములందలి మూలసూత్రములు మాత్రము మార్పు చెందలేదు. (హెగెల్ చెప్పిన "...that tragedy arises not from the conflict of right and wrong but from the conflict of right with right" అనునది గమనార్హము.)

పునరుజ్జీవన కాలములో ఎల్. కాస్టెల్ వెట్రో (1570) నాటినుండి అరిష్టాటిల్ నిర్వచనమునకు కొన్ని క్రొత్త సూత్రములు చేర్పబడెను. 'పొయెటిక్స్' లో కన్పట్టని కాలైక్య - స్థలైక్యములను వీరు విధిసూత్రమునుగా పరిగణించిరి. ఈ సూత్రమే నియో క్లాసికల్ కాలమున కార్నీల్, రేసిన్‌లచే 'ఐక్యత్రయము' (స్థల-కాల-కార్య ఐక్యములు) అను పేర బహుళప్రచారమును పొందెను. ఎలిజబెత్ కాలమున ఈ ఐక్యత్రయ మంతగా పాటింపబడలేదు. చివరకు ఇతివృత్తైక్యమును కూడ వారు అంతగా పాటించలేదని చెప్పవచ్చును. ఈ కాలమున విషాదరూపకమునందు ప్రాసంగికేతివృత్తములు (sub-plots) ప్రవేశించినవి; విషాద-అహ్లాద సంఘటనములు మిశ్రితములైనవి. (ఇట్టి అలవాటే చివరకు 'మెలోడ్రామా'గా పరిణమించినది). ఈ కాలమందలి శృంగారరూపకము (Romantic drama) లందు కూడ ప్రాచీనసూత్రములు పాటింపబడలేదని చెప్పవచ్చును.

18 వ శతాబ్దినుండి (డెడెరాట్, జార్జిలిలో, లెస్సింగ్‌లతో) విషాదరూపకనిర్మాణము నందు పెక్కుమార్పులు వచ్చినవి. ఉన్నతవంశీయుడే నాయకుడు కావలెననెడి నియమము సడలినది. ఏ సాంఘికవ్యవస్థకు చెందిన వ్యక్తి అయినను నాయకుడుగా గ్రహింపబడు చుండెను. దీనితో సాంఘిక వాస్తవికత పెంపొంది, సాంఘిక సంఘర్షణమును వ్యక్తీకరించు రూపకములు బయలుదేరినవి. ఇవి విషాద-అహ్లాద భావములకు మధ్యేమార్గమందుండును. వీటిని 'విషాదరూపకము లనుటకంటె సాంఘికరూపకము లనికాని, సమస్యారూపకములని కాని అనుట సమంజసము.

19 వ శతాబ్దమునందు వాస్తవికతకు వ్యతిరేకముగా సాంకేతికరూపకములు, శృంగారరూపకములు బయలుదేరుటచే, 'fatalism' నకు ప్రాముఖ్యము వచ్చినది. సాంకేతికరూపకములకు మారిస్ మేటర్‌లింక్ మూలపురుషుడు. ఇవి **రంగస్థలముమీద** అంతగా విజయమును పొందలేదని చెప్పవచ్చును.

నేడు సాంఘిక - ఆర్థిక సంఘర్షణములు రూపకములందు ముఖ్యములైనవి. కాని, కేవలము సాంఘికసమస్యలగుటచే విషాదరూపకమునకు వలసిన ఔన్నత్యము లోపించు చున్నది. వీటిని విషాదరూపకము లనుటకంటె 'గంభీరరూపకములు' (Serious plays) అనుట న్యాయ్యము.



(2) *Comedy* (అహ్లాదరూపకము)—"బాధాకరమును, వినాశకరమునుకాని ఏదో ఒక లోపమును లేదా అసహ్యాకరమగు విషయమును ప్రతిపాదించి మానవులను నిత్యజీవితము నందలి వ్యక్తులకంటె అధములనుగా చిత్రించునది 'అహ్లాదరూపక' మనబడు" నని అరిష్టాటిల్ నిర్వచనము. ఇందలి పాత్రలు వ్యక్తిత్వమును కలిగినవికాక సర్వసాధారణములై ఉండును. అందుచే అవి ఒక్కొక్కప్పుడు వ్యక్తుల వ్యంగ్యచిత్రములను ప్రదర్శించుచున్నట్లుండును.

గ్రీకుల అహ్లాదరూపకముకూడ డయొనిసస్ ఉత్సవములందే ఉద్భవించినదని తెలివి యున్నాను. [ప్రథమాధ్యాయాంతమందలి 8 వ విశేషాంశమును చూడవలెను]

అరిష్టాఫేన్సు రూపకములు ఒక పరిణతస్థితికి చెందియున్నవి. వీని రూపకములందు సాంఘికసమస్యలు, వ్యంగ్యము, తక్కువరకపు హాస్యము ప్రాతిపదికలు. ఇవి అత్యుత్తమ రూపకములని చెప్పలేము. మెనాండర్, ప్లాటస్, టెరెన్స్‌ల రూపకములందు బృందగీతి అదృశ్యమైనది ; తక్కువజాతి హాస్యము, వ్యక్తినిష్ఠమైన వ్యంగ్యము తగ్గింపబడినవి.

కాని వీరి ప్రభావము ఆంగ్లరూపకములందు కన్పట్టుటలేదు. అచ్చటి అహ్లాదరూపకము లకు స్వదేశీయములైన (మొరాలిటీ, మిరకిల్, ఇంటర్‌లూడ్) రూపకములే మాతృకలు.

షేక్స్పియర్ హాస్యము కేవలము స్వదేశీయమైనది. రాక్షసత్వము కలిగి ఉండుటయే స్వభావముగా గల పాత్రలయందుకూడ హృదయపు లోతులలో మానవత్వము దాగి ఉండు నని సూచించుట వాని రూపకములందలి గొప్పదనము. సానుభూతి, అవహేళన అనునవి రెండును కలిసిన హాస్యమే అతని అహ్లాదరూపకములందు సర్వత్ర కన్పట్టుచుండును. 'రొమాంటిక్ డ్రామా' శాఖకు షేక్స్పియరు రూపకములు పట్టుగొమ్మలు.

బెన్‌జాన్సన్ తన రూపకములందు ప్రాచీనుల ననుసరించుటకు ప్రయత్నించెను. వీని యందు శిల్పనైశిత్యము, భావనిర్మలత్వము విశిష్టముగా ఉన్నను మానత్వ నిరూపకమగు సానుభూతి తక్కువగా ఉండును. జాన్సన్ **'Comedy of humours'** అనెడి క్రొత్తరూపక మును ప్రచారములోనికి తెచ్చెను. మానవప్రకృతిలో ప్రముఖములగు నాలుగు లోపములను సాంకేతిక**ము**గా ఉంచి, ఆలోపములను ప్రతిబింబించు పాత్రలను సృష్టించుట ఇందలి లక్షణము.

అహ్లాదరూపకమును అన్నివిధముల అభివృద్ధికి తెచ్చినవాడు ఫ్రెంచి నాటకకర్త అయిన మోలియర్ (రచనాకాలము— క్రీ. శ. 1659-1673). ఇతడు ప్రహసనము లను, సాంఘిక - వ్యంగ్య రూపకములను ప్రధానముగా రచించెను. ఇందు అవహేళన పూర్వకముగా సాంఘికవ్యవస్థయందలి లోపములను విమర్శించెను; ఆంగ్లదేశమున రెస్టొ రేషను కాలపు నాటకకర్తలు మోలియర్‌ను అనుసరించి జాన్‌సన్‌కంటె సున్నితమగు హాస్యమును సృష్టించుటకు ప్రయత్నించిరి. నియమితమైన సాంఘికసూత్రములకు కట్టుబడి ఉన్న స్త్రీ-పురుషుల నడతను, వారి జీవితములను ప్రదర్శించు రూపకములు బయలు దేరినవి; ఇట్టిరూపకమును **'Comdy of Manners'** అందురు. నైతికమైనవిలువలకంటెనాగరక మైన ప్రవర్తన గొప్పదనియు, ఆవశ్యకమనియు ఈ రూపకములు నిరూపించుచుండును.

మానవుని సంపూర్ణత్వమును నిరూపించు రూపకములు ఫ్రెంచి విప్లవము తరువాత అన్ని దేశములందును సాధారణములైనవి. 18 వ శతాబ్ది ఉత్తరభాగమున ఇటలీలో గాల్డోనీ, జర్మనీలో లెస్సింగ్, ఆంగ్లదేశమున గోల్డ్‌స్మిత్-షెరిడాన్‌లును సునిశితమును, ఉద్వేగ

భరితమును అయిన ఆహ్లాదరూపకములను రచించిరి. వీరు పై రెండురకములగు ఆహ్లాద రూపకములలో ఏ ఒక్కదానిని ప్రత్యేకముగా అనుసరించలేదు; జీవితమును, కళను సన్నిహితములను చేసి వానికిగల సామ్య - భేదములను చూపుటకే యత్నించిరి.

పశ్చిమయూరపు దేశమున వెలసిన విధానములను స్వీకరించి, వానికి స్వదేశీయ మగు హాస్యవిధానమును మేళవించి 19 వ శతాబ్దిలో స్కాండినేవియా - రష్యా దేశస్థులు ఉత్తమ ఆహ్లాదరూపకములను రచించియున్నారు. వీరిలో ముఖ్యుడు హెన్రిక్ ఇబ్సెన్. సాధారణముగా గంభీరములగు రూపకములనే ఈతడు వ్రాసెను. వాని వ్యంగ్యభాషణ ములను, పాత్రలును అత్యుత్తమములుగా నేడు పరిగణింపబడుచున్నవి. మానవ ప్రకృతికి బీజభూతములైన లోతులకుపోయి, వారి వారి మానసిక తత్త్వములను పరిశీలించుటలో ఇతడు అగ్రగణ్యుడు. రష్యాలో చెకోవ్, నశించుచున్న ఉత్తమతరగతిజీవితమును వ్యంగ్య ముగా చిత్రించుటలో కృతకృత్యుడైనాడు. ఆంగ్లదేశమున బెర్నార్డుషా తన అపూర్వమైన మేధచేతను, హాస్యదృక్పథముచేతను కొలదికాలములోనే ప్రథమశ్రేణికి చెందిన రచయిత అయ్యెను.

మానవప్రకృతికి అతి సహజమైన హాస్యప్రవృత్తి మానవు డున్నంత కాలమును వర్ధిల్లు ననుటలో సందేహము లేదు.

(3) *Farce* (*ప్రహసనము*)— సాధారణముగా తక్కువరకపు ఆహ్లాదరూపకమును 'ప్రహసన' మందురు. భావమును, పాత్రలును ఆహ్లాదరూపకమందలి హాస్యమునకు కారణములుకాగా వాక్కును, చేష్టలును ప్రహసనమందలిహాస్యమునకు కారణములగుచున్నవి. కేవలము నవ్వించుటయే ప్రహసన లక్షణము; అందుచే ఇది ఆహ్లాదరూపకమునకు ప్రాథమిక రూపమని చెప్పవచ్చును. సర్కసులందు బఫూనులు చేయు చేష్టలు ఇట్టి ప్రహసనములకు తొలి రూపములు. ప్రహసనమందు వాక్కుకంటె చేష్టలే ఎక్కువ హాస్యకారకము లగుటచే భాషావిషయకముగా ఆహ్లాదరూపకమున పాటింపబడు నియమములు కూడ దీనికి లేవు. సామాన్య ప్రజలును, అసంస్కారులును ప్రహసనమును ఎక్కువగా ఆదరింతురు ("ప్రహస నాదుల విషయమున స్త్రీ-బాల-మూర్ఖులు అధికారులు" అని అభినవగుప్తుడు పేర్కొనుట గమనార్హము).

ఫార్సు అను పదమునకు 'చెత్త' (stuff) అని అర్థము. ప్రాకృతములైన హాస్య సంభాషణములు ప్రాచీనములైన 'మిష్టరీ రూపకము' లందును (ఫ్రాన్సు దేశము), 'మొరా లిటీ రూపకము' లందును (ఆంగ్లదేశము) కూడ కలవు. అవియే నేటి ప్రహసనములకు మూలములని చెప్పవచ్చును.

క్రీ. శ. 1800 వరకును నాటకముచివర ప్రదర్శింపబడు చిన్నిచిన్ని హాస్యరూపక ములను 'ఫార్సు' లనెడివారు. 19 వ శతాబ్ది చివరిభాగములో ఇవి స్వతంత్రముగా నిలువ గలిగినవి.

(4) *Miracle play* (*దివ్యలీలారూపకము*)— మధ్యయుగమునాటి మతసంబంధి రూపకములను 'మిరకిల్ రూపకము' లందురు. దైవికమైన మహిమను నీతిగా నిరూ



పించుట ఇందలి ముఖ్యలక్షణము. ఒక్కొక్కప్పుడు దైవభక్తుల జీవితము లిందు కూర్ప బడుట కలదు. కాని, సాధారణముగా సమకాలికమైన ఒక సమస్యను గ్రహించి, అది దైవమహిమచే ఎట్లు పరిష్కృతమైనదో నిరూపించుట అనునదియే ఇందు వస్తువుగా ఉండును. క్రీ. శ. 14 వ శతాబ్దమున ఫ్రాన్సుదేశమునందు ఈ మహిమాన్విత రూపకములు సంఖ్యయందే కాక గుణమునందును శ్రేష్ఠములై 'మిష్టరీ రూపకము' ల కంటె ప్రఖ్యాతి నొందినవి. ఆంగ్లదేశమున మాత్రము 'మిష్టరీ', 'మిరకిల్' రూపకములకు అంత ఎక్కువ భేదము లేదు.

(5) *Mystery Play* (*అద్భుత రూపకము*)— ఈష్టర్, క్రిష్టమస్ వంటి పర్వదినము లలో ప్రదర్శింపబడు మత సంబంధి రూపకములను 'మిష్టరీ రూపకము' లందురు. చర్చి పండుగలలోని ఉత్సవములందలి సంభాషణాదులు వీనికి మూలరూపములని చెప్పవచ్చును. క్రీ. శ. 15 వ శతాబ్దినాటికి వీని ప్రదర్శనములు బహుళ ప్రచారములో ఉన్నవి.

ఈ రూపకములయందు ప్రదర్శనమున కెక్కువ ప్రాముఖ్య మున్నది. విశాలము లైన ప్రదేశములును, విస్తృతములైన దృశ్యములును ఇందు ప్రదర్శింపబడుచుండును. బైబిలునందలి ఏదేని ఒక కథను (ముఖ్యముగా క్రీస్తు కథను లేదా ఒక మత ప్రవక్తకథను) ఆధారముగా తీసికొనిహాస్యసంభాషణములను కూర్చి వీటిని ప్రదర్శించుచుండెడివారు.

క్రీ. శ. 16 వ శతాబ్ది నాటికి వీటిని ప్రదర్శించు కాలము ఎక్కువ అయినది. క్రీ. శ. 1547 లో ప్రాచీన-నవీన బైబిలు కథలు మొత్తము 25 భాగములుగా ప్రదర్శింపబడినవట.

ఆంగ్లదేశమున ఈరూపకములందలి హాస్యము సహజమై, ఇతివృత్తమునకు సంబంధించి ఉండెడిది. కాని ఫ్రాన్సు దేశమున అసలు కథకుసంబంధములేని సంఘటనలు, సంభాషణములు కూడ మధ్య మధ్య చేర్పబడుచుండెడివి. ఈ రెండు విధములైన ప్రదర్శనములును 'మిరకిల్ - మిష్టరీ రూపకములు) ఫ్రెంచి హాస్య రూపకములకును, ట్రాజి- కామెడీలకును మూలములని చెప్పవచ్చును.

(6) *Pantomime* (*మూకాభినయరూపకము*)— వాచికాభినయరహితమై కేవలము అంగవిక్షేపములతో, దృష్టి-ముఖరాగాదులతో స్వగత-పరగతభావములను ప్రదర్శించెడి ఆంగికాభినయము 'మూకాభినయ' మనబడును. 18 వ శతాబ్దికి పూర్వము ఆంగ్లదేశమున **pantomime** అను పదమునకు **'player of every part'** అని మాత్రమే అర్థము. ఈ పదమునకు ఏడు విధములైన అర్థములు కలవని మారిస్ విల్సన్ డిషర్ వివరించెను (**The Oxford Companion to the Theatre - pp. 598-599**).

(అ) రోమన్ రంగస్థలమందలి ఒక ప్రత్యేకనటుని గ్రీకులు ఈ పేరుతో పిలిచెడివారు. ఆ నటుడు ముగ్గురు ప్రకృతుల ముఖములు అతుకబడిన ప్రతిశీర్షమును ధరించి, ఆ ముగ్గురి సంభాషణములను తానే అభినయించెడివాడు. పై విధముగానే జంతువులను, పక్షులను, తుఫానును, అగ్నినికూడ ఆ నటుడు ప్రదర్శించుచుండెడివాడు.

(ఆ) ఇతిహాసములనుండి కైకొనిన కథలు బాలేరూపమున 18వ శతాబ్దిలో ప్రదర్శింప బడినవి. వాటినికూడ ఈ పేరుతోనే పిలిచెడివారు.

(ఇ) ఆంగ్లదేశమున తరతరములుగా క్రిష్టమస్ పర్వదినములందు ప్రదర్శింపబడెడి వినోదములనుకూడ ఈ పేరుతోనే పిలిచెడివారు (ఈ వినోదములకు ఫ్రాన్సుదేశమున ఉత్సవ ములయందును, సంతలయందును ప్రదర్శింపబడెడి హాస్యపూరితములైన అర్లెక్విన్స్ నృత్య ములు మూలములు).

(ఈ) సంభాషణా రహితములైన 'పియరాట్' (pierrot) రూపకములకుకూడ ఇదేపేరు వర్తించును. (ఫ్రాన్సుదేశమున ప్రదర్శింపబడిన ఆంగ్ల మూకాభినయ రూపకములు వీనికి మూలములు).

(ఉ) మూకాభినయ రూపమున ప్రదర్శింపబడు 'మెలోడ్రామా' లకు కూడ ఈ పేరు చెల్లును. (18 వ శతాబ్దిలో ఇంగ్లండు, ఫ్రాన్సుదేశముల ప్రదర్శనములందు వాచికాభినయ ప్రాధాన్యము తగ్గినది).

(ఊ) ఇంద్రజాలాది ప్రయోగములతో కూడిన ప్రదర్శనములు (ముఖ్యముగా సర్కసు ప్రదర్శనముల వంటివి) కూడ ఈ పేరుతోనే వ్యవహృతములైనవి.

(ఋ) నృత్య - నాట్యములందు ఎడనెడ కన్పట్టు వాచికాభినయ రహితములగు భాగములకును ఈపేరు చెల్లును.

(7) *Masks* (*బుట్టబొమ్మలు*)— షేక్స్పియర్ తరువాతివాడగు బెన్‌జాన్సన్ ఈరకపు రూపకములకు విపరీతమైన ప్రచారమును కలిగించెను. జానపదుల వీథినాటకము లును, ఇటలీ - ఫ్రాన్సుదేశపు రాజాస్థానములందలి ప్రదర్శనములును వీటికి మూలములు. ఇందు రంగాలంకరణమునకు ప్రాముఖ్యమధికము. ఇతివృత్తము పెక్కు మార్పులకు లోనగును. ఒకే రూపకమున పది, పన్నెండు దేశముల మహారాజులనో, రాణులనో చూపుట; రంగమును నరకమునుండి స్వర్గమునకు మార్చుట మొదలగునవి వీటి ముఖ్య లక్షణములు.

మాస్కులయందు నటులే కాక ప్రేక్షకుల నుండి ఆహ్వానింపబడిన స్త్రీ - పురుషులు కూడ రంగముమీదికి వచ్చి నృత్యము చేయుట ఆచారము. జాన్సన్‌కు పూర్వము నుండియు వచ్చుచున్న ఈ ఆచారము ఈ రూపకములందు స్థిరపడిపోయినది.

మాస్కులయందు ఉత్తమ పాత్రలకు బదులు మంత్రకత్తెలు మొదలగు పాత్రలను ప్రవేశపెట్టుట కూడ కలదు. ఇట్టివాటిని 'Anti-Masks' అందురు. ప్రాచీనకాలమున ఈ రెండు రకముల పాత్రలును ఒకేరూపకమందు మిశ్రితము కాలేదు. కాని, జాన్సన్ వారిని కలిపివేసెను.

మిల్టన్ 'కోమస్' అను రూపకమును ఈ జాతికి చెందినదానినిగా పేర్కొనెను. అందలి నృత్యములవలనను, ప్రేక్షకులుకూడ వాటియందు పాల్గొనుచుండుట వలనను ఆ పేరు వచ్చినది. కాని, ఆదిలో ఇది నాటకముగానే పరిగణింపబడెడిది.

(8) *Melodrama* (*గేయ రూపకము*)— గేయ ప్రధానమైన రూపకమును 'మెలోడ్రామా' అందురు. 1599 లో ఇటాలియన్ నాటకకర్త రినూసినీ ప్రప్రథమముగా ఈ జాతి రూపకమును రచించెను. ఇది వందపండ్ల వరకును 'ఒపెరా' గానే చలామణి అయినది. జి. ఎఫ్. హేండెల్ అనునతడు తన రూపకములకు రెండు పేర్లను వాడెను.



అత్యాశ్చర్యకరములైన సంఘటనములు, తీవ్రములైన ఉద్వేగముల ప్రతిపాదనము, సుఖాంతమగుట అనునవి ఇందలి ముఖ్య లక్షణములు. క్రీ. శ. 18 వ శతాబ్ది నాటికి ఈ జాతి రూపకములు సర్వలక్షణసంపన్నములై ఆంగ్లనాటకరంగమున స్థిరపడినవి. ఆహ్లాదరూపకమునకు ప్రహసన మెట్టిదో, విషాదరూపకమునకు 'మెలో డ్రామా' అట్టిది. ఇందలి సంభాషణములును, వాద్యగీతములును నేటి సినీమాలయందువలె చకచక నడచును. ఉద్వేగముల కనుగుణముగ వాద్యసంగీతము ప్రయుక్తమగుచుండును. అతిలోక విషయ ములు(Supernatural element) ఇందు ప్రాధాన్యమును వహించును.. సార్వజనీనములైన మంచి-చెడ్డల మూలమున మానవుల ఉద్వేగములను ప్రదర్శించుట ఇందు జరుగుచుండును.

రంగస్థలమందు తప్పక విజయవంతములయ్యెడి రూపకములలో మెలోడ్రామాను ప్రధానముగా పేర్కొనవచ్చును. హ్యూగో, డ్యూమా మొదలగు పెద్ద రచయితలు ఈ లక్షణములను స్వీకరించుటచేతనే ప్రత్యేకతను కలిగినవారైరి. హెన్రీ ఇర్వింగ్ వంటి ఉత్తమ నటునితో ఈ రూపకముల ప్రాముఖ్య మింకను అధికమైనది. కాని నేడు వీటి ప్రదర్శనములు అపరూపములైనవి.

(9) *Ballet* (నృత్యరూపకము)— నేపథ్యమున ప్రయుక్తములగు జంత్ర - గాత్ర ముల కనుకూలమైన నృత్యములు కలదై, వాచికాభినయరహితమైన రూపకము 'బాలే' అనబడును. క్రీ. శ. 14, 15 శతాబ్దములందిది ఇటలీదేశమున మిక్కిలి ప్రసిద్ధికి వచ్చినది. ఆదికాలమునుండియు రాజాంతఃపురములందలి వినోదములందు నృత్యమునకు ప్రాముఖ్య ముండెడిది.

ఫ్రాన్సుదేశ చక్రవర్తి అగు 14 వ లూయీ ఈ జాతిరూపకములను అధికముగా ఆదరించెను. 'బాలే' కి రూపకమర్యాదను తెచ్చిపెట్టినవాడుకూడ ఇతడే. మోలియర్ ఇట్టి రచనలనుచేసి వానికి విలువచేకూర్చెను.

ఆచారముగా ధరింపబడెడి ప్రతిశీర్షములను, కన్నుచెదరు రంగాలంకరణములను, ఆహార్యమునందలి వైపరీత్యమును తొలగించి బాలేను కళాత్మకమైన రూపకవిశేషముగా రూపొందించుటకు 18 వ శతాబ్ది చివరిభాగమున ప్రయత్నములు జరిగెను. ఇట్టి ప్రయత్నము చేసినవారిలో జా జార్జె నావెర్ (Jean Georges Novere - క్రీ. శ. 1727 - 1810) ప్రముఖుడు. వీని నృత్యరూపకములందు ఆహార్యమునకు ప్రాముఖ్యము తగ్గినది; భావ ప్రకటన ప్రధానమైనది.

19 వ శతాబ్దిలో ఈ నృత్యరూపకములు స్వరకల్పనాదులతోసహా గ్రంథరూపమున ప్రజల కందుబాటులోనికి వచ్చినవి. శిల్పదృష్టి అధికమైనది. 19 వ శతాబ్ది చివరకు నృత్య బృందమున పురుషుడు అదృశ్యమై, నర్తకిమాత్రమే ప్రముఖముగా నిలిచినది. ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలలోకంటెకూడ రష్యాదేశములో వీటికి ఎక్కువ ఆదరము కలదు. వారి ప్రదర్శనములుకూడ విశిష్టములైనవి.

(10) *Opera* (*సంగీతరూపకము*)— జంత్ర-గాత్ర సంగీతములు ప్రధానములైన రూపకము 'ఒపెరా' అనబడును. సూటిగా చెప్పవలెనన్నచో ప్రతిమాటను గానముచేయు

పద్ధతిని 'ఒపెరా' అనవలెను. నేడు ఇవి రెండు రకములుగా ఉన్నవి— మొదటి రకమునందు సంభాషణము లన్నియును గేయ రూపముననే సాగును. రెండవ రకమునందు సంభాషణములను ఒండొంటితో కలుపుటకు వచనములు కూడ ఉండును. ఆది కాలములో కేవల సంభాషణములను సంగీతముతో కూర్చి ప్రయోగించెడివారు. మొదటి ఒపెరాను ఒ. రినూసినీ (క్రీ. శ. 1562-1621) అను నతడు వ్రాసెను; జకో పొపెరీ (క్రీ. శ. 1561-1633) అను నతడు దానికి సంగీతమును కూర్చెను. గ్లక్ (1714-87) అను నతడు పాత్రల మనోభావములను మాత్రమే సృష్టించుచు ఉత్తమ జాతి ఒపెరాలను ప్రదర్శించెను. తరువాత హాస్యసంగీతరూపకములు రూపొందినవి; వీటి జన్మస్థానము నేపుల్సు.

వివిధదేశములందు ప్రయుక్తము లగుచున్న రకరకములగు ఒపెరాలు 18 వ శతాబ్దిలో మోజర్టు (1756-91) అనువాని వలన సుప్రతిష్ఠితములైనవి. ఈతడు సాంప్రదాయక మార్గమును వీడక, ఒపెరాకు ఉదాత్తతను, ఉత్తమ అభినయమును, శాస్త్రీయ సంగీతమును చేకూర్చెను. తిరిగి 19 వ శతాబ్దిలో రిచర్డ్ వాగ్నర్ (1813-83) అను నతడు వీటిని ప్రచారములోనికి తెచ్చెను. ఈతని కృషి ఫలితముగా ఒపెరాకు సాహిత్యమున కూడ ఉన్నత స్థానము లభించినది. జర్మనీలో వాగ్నర్ ఎంత ప్రసిద్ధుడో ఇటలీలో వెర్డి అంత ప్రసిద్ధుడు.

ఇంతవరకును పది రకముల రూపకములను మాత్రమే వివరించియున్నాను. ఇంకను పెక్కు విధములగు రూపక విశేషములు కలవు —Burlesque, Burletta, Extravaganza, Aquatic Drama, Commedia dell arte, Mime, Monologue, Operetta, Pageant, Revue, Mascarade, Interlude, Marionette, Morality play మొదలైనవి. వీటినిగూర్చి పాశ్చాత్య రూపకచరిత్రగ్రంథములను పరిశీలింపదగును. నేడు ఏకాంకికలు (One-act plays) బహుళ ప్రచారమందున్నవి. ఏకాంకికారచనము ఒక ప్రత్యేకమైన కళ.

శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారు "The Dramatic History of the World" అను పేర ప్రపంచరూపకచరిత్రను ఆంగ్లమున 1908 లో ప్రకటించినారు. ప్రపంచములో ఇట్టి రచనకు వీరే ఆద్యులు. శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు పాశ్చాత్య రూపకములను గూర్చి "నాట్యోత్పలము" అను గ్రంథమును రచించి 1924 లో ప్రకటించిరి. ఈ రెండు గ్రంథములను, శ్రీ ఎ. నికాల్ రచించిన "World Drama" (1949) అను గ్రంథమును పరిశీలించవలెను.

## 11. సంస్కృత రూపకములు.

పాశ్చాత్యరూపకచరిత్రను పేర్కొన్నంత నిష్కర్షగా సంస్కృతరూపకచరిత్రను పేర్కొనుటకు తగిన ఆధారములు లేవని చెప్పుట సాహసము కాజాలదు; కర్తృత్వ విషయమున అనుమానము, కాలనిర్ణయము విషయమున అనుమానము. కొన్ని రూపకములను ఎవరు రచించిరో తెలియదు. కొన్ని రూపకములు కేవలము నామమాత్రావశేషములు. అయినను, శ్రీ ఎ. బి. కీత్ ఒక సమగ్ర చరిత్రను నిర్మించుటకు ప్రయత్నించి కృతకృత్యుడయ్యెను; ఆ గ్రంథము పేరు "The Sanskrit Drama" (1924). తరువాత



డా. యస్. కే. డే ఇంకొక గ్రంథములో సంస్కృతరూపకచరిత్రను రచించెను. "A History of Sanskrit Literature" (1947). సంస్కృత రూపక చరిత్ర విషయమునఇవి రెండును ప్రధాన గ్రంథములు.

అశ్వఘోషుడు : మనకు లభించిన ప్రథమ సంస్కృత రూపకము అశ్వఘోషుని 'శారిపుత్ర (శేదాశారద్వతీపుత్ర) ప్రకరణము'. దీనియందలి శిథిల భాగములు మాత్రమే మధ్య ఆసియాలో లభ్యమైనవి. ఇది నవాంకయుతమనియు, అశ్వఘోష విరచితమనియు రూపకాంతమున కలదు. శారిపుత్ర - మౌద్గల్యాయనులకు బుద్ధుడు బౌద్ధదీక్ష నొసంగుట ఇందలి ఇతివృత్తము. ఈ ప్రకరణమునందు నాట్యశాస్త్ర సూత్రములు చక్కగా పాటింపబడినవి. అశ్వఘోషుడు క్రీ. పూ. ప్రథమ శతాబ్దియందుండెనని విశ్వసింపబడుచున్నది. కాగా, అప్పటికే సంస్కృతరూపకరచన సుప్రతిష్ఠితమైన దన్నమాట. శారిపుత్రప్రకరణము లభించిన తాళపత్రములందే మరిరెండు రూపకముల శిథిలభాగములు కూడ కలవు. బహుళః ఇవియును అశ్వఘోషునివే కావచ్చును. అవి అత్యల్పభాగము లగుటచే కథా పరిణామము తెలియుటలేదు. ఒకదానియందు బుద్ధి, ధృతి, కీర్తి వంటి సాంకేతికపాత్రలు కలరు; ఇది ప్రబోధచంద్రోదయమువంటిది. ఇంక రెండవది ఇంచుమించుగా మృచ్ఛకటికమును పోలిఉన్నది.

భాసుడు : కాళిదాసాదులు భాసుని ఉత్తమరూపక రచయితనుగా ప్రశంసించి యున్నారు. కాని, 1912 లో శ్రీ పి. గణపతిశాస్త్రిగారు భాసనాటకచక్రమందలి కొన్ని రూపకములను ప్రకటించువరకును భాసకృతులను ఆధునికు లెరుంగరు. కాళిదాసు క్రీ. పూ. 100-క్రీ. శ. 400 మధ్యకాలము వాడని విమర్శకుల అభిప్రాయము; క్రీ. శ. 4 వ శతాబ్దివాడనునది బహుజనసమ్మతము. కావున, భాసు డంతకుముందే చాల ప్రసిద్ధినంది యుండవలెను. కావున ఇతడు క్రీ. శ. 1, 2 శతాబ్దములయం దుండెనని ఊహించవచ్చును. శ్రీ గణపతిశాస్త్రిగారు ప్రకటించిన భాసనాటకచక్రమందు 13 రూపకము లున్నవి— (1) దూతవాక్యము (వ్యాయోగము), (2) కర్ణభారము (వ్యాయోగము లేదా ఉత్సృష్టికాంకము), (3) దూతఘటోత్కచము (వ్యాయోగము లేదా ఉత్సృష్టికాంకము), (4) ఊరుభంగము (ఉత్సృష్టికాంకము), (5) మధ్యమ వ్యాయోగము, (6) పంచరాత్రము (సమవకారము), (7) అభిషేకము (నాటకము), (8) బాలచరితము (నాటకము-నాయిక లేదు), (9) అవిమారకము (నాటకము), (10) ప్రతిమ (నాటకము), (11) ప్రతిజ్ఞాయౌగంధరాయణము (నాటిక), (12) స్వప్నవాసవదత్తము (నాటకము), (13) చారుదత్తము (ప్రకరణము).

నాట్య సూత్రములకు విరుద్ధములైన పెక్కు ఘట్టములు భాసనాటకములం దున్నవి. అందుచే అవి ఫలాని రూపకములని స్పష్టముగా చెప్పుటకు వీలులేదు. ఈ సూత్రోల్లంఘనమునుబట్టి భాసుడు నాట్యశాస్త్ర రచనకు పూర్వుడని కొందరును, తెలిసియే ఉల్లంఘించెనని కొందరును వాదించుచున్నారు. ఈ రూపకములందు భాసుడు తన పేరెచ్చటను చెప్పుకొనలేదు. అందుచే ఇవి భాసకృతములే కావని కొందరును, అన్నియును భాసకృతములు

కావని కొందరును తలంచినారు. కాని భాసుడు ప్రసిద్ధరూపకకర్త అనుట నిర్వివాదాంశము. భాసుని 'ఊరుభంగము' విషాద రూపకమున కొక ఉదాహరణమని నిరూపించుటకు కొందరు విమర్శకులు ప్రయత్నించిరి. భాసనాటకములలో కథాగమనమందలి వేగము, చక్కని పాత్రపోషణము, సరళమైన భాష, ప్రదర్శనయోగ్యత అనునవి ముఖ్యలక్షణములు, (పంచరాత్రము తప్ప తక్కిన భారతనాటకము లన్నియును ఏకాంకములే) అన్నింటిలోను స్వప్నవాసవదత్తము ఉత్తమమందురు. భాసుడు దాక్షిణాత్యుడై యుండును.

*కాళిదాసు :* కాళిదాసు కాలమునుగూర్చి పైని వివరించియున్నాను. మాళవికాగ్నిమిత్రము (నాటకము), విక్రమోర్వశీయము (ఔత్తరాహులు దీనిని త్రోటకమనగా, దాక్షిణాత్యులు నాటకమునుగానే భావించిరి), అభిజ్ఞానశాకుంతలము(నాటకము)అనెడి మూడు రూపకములను వరుసగా రచించెను. ప్రసిద్ధ సంస్కృతరూపకకర్తలలో పెక్కురు మూడేసి రూపకములనే రచించియుండుట విచిత్రవిషయము (గ్రీకు రూపకకర్తల 'నాటకత్రయ' రచనము ఒకే కథకు సంబంధించియుండుట గమనార్హము). పై మూడింటిలోను అభిజ్ఞానశాకుంతలము ఉత్తమోత్తమరూపకము; ప్రాచ్య - పాశ్చాత్య విమర్శకులందరి మన్ననలను పొందిన రూపకమిది. కాళిదాసుని కళాప్రతిభ సాటిలేనిది; 'కవికుల గురువు'గా ఈతడు కీర్తింపబడెను. ఇత డుజ్జయినీ నగరవాసి అని విమర్శకు లభిప్రాయపడుచున్నారు.

*శూద్రకుడు :* మృచ్ఛకటికరచయితగా శూద్రకుడు మనకు సుపరిచితుడు. కాని శూద్రకు డొక కల్పిత పురుషుడనియు, ధావకభాసుడను నాతడే మృచ్ఛకటికమును రచించెననియు విమర్శకుల అభిప్రాయము. మృచ్ఛకటికము క్రీ. పూ. 3, 2 శతాబ్దములనాటి రచన అనియు, మనకు లభించిన ప్రథమ సంస్కృతరూపక మిదియే అనియు కొందరు విమర్శకుల అభిప్రాయము. కాని, మృచ్ఛకటికము క్రీ. శ. 6, 7 శతాబ్దములనాటిదని శ్రీ కర్మార్కర్ ప్రభృతులు నిరూపించి యున్నారు.

మృచ్ఛకటికము భాసుని 'చారుదత్తము' కంటె చాల విశిష్టమయినది. దీనికి సంస్కృత రూపకములం దొక ప్రత్యేకమయిన స్థానము కలదు. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము, భవభూతి ఉత్తరరామచరితము, శూద్రకుని మృచ్ఛకటికము అనునవి మూడును సంస్కృత రూపకప్రపంచములో మూడు విశిష్టస్థానములను ఆక్రమించుకొని ఉన్నవి. మొదటి రెండింటిలోను అతిలోక విషయములకుకూడ తావున్నది. కాని మృచ్ఛకటికము కేవలము సాంఘికమయినది. ఉత్తములు, దొంగలు, జూదరులు, ధూర్తులు, విప్లవకారులు, బిచ్చగాండ్రు, రాజోద్యోగులు, సోమరులు, రక్షకభటులు, దాసీలు, వేశ్యలు మొదలగువారు స్వేచ్ఛగా విహరించిన విచిత్రప్రపంచ మిది. ఇందు 'మృత్‌శకటికము' (మట్టిబండి) నాయకుని కష్టములకు కారణమై ప్రాధాన్యమును వహించుటచే ఇది 'మృచ్ఛకటికము' అనబడినది. మృచ్ఛకటికము ఉత్తమమైన కవిత్వమునకుకూడ ప్రసిద్ధికెక్కియున్నది.

*భాణ-ప్రహసనకర్తలు :* 'చతుర్భాణి' అనుపేర శ్రీమా. రామకృష్ణకవిగారు నాలుగు భాణములను ప్రకటించియున్నారు—1. ఉభయాభిసారిక (వరరుచి విరచితము), 2. పద్మప్రాభృతకము (శూద్రక విరచితము), 3 ధూర్తవిటసంవాదము (ఈశ్వరదత్త విరచితము),



4. పాదతాడితకము (శ్యామిలక విరచితము). వరరుచి పాణిని సమకాలికుడనియు, శూద్రకుడు ఆంధ్రభృత్యరాజైన స్వాతి ఆస్థాన కవి అనియు, ఈశ్వరదత్తుని కాలము తెలియదనియు, శ్యామిలకుడు క్రీ. శ. 800-900 మధ్యవాడనియు సంపాదకులు పేర్కొనినారు. ఈ నాలుగింటియందును రచనావిధాన మొకేవిధముగా కన్పట్టగలదు. 18 వ శతాబ్ది తరువాత బయలుదేరిన పెక్కు భాణములకంటె ఇవి చాల విశిష్టములై, వాటికంటె ప్రాచీనములుగా పరిగణింపబడుచున్నవి.

పల్లవరాజైన మహేంద్ర విక్రమవర్మ (క్రీ. శ. 620 ప్రాంతముల) 'మత్తవిలాస' (ఏకాంకము) ప్రహసనమును రచించెను. బౌద్ధ-కాపాలిక-పాశుపతమతములవారి అసభ్యవర్తనము లిందు ప్రదర్శింపబడినవి. బోధాయన విరచితమని చెప్పబడెడి 'భగవదజ్జుకీయ' ప్రహసన మింకొకటి కలదు. కాని దీనిని కూడ విక్రమవర్మయే రచించినట్లు ఊహించుట కవకాశమున్నది. పాత్రలలోని వైపరీత్యముచేకాక, సన్నివేశములందలి వైపరీత్యముచే హాస్యము సృష్టింపబడుట ఇందలి విశిష్టత.

*శ్రీహర్షుడు :* ప్రియదర్శికా-రత్నావళీ-నాగానందముల కర్తయగు ఈతడు నైషధకర్తయగు శ్రీ హర్షుని (క్రీ. శ. 12 వ శ.) కంటె భిన్నుడును, ప్రాచీనుడును. రూపకకర్తఅయిన శ్రీ హర్షుడు శ్రీ హర్షవర్ధన శిలాదిత్య బిరుదాంచితుడై క్రీ. శ. 7 వ శతాబ్ది ప్రథమభాగమున స్థానేశ్వర-కన్యాకుబ్జములను పాలించెను. వీని నాటకములను విదేశయాత్రికులుకూడ ప్రశంసించియున్నారు. బాణుడు వీని ఆస్థానకవి. ఇతడే ఆ నాటకములను రచించియుండునని కొందరి అభిప్రాయము; అది విశ్వసనీయము కాజాలదు. ప్రియదర్శికా-రత్నావళులు రెండును నాటికలు. రెండింటను కథ ఇంచుమించు సమానమే. ఇవి మాళవికాగ్నిమిత్రమును పోలి ఉండును. నాగానందము నాటకము. ఇది ఉత్తమనాటకముల జాతిలో చేరినది. రత్నావళి ఆలంకారిక సూత్రములను తు, చ తప్పకుండ అనుసరించిన రచనము. అందుచే శ్రీ హర్షుని ఈ నాటికకు విశిష్టమైన స్థానము కలదు.

*విశాఖదత్తుడు :* వీని కాలనిర్ణయము సంశయాస్పదము. విశాఖదత్తుని ముద్రారాక్షసమును ధనంజయుడు పేర్కొనుటచే ఇది క్రీ. శ. 10 వ శతాబ్దికి ముందరి రచన అనుట స్పష్టము; కాళిదాససమకాలికుడని కొందరు భావించియున్నారు. "కాళిదాసాదుల నాటకములను ఎక్కువగా 'poetic dramas' అని అనుటకు వీలున్నది; ఇంక, ముద్రారాక్షస మొక్కటియే సంస్కృతమందు సిసలైన నాటకము" అని కొందరు పేర్కొందురు. ప్రసిద్ధమైన రాజమార్గము నుండి శూద్రకు డొక క్రొత్త దారిని త్రొక్కగా, విశాఖదత్తు డింకొక క్రొత్త దారిని త్రొక్కెను. మృచ్ఛకటికములో రాజకీయములకు ప్రాధాన్య మల్పము. కాని ముద్రారాక్షసమందు అవియే ప్రధానము. విశాఖదత్తుడు చారిత్రకమైన కథను స్వీకరించెను; పెక్కు క్రొత్త కల్పలను చేసియుండెను. రాక్షసుని వాని ముద్రిక సాహాయ్యముచేతనే జయించుట ఇందు ప్రధాన మగుటచే ఇది ముద్రారాక్షస మనబడినది. ఇందు నాయిక లేకపోవుట ఒక విశిష్టత. దేవీచంద్రగుప్తము అనెడి నాటకమును కూడ ఈతడే రచించినట్లు చెప్పుదురు.

*భట్టనారాయణుడు :* వీనికాలముకూడ స్పష్టముగా తెలియదు. వామన-ఆనందవర్ధనులు భట్టనారాయణుని వేణీసంహారమును పేర్కొనియుండుటచే ఇతడు నిశ్చయముగా క్రీ. శ. 800 కు పూర్వుడు. వేణీసంహారమును రౌద్రరస ప్రధానమైన నాటకమునుగా పేర్కొన వచ్చును. భట్టనారాయణుడు ఆలంకారిక సూత్రములను చాల జాగ్రత్తగా అనుసరించి యున్నాడు. కొంత కావ్యధోరణియు, కొంత నాటక ధోరణియు కలిగిన దీనిని 'Declematory Drama' అని పేర్కొందురు.

*భవభూతి:* భవభూతి-వాక్పతి రాజులు యశోవర్మ ఆస్థానకవులని కల్హణుడు రాజ తరంగిణిలో పేర్కొనెను. వామనుడు భవభూతిని పేర్కొనెను. అందుచే ఇతడు 8 వ శతాబ్ది ప్రారంభమునం దుండెనని తలంపబడుచున్నది. ఇతడు విదర్భదేశీయుడని చెప్పబడు చున్నను ఆంధ్రుడు అయిఉండునేమో అని ఊహించుట కవకాశము లేకపోలేదు. మహావీర చరితము, మాలతీ మాధవము, ఉత్తరరామ చరితము అను మూడును భవభూతి రూపక ములు. ఇందు రెండవది ప్రకరణము. తక్కినవి నాటకములు. ఇవి మూడును వరుసగా ఒకదానికంటె ఇంకొకటి గుణాధికములు. "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అను నది ప్రసిద్ధమే కదా. శుద్ధవిషాదరూపకము కావలసిన ఉత్తరరామ చరితమును చక్కని ఆహ్లాదరూపకముగా మలచుకొనినాడు. ఇందలి కవిత్వము ప్రశస్తమైనది. పవిత్ర దాంప త్యమునందలి హృదయపు లోతులను కనుగొనగలిగిన శిల్పి ఆతడు.

*మురారి :* మురారి కాలముకూడ సరిగా తెలియదు. క్రీ.శ. 9, 10 శతాబ్దములయం దుండెనని ఊహించవచ్చును. ఇతడు బాలవాల్మీకి బిరుదాంచితుడు. "గురుకుల క్లిష్టో మురారిః కవిః" అని చెప్పుకొనియున్నాడు. వీని అనర్ఘరాఘవము గంభీరతకు ఉదా హరణమని తరువాతి వారిచే పొగడ్త కెక్కినది. ఇందు రూపకత్వముకంటె కావ్యత్వమే అధికము. ఇట్టి వాటిని "Closet Dramas" అనుట సమంజసము. రూపకకర్తలు తమ్ము గూర్చి గొప్పగా పొగడుకొనుట మురారితో ప్రారంభమైనదని చెప్పవచ్చును.

*రాజశేఖరుడు :* ఇతడు కనోజ్ రాజగు మహేంద్రపాలునకు ఉపాధ్యాయు డగుట చేతను, ఆనందవర్ధమని పేర్కొనియుండుటచేతను క్రీ. శ. 850-920 ప్రాంతములవా డగుచున్నాడు. వీని భార్య అవంతిసుందరి. ఆమె మంచి విదుషి; అలంకార శాస్త్ర విషయమున ఆమె అభిప్రాయములను రాజశేఖరుడు తన కావ్యమీమాంసయందు సగౌరవ ముగా పేర్కొనియుండెను. ఈ కావ్యమీమాంసకు అలంకార శాస్త్రమం దొక ప్రత్యేక స్థానము కలదు. రాజశేఖరుని నాలుగు రూపకము లిప్పుడు లభ్యము లగుచున్నవి:— (1) బాల రామాయణము— ఇందులో తన్ను 'బాలకవి' గా పేర్కొని యుండెను. ఇందు ఒక్కొక్క అంకమే ఒక్కొక్క నాటకమంత విశాలముగా ఉండును. (2) బాలభారతము— దీనికి ప్రచండ పాండవమను నామాంతరము కలదు; ఇందు 2 అంకములు మాత్రమే లభించినవి. (3) కర్పూరమంజరి— ఇది ప్రాకృత భాషయందు రచింపబడిన సట్టకము. అవంతిసుందరి ఆజ్ఞచే ఇది ప్రదర్శింపబడినట్లు ప్రస్తావనలో ఉన్నది. అంకము లనుటకు బదులుగా 'జవనికాంతరము' లనినాడు. (4) విద్ధసాలభంజిక— ఇది నాటిక. కథాకల్ప



నాదులయందు అంతగా విశిష్టత కానరాదు. మొత్తముమీద రాజశేఖరునిది చక్కని కవిత్వము.

*ఇతర రూపక కర్తలు:* 8. 9 శతాబ్దములలోను. ఆతరువాతను రచింపబడిన రూపకములను విమర్శకులు ప్రశస్తమైన రూపకములనుగా పరిగణించుటలేదు. వాటిలో కొంత విశిష్టత కలవి - వామనభట్టబాణుని 'పార్వతీపరిణయము', అనంగహర్షమాత్రరాజు 'తాపసవత్సరాజము', శక్తిభద్రుని 'ఆశ్చర్యచూడామణి', జయదేవుని 'ప్రసన్నరాఘవము' దిఙ్నాగుని 'కుందమాల', రామభద్రదీక్షితుని 'జానకీపరిణయము', కులశేఖరుని 'తపతీ సంవరణము', రవివర్మ 'ప్రద్యుమ్నాభ్యుదయము', కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము' మొదలగునవి. భాస్కరకవి 'ఉన్మత్తరాఘవము', కాంచనాచార్యుని 'ధనంజయవిజయము' మొదలగునవి చిన్ని రూపకములు. ఇవియేకాక ఆలంకారికులచే పేర్కొనబడిన పెక్కు రూపకములు కలవు; అందులో చాలవరకు నామమాత్రావశిష్టములు మాత్రమే.

పైరూపకములన్నియును ముద్రితములై లభ్యములగుచున్నవి (అశ్వఘోషునివితప్ప). ఇవి అన్నియును తెలుగులోనికి అనువదింపబడినవి; ఒకే రూపకమును పలువురు అనువదించి యున్నారుకూడను.

12 వ శతాబ్దినాటికి సంస్కృత రూపకరచనము క్షీణదశలో పడినది. ఆ తరువాత కూడ తెలుగుకవు లనేకులు సంస్కృత రూపకములను రచించియున్నారు. త్రిపురాంతకుని 'ప్రేమాభిరామము', భాస్కరుని 'ఉన్మత్తరాఘవము', విశ్వనాథుని 'సౌగంధికాపహరణము వామనభట్టబాణుని 'పార్వతీపరిణయము', రాజచూడామణి దీక్షితుని 'కమలినీకలహంసము', పరవస్తు వేంకట రంగాచార్యులవారి 'మంజుల నైషధము', శ్రీ విశ్వనాథ సత్యనారా యణగారి 'అమృతశర్మిష్ఠ' మొదలగునవి ఇందులకు ఉదాహరణములు.

## 12. చైనాదేశపు రూపకములు

గ్రీసు దేశమునందువలెనే చైనా దేశమునందును రూపకోత్పత్తికి మతమే కారణము. 'ఉత్తర ఛియ్ రాజవంశ' (క్రీ.శ 557-81) పరిపాలన కాలములోనే చైనాదేశపు రూపకము రూపొందినదని విమర్శకుల అభిప్రాయము. ప్రతిశీర్షములను ధరించు ఆచారముకూడ ఆనాడే ప్రారంభమైనది. ప్రసిద్ధుడయిన తియాంగ్ చక్రవర్తి 'మింగ్ హుయాంగ్' ప్రప్రథమ ముగా క్రీ శ. 720లో ఒక నాటక పాఠశాలను (Pear Garden) స్థాపించెనట. చైనా నటులు సీనరీ ఆవశ్యకము లేకయే ప్రదర్శించుటకు అలవాటుపడిరి. ఈ విషయమును పుట 386 లో కొంత వివరించియున్నాను. మొదటి రోజులలో వీరగాథలు నాటకీకరింపబడినవి. 12 వ శతాబ్దినాటికి చైనా రూపకములు సువ్యవస్థితములైనవి; రకరకముల రూపకములు (ట్రాజీ-కామెడీలు. గ్రామీణగాథా రూపకములు, శృంగార రూపకములు, ప్రహసనములు మొదలగునవి) వివిధములైన ఇతివృత్తములతో రచింపబడెను. క్రీ.శ. 12, 14 శతాబ్ద ముల మధ్య 85 మంది నాటక రచయితలు 564 రూపకములను రచించినట్లు చరిత్రకారులు పేర్కొనినారు. 17 వ శతాబ్దినాటికి చైనారూపక రచన క్షీణదశలో పడినది. తక్కువ రకపు ప్రహసనాదులు ప్రాముఖ్యమునకు వచ్చినవి. సంస్కృతమునందువలెనే ఈ దేశపు

రూపకములందు కూడ విషాద-ఆహ్లాదరూపకము లనెడి నిశితమైన విభాగము కన్పట్టదు. రూపకములం దధికభాగము మెలోడ్రామాలే. రూపక కథలయందు సాధారణముగా దుష్టశిక్షణము, శిష్టరక్షణము అనునవి ప్రాముఖ్యము వహించుచుండును. "వంద యువాన్ రూపకములు" అను పేరుతో ఒక నూరు రూపకములు ప్రప్రథమముగా క్రీ. శ. 1600 లో ముద్రితములైనవి. చైనీయుల రూపకములకంటె, వారి ప్రదర్శనములే ఎక్కువ ఆకర్షణీయములుగా ఉండునని చెప్పుదురు. ఆ ప్రదర్శన విధానములందు మన వీథి భాగవతముల పోలికలు కొన్ని కన్పట్టగలవు.

### 13. జపానుదేశ రూపకములు

జపానుదేశరూపకములు ముఖ్యముగా మూడు విధములని చెప్పవచ్చును. [The Oxford Companion to the Theatre - pp. 411-413]— (1) 'నో' రూపకములు (lyrical plays), (2) 'నింగ్యో - షిబయ్' రూపకములు (marionettes), (3) 'కబూకీ' రూపకములు (popular drama).

(1) నోరూపకములు— ముద్రింపబడిన ప్రథమ నోరూపకములు క్రీ. శ. 1600 నాటివి. ఇవి అప్పటికే సుప్రతిష్ఠములుగా ఉండుటచే అంతకు 3, 4 శతాబ్దముల ముందు నుండియు ఇవి ప్రచారమున ఉండియుండును. ఈ రూపకేతివృత్తములు మతసంబంధికథలు. మొదటినుండియు ఈ రూపకములను ధనికులును, పాలకులును మాత్రమే ఆదరించెడివారు. పెక్కురూపకములనుండి ప్రత్యేకరంగములను ఏర్చికూర్చి ప్రదర్శించుటకూడ ఆచారముగా ఉండెడిది.

(2) మారియొనెట్ రూపకములు — ఇవి ముఖ్యముగా ప్రజలరూపకములు. బుఱ్ఱకథకులవంటివారు ఈ రకపు రూపకముల ఉత్పత్తికి మూలపురుషులని చెప్పవచ్చును. దీని కుపయుక్తమయ్యెడి రంగస్థలము విశాలముగా ఉండును. ఈ ప్రదర్శనములందలి మారియొనెట్‌లు (బొమ్మలు) ఇంచుమించుగా మానవుని అంత ఎత్తున ఉండును. సూత్రధారాదులు ప్రేక్షకులకు కనిపించుచునే వీటిని ప్రదర్శింతురు.

(3) కబూకీ రూపకములు — ఇవి క్రీ. శ. 1700 ప్రాంతముల వర్ధిల్లినవి. వీటిని ప్రదర్శించురంగముకూడ చాల విశాలమైనదే. ఆ రంగమునకు మూడు ప్రక్కలను ప్రేక్షకులు కూర్చుందురు. దీనికి మూలము చైనీయుల రూపకమే అయినను, ఇవి స్వదేశీయమైన విశిష్టతను కలిగి ఉన్నవి (జపాన్ రూపకములపై చైనారూపకముల ప్రభావము కలదు)

ఇంతవరకును ప్రాచ్య - పాశ్చాత్య రూపకములనుగూర్చి వివరించియున్నాను. పాశ్చాత్యుల రూపకములును, సంస్కృతరూపకములును, చైనా-జపాన్ రూపకములును వేర్వేరుగా, మూడు ప్రత్యేకశాఖలుగా వర్ధిల్లినవి. ఒక దానిపై ఇంకొకదాని ప్రభావ మున్నట్లు కన్పట్టదు.

---

# అధ్యాయము 19[1]

## ఇతివృత్త నిర్మాణము[2]

[కాశీముద్రణమునందు 21 వ అధ్యా—133 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 19 వ అధ్యా—133 శ్లోకములును, బరోడాముద్రణమునందు 19 వ అధ్యా—154[3] శ్లోకములును కలవు. బరోడాముద్రణ తృతీయ సంపుటము ఈ అధ్యాయముతో ప్రారంభమగుచున్నది.]

### ఇతివృత్తము

ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్ ।
పంచభిః సంధిభి స్తస్య విభాగః సంప్రకల్పితః ॥ 1

—ఇతివృత్తము 'నాట్యశరీరము'. ఇది ఐదు సంధులచే విభజింపబడుచున్నది. (అనగా ఇతివృత్తమునందు ఐదు సంధులుండును.)

---

1. ఇది కాశీముద్రణమునందు 21 వ అధ్యాయము. బొంబాయి - బరోడా ముద్రణములందు 19 వ అధ్యాయము.

2. 'సంధ్యంగ వికల్పము' అని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము. 'సంధి నిరూపణము' అని బరోడా ముద్రణ పాఠము. అభినవగుప్తుడు 'సంధ్యధ్యాయ' మనెను.

3. కాశీ - బొంబాయి ముద్రణములలో లాస్యాంగములు దశరూపాధ్యాయాంతమందే వివరింపబడినవి ; కాని, బరోడా ముద్రణమునందు ఈ అధ్యాయాంతమున లాస్యాంగములు వివరింపబడినవి. నేనీ విధానమునే అనుసరించితిని.

4. అనభినేయమైన కావ్యమునకు 'వృత్త' మాత్రము శరీరము. ఇంక నటనీయమైన అభినేయ కావ్యమునకు (దశరూపమునకు) 'ఇతివృత్తము' శరీరము. 'ఇతి' అనునది 'ఈ ప్రకారముగా (అనగా పంచసంధులతో) అలంకరింపబడినది' అని నిర్దేశార్థకము. ఈ 'ఇతివృత్తము' నే వస్తువు అందురు. [అభినవభారతి - 3 వ సం - పుట 1] ఈ వివరణమునుబట్టి "ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్" అను పాఠాంతరములోని కావ్యపదమునకు రూపకరచనామాత్రమని అర్థము చెప్పుకొనవలసియున్నది.

"వాచియత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషాతనుఃస్మృతా" అని 14 వ అధ్యాయారంభమున చెప్పబడినది. "వాక్కులు నాట్యమునకు తనువు" అని అచ్చట చెప్పి, "ఇతివృత్తము నాట్యమునకు శరీరము" అని ఇచ్చట చెప్పుటలో వైరుధ్యమున్నదని భావించరాదు. అర్థనిర్మాపకత్వము, అర్థతాదాత్మ్యము, అర్థరూపతాధ్యాసము, అర్థైకజ్ఞాన నివేశిత్వము, అర్థోపరంజకత్వము, అర్థనిమిత్తము అనువానిచే వాగాత్మకములైన శబ్దములే ఇతివృత్తార్థముతో సమానయోగక్షేమత్వమును పొందుచున్నవి. [అభినవభారతి - 3 వ సం - పుట 2]

5. నాట్యమునకు ఇతివృత్తము 'శరీరము' కాగా, రసము 'ఆత్మ' అగుచున్నది.

### ఇతివృత్త భేదములు

వివేకవంతులైనవారు ఇతివృత్తమును రెండు విధములుగా కల్పించవలెను[7]— (1) ఆధికారికము, (2) ప్రాసంగికము.

జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము, క్రియ అను లక్షణములు గల ఫలవిషయకమైన ఆరంభము 'కార్య' మనబడును. అట్టి ఏ ఆరంభము (ఏ కార్యము) ముఖ్య ఫలప్రాప్తి సంబద్ధమగునట్లు సామర్థ్యముతో కవిచే పరికల్పితమగునో అట్టి ఆరంభము

---

ఈ రసములే శరీరావిర్భావకములు. ఈ 'ఆత్మ' ను గూర్చి 6 వ అధ్యాయాంతమున, 16 వ అధ్యాయాంతమున విశేషాంశములందు వివరించియున్నాను.

6. 'ఇతి-వృత్తము' అను పదమునందలి 'ఇతి' అనుదాని అర్థము ప్రసిద్ధము కాకపోవుటచే వెంటనే 'ఇతివృత్తమునందు ఐదు సంధు లుండవలె'నని చెప్పబడినది. ఈసంధులే ఇతివృత్త విభాజకములని తెలియవలెను. ఈ ఇతివృత్తాత్మకమగు నాట్యశరీరము ప్రకార వైచిత్ర్యమున శోభించును. ఆ వైచిత్ర్యము పంచసంధులవలన కలుగును. కాగా సంధులు ప్రకారవైచిత్ర్యకల్పనామయము లగుచున్నవి. [అభినవభారతి - 3 వ సం - పుట 2] ఈ సంధులు తరువాత వివరింపబడును. భరతుడు సంధి అననేమో నిర్వచింపలేదు.

7. సహజముగానే ఇది 'ఆధికారికేతివృత్తము', ఇది 'ప్రాసంగికేతివృత్తము' అని ఎచ్చటను ఉండదు. కవి కల్పనవలననే ఆ విభాగము వచ్చును. అనగా ఒకేరాశిని రెండు భాగములుగా చేసినట్లు కవి ఒకే ఇతివృత్తమును రెండు శాఖలుగా చేయునని గ్రహించవలెను. ఇది ప్రసిద్ధేతివృత్త విషయము. ఇంక ప్రకరణాదులందు రెండింటిని కవి కల్పించును. [అభినవభారతి - 3 వ సం - పుటలు 2–3].

8. ఫలప్రాప్తి అనగా ప్రధానఫలప్రాప్తి. ఈ ప్రధాన ఫలప్రాప్తి దృష్టితో పరికల్పితమైనదే ఆధికారికేతివృత్తమగును. అధికారమనగా కావ్యమందంతటను లేదా హృదయమునందంతటను ఆవరించియుండుట; అది ప్రయోజనముగా కలది ఆధికారికము. ఈ ఆధికారికేతివృత్తము ప్రాసంగికమునందును అంతర్లీనమైయుండును. ప్రసక్తియే ప్రసంగము. అట్టి ప్రసంగమువలన సంభవించినది లేదా ప్రధానఫలమును నిష్పన్నముచేయుటకు ప్రసక్తమగునది కాన ఇది ప్రాసంగిక మనబడినది.

"ఈ ప్రాసంగికమందును ఫలప్రాప్తి లేకపోలేదు ; అది 'ప్రాసంగికి' అనబడును. ఇది ప్రధానఫలప్రాప్తికి ఉపకారకము. ఆధికారికేతివృత్తకల్పనమునం దుపయోగించు కవి శక్తిచేతనే ప్రాసంగికము కూడ కల్పింపబడును, లేదా ప్రత్యేకశక్తినిష్పన్నమగును" అని ప్రత్యేకశక్తియోగజము, తదయోగజము అని కొందరు ప్రాసంగికమున ద్వైవిధ్యమును కల్పించిరి. కాని ఉపాధ్యాయు లంగీకరించలేదు. [అభినవభారతి - 3 వ సం - పుటలు 3-4]

"అధికార మనగా ఫలమందు స్వామ్యము; తత్స్వామి అధికారి; అతని ఇతివృత్తమును కవులు ఆధికారికమందురు" అని విశ్వనాథుడు ఆధికారికేతివృత్తమును వివరించెను. [శ్రీ వేదంవారి అనువాదము - 6 వ పరిచ్ఛేదము - 296 సూ.]



'ఆధికారిక' మనబడును; తదితరమైనది 'ప్రాసంగిక' మనబడును. అనగా ప్రధాన ఫలయోగము గల ఇతివృత్తము ఆధికారిక మనబడును; ఇంక తదుపకరణార్థమైన ఇతివృత్తము ప్రాసంగిక మనబడును. కవి ఏ ఫలమును ఉత్కృష్టమైనదానినిగా కల్పించునో అది ప్రధానఫలము. అట్టి ప్రధానఫలమును, కవి తన ప్రయత్నము వలన ధీరోదాత్తాది నాయకులలో యోగ్యుడైనవానికి సంబంధించినదానినిగా కల్పించును'.

### కార్యావస్థలు

ఇట్లు కవి కల్పించెడి ప్రధానఫలమునకు సాధనమైన వ్యాపారము (ఫలప్రాప్తికై నాయకుడు కావించెడి ప్రయత్నము) క్రమముగా ఐదు అవస్థలను కలిగిఉండునని ప్రయోక్తలు తెలియవలెను. ఈ పంచావస్థలును నాటక-ప్రకరణములందుండును. వీని ఫలము ధర్మార్థకామములకు సంబంధించి ఉండును. [చివరి రెండు వాక్యములకును మూలమైన శ్లోకము కాశీముద్రణమునందుమాత్రమే కలదు]—(1) ప్రారంభము, (2) ప్రయత్నము, (3) ప్రాప్తిసంభవము, (4) నియత ఫలప్రాప్తి, (5) ఫలయోగము[10].

(1) ప్రారంభము— ప్రధానఫలప్రాప్తిని గూర్చిన బీజానుగుణ మగు (బీజము=ఉపాయసంపద) ఔత్సుక్యము హృదయమందు నెలకొనుట ప్రారంభ మనబడును[11].

---

9. ఈ ఫలము కేవల నాయకప్రయత్నసంపాద్యమే కానక్కరలేదు. రాజ్యప్రత్యాపత్త్యాది ఫలప్రాప్తి అమాత్యప్రయత్నసంపాదితమైనను అది రాజునకే చెందును. వత్సరాజు కథలలో రాజ్యప్రత్యాపత్త్యాదులు యౌగంధరాయణాది అమాత్యసంపాదితములే. అయినను ఫలభోక్త వత్సరాజే అగుచున్నాడు. అందుచే అతడే నాయకుడగును. [అభినవభారతి - 3 వ సం - పుటలు 4-5]

ఇచ్చట కార్యావస్థాదులు కవి మనఃకల్పితములైనను అభేదోపచారముచే నాయకగతములనుగానే భావించవలెను.

10. వీనినే కార్యావస్థలందురు. వీని క్రమమును కవులేకాక నాట్యప్రయోక్తలును గుర్తించవలెను ; ఆక్రమమును తప్పించరాదు.

"ప్రధాన ఫలముపై దృష్టిని కేంద్రీకరించిన నాయకుని చిత్తవృత్తులే ఈ అవస్థలని గ్రహించవలెను. ఈ అవస్థలు తత్తదుచితములైన కాయిక-వాచిక-మనోవ్యాపారరూపములై ఉండును" అని నాట్యదర్పణకర్తలు తెలిపినారు. [నాట్యదర్పణము - పుట 49]

ఈ అవస్థల పేర్లు దశరూపకాదులందు భిన్నములుగా కన్పట్టుచున్నవి ; అవియే ప్రసిద్ధికెక్కినవి—(1) ఆరంభము, (2) యత్నము, (3) ప్రాప్త్యాశ. (4) నియతాప్తి. (5) ఫలాగమము. [దశరూపకము - 1 వ ప్రకాశము - 16 శ్లో.]

11. ముఖ్యఫలమును దృష్టియందుంచుకొని 'ఈ ఉపాయముచే ఇది సిద్ధించును' అనుచు రూపకపాత్రలు స్మరణ-ఉత్కంఠాదులను చూపుట 'ఔత్సుక్య' మనబడును. ఈ

(2) ప్రయత్నము— ఫలప్రాప్తి కన్పడనప్పుడు, ఆ ఫలమును గూర్చిన వ్యాపారమును మరింత ఔత్సుక్యముతో చేయుట 'ప్రయత్న' మనబడును. ['ఈ' ప్రయత్నముచే తప్ప ఇతర ప్రయత్నములచే ఫలప్రాప్తి కాదు అను నిశ్చయమునకు వచ్చుటచే ఇందు ఉపాయవిషయక స్మరణోత్కంఠాదులు ఎడతెగక సాగును.]

(3) ప్రాప్తిసంభవము— కొంచెముగా, భావమాత్రముగా ఫలము ప్రాప్తించుట 'ప్రాప్తిసంభవ' మనబడును. [ఇందు ఫలప్రాప్తినిగూర్చిన సంభావనయు, అసంభావనయుకూడ ఉండును. నిశ్చయించుకొనిన ఉపాయముచే విశిష్టఫలప్రాప్తి సంభావనామాత్రముగ స్థాపితమగునని తెలియవలెను]

(4) నియతఫలప్రాప్తి— సహకారిసామగ్రీసహిత మగు ఆ ముఖ్యోపాయమువలన ఫలప్రాప్తి తప్పక కలుగును అని భావించుట 'నియతఫలప్రాప్తి' అనబడును. [అనగా ఈ ఉపాయముచే ఈ నాయకునకు ఈ ఫలము సిద్ధించుననెడి నిశ్చయజ్ఞానము కలుగుట]

(5) ఫలయోగము— ఇతివృత్తముయొక్క అంతమందు నాయకు డాశించినదియును, నాయకునకు ఉచితమగునదియును అగు ఫలము సమగ్రముగా సిద్ధించుట 'ఫలయోగ' మనబడును.

ఫలార్థులచే ప్రారంభింపబడిన సర్వకార్యములందును ఈ ఐదు అవస్థలును క్రమముగా ఉండునని తెలియవలెను. పరస్పర భిన్నములైన దండ - చక్రాదులు ఏకభావవిన్యస్తములై ఘటనిర్మాణహేతువులయినట్లు వేర్వేరు స్వభావములు గల ఈ అవస్థలు పరస్పర సంగతితో ఏకకార్యసాధకములగుట ఫలహేతువగును. [ఈ అవస్థలన్నియును ఏకోన్ముఖములై ఫలప్రాప్తి హేతువులు కావలెనని సారాంశము]. ఆధికారికమైన ఇతివృత్తము ఆరంభమునుండి ఫలమువరకును అవస్థలనన్నింటిని అనుసరించి సాగవలయును.

### అర్థప్రకృతులు

ఇతివృత్తవిషయమున, ప్రారంభాది అవస్థలు ఐదు ఉన్నట్లే బీజాది అర్థప్రకృతు[12]లు ఐదు. ఉన్నవి—(1) బీజము, (2) బిందువు, (3) పతాక, (4) ప్రకరి, (5) కార్యము అను ఐదును 'అర్థప్రకృతు' లనబడును. వీనిని యథావిధిగా కూర్చవలెను—

(1) బీజము— ఆదిలో స్వల్పమాత్రముగా నాటబడి, పిమ్మట బహుప్రకారములుగా విస్తరించునదై, ఫలావసానముగా ఉండునది 'బీజ'మనబడును.

(2) బిందువు— ప్రయోజనమునకు (ఉపాయానుష్ఠానమునకు) విచ్ఛేదము కలిగినప్పుడు అవిచ్ఛేదకారణమై ఫలప్రాప్తిపర్యంతమును నిలుచునది 'బిందువు'[13] అనబడును.

(3) పతాక— పరార్థమై ప్రధానఫలమునకు ఉపకారకమగునట్లుగా ప్రధానేతివృత్తమువలెనే కల్పింపబడెడి వృత్తము 'పతాక' అనబడును. [ఇది కేవలము పరార్థమై పరప్రయోజనమును మాత్రమే సాధించదు; స్వప్రయోజనమును కూడ సిద్ధింపజేసికొనును. సుగ్రీవ-విభీషణాదుల రాజ్యప్రాప్తి ఇందుల కుదాహరణము. ఇదియే "ప్రధానేతివృత్తమువలె" అనుచోట వివక్షితమైన సాదృశ్యము].

(4) ప్రకరి— ఏ వృత్తము కేవలము పరార్థమే కల్పితము అగునో ఆ వృత్తము 'ప్రకరి' అనబడును. ఇట్టిది అనుబంధవిహీనముగా ఉండును. [రామాయణమందలి జటాయువు, వేణీసంహారమందలి వాసుదేవుడును ఇందుల కుదాహరణములు. ప్రకరి ఫలసిద్ధి పర్యంతమును ఉండదని కొందరందురు.]

(5) కార్యము—చేతనులచే (అనగా ప్రభు-మంత్ర-ఉత్సాహశక్తుల సాహాయ్యమున నాయక-పతాకనాయక-ప్రకరీనాయకులచే) సంపాదింపబడు ఫలరూపమగు ఆధికారికవస్తువును సాధించుటకు ఉపయోగించు ద్రవ్య-గుణ-క్రియా ప్రభృతి సమస్తసహకారివర్గమును 'కార్య' మనబడును. ["కార్యతే అనేన-ఫలం-ఇతి

---

ఔత్సుక్యము నాయికా - నాయక - అమాత్య - ప్రతినాయక - దైవములలో ఎవరిదైనను కావచ్చును. [అభినవభారతి - 3 వ సం - పుట 6]

12. కార్యావస్థ లనునవి ఆధికారికేతివృత్తమునకు సంబంధించిన భాగములు **(stages of action)**. ఇంక అర్థప్రకృతు లనునవి ఫలసాధనోపాయభేదములు. అర్థమనగా ఫలము. ప్రకృతులనగా ఉపాయములు. కావున అర్థ ప్రకృతులనగా ఫలహేతువు లని సారాంశము. ఇవికూడ ఇతివృత్తవిభాగములే అని శారదాతనయాదుల అభిప్రాయము. అది సరికాదు. వివరములకు విశేషాంశములను చూడవలెను.

13. ఏదియో ఒక అవాంతరకార్యముచే బీజము కనుమరుగు పడుచుండును. ఆ అవాంతరకార్యము సమాప్తమైన పిమ్మట కథాగతి కుంటుపడినట్లుగా తోచును. అప్పుడు నాయకాదులకు బీజమును జ్ఞప్తికితెచ్చి మరల కార్యాచరణమునకు వారి నుద్యుక్తులను కావించి కథాగతికి భంగమురాకుండ చేయునది 'బిందు' వనబడునని సారాంశము.

"ఉపాయానుసంధానమును మాటిమాటికిని జ్ఞాపకముచేయు చేతనవ్యాపారమైనదియును, మిగిలిన కారణములకు కారణత్వమును సిద్ధింపజేయునదియును, స్వయముగా తాను పరమకారణమగునదియును, నీటిమీద తైలబిందువువలె సర్వవ్యాపి అగునదియును 'బిందువు' అనబడు" నని అభినవగుప్తుడు తెలిపెను.

బీజ - బిందువులు రెండును ఫలపర్యంతమును వ్యాపించి ఉండునని తెలియవలెను. బీజ మనునది ముఖసంధి యందే ప్రవర్తిల్లి ఉన్మేషమును పొందును. బిందువు తదనంతరము ప్రవర్తిల్లును. ఇదియే రెండింటియందలి భేదము. రెండును సమస్తేతివృత్తవ్యాపకములే. [అభినవభారతి - 3 వ సం - పుట 14]

కార్యం"— దీనిచే ఫలము కలిగింపబడుచున్నది అనెడి వ్యుత్పత్తిచే ఇచ్చట కార్య శబ్దము ఉపాయసామగ్రిని తెలుపుచున్నది. బీజ-బిందువు వలెనే ఇదియును సమస్తేతివృత్తవ్యాపి. వివరములకు విశేషాంశములను చూడవలెను.]

ఏ నాయకునకు ఏ అర్థప్రకృతివిశేషముచే అధికమైన ప్రయోజనసిద్ధి అగునో ఆ అర్థప్రకృతినే అచ్చట ప్రధానముగా చేయవలెను; ఇంక తక్కినవి అప్రధానములగును.*

## పతాకాస్థానక భేదములు

ఒక వాక్యము ఒక అర్థమును ఉద్దేశించి ప్రయోగింపబడినప్పటికిని, ఆగంతుక భావముచే నిగూఢమగు ఇంకొక అర్థము సాధింపబడినచో అది 'పతాకాస్థానక'[14] మనబడును. ఈ నిగూఢార్థము మొదటి అర్థమునకు అనుగుణమైనదిగా ఉండును. ఇట్టి పతాకాస్థానకము నాలుగువిధములు—

(1) మొదటి పతాకాస్థానకము—ఉద్దిష్టమగు ప్రయోజనము కంటె ఎక్కువ ఉపకారకారి అగుటచే ఉత్కృష్టము అగు వేరొక అర్థము అచింతితముగా సంపన్నమగుట 'ప్రథమ పతాకాస్థానక' మనబడును.

[* కాశీముద్రణమునందు 21వ అధ్యా-1-30 శ్లో; బొంబాయి ముద్రణమునందు 19వ అధ్యా-1-30 శ్లో; బరోడా ముద్రణమునందు 19వ అధ్యా—1-29 శ్లో.]

14. అర్థప్రకృతులలో ఒకటి అయిన పతాకకును, ఈ పతాకాస్థానమునకును సంబంధము లేదు. పతాక అనగా 'లింగము'. నిగూఢముగా ఉన్న అర్థమును స్ఫురింపజేయునది 'లింగ' మనబడును. అట్టి అర్థముకలిగినది పతాకాస్థానక మనబడును. ఈ రెండవ అర్థము మొదటి అర్థమునుండియే జనింపవలెను. ఈ పతాకస్థానములకు ప్రత్యేకములుగా పేర్లులేవు.

పతాకా-ప్రకరులు రెండును ప్రాసంగికేతివృత్తభాగములని చెప్పవచ్చును. వానివలె పతాకాస్థానకము కూడ ప్రాసంగికేతివృత్తభాగమని శారదాతనయుడు పేర్కొనెను. [భావప్రకాశము - పుట 20]. ఇది సరికాదు. వివరములకు విశేషాంశములనుచూడవలెను.

వీనికి ప్రత్యేకముగా పేర్లు లేకపోవుటచేతను, ప్రథమ-ద్వితీయాది పదములచే ఇవి నిర్దేశింపబడుటచేతను ఈ నాలుగు పతాకాస్థానములును మొదటి నాలుగు సంధులందు మాత్రమే క్రమముగా ఉండునని కొందరందురట. అట్టి నియములేదని అభినవగుప్తుడనెను.

ఈ పతాకాస్థానకములు భావ్యర్థసూచకములుగా ఉండవలెనని ధనికాదులు తెలిపినారు. ఈ పతాకాస్థానకమునే పాశ్చాత్యులు 'Dramatic Irony' అని అందురు. ఇది సంఘటనములందుకాని, సన్నివేశములందుకాని, శబ్దమునందుకాని, పీటిమిశ్రమమందుకాని వ్యక్తమగుచుండును. ఎచ్చట "Ignorance of the sequel on the part of the personages represented clashes with the knowledge of it on the part of the audience" అనునది జరుగునో అచ్చట ఈ Dramatic Irony ఉండును.

సింగభూపాలుడు పతాకాస్థానక నిర్వచనములకు భరతుని శ్లోకములనే గ్రహించినను 2, 3, 4 పతాకాస్థానకములకు శ్లిష్టము, శ్లిష్టోత్తరము, తుల్యవిశేషణము అను పేర్లు పెట్టెను.



(2) రెండవ పతాకాస్థానకము— ప్రకృతమునకు సంబంధించి సాతిశయముగా, శ్లిష్టముగా (రెండర్థములు వచ్చునట్లుగా) చెప్పబడిన వాక్యము 'రెండవ పతాకాస్థానక' మనబడును. (ప్రకృతమునకు ఉచితమైనట్లుగా చెప్పబడిన అర్థము అప్రకృతమునకు కూడ ఉచితముగా ఉండుట.)

(3) మూడవ పతాకాస్థానకము— అస్ఫుటముగా ఉన్న అర్థమును, అభిప్రాయాంతరముతో ప్రయుక్తమై ప్రకృతాన్వయసముచితమగు ప్రత్యుత్తరముచే విశేష నిశ్చయసహితముగా స్ఫుటమొనరించు వాక్యము 'మూడవ పతాకాస్థానక' మనబడును.

(4) నాలుగవ పతాకాస్థానకము— ఇంకొక అర్థమును సాధించునట్లు సుశ్లిష్టముగా కావ్యమునందుపయుక్తమైన రెండర్థములు గల వాక్యము 'చతుర్థ పతాకాస్థానక' మనబడును.

## సంధులు[15]

నాటక కార్యము పై నాలుగు పతాకాస్థానకములతోను చెప్పబోయెడి ఐదు సంధులతోను కూడిఉన్నచో అది ఉత్కృష్టము కాగలదు. ఈ సంధుల నిప్పుడింక వివరింతును— సంధులైదు - (1) ముఖసంధి, (2) ప్రతిముఖసంధి, (3) గర్భసంధి, (4) విమర్శసంధి, (5) నిర్వహణసంధి. ఈ ఐదు సంధులును ప్రధానేతివృత్తమునందుండును. ఈ ప్రధానసంధులననుసరించి ఉండెడి ఇతర సంధులను అనుసంధు లందురు. (ఇవి ప్రాసంగికేతివృత్తమునందుండును.)

(1) ముఖసంధి— నానార్థ-రససంభవమగు బీజసముత్పత్తి కావ్యమందెచ్చట జరుగునో ఆ కథాభాగము 'ముఖసంధి' అనబడును. ఈ 'ముఖసంధి' శరీరానుగతముగా ఉండును. అనగా ప్రారంభమనెడి కార్యావస్థ ననుసరించి ఉండును. [ఫలసాధనోపాయములలో ముఖ్యమైన బీజముయొక్క నిష్పత్తితోను, ప్రారంభావస్థతోను కూడిఉండు కథాభాగము 'ముఖసంధి' అనబడునని సారాంశము. అర్థవశమున వచ్చు వివిధ రసములకు ఇది ఆకరము.]

(2) ప్రతిముఖసంధి— ముఖసంధియందు నిష్పన్నమైఉన్న బీజము అవాంతర కారణములచే మరుగుపడినప్పుడు ఆ బీజము మరల ఉద్ఘాటితము (సుస్పష్టము) చేయబడినచో ఆ కథాభాగము 'ప్రతిముఖసంధి' అనబడును. [ముఖసంధిలో

15. సంధి అనగానేమో భరతుడు నిర్వచింపలేదు.

"ప్రధానప్రయోజనముతో అన్వయము పొందియున్న కథాంశములు పరస్పర సంబద్ధములై అవాంతర ప్రయోజనసాధకములగునప్పుడు ఆ సంబంధము 'సంధి' అనబడు"నని అర్వాచీనాలంకారికులమ బట్టి చెప్పవచ్చును. వివరములకు విశేషాంశములను చూడవలెను.

కన్పట్టిన బీజము విరోధిసన్నిధానముచే నష్టమైనట్లు మరుగుపడిఉండును. అప్పుడు, మట్టి పెల్లను తొలగించినచో క్రిందనుండు బీజాంకురము బైటకు వచ్చినట్లుగా ఇందు బీజము స్పష్టముగా కనిపించును.]

(3) గర్భసంధి— బీజముయొక్క ఉద్భేదము అనగా ప్రాప్తి, అప్రాప్తి, మరల అన్వేషణము అనునవి ఎచ్చట కూర్పబడునో ఆ కథాభాగమును 'గర్భసంధి' అందురు. [ఇందు బీజము ఉద్భేదమును అనగా ఫలజననాభిముఖ్యస్థితిని పొందును. అనగా బీజము ముఖసంధియందు ఉత్పన్నమై, ప్రతిముఖసంధియందు ఉద్ఘాటితమై, గర్భసంధియందు ఫలోన్ముఖమగునని సారాంశము. ఇందు ప్రాప్తిసంభవావస్థ ఉండునుకాన అప్రాప్తిని ప్రధానముగను, ప్రాప్త్యంశమును అప్రధానముగను సూచింపవలెను. విమర్శ సంధియందు ప్రాప్తికి ప్రాధాన్యమును, అప్రాప్త్యంశమునకు న్యూనతయును కల్పించవలసిఉండును.]

(4) విమర్శసంధి (=అవమర్శసంధి)— గర్భనిర్భిన్నమైన (ఫలోన్ముఖమైన) బీజార్థము లోభ-క్రోధ-వ్యసనములచే సందేహాస్పదమయ్యెడి[15అ] కథాభాగము 'విమర్శసంధి' అనబడును. [ఫలోన్ముఖమైన బీజార్థము ఏదేని ఒక తీవ్ర విఘ్నముచే భంగపడుట జరుగును. ఫలప్రాప్తిని వాంఛించు నాయకాదులు క్రొత్తగావచ్చిన ఆ విఘ్నమును తరించుటకై తమశక్తి నంతయును వినియోగించవలసి ఉండును. అప్పుడే వానికి ఫలసిద్ధి చేకూరును. 'విమర్శ' అను పదము 'విఘ్నము' లేదా 'సందేహము' అను అర్థములందు ప్రయుక్తమైనదని చెప్పనగును.]

(5) నిర్వహణసంధి— సబీజకములును, నానా భావోత్తరములును అయిన ముఖాది సంధులయందలి ప్రారంభాద్యవస్థలు ఫలనిష్పత్తికి సంబంధించి ఉండునట్లు కూర్పబడు కథాభాగము 'నిర్వహణసంధి' అనబడును. [సబీజకములు=బీజముయొక్క

15అ. వెనుకటి గర్భసంధిలో ప్రాప్తి సంభవమైన తరువాత ఈ సంధిలో నియతప్రాప్తి ఉండును కాన ఇందు సందేహ మెట్లుండును అని శంకించి అభినవగుప్తుడు క్రింది విధముగా సమాధాన మొసంగెను—తర్కానంతరము ఏదో ఒక కారణమువలన సంశయము జనించవచ్చును. ఇందు ఆ కారణముయొక్క బలమువలన సంభావితమైన ఫలము విషయమున సందేహము జనించును. ఇచ్చట ఫలవిషయసంభవమును, సందేహమునుకూడ కలిగించు కారణములు రెండును తుల్యబలము కలవగుటచే ఫలము విషయమున మరల సంశయము జనించును. అప్పుడు ప్రత్యూహ విఘాతమునకు అత్యధికమైన ప్రయత్నము జరుగును. దానిచే మరల ఫలప్రాప్తి విషయమున నిర్ణయము కలుగును. ఇట్లు ఇందు తర్కము తరువాత సంశయమును, మరల నిర్ణయమును ఉండును. "శ్రేయాంసి బహువిఘ్నాని" అని కదా సూక్తి ? అట్టి విఘ్నాపసరణము నొనరించవలయుననెడి పట్టుదలతో ఇందాతడు స్వప్రయత్నమును సహస్రగుణముగా ఒనరించును.



ఉత్పత్తి-ఉద్ఘాటన-ఉద్భేదన-గర్భనిర్భేదము (భంగపడుట) లనెడు నాలుగుఅవస్థలతో కూడినవి; నానా భావోత్తరములు=సుఖ-దుఃఖాత్మకములైన హాస-శోక-క్రోధాది భావములచే జనించిన చమత్కారముతో కూడినవి. ఆయా స్థలములలో వేరువేరుగా ఉన్న ముఖాదిసంధులలోని ప్రయోజనములు పరస్పరము సంబంధించిఉన్నట్లు కాని, అవి అన్నియును ప్రధాన ప్రయోజనముతో సంబంధించిఉన్నట్లు కాని సుస్పష్టముగా భాసించవు. వానికిగల పరస్పరసంబంధమును విశదముచేయుచు, వానికి ప్రధానఫలముతో గల సంబంధమును నిశ్చయించెడి కథాభాగము 'నిర్వహణసంధి' అనబడునని సారాంశము]

ఆధికారికేతివృత్తమునందు ఈ సంధులన్నియును ఉండును. ఒక్కొక్కప్పుడు కొన్ని సంధులు లోపించవచ్చును. ఒక సంధి లోపించినచో అట్లు లోపించినది అవమర్శసంధి అగును; రెండు లోపించినచో అవి గర్భ-అవమర్శ సంధులగును; మూడు లోపించినచో అవి ప్రతిముఖ-గర్భ-అవమర్శ సంధులగును. ప్రాసంగికము పరార్థమే కాన దానికి సంధ్యాదినియమములు లేవు; ఇందేవృత్తమునైనను ఆధికారికమునకు అవిరోధముగా యోజింపవలెను.

పతాకయందుండెడి ఒకటి లేదా అంతకుమించిన సంధులు ప్రధానార్థమును అనుసరించిఉండుటచే అవి 'అనుసంధు' లనబడును ('అనుబంధములు' అని కాశీ ముద్రణ పాఠము). పతాకానిబంధనము పరార్థమే అగుటచే అది గర్భసంధివరకు లేదా విమర్శ (=అవమర్శ) సంధి వరకు మాత్రమే వ్యాపించిఉండును. (ప్రధాన ఫలప్రాప్తిలో పతాకానాయకుడు భాగస్వామి కారాదని భావము).

ఈ ఐదు సంధులును నాటక-ప్రకరణములు రెండింటియందును ఉండును. ఇంక శేషించిన రూపకములయందలి సంధులను గూర్చి వివరింతును. డిమ-సమవకారములు చతుస్సంధియుతములు; వీనియందు అవమర్శ సంధిని కవులెన్నడును కూర్పరాదు. వ్యాయోగ-ఈహామృగములు సంధిత్రయయుతములు; అనగా వీనియందు గర్భ-అవమర్శ సంధులుండవు; అంతియేకాక వీనియందు కైశికీ వృత్తియును ఉండదు. ప్రహసన-అంక-భాణ-వీథులు సంధిద్వయయుతములు; అనగా వీనియందు ముఖ-నిర్వహణములు రెండుమాత్రమే ఉండును.

### సంధ్యంగములు

ఇతివృత్తము నందలి ఆయా భాగములకు ఏకతను కూర్చుటకై సంధులు నిబంధింపబడును. ఇంక కథాభాగమునకు ఏకతను కూర్చుటలో సంధికి అంగభూతములై వర్తించునవి 'సంధ్యంగము' లనబడును. అట్టి సంధ్యంగములను ఆయా కథాభాగములందు ముఖ్యప్రయోజనోచితములనుగా కూర్చవలెను.

సంధ్యంగ ప్రయోజనములు

(1) ఇష్టార్థ రచన (అభీష్టమైన ప్రయోజనమును విస్తరింప జేయుట), (2) వృత్తాంతానుపక్షయము (ఇతివృత్తము క్షయమునొందక చక్కగా కొనసాగునట్లు చేయుట), (3) ప్రయోగమునందు రాగప్రాప్తి (ప్రయోగమును రక్తి కట్టించుట), (4) గుహ్యాగూహనము (గోప్యార్థములను గోపనము చేయుట అనగా కప్పిపుచ్చుట), (5) ఆశ్చర్యాభిఖ్యానము (ఇతివృత్తము నాశ్చర్యకరముగా నొనర్చుట), (6) ప్రకాశ్య ప్రకాశనము (ప్రకాశ మొనర్పదగు అర్థములను ప్రకాశింప జేయుట) అను ఈ ఆరును సంధ్యంగములను కూర్చుటవలన కలిగెడి ప్రయోజనములని తెలియవలెను.

అంగహీనుడైన మనుష్యుడు కార్యారంభ సమర్థుడు కాజాలనట్లే అంగహీన మైన కావ్యము ప్రయోగయోగ్యము కాజాలదు. కావ్యము ఉదాత్తమైనను సంధ్యంగరహితమైనచో ప్రయోగహీనమై[16] సహృదయుల మనస్సులను రంజింపజాలదు. కావ్యము హీనార్థమయినను అంగములతో చక్కగా కూడిఉన్నచో ప్రయోగము దీప్తమగును కాన అది నిస్సంశయముగా సహృదయుల హృదయములను రంజింపగలదు. కావున సంధిప్రదేశములందు యథాయోగముగా, యథారసముగా కవులు ఈ అంగములను కూర్చవలెను.

అంగములు అరువదినాలుగు.[17] వీనిలో ముఖసంధ్యంగములు-12; ప్రతిముఖ

16. ప్రయోగహీనమనగా ప్రదర్శనానర్హమగుట. దీనిని బట్టి ప్రయోగించుటకు పనికిరాని లేదా ప్రయోగించినచో రక్తి కట్టజాలని కేవల రూపకరచన సార్థకము కాజాలదని తెలియవలెను. రూపక మనగా దృశ్య ప్రధానమైన కావ్యము. ఆ దృశ్యత్వము దానికి లేనిచో అది కేవలము సంభాషణ రూపమున ఉన్న శ్రవ్యకావ్యమే అగునని తెలియవలెను.

కావ్యము హీనార్థమగుట అనగా ప్రహసనాదులయందలి కథలు స్వల్పప్రయోజనములు కలిగిఉండుట అని మాత్రమే అర్థము. అంతియేకాని అధమకావ్యమని తలంచరాదు. స్వల్పప్రయోజనము కల ప్రహసనాదులు కూడ అంగములయొక్క చక్కని కూర్పువలన ప్రదర్శనయోగ్యతను పొందుచున్నవి. వివక్షితార్థప్రతిపాదనము, గోప్యార్థగోపనము, ప్రకారార్థప్రకాశనము, అభినయరాగసమృద్ధి, చమత్కారకారిత్వము, ఇతివృత్త విస్తరము అను ఆరును షట్ప్రయోజనములని పెద్దనార్యుడు పేర్కొనెను.

17. సంధ్యంగము లరువది నాలుగని చెప్పబడినను నిజమునకు 65 అంగములు వివరింపబడినవి. గర్భసంధి యందలి "ప్రార్థన" అనుదానిని విడిచివేసి ధనంజయాదులు 64 సంధ్యంగములను మాత్రమే గణించిరి. కొందరు విమర్శసంధ్యంగమైన 'ప్రరోచన'ను విడిచివేసి 64 సంధ్యంగములను మాత్రమే గణింతురు. కొందరు నిర్వహణసంధ్యంగమైన 'ప్రశస్తి'ని విడిచివేసి 64 సంధ్యంగములను మాత్రమే గణించిరి. ప్రశస్తి అనునది నాంది



సంధ్యంగములు - 13 ; గర్భసంధ్యంగములు - 13 ; విమర్శసంధ్యంగములు - 13 ; నిర్వహణసంధ్యంగములు- 14. వీని లక్షణములను క్రమముగా వివరింతును,*

ముఖసంధ్యంగములు

1. ముఖసంధ్యంగములు— (1) ఉపక్షేపము, (2) పరికరము, (3) పరిన్యాసము, (4) విలోభనము, (5) యుక్తి, (6) ప్రాప్తి, (7) సమాధానము, (8) విధానము, (9) పరిభావన, (10) ఉద్భేదము, (11) కరణము, (12) భేదము- అను ఈ పన్నెండు అంగములును ముఖసంధియందలి అంగములు.

(1) ఉపక్షేపము— కావ్యార్థ సముత్పత్తి అనగా బీజోత్పత్తి 'ఉపక్షేప' మనబడును.

(2) పరికరము— ఉత్పన్నార్థము కొలదిగా విస్తరింపబడుట 'పరికర' మనబడును.

(3) పరిన్యాసము— కావ్యార్థము సుస్పష్టముగా నిర్దిష్టమగుట 'పరిన్యాస' మనబడును.

(4) విలోభనము— గుణములను వర్ణించుట 'విలోభన' మనబడును.[18]

(5) యుక్తి—కర్తవ్యతా నిశ్చయము 'యుక్తి' అనబడును. (దీని ప్రయోజనము ప్రకాశ్యప్రకాశనము)

వలె ఆశీఃపూర్వకమైనది. అందుచే దానిని సంధ్యంగముగా గణింపకుండుట సమంజసమని చెప్పవచ్చును. ఈ ప్రశస్తియే 'భరతవాక్య' మనబడును.

అభినవగుప్తుని అభిప్రాయమేమో స్పష్టముగాలేదు. భాషణము (62), సంగ్రహము (31) అను సంధ్యంగములకు నామభేదమేకాని అర్థభేదములేదు. కావున దీనిని సంఖ్యాభేదముగా అభినవగుప్తుడు తలంచలేదేమో ? అప్పుడు అంగములు అరువదినాలుగే అగును.

ఈ సంధ్యంగములకు మూలమందు ఉదాహరణములులేవు. అభినవగుప్తుడు మాత్రము ఆ యా నాటకములనుండి ఉదాహరణముల నొసంగెను. కొందరు కేవలము ఒకే ఒక నాటకమునుండి 64 సంధ్యంగములను ఉదాహరించియున్నారు. సింగభూపాలుడు ఒక్క బాలరామాయణము నుండియే అన్ని అంగములకును ఉదాహరణము లొసంగెను.

*[కాశీ ముద్రణమునందు 21 వ అధ్యా—31-70 శ్లో ; బొంబాయి, బరోడా ముద్రణములందు 19 వ అధ్యా—30-69 శ్లో.]

18. ఈ ఉపక్షేపాదులు నాలుగును ప్రాయికముగా ముఖసంధియందే ఉండును. ఇవి పైని పేర్కొనిన వరుసలోనే ఉండవలెనను నియమములేదు. మరియు సామాది సంధ్యంతరములు వీని మధ్యలో కూర్పబడుచుండును. వృత్తాంతానుపక్షయమే వీని ప్రయోజనము అని చెప్పబడెనుగదా. పరికరప్రయోజనము ఇష్టార్థరచనయును కానగును. [అభినవభారతి - 3 వ సం - పుట 38]

(6) ప్రాప్తి-సుఖపెట్టు వస్తువు లభించుట 'ప్రాప్తి' అనబడును.

(7) సమాధానము—బీజార్థము ప్రధాననాయకగతముగా సూచింపబడుట 'సమాధాన' మనబడును.

(8) విధానము—సుఖ-దుఃఖములు సమ్మిశ్రితములై వర్ణింపబడుట 'విధాన' మనబడును. (ఇష్టార్థరచనా-గుహ్యగూహనములు దీని ప్రయోజనములు)

(9) పరిభావన— జిజ్ఞాసాతిశయముతో కూడిన ఆవేగము వర్ణింపబడుట 'పరిభావన' అనబడును.

(10) ఉద్భేదము— బీజసముత్పత్తిని వర్ణించుట 'ఉద్భేద' మనబడును, (భూమిసంశ్లేషమువలన బీజము మొలకెత్తినట్లు ఇందు బీజసముత్పత్తి అగును.)

(11) కరణము— ప్రకృతార్థము ప్రారంభింపబడుట 'కరణ' మనబడును.

(12) భేదము— సంఘాతభేదము అనగా పాత్రలు స్వప్రయోజన నిర్వహణార్థమై రంగమునుండి నిష్క్రమించుటకు విడివడుట 'భేద' మనబడును.

ప్రతిముఖసంధ్యంగములు

2. ప్రతిముఖసంధ్యంగములు— (1) విలాసము, (2) పరిసర్పము, (3) విధూతము, (4) తాపనము, (5) నర్మము, (6) నర్మద్యుతి, (7) ప్రగమనము, (8) నిరోధము, (9) పర్యుపాసనము, (10) పుష్పము, (11) వజ్రము, (12) ఉపన్యాసము, (13) వర్ణసంహారము అను ఈ పదుమూడును ప్రతిముఖ సంధ్యంగములు—

(13) విలాసము— రతిభోగవిషయకమగు కోరిక 'విలాస' మనబడును[19].

(14) పరిసర్పము—కనుపించి, మరల కనుమఱుగైన ప్రకృతార్థమును అనుసరించుట 'పరిసర్ప' మనబడును.

---

19. శృంగారమున అయినచో రతిభావమునకు హేతుభూతము అగు స్త్రీ పురుషాది విషయార్థమగు సమీహ 'విలాస' మనబడును. ఇట్లే ఇతర రసములయందును ఊహింపదగును. ఈ నిర్వచనమునందలి 'రతి' అను పదము సర్వస్థాయి భావములకును ఉపలక్షణమని తెలియవలెను. శృంగారరసప్రధానములైన రూపకములందు రతి సంబంధమైన కోరిక ఉండును. అట్లే వీరరస ప్రధానములైన రూపకములందు ఉత్సాహ సంబంధమైన కోరిక వర్ణితమగును. అచ్చట రతిసంభోగవిషయము వర్ణితము కారాదు. కావుననే వేణీసంహారమున ద్వితీయాంకప్రారంభమందలి భానుమతీదుర్యోధనుల వృత్తాంతము విమర్శకు గురిఅయినది. ఔచిత్యమును పరిశీలించక శాస్త్రమును యథాక్షరముగా పాటించుట వలన ఈ దోషము దొరలినది. "సంధి-సంధ్యంగఘటనం రసబంధవ్యపేక్షయా। న తు కేవల శాస్త్రార్థ స్థితి సంపాదనేచ్ఛయా"॥ అని ఆనందవర్ధనులు ధ్వన్యాలోకమున నిర్దేశించియున్నారు. [అభినవభారతి - 3 వ సం - పుట 42].



(15) విధూతము— చేయబడిన అనునయమును మొదట అంగీకరించకుండుట 'విధూత' మనబడును.

(16) తాపనము— అపాయమును దర్శించుట 'తాపన' మనబడును.

(17) నర్మము— క్రీడార్థము చేయబడిన హాస్యము 'నర్మ' మనబడును.

(18) నర్మద్యుతి— దోషమును కప్పిపుచ్చుటకై చేయబడిన హాస్యము 'నర్మద్యుతి' అనబడును.

(19) ప్రగమనము ('ప్రగయణము' అని బరోడా ముద్రణపాఠము)—ఉక్తి-ప్రత్యుక్తిరూపమైన వాక్యము 'ప్రగమన' మనబడును.

(20) నిరోధము—వ్యసనమునుపొందుట 'నిరోధ' మనబడును.

(21) పర్యుపాసనము— కోపించినవారిని అనునయించుట 'పర్యుపాసన' మనబడును.

(22) పుష్పము— విశేషసూచకమగు వచనము 'పుష్ప' మనబడును.

(23) వజ్రము— ప్రత్యక్షపారుష్యముకల వాక్యము 'వజ్ర' మనబడును.

(24) ఉపన్యాసము— ఒక అర్థమును ఉపపత్తిచే సమర్థించుట 'ఉపన్యాస' మనబడును.

(25) వర్ణసంహారము— చాతుర్వర్ణ్యము అనగా వివిధ పాత్రలయొక్క సమ్మేళనము 'వర్ణసంహార' మనబడును.[20]

గర్భసంధ్యంగములు

3. గర్భసంధ్యంగములు— (1) అభూతాహరణము, (2) మార్గము, (3) రూపము, (4) ఉదాహరణము, (5) క్రమము, (6) సంగ్రహము, (7) అనునూనము, (8) ప్రార్థన, (9) ఆక్షిప్తి, (10) తోటకము, (11) అధిబలము, (12) ఉద్వేగము, (13) విద్రవము-అను ఈ పదుమూడును గర్భసంధ్యంగములు—

(26) అభూతాహరణము— కపటయుక్తమగు వాక్యము 'అభూతాహరణ' మనబడును.

---

20. చాతుర్వర్ణ్య మనగా బ్రాహ్మణాది వర్ణములని అర్థము చెప్పరాదు. ఈ పదముచే పాత్రలు ఉపలక్షితులైనారు. "వీరరసప్రధానములైన రూపకములందు నాయక-ప్రతినాయకులును, తత్సచివు లిరువురును ప్రధానముగా వర్ణింపబడుదురు. కావున వారు నలుగురును వర్ణములు. కామ ప్రధానమైన రూపకములందునా యికా-నాయకులును తత్సచివు లిరువురును (చేటీ-విదూషకులు) వర్ణములు. ఈ చతుర్వర్ణములవారి సమ్మేళనమే 'వర్ణసంహార' మనబడును" అని భట్టతౌతుని అభిప్రాయము [అభినవభారతి-3వ సం-పుట47].

(27) మార్గము— తత్త్వమును (యథార్థమును) చెప్పెడి వచనము 'మార్గ' మనబడును.

(28) రూపము— విచిత్రార్థములయొక్క సమ్మేళనమునందలి వితర్కము 'రూప' మనబడును [ఇందు "ఇది అనుచితము, ఇది అనుచితము" అనుచు చెప్ప బడునే కాని ఉచితపక్ష మేదియో నిర్ణయము కాదు. యుక్తి అను అంగమునందు ఉచితవస్తు నిశ్చయము ఉండును. ఇదియే వీనికిగల భేదము. రూపమనగా ఆకారము. ఆకారమునందు 'ఇది ఇట్టిది, ఇది ఇట్టిది' అను విశేష ప్రతిపత్తి ఉండును. అట్లే ఇందును కాన ఇది 'రూప' మనబడినది.]

(29) ఉదాహరణము—అతిశయసహితమగు వాక్యము 'ఉదాహరణ' మనబడును.

(30) క్రమము—భావనాబలముచే ఒక వస్తువుయొక్క పరమార్థమును గ్రహించుట 'క్రమ' మనబడును.

(31) సంగ్రహము— సామ-దానాదులతో కూడినది 'సంగ్రహ' మన బడును.

(32) అనుమానము— ప్రత్యక్షమగు రూపమును బట్టి తదనురూపమైన ఇంకొక దానిని ఊహించుట 'అనుమాన' మనబడును.

(33) ప్రార్థన— రతి-హర్ష-ఉత్సవములను గూర్చిన ప్రార్థన 'ప్రార్థన' అన బడును (ఈ అంగమును కొందరు గణించరు.)

(34) ఆక్షిప్తి (=క్షిప్తి=ఆక్షిప్తము)—హృదయస్థమైన రహస్యము ఏదేని ఒక హేతువుచే బయల్పడుట 'ఆక్షిప్తి' అనబడును.

(35) తోటకము—ఆవేగముతో కూడిన వచనము 'తోటక' మనబడును.

(36) అధిబలము—కపటముచే వచించుట 'అధిబల' మనబడును.

(37) ఉద్వేగము— అరి-నృప-దస్యులవలన కలిగిన భయము 'ఉద్వేగ' మనబడును.

(38) విద్రవము— భయ-త్రాసములను కలిగించు వస్తువును ఆశంకించుట (సంభవించునేమో అని ఊహించుట) 'విద్రవ' మనబడును [శ్రీశంకుకుని మతమున శంకా-భయ-త్రాసముల సముదాయమే 'విద్రవము'.]

### విమర్శసంధ్యంగములు

4. విమర్శసంధ్యంగములు— (1) అపవాదము, (2) సంఫేటము, (3) ద్రవము, (4) శక్తి, (5) వ్యవసాయము, (6) ప్రసంగము, (7) ద్యుతి



(8) ఖేదము, (9) ప్రతిషేధము, (10) విరోధనము, (11) ఆదానము, (12) ఛాదనము, (13) ప్రరోచన అను ఈ పదుమూడును విమర్శసంధ్యంగములు—

(39) అపవాదము— దోషమును వెల్లడిచేయుట 'అపవాద' మనబడును.

(40) సంఫేటము— రోషముతో కూడిన వాక్యము 'సంఫేట' మనబడును. [కొందరు దీనిని 'సంస్ఫోట' మందురట. 'స్ఫోట' మనగా అనాదరము. ఇందు అనాదరము రోషగ్రథిత వాక్యమున వ్యక్తమగుచుండును.]

(41) ద్రవము (అభిద్రవము-బొంబాయి ముద్రణ పాఠము)— గురు తిరస్కారము 'ద్రవ' మనబడును.

(42) శక్తి—కోపించిన వారిని ప్రసన్నులనుగా చేయుట 'శక్తి' అనబడును.

(43) వ్యవసాయము— ప్రతిజ్ఞాతమైన ప్రయోజనమును సాధించు హేతువు సిద్ధించుట 'వ్యవసాయ' మనబడును.

(44) ప్రసంగము— గురువులను కీర్తించుట 'ప్రసంగ' మనబడును.

(45) ద్యుతి— తిరస్కారసహితమగు వాక్యము 'ద్యుతి' అనబడును.

(46) ఖేదము— శరీరమునందును, మనస్సునందును కలిగిన శ్రమము 'ఖేద' మనబడును.[21]

(47) ప్రతిషేధము(నిషేధము-కాశీ, బొంబాయి ముద్రణములపాఠము)— అభీష్టార్థసిద్ధి భంగపడుట 'ప్రతిషేధ' మనబడును.

(48) విరోధనము— కార్యమునకు నాశము కలుగు పర్యంతమువచ్చుట 'విరోధన' మనబడును. (సంరంభముతోకూడిన ఉత్తరోత్తర భాషణము 'విరోధ' మనబడునని కాశీముద్రణ పాఠము.)

(49) ఆదానము— బీజకార్యము (బీజఫలము) సన్నిహిత మగుట 'ఆదాన' మనబడును. (అనగా ఫలము సమీపమునందుండుట,)

(50) ఛాదనము— దుష్టమైన అర్థముకూడ కలిగిన అపమానముచే బహుమానింపబడినచో ఆ వాక్యార్థము 'ఛాదన' మనబడును. [నాటకలక్షణరత్న కోశము ననుసరించి దీనిని 'సాదన' మనుట సమంజసమని డా. ఘోష్ అభిప్రాయ పడెను. కాని, అవమాన కళంకమును ఆచ్ఛాదించునదగుటచే 'ఛాదన' మనుటయే యుక్తము.]

---

21. మానసిక, కాయిక భేదములచే ఖేదము రెండు విధములుగా ఉండునని తెలియవలెను. శ్రమ-ఉద్వేగ-వితర్క-లజ్జాదులు వ్యభిచార భావములుగా పూర్వము నిరూపితములై ఉన్నవి. ఇచ్చట ప్రయోజన భేదము ఉండుటచే మరల సంధ్యంగములుగా గణింపబడినవి [అభినవభారతి 3 వ సం - పుట 55.]

(51) ప్రరోచన— నిర్వహింపబడనున్న అర్థమును ముందుగా ప్రదర్శించుట 'ప్రరోచన' అనబడును."

**నిర్వహణసంధ్యంగములు**

5. నిర్వహణ సంధ్యంగములు— (1) సంధి, (2) విబోధము, (3) గ్రథనము, (4) నిర్ణయము, (5) పరిభాషణము, (6) ధృతి, (7) ఆనందము, (8) సమయము, (9) ప్రసాదము, (10) ఉపగూహనము, (11) భాషణము, (12) పూర్వవాక్యము, (13) కావ్యసంహారము, (14) ప్రశస్తి అను ఈపదునాలుగును నిర్వహణ సంధ్యంగములు—

(52) సంధి—ముఖసంధిలో చెప్పబడిన కావ్యార్థము ఫలోన్ముఖమై సన్నిహితమగుట 'సంధి' అనబడును.

(53) విబోధము (నిరోధము-అని బరోడా, బొంబాయి ముద్రణముల పాఠము)—యుక్తితో కార్యమునన్వేషించుట 'విబోధ' మనబడును.

(54) గ్రథనము-- కార్యముల ఉపక్షేపము 'గ్రథన' మనబడును. (అనగా అవిజ్ఞాతములుగా సూచితములయిన కార్యవిశేషములనన్నింటిని ఏకార్థకములగునట్లు కూర్చుట).

(55) నిర్ణయము— అనుభూతమైన అర్థమును చెప్పుట 'నిర్ణయ' మనబడును.

(56) పరిభాషణము— అపరాధములను పరస్పరము వెల్లడిచేయుట 'పరిభాషణ' మనబడును.

(57) ధృతి (ద్యుతి-కాశీ, బరోడాముద్రణముల పాఠము)—క్రోధాదులను సామర్థ్యముతో శమింపజేయుట 'ధృతి' అనబడును.

(58) ఆనందము— అర్థములన్నియును చేకూరుట 'ఆనంద' మనబడును.

(59) సమయము— దుఃఖము తొలగుట 'సమయ' మనబడును.

(60) ప్రసాదము— శుశ్రూషాదులవలనకలిగిన ప్రీతి 'ప్రసాద' మనబడును.

(61) ఉపగూహనము-- అద్భుత సంప్రాప్తి 'ఉపగూహన' మనబడును.

22. ఈ అంగమును 'యుక్తి' అని కొందరు వ్యవహరింతురట. ఇట్లు ఉద్దేశక్రమమును విడిచిపుచ్చుటనుబట్టి అంగముల క్రమములో విధిపూర్వకమైన నియమము లేదని తెలియవలెను. కొంద రాలంకారికులు ఉద్దేశక్రమవిపర్యాసమునకు గల ఈ అభిప్రాయమును తెలిసికొనలేకపోయిరి [అభినవభారతి - 3 వ సం - పుట 56]. కొందరు ఈ అంగములలో ఏదేని ఒక అంగమును విడిచి, 13 అంగములనే ఇందు గణింతురు. మరికొందరు ప్రరోచనను విడిచిపుచ్చి ఇందు 13 అంగములను మాత్రమే గణింతురు.



(62) భాషణము—సామదానాదులతో కూడిన సంభాషణము 'భాషణ' మనబడును[23].

(63) పూర్వవాక్యము— యథోక్తార్థప్రదర్శనము 'పూర్వవాక్య' మనబడును (అనగా పూర్వము చెప్పినదానిని మరల స్మరించుట).

(64) కావ్యసంహారము—వరదానసంప్రాప్తి 'కావ్యసంహార' మనబడును.

(65) ప్రశస్తి[24]—నృపునకును, దేశమునకును శాంతిని కోరుట 'ప్రశస్తి' అనబడును*.

**సంధ్యంగ సమీక్ష**

రస-భావములను దృష్టియందుంచుకొని కావ్యకుశలులైన కవులు నాటకమునందు ఆయా సంధులలో యోగ్యములగు సంధ్యంగములను కూర్చవలెను[25]. కార్య

23. 31 వ సంధ్యంగమైన 'సంగ్రహము' కూడ సామ-దానాది సంపన్నమే. అట్టిది మరల ఇచ్చట తప్పక కూర్పబడవలెను కాన శబ్దాంతరముచే (నామభేదముచే) ఇది ఇచ్చట చెప్పబడినదని గ్రహించవలెను. సామదానాదు లనుటలోని 'ఆది' పదముచే గ్రహింపదగిన భేద-దండాద్యుపాయములను స్పష్టమార్గమున చెప్పుట అనుచితము కావున గర్భసంధ్యుక్త సామాద్యుపాయముల ననువదించుటమాత్ర మిచట చేయదగును. [అభినవభారతి - 3 వ సం - పుటలు 59-60]

24. అభినవగుప్తాదులు ప్రశస్తినే 'భరతవాక్యము'నుగా పరిగణించినట్లు కన్పట్టుచున్నది. ఇన్ని అంగములు వివరింపబడినను 'భరతవాక్యము' అను పేర ప్రసిద్ధినొందిన పదమునకు వివరణమిందులేదు. అభినవగుప్తుడు రత్నావళియందలి భరతవాక్యమునే ప్రశస్తి కుదాహరణముగా నొసంగెను. ప్రశస్తి-భరతవాక్యముల స్వరూపములను గూర్చి "భరతవాక్యము" అను నా వ్యాసములో చర్చచేసియున్నాను.["పరిశోధన" - సం. V-1955]

*[కాశీముద్రణమునందు-21వ అధ్యా—71-105 శ్లో; బొంబాయిముద్రణమునందు 19వ అధ్యా—68-101 శ్లో; బరోడాముద్రణమునందు 19వ అధ్యా—69-104 శ్లో.]

25. కావ్యకుశలుడనగా ప్రబంధనిర్మాణదక్షుడగు కవి అని అర్థము. ఒక్కొక్క పద్యమును అల్లెడివాడు కాని, పదేసి పద్యము లల్లెడి ముక్తకకవి కాని ప్రబంధనిర్మాణదక్షుడు కాజాలడు; వానికి సంధి-సంధ్యంగవిన్యాస చమత్కారము తెలియనే తెలియదు. ఇంక, ప్రబంధయోజన సమర్థుడగు కవియే సంధ్యంగసంయోజన యోగ్యతను గుర్తింపగలడు. ఈ సంధ్యంగసంయోజనము రస - భావాపేక్షితముగా సాగవలయును. రస - భావానుగుణముగా, తచ్చమత్కారాత్మకముగా ఆ యా సంధులందు తదుచితములైన సంధ్యంగములను కూర్చుటయే కౌశలము. అట్టి కౌశలముతో నిర్మింపబడిన కావ్యమే ప్రీతి - వ్యుత్పత్తులను కలిగించును. కుశలుడైన కవి పట్టిపట్టి సంధ్యంగములను కూర్చడు. అతడు ఏకరసావహిత మనస్కుడైనప్పుడు వాని ప్రయత్నము లేకయే అహమహమికతో ఆ అంగములు తత్తదుచితస్థానములందు పొందుపడుచుండును. సంధులు అవస్థాపరతంత్ర

మును, అవస్థను గుర్తెరింగి సంధులయందు ఈ అంగములను సంమిశ్రములుగా కాని, ద్వి-త్రియోగముతో కాని కూర్చవచ్చును."[26]

## సంధ్యంతరములు[27]

ప్రయోజనయోగముచే అంగములకు సంబంధించిన సంధివిశేషములు ఇరువది ఒక్కటి కలవు ; వీనినే సంధ్యంతరము లందురు—(1) సామము, (2) భేదము, (3) దండము, (4) ప్రదానము, (5) వధము, (6) ప్రత్యుత్పన్నమతిత్వము, (7) గోత్రస్ఖలితము, (8) సాహసము, (9) భయము, (10) హ్రీ (=సిగ్గు ;

ములు. ఆ అవస్థానము రస-భావాపేక్షము అని తెలియవలెను. [అభినవభారతి - 3వ సం - పుటలు 61-62]

26. ఆ యా సంధులలో యోగ్యములగు సంధ్యంగములను కూర్చవలెనని పైని చెప్పబడినది. యోగ్యతను, ఆవశ్యకతను బట్టి ఒక సంధిలో చెప్పబడిన అంగములను ఇంకొక సంధిలో కూర్చవచ్చునని దీని అభిప్రాయము. ముఖసంధి యందు చెప్పబడిన 'యుక్తి' గర్భ సంధియందును ఉపయుక్తమగు చుండుట ఇందుల కుదాహరణము. అంతియే కాక సంద ర్భానుకూలతను బట్టి ఒకే అంగమును ఆ సంధియందే రెండు, మూడు సార్లు కూర్చ వచ్చును. మూడుసార్లు మించి కూర్చినచో వైరస్యము కలుగునని తెలియవలెను. అనవసర ములనుకొనిన అంగములను కొన్నింటిని విడిచివేయవచ్చును.

27. "సంధులయందలి అంగములకు అశైథిల్యము సిద్ధించుట కెడనెడ మరికొన్ని సంధులను కూర్చవలెననియు, అవియే సంధ్యంతరము లనబడు" ననియు సింగభూపాలుడు తెలిపినాడు [రసార్ణవసుధాకరము— శ్రీ బులుసువారి అనువాదము - పుటలు 793 - 794]. అభినవగుప్తుని అభిప్రాయముకూడ ఇట్లే ఉన్నది. సంధ్యంతరములు సామాన్యముగా చెప్పబడిన ఉపక్షేపాది సంధ్యంగముల యొక్క విశేషములనదగు అవాంతరభేదములే. ఉదా: వేణీసంహారమున క్రోధరూపమగు ఉపక్షేపము, రామాభ్యుదయమున భయాత్మకమగు ఉపక్షేపము అనురీతిని వివిధ విశేషములతో ఉపక్షేపాదులు కానవచ్చుచున్నవి అని కొందరు అందురు. భరతుడుకాని, అభినవగుప్తుడు కాని వీనికిఉదాహరణముల నొసంగలేదు. సింగభూపా లుడుమాత్ర మొసంగెను. "దశరూపక కారు డనాలోచితముగ ఈసంధ్యంతరములకు సంధ్యం గములందంతర్భావమునుచెప్పెను. అదినాకు సమ్మతముకా"దని సింగభూపాలుడు చెప్పెను.

సంధ్యంగములవలె సంధ్యంతరములును విభావానుభావవ్యభిచారిస్వరూపములే అనియు, ఇవి ప్రయోగమునకు సముజ్జ్వలత నాపాదించుననియు తెలియవలెను. వీనిలో సామాదులు వీరమున ఉజ్జ్వలతాహేతువులు. అట్లే రౌద్రమున వధ ఉజ్జ్వలతాహేతువు. ప్రత్యుత్పన్నమతిత్వము 'మతి' లక్షణవ్యభిచారిరూప మగుచున్నది. గోత్రస్ఖలనము ఈర్ష్యా విప్రలంభమునం దెల్ల ఉపయుక్తమగును. సాహసము వీరాదులందును, చాపలము హాస్యము నందును ఉపకారి. ఓజ మనగా తేజస్సు. ఇది సామాన్యాభినయమందు (22 వ అధ్యా.) వివరింపబడును. సంవరణ మనగా అవహిత్థము. చిత్ర మనగా విస్మయము లేదా శిల్పవిశే షము. [అభినవభారతి - 3 వ సం - పుట 63]



ధీ-అని కాశీముద్రణ పాఠము), (11) మాయ, (12) క్రోధము, (13) ఓజస్సు, (14) సంవరణము, (15) భ్రాంతి, (16) హేత్వపధారణము (అవధారణము-అని కాశీముద్రణ పాఠము), (17) దూత, (18) లేఖ, (19) స్వప్నము, (20) చిత్రము, (21) మదము.

## అర్థోపక్షేపకములు[28]

ఇంక అర్థోపక్షేపకము లైదు విధములు—(1) విష్కంభము, (2) చూలిక, (3) ప్రవేశకము, (4) అంకావతారము, (5) అంకముఖము. వీని లక్షణములను వివరింతును—

1. విష్కంభము (= విష్కంభకము)— దీనిని మధ్యమ పురుషులు ప్రయోగించవలెను. నాటకముయొక్క ముఖసంధియందు మాత్రమే ఇది ప్రయుక్త మగును. ఇందు పురోహిత-అమాత్య-కంచుకులలో ఎవరైనను ఉండవచ్చును.

విష్కంభము శుద్ధ-సంకీర్ణ భేదములచే రెండు విధములు— (1) కేవలము మధ్యమపాత్రప్రయుక్తమగునది 'శుద్ధ విష్కంభ' మనబడును. (2) నీచ-మధ్యమ పాత్రలచే ప్రయుక్త మగునది 'సంకీర్ణ విష్కంభ' మనబడును.

2. చూలిక— యవనిక లోపల ఉన్న సూతాదులచే అనేక విధములుగా అర్థము సూచింపబడుట 'చూలిక' అనబడును.

3. ప్రవేశకము— అంకాంతరానుసారియై (రెండంకముల మధ్యమాత్రమే ఉండును ; అనగా ప్రథమాంక ప్రారంభమున ఎన్నడును ఉండదు) బిందువుయొక్క సంక్షేపార్థమును వివరించునది 'ప్రవేశక' మనబడును.

ఇది ఉత్తమ-మధ్యమ పాత్రలచే ప్రయుక్తము కారాదు. మరియు ఇది అను దాత్త వచనోపేతమును, ప్రాకృత భాషా-ఆచార సంయుక్తమును కావలయును [ఈ రెండు వాక్యములకును మూలమైన శ్లోకము బరోడా ముద్రణమందు లేదు].

28. ఇతివృత్తము లేదా వస్తువు సూచ్యము, అసూచ్యము (=ప్రదర్శనీయము) అను భేదములచే రెండు విధములు. రసములేనిది అనగా నీరసమయినది ప్రదర్శింపబడరాదు. అది సూచ్యము కావలెను. ఈ సూచనము ఐదు విధములుగా జరుగవచ్చును. ఇట్లు సూచించు విధములను సూచకములు లేదా అర్థోపక్షేపకము లందురు. ఈ అర్థోపక్షేపకములను వివ రించు శ్లోకములు ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి. అభినవగుప్తుడు వీని నిచ్చట వ్యాఖ్యా నించలేదు. వీని అర్థము కొంత దశరూపాధ్యాయమందే వివరింపబడినది. అచ్చటి శ్లోకము లను అభినవగుప్తుడు వ్యాఖ్యానించియున్నాడు. ఈ శ్లోకములను "కోహలమతానుసార ముగా లేదా సంగ్రహకారమతానుసారముగా ఎవరో ఇచ్చట చేర్చిఉందురు. అంక ముఖ నిర్వచనశ్లోకము నిజముగా కోహలునిదే" అని శ్రీ మా. రామకృష్ణకవిగారు తెలిపి నారు. [నా. శా - 3 వ సం - పుట 64 - అధస్సూచిక]

4. అంకావతారము— ప్రయోగము ననుసరించి బీజార్థయుక్తియుక్తముగా అంకాంతమందలి కథయే తరువాతి అంకమునందు అనుస్యూతముగా కొనసాగుట 'అంకావతార' మనబడును.

5. అంకముఖము (=అంకాస్యము)— తరువాతి అంక ప్రారంభమందలి కథ పూర్వాంకాంతమునందే స్త్రీచేకాని, పురుషునిచేకాని సూచింపబడుట 'అంకముఖ' మనబడును.*

లాస్యాంగములు[29]

పైనిచెప్పిన సంధ్యంగములే కాక 'లాస్య' విధియందు చెప్పబడిన అంగములు కూడ నాటకమునందు ఉపయుక్తములగును. నాటకమునం దుపయుక్తములగు

*[కాశీముద్రణమునందు 21వ అధ్యా—106-116 శ్లో ; బొంబాయిముద్రణమునందు 19వ అధ్యా—101-116 శ్లో ; బరోడాముద్రణమునందు 19 వ అధ్యా—104-116 శ్లో.]

29. అర్వాచీనాలంకారికులు లాస్యాంగములను 'భాణ' స్వరూపమును వివరించునప్పుడే వివరింపసాగిరి. అంతమాత్రమున ఇవి ఒక్క భాణమునకు మాత్రమే సంబంధించినవని తలంచరాదు. నిజమున కివి అన్నియును అందుండవు కూడను.

సుకుమారాభినయము 'లాస్య' మనబడుచున్నది. పార్వతీకృతమైన సుకుమారాభినయము 'లాస్య' మనబడునని అభినవగుప్తుడు అభిప్రాయపడినట్లు చెప్పవచ్చును.

ఆదిలో కరణాంగహారములను స్త్రీ లలితముగా ప్రదర్శించుట మాత్రమే లాస్యమయి ఉండును. తరువాత ఇది పదార్థాభినయాత్మకమై ఉండును. ఈ రెండు అవస్థలందును లాస్యము ఏకహార్యమే. తరువాత ఇందు పెక్కు పాత్రలు చేరుట కూడ తటస్థించినది. ఈ విధానము పిండీ బంధములందు కన్పట్టుచున్నది [4 వ అధ్యాయమును చూడవలెను]. తరువాత ఈ లాస్యము నాటకమందు కూడ ఉపయుక్తము కాదొడగినది. అట్టి లాస్యస్వరూపమే ఇచ్చట వివరింపబడినది.

'లాస్యాంగము' అనగా ఒక విధమగు 'ఏకాంకిక' అని స్థూలముగా చెప్పవచ్చును. 'లాస్యాంగ' మనగా లాస్యమునందలి ఒక అంగము లేదా భాగము అని అర్థము చెప్పుటకంటె 'లాస్యము అంగముగా కలిగినది లాస్యాంగము' అని అర్థము చెప్పుట సమంజసము [18 వ అధ్యాయాంతమున వీథ్యంగనిర్వచనమును కూడ చూడవలెను]. కావున, పది లాస్యాంగము లనునప్పుడు పది లాస్యభేదము లని అర్థము చెప్పుట సమంజసమని డా. ఘోష్ మొదలగువారి అభిప్రాయము [నా. శా. ఆంగ్లానువాదము - పుట 387 అధస్సూచికలు]. లాస్యము భాణాకృతి కలదని తెలియవలెను. అనగా దానివలెనే ఏకపాత్ర ప్రయోజ్యమును, వివిధ భావోపేతమును అగుచున్నది. మరియు ప్రకరణమువలె ఊహ్యకావ్యము. [118 వ శ్లో. అధిక పాఠము] ఈ లాస్య స్వరూపము 31 వ అధ్యాయమందు వివరింపబడును.

4 వ అధ్యాయమందు లాస్యమను పదము లేకపోయినను ఇచ్చటను, 31 వ అధ్యాయమందును ఇది కలదు. భరతుడు 'నృత్య' మను పదమును వాడకపోయినను లాస్య



అంగములకంటె భిన్నములైన లాస్యాంగములు భాణమునందువలెనే ఏకపాత్ర ప్రయోజ్యములు. ఇప్పుడు, నాటకమునం దుపయుక్తమగు లాస్యాంగస్వరూపమును వివరింతును. లాస్యము పది విధములు[30]—

(1) గేయపదము, (2) స్థితపాఠ్యము, (3) ఆసీనము, (4) పుష్పగండిక, (5) ప్రచ్ఛేదకము, (6) త్రిమూఢకము, (7) సైంధవకము, (8) ద్విమూఢకము, (9) ఉత్తమోత్తమకము, (10) ఉక్తప్రత్యుక్తము.

1. గేయపదము— ఆసనములం దుపవిష్టులైన (నాయిక ఆసనమం దుపవిష్టురాలు కాగా—అని కాశీముద్రణ పాఠము) గాయనులు తంత్రీ-భాండ వాద్యసహితముగా, శుష్క (అభినయశూన్యముగా) గానముచేయుట 'గేయపద' మనబడును (ఉదా : నాగానందమునందు ప్రథమాంకమున మలయవతి వీణపై పాడుట). ప్రియగుణాన్వితమైన గేయమును సాంగోపాంగ విధానముచే అభినయించుటయును 'గేయపద' మనబడును.

విధానమంతయును నృత్యమే. నృత్తమువలె, నృత్యము కూడ పై విధముగా నాట్యమం దుపయుక్తమగునని తెలియవలెను [1వ అధ్యాయాంతమందలి మొదటి రెండు విశేషాంశములను, 4 వ అధ్యాయాంతమందలి మొదటి విశేషాంశమును కూడ చూడవలెను]. లాస్యమనునదియెల్ల కైశికీవిజృంభితముగా ఉండునని గ్రహించవలెను.

30. లాస్యాంగములు పది అని నిర్దిష్టమైనను ఇందు 12 లాస్యాంగములు వివరింపబడినవి. కాని లాస్యము దశాంగమనియు, దశవిధమనియు ప్రసిద్ధినందియున్నది. ఇట్లు పదివిధములచేతనే లాస్యస్వరూపము సర్వమును సంగృహీతమైనదనియు, చిత్రపద - భావికములను చెప్పుట అనవసరమనియు అభినవగుప్తుడు తెలిపెను—

కైశిక్యుపయోగియును, రసోపకారియును అగు లాస్యసంభూతవైచిత్ర్యమెల్ల పది విధములచేతనే సంగృహీత మగుచున్నది. ఈ వైచిత్ర్యమనునది ప్రధానముగా మూడు విధములు—చిత్తవృత్త్యంశగతము, విభావాద్యంశగతము, ఉపరంజకభావగతము. వీనిలో ప్రచ్ఛేదకమువలనను ఉత్తమోత్తమకమువలనను చిత్తవృత్త్యంశగతమైన వైచిత్ర్యము సిద్ధించును. విభావాద్యంశగతమగు వైచిత్ర్యము కూడ లాస్యాంగమువలన సిద్ధించును. ఎట్లన సైంధవకమువలన కాక్వాద్యంశము, స్థితపాఠ్యముచే లక్షణగుణాద్యంశము, త్రిమూఢకముచే అనువృత్తాంశము, పుష్పగండికచే ఆహార్యవైచిత్ర్యమే కాక ఉపరంజకగీతాతోద్యవైచిత్ర్యమును, ఆసీనమువలన సాత్వికాంశము, గేయపదమువలన సర్వాతోద్యవైచిత్ర్యము, ఉక్తప్రత్యుక్తమువలన వాచికము, ద్విమూఢకమువలన ఆంగికవైచిత్ర్యము ఉత్తమోత్తమకమువలన వ్యభిచారిభావ వైచిత్ర్యమును సిద్ధించును. అనగా దశవిధ లాస్యాంగములచేతనే త్రివిధవైచిత్ర్యమును సిద్ధించుచుండగా సిద్ధింపని వైచిత్ర్యమేమియును వేరుగా లేదుకావున లాస్యాంగములు పది అనుటయే న్యాయ్యము. (అనగా 12 అంగములని అంగీకరించ నక్కరలేదని తాత్పర్యము). [అభినవభారతి - 3 వ సం - పుట 77]

2. స్థితపాఠ్యము— ఒంటరిగాఉన్న యువతి మదనానలతప్తాంగియై కూర్చుండి, రసోపయోగిగా ప్రాకృతమును పఠించుట 'స్థితపాఠ్య' మనబడును. (ఉదా: 'రత్నావళి' యందు ద్వితీయాంకమున సాగరికా వచనములు). ఈ స్థిత పాఠ్యము బహుచారీసమాయుక్తమును, పంచపాణి - కలానుసారియును లేదా చచ్చుత్పుటయుక్తమును కావలయును [ఇది బరోడా ముద్రణమునందలి అధిక పాఠము.]

3. ఆసీనము— సర్వాతోద్యరహితముగా (జిహ్మదృష్టి నిరీక్షణముతో- అని కాశీ, బొంబాయి ముద్రణముల పాఠము), అప్రసారితగాత్రముతో, చింతా-శోకసమన్వితముగా కూర్చుండుట 'ఆసీన' మనబడును. (ఉదా: 'రత్నావళి'యందు మూడవ అంక ప్రారంభమున రాజు ప్రవేశము.)

4. పుష్పగండిక— గానాశ్రిత మగు గేయమును వివిధ నృత్తములతో, పురుషచేష్టలతో ప్రదర్శించుట 'పుష్పగండిక' అనబడును (పుష్పగంధిక—సఖుల వినోదార్థము స్త్రీ, పురుషవేషమును తాల్చి లలితముగా సంస్కృతమును పఠించుట 'పుష్పగంధిక' అనబడును— అని కాశీ - బొంబాయి ముద్రణముల పాఠము. ఉదా: 'రత్నావళి' యందలి ద్వితీయాంకమందు దీని కుదాహరణము కలదు.) వివిధములైన నృత్తములు, ఆతోద్యసంయుతమగు గేయము, స్త్రీ పురుషవేషమున చరించుట అను ఈ మూడును ఎచ్చట ఉండునో అది 'పుష్పగండిక' అనబడును.

5. ప్రచ్ఛేదకము— చంద్రాతపాహతలైన స్త్రీలు ప్రియులను, వారు విప్రియకారులైనప్పటికిని, కలియుట 'ప్రచ్ఛేదక' మనబడును.

6. త్రిమూఢకము— పరుషములును తీవ్రములును కాని పదములచేతను, సమవృత్తములచేతను అలంకృతమైనదియును, పురుషభావాఢ్యమును అయిన నాట్యము 'త్రిమూఢక' మనబడును ('రత్నావళి' యందలి ద్వితీయాంకమందు దీని కుదాహరణము కలదు.)

7. సైంధవకము— వీణావాద్యాదిక్రియాన్వితమును, ప్రాకృతవచనయుక్తమును అగుచు విభ్రష్టసంకేతముగల పాత్రతో కూడిన నాట్యము 'సైంధవక' మనబడును. ('రత్నావళి' యందలి ద్వితీయాంక మిందులకు ఉదాహరణము. "రూపవాద్యాదిసంయుతమును, పాఠ్యవివర్జితమును ఐన నాట్యము 'సైంధవ' మనబడునని నాట్యకోవిదులందురు"— ఇది బరోడాముద్రణమునందలి అధికపాఠము).

8. ద్విమూఢకము— గీతాంగకములైన ముఖ-ప్రతిముఖములతో ఉపేతమును, చతురశ్రపదక్రమమును, శ్లిష్టభావరసోపేతమును, వైచిత్ర్యార్థమును అగు



నాట్యము 'ద్విమూఢక' మనబడును ('రత్నావళి' యందలి ద్వితీయాంక మిందుల కుదాహరణము. "శుభార్థగీతాభినయమును, చతురశ్రపదక్రమమును, స్పష్టభావరసోపేతమును, వ్యాజచేష్టమును అగునది 'ద్విమూఢక' మనబడును"—అని కాశీ, బొంబాయి ముద్రణముల పాఠము).

9. ఉత్తమోత్తమకము— వివిధరససంశ్రయమును, విచిత్రశ్లోకబంధమును హేలా-హావ విచిత్రితమును అగునది 'ఉత్తమోత్తమక' మనబడును. ('రత్నావళి' యందలి తృతీయాంకమునందు దీని కుదాహరణము కలదు.)

10. ఉక్తప్రత్యుక్తము— కోపప్రసాదజనితమును, సాధిక్షేపపదాశ్రయమును, చిత్రగీతార్థయోజితమును అగునది 'ఉక్తప్రత్యుక్త' మనబడును. ('రత్నావళి' యందలి తృతీయాంకమునందు దీని కుదాహరణము కలదు.)

11. చిత్రపదము (విచిత్రపదము-అని కాశీ, బొంబాయి ముద్రణముల పాఠము)- మదనానలతప్తాంగియైన స్త్రీ ప్రియుని ఆకృతినిచూచి మనస్సును వినోదింపజేసికొనుట 'చిత్రపద' మనబడును.

12 భావికము(భావితము-అని కాశీ, బొంబాయిముద్రణములపాఠము)- మదనానలతాపితయైన స్త్రీ ప్రియుని స్వప్నమందు కాంచి వివిధభావములను ప్రకటించుట 'భావిక' మనబడును.

నాటకమునం దుపయుక్తమగు లాస్యస్వరూపమును మాత్రమే ఇచ్చట వివరించితిని. లాస్యాంగముల సంపూర్ణలక్షణములను ప్రయోగజ్ఞులు లాస్యవిధానమందు తెలిసికొనగలరు. ప్రసంగము పరాహతమగు నను భయముచే వాని నిచ్చట సమగ్రముగా వివరించలేదని తెలియవలెను*.

నాటకలక్షణ సంగ్రహము

నాటకము ఐదుసంధులను, నాలుగు వృత్తులను, అరువదినాలుగు సంధ్యంగములను, 36 లక్షణములను కలిగియుండవలెను; గుణ-అలంకారములచే అలంకృతము కావలెను; మహారసమును, మహాభోగమును, ఉదాత్తవచనాన్వితమును, మహాపురుషచరితాశ్రయమును, సాధ్వాచారజనప్రియమును, సుశ్లిష్టసంధి సంయుక్తమును కావలెను; సుప్రయుక్తమును, సుఖాశ్రయమును కావలెను; మృదుశబ్ద-అర్థములను ప్రదర్శించునది కావలెను.[31] ఇట్లు కవి నాటకమును చక్కగా నిర్మించవలెను.

*[కాశీముద్రణమునందు-20వ అధ్యా—136-153 శ్లో; బొంబాయిముద్రణమునందు 18వ అధ్యా—182-192 శ్లో; బరోడా ముద్రణమునందు 19వ అధ్యా—117-138 శ్లో.]

31. ఇచ్చట నాటక మనగా అభినేయకావ్యమాత్రమని గ్రహించవలెను. అనగా నాటకమను పదముచే దృశ్యకావ్యము లన్నియును గ్రహింపబడినవి. ఇచ్చట చెప్పబడినవి

నాట్యస్వరూపము[32]

అవస్థా యా తు లోకస్య సుఖ-దుఃఖసముద్భవా।
నానాపురుషసంచారా నాటకేఽసౌ విధీయతే ॥ 142

న తజ్జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా।
న తత్ కర్మ స వా యోగో నాట్యేఽస్మిన్యన్న దృశ్యతే ॥ 143

యోఽయం స్వభావో లోకస్య నానావస్థాంతరాత్మకః।
సోఽంగాద్యభినయైర్యుక్తో నాట్యమిత్యభిధీయతే ॥ 144

—సుఖ - దుఃఖసముద్భవమును, నానాపురుషసంచారమును అయిన లోకావస్థయే నాటకమందు నిబంధింపబడును.

ఈ నాట్యమునందు కన్పట్టని జ్ఞానముకాని, శిల్పముకాని, విద్యకాని, కళకాని, కర్మకాని, యోగముకాని లేనేలేదు.

నానావస్థాంతరాత్మకమైన లోకస్వభావము అంగాద్యభినయయుక్తమై నాట్యమనబడును.

దేవతానామృషీణాంచ రాజ్ఞాం చోత్కృష్టమేధసామ్।
పూర్వవృత్తానుచరితం నాటకంనామ తద్భవేత్ ॥ 145

యస్మాత్ స్వభావం సంత్యజ్య సాంగోపాంగగతిక్రమైః।
ప్రయుజ్యతే జ్ఞాయతే చ తస్మాద్వై నాటకం స్మృతం ॥ 146

—దేవతల, ఋషుల, రాజుల, ఉత్కృష్ట మేధాసంపన్నుల పూర్వవృత్తానుచరితము నాటక మనబడును. ఈ పూర్వవృత్తము, సాంగోపాంగగతిపరిక్రమములతో, స్వభావమును విడిచిన నటులచే ప్రయుక్తమై, అట్లే సామాజికులచే గ్రహింపబడును కాన ఇది నాటకమనబడినది.[33]

సర్వభావములచే, సర్వరసములచే, సర్వకర్మ ప్రవృత్తులచే నానావస్థాంతరోపేత మగునట్లుగా నాటకమును నిర్మించవలెను. అనేక శిల్పజాతములను, అనేక కర్మక్రియలను అశేషముగా ప్రయోక్తలు నాటకమునందు నిరూపించవలెను.

నాట్యము లోకానుసారి[34]

లోకస్వభావమును, నరుల బలాబలములను, సంభోగమును, యుక్తిని బాగుగా పరిశీలించి నాటకమును నిర్మించవలెను. ముందు యుగములందలి (అనగా ద్వాపర-కలియుగము లందలి) నరులు ప్రాయికముగా అజ్ఞులగుదురు. కావున అప్పటివారు ప్రయత్నపూర్వకముగా శాస్త్రాదులను నేర్వవలసియుందురు. లోకము నశించునప్పుడు కర్మలు, శిల్పములు, శాస్త్రములు, విచక్షణ బలములు మున్నగున వన్నియును నశించును. కావున లోకభాషల బలాబలములను పరిశీలించి మృదు శబ్దమును, సుఖార్థమును అగునట్లుగా కవి నాటకమును కూర్చవలెను. చేక్రీడితాది శబ్దములతో కూడిన కావ్యబంధములు కమండలుధరులైన ద్విజులతో కూడిన వేశ్య వలెనే భాసించవు.

ఇంతవరకును దశరూపవిధానమును[35] వివరించితిని. ఇంక వృత్తుల లక్షణములను వివరింతును*

ఏకోనవింశాధ్యాయము సమాప్తము

---

అన్నియును సంభవమాత్రములనియు, ఇవి అన్నియును అన్నింటను ఉండవనియు కూడ గ్రహించవలెను. కవుల సుఖగ్రహణమునకై దశరూపలక్షణ మిట రాశీకరింపబడినది.

సంధులనగా ముఖాదులు, వృత్తులనగా కైశిక్యాదులు, సధ్యంగములనగా ఉపక్షేపాదులు, కావ్యలక్షణములనగా భూషణాదులు, గుణములనగా శ్లేషాదులు, అలంకారములనగా ఉపమాదులు, మహారసములనగా పురుషార్థోపయోగు లగు శృంగార-వీరాదులు. మహాభోగ మనగా సర్వసంపన్నమై రంజనాప్రధానముగాఉండుట, ఉదాత్తవచనాన్విత మనగా దోష రహితమై గుణమహిత మగుట. మహాపురుషుల చరితల నాశ్రయించినదై సత్పురుషులకు ప్రియమును కలిగించునదిగా ఉండవలెను. 'సుశ్లిష్టసంధి' అనుటలో సంధ్యంగములు సూచితములైనవి. సుప్రయుక్తమనుటలో లాస్యాంగములు సూచితములైనవి. సుఖాశ్రయ మనుటచే ఛందోవృత్త వైచిత్ర్యము సూచితమైనది. మృదుశబ్ద మనుటచే కావ్యమునందు మాధుర్య-ప్రసాద-అర్థవ్యక్తుల నెడి గుణముల ప్రాధాన్యము సూచితమైనది. [అభినవభారతి - 3వ సం - పుట 79]

32. ఇచ్చట చెప్పబడిన శ్లోకములలో రెండు ప్రథమాధ్యాయమందలివే. తక్కిన వాని అర్థము అచ్చట వేరు శ్లోకములందు వివరింపబడియున్నది.

33. ప్రయోగసమయమున ప్రయోక్తలు అనగా నటులు తమ సహజభావమును విడనాడి సాంగోపాంగములయిన గతిపరిక్రమములతో వ్యవహరింతురు కాన ఇది నాటక మనబడినదని సారాంశము. "నట నతౌ" అను సూత్రమునుబట్టి 'నట' పదమునకు 'నమన' మని అర్థము. కాగా 'నాటక' మను పదమునకు స్వభావమును విడిచి ప్రహ్వీభావమున ఉండుట (ఇంకొక రూపమందు ఒదిగిఉండుట) అని అర్థము. [26 వ అధ్యాయమును కూడ చూడవలెను]. సామాజికులును లోకమును చూచి అదియే నాటకమనుకొనరు. ఆ లోకవృత్తము అంగాద్యభినయోపేతమైనప్పుడే వారు దానిని నాటకముగా గ్రహించి ఆనందింతురు.

34. నాట్యము లోకము ననుసరించియే ఉండునని ఇంతకుముందు చాలసార్లు చెప్పబడినది. కవి-ప్రయోక్త లిరువురును ఈ సత్యమును మరవరాదు. చేక్రీడితాది పదముల ప్రసక్తి 16 వ అధ్యాయాంతమున కూడ కలదు.

చేక్రీడిత శబ్దము క్రీడధాతువునుండి పుట్టినశబ్దము. ఇయ్యది వ్యాకరణవిశేషజ్ఞులకుకాని సామాన్యులకు పరిచితముకాదు. యఙంతములు, యఙ్లుగంతములు మున్నగునవి సంస్కృత

## విశేషాంశములు

### 1. ఇతివృత్తము : ఆధికారిక-ప్రాసంగికములు

భరతుడు పంచసంధులను రూపకపరముగా మాత్రమే వివరించెను. భరతుని తరువాతి ఆలంకారికులగు భామహాదులు (క్రీ. శ. 600-750) కావ్యముకూడ పంచసంధియుతము కావలెనని చెప్పియు వాటిని వివరించలేదు. పంచసంధులను కావ్యపరముగా అన్వయించుటకు పూనుకొనినవారిలో ఆనందవర్ధనుడు ముఖ్యుడు. కాని తరువాతివారు, అభినవగుప్తునితో సహా, మరల పంచసంధులను రూపకపరముగానే వివరింపసాగిరి. 14 వ శతాబ్ది ప్రాంతము వారగు విశ్వనాథాదులు మరల పై ప్రసంగమును తెచ్చి మహాకావ్యమందును నాటక సంధులను, తదంగములను యథోచితముగా కూర్చవలెనని నిర్దేశించియున్నారు.

"ఇతివృత్తము నాట్యశరీర" మని భరతుడు చెప్పిన శ్లోకమునకు అభినవగుప్తుడు చేసిన వ్యాఖ్యానము గమనార్హము— అనభినేయమైన కావ్యమునకు 'వృత్తము' (=కథ=story) శరీరము; అభినేయమైనకావ్యమునకు (దశరూపమునకు) 'ఇతివృత్తము' (well-knit-plot) శరీరము. 'ఇతి'అనగా 'వివరింపబడనున్న పంచసంధులతో అలంకరింపబడిన' అని అర్థము.

మానవశరీరమందు అవయవవిభాగమెట్లుకలదో అట్లే రూపకశరీరమగు ఇతివృత్తము నందును సంధులను పేర విభాగముకలదని తెలియవలెను. మొత్తమునకు పంచసంధులనునవి రూపకేతివృత్తములకే ఎక్కువగా సంబంధించియుండుటస్పష్టమగుచున్నది. ఆలంకారికు లెవ్వరును సంధులకు కావ్యములనుండి ఉదాహరణము లిచ్చినట్లు కన్పట్టదు.

ఈ పంచసంధులను గూర్చి తెలిసికొనుటకుముందు కొన్ని ముఖ్యాంశములను గూర్చి తెలిసికొనవలసియున్నది. కావున వానిని ముందుగా వివరింతును.

దశరూపకములలో ఏదేని ఒక రూపకమును నిర్మింపదలచుకొన్న కవి (=నాటకకర్త) ముందుగా తదుచితమైన కథను ఎన్నుకొనును. ఒకవేళ కథనే ముందుగా ఎన్నుకొన్నచో తదుచితమైన రూపకస్వరూప మేదియో తరువాత నిర్ణయించుకొనును. సాధారణముగా 'కథ' అనునది మూడు విధములుగా ఉండును—ప్రఖ్యాతము అనగా పురాణేతిహాసాది ప్రసిద్ధము (పూర్వులు ప్రఖ్యాతమునకే ఎక్కువ ప్రాధాన్యము నొసంగిరి); ఉత్పాద్యము అనగా కవికల్పితము; మిశ్రమము అనగా కొంత ప్రసిద్ధము మరికొంత కల్పితము. కావున నాటకకర్త స్వీకరించెడి కథ పౌరాణికము కావచ్చును, లేదా చారిత్రకము కావచ్చును. లేదా సాంఘికము కావచ్చును. లేదా ఈ మూడు విధములలో ఏవో ఒక విధమును

---

మున మారుమూల మాటలు. ఇట్లే సన్నంతములు తరచు ప్రసన్నార్థములు కావు. [అభినవభారతి - 2 వ సం - పుట 346.]

35. 18, 19 అధ్యాయములు రెండును దశరూప విధానమునకు సంబంధించినవే. 18 వ అధ్యాయము దశరూపముల లక్షణములను వర్ణింపగా ఈ 19 వ అధ్యాయము దశరూపములయొక్క శరీరనిర్మాణరహస్యములను వెల్లడించుచున్నది.

*[ కాశీముద్రణమునందు 21 వ అధ్యా—117-136 శ్లో; బొంబాయి ముద్రణము నందు 19వ అధ్యా—117-133 శ్లో; బరోడాముద్రణమునందు 19వ అధ్యా—139-154 శ్లో.]



గ్రహించి ఆ వాతావరణముతో కూడియుండునట్లుగా కల్పించవచ్చును. కథ ఎట్టిదైనను, సాధారణముగా ప్రతి కథయందును ప్రధానముగా ఒక సాధ్యఫలము ఉండును. అనగా త్రివర్గ మనబడు ధర్మ-అర్థ-కామములలో ఏదియో ఒకదానిని ప్రధానముగా సంపాదించవలెననెడి దృష్టి ఉండును (లక్ష్యవిహీనమైన కార్యమేదియును ఉండదని మనకు తెలిసినదే; ఒకవేళ ఉన్నచో అది ఉన్మత్తుని పనిమాత్రమే); తక్కినవానిలో ఒకటి కాని, రెండును కాని ఆనుషంగిక ఫలములు కావచ్చును.

ఈ ప్రధానఫలమును సాధించువాడు లేదా పొందువాడు ప్రధానపురుషు డగును; అతడే నాయకుడు. వాని చరిత్రము, వాని స్వభావము చిత్రితమగు కథాభాగము ప్రధాన కథ అగును; దానినే ఆలంకారికముగా 'ఆధికారికేతివృత్తము' అందురు. ప్రధానఫలమును సాధించుటలో నాయకునకు కొందరి సాహాయ్యమవసరము కావచ్చును. అట్లు నాయకునకు సహాయపడువారిని 'ఉపనాయకులు' అని అనవచ్చును. వీరిలో ఎవని చరిత్రమైనను ప్రధాన కథకు పోషకముగాఉన్నచో అదికూడ తదనురూపముగా ఉండునట్లు స్వీకరింపబడును. అది ప్రసంగవశమున ప్రసక్తమగునదికాన 'ప్రాసంగికేతివృత్తము' అనబడును. ఇట్లు కవి స్వీకరించిన కథ రెండువిధము లగుచున్నది.

ప్రాసంగికేతివృత్తము పతాకా-ప్రకరీభేదములచే రెండు విధములుగా ఉండును. ప్రధానఫలమును సాధించుటలో నాయకునకు తోడుపడుచు, తన స్వార్థమునుకూడ సిద్ధింపజేసికొను ఉపనాయకుని చరిత్రము 'పతాక' అనబడును. రామాయణ నాటకములందలి సుగ్రీవ- విభీషణుల చరిత్రములు 'పతాక' లకుదాహరణములు. ఇంక కేవలము నాయకునకు తోడ్పడి, ఆపని ముగిసినవెంటనే మరుగుపడిపోవువాని చరిత్రము 'ప్రకరి' అనబడును. జటాయుచరిత్ర మిందులకు చక్కని ఉదాహరణము.

ఇచ్చట ఒక విషయమును గ్రహించవలసియున్నది. నాయకునియొక్క అమాత్యులు మొదలగువారు ఉపనాయకులనబడరు. వారు నాయకపరివారములోనివారు; వారెల్లప్పుడును వాని అధీనమునందే ఉందురు; వా రేపనిచేసినను తమ నాయకునికొరకే చేయుదురు. నాయకుడు ప్రధానఫలమును సాధించుటలో స్వయముగా పాల్గొనవచ్చును, లేదా ఆ ప్రధానఫలమును అమాత్యులద్వారా సాధించుకొనవచ్చును. ఎవరు సాధించినను, ప్రధాన ఫలము ఎవరికి చెందునో అతడే నాయకుడనబడును. అందుచేతనే వత్సరాజు కథలలో ప్రధానఫలము యౌగంధరాయణాది అమాత్యులచే సాధింపబడినను దాని ననుభవించెడి వత్సరాజే నాయకుడగుచున్నాడు.

### 2. సూచ్యము : దృశ్యము

ఏ రూపకమునందైనను నాయకుని చరిత్రమును సంపూర్ణముగా చిత్రించుటకు సాధ్యముకాదు. వాని జీవితములో ఆకర్షణీయమగు ఏదేని ఒక ఘట్టమును మాత్రమే కవి సాధారణముగా ఎన్నుకొనును. ఆ ఘట్టమునందు మరల పెక్కు సన్నివేశములుండును. ప్రధానఫలసంపాదనదృష్టితో చూచినచో ఆ సన్నివేశములందు కొన్ని అనవసరములగును; కవి ఆ సన్నివేశములను విడిచివేయవలెను. అవశ్యకములైన సన్నివేశములేవియో నిర్ణ

యించుకొని, తక్కినవానిని పరిహరించుటకు కవికి అధికారమున్నది. ఇంక ఆవశ్యకములైన సన్నివేశములలో కొన్ని రంగమునందు ప్రదర్శించుటకు బాగుండును. మరికొన్ని ప్రదర్శించుటకు బాగుండవు; అనగా అవి ఆకర్షణీయములుగా ఉండవు. కాని, అందలి విషయములు కథాగమనమునకు ఆవశ్యకములు; అందుచే ఆ సన్నివేశములు అపరిహార్యములు. అట్లు ఆవశ్యకములైన నీరస సన్నివేశములను ప్రత్యక్షముగా ప్రదర్శించక అందలి విషయములను కేవలము సూచింపవలెను.

### 3. అర్థోపక్షేపకములు

ఈ నీరససన్నివేశములందలి విషయములను ఐదు విధములుగా సూచింపవచ్చును. ఆ ఐదు విధములగు సూచనలను 'అర్థోపక్షేపకము'లందురు. ఈ అర్థోపక్షేపకములచే జరిగిపోయిన విషయములను కాని, జరుగనున్న విషయములను కాని, రెండింటిని కాని, దేశ-కాలములను కాని సూచింపవచ్చును—

(1) విష్కంభము—కేవలము మధ్యమ పాత్రలచే (ఇది శుద్ధము), లేదా మధ్యమ-నీచపాత్రలచే (ఇది మిశ్రమము) సూచనము చేయబడు విధానము.

(2) ప్రవేశము—కేవలము నీచపాత్రలచే సూచింపబడు విధానము. ఇది ప్రథమాంక ప్రారంభమున ఉండరాదు. అనగా నీచపాత్రలరంగప్రవేశముతో నాటకము ప్రారంభము కారాదని అభిప్రాయము.

కేవలము పాత్రభేదములను బట్టియే విష్కంభ - ప్రవేశకములకు భేదమును చెప్పుట అంత సమంజసముగా కన్పట్టదు. కాళిదాసాదుల నాటకములను బాగుగా పరిశీలించి చూచినచో ఇతివృత్తమునందు కవి కావించిన మార్పులను, ఆధికారికేతివృత్తమునకు సంబంధించిన భూత-భవిష్యద్వృత్తాంతములను సూచించుటకు విష్కంభములు ప్రయుక్తములై యున్నవనియు, తరువాతి అంకమునందు ప్రవేశింపబోవు పాత్రలను, అప్పటి పరిస్థితులను మాత్రము సూచించుటకు ప్రవేశకములు ప్రయుక్తలై యున్నవనియు గుర్తింపగలము. కాని తరువాతివా రిట్టి భేదముమ అంతగా పాటించినట్లు కన్పట్టదు.

(3) చూలిక - తెరలోపలనుండియే సూచించు విధానము.

(4) అంకావతారము - అంకాంతమందలి కథయే తరువాతి అంకమునందును కొనసాగు విధానము.

(5) అంకముఖము (=అంకాస్యము) - పూర్వాంకాంతమందలి పాత్రలు తరువాతి అంక ప్రారంభమందలి కథను సూచించి వెడలిపోవు విధానము.

### 4. రంగమున విషిద్ధములు :

ఈ అర్థోపక్షేపకములను తప్పక ప్రయోగించవలెనను నియమమెచ్చటను లేదు. అవసరములేనిచో మానివేయవచ్చును. నీరసములైన సన్నివేశములనే కాక అశక్యములైన వానిని, అనుచితములైన వానిని కూడ రంగమునందు ప్రత్యక్షముగా ప్రదర్శించరాదు. అందుచే కవి ముందుగానే జాగ్రత్తపడి అట్టివానిని కూడ అర్థోపక్షేపకములచేతనే సూచింప



వలసియున్నది. యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము, సేనల ముట్టడి మొదలగువానిని ప్రత్యక్షముగా ప్రదర్శించరాదు (18 వ అధ్యా.చూడవలెను.) ఇవి ప్రయోగసాధ్యములు కావు; అనగా వీనిని ప్రదర్శించుటలో సౌలభ్యము తక్కువ, శ్రమ అధికము, కలిగెడిఫలము అత్యల్పము లేదా పూజ్యము. అశ్లేశయన - చుంబన - ఆలింగన - అవలేపన - గుహ్యకార్య - దంతచ్ఛేద్య - నఖచ్ఛేద్య - నీవీస్రంసన - స్తనాంతరవిమర్దన - భోజన - సలిలక్రీడాదులనుకూడ రంగమునందు ప్రత్యక్షముగా ప్రదర్శించరాదు. ఇంతియేకాక లజ్జాకరమైన ఏకార్యమును రంగమునందు ప్రదర్శించరాదు. (22 వ అధ్యా. చూడవలెను.) ఇవి అనుచితములు లేదా జుగుప్సావహములు అగు కార్యములు. వీనిని ప్రత్యక్షముగా ప్రదర్శించరాదని చెప్పుచు "తండ్రి, కొడుకు, కోడలు, అత్త కలిసి నాటకమును చూచుచుందురు. కాన అట్టివానిని వర్జించవలె"నని భరతుడు చమత్కరించెను. ఇందు భరతుని లోకజ్ఞతయేకాక హాస్యదృష్టియును గమనార్హములు.

### 5. అన్యథాకల్పనము

ఇంక ప్రదర్శనీయములు అనగా ఆకర్షణీయములు అగు సన్నివేశములు మాత్రమే మిగిలి ఉండును. వీనిలోకూడ అన్నింటిని యథాతథముగా రంగమునందు ప్రదర్శించుటకు వీలుపడదు. ఔచిత్యదృష్టితో కాని, రసపోషణదృష్టితోకాని, నాటకీయతాదృష్టితోకాని, ప్రదర్శన సౌలభ్యమును వాంఛించికాని కొన్ని సన్నివేశములందు కవి మార్పులు చేయవలసియుండును; కార్య - కారణ సంబంధమును నిరూపించుటకై కొన్ని కల్పనలను చేయవలసి ఉండును. (అభిజ్ఞానశాకుంతలమందు దుష్యంతుని మరపునకు దుర్వాసుని శాపమును కారణముగా కవి కల్పించుట ఇందుల కుదాహరణము). అట్లు ఉచితములైన మార్పులను, చేర్పులను చేసికొనుటకు కవికి స్వేచ్ఛయేకాదు, అధికారమును కలదు. ఆధికారికేతివృత్తమునందేకాక ప్రాసంగికేతివృత్తమునందును కవి ఇట్టి మార్పులను చేయవచ్చును.

ఇట్లు ప్రధానఫలసంపాదనమునకు తోడుపడు ముఖ్యసన్నివేశములను మాత్రమే గ్రహించి, ఔచిత్యదృష్టితో వానియందు కూడ మార్పులను కావింపగా ఆధికారికేతివృత్తమునందును, ప్రాసంగికేతివృత్తమునందును కేవలము సారవంతములును, రసవంతములును అగు సన్నివేశములు మాత్రమే మిగులును. వీనినిమాత్రమే అంకములందు నిబంధించవలెను; అవియే ప్రత్యక్షముగా ప్రదర్శింపబడును. అంకములందట్లు కథను నిబంధించుటలో కూడ కొన్ని నియమములను పాటించవలసియున్నది. 18 వ అధ్యాయములో అంకలక్షణమును వివరించినప్పుడు వానిని భరతుడు వివరించియుండెను.

ఆయినచో, సారభూతములగు ఈ సన్నివేశములను ఏ విభాగముతో, ఏ క్రమములో అంకములందు నిబంధించవలెను? అను ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. సంధివిభాగాది వివరణ మీ ప్రశ్నకు సమాధానము కాగలదు.

### 6. కార్యావస్థలు

లోకమున ఎవరేని ఏదేని ఒకఫలమును సాధించుటకు పూనుకొని, దానిని సాంతముగా అనగా ఆ ఫలము సిద్ధించుపర్యంతమును కొనసాగించినచో ఆ కార్యాచరణమునందు ప్రధానముగా ఐదు అవస్థలు మనకు గోచరించును—

(1) దేనిమీదనైనను ఒకదానిమీద ఒకనికి అభిలాష జనింపగానే అతడు దానిమీదనే తన దృష్టిని కేంద్రీకరించును. దానిని మననము చేసి తత్సాధనోపాయముల నాలోచించి, ఒక నిర్ణయమునకు వచ్చును.

(2) సాధనోపాయములు నిర్ణయము కాగానే వానిని ఆచరణలో పెట్టును, అనగా కార్యాచరణమునకు పూనుకొనును.

(3) కొంత ప్రయత్నము జరిగిన తరువాత ఫలము లభించునని కొంత ఆశ పొడముట సహజము. (కాని, ఆశతో పాటు ఆటంకములును ఎదురగుచుండును. ఫలము చేతికందినట్లే కన్పించి మరల దూరమగుచుండును. అయినను దాని సాధించుటకు పట్టుదలతో ప్రయత్నము నిరంతరముగా సాగుచునేఉండును.)

పై మూడు అవస్థలును సర్వకార్యములకును సహజములు. సాధింపదలచుకొన్న ప్రతి ఫలమును విధిగా చేతికందునని చెప్పజాలము. ప్రయత్నము సఫలమైనచో అది సుఖాంతమగును; కాని, విఫలమైనచో అది దుఃఖాంతమగును. అందుచే తరువాతి రెండు అవస్థలును రెండేసివిధములగుచున్నవి.

(4) (అ) కలిగిన ఆటంకములనెల్ల స్వశక్తిచే కాని, దైవబలముచే కాని క్రమముగా తొలగించుకొనుటతో ఫలము తప్పక లభించునను నిశ్చయము కలుగును.
(ఆ) తన శక్తికి మించిన ఆటంకము లెదురై, వానిని తొలగించుకొనుటకు సమర్థుడు కాలేనిచో వానికి ఫలము దూరమగుచుండును.

(5) (అ) ఆటంకము లన్నియును తొలగిన తరువాత ఆతడు ఆశించిన సమగ్ర ఫలమును పొందును.
(ఆ) ఆటంకములను దాటలేనివాడై, చివరకు వానికి లొంగిపోయి శత్రువులచే చంపబడును లేదా తానుగా మరణమును తెచ్చిపెట్టుకొనును.

సమగ్రములగు సర్వకార్యములును పై విధముగా ఐదు అవస్థలను కలిగిఉండును. నాటకముగా మలచుటకు కవి ఎన్నుకొనిన కథకూడ ఇట్లు సమగ్రమే కావలెను. ఇచ్చట ఒక విషయమును గుర్తించవలెను. భారతీయులు రసదృష్టి ప్రధానముగా కలవారగుటచేతను, నాటకము మానవులకు మార్గదర్శకము కావలెనని తలంచిన వారగుటచేతను దుఃఖాంతములగు ఇతివృత్తములను గ్రహించలేదు. అందుచే చివరి రెండవస్థలయందలి రెండవ భేదములు భారతీయ నాటకములందు కన్పట్టవు. అవ్యవస్థితములైన లౌకిక కార్యములందు ఈ దశలన్నియును ఒకవేళ స్పష్టముగా కన్పట్టకపోయినను సువ్యవస్థితములైన నాటకేతివృత్తములం దివి విస్పష్టముగా గోచరింపగలవు. పాశ్చాత్యులుకూడ ఈ అయిదు అవస్థలను గుర్తించియుండుట గమనార్హము. భరతు డీ అయిదు అవస్థలకును నాటకీయముగా పేర్లుపెట్టి, వానిని నిర్వచించెను. ఇవి కథాగమనమునకు అనగా కార్యాచరణకు సంబంధించిన క్రమదశలగుటచే 'కార్యావస్థ' లనబడినవి.

(1) ప్రథమావస్థ 'ప్రారంభము': దీనిని తరువాతి అలంకారికులు 'ఆరంభ' మనిరి. "ప్రధానఫలప్రాప్తినిగూర్చిన బీజానుగుణమగు ఔత్సుక్యము హృదయమందు నెలకొనుట 'ప్రారంభ' మనబడును" (Initial incident). ఈ ఔత్సుక్యము కేవలము నాయకగతమే



కానక్కరలేదు. ప్రధానప్రయోజనమున కనుకూలురగు ఇతరులుకూడ ఈ ఔత్సుక్యమును చూపవచ్చును.

2. ద్వితీయావస్థ 'ప్రయత్నము' : దీనిని తరువాతిఅలంకారికులు 'యత్న'మనినారు. "ఫలప్రాప్తి కన్పడనప్పుడు ఆ ఫలమునుగూర్చిన వ్యాపారము మరింత ఔత్సుక్యవంతమగుట 'ప్రయత్న' మనబడును" (Growth of the action).

3. తృతీయావస్థ 'ప్రాప్తిసంభవము' : దీనిని తరువాతి ఆలంకారికులు 'ప్రాప్త్యాశ' అనినారు. "కొంచెముగా, భావమాత్రముగా, ఫలము ప్రాప్తించుట 'ప్రాప్తిసంభవ' మనబడును" (Turning point or crisis).

4. చతుర్థావస్థ 'నియతఫలప్రాప్తి' : దీనిని తరువాతి ఆలంకారికులు 'నియతాప్తి' అనినారు. "సహకారిసామగ్రీసహితమగు ముఖ్యోపాయము వలన ఫలప్రాప్తి తప్పక కలుగునని భావించుట 'నియతఫలప్రాప్తి' అనబడును" (Resolution or falling action).

5. పంచమావస్థ 'ఫలయోగము' : దీనిని తరువాతి ఆలంకారికులు 'ఫలాగమ' మని నారు. "ఇతివృత్తము యొక్క అంతమునందు నాయకు డాశించినదియును, నాయకునకు ఉచితమగునదియును అగు ఫలము సమగ్రముగా లభించుట 'ఫలయోగ' మనబడును." (Conclusion or Catastrophe).

భరతుని నిర్వచనములను పరిశీలించినచో ఈ అవస్థలనునవి నాయకుని మనోభావములనికూడ పేర్కొనవచ్చును. ఫలార్థులచే ప్రారంభింపబడిన సర్వకార్యములందును ఈ ఐదు అవస్థలును క్రమముగా ఉండుననియు, "వేర్వేరు స్వభావములు కల ఈ అవస్థలు పరస్పర సంబద్ధములై ఫలహేతువులు కావలెననియు, ఆధికారికమైన ఇతివృత్తము ప్రారంభము నుండి ఫలాంతమువరకును ఆయా అవస్థల ననుసరించి కొనసాగవలెననియు భరతుడు పేర్కొనెను.

ఈ ఐదు అవస్థలలో ఒక్కొక్కదానిని ఒక్కొక్క అంకమునందు నిబంధించుట ముఖ్యము. దశరూపకములలో ఉత్తమములైన నాటక-ప్రకరణములు రెండును సమగ్రేతివృత్త సహితములగుటచే వానియందు ఐదు అంకముల కంటె తక్కువ ఉండరాదు అను నియమ మిందుచేతనే ఏర్పడినది. పాశ్చాత్యులు కూడ ఈ నియమమును పాటించినారు; ముఖ్యముగా షేక్స్పియరు నాటకములు పంచాంకపరిమితములే. ఉత్తమరూపకముల విషయమున ఈ నియమ మొకనాడు సర్వదేశములందును పాటింపబడినదని చెప్పవచ్చును. ఈ అవస్థలు పైని పేర్కొనిన క్రమములోనే ప్రవర్తిల్లుచుండునని మరవరాదు.

## 7. అంక సంఖ్య

కాని, ఐదు అంకముల కంటె ఎక్కువ అంకములు కల నాటకములను మనము చూచుచున్నాము. ఇచ్చట ఈవిధముగా సంభావించుకొనవలసియుండునని అభినవగుప్తుడు తెలిపియున్నాడు—ఒక్కొక్కఅవస్థలో ఉపక్రమ-ఉపసంహారములనెడి రెండు భాగములను కల్పించుకొని ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క అంకమును నిబంధించవచ్చును. కార్యానుకూలమైన ఒక అవస్థనుమాత్రమే పై విధముగా రెండంకములందు నిబంధించినచో మొత్తము

ఆరు అంకములు రాగలవు. ఇట్లే తక్కిన అవస్థలకుకూడ చెరి రెండేసి అంకములను కల్పించినచో మొత్తము పది అంకములు రాగలవు. ఇంక అంతకుమించి ఉండుటకు అవకాశము లేదు. అందుచేతనే నాటక-ప్రకరణములందు "ఐదు అంకముల నుండి పది అంకముల వరకును ఉండవచ్చును" అను నియమము ఏర్పడినది.

మరి, ఐదు అంకములకంటె తక్కువ అంకములుకల రూపకములనుకూడ మనము చూచుచున్నాము. దీని నీ విధముగా సంభావించుకొనవలసి ఉండును—ఒక అవస్థను ప్రధానముగా చేసి దాని తరువాతి అవస్థనుకూడ దానితో కలిపివేసి ఆ రెండింటిని ఒకే అంకమునందు నిబంధించినచో నాలుగు అంకములు మాత్రమే రాగలవు. నాలుగు అంకములు కల రూపకములలో ప్రధానమైనది నాటిక. డిమమునందుకూడ నాలుగు అంకములుండును. సమవకారమునందు 3 అంకములుండును. ప్రహసనమునందు రెండంకములు కాని, ఒక అంకము కాని ఉండును. ఈహామృగము ఏకాంకమని భరతుడు చెప్పగా కొందరు చతురంకమనినారు. ఇంక తక్కిన వ్యాయోగాదులు నాలుగును ఏకాంకములే.

ఒక్కొక్క అవస్థను రెండు అంకములందు నిబంధించుట కంటె ఒకే అంకమునందు నిబంధించి, ఆ అంకమును పొడిగించరాదా అని ప్రశ్నించవచ్చును. కాని అది సమంజసము కాదు. అంకము పెద్దది అయినచో ప్రయోక్తలకును (=నటులకును), ప్రేక్షకులకును కూడ విసుగుపుట్టునని భరతుడే పేర్కొనెను. కావున ఒక అవస్థకు సంబంధించిన విషయము అధికముగా ఉన్నచో ప్రదర్శనానుకూలతనుబట్టి వానిని రెండు అంకములందు నిబంధించవలెను.

**3. అర్థప్రకృతులు**

అవస్థ లనునవి ఫలసాధనమునందు నాయకుడు కావించు ప్రయత్నమునకును, అప్పటి వాని మనోగత భావములకును సంబంధించిన క్రమదశలని గుర్తించియున్నాము. వేర్వేరు స్వభావములు కల ఈ దశలు పరస్పర సంబద్ధములై ఉండుటకు కారణములు లేదా హేతువులు అగువానిని 'అర్థప్రకృతులు' అందురు. అర్థమనగా ఫలము, ప్రకృతి అనగా హేతువు. కావున అర్థప్రకృతులనునవి ఫలహేతువులని సారాంశము. ఇవి ఆయా అవస్థలకు హేతువులని చెప్పుటయు సమంజసమే కాగలదు. అంతియేకాని ఇవి ఇతివృత్తమునకు సంబంధించిన భాగములని మాత్రము తలంచరాదు. అవస్థల వలెనే అర్థప్రకృతులు కూడ ఐదువిధములు- బీజ-బిందు-పతాకా-ప్రకరీ-కార్యములు.

(1) బీజము—ఏదేని ఒక కార్యమును ప్రారంభించుటకు మనస్సులో ఏదియో ఒక అభిలాష జనించవలెను; అప్పుడే మానవుడు కార్యోన్ముఖుడగును. కావున, ఒక నిర్దిష్ట ఫలమును సాధించుటకు అతనిలో జనించిన అభిలాష 'హేతువు' అగుచున్నది. ఈ హేతువే ఆలంకారికముగా 'అర్థప్రకృతి' అనబడును. ఇట్లు నాయకుని లేదా తత్స్థానీయులను కార్యోన్ముఖులనుచేయు హేతువు అనగా ప్రధానకార్యారంభమునకు కారణమగునది 'బీజము' అనబడును.

ఇచ్చట ఒక విషయమును గుర్తునందుంచుకొనవలయును. బీజమనునది కార్యారంభమునకు హేతువై అంతటితో సమసిపోవునది కాదు. నాయకసంబంధమైన అభిలాష



అనెడి బీజమే క్రమముగాస్థిరపడి అంతమున ఫలరూపమును తాల్చును. కావున అభిలాషారూపమైన నాటకబీజము ఫలప్రాప్తిపర్యంతమును నాటకమందు వ్యాపించియుండునని తెలియవలెను. నాయకాదులచే ఆ బీజము మాటిమాటికిని స్మరింపబడుచునే ఉండును. కావుననే "ఆదిలో స్వల్పమాత్రముగా నాటబడి పిమ్మట బహుప్రకారములుగా విస్తరించునదై, ఫలరూపముగా పరిణమించునది 'బీజ' మనడును" అని భరతుడు బీజమును నిర్వచించెను.

లోకమునందు, నేలలో నాటబడిన బీజము తడి తగులగానే అంకురించి (బీజసముత్పత్తి), మట్టిపెల్లను తొలగించుకొని పైకివచ్చి (=బీజోద్ఘాటనము), పెరిగి పెద్దదై (=బీజోద్భేదము) ఫలోన్ముఖమగును. అది ఫలరూపమును తాల్చుటకు ముందు ఆతప-అనావృష్టి-పశు-పక్ష్యాదు లనెడి అపాయములనుండి రక్షింపబడవలెను. నాటకమందలి బీజమును ఇట్టిదే. ప్రధానకథాప్రవృత్తి కంతకును ఆధారమగు సన్నివేశ మేది కలదో అది బీజ మనబడునని గ్రహించవలెను.

2. బిందువు— ఫలార్థులు ప్రారంభించెడి ప్రతికార్యమునందును తరచుగా కాని, విరలముగా కాని ఆటంకము లెదురగుచుండును. ఆటంకము కలిగినప్పుడెల్ల కథాగమనము కుంటుపడుచుండును. అప్పుడు నాయకాదులకు బీజమును గుర్తునకుతెచ్చి, కార్యాచరణకు మరలవారి నుద్యుక్తులను కావించి కథాగమనమునకు భంగము రాకుండచేయు హేతువు 'బిందువు' అనబడును. ఆటంకములచే కథాప్రవృత్తికి భంగము కలిగినప్పుడెల్ల బిందువు ప్రసక్తమగుచునే ఉండును. కావున బీజమువలెనే బిందువును నాటకమునందు ఫలప్రాప్తి పర్యంతమును వ్యాపించియుండునని తెలియవలెను.

ప్రధానప్రయోజనము సాధింపబడుటకు ముందు ఇతరములగు స్వల్పప్రయోజనములు కూడ కొన్ని సాధింపబడవలసియుండును. అవి సాధింపబడుటలో ప్రధాన ప్రయోజనము అనగా బీజము కనుమరుగు అగుచుండును. ఆ స్వల్పప్రయోజనములు సాధింపబడగానే బీజమును మరల స్మరణకు తెచ్చుచుండునది బిందువే. కావున, బీజమును మరుగుపరచునవి ఆటంకములే అనగా విరుద్ధాంశములే కానక్కరలేదు; సాహాయ్యకారులును అవాంతరప్రయోజనసిద్ధిలో బీజమును మరుగుపరచుచుండవచ్చును.

"ప్రయోజనమునకు (=ఉపాయానుష్ఠానమునకు) విచ్ఛేదము కలిగినప్పుడు అవిచ్ఛేదకారణమై ఫలప్రాప్తి పర్యంతమును నిలుచునది 'బిందువు' అనబడు" నని భరతుడు బిందువును నిర్వచించెను. "ఉపాయానుసంధానమును మాటిమాటికి జ్ఞప్తికితెచ్చు చేతనవ్యాపారమైనదియును, మిగిలిన కారణములకు కారణత్వమును సిద్ధింపజేయునదియును, నీటిమీది తైలబిందువువలె సర్వవ్యాపి అగునదియును 'బిందువు' అనబడు"నని అభినవగుప్తుడు వివరించెను.

3, 4. పతాకా-ప్రకరులు—వీని స్వరూపముల నిదివరకే వివరించియున్నాను. ఇవి ప్రాసంగికేతివృత్తభాగములై ప్రధాన ఫలసాధనమునకు హేతువులగుచున్నవి. పతాక కూడ ప్రధానేతివృత్తమువలెనే కల్పింపబడవలెననియు (అనగా నియతపరిమాణములో ఆధికారికేతివృత్తలక్షణము లన్నియు ఇందుండును), పతాకానిబంధనప్రయోజనము ప్రధానముగా పరార్థమే అగుటచే అది అంతమువరకును కొనసాగరాదనియు భరతుడు నిర్దేశించియుండెను.

అనగా ప్రధాన ఫలములో పతాకా నాయకుడు భాగస్వామి కారాదని తాత్పర్యము. ఇంక ప్రకరి కేవలము పరార్థమే.

నాయకు డితరుల సాహాయ్యముపై ఆధారపడక కేవలము స్వశక్తిచేతనే ప్రధాన ఫలమును సాధించుకొనునప్పుడు పతాకా-ప్రకరు లందుండవు. కాని బీజ-బిందు-కార్యము లనునవి మూడును తప్పక ఉండును. అసలు ముఖ్యములైన అర్థప్రకృతు లీ మూడే. పతాకా-ప్రకరులు ప్రాసంగికేతివృత్తమునకు సంబధించినవికాగా ఇవి మూడును ఆధికారికేతివృత్తమునకు సంబంధించినవగుచున్నవి. పతాకా-ప్రకరులులేని ఇతివృత్తములందు వాని పనిని బిందువే సాధించుచుండునని తెలియవలెను. ఇంక, పతాకా - ప్రకరులున్నచోట బిందువు ఉండరాదను నియమము లేదు. అచ్చట కూడ ఉండవచ్చును.

5. కార్యము—కార్యమనగా ఫలమని సామాన్యార్థము. నాయకాదులొనరించిన ప్రయత్నమున కంతటికిని ఈ ఫలసిద్ధియందలి కోరికయే కారణమగుచున్నది. కావున, కార్యమనుదానికి ప్రధానఫలమను నర్థమును చెప్పుట పరిపాటి అయినది; కాని, దీనినే ఫలమనిచెప్పుటకంటె 'ఐదవ అవస్థయగు ఫలయోగమును శీఘ్రతరముచేయుటకు ఈకార్యము హేతువు' అని చెప్పుట సమంజసము. సాహిత్యదర్పణకారుడు 'రావణవధము'ను ఈ కార్యమున కుదాహరణముగా నొసంగినాడు. ప్రధానఫలము సీతాసమాగమమే కాని రావణవధము కాదు. సీతాసమాగమమనెడి ఫలయోగమునకు రావణవధము హేతువైనది. ఆ వధము జరుగనిచో ఈఫలము సిద్ధించదు. ఇట్లు ఫలాగమమునకు హేతువగుటచే కార్యమనునది హేతువు అను నర్థమునందే ప్రయుక్తమైనదనుట స్పష్టము.

"నాయకాదులకు ఆధికారికవస్తు నిర్వహణములో సాహాయ్యపడు అర్థము 'కార్యము' అనబడు"నని భరతుని కార్యనిర్వచనము. కార్యమనగా 'కరణీయము' లేదా 'ప్రయోక్తవ్యము' అను అర్థమును అభినవగుప్తుడు చెప్పెను.

ఫలమును సాధించు ప్రయత్నములో నాయకుడు తనకున్న సర్వశక్తులను వినియోగించుట కార్యమగును; ఇది ఫలయోగమును శీఘ్రతరము చేయును. ఈకార్యము అంతమునందే, లేదా ఏదియో ఒకచోటమాత్రమే ఉండునని భావించరాదు. బీజ - బిందువుల వలె ఇదియును సమస్తేతివృత్తవ్యాపి కావచ్చును.

## 9. సంధులు

అవస్థలనునవి కథాగమనమునకు సంబంధించిన క్రమదశలనియు, అర్థప్రకృతులనునవి ఆ కథాగమనమునకు హేతువులనియు నిరూపించియున్నాను. అవస్థావిభాగము కథాగమనమునకు సంబంధించిన విభజనము కాగా కథకు సంబంధించిన విభజనమింకొకటి కలదు. అదియే సంధివిభాగము. అవస్థావిభజనమున కనుగుణముగానే ఈ సంధివిభజనము ఉండును. కావున, ఐదు అవస్థలున్నట్లే కథయందును ఐదు భాగములుండును. ఆకథాభాగములకే 'సంధులు' అని పేరు.

ఒక నాయకుని జీవితమునందలి ఒక ప్రధానఘట్టమునకు సంబంధించిన ముఖ్య సన్నివేశములనే ఎన్నుకొని, వానిని ఔచిత్యదృష్టితో సంస్కరించుకొని కవి వానిని అంకము



లందు నిబంధించునని ఇంతకుముందు చెప్పియున్నాను. ఆ సన్నివేశము లన్నియును ఏకసూత్రతకలవై పరస్పర సంబద్ధములగునట్లుగా కూర్చుకొనుట కవియొక్క ప్రథమ కర్తవ్యము. 'ఈ సన్నివేశమునుండి ఈ సన్నివేశమువరకును ఒక భాగము,' తరువాత 'ఈ సన్నివేశమునుండి ఈ సన్నివేశమువరకును ఒక భాగము' అని ఇట్లు నిర్ణయించుకొనుచు కవి ముందుగా కథను విభజించుకొనవలెను.

ఇట్లు కవి కథను సమ్యగ్విభజనము చేసికొనునప్పుడు, ప్రారంభము మొదలు ఫలయోగమువరకును వ్యాపించియుండెడి ఏ సమగ్రకథలోనైనను ఐదు భాగములు తప్పక వచ్చును—(1) అభిలాష జనించి మనస్సున నెలకొనెడి కథాభాగము మొదటిది, (2) ఆ అభిలాషను వ్యక్తముచేసి దానిని సిద్ధింపజేసికొనుటకు ప్రయత్నము మొదలుపెట్టెడి కథాభాగము రెండవది, (3) ప్రయత్నము ఫలించువిషయమున ఆశా-నిరాశలు రెండును కలిగెడి కథాభాగము మూడవది, (4) ప్రయత్నము ఫలించుననెడి నిశ్చయముకలిగెడి కథాభాగము నాలుగవది, (5) ఫలము సిద్ధించెడి కథాభాగము ఐదవది. ఈ అయిదు కథాభాగములను ఆలంకారికముగా 'పంచ సంధులు' అని అందురు; వీనికి క్రమముగా ముఖ-ప్రతిముఖ-గర్భ-విమర్శ-నిర్వహణము లని పేరు.

కావున, నాటకరచనా ప్రారంభమునకు ముందు, కవి కథను విభజించుకొనగా ఏర్పడిన భాగములే అనగా కథాఖండములే 'సంధులు' అనబడునని సారాంశము. (ఇట్లు విభజింపబడుటలో ప్రతికథాఖండము లేదా సంధి కొన్ని సన్నివేశముల కూడలి అగుచున్నది. అందలి ఆ సన్నివేశములే 'సంధ్యంగములు' అనగా 'ఆ సంధియందలి అంగములు' అనబడునని చెప్పవచ్చును. వీనిని తరువాత వివరింతును.)

*సంధినిర్వచనము:* ఇచ్చట ఒకవిషయమును గుర్తునందుంచుకొనవలసియున్నది. 'సంధి' అనగా ఏవియో రెండు కలియగా ఏర్పడినదనియు, ఆ రెండును కలిసినచోట లేదా ఇంకొకచోట మాత్రమే ఉండునదనియు తలంచరాదు. "అయిదు అవస్థలును, క్రమముగా అయిదు అర్థప్రకృతులతోను సమన్వయముచెందు భాగములు 'సంధు' లనబడు" నని దశరూపకకారుడు పేర్కొనియున్నాడు. కాని, ఇది సరిఅయిన సంధినిర్వచనము కాదు. అర్థప్రకృతులయిన పతాకా-ప్రకరులు లేకపోయినను ఐదు సంధులును ఉండును. కావున, అవస్థా-అర్థప్రకృతుల క్రమసమన్వయముచే సంధు లేర్పడుచున్నవని చెప్పుట కుదురదు. పతాకా-ప్రకరులు లేనిచోట వాని పనిని బిందువు నెరవేర్చుచుండునని చెప్పియున్నాను. అప్పుడుకూడ పైనిర్వచనము కుదురదు. ఒక కథాభాగము అంతయును 'సంధి' అనబడునని స్పష్టపడుచుండగా రెండు సమన్వయముచెందుటవలన లేదా కలియుటవలన సంధి ఏర్పడునని చెప్పుట ఎట్లు కుదురును ? ధనంజయుడు పై నిర్వచనమును ఏ దృష్టితో చేసెనో కాని, అది తరువాతి ఆలంకారికులను, ఆధునిక విమర్శకులను కొందరిని చాల కలవరపరచినదని చెప్పవచ్చును. భరతుడు 'సంధి'ని నిర్వచింపకపోవుటయే దీని కంతకును మూలకారణము.

కొందరు పై నిర్వచనమును ఈ క్రిందివిధముగా సమన్వయింతురు—కథయందలి ప్రథమభాగము ఆరంభమనెడి అవస్థారూపమున ప్రవర్తిల్లుచున్నది. ఫలసిద్ధికై నాయకాదులు చూపు ఔత్సుక్యమే ఆరంభమనబడును కదా. ఈ ఔత్సుక్యమునకు హేతువగు

'బీజము' కూడ ఆ ప్రథమభాగమునందే తప్పక ఉండును. కావున ఆరంభమనెడి అవస్థయును, బీజమనెడి అర్థప్రకృతియును కథయొక్క ప్రథమ భాగమునందు కలియుచున్నవి. ఇట్లే తక్కిన నాలుగు భాగములందును ప్రయత్నాద్యవస్థలును, బింద్వాద్యర్థ ప్రకృతులును క్రమముగా కలియుచున్నవి. పతాకా-ప్రకరులు లేనప్పుడు బిందువే వాని ప్రయోజనమును కూడ నిర్వర్తించుచుండును.

కాని, పై సమన్వయమునందలి 'కలియుచున్నవి' అనుదానికి అవస్థయును, అర్థప్రకృతియు ఒకచోట కలియుననియు, అచ్చటనే 'సంధి' ఉండుననియు అర్థముకాదు; అవి రెండును ఆ సంధియందు ఉండును, లేదాకన్పట్టును అని మాత్రమే అర్థము. ఈ విషయమును మరచిపోరాదు.

ధనంజయుడు సంధిని ఇంకొక విధముగాకూడ నిర్వచించియున్నాడు. దానిని వ్యాఖ్యాతయగు ధనికు డీ క్రిందివిధముగా వివరించెను—"ఏకేన ప్రయోజనేనాన్వితానాం కథాంశానా మవాంతరైకప్రయోజన సంబంధః సంధిః"— ప్రధానప్రయోజనముతో అన్వయము పొందియున్న కథాంశములు పరస్పరసంబద్ధములై అవాంతరప్రయోజన సాధకములగు నప్పుడు ఆ సంబంధము 'సంధి' అనబడును. దీనికి ఈ క్రిందివిధముగా అర్థము చెప్పుట సమంజసము—ఈ సంధులు అనగా కథాభాగములు అన్నియును ప్రధానఫలమును సాధించుటకు తోడుపడుచున్నవి. అనగా ఒక భాగము ఇంకొక భాగమునకు దారితీయుచు క్రమముగా ఫలసిద్ధిని కలిగించుచున్నవి. ఇట్లివి ప్రధానఫలసాధకములగుటయే కాక అవాంతరఫలసాధకములుకూడ అగుచున్నవి. ఒక సంధి పూర్తియగునప్పటికి కథలో కొంతభాగము పూర్తి అయినదన్నమాట. అనగా అప్పటికి ఏదో కొంతఫలము సాధింపబడినదని చెప్పవచ్చును. ఇట్లు ఆయా సంధులందు సాధింపబడిన అవాంతరఫలములే అంతమున మహాఫల రూపమున పర్యవసించును.

భరతుడు పంచసంధుల నీ క్రిందివిధముగా వివరించెను—

(1) ముఖసంధి— నానార్థరససంభవ మగు బీజసముత్పత్తి కావ్యమం దెచ్చట జరుగునో, ఆ కథాభాగము 'ముఖసంధి' అనబడును. ఇది ప్రారంభమనెడి కార్యావస్థ ననుసరించియుండును.

(2) ప్రతిముఖసంధి—ముఖసంధియందు నిష్పన్నమైయున్న బీజము అవాంతర కారణములచే మరుగుపడినప్పుడు ఆ బీజము ఉద్ఘాటితము (=సువ్యక్తము) చేయబడు కథాభాగము ప్రతిముఖసంధి అనబడును. (ముఖసంధియందు అవ్యక్తముగా ఉండెడి బీజము ప్రతిముఖసంధియందు సువ్యక్తముచేయబడును.)

(3) గర్భసంధి— బీజముయొక్క ఉద్భేదము (=ఫలజననాభిముఖ్యస్థితి) ఎచ్చట కూర్పబడునో ఆ కథాభాగమునకు 'గర్భసంధి' అని పేరు. (బీజము ముఖసంధియందు ఉత్పన్నమై, ప్రతిముఖసంధియందు ఉద్ఘాటితమై, గర్భసంధియందు ఉద్భేదమును పొందును. అనగా ఫలోన్ముఖమగును. ఇందు ఫలము చేతికందినట్లే ఉండి మరల దూరమగుచుండ, దానికొరకు మరల ప్రయత్నము సాగుచుండును. సందర్భమునుబట్టి ఇట్లెన్ని పర్యాయములైనను జరుగవచ్చును. కావుననే గర్భసంధియందు ప్రాప్తి-అప్రాప్తి-పునరన్వేషణములుండునని అభినవగుప్తుడు పేర్కొనెను.)



(4) విమర్శసంధి (=అవమర్శసంధి)— ఫలోన్ముఖమైన బీజార్థము లోభ-క్రోధ-వ్యసనములచే సందేహాస్పదమయ్యెడి కథాభాగము 'విమర్శసంధి' అనబడును. (ఫలోన్ముఖమైన బీజార్థము ఏదేని ఒక తీవ్ర విఘ్నముచే భంగపడగా ఫలప్రాప్తి సంశయాస్పదమగును. అప్పుడు నాయకాదులు తమ శక్తినంతటిని వినియోగించి దానిని తొలగించుకొన్నప్పుడు ఫలప్రాప్తి నిశ్చితము కాగలదు.)

(5) నిర్వహణసంధి—బీజసహితములును, నానాభావ సంయుక్తములును అయిన నాలుగు సంధులయందలి ప్రారంభాద్యవస్థలును ఫలప్రాప్తియందు సమ్మేళనము చెందిన కథాభాగము 'నిర్వహణసంధి' అనబడును.

*సంధి-అంకముల సంబంధము :* ఒక్కొక్క అవస్థను ఒక్కొక్క అంకమునందు నిబంధించవలెననియు, సందర్భమునుబట్టి అంకములు తగ్గుటయు హెచ్చుటయు జరుగుననియు ఇంతకుముందు వివరించియున్నాను. ఈ వివరణమును అవస్థలకు అన్వయించి చెప్పుటకంటె సంధులకు అన్వయించిచెప్పుట చాల సమంజసముగా కన్పట్టుచున్నది. అనగా ఒక్కొక్క సంధిని ఒక్కొక్క అంకమునందు కాని, అవసరమునుబట్టి రెండేసి అంకములందు కాని, లేదా రెండేసి సంధులను ఒకే అంకమునందు కాని నిబంధించవలెనని చెప్పుట సమంజసముగా ఉండును. అవస్థ అనునది అంకములో ఏదో ఒకచోట మాత్రమే ప్రస్ఫుటముగా కన్పట్టుచుండును. ఇంక సంధి అనునది అంకమునందంతటను, కాదన్నచో రెండు అంకములందుకూడ పూర్ణముగా వ్యాపించియుండును. కావున సంధులను అంకపరముగా వివరించుటయే న్యాయ్యము కాగలదు. (సంధిఅంకములోని కొంత భాగమును మాత్రమే ఆక్రమించుకొని ఉండుటయు కలదు; కాని నాటకములందు అది సార్వజనీనము కాదు.)

కావున, అంకవిభాగము ఇతివృత్తమునకు సంబంధించిన బాహ్యవిభాగమనియు, ఇంక సంధివిభాగము ఇతివృత్తమునకు సంబంధించిన ఆంతరవిభాగమనియు తెలియవలెను. అవాంతరవస్తుసమాప్తియందుకాని, నటుల, ప్రేక్షకుల విశ్రాంతికొరకు కాని చేయబడెడి విచ్ఛేదములు అంకములనబడునని అభినవగుప్తుడు వ్యాఖ్యానించియుండుట గమనార్హము [పుట 512 లోని 17 వ అధస్సూచికను చూడవలెను]. అంకవిషయమున పాటించవలసిన విధులను భరతుడే విపులముగా వివరించియుండెను.

ఈ ఐదు సంధులును నాటక-ప్రకరణములయందలి ఆధికారికేతివృత్తములందు తప్పక ఉండును (పతాకయందుకూడ ఒకటి లేదా అంతకుమించిన సంధులుండవచ్చును. కానిఅది ప్రధానార్థమును అనుసరించినదగుటచే అందలి సంధులను 'అనుసంధు' లందురు). ఇంక డిమ-సమవకారములందు నాలుగుసంధులే ఉండును; వీనియందు అవమర్శసంధి ఉండదు. వ్యాయోగ-ఈహామృగములు సంధిత్రయయుతములు; వీనియందు గర్భ-అవమర్శసంధులుండవు. ప్రహసన-అంక-భాణ-వీథులు సంధిద్వయయుతములు; వీనియందు ముఖ-నిర్వహణ సంధులు రెండు మాత్రమే ఉండును. కథ ఎట్టిదైనను, ఎంత చిన్నదైనను ఆద్యంతము లనునవి రెండును ఉండును కాన ముఖ-నిర్వహణ సంధులు రెండును తప్పక ఉండునన్నమాట. వ్యాయోగాదులు ఏకాంకములని ఇంతకుముందే పేర్కొనియున్నాను. నాటక-ప్రకరణము

లందు ఒకొక్క సంధి రెండేసి అంకముల నాక్రమించుకొనుచుండ, వీనిలో ఒకే అంకము రెండేసి సంధులను ఇముడ్చుకొనుచున్నది.

## 10. సంధ్యంగములు

ఇతివృత్తము ఐదు సంధులుగా విభజింపబడినప్పుడు అందలి సన్నివేశములుకూడ ఐదు భాగములుగా విభజింపబడిపోవునని వేరుగా చెప్పనక్కరలేదు. అనగా కథాప్రారంభమందలి కొన్ని సన్నివేశములు కలిసి ముఖసంధి అగును, తరువాతి కొన్ని సన్నివేశములు కలిసి ప్రతిముఖసంధి అగును. ఇట్లే ఇతరసంధులును ఏర్పడును. ఆ యా సన్నివేశములు ఆయా సంధులయందలి భాగము లగుచున్నవి. ఇంకను సూటిగా చెప్పవలెనన్నచో ఆ సన్నివేశములు ఆ సంధికి అంగములు. వీనినే ఆలంకారికముగా 'సంధ్యంగములు' అందురు. ఈ సన్నివేశములు లేదా ఈ సంధ్యంగములు సారభూతములైన వగుటచే కథాగమనమునకు అత్యావశ్యకమ లగుచున్నవి. ఇట్టి ఆవశ్యకసన్నివేశములను సాధ్యమైనంతవరకును గుర్తించి, వానికి ఆలంకారికులు పేర్లుపెట్టి నిర్వచించియున్నారు. అంతియే కాని సంధ్యంగము లనువానిని ఆలంకారికులు క్రొత్తగా కల్పించి వానిని అనుసరించవలెనని శాసించనూ లేదు, నాటకకర్తలు గ్రుడ్డిగా వానిని అనుసరించనూలేదు. ఈ సత్యమును ముఖ్యముగా గ్రహించవలసియున్నది; ఆలంకారికుల సూక్ష్మవివేచనాశక్తికి ఆశ్చర్యపడవలసియున్నది.

కథాగమనమునందు అవస్థ లుండునట్లే, ఇతివృత్తమునందు సంధు లుండునట్లే, సంధులందు అంగము లుండుట తప్పదు. సంధ్యంగముల నిర్వచనములను పరిశీలించినచో అవి అన్నియును ప్రధానపాత్రలచే ముఖ్యముగా నాయక-అమాత్యులచే లేదా నాయికా-నాయకులచే వ్యక్తము చేయబడు భావములకు స్థానములని గుర్తింపగలము. ఇవి అన్నియును కథాగమనమునకు తోడ్పడుటయే కాక, కథాగతిని ప్రేక్షకులకు సూచించుచుండును. ప్రధానఫలసిద్ధి కనుకూలముగా సారభూతములైన సన్నివేశములను కవి సమకూర్చుకొనునప్పుడు ఈ అంగము లన్నియును వాని అంతట అవియే అచ్చట ప్రత్యక్షము లగుచుండును; ఉత్తమకవి ఎన్నడును వానిని శ్రమపడి కూర్చడు.

సంధ్యంగములు మొత్తము అరువదినాలుగని నిర్ణయించి, ఆలంకారికముగా భరతుడు వానికి క్రిందివిధముగా పేర్లు పెట్టెను—

(1) ముఖసంధియందలి అంగములు పన్నెండు— ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, కరణము, భేదము.

(2) ప్రతిముఖసంధియందలి అంగములు పదుమూడు— విలాసము, పరిసర్పము, విధూతము, తాపనము, నర్మము, నర్మద్యుతి, ప్రగయణము, నిరోధము, పర్యుపాసనము, పుష్పము, వజ్రము, ఉపన్యాసము, వర్ణసంహారము.

(3) గర్భసంధియందలి అంగములు పదుమూడు— అభూతాహరణము, మార్గము, రూపము, ఉదాహరణము, క్రమము, సంగ్రహము, అనుమానము, ప్రార్థన, ఆక్షిప్తము, తోటకము, అధిబలము, ఉద్వేగము, విద్రవము.



(4) విమర్శసంధియందలి అంగములు పదుమూడు— అపవాదము, సంఫేటము, ద్రవము, శక్తి, వ్యవసాయము, ప్రసంగము, ద్యుతి, ఖేదము, నిషేధము, విరోధనము, ఆదానము, ఛాదనము, ప్రరోచన.

(5) నిర్వహణసంధియందలి అంగములు పదునాలుగు— సంధి, విబోధము, గ్రథనము, నిర్ణయము, పరిభాషణము, ధృతి, ప్రసాదము, ఆనందము, సమయము, ఉపగూహనము, భాషణము, పూర్వవాక్యము, కావ్యసంహారము, ప్రశస్తి (=భరతవాక్యము).

సంధ్యంగముల ప్రయోజనమునుగూర్చి భరతు డీ క్రిందివిధముగా వివరించియుండెను—

"ఇతివృత్తమునందలి ఆ యా భాగములకు ఏకతను కూర్చుటకై సంధులు నిబంధింపబడును. ఇంక కథాభాగమునకు ఏకతను కూర్చుటలో సంధికి అంగభూతములై వర్తించునవి 'సంధ్యంగము' లనబడును. అట్టి సంధ్యంగములను ఆ యా కథాభాగములందు ముఖ్యప్రయోజనోచితములనుగా కూర్చవలెను".

*సంధ్యంగ ప్రయోజనములు:* సంధ్యంగములకు ఆరు ముఖ్యములైన ప్రయోజనములు కలవు— (1) ఇష్టార్థరచన (అభీష్టమైన ప్రయోజనమును విస్తరింపజేయుట), (2) వృత్తాంతానుపక్షయము (ఇతివృత్తము క్షయము నొందక చక్కగా కొనసాగునట్లు చేయుట), (3) ప్రయోగమునందు రాగప్రాప్తి (ప్రయోగమును రక్తి కట్టించుట), (4) గుహ్యాగూహనము (గోప్యార్థములను గోపనము చేయుట. అనగా కప్పిపుచ్చుట), (5) ఆశ్చర్యాభిఖ్యానము (ఇతివృత్తము నాశ్చర్యకరముగా నొనర్చుట), (6) ప్రకాశ్యప్రకాశనము (ప్రకాశ మొనర్పదగు అర్థములను ప్రకాశింపజేయుట).

అంగహీనుడైన మనుష్యుడు కార్యారంభసమర్థుడు కాజాలనట్లే అంగహీనమైన కావ్యను ప్రయోగయోగ్యము కాజాలదు. కావ్యము ఉదాత్తమైనను సంధ్యంగరహితమైనచో ప్రయోగహీనమై ప్రదర్శనకనర్హమై, సహృదయుల మనస్సులను రంజింపజాలదు. కావ్యము హీనార్థమయినను (ప్రహసనాదులందువలె స్వల్పప్రయోజనము కలదయినను) అంగములతో చక్కగా కూడియున్నచో ప్రయోగము దీప్తమగును కాన అది నిస్సంశయముగా సహృదయు లను రంజింపగలదు. కావున రస-భావములను దృష్టియందుంచుకొని కావ్యకుశలులైన కవులు నాటకమునందు ఆ యా సంధులలో యోగ్యములగు సంధ్యంగములను కూర్చవలెను. కార్యమును, అవస్థను గుర్తెరింగి సంధులయం దీ అంగములను సంమిశ్రములుగా కాని, రెండేసి మూడేసిసార్లు కాని కూర్చవచ్చును.

ఈ సంధ్యంగములు విభావ-అనుభావ-వ్యభిచారి రూపములని నాట్యదర్పణ కర్తలు నిర్దేశించియున్నారు (నాట్యదర్పణము - పుట 115). ఈ సంధ్యంగములను బాగుగా కవి నిర్వహించినచో కథకు నిబిడత్వము చేకూరును. నటుడు వీనిని గుర్తించినచో యథారసముగా అభినయింపగలడు. అప్పుడు ప్రేక్షకులు కథాగమనమును చక్కగా గ్రహింపగలుగుదురు. కావున కవి-నట-ప్రేక్షకుల దృష్టిలో సంధ్యంగముల జ్ఞానము అత్యావశ్యకము.

సారాంశము—(1) సంధి అనునది మొత్తము కథలో ఒక భాగము కాగా **(a unit of plot)** సంధ్యంగము లనునవి ఆ సంధిలోని వేర్వేరు అంశము లగుచున్నవి **(different actions and incidents).**

(2) సంధ్యంగములను భరతు డొక క్రమములో పేర్కొనెను. ధనంజయాదు లింకొక క్రమములో పేర్కొనిరి. ఎవరే క్రమములో చెప్పినను, కవి ఆ క్రమమునే పాటించ వలెననెడి నియమ మెచ్చటను లేదు; స్వీకరించిన కథనుబట్టి క్రమమును మార్చుకొనవచ్చును.

(3) ఒక సంధిలో చెప్పబడిన అంగము లన్నియును ఆ సంధిలో తప్పక ప్రయుక్తములు కావలెనను నియమము లేదు. కథకు అనవసరములైన కొన్నింటిని విడిచి వేయవచ్చును. ఆయా సంధులందు తప్పక ప్రయుక్తములు కాదగిన ముఖ్యాంగము లేవియో తరువాతి ఆలంకారికులు వివరించియున్నారు.

(4) ఒకే సంధ్యంగమును అ సంధిలోనే రెండు, మూడుసార్లు ప్రయోగించవచ్చును. దీనివలన సన్నివేశమునకు దీప్తి కలుగును. మూడుసార్లకంటె అధికముగా ప్రయోగించినచో వైరస్యము కలుగునని భరతుడే పేర్కొనెను.

(5) రెండు సంధ్యంగములను కలిపి ఒకేచోట ప్రయోగించవచ్చును.

(6) ఒక సంధిలోని అంగము ఇంకొక సంధిలో కూడ ప్రయుక్తమగుట కవకాశ మున్నది. ముఖసంధిలోని యుక్తి గర్భసంధిలో ప్రయుక్తమగుట ఇందుల కుదాహరణము.

(7) ధనంజయాదులు సంధ్యంగములను భిన్న క్రమములో చెప్పినట్లే కొన్నింటి పేర్లను, నిర్వచనములను కూడ భిన్నముగా చెప్పియున్నారు.

(8) సంధ్యంగములు అరువదినాలు గని చెప్పినంతమాత్రమున సర్వకథాంశములను గ్రహించినట్లు కాదు ; ఇవి ఉదాహరణపరములుగా మాత్రమే చెప్పబడినవని నాట్యదర్పణ కర్తలు పేర్కొనియున్నారు (నా. ద. - పుట 101).

### 11. సంధ్యంతరములు

సంధులయందు ఈ సంధ్యంగములేకాక ఇరువదియొక్క సంధ్యంతరములు, నాలుగు పతాకాస్థానకములుకూడ ప్రయుక్తమగునని చెప్పి భరతుడు వానినికూడ వివరించెను. సంధ్యంగ ములచే సర్వకథాంశములను స్వీకృతములు కాజాలవని నాట్యదర్పణకర్తలు చెప్పినది సత్యము. ఒక సంధ్యంగమునకును ఇంకొక సంధ్యంగమునకును మధ్య కొన్ని కథాంశములు ప్రవర్తిల్లుచుండును. వానివలన అంగములకు శైథిల్యము వాటిల్లకుండ ఎడనెడ మరికొన్ని సంధులను కూర్పవలెననియు, అవియే సంధ్యంతరము లనబడుననియు సింగభూపాలుడు పేర్కొనియుండెను. భరతుడీ సంధ్యంతరములను నిర్వచించలేదు; అభినవగుప్తుడు ఉదాహర ణముల నొసంగలేదు. సింగభూపాలుడు మాత్ర మొసంగెను. "దశరూపకకారుడు అనాలో చితముగ ఈ సంధ్యంతరములకు సంధ్యంగములం దంతర్భావమును చెప్పెను. అది నాకు సమ్మతము కాదు" అని సింగభూపాలుడు స్పష్టము చేసెను. సంధ్యంతరముల ప్రయోజన మును అభినవగుప్తుడు వివరించియుండెను. (పుట 578 చూడవలెను.)

### 12. పతాకాస్థానకములు

సంధ్యంగ - సంధ్యంతరముల కంటెను అధిక ప్రభావము కలవి పతాకాస్థానకములు. "ఒక వాక్యము ఒక అర్థము నుద్దేశించి ప్రయోగింపబడినప్పటికిని, దానినుండి అగంతుక



భావముచే నిగూఢమగు ఇంకొక అర్థము సాధింపబడినచో అది 'పతాకాస్థానక' మనబడు" నని భరతుని నిర్వచనము. ఈ నిగూఢార్థము మొదటి అర్థమునకు అనుగుణమైనదిగానే ఉండవలెను. పతాకాస్థానకముచే భావ్యర్థము సూచితము కావలెనని ధనంజయాదు లభి ప్రాయపడిరి. ఈ పతాకాస్థానకమును ఆంగ్లమున 'Dramatic Irony' అందురు.

పతాకాస్థానకము నాలుగు విధములు. వీనికి ప్రత్యేకములగు పేర్లు లేవు. భరతుడు వీని నీక్రిందివిధముగా నిర్వచించెను—

(1) ఉపకారకమైన వాక్యముచే లేదా క్రియచే అచింతితముగా ఉత్కృష్టమగు అర్థము సాధింపబడినచో అది ఒకటవ పతాకాస్థానక మగును.

(2) ప్రకృతముకు సంబంధించి సాతిశయముగా, శ్లిష్టముగా (రెండర్థములు వచ్చునట్లుగా) చెప్పబడిన వాక్యము రెండవ పతాకాస్థానకమగును. (ప్రకృతమునకును అప్రకృతమునకును కూడ ఈ వాక్యము ఉచితముగానే ఉండును.)

(3) అస్ఫుటముగా ఉన్న అర్థమును సముచితనగు ప్రత్యుత్తరముచే విశేష నిశ్చయ సహితముగా స్ఫుటమొనరించుట మూడవ పతాకాస్థానమగును.

(4) సుశ్లిష్టముగా కావ్యమునందుపయుక్తమైన రెండర్థములు కల వాక్యము ఇంకొక అర్థమును సాధించినచో అది నాలుగవ పతాకాస్థానకమగును.

పతాకాస్థానమున కెంత ప్రాబల్యమున్నదనగా శారదాతనయాదులు దానిని ఇతివృత్తమునందొక భాగముగానే పరిగణించి, ఆధికారిక - ప్రాసంగిక - పతాకాస్థానక భేదములచే ఇతివృత్తము మూడు విధములని పేర్కొనియున్నారు. ఇది అతిశయోక్తి అని చెప్పవచ్చును.

### 13. సారాంశము

కవి, ఒక ఉత్తమనాయకుని జీవితములోని ఒక ఆకర్షణీయమగు ఘట్టమును స్వీక రించి, అందలి సన్నివేశములలో నీరసములగువానిని పరిహరించి, తక్కినవానిని అవసర మైనచో సంస్కరించుకొనును. ఇట్లు సిద్ధములైన సన్నివేశములను అనగా ప్రత్యక్షముగా ప్రదర్శింపబడెడి కథను ముందుగా ఐదు సంధులుగా విభజించుకొనును. ఆ సంధులలో కార్యావస్థలను, అర్థప్రకృతులను, సంధ్యంగములను, సంధ్యంతరములను, పతాకాస్థానకము లను యథోచితములుగా గుర్తించుకొనును. ఇట్లు రచనాప్రణాళికను సిద్ధముచేసికొని, రచనకు పూనుకొనునప్పుడే ఆ కథ 'ఇతివృత్తము' **(Well-knit plot)** అనబడును (కవి మొదట స్వీకరించినది కేవలము వృత్తము=కథ=**Story** మాత్రమే). "ఇతివృత్తం తు నాట్యస్య శరీరం పరికీర్తితమ్" అని భరతుడు చెప్పుటలో ఇంత మహార్థము ఇమిడియున్నది.

భరతుడుపయోగించిన 'కావ్య కుశలుడైన కవి' అనుదానిపై వ్యాఖ్యా నించుచు - "కావ్యకుశలుడనగా ప్రబంధనిర్మాణదక్షుడగు కవి అని అర్థము. ఒక్కొక్క పద్యమును లేదా పదేని పద్యములను అల్లెడి ముక్తకకవి ప్రబంధనిర్మాణ దక్షుడు కాజాలడు ; వానికి సంధి-సంధ్యంగ విన్యాస చమత్కారము తెలియనే తెలియదు. ఇంక ప్రబంధయోజనాసమర్థుడగు కవియే సంధ్యంగసంయోగయోగ్యతను గుర్తింప

గలదు" అని అభినవగుప్తుడు పేర్కొనెను. ఇచ్చట ప్రబంధ మనగా నాటక-ప్రకరణములు రెండింటిలో ఒకటి అని అర్థము. సంధి-సంధ్యంగాది సంఘటనము కేవలము ప్రతిభాసాధ్య మగుటచేతనే "సందర్భేషు దశరూపకం శ్రేయః; తద్ధి చిత్రం చిత్రపటవద్విశేషసాకల్యాత్" (సందర్భములలో అనగా ప్రబంధములలో దశరూపకము శ్రేష్ఠము; విశేషసమగ్రమగుటచే అది చిత్రపటము వలెనే చిత్రముగా ఉండును) అని వామనుడు పేర్కొనుట అత్యంతమును సమంజస మగుచున్నది.

నాటక మెట్టిదిగా ఉండవలెనో ఈ అధ్యాయాంతమున భరతుడే వివరించియుండెను.

ఇంతవరకును వివరించినవానినెల్ల సౌలభ్యార్థము, పట్టికరూపములో, క్రింద చూపుచున్నాను—




## 14. ఇతివృత్త నిర్మాణము : పాశ్చాత్యులు

*అరిష్టాటిల్ :* పొయెటిక్సులో అరిష్టాటిల్ రూపకమును మొత్తము ఆరు అంశములుగా విభజించిన విషయమును పుట 885 లో పేర్కొనియున్నాను. ఆ ఆరు అంశములలోను ఇతివృత్తము (plot) ప్రధానమని అతడు నిర్దేశించెను; రూపకమునకదియే ప్రాణమని



వాని అభిప్రాయము. ఇతివృత్త నిర్మాణమునుగూర్చి అతడు వ్రాసిన కొన్ని వాక్యములను క్రింద ఉదాహరించుచున్నాను [Butcher's Translation of Poetics]—

"The plot is the first principle, and as it were, the soul of tragedy; character holds the second place (pp. 28-29)...Tragedy is an imitation of an action that is complete, and whole, and of a certain magnitude; for there may be a whole that is wanting in magnitude. A whole is that which has a beginning, a middle, and an end. A beginning is that which does not itself follow anything by casual necessity, but after which something naturally is or comes to be. An end, on the contrary, is that which itself naturally follows some other thing, either by necessity, or as a rule, but has nothing following it. A middle is that which follows something as some other thing follows it. A well constructed plot, therefore, must neither begin nor end at haphazard, but conform to these principles (P. 31).....the proper magnitude is comprised within such limits, that the sequence of events, according to the law of probability or necessity, will admit of change from bad fortune to good, or good fortune to bad. Unity of plot does not, as some persons think, consist in the unity of the hero (P. 33) .....the plot, being an imitation of an action, must imitate one action and that a whole, the structural union of the parts being such that if any one of them is displaced or removed, the whole will be disjointed and disturbed (P. 35).....plots are either Simple or Complex, for the actions in real life, of which the plots are an imitation, obviously show a similar distinction. An action which is one and continuous in the sense above defined, I call Simple, when the change of fortune takes place without Reversal (or Recoil) of the Action and without Recognition. A Complex action is one in which the change is accompanied by such Reversal, or by Recognition, or by both. These last should arise from the internal structure of the plot, so that what follows should be the necessary or probable result of the preceeding action (Pp. 39-40)........A perfect tragedy should be arranged not on simple but on the complex plan. (P. 45)"

పై వాక్యములను పరిశీలించినచో బాహిరమైన అల్పాంశములందు తప్ప, అంతస్సారమున గ్రీకు-భారతీయ లక్షణములకు భేదములేదని స్పష్టపడగలదు. ఒక రోజులో జరిగిన కథను ఒక అంకమందు కూర్చవలెనని భరతుడు చెప్పగా, మొత్తము రూపకమందలి కథ అంతయును ఒక రోజులో జరిగినదే కావలెనని అరిష్టాటిల్ నిర్దేశించిన విషయ మిదివరకే పేర్కొనియున్నాను. ఆనాడు గ్రీకు రూపకములందు నేటి అంకవిభజనము లేదు. కాని, 'episodes' అనుపేర కథ విభజింపబడియుండెడిది.

*అర్వాచీన విభజనము :* అరిష్టాటిల్ ఇతివృత్తమును మూడు భాగములుగా (ఆది-మధ్య-అంతములు) విభజింపగా అర్వాచీనకాలమందలి విమర్శకులు ఐదు భాగములుగా విభజించియున్నారు—(1) Initial incident, (2) Rising action or Growth or Complication, (3) Crisis or Climax or Turning point, (4) Falling action or Resolution or Denouement, (5) Catastrophe or Conclusion.

ఒక్కొక్కప్పుడు ప్రదర్శనప్రారంభమందు కొంత వివరణము చేయనిచో ప్రేక్షకులకు కథ అర్థమగుట కష్టమగును; అట్టి వివరణమునకు సంబంధించిన భాగమును 'Introduction' లేదా 'Exposition' అందురు. ఇది సంస్కృతనాటకములందు ప్రథమాంకప్రారంభ

మందుండెడి విష్కంభతుల్యము. తక్కిన ఐదు భాగములును పంచావస్థలతో లేదా పంచ సంధులతో సంవదించును.

ప్రతి రూపకేతివృత్తమును ఏదో ఒక సంఘర్షము (conflict) తో కూడియుండును. భారతీయేతివృత్తములందుకంటె పాశ్చాత్యేతివృత్తములందు దీనికి ఎక్కువ ప్రాధాన్యము కలదు. భారతీయేతివృత్తములందు నిర్దిష్టఫలసంపాదనము ప్రాముఖ్యము వహించును. సంఘర్షము అసలు లేకపోయినను, లేదా తక్కువగా ఉన్నను దానిని పాశ్చాత్యులు ఉత్తమ రూపకముగా పరిగణించరు. ఈ సంఘర్షము మంచికిని మంచికిని మధ్య రావచ్చును, లేదా మంచికిని చెడుగునకును మధ్య రావచ్చును. అట్లే వ్యక్తుల మధ్య, భావముల మధ్య, ఆశయముల మధ్య సంఘర్షము చెలరేగవచ్చును. గ్రీకురూపకములందు వ్యక్తిజీవితమునకును విధి లేదా దైవికశక్తికిని (fate) మధ్య చెలరేగెడి సంఘర్షము ప్రాధాన్యమును వహించును. ఈ విధముగా సంఘర్షమే రూపకేతివృత్తమునకు వెన్నెముక అని పాశ్చాత్యుల అభిప్రాయము.

ఈ సంఘర్షము ఎప్పుడు ప్రారంభించునో అప్పుడే అసలు ఇతివృత్తము (real plot) ప్రారంభమైనదన్నమాట (అంతకుముందున్న రూపకభాగమంతయును 'exposition' అనబడు భాగముమాత్రమే). ఎప్పుడు ఈ సంఘర్షము అంతమగునో అప్పుడే అసలు ఇతివృత్తము అంతమగును. ఈ రెండింటి మధ్యనున్న ఇతివృత్తమే పై విధముగా 5 భాగములుగా విభజింపబడుచున్నది. ఈ ఐదు భాగములందును ఒక క్రమము, పూసలలోని దారమువలె, అంతర్గతమై అనుస్యూతముగా ఉండును. ఈ క్రమమే 'Dramatic line' అని ఆంగ్లమునందును, 'సంధి విభాగ' మని సంస్కృతమునందును పేర్కొనబడుచున్నది. ఈ సందర్భమున శ్రీ హడ్సన్ సరళమగు భాషలో చేసిన వివరణమును క్రింద పొందుపరచుచున్నాను—

"The complications which arise from the initial clash of opposed forces will, as a rule, continue to increase until a point is reached at which a decisive turn is taken in favour of one side or the other; after which, the progress of events will be inevitable though often with many minor interruptions, towards the final triumph of good over evil or of evil over good. Through every plot we may thus trace more or less clearly what is sometimes called "the dramatic line". We have, to begin with, some Initial Incident or Incidents in which the conflict originates; secondly, the Rising Action, Growth, or Complication, comprising that part of the play in which the conflict continues to increase in intensity while the outcome remains uncertain; thirdly, the Climax, Crisis or Turning Point, at which one of the contending forces obtains such controlling power that henceforth its ultimate success is assured; fourthly, the Falling Action, Resolution, or Denouement, comprising that part of the play in which the stages in the movement of the events towards this success are marked out; and fifthly, the conclusion or catastrophe, in which the conflict is brought to a close." [An Inroduction to the Study of Literature, 1922 - Pp. 264-265]

పై వివరణములో మొదటి రెండు అవస్థలును విషాద-అహ్లాద రూపకములయందు ఇంచుమించుగా సమానములే. ఇంక చివరి రెండు అవస్థలందును వాని తీరులు పూర్తిగా భిన్నములుగా ఉండును. ఇచ్చట ఈ క్రింది విషయములు గమనార్హములు. 3 వ అవస్థా విషయమున Climax, Crisis, Turning point అను పదములు చెప్పబడినవి; చివరి రెండింటి



కిని బదులుగా Climax అను పదము వాడుకలో ఉన్నది. Climax అను పదమునకు 'నిచ్చెన' (ladder) అని అర్థము. ఇది Turning point కు మార్గము కాగలదు కాని ఇదియే Turning point కాజాలదు. Denouement అను పదమును అశ్రద్ధగా Catastrophe అను అర్థమునందుకూడ వాడుచుందురు; అది సమంజసము కాదు.

పై పంచావస్థావిభాగమువలననే రూపకములను పంచాంకములుగా విభజించుట జరిగియున్నది. ఈ పంచాంకపరిమితి అనునది ఒకనాడు విశ్వవ్యాప్తమైన రూపకధర్మముగా పాటింపబడినదని చెప్పవచ్చును. షేక్స్పియరు రూపకములు పంచాంకపరిమితములే అనుట చర్వితచర్వణము. గ్రీకు విషాదరూపకములో మొదట 'Prologue', తరువాత మూడు 'Episodes', అంతమున 'Exodus' అను విభాగము లుండెడివి. ఐదు అనెడి ఈ విభాగమే తరువాతి సెనెకారూపకములందలి పంచభాగవిభజనమునకు (5 episodes) మార్గదర్శకమై ఉండును. సెనెకావిషాద రూపకములందలి ఈ విభజనమే ఆంగ్లదేశమున పునరుజ్జీవన కాలమందలి రూపకములందును పాటింపబడినది. షేక్స్పియరు నాటకములందు కూడ ఈ విభజనము మొదట 'అంకము' లనుపేర వ్యవహృతము కాలేదు; వాటిని 5 భాగములు (parts) అని మాత్రమే అనెడివారు. తరువాత మొదటి ఫోలియో కాలమున అంకములనెడి విభజనము ప్రచారములోనికి వచ్చెను. షేక్స్పియరు తరువాత నాలుగు అంకముల పరిమితి అనునది ప్రచారములోనికి వచ్చెను. నేడు ఇంచుమించుగా అందరును మూడు అంకములతోనే రూపకములను రచించుచున్నారు. అంకముల సంఖ్య హెచ్చినను తగ్గినను 'Dramatic line' అనునది మాత్రము అన్నింటను ఉండుట తప్పదు. ఇచ్చట ఇంకొక విషయమును కూడ గమనించవలసియున్నది. ఒక్కొక్క అవస్థ ఒక్కొక్క అంకమునందు నిబంధింపబడుట న్యాయ్యమే అయినను కొందరు దానిని పాటించలేదు. ప్రథమాంకములో ప్రారంభమైన Initial complication తృతీయాంకమువరకును సాగుట కలదు. మూడవ అంకమునందు దీని చివరిభాగము, తరువాతి రెండు అవస్థలునుకూడ కన్పట్టుచుండును. నాలుగవ అంకమునుండి అయిదవ అంకప్రారంభమువరకును నాలుగవ అవస్థ సాగి, అయిదవ అంకాంతమున ఐదవ అవస్థ పొందుపడుట కలదు. భారతీయ రూపకములందు ఇట్టి వ్యత్యాసములు 3, 4 అంకములే కల రూపకములందు మాత్రమే సాధారణముగా కన్పట్టుచుండును.

### 15. రూపక ప్రయోజనము

"కావ్యాలాపాంశ్చవర్జయేత్" అనెడి సూక్తి ఒకటి ప్రచారమందున్నది. ఈ సూక్తి అసత్కావ్యవిషయమని వ్యాఖ్యాతలందరును ఖచ్చితముగా చెప్పియుండుటచే ఇది పరిగణనీయము కాదు. ప్రథమాధ్యాయాంతమున నాట్యప్రయోజనమును భరతుడు స్పష్టముగా నిర్దేశించియుండెను—"నాట్యము ఉపదేశాత్మకమగుటయే కాక హితమును, ధైర్యమును, క్రీడను, సుఖమునుకూడ కలిగించును...అంతియేకాక యశస్సును, ఆయువును, బుద్ధివికాసమునుకూడ కలిగించును" (పుట 17) అనెడి వాక్యములు గమనార్హములు. దేవేంద్రాదులు బ్రహ్మను "క్రీడనీయకము" (వినోదవస్తువు) కొరకు అర్థించియున్నారుకదా.

భామహుడు కావ్యప్రయోజనమును వివరించుచు 'ప్రీతి' అను పదము నుపయోగించుట గమనార్హము [కావ్యాలంకారము - 1 వ పరిచ్ఛేదము - 2 శ్లో.]—

ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ।
ప్రీతిం కరోతి కీర్తిం చ సాధుకావ్యనిషేవణమ్ (నిబంధనమ్) ॥

—సాధు కావ్యనిషేవణము ధర్మార్థ కామమోక్షములయందును కళలయందును వైచక్షణ్యమును, ప్రీతిని, కీర్తిని కలిగించును. (ఇందలి 'నిషేవణ' మను పాఠము పాఠకపరమైనది; ఇంక 'నిబంధన' మను పాఠము కవిపరమైనది.)

ధనంజయుడు కేవలము 'ఆనందము'ను మాత్రమే రూపకప్రయోజనమునుగా పరిగణించెను. [దశరూపకము - ప్రథమప్రకాశము - 6 శ్లో.]

ఆనందనిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః।
యోఽపీతిహాసాదివదాహ సాధు స్తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ ॥

—ఆనందనిష్యందులైన రూపకములకు ఫలము ఇతిహాసాదులందువలె వ్యుత్పత్తి మాత్రమే అని ఏ అల్పబుద్ధి చెప్పెనో అస్వాదుపరాఙ్ముఖునకు నమస్కారము. (పైశ్లోకమును ధనంజయుడు భామహుని వైచక్షణ్యమును దృష్టిలో పెట్టుకొని చెప్పినట్లు స్పష్టమగుచున్నది.)

రూపకములు ప్రత్యక్షప్రయోజ్యములగుటచే కావ్యములకంటె శీఘ్రముగా ఆనందావహములగుచున్నవి. 'రస' మనునది ఆనందమునకు పర్యాయపదముకదా.

అరిష్టాటిల్ విషాదరూపకమునకు కూడ ఆనందమే ప్రయోజనమని అంగీకరించియుండుట గమనార్హము.

మానవు డెన్ని కష్టము లనుభవించినను చివరకు సుఖమును పొందుట న్యాయ్యమనియు, దుష్టశిక్షణము శిష్టరక్షణము కర్తవ్యములనియు, రూపకాదుల ప్రదర్శనమువలన మానవునిలో నిరాశ జనించరాదనియు భారతీయుల ఆశయము. గ్రామ్యధర్మప్రవృత్తి యందున్న ప్రజలను ధర్మమార్గప్రవృత్తులను చేయుటకే నాట్యము సృష్టింపబడినదని ప్రథమాధ్యాయమునుబట్టి స్పష్టమగుచున్నది, కావున కావ్యమునందుకాని, ఎక్కువ హృదయావర్జకములైన రూపకములందుకాని ధర్మపరాజయమును, నిరాశను నిరూపించుటకు మనవారు పూనుకొనలేదు. అందుచేతనే భారతదేశమందు విషాదరూపకరచనమునకు తావులేకపోయినది. ప్రేక్షకుడు నాయకునితో తాదాత్మ్యమునుపొందినప్పుడే రసానుభూతి కలుగును. అట్లు తాదాత్మ్యము కలుగుటకు నాయకుడు విధిగా ధీరుడును, ఉదాత్తుడును, ఉత్తముడును (ideal person) కావలయును; నాటక-ప్రకరణములందలి నాయకు లట్టివారుగా ఉందురు. అందుచేతనే అవి ఉత్తమరూపకములైనవి. ప్రహసనాదుల విషయము ఇట్టిది కాదు; వాటియందలి కథలును, వ్యక్తులును కూడ తక్కువ రకమునకు చెందుటచే తాదాత్మ్యసిద్ధి కలుగదు. ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలసియున్నది. నాటికా-నాటకములు రెండును శృంగార ప్రధానములే అయినను ఆ రెండింటియందలి శృంగారమును ఒకే జాతికిచెందినది మాత్రము కాదు. అభిజ్ఞాన శాకుంతల - ఉత్తరరామచరితాదులందు పవిత్రప్రణయము ప్రతిపాదితమైనది. ఇంక, నాటికలయందలి శృంగారము భౌతికమైనది. అసలు, ఈ నాటికలు విలాసవంతులైన రాజుల వినోదార్థము రచింపబడియుండవచ్చును.

---

# అధ్యాయము 20[1]

## వృత్తులు[2]

[కాశీ ముద్రణమునందు 22 వ అధ్యా—69 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 20 వ అధ్యా—66 శ్లోకములును, బరోడా ముద్రణమునందు 20 వ అధ్యా—77 శ్లోకములును కలవు.]

ఇప్పుడు వృత్తుల[3] ఆవిర్భావమును క్రమముగా వివరింతును. వస్తువునుబట్టి వృత్తులు జనించుచుండును; ఆ వృత్తిభేదములనుబట్టి కావ్య (రూపక) భేదము లేర్పడుచుండునని[4] తెలియవలెను.

### వృత్తుల ఆవిర్భావము

కృతయుగారంభమందు, జగత్ప్రభువైన అచ్యుతుడు (విష్ణువు) జగత్తు నంతటిని ఏకార్ణవముగా చేసి, లోకములనెల్ల మాయచే సంక్షిప్త మొనర్చి, నాగపర్యంకమందు శయనించెను. అప్పుడు వీర్య-బలోన్మత్తులైన మధు-కైటభులను రాక్షసులు యుద్ధకాంక్షులై వాసుదేవుని యుద్ధమునకుపిలిచిరి. వారు తమతమ జబ్బలనుచరచుకొనుచు అక్షయుడును, ప్రభువును అయిన ఆ భూతభావనుని దరిజేరి జానువులచే, ముష్టులచే పొడుచుచుయుద్ధము చేసిరి. అనేకములైన పరుష వాక్యములతో

---

1. ఈ భాగము కాశీ ముద్రణమునందు ద్వావింశాధ్యాయము. బొంబాయి-బరోడా ముద్రణములందు మాత్రము వింశాధ్యాయము.

2. 'వృత్తి వికల్ప' మని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము. 'వృత్తి వికల్పన' మని బరోడా ముద్రణపాఠము. అభినవగుప్తుడు 'వృత్త్యధ్యాయ' మనెను.

3. వృత్తి అనగా వ్యాపారము. వాక్-మనః-కాయ వ్యాపారముల వైచిత్ర్యముతో కూడిన చేష్టలు వృత్తు లనబడును. ఇట్టి చేష్టలు సర్వజీవలోకసహజములు. కాని లోకమునందివి సహజముగ ఆవేశమయములై ఉండును. ఇట్టిది లౌకికావేశము. ఇంక కావ్య-నాట్యములందు కవికిని, సామాజికునకును కలుగు ఆవేశము అలౌకికావేశ మనబడును. ఇదియే రసచర్వణమున కుపకరించును [అభినవభారతి - 3 వ సం-పుట 83.]

'రీతి' అనునది శబ్దసంఘటనాశ్రయమైనది. కావ్యవృత్తి అనునది అర్థాశ్రయమైనది. ఇంక నాట్యవృత్తి అనునది కేవలము రసాశ్రయమై ప్రత్యక్షభావనాయోగ్య మగుచున్నది. కావున నాట్యవృత్తి కావ్యవృత్తికంటె విశిష్టమైనదని తెలియవలెను.

4. వృత్తిభేదములవలననే రూపకభేదము లేర్పడుచున్నవనియు, కావ్యములకెల్ల వృత్తులే మాతృకలనియు 18 వ అధ్యాయప్రారంభమందు చెప్పబడినది.

లతో విష్ణువు నెదిరించుచు, పెక్కువిధము లగు అధిక్షేపవాక్యములచే సముద్రమును కంపింపజేయుచున్నట్లు కన్పట్టిరి.

నానాప్రకారములైన ఆ మధు-కైటభుల పరుషవాక్యములను విని కించ పడినవాడై బ్రహ్మ విష్ణువుతో ఇట్లు చెప్పెను— "ఉత్తరప్రత్యుత్తరరూపములైన మాటలతో ఈ భారతీవృత్తి కొనసాగుట[5] ఎందులకు? ఈ ఇరువురిని చంపుము." పితామహుని వాక్యములను విని "ఒకానొక కార్యము[6] కొరకు అనగా భారతీవృత్తి నిర్మాణము కొరకు ఈ వాగ్యుద్ధము నింతవరకును సాగించినాను. వాక్యబహుళమగు ఈ భారతీవృత్తి వక్తలకు (కవులకు) ఆశ్రయము కాగలదు.[7] ఇంక వీరిని చంపుదును" అని మధుసూదనుడు ప్రత్యుత్తర మొసంగెను.

ఇట్లుచెప్పి శుద్ధములును, అవికృతములును, అంగహారసహితములును అయిన అంగములతో (అనగా ఆంగికాభినయముతో) ఆ హరి యుద్ధమార్గవిశారదులైన ఆ రాక్షసు లిరువురితోడను తీవ్రముగా యుద్ధము చేసెను. ఆ సమయమున వాసుదేవుని పదన్యాసములచే భూమికి 'భార' మధికమాయెను; ఇట్టి 'భారము' చే జనించిన దగుటవలన ఈ వ్యాపారము భారతీవృత్తి యనబడినది[8].

ఆ సమయమున తీవ్రములును, తొట్రుపాటు లేనివియును, సత్త్వప్రధానములును అయిన శార్ఙ్గధనుస్సుయొక్క వల్గితములవలన (వ్యాపారవిశేషముచే) 'సాత్త్వతీవృత్తి'[9] నిర్మితమైనది.

పిమ్మట విచిత్రములగు అంగహారములను ప్రదర్శించుచు వాసుదేవుడు విడిపోయిన తన కేశపాశమును సవిలాసముగా ముడివేసికొనెను. ఆ విలాసచేష్టనుండి 'కైశికీవృత్తి' నిర్మితమైనది.

సంరంభ - ఆవేగ సమన్వితములును, అనేకచారీప్రయోగసహితములును, చిత్రకరణసంయుక్తములును అగు బాహుయుద్ధములవలన 'ఆరభటీవృత్తి' ప్రవర్తితమైనది.[10]

ఇట్లు, వృత్తినియమితములైన ఏయే చేష్టలను వాసుదేవు డొనరించెనో ఆయా చేష్టలను తదర్థానుగుణముగా జప్యపూర్వకములగు వాక్యములతో బహ్మ వర్ణించెను.[11]

---

5. ఇచ్చట మధుకైటభులకును, విష్ణువునకును మధ్య వాగ్యుద్ధము జరిగినదని తెలియవలెను. మత్తులైన మధుకైటభులు లౌకికావేశపరులగుటచే వారు వృత్తిప్రవర్తకులు కాలేరు. అందుచే ఇచ్చట సత్త్వప్రధానుడైన వాసుదేవుడే వృత్తిప్రవర్తకుడని తెలియవలెను. లోకసాధారణభావమున ఆవేశమయుడుగా కన్పట్టినను నిజమున కాతడు ఆవేశరహితుడే. ఇట్టివాడగు విష్ణువిచ్చట 'నట' స్థానీయుడు, ఇంక బ్రహ్మ 'ప్రేక్షక' స్థానీయుడు. అట్టి ప్రేక్షకుల హృదయములో విశ్రాంతిని పొందుటయే వృత్తుల పరమప్రయోజనము. [అభినవభారతి-3 వ సం - పుటలు 85-87.]

6. 'కార్యక్రియాహేతోః' అనుటకు బదులుగా 'కావ్యక్రియాహేతోః' అను పాఠాంతరము కలదు. అభినవగుప్తుడు 'కార్య' పదమునే గ్రహించెను. కాని డా. రాఘవన్ 'కావ్య' పద ముచితముగా నుండునని అభిప్రాయపడెను. సింగభూపాలుడుకూడ 'కావ్య' పదమునే గ్రహించియుండెను. [రసార్ణవసుధాకరము - పుట 217]

7. 'భారతి' అనగా వాక్కు. వాగ్వ్యాపారము అనగా వాచికాభినయమునకు ప్రాధాన్యమున్నచోట/ అది 'భారతీ' వృత్తి అనబడును. ఇంకను సూటిగా చెప్పవలెనన్నచో 'action' కు ప్రాధాన్యములేక కేవలము సంభాషణయే ఎచ్చట ప్రాధాన్యమును వహించునో అచ్చట భారతీవృత్తి ఉండును.

'రిటారిక్కు'లో అరిస్టాటిల్ 'వక్త' (Orator or Speaker) కు ప్రాధాన్యమిచ్చి కావ్యశాస్త్రవివరణము చేయుట గమనార్హము. 'వక్త' అనగా 'కవి' అని అభినవగుప్తు డర్థమువ్రాసెను. [అభినవభారతి - 3 వ సం - పుట 86]

8. ఇది 'భారతి' అను పదమునకు రెండవ వ్యుత్పత్తి. ఇది భారతీవృత్తిస్వరూపమున కేమాత్రమును సన్నిహితముగా లేదు. భారత్యాది పదములకు అసలు అర్థము విస్మృతమై పోయినదనియు, భరతుడు కూడ ఏదో ఒక రకముగా వ్యుత్పత్తులను చెప్పుటకు ప్రయత్నించెననియు గ్రహించవలసియున్నది. "ఇది కేవలము అక్షరసామ్యమును బట్టి చెప్పబడిన నిర్వచనము మాత్రమే. ఇందు నటవ్యాపారమున్నను అంతరవికల్పాత్మకమైన వాగ్వ్యాపారబాహుళ్య మున్నప్పుడే భారతీవృత్తి అగునని గ్రహించవలెను" అని చెప్పి అభినవగుప్తుడు పై నిర్వచనమునందనాదరము చూపినాడని చెప్పవచ్చును. [అభినవభారతి - 3 వ సం - పుట 86]

9. సత్త్వమనగా మనోవ్యాపారము. సత్త్వప్రధానముగా అనగా సావధానమగు మనస్సుతో చేసిన వ్యాపారమగుటచే ఇది 'సాత్త్వతీవృత్తి' అనబడినది. ఇందలి 24 వ అధస్సూచికను, 7 వ అధ్యాయమందలి 5 వ అధస్సూచికను చూడవలెను.

10. వాసుదేవుని వాచిక-మానసిక-కాయిక వ్యాపారములచే క్రమముగా భారతీ-సాత్త్వతీ-కైశికీ వృత్తులు ప్రవర్తితములైనవి. కైశికివలెనే ఆరభటియును కాయిక వృత్తియే; కాని, కైశికి సవిలాసవ్యాపారము కాగా ఆరభటి ఉద్ధతవ్యాపార మగుచున్నది.

ఇట్లు ప్రపంచవ్యాపారమంతయును వృత్తిచతుష్టయ పరిమితమగుచున్నది; అనగా వాక్ మనః-కాయ వ్యాపారములకంటె అతిరిక్తమైన మానవవ్యాపార మింకేదియును ఉండదు. కార్య (కావ్య) సందర్భము లన్నియును రస-భావ పర్యవసితములే అని తెలియవలెను. ఈ రస-భావములు చేతనములయందే ఉండును. వానియందు వ్యాపారత్రయ శూన్యమైన కావ్యాంశ మేకొంచెమేనియునుండదు. ఈ విషయమును గుర్తెరుంగక భరతాభిప్రాయమునకు విరుద్ధముగా పండితసహృదయమ్మన్యులు కొందరు వృత్తులు ఐదు అనియు, మరికొందరు రెండు అనియు చెప్పుట అసమంజసము. [అభినవభారతి - 3 వ సం - పుటలు 87-88]

11. జప్యమనగా ఇచ్చట భక్త్యావేశము; కవియును బ్రహ్మవంటివాడే కావల

వృత్తులు నాట్యమం దుపయుక్తములగుట

ఆ మధుకైటభుల నిరువురను వాసుదేవుడు సంహరించిన తరువాత బ్రహ్మ అరిందముడగు ఆ నారాయణునితో ఇట్లు చెప్పెను—"అహో విచిత్రములును, విషమములును, ప్రసిద్ధములును అగు అంగహారములతో ఓ దేవ! నీవు రాక్షసులను నాశమొనర్చితివి. ఇప్పట్లు మీ రొనరించిన నియుద్ధమందలి గతిపరిక్రమణమే సర్వశస్త్ర ప్రయోగములందును 'న్యాయ' మై ప్రవర్తింపగలదు."

న్యాయాశ్రితములును, న్యాయసముత్థితములును అగు అంగహారములచే యుద్ధములు ప్రవర్తితములగుచున్నవి కాన వానికిసి 'న్యాయము' లనియే పేరు.[12]

నానాభావరసాన్వితములైన నాట్యప్రయోగములందు తరువాతి కాలములో ఉపయుక్తమగుటకొరకు మహాత్ముడైన బ్రహ్మ ఈ నాలుగు వృత్తులను వేదములందు నిక్షిప్తమొనర్చెను. కావ్యబంధములను ఆశ్రయించి ఉండునవి కాన ఇవి 'వృత్తు' లనబడినవి (వృత్తి=వర్తనము=ఉండుట).

బ్రహ్మ వాసుదేవునిచరితము ననుసరించి స్తోత్రకావ్యరూపముగా ఏయే వ్యాపారములను వర్ణించెనో[13] ఆయా వ్యాపారములను వ్యక్తము చేయదగు పాఠ్యాదిసంయుతములగు వృత్తులనే ఋషులును అనుసరించిరి.

యును. రసాధిష్ఠత్వమే కవికి ముఖ్యము. విస్తారణాత్మకమైన ఆతని వర్ణనాసంపదయు రసప్రధానమే కావలయును. [అభినవభారతి - 3 వ సం - పుట 88]

12. ఈ చివరి వాక్యమునకు మూలమైన 19 వ శ్లోకము 10 వ అధ్యాయమందు కూడ కలదు. [75–76 శ్లో.]—ఆయా వ్యాపారములందు ప్రవర్తించెడి అవయవముల యొక్క సమకాలప్రచారము నృత్తమాతృక అనబడును. 2, లేదా 3, లేదా 4 మాతృకలు ఒకే వ్యాపారమువలె కలిసియుండుట'కరణ'మనబడును. అవిచ్ఛేదముగా ప్రయోగింపబడు కరణములు అంగహారమగును. ఆవిధముగనే యుద్ధాదులందు నృత్తమాతృకకు బదులుగా ఉపయోగింపబడు స్థానకాదిక్రియావిశేషము 'న్యాయ' మనబడును. ఆయా అవయవములతో చేయదగిన వ్యాపారమును చేయుచు అనగా శత్రుభంగమును, ఆత్మరక్షణమును చేసికొనుచు పరస్పరము యుద్ధము చేయుచున్న యోధుల వ్యాపారవిశేషము 'న్యాయ' మనబడునని తెలియవలెను.—[శ్రీ మా. రామకృష్ణకవిగారి అధస్సూచిక - 3 వ సం - పుట 89]. నృత్తమాతృకను గూర్చిన వివరణమునకు 4 వ అధ్యాయమందలి 12 వ అధస్సూచికను చూడవలెను.

శత్రువు విక్రమించినపుడు గతాగతములకు సంబంధించిన శస్త్రాదిలక్షణ్యమగు యుద్ధము నియుద్ధమనబడును. ఇదియే మల్ల (బాహు) యుద్ధము. [అభినవభారతి - 3 వ సం - పుట 88]

13. పాఠ్యప్రధానము భారతి, అభినయప్రధానము సాత్త్వతి, అనుభావాద్యావేశమయరసప్రధానము ఆరభటి, గీతవాద్యోపరంజకప్రధానము కైశికి అని తెలియవలెను. [అభినవభారతి 3 వ సం - పుట 90]



ఈ వాచిక-ఆంగిక-సాత్త్విక అభినయరూపములుగా ఉత్పన్నములైన ఈ వృత్తులను, కావ్యరూపత కలిగించుటకై, నాట్యమునందును కూర్చితిని. అనగా ఋగ్వేదమునుండి భారతిని, యజుర్వేదమునుండి సాత్త్వతిని, సామవేదమునుండి కైశికిని, అథర్వవేదమునుండి ఆరభటిని సంగ్రహించి కావ్యములందు కూర్చితిని" ఈ వృత్తులే అభినేయ-అనభినేయ కావ్యములకు వైలక్షణ్యమును కలిగించునని తెలియవలెను*.

భారతీవృత్తి

1. భారతీవృత్తి— వాగ్వ్యాపారము ప్రధానముగా కలది 'భారతీవృత్తి' అనబడును. దీనిని ప్రయోగించుటకు పురుషులే సమర్థులు. దీనిని స్త్రీలు ఆచరింపరాదు. సంస్కృత పాఠ్యమును ఇందుపయోగించవలెను. స్వనామధేయులైన భరతులచే (నటులచే) ఇది ప్రయుక్తమగును[15]—ఇట్టిది భారతీవృత్తి అనబడును. ప్రరోచన,

14. దీనిని వృత్తుల ఉత్పత్తికి సంబంధించిన ఇంకొక కథనుగా సింగభూపాలుడు తలంచెను. దాని ననుసరించి డా. ఘోష్ కూడ దీనిని భిన్నముగుకథనుగానే పరిగణించెను. కాని ఈ అభిప్రాయము సమంజసముకాదు. వృత్తులు భగవానుడగు వాసుదేవునివలననే నిర్మితములైనవి. అప్పుడు జగమంతయును ఏకార్ణవముగా ఉన్నది. అందుచే తరువాతి కాలములో నాట్యప్రయోగములం దుపయుక్తములగుటకొరకు బ్రహ్మ ఈ నాల్గు వృత్తులను నాల్గు వేదములందును నిక్షేపించెను. పిమ్మట బ్రహ్మ ఆజ్ఞననుసరించి భరతు డా నాలుగు వృత్తులను నాలుగు వేదములనుండి సంగ్రహించి నాట్యమును నిర్మించెనని తెలియవలెను. ఈ పనిని బ్రహ్మయే స్వయముగా చేసినట్లు ప్రథమాధ్యాయమందుకలదు. పాఠ్యప్రధానమైన ఋగ్వేదమునుండి భారతీవృత్తి, గీతప్రధానమైన సామవేదమునుండి కైశికీవృత్తి, అభినయప్రధానమైన యజుర్వేదమునుండి సాత్త్వతీవృత్తి, రసప్రధానమైన అథర్వవేదమునుండి ఆరభటీవృత్తి సంగ్రహింపబడినవని తెలియవలెను,

*[కాశీ ముద్రణమునందు 22 వ అధ్యా-1-24 శ్లో: బొంబాయి ముద్రణమునందు 20 వ అధ్యా-1-24 శ్లో: బరోడా ముద్రణమునందు 20 వ అధ్యా-1-25 శ్లో.]

15. భారతీవృత్తి సంస్కృతపాఠ్య మందుండునని చెప్పుటచే ప్రాకృతపాఠ్యమందలి లాలిత్యము కైశికీవృత్తిచే ప్రవర్తితమగునని తెలియవలెను. భరతవంశమునందు జనించినవారు భరతులు. అట్టి భరతులచే ప్రయుక్తమగునది కాన ఇది 'భారతీవృత్తి' అనబడినది. స్వనామధేయు లనగా భూమికాధారణముచేయని నటులనికూడ అర్థము చెప్పవచ్చును. ఈ అర్థము చెప్పినచో భారతీవృత్తి ప్రరోచనాదులందు మాత్రమే ప్రయుక్తమగునని చెప్పవలసివచ్చును. ఇట్టి అర్థమును కొందరు చెప్పినారు. కాని, అది సమంజసముగా కన్పట్టదు. నాట్యమందలి వాచికమంతయును భారతీవృత్తియే. 3 వ విశేషాంశమును చూడవలెను.

ఇచ్చట ఇంకొకవిషయమును గుర్తునందుంచుకొనవలయును-ఈ వృత్తులు లక్ష్యములందు ఎల్లప్పుడును పరస్పరము సంకీర్ణములుగనే ఉండును. కాని, వానిలో ఏభాగమందు ఏది

ఆముఖము, వీథి, ప్రహసనము అను భేదములచే భారతీవృత్తి నాలుగు విధములు[16].

(1) ప్రరోచన : జయమును అభ్యుదయమును సూచించునదియును, మంగళావహమును, విజయప్రదమును, సర్వపాపప్రశమనమును, పూర్వరంగమందు ప్రయుక్తమును[17] అగునది 'ప్రరోచన' అనబడును.

(2) ఆముఖము : నటికాని, విదూషకుడు కాని, పారిపార్శ్వకుడు కాని సూత్రధారునితోకలిసి ప్రస్తుత కార్యమునకు సంబంధించిన చిత్రవాక్యములతో, వీథ్యంగములతో, స్పష్టములైన ఉక్తి-ప్రత్యుక్తులతో చేయు సంలాపము 'ఆముఖ'

---

ప్రధానముగా కన్పట్టునో ఆ పేరుతోనే అది వ్యవహరింపబడుచుండును. వాక్-మనః-కాయ చేష్టలలో ఒకచేష్ట వివిక్తముగా ఉండుట ఎన్నడును పొసగదుకదా. కాయికచేష్ట కూడ మానసిక-వాచికచేష్టల సూక్ష్మాంశములలో వ్యాప్తమైయుండును; అట్లే మానసిక-వాచిక చేష్టలును. ఇంక రసోపయోగియగు లాలిత్యభాగము (కైశికి) లేని వ్యాపార మేదియును నాట్యమందుండదని చెప్పవచ్చును. వాగ్వ్యాపారము సర్వకాలసర్వావస్థల యందును దేహిని అనుసరించియే ఉండును. అట్లే మానసికవ్యాపారము లేనిదే ఏ చేష్టయును ఉండదు. కావున వృత్తులు నాట్యమందు పరస్పర సంవలితములై కన్పట్టుచుండునని తెలియవలెను. [అభినవ భారతి-3 వ సం-పుట 91]

16. విధములనుటచే ఇవి నాలుగును నాలుగు ప్రకారములు కావనియు, నాలుగు అంగములు లేదా అంశములు మాత్రమే అనియు గ్రహించవలెను. వీథీ-ప్రహసనములు రూపకభేదములుగా 18 వ అధ్యాయమందు నిరూపితములైనవి. ఇవి రూపకమునకు అంగములు కావు; నాట్యమునకు అంగములని చెప్పవచ్చును. నాట్యమునకు అంగములనుటచే నాట్యము సముదాయరూపమని చెప్పినట్లైనది. [అభినవభారతి-3 వ సం - పుట 92]

ఆదిలో పూర్వరంగమును, ప్రస్తావనయును శుద్ధములు(simple) గా ఉండెడివి. ఈశ్వర ప్రసాదితమగు నృత్తమును చేర్చుటచే శుద్ధపూర్వరంగము చిత్రపూర్వరంగమైనది. అట్లే రంజనాతిశయార్థము ప్రరోచనా-ప్రస్తావనలకు తరువాతి కాలములో వీథీ-ప్రహసనములు కలిసియుండును. [డా. రాఘవన్-"వృత్తి"-పుట 369]

17. పూర్వరంగమందు ప్రయుక్తమగునని చెప్పిన ప్రరోచన భారత్యంశమే అని తెలియవలెను. 5 వ అధ్యాయమందలి 10 వ అధస్సూచికను చూడవలెను. అచ్చటి 'నాంది'యే ఇచ్చట ప్రరోచనగా చెప్పబడినదని అభినవగుప్తుడు పేర్కొనెను. [అభినవభారతి-1 వ సం-పుట 217]

5 వ అధ్యాయమందలి ప్రరోచనా నిర్వచనము [బరోడా ముద్రణము-135 శ్లో.]; ఇచ్చట మరల చెప్పబడినది. ఇది ఒక్క వ్రాతప్రతిలో మాత్రమే కలదట— "హేతుయుక్తి సమాశ్రయముగా ఆయా కారణములను కూర్చుటచే కావ్యార్థసూచనముచేసి, ప్రయోగింపబోవు రూపకమందు సామాజికులకు ప్రీతి కలుగునట్లు చేయుట 'ప్రరోచన' అనబడును." —ఈ ప్రరోచనయును, నాందీరూపమైన ప్రరోచనయును ఒక్కటి కాదని తెలియవలెను.



మనబడును; దీనికే 'ప్రస్తావన' అనియు పేరు.[18] ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవృత్తకము, అవలగితము అనెడి అంగములైదును ఆముఖ భేదములు—వీనిలో ఉద్ఘాత్యకము,[19] అవలగితము అను రెండింటి లక్షణములను ఇంతకుముందే (18 వ అధ్యాయమున-వీథ్యంగ నిరూపణమునందు) వివరించియున్నాను. ఇంక తక్కినవాని లక్షణముల నిప్పుడు వివరింతును.

కథోద్ఘాతము : సూత్రధారుడు ప్రయోగించిన వాక్యమును కాని, ఆ వాక్యార్థమును కాని గ్రహించి పాత్ర రంగస్థలమునందు ప్రవేశించుట 'కథోద్ఘాత' మనబడును.[20]

---

18. ముఖసంధిపర్యంతమును ఉండునది కాన, లేదా ముఖము అనగా కథారంభము ఇందు కొలదిగా సూచింపబడును కాన ఇది 'ఆముఖ' మనబడినది. ఆముఖమందు సూత్రధారు డవశ్యముగా ఉండును. వానితో నటి మొదలగువారిలో ఒకరు కాని, ఇరువురుకాని, ముగ్గురుకాని కలిసి సంలాపము చేయుదురు. సాధారణముగా నటికాని పారిపార్శ్వక-విదూషకులలో ఒకరుకాని తప్పక ఉందురు. అభిజ్ఞానశాకుంతలాదులందు నటీ-సూత్రధారులు మాత్రమే కలరు. ఊరుభంగ-ఉత్తరరామచరితాగులందు నటిలేదు; నటుడు లేదా పారిపార్శ్వకుడు మాత్రమే కలరు. పారిపార్శ్వకునకు బదులు విదూషకుడున్న రూపకము లత్యల్పములు. నటీ-సూత్రధారులు, విదూషక-పారిపార్శ్వకులు-మొత్తము నలుగురును ఉన్నరూపకము లేదనుకుందును. "ఇందు పాత్రలధికముగా ఉండరాదు" అని భరతుడే తరువాత చెప్పును.

ఈ ఆముఖము ప్రస్తావన అనబడినది. పూర్వరంగమందు ఇంకొక ప్రస్తావన చెప్పబడినది ఇచ్చట ఈ విషయమును గ్రహించవలసియున్నది. ప్రస్తావన రెండు విధములు : పూర్వరంగాంగమైన దానియందు కవి ఉదాసీనుడు (అనగా తటస్థుడు); అది వాని రచన కాదు. అచ్చట స్థాపకుడు స్వతంత్రించి పూర్వరంగమును కార్యాభిముఖముగా నడుపును; ధ్రువాగానాదులకాతడే కర్త. ఇంక భాణాంగమునందు కార్యము పూర్వరంగాభిముఖముగా నడిపింపబడును. ఇందు ప్రరోచనాదులు, ఋతువర్ణన, పాత్రప్రవేశసూచనము మున్నగునవి ఉండును. వీనినెల్ల కవియే రచించును. [అభినవభారతి -1 వ సం - పుట 248; 3 వ సం - పుట 93.]

19. కుమారగిరిరెడ్డి 'వసంతరాజీయము' నందు పేర్కొనిన 'ఉద్ఘాత్యక' లక్షణమును పుట 529 లో ఉదాహరించియున్నాను. ఆముఖాంగము లైదింటిలోను కథోద్ఘాతాదులు మూడును పాత్రప్రవేశ సూచకములు. ఉద్ఘాత్యక-అవలగితము లిట్టివి కావు. ఇవి ప్రశ్న-ప్రతివచనరూపములై వైచిత్ర్యాత్మకములుగానుండును. వీథ్యంగములైన ఈ రెండును ప్రస్తావన యందుండుటనుబట్టి వీథి ప్రస్తావనలో కలిసిపోయినదని చెప్పవచ్చును.

20. వాక్యము నవలంబించిన కథోద్ఘాతము 'రత్నావళి' యందును, వాక్యార్థము నవలంబించిన కథోద్ఘాతము ప్రతిమానిరుద్ధమందును కలవు. "కావ్యార్థరూపమైనద (కథ)

ప్రయోగాతిశయము : నాట్యమునకు సంబంధించిన వస్తువును సూత్రధారుడు ప్రస్తావనయందు ప్రయోగింపగా దాని ననుసరించి పాత్ర ప్రవేశించుట 'ప్రయోగాతిశయ' మనబడును.[21]

ప్రవృత్తకము : సూత్రధారుడు కాలప్రవృత్తిని (ఏదేని ఒక 'ఋతువును') ఆశ్రయించి వస్తువర్ణనము చేసినచో తదనుసారముగా పాత్ర ప్రవేశించుట 'ప్రవృత్తక' మనబడును (వేణీసంహారప్రారంభమందు ప్రవృత్తకము కలదు.)

అర్థానుసారముగా వీనిలో ఏదో ఒకదానిని ప్రస్తావనయందు సుశ్లిష్టముగా ప్రయోగించవలెను. ప్రస్తావనయందు పాత్ర లధికముగా ఉండరాదు. ఉక్తి-ప్రత్యుక్తులు మొదలగువానిచే గ్రంథము నధికముగా నిరూపించవలెను. ఇట్లు ప్రస్తావన బహువిధములుగా ఉండునని బుధులు తెలియవలెను.[22] అష్టార్ధవికల్పమైన భారతీవృత్తి పై విధముగా ఉండును.[23]

(3) వీథి, (4) ప్రహసనము : వీని లక్షణములను ఇదివరకే (18వ అధ్యాయమందు) వివరించియున్నాను.

## సాత్త్వతీవృత్తి

2. సాత్త్వతీవృత్తి—న్యాయములతోను ఉచితములగు ఇతర వ్యాపారములతోనుకూడినదియును, హర్ష భావమధికముగాకలదియును, శోక భావము లేనిదియును

---

మొదటనే గమ్యమానమగును కాన ఇది కథోద్ఘాతమనబడినది. [అభినవభారతి—3 వ సం-పుట 94]

21. ఇచ్చట ప్రయోగములో (ప్రస్తావనయందు) ప్రయోగము (నాట్యమునకు సంబంధించినవస్తువు)కూడియుండును కానఇది ప్రయోగాతిశయమనబడినది. విక్రమోర్వశీయ ప్రారంభములో ప్రయోగాతిశయము కలదు. [అభినవభారతి 3 వ సం - పుట 95]

22. ఆ ముఖాంగములైదింటిని ఒకేసారి ప్రయోగించవలసియుండునని తలంచరాదు; అట్లు తలంచినచో అది మునిమతవిరుద్ధమని తెలియవలెను. అర్థానుసారముగా వీనిలో ఏదో ఒకదానిని మాత్రమే సుశ్లిష్టముగా సంయోజనము చేయవలయును. ఎచ్చటనేని రెండంగములను కూడ కూర్చవచ్చును. (ఈ వాక్యమునకు మూలమైన శ్లోకార్థము ఒక వ్రాతప్రతిలోనే కలదట) ఆముఖము అల్పపాత్రముగా ఉండవలెననుట గమనార్హము. 18 వ అధస్సూచికను కూడ చూడవలెను.

23. అష్టార్థమనగా నాలుగు. నాలుగు భాగములుగాఉన్న భారతీవృత్తిపైన వివరింపబడినది. కాని డా. ఘోష్ 'అష్టార్థము'అనగా ఎనిమిది అను అర్థమును గ్రహించి ప్రరోచనా-వీథీ-ప్రహసనములు మూడును, ఆముఖాంగములైదును కలిసి మొత్తము ఎనిమిది భాగములగునని పేర్కొనెను. [నా. శా ఆంగ్లానువాదము - పుట 405 - అధస్సూచిక]



అగు మానసవ్యాపారము 'సాత్త్వతీవృత్తి' అనబడును.[24]

సత్త్వజన్యములగువాక్యములందు సాత్త్వికాభినయ మధికముగాను, వాచిక-ఆంగికాభినయములు అల్పములుగాను ఉండును. వీర-అద్భుత-రౌద్ర రసములందు ఇది ప్రయుక్తమగును. ఇందు శృంగార-కరుణ-నిర్వేదము లుండవు[25] (అల్పముగా ఉండునని పాఠాంతరము కలదు) ఉద్ధతులైన పురుషుల పరస్పరాధర్షణములందిది అధికముగా ప్రయుక్తమగును.

ఇట్టి సాత్త్వతీవృత్తి భేదములు నాలుగు కలవు—ఉత్థాపకము, పరివర్తకము, సల్లాపకము, సంఘాత్యము.

(1) ఉత్థాపకము : మానసిక సంఘర్షమును సూచించు వ్యాపారము 'ఉత్థాపక' మనబడును.[26] అనగా "ఇదిగో, నేనుకూడ సిద్ధముగానే ఉన్నాను. లెమ్ము. నీశక్తిని చూపుము" అనెడి సంఘర్షసముత్థములైన వాక్యములతో కూడినది ఉత్థాపక మనబడును.

---

24. సత్=సత్త్వము=ప్రకాశము. ఇట్టి 'సత్తు కలది సత్వత్తు'అనగా ప్రకాశవంతమైన మనస్సు. ఇట్టి ప్రకాశవంతమైన మనస్సునందు జనించునది 'సాత్త్వతము' అనబడును.

ఇందలి 9 వ అధస్సూచికను, పుటలు 255-256 చూడవలెను.

"సాత్త్వతేన న్యాయేన"అని అభేదాన్వయము చేయుటయును పొసగును. కాని ఇచట న్యాయశబ్దముచే నాలుగువిధములగు న్యాయములను గ్రహించవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 96]

25. మనస్సు శృంగారమునందు విషయనిమగ్నమగును, కరుణమునందు కాందిశీకమగును, నిర్వేదమందు మూఢమగును. ఈ శృంగారాదులందు మానసవ్యాపారము కొంత ఉన్నను క్రోధ-విస్మయ-ఉత్సాహములందువలె సాతిశయముగా పరిస్ఫురించదు. ఆధర్షణమనగా మాటలతో తిరస్కరించుట. [అభినవభారతి - 3 వ సం - పుట 97]

26. మానసపరిస్పందమును ఉత్థాపితము చేయునది కాన ఇది ఉత్థాపక మనబడినది. ఔపచారికముగా, తత్సూచకమగు వ్యాపారక్రమము కూడ ఉత్థాపక మనబడును. ఉదా: వేణీసంహారచతుర్థాంకప్రారంభములో భీముడు—"ఓహోహో! మీ రందరును ఆలకింపుడు. పాంచాలరాజాత్మజాశిరోరుహములను స్పృశించి, కురురాజు అందరియెదుట ఆపె వస్త్రమును కూడ అపహరించిన పశువు (దుశ్శాసనుని) యొక్క రొమ్ము చీల్చి అందలి రక్తమును త్రాగుటకు ప్రతిజ్ఞపట్టియున్నాను. ఆ పశు వీనాడు నా బాహు పంజరములందు చిక్కినాడు. ఓ కౌరవులారా! సామర్థ్యమున్నచో వానిని రక్షింపుడు". [అభినవభారతి - 3 వ సం - పుట 97]

(2) పరివర్తకము: హృదయసంఘర్షముచే చేయదలచిన కార్యమును విడిచి, కారణాంతరముచే వేరొక కార్యము నాచరించుట 'పరివర్తక' మనబడును[27]

(3) సల్లాపకము (సంలాపకము): ఆధర్షణ సహితముగా కాని, ఆధర్షణ రహితముగా కాని ఇతరుల నధిక్షేపించి మాటాడుట 'సల్లాపక' మనబడును.[28]

(4) సంఘాత్యము: సామాద్యుపాయశక్తిచేకాని, అర్థశక్తిచేకాని, దైవవశమున కాని, ఆత్మదోషమువలన కాని సంఘాతము భేదింపబడుట 'సంఘాత్య' మనబడును.[29]

---

27. ఉదా: వేణీసంహార ప్రథమాంకములో ఆయుధాగారమును ప్రవేశింపదలచిన భీముడు ద్రౌపదీచతుశ్శాలను ప్రవేశించెను. అంతట ఆయుధాగారదర్శనేచ్ఛను విడనాడి పాంచాలిని చూచుటకే నిర్ణయించుకొనుట. [అభినవభారతి - 3వ సం - పుటలు 97-98]

కొన్ని వ్రాతప్రతులలో ఈ క్రింది అర్థము కల శ్లోకము కలదట—"పరివర్తకము మూడు విధములుగా ఉండును—నిర్దిష్టవస్తు విషయము, ప్రపంచబద్ధమైన త్రిహాస్య సంయుక్తము, సంఘర్షవిశేషకృతము. [బరోడా ముద్రణము - 47వ శ్లో]

28. ఉదా: వేణీసంహారతృతీయాంకమందు సూతుడు అశ్వత్థామతో ద్రోణమరణమును వివరించుచు "అశ్వత్థామ హతుడయ్యెనని పృథాసూనుడు స్పష్టముగా పలికి, ఆ సత్యవచనుడు మెల్లగా 'గజము' అని పలికెను"—అని చెప్పుటలో ధర్మజుని మొదట పృథాసూనుడని పిమ్మట సత్యవచనుడనుట [అభినవభారతి-3వ సం - పుట 98]

దీనికి ఇంకొక నిర్వచనము కలదు—ధర్మాధర్మములచే జనించు రాగదోషసహితమగు సాధిక్షేపవచనము సల్లాపకమనబడును" [బరోడా ముద్రణము-49వ శ్లో.]

29. ఉదా: వేణీసంహారమందు భీముడు ధర్మజునిపై అలుగుట, అర్జునుడు శిఖండిని పురస్కరించుకొని యుద్ధమొనర్చుట, సుతమరణమును విన్నచో అస్త్రమును విడుతునని ద్రోణుడనుట (ఇది దైవవశము), కర్ణునితో కలహించి అశ్వత్థామ శస్త్రసన్న్యాస మొనర్చుట (ఇది ఆత్మదోషము) [అభినవభారతి-3వ సం-పుట 99]

దీనికి ఇంకొక నిర్వచనము కలదు— "అనేకకపటములలో, ఇతరులను చంపవలెననెడి ఆశయముతో ప్రయోగింపబడిన కూటముల యొక్క సంఘాతము 'కూటసంఘాత్య' మనబడును [బరోడా ముద్రణము-51వ శ్లో.]. "అష్టార్థవికల్పమైన సాత్త్వతీవృత్తిని వివరించియున్నాము"అని మూలపాఠమును గ్రహించి వెనుకటివలెనే 'ఎనిమిది అర్థములు' అని చెప్పి, ఉత్థాప-పరివర్తములు రెండు, సల్లాపకభేదములు రెండు (ఆధర్షణసహితము, అధర్షణరహితము), సంఘాత్యభేదములు నాలుగు(సామోపాయజము, అర్థశక్తిజము, దైవశక్తిజము ఆత్మదోషజము) —మొత్తము ఎనిమిది అగునని డా. ఘోష్ పేర్కొనెను [నా. శా. ఆంగ్లానువాదము-పుట 406]

నాలుగు రకముల సంఘాత్యమునకును ఉదాహరణములు:—

(1) సామాద్యుపాయశక్తిచే జనించు సంఘాత్యకము—శిఖండిని ముందుంచుకొని యుద్ధముచేయుట అనెడి సామోపాయముచే భీష్ముడు భేదింపబడుట.



కైశికీవృత్తి

3. కైశికీవృత్తి—సుకుమారవస్త్ర-మాల్యాదులచే చిత్రమైనదియును, గీత-నృత్తబహులమును, స్త్రీలచే ప్రయోగింపబడునదియును, కామోపభోగముచే (రతిచే) జనించునదియును అగు వ్యాపారము 'కైశికీవృత్తి' అనబడును.[30] ఈ కైశికీవృత్తి యందు నాలుగు భేదములు కలవు— నర్మము, నర్మస్ఫుంజము, నర్మస్ఫోటము, నర్మగర్భము.

(1) నర్మము: వీరరసరహితమై, విశుద్ధవ్యాపారములతో శృంగారమును స్థాపించు హాస్యప్రధానమగు వచనము 'నర్మ' మనబడును. ఇందుపయుక్తమగు హాసము మూడు విధములుగా ఉండును- ఈర్ష్యనుకాని క్రోధమునుకాని సూచించునది; పరులను ఉపాలంభించుటతో కూడినది; వంచనాపూర్వకముగా పరుల హృదయమును గ్రహించుటకు ప్రయుక్తమైనది. ఈ మూడు విధములగు హాసభేదములచే నర్మమును మూడువిధములగుచున్నది[31].

(2) నర్మస్ఫుంజము: ప్రేయసీప్రియులు అన్యోన్యానురాగమును వ్యక్తము చేయు వాక్యములతోను, వేషములతోను తొలిసారిగా కలిసికొనియు (ఇది నవసంగమసంభోగమనబడును) పూర్వనాయికవలని భయముచే వెంటనే విడిపోవుట 'నర్మస్ఫుంజ' మనబడును[32].

---

(2) దైవశక్తిజనితమగు సంఘాత్యము—'నా కుమారుడు చనిపోయిన మాటవిన్నచో శస్త్రమును విడుతు'నని ద్రోణుడు ప్రతిన పూనుట.

(3) ఆత్మదోషజసంఘాత్యము— కర్ణునితో కలహించి అశ్వత్థామ శస్త్రసన్న్యాస మొనర్చుట [అభినవభారతి-3వ సం - పుట 99]

ఇచ్చట మూడు భేదములే చెప్పబడినవి. కాని, (1) మంత్రశక్తిజము (సామోపాయజము), (2) అర్థశక్తిజము (ధనముచే చేయబడునది), (2) దైవవశజము, (4) ఆత్మదోషజము అని నాలుగు భేదములను కల్పించవచ్చును.

30. దీనికి ఇంకొక నిర్వచనము కలదు—'బహువాద్య-నృత్త-గీతములు, శృంగారాభినయము, చిత్రనైపథ్యము, మాల్యాలంకారములు, ప్రశస్తవేషము, చిత్రవాక్యపదబంధములును కలిగినదై హసిత-రుదిత-రోషములతో కూడిన స్త్రీ-పురుష కామవ్యాపారము 'కైశికీవృత్తి' అనబడును" [బరోడా ముద్రణమునందు-54-55 శ్లో.]

31. నర్మ మనగా శృంగారోచితమైన వ్యాపారము. మూడు విధములగు నర్మములకును అభినవగుప్తుడు 'రత్నావళి' నుండి ఉదాహరణము లొసంగెను. [అభినవభారతి-3వ సం - పుట 101]

32. నవసంగమసంభోగ మనగా క్రొత్తకలయికమాత్రము. నర్మమునకు స్ఫుంజము అనగా విఘ్నము కలుగును గాన ఇది నర్మస్ఫుంజ మనబడినది. 'రత్నావళి' యందు ఉదయన-సాగరికలు కలిసి విడిపోవుట ఇందుల కుదాహరణము [అభినవభారతి - 3వ సం - పుట-101.]

(3) నర్మస్ఫోటము : భయ-హాసాది వివిధభావములయొక్క రసస్థితినందని అంశములచే శృంగారము వైచిత్ర్యసహితమగుట 'నర్మస్ఫోట' మనబడును.[33]

(4) నర్మగర్భము : శృంగారోపయోగులగు విజ్ఞాన-రూప-శోభా-ధనాది గుణములను కార్యవశమున రహస్యముగా ఉంచి, నాయకుడు ప్రచ్ఛన్నరూపుడై వ్యవహరించుట 'నర్మగర్భ' మనబడును.[34] ఇట్లు అష్టార్ధ వికల్పమైన కైశికీవృత్తిని వివరించియున్నాను.

ఆరభటీవృత్తి

4. ఆరభటీవృత్తి––ఆరభటులయొక్క క్రోధ-ఆవేగాది గుణములు, వివిధములగు కపటములు, వంచనములు, దంభములు, అనృతవాక్యములు కలిగి దీప్తరసములగు రౌద్రాదులందు ప్రయుక్తమగునది 'ఆరభటీవృత్తి' అనబడును,[35]

---

33. నర్మమునకు స్ఫోటము అనగా వైచిత్ర్యము (చమత్కారోల్లాసకృతస్ఫుటత్వము) కలుగును కాన ఇది నర్మస్ఫోట మనబడినది. ఉదా : రత్నావళిలో—

సుసంగత :— ఎవరికొరకు నీ విచ్చటికి వచ్చితివో ఆత డిచ్చటనే ఉన్నాడు.

సాగరిక :— సఖి! నే నెవరికొరకు కిచ్చటికి వచ్చినానె?

—ఇచ్చట సుసంగత వాక్యములలో హాస్యలేశము, సాగరిక పలుకులలో రౌద్రలేశము కలదు. అవి రసములు మాత్రము కావు. ఇట్లు అంతటను సంభావించవలెను. [అభినవభారతి-3 వ సం-పుట 102]

34. నర్మగుణములు గర్భితములు అనగా ప్రచ్ఛన్నము లగుటవలన ఇది నర్మగర్భ మనబడినది. నాయకుడు ప్రచ్ఛన్నరూపుడై సంకేతస్థానమునుగూర్చి వెడలుట మొదలగునవి ఇందుల కుదాహరణములు.

దీనికి ఇంకొక నిర్వచనము కలదు–– "నాట్యప్రయోగములందు పూర్వనాయకుడు ఏదేని ఒక కారణముచే విపత్తిని చెందగా మరియొకడు తత్‌స్థానమందు అట్లే వ్యవహరించుటయు నర్మగర్భమే అగును" [బరోడా ముద్రణమునందు 62 వ శ్లో.] మనుచరిత్రయందలి మాయాప్రవరుని ఇందుల కుదాహరణముగా పేర్కొనవచ్చును. విజ్ఞాన-రూప-శోభా-ధనాది గుణము లనుటకు బదులుగా "విజ్ఞాన-రూప-సంభావనాది గుణము"లను పాఠమును డా. ఘోష్ గ్రహించెను. ఇట్లు, నర్మగర్భము మూడు విధములు, నర్మము మూడు విధములు, నర్మస్ఫుంజ-నర్మస్ఫోటములు రెండు— మొత్తము ఎనిమిది అంగములగుచున్నవి.

35. దీనికి ఇంకొక రెండు నిర్వచనములు కలవు—"పుస్తములు, పడుట గెంతుట దాటుట ఛేదించుట 'మొదలగునవి, మాయాకృతమగు ఇంద్రజాలము, చిత్రయుద్ధములు కలిగియుండునది 'ఆరభటీ' వృత్తి అనబడును" "షాడ్గుణ్యముతో, వంచనా-విద్రవములతో, లాభాలాభములతో కూడియుండునది 'ఆరభటీవృత్తి' అనబడును." [బరోడా ముద్రణమునందు-65, 66 శ్లో.]



ఆరభటీవృత్తియందు నాలుగు భేదములుకలవు—సంక్షిప్తకము, అవపాతము, వస్తూత్థాపనము, సంఫేటము. వీని లక్షణములను వరుసగా వివరింతును—

(1) సంక్షిప్తకము : అన్వర్థములైన శిల్పములు, విపులములగు పుస్తములు, విచిత్రమగు నేపథ్యము మున్నగువానిచే సంజ్ఞామాత్రముగ వస్తువులను సూచించుట 'సంక్షిప్తక' మనబడును.

(2) అవపాతము : అధికమగు హర్షముచే కాని భయముచే కాని శీఘ్రముగా పాత్రలప్రవేశ-నిర్గమములు జరుగుట, విద్రవముచే కాని వినిపాతముచే కాని ఆవేగప్రధానమగు చేష్ట చేయుట 'అవపాత' మనబడును.

(3) వస్తూత్థాపనము : సర్వరసములను (వివిధములగు స్థాయి - వ్యభిచారి భావములను) సంగ్రహముగా నిబంధించుటచేతను కాని, అగ్నిప్రమాదాదులతో కాని, అవి లేకుండగ కాని భావివస్తువును హృదయగోచరము చేయుట 'వస్తూత్థాపన' మనబడును.

(4) సంఫేటము : సంరంభముచే ప్రయుక్తమగునదియును, అనేకవిధములగు యుద్ధ-నియుద్ధ-కపటాదులతో కూడినదియును, శస్త్రప్రహారములతో నిండినదియును 'సంఫేట' మనబడును.

ఇంతవరకును నాట్యసంశ్రయములగు వృత్తుల స్వరూపములను వివరించియున్నాను. ఇంక ఏ వృత్తి ఏ రసమునందు ప్రయుక్తము కావలయునో వివరింతును.

హాస్యశృంగారబహులా కైశికీ పరిచక్షితా।
సాత్త్వతీ చాపి విజ్ఞేయా వీరాద్భుతశమాశ్రయా ॥ 73
రౌద్రే భయానకే చైవ విజ్ఞేయారభటీ బుధైః।
బీభత్సే కరుణే చైవ భారతీ సంప్రకీర్తితా ॥ 74

—కైశికి హాస్య-శృంగారములందును, సాత్త్వతి వీర-అద్భుత-శమములందును,[36] ఆరభటి రౌద్ర-భయానకములందును, భారతి బీభత్స-కరుణములందును[37] అధిక

---

36. 'వీరాద్భుతశమాశ్రయా' అనుటలో 'శమము' చే శాంతరసము చెప్పబడినదని శాంతరసవాదుల అభిప్రాయము. కాని కొందరు 'వీరాద్భుతసమాశ్రయా' అని పఠింతురట. [అభినవభారతి - 3 వ సం - పుట 105.] 'వీర-రౌద్ర-అద్భుతాశ్రయ' మని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము.

37. 'ఆరభటి భయానక - బీభత్స - రౌద్రాశ్రయము'; 'భారతి కరుణ - అద్భుత సంశ్రయము' అని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠములు.

వృత్తుల రసప్రయోగమును గూర్చి కోహలమతము క్రింది విధముగా ఉన్నదట [బరోడా ముద్రణము - పుట 105 - శ్రీ మా. రామకృష్ణకవిగారి అధస్సూచిక]—

మూగా ప్రయోగింపబడవలెను.[38]

ఇంతవరకును సాత్త్వికం (7 వ అధ్యా.)-ఆంగిక (8-13 అధ్యా.)- వాచిక (14-19 అధ్యా.) అభినయములను మూడింటిని, వృత్తులను వివరించియున్నాను. ఇంక ఆహార్యాభినయమును వివరింతును.*

వింశాధ్యాయము సమాప్తము

## విశేషాంశములు

### 1. వృత్తుల ఉత్పత్తిక్రమము.

వృత్తుల ఉత్పత్తిని గూర్చి శారదాతనయుడు చెప్పిన కథను 6 వ అధ్యాయముచివర 4 వ విశేషాంశములో వివరించియున్నాను. అందు కైశికీ - ఆరభటీ - సాత్త్వతీ - భారతీ వృత్తులు క్రమముగా ఉత్పన్నములైనట్లు చెప్పబడినది. నాట్యశాస్త్రప్రథమాధ్యాయమందు భరతుడు ప్రథమముగా భారతీ - సాత్త్వతీ - ఆరభటీ వృత్తులతో కూడిన నాట్యమును ప్రదర్శించెననియు, పిమ్మట బ్రహ్మ ఆదేశమునుసరించి కైశికీవృత్తిని చేర్చెననియు చెప్పబడినది. ఈ అధ్యాయమందు చెప్పబడిన క్రమము పైవాటికి భిన్నముగా కన్పట్టుచున్నది; కాని, ఈక్రమమే సమంజసమని చెప్పవచ్చును..

సర్వకావ్యములకును వృత్తులు మాతృకలని భరతుడు 18 వ అధ్యాయ ప్రారంభమున పేర్కొనియుండెను. దానిపై అభినవగుప్తుడు చేసిన వ్యాఖ్యానమును 18 వ అధ్యాయమందలి 18 వ అధస్సూచికలో వివరించియున్నాను. కాని వృత్తులు ఆదిలో నాట్యమునకు మాత్రమే సంబంధించినవనుట నిశ్చయము.

మనము ఏకర్మను ఆరంభించినను అందు వాక్ - మనః - కాయ వ్యాపారములుండును (ఈమూడు వ్యాపారములనే త్రికరణములందురు). వృత్తియును, వ్యాపారమును పర్యాయపదములు. వాగ్రూపమైన వ్యాపారము 'భారతీవృత్తి' అనబడును. మనోవ్యాపారము 'సాత్త్వతీవృత్తి' అనబడును. కాయికమైన అనగా చేష్టాప్రధానమైన వ్యాపారము 'ఆరభటీవృత్తి' అనబడును. ఇంక ఆయా వ్యాపారములందు కన్పట్టు శోభాదికమంతయును 'కైశికీవృత్తి' అనబడును.

నాట్యము అభినయాత్మకము. అందుచే నటులచే ప్రయుజ్యమానములగు ఈవృత్తులు నాట్యమునందు ప్రత్యక్షభావనాయోగ్యములగుచున్నవి. రూపకమందు ఎచ్చట వాగ్వ్యాపార మధికముగా ఉండునో, ఎచ్చట క్రియకు ప్రాధాన్యము ఉండదో అచ్చట భారతీవృత్తి ఉండునని తెలియవలెను. అట్లే ఎచ్చట సాత్త్విక-ఆంగిక అభినయములకు ప్రాధాన్యము ఉండునో అచ్చట సాత్త్వతీవృత్తి ఉండును. గీత-ఆతోద్య-నృత్యాది రంజకవర్గ మెచ్చట ప్రయుక్తమగునో అచ్చట కైశికీవృత్తి ఉండును. ఇంక చేష్టాప్రధానమైనచోట ఆరభటీ వృత్తి ఉండును.

అభినవగుప్తుని మాటలలో చెప్పవలెనన్నచో భారతి వాక్చేష్ట లేదా వాచికాభినయము లేదా పాఠ్యము. సాత్త్వతి మనశ్చేష్ట లేదా సాత్త్వికాభినయము. ఇంక కాయచేష్ట రెండు విధములు—సుకుమారము లేదా ఉద్ధతము; మొదటిది కైశికి, రెండవది ఆరభటి.

శ్రీ ఆర్. వి. జాగీర్దార్ భారతీయ నాట్యోత్పత్తిని గూర్చి చర్చించుచు ఈ వృత్తుల క్రమము భారతీయనాట్యోత్పత్తిక్రమమును నిరూపించుచున్నదని నిర్దేశించెను. [Drama in Sanskrit Literature, 1947]. ఆతని అభిప్రాయముప్రకారము పౌరాణికసూతుని కథాకథనమునుండియే రూపకము రూపొందినది. ఆ సూతుడే రూపకములందు సూత్రధారుడైనాడు. ఈ క్రమపరిణామములో నాలుగు అవస్థలు కన్పట్టగలవు. ఆ నాలుగు అవస్థలును పై నాలుగు వృత్తులకును క్రమముగా సంబంధించియున్నవి—

(1) సూతుడు తాను స్వయముగా కథను చెప్పుట— భారతీవృత్తి.

(2) సూతుడు ఇతర గాయకులతో (కుశీలవులతో) కలిసి కథను చెప్పుట— సాత్త్వతీవృత్తి.

(3) పౌరాణికగాథలు సంభాషణాప్రధానములు కాగా ఆహార్యాదికమునకును, నటికిని ప్రాధాన్యము వచ్చుట— కైశికీవృత్తి.

(4) పౌరాణికేతివృత్తములు అంకములుగా విభజింపబడి, దృశ్యత్వము ప్రాధాన్యమును వహించుట— ఆరభటీవృత్తి.

పై విధముగా నాట్యశాస్త్రమందు వర్ణింపబడిన నాలుగు వృత్తులును రూపక పరిణామ చరిత్రయందు నాలుగు దశలను సూచించుచున్నవని శ్రీ జాగీర్దార్ అభిప్రాయము.

ఇచ్చట ఇంకొక విషయమును గుర్తించవలసియున్నది. దశరూపములును నాటక-ప్రకరణములందు కన్పట్టునట్లే సాంగములైన వృత్తులు నాలుగును నాటక-ప్రకరణములందు ఉండును. అందుచేతనే ఇవి "పూర్ణవృత్తి రూపకము" లనబడినవి. తక్కిన రూపకములందు నాలుగు వృత్తులును ఉండవు. ఉన్నవృత్తిలో కూడ కొన్ని అంగములు లోపించవచ్చును. నాలుగువృత్తులును ఉండునన్నంతమాత్రమున అవి సమప్రాధాన్యమును కలిగియుండునని భావించరాదు. ఒక్కొక్క రూపకమునందు ఒక్కొక్కవృత్తి ప్రాధాన్యమును వహించును.

---

వీరాద్భుతప్రహసనైరిహ భారతీస్యాత్. సాత్త్వత్యపీహ గదితాద్భుతవీరరౌద్రైః ।
శృంగారహాస్యకరుణైరపి కైశికీ స్యాదిష్టా భయానకయుతారభటీ సరౌద్రా ॥

38. 7 వ అధ్యాయాంతమందు గల "న హ్యేకరసజం..."; "సర్వేషాం (బహూనాం) సమవేతానాం" అనెడి రెండు శ్లోకములును ఇచ్చట మరల కలవు. 7 వ అధ్యాయమందలి 28 వ అధస్సూచికను పరిశీలించవలెను.

* [కాశీముద్రణమునందు 22 వ అధ్యా—46-69 శ్లో; బొంబాయిముద్రణమునందు 20 వ అధ్యా—45-66 శ్లో; బరోడా ముద్రణమునందు 20 వ అధ్యా—52-77 శ్లో].

రసమునుబట్టి ఈ ప్రాధాన్యము కలుగుచుండునని భరతుడే నిర్దేశించియుండెను; కావుననే ఏ రూపకమందే వృత్తి ఉండును? అనునది చెప్పుటకంటె ఏ రసమందు ఏ వృత్తి ఉండును? అను విషయమునే వివరించుట జరిగినది. ఏ రూపకమందు ఏ రసము ప్రధానమో ఇదివరకే చెప్పబడియుండుటచే రూపకములకును, వృత్తులకును గల సంబంధమును సులువుగా గ్రహించవచ్చును.

ఇచ్చట ఇంకొక విషయమును కూడ గుర్తించవలసియున్నది—మధు-కైటభులతో విష్ణువొనర్చిన యుద్ధమునుండి వృత్తులు జనించినట్లు మొదట చెప్పబడినది. పిమ్మట వేదములనుండి వృత్తులను గ్రహించినట్లు తరువాత చెప్పబడినది. ఇవి రెండును రెండు వేర్వేరు కథలని భ్రమించరాదు. పై యుద్ధసమయమున ఉత్పన్నములైన లేదా బ్రహ్మచే భావింపబడిన వృత్తులు నాలుగును, అది ప్రళయకాల మగుటచే, భావియుగప్రజల ఉపయోగార్థము నాలుగు వేదములందును నిక్షేపింపబడినవి. యుగప్రారంభమై, నాల్గు వేదములనుండియు నాట్యము మరల సృష్టింపబడినప్పుడు ఈ వృత్తులును వేదములనుండి వెలికితీయబడినవి. కావున ఈ రెండవ కథ మొదటి కథకు చివరిభాగమే కాని భిన్నకథ మాత్రము కాదు.

## 2. వృత్తుల సంఖ్య

6 వ అధ్యాయమందు నాట్యసంగ్రహశ్లోకమును వ్యాఖ్యానించునప్పుడు "వృత్తులు రెండు లేదా మూడు, లేదా ఐదు అనెడి వాదములను నిరాకరించుటకే 'వృత్తులు నాలుగు' అని చెప్పబడెను" అని అభినవగుప్తుడు పేర్కొనియుండెను. అనగా వృత్తులు రెండే అను వారు కొందరును, మూడు అనువారు మరికొందరును, ఐదు అనువారు ఇంకొక కొందరును ఉన్నారన్నమాట.

భరతుని వృత్తి సంఖ్యను (వృత్తులు నాలుగు అనుదానిని) విమర్శించిన ప్రథముడు ఉద్భటుడు— ఉత్సృష్టికాంకమునందు భారతి తప్ప తక్కిన మూడు వృత్తులును ఉండవు కదా. మరి చేష్టాప్రధానమైన కరుణము కేవలము ఒక్క భారతీవృత్తిచేతనే ఎట్లు వ్యక్తము కాగలదు? నిజముగా, ఆ కరుణమునందు 'ఫలసంవిత్తి' అనెడి వృత్తి ఉన్నది. దీనిని గ్రహించని భరతుని వివరణము అసమగ్రమగుచున్నది. ఇంక కైశికీవృత్తి సాత్త్వతీవృత్తిలోనే ఇమిడిపోగలదు. ఇవి రెండును అభినయప్రధానములేకదా. ఒకవేళ శృంగార ప్రధానమగుటచే కైశికి అవశ్యకమన్నచో ధర్మ - అర్థములకు సంబంధించిన మరిరెండు వృత్తులను కూడ గ్రహించవలసియున్నది. ఈదృష్టితో చూచినచో భరతుని వివరణము దోషభూయిష్ఠమగుచున్నది.

ఇట్లు రెండువిధములుగా భరతుని విమర్శించి, పిమ్మట ఉద్భటుడు స్వీయాభిప్రాయమును క్రిందివిధముగా వివరించెను—వాక్ - చేష్టా భేదములచే వృత్తి ప్రధానముగా రెండు విధములు. చతుర్విధపురుషార్థభేదములచే అవి ఎనిమిది అగుచున్నవి. ఇవి ఎనిమిదియును న్యాయ్య - అన్యాయ్య భేదములచే రెండువిధములుగా ఉండును; కావున మొత్తము 16 భేదములగుచున్నవి. ఇంక ఫలవృత్తి (ఫలసంవిత్తి) అవస్థననుసరించి వివిధములుగాఉండును.



ప్రభేదములను విడిచివేసినచో న్యాయ్యచేష్టావృత్తి, అన్యాయ్యచేష్టావృత్తి, (చేష్టకు సంబంధించినవి), ఫలసంవిత్తి (చేష్టాఫలానుభవమునకు సంబంధించినది) అనెడి మూడు వృత్తిభేదములను ఉద్భటుడు ప్రధానముగా చెప్పెనని చెప్పవచ్చును. ఇంకవృత్తులు రెండు లేదా ఐదు అనెడి వాదములెవ్వరివో తెలియదు. మరికొందరు వృత్తిసమ్మేళనము వలన 'మిశ్రవృత్తి' అనెడి ఐదవవృత్తి కలుగునని చెప్పుదురు; భోజుడు ఈ 'మిశ్రవృత్తి'ని స్వీకరించెను. హరిపాలుడు 'బ్రాహ్మీవృత్తి' ని కల్పించెను; శకలీగర్భుడను ఆలంకారికుడు 'ఆత్మసంవిత్తి' అనెడి క్రొత్తవృత్తిని కల్పించెను. ఇది మూర్ఖాదులకు సంబంధించినవృత్తి. అభినవగుప్తుడీ అభిప్రాయముల నెల్ల ఖండించి వృత్తులు నాలుగే అని స్థాపించెను. [అభినవ భారతి - 2 వ సం - పుటలు 451–452]

## 3. భారతీవృత్తి

వాక్యభూయిష్ఠమైనదిఅనగాపాఠ్యప్రధానమైనది భారతీవృత్తి. అందుచేదీనిని'శబ్దవృత్తి' అని అందురు; తక్కినవి మూడును అర్థవృత్తులు. విష్ణువు పదన్యాసభారమువలన 'భారతి' జనించినదని భరతుడు చెప్పిన వ్యుత్పత్తి సమంజసముగా లేదు. దీనినిబట్టి భారతి, కైశికి మొదలగు పదముల అర్థములు భరతునినాటికే విస్మృతములైనవని ఊహించవచ్చును. "ఇది భరతప్రోక్తమగుటచే 'భారతి' అనబడినది" అని శారదాతనయుని అభిప్రాయము. అనగా నాట్యముకంటె ప్రాచీనమైన నృత్తమునందే తక్కిన మూడు వృత్తులును ఉన్నవి; నాట్యము సృష్టింపబడినప్పుడు 'వాక్కు' క్రొత్తగా చేరినది; ఇందులకు క్రొత్తవృత్తిని-భారతీవృత్తిని-భరతుడు సృష్టించెను. కావున ఇది భారతీవృత్తి అనబడినదని శారదాతనయుని అభిప్రాయము.

"భరతులచే ప్రయుక్తమైనదికాన ఇది 'భారతి' అనబడినది" అని భరతుడే ఇంకొక నిర్వచనము చేసెను. ఇది సమంజసముగా ఉన్నది. ఆదికాలములో సూతాదుల పౌరాణికకథాకథనము ఒకప్రక్క సాగుచుండగా ఇంకొకప్రక్క నృత్తము, మూకాభినయము సాగుచుండియుండును. మహాభాష్యకారుని అనుసరించి మొదటి శాఖవారిని 'గ్రాంథికులు' అనియు, రెండవశాఖవారిని 'శౌభికులు' అనియు పిలువవచ్చును. ఈ రెండవశాఖలోనివారు మరల రెండు విధములుగా ఉండియుందురు—కేవలము అభినయము నొనర్చువారు 'నటులు'; ఆంగికాద్యభినయములతోపాటు వాక్కునుకూడ గ్రహించినవారు 'భరతులు'. ఈ రెండు క్రియలును సమ్మిళితములైనప్పుడే 'సంపూర్ణనాట్యము' సిద్ధించియుండును; అప్పుడు నట-భరతపదములు పర్యాయపదములై యుండును.

ఇట్లు భారతి సర్వరూపకమునకును సంబంధించిన వృత్తికాగా ధనంజయ-సింగభూపాలాది అర్వాచీనాలంకారికులు దానిని 'ప్రస్తావన'కు మాత్రమే పరిమితముచేసిరి. అందుచేతనే వారు భారతీవృత్తిని ప్రస్తావనాంగముగానే నిర్వచించి, తక్కిన మూడు వృత్తులను వేరుగా నిర్వచించియున్నారు.

ఇది సమంజసము కాదు. ప్రస్తావనలో అభినయము ఉండదు కావ అచ్చట భారతీవృత్తి మాత్రమే ఉండునని వారి అభిప్రాయముకావచ్చును. కాని, భారతీవృత్తిప్రయోజన మింత

మాత్రమే కాదు; రూపకము సర్వమును భారతీవృత్తియే అని తెలియవలెను. "వృత్తిఃసర్వత్ర భారతీ" (పుట 12) అని భావప్రకాశమందు శారదాతనయుడు పేర్కొనుట గమనార్హము.

ఇచ్చట ఒక విషయమును గుర్తించవచ్చును. ఇతివృత్తసహితమైన మూకాభినయ రూపకమందు భారతిఉండుట కవకాశము లేదు. తక్కిన మూడువృత్తులుమాత్రమే ఉండును. ఇంక ఆ రూపకప్రారంభమందు ప్రార్థనాదులు, ఉపోద్ఘాతముగాచెప్పెడు మాటలు మొదలగు వానియందు మాత్రమే భారతి ఉండుట కవకాశమున్నది. ఈ విధముగా ఇది ప్రస్తావనాంగమే కాగలదు. కాని, నాటకాదులను సర్వాంగసంపన్నముగా ప్రదర్శించెడు అవకాశమేర్పడినతరువాత భారతివృత్తిని కేవలము ప్రస్తావనకు మాత్రమే పరిమితముచేయుట న్యాయ్యము కాజాలదు.

శుద్ధమైన పూర్వరంగమునందు నృత్తాదులవలన వైచిత్ర్యము కూర్పబడుటచే అది 'చిత్ర పూర్వరంగ' మైనదని 4 వ అధ్యాయమందు గుర్తించినాము. అట్లే పూర్వరంగాంతమున స్థాపకుడు ప్రవేశించి సాగించెడి ప్రస్తావనలో వీథీ-ప్రహసనముల లక్షణములు చేరి చిత్రత్వము చేకూరియుండును. అందుచేతనే భరతుడు వీథీ-ప్రహసనములను కూడ భారతీవృత్త్యంగములనుగా పేర్కొనియుండెను. వీథ్యంగములైన ఉద్ఘాత్యక-అవలగితములు ఆముఖాంగము లగుట గమనార్హము. విదూషకుని రూపములో ప్రహసనము నిలిచినది. నటీ రూపమున నృత్త-గీతములు ప్రవేశించినవి. ఇంకను వివరములకు 15, 18, 19 అధస్సూచికలను చూడవలెను.

ఇచ్చట ఒక సత్యమును గుర్తించవలసియున్నది. భారతీవృత్తి నిర్వచనములో అది పురుషప్రయోజ్యమనియు, స్త్రీవర్జితమనియు, సంస్కృతవాక్యయుక్తమనియు చెప్పబడినది. స్త్రీలకంటె పురుషులు అధికముగా మాటాడుట కలదు కాన ఇది కొంతవరకు సమంజసమైనను భారతీవృత్తిని కేవలము పురుషులకును, సంస్కృతపాఠ్యమునకును, ప్రస్తావనకును పరిమితముచేయుట అసమంజసము **కాజాలదు.**

4. శ్రవ్యకావ్యము : వృత్తులు.

వృత్తులు నాట్యమందేకాక శ్రవ్యకావ్యమందును ఉండునని తెలిపియున్నాను. నిజమునకు శ్రవ్యకావ్యమంతయును భారతీవృత్తియే. ఇంక విరహాదులు, చంద్రోదయాదులు వర్ణితములైనప్పుడు కైశికీవృత్తియును, యుద్ధాదులు వర్ణితములైనప్పుడు ఆరభటీవృత్తియును కన్పట్టవచ్చును. కావ్యమందలి భారతీవృత్తి ఈ కైశికీ-ఆరభటీవృత్తుల ప్రాబల్యమున రెండు మార్గములుగా సాగుచుండును—వాటినే క్రమముగా వైదర్భీ - గౌడీరీతులందురు. అట్లే రసానుసారులైన గుణములు కూడ ముఖ్యముగా రెండే— మాధుర్య - ఓజస్సులు; ఇవి శృంగార - రౌద్రములకు ప్రధానముగా సంబంధించియున్నవి. ఇట్లు మాధుర్యగుణము, కైశికీవృత్తి, వైదర్భీరతి అనునవి మూడును ఒక ప్రక్కను; ఓజోగుణము, ఆరభటీవృత్తి, గౌడీరీతి అనునవి మూడును ఇంకొక ప్రక్కను రసములను, ఇతివృత్తములను రెండు శాఖలుగా విభజించుచున్నవి. ఇందు గుణములెట్లు రసధర్మములో, వృత్తులును అట్లే రస



ధర్మములు. ఈ విధముగా నాట్యవృత్తులు శ్రవ్యకావ్యమునందు రసోచితార్థసందర్భములైన గుణములకును, రసోచితశబ్దసందర్భములైన రీతులకును సన్నిహితములగుచున్నవి.

శ్రవ్యకావ్యమందు భారతీ - సాత్త్వతీవృత్తుల స్వరూపములు కొంత మారినవి. శబ్దవృత్తి అయిన భారతి అర్థవృత్తియై ఈషత్సౌకుమార్యము కలదై కైశికీవృత్తికిని; సాత్త్వతి ఈషత్ప్రౌఢమై ఆరభటికిని సన్నిహితములైనవి.

శృంగారప్రకాశమందు భోజుడు క్రిందివిధముగా వృత్తి - రీత్యాదుల సంబంధమును నిర్ణయించెను. ["వృత్తులు" అనెడి డా. రాఘవన్‌గారి వ్యాసము—Journal of Oriental Research, Vol. VII. Part I, P. 52]—

| పురుషార్థము | నాయకుడు | నాయిక | వృత్తి | ప్రవృత్తి | రీతి |
|---|---|---|---|---|---|
| ధర్మము | ధీరోదాత్తుడు | స్వీయ | భారతి | పౌరస్త్య | పాంచాలి |
| అర్థము | ధీరోద్ధతుడు | సర్వస్త్రీలు | ఆరభటి | ఉఢ్రమాగధి | గౌడి |
| కామము | ధీరలలితుడు | ,, | కైశికి | దాక్షిణాత్య | వైదర్భి |
| మోక్షము | ధీరప్రశాంతుడు | స్వీయ | సాత్త్వికి | ఆవంత్య | లాటీయ |

డా. వి. రాఘవన్ "వృత్తులు" అను పేర మూడు వ్యాసములను ప్రకటించినారు [Journal of Oriental Research, 1932-33]. ఈ వ్యాసములందు వృత్తులను గూర్చిన కూలంకషమగు చర్చ కలదు.

---

# అధ్యాయము 21[1]

## ఆహార్యాభినయము[2]

[కాశీముద్రణమునందు 23 వ అధ్యా-215 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 21 వ అధ్యా-214 శ్లోకములును, బరోడా ముద్రణము నందు 21 వ అధ్యా-227 శ్లోకములును కలవు.]

### ఆహార్యాభినయ ప్రాధాన్యము

ప్రయోగము సర్వమును (వాక్-అంగ-సత్త్వాత్మకమైనది) ఆహార్యాభినయమందే ప్రతిష్ఠితమైయున్నది కాన ఇప్పుడు ఆహార్యాభినయమును క్రమముగా వివరింతును[3]. ప్రకృతులు వివిధావస్థలతో కూడియుందురు; వారు మొదట నైపథ్యసాధితులు (ఉచిత ఆహార్యముచే ప్రకాశించువారు) అయినచో తరువాత అంగాద్యభినయములచే ప్రయోగము యొక్క అభివ్యక్తిని సులువుగా సాధింపగలరు.

1. ఈ భాగము కాశీముద్రమునందు త్రయోవింశాధ్యాయము. కాని, బొంబాయి-బరోడా ముద్రణములందు మాత్రము ఏకవింశాధ్యాయము.

2. అన్ని ముద్రణములందును 'ఆహార్యాభినయ' మనియే కలదు. ఆహార్యమనగా నేపథ్యజమైన విధి (costumes and make-up). నేపథ్యగృహ మనగా వేషధారణమునకుపయుక్తమగు నాట్యశాలా భాగము కదా (Green room).

3. "క్రమముగా వివరింతును" అనుటను బట్టియు, అన్ని అభినయముల తరువాతను ఆహార్యాభినయము వివరింపబడుచుండుటచేతను ఇది వాగాద్యభినయములకంటె బహిరంగమైనదని కొందరందురు. అది సరికాదు. ఆహార్యాభినయము సర్వాభినయములకును అనుగ్రాహకమును, ఉపజీవ్యమును అగుటవలననే చివరవివరింపబడుచున్నదని తెలియవలెను. "క్రమముగా వివరింతును" అనుటలోని అర్థమిదియే. అందుచేతనే ప్రయోగము సర్వమును ఆహార్యాభినయమందే ప్రతిష్ఠితమై ఉన్నదని చెప్పబడెను. [అభినవభారతి 3 వ సం-పుట 108]

4. వివిధములైన అవస్థలు అనగా రతి-శోకాదులు. వానికి ఆశ్రయభూతులైన ప్రకృతులు కూడ ఉత్తమ-మధ్యమ-అధమభేదములచే వివిధములుగా ఉందురు. ఇట్టిప్రకృతులు మొదట ప్రయత్నపూర్వకమైన చక్కని ఆహార్యముచే ప్రకాశితులైనచో తరువాత అంగాద్యభినయములు సులభముగా వ్యక్తీకరింపబడగలవు. ఇతరాభినయములు లేకపోయినను ఉచితమైన ఆహార్యమునుబట్టియే అతడే ప్రకృతియో, ఏ దేశమువాడో, ఏ కాలమువాడో, ఏ అవస్థయందున్నవాడో గ్రహించుట కవకాశము కలదు. కావున ఆహార్యమనునది సమస్తాభినయములతోకూడిన ప్రయోగమనెడి చిత్రమునకు భిత్తిస్థానీయమని తెలియవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 109].



ఆహార్యాభినయమనగా నేపథ్యజమైన విధి అని తెలియవలెను. నాట్యము యొక్క శుభమును (సిద్ధిని) కోరువారు ఆహార్యాభినయమును గూర్చి ప్రయత్నించుట ముఖ్యము; నైపథ్యము నాట్యమున కలంకారము.

నాట్యమందలి నైపథ్యము నాలుగువిధములు— 1 పుస్తము 2. అలంకారము, 3. అంగరచన, 4. సంజీవము[5]. వీనిని వరుసగా వివరింతును--

## 1. పుస్తము

శైల-యాన-విమానములు, చర్మ-వర్మ-ధ్వజములు, నగములును ప్రదర్శనార్థము నాట్యరంగమందు నిర్మింపబడుట 'పుస్త'మనబడును. నానారూప భేదముల చేతను, ప్రమాణభేదములచేతను పుస్తము మూడువిధములు—సంధిమ - వ్యాజిమ-వేష్టిమములు.

(1) సంధిమము— కిలింజ (భూర్జ-వేణుపత్రాదులు)-చర్మ-వస్త్రాదులచే రూపములను తయారుచేయుట 'సంధిమ' మనబడును.

(2) వ్యాజిమము— యంత్రకృతమైన పుస్తము 'వ్యాజిమ' మనబడును. (అనగా సూత్రాదుల సాహాయ్యముచే పై రూపములను ఆడించుట లేదా కదలునట్లు చేయుట.)

(3) వేష్టిమము— దేని రూపము వేష్టితము అగునో (వస్త్రాదులచే చుట్టబడునో) అది 'వేష్టిమ' మనబడును[6]

5. వివిధవస్తువులను లేదా ఖండములను చేర్చి ఒకటిగా చేయుట 'పుస్త' మనబడును (Model work). ఆ యా రంగముల కావశ్యకములైన వస్త్రాదులు ఎట్లు నిర్మితము కావలెనన్న చర్చకు-సంబంధించినదిది. అంగరచన అనగా ముఖాదులకు రంగుపూసికొనుట; జుట్టు, గడ్డము మొదలగువానిని కూర్చుకొనుట. అలంకార మనగా నగలు, దండలు, వస్త్రాదులు; ఇందు స్త్రీ-పురుషులకు ఏ సమయమందేది యుక్తము ? అను విషయము దేశ - కాల - అవస్థాద్యౌచిత్యదృష్టితో, విపులముగా వివరింపబడినది. పశు-పక్ష్యాదులు రంగస్థలమందు సజీవముగా తిరుగుచున్నట్లు చూపుట 'సంజీవ' మనబడును.

6. సంధానము లేదా సంధ అనగా కూర్పు; ఆ యా వస్తువులను ఒకటిగా చేర్చి ఒక రూపమును తయారుచేయుట సంధిమము. తెరయందే ఉండి సూత్రాకర్షణముచే రంగమునందున్న వస్తువులను కదలునట్లు చేయుట వ్యాజిమము. కేవలము వస్త్రమును చుట్టబెట్టి పైన లక్క, మైనము పూసి ఏదేని రూపమును తయారుచేయుట (గుడ్డ బొమ్మలు) వేష్టిమము [అభినవభారతి - 3 వ సం - పుట 109]. 'వేష్టితము' నకు 'చేష్టిత' మను పాఠాంతరము కలదు. కేవలాభినయముచేతనే ఒక వస్తువును సూచించుట 'చేష్టితము' కావచ్చును.

## 2. అలంకారము

మాల్య - ఆభరణ - వస్త్రములను నానావిధములుగా అంగములందును (శరీరము, శిరో - హస్తాదులు), ఉపాంగములందును (నుదురు, వ్రేళ్ళు మొ॥) యథోచితముగా అలంకరించుకొనుట 'అలంకార' మనబడును. ఇందుమరల భేదములుకలవు—

(1) మాల్య రూపమైన అలంకారము ఐదు విధములు—వేష్టిమ - వితత- సంఘాత్య - గ్రంథిమ - ప్రాలంబితములు[7].

(2) ఆభరణ రూపమైన అలంకారము నాలుగువిధములు—

ఆవేధ్య - బంధనీయ - ప్రక్షేప్య - ఆరోప్యములు. కుండలాది శ్రవణభూషణములు ఆవేధ్యములు, శ్రోణీసూత్ర (వడ్డాణము) - అంగదములు బంధనీయములు, వివిధములైన హేమసూత్రాది హారములు ఆరోప్యములు, నూపుర - వస్త్రాభరణములు ప్రక్షేప్యములు.

ఇంక ఆ యా దేశ-జాతి సముద్భవమైన స్త్రీ - పురుషుల నానావిధభూషణ వికల్పమును వివరింతును[8]—

### పురుషుల భూషణములు

శిరోభూషణములు—చూడామణి (శిరోమధ్యమందు ధరింపబడును), మకుటము లేదా ముకుటము (లలాటోర్ధ్వభాగమునందు ధరింపబడును.)

కర్ణ (చెవి) భూషణములు—కుండలము (చెవి క్రిందిచివర ధరింపబడును), మోచకము (కర్ణశష్కులీమధ్యచ్ఛిద్రమందు), కీలము (ఊర్ధ్వచ్ఛిద్రమందు.)

కంఠాభరణములు—ముక్తావళి (ముత్యాలదండ), హర్షకము (సర్పాది రూపముగానుండునది), సూత్రము (బంగారపు గొలుసు, ఎక్కువ పేటలు కలది.)

అంగుళిభూషణములు—వేతిక (సూక్ష్మకటకరూపమైనది), మామూలు ఉంగరము, అంగుళిముద్ర (పక్షి - పద్మాద్యాకారములు కలిగినది.)

---

7. తృణ-పల్లవ-కుసుమములతో పూలగుత్తులను తయారుచేయుట వేష్టిమము, పూవులను దండలుగా గ్రుచ్చుట వితతము, దండను వలయముగా నేర్పరచి పూవుల తొడిమలు కన్పించకుండ కట్టుట సంఘాత్యము, కొన్ని పుష్పగుచ్ఛములను కలిపి దండగా కూర్చుట గ్రంథిమము, కాళ్ళ పర్యంతమును వ్రేలాడెడి పొడుగుపాటి దండలు లేదా జాలకాదులకుపయోగించెడి అలంకారాదులు ప్రాలంబితము. [అభినవభారతి - 3 వ సం - పుట 110]

8. పురుషుల భూషణములు వేరు, స్త్రీల భూషణములు వేరు. ఇవి మరల దేశమును అనుసరించియు, జాతిని అనుసరించియు మారుచుండును. ఆ యా భేదములనెల్ల గుర్తించి నాట్యమందు భూషణములను కల్పించవలెను. ఇచ్చట నామమాత్రముగ కొన్ని సూచనలొసంగబడుచున్నవి.



బాహునాళీ భూషణములు—హస్తలి, వలయములు (కంకణములు).

మణిబంధ (మనికట్టు) విభూషణములు—రుచకము (నేటి 'రిష్టువాచి' వంటిది కావచ్చును), చూలిక (ఇది 'నికుంచక' మను పేర ప్రసిద్ధము - ఇది రుచకము పైని అనగా చేతి పై భాగమున ధరింపబడును).

కూర్పరోపరిభూషణములు–కేయూరములు(కూర్పరమునకు అనగా మోచేతికి పైభాగమున ధరింపబడును), అంగదము (కేయూరము పై భాగమున ధరింపబడును).

వక్షో విభూషణములు—త్రిసరము (మూడు పేటల ముత్యాలదండ), హారము.

అంగభూషణములు— వ్యాలంబ మౌక్తికహారము (వ్రేలాడుచున్న ముత్యాల హారము), మాల (పూలదండ).

కటి విభూషణములు— తలకము (బొడ్డునకు క్రింది భాగమున ధరింపబడును), సూత్రకము (తలకమునకు క్రిందుగా ధరింపబడును.)

పురుషుల కుచితమైన పై భూషణవిధిని దేవతల. పార్థివుల విషయమున అనుసరించవలెను. ఇంక స్త్రీల భూషణములను వివరింతున—

### స్త్రీల భూషణములు

శిరోభూషణములు— శిఖాపాశము, శిఖావ్యాలము లేదా శిఖాజాలము (సర్పాకృతి కల నాగరము వంటిది), పిండీపత్రము (పద్మమువలె ఉండు నాగరము వంటిది), చూడామణి (శిరోమధ్యభాగమున ధరింపబడునది), మకరిక (మకరపత్రము), ముక్తాజాలము (లలాటమందు వ్రేలాడగట్టబడు ముత్యాలజాలు), గవాక్షకము (ముత్యములతో తోరణరూపముగా లేదా జాలికారూపముగా ఉండునది), శీర్షజాలకము, శిఖపత్రము (మయూరపింఛాకారమైన విచిత్రవర్ణమణిరచితావతంసకము).

వేణీ భూషణములు— కండకము, శిఖపత్రము (ఖడ్గపత్రము-కాశీపాఠము), దోరకము (జడగంటల వంటి ఆభరణము).

లలాట భూషణము— నానాశిల్పప్రయోజితమగు తిలకము. ఇది కనుబొమల మధ్యభాగమునకు పైగా కుసుమగుచ్ఛాకృతిగా ఉండవలెను.

కర్ణభూషణములు— కర్ణిక (దుద్దు), కర్ణవలయము, పత్రకర్ణిక, కుండలము, కర్ణముద్ర, కర్ణోత్కీలకము, నానారత్నవిచిత్రములైన దంతపత్రములు, కర్ణపూరము.

గండభూషణములు— తిలకములు, పత్రలేఖలు.

నేత్రములకు అంజనము (కాటుక) పెట్టుకొనవలెను. అధరమునకు రంజనము (ఎరుపు రంగు) కర్తవ్యము (తాంబూలాదులచే కలుగునది). అశ్మరాగద్యోతితమైన అధరము పల్లవప్రభలను వెదజల్లుచుండును.

ముందరి నాలుగు దంతములకును రంగువేయవచ్చును ; లేదా అవి తెల్లగానే ఉండవచ్చును. రాగాంతరకల్పనము దంతములకు అధికశోభను చేకూర్చును. ముక్తావిభాసితములయిన దంతములుకాని, పద్మపల్లవములవలె శోభించు సురక్తములైన దంతములు కాని ముగ్ధలగు సుందరులకు శోభావహములు. సవిభ్రమాపాంగ నిరీక్షణములు వారికి విలాసావహములు.'

కంఠవిభూషణములు—ముక్తావళి, వ్యాళ (పాము) పంక్తి, మంజరి, రత్నమాలిక, రత్నావళి, సూత్రకము.

హారములు ద్విసరములు (రెండుపేటలు కలవి) లేదా త్రిసరములు, లేదా చతుస్సరములుగా ఉండును. శృంఖలికయను కంఠవిభూషణమే.

బాహుమూల విభూషణములు—అంగదము, వలయము.

వక్షోవిభూషణములు - త్రివణి, నానాశిల్పకృతములైన హారములు.

స్తనవిభూషణము—మణిజాలబద్ధమైన ఆభరణము.

బాహునాళీ విభూషణము—కర్జూరకము, ఉచ్చితికము.

అంగుళి విభూషణములు— కలాపి, కటకము, శంఖము, హస్తపత్రము, పూరకము, ముద్ర, అంగుళీయకము.

శ్రోణీవిభూషణములు— కాంచి, మేఖల, రశన, కలాపము, ముక్తాజాలాఢ్యమగు తలకము. కాంచి ఏకయష్టిక (ఒక పేటకలది), మేఖల అష్టయష్టిక, రశన షోడశయష్టిక, కలాపము పంచవింశ (25) యష్టిక అని తెలియవలెను. దేవ-పార్థివ స్త్రీల ముక్తాహారములు 32 లేదా 64 లేదా 108 పేటలుకలిగియుండును.

గుల్ఫోపరి (మడమపై భాగమందలి) విభూషణములు—నూపురము (అందెలు మొదలైనవి), కింకిణీకము (చిరుగజ్జెలు కలది), ఘంటిక (పెద్ద గజ్జెలుకలది), ధ్వనించెడి కటకములు (గులకరాళ్ళతోకూడిన గుల్ల కడియములు) రత్నజాలకము.

పాదవిభూషణములు— జంఘలయందు పాదపత్రములు, అంగుళులయందు అంగుళీయకములు (మట్టెలు), అంగుష్ఠమునందు తిలకములు ఉండవలెను. మరియు చిత్రరచనా నివేశితమైన అలక్తకరాగము (పారాణిఎరుపు) అశోకపల్లవచ్ఛాయమై పాదములకు సహజసంపదను చేకూర్పగలదు.

కేశాదినఖపర్యంతమును స్త్రీలకు ఉచితములైన భూషణములను వివరించియున్నాను. వీనిని యథాభావరసావస్థముగా వినియోగించవలెను.*

---

9. ఇట్లు దంత - అధరరాగ వైచిత్ర్యముతో ఒప్పుచు సవిభ్రమాంతనిరీక్షణములతో కూడిన స్మితముతో కన్పట్టు యువతులు అధికమనోహరలగుదురని తెలియవలెను. [అభినవభారతి - 3 వ సం - పుటలు 114-115]

*[కాశీముద్రణమునందు 23 వ అధ్యా—1-42 శ్లో ; బొంబాయి ముద్రణమునందు 21 వ అధ్యా—1-42 శ్లో ; బరోడా ముద్రణమునందు 21 వ అధ్యా—1-43 శ్లో.]



అలంకరణౌచిత్యము

ఈ భూషణవిధి అంతయును విశ్వకర్మ మతానుసారముగా కాని, బుద్ధిసంపదచే కాని (లోకప్రసిద్ధిని బట్టి కాని) నిర్ణయింపబడవలెను ; మరియు ఇప్పట్లు ఆగను (ఉపాదానకారణము) — ప్రమాణ (అవయవప్రమాణము) -- రూపనిర్వర్ణన (శరీరవర్ణస్వభావ) ముల ననుసరించి ఆయా వ్యక్తులయందు ఆయా భూషణములను కూర్చవలెను. తనకు వీలుగాఉన్నదికదా అని సువర్ణముతో కాని, ముత్యములతో కాని, మణులతో కాని, ఆభరణములను చేయించి ఒడలినిండ ధరించుట యుక్తము కాదు. కేవలము ఔచిత్యము ననుసరించియే ఆభరణకల్పనము చేయవలయును. విభాగపూర్వకముగా (అనగా ఔచిత్యముతో) ధరింపబడిన రత్నభూషణములే ఆయా అంగములకు శోభను కలిగింపగలవు. నాట్యప్రయోగమందు భూషణములను అధికముగా వినియోగించరాదు; అట్లు అధికముగా వినియోగించినచో సవ్యాయత విచేష్టనమువలన (ఎక్కువ కదలిక వలన) ఖేదము జనింపగలదు. బరువుచే క్రుంగినవాడు స్వేదమును, మూర్ఛను కూడ పొందును; అట్లే బరువైన ఆభరణములచే పీడింపబడినవాడు చేష్టను చూపలేడు. పల్చని బంగారపు రేకుతో చేయబడిన భూషణములును, లక్కతో పొదిగిన రత్నాభరణములును నాట్యమందుఖేదమును కలిగించవు.

దివ్యుల భూషణవిధి స్వేచ్ఛాపరికల్పితము—వారు సంకల్పసిద్ధులుకాన. కాని, మనుష్యుల భూషణవిధి మాత్రము ప్రయత్నసంపాద్యము కావలయును.

వస్త్రవిధి

వస్త్రరూపమగు అలంకారము నానాదేశసంభవమై బహువిధములుగా ఉండును. అవి మూడు విధములు— శుద్ధము (తెల్లనిది), రక్తము (రంగుబట్ట), విచిత్రము (బహువర్ణములుకలది). దివ్యులకు ఈ భూషణవిధి అంతయును ఒప్పును. మనుష్యులకు మాత్రము దేశాశ్రయమగు అలంకారపరికల్పనము చేయనగును.

దివ్యాంగనలకు వారివారి భూములకును, అవస్థలకును ఉచితములైన ఆభరణములను వేషములను సమకూర్చవలెను. విద్యాధర-యక్ష-అప్సరో-నాగాంగనలకును, ఋషి-దైవత కన్యలకును, సిద్ధ-గంధర్వ-రాక్షస-అసుర వనితలకును, దివ్య-వానర-మనుష్యాంగనలకును సంబంధించిన వేషములు నానా విధములుగా ఉండవలెను. (అనగా వారి వేషమును బట్టియే వారు 'ఫలానా' అని గుర్తింపబడవలెను).

విద్యాధరస్త్రీలకు ముక్తాభూషితమగు శిఖాబంధమును రచింపవలెను. వారి వేష - పరిచ్ఛదము శుద్ధముగా (చిత్రముగా - కాశీముద్రణ పాఠము) ఉండవలెను.

యక్షిణులును, అప్సరసలును రత్నభూషణోపేతలు కావలయును. వారి వేషములును సమానములే ; కాని, యక్షిణులు కేవలము శిఖను ధరించవలెను.

నాగస్త్రీల భూషణములు దివ్యస్త్రీలకు వలెనే ఉండవలెను ; కాని ముక్తామణి లతాప్రాయములగు ఫణములు (పడగలు) ఉండవలెను.

మునికన్యల శిరస్సులు ఏకవేణీధరములు కావలయును. వీరికి భూషణవిధి లేదు; వేషము వనోచితముగా ఉండవలెను.

సిద్ధాంగనలకు ముక్తా - మరకత ప్రాయమైన అలంకారమును, పీతవస్త్ర - పరిచ్ఛదములును (పరిచ్ఛదము = మేలిముసుగు) సముచితములు.

గంధర్వస్త్రీలకు పద్మరాగమణిప్రాయములైన విభూషణములు, వీణాహస్తము, కౌసుంభ (కనకాంబరపు రంగు) వస్త్రములును రమ్యముగా ఉండును.

రాక్షసస్త్రీలకు ఇంద్రనీల విభూషణములు, సితదంష్ట్రలు, నల్లని వస్త్ర - పరిచ్ఛదములును తగియుండును.

సురాంగన (దివ్యాంగన) లకు వైడూర్య-ముక్తాభరణములను కూర్చవలెను ; వారిపరిచ్ఛదము శుకపింఛతుల్యములైనవస్త్రములతో కూడియుండును. దివ్య వానర స్త్రీలకు పుష్యరాగమణీభూషణములు లేదా ఒక్కొక్కప్పుడు వైడూర్యభూషణములు, నీలపరిచ్ఛదమును అర్హములు.

శృంగారిణులగు దివ్యాంగనల వేషములు పైని వివరించిన విధముగా ఉండును. కాని అవస్థాంతరములందు (శృంగారేతరమైన అవస్థలందు) వారి వేషము శుద్ధముగా (తెల్లగా) ఉండవలెను.

ఇంక మనుష్య స్త్రీల వేష - ఆభరణములను వివరింతును. వీరి వేష - ఆభరణములు ఆ యా దేశసముద్భవములుగా ఉండవలెను.

ఆవంతీయువతి అలకలతో (ముంగురులతో) కూడిన లేదా వంకరలు తిరిగిన కుంతలములు కలిగియుండును.

గౌడస్త్రీలు అలకలను, సశిఖాపాశవేణిక (కొప్పుగాముడిచిన జడ) ను కలిగియుందురు.

ఆభీరయువతి రెండు జడలు వేసికొనును; నీలప్రాయమైన వస్త్రమును ముసుగుగా వేసికొనును.

పూర్వోత్తరదేశమందలి స్త్రీలు సమున్నద్ధశిఖండకములు (మీదికెత్తి కట్టబడిన జుట్టు), నఖశిఖ పర్యంతమైన ముసుగు కలిగియుందురు.

దక్షిణదేశస్త్రీలు ఆవర్తాకారమున నుండు లలాటికము (బొట్టు) ను, కుంభీబంధసంయుక్తమైన ఉల్లేఖ్యమును కలిగియుందురు.

గణికల అలంకారము వారి వారి ఇచ్ఛానుసారముగా ఉండవలెను.





స్త్రీల వేణీబంధభేదములు
(అమరావతీ శిల్పములు)

ఇంక తక్కినవారికి వారి వారి దేశ - జాతి విధానములను అనుసరించి వేష - ఆభరణ - క్షురకర్మ - పరిచ్ఛదములను సమకూర్చవలెను.[10]

**ఔచిత్యము**

> అదేశయుక్తో వేషో హి న శోభాం జనయిష్యతి ॥
> మేఖలోరసి బద్ధా తు హాస్యం సముపపాదయేత్ ।[11] 73-74

—అస్థానోపహితమగు వేషము శోభను కలిగించదు. మేఖల (వడ్డాణము) ఉరమునందు ధరింపబడినచో హాస్యమును కలిగించునుకదా.

ప్రోషితభర్తృకా - వ్యసనాభిహతల వేషము మలినమును, శిరము ఏకవేణీ ధరమును కావలయును.

విప్రలంభమందు స్త్రీల వేషము శుద్ధముగా ఉండవలెను. అత్యాభరణ సంయోగము కాని, సంస్కారము కాని ఉండరాదు.

ఇట్లు స్త్రీల వేషము దేశ-అవస్థా (రతితి-శోకాద్యవస్థా) సముద్భవము కావలయును. ఇంక పురుషుల వేషములను వివరింతును. పురుషులవిషయమున ముందుగా అంగరచన చేయవలెను; పిమ్మట ఆయా దేశ సముద్భవమైన వేషములను కల్పించవలెను.*

## 3. అంగరచన

**వర్ణములు**

వర్ణములు మూడువిధములు— స్వభావజములు, సంయోగజములు, ఉపవర్ణములు.

---

10. కాంతిని అంతటను పోషించునదికాన 'ఆభరణ' మనబడినది. అలకాదియోజనము క్షురకర్మ. విచిత్రవస్త్రప్రయోగము పరిచ్ఛదము. కేశరచనాదికము వేషము. ఆవంత్యాదులు దేశములు. రతి - శోకాగులు అవస్థలు. [అభినవభారతి - 3 వ సం - పుటలు 120-121].

11. బొంబాయి ముద్రణమున ఈ శ్లోకమునందలి పదములలో కొంతమార్పుకలదు; అర్థము సమానమే—

> అదేశజో హి వేషస్తు న శోభాం జనయిష్యతి। మేఖలోరసిబంధే చ హాస్యాయైవోపజాయతే॥ 71

ఈ అభిప్రాయమునే క్షేమేంద్రుడు 'ఔచిత్య విచారచర్చ'లో అనుసరించియుండెను—

> కంఠే మేఖలయా నితంబఫలకే తారేణ హారేణ వా
> పాణౌ నూపురబంధనేన చరణే కేయూరపాశేన వా।
> శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా నాయాంతికే హాస్యతా
> మౌచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతిర్నో గుణాః॥

'ఔచిత్యసంప్రదాయము' ను గూర్చి 16 వ అధ్యాయాంతమున 7 వ విశేషాంశములో వివరించితిని. ఈ అధ్యాయాంతమందలి 2 వ విశేషాంశమును కూడ చూడవలెను.

*[కాశీముద్రణమునందు 23 వ అధ్యా—43-73 శ్లో; బొంబాయిముద్రణమునందు 21 వ అధ్యా—43-74 శ్లో; బరోడాముద్రణమునందు 21 వ అధ్యా—43-78 శ్లో.]



1. స్వభావజ వర్ణములు : సిత-(తెలుపు)-నీల(నలుపు)-పీత (పసుపు) - రక్త (ఎరుపు)వర్ణములు నాలుగును స్వభావజములైన వర్ణములు. వీనితో అంగవర్తనము[12] నిర్వర్తించవలెను. ఈ సహజవర్ణములసంయోగముచే అనగా రెండేసివర్ణముల సంయోగముచే మరికొన్ని వర్ణములు కలుగుచున్నవి. ఇవికాక ఉపవర్ణములు (బహువర్ణమిశ్రజములు) కూడ కొన్నికలవు. వీనిని తయారుచేసికొనవలసిన విధానమును వివరింతును.

2 సంయోగజవర్ణములు: కారండవ (కపోత-అని పాఠాంతరము) వర్ణము— సిత - నీలవర్ణముల సంయోగమువలన కలుగును.

పాండురవర్ణము— సిత - పీత (నీల - అని కాశీముద్రణపాఠము) వర్ణముల సంయోగము.

పద్మవర్ణము—సిత - రక్తవర్ణముల సంయోగము.

హరిత (ఆకుపచ్చని) వర్ణము—పీత - నీలవర్ణముల సంయోగము.

కషాయవర్ణము—నీల - రక్తవర్ణముల సంయోగము.

గౌర (లేత ఎరుపు) వర్ణము—రక్త - పీతవర్ణముల సంయోగము.

ఇవి వర్ణద్వయసంయోగముచే ఏర్పడిన వర్ణములు.

3. ఉపవర్ణములు : మూడేసి, నాలుగేసివర్ణముల సంయోగములచే పెక్కు ఉపవర్ణములు కలుగుచున్నవి. నీలవర్ణము తప్ప తక్కిన వర్ణములలో బలమైనవర్ణము (ముదురు రంగు) ఒకపాలును, దుర్బలములైన వర్ణములు (లేతరంగులు) రెండు పాళ్ళును ఉండవలెను. ఒక్క నీలవర్ణ విషయమున మాత్రము లేతరంగులు నాలుగు పాళ్ళు ఉండవలెను; ఇందులకు కారణము నీలవర్ణము సర్వవర్ణములకంటె బలమైన వర్ణమగుటయే.

వర్తనము : పైవిధముగా నానావర్ణసంయోగసంశ్రయమైన విధిని తెలిసికొని, పిమ్మట యథాయోగముగా అంగవర్తనమునకుపక్రమించవలెను. వర్తనమనగా ఛాదనము లేదా స్వవేషపరివర్జితమగు రూపము (ఛాదనము = సహజరూపమును కప్పిపుచ్చుట; స్వవేషపరివర్జతమగు రూపము = తన వేషమువిడిచిన మరియొక రూపము)

---

12. వర్తనము, ఛాదనము, స్వవేషపరివర్జితమైనరూపము అనునవి పర్యాయ పదములు. [అభినవభారతి - 3 వ సం - పుట 123]

వర్తనము=రూపపరివర్తనము. ఈ అంగవర్తనమును పురుషులు స్త్రీ పాత్రలను ధరించునపుడు అంగనారూపపరివర్తన సంపాదనముకై చేయవలెను. స్త్రీలు స్త్రీ పాత్రలను ధరించునప్పుడు ఈ అంగవర్తనము ఆవశ్యకము కాదు.[అభినవభారతి-3 వ సం - పుట 121]

### ఉత్తమనటుడు

స్వవర్ణమాత్మనశ్ఛాద్యం వర్ణకైర్వేషసంశ్రయైః॥ 88
ఆకృతిస్తస్య కర్తవ్యా యస్య ప్రకృతిరాస్థితా।
యథా జంతుః స్వభావం స్వం పరిత్యజ్యాన్యదైహికమ్॥ 89
తత్స్వభావం హి భజతే దేహాంతరముపాశ్రితః।
వేషేణ వర్ణకైశ్చైవ చ్ఛాదితః పురుషస్తథా॥ 90
పరభావం ప్రకురుతే యస్యవేషం సమాశ్రితః॥ 91

—నటుడు వేషసంశ్రయములగు వర్ణకములచే (రంగులచే) తనసహజవర్ణమును మరుగుపరచి, ఏ ప్రకృతి ప్రస్తుతమో (ఏ వేషమును తాను నిర్వహింపనుండెనో) తదాకృతిని కల్పించుకొనవలయును. జంతువు (జీవాత్మ) దేహాంతరము నాశ్రయించినప్పుడు (పునర్జన్మచే లేదా పరకాయప్రవేశముచే) స్వస్వభావమును పరిత్యజించి, అన్యదేహ - స్వభావములను పొందునట్లే వేష-వర్ణకములచే ఆచ్ఛాదింపబడిన పురుషుడు ఏ వేషమును ఆశ్రయించునో తద్భావమును చక్కగా పొందవలెను.[13]

### ప్రాణులు - అప్రాణులు

దేవ-దానవ-గంధర్వ-యక్ష-రాక్షస-పన్నగులును, జీవబంధము గల ఇతరులును 'ప్రాణు' లనబడుదురు. శైల-ప్రాసాద-యంత్రములు, చర్మ-వర్మ-ధ్వజములు, నానాప్రహరణాదులు 'అప్రాణు' లనబడును. ఒక్కొక్కప్పుడు ఈ 'అప్రాణులు' కారణవశమున శరీరులగుట కలదు. అప్పుడు వానికి నాట్యధర్మము ననుసరించి వేష-భాషలను కూర్చవలెను. వర్ణముల స్వరూపములను తెలిసికొని, దేశ-జాతి-ప్రకృతి-వయస్సుల ననుసరించి అంగరచన నిర్వర్తించవలెను.

---

13. పరమాత్మ జ్ఞానప్రకాశరూపమగు స్వస్వభావమును విడువకయే దేహకంచుకోచితచిత్తవృత్తిరూపితమయినట్లు తన రూపమును ఎట్లు ప్రదర్శించుచున్నాడో అట్లే నటుడు కూడ తన స్వభావమును విడువకయే దేహస్థానీయమైన వేషపరివర్తనముచే తదుచితస్వభావాలింగితుడైనట్లుగా స్వాత్మను సామాజికులకు ప్రదర్శించును. వాని అభినయనైపుణ్యమునుబట్టి సామాజికులు వానియందు నటాభిమానమును కాక రామాభిమానమునే ప్రదర్శింతురు. [అభినవభారతి - 3 వ సం - పుట 124]

నటుడు 'పాత్ర' మాత్రమే అనియు ప్రకృతితో సంపూర్ణతాదాత్మ్యము, రసానుభూతి వానికి ఉండవనియు ఇదివరకే చెప్పియున్నాను [చూ. 6 వ అధ్యాయము— 12 వ అధస్సూచిక]. అట్లయ్యు తన నటనానైపుణ్యముచే తాను నిజమైన రాముడే అయినట్లు, సుఖ-దుఃఖములను నిజముగా తానే అనుభవించుచున్నట్లు ప్రేక్షకులను భ్రమింపజేయవలెను. అప్పుడే అతడు ఉత్తమనటుడు కాగలడు.



### ఆ యా ప్రకృతుల వర్ణభేదములు

దేవతలు, యక్షులు, అప్సరసలును గౌరవర్ణులు.

రుద్ర-అర్క-ద్రుహిణ-స్కంధులు—తపనీయ (సువర్ణ) ప్రభాయుతులు.

సోమ-బృహస్పతి-శుక్ర-వరుణ-బలరామ-తారకాగణ-సముద్ర-హిమవన్నగ-గంగానదులు— శ్వేతవర్ణోపేతులు.

అంగారకుడు—రక్తవర్ణుడు.

బుధ-హుతాశనులు—పీతవర్ణులు.

నర-నారాయణులు, వాసుకి—శ్యామవర్ణులు.

దైత్య-దానవ-రాక్షస-గుహ్యక-పర్వత-పిశాచ-జల (యమ - అని కాశీ ముద్రణపాఠము)-ఆకాశములు—అసితవర్ణోపేతులులు ('శ్యామవర్ణోపేతులు' అని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము. జల-ఆకాశాదు లనునప్పుడు తదధిష్ఠాన దేవతలని గ్రహించవలెను.)

యక్ష-గంధర్వ-భూత-పన్నగ-విద్యాధర-పితృదేవ-వానరులు— నానావర్ణోపేతులు (పితరులు నరులతో సమానమని బొంబాయిముద్రణ పాఠము.)

ఆరు (సప్త-అని కాశీ, బొంబాయి ముద్రణముల పాఠము) ద్వీపములందు నివసించెడి పురుషులను కనకప్రభాయుతులనుగా నాట్యమందు నిరూపించవలెను.

జంబూద్వీపమందలి ఉత్తర కురుదేశస్థులుతప్ప తక్కిన పురుషులు నానావర్ణాశ్రయులుగా ఉందురు.

ఉత్తరకురుదేశస్థులు కనకప్రభ కలవారు.

భద్రాశ్వపురుషులు శ్వేతవర్ణయుతులు.

కేతుమాలానివాసులు నీల (శ్వేత-కాశీ-బొంబాయిముద్రణములపాఠము) వర్ణులు.

ఇంక తక్కినవారు గౌరవర్ణులు.

భూతములు, వామనులు నానావర్ణయుతులు; మరియు వీరు వికృతాననులును లేదా వరాహ-మేష-మహిష-మృగవక్త్రులును అయియుందురు.

ఇంక భరతవర్షమందలి జనుల వర్ణములను వివరింతును. రాజులు పద్మవర్ణులుగా కాని, గౌరవర్ణులుగా కాని, శ్యామవర్ణులుగా కాని ఉందురు.

సుఖులైన మర్త్యులు గౌరవర్ణయుతులుగానుందురు. కుత్సితకర్మయుతులు, గ్రహగ్రస్తులు, వ్యాధితులు, తపఃస్థితులు, ఆయస్తకర్ములు (క్లేశబహుళమైన కర్మలు చేయువారు), కుత్సితజాతులు (ధీవర - డోంబాదులు)—అసితవర్ణులుగా ఉందురు.

ఋషులు నిత్యమును బదర (రేగుపండు) ప్రభాయుతులుగా ఉందురు. కాని తపస్స్థితులైన ఋషులు మాత్రము నిత్యమును అసితవర్ణులుగానే ఉందురు.

అంతియేకాక కారణవ్యపదేశముచే (క్లేశబహులమైన క్రియలుచేయువారు నల్లగా ఉండుట మొ॥) లేదా ఆత్మేచ్ఛచే (కవిబుద్ధ్యనుసారముగా) దేశ - జాతి వశానుసారముగా వర్ణవిధి నొనరించవలెను. దేశ - కర్మ - జాతి - పృథివీవిభాగముల ననుసరించి, ప్రయోగానుసారముగా పురుషుల వర్తనమును నెరవేర్చవలెను.

కిరాత - బర్బర - ఆంధ్ర - ద్రవిడులు, కాశీ-కోసలులు, పులిందులు, ఇతర దాక్షిణాత్యులు ప్రాయికముగా అసితవర్ణులు.

ఉత్తరదిశాశ్రితులైన శక - యవన - పహ్లవ (పల్లవ - కాశీ - బొంబాయి ముద్రణముల పాఠము) - బాహ్లికులు ప్రాయికముగా గౌరవర్ణులు.

పాంచాల - శూరసేన - మహిష - ఓఢ్ర - మగధ - అంగ - వంగ - కళింగ దేశస్థులు శ్యామవర్ణులు.

బ్రాహ్మణ-క్షత్రియులు—గౌరవర్ణులు.

వైశ్య-శూద్రులు—శ్యామవర్ణులు.[14]*

శ్మశ్రుకర్మ

పైవిధము యథాన్యాయముగా ముఖ - అంగ - ఉపాంగవర్తనము కావించి,[15] పిమ్మట దేశ - కాల (కర్మ - కాశీ, బొంబాయి ముద్రణముల పాఠము) - వయస్సులననుసరించి శ్మశ్రుకర్మ నిర్వర్తించవలెను. ఆ యా అవస్థల ననుసరించి శ్మశ్రువు (గడ్డము - మీసము) నాలుగు విధములుగా ఉండును—శుద్ధము (నిత్యమును క్షురకర్మ నాచరించుచుండుటచే శుభ్రముగా ఉండునది), శ్యామము (మాసినగడ్డము), రోమశము (ఏనాడును క్షురకర్మ ఎరుగని సిక్కుల గడ్డము వంటిది), విచిత్రము (విచిత్రసన్నివేశములతో షోకుగా కత్తిరింపబడినది).

---

14. ఒక్కొక్కరికి ఒక్కొక్క వర్ణము చెప్పబడినది. కాని మనవారిప్పుడు అందర కును ఒకేరంగు, సాధారణముగా తెల్లనిరంగు కాని, గులాబిరంగు కాని, వేయుచుందురు. ఇది అశాస్త్రీయమును, లోకవిరుద్ధమును కూడ. దేశ - జాతి - కర్మలనుబట్టి వర్ణమును నిర్ణయించుకొని పిమ్మట వర్తనము చేయుట ముఖ్యము.

15. ముఖమునందేకాక అంగ - ఉపాంగములందు కూడ రంగు వేసికొనవలెనని చెప్పుట గమనార్హము. మనవారిప్పుడు ముఖమునకింత తెల్లనిరంగు లేదా గులాబిరంగు వేసికొని చేతులను, పాదములను అట్లే వదలివేయుచుందురు. ఇది ఒక్కొక్కప్పుడు జుగుప్సను కూడ కలిగించుచుండును. కావున శ్రద్ధతో శరీరమునందంతటను వర్తనము కావించవలెను.

*[కాశీముద్రణమునందు 23 వ అధ్యా—74-105 శ్లో; బొంబాయిముద్రణమునందు 21 వ అధ్యా—75-105 శ్లో; బరోడాముద్రణమునందు 21 వ అధ్యా—78-113 శ్లో.]



లింగస్థ (బ్రహ్మచారి - వానప్రస్థులు) - అమాత్య - పురోధస - మధ్యస్థ పురుష (ఉత్తమ - అధమ ప్రకృతులు కానివారు) - దీక్షాసమాశ్రితులకు 'శుద్ధశ్మశ్రువు' ఉండవలయును.

సిద్ధ-విద్యాధరాది దివ్యపురుషులకు, పార్థివ-కుమారులకు, రాజోపజీవులకు, శృంగార పురుషులకు, యౌవనోన్మాదులకు (అమాత్య - పురోధసులైనను సరే) 'విచిత్ర శ్మశ్రువు' ఉండవలయును.

అనిస్తీర్ణ (పూర్తికాని) ప్రతిజ్ఞకలవారు, దుఃఖితులు, తపస్వులు, వ్యసనాభి హతులును అయినవారికి 'శ్యామశ్మశ్రువు'ను ఉంచవలయును.

ఋషి-తాపస-దీర్ఘవ్రత-చీరబద్ధులకు 'రోమశశ్మశ్రువు' ఉండవలయును.

పైవిధముగా ప్రయోక్తలు నానావిధములైన శ్మశ్రువులను కల్పించవలెను.

వేషములు

ఇంక నానా ప్రయోగజములైన వేషములను వివరింతును. వేషము మూడు విధములుగా ఉండును—శుద్ధము, మలినము, విచిత్రము. వీని వినియోగములను వివరింతును—

1. శుద్ధము— దేవాభిగమన-మంగళ-నియమ-తిథినక్షత్రయోగ-వివాహ కరణ-ధర్మప్రవృత్తకర్మలయందు స్త్రీపురుషుల వేషము శుద్ధముగా (తెల్లనివస్త్ర ములతో కూడినదిగా) ఉండవలెను. ఇట్లే ప్రాయశ్చిత్తికుల (వినీతుల) వేషమును శుద్ధమే. మరియు వృద్ధ-బ్రాహ్మణ (సిద్ధ-విద్యాధర-కాశీముద్రణ పాఠము)-శ్రేష్ఠి-అమాత్య-పురోధస-వణిక్-కంచుకి-తపస్వి-విప్ర-క్షత్రియ-వైశ్య - స్థానీయమానవుల నాటకాశ్రయమైన వస్త్రవిధి శుద్ధముగానే ఉండవలెను.

2. చిత్రము—దేవ-దానవ-యక్ష-గంధర్వ - ఉరగ - రక్షో-నృప-కర్కశుల (కాముకుల - అని పాఠాంతరము) వేషము చిత్రముగా ఉండవలెను.

3. మలినము— ఉన్మత్త-ప్రమత్త (త్రాగుబోతులు) - అధ్వగ (బాట సారులు) - వ్యసనోపహతుల వేషము మలినముగా ఉండవలెను. శుద్ధ-చిత్రవేషము లలో వస్త్రములు ఉత్తరీయములు కూడ శుద్ధములుగాను, రక్త-విచిత్రములుగాను కల్పింపబడవలెను. అట్లే మలినవేషమందును అన్నియును మలినములుగానేఉండ వలెను. నాట్యతత్త్వజ్ఞులు వీనిని చక్కగా సంయోజనము చేయవలెను.

ముని - నిర్గ్రంథ (జైనులు) - శాక్య (బౌద్ధులు) - యతి - పాశుపత - త్రిదండి (సన్యాసి) - శ్రోత్రియులకు లోకస్వభావము ననుసరించి వ్రతానుసారమైన వేషములను కల్పించవలెను.

తాపసులకు చీర (స్థూలమైన వృక్షచర్మము) - వల్కల (భూర్జపత్రచర్మము) - చర్మము (మృగచర్మము) లు అర్హములు.

పాశుపతులకు నానాచిత్రవస్త్రములు తగును.

కుజాతులకు (కులజులకు - అని కాశీపాఠము) యథార్హమైన వస్త్రములను కల్పించవలెను.

అంతఃపురరక్షణమందు వినియుక్తులు యథావిధిగా కాషాయకంచుకములను ధరించవలెను.

అవస్థాంతరములందు పురుషుల (స్త్రీల - అని కాశీపాఠము) వేషము క్రింది విధముగా ఉండవలయును—శూరులు సంగ్రామోచిత వేషులై విచిత్ర శస్త్ర-కవచులును, బద్ధతూణీరులును, ధనుర్ధరులును కావలయును. నృపుల వేషము నిత్యమును చిత్రముగా ఉండవలెను ; కాని, నక్షత్రోత్పాత మంగళమందు (నక్షత్రోత్పాతప్రశమనార్థమైన మంగళమందు—ఇది నైమిత్తిక శ్రాద్ధ-దేవతార్చనాదుల కుపలక్షణము) మాత్రము కేవలము శుద్ధముగానే ఉండవలెను.

ఇట్లు దేశ-జాతివయోనుసారముగా ఉత్తమ-మధ్యమ-అధములైన స్త్రీ-పురుషులకు వేషములను కల్పించవలెను. నాటకాశ్రయమైన ప్రయోగమందు శుభ - అశుభకృతములైన వివిధావస్థలను పొందెడివారికి పై విధముగా వస్త్రవిధిని నిర్వహించవలెను.*

### ప్రతిశిరములు: కేశరచనము

పై విధముగానే దేశ - జాతి - వయోనుసారముగా దివ్యులకు, మానవులకు నాటకాశ్రయములైన ప్రతిశిరములను[16] (ప్రతికృతిరూపములైన శిరములను) ఉపయోగించవలెను. వీనిలో దివ్య - పార్థివ సంశ్రయములైన మకుటములు (విగ్గులు) మూడు విధములు - పార్శ్వగతము (పార్శ్వమౌళి), మస్తకి, కిరీటి.

దేవ - గంధర్వ - యక్ష - పన్నగ - రక్షస్సులకు 'పార్శ్వమౌళి' (పార్శ్వగత) మకుటము నుపయోగించవలెను.

---

*[కాశీముద్రణమునందు 23వ అధ్యా—106-131 శ్లో; బొంబాయిముద్రణమునందు 21 వ అధ్యా—106-129 శ్లో; బరోడాముద్రణమునందు 21 వ అధ్యా—114-138 శ్లో.]

16. ప్రతిశిరము = ప్రతిశీర్షకము = ప్రతికృతి (ప్రకృతి అని మూలము) రూపమగు శిరము ప్రతిశిరము. [అభినవభారతి - 3 వ సం - పుట 132] ఈ శిరములు విగ్గులు కలవిగా ఉండును. దానివలన కేశములయందును, శ్మశ్రువుల యందును పాత్రోచితమగు రూపములను కల్పించవీలగును. ముండితుడు కావలెనన్న పూర్తిగా క్షురకర్మ చేయనవసరము లేక ముండితమకుటము నుపయోగించవచ్చును. ఇది మనకు అనుభవములో ఉన్నవిషయమే.





వస్త్రధారణ విధానములు
(అమరావతీ శిల్పములు)

దివ్యులలో ఉత్తములకు 'కిరీటి' మకుటము నుపయోగించవలెను.

ప్రశ్న—దివ్య - పార్థివులలో ఉత్తములు పార్శ్వమౌళి మకుటములు కలిగి యుండవలెనని చెప్పబడెనుకదా? అసలీ మకుటము లెందులకు సృష్టింపబడినవి?

సమా—వేదములయందు యథాశ్రుతిగా కేశచ్ఛేదము విహితమైయున్నది. యజ్ఞమందు క్షురకర్మను చేయించుకొనినవానియొక్క శిరమును ఆచ్ఛాదించుటకును (ఉష్ణీషాదులు). కేశములు దీర్ఘములు కానప్పుడు వానిని సరిచేయుటకును (విగ్గులు) ఈ మకుటములు (=ముకుటములు) కల్పింపబడినవి.

మధ్యములకు పార్శ్వమౌళి మకుటముల నుపయోగించవలెను. కనిష్ఠులకు శీర్షమౌళి బాగుండును.

నరాధిపులకు 'మస్తకి' మకుటముల నుపయోగించవలెను.

విద్యాధర - సిద్ధ - చారణులకు గ్రంథిమంతములైన కేశమకుటములను (జుట్టుముడులు) కల్పించవలెను.

రక్షో - దానవ - దైత్యుల (యక్షుల - అని పాఠాంతరము) మకుటములు పింగళవర్ణము కలవియును, ఆస్యములు పింగళవర్ణనేత్రములు హరిత్శ్మశ్రువులు కలవియును కావలయును.

సేనాపతి - యువరాజ - మహామాత్రులకు అర్ధమకుటమును యోజింపవలెను.

అమాత్య - కంచుకి - శ్రేష్ఠి - పురోధసుల ప్రతిశీర్షములను వేష్టనాబద్ధపట్టములను (ఉష్ణీషప్రాయములను) గా చేయవలెను.

పిశాచ - ఉన్మత్త - భూత - సాధక - తపస్వి - అనిస్తీర్ణప్రతిజ్ఞుల శిరములు లంబకేశములుగా ఉండవలెను.

'శాక్య - శ్రోత్రియ - నిర్గ్రంథ - పరివ్రాట్ - దీక్షిత - యజ్ఞదీక్షాన్వితులకు శిరోముండనముకల ప్రతిశీర్షకములను కూర్చవలెను.

ఇంక వ్రతానుసారులైన ఆ యా లింగస్థుల శిరములు ముండములు, లేదా కుంచితములు, లేదా లంబకేశయుతములు కావలయును.

ధూర్త (వధూ-అని కాశీముద్రణ పాఠము) - రాత్యుపజీవి (రాజోపజీవి-అని కాశీముద్రణ పాఠము) - శృంగారచిత్తుల శిరములు కుంచితకేశయుతములు కావలయును.

బాలుర శిరములు త్రిశిఖండ (మూడుగా ఉన్న చూలికలతో) విభూషితములుగా ఉండవలెను.

మునుల శిరములు జటామకుట బద్ధములుగా ఉండవలెను. చేటుల శిరములు త్రిశిఖాయుతములు లేదా ముండితములు కావలయును.





పురుషుల ప్రతిశిరములు
(అమరావతీ శిల్పములు)

విదూషకుని శిరము ఖలతి (బట్టతల), లేదా కాకపదము (కాకిరెక్కవలె ఉండునది) కావలయును.

ఇంక శేషించినవారి శిరములను అర్థానుసారముగా, నానావస్థాంతరాశ్రయముగా, దేశ-జాతి సమాశ్రయముగా కూర్చవలెను.

## దృష్టుల ప్రాధాన్యము[17]

ఇట్లు నానా ప్రకారములైన భూషణ-వర్ణక-వస్త్ర-మాల్యములతో యథావిధిగా వేషములను చక్కగా కల్పించవలెను. మొదట ప్రయోగగుణసంభవమైన ప్రకృతిని స్థాపించి (రామాదుల రూపమును పొంది), తాదృశమైన స్త్రీల లేదా పురుషుల అవస్థలను పొందవలెను. దివ్యులకు సంబంధించిన సర్వభావములను మానుష సంశ్రయములుగానే నిరూపించవలెను. ప్రయోక్తలు వారికి అనిమిషత్వాదులను కల్పించరాదు.

> ఇహ భావరసాశ్చైవ దృష్టిభిః సంప్రతిష్ఠితాః ।
> దృష్ట్యైవ స్థాపితో హ్యర్థః పశ్చాదంగై ర్విభావ్యతే ॥ 160

—నాట్యమున భావ-రసములు దృష్టులయందే ప్రతిష్ఠితములై యున్నవి. దృష్టులచే స్థాపితములైన అర్థములే పిమ్మట అంగాభినయముచే విభావ్యములగును.

నానా ప్రకృతి సంభవమైన అంగరచనము పై విధముగా ఉండునని తెలియవలెను.

## సంజీవము[18]

ఇంక 'సంజీవ' (సజ్జీవము, సజీవము అని బరోడాముద్రణపాఠము) లక్షణమును వివరింతును. ప్రాణుల (పశు-పక్ష్యాదుల) రంగప్రవేశము 'సంజీవ' మనబడును. ఈ ప్రాణులు మూడు విధములు— చతుష్పదములు, ద్విపదములు, అపదములు. గ్రామ్యములు, ఆరణ్యములును అయిన పశువులు చతుష్పదములు; ఖగములు, మనుష్యులు, ద్విపదములు; ఉరగములు అపదములు.

17. ఇంచుమించుగా ఈ భాగము కాశీముద్రణమునందు లేదు.

18. సంజీవలక్షణమును వివరించు అభినవభారతీ భాగము శిథిలమైనట్లుగా కన్పట్టుచున్నది (పుట 109). అందుచే దీని విషయమున అభినవగుప్తుని అభిప్రాయ మేమియో తెలియుటలేదు. సజీవులైన మనుష్యులతోపాటు సజీవములైన పశుపక్ష్యాదులు కూడ రంగమునందు ప్రవేశించుట 'సంజీవ' మనబడునని చెప్పవచ్చును. వీటివలన రంగమునకు శోభ కలిగి రంజనాతిశయము కలుగును.

సజీవములుకాని వృక్ష-ప్రాసాదాదుల నెట్లునిరూపించవలెనో 12 వ అధ్యాయమందు వివరింపబడినది. ఇంక ఈ అధ్యాయమందు సజీవుల రంగప్రవేశము వివరింపబడినదన్నమాట.



## ప్రహరణములు

నాటకమందు యుద్ధ-సంఫేట-ఉపరోధముల విషయమున తత్సంబంధులైన వ్యక్తులు నానాప్రహరణోపేతులుగా ఉండవలెను[19]. ఆయుధములు (ఆయుధ-వర్మములు - అని కాశీముద్రణపాఠము) ఆయా పురుషుల ప్రమాణములననుసరించి ఉండవలెను[20]. ఆ ఆయుధముల ప్రమాణములను ఇంక వివరింతును.

భిండి— 12 తాలముల పొడువు ఉండవలెను.

కుంతము— పది తాలముల పొడువు.

శతఘ్ని-శూల-తోమర-శక్తులు— ఎనిమిది తాలముల పొడువు.

ధనువు— ఎనిమిది తాలముల పొడువు, రెండు హస్తముల వెడల్పు కలిగియుండవలెను.

శర-గద-వజ్రములు— 4 తాలముల పొడువు ఉండవలెను.

అసి— 40 అంగుళముల పొడువు ఉండవలెను.

చక్రము (డాలు)—12అంగుళముల పొడువు(వ్యాసము) కలిగి.యుండవలెను.

ప్రాస-పట్టిసములు— 6 అంగుళముల పొడువు ఉండవలెను.

దండ-కణయములు— 20 అంగుళముల పొడువు ఉండవలెను.

సబలము— 16 అంగుళముల విస్తీర్ణముకలదై చిరుగంటలతో కూడినది కావలెను.

ఖేటకము— 30 అంగుళముల ప్రమాణము కలిగియుండవలెను.

మరియు జర్జర-దండకాష్ఠ-ప్రతిశీర్షక-ఛత్ర- చామర - ధ్వజ - భృంగారములే కాక ఇంకను లోకమందు పురుషులకు ఉపకరణభూతములయిన ద్రవ్యములు కూడ నాట్యమం దుపయుక్తములగును. పై ద్రవ్యము లన్నియును ఆయా శాస్త్రకారులచే ఆయా సందర్భములందు వివరింపబడియున్నవి. తదనుసారముగా, తల్లక్షణము లను ప్రయోక్తలూహించవలెను.[21]*

19. ప్రహరణమనగా యుద్ధోపయోగిని అయిన ఆయుధము. ఇందు ఆయా అస్త్రములు తత్తదధిష్ఠానదేవతాస్వరూపములు కలిగియుండవలెను. ఉదా: నాగాస్త్రము సర్పాకృతిగాను, నృసింహాస్త్రము నరసింహాకృతిగాను ఉండవలెను. [అభినవభారతి - 3వ సం - పుట 135]

20. భిండి ద్వాదశతాల (జేన) ప్రమాణమనునప్పుడు ఏ పురుషుడు దానిని ధరించునో వాని 12 జేనలతోనే దానిని కొలవవలెనని అర్థము.

21. పై ద్రవ్యములు లోకమున అనేక రూపములలో ఉండును. కాని నాట్యోపయోగి అయిన రూపమునే ఊహాపోహములచే నిర్ణయించుకొనవలసియున్నది. [అభినవభారతి - 3 వ సం - పుట 137]

*[కాశీముద్రణమునందు 23 వ అధ్యా—132-163 శ్లో, బొంబాయిముద్రణమునందు 21వ అధ్యా—130-163 శ్లో, బరోడాముద్రణమునందు 21 వ అధ్యా—139-173 శ్లో.]

జర్జరము

ఇంక జర్జర - దండకాష్ఠ లక్షణములను వివరింతును. మహేంద్రధ్వజభేదము లను గూర్చి) విశ్వకర్మ లక్షణసహితముగా వివరించియుండెను. దారుకర్మతో కూడిన దాని నిర్మాణవిధానమును వివరింతును— చెట్టువేరుతోకాని, చెట్టు కొమ్మతోకాని జర్జరము నిర్మితము కావలయును. అసలు, జర్జరమునకు వేణువు (వెదురు) శ్రేష్ఠము. శ్వేతభూమియందు జనించిన వేణువును పుష్య నక్షత్రమందు జర్జరార్థము ప్రయత్నపూర్వకముగా సేకరించవలెను. అది 108 అంగుళముల ప్రమాణమును ఒక్కొక్కక్క జేన దూరమున ఉన్న నాలుగు గ్రంథులను కలిగి యుండవలెను. గ్రంథులు స్థూలముగా (కనిపించునంత పెద్దవిగా) ఉండరాదు. శాఖలుకాని, రంధ్రములుకాని ఉండరాదు. క్రిమిక్షతపర్వములు కలదియును, ఇతర వేణుసంఘర్షముచే సన్నముగా ఉండునదియును కారాదు. మధు (తేనె)-సర్పి (నెయ్యి)-స్సర్షపముల (ఆవాలు) చే మాల్య-ధూప పురస్కృతముగా, విధిపూర్వక ముగా వేణువును పూజించి, జర్జరార్థము దానిని గ్రహించవలెను. మహేంద్రధ్వజ విషయమున చెప్పబడిన విధి-క్రమవులే పుష్యవేణుసమాశ్రయమైన జర్జరవిషయము నను అనుసరించవలెను. దీర్ఘ పర్వము, తనుపత్రము, పర్వాగ్రతండులమును (అగ్రపర్వ మందు వెదురుబియ్యము కలది) అయినదానిని 'పుష్య (పుణ్య- అని కాశీపాఠము) వేణువు' అందురు.

దండకాష్ఠము

ప్రమాణయుక్తముగా జర్జరవిధిని వివరించియున్నాను. ఇంక దండకాష్ఠ లక్షణమును వివరింతును. వెలగ, మారేడు, వెదురు కఱ్ఱలతో దండకాష్ఠమును నిర్మించవలెను. అది త్రిభాగవక్రమును (మూడువంపులు తిరిగినది), మందశాఖమును, లక్షణాన్వితమును కావలయును ; పురుగులు దొలిచినది, పుచ్చినది కారాదు.

పైవిధముగా సలక్షణములగు దండకాష్ఠ - జర్జరములను నిర్మించనివాడు మహోపచయమును పొందుట ధ్రువము.

ప్రతిశీర్షకనిర్మాణము

ఇంక శీర్షకవిభాగార్థము 'ఘటి' ని[22] ప్రయత్నపూర్వకముగా సమకూర్చు కొనవలెను. అది ఆయా ప్రకృతుల ప్రమాణముల ననుసరించి 32 అంగుళముల

22. "శీర్షవిభాగార్థము 'ఘటి' ని సమకూర్చవలెను" అని బరోడా ముద్రణపాఠము. "శీర్ష విధానార్థము 'పటి' ని సమకూర్చవలె" నని కాశీ ముద్రణపాఠము. ఇందు "ఘటి" అను పాఠమే సమంజసముగా ఉన్నది. 'ఘటి' అనగా కుండ. కుండ ఆకారముగా శిరమును తయారుచేసి శిరమువలె ధరింపబడును కావున దీనికి 'ప్రతిశిరము' (Mask) అని పేరు.



శీర్షవిభాగార్థ మనగా రెండేసి, మూడేసి శిరములను కల్పించుటకొరకు అని అర్థము. లేదా తన శిరమును కప్పివేసెడి ఇంకొక కృత్రిమశిరమును తగిలించుకొనుట (ఇది కాశీ ముద్రణపాఠముయొక్క అర్థము). ప్రతిపాద-ప్రతిహస్తముల విషయమునను ఇట్లే కల్పించుకొన వలయును (అనగా నాలుగేసి, ఆరేసి హస్తములను లేదా పాదములను కల్పించుటయందును ఈ విధినే అనుసరించవలెను). [అభినవభారతి - 3 వ సం - పుటలు 198-199]


జపానుదేశపు 'నో' రూపకప్రదర్శనములందలి ఒక ప్రతిశిరము

గ్రీకురూపకప్రదర్శనములందు నటులు ప్రతిశీర్షకములనే ధరించెడివారు. జపాను 'నో' రూపకములందును ఇట్టిది కలదు (ప్రక్కపటమును చూడవలెను). మహమ్మదీయుల పండుగసమయము లలో మనవారు 'పెద్దపులి' వేషమును వేయు చుందురు. ఆ పెద్దపులి వేషమును వేయునతడు ధరించు 'పులితల' ప్రతిశీర్షకమునకు ఒక ఉదాహరణము. గ్రీకుదేశమునకు సంబంధించిన రెండు ప్రతిశీర్షకములను క్రింద ఉదాహరించుచున్నాను.


గ్రీసుదేశమునందలి భూతముల ప్రతిశిరములలో ఒక భేదము


గ్రీసుదేశమునందలి విషాదరూపక నాయకుని ప్రతిశిరము

వరకును ప్రమాణములను కలిగియుండును. బిల్వమజ్జతో (మారేడు జిగురుతో) సిర (చెట్టుబెరడు) సమాశ్రయముగా ఘటిని నిర్మించవలెను. ఉడకబెట్టిన మారేడుగుజ్జు ద్రవముతో ఊకను లేదా బూడిదను కలిపి ప్రతిశీర్షకమును తయారుచేయవలెను. మారేడుగుజ్జు పూయబడిన చీరతో ఘటిని కప్పవలెను. ఈ ఘటి స్థూలముకాని, ఆనతము (ఒకప్రక్కకు వంగినది) కాని, చిన్నది లేదా పల్చగా ఉండునది కాని, దీర్ఘము కాని కారాదు. దానిని ఎండలో కాని, ఇతరవిధముగా కాని ఎండబెట్టి, విధిదృష్టవిధానమున సుతీక్ష్ణమైన శస్త్రముతో, కన్నులు మొదలగు అవయవముల నేర్పరుచుటకు, దానియందు రంధ్రములను చేయవలెను.

ముందుగా దానియందు అర్థార్థమగునట్లుగా లలాటమును కోణసహితముగ చెక్కవలెను. లలాటము $\frac{1}{2}$ (అర) అంగుళము లోతుగను, 6 అంగుళముల పొడువుగను చెక్కవలెను. చెక్కిళ్లను $\frac{1}{4}$ అంగుళము లోతుగను, 2 అంగుళముల పొడువుగను చెక్కవలెను. గండముల చివర రెండంగుళముల పొడువుగను, 3 అంగుళముల లోతుగను కర్ణనాళ-కర్ణవివరములను ఏర్పరచవలెను. కర్ణశష్కులిని ద్వాదశాంగుళ ప్రమాణముగ నిర్మించవలెను. ఇట్లు ఘటియందు సమముగ ఛేద్యకర్మను ఆచరించవలెను. ఆ ఘటికి పైభాగమున అనేకములగు శిల్పములతో, మకుటములను నిర్మించవలెను. అవి రత్నచ్ఛన్నములై నానారూపశోభితములై ఒప్పుచుండవలెను.

## నాట్యోపకరణములు

ప్రకృతుల ననుసరించి, నాట్యమునకు సంబంధించిన బహుప్రకారములగు ఉపకరణములను ప్రయోగమందు ఉపయోగించవలెను. చరాచరసమన్వితమైన ఈ లోకమందలి శిల్పములు, కర్మలు మున్నగునవన్నియును నాట్యమందు ఉపకరణములే అగును. నాట్యోపకరణములుగ ఆశ్రయింపబడు శిల్పకర్మలు అనంతములు కావున ఏది ఎవని దేశమునకు సంబంధించియుండునో దానినే వానికి కల్పించవలెను; నాట్యోపకరణముల విషయమున ప్రయోక్తల కింతకంటె మార్గాంతరము లేదు. కర్మ-శిల్పములను తొలుతగా సృష్టించినవాడే వాని నిర్మాణ-ప్రమాణ-లక్షణ-విధులను వివరించియుండును (కావున వానినే ఇందును అనుసరించవలెను). మహాత్మునిచే (విశ్వకర్మచే) కాష్ఠయంత్రభూయిష్ఠముగా చేయబడిన శిల్పసృష్టి నాట్యమందుపయుక్తమగుట సమ్మతముకాదు; గురుత్వము (బరువు) వలన అది ఖేదావహమగును.*

*[కాశీముద్రణమునందు 23వ అధ్యా—164-190 శ్లో; బొంబాయిముద్రణమునందు 21వ అధ్యా—164-190 శ్లో; బరోడా ముద్రణమునందు 21వ అధ్యా—173-200 శ్లో.]



ఈ జీవలోకమందలి నానాలక్షణలక్షితములగు వస్తువుల ఆకృతివిశేషమే నాట్యమందు ఉపకరణము కాగలదు [వెనుక 197 శ్లోకములో కర్మ-శిల్పములు నాట్యోపకరణములుగా చెప్పబడెను. ఇప్పుడు ద్రవ్యమును కూడ నాట్యోపకరణమునుగా చెప్పి, దాని అనుకృతియే ఇందుండవలెనని నిర్దేశించెను.] ప్రాసాద-గృహ-యాన-నానాప్రహరణములను యథోక్తలక్షణముగా నాట్యమందు చూపించుట శక్యముకాదు. లోకధర్మి ఒకవిధముగా ఉండును; నాట్యధర్మి ఇంకొకవిధముగా ఉండును. లోకధర్మి స్వభావసిద్ధము, ఇంక నాట్యధర్మి విభావనాత్మకము (భావనామాత్రసిద్ధము). ఇనుముతో కాని, గుల్లగాగాక గట్టిగా ఉండునట్లు కాని నాట్యోపకరణములను నిర్మించరాదు; అట్లే నిర్మింపబడినచో బరువువలన ఖేదము జనించును. కాష్ఠ - చర్మ - వస్త్ర - జతు (లక్క) - వేణుదళము (వెదురుబద్ద) లతో తేలికగా కదల్చుటకు వీలగునట్లు నాట్యోపకరణములను తయారుచేయవలెను. చర్మ-వర్మ-ధ్వజ-శైల-ప్రాసాద-దేవతాగృహ - హయ - వారణ - యాన-విమాన-గృహముల ఆకృతులను, ముందుగా వేణుదళములతో రూపు పొడగట్టునట్లు నిర్మించి, వానిని మంచి రంగులుగల వస్త్రములచే కప్పి, ప్రకృతిసారూప్యమును కలిగించవలయును. ఒకవేళ వస్త్రములు దొరుకనిచో వానికిబదులుగా శ్లక్ష్ణములైన తాలీయ (తాలపత్ర) ములనుకాని, కిలింజమును (భూర్జవేణుదళాదులను) కాని ఉపయోగించవలెను.

ఇంక ఆయుధములను తృణ-వేణు దళములతోను, తదితర నానారూపములను జతు-భేండ (జీలుగబెండు) ములతోను నిర్మించవలెను. ప్రతి (కృత్రిమ) పాద-ప్రతిశిరః-ప్రతిహస్త-ప్రతిత్వచములను తృణ-కిలింజ-భేండములచే నిర్మించి సారూప్యమును కల్గించవలెను. మరియు సారూప్యము కలుగునట్లుగా వివిధ రూపములను మట్టితో కూడ నిర్మించవచ్చును. భేండ-వస్త్ర-మధూచ్ఛిష్ట (మైనము) - లాక్షా - అభ్రదళము (అభ్రకపురేకు=మైకా; ఇదిఇప్పటి డాగురేకు అయియుండును) లతోను, అతసీ (అవిసె) - శణ(జనుము) - బిల్వము (మారేడు) లతోను ఏనుగులను (పర్వతములను - అని పాఠాంతరము) నిర్మించవలెను. నానా కుసుమజాతులును, వివిధఫలములును భేండ-వస్త్ర-మధూచ్ఛిష్ట-లాక్షా నిర్మితములు కావలయును. భేండ-వస్త్ర-మధూచ్ఛిష్టములతో, తామ్రపత్రము (రాగిరేకు) లతో, నీలవర్ణోపేతములు లేదా రంజితములు అయిన అభ్రపత్రములతో మణులను తయారుచేయవలెను. అసలు, వీనికి ఉపాశ్రయములుగా (ఆధారములుగా) మెరిసెడి తగరపురేకులే (ముత్యపురేకులు అయియుండును) ఉండవలెను.

పూర్వము వివరింపబడిన వివిధములైన దివ్యమకుటములు అభ్రపత్రోజ్జ్వలములుగా నిర్మింపబడవలెను; మరియు మణివ్యాలోపశోభితములు కావలెను. వానిని

నిర్మించుటయందు శాస్త్రప్రభవమైన కర్మవిధానము చెప్పబడలేదు. కాన, ఇవి ఊహాపోహప్రయోజితములై ఆచార్యబుద్ధి ననుసరించి నిర్మితములు కావలయును. భవిష్యత్కాలమందలి మనుష్యులు అల్పబలులగుదురుకాన వారి కుచితమగునట్లుగా ఈ నాట్యోపకరణనిర్మాణప్రక్రియను వివరించియున్నాను. మనుష్యులు కాంచనమయములగు ఆభరణాదులను కల్పించుకొనలేరు; వారి ఆభరణములును, మకుటములును సువర్ణ-మణి నిర్మితములు కారాదు. యుద్ధ - నియుద్ధ - నృత్త - దృష్టి వ్యాపారకర్మలందు ఆభరణముల బరువుచే అలసినవానికి స్వేద-మూర్ఛలు కలుగును. స్వేద-మూర్ఛా-క్లమార్తుని ప్రయోగము తప్పక వినాశమొందును. అంతియేకాదు, వ్యాయత (అతిశయ) చేష్టలవలన ప్రాణాపాయమును కలుగగలదు. కావున తామ్రపత్ర-రంజితాభ్రపత్ర-భేండ-మధూచ్ఛిష్టములతోనే ఆభరణములను తయారుచేయవలెను. ఇట్లు లోక స్వభావమును అనుసరించి, స్వబుద్ధివిభవముతో బుధుడు (నాట్యాచార్యుడు) నాట్యోపకరణములను చక్కగా కూర్చవలెను.

ఆయుధములచే ఛేదించుట కాని (నరకుటకాని), భేదించుట కాని (చీల్చుట కాని), కొట్టుటకాని రంగమునందు చేయరాదు. వానిని సంజ్ఞామాత్రముగనే ప్రయోగించవలెను. యోగశిక్షచే, విద్యచే (సుధామకుడు చెప్పిన హస్తలాఘవాదులచే), మాయచే (చతుర్బంధాదికము=కనికట్టు= మెస్మరిజమ్‌చే) రంగమధ్యమందు శస్త్రప్రయోగమును యథార్థముగా చూపవచ్చును.

ఇట్లు నానాప్రకారములైన ఆయుధ-ఆభరణములలో నేను చెప్పక విడిచిన వానిని లోకమునుండి గ్రహించవలెను. ఇంతవరకును ఆహార్యాభినయమును సంగ్రహముగా వివరించితిని. ఇంక సామాన్యాభినయమును వివరింతును.*

ఏకవింశాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

### 1. ఆహార్యాభినయప్రాధాన్యము

'ఆహార్య' మను పదమునకు నేపథ్య సంబంధమైన కార్యకలాపమని అర్థము: ఇందు అంగవర్తనము (కోటావేసికొనుట), వస్త్రధారణము, అలంకరణ మొదలైనవన్నియును చేరును. దీనినే ఆంగ్లమున **"costumes and make-up"** అందురు. నాట్యశాలా నిర్మాణమందే నేపథ్యగృహము **(Green room)** నకు కూడ స్థానమొసంగబడినది. నేపథ్యగృహ కుడ్యమునందు రెండు ద్వారములుండునని చెప్పబడుటచే నేపథ్యగృహమునందు రెండు భాగములుండియుండుననియు, ఒకటి పురుషుల ఆహార్యమునకును, ఇంకొకటి స్త్రీల ఆహార్యమునకును ఉపయుక్తములయ్యెడివనియు, ఒకద్వారమును పురుషులును, ఇంకొక ద్వారమును స్త్రీలును ఉపయోగించెడివారనియు ఊహించుట కవకాశమున్నది.

కళలన్నియును అనుకరణాత్మకములుకదా ; అందున, నాట్య మన్నింటికంటెను అధికముగా అనుకరణాత్మకము. అనుకరణమన్నంతనే స్వభావమును విడిచి, ఇంకొకరి స్వభావమును తనపై ఆరోపించుకొనుట జరుగును. ఆ ఆరోపణము వాక్కునకు మాత్రమే పరిమితమై కంఠస్వరమందు సామ్యమువచ్చినచో అది వాచికానుకరణము లేదా వాచికాభినయమగును. అట్లే, చేష్టను అనుకరించినప్పుడు ఆంగికాభినయమును, మనోభావములను అనుకరించినప్పుడు సాత్త్వికాభినయమును అగుచున్నవి.

శ్రవ్యకావ్యమునందు ఆహార్యమునకు ప్రాధాన్యములేదు. అందుచేతనే కావ్యులు సాధారణముగా పైత్రివిధాభినయములనే పేర్కొనుచుందురు. "వర్ణనాత్మకమైన వాచికము, సంనివేశవలనాదికమైన ఆంగికము, అంతర్బహిరాత్మకమైన సాత్త్వికము అను మూడు అభినయములును కావ్యార్థభావనయందు కరణభూతములు అనగా రసములను ఉత్పాదించుటయందు సాధనములు" అని అభినవగుప్తుడు పేర్కొనుట గమనార్హము [7 వ అధ్యాయమందలి 3 వ అధస్సూచికను చూడవలెను.]

"దృశ్యమానమగుటవలన రూపమనబడినది"; "రూపారోపము కలది కావున రూపకమనబడినది" అనెడి నిర్వచనములు నాట్యమందు ఆహార్యము అత్యావశ్యకమనెడి విషయమును స్పష్టముచేయుచున్నవి. నటుడు రంగస్థలమందు ప్రవేశింపగానే ప్రేక్షకులను ప్రధానముగా ఆకర్షించునది వాని ఆహార్యమే ; పిమ్మట వానిమాటలు, చేష్టలు ; అటుతరువాత సాత్త్వికాభినయము. ఈ దృష్టితో చూచినచో నాట్యమందు ఆహార్యాభినయమే ప్రథమమును, ప్రధానమునుకూడ అగుచున్నది. వాచికాదులయందు సామ్యమున్నను వేషమందు సామ్యములేనిచో నాటకప్రదర్శనమున ప్రధానమైన 'భ్రాంతి' **(Make-believe)** సంపూర్ణము కాజాలదు. పౌరాణిక - చారిత్రక రూపకప్రదర్శనములందు ఆహార్యమునకు మరింత ప్రాధాన్యముకలదు. ఈ అధ్యాయమందలి 3, 4 విశేషాంశములను చూడవలెను.

మొత్తము నాట్యశాలలో నాలుగవవంతు నేపథ్య గృహమునకు ప్రత్యేకింపబడుట కూడ ఆహ్యారాభినయ ప్రాధాన్యమును వ్యక్తముచేయుచున్నదని చెప్పవచ్చును.

భారతదేశమందు ఆహార్యాభినయమును గూర్చి వివరించిన ప్రథమగ్రంథము భరతుని నాట్యశాస్త్రమగుట స్పష్టము. పిమ్మటనైనను ఇంతవిపులముగా చెప్పిన గ్రంథము ఇంకొకటి కన్పట్టదు. భారతీయపద్ధతులు క్రమముగా విస్మృతములైనవని చెప్పవచ్చును. భారతదేశమున సంస్కృతేతరభాషారూపకప్రదర్శనములు ఆరంభమగునాటికే పాశ్చాత్యపద్ధతులు ప్రచారమందుండుటచే ఆ పద్ధతులే అవలంబింపబడెను; మనవారును ఆ మార్గమునే అవలంబించిరి. ఈ దృష్టితోనే శ్రీ పసుమర్తియజ్ఞనారాయణశాస్త్రిగారు తమ "ఆంధ్రనటప్రకాశిక" (1930)లో ఆహార్యాభినయమును వివరించియున్నారు. ఆహార్యాభియనమును

*[ కాశీముద్రణమునందు 23 వ అధ్యా—191-215 శ్లో; బొంబాయిముద్రణమునందు 21 వ అధ్యా—191-218 శ్లో; బరోడా ముద్రణమునందు 21 వ అధ్యా—200-227 శ్లో.]

గూర్చి చర్చించిన ఆంధ్రవిమర్శకులలో వీరే ప్రథములని చెప్పవచ్చును. వీరు స్వానుభవమును జోడించి చక్కని వివరణము చేసియున్నారు. శ్రీ కుమార్ అనువారు 'ఆహార్యం' అనుపేర ఒక గ్రంథమును ప్రకటించినారు.

ఆహార్యమునుగూర్చి లెమన్ థామస్ రీడ్ (Leman Thomas Rede) అను నతడు ఆంగ్లదేశమున ప్రప్రథమముగా "The Road to the Stage" (1827) అను గ్రంథములో విపులమగుచర్చ చేసెను. అది ఇంచుమించుగా ఏబది ఏండ్లపాటు పరమప్రామాణికగ్రంథముగా విలసిల్లినది. అటుపిమ్మట పెక్కు గ్రంథములు బయలుదేరినవి. "Theatre and Stage" అను గ్రంథములోని రెండవభాగములో ఆల్‌ఫ్రెడ్‌హార్ట్రాప్ అనునతడు "make-up" మీద ఒక విపులమైన వ్యాసమును రచించెను. ఇది చక్కగా ఉన్నది.

చైనీయుల ఆహార్యవిధానమును, గ్రీకుల ఆహార్యవిధానమును "The Oxford Companion to the Theatre" అను గ్రంథములో వర్ణింపబడినవి. [pp. 126-127; 337-338] ఈ గ్రంథములోనే "make-up" మీద ఒక ప్రత్యేక వ్యాసముకలదు. [పుటలు-448-508.]

## 2. ఆహార్యము : ఔచిత్యము

నేటి ప్రదర్శనములందు ఒక ముఖ్యలోపము కన్పట్టుచున్నది—వృత్తినటుల విషయమెట్లున్నను, ఔత్సాహికనటులు కొందరు మేకప్ విషయమున, ముఖ్యముగా అంగవర్తనము విషయమున సరిగా శ్రద్ధవహించుట లేదు. ముఖమున కింత రోజ్ క్రీమ్ దట్టముగా పట్టించి చేతులను, కాళ్ళను, చివరకు మెడను కూడ మామూలుగా వదలివేయుచున్నారు. ముందు వరుసలో కూర్చుండిన ప్రేక్షకుల కిది అసహ్యమును, బాధాకరమును అగుచున్నది. ఇంకొక లోపమును కూడ ఇచ్చట పేర్కొనవలసి యున్నది. వృత్తి నటులును, ఔత్సాహిక నటులును కూడ అన్ని వేషములకును (రాక్షసవేషములకు తప్ప) ముఖమునందు సాధారణముగా ఒకే రకపు రంగును వేసికొనుచున్నారు. ఇది సమంజసము కాదు. భరతుడు చెప్పినట్లుగా దాక్షిణాత్యులు ప్రాయికముగా అసితవర్ణులు. కొందరు బాగా తెల్లగా ఉండవచ్చును. కాని, ఎక్కువమంది చామనచాయ కలవారే. అట్టి యెడ అందరకును ఏ రోజ్ క్రీమ్‌నో దట్టముగా పట్టించుట న్యాయ్యము కాజాలదు.

ప్రతిశిరము లేదా ప్రతిశీర్షకము అను పదము నాట్యశాస్త్రమందు మూడు నాలుగు అర్థములందు ప్రయుక్తమైనదని చెప్పవచ్చును—(1) నేటి 'విగ్గు'-పురుషుడు స్త్రీ వేషము వేసినప్పుడును, పురుషులు రాజాదుల వేషములు వేసినప్పుడును ఇది ముఖ్యము. ముండితశిరమును చూపుటకు ప్రత్యేకమైన ప్రతిశిరమును ఉపయోగించవలెనని భరతుడే సూచించెను. (2) వికృతరూపులైన రాక్షసాదుల వేషములను ధరించినప్పుడు కృత్రిమ ముఖమును (Mask) తగిలించుకొనుట. దీనిని తయారుచేసికొనవలసిన విధానమును భరతుడే సూచించియుండెను. ప్రాచీనగ్రీకునటులు మొదలగువారు వీటినే ధరించెడివారు. (3) రావణాదుల బహుశిరస్సులను చూపవలసివచ్చినప్పుడు పది తలలు కలిగియుండునట్లుగా తయారుచేసికొనుట. (4) రాజాదులు ధరించు కిరీటాదులు—ఇంచుమించుగా వై అన్నింటికిని ప్రతిశిరము లేదా ప్రతిశీర్షకమనియే పేరు.



ఇంక అంగరచనా విషయమున నాలుగు ప్రాథమికవర్ణములు చెప్పబడినవి—సిత-నీల-పీత రక్త వర్ణములు. వీనిలో రెండేసి కలియుటవలన మిశ్రవర్ణము లేర్పడుచున్నవి. మూడు, నాలుగేసి వర్ణములు కలియుటవలన ఉపవర్ణము లేర్పడుచున్నవి. వీటిని ఏ యే పాళ్ళలో కలుపవలయునో కూడ భరతుడు నిర్దేశించియుండెను.

దేశభేదమును బట్టి మనుష్యుల రూపములును భేదించుచున్నవి. మరియు ఒకే దేశమందు అనేక జాతులవారున్నారు; ఆ జాతులలో మరల ప్రాదేశికభేదములు కలవు. ఆచారమునందు, వేషమునందు వారు పరస్పరము భేదించుచుందురు. స్త్రీ పురుషలలో ఉత్తమ-మధ్యమ-అధమభేదములచే త్రైవిధ్యము కన్పట్టుచున్నది. ఇందు మరల బాల్య-యౌవన-వృద్ధాది భేదములుకలవు. అంతియేకాక అవస్థాభేదములనుబట్టియు ఆహార్యము మారుచుండును (అనగా ఒకే వ్యక్తి శృంగారమందును, శోకమునందును లేదా సభలో ఉన్నప్పుడు, ఇంటియొద్ద ఉన్నప్పుడు ఒకే రకముగా ఉండదు). ఇట్లు, ఆహార్యవిషయమున ఇన్ని అంశములను గుర్తునందుంచు కొనవలసియున్నది. ఇందు ఏ అంశమును మరచిపోయినను ఆహార్యమునందు ఔచిత్యము లోపించును.

ఇంకొక విషయమును కూడ ఇచ్చట గమనించవలసియున్నది—వేణీబంధము స్త్రీకి సహజమైన అలంకారము. కాని, స్త్రీలందరకును ఒకే రకమగు కేశరచన అందము నీయదు. కొందరికి వాలుజడ బాగుండును. కొందరికి కొప్పుబాగుండును. కొందరికి ప్రక్కపాపట బాగుండును. కొందరికి సిగ బాగుండును. అట్లే పొడుగుగా ఉన్నవారికి ఒక రకపు వస్త్రధారణము బాగున్నచో పొట్టివారికి ఇంకొక రకమును, లావుగాఉన్నవారికి వేరొక రకమును, సన్నముగా ఉన్నవారికి మరియొకరకమును బాగుండును. శరీరవర్ణమునుబట్టి వస్త్రవర్ణమును మనవారు ఎంచుకొనుచుండుట మనకు అనుభవములో ఉన్నవిషయమే. అందుచే ఒకవ్యక్తికి ఒకపరిస్థితిలో నప్పినది ఇంకొకవ్యక్తికి అదేపరిస్థితిలో నప్పకపోవచ్చును. కావున ఈ విషయమునుకూడ ఆహార్యవిషయమున గుర్తునందుంచుకొనవలయును.

దేశ-జాతి-అవస్థాది భేదములను దృష్టియందుంచుకొని భరతుడు కొన్ని సూచనలను చేసియుండెను. తక్కనది లోకమునుండి గ్రహించవలసియున్నది. నిజమునకు ఆహార్యవిషయమున ఫలానా అని నిష్కర్షించు సూత్రములు లేవు. ఒకవ్యక్తి అనుభవము, ఆలోచనాశక్తి అనునవియే అధికప్రమాణములు. అందరును ఆహార్యనిపుణులు కాలేరు. 'ఆహార్యము' కూడ ఒక ప్రత్యేకమైన కళ; అందులో నిష్ణాతుడగుటకు నిరంతకృషి ఆవశ్యకము.

ఆహార్య విషయమున ఎన్ని అంశములున్నవో భరతుడే వివరించియుండెను—వీటిలో ప్రధానమైనది అంగరచన. వర్ణకములచే స్వీయవర్ణమును ఆచ్ఛాదించుకొనవలెను. పురుషులు స్త్రీ వేషమును ధరించునప్పుడు అంగవర్తనము ముఖ్యమని చెప్పబడుట గమనార్హము. తరువాత వస్త్రధారణము, పిమ్మట భూషణ విధి, అటుపిమ్మట శ్మశ్రూకర్మాదులు కర్తవ్యములు. వీలునుబట్టి ఇందులో ముందు వెనుకలుండవచ్చును.

ఆహార్యమనెడి ఈ కళ నేడు ఎంతో అభివృద్ధి చెందియున్నది. దీనితో మనుష్యులను పూర్తిగా మార్చివేయవచ్చును. ఇంతశక్తి దీనియందున్నను అసలు నటుడు ప్రకృతికి తగిన

వాడు కానిచో రక్తితక్కువగును. ఒక బక్కవానిచే భీముని వేషమును ధరింపజేయుట ఉచితమనిపించుకొనదు. అందుచే ప్రకృతికితగిన నటుని ఎన్నుకొనుటకూడ ప్రధానమగు చున్నది. ఈ విషయము 26 వ అధ్యాయమందు వివరింపబడును. నటుడు ప్రకృతికి తగి యున్నచో, చక్కగా సంయోజితము చేయబడిన వాని ఆహార్యము మరింత రాణింపగలదు.

నేడు విద్యుచ్ఛక్తిప్రాముఖ్యమును వహించుటచే అంగరచనము విషయములో మరింత శ్రద్ధను, వివేకమును చూపించవలసిన అవసర మధికమైనది.

లోకమందుకాని, నాట్యమందుకాని ఏ విషయమైనను ఔచిత్యసహితముగా ఉన్న ప్పుడే ఆకర్షణీయమును, ఆహ్లాదకరమును కాగలదు. ఈ ఔచిత్యము దేశ-కాల-అవస్థాదులపై ఆధారపడియుండును. కావ్య-నాట్యములయందు ఔచిత్యమున కెంతటి ప్రాముఖ్య మున్నదో 16 వ అధ్యాయము చివర 7 వ విశేషాంశములో నిరూపించియున్నాను. కావ్య-నాట్యరచనములందే కాక నాటకప్రదర్శనములందును ముఖ్యముగా ఆహార్యమందును ఔచిత్యమున కెంత ప్రాముఖ్యమున్నదో భరతు డీ అధ్యాయమందు స్పష్టముచేసియుండెను. కాని, ఈ వివేచనమును భరతుడు సూటిగా చేయలేదు. అంతియేకాక 'ఔచిత్య' పదమును నిర్వచింపలేదుకూడను.

రుద్రుటుడు అనౌచిత్యమనగా ఏమో క్రిందివిధముగా వివరించెను.

> గ్రామ్యత్వ మనౌచిత్యం వ్యవహారాకారవేషవచనానామ్ ।
> దేశకులజాతివిద్యావిత్తవయఃస్థానపాత్రేషు ॥ —(రుద్రటాలంకారము - XI-9 శ్లో)

—దేశ-కుల-జాతి-విద్యా-విత్త-వయః-స్థాన-పాత్రముల విషయమున వ్యవహార-ఆకార-వేష-వచనములయందలి అనౌచిత్యమే 'గ్రామ్యత్వ' మనెడి దోషమగును.

అనౌచిత్య-ఔత్యములను ఆనందవర్ధనుడు ఈక్రింది విధముగా వివరించెను—

> అనౌచిత్యాదృతే నాన్యద్ రసభంగస్య కారణమ్ ।
> ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా ॥ —(ధ్వన్యాలోకము—III - 15 శ్లో.)

—అనౌచిత్యము వినా వేరొక రసభంగకారణము లేదు. ఇంక ఔచిత్యనిబంధనము కేవలము రసగుళికయే.

ఔచిత్యపదమును స్పష్టముగా నిర్వచించుటయేకాక, ఔచిత్యమును ఒక ప్రధాన సంప్రదాయమునుగా స్థాపించినవాడు క్షేమేంద్రుడు. ఔచిత్యనిరూపణవిషయమున ఇతడు భరతుని అనుసరించెనని చెప్పియున్నాను. పుట 634 లోని 11 వ అధస్సూచికను చూడ వలెను. ఈతడు 'ఔచిత్య' పదమును క్రిందివిధముగా నిర్వచించెను—

> ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్య యత్ ।
> ఉచితస్య చ యో భావః తదౌచిత్యం ప్రచక్షతే ॥ —(ఔచిత్యవిచారచర్చ— 7 శ్లో.)

—దేనికి ఏది తగియుండునో (సదృశముగా ఉండునో) అది 'ఉచిత' మనబడునని పెద్దలనిరి. ఉచితముయొక్క భావమే ఔచిత్యము.

ఇట్టి ఔచిత్యము పద-వాక్య-ప్రబంధ-గుణ-అలంకార-రస-క్రియా-కారక-లింగ-వచన-విశేషణ-ఉపసర్గ-నిపాత-కాల-దేశ-కుల-వ్రత-తత్త్వ-సత్త్వ-అభిప్రాయ-స్వభావ-సార సంగ్రహ-ప్రతిభా-అవస్థా-విచార-నామ-ఆశీర్వాదములందు (మొత్తము 27 స్థానములందు) పాటింపబడవలెనని ఆతడు సోదాహరణముగా వివరించెను.

---

# అధ్యాయము 22[1]

## సామాన్యాభినయము

[కాశీముద్రణమునందు 24 వ అధ్యా-320 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 22 వ అధ్యా-321 శ్లోకములును, బరోడాముద్రణము నందు 22 వ అధ్యా-332 శ్లోకములును కలవు.]

వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములకు సంబంధించిన విశేషాభినయము 'సామాన్యాభినయ' మనబడును[2]

## సాత్త్వికాభినయము

సాత్త్వికాభినయమందే నాట్యము ప్రతిష్ఠితమైయున్నది. కావున దానిని గూర్చి ప్రయత్న మవశ్యము చేయవలెను. సాత్త్వికాభినయము అధికముగాగల అభి నయము జ్యేష్ఠాభినయ మనబడును. సాత్త్వికాభినయము ఇతరాభినయములతో సమానముగా ఉన్నచో అది మధ్యమాభినయ మనబడును. వాచికాంగికాభినయము లధికమై సాత్త్వికాభినయము తక్కువగాఉన్నచో అది అధమాభినయ మనబడును.

సత్త్వము చిత్తవృత్తిరూపమై అవ్యక్తముగా ఉండునని తెలియవలెను. ఇది రోమాంచ-అస్రాది గుణములచే ఆయా స్థానములందు, ఆయా రసములందు గ్రహింపబడుచుండును[3].

---

1. ఈభాగము కాశీ ముద్రణమునందు చతుర్వింశాధ్యాయము. బొంబాయి, బరోడా ముద్రణములందు ద్వావింశాధ్యాయము.

2. (1) వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములలో ఇంతవరకును చెప్పబడనిదియును, కాని వానితో సమప్రాధాన్యము కలదియును, కవి-నట శిక్షార్థ మవశ్యము చెప్పవలసినది యును ఏది కలదో అది 'సామాన్యాభినయ' మనబడును.

(2) వివిధములైన వాచిక-ఆంగిక-సాత్త్విక భేదముల నన్నింటిని ఆయా పాళ్ళలో కూర్చిచేయు అభినయము "సామాన్యాభినయ" మనబడును.

(3) భావ-రసములను చక్కగా ప్రదర్శించుటకు చేయదగిన అభినయము సామా న్యాభినయ మనబడును.

ఈ అధ్యాయమునకు 'సామాన్యాభినయ' మను పేరు ఎట్లు వచ్చినది ? అను విషయ మును గూర్చి అభినవగుప్తుడు వివిధాభిప్రాయములను పేర్కొని చర్చించెను. [అభినవ భారతి - 3 వ సం-పుటలు 146-149]

3. చిత్తవృత్తిరూపమైన సత్త్వము రెండు విధములుగా ఉండును—(1) అభ్యంత రము, (2) బాహ్యము. సంవేదన భూమియందు (మనస్సునందు), ప్రాణభూమియందు

**అలంకార భేదములు**

ఇంక భావ-రసాశ్రయములైన అలంకారములను కూడ నాట్యజ్ఞులు ఎరుంగ వలెను. (ఈ అలంకారములు కేవలము దేహమాత్రనిష్ఠములు— చిత్తవృత్తి రూపములు కావు.)

వక్త్రజములును, గాత్రజములును అయి యౌవనమందు స్త్రీలలో స్పష్టముగా కన్పట్టు వికారములు అలంకారము లనబడును.'—వీటిలో అంగజ (గాత్రజ) భేదములైన అలంకారములు మూడువిధములు, స్వాభావికాలంకారములు పదివిధములు, అయత్నజములైన అలంకారములు ఏడు విధములు'. ఇందు స్వాభావిక-అయత్నజములు రస-భావోపబృంహితములై యుండును.

---

(వాయుప్రసరణమార్గమందు) సంక్రమించియుండునది అభ్యంతరము. ఇంక దేహసంక్రాంతమైనది బాహ్యము. ఇది ఘర్మ-రోమాంచాది గుణరూపముననుండును. ఈ బాహ్య మనునది కూడ సంవేదనరూపమైన అభ్యంతరముయొక్క ఫలమే. అనగా అవ్యక్తమైన చిత్తవృత్తి దేహవ్యాప్తమైనప్పుడు రోమాంచ-అస్రాదులు జనించును. వీనినిబట్టియే అభ్యంతరమైన సత్త్వము ఊహింపబడును. ఈ రోమాంచ-అస్రాదులు రసపోషకములు. చేష్టాలంకారాదులు దేహధర్మములైనను నిజమునకు అవియును సత్త్వజన్యములే. అనగా మనస్సునకు దేహముపై గల ప్రభావమునుబట్టి దేహమునందు కూడ వికారములు జనించుచుండును. ఇవియే చేష్టాలంకారాదులు (భావ-హావ-హేలాదులు).

స్తన-కేశ-లావణ్యాదులు స్త్రీకి సామాన్య లక్షణములై యువతీత్వమును స్పష్టము చేయుచున్నట్లే, ఈ చేష్టాలంకారములును సామాన్యలక్షణములై శృంగారాదులను సూచించుచుండునని తెలియవలెను.

ఏ యే పాత్రలు, ఏ యే రసములందు, ఏ యే భావములను ప్రదర్శించవలెనో భావాధ్యాయమునందు చెప్పబడినది. ఇప్పుడు కేవలము దేహధర్మములైన అలంకారరూపము లగు చేష్టలు వివరింపబడుచున్నవి. [అభినవభారతి - 3 వ సం - పుటలు 152-154]

4. అలంకారములనగా దేహమునందు కన్పట్టు వికారములు లేదా మార్పులు. ఇవియెల్ల అనుభావములే. ఆ యా అలంకారములు కన్పట్టినంతనే 'ఈమె ఉత్తమ, శృంగార సముచిత' అని భావాది వివేకములేకయే తెలిసికొనగలము. ఇట్లే పురుషగతములగు శోభాదులును 'ఇతడు ఉత్సాహప్రకృతి' అని తెలియజేయుట కుపయోగించును. ఇట్లు సామాన్య లక్షణములను తెలియజేయునవియును, సర్వావస్థలయందును విడువక ఉండునవియును అగుటచే ఇవి సామాన్యాభినయము లనబడును. ఈ వికారములు వాచికాది భేదసహితములైఉన్నను అవి అన్నియును సత్త్వప్రధానముగనే ప్రయుక్తములగును కాన అవియును సాత్త్వికము లనియే వ్యవహరింపబడును. [అభినవభారతి - 3 వ సం - పుట 153]

5. ప్రాచ్యవాసనానువిద్ధమైన దేహమునందు యౌవనారంభముతోనే జనించునవి అంగజభేదములు; ఇవియే భావ-హావ-హేలలు. ఇంక స్వాభావిక-అయత్నజ భేదములు రస-భావానుప్రాణితములై యుండును. ఇవి ఈజన్మయందే విశిష్టవిభావదర్శనమువలన కలుగును.



**అంగజవికారములు**

దేహాత్మకమైన సత్త్వమునుండి భావమును, భావమునుండి హావమును, హావమునుండి హేలయును బయలువెడలును. మరియు సత్త్వభేదముగల శరీరమున భావ-హావ-హేలలు మూడును దేహస్వభావమాత్రాపేక్షములైనను పరస్పర సముత్థితములుకూడ అగుచున్నవి. (అన్యనాయికాగత హేలావలోకనమున ప్రకృత కుమారియందు భావ-హావములు లేదా హావదర్శనముచే హేలా-భావములును జనించును. ఇట్లు భావ-హావ-హేలలు పరస్పరము సముద్భవహేతువులగును.)

1. భావము : వాచిక-ఆంగిక - ముఖరాగాత్మకమైన అభినయముచేతను, సాత్త్వికాభినయముచేతను ఒక పాత్రయొక్క అంతరభావమును సహృదయునకు ప్రకటించు దేహవికారము 'భావ' మనబడును.'

2. హావము : శృంగారోచితమగు ఆకారమును సూచించునట్టిదియును, గ్రీవారేచకసహితమును, అక్షి-భ్రూ వికారసంపన్నమును అయి స్వయముగా జనించునది 'హావ' మనబడును. (భావముచే కేవలము సహృదయులే అంతరభావమును గ్రహింపగలరు; ఇంక హావముచే సహృదయులు, అసహృదయులుకూడ గ్రహింపగలరు. హావముపుట్టి నిలిచిపోవుచు, మరల పుట్టుచు, మరల నిలిచిపోవుచు ఉండును.

---

స్వాభావికములు రత్యాదిభావములచే జనించును. అయత్నజములు కేవలము గుణరూపముననుండును. [అభినవభారతి - 3 వ సం - పుట 155]

6. దీని మూలశ్లోక మీ క్రింది విధముగా ఉన్నది—

> వాగంగముఖరాగైశ్చ సత్త్వేనాభినయేన చ ।
> కవే రంతర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే ॥ 8

ఇదే శ్లోకము 7 వ అధ్యాయములో కూడ ఉన్నది: పుట 233 చూడవలెను. అందలి 7, 8 అధస్సూచికలనుకూడ చూడవలెను. ఈ రెండుచోట్లను అభినవగుప్తుని వ్యాఖ్యానములు భిన్నములుగా కన్పట్టుచున్నవి—

వాగంగముఖరాగములచేతను, సత్త్వముచేతను నాయికయొక్క వాగంగసత్త్వముల విశేషము లక్షితమగును. అదియే భావ మనబడును. ఈ వాగంగసత్త్వములు వాసనాత్మకముగా అంతరంగముననుండు రసాఖ్యభావమును సహృదయునకు సూచించును.

ఉదా : ఉత్తమమాధమస్వభావములు గల ఇరువురు బాలికలు అభినయించుచున్నపుడు ఒక బాలికయొక్క వాక్కును, ఆమె చదురాది వ్యాపారములను, ముఖవైవర్ణ్యాదులను చూచు సహృదయునకు ఆమె సత్త్వాదులందు గల విశేషము గోచరించి 'ఈ నాయిక ఉత్తమ అయియుండనోపు' అనెడి భావము కల్గును. అట్టి భావమును కల్గించు దేహవికార విశేషమే భావము అనబడును. ఈ శ్లోకమే ఏడవ అధ్యాయమున భావనిర్వచనమందునుకలదు. కాని ఈ రెండు శ్లోకములును ఏకార్థప్రతిపాదకములు కావు; శ్రీశంకుకుడు మాత్రము ఏకార్థకములనుగా తలంచెను. [అభినవభారతి - 3 వ సం - పుట 156-91]

అట్లుకాక ఒకసారి జనించి, అట్లే ఎడతెగక ప్రసరించుచున్నచో ఆ హావమే హేల అగును.)

3. హేల: హావమే 'హేల' అగును. ఇది శృంగారరస సంభవమును, లలితాభినయాత్మకమును అగును.[7]

స్త్రీలకు స్వభావజములైన అలంకారములు

లీలా-విలాస-విచ్ఛిత్తి-విభ్రమ-కిలికించిత-మోట్టాయిత-కుట్టమిత-బిబ్బోక-లలిత-విహృతము లనెడు పది వికారములును స్త్రీలకు స్వభావజములైన అలంకారములు. వీని స్వరూపములను వివరింతును—

1. లీల—ప్రియునియందుగల ప్రీతిచే వానియొక్క వాగంగాలంకారములను మధురముగను, విశిష్టముగను అనుకరించుట (స్వీయములనుగా చేసికొని ప్రయోగించుట) 'లీల' అనబడును.

2. విలాసము—శృంగారము ఉద్వేలమగుటచే స్థాన - ఆసన-గమనములందును, హస్త-భ్రూ-నేత్ర కర్మలందును అప్రయత్నముగ కన్పట్టెడి విశేషము 'విలాస' మనబడును.

3. విచ్ఛిత్తి—మాలలను, వస్త్రములను, భూషణములను, చందనాదులను అనాదరముతో స్వల్పముగా ధరించినను అవి అధికమగు శోభను కలిగించుట 'విచ్ఛిత్తి' అనబడును.

4. విభ్రమము—వాక్-అంగ-ఆహార్య-సత్త్వములకు సంబంధించిన వివిధార్థములను మదముచేకాని, హర్షముచేకాని, రాగముచేకాని వ్యత్యస్తముగా నొనర్చుట 'విభ్రమ' మనబడును.

5. కిలికించితవు (కిలకించితము—కాశీ-బొంబాయి ముద్రణములపాఠము)-హర్షమువలన స్మిత-రుదిత-హసిత-భయ-హర్ష-గర్వ-దుఃఖ-శ్రమ-అభిలాషములను మాటిమాటికిని సమ్మిశ్రితములను చేయుట 'కిలికించిత' మనబడును.

6. మోట్టాయితము— ఇతరులు ప్రియుని వార్తలను చెప్పునప్పుడు కాని, వానిని స్వయముగాచూచినప్పుడు కాని రతిభావనచే నాయికయందు లీలా-హేలాదులు జనించుట మోట్టాయిత మనబడును.

7. హావావస్థయందు నాయిక తన రతిభావమును తాను గుర్తించలేదు. కేవలము రతిబలమున తనకు తెలియకయే ఆ యా వికారములను ప్రదర్శించుచుండును. అవి స్పష్టములుగా స్థిరములుగా ఉండును. ఇంక హేలయందు నాయిక, ఆ వికారములు తనలో గల రతిభావముచేతనే జనించినవని గ్రహించును. ఇందలి నికారములు వేగముగా ప్రసరించుచుండును. [అభినవభారతి - 3వ సం - పుట 157]



7. కుట్టమితము— ప్రియుడు కేశములను, లేదా స్తనములను, లేదా అధరమును గ్రహించునప్పుడు అతిహర్షసంభ్రమమువలన జనించుసుఖము 'కుట్టమిత' మనబడును. ఇది సుఖమే అయినను దుఃఖరూపముగా (అనగా కృతకకోపాదులతో) వ్యక్తమగును.

8. బిబ్బోకము— ఇష్టములైన వస్త్రాద్యలంకారములను పొందియు అభిమాన-గర్వములచే స్త్రీలు వానియందు అనాదరము చూపుట 'బిబ్బోక' మనబడును.

9. లలితము— హస్త-పాద-అంగ విన్యాసములను భ్రూ-నేత్ర-ఓష్ఠ కర్మలతో సుకుమారముగా ఒనర్చుట 'లలిత' మనబడును.

10. విహృతము—ప్రీతియుక్తములైన వాక్యములు మాటాడవలసిన అనసరమువచ్చినను వ్యాజముచేకాని, స్వభావముచేకాని (సిగ్గుచేకాని—కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము) మాటాడకుండుట 'విహృత' మనబడును.

అయత్నజములైన స్త్రీల అలంకారములు

శోభా-కాంతి-దీప్తి-మాధుర్య-ధైర్య-ప్రాగల్భ్య-ఔదార్యము లనెడి ఏడును స్త్రీలయందు అయత్నజములైన అలంకారములు—

1. శోభ— ఉపభోగముచే (పురుషునిచే ఉపభుజ్యమానము లగుటచే) పెంపొందింపబడిన రూప-యౌవన-లావణ్యములు అవయవములకు కలిగించు నూత్న విలాసము 'శోభ' అనబడును.

2. కాంతి—సంపూర్ణమగు కామోపభోగముతోకూడిన శోభయే 'కాంతి' అనబడును.

3. దీప్తి—అత్యధికమైన కాంతియే 'దీప్తి' అనబడును.

4. మాధుర్యము—దీప్తములైన క్రోధాదులు లలితములైన రతిక్రీడాదులు మున్నగు సర్వావస్థలయందును చేష్ట అనుల్బణముగా (మసృణముగా) ఉండుట 'మాధుర్య' మనబడును.

5. ధైర్యము— ఏ విషయమందును చాపల్యములేక, తన్నుతాను పొగడుకొనక, స్వాభావికమగు చిత్తవృత్తిని కలిగియుండుట 'ధైర్య' మనబడును.

6. ప్రాగల్భ్యము— కామకళాదులందు సాధ్వసము లేకుండుట 'ప్రాగల్భ్య' మనబడును.

8. కామోపభోగముచే రూపాదులందు ఛాయాంతరము జనించును. ఆ అంగచ్ఛాయ (నూత్న విలాసము) మూడు అవస్థలు కలిగియుండును—అందు మందావస్థ శోభ, మధ్యావస్థ కాంతి, తీవ్రావస్థ దీప్తి అని తెలియవలెను. [అభినవభారతి-3వ సం-పుట 163]

7. ఔదార్యము— సర్వావస్థల యందును పరుషములు పలుకకుండుట 'ఔదార్య' మనబడును.

లలితాత్మకమగు శృంగారప్రయోగమునందు సుకుమారములగు సంభోగ-విప్రలంభాదిభేదము లన్నింటియందును ఈ ఆలంకారములు ప్రయుక్తములగును. ఆ శృంగారమున ఈర్ష్యామర్షాది దీప్తభావములందు మాత్రము విలాస-లలితము లనెడి రెండు అలంకారములు తప్ప తక్కినవానిని ప్రయోగించవలయును.

పురుషులయందలి సత్త్వభేదములు

శోభా-విలాస-మాధుర్య-స్థైర్య-గాంభీర్య-లలిత-ఔదార్య-తేజస్సులు అనెడి ఎనిమిదియును పురుషులయందలి సత్త్వభేదములు (ఇవి అయత్నజములైనపురుషుల అలంకారములు).

1. శోభ—దక్షత, శౌర్యము, ఉత్సాహము, నీచార్థములందు జుగుప్స, ఉత్తమగుణములతో స్పర్థ అనునవి కలిగియుండుట 'శోభ' అనబడును.

2. విలాసము— ధీరముగా ప్రసరించుదృష్టి, వృషభగతి వంటి గతి, స్మితపూర్వకమైన ఆలాపము కలిగియుండుట 'విలాస' మనబడును.

3. మాధుర్యము— అభ్యాసపాటవముచే మహావికారములందుకూడ చేష్టలలో ఉల్బణత్వము చూపకుండుట 'మాధుర్య' మనబడును. (అనగా యుద్ధనియుద్ధాది వికారములందు అభ్యాసపాటవముచే కర-చరణాది క్రియలు అనుల్బణములుగానుండుట).

4. స్థైర్యము—శుభసంకల్పముచే కాని అశుభసంకల్పముచే కాని జనించిన ధర్మార్థకామములందలి వ్యవసాయము (పూనిక) స్థిరముగానుండుట 'స్థైర్య' మనబడును.

5. గాంభీర్యము—హర్ష-క్రోధ-భయాది భావములందు తత్తదుచితములైన ఆకారములు కన్పట్టకపోవుట 'గాంభీర్య' మనబడును.

6. లలితము—ప్రయత్నములేకయే నిర్వికారమగు స్వభావమునందు జనించిన శృంగారాకార చేష్టలను కలిగియుండుట 'లలిత' మనబడును.

7. ఔదార్యము—దానమును కాని, అభయప్రదానమును కాని, ప్రియభాషణమును కాని శత్రు-మిత్ర భేదములేకయే చేయుట 'ఔదార్య' మనబడును.

8. తేజస్సు—శత్రుకృతమైన అధిక్షేపమునుకాని, అవమానమునుకాని ప్రాణాత్యయమందును సహించకపోవుట 'తేజ' మనబడును.*

---

* [కాశీ ముద్రణమునందు 24 వ అధ్యా—1-39 శ్లో; బొంబాయి ముద్రణమునందు 22 వ అధ్యా--1-39 శ్లో; బరోడా ముద్రణమునందు 22 వ అధ్యా—1-41 శ్లో.]



## శారీరాభినయము

ఇంతవరకును సత్త్వజన్యమైన సామాన్యాభినయమును వివరించితిని. ఇంక శరీరజమగు సామాన్యాభినయమును క్రమముగా వివరింతును. శారీరాభినయము ఆరు విధములు— 1. వాక్యము, 2. సూచ, 3. అంకురము, 4. శాఖ, 5. నాట్యాయితము, 6. నివృత్త్యంకురము.¹

1. వాక్యము—వృత్తబంధములతో (పద్యములతో) కాని, చూర్ణపదములతో (గద్యముతో) కాని కూడిన సంస్కృత-ప్రాకృత పాఠ్యములను నానా రసార్థయుక్తముగా పఠించుట 'వాక్యాభినయము' (వాక్యములతోకూడ ప్రయుక్తమయ్యెడి శారీరాభినయము) అనబడును.

2. సూచ—చెప్పబోవు వాక్యమునుకాని, వాక్యార్థమునుకాని ముందుగా సాత్త్విక-అంగికాభినయములచే సూచించి, పిమ్మట వాక్యాభినయముచేయుట 'సూచాభినయ' మనబడును.

3. అంకురము—వాక్యమునందు ఇమిడియున్నవస్తువును వచనశూన్యమైన ఆంగికాభినయముచే, నిపుణముగా వ్యక్తముచేయుట 'అంకురాభినయ' మనబడును. ఇది సూచాభినయతుల్యము. (దీనిని ప్రయోగించుటకును, భావించుటకును నైపుణ్యమవసరము. మరియు ఇది స్వబుద్ధికల్పనచే సాధింపబడునదై యుండును).

4. శాఖాభినయము— శిరో-ముఖ-జంఘా-ఊరు-పాణి-పాదముల వర్తనములు ఏకభావవ్యక్తీకరణమందు ఏకకాలమున ప్రయుక్తమగుట 'శాఖాభినయ' మనబడును.

5. నాట్యాయితము—నాట్యమందలి పాత్రలనే సామాజికులనుగా కల్పించి, ఆ నాట్యముకంటె వేరగు ఇంకొక నాట్యమును ప్రయోగించి, అది అసత్యమైనను యథార్థమగు నాట్యమే అనునట్లు ప్రదర్శించుట 'నాట్యాయిత' మనబడును. (అనగా నాటకమునందు ఇంకొక నాటకమును ప్రయోగించుట నాట్యాయిత మనబడునని సారాంశము—దీనినే 'గర్భాంక' మందురు).

వేరొక అర్థము నుద్దేశించి నేపథ్యమందు గానము చేయబడిన ధ్రువ యొక్క అర్థమును భావ-రసావిష్టులైన పాత్రలు హర్ష-శోక-రోషాది సూచకములైన

---

1. ఆంగికాది చతుర్విధాభినయముల యొక్క పూర్వ-అపరనిర్ణయమును చేయనవియే ఈ సూచాద్యభినయములు. శాఖా-అంకురములు 8 వ అధ్యాయమందు కూడ పేర్కొనబడినవి. కాళిదాసు 'మాలవికాగ్నిమిత్రము' లో పంచాంగాభినయమును పేర్కొనెను. విశేషములకును, సమన్వయమునకును ఈ అధ్యాయాంతమందలి 2 వ విశేషాంశమును చూడవలెను.

ఆంగిక-సాత్త్వికాభినయములచే కాకతాళీయముగా అభినయించుట కూడ 'నాట్యాయిత' మనబడును.

6. నివృత్త్యంకురము— ఒకపాత్ర పలికిన వాక్యముయొక్క అర్థమును మరియొక పాత్ర తనకు సంబంధించునట్లుగా సూచాభినయముతో అభినయించుట 'నివృత్త్యంకుర' మనబడును[10].

వాచికాభినయము

ఈ అభినయము లారింటికిని భావ-రసోచితముగా ప్రయుక్తమగు వాచికము విషయము కావలయును. ఈ వాచికాభినయము ద్వాదశాభినయాత్మకముగా కావ్యవస్తువునందుండునని తెలియవలెను. (ఇంతవరకును శారీరమైన సామాన్యాభినయము చెప్పబడినది. ఇంక వాచికరూపమైన సామాన్యాభినయము వివరింపబడును. ఇది 12 విధములుగా ఉండును). ఆలాప-ప్రలాప-విలాప-అనులాప-సంలాప-అపలాప-సందేశ-అతిదేశ-నిర్దేశ-వ్యపదేశ-ఉపదేశ-అపదేశము లనెడి భేదములచే ఈ వాచికాభినయము పన్నెండు విధములు—

1. ఆలాపము— ఎదుటి వ్యక్తితో మధ్యమపురుషలో ఉపదేశశూన్యముగా మాటాడుట 'ఆలాప' మగును.

2. ప్రలాపము—అనర్థక వాక్యములను పలుకుట 'ప్రలాపము'.

3. విలాపము—కరుణరస సంబంధమైన వాక్యము 'విలాపము'.

4. అనులాపము— ఒకే వాక్యమును పెక్కుసార్లు చెప్పుట 'అనులాపము'.

5. సంలాపము— ఉక్తి-ప్రత్యుక్తిసహితమగు సంభాషణము 'సంలాపము'.

6. అపలాపము— ముందు చెప్పినమాటను మరియొక విధముగా మార్చి చెప్పుట 'అపలాపము'.

7. సందేశము— 'ఈ మాట వానితో చెప్పుము' మున్నగు వాక్యములు 'సందేశము'.

8. అతిదేశము— 'నీవు చెప్పినదానినే నేను చెప్పితిని' మున్నగు వాక్యములను చెప్పుట 'అతిదేశము'.

9. నిర్దేశము— 'ఆ యీ నేను మాటాడుచున్నాను' అనుచు తన్ను తాను నిర్దేశించుకొనుట 'నిర్దేశము'.

---

10. నాట్యాయితమందలి రెండవ భేదమున చెప్పబడిన ధ్రువాగానము నేపథ్యమందు ప్రాసంగికముగా చేయబడును. కాని, నివృత్త్యంకురమందలి వారు ఇరువురును రంగము మీద నుండెడి పాత్రలే.



10. వ్యపదేశము—ఏదేని ఒక వ్యాజముతో మాటనుచెప్పుట 'వ్యపదేశము'.

11. ఉపదేశము— 'ఇది చేయుము', 'తీసికొనుము' మున్నగు వాక్యములను చెప్పుట 'ఉపదేశము'.

12. అపదేశము— తాను చెప్పదలచిన దానిని "ఇట్లు అతడు చెప్పుచున్నాడు" అని ఇంకొకడు చెప్పినట్లు చెప్పుట 'అపదేశము'.

వాచికాభినయమందలి ఇంకొక విభజనపద్ధతి

పై వాచికాభినయ భేదములన్నియును సర్వాభినయములందును (పై ఆరు ఆంగికాభినయములందును, ఇతర నాటకాది కావ్యవిశేషములందును) ప్రయుక్తము లగును. ఈ వాచికాభినయము మరల ఏడు విధములుగానుండును. ప్రత్యక్షము, పరోక్షము, భూతకాలికము, వర్తమానకాలికము, భావికాలికము, ఆత్మస్థము, పరస్థము.

"ఇతడు చెప్పుచున్నాడు, నేను చెప్పుటలేదు"—ఈ వాక్యద్వయము ప్రత్యక్షమును, వర్తమానమును అగును.

"నేను చేయుచున్నాను, వెళ్ళుచున్నాను, చెప్పుచున్నాను"—ఈ వాక్యత్రయము ప్రత్యక్షము, వర్తమానము, ఆత్మస్థమును అగును.

"చేయగలను, వెళ్ళగలను, చెప్పగలను"—ఇది పరోక్షము, భవిష్యత్కాలము, ఆత్మస్థమును అగును.

"నాచే శత్రువులు హతులైరి, ఓడింపబడిరి, చీల్చబడిరి."— ఇది పరోక్షము, భూతకాలికము, ఆత్మస్థమును అగును.

"నీచే శత్రువులు చంపబడిరి, జయింపబడిరి"—ఇది పరోక్షము, భూతకాలికము, పరస్థమును అగును.

"ఇతడు చెప్పుచున్నాడు, చేయుచున్నాడు, వెళ్ళుచున్నాడు"—ఇదిప్రత్యక్షమును, వర్తమానకాలికమును, పరస్థమును అగును.

"వాడు వెళ్ళుచున్నాడు, చేయుచున్నాడు"—ఇది పరోక్షము, వర్తమానము, పరస్థమును అగును.

"వారు చేయగలరు, వెళ్ళగలరు, చెప్పగలరు."—ఇది పరోక్షము, భవిష్యత్కాలికము, పరస్థమును అగును.

నాట్యమునందు హస్తమును అడ్డుగాపెట్టి మాటాడుట (స్వగత-జనాంతిక-అపవారితములు)—ఇది వక్తకు ఆత్మస్థమును, ఇతరులకు పరోక్షమును అగును.

ఆత్మస్థ-పరస్థభేదములచేతను, కాలభేదములచేతను ఈ సప్తప్రకారములును అనేక విధములుగా ఉండును. వీనిని మార్గాభినయములందు ప్రయోక్తలు ప్రయో

గించవలెను. వీనినుండియే వివిధములైన అభినయములు నిష్పన్నములైనవి.[11]

'అతడిది చేసెను', 'ఇది వానిది', 'ఆతడిట్లు చేయుచున్నాడు' అనెడి పరోక్షాభినయము 'మధ్యస్థ' మనబడును. స్వవిషయమును నిరూపించు అర్థము 'ఆత్మస్థ' మనబడును. పరార్థవర్ణనము 'పరస్థ' మనబడును.*

శిరో-హస్త-కటీ-వక్షో-జంఘా-ఊరు-చరణముల కర్మవిభాగము సమముగా నుండెడు అభినయము 'సామాన్యాభినయ' మనబడును. లలితములైన హస్త సంచారములతో, సుకుమారములైన అంగచేష్టలతో నాట్యజ్ఞులు రస-భావ సమన్విత ముగా అభినయము చేయవలెను.

### బాహ్య-ఆభ్యంతర నాట్యములు

ఉద్భటము కానిదియును, సంభ్రమాదులు లేనిదియును, ఆవిద్ధములైన అంగ చేష్టలేనిదియును, లయ-తాల-కలా-పాతములచే నియతములైన అక్షరములు కలదియును, చక్కగా విభక్తములైన పదములతోకూడిన సంభాషణములు కలది యును, పారుష్యరహితమును అగు నాట్యము 'ఆభ్యంతర' మనబడును.

పై లక్షణములు లేనిదియును, శాస్త్రప్రసిద్ధములు కాని గతి-చేష్టితములతో కూడినదియును, గీత-వాద్యనిబద్ధము కానిదియును అగు నాట్యము 'బాహ్య' మనబడును.

లక్షణమునకు లోబడియుండుటవలన మొదటిది 'ఆభ్యంతర' మనబడినది. ఇంక శాస్త్రమునకు లోబడనిది కావున రెండవది 'బాహ్య' మనబడినది. ఏది నాట్యము యొక్క ప్రయోగమును, కర్మను నిరూపించునో అది 'లక్షణ' మనబడును. ఆచార్యుని యొద్ద నివసించి సేవింపనివారును, శాస్త్రబహిష్కృతు లయినవారును సంప్రదా యము నెరుంగనివారై 'బాహ్యనాట్యము' నే ప్రయోగింతురు.

### ఇంద్రియ-ఇంద్రియార్థముల అభినయము

శబ్ద-స్పర్శ-రూప-రస-గంధము లనెడి ఇంద్రియార్థములను, ఇంద్రియములను క్రియావిశేషములచే నటుడు క్రింది విధముగా అభినయించవలెను—

11. వాక్యము ఆలాప-సంలాపాది భేదములచే 12 విధములు: అవి మరల ఆత్మస్థ-పరస్థ-ప్రత్యక్ష-పరోక్ష భేదములచే నాలుగేసి విధములు; కాగా 48 విధములగును. ఇవి మరల మూడు కాలములచేతను భిన్నములై మొత్తము 144 భేదములు కలుగుచున్నవి. ఇందు మరల అనేకభేదములు కలవు. [అభినవభారతి - 3 వ సం - పుట 180]

* [కాశీ ముద్రణమునందు 24 వ అధ్యా—40-67 శ్లో; బొంబాయి ముద్రణము నందు 22 వ అధ్యా—40-67 శ్లో; బరోడా ముద్రణమునందు 22 వ అధ్యా—42-71 శ్లో.]



1. శబ్దము— దృష్టిని అడ్డముగాత్రిప్పి, శిరమును ప్రక్కకువంచి, చూపుడు వ్రేలిని చెవియొద్ద ఉంచుట 'శబ్దాభినయ' మగును (అనగా శబ్దమును వినుచున్నట్లు అభినయించుట).

2. స్పర్శము— నేత్రములను కొంచెము ముడిచి, కనుబొమలను ఎగుర వేయుచు, చెక్కిళ్ళను మూపులను స్పృశించుట 'స్పర్శాభినయ' మగును.

3. రూపము— శిరముపై పతాకాహస్తమునుంచి, కొంచెము ఇటునటు కదల్పబడు ముఖముతో, దేనినో చూచుచున్నట్లుండు దృష్టి కలిగియుండుట 'రూపాభినయ' మగును.

4. రసము, 5. గంధము— నేత్రములను కొంచెము మూసి, నాసికను పెద్దదిగాచేసి, పెద్దగా ఎగబీల్చుట 'రసాభినయము'ను, 'గంధాభినయము'ను అగును.

ఇంద్రియవిషయముల నైదింటిని అభినయించు విధానమును వివరించి యున్నాను. ఇంద్రియములనుకూడ ఆయా ఇంద్రియార్థములను అభినయించునట్లే అభినయించవలెను.

### మనస్సును నిర్దేశించుట

ఇంద్రియములు మనస్సంయోగమును పొందునప్పుడే ఇంద్రియార్థములను గ్రహింపగలవు. మనస్సంయోగమును పొందని ఇంద్రియము సవిషయమును గ్రహించలేదని తెలియవలెను. ఇట్టి మనస్సునకుగల మూడు విధములగు అవస్థలను అభినయించుటకు మూడు విధములగు క్రియావిశేషములు కలవు— ఇష్టము, అనిష్టము, మధ్యస్థము.

1. ఇష్టము— ప్రహ్లాదనముచే, రోమాంచముచే, వదనవికాసముచే ఇష్ట విషయమును గ్రహించుటకు ఉన్ముఖమగు మనస్సును నిర్దేశించవలెను. ఇప్పట్ల ఇష్టము లైన శబ్ద - స్పర్శ - రూప - రస - గంధముల విషయమున మనస్సంయోగము చెందిన ఇంద్రియములను ప్రసన్నముగా ప్రదర్శించవలెను.

2. అనిష్టము—శిరస్సును ప్రక్కకుత్రిప్పి, కనులను ముక్కును ముడుచుచు, దృష్టి నటునిటు పోనీయకుండుటచే అనిష్టవిషయపరాఙ్ముఖమగు మనస్సును నిర్దే శించవలెను.

3. మధ్యస్థము— అధికహర్షమునుకాని, అధికజుగుప్సను కాని పొందని మధ్యస్థభావముతో మధ్యస్థముగానుండు మనస్సును నిర్దేశించవలెను.*

* [కాశీ ముద్రణమునందు 24 వ అధ్యా—68-90 శ్లో; బొంబాయి ముద్రణము నందు 22 వ అధ్యా—67-89 శ్లో; బరోడా ముద్రణమునందు 22 వ అధ్యా—72-94 శ్లో.]

## కామోపచారము

**కామము : శృంగారము**

ప్రాయికముగా సర్వభావములును కామమునుండియే నిష్పన్నములగు చున్నవి. ఆ కామము ఇచ్ఛా-గుణసంపన్నమై (కార్యవ్యాపారాదులకు ఉన్ముఖమైన కోరికతో కూడినదై) బహువిధములుగా ఉండును— ధర్మకామము, అర్థకామము, మోక్షకామము.

స్త్రీ-పురుషులయొక్క సంయోగము 'కామము' అనబడును[12].

ఈ కామము సర్వలోకముయొక్క ఇతర సుఖదుఃఖములను కప్పిపుచ్చి అదియే అధికముగా కన్పట్టును. అది వ్యసనమందు కూడ సుఖముగానే ఉండును.

రతిసంభోగకారకమైన స్త్రీ-పురుష సంయోగము (అది ఉత్తమ ప్రకృతిగత మైనప్పుడు) 'శృంగార' మనబడును. ఇది శుభమును, ఉపచారకృతమును అయి యుండును. (ఉపచారమనగా అన్యోన్యహృదయగ్రహణోచితమైన వ్యాపారము: ఉపచారకృతమనగా దానితో పరిపూర్ణమై ఉండునది).

**సుఖమునకు స్త్రీలు మూలము**

ఈ లోకమెల్లప్పుడును అధికముగా సుఖమునే కోరును; ఆ సుఖమునకు స్త్రీలే మూలము. అట్టి స్త్రీలు నానావిధములగు శీలములను కలిగియుందురు.

**స్త్రీల శీలభేదములు**

స్త్రీలు దేవ-దానవ-గంధర్వ-రక్షో-నాగ-పక్షి-పిశాచ-యక్ష-వ్యాల-నర-వానర-హస్తి-మృగ-మీన-ఉష్ట్ర-మకర-ఖర-సూకర-వాజి-మహిష-అజ-శ్వ-గవాదులతో తుల్యములైన శీలములు[13] కలిగియుందురని తెలియవలెను—

1. దేవశీల—స్నిగ్ధములైన అంగోపాంగములు, నిలుకడ, మందములగు నిమేషములు, ఆరోగ్యము, కాంతి, దాన-సత్త్వ-ఆర్జవములు, అల్పస్వేదము, సమ రతియందు ఆసక్తి, అల్పభోజనము, సురతమునందు ప్రీతి, గంధ-పుష్పములం దిష్టము కలదై మనోహర అగు అంగన 'దేవశీల' అనబడును.

---

12. అనగా స్త్రీ పురుషుల సంయోగము సాక్షాత్తుగా సుఖసాధనమగుటచేతను, అదియే ఇచ్ఛావిషయమగుటచేతను, ఆ సంయోగము నిరుపదమగు 'కామ' శబ్దముచే వ్యవహరింపబడుచున్నది. [అభినవభారతి—3 వ సం-పుట 186]

13. శీలము, సత్త్వము, చైతన్యము, బుద్ధిపూర్వకము, స్వభావము, హేవాకము అనునవి పర్యాయపదములు [అభినవభారతి - 3 వ సం - పుట 187]. 'ఆది' పదముచే స్త్రీలు పైన పేర్కొన్న శీలములనే కాక ఇంకను పెక్కు రకములగు శీలములను కలిగియుండవచ్చునని తెలియవలెను.



2. అసుర (దానవ) శీల—అధర్మమునందును శాఠ్యమునందును ఆసక్తి, స్థిరమైన క్రోధము, అతిపారుష్యము, మద్యమాంసములందు ప్రీతి, అతిలోభము, కలహమునందు ప్రీతి, ఈర్ష్యాస్వభావము, చంచలమైన స్నేహము కలదై నిత్య కోపనయు, అతిమానవతియు, చపలయు అగు అంగన 'అసురశీల' అనబడును.

3. గంధర్వశీల—క్రీడలయందు ఆసక్తి, సుందరములగు నేత్ర-నఖ-దంతములు, సౌష్ఠవోపేతములైన అంగములు, స్థిరభాషణములు, అల్పసంతానము, రతియందలి ప్రీతి, గీత-వాద్య-నృత్తములం దాసక్తి, హర్షము, పరిశుద్ధత, స్నిగ్ధములైన చర్మ-కేశ-నేత్రములు కలిగిన అంగన 'గంధర్వశీల' అనబడును.

4. రాక్షసశీల—పెద్దవియును విస్తీర్ణములును అగు అంగములు, విస్తీర్ణములైన ఎఱ్ఱని నేత్రములు, ఖరరోమములు, పగటినిద్రయందాసక్తి, ఉచ్చభాషణములు, క్రోధ-ఈర్ష్యా-కలహములందు ప్రీతి, రాత్రులందు విహరించు స్వభావము కలదై నఖ-దంతక్షతముల నొనరించు అంగన 'రాక్షసశీల' అనబడును.

5. నాగ (సర్ప) శీల— కొనదేరినముక్కు, వాడియైన దంతములు, అందమైన శరీరము, ఎఱ్ఱని కనులు, నీలోత్పలమువంటి రంగు, అతికోపము, తిర్యగ్గమనము, ఆరంభములందు చాంచల్యము, అధికనిశ్శ్వాసము, అతిమానము, గంధ-మాల్య-ఆసవములందు ప్రీతి, నిద్రయందాసక్తి కలిగిన అంగన 'నాగశీల' అనబడును.

6. శకున (పక్షి) శీల— ఎక్కువగా ప్రక్కకు తిరిగిన ముఖము, తీక్ష్ణమైన స్వభావము, నదులయందు ప్రీతి, సుర-ఆసవ-క్షీరములందు ఆసక్తి, అధికసంతానము, ఫలములందు ప్రీతి, నిత్యశ్వాసము, ఉద్యానవనములందు ప్రీతి, చాపల్యము, ఎక్కువగా మాటాడు స్వభావము, తొందర కలిగిన అంగన 'శకునశీల' అనబడును.

7. పిశాచశీల— ఎక్కువ తక్కువలుగా ఉన్న వ్రేళ్ళుగల చేతులు, గృహారామసంచారము, పిల్లలను పీడించెడి స్వభావము, నైచ్యము, క్లిష్టములైన మాటలు, సురతమునందు కుత్సితాచారము, రోమశములైన అంగములు, మహాస్వనము, మద్య-మాంస-బలులందు ప్రీతి కలిగిన అంగన 'పిశాచశీల' అనబడును.[14]

8. యక్షశీల— స్వప్నములో చెమర్చు స్వభావముకల శరీరము, స్థిరములైన శయ్యా-ఆసనములందు ప్రీతి, మేధ, బుద్ధి, మద్య-గంధ-మాంసములందు ప్రీతి, చాల కాలము తరువాత చూచినవారిపై సంతోషము, కృతజ్ఞత, తక్కువ నిద్ర కలిగిన అంగన 'యక్షశీల' అనబడును.

---

14. పిశాచశీలనిర్వచనము కాశీ ముద్రణమందులేదు. 'శ్వశీల' ను నిర్వచించుటలో కాశీ ముద్రణమునందు 'అశ్వశీల' అని ఉన్నది. 'హయశీల' అంతకుముందే వివరింపబడుటచే ఈ నిర్వచనము అధిక పాఠమని డా. ఘోష్ అభిప్రాయపడెను. అది సరికాదు. 'శ్వశీల' అనగా 'కుక్క స్వభావమువంటి స్వభావము కలది' అని అర్థము.

9. వ్యాల (క్రూరమృగ) శీల— మానావమానములందు సమత, పరుషమైన చర్మము, ఖరస్వరము, శాఠ్యము, అనృతము, ఉద్ధతభాషణములు, పింగళ దృష్టులు కలిగిన అంగన 'వ్యాలశీల' అనబడును.

10. మనుష్యశీల— ఆర్జవమునందు నిత్యాసక్తి, దక్షత, ఓరిమి, సమవిభక్తములైన అవయవములు, కృతజ్ఞత, గురు-దేవ-ద్విజులందు ప్రీతి, ధర్మ-కామ-అర్థములందు ఆసక్తి, అహంకారరాహిత్యము, సుహృత్తులందు ప్రీతి, మంచి శీలము కలిగిన అంగన 'మనుష్యశీల' అనబడును.

11. వానరశీల— కుదింపబడిన చిన్న శరీరము, హర్షము, పింగళరోమములు, ఫలమునందలి ప్రీతి, ప్రాగల్భ్యము, చాపల్యము, తీక్ష్ణత, వృక్ష-ఆరామ-వనములందు ప్రీతి, స్వల్పమైన ఉపకారమునుకూడ అధికముగా తలంచుట కలిగినదై బలాత్కారరతిశీల అగు అంగన 'వానరశీల' అనబడును.

12. హస్తిశీల— పెద్దదవుడలు, నుదురు, బలిసిన శరీరము, పింగళములైన నేత్రములు, రోమశములైన అంగములు, గంధ-మాల్య-ఆసవము లందలి ప్రీతి, కోపము, చిత్తస్థైర్యము, జల-ఉద్యానవనములందలి ప్రీతి, మధురములగు వానియందు ప్రీతి, రతియందు ఆసక్తి కలిగిన అంగన 'హస్తిశీల' అనబడును.

13. మృగశీల— స్వల్పమైన ఉదరము, చప్పిముక్కు, సన్నని పిక్కలు, వనములందు ప్రీతి, విశాలములైన చంచలనేత్రములు, చాపల్యము, శీఘ్రగమనము, పగటివేళ భయము, గీత-వాద్య-రతులందుప్రీతి, స్థిరనివాసమందు ఇష్టము కలిగిన అంగన 'మృగశీల' అనబడును.

14. మత్స్యశీల— దీర్ఘమును పీనమును ఉన్నతమును అయిన వక్షము, చాంచల్యము, అతినిమేషము, బహుభృత్యులు, బహుసుతులు, జలమునందు ప్రీతి కలిగిన అంగన 'మత్స్యశీల' అనబడును.

15. ఉష్ట్రశీల— వ్రేలాడుచున్న పెదవి, అధిక స్వేదము, వికటగమనము, కృశించిన ఉదరము, పుష్ప-ఫలములందును ఉప్పు-పులుపు-వగరులందును ప్రీతి, వదులుగానుండెడి కటి-పార్శ్వములు, పరుష-నిష్ఠురసంభాషణములు, పొడువైన మెడ, అడవులందు ప్రీతి కలిగిన అంగన 'ఉష్ట్రశీల' అనబడును.

16. మకరశీల— స్థూలమైన శిరస్సు, వంగిన మెడ, తెరచిన నోరు, పెద్ద కంఠధ్వని, క్రూరత్వము కలిగినదై మత్స్యగుణోపేతయగు అంగన 'మకరశీల' అనబడును.

17. ఖరశీల— స్థూలములైన నాలుక పెదవులు దంతములు, పరుషమైన చర్మము, కటుభాషణములు, రతియుద్ధమునందు ఆసక్తి, ధార్ష్ట్యము, నఖక్షత-



దంతక్షతములందు ప్రీతి, సవతియందు ద్వేషము, దక్షత, చాపల్యము, శీఘ్రగమనము, రోగము, బహుసంతతి కలిగిన అంగన 'ఖరశీల' అనబడును.

18. సూకరశీల— దీర్ఘములైన పృష్ఠ-ఉదర-ముఖములు, రోమశములైన అవయవములు, బలము, సన్నని నుదురు, కందమూల-ఫలములందు ప్రీతి, నలుపురంగు, పండ్లచే వికృతమైన ముఖము, పొట్టిజుత్తు, హీనమైన ఆచారము, బహుసంతతి కలిగిన అంగన 'సూకరశీల' అనబడును.

19. హయశీల— స్థైర్యము, సుభగత్వము, దానస్వభావము, నిడుపాటి పెద్ద జుట్టు, కృశత్వము, చాంచల్యము, వాక్కునందు స్నిగ్ధత, శీఘ్రగమనము, కామము, క్రోధము, సమవిభక్తములైన పార్శ్వ-కటీ-ఊరు-పృష్ఠ-గ్రీవములు కలిగిన అంగన 'హయశీల' అనబడును.

20. మహిషశీల— స్థైర్యము, బిరుసైన రోమములు, రౌద్రము, లోకద్వేషము, రతిప్రీతి, ఉన్నతవక్త్రము, జల-వన క్రీడలయందు ఆసక్తి, పెద్ద నుదురు, అందమైన పిరుదులు, స్థూలములైన పృష్ఠ-నేత్ర-దంతములు, సన్నని పార్శ్వములు ఉదరము కలిగిన అంగన 'మహిషశీల' అనబడును.

21. అజ (మేక) శీల— కృశత్వము, సన్నని భుజములు ఉరము, నిశ్చలములు స్థిరములు అయిన నేత్రములు, పొట్టికాళ్ళు చేతులు, సూక్ష్మములైన రోమములు, భయము, నీటిని చూచినచో భయము, బహుసంతతి, వనములందు ప్రీతి, చాంచల్యము, శీఘ్రగమనము కలిగిన అంగన 'అజశీల' అనబడును.

22. శ్వ (కుక్క) శీల— గాత్రలాఘవము, నేత్రపాటవము, ఒడలు సాగదీయుట, పొడవైన చిన్న ముఖము, పొట్టి కాళ్ళు చేతులు, ఉచ్చస్వనము, తక్కువనిద్ర, క్రోధము, మంచిపనులందు ప్రీతి, హీనమైన ఆచారము, కృతజ్ఞత కలిగిన అంగన 'శ్వశీల' అనబడును.

23. గోశీల—స్థూలములు పీనములు ఉన్నతములు అగు పిరుదులు, సన్నని జంఘలు, సుహృత్తులందు ప్రీతి, పొట్టికాళ్ళు చేతులు, ప్రయత్నమందు దార్ఢ్యము, ప్రజాహితకారిత్వము, పితృదేవార్చనములందు ప్రీతి, సత్య-శౌచములందు గురువులందు ప్రీతి, స్థైర్యము, క్లేశమునందు ఓరిమి కలిగిన అంగన 'గోశీల' అనబడును.*

* [ కాశీ ముద్రణమునందు 24 వ అధ్యా—90-135 శ్లో; బొంబాయి ముద్రణమునందు 22 వ అధ్యా—89-137 శ్లో; బరోడా ముద్రణమునందు 22 వ అధ్యా—95-144 శ్లో.]

### ఉపచారము

పై విధముగా స్త్రీలు నానావిధములగు స్వభావములను కలిగియుందురు. ఆయా స్వభావముల నెరింగి తదనుగుణముగ కామోపచారము నొనరించవలెను. శీలానుసారముగా స్త్రీలయెడ కావింపబడిన ఉపచారము, అది స్వల్పమైనను, వారికి హర్షదాయకమగును. వారి వారి శీలములను గుర్తించక కావించెడి ఉపచారము ఎంతగొప్పదైనను వారికి తుష్టికరము కానేరదు. కోరినదానిని పొందుటచే 'రతి' జనించునుగదా! స్త్రీ పురుషులయందు పరస్పరము రతి జనించుటకు ఉపచారము ఆవశ్యకము ('ఉపచార'మనగా అన్యోన్య హృదయగ్రహణోచితమైన వ్యాపారము.)

### సుఖమునకు స్త్రీలే మూలము

తపస్సుచే ధర్మమును, ధర్మముచే సుఖమును సాధించవలెను. అట్టి సుఖమునకు మూలము ప్రమదలే (స్త్రీలే). అందుచేతనే వారితో సంభోగము కాంక్షింపదగినది.

### బాహ్య-అభ్యంతర కామోపభోగము

నాట్యధర్మమందు (నాట్యోపాయమైన ఇతివృత్తమునందు) స్త్రీ పురుష సంశ్రయమైన కామోపభోగము బాహ్యా-అభ్యంతర భేదములచే రెండు విధములు. వీనిలో 'అభ్యంతరము' నాటకమందు (నాటికయందుకూడ అని అభినవగుప్తుడు) రాజులచే అనుసరింపబడును. ఇంక 'బాహ్యము' ప్రకరణమందు వేశ్యాగతముగా ఉండును. ముందుగా రాజుల అభ్యంతర కామోపచారమును వివరింతును. ఈ ఉపచార విధి కామతంత్ర (కామసూత్ర-కాశీముద్రణ పాఠము[15]) సముత్థితమైనది. నానాశీలములుగల స్త్రీల ప్రకృతి బాహ్యా-అభ్యంతర-బాహ్యాభ్యంతర భేదములచే మూడు విధములుగానుండును. కులీన 'అభ్యంతర'అనబడును, వేశ్యాంగన 'బాహ్య', కృతశౌచ (శుద్ధశీలముగల అనగా ఒకనికే కట్టుబడియున్న వేశ్య) 'బాహ్యాభ్యంతర'. అంతఃపురోపచారమందు నాయిక కులజ కాని, కన్య కాని (గణికాకుమారి కూడ కావచ్చును) కావలయును. రాజకృతమైన కామోపచారమందు బాహ్య స్త్రీ భోగము వాంఛనీయము కాదు. అయినను రాజునకు దివ్యవేశ్యాంగనతో సంగమము కలుగవచ్చును. (ఉదా : ఊర్వశీ - పురూరవుల కథ.)

15. 'కామతంత్ర' ప్రసక్తి ఇంకను మూడు నాలుగుచోట్ల కలదు. 'కామసూత్ర' మనెడి కాశీ పాఠము సరికాదేమో. వాత్స్యాయనకృత కామసూత్రము పైదానికంటె భిన్నమును, దానికంటె అర్వాచీనమును అయియుండును. కొన్నిచోట్ల కామతంత్ర మనగా ఒక గ్రంథ మను అర్థముకంటె 'కామవ్యాపార విధి' అను అర్థము కూడ సరిపోవుచుండుట గమనార్హము.



ఇట్లు అభ్యంతరనాయికాగతమైన కామోపభోగము రాజులకును, బాహ్యా జన కామోపభోగము బాహ్యాజనులకు విధింపబడినది. కులజల విషయమున అనుసరించిన కామోపచారమునే కన్యకా విషయమునందును అనుసరించవలెను. కామోపభోగములందు వేశ్యయు కులజవలెనే ప్రవర్తించును.

### కామోత్పత్తి

ఉత్తమ-మధ్యమ-అధమప్రకృతులైన స్త్రీలయందు కాని, పురుషులయందుకాని కామోత్పత్తి నానాభావసముద్భవ మగుచున్నది. వినుట లేదా చూచుట, చిత్రాది దర్శనము, అంగలీలలు, మధురాలాపములు అనువానివలన కామము జనించును. రూపము, గుణములు, కలాది విజ్ఞానము, యౌవనము కల పురుషునిచూచి యువతి మదనాతురయగును. ఇట్లు కామపరవశులైన స్త్రీ-పురుషుల శరీరవికారములను తజ్ఞులు బాగుగా గుర్తెరుంగవలెను. ఇప్పట్ల చలించుచున్న పక్ష్మములు, మూయబడిన నేత్రములు, జారిన పై రెప్పలు కలిగి లలితముగానుండెడిదృష్టి. 'కామ్యదృష్టి' (కామమును వ్యక్తముచేయునది) అగును[16]. కామమునందు చెక్కిళ్ళు కొంచెము ఎఱ్ఱబడును: చిరుచెమటలు పట్టును; రోమాంచము కలుగుచుండును, పోవుచుండును; ముఖరాగము ప్రసన్నముగానుండును.

కామ్యములగు అంగవికారములు, క్రీగంటిచూపులు, ఆభరణములను తడుముకొనుచుండుట, చెవి గోకికొనుట, కాలిబొటనవ్రేలితో నేలరాయుట, స్తనములను నాభిప్రదేశమును కన్పడునట్లుచేయుట, గోళ్ళనుతీయుట, జుత్తుసర్దుకొనుట మున్నగు భావములనుబట్టి మదనాతురయగు వేశ్యను గుర్తించవలెను. ఇంక కులాంగనయొక్క ఇంగితములను వివరింతును—నవ్వుచున్నట్లున్న కనులతో దీర్ఘముగా నిరీక్షించుట, నిగూఢముగా నవ్వుట, అధోముఖయై మాటాడుట, నవ్వుచు సమాధానము చెప్పుట, స్వేదమును ఆకారమును కన్పట్టనీయకుండుట, అధరము చలించుచుండుట, కంగారుపడుట మున్నగు భావములనుబట్టి కులాంగన 'మదనాతుర' అని గుర్తించవలెను.

### దశకామావస్థలు

అప్రాప్తసురతోత్సవయగు కన్య దశావస్థలతోకూడిన కామమును పై కామచిహ్నములచే ప్రదర్శించవలెను. ఈ దశావస్థలును స్త్రీ-పురుషులకు సమానములు—

16. ఇచ్చట స్త్రీల 'లలితదృష్టి' వివరింపబడినది. ఈ నిర్వచనము 8 వ అధ్యాయమందు సంచారిభావదృష్టులలో 'లలితదృష్టి' కి చెప్పబడిన నిర్వచనముకంటె భిన్నముగా ఉన్నది—"వలితములైన అంతములు, లాలిత్యసమ్మిశ్రమును వ్యంజితమును అగు చూపు కల దృష్టి 'లలితదృష్టి' అనబడును. ఇది స్త్రీల అర్ధావలోకనములందు ప్రయుక్తమగును".

అభిలాషా-చింతన-అనుస్మృతి-గుణకీర్తన-ఉద్వేగ-విలాప-ఉన్మాద-వ్యాధి-జడతా-మరణములు అనెడి పదియును వరుసగా కామావస్థలు.[17] వీని లక్షణములను వివరింతును—

1. అభిలాష— తాను కామించిన స్త్రీనిగూర్చిన లేదా పురుషుని గూర్చిన జ్ఞానముతో ప్రారంభమై, సంకల్పపూర్వకమైన ఇచ్ఛచే ఉద్రిక్తమై సమాగమోపాయమును వెదకుట 'అభిలాష' అనబడును. ప్రియుడున్నచోటునుండి మాటిమాటికి వెడలిపోవుచు మరల ప్రవేశించుట, వానిదర్శనపథమందు నిలుచుట, మదనచిహ్నము లను ప్రకటించుట అనువానిచే ప్రథమ కామావస్థను అభినయించవలెను.[18]

2. చింత(చింతనము)—"ప్రియుని సమాగమమున ఉపాయము ఎద్ది? అది ఎట్లునాకు కలుగును?" అని స్వీయభావమును దూతితో ఆలోచించుట 'చింత' అనబడును. భావసూచకములగు సగము చూపులు, కంకణములను వడ్డాణమును నీవిని నాభిప్రదేశమును స్పృశించుచుండుట అను వానిచే ద్వితీయ కామావస్థను అభినయించవలెను.

3. అనుస్మృతి— మాటి మాటికిని నిట్టూర్పులు విడుచుచుండుట, తాను కోరినదానినే చింతించుచుండుట, మరియొక పని చేయుటకు విముఖమైయుండుట 'అనుస్మృతి' అనబడును. ఆసనమందు కాని, శయనమందు కాని స్థిరముగా ఉండ లేకపోవుట, తాను చేయు పనిని ఏదో ఆలోచనవలన సగములోనే విడిచివేయుట అను వానిచే తృతీయావస్థను అభినయించవలెను.

4. గుణకీర్తనము— అంగ-ప్రత్యంగ లీలలలో, వాక్కులో, చేష్టలో, నవ్వులో, చూపులో వానిని పోలినవాడు లేడని చెప్పుట 'గుణకీర్తనము'అనబడును. గుణములను కీర్తించుట, గగుర్పాటునొందుట, కన్నీళ్ళను చెమటను తుడుచుకొను చుండుట, దూతితో రహస్యముగా తన వేదనను తెలుపుకొనుట అను వానిచే చతుర్థావస్థను అభినయించవలెను.

5. ఉద్వేగము— ఆసన-శయనములందు నిలుకడయు, తుష్టియు లేక పోవుట, నిత్యమును ప్రియుని కలియవలెననెడి ఉత్సుకతతో ఉండుట 'ఉద్వేగ' మనబడును. చింతా-నిశ్శ్వాస-ఖేద-హృదయతాపములను అధికముగా చూపుటచే ఉద్వేగమును అభినయించవలెను.

6. విలాపము— "ఇచ్చట నిలిచెను, ఇచ్చట కూర్చుండెను, ఇచ్చట నన్ను చేరెను" అనుచు విలపించుట 'విలాప' మనబడును. అత్యంతమును ఉద్విగ్నయై ఔత్సుక్యముతో, అధైర్యముతో విలపించుచు, ఇటునటు తిరుగుచు విలాపమును అభినయించవలెను.

7. ఉన్మాదము—సర్వావస్థలయందును నాయక సంశ్రితములైన కథలనే ఎన్నుచు, ఇతరపురుషులను ద్వేషించుట 'ఉన్మాద' మనబడును. అనిమిషదృష్టితో నిలుచుట, దీర్ఘముగా నిశ్వసించుట, ఏదో ఆలోచించుచు నడచుట, విహారకాల మందును ఏడ్చుట అనువానిచే ఉన్మాదమును అభినయించవలెను.

8. వ్యాధి— సామ-దాన-అర్థములను ప్రయోగించియు, దూతికలను రాయబారమంపియు నిరర్థకమగుటచే 'వ్యాధి' జనించును. హృదయము మోహము చెందుట, ఎచ్చటికో తెలియకయే వెళ్ళుచుండుట, తీవ్రమైన శిరోవేదన, ధైర్యము లేకుండుట అనువానిచే వ్యాధిని అభినయించవలెను.

9. జడత—ఏమడిగినను సమాధానము చెప్పకపోవుట, దేనిని వినకుండుట, చూడకుండుట, 'హా' మున్నగు కష్టసూచకములగు వాక్యములను పలుకుట, మౌనముతోనుండుట, స్మృతిలేకుండుట "జడత" అనబడును. అసమయములో హఠాత్తుగా 'హుం' అనుట, అంగములు వదులుగా ఉండుట, నిశ్శ్వాసములు అను వానిచే జడతను అభినయించవలెను.

10. మరణము— సమాగమోపాయము లన్నియును వ్యర్థములగుటచే (సమాగమము చేకూరనప్పుడు) కామాగ్ని ప్రదీప్తమై 'మరణము' సంభవించును.

17. అర్వాచీనాలంకారికులు కొందరు ద్వాదశ కామావస్థలను వివరించియుండిరి. ధనంజయాదులు శృంగారమును మూడు విధములుగా విభజించియున్నారు—అయోగము, సంభోగము, విప్రయోగము. ఏకచిత్తులైన యువతీ-యువకులు అనురాగవంతులైనను పారతంత్ర్యముచే కాని, దైవవశమున కాని కలియలేకపోయిన స్థితి 'అయోగ' మనబడును. దీనినే 'పూర్వానురాగ' మని కూడ అందురు. పై దశకామావస్థలును ఈ స్థితికి సంబంధించియున్నవని తెలియవలెను. భరతుడు అయోగమును కూడ విప్రలంభమునందే అంతర్గతము చేసెను. అంతియేకాక ఈఅయోగావస్థను భరతుడు 'ప్రచ్ఛన్నకామిత' మనుట గమనార్హము ("ప్రచ్ఛన్నకామితమును పై విధముగా అభినయించవలెను" అని తరువాత చెప్పబడును). ప్రచ్ఛన్నకామితమందలి గతి 12 వ అధ్యాయమందు చెప్పబడినది. ప్రచ్ఛన్న కామిత మనగా రహస్యకామితమనియు అర్థము. 'వ్యాధి' అనుటకు 'సంజ్వర' మనినాడు ధనంజయుడు.

18. అభిలాషయందు విస్మయ-ఆనంద-సాధ్వసము లుండునని ధనంజయుడు పేర్కొనెను [దశరూపకము - 4 వ ప్రకాశము - 53 శ్లో]. సాధ్వసమునకు ధనికుడు కుమార సంభవమునుండి [5 వ సర్గ - 85 వ శ్లో.] ఉదాహరణము నొసంగెను. ఇందు శివుని చూడగానే పార్వతికి కలిగిన సంభ్రమమును కాళిదాసు అతిలోకముగా వర్ణించియుండెను—

తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టి, ర్నిక్షేపణాయ పదముద్ధృత ముద్వహన్తీ ।
మార్గాచలవ్యతికరాకులితేవసింధుః, శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ ॥

కామావస్థల సామాన్యాభినయము

కామతంత్రమును సమీక్షించి, అప్రాప్తకామమునందు, మరణమును వర్జించి[19] తక్కిన అవస్థలను పైవిధముగా నిరూపించవలెను. పురుషుడుకూడ పైవిధముగానే ఆయా అవస్థలను ప్రదర్శించవలెను. ఇది స్త్రీ-పురుషుల కామావస్థలకు సంబంధించిన సామాన్యాభినయము.

చింత, నిశ్శ్వాసము, ఖేదము, హృదయతాపము, ప్రియానుగమనము, ప్రియుడువచ్చుమార్గమును నిరీక్షించుట, ఆకాశముచూచుట, దీనముగామాటాడుట, ఆభరణములను వస్త్రములను స్పృశించుచుండుట, వాటిని మెలిపెట్టుచుండుట. దేనికైన చేరబడియుండుట మున్నగు విప్రలంభసముద్భవములైన అభినయములచే సర్వకామావస్థలను అధికముగా అభినయించవలెను. కామాగ్నిచే దహింపబడువారు చల్లని మాల్యములను, ఆభరణములను, గంధములను, ఉపవనములను సేవించవలెను. అనేకములైన కామావస్థలచే పీడింపబడిన కామార్తులుతమ అవస్థను ప్రదర్శింపజాలిన దూతిని పంపించుచు మదనాశ్రయమైన సందేశమును దూతికీయవలెను. ఆ దూతియు సందేశమునుకొనిపోయి "ఆమె (లేదా వాని) అవస్థ ఈ యీ విధముగా ఉన్నది" అని వినయముతో విన్నవించవలెను. ఇట్లు పరస్పరాభిప్రాయములను ఎరిగిన పిమ్మట సమాగమోపాయమును చింతించవలెను.

ప్రచ్ఛన్న కామమును పైవిధముగా అభినయించవలెను.*

ఆభ్యంతరకామోపచారము

ఇంక రాజునకు సంబంధించినదియును, కామతంత్రానుసారియును అయిన ఆభ్యంతరకామోపచారమును వివరింతును. నానావిధములగు శీలములచే జనించిన సుఖ-దుఃఖకృతములగు భావములలో రాజు ఏ భావములను అవలంబించునో వానినే తక్కిన లోకమును అవలంబించునని తెలియవలెను. రాజులకు ఆజ్ఞామాత్రముచేతనే స్త్రీప్రాప్తికి ఉపాయములు సిద్ధించును కాన వారికి స్త్రీలు దుర్లభలుకారు; అయినను దాక్షిణ్యాసముద్భవమైన కామమే రతికరము కాగలదు.

---

19. ఈ మరణనిషేధము ప్రత్యేకమైనది. ఇంకను ముందు బోలెడంత కథ జరుగవలసియుండగా 'అయోగ' అవస్థయందే నాయిక లేదా నాయకుడు మరణించుట తటస్థించినచో ఇంకేమున్నది? అందుచే ఇచ్చట మరణమును నిరూపించరాదు. మరి మరణమేల చెప్పబడినదన్నచో 'మరణము కలుగునన్నంతగా వారు తప్తమైరి' అని నిరూపించుటకే.

* [కాశీముద్రణమునందు 24వ అధ్యా-136–188 శ్లో; బొంబాయి ముద్రణమునందు 22వ అధ్యా - 138–193 శ్లో; బరోడా ముద్రణమునందు 22వ అధ్యా - 145-201 శ్లో.]



ప్రచ్ఛన్నకామితము : పట్టపురాణియందలి బహుమానముచేతను, ఇతర భార్యలవలని భయముచేతను వారి పరిజనమునెడ గల కామమును రాజు ప్రచ్ఛన్నముగా చూపవలెను. అనేకవిధములుగా కామతంత్రమును నెరపదగిన అవకాశములు నరేంద్రులకు ఉన్నను, ప్రచ్ఛన్న కామితము మాత్రమే వారికి రతికరము కాగలదు. నాయిక దుర్లభయగుట, ఆమెను పొందకుండ నివారింపబడుచుండుట, నివారింపబడినకొలది పట్టుదల ఎక్కువ అగుట ఏ స్త్రీ విషయమున సంభవించునో ఆ స్త్రీ విషయకమగు కామమే అతిశయమగు ప్రీతిని కలిగించును.

స్పష్టకామితము : రాజునకు అంతఃపురజనముతో దివాసంభోగము (పరస్పరావలోకన-ప్రణయకలహ-సంగీతకాదులు) తప్పుకాదు ; కాని 'వాసోపచార' మనునది రాత్రులందే జరుగవలెను.

వాసకోచితకాలములు : పరిపాటి (బహుభార్యలున్నపుడు వారి వారి వంతుల చొప్పున వెళ్ళుట), ఋతుకాలము (సంతానము కొరకు), నవత్వము, ప్రసవానంతర కాలము, దుఃఖసమయము, ప్రమోదసమయము అను ఈ ఆరును 'వాసకములు' (వాసోచితములైన సమయములు) అని తెలియవలెను.[20] ఉచితమైన వాసకమందును, ఋతుకాలమందును ధర్మవృత్తియగు రాజు తనకిష్టమగు కాంతయైనను, ద్వేష్య అగు కాంతయైనను తప్పక కామోపచారములచే ఉపచరించవలెను.

అష్టవిధనాయికావస్థలు

కామోపచారమందలి నాయికలు ఎనిమిది విధములుగానుందురు— వాసకసజ్జ, విరహోత్కంఠిత, స్వాధీనభర్తృక, కలహాంతరిత, ఖండిత, విప్రలబ్ధ, ప్రోషితభర్తృక, అభిసారిక.

1. వాసకసజ్జ— ఉచిత వాసకమునందు (రాత్రి అంతయు నాయకుడు తనతోకూడియుండుటకు తగినకాలమందు) రతి సంభోగలాలసయై సంతోషముతో అలంకరించుకొను నాయిక 'వాసకసజ్జ' (=వాసకసజ్జిక) అనబడును.

2. విరహోత్కంఠిత— అనేక కార్యవ్యాసంగములచే ప్రియుడురానిచో దుఃఖార్తయగు నాయిక 'విరహోత్కంఠిత' అనబడును.

---

20. అంతఃపురజనము=ఊఢ, పునర్భువు, అవరుద్ధగణిక, కన్యకయైన ప్రేష్య - వీరి విషయమున మాత్రము ప్రచ్ఛన్నకామితమని ఎరుంగవలెను. దివాసంభోగము=పరస్పరావలోకన - ప్రణయకలహ - సంగీతకాదులు. రాత్రి అంతయును వసించి భోగించుచోటు (పడకటిల్లు) 'వాసము'; తదుచితమైన కాలము 'వాసకము' అనబడును. [అభినవభారతి - 3 వ సం - పుటలు 206–207]

3. స్వాధీనభర్తృక— నాయకుడు సురతాతిరసబద్ధుడై తన పార్శ్వమందుండగా అధికమగు హర్ష-సౌభాగ్య-అభిమానములను కలిగియుండు నాయిక 'స్వాధీనభర్తృక' అనబడును.

4. కలహాంతరిత— ఈర్ష్యాకలహమువలన వెడలిన ప్రియుడు మరలి రాకుండుటచే అమర్షవశయగు నాయిక 'కలహాంతరిత' అనబడును.

5. ఖండిత— ఉచితవాసకమునందు (తనతో కలిసియుండవలసిన సమయములో) ప్రియుడు ఇంకొక నాయికతో కలిసియుండి తనయొద్దకు రానిచో దుఃఖార్తయగు నాయిక 'ఖండిత' అనబడును.

6. విప్రలబ్ధ— దూతిని పంపి, సంకేతమును చెప్పియున్నప్పటికిని ఏదేని కారణమున ప్రియుడు రాకపోవుటచే వంచిత అయిన నాయిక 'విప్రలబ్ధ' అగును.

7. ప్రోషితభర్తృక—నానాకార్యాసక్తుడై ప్రియుడు దేశాంతరము వెడలగా కేశసంస్కారాదులను వర్జించియుండు నాయిక 'ప్రోషితభర్తృక' అనబడును.

8. అభిసారిక—మద్యమదముచే కాని, మదనపారవశ్యముచే కాని లజ్జను విడిచి కాంతునియొద్దకుపోవు నాయిక 'అభిసారిక' అనబడును.

నాటకాశ్రయములైన నాయికావస్థలు పై విధముగా నుండునని తెలియవలెను. ఇంక వీరికి సంబంధించిన కామతంత్రమును వివరింతును.

### అష్టవిధనాయికావస్థల అభినయము

చింత, నిశ్శ్వాసము, ఖేదము, హృదయతాపము, సఖీసంలాపము, తన అవస్థను పర్యాలోకము చేసికొనుట, గ్లాని, దైన్యము, అశ్రుపాతము, రోషము తెచ్చుకొనుట, భూషణములను త్యజించుట, కేశసంస్కారాదులు లేకుండుట, దుఃఖము, రోదనము అనువానిచే ఖండితా-విప్రలబ్ధా-కలహాంతరితా-ప్రోషితభర్తృకలు తమ తమ అవస్థలను అభినయించవలెను.

విచిత్రమును ఉజ్జ్వలమును అయినవేషము, ప్రమోదముచే వికసించినముఖము, అధికమైన శోభ అనువానిచే స్వాధీనభర్తృక తన అవస్థను నిరూపించవలెను.[21]

అభిసారణము : వేశ్యకాని, కులజకాని, ప్రేష్య (దాసి) కాని క్రింద చెప్పబోవు భావవిశేషములతోకూడి అభిసరణముచేయవలెను (కాంతునియొద్దకు పోవలెను)— వేశ్యాంగన మదవతియై సుకుమారచేష్టలను చేయుచు, నానాభరణములను ధరించినదై పరిజనులతోకూడి మెల్లగా పోవలెను. కులాంగన ఇతరులు చూతురను

21. వాసకసజ్జా-అభిసారికలు కూడ స్వాధీనభర్తృకవలెనే తమ తమ అవస్థలను నిరూపించవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 210]



అనుమానముతో, అవయవములను ముడుచుకొని, భయపడుచు, ముఖమువంచి, ముసుగువేసికొని పోవలెను. ఇంక ప్రేష్యాంగన మదముచే మాటలు తొట్రుపాటు పడుచుండ, విభ్రమముచే వికసించిన లోచనములు కలదై, ఆవిద్ధగతితో పోవలెను. ఇట్లు వెళ్ళినపిమ్మట అచ్చట ప్రియుడు నిద్రపోవుచున్నచో క్రింది విధముగా ఉపచారముచే మేల్కొలుపవలెను—అలంకారములను (నూపురాదులను) ధ్వనింపజేయుటచే కులాంగనయు, చల్లని పరిమళములచే వేశ్యయు, తన చీరచెరగుతో విసరుటచే ప్రేష్యయు ప్రియుని మేల్కొల్పవలెను.

ఇట్లు కామోపచారము కేవలము కులాంగనావిషయమున మాత్రమేకాక వేశ్యాంగనావిషయమున కూడ అనువర్తించును. వేశ్యోపచారము లోకమున రహస్యముగ ఆచరింపదగినదయినను నాటకమున సర్వావస్థలును ప్రత్యక్షములగునట్లు అభినయించవలెను.

నవకామప్రవృత్త లేదా క్రుద్ధ అయిన నాయికతోడి సమాగమమందు ఏదేని వ్యాజముతో కూడిన ఉపాయముతో వాసకమును యోజింపవలెను. ప్రియురాలు అనుభవించిన వివిధములగు అలంకార-వస్త్ర-గంధ-మాల్యములను నాయకుడు సంతోషముతో సేవించవలెను. కామినీసమాగమమునకు పూర్వము పురుషుడు ఎంతమదన (కామభావ) పరవశుడుగా ఉండునో తత్సమాగమానంతరము ఆ పారవశ్యము అంతకు రెండురెట్లు హర్షముతోకూడియుండును. కావున కామోపచారము అచ్చటను ఆవశ్యకమే. అతిశయములైన విలాస-భావ-ఇంగిత (ప్రేమసూచకములైన వ్యాపారములు)-లీలా-మాధుర్యాది గుణములతో, పరస్పరప్రేమనిరీక్షణములతో సమాగమమందు కామోపచారమును కావించవలెను.

ఉపచారములచే కామము జనించినపిమ్మట నాయకుని రాకయందు నాయిక క్రిందివిధముగా వాసోపచారమును చేయవలెను—గంధ-మాల్యములను, చూర్ణము (పటవాసము) ను, వస్త్రములను ధరించుట పూర్తికావించియు అద్దమునందు మాటిమాటికిని సవిలాసముగా, స్వేచ్ఛగా చూచుకొనుచుండవలెను. వాసోపచారమునందు అధికముగా భూషణములను ధరింపరాదు; ధ్వనించు రశనా-నూపురాదులిందు ప్రశస్తములు.

### రంగమున నిషిద్ధములు

వస్త్రధారణము, స్నానము, చందనాదులు ధరించుట, కాటుకపెట్టుకొనుట, లత్తుక మొదలగువానిని ధరించుట, జుట్టు ముడివేసికొనుట అనువానిని రంగమునందు ప్రదర్శించరాదు. ఉత్తమ - మధ్యమప్రమదలు రంగమునందెప్పుడును మేలి

ముసుగు లేకుండనుండరాదు; ఏకవస్త్రలు కారాదు; అధరరాగమును ఉంచుకొన రాదు. కాని అధమస్త్రీల విషయమున ఇట్టి నిషేధములేదు. అయినను కారణాంతరములచే, నాటకమందు అధములైన ప్రేష్యాది స్త్రీ-పురుషుల విషయమునకూడ రంగమునందు పై కృత్యములు నిషిద్ధములే.*

ప్రతీక్ష: భూషణములను, పుష్పములను ధరించి ప్రియుని రాకకు ప్రతీక్షింపవలెను. అవిరుద్ధమగునట్లుగా, సవిలాసముగా నాయిక తన్ను అలంకరించుకొనవలెను. ఇట్లు వాసకోచితవిధిని నిర్వర్తించి, నాలికాశబ్దమును వినుటకై చెవియొగ్గి కాలమును నిర్దేశించుచుండవలెను (ఇంత కాలము కడచినది, ఎందుచేత ఇంతవరకును రాలేదు ? అని వితర్కించుచుండవలెను). అనుకొనినవేళ అతిక్రమింపగానే నాయకుడు రాకపోవుటచే విక్లబయై, కంపించుచున్న గాత్రముతో, విషణ్ణమైన హృదయముతో ద్వారమునొద్ద కేగవలయును. ద్వారమును వామహస్తముతో కవాటమును దక్షిణహస్తముతో పట్టుకొని, ద్వారమునకు చేరబడి నాయకుని రాకను నిరీక్షించవలెను. అట్లు ద్వారమునకు చేరబడి శంకా-చింతా-భయములను చూపవలెను. ప్రియుడు ఎంతకును కంటబడకపోవుటచే ఆమె క్షణముసేపు విషణ్ణ కావలెను. అప్పుడు దీర్ఘముగా నిశ్శ్వసించి, కంటనీరుపెట్టి, సన్నహృదయముతో ఆసనమందు కూలబడవలెను.

మంచి-చెడ్డల నాలోచించుచు, అతడు రాకపోవుటకుగల కారణమును బహువిధములుగా విమర్శించవలెను. అనగా ప్రియుడు రాకపోవుటకు కారణము గురుకార్యమా ? మిత్రులతోకూడియుండెనా ? రాజ్యచింతతోనుండెనా ? మంత్రులతో ఆలోచించుచుండెనా ? లేదా ఇంకొక ప్రియురాలిచే బద్ధుడయ్యెనా ? అని చింతించవలెను. కనులదరుట, భుజములదరుట మున్నగు నిమిత్తములచే శుభ-అశుభ శకునములను సూచింపవలెను. స్త్రీలకు వామపార్శ్వమందు కలుగు నిమిత్తములు శుభసూచకములు; దక్షిణపార్శ్వమందు కలుగునవి అనిష్టసూచకములు. వామ పార్శ్వమందలి నేత్ర-లలాట-భ్రూ-నాసా-ఓష్ఠ-ఊరు-బాహు-స్తనములు స్ఫురించినచో (అదరినచో) అది ప్రియసమాగమమును సూచించును. ఇంక దక్షిణపార్శ్వమందలి అవయవములు అదరుట దుర్నిమిత్తసూచకము. అట్లు దుర్నిమిత్తములు కన్పట్టగానే క్షణకాలము మోహము నొందవలెను. నాయకుడు రానంతసేపును చెక్కిలిని చేతి కానించి, తన అలంకరణమును నిరసించుకొనుచు ఆమె ఏడ్వవలెను. తరువాత ప్రియునిరాకనుగూర్చిన శుభనిమిత్తములు కనుపట్టినంతనే, అతడు

* [కాశీముద్రణమునందు 24వ అధ్యా - 189–236 శ్లో: బొంబాయి ముద్రణమునందు 22వ అధ్యా - 194–235 శ్లో: బరోడా ముద్రణమునందు 22వ అధ్యా - 202–248 శ్లో.]



ధరించిన పుష్పమాల్యాదుల గంధమును ఆఘ్రాణించుటచే వాని రాకను సూచింపవలెను. అల్లంతదూరములో నాయకునిచూచి ఆనందముతో యథావిధిగా ఎదురేగి, ప్రహర్షముచే వికసించిన కనులతో కాంతుని చూడవలెను.[22]

అప్పుడు కాంతునియందు వేరొకస్త్రీతో కలిసిన చిహ్నములును, దంతక్షతాదులును కన్పట్టినచో చెలికత్తె భుజముపై చేతినానుకొని, ఆయతస్థానమందు నిల్చి వానిని పరిశీలించవలెను. అప్పుడు సాపరాధుడైన ఆ నాయకుని కోపసూచకములగు ఆయాచేష్టలచే, నిందాపూర్వకములగు వాక్యములచే ఉపాలంభించవలెను. మానము, అవమానము, సంమోహము, అవహిత్థ, భయము అనునవి స్త్రీలయొక్క ఈర్ష్యావచనములందు కన్పట్టుచుండును.

నమ్మకమును కలిగించు పనిని ప్రియుడు చేసినప్పుడును, కుశలవార్త నడిగినప్పుడును, కుశలప్రశ్నపూర్వకముగా అనురాగమును చూపినప్పుడును, నాయకుడు సాపరాధుడా? కాడా? అను సందేహమున్నప్పుడును, ప్రియుడు ప్రార్థించుచున్నప్పుడును, పిల్లలకు సంబంధించిన అభ్యుదయకార్యములందును, కళా-శిల్పాది విషయమున కలిగిన వివాదమందును, తనపక్షమందున్న సఖీజనులపనులు ప్రియునిచే నెరవేర్పబడవలసియున్నప్పుడును, ఇంద్రజాలాదులచే విస్మయముకలిగినప్పుడును, వ్రత-గృహకృత్య - కౌముదీమహోత్సవాది సమయములందును, గూఢముగా మాటాడి ప్రియుని అభిప్రాయమును తెలిసికొనవలసియున్నప్పుడును, అందరును నవ్వెడి సంఘటనములందును, అత్యాదరముతో ప్రియుడు దేనినిగూర్చి అయినను ప్రశ్నించినప్పుడును, అగ్ని మొదలగు ఉత్పాతములందును, బంధువియోగాది వ్యసనములందును-సాపరాధుడగుటచే ప్రియుడు మాటాడదగనివాడైనను-ప్రియురాలు తప్పక వానితో మాటాడవలెను.

## ఈర్ష్య

స్నేహమెచ్చటనుండునో అచ్చట మదనసంభవమైన ఈర్ష్య జనించుచునే ఉండును. వైమనస్యము, వ్యలీకము, విప్రియము, మన్యువు అనెడి నాలుగు హేతువులచే ఈర్ష్య జనించును. వీని లక్షణముల నిప్పుడు వివరింతును—

1. వైమనస్యము—వేరొకస్త్రీతో కలిసిన చిహ్నములను, దంతక్షతాదులను కలిగినవాడై రాత్రి అంతయు నిద్రలేక బడలికతో మెల్లగా నడచివచ్చుచున్న

22. ఇంతవరకును వాసకసజ్జావిషయకమైన, వాగంగసత్త్వవ్యామిశ్రితమైన సామాన్యాభినయము వివరింపబడినది. తరువాత ఖండితాది నాయికల విషయము ప్రసక్తమగును. [అభినవభారతి - 3 వ సం - పుట 218]

ప్రియునిచూచుటచే స్త్రీలయందు జనించు విముఖత 'వైమనస్య' మనబడును. తీవ్రములును, అసూయాపూర్ణములును అగు దృష్టులు, రోషముచే అదరుచున్న అవయవములు కలదై 'బాగుబాగు', 'సెబాస్', 'చాలబాగున్నది' మొదలగు వాక్యములచే వైమనస్యజనితమైన ఈర్ష్యను అభినయించవలెను.

2. వ్యలీకము—వలదని పెక్కుసార్లు వారింపబడినప్పటికిని ఆ స్త్రీతోనే మరల తన కంటబడినచో మాత్సర్య-సంఘర్షములవలన జనించు మానసికవ్యథ 'వ్యలీక' మనబడును. పాదములతో నేలను అదిమిపట్టి, ఎడమచేతిని గుండెలపై ఉంచి, కుడిచేతితో విదలించికొట్టుచు వ్యలీకముచే జనించిన ఈర్ష్యను అభినయించవలెను.

3. విప్రియము—"నీతోడిదే నా జీవితము ; నీకు దాసుడను ; నీవే నా ప్రియవు" అని పలుసార్లు చెప్పియు ప్రియుడు అన్యథా ఆచరించునప్పుడు జనించు మానసికవ్యథ 'విప్రియము'. తన్ను ప్రసన్నురాలిని చేసికొనుటకు ప్రియుడు పంపిన దూతిని లేఖను ప్రతివచనములను దూషించుచు తిరస్కరించుట, కోపముతో కూడిన నవ్వు, ఏడుపు, శిరఃకంపము మొదలగు వానిచే విప్రియమువలన జనించిన ఈర్ష్యను అభినయించవలెను.

4. మన్యువు—వేరొకనాయిక యొద్దనుండి తనయొద్దకు సంభోగచిహ్నములతో సూటిగావచ్చి తన సౌభాగ్యమును ప్రశంసించుకొను ప్రియునిచూచినప్పుడు జనించు ఆవేశము 'మన్యువు' అనబడును. జారిపోవుచున్న మొలనూలిని గాజులను సర్దికొనుచు, కనులనిండ నీరునింపుచు మన్యువుచే జనించిన ఈర్ష్యను అభినయించవలెను. మరియొక కాంతతో కూడినందులకు సిగ్గుపడుచు జంకుతో నిలిచిన ప్రియతమునిచూచి ఈర్ష్యావచనములతో కూడిన నిందావాక్యములచే వాని మనస్సు నొప్పించవలెను. కాని, నిష్ఠురముగా మాటాడరాదు ; ఎక్కువకోపము కలిగించు పరిహాసము చేయరాదు. కనులనిండ నీరునింపుచు తన్నుతాను నిందించుకొనుచుండవలెను.

ప్రియుడు అనునయించునప్పుడు-నిరాదరసూచకముగా చిటికలువేయుట, గుండెలపై చేతినుంచుట, మీదిచూపులు కోరచూపులు చూచుట, కటిపైనుంచిన హస్తమును గిఱ్ఱున త్రిప్పుట, అంజలిని విదలించుట, తలను త్రిప్పుట, క్రిందికివాల్చుట, ప్రక్కకు పడవేయుట, దేనినేని ఆన్చి ఉంచుట, గంభీరముగాచూచుట, మెటికలు విరుచుట, లలితముగా బెదరించుట మున్నగు భావవిశేషములచే ప్రియురాలు ఈర్ష్యను అభినయించవలెను. అప్పుడామె "చాలబాగున్నావు. చూచితిని. వెళ్ళు. ఏమి ఆలస్యము ? నన్ను స్పృశింపకుము. నీ హృదయములో ఉన్నప్రియురాలి



యొద్దకేగుము. ఇంక వెళ్ళుము" అని చెప్పి, వెనుదిరిగి, అంతలోనే ప్రియునివైపు మరలి ఏదేని మిషచే హర్షముకలిగినట్లు సూచింపవలెను.

అతడు తనదోషమును గుర్తించినవాడై హస్తమునుకాని, వస్త్రమునుకాని, శిరోజములనుకాని బలాత్కారముగా గ్రహించుటచే ప్రియురాలిని అనునయించవలెను.[23] అట్లు ప్రియుడు గ్రహించిన హస్తమును లేదా వస్త్రమును లేదా శిరోజములను ఆమె అతనిని ఉపసర్పించుచు మెల్లగా వదిలించుకొనవలెను. మరల అతడు గ్రహించినచో స్వర్ణాలసయై "ఉహూ. విడిచిపెట్టు" అని అనవలెను; మరియు పాదాగ్రమున నిలిచి, అతిశయమైన కుట్టమితముతో, అశ్వక్రాంతచారితో మెల్లగా శిరోజములను విడిపించుకొనవలెను. ఇంకను ఆతడు విడువకున్నచో స్వేదముతోకూడినదై "హా. ఉహూ. నన్ను విడిచిపెట్టు. పొమ్ము" అనుచు స్వర్ణాలసాంగియై పలుకవలెను. "పొమ్ము" అని రోషముతోచెప్పి, తానే వెడలిపోయి, ఏదో ఒక మాటతో మరలవచ్చి "వెళ్ళుదువా ? లేదా" అని అడుగవలెను. అప్పుడు చేతిని విదలించికొట్టుచు హుంకరించవలెను. ఇంకను ఆతడు తన్ను అనుసరించుచున్నచో ఒట్లు పెట్టియు, వ్రతోపవాసాది వ్యాజములను కల్పించియు ఆతనిని విదలించుచుండవలెను. కాని, ఆతడు వెనుకనుండివచ్చి ప్రియురాలిని కౌగిలించుకొనుటయు, ఆమె కన్నులు మూయుటయు చేయవలెను. ఆపె వస్త్రము తొలగినచో[24] దీపమును మరుగుపరచవలెను. ప్రియుడు తన పాదములమీద పడునంతవరకును ఆమె వానిని పైవిధముగా ఖేదపెట్టవలెను. అతడు పాదములమీద పడిన తరువాత వానిని లేవనెత్తుటకు దూతి కొరకు నిరీక్షించవలెను. అతనిని లేవనెత్తి నాయిక వానిని ఆలింగనము చేసికొనవలెను. పిమ్మట రతిభోగాసక్తయై సంతోషముతో పడకటింటికి దారితీయవలెను. శృంగారసంయుక్తము, రతిసంభోగకారణము అగు ఈ విధినంతటిని సుకుమారమైన గీతివిధానముతో కూర్చవలెను.[25] ఆకాశ

---

23. అపరాధము స్వల్పమైనచో శిరోజములను, మధ్యమమైనచో హస్తమును అధికమైనచో వస్త్రమును గ్రహించవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 223]

24. రంగమున వస్త్రాపహరణాదులు నిషిద్ధమని చెప్పబడెనుకదా, మరి దీనికేమి చెప్పుదురని ప్రశ్నింపవచ్చును. ఆ నిషేధము నాటక - ప్రకరణ విషయము; ఇప్పుడీ చెప్పుచున్నదంతయు 'లాస్యాభినయ' విషయమని తెలియవలెను. ఇందు పై నిషేధములనంతగా పాటించకపోవుట దోషముకాదు. [అభినవభారతి - 3 వ సం - పుట 224] లాస్యాంగములు 19 వ అధ్యాయాంతమున వివరింపబడెను. లాస్యాభినయము, 31 వ అధ్యాయమందు వివరింపబడును.

25. పైనిచెప్పబడిన విధానమంతయును నాట్యమునందు కేవలము అనుపయుక్తము కాదు. భాణకాదులందు దీని ప్రసక్తి స్పష్టముగా గోచరించుచుండును. [అభినవభారతి - 3వ సం - పుట 224]

పురుషభాషితమును, పరస్థవచనాశ్రయమును అయిన కావ్యమునందు (అనగా భాణకాదులందు) పై విధానమంతయును స్త్రీచే అభినయింపబడవలెను.

నాటకమందలి వస్తువు అంతఃపురసంబంధియు, శృంగారరసయుక్తమును అగునప్పుడుకూడ పైవిధినే అనుసరించవలెను.[26]*

రంగమున నిషిద్ధములు

నాట్యధర్మము తెలిసినవారు రంగమందెవ్వరును శయనించినట్లు చూపరాదు. అప్పట్ల ఏదేని వ్యాజమును కల్పించి, అంకమును ముగించవలెను. ప్రయోజనానుసారముగా ఒక్కొక్కచో ఒంటరిగాకాని లేదా కలిసికాని శయనించుటను చూపవచ్చును. కాని, చుంబనమును, ఆలింగనమును, గుహ్యమును, దంతక్షతమును, నఖక్షతమును, నీవీ విస్రంసనమును, స్తనాంతర (స్తన-అధర—కాశీముద్రణ పాఠము) విమర్దనమును రంగమునందు చూపరాదు. అట్లే భోజనమును, జలక్రీడను, లజ్జాకరములైన ఇతర కామవ్యాపారములనుకూడ రంగమునందు చూపరాదు.

పితాపుత్రస్నుషాశ్వశ్రూదృశ్యం యస్మాత్తు నాటకమ్।
తస్మాదేతాని సర్వాణి వర్జనీయాని యత్నతః॥ 299

—తండ్రి కొడుకులు, అత్తా కోడండ్రు కలిసి ఒకేసారి నాటకమును చూచుచుందురుకాన వారి మనస్సునకు సంకోచమును కలిగించు పై కార్యముల నన్నింటిని వర్జింపవలెను.

వాక్యైః సాతిశయైః శ్రవ్యై ర్మధురై ర్నాతినిష్ఠురైః।
హితోపదేశసంయుక్తై స్తజ్ఞః కుర్యాత్తు నాటకమ్॥ 300

—సాతిశయములును, విననింపుగ నుండునవియును, మధురములును, సుకుమారములును, హితోపదేశసహితములును అగు వాక్యములతో నాటకమును రచింపవలెను.

ఇట్లు అంతఃపురోపచారకృతమైన అభినయమును బుధులు నిర్వర్తించవలెను.

మదనాశ్రయమైన సమాగమమునందు స్త్రీలు ప్రియులవిషయమునుపయోగింపదగు పదములను వివరింతును- ప్రియ, కాంత, వినీత, నాథ, స్వామి, జీవితము, నందన అనెడి పదములను నాయకు డిష్టుడైనప్పు డుపయోగించవలెను.

---

26. ఇచ్చట ఈ అభినయవినియోగము మొదట గీతవిధియందు (లాస్యమందు), పిమ్మట పరోక్షప్రయోగమందు, తరువాత ప్రత్యక్షపురుషసంబంధము కల నాటకములందు వరుసగా చెప్పబడినదని తెలియవలెను.

* [కాశీముద్రణమునందు 24వ అధ్యా - 237—284 శ్లో; బొంబాయిముద్రణమునందు 22వ అధ్యా - 285—288 శ్లో; బరోడా ముద్రణమునందు 22వ అధ్యా - 244-294 శ్లో.]



ప్రియుడు : విప్రియమును చేయనివాడు, అయుక్తముగా మాటాడనివాడు, ఋజుప్రవర్తనము కలవాడును అగు నాయకుని 'ప్రియ' అని సంబోధించవలెను.

కాంతుడు : అధరమందుకాని, శరీరమందుకాని అన్యనారీసముద్భూతమైన చిహ్నము కన్పట్టని నాయకుని 'కాంత' అని అనవలెను.

వినీతుడు : కోపమువచ్చినను ప్రియురాలికి జవాబు చెప్పని, పరుషముగా మాటాడని నాయకుని 'వినీత' అని సంబోధించవలెను.

నాథుడు : (స్వామి-అని 'కాశీముద్రణ పాఠము') హితమును కోరువాడు, రక్షించుటయందు సమర్థుడు, మాన-మాత్సర్యములులేనివాడు, సర్వకార్యములందు సావధానుడును అయిన నాయకుని 'నాథ' అని సంబోధించవలెను.

స్వామి (నాథ- అని కాశీముద్రణ పాఠము): సామవాక్యములచే, దానముచే, భోగములచే, లాలన-పాలనములచే ప్రియురాలిని సేవించు నాయకుని 'స్వామి' అని సంబోధించవలెను.

జీవితము : ప్రియురాలి అభిప్రాయము నెరింగి, సమాగమమున నిపుణముగా శయనక్రియ నాచరించు నాయకుని 'జీవితమ్' అని సంబోధించవలెను.

నందనుడు : కులీనుడు, ధీరుడు, దక్షుడు, వాగ్విశారదుడు, సఖులమధ్య ప్రశంసనీయుడు, దక్షిణుడు అయిన నాయకుని 'నందన' అని సంబోధించవలెను.

పై వచన విన్యాసములు రతిప్రీతిసూచకములు. ఇంక క్రోధమందు ప్రియుని విషయమున దుశ్శీల, దురాచార, శఠ, వామ, వికత్థన (విరూపక అని కాశీముద్రణ పాఠము), నిర్లజ్జ, నిష్ఠుర అనెడి పదములను అప్రీతిసూచకములుగ ప్రయోగించవలెను.

దుశ్శీలుడు : నిష్ఠురుడు, అసహిష్ణువు, మాని, ధృష్టుడు, వికత్థనుడు, అనవస్థితచిత్తుడు అయిన నాయకుడు 'దుశ్శీలు' డనబడును.

దురాచారుడు : ఆలోచింపకయే కొట్టుట, కట్టుట, పరుషముగా మాటాడుట చేయు నాయకుడు 'దురాచారు'డనబడును.

శఠుడు : మాటలలో మాత్రమే మాధుర్యమును చూపుచు క్రియాశూన్యుడగు నాయకుడు 'శఠు' డనబడును.

వాముడు : వారింపబడినదానినే తప్పక చేసెడి విపరీతబుద్ధి 'వాము' డనబడును.

వికత్థనుడు ; సరస(ఆర్ద్ర)ములైన దంతక్షతాది చిహ్నములు కలవాడు, తానుపొందిన స్త్రీయొక్క సౌభాగ్యమును పొగడువాడు, అతిమాని, స్తబ్ధుడు అయిన నాయకుడు 'వికత్థను' డనబడును.

నిర్లజ్జుడు : అన్యస్త్రీసంభోగచిహ్నము కలిగి, అపరాధము స్పష్టపడగా నాయికచే వలదని గట్టిగా వారింపబడినను ఉపసర్పించు నాయకుడు 'నిర్లజ్జ' డనబడును.

నిష్ఠురుడు : తాను అపరాధముచేసియు, అందుచే కుపిత అయిన నాయికను అనునయింపకయే బలాత్కారముగా సేవించు నాయకుడు 'నిష్ఠురు'డనబడును.

అప్రీతిసూచకములైన వచనవిన్యాసములు పైవిధముగానుండును.

పైనిచెప్పబడిన ప్రియ-అప్రియవచన విన్యాసములనేకాక ఇంకను ఇతరము లగు వచన విన్యాసములను కూడ నర్తకులు ప్రయోగించవచ్చును.

పై విధముగా సుకుమారగీతవిధానముతో శృంగారరససంభూతములగు రతిసంభోగ-భేదములందు ఆయా వచనవిన్యాసములను ప్రయోగించవలెను. శృంగార రసమునందు వస్తువు ఆకాశపురుషభాషితమును, పరస్పరవచనాశ్రయమును అగు నప్పుడుకూడ పై విధానమునే అనుసరించవలెను. ఇంక నాటకమునందుకూడ వస్తువు శృంగారరససంయుక్తమైనప్పుడు పై వచనవిన్యాసక్రమమునే అనుసరించ వలెను.

ఇంక దివ్యాంగలనతో రాజులకు సమాగమము కలుగునప్పుడు అనుసరింప దగు కామోపచారమును ఇప్పుడు వివరింతును. దివ్యులగు స్త్రీ-పురుషుల శృంగారము నందు వేషము నిత్యోజ్జ్వలముగను, మనస్సు నిత్యప్రముదితముగను, కాలము నిత్యసుఖముగను లలితాశ్రయముగను ఉండును; ఈర్ష్య కాని, క్రోధముకాని, అసూయకాని, అనునయముకాని ఉండదు. కాని, దివ్యాంగనలు మనుష్యులతో (రాజులతో) కలియునప్పుడు మాత్రము మనుష్య లనుభవించు భావములు, ప్రయోగించు అంగచేష్టితములు మున్నగువానినెల్ల వారికిని ఆపాదించవలెను. శాపముచేకాని, సంతానకాంక్షచేకాని దివ్యాంగనలకు శృంగారరససమాశ్రయమగు మానుషసమాగమమును కల్పించవలెను.

పుష్పవాసనలచే, ఆభరణధ్వనులచే అగుపడకయే నాయకుని మనస్సును ఆకర్షించి, ఒకక్షణము సందర్శనమొసంగి మరల అంతర్హితము కావలెను. వస్త్ర-ఆభరణ-మాల్యాదులు, ప్రేమలేఖలను పంపుట మొదలగు ఉపచారములచే నాయ కుని కామమును వృద్ధి పొందించవలెను. ఆ విధముగా ప్రియురాలిచే రెచ్చగొట్టబడిన కామము ప్రీతిజనకమైనట్లు స్వభావోపగతమైన కామము ప్రీతిజనకము కానేరదు.

రాజు లాచరింపదగిన ఆభ్యంతరకామోపచారమును వివరించియున్నాను. ఇంక 'వైశిక' మైన బాహ్యోపచారమును వివరింతును.*

---

*[కాశీముద్రణమునందు 24వ అధ్యా-285—320 శ్లో; బొంబాయి ముద్రణమునందు 22వ అధ్యా-284-321 శ్లో; బరోడా ముద్రణమునందు 22వ అధ్యా-295-332 శ్లో.]



## విశేషాంశములు

### 1. సామాన్యాభినయము

అర్వాచీనాలంకారశాస్త్రగ్రంథములందు కన్పట్టు నాయికా-నాయక భేదములు, శృంగారావస్థలు, తదితర శృంగారసంబంధి విషయములును ఈ అధ్యాయమందు చర్చింప బడినవి.

వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములకు వేర్వేరుగా కాని, సముదాయరూపముగా కాని సంబంధించిన అభినయము 'సామాన్యాభినయ' మనబడును. ఇంతవరకును వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములు ఆయా అధ్యాయములందు వివరింపబడినవి. వాటి విషయ మున ఇంతవరకును వివరింపబడని కొన్ని క్రొత్త అంశములు ఈ అధ్యాయమందు వివరింప బడినవని తెలియవలెను. ఈ అంశములను కూడ ఆయా సందర్భములందే చెప్పుటకు అవకాశము లేదు. కాని, వీటి జ్ఞానము కవి-ప్రయోక్తలిరువురకును అత్యావశ్యకము. అందుచే ఇట్టి వాటినెల్ల రాశీకరించి భరతుడీ అధ్యాయమునందు వివరించెను.

ఈ అధ్యాయప్రథమభాగమందు మొదట సాత్త్వికాభినయము, పిమ్మట శారీరాభి నయము, తరువాత వాచికాభినయము వివరింపబడెను (పుటలు 655 నుండి 665 వరకును). ఇంక రెండవ భాగమందు కామోపచారము (ఆభ్యంతరము) సవిస్తరముగా వివరింపబడెను. (పుటలు 666 నుండి 684 వరకును).

### 2. ఆరు విధములగు శారీరాభినయము

ఆంగికాభినయము మూడు విధములని 8వ అధ్యాయమందు చెప్పబడెను (పుట 268, అందలి 5వ అధస్సూచికను చూడవలెను) ఈ అధ్యాయమందు శారీరాభినయము ఆరు విధములని చెప్పబడెను. ఈ రెండు అధ్యాయములందలి విషయములును సమన్వయింపబడిన అభినవభారతీభాగము లభించకపోవుట విచారకరము.

ఇందలి శాఖా-అంకురాభినయములు రెండును ఆంగికాభినయమునకు సంబంధించి యున్నవి. సాధారణముగా నృత్తము అంగవిక్షేపాత్మకమైనదని గుర్తించియున్నాము. ఇందు తాల-లయలును, అంగహారములును ప్రధానములు. ఇంక నృత్యమునందు ఒక పాటను పాడుచు అర్థమును అభినయించుట జరుగును; ఈ అర్థాభినయమంతయును 'శాఖ' అగును. ఇంక అంకురమనునది ప్రత్యేకభావములను ప్రత్యేకాంగములచే వ్యక్తముచేయుట కాగలదు.

ఈ అధ్యాయమందు చెప్పబడిన శారీరాభినయమందు వాచిక-ఆంగిక-సాత్త్వికాభి నయములు మూడును కలిసియున్నవి. వాక్-చేష్టలు రెండును కలిసియున్నచోట అవి రెండును ఒకేసారి ప్రయుక్తములు కావచ్చును, లేదా ఒకటి ముందుగాను ఇంకొకటి తరువాతను ప్రయుక్తము కావచ్చును. వాచిక-ఆంగికములు రెండును ఒకేసారి ప్రయుక్తము

లయినచో అది 'వాక్యాభినయ' మనబడును. ఆంగికాభినయము ( action) ముందు ప్రయుక్తమగుట 'సూచాభినయ' మనబడును. వాచికము ముందు ప్రయుక్తమై పిమ్మట ఆంగిక-సాత్త్వికములు ప్రయుక్తమగుట 'అంకుర' మనబడును. ఇందులకు "నను శకుంతలాయాః.. " అనెడి అభిజ్ఞాన శాకుంతల శ్లోక ముదాహరణము. 'శాఖ' అనునది అంగముల సాముదాయికాభినయమని చెప్పవచ్చును నాట్యాయితమును 'గర్భాంక' మనవచ్చును ; అనగా ఒక రూపకమం దింకొక రూపకము ప్రదర్శింపబడుట. ఇదియును వాచికాంగికముల సమ్మిశ్రమమే; అనగా వాక్యాభినయమే. ఇంక రంగస్థలమందలి ఒక పాత్రచే ప్రభావితమై ఇంకొక పాత్ర చేయు అభినయము 'నివృత్త్యంకుర' మనబడును. అంకుర- సూచాభినయములు రెండును కొంత సన్నిహితములైనవి. సూచాభినయమందు మొదట అభినయమును పిమ్మట వాచికమును ప్రయుక్తములగుచుండగా అంకురమందు మొదట వాచికమును పిమ్మట అభినయమును ప్రయుక్తములగును.

శాఖాభినయమనగా ఏమో భరతుడు స్పష్టముగా పేర్కొనలేదు. ఇతర ఆలంకారికులను బట్టి 8 వ అధ్యాయమందును, ఇచ్చటను వివరించియున్నాను.

ఈ సందర్భమున 'మాళవికాగ్నిమిత్ర'మందలి పరివ్రాజికా శ్లోకము పరిశీలనార్హము. మాళవికానృత్యమును పరివ్రాజిక మెచ్చుకొను సందర్భమిది (2 వ అంకము - 8 శ్లో.)—

అంగై రంతర్నిహితవచనైః సూచితః సమ్యగర్థః, పాదన్యాసోలయమనుగత స్తన్మయత్వం రసేషు ।
శాఖాయోనిర్మృదురభినయ స్తద్వికల్పానువృత్తౌ, భావో భావం నుదతి విషయాద్రాగబంధః స ఏవ ॥

—వచనము లంతర్నిహితములుగానున్న అంగములచే అర్థము చక్కగా సూచింపబడినది. పాదన్యాసములు లయానుగతములుగానున్నవి. రసవిషయమున తన్మయత్వము కలదు. శాఖాభినయము మృదువుగానున్నది. అభినయమందలి భేదములనుబట్టి భావభేదములు చక్కగా వ్యక్తములైనవి. ఆదినుండి అంతమువరకును ఒకే రకముగా రక్తి కట్టినది.

పై శ్లోకమందు మొదటి పాదమున అంకురాభినయమును, రెండవ పాదమున నృత్తమును సూచింపబడినవి. ఇంక మూడవ పాదమందు శాఖాభినయము స్పష్టముగా పేర్కొనబడెను.

గణదాసుడు మాళవికకు 'పంచాంగాభినయము' నేర్పినట్లు మాళవికాగ్నిమిత్రమందే కలదు. [ప్రథమాంకము - మిశ్రవిష్కంభాంతమందు]—

కరాభ్యాం చరణాభ్యాం చ శిరసా చాభినీయతే ।
యత్రవ స్త్వితి విజ్ఞేయో పంచాంగాభినయో హి సః ॥

—"రెండు చేతులు, రెండు పాదములు, శిరస్సు అనెడి ఐదు అంగములతోను 'వస్తువు' ఎచ్చట అభినయింపబడునో అది పంచాంగాభినయ మనబడును" అని నీలకంఠుడు ప్రమాణమును పేర్కొనెను.



కాని పంచాంగాభినయ మనగా "ప్రేరణ" మని కాటయవేముడు వ్యాఖ్యానించెను. "నృత్తరత్నాకర"మందు దాని లక్షణము క్రింది విధముగానున్నట్లుత దుదాహరించెను. [శ్రీ కాలే ప్రకటించిన ముద్రణము - పుట 9]

నృత్తం తథా చ కైవారో ఘ(మ)ర్మరో జాగరం (దాగడం) తథా ।
గీతం చేతి సమాఖ్యాతం ప్రేరణస్యాంగపంచకమ్ ॥

త్రిభిస్త్వే తత్రప్రయోజ్యం స్యాత్కైవారం జాగరం (దాగడం) వినా ।

—నృత్తము, కైవారము, ఘర్మరము, జాగరము, గీతము అనునవి అయిదును ప్రేరణము యొక్క అంగములు. కైవార - జాగరములను విడిచి తక్కిన మూడింటితో కూడ ప్రేరణమును ప్రయోగించవచ్చును.

"చిత్రాభిర్భూహ స్తపాదై రంగై శ్చేష్టాది సమ్మితః ।
పాత్రాద్యవస్థాకరణం పంచాంగాభినయో మతః ॥"

అని ఇంకొకరు పేర్కొనిరట.

ఈ పై భేదములకును భరతుడు చెప్పిన భేదములకును సంబంధములేదు. 'పంచాంగాభినయ' మనునప్పుడు కాళిదాసు వేటిని ఉద్దేశించెనో తెలియదు.

3. నాయికానాయక - భేదములు.

**నాయికలు :** సంస్కృతమునందు సాధారణముగా స్త్రీలు ప్రాకృతము మాటాడుచుండుటచేతను, స్త్రీలును నీచులును సాధారణముగా సమాసమందు కలిపి చెప్పబడుచుండుటచేతను ఆలంకారికులు స్త్రీలందరిని అధమపాత్రలనుగానే నిర్దేశించినట్లు చాలమంది తలచుచున్నారు. ఆ అభిప్రాయము సరియైనది కాదు. పురుషులలో ఉత్తమ-మధ్యమ-అధమ భేదములున్నట్లే స్త్రీలలోను ఉత్తమ-మధ్యమ-అధమ భేదములు కలవు. ఈ విషయము 'స్త్రీ పురుషులప్రకృతి భేదములు' అనెడి 24వ అధ్యాయమందు స్పష్టము కాగలదు.

ఉత్తమ - మధ్యమ - అధమములనెడి ఈ విభజనము స్వభావమును బట్టి జరిగినది. స్వభావము లేదా శీలమునుబట్టి స్త్రీలు 23 రకములుగానుందురని ఇంకొక విభాగము తరువాత చెప్పబడినది. భరతుని తరువాతి ఆలంకారికులలో శారదాతనయుడొక్కడే ఈ భేదములను మరల వివరించియుండెను. తక్కినవారీ ప్రశంస చేయలేదు. ఈ ఇరువదిమూడు భేదములును పైమూడు స్థూలభేదములకును చెందియున్నవి.

ఇంక శృంగారరసదృష్టితోఅష్టవిధనాయికావస్థాభేదములను భరతుడు పేర్కొనియుండెను. అర్వాచీనాలంకారికులు ఇందింకను ప్రభేదములను వివరించియున్నారు. కామశాస్త్రకారులు మరికొన్ని భేదములను పేర్కొనియున్నారు—పద్మిని, హస్తిని, చిత్తిని, శంఖిని. [పద్మినీజాతి స్త్రీ చిత్రపటమును పుట 689 లో చూడవలెను].

ధనంజయుడు వివరించిన షోడశనాయికాభేదములను జి. సి. ఓ. హాస్ ఒక పట్టికరూపములో వివరించెను; దానిని ప్రక్కపుటలో ఉదాహరించుచున్నాను. [దశరూపకాంగ్లానువాదము, 1912-పుట 149]. ఆ పట్టికలో కన్పట్టు అంకెలు షోడశ (16) నాయికా సంఖ్యను నిర్దేశించుచున్నవి—




నాయకులు : కామోపచారమున ప్రేయసీ ప్రియుల సమాగమమునందు స్త్రీలు పురుషులను సంబోధించు విధములు పదునాలుగు చెప్పబడినవి. ఈ సంబోధనములు ఆ పురుషుల స్వభావములను సూచించునవియగుటచే భరతుడు 14 రకముల పురుషులను సూచించెనని చెప్పవచ్చును. వీరందరును ఉత్తమ-మధ్యమ-అధమ భేదములుగా విభక్తమైపోదురు. అర్వాచీనాలంకారికులు మరికొన్ని భేదములను పేర్కొని యున్నారు—

పతి, ఉపపతి, వైశికుడు—ఇది ఒక విధమగు విభజనము. అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు—ఇది ఇంకొక విధమగు విభజనము. ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరలలితుడు, ధీరశాంతుడు—ఇది మరియొక విభజనము; దీనిని భరతుడు 24 వ అధ్యాయమందు వివరించెను. భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడు—ఇది కామసూత్రకారాదుల విభజనము. [పాంచాలుని చిత్రమును ప్రక్కపుటలో చూడవలెను].

ఇంకొక విధమైన పురుషభేదవిభాగము చేయుచు భరతుడు కామతంత్రమందలి పురుషులు ఐదు విధములుగానుందురని 23 వ అధ్యాయమందు పేర్కొనెను—చతురుడు, ఉత్తముడు, మధ్యముడు, నీచుడు, సంప్రవృత్తకుడు.

ఈ నాయకులకును, పైన చెప్పిన నాయికలకును వేర్వేరుగా సఖులుందురు; వారికిని వేర్వేరు పేర్లు కలవు. నాయక సహాయులను 23 వ అధ్యాయము చివర 2 వ విశేషాంశమునందు వివరించియున్నాను.

---


పాంచాల పురుషుడు


పద్మినీజాతి స్త్రీ

# అధ్యాయము 23[1]

## బాహ్యోపచారము[2]

[కాశీముద్రణమునందు 25 వ అధ్యా—79 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 23 వ అధ్యా—73 శ్లోకములును, బరోడాముద్రణము నందు 23 వ అధ్యా—80 శ్లోకములును కలవు.]

వైశికుడు

ఎవనియందు కళలన్నియును విశేషించియుండునో ఆతడు 'వైశికు'డనబడును; లేదా వేశ్యోపచారమందు సాధువు అగు నతడు 'వైశికు' డనబడును[3]. మరియు సర్వకళోపేతుడును, సర్వశిల్పవిచక్షణుడును, స్త్రీ చిత్తగ్రహణాభిజ్ఞుడును అయిన పురుషుడు 'వైశికు'డగును.

*వైశికగుణములు :* స్వశరీర సముత్థములగు అతని ముప్పదిమూడు[4] గుణములను స్థూలముగా రెండువిధములు— ఆహార్యములు (శాస్త్రజ్ఞతాదులు), సహజములు (రూపలావణ్యాదులు)—

శాస్త్రవిదుడు, శిల్పసంపన్నుడు, రూపవంతుడు, విక్రాంతుడు, ప్రియదర్శనుడు, ధృతిమంతుడు, వయో - వేష - కులాన్వితుడు, సురభి, మధురస్వభావుడు, త్యాగి, సహిష్ణువు, అవికత్థనుడు, అశంకితుడు, ప్రియభాషి, చతురుడు, శుభదుడు, (సుభగుడు-కాశీ ముద్రణపాఠము), శుచి, కామోపచారకుశలుడు, దక్షిణుడు, దేశ-

1. ఈ భాగము కాశీముద్రణమునందు పంచవింశాధ్యాయము; బొంబాయి, బరోడా ముద్రణములందు మాత్రము త్రయోవింశాధ్యాయము.

2. ఇది కాశీముద్రణ పాఠము. 'వైశికాధ్యాయ' మని బొంబాయిముద్రణ పాఠము. అభినవగుప్తుడును ఇట్లే పేర్కొనెను. బరోడాముద్రణమునందు పేరు లేదు.

3. 'కళ లన్నియును విశేషించియుండుట' అనగా సర్వకళోపేతుడని అర్థము. వేశము=వేశ్య లేక వేశ్యోపచారము ; దానియందు సాధువు (నిపుణుడైనవాడు) వైశికు డనబడును. కళలకు విశేషమును కలిగించువాడు 'వైశికు' డనబడును. (విశ్ = విశేషమును కల్గించు) అనగా సమస్తకామములను అతివైదగ్ధ్యమువలన విశేషములనుగానొనర్చువాడు వైశికు డనబడును [అభినవభారతి - 3 వ సం - పుట 282]. కళలు అరువదినాలు గని ప్రసిద్ధము. జైనులు 72 కళలను పేర్కొనిరి.

4. ఆహార్యము లనగా సంపాదించుకొన్నవి; ఇంక సహజములు పుట్టుకతోవచ్చినవి. ఆలంకారికులు మహాకావ్యనాయకగుణములను వివరించియున్నారు. వాటికిని, వైశిక గుణములకునుగల భేద-సామ్యములను గమనించవలెను.



కాలవిదుడు, దీనవాక్యరహితుడు, స్మితవంతుడు, వాగ్మి, దక్షుడు, ప్రియంవదుడు, స్త్రీలుబ్ధుడు, సంవిభాగి, శ్రద్ధధానుడు (శ్రద్ధాళువు), దృఢస్మృతి, (దృఢవ్రతుడు-కాశీముద్రణ పాఠము), గమ్యావిషయమందును అవిస్రంభి (తొందరపాటు లేనివాడు), మాని అయినవాడు 'వైశికు' డనబడును.

వైశికునివయస్యుడు

అనురక్తుడు, దక్షుడు, దక్షిణుడు, శుచి, ప్రతిపత్తిమంతుడు, చిత్రాభిధాయి (వక్రోక్తి కుశలుడు) అయినవాడు వైశికుని 'వయస్యుడు' గానుండవలెను.[5]

దూతికలు

విజ్ఞానగుణసంపన్న, కథిని (బృహత్కథాదులందలి కథలు తెలిసినదై చక్కగా చెప్పగలుగునది), లింగిని (చిత్రకారిణి), ప్రాతివేశ్య (పొరుగింటి స్త్రీ), సఖి, దాసి, కుమారి, కారుశిల్పిని (కుమ్మరిది, కంచరిది మొ॥), ధాత్రి, పాషండిని (వ్రతస్థురాలు), రంగోపజీవిని (చారణ స్త్రీ లేదా రజక స్త్రీ) అనువారు దూతికలుగానుండుటకు తగినవారు.

*దూతీగుణములు :* కాముకుని ప్రోత్సాహనమందు (సంముఖీకరణమందు) కుశల, మధురకథాయుత, దక్షిణ, కాలజ్ఞ, లడహ (ప్రగల్భ), సంవృతమన్త్ర (రహస్యమును దాచగలది) అయిన స్త్రీని 'దూతి'గా పంపవలెను. జడత్వము, రూపసంపద, అర్థము (ధనము), ఆతురత కల వ్యక్తిని దూతగా కాని, దూతికగా కాని ఎన్నడును నియోగించరాదు.[6]

*దూతీకృత్యము :* అనేక కారణములను పేర్కొని ప్రోత్సాహనముచేయుట, సందేశమును తు-చ తప్పకుండచెప్పుట, సరిగా ఆమె భావమునుప్రదర్శించుట అనునవి దూతిక చేయవలసిన ముఖ్యమైన పనులు. మరియు నాయికయొక్క కుల-భోగ-ధనాధిక్యములను అధికముగా పొగడి, కామమును నివేదించి, సమాగమోపాయములను సూచింపవలెను. అకామప్రవృత్త లేదా క్రుద్ధురాలు అయిన స్త్రీతో సంగమము

5. వైశిక (నాయక) సహాయులనుగూర్చి ఈ అధ్యాయము చివర 2 వ విశేషాంశమందు వివరించియున్నాను.

6. ప్రోత్సాహనమున కుశల అనుచో ప్రోత్సాహన శబ్దమున రెండు ప్రేరణార్థకములు కలవు—నాయికచే ప్రోత్సహింపబడి నాయకుని ప్రోత్సహించుటయందు కుశల అని అర్థము. దూతి జడురాలైనచో ప్రత్యుత్పన్నమతిసాధ్యములైన పనులను చేయజాలదు. రూప-అర్థయుక్త అయినచో స్వార్థమునే ఆశించును. ఆతుర అయినచో రతినిరపేక్షకలదై కంటబడుటయే జుగుప్సాహేతువు కాగలదు. [అభినవభారతి - 3 వ సం - పుట 284]

కలిగించరాదు. ఉపాయరహితముగా సంగమమును కలిగించరాదు. ప్రథమసమాగమమును (గాంధర్వవివాహ-వేశ్యా-పునర్భూసంగమములను) రాత్రిసమయమున జరుగు ఉత్సవమున, ఉద్యానమున, మిత్రవేశ్మమున, ధాత్రీగృహమున, సఖిగేహమున, శూన్యాగారమున ఏర్పాటుచేయవలెను. జబ్బుగా ఉన్నవారిని చూడవలెనన్నట్లు లేదా ఆహ్వానముచే వెళ్ళినట్లు మిషనుకల్పించి, విధిపూర్వకముగా, ఉపాయసహితముగా ప్రథమసమాగమమును కల్గించవలెను.

అనురక్త

సమాగమము కలిగినపిమ్మట ఆకారమును బట్టియు, కామచిహ్నములను బట్టియు, ఆమె తనయందు అనురక్తయో, విరక్తయో గుర్తించవలయును. స్వభావభావాతిశయముచేతనే మదనాశ్రితయై (సురతమందు నఖక్షతాదుల నతిశయముగా సహించుట), నిభృత (మదనార్దియై అనిభృత-అని కాశీముద్రణపాఠము) లీలనుకావించు స్త్రీ 'మదనాతుర' అని తెలియవలెను.

నాయకుని గుణములను సఖులకు వర్ణించి చెప్పుట, వానికి స్వీయధనమును పంపుట, వాని మిత్రులను పూజించుట, వాని శత్రుజనమును తానును సదా ద్వేషించుట, సఖులు వానియొద్దకు రాకపోక లొనర్చుచో చాల సంతోషించుట (వాని సమాగమమును కోరుట, వానిని చూచినచో అధికముగా సంతోషించుట-కాశీముద్రణ.పాఠము), వాని కథలతో తృప్తిపొందుట, వానికొరకు సస్నేహముగా నిరీక్షించుట, ఆతడు నిదురించిన తరువాత తాను నిదురించుట, ఆతడు చుంబించిన తానును ప్రతిచుంబన మొనర్చుట, ఆతడు మేల్కొనుటకు ముందే తాను మేల్కొనుట, వానితోపాటు క్లేశములను సహించుట, వానితోపాటు ఉత్సవములందు మోదమును వ్యసనమునందు దుఃఖమునుపొందుట(సుఖ-దుఃఖములందుసమత్వముకలిగియుండుట, క్రోధమును పొందకుండుట—కాశీముద్రణపాఠము) అనెడి గుణములతో కూడియున్న స్త్రీ 'అనురక్త' అని చెప్పబడును.

విరక్త

చుంబించినను తాను తిరిగి చుంబింపకపోవుట (చుంబించినచో ముఖమును కడుగుకొనుట—కాశీముద్రణపాఠము), అనిష్టకథలను చెప్పుట, ప్రియము చెప్పినను కోపించుట, వాని శత్రుజనమును ఆదరించుట, పరాఙ్ముఖియై శయనించుట, వాని కంటెముందుగానే శయనించుట, మహోపకారము (మహోపచారము-కాశీముద్రణపాఠము)చే కూడ సంతుష్టినొందకపోవుట, క్లేశమును సహింపకపోవుట, అకారణముగా కోపించుట, వానిని కన్నెత్తి చూడకపోవుట, వానిని అభినందించకుండుట అనెడి గుణములుకల స్త్రీ 'విరక్త' అని గ్రహించవలెను.



*విరక్తి కారణములు :* స్త్రీ కాని పురుషుడు కాని ఆదిలో అనురక్తి కలిగియున్నను, పిమ్మట విరక్తినొందుటకు గల కారణములు క్రిందివిధముగానుండును—దారిద్ర్యము, వ్యాధి, దుఃఖము (అపత్యమరణాదులు), పారుష్యము, దుశ్శ్రవత్వము (చారి చెడుగును వినుట), ప్రవాసగమనము, అతిలోభము, అతిక్రమము (గౌరవమును లెక్కచేయకుండుట), అత్యభిగమము (శీలమును కాపాడుకొనలేకపోవుట), విప్రియచేష్టలు.

*విరక్తహృదయగ్రహణోపాయములు :* అర్థప్రదర్శనము (నాకు డబ్బు ఉన్నదని చెప్పుట), ఉపదానము (డబ్బు ఇచ్చుట), ఉపన్యాసము (తన్ను మరియొక స్త్రీ ప్రేమించుచున్నదని చెప్పించుట), వ్యాధిత (విచిత్రములగు ఆధులు కల్గియుండుట), విచిత్రాభిప్రాయమును ప్రదర్శించునట్లు సూచించి చెప్పకయే ఏదో వ్యాజముతో ఆమెయొద్దనుండి లేచి దూరముగా వెడలుట, తాను మరియొక స్త్రీని ప్రేమించుచున్నట్లు చెప్పించుట అనునవి విరక్తహృదయగ్రహణోపాయములు.

మదనాశ్రయవిషయములందు భావగ్రహణసమర్థములైన కార్యములవలన స్త్రీలు సంతుష్టలై పురుషులకు వశలగుదురు. (వారికి కోపమురాదు, ఒకవేళ కోపనులైనచో శాంతి పొందుదురు—కాశీముద్రణపాఠము). లుబ్ధురాలిని అర్థప్రదానము చేతను, పండితురాలిని కళాజ్ఞానముచేతను, చతురను లడహత్వము (=ప్రాగల్భ్యము; క్రీడనత్వము— కాశీముద్రణపాఠము) చేతను, కోపశీలను అనువృత్తి చేతను, పురుషద్వేషిణిని ఇష్టకథా కథనములచేతను, బాలను ఉపక్రీడనకముల (ఆటవస్తువుల) చేతను, భీరురాలిని ఆశ్వాసనముల (బుజ్జగించుట) చేతను, గర్వితను సేవనము (పాదస్పర్శనాదుల)- చేతను, ఉదాత్తను విస్మయహేతువులగు శిల్పదర్శనముల చేతను లోబరచుకొనవలయును*

వేశ్యల ప్రకృతులు

ఉత్తమ-మధ్యమ-నీచ భేదములచే వేశ్యల ప్రకృతులు[7] మూడువిధములు.

1. ఉత్తమప్రకృతి— తనకు విప్రియము నాచరించుచున్న ప్రియునిగూడ అప్రియము పలుకనిది, దీర్ఘరోషము లేకుండునది, కలావైచక్షణ్యము కలిగియుండునది. శీల-శోభా-కులాధికులగు పురుషులచేతకూడ కోరబడునది, కామతంత్రమందు

---

* [కాశీముద్రణమునందు 25 వ అధ్యా—1-35 శ్లో, బొంబాయిముద్రణమునందు 28 వ అధ్యా—1-32 శ్లో, బరోడాముద్రణమునందు 23 వ అధ్యా—1-34 శ్లో]

7. ఈ విభజనము సర్వస్త్రీసామాన్యము కాదు ; ఇది కేవలము వేశ్యాస్త్రీల విషయమే. డా. ఘోష్ ఈ భేదమును గుర్తించినట్లు లేదు. స్త్రీలందరి విషయమును 24 వ అధ్యాయములో చెప్పబడును.

కుశల, దక్షిణ, రూపశాలిని, తగినంత కారణమున్నప్పుడే రోషమును చెందునది, ఈర్ష్యారహితముగా మాటాడునది, కార్య-కాల-విశేష జ్ఞానమును, రూపమును కలిగియుండునది 'ఉత్తమప్రకృతి' అనబడును.

2. మధ్యమప్రకృతి— పురుషులను వలచి వలపించుకొను నేర్పుకలది, కామోపచారముల నెరింగియుండునది, ప్రతిపక్షమును గూర్చి అసూయచెందునది, ఈర్ష్యాతుర, అనిభృత, క్షణక్రోధ, క్షణప్రసాద, గర్విత అగునది 'మధ్యమప్రకృతి' అనబడును.

3. అధమప్రకృతి — అస్థానకోపన, దుశ్శీల, అతిమానిని, చపల, పరుష స్వభావ, దీర్ఘరోష అగునది 'అధమప్రకృతి' అనబడును.

యౌవన భేదములు

స్త్రీలందరియందును యౌవనభేదములు నాలుగు కలవు— ప్రథమ యౌవనము, ద్వితీయ యౌవనము, తృతీయ యౌవనము, చతుర్థ యౌవనము.[8] శృంగారాశ్రయములగు నేపథ్య-రూప-చేష్టా-గుణములచే ఈ యౌవనభేదములు వ్యక్తమగునని తెలియవలెను.

1. ప్రథమయౌవనము— పీనములైన (బలసిన) ఊరు-గండ-జఘన-అధరములను, కర్కశములు రతిమనోజ్ఞములు అయిన స్తనములను కలిగిన శృంగార సముత్సాహమగు వయస్సు 'ప్రథమయౌవన' మనబడును.

నవయౌవనవతియగు నారి అధికముగా క్లేశమును (దంతక్షతాదులను) సహింపలేనిదియును, సౌఖ్యగుణములందు ఆసక్తురాలును అగును.

2. ద్వితీయయౌవనము— అవయవసంపూర్తితో కూడిన గాత్రము, పీన పయోధరములు, నతమధ్యము కలిగిన కామసారభూతమగు వయస్సు 'ద్వితీయ యౌవన' మనబడును.

ద్వితీయయౌవనమందు కాంత కొంచెముగా మాన-క్రోధ-మాత్సర్యములను చూపునదియును, క్రోధమునందు తూష్ణీంభావమును వహించునదియును అగును.

---

8. 20 సంవత్సరముల వరకు ప్రథమయౌవనము, 20-30 సంవత్సరములమధ్య ద్వితీయయౌవనము, 30-40 సంవత్సరములమధ్య తృతీయయౌవనము, 40-50 సంవత్సరములమధ్య చతుర్థయౌవనము. మరి కొందరు 16 సంవత్సరముల వరకు ప్రథమయౌవనము, 16-25 సంవత్సరములమధ్య ద్వితీయయౌవనము, 25-35 సంవత్సరములమధ్య తృతీయయౌవనము, 35-45 సంవత్సరములమధ్య చతుర్థయౌవనము అని చెప్పుదురు. [అభినవభారతి - 3 వ సం - పుట 240]



3. తృతీయయౌవనము—సర్వాంగశోభాయుతము, రతికరణోత్పాదము (ఇతరులలో రతిని రగుల్కొల్పునది), రతిగుణాఢ్యము, కామాప్యాయితశోభము అగు వయస్సు 'తృతీయయౌవన' మనబడును.

తృతీయయౌవనముగల వనిత రతిసంభోగదక్షయు, ప్రతిపక్షమం దసూయ వహించునదియు, రతిగుణాఢ్యయు (కామతంత్రప్రయోగప్రగల్భయు), అనిభృత-గర్వితచేష్టాయుతయు అగును.

4. చతుర్థయౌవనము— నవయౌవనమును, ద్వితీయ-తృతీయ యౌవనములును గతించిన పిమ్మట వచ్చునదియును, శృంగారశత్రుభూతమును అగునది 'చతుర్థయౌవన' మనబడును.

చతుర్థయౌవనమందుండు స్త్రీ నిర్మాంసములైన గండ - జఘన - అధర - స్తనములు, గళితగాత్రలావణ్యము కలదై కామమునందు నిరుత్సాహము కలిగి యుండును.

చతుర్థయౌవనమందలి స్త్రీ చిత్తగ్రహణ సమర్థయు, కామాభిజ్ఞయు అయి నను అమత్సరోపేతయును, ఎల్లప్పుడును అవిరహమునే కోరునదియును అగును.

ఇట్లు నాటకమునందు స్త్రీల యౌవనభేదములు నాలుగు విధములుగా ఉండును.

కామతంత్రమందలి పురుషుల భేదములు

ఇంక కామతంత్రమందలి పురుషుల భేదములను వివరింతును. స్త్రీ సంప్రయోగ (సమాగమ) విషయమందు చతుర - ఉత్తమ-మధ్యమ - నీచ - సంప్రవృత్తక (సంప్రవృద్ధ—కాశీముద్రణ పాఠము) భేదములచే పురుషులు అయిదు విధములుగా ఉందురు—

1. చతురుడు—సుఖ-దుఃఖములందు సముడు, క్లేశమును సహింపగలవాడు, ప్రణయక్రోధప్రసాదనకుశలుడు, నాయిక ఇష్టమును అనుసరించువాడు, అర్థి, దక్షుడు అయిన పురుషుడు 'చతురు' డనబడును.

2. ఉత్తముడు—స్త్రీలకు విరాగము జనించునట్లుగా కించిత్ విప్రియను కూడనొనర్పనివాడు (అవిప్రియకారి, ధీరోదాత్తుడు, ప్రియంవదుడు, మాని - అని కాశీముద్రణపాఠము). అజ్ఞాతేప్సితహృదయుడు (తన మనసులోని కోరికను తెలియకుండ నుంచువాడు, గంభీరుడు), స్మృతిమంతుడు, ధీమంతుడు, మధురస్వభావుడు, త్యాగి, రాగి అయినను మదనవశుడు కానివాడు, స్త్రీచే అవమానితుడైనప్పుడు విరక్తుడగువాడు 'ఉత్తము' డనబడును.

3. మధ్యముడు— తాను మధ్యస్థుడుగా ఉండి సర్వార్థములచేతను స్త్రీల భావగ్రహణము చేయువాడును, కించిద్దోషము కన్పట్టినను విరక్తుడగువాడును,

యుక్తకాలమందు దాతయును, అవమానితుడైనను అధికక్రోధమును చెందని వాడును, వ్యలీకమాత్రము (అపవాదు) చేతనే విరక్తుడగువాడును 'మధ్యము' డనబడును.

4. అధముడు—స్త్రీచే అవమానితుడైనను నిర్లజ్జతో, అవికృతాస్యముతో ఆమెను చేరువాడును, అన్యనరసంక్రాంతయైనను తన స్నేహమును మరలింపలేని వాడును, మిత్రులచే వారింపబడినను ఆమె క్రొత్తగా చేసిన వ్యలీకము తనకు ప్రత్యక్షముగా కన్పట్టినను కూడ ఆమె నింతకుముందుకంటె ఎక్కువగా ప్రేమించు వాడును 'అధము' డనబడును.

5. సంప్రవృత్తుడు— భయ-అమర్షములను లెక్కచేయనివాడు, మూర్ఖ స్వభావుడు, ప్రసక్తహాసుడు (వెట్టినవ్వు నవ్వువాడు), ఏకాంతదృఢగ్రాహి (మొండి పట్టుదల కలవాడు), కామతంత్రమునందు నిర్లజ్జుడు, రతికలహసంప్రహారములందు అకర్కశుడు (కర్కశుడు-అని కాశీ ముద్రణపాఠము), స్త్రీలకు క్రీడనీయకమైన వాడును 'సంప్రవృత్తకు' డనబడును.*

ఉపాయములు

స్త్రీలు నానాశీలములు, నిగూఢములైన అభిప్రాయములు, కోరికలు కలవారుగానుందురు. యథాసత్త్వముగా (వారి ఆశయమేమో నిపుణముగా గుర్తించి) పురుషులు వారిని చేరవలెను. ఇట్లు స్త్రీయొక్క భావములను (అనురాగ-విరాగములను) తెలిసికొనిన పిమ్మట కామతంత్రానుసారముగా ఆయా ఉపక్రమము (ఉపాయము) లతో పురుషుడు స్త్రీని ఉపచరించవలెను. ఆ ఉపక్రమము సామ-దాన-భేద-దండ-ఉపేక్షా భేదములచే ఐదు విధములు—

1. సామము— "నేను నీవాడను, నీవు నాదానవు, నీకు దాసుడను, నీవే నా ప్రియవు" అనుచు ఆత్మోపక్షేపణము (నిజభావప్రదర్శనము) చేయుట 'సామ' మనబడును.

2. దానము— తన విభవమునుబట్టి ఆయా సమయములందు (అనగా నియతముగాకాక నిమిత్తవిశేషకృతములైన ప్రమోద-వ్యసనాది నిబంధనములందు) ఏదో ఇతరవ్యాజముతో స్త్రీకి ధనమును బాగుగా ఇచ్చుచుండుట 'దాన' మనబడును.

3. భేదము— ఉపాయసహితముగా ఆమెయొక్క వేరొక ప్రియుని దోషములను ప్రదర్శించుట 'భేద' మనబడును.

*[కాశీముద్రణమునందు 25 వ అధ్యా—36–63 శ్లో. బొంబాయిముద్రణమునందు 23 వ అధ్యా-33-57 శ్లో. బరోడాముద్రణమునందు 23వ అధ్యా—35–62 శ్లో.]



4. దండము— బంధన-తాడనములు 'దండ'మనబడును.

మధ్యస్థను సామముచేతను, లుబ్ధను దానముచేతను స్వీకరించవలెను. అన్యావబద్ధభావ అయిన స్త్రీయెడ భేదమును ప్రయోగించవలెను. అన్యభావసముత్థితయై దుష్టాచారమును (దేశాంతరపలాయనము, పురుషాంతరగృహనివాసము మొ॥) ఆరంభించినచో మృదుతాడన-బంధనములచే దండమును ప్రయోగించవలెను. ఇప్పట్ల త్రాడుతో కాని, వేణుదళముతో కాని కొట్టవలెను.

5. ఉపేక్ష—సామాదులను యథాక్రమముగా ప్రయోగించినను వశురాలు కానిచో బుద్ధిమంతు డామెను ఉపేక్షించవలెను.

ముఖరాగ-నేత్ర-భావ-చేష్టితములనుబట్టి స్త్రీ తనయెడ ద్వేషియో లేదా ప్రేమకలదియో, లేదా మధ్యస్థయో తెలిసికొనవలెను. దివ్యలు, నృపకాంతలు (రాజుయొక్క భోగకాంతలు) కాక తక్కిన వేశ్యలెల్లరును-ప్రియులైనను ప్రియులు కాకున్నను-అర్థహేతువుచే పురుషుల నందరిని సేవించువారే అగుదురు. వేశ్యలు అంతకుముందు ద్వేషించినను, ధనమిచ్చిన తరువాత వానిపై ప్రేమను ఒలకపోయుదురు; అంతకుముందే ప్రియుడైనచో ఇప్పు డాతని ప్రియతమునిగా ఎన్నుదురు. అంతియేకాక దుశ్శీలుని సుశీలుడనియు, నిర్గుణుని గుణాఢ్యుడనియు వర్ణింతురు. ధనమిచ్చిన పురుషుని చూడగానే ఉత్ఫుల్లతారకలు కలవారై నేత్రములతోడనే నవ్వుచున్నట్లుందురు. మరియు భావ-రూప-గుణములచే ప్రసన్నముఖరాగయుక్తలుగా కన్పట్టుదురు (అనగా వేశ్యాహృదయము గుర్తింపరానిదని భావము).

కావున భావాభావములను గుర్తించి, కామతంత్రానుసారముగా, ఆయా ఉపక్రమములచే ప్రయత్నపూర్వకముగా పురుషులు స్త్రీలను ఉపచరించవలెను. కాష్ఠమునుండి అగ్నిపుట్టునట్లే ఉపచారబలముచేతను, విప్రలంభముచేతను స్త్రీలయందు కామము నిష్పన్నమగును.

పైని వివరింపబడిన విధముగా వైశికాశ్రయమైన ఈ వేశ్యోపచారమును యథాయోగముగా ప్రకరణ-నాటకములందు పాటించవలెను. ఇంక ప్రకృతుల లక్షణములను వివరింతును.*

త్రయోవింశాధ్యాయము సమాప్తము

*[కాశీముద్రణమునందు 25 వ అధ్యా—64–79 శ్లో. బొంబాయిముద్రణమునందు 23 వ అధ్యా—57–78 శ్లో. బరోడాముద్రణమునందు 23 వ అధ్యా-63–80 శ్లో.]

## విశేషాంశములు

### 1. కామోపచారము

ఆభ్యంతర-బాహ్య భేదములచే కామోపచారము రెండు విధములని 22 వ అధ్యాయమందు చెప్పబడెను (పుట 670). ఆభ్యంతర మనగా అంతఃపుర సంబంధి అయిన కామోపచారము. బాహ్యమనగా వేశ్యాగతమైన కామోపచారము. మొదటిది నాటకమందు రాజులచే అనుసరింపబడును. ఇంక రెండవది ప్రకరణగతమయియుండును. ఈ ఉపచారమును బట్టి స్త్రీలు కూడ ప్రధానముగా రెండు విధము లగుచున్నారు. కులీన 'ఆభ్యంతర' అనబడును; వేశ్య 'బాహ్య' అనబడును. ఈ రెండు భేదములు సమ్మిళితమైన స్త్రీ భేదమింకొకటి కూడ కలదు—కృతశౌచ అయిన వేశ్య 'బాహ్యాభ్యంతర' అనబడును. మృచ్ఛకటికమందలి 'వసంతసేన' ఇట్టిది.

22 వ అధ్యాయమందు ఆభ్యంతరకామోపచారము వర్ణింపబడెను; ఇంక ఈ అధ్యాయమందు బాహ్యకామోపచారము వర్ణింపబడినది. అందుచే ఈ 23 వ అధ్యాయము 22 వ అధ్యాయమునకు పుచ్ఛభూత మగుచున్నది; ఇదియును సామాన్యాభినయశేషమే.

ఒకనియందే అనురాగముకలదై వానికే కట్టుబడియున్న వేశ్యావిషయ మిందు వివరింపబడినదని చెప్పవచ్చును. ఆ ఒకడు ప్రకరణాదులందువలె విప్ర-వణిక్-అమాత్యాదులలో ఒకడు కావచ్చును; లేదా విక్రమోర్వశీయమునందువలె దివ్యవేశ్యాకాముకుడైన రాజు కావచ్చును; లేదా నాటకమందలి పతాకా నాయకుడు కావచ్చును.

ఇందు వేశ్యాభేదములు, వారు పురుషులను ఆకర్షించు విధము, వారిని పురుషులు వశముచేసికొను విధములు విపులముగా వర్ణింపబడినవి. శ్రీ లుడ్‌విక్ స్టెర్న్‌బాచ్ అనునతడు "గణికా-వృత్త-సంగ్రహము" (1953) అనెడి గ్రంథమునందు వేశ్యలనుగూర్చిన శాస్త్రవిషయములనెల్ల రాశీకరించెను.

ఈ అధ్యాయమందును, మరికొన్నిచోట్లను "కామతంత్ర" మను పేరు కలదు. ఇది 'కామసూత్ర' మగునో కాదో చెప్పజాలము. కామతంత్ర మనగా "కామోపచార" మనియు అర్థము చెప్పవచ్చును.

### 2. నాయక సహాయులు

నాయకసహాయులనుగూర్చి వాత్స్యాయనుడు క్రింది విధముగా వివరించెను—"దూతలను మూడు విషయములను బట్టి నిర్ణయించుకొనవలెను—(1) స్నేహము, (2) గుణము, (3) జాతి. చిన్నతనమునుండియు తనతో ఆటపాటలలో పాల్గొనుచు స్నేహభావమును **వెలిబుచ్చువాడును,** ఉపకారబుద్ధి కలవాడును, స్వభావమునందును వయస్సునందును తనతో సమానుడును, తనకు సహాధ్యాయుడును, తన రహస్యములు వానికి వాని రహస్యములు తనకు తెలిసెడి మైత్రికలవాడును, తనతోపాటు స్నేహితునివలెపెరిగిన దాదికుమారుడును, ఇంకను ఇటువంటివారును, స్నేహితులనబడుదురు. పితృపితామహుల కాలమునుండియు స్నేహము వృద్ధిపొందుచున్న వంశములో పుట్టిన సమవయస్కుడును, తనతో మనస్సు విప్పి మాటాడువాడును, వ్యభిచారదోషము లేనివాడును, తాను చెప్పినట్లు



వినువాడును, ఎట్టి సమయమందును తన్ను విడువనివాడును, ఆశలేనివాడును, ఇతరులకు స్వాధీనము కానివాడును, రహస్యములను వెల్లడిచేయని వాడును 'గుణము'నుబట్టి సహాయకులుగా ఉండదగినవారు. చాకలి, మంగలి, మాలాకారుడు, సుగంధద్రవ్యవ్యాపారి, పానీయముల నమ్మువాడు, భిక్షుకుడు, గోపాలకుడు, తములపాకులమ్మువాడు, కంసాలి, పీఠమర్దుడు, విటుడు, విదూషకుడు అనువారు 'జాతి'ని బట్టి సహాయకులుగా ఉండదగినవారు...చమత్కారముగను తెలివిగను మాటాడుట, అన్నివిషయములందును పైచేయిగా ఉండుట, నాయికా-నాయకుల ఇంగితములను గ్రహించుట, ఏసమయమందును తొందర లేకుండుట, ఇతరుల రహస్యములను తెలిసికొనగలిగియుండుట, ప్రతి పనిని చెప్పినట్లు చేయగలిగియుండుట, ఇతరులను వంచింపగలిగెడి నేర్పు కలిగియుండుట, ప్రదేశమును కనిపెట్టి జాగ్రత్తగా మెలగుట, కాలమునకనుసరించి ప్రవర్తించుట, కార్యనిర్వహణమునందు సూక్ష్మమార్గము నాలోచించి ప్రవర్తించుట, సులువుగా పనులను నేరవేర్చుట అనునవి ఉపాయపూరితములైన దూతగుణములు. ["వాత్స్యాయనీయం" - శ్రీ మేడిచర్ల ఆంజనేయ మూర్తిగారి అనువాదము - పుటలు 86-89 చూడవలెను]

### 3. కళలు

ఎవనియందు కళలన్నియును విశేషించియుండునో అతడు 'వైశికు' డనబడునని భరతుడు పేర్కొనియుండెను; కాని, ఆకళలెట్టివో మాత్రము తెలుపలేదు. "చతుష్షష్టి (64) కళలు" అని లోకప్రసిద్ధి కలదు. కామసూత్రాదులందు ఈ కళలు వివిధములుగా ఉదాహృతములైనవి. కామసూత్రమందలి చతుష్షష్టికళావివరణమును క్రింద ఉద్ధరించుచున్నాను. [శ్రీ మేడిచర్ల ఆంజనేయ **మూర్తి**గారి అనువాదము - పుటలు 42-49]

1. గీతము— ఇది స్వరప్రధానముగా, పదప్రధానముగా, లయప్రధానముగా మనస్సుయొక్క అవధానము ప్రధానముగా లోలోపల గానము చేయబడునదిగానుండును.
2. వాద్యము—ఇది తత - ఘన - అవనద్ధ - సుషిరభేదములచే నాలుగువిధములు.
3. నృత్యము—భావాభినయము.
4. ఆలేఖ్యము—చిత్రలేఖనము.
5. విశేషకచ్ఛేద్యము—తిలక - పత్రభంగాది రచన.
6. తండులకుసుమబలివికారములు—బియ్యపుపిండితో, పూలతో భూతతృప్తికొరకు పెట్టెడి ముగ్గులు.
7. పుష్పాస్తరణము—పూలశయ్యలను, ఆసనములను ఏర్పరచుట.
8. దశనవసనాంగరాగము—దంతములకు, వస్త్రములకు రంగులు అద్దుట.
9. మణిభూమికాకర్మ—మణులతో బొమ్మలను నిర్మించుట.
10. శయనరచనము—ఋతువులను శీతోష్ణపరిస్థితులను అనుసరించి శయ్యలను కూర్చుట.
11. ఉదకవాద్యము—జలతరంగిణి.
12. ఉదకాఘాతము—పిచికారుతో నీళ్ళు చిమ్ముట (వసంతకేళియందు).
13. చిత్రయోగములు—రకరకముల వేషములతో సంచరించుట.

14. మాల్యగ్రథనవికల్పములు—చిత్రవిచిత్రములైన పూల మాలికలనుకూర్చుట.

15. శేఖరకాపీడయోజనము—పూలతో కిరీటమును, తలకు చుట్టును అలంకరించు కొనెడి పూల నగిషీని కూర్చుట.

16. నేపథ్యయోగములు—అలంకరణవిధానములు.

17. కర్ణపత్రభంగములు—ఏనుగు దంతముతోను, శంఖములతోను చెవులకు అలంకారములను కల్పించుకొనుట.

18. గంధయుక్తి—అత్తరువులు మొదలగునవి చెసెడి నేర్పు.

19. భూషణయోజనము—సొమ్ములు పెట్టుకొను విధానము.

20. ఇంద్రజాలములు—చూపరుల కనులను భ్రమింపజేయుట.

21. కౌచుమారయోగము—సుభగంకరణాది యోగములు.

22. హస్తలాఘవము—చేతులలో ఉన్న వస్తువులను మాయముచేయుట.

23. విచిత్రశాకయూషభక్ష్యవికారక్రియలు—రకరకములతినుబండములనువండుట.

24. పానకరసరాగాసవయోజనము—పానకములు, మద్యములుచేయుట.

25. సూచీవానకర్మ—గుడ్డలు కుట్టుట.

26. సూత్రక్రీడ—దారములనుముక్కలుచేసి, కాల్చి, మరలమామూలుగాచూపుట.

27. వీణాడమరుకవాద్యములు—ఈ వాద్యములందు మంచి నేర్పు.

28. ప్రహేళికలు—సామాన్యార్థము మాత్రము పైకి కన్పడునట్లును, గంభీరమైన అర్థము గర్భితమగునట్లును కవిత్వము చెప్పుట.

29. ప్రతిమాల—కట్టుపద్యములు చదువుట.

30. దుర్వాచకయోగములు—విలాసముకొరకు క్లిష్టరచనలను చదువుట.

31. పుస్తకవాచనము—అర్థవంతముగా చదివెడినేర్పు.

32. నాటకాఖ్యాయికాదర్శనము—నాటకములకు, కథలకు సంబంధించినజ్ఞానము.

33. కావ్యసమస్యాపూరణము—పద్యములతో సమస్యలను పూరించుట.

34. పట్టికావేత్రవానవికల్పములు—పేముతో కుర్చీలు మంచములు అల్లుట.

35. తక్షకర్మ—విలాసముకొరకు బొమ్మలు మొదలగునవి చేయుట.

36. తక్షణము—కట్టుపనియందలి నేర్పు.

37. వాస్తువిద్య—గృహాదినిర్మాణశాస్త్రము.

38. రూప్యరత్నపరీక్ష—రూపాయలలోను, రత్నములలోను మంచిచెడుగులను పరిశీలింపగల్గుట.

39. ధాతువాదము—లోహములుండెడి ప్రదేశములను కనుగొనుట.

40. మణిరాగాకరజ్ఞానము—మణుల గనులను కనిపెట్టుట.

41. వృక్షాయుర్వేదయోగములు—చెట్లవైద్యము.

42. మేషకుక్కుటలావకయుద్ధవిధి—పొట్టేళ్ళు, కోళ్ళు, లావకపక్షులు మొదలగు వాటితో పందెములాడుట.

43. శుకసారికాప్రలాపనము—చిలుకలకు గోరువంకలకు మాటలు నేర్పుట.



44. ఉత్సాదన సంవాహన కేశమర్దనములందలి కౌశలము—ఒళ్ళుపట్టుట, పాదము లొత్తుట, తల అంటుట మొదలగువానియందలి నేర్పు.

45. అక్షరముష్టికాకథనము—అక్షరములను మధ్యమధ్య గుర్తించుచుకవిత్వము చెప్పుట.

46. మ్లేచ్ఛితకవికల్పములు—సాధుశబ్దమును కూడ అక్షరవ్యత్యయముచేసి అసాధు వని భ్రమింపజేయుట.

47. దేశభాషా విజ్ఞానము—బహు దేశభాషలను నేర్చియుండుట.

48. పుష్పశకటిక—పూలతో రథము, పల్లకి మొదలగునవి కట్టుట.

49. నిమిత్తజ్ఞానము—శుభ - అశుభ శకునములను తెలిసియుండుట.

50. యంత్రమాతృక—యంత్రనిర్మాణాదులు.

51. ధారణమాతృక—ఏకసంథాగ్రహణము.

52. సంపాఠ్యము—ఒకడు పఠించుచుండగా వానిననుసరించి పలువురు వల్లించుట.

53. మానసీక్రియ—మనస్సుయొక్క అవధానమునకు సంబంధించిన పనులు.

54. కావ్యక్రియ—కావ్యములను రచించుట.

55. అభిధానకోశచ్ఛందోవిజ్ఞానము—నిఘంటు - ఛందశ్శాస్త్రపరిజ్ఞానము.

56. క్రియాకల్పము—కావ్యాలంకారశాస్త్రపరిజ్ఞానము.

57. ఛలితకయోగములు—మారువేషముతో ఇంకొకవ్యక్తివలె చలామణిఅగుట.

58. వస్త్రగోపనము—వస్త్రములను మాయముచేయుట మొదలగుపనులు.

59. ద్యూతవిశేషములు—జూదములందలి విశేషములను తెలిసికొనియుండుట.

60. ఆకర్షక్రీడలు—జూదములందలి భేదములు.

61. బాలక్రీడనకములు—పిల్లల ఆటలయందలి నేర్పు.

62. వైనయికీజ్ఞానము—గజ - అశ్వశాస్త్ర పగిజ్ఞానము.

63. వైజయికీ విద్యలు—విజయసాధనోపాయములను తెలిసియుండుట.

64. వ్యాయామికీ జ్ఞానము—వ్యాయామపరిజ్ఞానము.

పైని చెప్పబడిన చతుష్షష్టికళలేకాక పాంచాలికీ కళలనుపేర ఇంకొక చతుష్షష్టి కళలున్నవనియు, వాటిని సాంప్రయోగికాధికరణములో వివరింతుననియు వాత్స్యాయనుడు పేర్కొనెను.

జైనులందరును తమ గ్రంథములందు 72 కళలను పేర్కొనియున్నారు. 'లలితవిస్తరము'నందు చతుష్షష్టికామకళలును, 86 కళలును వివరింపబడినవి. కామసూత్రవ్యాఖ్యానమందు యశోధరుడు కళలు మొత్తము 512 అని పేర్కొనియుండెను. శ్రీ ఎ. వెంకటసుబ్బయ్యగారు "The Kalās" (1911) అను పేర ఒక పరిశోధన గ్రంథమును ప్రకటించియున్నారు. అందు వివిధశాస్త్రకర్తలు చెప్పిన కళాభేదములన్నియును వివరింపబడెను.

---

# అధ్యాయము 24[1]

## స్త్రీ-పురుష ప్రకృతి భేదములు[2]

[కాశీముద్రణమునందు 34 వ అధ్యా—79 శ్లో; బొంబాయి ముద్రణమునందు 24 వ అధ్యా—116 శ్లో; బరోడాముద్రణమునందు 24 వ అధ్యా—39 శ్లో కలవు.]

స్త్రీ - పురుషుల ప్రకృతులు సంగ్రహముగా మూడువిధములు— ఉత్తమ ప్రకృతులు, మధ్యమ ప్రకృతులు, అధమ ప్రకృతులు[3].

### పురుషుల ప్రకృతిభేదములు

1. ఉత్తమప్రకృతి—జితేంద్రియుడు, జ్ఞానవంతుడు, నానాశిల్పవిచక్షణుడు, దక్షిణుడు, మహాలక్ష్యయుతుడు, భీత (లేదా దీన) జనపరిసాంత్వనపరుడు, నానా శాస్త్రార్థసంపన్నుడు, గాంభీర్య-ఔదార్యశాలి, స్థైర్య (లేదా ధైర్య)-త్యాగగుణో పేతుడు అయిన పురుషుడు 'ఉత్తమ ప్రకృతి' కలవాడని తెలియవలెను.

2. మధ్యమప్రకృతి—లోకోపచార చతురుడు(వ్యవహారదక్షుడు), శిల్ప-శాస్త్రవిశారదుడు, విజ్ఞాన-మాధుర్యయుతుడు అయిన పురుషుడు 'మధ్యమ ప్రకృతి' కలవాడనబడును.

1. ఈ భాగము కాశీముద్రణమునందు చతుస్త్రింశాధ్యాయము (34 వ అధ్యా.). బొంబాయి-బరోడాముద్రణములందు మాత్రము చతుర్వింశాధ్యాయము (24 వ అధ్యా.) ఈ అధ్యాయవిషయమున వ్రాతప్రతులు పరస్పరము చాల భేదించుచున్నవని శ్రీ మా. రామకృష్ణ కవిగారు తెలిపియున్నారు. బొంబాయి ముద్రణమం దీ అధ్యాయమున ఇతర అధ్యాయములందలి శ్లోకములు కూడ చేరియున్నవి.

2. కాశీముద్రణమునందు 'ప్రకృతి విచారము' అని కలదు. బొంబాయి ముద్రణమునందు 'సామాన్యాభినయ' మని కలదు. 'స్త్రీ-పుంసోపచార' మని అభినవభారతీపాఠము.

3. ఇంతవరకును స్త్రీ-పురుష హేతుకమైన కామోపచారము వర్ణితమైనది కదా' ఆ స్త్రీ-పురుషుల స్వభావములు విచిత్రములుగానుండును ; కాని వాటినెల్ల గణించుటకు శక్యముకాదు. ఆ స్వభావములెల్ల ప్రకృతి త్రైవిధ్యముచే ఇప్పుడు సంగ్రహముగా చెప్పబడుచున్నవి. శృంగారమునకు ఆలంబనములైన నాయికా-నాయకు లెట్టి ప్రకృతులు (శీలములు లేదా స్వభావములు) కలిగియుందురు? వారి సహాయు లెట్టివారు? మొదలగు సర్వవిషయములను కవియును, నటుడును కూడ తప్పక తెలిసికొనవలయును. [అభినవ భారతి - 3 వ సం - పుట 243]



3. అధమప్రకృతి— రూక్షవాక్యయుతుడు, దుశ్శీలుడు, కుసత్త్వుడు, స్థూల (లేదా స్వల్ప) బుద్ధి, క్రోధవశుడు, ఘాతకుడు, మిత్రఘ్నుడు, ఛిద్రమాని (గృహకల్లోలాదులను కలిగించువాడు), పిశునుడు (దుష్టుడు), ఉద్ధతవాక్యోపేతుడు, అకృతజ్ఞుడు (ఉపకారమును పొంది మరచువాడు), అలసుడు, మాన్య - అమాన్య విశేషజ్ఞానరహితుడు, స్త్రీలోలుడు, కలహప్రియుడు, సూచకుడు (కొండెకాడు), పాపకర్ముడు, పరద్రవ్యాపహారి అయిన పురుషుడు 'అధమప్రకృతి' కలవాడనబడును.[4]

ఇట్లు శీలమునుబట్టి పురుషుల ప్రకృతులు మూడు విధములుగానుండును.

### స్త్రీల ప్రకృతిభేదములు

ఇంక స్త్రీలయొక్క ప్రకృతులను మరల వివరింతును.[5]

1. ఉత్తమప్రకృతి— మృదుభావ, అచపల, స్మితభాషిణి, అనిష్ఠుర, వచనదక్ష అయినను గురువుల విషయమున లజ్జాన్విత, వినయాన్విత, రూప-అభిజన-మాధుర్యము లనెడి స్వాభావిక గుణములతోకూడినది, గాంభీర్య-ధైర్య సంపన్న అయిన ప్రమద 'ఉత్తమప్రకృతి' కలదని తెలియవలెను.

2. మధ్యమప్రకృతి—నాత్యుత్కృష్టములును (అతిశ్రేష్ఠతాహీనములును), అసమగ్రములును అయిన పై గుణములతో కూడినదై అల్పదోషానువిద్ధ అగు స్త్రీ 'మధ్యమ ప్రకృతి' అనబడును.

3. అధమప్రకృతి— పురుషులలోని అధమప్రకృతికి చెప్పిన లక్షణములే స్త్రీలయందలి అధమప్రకృతికిని మొత్తముమీద వర్తించును.

### ఇతర ప్రకృతులు

నపుంసకుడు మిశ్రప్రకృతియో, అధమప్రకృతియో అగును.

4. పై గుణములన్నియును ఒక్కనియందే మూర్తీభవించియుండవలెనని తలంచరాదు. పై గుణములలో ఏ కొన్ని గుణములు కలిగియున్నను అతడు 'అధమప్రకృతి' కలవాడే అగును. ఉత్తముల విషయ మట్లు కాదు. వారియందు పైని చెప్పిన గుణసంపద సుసంపన్నమై ఉండవలెను.

5. 23 వ అధ్యాయమందు వివరింపబడిన స్త్రీలయొక్క ప్రకృతి త్రైవిధ్యము కామోపచారాభినయము ననుసరించియున్నది. ఇప్పుడు వివరింపబడుచున్నది సర్వవ్యవహార సాధారణమగు స్వభావకృతవిభాగమని తెలియవలెను. అందుచేతనే 'మరల వివరింతును' అని చెప్పబడెను. [అభినవభారతి - 3 వ సం - పుట 250]

ప్రేష్యాదులు (లేదా చేట్యాదులు) కూడ సంకీర్ణ (మిశ్ర) ప్రకృతులే.[6] శకారుడు, విటుడు (విదూషకుడని కాశీ ముద్రణ పాఠము: చేటుడని బొంబాయి ముద్రణ పాఠము), ఇటువంటివారే అగు ఇతరులును కూడ సంకీర్ణప్రకృతులే. నాటకమందు వీరందరును అధమప్రకృతులే అని తెలియవలెను (పరమార్థ మేమనగా నాటకములో ప్రేష్య-విట-శకారాదులందరును అధమప్రకృతి కలవారై ఉందురు).

ఇట్లు, పురుష-స్త్రీ-నపుంసక ప్రకృతులను తెలిసికొనవలెను. శీల సంశ్రయ మైన ఈ ప్రకృతుల విభాగము నింక వివరింతును.

### చతుర్విధ నాయకులు

పైని చెప్పిన మధ్యమోత్తమ ప్రకృతులలో నానాలక్షణలక్షితులగు నాయకులు నాలుగు విధములుగానుందురు— ధీరోద్ధతులు, ధీరలలితులు, ధీరోదాత్తులు, ధీరప్రశాంతులు.

1. ధీరోద్ధత నాయకులు—దివ్యులు.
2. ధీరలలిత నాయకులు—నృపులు (రాజులు)
3. ధీరోదాత్త నాయకులు—సేనాపతి-అమాత్యులు.
4. ధీరప్రశాంత నాయకులు—బ్రాహ్మణ-వణిజులు.[7]

### చతుర్విధనాయక సహాయులు

పై చతుర్విధనాయకులకు సంబంధించిన చతుర్విధవిదూషకులు[8] కూడ కలరు (వీరు శృంగార విషయమున నాయక సహాయులుగానుందురు). లింగి (ఋషి), ద్విజుడు (విరుడు), రాజజీవి, శిష్యుడు అను వారు నలుగురును యథాక్రమముగా పై నలుగురు నాయకులకును (దివ్య-సేనాపతి-నృప-బ్రాహ్మణులకు) సహాయులని తెలియవలెను (ఔచిత్యము ననుసరించి ఈ విధముగా ఉండవలెనని అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను). ఈ విదూషకులు మంచి కథలను చెప్పుటయందు నిపుణులై నాయకులకు విప్రలంభమందు మిత్రులుగానుందురు.

---

6. సహజమైన అధమత్వము, స్వామిని అనుసరించి ఉండుటవలన ఉత్తమత్వ ప్రాప్తియును కలుగుటచే 'సంకీర్ణ ప్రకృతి' అగును.

7. ధనంజయాదులు ధీరోద్ధతాదుల లక్షణములను పేర్కొనియున్నారు. కాని, భరతుడు చేసిన విభాగము కొంత భిన్నముగానున్నది.

8. 'విదూషక' పదమునకు రెండు నిర్వచనములు కలవు—(1) విగ్రహమును (కలహమును) సంధిచే దూషించు (పోగొట్టు) వాడు కావున 'విదూషకు' డనబడును; (2) విప్రలంభమందు వినోదము కలిగించి, దానిని మరపించు వాడు కాన విదూషకు డనబడును. [అభినవభారతి - 3 వ సం - పుట 251]



### నాయకుడు

వ్యసని అయికాని, దుఃఖమునుపొంది కాని పిమ్మట ఎవడు అభ్యుదయమును పొందినవాడగునో అతడే ప్రధాననాయకుడని తెలియవలెను. అనేకులకు ఒకే విధముగా వ్యసన-అభ్యుదయములు రెండును కలిగినప్పుడు ఎవని వ్యసనాభ్యుదయ ములు పరిపుష్టములై ఉండునో అతడే నాయకుడగును (రామ-సుగ్రీవ-విభీషణులలో రాముడు నాయకుడైనట్లు).

### చతుర్విధనాయికలు

ఇంక నాయికలు కూడ నాలుగు విధములుగానుందురు—దివ్య, నృపపత్ని, కులస్త్రీ, గణిక. ప్రకృతిలక్షణభేదములచే వీరు నాలుగు విధములుగానుందురు— ధీర, లలిత, ఉదాత్త, నిభృత. దివ్య-నృపపత్ను లిరువురును ఈనాలుగు గుణములను కలిగియుందురు. కులజాంగనలు ఉదాత్తలును నిభృతలును అగుదురు. గణికా-శిల్పకారికలు లలితోదాత్తలుగానుందురు.*

### అభ్యంతర (రాజాంతఃపుర) పరివారము

ఈ సర్వప్రకృతులకును ఉపచారము బాహ్య-అభ్యంతర భేదములచే రెండు విధములుగానుండును; ఆయా ఉపచారములకుతగిన పరివారమును నియతముగా నుండును. వీని లక్షణములను వివరింతును. అంతఃపుర ఉపచారము 'అభ్యంతర' మనియు, బాహ్యోపచారము 'బాహ్య'మనియు చెప్పబడును. రాజోపచారమందు రాజాంతఃపుర సమాశ్రయలైన స్త్రీల విభాగమును ఉపచారవిభాగపూర్వకముగా వివరింతును—మహాదేవి, దేవులు, స్వామినులు, స్థాపితలు, భోగినులు, శిల్పకారిణులు, నాటకీయలు, నర్తకి, అనుచారిక, పరిచారికలు, సంచారికలు, ప్రేషణకారికలు, మహత్తరులు, ప్రతీహారులు, కుమారికలు, స్థవిరలు, ఆయుక్తికలు అను వారు నృపుని అంతఃపురజనమని తెలియవలెను.

1. మహాదేవి— మూర్ధాభిషిక్త 'మహాదేవి' అనబడును (పట్టపురాణి). కుల-శీల సమన్విత, గుణయుక్త, మధ్యవయస్సులోనున్నది, అక్రోధన, ఈర్ష్యను విడిచినది, నృపుని శీలమును తెలిసినది, సుఖ-దుఃఖములను సహించునది, సర్వసమ, శాంతి-స్వస్త్యయనములతో ఎల్లప్పుడును భర్తకు మంగళముకోరునది, శాంతచిత్త, పతివ్రత, ధీర, అంతఃపురమునందు ఆసక్తి కలది 'మహాదేవి' అనబడును.

---

* [కాశీముద్రణమునందు 34వ అధ్యా—1-25 శ్లో; బొంబాయి ముద్రణమునందు 24వ అధ్యా-—1-11 శ్లో+82-90 శ్లో; బరోడాముద్రణమునందు 24వ అధ్యా- 1-25శ్లో.]

2. దేవులు— పై మహాదేవీగుణములుకలవారైనను ఆ సంస్కారము మాత్రము లేనివారు, గర్వితలు, అతిసౌభాగ్యవతులు, పతిసంభోగతత్పరలు,[9] శుచులు, నిత్యోజ్జ్వలాకారలు, ప్రతిపక్షమునం దసూయకలవారు, వయో-రూప గుణాఢ్యలు అయినవారు 'దేవులు' అనబడుదురు.

3. స్వామినులు— సేనాపతుల, లేదా అమాత్యుల, లేదా చివరకు తదితరభృత్యుల తనయలు 'స్వామినులు' అనబడుదురు. ప్రతిసమ్మానవర్జితలు, శీల-రూప-గుణ సంపన్నలు, నృపతికి హితలు, స్వగుణములచే లబ్ధసమ్మానలు అయిన స్త్రీలు 'స్వామినులు' అనబడుదురు.

4. స్థాపితలు (స్థాయినులు-కాశీముద్రణపాఠము)— రూప-యౌవన శాలినులు, సౌభాగ్యగర్వముచే కర్కశలు, విభ్రమాన్వితలు, రతిసంభోగకుశలలు, ప్రతిపక్షమం దసూయకలవారు, దక్షులు, భర్తృచిత్తమును ఎరింగినవారు, ఎల్లప్పుడు గంధ-మాల్యములచే ఉజ్జ్వలలు, నృపతి ఇంగితము ననుసరించి ప్రవర్తించువారు, ఈర్ష్యామానగర్వితలు, ఉత్థితలు, ప్రమత్తలు, అలసత లేనివారు, అనిష్ఠురలు, మాన్యామాన్యవిశేషజ్ఞలు అయిన స్త్రీలు 'స్థాపితలు' అనబడుదురు.

5. భోగినులు— రూప-శీలములచే స్వీకరింపబడినవారు, సుకుమారలు, అత్యుద్భటలు కానివారు, మధ్యస్థలు (ప్రతిపక్షమం దసూయలేనివారు), నిభృతలు, సహనశీలలు అయిన స్త్రీలు 'భోగినులు' అనబడుదురు.

6. శిల్పకారికలు (=శిల్పకారిణులు)—నానాకళావిశేషజ్ఞలు, నానాశిల్ప విచక్షణలు, గంధపుష్పవిభాగజ్ఞలు (పుష్పములనుండి అత్తరును తయారుచేయువారు), లేఖ్యాలేఖ్య వికల్పికలు, శయన-ఆసన-భోగజ్ఞలు, చతురలు, మధురస్వభావలు, దక్షులు, సౌమ్యలు, స్ఫుటలు, శ్లిష్టలు, నిభృతలు అయిన స్త్రీలు 'శిల్పకారికలు' అనబడుదురు.

7. నాటకీయలు— గ్రహ-మోక్ష-లయలను తెలిసినవారు, రస-భావ వికల్పికలు (స్వర-తాల-లయజ్ఞలు, ఆచార్యోపసేవితలు— కాశీముద్రణ పాఠము),

9. మహాదేవి అధికముగా శృంగారోచిత కాదు. శృంగారోచిత అయినట్టి స్త్రీని కవులు 'దేవి' అని వ్యవహరింతురు. 'మహాదేవి' ఒక్కతెయే ఉండును. కాని, దేవులు, స్వామినులు మొదలగువారు అనేకులుం దురు. కావుననే 'మహాదేవి' అని ఏకవచనము ప్రయుక్తమైనది. [అభినవభారతి - 3 వ సం - పుట 254]. నాడు రాజునకు పెక్కురు భార్యలుండుట సంప్రదాయము. బిందుసారునకు 16 గురు భార్యలుండెడివారట. వత్సరాజు మామయగు మహాసేనునకు 16 గురు భార్యలుండిరట.



చతురలు, నాట్యకుశలలు, ఊహాపోహ విచక్షణలు, రూప-యౌవన సంపన్నలు అయిన స్త్రీలు 'నాటకీయలు' (actresses) అనబడుదురు[10].

8. నర్తకి— హేలా-భావ విశేషాఢ్య, సత్త్వాభినయజ్ఞ, మాధుర్య (స్వభావ) సంపన్న, ఆతోద్యకుశల, అంగ-ప్రత్యంగసంపన్న, చతుష్షష్టికళాన్విత, చతుర, ప్రశ్రయోపేత, స్త్రీదోషవివర్జిత, ఎల్లప్పుడును ప్రగల్భ, అలసత లేనిది, జితశ్రమ, నానా శిల్ప ప్రయోగజ్ఞ, నృత్త-గీత విచక్షణ, రూప-గుణ-ఔదార్య-సౌభాగ్య-శీల సంపన్న, పేశల-మధుర-స్నిగ్ధ-అనువాదిక-చిత్ర కంఠము కలది, అవికల, చిత్ర కర్మ కుశల, రూప-యౌవన-కాంతులయందు సమాగతలైన స్త్రీలలో సాటిలేనిది అయిన స్త్రీ 'నర్తకి' అనబడును.[11]

9. అనుచారిక—దక్షయును, దక్షిణయును, సర్వావస్థోపచారములందును పార్థివుని విడిచిపెట్టనిదియును 'అనుచారిక' అనబడును.

10. పరిచారికలు—శయ్యాపాలి (శయ్య నలంకరించునది), ఛత్రధారిణి, వ్యజనధారిణి, సంవాహిక (కాళ్ళు పట్టునది), గంధయోక్త్రి, ప్రసాధిక (అలంకరణము చేయునది), ఆభరణయోక్త్రి, మాల్యసంయోజిక అనువారు 'పరిచారికలు' అనబడుదురు.

11. సంచారికలు—సర్వాంతఃపురసంచారిణులు, ఉపవనసంచారిణులు, దేవతాయతన-క్రీడాప్రాసాదపరిచారికలు, యామకినులు (ప్రతి యామమునకును గంటలు కొట్టువారు) అను వారు 'సంచారికలు' అనబడుదురు.

12. ప్రేషణకారికలు (=ప్రేషణికలు)—గూహ్యాగుహ్య సముత్థితమైన (దాచదగిన రహస్యముతో కూడిన) కామసంయుక్తప్రేషణమందు (దూతీ కృత్యములందు) నృపులచే నియోజ్యలగువారు 'ప్రేషణకారికలు' అనబడుదురు.

13. మహత్తరలు—స్తుతి - స్వస్త్యయనములచే సర్వాంతఃపురరక్షణల నొనర్చి, అభివృద్ధిని చూచి సంతసించునది 'మహత్తరి' అనబడును.

14. ప్రతిహారులు— సంధి-విగ్రహ సంబద్ధమును, వివిధ చారులవలన తెలియజేయబడినదియును అగు కార్యమును నివేదించునది 'ప్రతిహారి' అనబడును.

10. రాజాంతఃపురములందు స్త్రీలే నాట్యమును (నాటకాదులను) ప్రదర్శించుచుండినట్లు నాట్యశాస్త్రమందే కలదు (26 వ అధ్యా). 'ప్రియదర్శిక'యందు అట్టి సన్నివేశ మొకటి కలదు. కాని వీరు మామూలు నాటకసమాజములందలి స్త్రీలవంటివారు కాదు. కేవలము అంతఃపురమునకు సంబంధించినవారు మాత్రమే.

11. నర్తకియు, నాటకీయయు విడివిడిగా పేర్కొనబడుట గమనార్హము. అభినయ దర్పణాదులన్నింటియందును నర్తకీ లక్షణము ఆదిలోనే చెప్పబడినది. నర్తకికి 'పాత్ర' అనియు పేరు. ఈ నర్తకి లేదా పాత్ర 'రాజనర్తకి' అనబడును. పుట 147 చూడవలెను.

15. కుమారికలు— అప్రాప్తరతిసంభోగ, అసంభ్రాంత, అనుద్ధత, నిభృత, లజ్జావతి అయిన బాలిక 'కుమారి' అనబడును.

16. వృద్ధ— పూర్వరాజసంప్రదాయజ్ఞ, పూర్వరాజాభిపూజిత, పూర్వ రాజానుచరిత అగునది 'వృద్ధ' అనబడును.

17. ఆయుక్తికలు—భాండాగారాధికృతలును, ఆయుధాగారాధికృతలును, ఫల-మూల-ఔషధులకు అధికారిణులును, అన్వవేక్షికలును (అన్నవీక్షణలు-అని కాశీ ముద్రణ పాఠము), గంధ-మాల్యా-ఆభరణ-వస్త్రచింతికలును, బహుజనపరివారిత లును అయినవారు 'ఆయుక్తికలు' అనబడుదురు.*

అంతఃపురచారిణులైన స్త్రీలను పైని సంగ్రహముగా వివరించితిని. ఇంక వారి (ఆయుక్తికల) విశేషలక్షణములను వివరింతును— వివిధకార్యనియోగము లందు నియుక్తలగువారు అనురక్తలు, భక్తికలవారు, నానాపార్శ్వసముత్థితలు కావలయును. మరియును అనుద్భటలు, అసంభ్రాంతలు, అలుబ్ధలు, అనిష్ఠురలు, దాంతలు, క్షాంతలు, ప్రసన్నలు, జితక్రోధలు, జితేంద్రియలు, కామరహితలు (ఇతరులయందు కామమును రేకెత్తించలేనివారు), లోభహీనలు, స్త్రీదోష వివర్జితలు కావలయును.

నపుంసకాదివర్గము[12]

తృతీయప్రకృతికి చెందినవారుగా చెప్పబడిన 'నపుంసకులు' కూడ రాజ వేశ్మమందు అంతఃపురసంచారవిషయమున నియోగింపబడవలెను. ఇంక స్నాతక-కంచుకీయ-వర్షవర-ఔపస్థాయిక-నిర్ముండులను వివిధ కక్ష్యాస్థానములందు నియో గించవలెను[13].

* [కాశీముద్రణమునందు 35వ అధ్యా—26–56 శ్లో; బొంబాయి ముద్రణమునందు 24వ అధ్యా— 12–44 శ్లో; బరోడా ముద్రణమునందు 24వ అధ్యా— 26–64 శ్లో.]

12. మహాదేవి మొదలు ఆయుక్తిక పర్యంతమును అంతఃపురస్త్రీగణము సప్త దశకము (పదునేడు). ఇంతవరకును వీరినిగూర్చి వివరింపబడినది. ఇంక నపుంసకాదివర్గము అష్టాదశమము (పదునెనిమిదవది). వీరినిగూర్చి ఇప్పుడు వివరింపబడును. ఇట్లు మొత్తము అష్టాదశమగుటచేతనే "అష్టాదశవిధమైన అంతఃపురోపచారమును (పరివారమును) వివరించితిని." అని తరువాత చెప్పబడును. [అభినవభారతి - 3 వ సం - పుట 253] అనగా నపుంసకాదులందరును ఒకే విభాగముగా ఎంచబడినారన్నమాట.

13. ఈ రెండు వాక్యములకును మూలములైన రెండు శ్లోకములును బొంబాయి ముద్రణపాఠము [48–49 శ్లో.]



అపురుషులును, స్త్రీభోగ వివర్జితులును అయిన వ్యక్తులే నిత్యమును నాటక మందు అంతఃపురచరులుగా ఉండవలయును. ఆర్యాచారపరిరక్షకుడు 'స్నాతకు' డనబడును. అర్థసంయుక్తములైన ప్రేషణము (పంపుట) లందు కంచుకిని, కామ చారములందు వర్షవరుని (వర్షధరుని-అని పాఠాంతరము) నియోగించవలెను ఇంక ఔపస్థాయిక-నిర్ముండులు స్త్రీల ప్రేషణకర్మలందును, కుమారీ-బాలికారక్షణ మందును నియుక్తులు కావలెను. మరియు స్త్రీల మానకార్యములందు అనుచారి కలును, సర్వనృత్త-అంగయోగజ్ఞులు నాట్యాగారమందును నియమింపబడవలెను. వినీతులు, స్వల్పసత్త్వులు, క్లీబులు, స్త్రీస్వభావులు, పుట్టుకచేత దోషులు కాని వారు (పుట్టుకనుండియే మూగవారు-అని కాశీముద్రణపాఠము) అయిన వ్యక్తులు 'వర్షవరు' లనబడుదురు. నపుంసకులు, స్త్రీస్వభావవివర్జితులు, కామవిజ్ఞానవర్జితులు అయిన పురుషులు 'నిర్ముండు' లనబడుదురు, విద్యా-సత్యసంపన్నులు, కామ దోష వివర్జితులు, జ్ఞాన-విజ్ఞాన కుశలులు, బ్రాహ్మణులు, వృద్ధులు అయినవారిని నృపుడెల్లప్పుడును దేవీప్రయోజనములందు నియమించవలెను.

పైన అష్టాదశవిధమైన అంతఃపురచరవర్గమును వివరించితిని. ఇంక బాహ్యా చరులైన పురుషులను వారి లక్షణములను వివరింతును.

బాహ్య పరివారము

రాజు, సేనాపతి, పురోధసుడు, మంత్రులు, సచివులు, ప్రాడ్వివాకులు, కుమారాధికృతులు అను వారు బాహ్యపరివారము.[14] వీరేకాక కొందరు సభా స్తారులు (మాన్యులు-అని బరోడా ముద్రణ పాఠము) కూడ ఉందురు.

1. రాజు—బలవంతుడు, బుద్ధిసంపన్నుడు, సత్యవాది, జితేంద్రియుడు, దక్షుడు, ప్రగల్భుడు, ధృతిమంతుడు, విక్రాంతుడు, మతిమంతుడు, శుచి, దీర్ఘదర్శి, మహోత్సాహుడు, కృతజ్ఞుడు, ప్రియవాక్కు, మృదుస్వభావుడు, లోకపాలవ్రత ధరుడు, కర్మమార్గ విశారదుడు, ఉత్థితుడు, అప్రమత్తుడు, వృద్ధులను సేవించువాడు, అర్థశాస్త్రవిదుడు, పరభావేంగితాభిజ్ఞుడు, శూరుడు, రక్షాసమన్వితుడు, ఊహాపోహ

14. అంతఃపురపరివారమనగా కేవలముఅంతఃపురమునందు సంచరించెడివారనియు, బాహ్యపరివార మనగా రాజాస్థానమందును, బాహ్యప్రదేశములందును కూడ సంచరించు వారనియు గ్రహించవలెను. ఈ బాహ్యాభ్యంతరపరివారమంతయును రాజోపయోగి అని తెలియవలెను.

ఇచ్చట 'రాజ' శబ్దముచే యువరాజు గ్రహింపబడెనని అభినవగుప్తుడు వ్యాఖ్యా నించెను. [అభినవభారతి - 3 వ సం - పుట 259]

విచారి, నానాశిల్పప్రయోజకుడు, ధర్మజ్ఞుడు, అవ్యసని (స్త్రీ-మద్య-మృగయ-అక్షక్రీడలందు ఆసక్తిలేనివాడు), నీతిశాస్త్రకుశలుడు అయిన పురుషుడు 'నృపు' డనబడును.

2. మంత్రులు; 3. పురోధసుడు—కులీనులు, బుద్ధిసంపన్నులు, నానాశాస్త్రవిపశ్చిత్తులు, స్నిగ్ధులు, పరులచేత అహార్యులు (శత్రువులకు అభేద్యులు), అప్రమత్తులు, దేశజులు, అలుబ్ధులు, వినీతులు, శుచులు, ధార్మికులు అయినవారు మంత్రి-పురోధసులుగా ఉండవలెను.

4. సేనాపతి—బుద్ధిమంతుడు, నీతిసంపన్నుడు, అలసతలేనివాడు, ప్రియంవదుడు, పరరంధ్రవిధిజ్ఞుడు, దండయాత్రాకాల విశేషవిదుడు, అర్థశాస్త్రార్థకుశలుడు, అనురక్తుడు, కులోద్భవుడు, దేశ-కాల విదుడు అయినవానినే సేనాపతిగా రాజు నియమించవలెను.

5. అమాత్యులు— బుద్ధిమంతులు, నీతిసంపన్నులు, విక్రాంతులు, ప్రియంవదులు, అర్థశాస్త్రకుశలులు, ప్రజలయందనురక్తులు, ధార్మికులు అయినవారినే రాజు అమాత్యులను చేయవలెను.[15]

6. ప్రాడ్వివాకులు[16]— వ్యవహారార్థతత్త్వజ్ఞులు, బుద్ధిమంతులు, బహుశ్రుతులు, మధ్యస్థులు, ధార్మికులు, ధీరులు, కార్యాకార్యవివేకులు, క్షాంతులు, దాంతులు, జితక్రోధులు, సమదర్శులు అయిన ద్విజులే ధర్మాసనమందు నియుక్తులు కావలయును.

7. కుమారాధికృతులు (రాజపుత్రరక్షణోద్యోగులు)— ఉత్థితులు, అప్రమత్తులు, అలసతలేనివారు, జితశ్రములు, స్నిగ్ధులు, క్షాంతులు, వినీతులు,

15. ఇది కాశీ ముద్రణపాఠము ; బరోడా ముద్రణమునందు లేదు. మూలమందు అమాత్య-సేనాపతుల నిర్వచనములు సరిగా విస్పష్టముగా లేవు. బరోడా ముద్రణమునందలి అధస్సూచికలో సచివుల గుణము లీ క్రింది విధముగా ఉన్నవి. [3 వ సం - పుట 261]—"దక్షులు, ప్రియంవదులు, భక్తులు, శుచులు, శ్రమవర్జితులు, వినీతులు (ధర్మశాస్త్ర విదులు), కుశలులు, దాంతులు అయినవారు 'సచివులు' అనబడుదురు."

అమాత్యు డనగా 'సహచరు' డని అర్థము (అమ=సహ). రాజునకు సహచరుడని అర్థము. [అభినవభారతి - 3 వ సం - పుట 260]

16. పాడ్వివాక శబ్దములో 'ప్రాట్+వివాక' అని పదచ్ఛేదము. ప్రాట్=వివాదపదమున నిర్ణయము నడుగువాది-ప్రతివాదులు—(పృచ్ఛతి=వివాదపదే నిర్ణయమితి ప్రాట్) వారికి నిర్ణయమునుచెప్పువాడు ప్రాడ్వివాకుడు (విశేషేణ ఉచ్యతే అనేనేతి వివాకః). [అభినవభారతి - 3 వ సం - పుట 261]



మధ్యస్థులు, నిపుణులు, నయజ్ఞులు, వినయజ్ఞులు, ఊహాపోహవిచక్షణులు, సర్వశాస్త్రార్థ సంపన్నులు అయినవారు కుమారాధికృతులుగానుండవలెను.

పైన పేర్కొనబడినవారి గుణములెల్ల సంగ్రహముగా చెప్పబడినవి. కాని, అవి ముఖ్యముగా బృహస్పతి-శుక్ర మతానుసారముగానే ఉండవలెను[17]; ఇంక సభ్యుల (సభాస్తారుల) గుణములును తదనుసారముగనే ఉండవలెను.

ప్రాడ్వివాకనిర్ణయమును[18] పైన వివరించితిని. ఇంక చిత్రాభినయమును[19] వివరింతును*.

చతుర్వింశాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

### 1. ప్రకృతిభేదములు

స్త్రీ పురుషుల ప్రకృతులు ఉత్తమ - మధ్యమ - అధమ భేదములచే మూడు విధములని చాలసార్లు చెప్పబడినదే. ఇది స్థూలమైన విభజనము. ఇందింకను పెక్కు ప్రభేదములున్నవని 22 వ అధ్యాయము చివర తెలిపియున్నాను. ఆయా ప్రకృతుల లక్షణములెట్టివిగా ఉండునో ఇప్పుడీ అధ్యాయమందు విపులముగా వివరింపబడెను. ముఖ్యముగా ఈ అధ్యాయమందు నాయకులుగా నుండెడు ధీరోదాత్త - ధీరోద్ధత - ధీరలలిత - ధీరప్రశాంతుల గుణములును, నాయికలుగా ఉండెడు దివ్య - నృపపత్నీ - కులస్త్రీ - గణికల లక్షణములును వివరింప

17. పైన పేర్కొనబడినవారనగా రాజు మొదలు కుమారాధికృతులవరకును. ఇచ్చట వీరి గుణములు సంగ్రహముగా చెప్పబడినవని తెలియవలెను. విపులవర్ణనము బార్హస్పత్య-ఔశనసాది గ్రంథములందు కలదు. [అభినవభారతి - 3 వ సం - పుట 262]

18. రాజు ప్రజలను మాత్స్యన్యాయమునుండి అనగా ప్రబలుడు దుర్బలుని తినుట అనెడి అక్రమమునుండి రక్షించవలెను. అట్టి రక్షణమును వివాదనిర్ణయముచే చేయుటకు ప్రాడ్వివాకులు అత్యంతప్రధానులు. కావున ప్రాడ్వివాకుడు రాజంతటివాడుగనే లోకమందు భావింపబడుచున్నాడు. [అభినవభారతి - 3 వ సం - పుట 262]

19. సామాన్యాభినయమందును చిత్రాభినయము కలదు. కాని అందు శృంగారరస - తద్వ్యభిచారులకే అభినయమున ప్రాధాన్యము చూపబడెను. అట్లుకాక చిత్రాభినయమున రసాద్యుపయోగులగు బాహ్యవస్తువులకు సంబంధించిన అభినయములును, వాని మిశ్రీకరణరూపమగు సమానీకరణమును వివరింపబడును. అందుచే చిత్రాభినయము సామాన్యాభినయవిశేషమని ఎరుంగవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 264]

* [కాశీముద్రణమునందు 34వ అధ్యా—57–79 శ్లో, బొంబాయి ముద్రణమునందు 24వ అధ్యా— 45–72 శ్లో; బరోడా ముద్రణమునందు 24వ అధ్యా— 64–89 శ్లో.]

బడెను. మరియు అంతఃపురమందలి స్త్రీల విభాగము, వారి కర్మలు పేర్కొనబడెను. అట్లే, రాజాస్థానమందలి పురుషుల విభాగమును చెప్పబడెను. రాజాస్థానమందలి ప్రాడ్వివాక లక్షణములు 27 వ అధ్యాయమునందు మరల వివరింపబడును. ఆలంకారికులు స్త్రీల నందరను నీచపాత్రములనుగా నిర్దేశించిరనెడి అభిప్రాయము తప్పు అని ఇదివరకే పేర్కొనియున్నాను. ఈ అధ్యాయమును చదివినచో ఆవిషయము స్పష్టపడగలదు.

స్త్రీ-పురుషుల శీలములందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నదని భరతుడు రెండు మూడుసార్లు పేర్కొనెను. దేశ-కాల-అవస్థా-వయః-ప్రకృతుల ననుసరించి చతుర్విధాభినయములును ప్రయుక్తము కావలయునని ఆతడు పదేపదే నిర్దేశించియుండెను; నిజము చెప్పవలెనన్నచో ఇందులో తక్కినవన్నియు 'ప్రకృతి'నే అనుసరించియుండును. ప్రకృతి 'ఔచిత్యము'ను పాటించుటయే నాట్యసిద్ధికి మూలసూత్రము.

ఈ ప్రకృతి ఔచిత్యమును 'రిటారిక్కు'లో అరిష్టాటిల్ కూడ వివరించియుండెను—

"Let us next go over in detail the dispositions of men; considering of what kind of a turn they are, in reference to their passions, habits, ages and fortunes......I call anger, lust and the like by the name passions...By the name habits, I designate virtues and vices...And the ages are youth, prime and old age. By fortune I mean high birth and wealth and abilities and their opposites and in one word, good and bad fortunes......If then one expresses himself in the languages appropriate to the habit, he will produce the effect of being characteristic; for a rustic and a man of education will express themselves neither in the same words, nor in the same manner..." [quoted by Dr. V. Raghavan—Journal of Oriental Research, Vol. VIII - part I - pp. 70-71]

## 2. గ్రీకు-చైనా దేశములందలి పాత్ర విభజనములు

*గ్రీకుల విభజనము :* చిత్రలేఖన - కావ్య - నాట్యములలో మనుష్యులను చిత్రించుట యందు అరిష్టాటిల్ మూడు స్థూలములైన భేదములను పేర్కొని అవియే విషాద-ఆహ్లాద రూపకముల భేదమునకు ముఖ్యకారణములని నిర్దేశించెను—

"Since the objects of imitation are men in action, and these men must be either of a higher or a lower type (for moral character mainly answers to these divisions, goodness and badness being the distinguishing marks of moral differences), it follows that we must represent men either as better than in real life, or as worse, or as they are. It is the same in painting. Polygnotus depicted men as nobler than they are, Pauson as less noble, Dionysius drew them true to life.....So again in language, whether prose or verse unaccompanied by music. Homer, for example makes men better than they are; Cleophon as they are; Hegemon the Thasian, the inventor of parodies, Nicochares, the author of the Deliad, worse than they are... The same distinction marks off Tragedy from Comedy; for Comedy aims at representing men as worse, Tragedy as better than in actual life." [Butcher's Translation of Poetics - pp. 11-13]

*చైనీయుల విభజనము :* చైనీయుల పాత్ర విభజన మింకొక విధముగా ఉన్నది. వారి పాత్రలు స్థూలముగా నాలుగు విధములు—



"Characters are classified under four types: Shēng, males in general; tan, females in general; Ching or hua-lien, robust males with faces painted like masks; and clion, broad comedians. But these have a number of precise subdivisions." [The Oxford Companion to the Theatre - P. 126]

రూపకపాత్రలను స్థూలముగా క్రింది విధముగా పేర్కొనవచ్చును—

నాయకుడు, నాయక సహాయుడు, నాయక పరివారము, నాయిక, నాయికాసఖులు. నాయకసహాయుడు విదూషకుడు కానిచో హాస్యపాత్ర ఇంకొకటి ఉండవచ్చును—వీరు ముఖ్యపాత్రలు. ఇంక రెండవ పక్షమున ప్రతినాయకుడు, వాని సహాయులును ఉందురు. ఈ ప్రతినాయకుని 'విలన్' అందురు. గ్రీకు రూపకములందు కోరస్ అధికముగానుండును; "బృందగీతి"అనుపేర నేటి తెలుగురూపకములందిది అచ్చటచ్చట కన్పట్టుచున్నది.

# అధ్యాయము 25[1]

## చిత్రాభినయము[2]

[కాశీముద్రణమునందు 26 వ అధ్యా—122 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 25 వ అధ్యా—180 శ్లోకములును, బరోడాముద్రణము నందు 25వ అధ్యా—125 శ్లోకములునుకలవు.]

### చిత్రాభినయము

అంగాద్యభినయములకు సంబంధించి అక్కడక్కడ పేర్కొనబడవలసి యున్నను ఏ చిత్రము (విశేషములు) ఇంతవరకు పేర్కొనబడలేదో ఆ చిత్రము ఇప్పుడు వివరింపబడుచున్నది కాన ఇది 'చిత్రాభినయ' మనబడినది.[3]

1. ఈ భాగము కాశీముద్రణమునందు షడ్వింశాధ్యాయము (26 వ అధ్యా.) బొంబాయి-బరోడా ముద్రణములందు పంచవింశాధ్యాయము (25 వ అధ్యా.).

2. అన్ని ముద్రణములందును 'చిత్రాభినయము' అనియే కలదు.

3. చిత్రాభినయము సామాన్యాభినయము యొక్క విశేషమే కావున ఇది దానికి శేషభూతము. (పుట 711 లోని 19వ అధస్సూచికను కూడ చూడవలెను). సామాన్యాధ్యాయమున రసప్రధానముగ పదార్థవిశేషముల నభినయించుటలో అభినయముల సమానీకరణము చెప్పబడినది. ఇందు తదుపయోగి యగు విభావాదుల అభినయము వివరింపబడును.

ఇందు ఒక విషయమును అభినయించుటకు చెప్పబడిన ఒక అభినయము తద్విరుద్ధమగు వేరొకవిషయమును కూడ అభినయించుట కుపయోగించును. కావున ఇది 'చిత్ర' మనబడినది; ఇట్టి అభినయ వైదగ్ధ్యమే ఇందు నిరూపింపబడును.

మూలమున అంగాదు లనుచోట అంగ శబ్దముచే కరణాంగహారములు చెప్పబడెను. ఆది శబ్దముచే విభావాదులు గ్రాహ్యములు. ఈ కరణాంగహారములుకూడ అభినయములే. "అభినీయతే అనేనేత్యభినయః" అను వ్యుత్పత్తిచే "దీనిచే అభినయింపబడును" కాన విభావములు కూడ అభినయములే. కావున కరణాంగహారవిభావాదులగు అభినయముల విశేషము ఇందు చెప్పబడుచున్నది. వెనుక ఏయే అభినయములు చెప్పబడినవో ఆ అభినయములే అభినయాంతరములకు కూడ ఇందు అభినయముగా చెప్పబడెను. కావుననే ఇది 'చిత్ర' మనబడెను. "క్వచిత్ అనుక్తః" అని మూలములో అన్వయము చెప్పుటచే ఇందు వెనుక చెప్పబడనివియు, చెప్పబడినవియు ఉన్నవని ఎరుంగవలెను. ఈ అభినయవిశేషము చిత్రమయినది. ఆ విశేషమునందుండు వైచిత్ర్యమే అభినయమునకు చిత్రత్వమును సంపాదించును కాన ఈ అభినయము "చిత్రము" అనబడినది. [అభినవభారతి - 3 వ సం - పుటలు 264-265]



### ప్రకీర్ణ విషయములు

ప్రభాతము, గగనము, రాత్రి, ప్రదోషము, దివసము, ఋతువు, మేఘము, అంధకారము, విస్తీర్ణ జలాశయము, దిశ, గ్రహము, నక్షత్రము, మున్నగువాటిని ఆకాశమందున్న ఇతర పదార్థములను (చంద్రాదులను) స్వస్తికకరములను ఉత్తానములను పార్శ్వసంస్థితములను కావించి (స్వస్తిక-పతాకహస్తములను ఉత్తానము చేసి-అని కాశీముద్రణ పాఠము), శిరమును ఉద్వాహితముచేసి, ఊర్ధ్వ నిరీక్షణములతో, నానాదృష్టిసమన్వితముగా[4] నిరూపించవలెను.

భూమిస్థములైన వాటిని పైనవివరించిన స్వస్తికకరములతోడను, ఉద్వాహిత శిరముతోడను, అధోనిరీక్షణములతోడను నిరూపించవలెను[5].

చంద్రజ్యోత్స్న-వాయు-రస-గంధములు, సుఖము— వీటిని సర్పగ్రహణముచే, ఉల్లుకసనముచే (గ్రుడ్లగూబవలె ఊర్ధ్వవిధూననముచేయుట) నిర్దేశించవలెను.

సూర్య-రజో (ధూళి)-ధూమ-అనిలములు—వీటిని వస్త్రమును (ముఖమును-అని కాశీముద్రణపాఠము) కప్పుకొనుటచే నిర్దేశించవలెను.

అభినవగుప్తుని వివరణమును అంగీకరించక డా. ఘోష్ క్రింది విధముగా అభిప్రాయపడెను— "...But this does not appear to be convincing. The term (చిత్రాభినయ) seems to hint at the pictorial effect of the direct or indirect use of gestures and may be explained as 'చిత్రత్వం అభినయస్య' " [ఆంగ్లానువాదము - అధస్సూచిక - పుట 498.]

4. 9 వ అధ్యాయమందు చెప్పబడిన అభినయహస్తములకు కొన్ని విశేషములు ఈ అధ్యాయమందు పొందుపరచబడినవి. ఉదా: 9 వ అధ్యాయమందు సంయుత స్వస్తిక హస్తమును వివరించునప్పుడు "స్వస్తిక స్థానమునుండి విడివడిన ఈ హస్తములు దిక్కులను, మేఘమును, ఆకాశమును, వనమును, సముద్రమును, ఋతువులను, భూమిని, విస్తీర్ణమైన ప్రవాహమును అభినయించుటయందు ప్రయుక్తములగును" అని చెప్పబడినది [పుట 305]. ఇప్పుడీ అధ్యాయమందు ఆ హస్తములకు ఉత్తానత్వము, పార్శ్వస్థత, శిరము యొక్క ఉద్వాహనము, దృష్టి యొక్క ఊర్ధ్వత అనెడి విశేషములు చెప్పబడినవి. ఇదియే 'చిత్రము'. ఇట్లే తక్కినచోట్ల అన్వయించుకొనవలెను [అభినవభారతి - 3 వ సం - పుట 265]. ఇంకొక విషయమును ఈ సందర్భమున గుర్తుంచుకొనవలయును. అచ్చట ఒక హస్తము ఏయే అర్థములను నిరూపించునో పేర్కొనబడెను. ఇప్పుడిచ్చట ఏ అర్థమును ఎట్లభినయించవలయునో హస్తాభినయసహితముగా పేర్కొనబడుచున్నది.

5. నిరూపించవలసిన ఆయా విషయములను బట్టి ఒకప్పుడు దృష్టి విస్మితమును, ఇంకొకప్పుడు- తద్విహీనమును, ఒకప్పుడు ఊర్ధ్వమును, మరియొకప్పుడు అధోముఖమును అగుచుండును. [అభినవభారతి - 3 వ సం - పుట 265]

నీడకొరకు వెదకుటమూలముగా భూమి తాపమును (కాళ్ళుకాలుట), వేడిని ; ఊర్ధ్వాకేకరదృష్టితో మధ్యాహ్న సూర్యుని ; విస్మయాభినయముచే ఉదయ-అస్తంగతసూర్యుని నిర్దేశించవలెను.

సౌమ్యార్థయుక్తములును,సుఖభావకృతములును అయినవాటిని గాత్రస్పర్శ-రోమాంచములచే నిరూపించవలెను.

తీక్ష్ణరూపములు—స్పృశించకుండుట, ఉద్వేగము, ముఖమును ముడుచుకొనుట అనువానిచే తీక్ష్ణరూపములను నిరూపించవలెను.

గంభీరములును, ఉదాత్తములును అయిన అర్థములను సౌష్ఠవసంయుతములైన అంగములతో, సాటోపముగా, సగర్వముగా అభినయించుచు నిరూపించవలెను.

యజ్ఞోపవీతదేశస్థమైన అరాలహస్తముచే హంసమును అభినయించవలెను.

స్వస్తికమునుండి విడివడిన హస్తములచే హార-స్రక్-దామము (పూలదండ)లను నిరూపించవలెను.[6]

'సర్వము' అనెడి అర్థమును నిరూపించుటకు ప్రదేశినిని భ్రమింపజేయుచు, చుట్టునుచూచుటచే కాని, అలపల్లవహస్తమును రెండవహస్తముతో పీడించుటచేకాని[7] అభినయించవలెను.

ఆత్మస్థమును, పరస్థమును, మధ్యస్థమును అయిన శ్రవ్యమును శ్రవణయోగముచేతను, దృశ్యమును దృష్టివిలోకనములచేతను నిర్దేశించవలెను.

విద్యుత్తును, ఉల్కాపాతమును, మేఘగర్జనమును, విస్ఫులింగములను జ్వాలలను త్రస్తములైన అంగములను కుంచించుటచేతను, కనులను సంకోచించుటచేతను నిర్దేశించవలెను.

ఉద్వేష్టిత-పరావృత్తకరములతో, నతశిరముతో, జిహ్మదృష్టితో అనిష్టములును, అసంస్పర్శములును అగు వెనుకచెప్పిన విద్యుదుల్కాదులను నిర్దేశించవలెను.[8]

---

6. "అరాలహస్తములను రెండింటిని యజ్ఞోపవీతదేశమందుంచి పిమ్మట స్వస్తికమునుండి విడివడిన హస్తములతో హార-స్రక్-దామములను నిరూపించవలెను" అని కాశీ ముద్రణ పాఠము.

7. ప్రదేశినిని భ్రమింపజేయుచు అంతటను చూచుటచే "సర్వము" అనెడి అర్థమును అభినయించవచ్చును. లేదా అలపల్లవహస్తమును కాంగుళీహస్తముతో చేర్చుటచే కూడ "సర్వము" అనెడి అర్థము నిరూపింపబడును. ఇది పూర్వముచెప్పబడలేదు; కావున విశేషము. "సర్వము" అను శబ్దమును కూడ అందు వాడబడినప్పుడు దానిని వినుటచే కాని, ఆ దృశ్యమును చూచుటచే కాని అభినయించవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 267]

8. వెనుక చెప్పిన విద్యుదుల్కాదుల నభినయించుటకు ఇంకొక విధము చెప్పబడుచున్నది. పరావృత్తములును, అంతటను ఉద్వేష్టితములును అగు హస్తములతో దీనిని అభిన



ఉష్ణమును, వాయువును (ఆకాశమును-అని కాశీ ముద్రణ పాఠము), తేజస్సునుముఖప్రచ్ఛాదనముచేతను; రేణువులను, నీటిని, పతంగములను, భ్రమరములను నివారించుటచేతను నిర్దేశించవలెను.

సింహ-ఋక్ష-వానర-వ్యాఘ్ర-శ్వాపదములను నిర్దేశించుటకు స్వస్తికముగా ఉన్న పద్మకోశహస్తములను అధోముఖములను చేయవలెను.[9]

స్వస్తికముగానున్న త్రిపతాకహస్తములచే గురుపాదవందనమును అభినయించవలెను.[10]

ప్రతోదగ్రహణమును స్వస్తికముగానుంచిన కటకాముఖహస్తములచే ప్రదర్శించవలెను. ఒకటినుండి పదివరకునుగల అంకెలను అన్నేసి వ్రేళ్ళను చూపుటచేతను, దశ- (ఇరువది ముప్పది మొదలగు సంఖ్యలు) శత-సహస్ర సంఖ్యలను పతాకహస్తములచేతను, నిరూపించవలెను. దశ సంఖ్యను మించిన సంఖ్యలను ఆ సంఖ్యేయవస్తువు లెదురుగా లేనపుడు సంక్షేపముగా బహుత్వసూచనతో అభినయించవలెను.[11]

---

యించవలెను. ముందుభాగమున ముష్టిహస్తమును, వెనుకభాగమున పరాఙ్ముఖమగు అరాలహస్తమును ఉంచవలెను. జిహ్మదృష్టి తరువాత చెప్పబడును. ఆ దృష్టితో కూడియుండి పై రెండు హస్తములతో ఆవర్తన-ఉద్వేష్టనముల నాచరించుచు విద్యుదుల్కాదులను నిరూపించవలెను. [అభినవభారతి—3 వ సం - పుట 268]

9. సింహవ్యాఘ్రాదుల నిరూపణమును ఊర్ణనాభహస్తముచే చేయవలెనని వెనుక చెప్పబడెను. ఇచ్చట 'పద్మకోశహస్తములు' అనుదానిచే కుంచితములగు పద్మకోశహస్తములే ఊర్ణనాభ హస్తములని గ్రహించవలెను. ఈ ఊర్ణనాభ హస్తములకే "స్వస్తికముగానుంచుట" అను విశేష మిచ్చట చెప్పబడెను. లేదా పద్మకోశ హస్తములకే ఇందు అనుక్తమగు విశేషాభినయము చెప్పబడెనని గ్రహించవలెను. [అభినవభారతి—3 వ సం-పుట 268]

10. వెనుక త్రిపతాకహస్తమును గురుపాదవందనమున ఉపయోగించవలెనని చెప్పబడెను; వానిని స్వస్తికసంయుతములను కావించవలెనని ఇచ్చట విశేషము చెప్పబడెను. అట్లే కటకాముఖహస్తమును మంథన-శరాపకర్షణ - పుష్పాపచయ - ప్రతోదకర్మలయందుపయోగించవలెనని వెనుక చెప్పబడెను; ఆ హస్తములను స్వస్తికములుగా నుంచవలెనని ఇచ్చట విశేషము చెప్పబడినది. [అభినవభారతి—3 వ సం - పుట 268]

11. ఒకటి మొదలు పదివరకు అంకెలను నిరూపించుటకు వెనుక చెప్పిన హస్తములకే అనుక్తములగు విశేషములు చెప్పబడుచున్నవి. సూచీముఖహస్తమందలి ప్రదేశినిచే ఒకటి అను సంఖ్యను, త్రిపతాకమందలి లేదా కాంగులమందలి వ్రేళ్ళచే "రెండు మూడు, నాలుగు" అంకెలను, ముకుళహస్తమును ముడిచినదానిని విప్పుటచే "అయిదు"ను సూచించవలెను. ముకుళహస్తమునకు పై ప్రదేశినీ - త్రిపతాకా - కాంగులాదులను చేర్చి ఆరు మొదలు పదివరకును అంకెలను సూచించవలెను.

ఛత్ర-ధ్వజ-పతాకములను వాని దండమును ధరించిన ట్లభినయించుటచే నిర్దేశించవలెను. ఇంక ఆయా ఆకారములు కలవాటిని ధరించుటచే నానా ప్రహరణములను నిర్దేశించవలెను.[12]

స్మృతి-ధ్యాన-వితర్కములను ఏకచిత్తత, అధోముఖదృష్టి, కించిన్నతశిరము సందంశసవ్యహస్తము అనువానిచే నిర్దేశించవలెను.

అపత్య (సంతాన) నిరూపణమునందు శిరము ఉద్వాహితమును, హస్తములు హంసపక్షములును, కాగా, ఆ హస్తములను ప్రదక్షిణములును, ఉచ్ఛ్రయములును అగునట్లుగా చేయవలెను.

మానమును, దీర్ఘసత్త్వమును ఉద్వాహితశిరముచే, ఊర్ధ్వగతమగు హంసవక్త్రి హస్తముచే ప్రసాదన మొనర్చుచు నిర్దేశించవలెను.

వామ అరాలహస్తమును శిరమునందు సముద్వాహము చేయుటచే గమనమును, కడచినపనిని, నాశనమును, వాక్యసమాప్తిని నిరూపించవలెను.

ఋతువులు

శరత్తు—సర్వేంద్రియములు స్వస్థతతో ఉండుట, వదనము ప్రసన్నముగా ఉండుట, విచిత్రముగా ఉన్న భూతలమును పరిశీలించుట అనువానిచే శరదృతువును నిర్దేశించవలెను.

హేమంతము—గాత్రసంకోచనము, సూర్య-అగ్ని-పటములను సేవించుట అనువానిచే ఉత్తమ-మధ్యమ పురుషులు హేమంతర్తువును నిరూపించవలెను. శిరో-దంత-ఓష్ఠ-కంపనములచే, గాత్రసంకోచనముచే, ససీత్కార కూజితములచే అధములు శీతమును అభినయించవలెను. దైవఘటితము లేదా వ్యసనసంభవము అయిన

ఇరువది, ముప్పది, నలుబది మొదలగు వానిని పతాకహస్తములతో నిరూపించవలెను.

పదికిపైన లెక్కపెట్టవలసినపుడు సంక్షేపముగా బహుత్వమాత్రముననే అభినయించవలెను. సంఖ్యేయవస్తువులు ఎదురుగా లేక పరోక్షముగా ఉన్నపుడే ఇట్టి అభినయము చేయవలెను. ఆ వస్తువులు ఎదురుగా ప్రత్యక్షముగా ఉన్నచో వాని నొక్కొక్కదానిని నిర్దేశించుటచేతనే గణనము చేయవలెను. [అభినవభారతి - 3 వ సం - పుట 269]

12. వెనుక తొమ్మిదవ అధ్యాయమున దండధారణమునకు కటకాముఖహస్తమును ప్రయోగించవలెనని చెప్పి ఇందు దానిచే ఛత్ర-ధ్వజ-పతాకాదుల దండధారణమును చేయవలెనని విశేషము చెప్పెను. ఇచట వేరొక విధముగా కూడ వీటి నభినయించవచ్చును. శిరస్సుపైని అధోముఖముగ పతాక హస్తము నుంచుటచే ఛత్రమును, అయిదంగుళముల దూరముగ ఊర్ధ్వముగ పతాకహస్తము నుంచుటచే ధ్వజమును, సూచీముఖహస్తమునందలి అంగుళిచే పతాకను, ముష్టి-శిఖర-కపిత్థ-మృగశీర్షకాది హస్తములచే ఆయా ఇతర ప్రహరణములను నిరూపించవలెను. [అభినవభారతి - 3 వ సం - పుటలు 269–270]



అవస్థాంతరమందు ఉత్తములుకూడ ఎప్పుడేని పై విధముగానే (అధములవలెనే) శీతమును అభినయించవచ్చును.

శిశిరము—ఆ ఋతువునందు పుట్టిన పుష్పముల వాసనలను ఆఘ్రాణించుట, రూక్షవాయుస్పర్శము (ఉద్వేజనకరమగు వాయువు తాకిడి) అనువానిచే శిశిరర్తువును నిరూపించవలెను.

వసంతము— ప్రమోదమును కలిగించెడి ఆరంభ (ప్రయత్న)-ఉపభోగ-ఉత్సవములచేతను, నానాపుష్ప ప్రదర్శనములచేతను వసంతర్తువును నిర్దేశించవలెను.

గ్రీష్మము— చెమట తుడుచుకొనుట, నేల కాలుట, విసనకఱ్ఱలు, వేడిగాలి తగులుట అను వానిచే గ్రీష్మమును నిర్దేశించవలెను.

ప్రావృట్కాలము— కదంబ-నీప-కుటజ పుష్పములు, శాద్వల-ఇంద్రగోపకములు, సుఖస్పర్శములగు మేఘవాయువులు అను వానిచే ప్రావృట్ కాలమును (వర్షర్తువును) నిర్దేశించవలెను.

వర్షారాత్రము— గంభీరమేఘౌఘనాదము, ధారాప్రపతనము (కుంభవృష్టి), విద్యుత్-నిర్ఘాత (పిడుగు అనికూడ అర్థము కలదు) ఘోషములు (మెరుపులు, ఉరుములు) అను వానిచే వర్షించుచున్న రాత్రిని నిర్దేశించవలెను.

ఏ ఋతువునకు ఏది చిహ్నమో (పుష్పాదులు), ఏది వేషమో (తత్కాలోచితములైన వస్త్ర-ఆభరణ-అలంకరణములు), ఏది రూపమో (ఆతప-చంద్రజ్యోత్స్నాదులు) వాటిచేతను లేదా ఇష్ట - అనిష్టార్థప్రదర్శనములచేతను ఆ ఋతువును అభినయించవలెను. అర్థవశముచే ఈ ఋతువులను రసానుసారముగా (అనగా సుఖితులను సుఖోపేతులనుగా, దుఃఖితులను దుఃఖసంయుక్తులనుగా) నిరూపించవలెను.*

భావ-విభావ-అనుభావములు

భావము—సుఖదములు లేదా తదితరములు అయిన భావములలో ఏ వ్యక్తి ఏ భావముచే ఆవిష్టుడగునో ఆతడు తదాహిత సంస్కారముకలవాడై, సర్వమును తద్భావమయముగనే చూచును. కావున విభావ-అనుభావ ప్రదర్శనముచే భావాభినయమును చేయవలెను. అట్లు విభావముచే ఆహృతమైనభావము అనుభావప్రదర్శనముచే సిద్ధినిపొందును.[13]

*[కాశీముద్రణమునందు 26వ అధ్యా - 1–37 శ్లో; బొంబాయి ముద్రణమునందు 25వ అధ్యా - 1–26 శ్లో; బరోడాముద్రణమునందు 25వ అధ్యా - 1–38 శ్లో.]

13. భావములను విభావాదులచే అభినయించవలెను- వెనుక భావములను సూచించుట కేయే హస్తముల నుపయోగించవలెనో చెప్పబడెను. ఆయా భావములను, తత్తదు

విభావము— విభావముచే ఆహృతమైన కార్యము అనుభావముచే సహృదయహృదయసామీప్యమును పొందింపబడుచున్నది. ఆత్మవిశ్రాంతమైన సుఖ-దుఃఖాదిజ్ఞానరూపమగు అనుభవము 'భావ' మనబడును. అట్టి సుఖ-దుఃఖాది హేతువు అగు ఇతర వస్తుజ్ఞానము 'విభావ' మనబడును.[14] గురువు, మిత్రుడు (కార్యవశమున లేదా సమానఖ్యాతియోగమువలన పరిచితుడు), సఖుడు (సహపాంసు క్రీడనా పరిచితుడు=బాల్యసఖుడు),స్నిగ్ధుడు, సంబంధి, బంధువు మున్నగువారు విభావములు. వేని దర్శనమువలన చిత్తవృత్తి (సుఖ-దుఃఖాదిరూపము) జనించునో అవి 'విభావము' లనబడును.[15]

అనుభావము— అట్లు వచ్చినవానికి సంభ్రమముతో ఎదురేగుట, అర్ఘ్య-పాద్య-ఆసనములచే భక్తితో పూజించుట 'అనుభావ' మనబడును. (గుర్వాదులు విభావమైనప్పుడు ఇవి అనుభావములని తెలియవలెను). ఇట్లే ఇతర సందర్భములందును నానాకార్యప్రదర్శనములనుబట్టి ప్రయోజనవశముగా విభావమును, భావమును (అనుభావ-స్థాయి-వ్యభిచారులను) బుధులు తెలియవలెను. దూతకు ప్రతిసందేశమిచ్చుటయును అనుభావమే అగును.[16]

---

చితములగు విభావాదులచే అభివ్యక్తమైనవానిని, హంసపక్షాదులచే అనుభావములను కూర్చి అభినయించవలెను.

విభావము అభినయమెట్లగునని ప్రశ్నించవచ్చును. విభావముచే చిత్తవృత్తి బహిరుద్గతమగును. కావున విభావము భావమునకు గమకము. విభావముచే జనించిన భావము అనుభావములచే సిద్ధిపొందింపబడును. కావున విభావము భావమునకు గమకహేతువగునట్లే భావము అనుభావమునకు గమకమగును. ఈ అనుభావము జనించుటలో మరియొక భావముయొక్క సాహచర్యము లేదు; కావున భావమే గమకము. ఈ భావమే అనుభావరూపమున సిద్ధినందునని తెలియవలెను. [అభినవభారతి - 3 వ సం - పుటలు 272–273]

14. భావమనగా ఆత్మానుభావనము; అనగా ఆత్మవిశ్రాంతమగు సుఖ - దుఃఖజ్ఞానరూపమగు అనుభవనము. 'ఆత్మానుభవనము' అనుచోట ఆత్మవిశ్రాంతమగు అనుభవమనుటచే ఘటాద్యనుభవములు భావములు కావని తెలియవలెను.

ఆత్మానుభవనము అను పదమునకు "ఆత్మ దేనిచే అనుభవింపజేయబడునో అది"అని అర్థము; భావమనియు కొందరు అర్థము చెప్పుదురు. ఎటులైనను సుఖ - దుఃఖాదులు భావములని ఎరుంగవలెను.

పరదర్శనము విభావమనబడును; అనగా సుఖాదిజనకమగు - స్వేతరవస్తుజ్ఞానము 'విభావము'. [అభినవభారతి - 3 వ సం - పుట 273]

15. దీనినిబట్టి విభావము తప్పక 'దర్శనవిషయము' కావలెనని స్పష్టమగుచున్నది. [అభినవభారతి - 3 వ సం - పుట 273]

16. గుర్వాది విభావములు చిత్తవృత్తిజననమున నియతసాహచర్యమును కలిగియున్నవని ఎరుంగవలెను. వారిని చూడగనే సంభ్రమముతో లేచుట, ఎదుర్కొనుట



అభినయ సామాన్యలక్షణము

భావ-విభావ-అనుభావములు పైవిధముగానుండును; ఇవి పురుషులచేతను, ప్రమదలచేతను కూడ అభినయింపబడును. స్వభావాభినయమందు పురుషులు వైష్ణవస్థానమును, స్త్రీలు ఆయతస్థానమును లేదా అవహిత్థస్థానమును గ్రహించవలెను. కాని, ప్రయోజనవశమున బహువిధములగు ప్రయోగములందు నానాభినయములకొరకు తక్కిన స్థానములనుకూడ గ్రహించవచ్చును. పురుషుల చేష్టితము ధైర్యలీలాంగసంపన్నమును, స్త్రీల చేష్టితము మృదులీలాంగహారోపేతమును కావలయును. అనగా స్త్రీల కర-పాద-అంగసంచారములు 'లలితము'గానుండవలెను; ఇంక పురుషుల కర-పాద-అంగసంచారములు ధీరములును, ఉద్ధతములును కావలయును. స్త్రీలు రస-భావానుగుణముగా చక్కగా భావప్రదర్శనమును చేయవలెను. పురుషుల భావాభినయమును, స్త్రీల భావాభినయమును వేర్వేరుగా ఉండును. అట్టి భావాభినయములను క్రమముగా వివరింతును.

స్త్రీ-పురుషులు భావాభినయిముచేయు విధానము

హర్షము : గాత్రాలింగనము, సస్మితనేత్రములు, ఉల్లుకసనము అను వానిచే పురుషుడు హర్షమును ప్రదర్శించవలెను. ఆకస్మికముగా కలిగిన రోమాంచముతో, ఆనందబాష్పములతో నిండిన కనులతో, సస్మితవాక్యములతో ప్రీతిపూర్వకముగా నరక్తి (స్త్రీ) హర్షమును ప్రదర్శించవలెను.

క్రోధము :[17] ఉద్వృత్తములైన ఎఱ్ఱని కనులతో, పెదుకరచుచు, నిశ్వాసముతో, కంపించుచున్న అంగములతో పురుషుడు క్రోధమును అభినయించవలెను.

---

మున్నగునవి చేయుటయే వారివలన హృదయమందు జనించిన చిత్తవృత్తికి నిదర్శనములు.

ఇచట చూపిన విభావానుభావములు కేవలము ఉదాహరణ మాత్రములే. ఇతరములగు శృంగారాది రసములందును విభావాదులను ఎరుంగవలెను.

ఇది ఈ చిత్తవృత్తికి విభావము అని నియమముగాచెప్పుట కవకాశములేదు. ప్రయోజనవశమున ఆ విభావమే మరియొక చిత్తవృత్తిని గూడ జనింపజేయుచుండును.

విభావ - అనుభావములు తప్పక ప్రత్యక్షదృశ్యములే కావలెనను నియమములేదు అని చూపుటకే దూతసందేశ - ప్రతిసందేశములు కూడ విభావానుభావములగునని నిర్దేశింపబడినది. ఇట్లు ప్రత్యక్ష - శబ్ద - అనుమాన ప్రమాణములచే గ్రహింపబడినవి కూడ విభావానుభావములగును. [అభినవభారతి—3 వ సం - పుటలు 273-274]

17. 'క్రోధమును అభినయించవలెను' అనగా 'క్రోధప్రాప్తి' ని అని అర్థము. వెనుక సామాన్యాభినయము శృంగారాదిరసముల మూలమున వివరింపబడినది. ఇందు వ్యభిచారిభావముల విషయమున అభినయము చెప్పబడుచున్నది. [అభినవభారతి—3వ సం - పుటలు 275-276]

బాష్పపూర్ణములైన నేత్రములు, బాగుగా కంపించుచున్న చిబుక-ఓష్ఠములు, కంపించుచున్న శిరము, భ్రుకుటి, మౌనము, అంగుళిభంగము (వ్రేళ్ళు విరుచుట), మాల్య-ఆభరణములను వర్జించుట అనువానితో ఆయతస్థానమందు నిల్చి స్త్రీలు ఈర్ష్యాక్రోధమును అభినయించవలెను.

*దుఃఖము (శోకము)*: అధికములైన ఉచ్ఛ్వాస - నిశ్శ్వాసములు, అధోముఖుడై ఆలోచించుట, ఆకాశవచనములు (ఆకాశవీక్షణములు - అని కాశీ ముద్రణపాఠము) అనువానిచే పురుషుడు దుఃఖమును అభినయించవలెను. రోదనము, నిశ్శ్వాసములు, నెత్తి (లేదా గుండెలు) బాదుకొనుట, భూమిపై పడుట, అభిఘాతము అనువానిచే స్త్రీలు దుఃఖమును అభినయించవలెను. పైని చెప్పబడిన ఆనందజము, లేదా ఆర్తిజము, లేదా ఈర్ష్యాసంభూతము అయిన రోదనము స్త్రీ-నీచపాత్రలచేతనే అభినయింపబడవలెను.

*భయము*: సంభ్రమ - ఆవేగపూర్వకములైన చేష్టలు, శస్త్రసంపాతము, ధైర్యము, ఆవేగము, బలము మొదలగువానిచే పురుషుడు భయమును అభినయించవలెను. చలించుచున్న తారకలతోకూడిన కనులు, స్ఫురిత-కంపిత గాత్రము, సంత్రస్త హృదయము, పార్శ్వావలోకనము, ప్రియాన్వేషణము, ఆక్రందనము, ప్రియాలింగనము అనువానిచే స్త్రీలు భయమును అభినయించవలెను.

*మదము*: పూర్వోక్తములైన మదభేదములను స్త్రీలును, నీచులును అభినయించవలెను. లలితములైన తొట్రుపాటులు, శూన్యాకాశావలంబనము, నేత్రములు తిరుగుడువడుట, ఆగిఆగి మాటాడుట లేదా ప్రలాపమొనర్చుట, శరీరము కంపించుట అనువానిచే స్త్రీలు మదమును అభినయించవలెను.

పైవిధముగా స్త్రీ-పురుషులు అవసరమునుబట్టి భావాభినయమును చేయవలెను.

> సర్వే సలలితా భావాః స్త్రీభిః కార్యాః ప్రయత్నతః । 66
> ధైర్యమాధుర్యసంపన్నా భావాః కార్యాస్తు పౌరుషాః ॥ 67

—సలలితములగు భావములన్నియుస్త్రీలచే ప్రయోగింపబడవలెను. ఇంక ధైర్య-మాధుర్యసంపన్నములగుభావములు పురుషప్రయోజ్యములుగా కల్పింపబడవలెను.[18]*

18. ఈ విషయము పెక్కుసార్లు చెప్పబడినది. ఈ అధ్యాయమందే ఇంతకుముందొకసారి చెప్పబడినది కదా (పుట 721 చూడవలెను)—

> ధైర్యలీలాంగసంపన్నం పురుషాణాం విచేష్టితమ్ ।
> మృదులీలాంగహారైశ్చ స్త్రీణాం కార్యం తు చేష్టితమ్ ॥ 49



### పక్షులు

త్రిపతాక హస్తమందలి రెండు వ్రేళ్ళను చలింపజేయుటచే శుక-శారికలను, తదితర సూక్ష్మపక్షులను నిర్దేశించవలెను.

స్వభావస్థూలములైన శిఖి-సారస-హంసములను తదుచితములైన రేచక-అంగహారములతో నిరూపించవలెను.

### మృగములు

ఖర-ఉష్ట్ర-అశ్వ-ఇభ-సింహ-వ్యాఘ్ర-గో-మహిషాదులను తదుచితములైన గతిప్రచారములచేతను, శిరోగ్రీవాది కర్మలచేతను నిర్దేశించవలెను.

### భూత - రాక్షసాదులు

భూత-పిశాచ-యక్ష-దానవ-రాక్షసులను ఆయా అంగహారములచేతను, నామసంకీర్తనముచేతను నిర్దేశించవలెను. వారు అప్రత్యక్షము (invisible) గా ఉన్నప్పుడు అంగహారములచేత వారిని నిర్దేశించవలెను; ప్రత్యక్షముగానున్నప్పుడు భయ-ఉద్వేగములతోను, విస్మయముతోను వారిని నిర్దేశించవలెను. (స్త్రీ-నీచులు భయోద్వేగములను, ఉత్తములు విస్మయమును చూపవలెను).

### దివ్యులు

దివ్యులు అప్రత్యక్షముగా ఉన్నప్పుడు అర్థవశముగా ప్రణామముచేయుట, భావ-విచేష్టితములు, చిహ్నములు (రుద్రునకు శూలము మొ॥) అనువానిచే వారిని నిర్దేశించవలెను.

### ప్రకీర్ణ విషయములు

అభివాదనము—(1) నరులకు అభివాదనము చేయునప్పుడు వారు అప్రత్యక్షముగానున్నచో సవ్యపార్శ్వమునందు పైకెత్తబడిన అరాలహస్తముతో శిరమును స్పృశించవలెను. (2) దేవ-గురు-ప్రమదలకు కటకావర్ధమాన లేదా కపోతహస్తముచే అభివాదనము చేయవలెను. (3) ప్రత్యక్షముగానున్న దివౌకసులకును,

> కరపాదాంగసంచారాః స్త్రీణాం తు లలితాః స్మృతాః ।
> సుధీరశ్చోద్ధతశ్చైవ పురుషాణాం ప్రయోక్తృభిః ॥ 50

స్త్రీ-పురుషుల అభినయములందలి భేదమునుగూర్చి ఒకటవ అధ్యాయమందలి 2 వ విశేషాంశములో కొంత వివరించియున్నాను (చూ. పుటలు 20-21).

* [కాశీ ముద్రణమునందు 26 వ అధ్యా—88-68 శ్లో : బొంబాయి ముద్రణమునందు 25 వ అధ్యా—27-66 శ్లో ; బరోడా ముద్రణమునందు 25 వ అధ్యా—39-67 శ్లో.]

పూజ్యులకును అభివాదనముచేయునప్పుడు ప్రణామముచేయుచు వారి ప్రభావమునకు లోనైనట్లు కన్పట్టవలెను.

పరిమండలసంస్థమైన పతాకహస్తముచే మహాజనమును, సఖీవర్గమును, విటులను, ధూర్తులను నిర్దేశించవలెను.

ప్రసారితములైన రెండు హస్తములను ఉత్క్షిప్తముచేయుటచే పర్వతముల ఎత్తును, ఎత్తైన వృతములను నిర్దేశించవలెను.

సమూహమును, సేనను, బహుత్వమును, విస్తీర్ణతను, సాగరమును ఉత్క్షిప్తములైన రెండు పతాకహస్తములచే నిరూపించవలెను.

శౌర్య-ధైర్య-గర్వ-దర్ప-ఔదార్య-ఉచ్ఛ్రయములను లలాటదేశసంస్థమైన అరాలహస్తముచే నిర్దేశించవలెను.

వక్షోదేశమునుండి అపావిద్ధములైన మృగశీర్షహస్తములను ఎక్కువ వేగముతో ఉత్క్షిప్తములను చేయుటచే అపావృతములైన వాటిని (open things) నిర్దేశించవలెను.

వేలా-బిలద్వార-గృహ-గుహలను అధోముఖములును, ఉత్తానతలములును, కించిత్ప్రసారితములును అయిన హస్తములతో నిర్దేశించవలెను.

కామ-శాప-గ్రహగ్రస్తులను, జ్వరోపహతులను తత్తత్సదృశములైన (దోలాహస్తాది రూపములైన) అంగాదులచే (అది శబ్దముచే దృష్టి-సాత్త్వికములు గ్రాహ్యములు) నిరూపించవలెను.

దోలావిలోలనము (ఉయ్యెలను ఊపుట), గాత్రసంక్షోభము, రజ్జుగ్రహణము అనువానిచే దోలను (ఉయ్యెలను) నిర్దేశించవలెను. పుస్తకర్మచే నిర్మితమైన ఉయ్యెల రంగమునందు ప్రత్యక్షముగానున్నప్పుడు దానియందు కూర్చుండియే అభినయించవలెను.

**ఆకాశవచనాదులు**[19]

ఇంక ఆకాశవచన-ఆత్మగత-అపవారితక-జనాంతికముల అభినయమును వివరింతును—

**ఆకాశవచనము : దూరస్థునితో మాటాడుట అనగా రంగమున ప్రవేశించని పాత్రకు సంబంధించిన మాటలను "ఓహో ఇట్లనుచున్నావా" అను మాటలతో**

---

19. ఇది వాచికాభినయమునకు సంబంధించిన చిత్రాభినయమని తెలియవలెను. ఇచ్చటనుండి "ఇంక కాలుర పాఠ్యము కలస్వనయుతముగానుండవలెను" అనెడి పర్యంతము ఇది వాచికాభినయమందలి చిత్రాభినయమే. [అభినవభారతి - 3వ సం - పుట 282]



మధ్యమధ్య చెప్పుచు వానికి సమాధానములుగా తానా రంగమున ప్రవేశించని వానితో మాటాడుట 'ఆకాశవచన' మనబడును. ఇందు కావ్యభావసముత్థితములును, నానాకారణసంయుక్తములును అయిన సమాధానరూపములైన వాక్యములతో సంలాపమును సాగించవలెను.[20]

**ఆత్మగతము :** మనస్సులో అనుకొనెడి మాటలు 'ఆత్మగత' మనబడును. ఇది ప్రాయికముగా సవితర్కమై నాటకాదులందు ప్రయుక్తమగుచుండును. సవికల్పమును, హృదయస్థవిషయమును, భావస్థవిషయమును అయినది ఆత్మగతమేఅగును.[21]

**అపవారితకము :** నిగూఢభావసంయుక్తమైన సంభాషణము 'అపవారితక' మనబడును (ఇతరులకు వినపడకుండ ఒక్కనికే చెవిలో చెప్పుట)

**జనాంతికము :** కార్యవశమున పార్శ్వగతులు వినరానిది 'జనాంతిక' మనబడును. (రంగమందున్న వారిలో ఆ మాటలకు సంబంధించినవానికి తప్ప తక్కినవారి కిందలి సంభాషణము వినపడవచ్చును.)[22]

ఈ విధముగా గూఢార్థయుక్తములు, జనాంతికములు (అశ్రావ్య-నియతశ్రావ్యములు) అగు వాక్యములను నాటకమునందు ప్రయోగింపవలెను.

---

20. దూరస్థాభాషణము=రంగమున ప్రవేశింపనివానితోడి సంభాషణము. దీనిని అశరీర నివేదన-పరోక్షాంతరితములచే నిరూపించవలెను. అనగా వ్యక్తి లేకుండగనే అతని వాక్యములను కూడ చెప్పుచు, ఆ మాటలయనంతరము "ఇట్లనుచున్నావా?" అని సమాధానముగా తాను మాటాడుచుండవలెను. [అభినవభారతి - 3వ సం - పుట 280]

21. అతిహర్షము, మదము, ఉన్మాదము, రాగము, ద్వేషము, భయము, విస్మయము, క్రోధము, దుఃఖము అనెడి భావములలో ఒకదానితో కాని, వెక్కింటితో కాని కూడుకొనియున్న పురుషుడు తన మనోభావములను వెలిపుచ్చుకొనుట'ఆత్మగత'మనబడును— ఇది కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము. బరోడా ముద్రణమునందు లేదు.

22. ఒకడే వినవలెనని ఇతరులకు వినపడకుండునట్లు రహస్యముగా చెప్పబడునది అపవారితము. ఒక్కడుమాత్రము వినకుండునట్లు మిగిలినఅందరికిని చెప్పబడునది జనాంతికము. కొందరు ఇవి రెండును జనాంతికమే అని అందురు. ఎంతమంది వినవలెనని ఉద్దేశించెనో అంతమంది సమీపముననే చెప్పబడునది జనాంతికము; "జనస్య అంతికే యదుచ్యతే తత్ జనాంతికమ్". తానుద్దేశించినవాని కంటె ఇతరుడు వినకుండుగాక అని చెప్పబడునది కావున జనాంతికమే అపవారితకమును అగును. ఇట్టి రెండువిధములగు జనాంతికములును నిగూఢ భావములతో (ఇతరులనుండి మరుగుపెట్టునట్టి భావములతో) కూడినవే అని ఎరుంగవలెను. [అభినవభారతి- 3వ సం - పుట 281]

కుమారగిరిరెడ్డి తన వసంతరాజీయమందు ఆత్మగతాదులను క్రిందివిధముగా వివరించినట్లు కాటయవేముడు అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యానములో పేర్కొనెను—

అశ్రావ్యం వియతశ్రావ్య మీషచ్ఛ్రావ్య మితిత్రిధా। అశ్రావ్య మన్యై రజ్ఞాత మాత్మన్యేవ స్థితం విదుః॥

కర్ణోక్తము: పూర్వవృత్తమగు విషయమును (రంగమునందు అంతకుముందే ఒకసారి ప్రదర్శితమైనదానిని) కారణాంతరములచే మరల తప్పక చెప్పవలసి వచ్చినప్పుడు, పునరుక్తతను పరిహరించుటకు, చెవిలోనే చెప్పవలెను. ప్రత్యక్షకృతములు లేదా పరోక్షకృతములు, ఆత్మసముత్థములు లేదా పరకృతములు అయిన ఆకాశ-జనాంతిక-ఆత్మగత పాఠ్యములను అవ్యభిచారముతో (వెనుక చెప్పిన కాలాది పాఠ్యనియమములను విడువకయే) పఠించవలయును. త్రిపతాక హస్తమును అంతరితముచేసి జనాంతిక-అపవారితకములను ప్రయోగించవలెను.*

స్వప్నాయితాదులు

స్వప్నాయిత (పలవరింత) మందలి వాక్యార్థములను హస్తసంచారములచే అభినయించరాదు; సుప్తాభిహితములైన (పలవరింతలవంటి) వాక్యార్థములచేతనే స్వప్నాయితమును అభినయించవలెను. స్వప్నాయితమందలి పాఠ్యము మందస్వరముగను, వ్యక్తావ్యక్తముగను, పునరుక్తవచన-అర్థసహితముగను, గతించినవాటిని స్మరించునదిగను ఉండవలెను.

మరణకాలమందలి కాకువు శిథిలాక్షరముగను, గుర్వక్షరసహితముగను, కరుణాక్షరయుతముగను, ఘంటానుస్వరితసదృశముగను, గద్గదముగను, హిక్కా-శ్వాసోపేతముగను ఉండవలెను.[23]

---

తదాత్మగతమిత్యుక్త్వా నాట్యవ్యంగ్యే నివేశయేత్। అర్థస్త్వేకేన విజ్ఞేయో నియతశ్రావ్య ఇష్యతే।
ద్వివిధః సపరిజ్ఞేయో జనాంతశ్చాపవారితమ్। గుహ్యోగుహ్యతరశ్చేతి జనాంతో ద్వివిధోమతః।
స్యాజ్జనాంతిక మిత్యుక్త్వా వాచ్యః పూర్వ స్తథాపరః। కర్ణ ఏవ మిత్యుక్త్వా జ్ఞావ్యః పశ్చాత్పంగతేః।
సర్వైరాకర్ణనీయార్థః శ్రావ్య ఇత్యభిధీయతే। ఏతం ప్రకాశ మిత్యుక్త్వా తయోరంతే ప్రయోజయేత్।

స్వగతాదులను సింగభూపాలుడు క్రిందివిధముగా వివరించెను— "అసూచ్యము దృశ్యము (చూడదగినది), శ్రావ్యము (వినదగినది) అని రెండువిధములు. శ్రావ్యము— స్వగతము, ప్రకాశము అని రెండు విధములు. తనకు మాత్రము తెలియునది స్వగతము; ప్రకాశమనునది సర్వప్రకాశము, నియతప్రకాశము అని రెండు విధములు. అచ్చటనున్న అందరును వినదగినది సర్వప్రకాశము. అచ్చటనున్నవారిలో ఒక్కడు మాత్రము వినదగినది నియతప్రకాశము. ఆ నియతప్రకాశము కూడ జనాంతము, అపవారితము అని రెండు విధములు. మూడువ్రేల్లదగ్గరకు చేర్చిన హస్తము నితరులకు అడ్డముపెట్టి కథామధ్యమున ఒక్కనితో మాటాడుట జనాంతికము. ప్రక్కకుతిరిగి ఒక్కనితో రహస్యముచెప్పుట అపవారితము." [రసార్ణవసుధాకరము - పుట 961.]

*[కాశీముద్రణమునందు 26 వ అధ్యా—64-89 శ్లో; బొంబాయి ముద్రణమునందు 25 వ అధ్యా—66-95 శ్లో; బరోడా ముద్రణమునందు 25 వ అధ్యా—67-94 శ్లో.]

23. ప్రశిథిలములు అగు అక్షరములు=ఆయా ఉచ్చారణ స్థానములనుండి భ్రష్టములైనవి; గుర్వక్షరములు=తమతమ వ్యాపారమును చేయజాలని జిహ్వాగ్రోష్ఠాగ్రమధ్య



మూర్ఛయందలి పాఠ్యమును మరణకాలమందువలెనే హిక్కా-శ్వాసోపగతముగానుండవలెను.

అతిమత్తతయందలి పాఠ్యము స్వప్నాయితమందువలెనే ప్రయుక్తము కావలెను.

వృద్ధులపాఠ్యము గద్గదికతో, తొట్రుపాటుతో, అసమాప్తాక్షరములతో కూడి యుండవలెను.

ఇంక బాలుర పాఠ్యము కలస్వన (మధురస్వర) యుతముగానుండవలెను.[24]

మరణము

మరణాభినయము నానాభావోపగతముగానుండును. విక్షిప్తములు, నిభృతములు, సన్నములును అయిన హస్త-పాదములచే దీనిని అభినయించవలెను. మరణము వ్యాధికృతమైనప్పుడు నిషణ్ణగాత్రములతో, హిక్కా-శ్వాసోపేతముగా, పరాధీనగాత్రముతోనుండవలెను. ఇంక విషపానముచేగాని విషజంతుదంశముచేకాని సంభవించిన మరణమునందు అభినయము విషవేగక్రమ నిరూపకము, విక్షిప్తగాత్ర-కర-చరణ సహితమును, విస్ఫురితాంగక్రియోపేతమును కావలయును. విషము యొక్క ప్రథమవేగమందు కార్శ్యమును, ద్వితీయవేగమునందు వేపథువును, తృతీయవేగమునందు దాహమును, చతుర్థవేగమునందు విలల్లికను, పంచమవేగమునందు ఫేనమును, షష్ఠవేగమునందు గ్రీవాభంగమును, సప్తమవేగమందు జడతను, అష్టమవేగమునందు మరణమును అభినయించవలెను (విషవేగమును ఎనిమిది అవస్థలుగా చూపవలెనని సారాంశము. ఇంతకుముందివి 254 పుటలో వివరింపబడినవి.)

పై విషవేగములను క్రిందివిధముగా అభినయించవలెను—

కార్శ్యము— ప్రథమ వేగమందు వాడిన ముఖమును, చెక్కిళ్ళను కలిగి వాక్యములను మెల్లగా పలుకుచుండవలెను.

---

మూలములకు సంబంధించిన అక్షరములు; ఘంటానుస్వరితము=కదల్పబడిన ఘంటానాదానుకరణయుతము—అట్లు పలుకబడిన వాక్యమందలి గద్గద స్వరభేదమునుండి జనించిన తారమంద్రాదులతోను, ఉదాత్తానుదాత్తాదులతోను కూడినది. మరణకాలమందలి కాకువు త్రైవిధ్యముగా ఉండవలెను. [అభినవభారతి—3 వ సం - పుట 262]

24. ఇంతవరకు ఆకాశభాషిత-ఆత్మగత - అపవారిత - జనాంతిక - కర్ణోక్త - స్వప్నాయితోక్త - మరణమూర్ఛా మదభాషిత - వృద్ధ బాలోక్తములు అను భేదములచే వచనగతమగు చిత్రాభినయము వివరింపబడినది. మరణమందలి కాకువుతోపాటు ప్రసంగవశమున మరణాభినయము కూడ వివరింపబడుచున్నది. [అభినవభారతి - 3 వ సం. పుటలు282 283]

వేపథువు— ఇందు సర్వాంగములను వణికించుచు, అంగములను గోకికొను చుండవలెను. యథాయోగముగా హస్త-పాద-శిరముల నన్నింటిని కాని, లేదా విడి విడిగా కాని కంపింపజేయుచుండవలెను. (ఇది కాశీముద్రణ పాఠము; బరోడాముద్రణమునందు లేదు).

దాహము—ఇందు, హస్త-గాత్రములను విక్షిప్తములను చేయవలెను.

విలల్లిక (హిక్క-అని కాశీముద్రణ పాఠము)—మాటిమాటికిని రెప్పలు ఆర్పుచుండుట, ఉద్గారము (ఉమ్మి), ఛర్దనము (వాంతులు), చేతులను కాళ్ళను ఆడించుట, అస్పష్టముగా మాటాడుట అనువానిచే దీనిని అభినయించవలెను.

ఫేనము—ఉద్గార-వమనములు, అనేక విధములైన శిరోవిలోలనములు, నిస్సంజ్ఞత, నిమేషములు అనువానిచే దీనిని అభినయించవలెను.

గ్రీవాభంగము—(శిరోభంగము) అంస-కపోలములు కలియునట్లుగా శిరమును వ్రేలాడవేయుటచే దీనిని అభినయించవలెను.

జడత— సర్వేంద్రియసంమోహము (నిశ్చేష్టత) జడతఅగును.

మరణము—వ్యాధి వృద్ధియగుటవలన, లేదా పాముకాటువలన సంభవించెడి మరణమును, నాట్యధర్మిని అనుసరించి, నేత్రములను సంమీలితములు చేయుటచే నిర్దేశించవలెను.

పునరుక్తి

సంభ్రమ - రోష - శోక - ఉత్పాత - ఆవేశములందు ప్రయుక్తము లయ్యెడి వాక్యములకు పునరుక్తి దోషములేదు. ఇప్పట్ల సాధుసాధు (బాగుబాగు—ఇది శబ్ద పునరుక్తి) సాధు భద్రం(బాగు మంచిది-ఇది అర్థపునరుక్తి), అహో (అలాగా), మాం (నన్ను), హేహే, కిం (ఏమి), త్వం (నీవు), మామా (వద్దువద్దు), వద(చెప్పు) మొద లగు మాటలను రెండేసి, మూడేసిసార్లు చెప్పవచ్చును.

హాస్యప్రధానమగు వాక్య (కావ్య) మందు[25] లక్షణవిరుద్ధముగా ఏదేని చెప్పబడినను అదికూడ హాస్యజనకమే అగునుకాన అచ్చట లక్షణోపేతమైన అభినయము లేకపోవుట దోషముకాదు.

---

25. ఇచ్చటి శ్లోకము క్రింది విధముగా నున్నది—

ప్రత్యంగహీనం యత్కావ్యం వికృతంచ ప్రయుజ్యతే ।
న లక్షణకృతస్తత్ర కార్యస్త్వభినయో బుధైః ॥ 113

ప్రత్యంగమనగా సంస్కారము. ప్రహసనప్రధానమగుటచే ఎట్టి సంస్కారములు లేక వికృతముగా, హాసప్రధానముగానుండు కావ్యమునందు కూడ అభినయము ఉండవలెను. కాని, ఆ అభినయములు లక్షణబద్ధములు కాక హాసమును జనింపజేయుటకు ఏదో ఒక విధముగా నుండవలెను.



ఉత్తముల కుచితమైన భావమును మధ్యములయందును, అట్లే మధ్యముల కుచితమైన భావమును నీచులయందును కూర్చరాదు. జ్యేష్ఠ-మధ్యమ-అధముల ఆత్మచేష్టాసముత్థితములైన భావ-రసములు విభిన్నములైనప్పుడే నాట్యము రంజకము కాగలదు. ఇంతవరకును చెప్పబడిన అభినయవిశేషము లన్నింటిని సత్త్వ భావ సంయుక్తములనుగా నిరూపించవలెను. ఇంక అన్యములైన లౌకికాభినయము లన్నియును లోకానుసారముగనే ప్రయుక్తములు కావలయును.

నానావిధై ర్యథా పుష్పై ర్మాలాం గ్రథ్నాతి మాల్యకృత్ ।
అంగోపాంగై రసైర్భావై స్తథా నాట్యం ప్రయోజయేత్ ॥[26] 117

—మాల్యకారుడు నానావిధములైన పుష్పములతో మాలలను గ్రుచ్చునట్లే అంగోపాంగాభినయములతో, రస-భావములతో ప్రయోక్తలచే నాట్యము ప్రయుక్తము కావలయును.

రంగమునందు ప్రవేశించినవానికి ఏలీలా-నియతగతులు నిర్దేశింపబడినవో వాటినే అతడు, విధి పూర్వకముగా, రంగమునం దున్నంతవరకును అవిముక్త సత్త్వుడై (సత్త్వమును విడువనివాడై) పాటించవలెను.[27]

లోకప్రామాణ్యము : లోకధర్మి

నాట్యమందలి అభినయములను ఇంతవరకును వివరించితిని. ఇందు చెప్పబడని అభినయ ప్రకారములను బుధులెల్లప్పుడును లోకమునుండియే గ్రహించవలెను. లోకము, వేదము, అధ్యాత్మము (ఆత్మజ్ఞానము లేదా ఆత్మానుభవము) అను ఈ మూడును త్రివిధప్రమాణము లనబడును. ప్రాయికముగా వేద-అధ్యాత్మములచే ప్రమితములైన పదార్థములందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. శబ్ద-ఛందస్సమ న్వయము వేద-అధ్యాత్మోపపన్నము అయియుండును. కావున వేద-అధ్యాత్మ ములు నాట్యమున ప్రమాణములు. లోకసిద్ధమైన పదార్థము ఎవ్వరిచేతను కాదన బడక తప్పక సిద్ధించినదే అగును. నాట్యము లోకాత్మకమే (లోకానుకీర్తన

---

26. భామహుని క్రింది శ్లోకములో పై శ్లోకానుసరణము కన్పట్టుచున్నది. [భామ హాలంకారము - ప్రథమ పరిచ్ఛేదము - 59 శ్లో.]

మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం । యోజ్యం కావ్యే ష్వవహితధియా తద్వదేవాభిధానమ్ ॥

27. పై శ్లోకమున అభినయములకు మాలాగ్రథనసామ్యముచేమానత్వమును, చిత్రత్వ మును ఉండవలెననిచెప్పి శ్రమవశమున సంపాదించిన ఈ అభినయములను రంగమునందున్నంత వరకు ప్రయత్నముతో రక్షించుకొనవలెనని చెప్పబడినది. అవిముక్తసత్త్వుడు అనగా 'అవష్టంభము అనగా ఆధారభూతము అగు ప్రకృతిని విడువనివాడై' అని అర్థము. రంగము నుండి నిష్క్రమించువరకు తాను ధరించిన ప్రకృతిని మరువకయే ఉండవలెను. [అభినవ భారతి - 8 వ సం - పుట 285]

రూపము) అగునుకదా.[28] కావున లోకము నాట్యమునకు ప్రమాణము. ఇట్లు నాట్యమునకు లోక-వేద-అధ్యాత్మములు మూడును ప్రమాణములని ఎరుంగవలెను.

దేవ-ఋషి-రాజ-జనపదుల (కుటుంబుల—అని కాశీ ముద్రణ పాఠము) పూర్వవృత్తానుకరణమే నాట్యమనబడును. మరియును నానావస్థాంతరాత్మకమైన లోకచరితము అంగాభినయోపేతమగుటయే నాట్యమనబడునుకదా. కావున, నానావస్థాంతరాత్మకమైన లోకవార్తయే నాట్యవేద విచక్షణులచే నాట్యమందు అనుసంధింపబడవలెను. లోకధర్మప్రవృత్తములై ఏయే శాస్త్రములు, ధర్మములు, శిల్పములు, క్రియలు కలవో వాటినెల్ల నాట్యమందు ప్రయోగింపదగును. [ఈ పేరాకు మూలమైన శ్లోకములు బరోడా ముద్రణమున అధస్సూచికలో ఉన్నవి.]

లోకమునందలి స్థావర-జంగమముల భావ-చేష్టావిధిని శాస్త్రముచే నిర్ణయించుటకు శక్యముకాదు. ప్రకృతులు నానాశీలురుగా ఉందురు; శీలమునందే నాట్యము ప్రతిష్ఠితమై ఉన్నది. కావున లోకమే ప్రమాణమని నాట్యప్రయోక్తలు తెలియవలెను.

అభినయ విధులనెల్ల చక్కగా తెలిసికొని రంగమందు ఏమనుజుడు ప్రయోగించునో, ఆ నాట్యతత్త్వాభినయ ప్రయోక్త లోకమునందు శ్రేష్ఠమైన సంమానమును పొందును. ఇట్లు వాక్ - నేపథ్య - అంగసంభవములైన అభినయములను సిద్ధిని వాంఛించెడి ప్రయోగజ్ఞులు నాటకమునందు ప్రయోగించవలెను.[29]*

పంచవింశాధ్యాయము సమాప్తము.

---

28. 2 వ విశేషాంశమును చూడవలెను.

29. అభినవగుప్తుడిచ్చట కోహలాదుల సంప్రదాయమున వచ్చిన చిత్రాభినయమును, సంప్రదాయ ప్రవాహ విచ్ఛేదము కారాదను నూహతో, 38 శ్లోకములలో వివరించియుండెను [అభినవభారతి - 3 వ సం - పుటలు 287-291]. అందు చాల శ్లోకములు తప్పులతో, క్లిష్టాన్వయములతో కూడియుండుటచే వాటిని అనువదించలేదు. (చూ.పుట 731)

* [కాశీ ముద్రణమునందు 26 వ అధ్యా—88-122 శ్లో; బొంబాయి ముద్రణమునందు 25 వ అధ్యా—96-130 శ్లో; బరోడా ముద్రణమునందు 25 వ అధ్యా—95-125 శ్లో]



## విశేషాంశములు

**1. 9, 25 అధ్యాయముల సమన్వయము.**

చిత్రాభినయము మొత్తము సామాన్యాభినయమునకు శేషభూతమైనను ఆంగికాభినయమునకే (9 వ అధ్యా.) ఎక్కువ సంబంధించియున్నది. అభినవభారతిలో ఈ రెండధ్యాయములందలి విషయములు సమన్వయింపబడినవి. ఈఅధ్యాయమందలి అధస్సూచికలలో అచ్చటచ్చట ఆసమన్వయమును సూచించియున్నాను. 9 వ అధ్యాయమందు ఒక హస్తము ఏయే పదార్థములను నిరూపించునో చెప్పబడెను. ఈ అధ్యాయమందు ఆయా పదార్థములు ఎట్లెట్లు అభినయింపబడవలెనో వివరింపబడినది. అంతియేకాక 9 వ అధ్యాయమందు ఆయా హస్తములకు చెప్పబడని విశేషములు కూడ ఇందు చెప్పబడినవి. ఇట్టి విశేషములు చెప్పబడుటచేతకూడ ఇది 'చిత్రాభినయ'మనబడినది. దీనికి చిత్రాభినయమను పేరు ఏల వచ్చినదో 3 వ అధస్సూచికలో వివరించియున్నాను.

ఈ అధ్యాయమును చదువుచున్నప్పుడు ఏ హస్తము పేరు చెప్పబడునో ఆ హస్తమును గూర్చిన వివరములకు 9 వ అధ్యాయమును కూడ చూడవలసియున్నది.

అభినయదర్పణాదులందు కూడ ఈ చిత్రాభినయమునకు సంబంధించిన భాగములు కలవు. అంతియేకాక బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలనందరిని నిరూపించు విధానముకూడ వాటియందు వివరింపబడెను. ఈ అభినయసృష్టికి నందీశ్వర - కోహలాదులు మూలపురుషులై యుందురు. అభినవగుప్తుడు ఈ అధ్యాయవ్యాఖ్యాంతమందు కోహలాదుల శ్లోకములను ముప్పది యెనిమిదింటిని పేర్కొనియుండెను. అందు కొన్ని శ్లోకములు సరిగాలేవు. మొదటి మూడు శ్లోకములను క్రింద అనువదించుచున్నాను—

ముఖసమీపమున హంసపక్ష హస్తమునుంచుటచే లేదా శక్తి ప్రదర్శనముచే కుమారస్వామిని నిర్దేశించవలెను.

రెండుప్రక్కలను సమ్ముఖములగుకటకాముఖ హస్తములచే విష్ణువునునిర్దేశించవలెను.

లీలాలోకితములతో రెండు సందంశహస్తములచే మన్మథుని సూచింపవలెను.

శివుని నిరూపించు పద్ధతినే పార్వతిని నిరూపించుటకు కూడ అవలంబించవలెను.

చతురహస్తముతో సరస్వతిని నిరూపించవలెను.

కటకాముఖ హస్తముతో లక్ష్మిని నిరూపించవలెను.

.... .... ...

ఇచ్చట ఒక విషయమును గమనించవలసియున్నది—కరణాంగహారములను గురుముఖముగానే నేర్వవలెననియు, పుస్తకమును చదివి స్వయముగా అభ్యసించుటకు ప్రయత్నించినంత మాత్రమున సౌష్ఠవము చేకూరదనియు చెప్పియున్నాను [పుటలు 182-188 చూడవలెను]. దానిని ఇచ్చట కూడ అనువదించుకొనవలయును. "చతురహస్తముతో సరస్వతిని నిరూపించవలెను" అని చెప్పుటచే 'చతురహస్తము' ను పట్టినంత మాత్రమున సరస్వతి నిరూపితము కాదు; ఆ హస్తమును ఎచ్చట ఏ విధముగా పట్టవలెనో నాట్యాచార్యునకే తెలియును. వాటినెల్ల శాస్త్రమందు నిరూపించుటకు వీలుండదు. కావున నృత్త-నృత్యముల విషయమున గురుశుశ్రూష అత్యావశ్యకము.

2. ప్రమాణములు

నాట్యము త్రైలోక్యానుకరణము కావున నాట్య విషయమున 'లోకము' ఒక ప్రమాణము. అట్లే వేదము, అధ్యాత్మము కూడ నాట్య విషయమున ప్రమాణములే. ఈ విషయమును భరతుడే పేర్కొనెను. ఈ సందర్భమున అభినవగుప్తుడు క్రింది విధముగా వివరించెను—

(1) లోకము—లోకసిద్ధములగు ప్రత్యక్ష-అనుమాన-ఆగమ ప్రమాణములు.

(2) వేదము—లోకసిద్ధములైన వాటి విషయములందు కూడ నియతములగునవి. ఉదా : న్యాయములందు ధనుర్వేదము ప్రమాణము ; స్వర-తాలములందు గాంధర్వ వేదము ప్రమాణము.

(3) అధ్యాత్మము (ఆత్మానుభవము)—వేద-అధ్యాత్మములచే ప్రమితములగు పదార్థములయందే నాట్యము ప్రతిష్ఠితమైనది. శబ్దసమన్వయము వ్యాకరణమనెడి ఆగమము (శాస్త్రము) చే సిద్ధించును. వృత్తములందలి ఛందస్సమన్వయముచే కలిగెడి శ్రావ్యత ఆత్మానుభవము (స్వసంవేదనము) చే సిద్ధించును. కావుననే ఆగమ (వేద) - అధ్యాత్మ (స్వసంవేదన) ప్రమాణములచే సిద్ధించిన పదార్థములయందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నదని చెప్పబడెను. ఇచ్చట ఆగమ-అధ్యాత్మము అనునవి ఇతర ప్రమాణములకు ఉపలక్షణము.

ఇంక మూడవ ప్రమాణమగు లోకము నాట్యమున కెట్లు ఉపకారకమో వివరింతును. లోకములో మనచే అనుభవింపబడుదానిని కాదనలేము కదా? కావున, లోకములో సిద్ధించినది సర్వత్ర సిద్ధించినట్లే. లోకప్రసిద్ధిని మరుగుపరచుట ఎవ్వరికిని సాధ్యము కాదు. అనుభూతములైయుండు వానిని మార్చిన కాష్ఠమును పాషాణముగను, పాషాణమును కాష్ఠముగను చూపెడి ప్రమాదము సంభవించును. అందుచే లోకానుకీర్తనరూపమగు నాట్యమునకు లోకసిద్ధము ప్రమాణమే అగుచున్నది.

లోకములో కలుగు జ్ఞానమంతయును శాస్త్రములచే (ఆగమములచే) సిద్ధించును కదా? మరల లోకమును కూడ నాట్యమున ప్రమాణముగా గ్రహించుట ఎందులకు? అని ప్రశ్నించవచ్చును. లోకములో స్వభావములు భిన్నభిన్నములుగా నుండును. వాటి నెల్ల శాస్త్రమునందు నిరూపించుటకు సాధ్యము కాదు. అందుచేతనే "ఇచ్చట నేను వివరింపని వాటినెల్ల లోకమునుండి గ్రహించవలెను" అని చెప్పుచు భరతుడు మాటిమాటికిని లోక ప్రామాణ్యమును జ్ఞప్తికి తెచ్చుచుండును.

పై విధముగా ప్రమాణత్రయముచే అభినయముల నెరింగి సభలో రంగమందు ఎవడు చక్కగా ప్రయోగించునో అతడే సంమానమునందును. అభినయముల నెరుంగుటయే కాక, ప్రయోగించు విధానము కూడ తెలిసినప్పుడే నాట్యసిద్ధి చేకూరునని తెలియవలెను. [అభినవభారతి - 3 వ సం - పుటలు 286-287 ; 291]

లోక-నాట్యాచార్యప్రమాణములప్రాముఖ్యమును పుటలు 368-369 లలో వివరించి యున్నాను.



3. స్వగతాదులు

స్వగతాదులను విశ్వనాథుడు క్రింది విధముగా వివరించెను— "ఇతరు లెవ్వరును వినగూడనిది స్వగతము (=ఆత్మగతము). తాను చోటు మారి అన్యునికి చెప్పెడి రహస్యము అపవారితకము. కథామధ్యమున త్రిపతాకా హస్తముతో ఇతరులను వేరుచేసి ఇరువురు ఒండొరులతో రహస్యము మాటాడుకొనుట జనాంతికము. నాట్యమున పాత్ర లేకయే 'ఏమి చెప్పెదవు?' అని చెప్పని అర్థమును వినుట నభినయించి మాటాడుట ఏదికలదో అది ఆకాశభాషితము" [సాహిత్య దర్పణము - శ్రీ వేదంవారి అనువాదము-సూ. 425 చూడవలెను]. 725-726 పుటలనుకూడ చూడవలెను.

ఇందులో స్వగతము లేదా ఆత్మగతము అశ్రావ్యము ; అనగా రంగమందలి ఇతర పాత్ర లెవ్వరును వినగూడనిది (స్వగతమును ఎన్నడును ఇతర పాత్రలు వినుట సమంజసము కాదు). అపవారితకము నియతశ్రావ్య మనబడును. ఇందు, ఎవరిని ఉద్దేశించి ఆ మాట చెప్పబడుచున్నదో అతడొక్కడే దానిని వినును. ఇంక జనాంతిక మనునది ఈషచ్ఛ్రావ్య మనబడును; లేదా ఇదియును నియతశ్రావ్యమే.

స్వగతము లేదా ఆత్మగతము (Soliloquy) నాటకాదులం దుపయుక్తము కాదగునా? కారాదా? అనెడి విషయము పాశ్చాత్యదేశములందు తీవ్రసమస్య అయినది. పిచ్చివాడు తప్ప లోకమునందింకెవ్వడును తనలో తాను బిగ్గరగా మాటాడుకొనడు. అట్టి అసహజత్వమును నాటకాదులందుమాత్ర మేల ప్రయోగించవలెను? అని కొందరి వాదము.

గ్రీకు రూపకకర్తలు మొదలగువారు స్వగతమును స్వేచ్ఛగా వాడినారు. ఫ్రెంచి రూపకకర్తలు మాత్రము కొందరు స్వగతములకు బదులుగా విదూషకునివంటి నాయక సహాయులను సృష్టించినారు. స్వగతములో హృదయమందు దాగియున్న ఆంతరభావములు వెల్లడిచేయబడునట్లే ఈ సహాయక పాత్రలతో మాటాడునప్పుడును పాత్రల మనోభావములు వెల్లడిచేయబడుచుండెడివి. ముఖ్యపాత్రల మనస్సులలోని కొన్ని ప్రత్యేక భావములు, వారి ముందు ఆలోచనలు ప్రేక్షకులకు తెలియనిచో కథాగమనము అర్థము కాదు. మరి కవికి ప్రవేశములేని నాటకమందు అట్టివాటిని వెల్లడిచేయుటకు స్వగతము ఒక సాధనముగా గ్రహింపబడినది. ఆ ఆంతరభావములు వెల్లడి అగుటకే ఫ్రెంచి రూపకకర్తలు నాయక సహాయులను ఉపయోగించిరి. కాని ఈ పాత్రలు కేవలము పేలవములుగా నుండుటచే మోలియర్, షేక్స్పియర్ ప్రభృతులు మరల స్వగతములనే వాడియున్నారు. ఆధునిక రూపకకర్తలు స్వగతమును పరిహరించుటకు ప్రయత్నించుచున్నారు.

కాని, రూపకనిర్మాణములో కవికి ఈ స్వగత మొక సాధనమగుట దోషము కాజాలదు. అది చక్కగా ప్రయుక్తమయ్యెనా లేదా అనునదియే పరిశీలనార్హము; అసహజమన్న పేరుతో దానిని నిరాకరించుట పాడికాదు. 'నాట్యధర్మి' పేరుతో రూపక రచనా-ప్రదర్శనములం దెన్ని 'అసహజత్వములను' మన మంగీకరించుట లేదు? వాటికిలేని అభ్యంతరము దీనికిమాత్రమే ఏల ఉండవలెను? నాటకనిర్మాణములో అత్యవసరమై, కవిచే 'మోతాదు'లో చక్కగా ప్రయుక్తమైనచో 'స్వగతము' ఆదరణీయమే కాగలదు.

# అధ్యాయము 26[1]

## ప్రకృతి-పాత్రవివేకము[2]

[కాశీముద్రణమునందు 35 వ అధ్యా—30 శ్లోకములును (8-37 శ్లో); బొంబాయి ముద్రణమునందు 26 వ అధ్యా—26 శ్లోకములును; బరోడా ముద్రణమునందు 26 వ అధ్యా—38 శ్లోకములును కలవు.]

### ప్రకృతి-పాత్రలత్రైవిధ్యము

అనురూపా విరూపా చ తథా రూపానురూపిణీ।
త్రిప్రకారేహ పాత్రాణాం ప్రకృతిశ్చ విభావితా ॥ 1

—అనురూపము, విరూపము, రూపానురూపిణి (=రూపానురూపము=రూపానుసారిణి) అనుభేదములచే పాత్రల, ప్రకృతుల సంబంధము మూడువిధములు.[3]

1. ఈ భాగము కాశీముద్రణమునందు 35 వ అధ్యాయములో కలిసియున్నది (8-37 శ్లో.); ప్రత్యేక అధ్యాయముగా లేదు. బొంబాయి-బరోడా ముద్రణములందు షడ్వింశాధ్యాయము (26 వ అధ్యా.).

2. బరోడాముద్రణమునందు 'వికృతివికల్పము' అని కలదు; ఇది పొరపాటు కావచ్చును. అభినవగుప్తుడు 'ప్రకృతివికల్ప'మనెను. బొంబాయిముద్రణ పాఠమును ఇదియే. 'భూమికాపాత్రవికల్పము' అని కాశీముద్రణమునందు 35 వ అధ్యాయమునకు పేరు.

3. ప్రకృతులను గూర్చి 24 వ అధ్యాయమందు వివరింపబడినది; పాత్రలను గూర్చి 35 వ అధ్యాయమందు వివరింపబడును. ఈ ప్రకృతి-పాత్రల సంబంధము ఈ అధ్యాయమందు వివరింపబడుచున్నది. కావున ఈ రెండింటి సమన్వయమే ఈ 26 వ అధ్యాయము.

పాత్ర (=నటుడు) ప్రకృతి (=నాటకమందలి రామాదులతో) సదృశుడుగానుండవచ్చును—ఇది అనురూపము; లేదా పాత్ర విసదృశుడుగానుండవచ్చును—ఇది విరూపము; లేదా పాత్ర ఉభయాత్మకుడుగానుండవచ్చును— ఇది రూపామరూపము. ఈ విషయము ఈ అధ్యాయమందు చెప్పబడుచున్నది కాన ఇది వేషధారణమును గూర్చిన చర్చ అని తెలియవలెను.

పాత్ర, నటుడు, అభినేత, ప్రయోక్త, ప్రయోజకుడు అనెడి పదములు పర్యాయపదములు.

అట్లే ప్రకృతి, అనుకార్యుడు, అనుకరణీయుడు, అనుకీర్తనీయుడు, ప్రయోజ్యుడు అను పదములు పర్యాయపదములు. ప్రయోజ్య-ప్రయోజక స్వరూపవిదుడైన వానినే ప్రయోగజ్ఞుడందురు. అతడే ఆచార్యుడనబడును. ఆచార్య గుణములు ఈ అధ్యాయము చివర వివరింపబడును. [అభినవభారతి—3వ సం-పుటలు 292-293].



నానావస్థాక్రియోపేతా భూమికా ప్రకృతిస్తథా।
భృశ ముద్యోతయేన్నాట్యం స్వభావకరణాశ్రయమ్ ॥ 2

—భూమిక లేదా ప్రకృతి నానావిధములగు అవస్థలతోడను, క్రియలతోడను కూడియుండును. ప్రకృతిస్వభావ-కరణాశ్రయమగు (అవస్థా - క్రియోపేతమగు) నాట్యమే మిక్కిలి ప్రకాశించును.

### పుస్తకర్మ

బహుబాహువులును, బహుముఖములును, వికృతాననములును, పశు-శ్వాపద-ఖర - ఉష్ట్ర - అశ్వ - గజములయొక్క ముఖములును కలిగిన వారిని రంగస్థలముమీద ప్రదర్శించవలసివచ్చినప్పుడు నాట్యాచార్యుడు బుద్ధిననుసరించి ఆయా ముఖములను మట్టి, కఱ్ఱ, లక్క, చర్మము అను వాటితో తయారుచేయవలెను.[5]

4. అవస్థలనగా విలాస-లాలిత్య-ఔద్ధత్యాదులు. క్రియలనగా సుకుమారములైన ఉద్యానవన విహారాదులును, ఉద్ధతములగు యుద్ధసన్నాహాదులును. ఇవి అన్నియును ఒకే చోట ఉండును కావున సర్వథా అనురూపమగు భూమిక లేదా ప్రకృతియుండుట సంభవించనేరదు; వైవిధ్యముతో కూడియుండుటయే యుక్తము,

ప్రకృతి భూమివంటిది కావున 'భూమిక' అనబడును. 'భూమి' అనగా నిలబడుచోటు. ఉదాహరణమునకు ఒక ధ్యానపటమునందు పంచవక్త్రములతో దశభుజములతో శివుడు చిత్రింపబడెననుకొందము. అచట ధ్యానమున బుద్ధికి గోచరించునది తాదృశాకార విశిష్టుడగు పరమశివుడే కాని ఆ దేశము, ఆ కాలము, ఆ చిత్రమునందలి రంగులు, పటము మొదలగునవి కాదుకదా ? కావున అచట బుద్ధినివేశమునకు భూమివలె అవష్టంభస్థానమయినది కనుక ఆ పరమశివమూర్తియే భూమిక.

అట్లే రామాద్యనుకార్యులు సామాజికబుద్ధిగోచరులై తదవష్టంభస్థానభూతులగుచున్నారు కావున 'భూమిక' లనబడుదురు.

ప్రయోజ్యు ననుకరించునప్పుడు ఆతని స్వరూపము లనిదే అనుకరణము అసాధ్యమగునుకాన ముందుగా నటుడు ప్రయోజ్య (ప్రకృతి) స్వరూపమును సంపాదించవలెను: అందుచే ఈ విషయమే ముందు చెప్పబడుచున్నది [అభినవభారతి- 3వ సం-పుట 295].

సారాంశము: ప్రకృతులు=నాటకమందలి రాముడు మొదలగువారు. లేదా దేనిచే ఈతడు ఆ రాముడే - అనెడి భావము గలుగునో ఆ స్వభావ - చేష్టాదుల సమూహము ప్రకృతి=Character.

పాత్ర=నటబుద్ధిపోయి, రాముడుగా భావింపబడుచున్న నటుడు=Actor.

భూమిక=సామాజికబుద్ధి నిలబడుట కాధారమైన స్థానము (ప్రయోజ్యుడు)=Role.

5. పశువులనగా గోవులు మొదలగు సాధుమృగములు. శ్వాపదములనగా సింహాది క్రూరమృగములు. ఇంక ఖరోష్ట్రాదులు సాధ్వసాధుమృగములు. మూలమందు 'ఖరోష్ట్రాశ్చ

నటుని పరభావప్రవేశము

స్వాభావికేన రూపేణ ప్రవిశేద్రంగమండలమ్।
ఆత్మరూప మవచ్ఛాద్య వర్ణకై ర్భూషణైరపి ॥ 5

యాదృశం యస్య యద్రూపం ప్రకృత్యా తత్ర తాదృశం।
వయోవేషానురూపేణ ప్రయోజ్యం నాట్యకర్మణి ॥ 6

యథా జీవః స్వభావం హి పరిత్యజ్యాన్యదేహికమ్।
పరభావం ప్రకురుతే పరభావం సమాశ్రితః ॥ 7

ఏవం బుధః పరం భావం సోఽస్మీతి మనసాస్మరన్।
ఏషాం వాగంగ లీలాభి శ్చేష్టాభిస్తు సమాచరేత్ ॥ 8

—నటుడు రంగులు మొదలగు వర్ణకములతో కిరీటాది భూషణములతో, పైనిచెప్పిన జతుకాష్ఠాదులతో ఆత్మరూపమును (తన స్వభావమును, రూపమును గూడ)మరుగుపరచుకొని స్వాభావికమైన[6] (అనుకార్యుల అనగా రామాదుల స్వభావమున కుచితమైన) రూపముతో రంగమండలమును ప్రవేశించవలెను. అనుకార్యుని రూపమెట్టిదో దానికి అనుగుణమైన రూపమునే నాట్యకర్మయందు (నాట్య ప్రదర్శనమునందు) వయోవేషానుసారముగా నటునకు కల్పించవలెను.

జీవుడు తన స్వభావమును (తనకు సహజమైన దానిని) పరిత్యజించి, ఏ దేహమున తాను ప్రవేశించునో దానికి సహజమైన భావమునే చక్కగా కలిగియుండునట్లు బుధుడు (ఉత్తమ నటుడు)'అతడే నేను' అని మనస్సునందు తలంచుచు వాక్-అంగ-లీలా-చేష్టలతో పర భావమును (అనుకార్యుని స్వభావాదులను) ప్రదర్శించవలెను.[7]*

---

గజాననాః' [3 వ శ్లో.] అని కలదు... పశువులనగా గోవులు, అశ్వములు అని అభినవగుప్తుడర్థము వ్రాసెను. కాని 'ఖరోష్ట్రాశ్వ గజాననాః' అని ఉండుట సమంజసముగా కన్పట్టుచున్నది. పశు-శ్వా పదముల విషయమున ముఖములను మాత్రమే నిర్మించవలెననియు, ఖరోష్ట్రాదుల విషయమున సర్వశరీరమును మృత్కాష్ఠాదులచే నిర్మించవలెననియు అభినవగుప్తుడభిప్రాయపడెను. [అభినవభారతి - 3 వ సం - పుట 296]

6. నటుడు తన రూపమును కప్పిపుచ్చి, ప్రయోజ్యుని రూపమును తనయం దారోపించుకొనుచున్నాడు కాన అది ఎరువుతెచ్చుకొన్నట్లు కాక సహజముగనుండవలెనని తెలియవలెను.

7. ఇచ్చట 7 వ శ్లోకము ఉపమాన వాక్యరూపము; 8 వ శ్లోకము ఉపమేయ వాక్యరూపము. అట్లే జీవ-బుధులు ఉపమానోపమేయములు.

"జీవ స్వభావమును అనగా తనకు సహజమైన భావమును పరిత్యజించి" అనునప్పుడు నటబుద్ధి వానికి అసలే ఉండదని అర్థము చేసికొనరాదు. అట్టి జ్ఞానమే లేనిచో లయ-



విభావపరిపూర్ణతగల రాజాదుల సుకుమారచరితమును ప్రయోగించవలసి వచ్చినప్పుడు నాట్యాచార్యుడు సుకుమారప్రకృతికల స్త్రీలచేతనే శృంగారరసయుక్తముగా దానిని ప్రయోగింపజేయవలెను.[8] యుద్ధాదులచే ఉద్ధతములును, ఆవిద్ధచేష్టాదిసంయుతములును, సంరంభ-ఆరభట ప్రధానములును అయిన ప్రయోగములను స్త్రీలు ప్రదర్శించరాదు; ఇట్టివానిని పురుషులే ప్రయోగించవలెను.[9]

---

తాళాదులను అనుసరించుట అశక్యమే కాగలదు. కావుననే "అతడే నేను" అనెడి స్మరణ మనస్సునం దెల్లప్పుడును అనువర్తించుచునే ఉండును."

"సోఽస్మీత్యనేన స్వాత్మావష్టంభస్యాత్యాజ్యతామాహ. అన్యథా లయాద్యనుసరణమశక్యమ్" [అభినవభారతి - 3 వ సం - పుట 296] అని అభినవగుప్తుడిచ్చట వ్యాఖ్యానించెను.

సామాజికులవలె నటుడుకూడ రసానుభూతిని పొందునా? పొందడా? అనెడి సమస్య ఒకటి కలదు. నటునకు రసానుభూతి ఉండరాదని ఆలంకారికుల అభిప్రాయము. 'పాత్ర' (నటుడు) అనగా ఏమో అభినవగుప్తుడు వివరించియేయుండెను. పుట 193 లోని 12 వ అధఃసూచికను చూడవలెను. పై శ్లోకములు 21 వ అధ్యాయమందు కూడ భిన్నపాఠములతో కలవు [88-91 శ్లో.]. అచ్చటి అనువాదమును, 13 వ అధఃసూచికను కూడ చూడవలెను.

సారాంశము: అభినయసమయమున నటుడు రామాదులస్వభావమును పుణికిపుచ్చుకొన్నట్లు కన్పట్టవలెను. "ఆతడు నిజమైన రాముడే" అనెడి భావమును సామాజికులకు కలిగించవలెను. కాని తాను పూర్తిగా పరవశుడు కారాదు; పరవశుడైనచో అభినయమే సాగదు. కావున నటబుద్ధి వానికి అంతర్గతముగా ఉండక తప్పదు. (సామాజికులకు మాత్రము నటునియందు నటబుద్ధి నశించి ప్రయోజ్యబుద్ధియే కలుగవలెను). అది ఉన్నప్పుడే అతడు రంగమర్యాదాదులను పాటింపగలడు. మరి ఇట్లు రెండువిధములుగా ఆతడెట్లు ప్రవర్తింపగలడు అను ప్రశ్నకు సమాధానమును కూడ భరత-అభినవగుప్తులు చెప్పియే ఉన్నారు—శిక్షా-అభ్యాసపాటవమున సాధించిన సత్త్వముచే నటుడావిధముగా ప్రవర్తింపగలడు. కావుననే నాట్యము సత్త్వమునందే ప్రతిష్ఠితమై ఉన్నదనుట. ఈ సత్త్వసాధనము యోగతుల్యము.

నటుడు ప్రకృతితో తాదాత్మ్యమును చెందుటకు ప్రకృతివిభాగజ్ఞాన మావశ్యకము. ఎటువంటి ప్రకృతికి ఎటువంటి నటుడు సరిపోవునో 35 వ అధ్యాయమందు వివరింపబడును.

* [కాశీముద్రణమునందు 35 వ అధ్యా.—9-16 శ్లో. (క్రమములో భేదముకలదు); బొంబాయిముద్రణమునందు 26వ అధ్యా—1, 10, 13-18 శ్లో; బరోడాముద్రణమునందు 26 వ అధ్యా—1-8-శ్లో.]

8. శ్రీహర్ష విరచితమగు 'ప్రియదర్శికా' నాటికయందు 3వ అంకములో సాంకృత్యాయని అనెడు పరివ్రాజిక ఆరణ్యకా—మనోరమలచే ఇట్టి నాటకమునే ప్రదర్శింపజేసెను.

9. సుకుమారప్రయోగమునే స్త్రీలు ప్రదర్శించవలెననియు, ఉద్ధతచేష్టలు నిరూ

ఉద్భటము కానిదియును, సంభ్రమాదులును ఆవిద్ధములైన అంగచేష్టలును లేనిదియును, లయ - తాల - కలా - పాతములచే నియతమైనదియును, చక్కగా విభక్తములైన పదములతోకూడిన సంభాషణలు కలదియును, పారుష్యములేనిది యును అగు నాట్యమును పురుషలచేతను, స్త్రీలచేతనుకూడ ప్రయోగింపజేయ దగును.

భూమికాధారణము

ఈ విషయమును దృష్టియందుంచుకొని ప్రయోగజ్ఞులు నటులచే తత్తదను గుణములైన భూమికలను ధరింపజేయవలెను.

అనురూపము : ఆయా అవస్థలకును, వయస్సులకును తగినట్టి స్త్రీలు స్త్రీగత (సుకుమార) భావములను, పురుషులు పౌరుష (ఉద్ధతములును, ఆవిద్ధములును) భావములను నిరూపించుట 'అనురూప' మనబడును.

రూపానురూపము : పురుషుడు తనకు సహజముగా ఉన్న స్త్రీసదృశ రూపమువలన స్త్రీగతమైన భావమును అభినయించుట 'రూపానురూప' మనబడును. అట్లే స్వభావమునుబట్టి కలిగిన సాదృశ్యమువలన స్వేచ్ఛతో స్త్రీ పౌరుషభూమికను ధరించిన ధరించవచ్చును;[10] అదియును రూపానురూపమే అగును.

---

పితములగునప్పుడు దానిని పురుషులే ప్రయోగించవలెననియు సారాంశము. ఇందు మొదటిది రూపానురూపము (రాజాదుల భూమికలను స్త్రీలు ధరించుట); రెండవది అనురూపము.

10. పురుషత్వము నవలంబించి స్త్రీ ప్రవర్తించుటకు సాంకృత్యాయని (?) ఉదాహరణము. కాని, పౌరుషభూమికను స్త్రీ ధరించుట సర్వత్ర యుక్తముకాదు. కావుననే 'స్వేచ్ఛతో' అని చెప్పబడినదని తెలియవలెను [అభినవభారతి- 3వ సం- పుట-297].

ఇచ్చట మూలశ్లోకములు సరిగా లేవు. వీటిని క్రిందివిధముగా కూడ అనువదించ వచ్చును— "స్త్రీ స్త్రీభూమికను ప్రయోగించుచు మధ్యలో ఒకసారి పురుషుడుగా కూడ వ్యవహరించినచో అది 'రూపానురూప' మనబడును. స్త్రీ భావసాదృశ్యమువలన పురుషుడుగానే ప్రయోగమునంతటిని నిర్వహించవచ్చును; అదియును రూపానురూపమే అనబడును."

ఈదృష్టితో చూచినచో పురుషుడు స్త్రీ పాత్రను నిర్వహించుటనుగూర్చి భరతుడు నిర్దేశించలేదనియే చెప్పవచ్చును. ఈ విషయమునుగూర్చి అభినవగుప్తుడేమియును చెప్పలేదు. కాని 21వ అధ్యాయమందు చెప్పబడిన అంగవర్తనాదివివరణములనుబట్టియు, నాట్యధర్మి మొదలగు (పుట 381) ఇతర వివరణములనుబట్టియు పురుషుడు స్త్రీభూమికను నిర్వ హించుటకూడ కలదని చెప్పగలము.



విరూపము : ఇంక స్థవిరుడు (వృద్ధుడు) బాలిశ (యువ) భూమికయందును, బాలిశుడు (యువకుడు) వృద్ధభూమికయందును ప్రయోక్తలగుట 'విరూప' మన బడును. అట్లు ఎన్నడును నియుక్తులు కారాదు.[11] [ఈ త్రివిధములగు భూమికా ధారణములకును నేటి నాటకరంగమునుండి ఉదాహరణములను ప్రక్కపుటలలో ఒసంగియున్నాను.]

స్త్రీలకంఠములు స్వభావమధురములు

సంస్కృతపాఠ్యప్రయోగమందు పురుషులే నియుక్తులుకావలయును (అనగా పురుషులు సంస్కృత పాఠ్యమును ప్రయోగించవలెను; మరి స్త్రీలు ప్రాకృతపాఠ్య మును పఠింతురు). స్త్రీలకంఠస్వరములు స్వభావమధురములు; పురుషుల కంఠములు బలవంతములు (స్వభావపరుషములు) అనగా రంగపూరణోచితగంభీరస్వరయుక్త ములు. పురుషుడు లక్షణోపేతమగు గీతవిధిని నేర్చియుండవచ్చును; అయినను మాధుర్యహీనమగుటవలన ఆ గీతము శోభావహము కానేరదు.[12] కాని, ఎచ్చటనేని స్త్రీలయందు పాఠ్యగుణమును (సంస్కృతమును చక్కగా ఉచ్చరింపగలిగియుండుట),

---

11. ఇచ్చట బాలిశపదము విరూపప్రకృతి కుపలక్షణము. ఎచ్చట ఏ ప్రయోజనము శ్లిష్టముగా కన్పట్టదో దాని నచ్చట ప్రయోగించరాదని అర్థము [అభినవభారతి- 3వ సం- పుట 298].

రూపమునందు మాత్రమే వైరూప్యమున్నచో వర్ణకాదులచే దానిని కప్పిపుచ్చుట చాల సులభము. ఆధునికపరికరములు, పద్ధతులు ప్రబలి ప్రచారములో ఉన్న నేడు ఇది మరింత సులువు. కాని వృద్ధులకును, బాలురకును స్వభావములందే వైరూప్యమున్నది కాన వారిని పరస్పరచేష్టలయందు నియోగించుట యుక్తము కాదని సారాంశము.

"బాలుడు వృద్ధభూమికను, వృద్ధుడు బాలభూమికను ధరించి, ఆయా భూమికల కుచితములైన చేష్టాదులను ప్రదర్శించుట 'విరూప' మనబడును." అని బొంబాయి ముద్రణమునందు కలదు [26వ అధ్యా- 3వ శ్లో.] ఇది కాశీ-బరోడా ముద్రణము లందు లేదు.

ఇచ్చట క్రిందివిధముగా కూడ అనువదించవచ్చును. —పురుషుడు స్త్రీభూమిక యందును, స్త్రీ పురుషభూమికయందును ప్రయోక్తలైనప్పుడు వయస్సుమీరినవారు యువభూమికలను, యువకులు వయస్సుమీరినవారిభూమికలను నిర్వహించరాదు.

తాత్పర్యమున రెండు అనువాదములును సమానములే అని అనవచ్చును.

* [కాశీ ముద్రణమునందు 35వ అధ్యా—17-20 శ్లో, 23, 32 శ్లో; బొంబాయి ముద్రణమునందు 26వ అధ్యా—22-26 శ్లో, 2-5 శ్లో; బరోడా ముద్రణమునందు 26వ అధ్యా—9-16 శ్లో.]

12. గీతమనగా గీత ప్రధానమైన ప్రయోగమని అభినవగుప్తుడు అర్థము వ్రాసెను. సంస్కృతపాఠ్యప్రధానమైన ప్రయోగమందు పురుషులును, ప్రాకృతపాఠ్య

పురుషులయందు కంఠమాధుర్యమును సంభావ్యములు కానచ్చును. ప్రకృతివిపర్యయ జనితములైన వీటిని జన్మసిద్ధములుకాని అలంకారములుగనే గ్రహించవలెను. పురుష స్వభావము నాశ్రయించి స్త్రీలు ప్రదర్శించెడి ప్రయోగములందు వారు తరచుగా దేవ-పార్థివ-సేనాపతి-ముఖ్యపురుషుల భూమికలను ధరించుచుందురు.[13] (పురుష స్వభావమగు సంస్కృతపాఠ్యగుణము ఏ స్త్రీలయందుండునో ఆ స్త్రీలని ఇచ్చట అర్థము)

స్త్రీల నాట్యప్రయోగములు

స్వర్గమున రంభాదులయందు నాట్యము ప్రతిష్ఠితమయ్యెను.[14] అట్లే భూలోకమందును రాజాంతఃపురములందు అంగనాజనులకు నాట్యమును నాట్యాచార్యుడు ప్రయత్నముతో ఉపదేశించవలయును. పురుషాశ్రయమైన ప్రయోగమందు స్త్రీలను నియోగించునప్పుడు ఆచార్యుడు ఎక్కువ శ్రద్ధనువహించవలసియున్నది. నాటకమునందు బుధులు (నాట్యాచార్యులు) ఎన్నడును స్వయముగా భూమికాధారణమును చేయరాదు (అనగా వారు ఉపదేశకులుగానే ఉండవలెనని భావము).[15]

---

ప్రధానమైన లేదా గీతప్రధానమైన ప్రయోగమందు స్త్రీలను నియోగింపబడవలెను. మొదటిది గంభీరము, రెండవది సుకుమారము. సంస్కృత పాఠ్యమునకు తగిన పురుషుని గంభీరస్వరము ప్రాకృతపాఠ్యమునకు కాని, గీతమునకు కాని తగదని సారాంశము. 'మృచ్ఛకటికము'లో రేభిలుని సంగీతమును మెచ్చుకొనుచున్న చారుదత్తునితో మైత్రేయుడు చెప్పిన వాక్యములు పరిశీలనార్హములు—"నా కాడుదాని సంస్కృతము విన్నను, మగవాని కాకలీగీతమును విన్నను నవ్వులాటగా నుండును. ఆడుది సంస్కృతభాష జదివినప్పుడు ముక్కుత్రాడు వోసిన యాఁశెయ్యవలె సూ సూ సూ యనును. మగవాఁడు సంగీతము పాడినచో వృద్ధపురోహితుఁడు మెడనిండ నెండిన పూవుదండలు దాల్చి వేద మంత్రములు చదివినట్లుండును". (శ్రీ తిరుపతి వేంకట కవుల ఆంధ్రీకరణము - పుట 34)

13. పాఠ్యగుణమును కంఠమాధుర్యమును విపర్యయము లగుట క్వాచిత్కము. అందులో స్త్రీలు పురుషప్రయోగము ననుకరించుటయే ప్రచురముగా కన్పట్టుచున్నదని 'తరచుగా' అనెడి దానివలన స్పష్టమగుచున్నది. [అభినవభారతి - 3 వ సం - పుట 298]

"పురుషస్వభావము నాశ్రయించి.........ప్రయోగములు దేవ ........ముఖ్య పురుషుల భవనములందు జరుగుచుండును" అనెడి అర్థము కూడ ఇచ్చట సంభావ్యమగుచున్నది. భవనమనుటకంటె 'భూమిక' అనెడి పై అర్థమే సమంజసమని తలంచుచున్నాను.

14. స్వర్గమున ఇంద్రునియెదుట భరతమహర్షి అప్సరసలచేతనే "లక్ష్మీస్వయంవర" నాటకమును ప్రదర్శింపజేసినట్లు విక్రమోర్వశీయమునందు కలదు (చూ. తృతీయాంక ప్రారంభమందలి విష్కంభము.) దీనిని సరస్వతి స్వయముగా రచించినదట.

15. ఇచ్చట మూలశ్లోకములు క్రింది విధముగా ఉన్నవి—

రంభోర్వశీ ప్రభృతిషు స్వర్గే నాట్యం ప్రతిష్ఠితమ్ ॥ 20



స్వభావోపగతమైన 'విలాసము' స్త్రీలయందుండును కాన వారి అంగములు స్వభావమధురములై సులభసౌష్ఠవసంపన్నములగును. ఒక్కొక్కప్పుడు పురుషులయందును లాలిత్యము, సౌష్ఠవమును కన్పట్టుచుండును; అది అలంకారమనియే చెప్పవలెను (అనగా తెచ్చిపెట్టుకొన్నదే కాని సహజముకాదు).*

ప్రయోగద్వైవిధ్యము

నానాభావరసాశ్రయమైన నాటక (=రూపక) ప్రయోగము రెండువిధములుగా ఉండును—1. సుకుమార ప్రయోగము, 2. ఆవిద్ధప్రయోగము.[16]

1. సుకుమార ప్రయోగములు— నాటక-ప్రకరణ-భాణ-వీథీ-అంకములు సుకుమారప్రయోగములు. ఇవి మానుషాశ్రయములు (అనగా ఇవి మనుష్య బహులములు).[17]

---

తథైవ మానుషే లోకే రాజ్ఞా మంతఃపురేష్వహ ।
ఉపదేష్టవ్య మాచార్యైః ప్రయత్నేనాంగనాజనే ॥ 30
న స్వయం భూమికాన్యాసో బుధైః కార్యస్తు నాటకే ।
స్త్రీషు యోజ్యః ప్రయత్నేన ప్రయోగః పురుషాశ్రయః ॥ 31

బుధులనగా నాట్యాచార్యులని 35 వ శ్లోకవ్యాఖ్యానమందు అభినవగుప్తుడర్థము వ్రాసెను. ఇచ్చట 'స్వయం' అనగా 'పురుషులచే' అనియు, 'న్యాస' మనగా 'ప్రయోగ' మనియు పేర్కొనెను. దీనినిబట్టి "స్త్రీలు ప్రదర్శించు ప్రయోగములందు పురుషులు భూమికాధారణము చేయరాదు" అనెడి అర్థము కాని, "...పురుషులగు నాట్యాచార్యులు స్వయముగా భూమికాధారణము చేయరాదు" అనెడి అర్థముకాని సంభావ్యములగుచున్నవి.

నాట్యమును స్త్రీ-పురుషులు కలిసి ప్రదర్శించుట ఆనాడు నిషిద్ధముకాదు. కాని, రాజాంతఃపురములందలి సుకుమారప్రయోగములను అట్లు ప్రయోగించుట సమంజసముకాదనియు, అచ్చట పురుషభూమికలనుకూడ స్త్రీలే నిర్వహించవలెననియు, పురుషభూమికానిర్వహణమును ఆచార్యుడు స్త్రీలకు చక్కగా నేర్పవలెననియు ఇచ్చట అర్థముచెప్పుట రమణీయముగా ఉండును.

ఇంక నాట్యాచార్యుడు స్వయముగా భూమికాధారణము చేయరాదనెడి అర్థము విశేషసూత్రము (General rule). అది అచ్చటనేకాదు ఎచ్చటనైనను, ఎప్పుడైనను, ఏదేశమందైనను విధిగా పాటించవలసిన ధర్మము.

*[కాశీముద్రణమునందు 35 వ అధ్యా—20-24 శ్లో; బొంబాయి ముద్రణమునందు 26 వ అధ్యా—7-8 శ్లో; 10-13 శ్లో; బరోడా ముద్రణమునందు 26 వ అధ్యా—16-24 శ్లో.]

16. ఈ ప్రయోగద్వైవిధ్యము 12 వ అధ్యాయమందు (పుట 379) కూడ చెప్పబడినది. అచ్చటి 20 వ అధస్సూచికనుకూడ చూడవలెను.

17. ఇంతకుముందు చెప్పబడిన 9, 10 శ్లోకములు రెండును ఇచ్చట మరల 26-27, 27-28 శ్లోకములుగా పునరుక్తములైనవి—

2. ఆవిద్ధ ప్రయోగములు— ఆవిద్ధములైన అంగహారములు, ఛేద్య-భేద్య-ఆవహాములు, మాయేంద్రజాలములు, పుస్తనైపథ్యములుకలిగి, పురుషులధికముగాను స్త్రీలు తక్కువగాను ఉండి, ఉద్ధతమును సాత్త్వత్యారభటీవృత్తియుక్తమును అయిన నాట్యము ఆవిద్ధప్రయోగమనబడును. డిమ-సమవకార-ఈహామృగ-వ్యాయోగములు ఆవిద్ధప్రయోగములు. ఇవి దేవ-దానవ-రాక్షసులచేతను, ఉద్ధతులును శౌర్య-వీర్యబలాన్వితులును అయిన పురుషులచేతను ప్రయుక్తములు కావలయును.[18]

పై ప్రయోగములవిషయమున ఎల్లప్పుడును అప్రమత్తతతోకూడిన చక్కని ప్రయత్నము ఆవశ్యకము. ప్రయోక్తలకు యోగ్యమైన భూమికాధారణములేనిచో భావ-రస సౌష్ఠవము ఏ మాత్రమును సిద్ధించదు.[19] (ఆ సౌష్ఠవసిద్ధికై ఎల్లప్పుడును కృషిచేయవలెనని భావము.)

సంగీతాభ్యాసము

గానమాధుర్యము సహజమైనను కర్మకుశలత్వసిద్ధికై (శ్రమకు ఓర్చి ఉండగల్గుటకు) నిత్యసంగీతపరిక్లేశము ప్రమదాజనమునకు గుణమే అగును.[20]

---

సుకుమారప్రయోగోఽయం రాజ్ఞా మామోదకారకః ॥ 26

శృంగారరస మాసాద్య స్త్రీణాం తత్తు ప్రయోజయేత్ ।

యుద్ధోద్ధతావిద్ధకృతా సంరంభరభటాశ్రయే ॥ 27

న తే స్త్రీణాం ప్రకర్తవ్యాః కర్తవ్యాః పురుషైర్హి తే । 28

వీటి నిచ్చట అభినవగుప్తుడు వ్యాఖ్యానించలేదు.

18. సారాంశము— సుకుమార ప్రయోగములు స్వర్గమున అప్సరసలచేతను, భూలోకమున స్త్రీలచేతను ప్రయుక్తములు కావలయును. ఇంక ఆవిద్ధప్రయోగములు స్వర్గమున దేవ-దానవ-రాక్షసులచేతను, భూలోకమున ఉద్ధతులగు పురుషులచేతను ప్రయుక్తములు కావలయును.

19. ఇచ్చట మూల శ్లోక మీ క్రింది విధముగా ఉన్నది—

యోగ్యః స చ ప్రయత్నః కర్తవ్యః సతత మప్రమాదేన ॥ 32

న హి యోగ్యయా వినా భవతి చ భావ రస సౌష్ఠవం కించిత్ । 33

10 వ అధ్యాయము చివర వ్యాయామమునుగూర్చి చెప్పబడినప్పుడు ఆ అర్థమందు 'యోగ్యా' పదము ప్రయుక్తమైనది (పుట 337 లోని 22 వ అధస్సూచికను చూడవలెను). దాని నిచ్చట అన్వయించుకొని "అప్రమత్తతతో వ్యాయామమును ఎల్లప్పుడును చేయవలెను. చక్కని వ్యాయామము (అభ్యాసము) చేయనిచో భావరససౌష్ఠవము సిద్ధించదు" అని అర్థము చెప్పుట కూడ సమంజసముగానే ఉండును.

20. సాధారణముగా స్త్రీలకు సంగీతము ప్రకృతిసిద్ధము. పురుషులకు మాత్ర మభ్యసనీయము. ఇట్టి స్థితిలో అయత్నసిద్ధమగు గానవిషయమున అభ్యాస మెందులకు అని ఆశంకించుకొని "సహజగానమాధుర్యము కల్గియున్నను సంగీతపరిక్లేశము మరింత గుణాధాయకము కాగల" దని సమాధానము చెప్పెను.



పుష్పములచే లత శోభను కాంచునట్లే, ప్రమద తన నాట్యవిలాసములచే విచిత్రలావణ్యమును పొందును. ఆమె కామోపచారకుశలకూడ అయినచో ఇంక చెప్పవలసినదేమున్నది? ఆమె అధికముగా కామ్య (కోరతగినది) అగును.

ఆచార్యలక్షణము

గీతము, నృత్తము, వాద్యము, ప్రస్తారము, గమనక్రియ అను ఈ ఐదింటిని ఎరిగినవాడు ఆచార్యుడనబడును. ఊహాపోహములు, మతి-స్మృతి-మేధలు, శిష్యనిష్పాదనము అనెడి ఆరును ఆచార్యగుణములు.[21]

శిష్యలక్షణము

మేధ, స్మృతి, గుణశ్లాఘ (గుణమును మెచ్చుకొనుట లేదా అసూయ పొందకుండుట), రాగము (అనురక్తి), సంఘర్షము (ఇతరులను మించవలెనెడి స్పర్థ లేదా పట్టుదల), ఉత్సాహము అను ఈ ఆరును శిష్యునియందుండవలసిన గుణములు.

ఇట్లు ప్రయోగజ్ఞులు పాత్రలచే ఆయా భూమికలను ధరింపజేయవలెను. ఇంక సిద్ధి లక్షణమును వివరింతును.*

షడ్వింశాధ్యాయము సమాప్తము

---

21. ఇంతకుముందు చెప్పబడిన ఆచార్యుని గుణాదు లిప్పుడు పేర్కొనబడుచున్నవి. ఇచ్చట మూలమందు శ్లోక పాదములు వ్యత్యస్తములుగా ఉన్నవి. అభినవగుప్తుని వ్యాఖ్యాన క్రమమును అనుసరించి వాటిని క్రింది విధముగా సరిదిద్దుకొనవలయును—

గీతం నృత్తం తథా వాద్యం ప్రస్తారగమనక్రియా ।

ఏతాని పంచ యో వేత్తి స ఆచార్యః ప్రకీర్తితః ॥ 35

ఊహాపోహౌ మతిశ్చైవ స్మృతి ర్మేధా తథైవ చ ।

శిష్యనిష్పాదనం చైవ షడాచార్యగుణాః స్మృతాః ॥ 36

మానవు డగుటకు కర-చరణాది మానవావయవము లుండవలయును. ఇవి మాత్ర ముండిన వానిని మానవుడనుట కభ్యంతరము లేదు. ఇంక శౌర్య-ధైర్య-పాండిత్యాదు లున్నచో అవి అతిశయాధాయకములు. అట్లే ఆచార్యునకు గీతాదు లైదును స్వరూపాధాయకములు. ఇవి లేనిచో ఆత డాచార్యనామమునకే తగడు. ఇంకా ఊహాదు లారును అతిశయాధాయకములు.

గీతము=స్వరజ్ఞానము, నృత్తము=అంగహారాది క్రియలు, వాద్యము=చతుర్విధాతోద్యములు, ప్రస్తారము=తాలము, గమనక్రియ=పాత్రోచితములగు గతిప్రచారాది విశేషములు, ఊహము=కవి చెప్పనిదానినికల్పించుకొనుట, అపోహము=చెప్పకపోయినను అనుసరించుట, మతి=ప్రతిభ, స్మృతి=జ్ఞాపకశక్తి, మేధ=శీఘ్రగ్రహణశక్తి, శిష్యనిష్పాదనము=తన సామర్థ్యముతో శిష్యునిలోని గుణములను ప్రకాశింపజేయుట.

* [కాశీ ముద్రణమునందు 35 వ అధ్యా—27.37 శ్లో; బొంబాయి ముద్రణమునందు 26 వ అధ్యా—9, 20-28 శ్లో; బరోడా ముద్రణమునందు 26 వ అధ్యా—24-33 శ్లో]

## విశేషాంశములు

### 1. ప్రకృతి-పాత్ర వివేకము

ఈ విషయమును గూర్చి అభినవగుప్తుడు క్రిందివిధముగా వివరించెను [అభినవ భారతి- 3వ సం- పుటలు 292-294]—

వెనుకటి అధ్యాయములందు అభినయముల సమానీకరణము చెప్పబడెను; అందు రసమునుకాని, భావమునుకాని, ఇతరవిషయములనుకాని నిర్దేశించుట కెట్టి అభినయములు చేయవలెనో వివరింపబడెను. అట్టి అభినయములలో అన్యోన్యసమానీకరణము నుపదేశించి ఈ అధ్యాయమున అభినేతకును అభినేయునకును సమానీకరణమును భరతు డుపదేశించెను. అభినయముద్వారా అభినేయునకును, అభినేతకును (నటునకును) అభేదము కలుగుచున్నది. 'వాడే వీడు' అని అభినేతృ-అభినేయులకు సమానీకరణముచేయు సామాన్యాభినయము ఈ అధ్యాయమున వివరింపబడినది.

ఈ విషయమును సూచించుటకే 25వ అధ్యాయము చివర ప్రయోక్త, ప్రయోగజ్ఞుడు అను పదము లుపయోగింపబడినవి. దీనివలన ప్రయోజ్య-ప్రయోజకస్వరూపజ్ఞాన మత్యంతావశ్యకమని సూచితము. ఆ ప్రయోజ్య-ప్రయోజకస్వరూపములే ఇందు వివరింపబడినవి.

ప్రకృతి, ప్రయోజ్యుడు, అనుకరణీయుడు, అనుకీర్తనీయుడు అను పదములు పర్యాయపదములు. ప్రయోక్తకు ప్రయోజ్యుడు సదృశుడు లేదా విసదృశుడు లేదా ఉభయాత్మకుడు అయియుండును. సదృశుడు 'అనురూపుడు.' విసదృశుడు 'విరూపుడు.' ఉభయాత్మకుడు రూపానురూపుడు. రూపమనగా తనకు సహజమగు లక్షణము. అనురూపమనగా సాదృశ్యము. విరూపమనగా సాదృశ్యములేకుండుట. రూపానురూపమనగా తన లక్షణము, ప్రయోజ్యసాదృశ్యము కూడ కలిగియుండుట.

ఈ మూడు విధములును ఒకే చోట ఉండుట మనము చూచుచునే ఉందుము. ఒకవ్యక్తి మరియొకవ్యక్తితో కొన్ని విషయములందు సదృశుడును, కొన్నింట విసదృశుడును, మరికొన్నింట సదృశాసదృశుడును అగును. కాని, సకలలోకసంవాదినియగు అస్మాదృశబుద్ధి అంత నిశితాతినిశితముగావిచారింపక పురుషుడు ప్రయోజ్యుడై ప్రయోక్తయును పురుషుడే అయినచో సదృశుడనియు, స్త్రీ ప్రయోజ్య అయి పురుషుడు ప్రయోక్త అయిన విసదృశుడనియు, ప్రయోజ్యుడు సింహవదన-దశవదనాది యుతుడయి పురుషుడు ప్రయోక్త అయిన ఉభయాత్మకుడనియు వ్యవహరించును. ఈ విధము ననుసరించియే ఇందు ప్రకృతిత్రైవిధ్యము నిరూపింపబడినది.

ప్రకృతి ఒకప్పుడు పాత్రకు. అనురూపమగును; మరియొకప్పుడు విరూపమగును; ఇంకొకప్పుడు రూపానురూపిణిఅగును.

సామాజికులకు పాత్రలయందు నటబుద్ధితిరోధానముచే నటత్వము నశించి ప్రయోజ్యతాబుద్ధియే కలుగగా, ఆ ప్రయోజ్యుడు సామాజికుల భావనచే సాక్షాత్కారకల్పనానువ్యవసాయమున గోచరత్వమునందును. ప్రకృతి అనగా "ప్రకర్షేణ క్రియతే ఇతి ప్రకృతిః" అను వ్యుత్పత్తిచే సామాజికుని సాక్షాత్కారకల్పనానువ్యవసాయమున గోచరత్వమును పొందింపబడినవాడు అని అర్థము.



ఇట్టి ప్రకృతి తనకు అనురూపయా ? అననురూపయా ? రూపానురూపిణియా ? అను విషయమును గుర్తెరింగి ప్రయోక్త ప్రయోగించిన నాట్యము ఎక్కువగా శోభించును. ఈ జ్ఞానము నాట్యశోభాప్రయోజకము. నాట్యము ప్రయోజ్యస్వభావముగనే ఉండవలెనుకదా?

సుకుమారస్వభావుడయిన పురుషుడు ప్రయోజ్యుడయినప్పుడు, లాలిత్య-సౌకుమార్యములు స్త్రీజనమునకు అయత్నసిద్ధములు కావున, స్త్రీ ప్రయోగించుట యుక్తముగా నుండును. అచట ఆ ప్రకృతి ఆమెకు 'రూపానురూపిణి'.

ఉద్ధతస్వభావుడగు పురుషుడు ప్రయోజ్యుడయినప్పుడు ప్రయోక్తగా పురుషుడే తగును. ఇచ్చట ప్రయోక్తకు ఆ ప్రకృతి 'అనురూప'.

ఇక ఇట్లుకాక ప్రయోక్తకు ప్రకృతి కేవలము విరూపయైనప్పుడు అనుకీర్తనమును (అనుకరణమును) చాలప్రయత్నముతో సంపాదించవలెను కాన ప్రయోక్త సావధానముతో నటించవలసియుండును.

ఇట్లు ప్రయోగమున ప్రయోక్తకు ప్రకృతిపరిజ్ఞానము అత్యంతము ఆవశ్యకము ; ఆ పరిజ్ఞానము లేనిచో నాట్యము రక్తికట్టదు.

### 2. రంగస్థలము : స్త్రీలు

కేవలము నాట్యప్రదర్శనముకొరకే 24 గురు అప్సరసలు సృష్టింపబడినట్లు ప్రథమాధ్యాయమందు చెప్పబడినది. స్త్రీలు స్త్రీభూమికలను నిర్వహించుట 'అనురూప'మనియు, ఇది ఉత్తమభూమికాధారణమనియు ఈ అధ్యాయమందు స్పష్టముచేయబడెను. కావున, నాట్యశాస్త్రరచనాకాలమందు స్త్రీలే స్త్రీ భూమికలను ధరించుచుండిరనుట స్పష్టము.

పెక్కు సంస్కృతరూపకముల ప్రస్తావనలందు 'నటి' కన్పట్టుచున్నది ; ఆమె సూత్రధారుని పత్ని. సూత్రధారు డామెను 'ఆర్యరాల' అని సంబోధించును. నటి సూత్రధారుని 'ఆర్యపుత్ర' అని సంబోధించును. ఇవి భార్యాభర్తలు పరస్పరము చేసికొనెడి సంబోధనలు. పత్ని అనగా సహధర్మచారిణి అనియు, నాట్యవేదమహాసత్రదీక్షితుడైన సూత్రధారుడు నటిని 'ఆర్యరాల' అని సంబోధించుననియు అభినవగుప్తుడు వ్యాఖ్యానించియుండెను (పుట 491 లోని 14వ విశేషాంశమును చూడవలెను). పారిపార్శ్వకుడు సూత్రధారుని 'భావ' అని సంబోధించుచుండును. సూత్రధారుడు ప్రియదర్శికా - రత్నావళులందు నాయకుడైన వత్సరాజు భూమికను ధరింపగా వాని తమ్ముడు 'రత్నావళి' లో యౌగంధరాయణభూమికను, వాని తండ్రి 'ప్రియదర్శిక' లో కంచుకిపాత్రమును ధరించినట్లు ఆ ప్రస్తావనలలో కలదు. ఈ విషయములనుబట్టి నాడు ఒక సమాజమందలి నటులందరును ఒకే కుటుంబమునకు చెందినవారుగా కన్పట్టుచున్నారు (నేటి'సురభినాటకసమాజము' లిట్టివే). సూత్రధారుడే ఆకుటుంబమునకు పెద్ద. సాధారణముగా సూత్రధారుడు నాయకభూమికలను, వాని భార్య యగు నటి నాయికాభూమికలను ధరించుచుండెడివారు. నటి కేవలము నటిగానే కాక ఆదర్శగృహిణిగా కూడ చిత్రింపబడినది. ఆమె సూత్రధారునియందు కడు అనురక్త; ఇంటిని చక్కదిద్దుటలో ఆసక్తిమెండు. సంతానయోగక్షేమములందు శ్రద్ధ అధికము. ఆమె కుమార్తె వివాహమునుగూర్చి తాపత్రయపడుట కొన్ని ప్రస్తావనలందు వర్ణింపబడినది.

పై విధముగా భరతు డంగీకరించినను, ఉత్తమనాటకకర్తలు ఆమోదముద్రవైచినను కాలక్రమమున స్త్రీలు రంగమునుండి బహిష్కరింపబడిరి. స్మృతుల కాలమునాటికి అసలు నటులందరును పంక్తిబాహ్యులైరి.

పాశ్చాత్య సంస్కృతీ ప్రభావము కారణముగా 19 వ శతాబ్దిలో భారతదేశమున నాటకప్రదర్శనములు ప్రారంభమైనప్పుడు కేవలము పురుషులే నాటకసమాజములందు చేరిరి. పురుషులే స్త్రీభూమికలను ధరించెడివారు. ఒక్క బెంగాలు దేశమందుమాత్రము క్రీ.శ. 1795 నుండియును స్త్రీలు అప్పుడప్పుడు నాటకప్రదర్శనములందు పాల్గొనుచుండిరట. తెలుగుదేశమున స్త్రీలు పురుషులతోకలిసి రంగస్థల మెక్కుట సురభినాటకసమాజముతో క్రీ.శ. 1897 ప్రాంతముల ఆరంభమైనదని చెప్పవచ్చును. వీరు ఒకే కుటుంబమునకు చెందినవారు. విజయనగరమందలి 'విజయరామా డ్రమెటిక్ కంపెనీ' లో వృత్తి నటీమణులు (Professional Actresses) ఉండెడివారు ; వీరు వేశ్యలు. శ్రీ టి. రాఘవాచార్యులవారి ఉద్యమముతో కులీనలు రంగస్థలమెక్కుట ప్రారంభమైనది.

గ్రీకురూపకప్రదర్శనములందు స్త్రీలు పాల్గొనలేదు; యువకులే స్త్రీభూమికలను నిర్వహించెడివారు. షేక్స్పియరు కాలమందుకూడ స్త్రీలు రంగస్థలమెక్కలేదు; అప్పుడును యువకులే స్త్రీభూమికలను నిర్వహించెడివారు. రెస్టొరేషన్ యుగములో 8-12-1660 తేదీన జరిగిన 'ఒథెల్లో' నాటకప్రదర్శనమందు ప్రప్రథమముగా ఆంగ్లదేశమున ఒక స్త్రీ డెస్డిమోనా భూమికను ధరించినదట! ఇతర పాశ్చాత్యదేశములందు క్రీ. శ. 1600 పూర్వము స్త్రీలు రంగస్థలమునందు పాల్గొన్నట్లుకనపట్టదు. ఇంక చైనా, జపాన్, బర్మా, సింహళదేశములందు స్త్రీలు రంగస్థలమెక్కుట అర్వాచీనవిషయమనియే చెప్పవచ్చును.

భారతదేశమున స్త్రీలరంగప్రవేశమునకు ఆదికాలములోలేని బహిష్కారము మధ్యకాలములో వచ్చినది. ఇంక ఇతరదేశముల విషయము ఇందులకు వ్యతిరేకము. అచ్చట ఆదికాలములో ఉన్న బహిష్కారము మధ్యకాలములో పోయినది.

పురుషుడు స్త్రీభూమికను ధరించి ఉత్తమముగా నిర్వహించుటలో 'ప్రతిభ' అధికముగా వ్యక్తమగుట సత్యమే అయినను స్త్రీలే స్త్రీభూమికలను ధరించుటయందు సౌలభ్యమధికము. స్త్రీభూమికలను స్త్రీలే ధరించవలెనా ? అక్కర లేదా ? అనునది నేడొక తీవ్రసమస్య కాదు. ఉత్తమనటీమణులు తగినంతమంది లభించకపోవుటయే నేటి సమస్య. పురుషులే స్త్రీభూమికలను అత్యుత్తమముగా నిర్వహించినకాలము గడచి పోయినదని చెప్పవచ్చును. ఆధునికులు దీనిని ఎక్కువగా ఆదరించుటలేదు. ఈ విషయమున ప్రావీణ్యము సంపాదించుటకు ఉత్సహించెడి యువకులును నేడు లేరనుట అసత్యము కాజాలదు. తెలుగు దేశమున ఔత్సాహిక నాటకసమాజములవారు 'రిహార్సల్సు' వేసి కొనుటకు గదులు కాని, నాటకములను ప్రదర్శించుటకు నాటకశాలలు కాని లేక బాధ పడుచున్నారు. అందులకుతోడు నటీమణుల కొరత వారిని మరింత బాధపెట్టుచున్నది. ఈ మూడు కొరతలును తీరినప్పుడే తెలుగు దేశమున నాటకకళ కొంతకుకొంత అభివృద్ధిని కాంచగలదు.

---

# అధ్యాయము 27[1]

## నాట్యసిద్ధి[2]

[కాశీముద్రణమునందు 27 వ అధ్యా— 102 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 27 వ అధ్యా—93 శ్లోకములును; బరోడా ముద్రణమునందు 27 వ అధ్యా—104 శ్లోకములును కలవు.]

ప్రయోగము సర్వమును 'సిద్ధి' కొరకే ప్రదర్శితమగునుకాన నాటకా శ్రితములైన సిద్ధుల లక్షణములను ఇంక వివరింతును.[3] వాక్-మనో-అంగసము ద్భవమును, నానాభావసముత్థితమును అయిన సిద్ధి దైవ-మానుష (దైవీ-మానుషీ) భేదములచే రెండు విధములని తెలియవలెను. ఇందు మానుషసిద్ధి దశాంగ యుక్తము ; ఇంక దైవసిద్ధి రెండు విధములు. ఈ దైవసిద్ధి సత్త్వాశ్రయముగా ఉండును ; మరి మానుషసిద్ధి శారీరీ-వాఙ్మయీరూపముగానుండును.

**మానుషసిద్ధి[4]**

వాఙ్మయసిద్ధి : 1. స్మితము, 2. అర్ధహసితము, 3. అతిహసితము, 4. సాధు-అహో-కష్టమ్ అను మాటలు, 5. ప్రబద్ధనాదము అను ఈ ఐదును

---

1. ఈ భాగము మూడు ముద్రణములందును సప్తవింశాధ్యాయమే (27వ అధ్యా.)

సూచన : అన్ని ముద్రణములును 8వ అధ్యాయమువరకును సమానమే. బొంబాయి-బరోడా ముద్రణములందలి 9వ అధ్యాయము కాశీముద్రణమునందు రెండు అధ్యాయము లైనది. అట్లే 17వ అధ్యాయము కూడ కాశీముద్రణమునందు రెండు అధ్యాయములైనది. ఇట్లు కాశీముద్రణమునందు రెండు అధ్యాయములు పెరిగినవి. కాని, కాశీముద్రణము నందలి 34 వ అధ్యాయము బొంబాయి-బరోడా ముద్రణములందు 24 వ అధ్యాయ మగుటచేతను, 35వ అధ్యాయమందలి ఒక భాగము ప్రత్యేకముగా 26వ అధ్యాయ మగుటచేతను పై అధ్యాయసంఖ్య యందలి భేదము ఈ 27వ అధ్యాయము ప్రసక్త మగునప్పటికి తొలగిపోయినది.

2. 'సిద్ధివ్యంజకము'—అని కాశీ-బొంబాయి-బరోడా ముద్రణముల పాఠము. అభినవగుప్తుడు సిద్ధ్యధ్యాయమనెను.

3. వివిధసంస్కృతిస్వభావములుకల ప్రేక్షకులు ప్రయోగమును మెచ్చుకొనెడి విధాన మిందు వివరింపబడుచున్నది. సిద్ధి అనునది ప్రయోక్తపరమైనది. ఆ సిద్ధిని ప్రేక్షకు లేవిధముగా గ్రహించి వ్యక్తము చేయుదురో, సిద్ధివిఘాతము లెట్టివో, ఇందు వివరింప బడును. 'సిద్ధి'ని గూర్చి అభినవగుప్తుడు చేసిన వ్యాఖ్యానమును ఒకటవ విశేషాంశమునందు వివరింతును.

4. మానుష సిద్ధినిగూర్చి డా. ఘోష్ క్రిందివిధముగా అభిప్రాయపడెను—

"This 'human' success seems to relate to the common 'human' beings

వాఙ్మయసిద్ధియొక్క అంశములు (సశబ్దముగా వాక్కులతో సిద్ధిని వ్యక్తముచేయు విధానమిది.)—

1. స్మితము— శిష్టమైన హాస్యరసము నర్తకులచే కొంచెముగా ప్రయుక్తమైనప్పుడు దానిని ప్రేక్షకులు 'స్మితము' చే ప్రతిగ్రహించవలెను. ఇటిది 'స్మిత సూచిత సిద్ధి' అనబడును.

2. అర్ధహాస్యము— కించిదస్పష్టహాస్యము లేదా అట్టి అస్పష్టహాస్యవచనము నటులచే ప్రయుక్తమైనప్పుడు దానిని ప్రేక్షకులు నిత్యమును 'అర్ధహాస్యము' చే గ్రహించవలెను. ఇట్టిది 'అర్ధహాస్యసూచితసిద్ధి' అనబడును.

3. అతిహాస్యము— విదూషకచ్ఛేదకృతము (ఛేదము=వచనభంగి) లేదా ఏదేని శిల్పకృతము అయిన దానిని ప్రేక్షకులు నిత్యమును 'అతిహాసము' చే గ్రహించవలెను. ఇట్టిది 'అతిహాస్యసూచితసిద్ధి' అనబడును.

4. అహో— ధర్మపదసంయుక్తము లేదా అతిశయసంభవము అయిన విషయము ప్రయుక్తమైనప్పుడు ప్రేక్షకులు 'అహో' కారము నొనర్చవలెను.

సాధు— విస్మయావిష్టభావములందు లేదా ప్రహర్షార్థములందు 'సాధు' శబ్దమును ప్రేక్షకులు ప్రయోగించవలెను.

కష్టమ్— కరుణమునందు కన్నీటితో 'కష్టమ్' అను శబ్దమును ప్రేక్షకులు ప్రయోగించవలెను.

5. ప్రబద్ధనాదము— విస్మయార్థములందు నిత్యమును ప్రేక్షకులు ప్రబద్ధ నాద మొనర్చవలెను. (ఎడతెగకుండ కేకలు వేయుట, చప్పట్లు కొట్టుట మొ॥)

శారీరసిద్ధి: 1. పులకలు (జలదరింపు), 2. రోమాంచము (గగుర్పాటు), 3. అభ్యుత్థానము (లేచినిలుచుండుట), 4. చేలదానము (వస్త్రములను దాన మొసంగుట) 5. అంగుళిక్షేపము (వ్రేళ్ళు, చేతులు ఆడించుట) అనునవి ఐదును శారీరసిద్ధికి చిహ్నములు (అనగా శారీరసిద్ధి వ్యక్తమగు పద్ధతి ఇది.)

పులకలు— అధిక్షేపముతో కూడిన వాక్యములు ప్రయుక్తములైనప్పుడు పులకలు కలుగును.

బహుమానములు— కుతూహలము రేకెత్తించినప్పుడు బహుమతుల నొసంగవలెను.

అభ్యుత్థానము— రంగము దీప్తప్రదేశమును, అందలి కార్యములు ఛేద్య-భేద్య-ఆహవాత్మకములును, విద్రవ-ఉత్పాత సంయుక్తములును, యుద్ధ-నియుద్ధజ

---

or average spectatros, and they should be compared with men occupying the gallery of a modern theatre. They are generally moved by outward and not deep aspects of a dramatic performance." [p. 513—foot-note].



ములును, అయినప్పుడు కుశలులైన ప్రేక్షకులు సాస్రముగా అంస-శీర్షములను బాగుగా కంపింపజేయుచు ఆకస్మికముగా లేచి నిలుచుండవలెను.[5]

పైవిధముగా తజ్ఞులచే అభివ్యక్తముచేయబడు ప్రోత్సాహముచే సూచితమగు నటునిసిద్ధి మానుషసిద్ధి అనబడును.

దైవసిద్ధి[6]

ఇంక దైవసిద్ధిని వివరింతును. ఇది రెండువిధములని చెప్పబడెనుకదా—

1. భావాతిశయముతో కూడినదై, సత్త్వయుక్తమై, సహజముగా మొదటినుండియు ఎట్టి విఘ్నములును లేకుండుట దైవకృతమగు సిద్ధి అని ప్రేక్షకులు తెలియవలెను.

2. ఒకవేళ విఘ్నములు జనించినను అవి దైవాపరపర్యాయమగు అదృష్టముచే, లేదా పురుషప్రయత్నముచే నశించి శబ్దముకాని, క్షోభముకాని, ఉత్పాతములుకాని లేక రంగమండలము ప్రేక్షకులతో నిండియుండుటకూడ దైవసిద్ధి అని ఎరుంగవలెను.

ఘాతములు

ఇంతవరకును దైవీ-మానుషీసిద్ధులను వివరించియున్నాను. ఇంక దైవ సముత్థములైన ఘాతములను వివరింతును.

---

5. ప్రకంపితాంసశీర్షకాదులు— అనగా మూపులు ఎగురవేయుట, లేచి నిలుచుండుట మున్నగువానిని చేయుచు ప్రేక్షకుడు నటునకు ప్రోత్సాహ మొసంగవలెను. ఇచ్చట మూడే భేదములు స్ఫుటముగా కన్పట్టుచున్నవి. కాని, ఇందు ప్రేక్షకుడు లేచి నిలుచుండవలెననుటచే 'అభ్యుత్థాన' మనెడి తొమ్మిదవ భేదము చెప్పబడెను. ఇందు వదన-అంగులిక్షేపాదులుండును కాన పదియవ భేదముకూడ చెప్పబడినట్లే. సాస్రముగా అనుటచే పైనిచెప్పని మరియొక భేదముకూడ చెప్పబడినట్లుండును. కాని ఇట్టివి పెక్కు భేదములుండునుకాన అవి యెల్ల అభ్యుత్థానమునందే అంతర్భూతములని గ్రహించవలెను [అభినవభారతి-శివ సం- పుట 308].

6. దైవసిద్ధి రెండు విధములు— (1) సహజముగ విఘ్నములు లేకుండుట, (2) కారణాంతరములచే వచ్చిన విఘ్నములు తొలగుట. ఈ రెండును రెండు శ్లోకములలో వివరింపబడెను. ఈ రెండవ భేదమును వివరించు శ్లోకము క్రిందివిధముగానున్నది—

న శబ్దో యత్ర న క్షోభో న చోత్పాతనిదర్శనమ్।
సంపూర్ణతా చ రంగస్య దైవీసిద్ధిస్తు సా స్మృతా॥ 17

డా. ఘోష్ దైవసిద్ధిని గూర్చి క్రిందివిధముగా అభిప్రాయపడెను—

"The 'divine' success seems to relate to cultured spectators who generally take interest in deeper and more subtle aspects of a dramatic performance and as such are above ordinary human beings and may be called 'divine' [p. 513—foot-note].

ఘాతములు మూడు విధములు— దైవసముత్థములు, ఆత్మసముత్థములు, పరసముత్థములు. ఈ మూడు విధములునుకాక 'ఔత్పత్తిక' మనెడి నాలుగవ ఘాతము కూడ ఒకానొకప్పుడు సంభవించుచుండును.

1. దైవసముత్థితములైన ఘాతములు— వాత-అగ్ని-వర్ష-కుంజర-భుజంగ-మండపనిపాతము (నాట్య మండపము విరిగిపడుట) లవలనను, కీట-వ్యాల-పిపీలికా-పశుప్రవేశనములు అనువానివలనను కల్గు నాట్యవిఘాతములు దైవ కృతములు.

2. పరకృతఘాతములు-- వైవర్ణ్యము, చేష్టలేకయుండుట, కలవరపడుట, స్మృతి తప్పుట మొదలగునవి ఇతరులవలన కలిగినచో అవియును పరసముత్థవిఘాతములే. మాత్సర్య-ద్వేషములవలనను (మాత్సర్యము=ఏకద్రవ్యాపేక్షచే జనించిన అప్రీతి, ద్వేషము=సహజమగు అప్రీతి), పక్షపాతముచేతను, అర్థ విషయకములైన భేదములచేతను (లంచములను గ్రహించి) పరులు ఘాతములను కల్పింతురు. అతిహసిత-రుదితములును, విస్ఫోటిత-ఉత్కృష్టములును, నాలికా పాతమును, గోమయ-లోష్ట-తృణ-శిలా (పిపీలికా-అని బరోడా ముద్రణపాఠము) నిక్షేపములును ( పేడ విసరుట మొదలగునవి) అరిసంభూతములైన ఘాతములని తెలియవలెను. (పిపీలికానిక్షేపమనగా సుకుమారప్రకృతియగు స్త్రీ పాత్ర ప్రాయముగానుండు నటునకు త్రాసము కలిగించుటచే సంభవించెడి సిద్ధివిఘాతమని అభినవగుప్తుడు వ్యాఖ్యానించెను.)

3. ఔత్పాతికఘాతములు— భూకంప-ఉల్కాపాత-వాత-నిర్ఘాతము (పిడుగు పడుట) లును, పశు-మత్త-ఉన్మత్త ప్రవేశకృతములును ఔత్పాతిక ఘాతములు (అశంకితముగా సింహాదిరూపములను ధరించి సుకుమారప్రయోక్తను భయపెట్టుట, లేదా సామాజికులను భయపెట్టుట. మాత్సర్యమువలన ఉన్మత్త వేషమును ధరించి అచ్చట ప్రకృతప్రయోగమునకు, పాత్రలకు సరిపడని నవ్వు కలిగించుట మొ॥)

4. ఆత్మసముత్థములైన ఘాతములు— వైలక్షణ్యము (అభినయము సరిగా లేదా సహజముగా లేకుండుట అనగా పాత్ర తన లక్షణమును మరచుట), అచేష్టితము (మొద్దువలె నిలబడుట), విభూమికత్వము (తనకు అనురూపముకాని భూమికను ధరించుట లేదా తూష్ణీంభావము కలుగుట), స్మృతిప్రమోహము (తన పాఠ్యమును మరచిపోవుట), అన్యవచనమును చెప్పుట (ఇంకొక పాత్ర మాటలు తానే చెప్పివేయుట మొదలగునవి), ఆర్తనాదము (కేకలు, బొబ్బలు పెట్టుట), విహస్తత్వము (హస్తాభినయము సరిగాలేకుండుట), ముకుట-ఆభరణములు జారి పడిపోవుట (ఆహార్యభ్రంశత్వము), పుష్కరజదోషములు[7] (వాద్యధ్వనులు సరిగా లేకుండుట), కావ్యదోషములు (వాగ్భీతి =మాటాడుటకు జంకు- అని కాశీ ముద్రణపాఠము),అతిహసిత-రుదితములు, విస్వరత్వము(ఉచ్చారణము, కాక్వాదులు సరిగా లేకుండుట) అనునవి ఆత్మసముత్థములైన దోషములు.



అతిహసిత-రుదితములు సిద్ధికి దోషాపాదకములు. కీట-పిపీలికాపాతనులును సిద్ధిని సాకల్యముగా నాశముచేయును. విస్వరత్వము, అజ్ఞాతతాళము (తాళాను గుణముగ స్వరకల్పన లేకుండుట), వర్ణ-స్వర-సంపద్విహీనత్వము, స్థాన-లయల అజ్ఞానము అనునవి స్వరగతములై ప్రయోగసిద్ధికి ఘాతహేతువులగును. ముకుట-ఆభరణములు పడిపోవుట ప్రబద్ధనాదమును నాశముచేయును. పశువిశసనము ప్రయోగమునకు అత్యంత బాధాజనకమగును. విషమము, మానహీనము. విమార్జనము, ఆకులప్రహారము (ఇష్టమువచ్చినట్లు వాయించుట), అవిభక్తగ్రహ-మోక్షము అయిన పుష్కరగతమైన వాద్యవిధానము ప్రయోగసిద్ధిని నాశముచేయును. పునరుక్తి, అసమాసము, విభక్తిభేదము, విసంధి, అపార్థము, లింగవిపర్యయముచే కలుగు దోషము, ప్రత్యక్ష-పరోక్ష సంమోహము, ఛందోవృత్తత్యాగము, గురు-లఘుసంకరత్వము, యతిభేదము అను కావ్యగతదోషములు స్థూలముగ ఘాతనిమిత్తములు.

*ప్రతిక్రియారహితములైన ఘాతములు :* ప్రకృతి వ్యసనసముత్థము, శేషోదక నాలికాత్వము[8] అను రెండును ప్రయోగసమయమున నిత్యమును ప్రతిక్రియా

---

7. పుష్కరవాదనమందలి దోషములుకూడ సిద్ధివిఘాతములని చెప్పబడుటచే అభినయముల సమానీకరణముమాత్రమే కాక ఆతోద్య-గీతములు సామాన్యాభినయములతో సమముగ మేళనము చెందియుండుట కూడ సామాన్యాభినయమే అగునని ఎరుంగవలెను [అభినవభారతి-3వ సం-పుట 314].

8. ప్రకృతివ్యసనము=ప్రకృతమగు (స్వభావగతమగు) అనౌచిత్యము. "అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్" అనికదా చెప్పబడెను.

శేషోదకనాలికాత్వము=కాలమునకు అనుచితమగుదానిని నిబంధించుట. ప్రభాత కాలమున రాజులు సంగీతకదర్శనాదికము చేయుచున్నట్లు నిబంధించుట. దీనినిబట్టి దేశ-కాల-స్వభావకృతమగు అనౌచిత్యమంతయును సిద్ధిఘాతమని ఎరుంగవలెను [అభినభారతి-3వ సం-పుట 316].

ఉదకనాలిక=ప్రాచీనులు నియతపరిమాణాత్మకమైన నాడికా (tube) సహితమగు జలపాత్రను కాలమును కొలుచుట కుపయోగించెడివారు. ఆ నాడికనుండి అందలినీరు వెడలిపోవుటకు పట్టుకాలము ఒక 'నాడిక' (=నాడి=నాలిక) అనబడును.

రహితములైన ఘాతములని తెలియవలెను. (ఇవి ఔచిత్యమునకు సంబంధించిన దోషములు.)

ఘాతస్థానములు : అప్రవిభాగము (అర్థవంతమగునట్లుగా విడదీసి చదవక పోవుట), స్ఖలనము (పాఠ్యమున తడబడుట), విస్వరోచ్చారణము, భూషణములను తప్పుగా ధరించుట, భూషణములు పడిపోవుట, ముకుటము జారిపోవుట, వాజి-స్యందన-కుంజర-ఖర-ఉష్ట్రి-శిబికా-విమానయానముల విషయమున ఆరోహణ-అవతరణములు సరిగాలేకుండుట, ప్రహరణ-కవచములను తప్పుగా ధరించుట, మకుట-భూషణరహితముగాకాని ఆలస్యముగాకాని రంగమున ప్రవేశించుట అనునవి ఘాత నిమిత్తములని కుశలురైన పండితులు గుర్తించవలెను. కాని యూపాగ్నిచయన దర్భలు, స్రుక్-భాండాది చిహ్నములు లోకవృత్తోపయోగులు కాకపోవుటచేతను, అవి నటులకు దుర్లభములు కావునను వానిని విడిచివచ్చినను సిద్ధివిఘాతము కలుగదు (చిహ్నములనగా వేటిచే అతడు ఆ వ్యక్తిగా సులభముగా గ్రహింపబడగలడో అట్టివి).

ఘాతభేదములు : సిద్ధితో మిశ్రితమైనఘాతము, సర్వగతఘాతము, ఏకదేశజమైన ఘాతము అనెడి భేదములను నాట్యకుశలులు లిఖించవలెను.

సంపూర్ణసిద్ధినికాని, సర్వగతఘాతమునుకాని సకారణముగా నిర్దేశించవలెను. ఏకదేశజమైన ఘాతమునుబట్టి ప్రయోగమును హీనముగా లెక్కించరాదు. జర్జరమోక్షాంతమునుండి నాలికామోక్షమువరకును సిద్ధినిగూర్చి నాట్యజ్ఞులైన ప్రాశ్నికలు (Judges or Assessors) విధిపూర్వకముగా సతతమును లిఖించవలెను.* (జర్జరమోక్షాంతమునుండి అని చెప్పుటచే పూర్వరంగ ప్రయోగముకూడ పరీక్షింపదగినదని తెలియవలెను.)

ఒక దేవుని ఉత్సవసందర్భములో ఇంకొక దేవుని గూర్చిన నాందీ శ్లోకమును మూఢుడై ఎవడైన పఠించినచో అది ప్రయోగమందు పూర్వరంగసిద్ధికి ఘాతమగును.

ఎవడేని ఒకకవి కావ్యమందు ఇంకొక కవి కావ్యమందలి భాగములను మిశ్రీకృతము చేసినచో దానిని వానికి సంబంధించిన ఘాతముగా పరిగణించవలెను. ఎవడేని తెలిసియు ఒక కవి కావ్యమునకు ఇంకొక కవిపేరు పెట్టినచో (ప్రసిద్ధుడైన కవిపేరుతో ఇంకొకని కావ్యమును చెలామణి చేసినచో) వాని దోషము స్పష్టము

*[కాశీముద్రణమునందు 27వ అధ్యా—1-40 శ్లో ; బొంబాయిముద్రణమునందు 27 వ అధ్యా— 1-39 శ్లో ; బరోడాముద్రణమునందు 27 వ అధ్యా—1-41 శ్లో.]



కాన దానిని ఘాతముగానే లిఖించవలెను. [ఈ పేరా కాశీ ముద్రణపాఠము. ఇది బరోడాముద్రణమునందు అధస్సూచికలో మాత్రమే కలదు.]

ఎవడేని దేశభాషారహితముగా (దేశవేష-భాషావ్యపేతముగా- కాశీ-బొంబాయి ముద్రణముల పాఠము) బుద్ధిపూర్వకముగా కావ్యమును ప్రయోగించినచో దానిని ఘాతముగా ప్రయోగజ్ఞులు లిఖించవలెను.

నాట్యవిధిలో చెప్పబడినదానిని యథావిధిగా గ్రహించుటయందును, తత్ప్రయోగమును సాధించుటయందును (అనగా దానియందు ప్రతిపాదింపబడినదానినంతను సామాజికులు గ్రహించునట్లు చేయుటయందును) శక్తిమంతుడు కాకపోయినను ఎవడు కేవలము నాటకము వేయవలెనను ఉత్సాహముచేతనే ప్రయోగము నిచ్చునో అట్టివాడును సిద్ధిఘాతమునకు హేతువే అగును.

లోక - వేదసంసిద్ధములును, గంభీరార్థములును, సర్వజనగ్రాహ్యములును అయిన శబ్దములనే విధిపూర్వకముగా నాటకమునందు ప్రయోగించవలెను.' లోకములో కేవలము గుణహీనమైనదికాని, కేవలము దోషహీనమైనదికాని ఉండదు. కావున, నాట్యార్థమునుబట్టి నాట్యప్రకృతులయందలి దోషములను గ్రహించవలెను. నటునియందుకాని, వాక్-అంగ-సత్త్వ-నేపథ్య-రస-భావ-గీత-ఆతోద్య-లోకయుక్తులయెడ గాని ఎన్నడును అనాదరము చూపరాదు. ఇట్లు సిద్ధుల లక్షణములను బుధులు తెలియవలెను.

ప్రాశ్నికుల లక్షణములు[10]

ఇంక ప్రాశ్నికుల లక్షణములను వివరింతును— చరిత్ర-అభిజనోపేతులు (సచ్ఛీలురు, కులీనులు), శాంతవృత్తులు, యశో-ధర్మపరులు, మధ్యస్థులు, వయో

9. నాట్యవిధిలో చెప్పబడిన దానిని గ్రహించుటకును, ప్రయోగమును సరిగా చేయుటకును అశక్తుడైనప్పటికిని నాటకమందు ఆసక్తి కలవాడై దేశ-వేషాద్యనౌచిత్యములతో ఎవడు ప్రయోగమును ప్రదర్శించునో వానికి పై సిద్ధివిఘాతములన్నియును కలుగును. కావున నాట్యవిధిని గ్రహించుటకును, సాధ్యమైనంతవరకు ఆచరణలో పెట్టుటకును యత్నించవలెను. సాధ్యమైనంతవరకు దోషములనెరింగి వాటిని విడువవలెను. దోషములతో కూడిన దానిని గ్రహించనేరాదని అర్థము చెప్పినచో అట్టి ప్రయోక్తయే లేకపోవలసివచ్చును; కావున 'అనాదరము' ను చూపరాదని తరువాత చెప్పబడినది. [అభినవభారతి - 3వ సం - పుట-318.]

నాటకాదులం దుపయుక్తములు కాదగిన శబ్దములను గూర్చి ఇంతకుముందే రెండుసార్లు చెప్పబడినది— 16వ అధ్యాయాంతమునందు; 20వ అధ్యాయాంతమునందు.

10. ప్రశ్నేభవాః=ప్రాశ్నికాః (మధ్యస్థులు). అభినయములు నాలుగు, గీతాతోద్యములు రెండు మొత్తము ఆరు అంగములు. విమలాశయత్వము అనగా సహృదయత్వము ఉత్తమగుణము. అట్టి గుణోపేతులగు ప్రాశ్నికులతో కలిసి ఆలోచించవలెనని

న్వితులు, షడంగ (అభినయచతుష్టయము, గీత-ఆతోద్యములు) నాట్యకుశలులు, ప్రబుద్ధులు, శుచులు, సములు, చతురాతోద్యకుశలులు, వృత్తజ్ఞులు (నేపథ్యజ్ఞులు-కాశీముద్రణ పాఠము), తత్త్వదర్శులు, దేశ-భాషావిధానజ్ఞులు, కలా-శిల్ప ప్రయోజకులు, చతుర్విధాభినయోపేతులు, రస-భావ వికల్పజ్ఞులు, శబ్ద-చ్ఛందో విధానజ్ఞులు, నానాశాస్త్రవిచక్షణులు అయినవారు దశరూపమందు ప్రాశ్ని కులుగా[11] ఉండవలెను.

ప్రేక్షకుల లక్షణములు

అవ్యగ్రై రింద్రియైః శుద్ధ ఊహాపోహవిశారదః ।
త్యక్తదోషోఽనురాగీ చ స నాట్యే ప్రేక్షకః స్మృతః ॥ 54

యే తుష్టౌ తుష్టి మాయాంతి శోకే శోకం వ్రజంతి చ ।
దైన్యే దీనత్వ మాయాంతి తే నాట్యే ప్రేక్షకాః స్మృతాః ॥ 42

య స్తుష్టౌ తుష్టి మాయాతి శోకే శోక ముపైతి చ ॥ 61
క్రుద్ధః క్రోధే భయే భీతః స శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః । 62

—అవ్యగ్రములైన ఇంద్రియములచే శుద్ధుడును, ఊహాపోహవిశారదుడును, దోషరహితుడును, అనురాగియును అయినవాడు నాట్యమందు ప్రేక్షకుడుగా ఉండుట కర్హుడు. ఎవరు కథాగతమైన దైన్యమునందు దీనత్వమును, తుష్టియందు తుష్టిని, శోకమునందు శోకమును పొందుదురో వారే నాట్యమందు ప్రేక్షకు లనబడుదురు. ఎవడు ప్రయోగమునుచూచుచు క్రోధమునందు క్రుద్ధుడును, భయము నందు భీతుడును అగునో, తుష్టియందు తుష్టిని, శోకమునందు శోకమును పొందునో ఆతడే ఉత్తమప్రేక్షకుడు.

కాని, పై గుణములు ప్రేక్షకులందరియందును చక్కగాఉండవు ; కారణము విజ్ఞానము అప్రమేయమును, ఆయువు అల్పమును అగుటయే. సంకీర్ణమైన పరిషత్తు

---

తాత్పర్యము. వస్తుతత్త్వము నెరుంగుటకు ప్రాజ్ఞులతో విచారించవలెను. ఒక్కొక్కప్పుడు ప్రయోక్తలకు పరస్పర కలహముచే కూడ ప్రాశ్నికుల అవసరము కలుగును. అట్టి వివాదము ఒకప్పుడు లక్ష్యములను గూర్చియు, ఇంకొకప్పుడు లక్షణములను గూర్చియు వచ్చుచుండును. [అభినవభారతి-3వ సం-పుట 318.]

11. "ప్రేక్షకులుగా" ఉండవలెను అని కాశీముద్రణపాఠము. డా. ఘోష్ ఈ పాఠమునే అనుసరించెను. ఇది సమంజసముకాదు. ఇది ప్రాశ్నికుల విషయమని అభినవగుప్తుడుకూడ స్పష్టముగా వ్యాఖ్యానించియుండుట గమనార్హము.



నందు ఎవనికి ఏ శిల్పము లేదా ఏ నేపథ్యము లేదా ఏయే కర్మ-వాక్-చేష్టితములు సరిపడునో, స్వకర్మవిషయమగుటచే, ఆతడు దానినే మెచ్చుకొనును.

ప్రకృతులు నానా శీలోపేతులుగా ఉందురు. ఉత్తమ-మధ్యమ-అధముల యొక్కయు, వృద్ధ-బాలిశ-ప్రమదలయొక్కయు శీలములననుకరించుచు నాట్యము నిర్మితమగును. అట్టియెడ సంకీర్ణ పరిషత్తునందలి అందరును అన్నింటిచేతను ఆనందింప లేరు. తరుణులు కామవిషయములచేతను, విదగ్ధులు సమయప్రదర్శనముచేతను, అర్థపరులు అర్థవిషయములచేతను, విరాగులు మోక్షప్రదర్శనముచేతను, శూరులు వీర-రౌద్ర-నియుద్ధ-ఆహవములచేతను, వృద్ధులు ధర్మాఖ్యాన-పురాణములచేతను, బుధులు సర్వతత్త్వభావప్రదర్శనముచేతను తుష్టులగుదురు. బాలురు, మూర్ఖులు, స్త్రీలు హాస్య-నేపథ్యములచే తుష్టిని పొందుదురు. ఈ విధముగా, భావానుకరణ మందు, ఎవడు ఏ భావమునందు తన్మయత్వమును చెందగలడో ఆ భావవిషయమున ఆతడు ఉత్తమప్రేక్షకుడని తెలియవలెను.

దశరూపసంశ్రయమైన ప్రయోగమునందు ప్రేక్షకులు పై విధముగా ఉందు రని తెలియవలెను.

నాటకపు పోటీలు : ప్రాశ్నికుల విధులు

ప్రయోగవిషయమున సంఘర్షము సముత్పన్నమైనప్పుడు ఈ క్రింది పదుగు రును ప్రాశ్నికులుగా ఉండవలెను— యజ్ఞవిదుడు, నర్తకుడు, ఛందోవిదుడు, శబ్ద విదుడు, అస్త్రవిదుడు, రాజు, చిత్రకారుడు, వేశ్య, గాంధర్వుడు, రాజసేవకుడు. వీరిలో యజ్ఞవిదుడు యజ్ఞయోగమునందును, నర్తకుడు అభినయవిషయమునందును, ఛందోవిదుడు వృత్తబంధముల విషయమునను, శబ్దవిదుడు పాఠ్యవిస్తరవిషయము నను, అస్త్రవిదుడు శస్త్రాస్త్రప్రయోగ విషయమునను, రాజు విభూతిగుణయోగ-అంతఃపురచేష్టిత-ఆత్మచరితముల విషయమునను, చిత్రకారుడు నేపథ్యవిషయము నను, వేశ్య కామోపచారవిషయమునను, గాంధర్వుడు స్వరకర్మవిషయమునను, సేవకుడు ఉపచారవిషయమునను ప్రాశ్నికులు కావలయును.

పై వివాదము శాస్త్రముచే తెలిసికొనదగిన విషయమును గూర్చి కాక ప్రకృతులకు సంబంధించిన విషయమునైనపుడు పై పదుగురు ప్రాశ్నికులును దృష్టాంతపూర్వకముగా దోషములను, గుణములను యథాప్రకృతికముగ వివరించ వలయును. ఇంతకుముందు వివరించిన గుణములు కలిగిన ఆ ప్రాశ్నికులు శాస్త్ర సంశ్రయమైన సంఘర్షము సంభవించినప్పుడు శాస్త్రప్రమాణనిరూపణముచేతనే వ్యవహారమును నిర్ణయించవలెను. భర్తృనియోగముచే (ప్రభువు ఆజ్ఞచే లేదా నాటక

సమాజాధిపతి కోరుటచే), లేదా అన్యోన్య విగ్రహముచే, లేదా స్పర్ధచే, లేదా అర్థమును పతాకను గెలుచు కోర్కెచే భరతుల (నటుల) మధ్య సంఘర్షము సంభవించుచుండును. అప్పట్లు పక్షపాతరహితముగా వ్యవహార దర్శన-పరిష్కారములు కర్తవ్యములు. అనన్యమతులు, సుఖోపవిష్టులు, నిర్మలభావులును అయిన ప్రాశ్నికులు లేఖక-గణక[12]సహాయులై సిద్ధియొక్క ఘాతములను క్రమముగా లిఖించవలెను.

ప్రాశ్నికులు రంగస్థలమునకు అత్యాసన్నులుగా కాని, దూరసంస్థితులుగా కాని ఉండరాదు ; వారు రంగస్థలమునకు 12 హస్తముల దూరమునందుండవలెను. నాట్యప్రయోగమందలి పూర్వోక్తములైన సిద్ధి స్థానములను, ఘాతములను లిఖించవలెను. దైవ-ఉత్పాత-పరసముత్థితములైన ఘాతములను బుధులు లిఖించరాదు ; నాట్య(కావ్య)సముత్థములును, ఆత్మ (నట) సముత్థములును అయినవానిని మాత్రమే ఘాతములనుగా లిఖించవలెను. అట్లు లిఖించిన పిమ్మట చివర ఎవనికి ఘాతములు అల్పములును, సిద్ధిస్థానములు బహుళములును అగునో వానినిగూర్చి రాజునకు నివేదించి, పిమ్మట సిద్ధ్యతిశయము గల ఆ నటునకు పతాక నొసంగవలెను. ఇరువురు నటులు సమసిద్ధి కలవారైనచో ఆ విషయమును రాజునకు నివేదించి, వానినిర్ణయమును బట్టి పతాక నొసంగవలెను. రాజుకూడ వారిని సములనుగా భావించినచో అప్పుడు పతాకను ఇరువురకును ఒసంగవలెను. (దీనినే ఇప్పుడు మనము 'bracketing' అనుచున్నాము) ఇట్లు విధిజ్ఞులు వ్యవహారమును సామంజస్యమును బట్టి పరిష్కరించవలెను*.

స్వస్థచిత్తులు, సుఖాసీనులు, సువిశిష్టగుణార్థులు, సర్వరాగపరాఙ్ముఖులు అయిన ప్రేక్షకులు బాగుగా విమర్శించి ప్రయోగసమయాశ్రితములైన సాధనములను, దూషణాభాసములను కూడ గ్రహించవలెను. సమత్వము, అంగమాధుర్యము, పాఠ్యము, ప్రకృతులు, రసములు, వాద్యము, గానము, నేపథ్యము అనువానిని కూడ వారు (ప్రయోక్తలు-అని కాశీముద్రణపాఠము) ప్రయత్నపూర్వకముగా గ్రహించవలయును.

కలాంతరకలలయందు గీత-వాదిత్ర-తాలములతో నాట్యమును సమముగా నొనర్చుట 'సమనాట్య' మనబడును. అంగోపాంగసమాయుక్తమును, గీత-తాల-

12. లేఖకుడు లిఖించును, గణకుడు ఘాతములనెల్ల రాశీకరించును. సామర్థ్యమును బట్టి ఈ రెండు పనులను ఒకడే చేయవచ్చును. [అభినవభారతి-3వ సం-పుట 319].

*[కాశీముద్రణమునందు 27వ అధ్యా—41-80 శ్లో; బొంబాయిముద్రణమునందు 27వ అధ్యా— 40-68 శ్లో ; బరోడాముద్రణమునందు 27వ అధ్యా— 42-78 శ్లో.]



లయాన్వితమును అయిన గానవాద్యముల యొక్క సమత్వమును కూడ బుధులు 'సమనాట్య' మందురు.

ఉరము నిర్భుగ్నమును, కరములు చతురశ్రములును కాగా గ్రీవము అంచితమగుట 'అంగమాధుర్య' మనబడును.

వాద్యములు, ప్రకృతులు, గానము అనువానిని ముందు వివరింతును. ఇంక తక్కిన సాధ్యవిషయములను గూర్చి ఇంతకుముందే వివరించియున్నాను.

ఇట్లు, సిద్ధిస్థానముల నెరింగి వానిచే సిద్ధిని ప్రకాశమొనర్చవలెను.

### నాట్యప్రయోగకాలములు

పగటియందును, రాత్రియందును వివిధాశ్రయములైన వార (ప్రయోగ) కాలములను నాట్యజ్ఞులు తెలియవలెను.

పగటివేళ పూర్వాహ్ణ-మధ్యాహ్న-అపరాహ్ణములు నాట్యవారములు (అనగా ఇవి పగటియందు నాట్యప్రయోగోచితసమయములు). ఇంక రాత్రివేళ ప్రదోష-అర్ధరాత్రి-ప్రభాతములు నాట్యవారములు (అనగా ఇవి రాత్రియందు నాట్యప్రయోగోచితసమయములు). రసాశ్రయమైన ఏ నాట్యము ఎచ్చట ప్రయోజ్యమో దానిని వారకాలసమాశ్రయముగా వివరింతును—

1. పూర్వాహ్ణము — శ్రోత్రరమణీయమును, ధర్మోత్థానకృతమును అయిన ప్రయోగమును - అది వికృతమైనను, శుద్ధమైనను - పూర్వాహ్ణమందు ప్రయోగించవలెను.

2. అపరాహ్ణము—సత్త్వగుణయుక్తమును, వాద్యభూయిష్ఠమును, సిద్ధిబహుళమును అయిన ప్రయోగమును అపరాహ్ణమందు ప్రయోగించవలెను.

3. ప్రదోషము (సాయంకాలము)—కైశికీవృత్తి సంయుక్తమును, శృంగార రస సంశ్రయమును, నృత్త-వాదిత్ర-గీత సంపన్నమును అయిన నాట్యమును ప్రదోష కాలమందు ప్రయోగించవలెను.

4. ప్రభాతము—నర్మహాస్యబహుళమును, కరుణప్రాయమును, నిద్రావినాశనమును అయిన నాట్యమును ప్రభాతకాలమందు ప్రయోగించవలెను.

నాట్యమునకు నిషిద్ధమైన సమయములు : అర్ధరాత్రియందు, మధ్యాహ్న సమయమందు, సంధ్యాభోజనకాలమునందు నాట్యమును ప్రయోగించరాదు.

ఇట్లు దేశ-కాలములను బలాబలములను సమీక్షించి యథాభావ-రసముగా నాట్యమును ప్రయోగించవలెను. కాని, రాజు ఆజ్ఞాపించినచో దేశ-కాలముల నిమిత్తములేకయే ప్రయోక్తలునిస్సంశయముగా నాట్యమును ప్రయోగించవచ్చును.

సిద్ధిగుణములు

పాత్ర-ప్రయోగము-సమృద్ధి అనునవి మూడును కలిసి నాటకాశ్రితములైన గుణములు.

బుద్ధిమత్త్వము, సురూపత్వము, లయ-తాలజ్ఞత, రస-భావజ్ఞత-వయఃస్థత్వము (ప్రకృతికి తగిన వయస్సు కలిగియుండుట), కుతూహలము, గ్రహణ-ధారణములు, గాత్రవైకల్యము లేకుండుట, సాధ్వసజయము (సభాకంపము లేకుండుట), ఉత్సాహము అనునవి పాత్రగుణములు.

సువాద్యత్వము, సుగానత్వము, సుపాఠ్యత్వము, శాస్త్ర - కర్మసమాయోగము అనునవి ప్రయోగగుణములు.

సువిభూషణములు, సుమాల్య-ఆభరణ-వస్త్రములు, విచిత్రఅంగరచన అనునవి సమృద్ధిలక్షణములు.

పైని చెప్పిన మూడును ఏకీభూతములైనచో వానిని నాటకమున 'అలంకారములు' గా పరిగణింపదగునని ప్రయోక్తలు తెలియవలెను.

ఇంతవరకును సిద్ధుల లక్షణములను వివరించితిని. ఇంక, ఆతోద్యవికల్పనమును చెప్పుదును.*

సప్తవింశాధ్యాయము సమాప్తము

---

## విశేషాంశములు

1. సిద్ధి

సిద్ధిని గూర్చి భరతహృదయమును అభినవగుప్తుడు క్రింది విధముగా ఆవిష్కరించెను. [అభినవభారతి-3 వ సం].

"యో యథాభినయే యస్మిన్ యోక్తవ్యః సిద్ధి మిచ్ఛతా" మొదలగుచోట్ల అంతటను అభినయమునకు సిద్ధియే పరమలక్ష్యముగా చెప్పబడెను. అట్లే ఉపాంగాభినయమునకు, అభినయసమానీకరణాత్మకమైన సామాన్యాభినయమునకు కూడ సిద్ధియే ఫలముగా నిరూపింపబడినది. చిత్రాభినయాధ్యాయము చివరకూడ "ఏవమేతేహ్యభినయా వాఙ్నేపథ్యాంగ సంభవాః ప్రయోగజ్ఞేన కర్తవ్యా నాటకే సిద్ధి మిచ్ఛతా" అను శ్లోకముచే కూడ సిద్ధియే ఫలముగా చెప్పబడెను. "రసాభావా" అనుచోట నాట్యవేదసంగ్రహములో సిద్ధి ఉద్దేశింపబడెను. ఆ సిద్ధి ఎట్టిది అను విషయమీ అధ్యాయమందు నిరూపింప బడుచున్నది.

---

*[కాశీముద్రణమునందు 27వ అధ్యా.—80-102 శ్లో; బొంబాయిముద్రణమునందు 27వ అధ్యా— 68-93 శ్లో ; బరోడాముద్రణమునందు 27 వ అధ్యా— 79-104 శ్లో.]



సామాజికగతమైన సిద్ధి : 'సిద్ధి' అనగా సాధింపదలచిన ప్రయోజనము సుసంపన్నమగుట. అది నటులకును, సామాజికులకును గూడ సమానమే. వీరిలో ఎవరికి సంబంధించిన సిద్ధి ఇందు వివరింపబడినది ? అను విషయమును గ్రహించవలసియున్నది. "ఇది సామాజికుల సిద్ధికాదు ; నటుల సిద్ధియే" అని చూపుటకే 'సిద్ధీనాం తు' అని మూలమున 'తు' చేరబడినది. మరియు "నాటకాశ్రితములగు సిద్ధుల లక్షణములను వివరింతును" అని భరతుడు పేర్కొని యుండెను. నాటకుడనగా నటుడు—"నటతీతి నాటకః" అనెడి వ్యుత్పత్తిచేత; కావున, నాటకాశ్రితములగు సిద్ధులనగా నటాశ్రితములగు సిద్ధులని గ్రహించవలెను.

సామాజికుల సిద్ధికొరకే ఈ ప్రయోగము కావున వారల సిద్ధి మరల చెప్పవలసిన అవసరము లేదు. అట్టి సామాజికసిద్ధిహేతువైన ప్రయోగమందు నటసిద్ధి ఎట్లుండవలెనో ఈ అధ్యాయమందు వివరింపబడుచున్నది—

"ప్రయోగః సప్రయోజనః" ఇత్యాది స్థలములందు వెనుక సామాజికగతసిద్ధియే నాట్యోత్పత్తికి ఉద్దిష్టఫలమని చెప్పబడినది. మరియు "న వేద వ్యవహారోయం సంశ్రావ్యః శూద్రజాతిషు" అని సామాజికోద్దేశముతోనే ఈ నాట్యము ఉత్పన్నమయ్యెను కదా ! అట్టిచో వారికై సిద్ధించని నాట్యము నాట్యమే కాదు.

సామాజికులకు అభిసంహితమైన ఫలము సిద్ధించుటయే సిద్ధి. ఇది ధాన్యాదులవంటి ఫలము. మనుష్యుడగు సామాజికునిచే అభిసంహితమైన ఫలము సిద్ధించుట మానుషసిద్ధి. సామాజికునకు దైవసిద్ధికూడ ఉండును. అది నిర్విషయస్వకీయపరమానందావిర్భావసంపత్తి. నాట్యాంతర్భాగమున ఉపరంజకములుగా నుపయోగింపబడిన గీతాదులు కాని, నటులు కాని, రామాదులు కాని తుచ్ఛములగు దేశకాలనిర్యంత్రణాదులు కాని విషయములు కాకుండ పరమానందావిర్భావమునకు యోగ్యమగు స్థితి కలుగుట దైవజన్యము కావున ఇది దైవికీసిద్ధి. ఇదియును వెనుక నిరూపింపబడినదే. అట్టి నిర్విషయసిద్ధియే సమస్తరసప్రకృతి అగుటచే "స్వం స్వం నిమిత్తమాసాద్య శాంతాదుత్పద్యతే రసః" అని శాంతము సర్వరసప్రకృతిగా నిరూపింపబడుట సమంజసమే కదా—ఇది రహస్యముగానుండు దైవసిద్ధి. ఇంక ప్రస్ఫుటమగు దైవసిద్ధి పురుషార్థవ్యుత్పత్తిప్రదము కూడను. అదికూడ "ధర్మో ధర్మప్రవృత్తానాం కామః కామోపసేవినాం" మున్నగువానిచే నిరూపింపబడినది. కావున సామాజికగతమును, మానుష-దైవ భేదములచే ద్వివిధమును అగు సిద్ధి ఎట్టిదియో వెనుక చెప్పబడెను. ఇంక ఇచట నటుల సిద్ధియే వివరింపబడినది.

నటగతమైన సిద్ధి : నటునకు సిద్ధి అనగా ప్రయోగము సరిగా నిష్పన్న మగుట—అదియే ప్రయోగసిద్ధి. "ప్రయోగనిష్పత్తి లేనిదే నాట్యమే లేదుకదా ? అట్టి ప్రయోగనిష్పత్తి సామాన్యాభినయమును బాగుగా ప్రదర్శించుటచే కలుగునదే కదా? అది ఇదివరకే చెప్పబడినది కదా ?" అని అనరాదు.

1. మానుషసిద్ధి : పరులగు సామాజికులప్రోత్సాహముచే నటునకు అభినయమునందు కలుగు విశ్వాసబలముచే కాని, స్వప్రతిభాబలముచేకాని ప్రయోగమున సిద్ధికలుగుచుండును. అందు ఇతరుల ప్రోత్సాహముచే నటుడు తన ప్రయోగమున పరిపూర్ణతనందుట మనుష్య

జనితము కాన అది 'మానుష సిద్ధి.' సహజమగు ప్రతిభామాహాత్మ్యముచే సిద్ధి నందుట 'దైవిక సిద్ధి.'

తనలో నుండు శక్తికూడ ఒకప్పు డితరుల ప్రోత్సాహముచే బయల్పడు ననుటకు ఇతరులచే ప్రబోధితుడైన హనుమంతుడు సాగరలంఘనమును చేయుటయే నిదర్శనము.

అట్టి ప్రోత్సాహము (అనగా మానుషసిద్ధిహేతువు) వాచికము, శారీరము అని రెండు విధములు—అందు వాచికము ఐదు విధములు : (1) స్మితము, (2) అర్ధహాసము, (3) అతిహాసము, (4) సాధు, అహో, కష్టమ్ మొదలగు మాటలను పలుకుట, (5) ప్రబద్ధ నాదము. ఇంక శారీరముకూడ అయిదు విధములు : (1) పులకలు (జలదరింపు), (2) రోమాంచము (గగుర్పాటు), (3) అభ్యుత్థానము (లేచి నిలుచుండుట), (4) చేల దానము, (5) అంగులిక్షేపము.

కొందరీ ప్రోత్సాహనమును ఇంకొక విధముగా విభజించినారు: సామాజికులు (1) వాక్కుచేతకాని, (2) సాత్త్వికదర్శనముచేత కాని, ప్రోత్సాహమును చూపింతురు. అందు వాచికప్రోత్సాహము ఏడు విధములు (పరా - పశ్యంతీ - మధ్యమా - వైఖరీ భేద ములచే శబ్దము నాలుగు విధములు ; అందు మధ్యమ అంతస్సంజల్పరూపము, వైఖరి స్పష్టరూపము)—

(1) మధ్యమారూపము, (2) తత్ప్రరోహము, (3) సామాన్యవైఖరీరూపము, (4) తత్ప్రరోహాత్మకము, (5) విశేషశబ్దాత్మక వైఖరీస్వభావము, (6) ఆవేశోచితవిశేష వైఖరీరూపము (ప్రబంధాత్మకము), (7) ఆవేశోచితవిశేషవైఖరీరూపము (విచ్ఛేద రూపము.)

ఇందు స్మితము అంతస్సంజల్పరూపమైన మధ్యమారూపమగు శబ్దము ; హాసము తత్ప్రరోహము ; అట్లే తక్కినవాటిని కూడ గ్రహించవలెను. సాత్త్వికదర్శనము పులకాది రూపమున ఏకవిధము. ఇంక శరీరవికారము ద్వివిధము—(1) అభిసంధానపూర్వకము అనగా హఠాత్తుగా లేచుట మొదలగునవి, (2) అనభిసంధానకృతము అనగా చేలాది ప్రదానము లేదా అంగులివిక్షేపము.

పైని వివరించిన విధముగా మానుషసిద్ధి పది విధములు. ప్రయోగౌచిత్యమును బట్టి నటులకు ఒక్కొక్కవిధమగు ప్రోత్సాహము కలుగుచుండును.

2. *దైవికసిద్ధి :* పైది అంతయును పరప్రోత్సాహజనితమగు సిద్ధి. ఇంక స్వప్రతిభా తారతమ్యకృతమగు సిద్ధి దైవికసిద్ధి ; ఇది రెండు విధములు—(1) కలిగిన విఘ్నములు అదృష్టమగు దైవముచే ఉపశమింపజేయబడుట లేదా పురుషవ్యాపారోపనతమగు విఘ్నాపసరణము మొదటివిధము ; (2) అసలు విఘ్నములు లేకపోవుట రెండవరకము.

ప్రతిభావంతులు కూడ ఒక్కొక్కప్పుడు విఘ్నబలమున మందీభూతప్రతిభులగుదురు. ఇట్టి విఘ్నములు రెండు విధములు—(1) ఆధ్యాత్మికములు అనగా శరీరజన్యములగు వ్యాధిరూపములు ; (2) ఆధిదైవికములు అనగా బాహ్యభూతజనితకలకలశబ్దాదికము, భూకంపము, వాతము, వర్షము మొదలగునవి.



ఇట్లు నటగతమగు సిద్ధి రెండువిధములు. అది వాఙ్మనోంగసముద్భవమనుటచే సర్వాభినయైకీకారసంపత్తి ఉండునని ఎరుంగవలెను.

కొందరు "వాఙ్మనోంగసముద్భవా" అనుదానిని "దశాంగా మానుషీ" అనుదానితో సమన్వయించిరి. మరికొందరు "నానాసత్త్వాశ్రయకృతా వాఙ్మయ్యథ శరీరజా" అను పాఠము నంగీకరించిరి. ఏమయినను 'సిద్ధి' అనునది అభినయవిషయమని తెలియవలెను.

## 2. నేటి ప్రదర్శనములు

ఎవరే రూపకమును ప్రదర్శించినను 'సిద్ధి'ని (success) దృష్టిలో పెట్టుకొనియే చేయుదురు. కవి కర్మ, సూత్రధారుని ఆచార్యకత్వము, భరతుల పరిశ్రమ, దైవబలము అనువాని సమానీకరణముయొక్క సమగ్రఫలమే సిద్ధి. రూపకరచనమందు దోష మున్నను, ఆచార్యకత్వము సరిగా లేకపోయినను. భరతులు మందబుద్ధులై శ్రద్ధ చూపక పోయినను, దైవము తిన్నగా చూడకపోయినను నాట్యసిద్ధి కలుగదు. ఈ నాలుగింటిలో ఏది లేకపోయినను రక్తికట్టదు. నాలుగును లోపించినచో ఇంక చెప్పవలసిన దేమున్నది?

రెండు విధములగు సిద్ధులలోను దైవికసిద్ధి చాల ఉత్తమమైనది. నటుడు ప్రకృతి కరణ-స్వభావములను పూర్తిగా తనయం దారోపించుకొని, ప్రకృతివలెనే కన్పట్టుచు, ప్రకృతియొక్క సుఖ-దుఃఖములందు ప్రేక్షకులు తన్మయత్వము చెందునట్లు చేయవలయును. తన్మయత్వము చెందుట యనగా ప్రేక్షకులకు అది రంగస్థలమను గుర్తుకాని, అందున్నవారు నటులను జ్ఞానముకాని ఉండరాదు. వారు నిజమైన సీతారాము లనెడి భావమే వారికి కలుగవలెను. ఇట్టి భావన కలుగుటకు నటుని స్వప్రతిభతో కూడిన అభినయ సామర్థ్యము సాధన మగుచున్నది—నటుడు తా నేడ్చి ప్రేక్షకులను ఏడ్పించును ; తాను మనసార నవ్వి ప్రేక్షకులను నవ్వించును.

ఇచ్చట ఒక ముఖ్యవిషయమును గుర్తించవలెను—కావ్య నిర్మాణ సమయములో కవి ప్రకృతుల సుఖ - దుఃఖములను భావించి, అనుభవించును. ఆ అనుభవమునే అక్షరరూప మును పొందించును ; దానినే నటుడు భావించి; అనుభవించి అభినయము ద్వారా ప్రదర్శించును ; దానినే ప్రేక్షకులు భావించి, అనుభవింతురు. ఇట్లు కవియును, నటుడును, ప్రేక్షకుడును సమానానుభవము కలవా రగుచున్నారని భట్టతౌతుడు పేర్కొనియుండెను. సందర్భము భిన్నమైనను ప్లేటో కూడ ఇట్టి అభిప్రాయమునే వ్యక్తము చేసియుండుట గమనార్హము—

"Plato in his Ion has recognised that the psycho-physical condition of the spectator, consequent on witnessing a dramatic presentation, is all most the same as that of the dramatist at the time of production and of the actor at the time of representation". [Comparative Easthetics—Vol. II - P. 89]

నటుడుకాని, ప్రేక్షకులుకాని పరగతసుఖదుఃఖములను తమవిగా భావించుటకు కారణభూతమైనది సత్త్వము. దానివలననే నటునకును, ప్రేక్షకునకును ఏకాగ్రత సిద్ధించును. పుట 268 లోని 5 వ విశేషాంశమును చూడవలెను.

"ప్రదర్శన సమయమున ఎచ్చట శబ్దముకాని, క్షోభముకాని, ఉత్పాతనిదర్శనము కాని ఉండదో, రంగమండలము ప్రేక్షకులతో నిండియుండునో అది దైవీసిద్ధి అనబడును" అనెడి భరతుని వివరణము గమనార్హము.

కాని, నేటి ప్రదర్శనములందు దైవసిద్ధిని పొందుటకు నటు లెక్కువగా ప్రయత్నించుటలేదు; రూపకదిదృక్షతో వచ్చు ప్రేక్షకులును తక్కువే. నటులు అప్పుడే రైలు దిగి వత్తురు; ప్రదర్శకులు ముందుగా సొమ్మివ్వనిచో అక్కడ రగడ. రిహార్సల్సుకు అవకాశమే లేదుకదా. ఇంక రంగస్థలమందు నటులు కవి వ్రాసిన వాక్యములను విడిచి ఒకరిపై ఒకరు ఛలోక్తులను విసరుకొందురు. కొందరు ప్రేక్షకులతో సూటిగా మాటాడుదురు. మొత్తమునకు సిద్ధిమీద దృష్టి తక్కువ. ఇంక శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పినట్లు "నాటకమును జూడవచ్చినవారి చిత్తవృత్తి యొక్కొక్కరి దొక్కొక్క విధముగా నుండును. అప్పుడే భుజించి దిగుచెమటలతో వచ్చువారు కొందఱు; ఆలుబిడ్డలకై డబ్బు ఖర్చుపెట్టి పిలుచుకొనిరాలేక వారితో కలహించివచ్చువారు కొందఱు; ఇంటి పెద్దలను మోసగించి కృత్యాద్యవస్థతో తప్పించుకొని వచ్చువారు కొందఱు; ఎవరెవరినో ప్రార్థించి అప్పు దెచ్చుకొని కడపటి నిమిషమున కాత్రపడి వచ్చువారుకొందఱు; దాక్షిణ్యమున వచ్చువారు కొందఱు; దొంగతనమున లోపలికిఁ జొచ్చువారు కొందఱు; వచ్చినవారిలో ఇరుగుపొరుగువారి వేషభూషలను విమర్శించువారు కొందఱు; కుర్చీలు వెనుకముందులకిడ్చి, మార్చి రగడచేయువారు కొందఱు; స్థలములకై తగవులాడువారు కొందఱు." [నాటకోపన్యాసములు, 1935—పుటలు 78–79]

అప్రస్తుతమైనను ఇచ్చట ఒక విషయమును గమనించవలసియున్నది. శ్రీ శర్మగారు నాందీ-ప్రస్తావనల ప్రయోజనమును వివరించుచున్న సందర్భమిది. వారు పేర్కొనిన ప్రేక్షకుల చిత్తవృత్తులన్నియును ఇంచుమించుగా నేటి "టిక్కెట్ల నాటక ప్రదర్శనము"లకు సంబంధించినవే. పూర్వకాలమందు నాటక ప్రదర్శనములకు టిక్కెట్లు లేవు. ఏ శ్రీమంతుడో తానొక్కడే ఖర్చుపడి నాటకమును వేయించగా ఊరివారందరును ఊరకనే చూచెడివారు. దైవోత్సవములందో, పర్వదినములందో నాటకములు ప్రదర్శింపబడెడివని సంస్కృత రూపకప్రస్తావనల వలన తెలియుచునే ఉన్నదికదా. మరి నేటి టిక్కెట్ల నాటకములకు సంబంధించిన ప్రేక్షకుల చిత్తవృత్తులను పేర్కొని ప్రాచీనకాలమునుండియు వచ్చుచున్న నాందీ-ప్రస్తావనల సంప్రదాయమునకు ప్రయోజమును చెప్పుట సమంజసముగా కన్పట్టదు.

ఇంతవరకును బహుళప్రచారములో నున్న పద్యనాటకములు (ముఖ్యముగా పౌరాణికములు) నాటకప్రదర్శనములందు రెండు దుష్టసంప్రదాయములను నెలకొల్పినవి— (1) రంగస్థలమును 'సంగీత కచేరి'గా నొనర్చుట, (2) ప్రేక్షకులు 'వన్సుమోర్'లు కొట్టుట. "అర్థవంతముగా చదువుట" అనెడి భావమునకు కొందరు నటులు తిలోదకము లిచ్చినారని చెప్పవచ్చును. ప్రేక్షకులు తన్మయత్వము చెందుట అనునది కలలోని వార్త అయినది. పూర్వము నటుడు దేనినేని చెడగొట్టినచో వాని నేడ్పించుటకు 'వన్సుమోర్' అనెడివారట. కాని నేడు ఆ భావములో మార్పువచ్చినది. కొందరు ఉత్తమనటులు భావావేశమును చూపినప్పుడుకూడ తన్మయత్వమును చెందలేక ఈ 'వన్సుమోర్' లతో మన



ప్రేక్షకులు కాలక్షేపము చేయుచున్నారు. ఈ వన్సుమోర్‌ల కొరకు చనిపోయిన పాత్రలు కూడ తిరిగి బ్రతికి పద్యము పాడి మరల చావవలసివచ్చుచున్నది; లేనిచో ఆ వన్సుమోర్ కొట్టిన సహృదయుడు ప్రదర్శనమును సాగనీయడు. ఇట్టి ఈ పరిస్థితి ప్రేక్షకుల సంస్కారరాహిత్యమును, అల్పహృదయమును ప్రతిబింబించుచున్నది.

నేటి ఔత్సాహికనాటకసమాజములవారు రూపకములను శ్రద్ధతో, ఆదర్శవంతముగా ప్రదర్శించుటకు ప్రయత్నించుచున్నారు. వీరి ప్రయత్నములచే మరల సత్సంప్రదాయములు నెలకొల్పబడగలవని ఆశించవచ్చును.

### 3. నాటకపు పోటీలు

తెలుగు దేశమున నాటకపు పోటీలు 1913 ప్రాంతముల ప్రారంభమైనవి. అప్పుడు పోటీలకు ఒకే ఒక నాటకమును ఎన్నుకొనెడివారు. వివిధనాటకసమాజములవారు ఆ ఒక్క నాటకమునే ప్రదర్శించెడివారు. ఉత్తమత్వనిర్ణయమునకు పలువురు ప్రాశ్నికులు (judges) ఉండెడివారు— ముగ్గురు సంగీతమునకు, ముగ్గురు సాహిత్యమునకు, ముగ్గురు అభినయమునకు (ఈ నాటకపు పోటీలతో నటులన్నచో దేశమున అంతకుముందు లేని గౌరవాదరములు పెంపొందినవని చెప్పవచ్చును). ఇంచుమించుగా ఇట్టిపద్ధతినే భరతుడీ అధ్యాయమందు వివరించెను. ఇందు ఘాతముల విషయమున ప్రాశ్నికులకు చక్కని సూచన లొసంగబడినవి.

నేటి నాటకపు పోటీలు ఇంకొక తీరుగా ఉన్నవి. ఒక్కొక్క నాటకసమాజము ఒక్కొక్క రూపకమును ప్రదర్శించును; అందులో ఉత్తమత్వ నిర్ణయము చేయబడుచున్నది.

పై రెండు పద్ధతులలో ఏది ఉత్తమమను విషయమును సహృదయులు నిర్ణయించవలసియున్నది.

గ్రీకు విషాదరూపకముల వికాసమునకు నాటకపు పోటీలే ముఖ్యకారణమనెడి విషయము గమనార్హము. అంతియేకాదు, నాడా దేశమున రూపకకర్తలకును, నటులకును మంచి పలుకుబడి, గౌరవము ఉండెడివి. నాటకపు పోటీలలో ఎస్కిలస్ 13 సార్లు ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యెనట; సొఫోక్లిస్ 18 సార్లు ప్రథముడుగా విజయమందెనట.

రూపకప్రదర్శనసమయములను, ఏ సమయమందే రూపకమును ప్రదర్శించవలెననెడి విషయమును భరతుడు నిర్దేశించియుండెను.

గ్రీకు రూపకములు ప్రభాతకాలమందు ప్రయుక్తము లయ్యెడివి.

# అధ్యాయము 28[1]

## జాతి లక్షణము[2]

[కాశీముద్రణమునందు 28 వ అధ్యా—141 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 28 వ అధ్యా—161 శ్లోకములును; బరోడా - 28 వ అధ్యా - 141 శ్లో కలవు. లెక్కింపబడని పెక్కుగద్య భాగములు కూడ కలవు.]

### లక్షణయుక్తములగు ఆతోద్యములు

ఆతోద్యవిధి నింక వివరింతును—

లక్షణాన్వితములగు ఆతోద్యములు నాలుగు విధములు— 1. తతము, 2. అవనద్ధము, 3. ఘనము, 4. సుషిరము.

తంత్రీగతవాద్యము 'తత' మనబడును. చర్మముతో మూయబడిన వాద్యము 'అవనద్ధ' మనబడును. తాళములు (కంచుతాళములు మొ॥) 'ఘనము' అనబడును. వేణువు 'సుషిర' మనబడును[3].

ఇట్లు గానము, నాట్యము, వాద్యము అనునవి వివిధాశ్రయములుగా ఉండును. ఈ మూడింటిని అలాతచక్రమువలె ఒకదానివెంబడి ఇంకొకటిని అవిచ్ఛేదముగా ప్రయోగించవలెను.

### గాంధర్వము

నానాతోద్యసమాశ్రయమగు గానము 'గాంధర్వ' మనబడును. ఇయ్యది స్వరాశ్రయము, తాళాశ్రయము, పదాశ్రయము అని మూడు విధములుగానుండును.

---

1. అన్ని ముద్రణములందును అష్టావింశాధ్యాయమే (28 వ అధ్యా.).

2. 'ఆతోద్యవిధాన' మని కాశీముద్రణపాఠము. 'జాతిలక్షణ'మని బొంబాయి ముద్రణపాఠము. ఇందు జాతిలక్షణమే ప్రధానముగా వివరింపబడుటచే దీనిని 'జాతిలక్షణ' మనుటయే సమంజసము. 'జాతి వికల్పనము' అని బరోడా ముద్రణ పాఠము

సూచన: 27 వ అధ్యాయముతో బరోడా ముద్రణము మూడవ సంపుటము ముగిసినది. 28 నుండి 36 వరకును గల 9 అధ్యాయములతో కూడిన నాలుగవ సంపుట మింకను ప్రకటితము కాలేదు. కాశీ-బొంబాయి ముద్రణములందలి సంగీతాధ్యాయములు దోషభూయిష్ఠములుగా ఉన్నవి. అభినవభారతీసాహాయ్యము లేనిదే మూలమును అర్థము చేసికొనుటయు, అనువదించుటయు సాధ్యము కాదు. అయినను అనువదించుటకు శక్తివంచన లేకుండ ప్రయత్నించినాను. అర్థముకాని, క్లిష్టముగానున్న భాగములను విడిచివేసి అచ్చటనే ఆ విషయమును తెలిపియున్నాను. [బరోడా 4వ భాగము 1964లో ప్రకటితము].

3. దీనితరువాత ఉన్న 4 శ్లోకములు (కాశీముద్రణమునందు 3 - 6 శ్లో) అనువదింపబడలేదు.



గానము దేవతలకు, అందున ముఖ్యముగా గంధర్వులకు ప్రీతికరమైనదగుటచే గాంధర్వ మనబడినది.

గాంధర్వమునకు గాత్రము, వీణ, వంశము (వేణువు) అనునవి మూడును ఉద్భవస్థానములు. అందు స్వరవిధిని వివరింతును—

గాంధర్వము స్వర-తాళ-పదాత్మక (సాహిత్యాత్మక)మని చెప్పబడెను కదా. ఈ మూడింటి లక్షణములను వివరింతును. ముందుగా స్వరములకు సంబంధించిన విభాగములను వివరింతును. స్వరములు వైణములు, శారీరకములు అని రెండు విధములు.

### గాంధర్వ వేదసంగ్రహము

స్వరాత్మక గాంధర్వమందలి విభాగములు—

1. స్వరములు, 2. గ్రామములు, 3. శ్రుతులు, 4. మూర్ఛనలు, 5. స్థానములు, 6. సాధారణములు, 7. జాతులు (పదునెనిమిది), 8. వర్ణములు (నాలుగు), 9. అలంకారములు, 10. ధాతువులు.

అలంకారములు, వర్ణములు, గీతులు అనునవి శరీరజస్వరములకు మాత్రమే చెందు విభాగములు.

ఇంక తాళాత్మకగాంధర్వమందలి విభాగములు—

1. ఆవాపము, 2. నిష్క్రామము, 3. విక్షేపము, 4. ప్రవేశకము 5. శమ్య, 6. తాళము, 7. సన్నిపాతము, 8. పరివర్తము, 9. వస్తువు, 10. మాత్ర, 11. విదారి, 12. అంగము, 13. లయ, 14. యతి, 15. ప్రకరణము, 16. గీతములు, 17. అవయవములు, 18. మార్గములు, 19. పాదభాగములు, 20. పాణులు.

పదాత్మకగాంధర్వమందలి విభాగములు—

1. వ్యంజనములు, 2. స్వరములు, 3. వర్ణములు, 4. సంధులు, 5. విభక్తులు, 6. నామములు, 7. ఆఖ్యాతములు, 8. ఉపసర్గలు, 9. నిపాతములు, 10. తద్ధితములు, 11. కృదంతములు, 12. ఛందస్సు, 13. వృత్తములు, 14. జాతులు.

ఇది గాంధర్వసంగ్రహము. ఇంక వివరములను చెప్పుదును.

### స్వరములు

1. స్వరములు— షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము[4] అనునవి పడును సప్తస్వరములు (వీటినే "స, రి, గ, మ, ప, ధ, ని" అందురు.)

---

4. ఈ సప్తస్వరములను ఏయే జంతువులు పలుకునో పోలూరి గోవిందకవి క్రింది విధముగా వివరించెను. [రాగతాళచింతామణి - పుట 64]—

స్వరముల చతుర్విధత్వము: ఈ స్వరములు శ్రుతియోగమునుబట్టి నాలుగు విధములుగా నుండును—(1) వాది, (2) సంవాది, (3) వివాది, (4) అనువాది.

(1) వాది—ఏ స్వరము రాగమునకు జీవభూతమై ప్రధానముగా నుండునో అది వాది స్వరము.

(2) సంవాది—ఏ రెండు స్వరములమధ్య తొమ్మిది లేదా పదుమూడు శ్రుతుల అంతరముండునో ఆ రెండు స్వరములు సంవాది స్వరములు. ఉదా: షడ్జ-మధ్యమములు, షడ్జ-పంచమములు, ఋషభ-ధైవతములు, గాంధార-నిషాదములు అనునవి షడ్జగ్రామమున సంవాదిస్వరములు. మధ్యమగ్రామమునషడ్జ-మధ్యమములు, ఋషభ-ధైవతములు, గాంధార-నిషాదములు, పంచమ-ఋషభములు సంవాది స్వరములు.

(3) వివాది—ఏ రెండు స్వరములమధ్య 20 శ్రుతుల అంతరముండునో ఆ రెండును వివాది స్వరములు. ఉదా: ఋషభ-గాంధారములు, ధైవత-నిషాదములు.

(4) అనువాది—వాది-సంవాది-వివాది స్వరములకు భిన్నములైనవి అనువాది స్వరములు. ఉదా: షడ్జమునకు ఋషభ-గాంధార-ధైవత-నిషాదములును, ఋషభమునకు మధ్యమ-పంచమ నిషాదములును, గాంధారమునకు మధ్యమ-పంచమ-ధైవతములును, మధ్యమమునకు ధైవత-పంచమ-నిషాదములును, పంచమమునకు ధైవత-నిషాదములును, ధైవతమునకు షడ్జ-ఋషభ-గాంధారములును, నిషాదమునకు షడ్జ-ఋషభ-గాంధారములును అనువాది స్వరములు.

వదనమువలన (మాటిమాటికిని పలుకబడుటచేత) 'వాది' అనియు, సంవాదము వలన (వాదిస్వరముతో సంవదించుటచేత) 'సంవాది' అనియు, వివదనమువలన (వాది స్వరమునకు విరుద్ధముగా నుండుటచేత) 'వివాది' అనియు, అనువదనము వలన (వాదిస్వరము ననుసరించి పలుకబడుటచేత) 'అనువాది' అనియు వ్యవహరింప బడుచుండునని తెలియవలెను.

గ్రామములు

2. గ్రామములు—గ్రామములు రెండు విధములు—(1) షడ్జగ్రామము,

---

నానామయూరసంతానంబు గావించు, సంతతస్థితిని షడ్జస్వరంబు
చాతకగోవృషవ్రాతంబు వివరించు, ఋషభస్వరంబు సమీహితముగ
సతతమజావికసముదాయమొనరించు, గాంధారనాదమఖండముగను
క్రౌంచ పంచాస్య సంఘంబులు పాటించు. మధ్యమస్వరమును మార్దవముగఁ
బంచమస్వర మెసఁగించుఁ బరభృతంబు, దర్దురాళ్వము లొదవించు ధైవతమును
సమదగజరాజ మనును నిషాదరవము.........



(2) మధ్యమగ్రామము. ఒక్కొక్క గ్రామమున సప్తస్వరములకును మొత్తము 22 శ్రుతు లుండును......[5]

శ్రుతులు

3. శ్రుతులు—శ్రుతుల మొత్తము ఇరువది రెండు. షడ్జ గ్రామమునందు-షడ్జమునకు నాలుగు శ్రుతులు, ఋషభమునకు మూడు శ్రుతులు, గాంధారమునకు రెండు శ్రుతులు, మధ్యమమునకు నాలుగు శ్రుతులు, పంచమమునకు నాలుగు శ్రుతులు, ధైవతమునకు మూడు శ్రుతులు, నిషాదమునకు రెండు శ్రుతులు ఉండును. ఇంక మధ్యమగ్రామమునందు- మధ్యమమునకు నాలుగు శ్రుతులు, పంచమమునకు మూడు శ్రుతులు, ధైవతమునకు నాలుగు శ్రుతులు, నిషాదమునకు రెండు శ్రుతులు, షడ్జమునకు నాలుగు శ్రుతులు, ఋషభమునకు మూడు శ్రుతులు, గాంధారమునకు రెండు శ్రుతులు ఉండును.

---

5. ఇచ్చట వరుసగా 2 పంక్తుల గద్యము, ఒక శ్లోకము (కాశీముద్రణమునందు 22 వ శ్లో.) 11 పంక్తుల గద్యము విడువబడెను. (కాశీముద్రణమునందు పుటలు 318–319).

గోవిందకవి 'గ్రామము'ను క్రిందివిధముగా వివరించెను (రాగతాళ చింతామణి—పుట 67)—

"జనసమూహమురీతి స్వరసమూహము గూడి, గ్రామంబనగ విఖ్యాతమయ్యె
మూర్ఛనాదము తానములకు వర్ణాలంక్రి, యా జాతులకు నాశ్రయంబనంగ
వెలయు నాగ్రామంబు చెలఁగుముఖ్విధముల...."

భరతుడు రెండు గ్రామములను మాత్రమే పేర్కొనెను. అర్వాచీనులు 'గాంధార' మనెడి గ్రామమునుకూడ కల్పించి మూడు గ్రామములను వివరించిరి. వారి ననుసరించి గోవిందకవియును మూడు గ్రామములను సాంగములనుగా వివరించెను.

అనేక కుటుంబములు కలిసి ఒక గ్రామమగునట్లే మూర్ఛనాభేదములచే కలుగు మేళములు సంభవించుట కుపయోగపడు స్వరసముదాయములు కలిసి గ్రామమగును.

6. శ్రుతిలక్షణమును గోవిందకవి క్రిందివిధముగా వివరించెను. (రాగతాళచింతామణి - పుటలు 46–47)—

స్వరమునకారంభకమై, మఱియు స్వరాంగకము హ్రస్వమాత్రస్వరమై
కరమాది నెద్దివినఁబడు, నరయఁగ శ్రుతి యనఁగఁ బరఁగునది.......... 50
బ్రహ్మంబువిశ్వమై పరిఢవిల్లినరీతి, బాలెల్లఁ బెరుఁగులై పరఁగినట్లు,
.... .... .... .... .... ....
శుక్లశోణితములు శుభశరీరాకృతి, వరలినట్లు శ్రుతుల స్వరములగుచు
విన్నవారికొసఁగు వీనులవిందులు, సరసగతుల.... .... .... .... 57

సంగీతదర్పణమునందు శ్రుతిలక్షణము క్రిందివిధముగా నున్నది. [ప్ర.అధ్యా-51శ్లో-
స్వరూపమాత్ర శ్రవణాన్నాదోఽనురణనం వినా । శ్రుతిరిత్యుచ్యతే భేదా స్తస్యాద్వావిం-

మూర్ఛనలు

4. మూర్ఛనలు[7]—ఒక్కొక్క గ్రామమునకు ఏడేసి మూర్ఛనలు చొప్పున రెండు గ్రామములందును మొత్తము పదునాలుగు మూర్ఛన లుండును.

షడ్జగ్రామమున మూర్ఛనలు : ఇందు ఏడు మూర్ఛనలును వరుసగా షడ్జ-నిషాద-ధైవత-పంచమ-మధ్యమ-గాంధార-ఋషభములు ఆరంభస్వరములు కలవిగా ఉండును. (వాని వాని స్వరూపములను పూర్తిగా క్రింద చూపుచున్నాను.)

| మూర్ఛనలు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|
| (1) ఉత్తరమంద్ర | సరిగమపధని | నిధపమగరిస |
| (2) రజని | నిసరిగమపధ | ధపమగరిసని |
| (3) ఉత్తరాయత | ధనిసరిగమప | పమగరిసనిధ |
| (4) శుద్ధషడ్జ | పధనిసరిగమ | మగరిసనిధప |
| (5) మత్సరీకృత | మపధనిసరిగ | గరిసనిధపమ |
| (6) అశ్వక్రాంత | గమపధనిసరి | రిసనిధపమగ |
| (7) అభిరుద్గత | రిగమపధనిస | సనిధపమగరి |

మధ్యమగ్రామమున మూర్ఛనలు : ఇందు ఏడు మూర్ఛనలును వరుసగా మధ్యమ-గాంధార-ఋషభ-షడ్జ-నిషాద-ధైవత-పంచమస్వరములు ఆరంభస్వరములు కలవిగా నుండును—

| మూర్ఛనలు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|
| (1) సౌవీరి | మపధనిసరిగ | గరిసనిధపమ |
| (2) హారిణాశ్వ | గమపధనిసరి | రిసనిధపమగ |
| (3) కలోపనత | రిగమపధనిస | సనిధపమగరి |
| (4) శుద్ధమధ్యమ | సరిగమపధని | నిధపమగరిస |
| (5) మార్గి (మార్గవి) | నిసరిగమపధ | ధపమగరిసని |
| (6) పౌరవి | ధనిసరిగమప | పమగరిసనిధ |
| (7) హృష్యక | పధనిసరిగమ | మగరిసనిధప |

పై పదునాలుగు మూర్ఛనలును పూర్ణము, షాడవము, ఔడవితము, సాధారణకృతము అను భేదములచే నాలుగేసి విధములుగా నుండును.

---

7. 'మూర్ఛన' అనగా వినువారిని మోహింపజేయునది' అని అర్థము. "వరుసను సప్తస్వరముల కరుదుగ నారోహణంబు నవరోహణమున్ గిరికొల్ప" మూర్ఛన అగునని గోవిందకవి నిర్వచించెను [రాగతాళచింతామణి - పుట 70].



ఉదా : మొదటి మూర్ఛన.

| | | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| పూర్ణ— | | సరిగమపధని | నిధపమగరిస |
| షాడవ— | | రిగమపధని | నిధపమగరి |
| | లేదా | సరిగమపధ | ధపమగరిస |
| | ,, | సగమపధని | నిధపమగస |
| | ,, | సరిగమధని | నిధమగరిస |
| ఔడవిత— | | రిగమధని | నిధమగరి |
| | లేదా | సరిమపధ | ధపమరిస |
| | ,, | సగమధని | నిధమగస |
| సాధారణకృత— | | సరిగమపధని | నిధపమగరిస |
| (సా=సాధారణగాంధారము<br>కా=కాకలినిషాదము) | | (సా) (కా) | (కా) (సా) |

......................................

తానములు

తానమనగా విస్తరింపు; అనగా మూర్ఛనలను విస్తరింపుచేయుట అని అర్థము. ఈ మూర్ఛనలయందలి పైని పేర్కొనబడిన షాడవ-ఔడవిత భేదములకు 'తానము' అని పేరు. 'షాడవ' మనగా సప్తస్వరములలో ఒక స్వరము లోపించుటచే ఆరు స్వరములే ఉండుట; 'ఔడవిత' మనగా రెండు స్వరములు లోపించి అయిదు స్వరములే ఉండుట.

షాడవములు : షడ్జగ్రామమున స, రి, ప, ని అను నాలుగు స్వరములలో ఒక్కొక్క స్వరమును ఒక్కొక్కసారి వదలి మూర్ఛనలను చేయుటచే 7 మూర్ఛనల యందును నాలుగేసి భేదము లేర్పడును. ఇట్లు షడ్జగ్రామమున మూర్ఛనల షాడవములు (7 × 4 =) 28 విధములు అగుచున్నవి.

మధ్యమగ్రామమున స, రి, గ అను స్వరములలో ఒక్కొక్క స్వరమును ఒక్కొక్కసారి వదలి ఆరోహణ-అవరోహణముల నొనర్చుటచే ఏడు మూర్ఛనల యందును మూడేసి భేదము లేర్పడును. ఇట్లు మధ్యమగ్రామమున మూర్ఛనల షాడవములు (7 × 3 =) 21 విధములగుచున్నవి.

ఔడవితములు : షడ్జగ్రామమున మూర్ఛనలలో 'స, ప' లను కాని, 'గ, ని' లను కాని, 'రి, ప' లనుకాని ఒక్కొక్కసారి వదలి ఆరోహణ-అవరోహణముల నొన

---

8. 32 వ శ్లోకము తరువాత గద్యమందలి 6 పంక్తులు విడువబడెను. [కాశీ ముద్రణమునందు పుట 320.]

ర్చుటచే ఏడు మూర్ఛనలలోను మూడేసి భేదము లేర్పడును. ఇట్లు షడ్జగ్రామ ఔడ
వితములు (7×3=) 21 విధము లగుచున్నవి.

మధ్యమగ్రామమున మూర్ఛనలలో 'రి, ధ' లను కాని, 'గ, ని' లను కాని
ఒక్కొక్కసారి వదలి ఆరోహణ-అవరోహణముల నొనర్చుటచే ఏడు మూర్ఛనలలోను
రెండేసి భేదము లేర్పడును. ఇట్లు మధ్యమగ్రామఔడవితములు (7×2=)
14 విధము లగుచున్నవి.

ఇట్లు తానముల మొత్తము 84 (షాడవములు 49+ ఔడవితములు 35)[9].
తంత్రియందు 'తానక్రియ' రెండు విధములు— (1) ప్రవేశము, (2) నిగ్ర
హము. అధరస్వరప్రకర్షము, ఉత్తరస్వరమార్దవము కలది ప్రవేశము. నిగ్రహ
మనగా అసంస్పర్శము...[10]

ఈ మూర్ఛనలు ప్రయోక్తృ-శ్రోతృ సుఖావహములని తెలియవలెను.

స్థానములు

5. స్థానములు—స్థానములు మూడువిధములు (ఉరము, కంఠము, శిరము)
అని కాకువిధానమందు చెప్పబడినది. [పుటలు 493-494 లను, అందలి 17 వ
అధస్సూచికను చూడవలెను.]

సాధారణములు

6. సాధారణములు—అంతరస్వరము సాధారణమనబడును; అనగా రెండు
స్వరములకు మధ్యనుండి ఆ రెండింటికిని చెందని స్వరము 'సాధారణ' మనబడును.
ఋతువులమధ్య ఇట్టి సాధారణస్థితి మన మెరిగినదే. శిశిరఋతువు పూర్తిగా వెళ్ళక,
వసంతము పూర్తిగారాక ఉన్నసమయములో ఎండలోనున్న చెమటపట్టుచు, నీడలో
ఉన్నచో చలివేయుచు అది శిశిరమని కాని, వసంతమని కాని చెప్పుటకు వీలు
లేకుండును. దానిని సాధారణఋతువు అందురు. ఇది కాలసాధారణము[11]. ఇట్లే స్వర
సాధారణము, జాతిసాధారణము అని సాధారణము రెండువిధములుగా నుండును.

9. ఈ ఎనుబదినాలుగు తానములకును "వేదోక్తంబులైన యజ్ఞనామధేయంబులు
సంగీతశాస్త్ర ప్రసిద్ధంబులై యొప్పుచుండు" అనుచు గోవిందకవి ఆ పేర్లను వివరించెను.
[రాగతాళచింతామణి - పుటలు 83-87]

10. ఇచ్చట కాశీముద్రణమునందలి పుట 321లోని 2, 3 పంక్తులు విడువబడెను.

11. ఇచ్చటి మూలశ్లోకము క్రిందివిధముగా నున్నది—
ఛాయాసు భవతి శీతం ప్రస్వేదో వా భవతి చాతపస్థస్య। న చ నాగతో వసంతో న చ నిఃశేషః శిశిరకాలః॥ 33



స్వరసాధారణము: నిషాదము షడ్జముయొక్క రెండు శ్రుతులను స్వీకరించి
నప్పుడు ఆ రెండు శ్రుతులను షడ్జమనికాని, నిషాదమనికాని వ్యవహరింపక, అది
ఉభయసాధారణముగా నుండుటచే దానిని సాధారణస్వరమందురు; దీనికి 'కాకలి'
(లేదా కైశికి) అని పేరు. అట్లే గాంధారము మధ్యమముయొక్క రెండు శ్రుతు
లను గ్రహించినప్పుడు ఆ రెండు శ్రుతులను గాంధారమనికాని, మధ్యమమని కాని
వ్యవహరింపక, అది ఉభయసాధారణముగా నుండుటచే, దానిని సాధారణస్వర
మందురు; దీనికి 'అంతరగాంధారము' (లేదా 'సాధారణగాంధారము) అని
పేరు. ఇవియే స్వరసాధారణములు.

ఈ అంతరస్వరము ఆరోహివర్ణాశ్రయముగానే ప్రయోగింపబడవలెను; అవ
రోహివర్ణాశ్రయముగా ప్రయుక్తము కారాదు.

అతిసూక్ష్మమయినదగుటచేత, లేదా అవ్యక్తమధురమగుటచేత, లేదా ఉభయ
సంబంధము కలదగుటచేత 'కాకలి' అనుపేరు కలిగెను. ఇది ఏకశ్రుతికముగా
ఉన్నప్పుడు కేశమువలె అత్యంతసూక్ష్మముగా నుండును కాన దీనికి 'కైశికి' అను
పేరును కలిగెను. ద్విశ్రుతికమగునప్పుడు 'కాకలి' అనబడును[12].

జాతిసాధారణము: ఒక గ్రామమునందలి అంశలు-కల జాతులను ఇంకొక
గ్రామమున ప్రయోగించినప్పుడు ఆ జాతి ఉభయసాధారణమగును*

జాతులు

7. జాతులు—స్వరసాధారణములగు జాతులు మూడు—(1) మధ్యమ,
(2) పంచమి, (3) షడ్జమధ్య. ఈ మూడింటికిని షడ్జ-మధ్యమ-పంచమ స్వరములు
అంగములు.

షడ్జగ్రామాశ్రయములగు జాతులు ఏడువిధములు—(1) షాడ్జి, (2) ఆర్షభి,
(3) నైషాది, (4) ధైవతి, (5) షడ్జోదీచ్యవతి, (6) షడ్జకైశికి, (7) షడ్జమధ్యమ.

మధ్యమగ్రామాశ్రయములగు జాతులు పదునొకండు విధములు —
(1) గాంధారి, (2) రక్తగాంధారి, (3) గాంధారోదీచ్యవ, (4) మధ్యమోదీచ్యవ,
(5) మధ్యమ, (6) పంచమి, (7) గాంధారపంచమి, (8) ఆంధ్రి, (9) నందయంతి,
(10) కర్మారవి, (11) కైశికి.

ఇట్లు జాతులు మొత్తము పదునెనిమిది విధములు.

12. కాశీముద్రణమునందలి పుట 321 లో 16, 17 పంక్తులును, 19, 23
పంక్తులును, 35 వ శ్లోకమును విడువబడెను.

*[కాశీముద్రణమునందు 28 వ అధ్యా - 1-35 శ్లో; బొంబాయి ముద్రణము
నందు 28 వ అధ్యా - 1-38; బరోడా ముద్రణము - 28వ అధ్యా - 1-36 శ్లో.]

పై జాతు లన్నియును రెండువిధములుగా ఉండును— శుద్ధములు, వికృతములు.

శుద్ధజాతులు : అన్యూనస్వరములై, అంశ-గ్రహ-న్యాసములతో కూడి యుండు జాతి 'శుద్ధ జాతి' అనబడును. షడ్జగ్రామాశ్రయములగు జాతులలో షాడ్జి, ఆర్షభి, ధైవతి, నైషాది అనునవి నాలుగును శుద్ధజాతులు. ఇంక మధ్యమ గ్రామమున గాంధారి, మధ్యమ, పంచమి అనునవి మూడును శుద్ధజాతులు.

వికృతజాతులు : స్వర-అంశ-గ్రహ-న్యాసములలో న్యాసము తప్ప తక్కిన వాటిలో ఏ ఒకటి కాని, రెండు కాని, మూడు కాని లోపించిన ఆ జాతి 'వికృత జాతి' అనబడును.

శుద్ధ-వికృత జాతుల సమవాయమువలన మిగిలిన పదునొకండు జాతులును (శుద్ధజాతులు ఏడును కాక తక్కినవి) ఏర్పడుచున్నవి ; కావున, వీటిని 'శుద్ధ-వికృతము' లనియు వ్యవహరింతురు. ఆ పదునొకండు జాతులును వేని వేని సంయోగమున ఏర్పడునో వివరింతును—

1. షడ్జమధ్యమ—షాడ్జీ-మధ్యమల సంయోగమువలన 'షడ్జమధ్యమా జాతి' నిష్పన్నమగుచున్నది.

2. షడ్జోదీచ్యవ (షడ్జోదీచ్యవతి)—షాడ్జీ-గాంధారీ-ధైవతుల సంయోగమువలన 'షడ్జోదీచ్యవాజాతి' జనించును.

3. షడ్జకైశికి— షాడ్జీ-గాంధారీ జాతుల కలయికచే 'షడ్జకైశికీజాతి' జనించును.

4. గాంధారోదీచ్యవ— షాడ్జీ-గాంధారీ జాతులతో ధైవతీ-మధ్యమ జాతులు కలియుటచే 'గాంధారోదీచ్యవాజాతి' జనించును.

5. మధ్యమోదీచ్యవ—గాంధారీ-పంచమములతో ధైవతి కాని, మధ్యమ కాని కలియుటచే 'మధ్యమోదీచ్యవాజాతి' ఏర్పడును.

6. రక్తగాంధారి— గాంధారీ-పంచమీ-నైషాదీ-మధ్యమజాతులు నాలుగును కలియుటచే 'రక్తగాంధారీజాతి' జనించును.

7. ఆంధ్రి— గాంధారీ-షాడ్జీజాతుల సంయోగమువలన 'ఆంధ్రీ జాతి' జనించును.

8. నందయంతి— గాంధారీ-పంచమీ-ఆర్షభీజాతుల సంయోగము వలన 'నందయంతీజాతి' జనించును.

9. గాంధారపంచమి — గాంధారీ - పంచమీ జాతుల సంయోగముచే 'గాంధారపంచమీజాతి' జనించును.



10. కర్మారవి—నైషాదీ-ఆర్షభీ-పంచమీజాతుల సంయోగముచే 'కర్మారవిజాతి' జనించును.

11. కైశికి— పంచమీ-మధ్యమా-షాడ్జీ-ధైవతీ-గాంధారులు అను ఐదు జాతుల కలయికచే 'కైశికీజాతి' జనించును.

ఇట్టి జాతులు పరస్పరోత్పన్నములని తెలియవలెను.

పైని వివరించిన జాతులలో నాలుగు సప్తస్వరములు గల జాతులు ; పది పంచస్వరములు గల జాతులు; నాలుగు షట్స్వరములు గల జాతులు.

షడ్జగ్రామమందలి షడ్జకైశికి ఒకటియును ; మధ్యమగ్రామమందలి మధ్యమోదీచ్యవ, కర్మారవి, గాంధారపంచమి అను మూడును కలిసి మొత్తము ఈ నాలుగు జాతులును సంపూర్ణస్వరజాతులు.

మధ్యమగ్రామమందలి రక్తగాంధారి, మధ్యమ, పంచమి, కైశికి, గాంధారి అను ఐదును ; షడ్జగ్రామమందలి ఆర్షభి, ధైవతి, నైషాది, షడ్జమధ్యమ, షడ్జోదీచ్యవ అను ఐదును కలిసి మొత్తము ఈ పదియును పంచస్వరజాతులు.

మధ్యమగ్రామమందలి గాంధారోదీచ్యవ, నందయంతి, ఆంధ్రి అను మూడును; షడ్జగ్రామమందలి షాడ్జి ఒకటియును కలిసి మొత్తము ఈ నాలుగు జాతులును షట్ స్వరజాతులు. షడ్జగ్రామమందు షాడ్జి ఒకప్పుడు షాడవీభూతమును, ఇంకొక్కప్పుడు ఔడవీకృతమును అయి షట్స్వరమును కాగలదు......[13]

పై విధముగా జాతులలో కొన్ని స్వరములు లోపించుచుండుట కలదు. ఏ స్వరము లోపించినను లోపించవచ్చును కాని మధ్యమస్వరము మాత్రము అవినాశియై ఉండవలయును. సామగులగు మహర్షులు ఈ మధ్యమస్వరమును సర్వస్వరప్రవరమును గాను, అవినాశిగను గాంధర్వకల్పమున పేర్కొనిరి.*

దశవిధజాతిలక్షణము

పై జాతులకు సంబంధించిన లక్షణములు పది విధములు.

గ్రహాంశౌ తారమంద్రౌ చ న్యాసాపన్యాస ఏవ చ ।
అల్పత్వం చ బహుత్వం చ షాడవౌడవితే తథా ॥ 70

---

13. కాశీముద్రణమునందలి పుట 324 లోని 6 శ్లోకములు (62-68 శ్లో.) విడువబడెను.

* [కాశీముద్రణమునందు 28 వ అధ్యా - 36. 69 శ్లో ; బొంబాయిముద్రణము నందు 28 వ అధ్యా - 39-73 శ్లో; బరోడా ముద్రణము-28 వ అధ్యా-37-65 శ్లో]

—(1) గ్రహము, (2) అంశము, (3) తారము, (4) మంద్రము, (5) న్యాసము, (6) అపన్యాసము, (7) అల్పత్వము, (8) బహుత్వము, (9) షాడవము, (10) ఔడవితము.

*గ్రహము :* సర్వజాతులందును అంశమే గ్రహము. దేనిచే గానము ప్రవృత్త మగునో అది 'అంశ' మనబడును ; ఈ అంశము గ్రహవికల్పితమే. (ఏ స్వరమునుండి రాగము ప్రారంభమగునో అది గ్రహస్వర మనబడును).

*అంశము :* రాగము ఏ స్వరముచే అభివ్యక్తము చేయబడునో, దేనిచే ప్రవర్తింపజేయబడునో అది 'అంశ' మనబడును. (ఏది ప్రారంభస్వరమో అది అంశము; దీనిని జీవస్వర మందురు.) ఆ అంశముచేతనే తార-మంద్రములు ఉపలభ్యమానము లగును. ఆ అంశస్వరమే అనేక స్వరసంయోగమును పొందును. ప్రబలముగానుండు ఆ అంశమును చుట్టి సంవాది-అనువాదిస్వరములు గ్రహ-అపన్యాస-న్యాస-విన్యాస-అభ్యాసరూపబహుత్వగోచరములై దశవిధములుగా ప్రవర్తించుచుండును. ఇట్టి గ్రహాంశములు మొత్తము అరువదిమూడు. ఈ అరువదిమూడును ఆయా జాతులందు క్రిందివిధముగా నుండును.

మధ్యమోదీచ్యవా-నందయంతీ-గాంధారపంచమీ జాతులకు పంచమస్వరము గ్రహస్వరమును, అంశస్వరమును కూడ అగును. (మూడు జాతులందును మొత్తము మూడు.)

ధైవతీజాతికి ధైవత-ఋషభస్వరములు రెండును అంశ-గ్రహములు.

పంచమికి పంచమ-ఋషభములు రెండును గ్రహాంశములు.

గాంధారోదీచ్యవకు షడ్జ-మధ్యమములు రెండును గ్రహాంశస్వరములు.

ఆర్షభికి నిషాద-ఋషభ-ధైవతములు మూడును అంశగ్రహములు.

నైషాదికి నిషాద-గాంధార-ఋషభములు మూడును అంశ-గ్రహములు.

షడ్జకైశికికి షడ్జ-గాంధార పంచమములు రెండును అంశ-గ్రహములు.

షడ్జోదీచ్యవతికి షడ్జ-మధ్యమ-నిషాద-ధైవతములు నాలుగును అంశ-గ్రహములు.

కర్మారవికి పంచమ-ఋషభ-నిషాద-ధైవతములు నాలుగును అంశ-గ్రహస్వరములు.

ఆంధ్రికి గాంధార-ఋషభ-నిషాద-పంచమములు నాలుగును గ్రహాంశములు.

మధ్యమకు ఋషభ - షడ్జ - మధ్యమ - పంచమ - ధైవతములు ఐదును గ్రహాంశములు.



షాడ్జికి షడ్జ-గాంధార-మధ్యమ-పంచమ ధైవతములు ఐదును అంశ-గ్రహములు.

గాంధారి-రక్తగాంధారులకు నిషాద-షడ్జ-గాంధార-మధ్యమ-పంచమములు అంశగ్రహములు (రెండు జాతులకును మొత్తము పది)

కైశికికి షడ్జ - గాంధార - మధ్యమ - పంచమ - ధైవత - నిషాదములు ఆరును గ్రహాంశములు

షడ్జమధ్యమకు అన్ని స్వరములును అంశగ్రహస్వరము లగును (మొత్తము ఏడు)......"

*అల్పత్వము ;* గీతాంతరమునందలి అంశస్వరమును అధికముగా ఉచ్చరింపకుండుట 'అల్పత్వ' మనబడును. ఇది రెండు విధములు—(1) అనభ్యాసము, (2) లంఘనము. గీతమందు ఒక స్వరమును పునఃపునరావృత్తము చేయకపోవుట 'అనభ్యాస' మగును. గీతమందు ఒక స్వరమును పూర్తిగా ఉచ్చరింపక విడిచి, పై స్వరమునకు దాటుట 'లంఘన'మగును.

*బహుత్వము :* ఇది అల్పత్వమునకు వ్యతిరేకము; గీతమునందు ఒకేస్వరమును గ్రహించి మాటిమాటికిని ఎక్కువగా పాడుట. ఇదికూడ రెండు విధములు—(1) అభ్యాసము, (2) అలంఘనము.

*తారము :* ఇది ఉచ్చస్వరము; మూర్ధస్థానమున జనించును. అంశస్వరము నుండి నాలుగుస్వరములనుకాని, అయిదవస్వరమునుకూడకాని తారస్వరముగా పలుకవలయును. అటుపైని తారముగా పలుకరాదు.

*మంద్రము :* ఇది హృదయస్థానమున జనించు తగ్గుస్వరము. ఇది మూడు విధములు—(1) అంశపరము, (2) న్యాసపరము, (3) అపన్యాసపరము.

*న్యాసము :* గీతమునుపాడి ముగించు స్వరము 'న్యాస' మనబడును ; ఇది 21 విధములుగా నుండును.

*అపన్యాసము :* గీతమును పాడునపుడు నడుమనడుమ ముగించుస్వరము 'అపన్యాస' మనబడును; ఇది 56 విధములుగా నుండును.*

**జాతులందలి అంశాదివికల్పనము**

ఇప్పుడింక జాతులందలి అంశవికల్పనమును పేర్కొందును—

14. కాశీముద్రణమునందలి పుట 326 లోని 3 శ్లోకములు (87-89 శ్లో.) విడువబడెను.

* [కాశీముద్రణమునందు 28 వ అధ్యా-70-95 శ్లో; బొంబాయి ముద్రణమునందు 28 వ అధ్యా-74-111 శ్లో; బరోడా ముద్రణము-28 వ అధ్యా-66-94 శ్లో.]

1. షాడ్జి— ఇందు నిషాద-ఋషభములు తప్ప తక్కిన స్వరములు అంశ స్వరములు. అన్ని స్వరములును న్యాసమగును. గాంధార-పంచమములు అపన్యాస ములు. నిషాదరహితమై షాడవమగును. నిషాద-ఋషభములు అత్యల్పత నందును. షడ్జ-గాంధార-నిషాద-ఋషభములయందు సంచారము చేయవలెను. ఈ జాతి యందు గాంధారమునకు బహుత్వము ఉండవలెను.

2. ఆర్షభి—ఇందు నిషాద-ఋషభ-ధైవతములు అంశస్వరములు; అవియే అపన్యాసములును. ఋషభము న్యాసము. పంచమమునకు ఆరోహణవశమున లంఘనరూపమగు అల్పత్వముండవలెను. వివాదిస్వరములకు సంచారము చేయ వలెను. సప్తమమును విడుచుటచే షట్స్వరత్వము వచ్చును. పంచమస్వరమును కూడ లోపింపజేయుటచే పంచస్వరయుతము కాగలదు.

3. ధైవతి— ఇందు ధైవతము న్యాసము. ధైవత-ఋషభములు అంశ ములు. ధైవత-ఋషభ-మధ్యమములు అపన్యాసములు. షడ్జ-పంచమహీనమై పంచస్వరమగును. ధైవత-ఋషభములు ఆరోహణములో లంఘనీయములు.

4. షడ్జోదీచ్యవతి— ఇందు షడ్జ-మధ్యమ-నిషాద-ధైవతములు అంశస్వర ములు. మధ్యమము న్యాసము. ధైవత-ఋషభములు అపన్యాసములు. ఋషభ హీనమై షట్స్వరత్వము నందును. గాంధార-పంచమస్వరముల లోపముచే పంచ స్వరత్వము కలుగును. ఈ ఋషభ-పంచమములనే లంఘనమున వదలవలెను.

5. షడ్జమధ్యమ—ఇందు అన్ని స్వరములును అంశములే; అవియే అప న్యాసములును. షడ్జ-మధ్యమములు న్యాసములు. గాంధార-నిషాదములను విడిచి పంచస్వరము అగును. ఋషభహీనమైన షాడవ మేర్పడును. ఋషభమిందు అత్యల్ప త్వము నందును. సర్వస్వరముల సంచారమును ఇందు అభిమతము.

6. గాంధారి— ఇందు ధైవత-ఋషభములు తప్ప తక్కిన ఐదును అంశస్వరములు. షడ్జ-పంచమములు అపన్యాసములు. గాంధారము న్యాసము. ఋషభస్వరలోపముచే షాడవ మేర్పడును. ధైవత-ఋషభ-గాంధారముల సంచారముచేయవలెను. షడ్జ-మధ్యమములు బహుత్వమునందును. గాంధారము నకు ఆరోహణమున లంఘనమును కావించవలెను.

7. రక్తగాంధారి— ఇందు అంశస్వరములు గాంధారియందువలెనేఉండును. ధైవత-నిషాదములు బహుత్వమునందవలెను. గాంధార-షడ్జముల సంచారము చేయవలెను. మధ్యమము అపన్యాసము.

8. గాంధారోదీచ్యవ— ఇందు షడ్జ-మధ్యమములు అంశస్వరములు. ఇందులో పంచస్వర్యము ఉండదు. ఋషభస్వరలోపముచే షాట్స్వర్య మేర్పడును. న్యాస-అపన్యాస-లంఘనాదులు షడ్జోదీచ్యవతియందువలెనే ఉండును.

9. మధ్యమ— ఇందు షడ్జ-ఋషభ-మధ్యమ-పంచమ-ధైవతములు అంశ స్వరములు; అపన్యాసములును అవియే. మధ్యమము న్యాసము. గాంధార-నిషాద



ములు లోపించిన పంచస్వరత్వము కలుగును. గాంధారము బహుత్వమునందును. గాంధారము లోపించుటచే షట్స్వరత్వము కలుగును. షడ్జ-మధ్యమ-గాంధార ములు అల్పత్వమునందును.

10. మధ్యమోదీచ్యవ— ఇందు పంచమము అంశస్వరము. తక్కినవి గాంధారోదీచ్యవయందువలెనే ఉండును.

11. పంచమి—ఇందు పంచమ - ఋషభములు అంశస్వరములు. పంచమ-ఋషభ-నిషాదములు అపన్యాసములు. పంచమము న్యాసము. మధ్యమ-ఋషభ ములు లోపించుటచే పంచస్వరత్వము కలుగును. షడ్జ-గాంధార-మధ్యమములు అల్పత్వము నందును. మధ్యమ-ఋషభములకు సంచారమును కావించవలెను.

12. గాంధారపంచమి-ఇందు పంచమము అంశస్వరము. పంచమ-ఋషభ ములు అపన్యాసములు. గాంధారము న్యాసము. ఇందు హీనస్వరత ఉండదు. పంచమ-గాంధారములకు సంచారము కావించవలెను.

13. ఆంధ్రి—ఇందు ఋషభ-పంచమ-గాంధార-నిషాదములు అంశస్వర ములు; అవియే అపన్యాసములును. గాంధారము న్యాసము. షడ్జరహితమై షాడవ మగును. గాంధారషడ్జములకు సంచారము కావించవలెను. షడ్జమునకు అల్పత్వ మున లంఘనము కావించవలెను. ఇందు పంచస్వరత్వము ఉండదు.

14. నందయంతి—ఇందు పంచమము అంశము. మధ్యమ-పంచమములు అపన్యాసములు. షడ్జహీనమై షాడవ మగును. అదియే లంఘనీయమును అగును. ఆంధ్రి యందువలెనే ఇందును సంచారము కర్తవ్యము.....[15]

15. కర్మారవి—ఇందు పంచమ-ఋషభ-ధైవత-నిషాదములు అంశస్వర ములు; అవియే అపన్యాసములును. పంచమము-న్యాసము. ఇందు హీనస్వర్యము ఉండదు. గాంధారమునకు సంచారము కర్తవ్యము.

16. కైశికి—ఇందు ఋషభవర్జితములైన ఆరు స్వరములును అంశములు; అవియే అపన్యాసములు. గాధార-సప్తమములు న్యాసములు...[16]

ఇంతవరకును దశలక్షణోపేతములైన జాతులను వివరించియున్నాను. ఇంక ఏ యే రసములందు ఏ యే జాతులు ప్రయుక్తములు కావలెనో వివరింతును.*

అష్టావింశాధ్యాయము సమాప్తము.

---

15. కాశీముద్రణమునందలి పుట 329 లోని రెండు శ్లోకములు (133-134.) విడువబడెను.

16. కాశీముద్రణమునందలి పుట 330 లోని 3 శ్లోకములు (138-140 శ్లో) విడువబడెను. నైషాదీ-షడ్జకైశికీ జాతుల వివరములు స్పష్టముగా లేవు.

* [కాశీముద్రణమునందు 28 వ అధ్యా-96-141 శ్లో; బొంబాయి ముద్రణము నందు 28 వ అధ్యా-112-161 శ్లో;బరోడా ముద్రణము-28 వ అధ్యా - 94-141శ్లో.]

# అధ్యాయము 29[1]

## తంత్రీవాద్యములు[2]

[కాశీముద్రణమునందు 29 వ అధ్యా—149 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 29 వ అధ్యా—125 శ్లోకములును కలవు.]

జాతులు : రసానుగుణ ప్రయోగము

*షడ్జగ్రామజాతులు* : శృంగార-హాస్యములందు షడ్జ-మధ్యమ బాహుల్యముగల షడ్జమధ్యమను, షడ్జోదీచ్యవతిని ప్రయోగించవలెను.

వీర-అద్భుత-రౌద్రములందు షడ్జ-ఋషభములు గ్రహస్వరములుగా గల ఆర్షభిని, షాడ్జిని ప్రయోగించవలెను.

కరుణరసమందు గాంధారాంశసహితమగు షడ్జకైశికిని ప్రయోగించవలెను.

బీభత్స - భయానకములందు ధైవతము అంశముగా గల ధైవతీ జాతిని ప్రయోగించవలెను.

ధ్రువాగానమున రస-కార్య-అవస్థానుగుణముగా పై జాతులను ప్రయోగించవలెను. ఇది షడ్జగ్రామాశ్రితములైన జాతుల ప్రయోగము.

*మధ్యమగ్రామజాతులు*: ఇంక మధ్యమగ్రామాశ్రయములైన జాతులను క్రిందివిధముగా ఆ యా రసములందు ప్రయోగించవలెను—

కరుణరసమందు గాంధారాంశయుతములగు గాంధారీ-రక్తగాంధారులను ప్రయోగించవలెను.

శృంగార-హాస్యములందు మధ్యమ-పంచమ బహుళములగు మధ్యమా-పంచమీ-నందయంతులను ప్రయోగించవలెను.

వీర-రౌద్రములందు షడ్జ-ఋషభములు అంశములుగాగలమధ్యమోదీచ్యవా-గాంధారోదీచ్యవలనుప్రయోగించవలెను.

అద్భుతరసమందు నిషాదాంశయుతములగు ఆంధ్రీ-కర్మారవులను ప్రయోగించవలెను.

బీభత్స-భయానకములందు ధైవతాంశయుతమగు కైశికిని, గాంధార పంచమిని ప్రయోగించవలెను.

1. ఈ భాగము అన్ని ముద్రణములందును ఏకోనవింశాధ్యాయమే. (29 వ అధ్యాయము) బరోడా-29 వ అధ్యా - 119 వ శ్లో: భిన్న పాఠము - 146 శ్లో.

2. 'తతాతోద్య విధానము' అని కాశీముద్రణపాఠము. 'ఆతోద్యజాతి విధానము' అని బొంబాయిముద్రణపాఠము. 'తతాతోద్య విధానము' అని బరోడా పాఠము.



సర్వరసములందును షడ్జమధ్యమ ప్రయుక్తము కావచ్చును. దీనియందు సప్తస్వరములును అంశములేకదా.

స్వరములు : రసానుగుణప్రయోగము

ఏ రసములందు ఏ అంశములు బలము కలవిగా నుండవలెనో గుర్తించి, ఆ యా రసములందు ఆ స్వరములు ప్రబలముగా నుండు జాతులను గానము చేయవలెను.

హాస్య-శృంగారములందు మధ్యమ-పంచమ స్వరభూయిష్ఠముగా గానము ఉండవలెను.

వీర-అద్భుతములందు షడ్జ-ఋషభప్రాయమగు గానము ప్రయుక్తము కావలెను.

కరుణమునందు గాంధార-నిషాదప్రాయమగు గానము ఉండవలెను.

బీభత్స-భయానకములందు ధైవతభూయిష్ఠముగా గానము ప్రయుక్తము కావలెను.

ఇట్లు రసానుగుణముగా ఆయా స్వరములు అంశస్వరములుగా గల జాతులను గానమందు ప్రయోగించవలెను.

స్వరములు : వాద్యానుగుణరసప్రయోగము

ఇంక వాద్యప్రయోగమునందు రసానుగుణముగ నుపయోగింపదగు స్వరములను వివరింతును—

హాస్య-శృంగారములందు మధ్యమ-పంచమములను, వీర-రౌద్ర-అద్భుతములందు షడ్జ-ఋషభములను, కరుణరసమందు గాంధార-నిషాదములను, బీభత్స-భయానకములందు ధైవతమును ప్రయోగించవలెను.

ఇంక వర్ణ-అలంకారముల లక్షణములను వివరింతును.[3]

వర్ణములు[4]

8. వర్ణములు—ఆరోహి, అవరోహి, స్థాయి, సంచారి అనెడి భేదములచే 'వర్ణములు' నాలుగు విధములు. అలంకారములు వర్ణముల నాశ్రయించి యుండును.

3. స్వరాత్మక గాంధర్వమందలి పది విభాగములలో మొదటి ఏడును (స్వర-గ్రామ-శ్రుతి-మూర్ఛనా-స్థాన-సాధారణ-జాతులు) 28 వ అధ్యాయమందు వివరింపబడెను. ఇప్పుడు వర్ణ-అలంకారములు వివరింపబడుచున్నవి. తరువాత 'ధాతువులు' వివరింపబడును.

4. 'వర్ణ' మనగా గానక్రియ. గానము చేయునపుడు మొదట ఏ స్వరమున గానము ప్రారంభింపబడునో ఆ స్వరమందే తిరిగివచ్చి నిలుచుట 'స్థాయి వర్ణము'. గానము చేయునపుడు ప్రారంభించిన స్వరమునుండి క్రమముగా పెచ్చుచు పోవుట 'ఆరోహి వర్ణము'.

ఆరోహి - స్వరములను ఆరోహణముచేయుట.
అవరోహి - స్వరములను అవరోహణముచేయుట.
స్థాయి - స్వరములు స్థిరముగానుండుట.
సంచారి - స్వరములు సంచార మొనర్చుట.

ఈ నాలుగు వర్ణములును శారీరస్వరసంభవములుగాను, ఉరః-శిరః-కంఠ దేశగతములగు మంద్ర - మధ్య - తారస్వరములకు సంబంధించినవిగను ఉండును. ఈ నాలుగు విధములగు వర్ణములకును సంబంధించిన అలంకారములను వివరింతును.

అలంకారములు[5]

9. అలంకారములు—వర్ణములకు సంబంధించిన అలంకారములను క్రింద పేర్కొనుచున్నాను—

(1) ప్రసన్నాది, (2) ప్రసన్నాంతము, (3) ప్రసన్నాద్యంతము, (4) ప్రసన్నమధ్యము, (5) సమము, (6) స్థిరము, (7) బిందువు, (8) నివృత్తము, (9) ప్రవృత్తము, (10) వేణువు, (11) కుహరము, (12) రేచితము, (13) కంపితము, (14) ప్రేంఖోలితకము, (15) మంద్రతారప్రసన్నము, (16) తారమంద్రప్రసన్నము, (17) ప్రసారము, (18) ప్రసాదము, (19) ఉద్వాహితము, (20) అవలోకితము, (21) నిష్కూజితము, (22) ఉద్గీతము, (23) హ్రాదమానము, (24) రంజితము, (25) ఆవర్తకము, (26) పరివర్తకము (27) ఉద్ఘట్టితము, (28) ఆక్షిప్తకము, (28) సంప్రదానము (30) హసితము, (31) హుంకారము, (32) సంధిప్రచ్ఛాదనము, (33) విధూమము, (34) గాత్రవర్ణము,

పై అలంకారములలో ప్రసన్నాది- ప్రసన్నాంత- ప్రసన్నాద్యంత- ప్రసన్న.. సమ- ప్రస్తార- ప్రసాద- రేచితములు స్థాయివర్ణాశ్రయములగు అలంకారములు; మంద్రతారప్రసన్న- బిందు[6]- ప్రేంఖోలిత- తారమంద్రప్రసన్న- నివృత్త- ప్రవృత్త కుహర- వేణు- రంజిత- అవలోకిత- ఆవర్తక- పరివర్తకములు సంచారివర్ణాశ్రయములగు అలంకారములు; నిష్కూజిత- హుంకార- హసిత- బిందు-రేచిత-ప్రేంఖోలితక- ఆక్షిప్తక- విధూమ- ఉద్ఘట్టిత- హ్రాదమాన- సంప్రదాన-సంధిప్రచ్ఛాదన- ప్రసన్నాది - ప్రసన్నాంతములు ఆరోహివర్ణసమాశ్రయములగు అలంకారములు; విధూమ- గాత్రవర్ణ- ఉద్వాహి- ఉద్గీత- వేణువులు అవరోహివర్ణాశ్రయములైన అలంకారములు.

ఈ అలంకారములు సప్తరూపము[7]నందు ప్రయుక్తములగునని బుధులు తెలియవలెను. జాతి-వర్ణప్రకర్షమువలన ఇవి ధ్రువలయందధికముగా ప్రయుక్తము కారాదు. బిందువుకాని, వేణువుకాని, ఇంకను ఇతరములుకాని ధ్రువాప్రయోగములందు స్వప్రమాణము ననుసరించి ఉండరాదు. ప్రయోజనానుసారముగా, అర్థము ననుసరించి ధ్రువలు ప్రయోగింపబడును. కావున వానియందు పదసంశ్రయము లగు వర్ణాలంకారములను తక్కువగా ప్రయోగించవలెను.*

ఆయా వర్ణములలో ప్రయోగింపదగు అలంకారములను వివరింతును—

(1) ప్రసన్నాది, (2) ప్రసన్నాంతము, (3) ప్రసన్నాద్యంతము, (4) ప్రసన్నమధ్యము, (5) బిందువు, (6) కంపితము, (7) రేచితము, (8) తారము, (9) మంద్రము, (10) తారతరము, (11) ప్రేంఖోలితకము, (12) సమము, (13) నివృత్తము, (14) ప్రవృత్తము, (15) ప్రసాదము, (16) అవలోకితము, (17) వేణువు అనునవి సర్వవర్ణములందును ప్రయోగింపదగు అలంకారములు. స్థాయివర్ణము తప్ప తక్కిన వర్ణములన్నియును ప్రయోగమునందు నిబంధింపదగినవే.

## అలంకారముల లక్షణములు

1. ప్రసన్నాది—మొదట ప్రసన్నముగానుండి క్రమముగా దీప్తి చెందునది.

2. ప్రసన్నాంతము—మొదట దీప్తముగానుండి అంతమున ప్రసన్నముగా నుండునది.

3. ప్రసన్నాద్యంతము — ఆద్యంతములు రెండింటను ప్రసన్నముగా నుండునది.

---

ప్రారంభించిన స్వరమునుండి వరుసగా దిగెడి గానక్రియ 'అవరోహి వర్ణము'. పైని చెప్పిన మూడు వర్ణములును కలియు గానక్రియ సంచారి వర్ణము.

5. పై నాలుగు వర్ణముల ననుసరించి స్వరములను చేర్చుటయే 'అలంకార' మనబడును. గానమునకు శోభనిచ్చునది ఈ అలంకారమే.

6. అలంకారములు ముప్పదిమూడు అని తరువాత చెప్పబడును. కాని ఇచ్చట మొదటి 32 మాత్రమే పేర్కొనబడెను. లక్షణములను వివరించునప్పుడు బిందువు, వేణువు చెప్పబడెను. అందుచే అలంకారములు ముప్పదినాలుగయ్యెను. ఇంక తరువాత లక్షణములను వివరించునప్పుడు చెప్పబడిన తార-మంద్ర-తారతరములను నేను ప్రత్యేకాలంకారములనుగా గణించలేదు. అవి కూడ ప్రత్యేకాలంకారము లన్నచో అలంకారముల మొత్తము ముప్పది ఏడు అగును.

7. సప్తరూప మనగా 31 వ అధ్యాయమందు వివరింపబడనున్న సప్తగీతములు. 5 వ అధ్యాయమందలి 17 వ అధస్సూచికను కూడ చూడవలెను. (పుట-162)

* [కాశీముద్రణమునందు 29 వ అధ్యా—1-40 శ్లో; బొంబాయిముద్రణమునందు 29 వ అధ్యా—1-32 శ్లో. బరోడా ముద్రణము - 29 వ అధ్యా - 1-30 శ్లో.]

4 ప్రసన్నమధ్యము—మధ్యలో ప్రసన్నముగానుండునది.
5. సమము—అంతటను సమముగా నుండునది.
6. స్థిరము—ఒకే స్వరము కలది.
7. బిందువు—ఒక కల మాత్రము కలిగియుండు తారస్వరము.
8. నివృత్తము—మూర్ధమును స్పృశించి మరలి వచ్చునది.
9. ప్రవృత్తము—మందముగా సాగునది.
10. వేణువు—ఆక్రీడితలయము వేణువనబడును.
11. కుహరము—కంఠమున నిరోధింపబడు వాయువు కలది.
12. రేచితము—శిరోగతమై మూడు కలల కాలము కంపము చెందునది.
13. కంపితము—ఉరోగతముగ మూడు కలల కాలము కంపనము చెందునది.

14. ప్రేంఖోలితకము—మూడు స్థానముల మధ్యను గతాగతములను చేయునది.

15. తారమంద్రప్రసన్నము—తారమనునది కంఠమందలి అదోభాగమున నుండును;
మంద్రమనునది ఉరః స్థానమున అధోభాగమున నుండును;
తారతరమనునది మూర్ధస్థానమున అధోభాగమున నుండును.
ఇంక తారమంద్రప్రసన్న మనగా క్రమాగతమగు తారపంచమము లేదా ధైవతము మంద్రమగుట.

16. మంద్రతారప్రసన్నము - మంద్రమునుండి తారమునకు క్రమముగా ఆరోహించునది.

17. ప్రస్వారము (ప్రసారము) - క్రమముగా ఒకే స్వరమున ఆరోహణము నందునది.

18. ప్రసాదము - పైప్రస్వారమే మెల్లగా నివృత్తమై ప్రసన్నమగుట.

19. ఉద్వాహితము - సమనంతరమున నుండు రెండు కలలందు కూడ చరించుట. ఇందు ఒక కలలో ఆరోహణమును, ఇంకొక కలలో ప్రసాదమును చెందును.

20. అవలోకితము - ఉద్వాహితము రెండుసార్లు ప్రయుక్తమగుట.

21. నిష్కూజితము - ఒక స్వరమునుండి మరియొక స్వరమునకు వరుస వదలక వెళ్ళుట క్రమము. ఒక స్వరమును వదలి మరియొక స్వరమునకు వెళ్ళుట ఏకాంతరము. అట్లు ఏకాంతరముగ రెండు కలల కాలమున స్వరసంచారము కావించుట నిష్కూజితమగును.



22. ఉద్గీతము - మొదట ఆరోహిస్వరము, చివర అవరోహిస్వరము కలిగి క్రమస్వరముల సంచారము కావించుట.

23. హ్రాదమానము - రెండు మొదలు ఆరువరకును స్వరములు ఆరోహణము చెందుట.

24. రంజితము—తరువాతి స్వరమందు రెండుకలల కాలముండి, అర్ధకల ఆరోహణమును, మరల అంతియే అవరోహణమును ఒనర్చుట.

25. ఆవర్తకము— సమనంతరస్వరములు నాల్గింటియందును ఆరోహావరోహవిధిచే సంచరించుట.

ఈ ఆవర్తకము సమనంతరస్వరములందును, సాంతరస్వరములందును కూడ జరుగును. ఇది ఎనిమిది కలల కాలములో జరుగును. నాలుగు కలలలో ఆవృత్తిని చెందునది కాన ఆవర్తకమనబడెను.

26. పరివర్తకము—మూడు స్వరములను అతిక్రమించి, స్వరాంతరమునకు లంఘించి, మరల పరావృత్తి చెందుట. ఇది ఎనిమిది కలల కాలములో జరుగును.

27. ఉద్ఘట్టితము—పరస్పరవ్యవధానము కలిగివ రెండు స్వరములు ఏక కాలమున ఆరోహావరోహముల నందుట.

28. ఆక్షిప్తకము—మూడుస్వరములందు ఒకకల మొదలు ఆరుకలల వరకును సంచారము కావించుట. ఇది కలాభేదమునుబట్టి ఆరు విధములుగానుండును.

29, సంప్రదానము (సంప్రదాయము)—నాలుగు ఏకాంతరస్వరములందు ఆక్షిప్తకమునందువలెనే సంచారమును కావించుట.

30. హాసితము—రెండు స్వరములందు వికలముగ హింసితమువలె సంచారమొనర్చుట. ఇది ఆక్షిప్తకమువంటిదే.

31. హుంకారము—సమనంతరస్వరములు నాలుగింటిని హాసిత వ్యాపారముతో ఏకకలాకాలమున ఆరోహణ మొనరించుట.

32. సంధిప్రచ్ఛాదనము—అనంతరస్వరము నారోహించి క్రమముగా నాలుగు కలలకాలమున ప్రత్యావర్తితమగుట.

33. విధూనము (విధూమము)—మొదట పదమును ఉత్పాదింపజేసి, ద్విస్వరమగు లఘువర్ణమున ఏకకలాకాలమున ఆరోహ మొనర్చుట.

34. గాత్రవర్ణము—రెండు రెండు స్వరములు కంపితములును, తరువాత రెండు స్వరములు ప్రసన్నములును అగుట.

పైని అలంకారముల లక్షణములను వివరించితిని. వర్ణవిరోధములేకుండునట్లుగా ఈ అలంకారములచే గీతులను అలంకరించవలెను.

స్థానే చాలంకారం కుర్యాత్ నహ్యురసి కాంచికాం బధ్యేత్ । 74

.... ... ...

శశినా రహితేవ నిశా విజలేవ నదీ లతా విపుష్పేవ ।
అవిభూషితేవ చ స్త్రీ గీత్యలంకారహీనా స్యాత్ ॥ 75

—స్థానమునెరింగి అలంకారమును కూర్చవలెను. వక్షఃస్థలమున మొలనూలిని కట్టరుకదా ?...అలంకారములేని గీతి చంద్రుడులేని రాత్రివలె, జలములేని నదివలె, పుష్పములేని లతవలె, అలంకరించుకొనని స్త్రీవలె భాసించదు.*

### గీతులు

ఇంక గీతుల లక్షణములను వివరింతును. గీతులు నాలుగు విధములు—(1) మాగధి, (2) అర్ధమాగధి, (3) సంభావిత, (4) పృథుల.

1. మాగధి—భిన్నవృత్తులలో గానముచేయబడు గీతి.

2. అర్ధమాగధి—మాగధికాలమునందలి సగముకాలములోనే నివృత్తమైన గీతి అర్ధమాగధి.

3. సంభావిత—గుర్వక్షరసమన్విత మగు గీతి.

4. పృథుల—లఘ్వక్షరసమన్విత మగు గీతి.

ఈ గీతులు ధ్రువాగానమునందు ప్రయోగింపదగినవి కావు. గానవేత్తలు వీటిని గాంధర్వమునందే ప్రయోగించవలెను.

### ధాతువులు

ఇప్పుడు సాధు (మంచి) వాద్యముయొక్క లక్షణములను వివరింతును. వాద్య కరణాశ్రయములగు ధాతువులు నాలుగు—(1) విస్తారము, (2) వ్యంజనము, (3) కరణము, (4) ఆవిద్ధము.

1. విస్తారము : విస్తారధాతువు నాలుగువిధములు—(1) సంఘాతజము, (2) సమవాయజము, (3) విస్తారజము, (4) అనుబంధము.[8]

2. వ్యంజనము : వ్యంజనధాతువు వీణావాద్యమున నుపయోగింపబడును. ఇది (1) కలము, (2) తలము, (3) నిష్కోటితము, (4) ఉన్మృష్టము, (5) రేఫము, (6) అవమృష్టము, (7) పుష్పము, (8) అనుస్వరితము, (9) బిందువు, (10) అనుబంధము అనెడి భేదములచే పది విధములు.

*[కాశీముద్రణమునందు 29 వ అధ్యా—41-76 శ్లో; బొంబాయిముద్రణమునందు 29 వ అధ్యా—32-47 శ్లో. బరోడా ముద్రణము-29 వ అధ్యా - 30-45 శ్లో.]

8. ఇచ్చట 6 శ్లోకములు విడువబడెను (కాశీ-82-88 శ్లో.)



(1) కలము—అంగుష్ఠములతో తంత్రులను స్పృశించుట.

(2) తలము—ఎడమ బొటనవ్రేలితో నొక్కిపట్టియుంచి, కుడి బొటనవ్రేలితో తీగెలను మీటుట.

(3) నిష్కోటితము—ఎడమ బొటనవ్రేలితో కూడ మీటుట.

(4) ఉన్మృష్టము—ఎడమచేతి ప్రదేశినితోడి ఘాతము.

(5) రేఫము—సర్వాంగుళి సమాక్షేపము.

(6) అవకృష్టము—కుడిచేతి బొటనవ్రేలితోను, చిటికెనవ్రేలితోను క్రిందివైపు తంత్రులను మూడుసార్లు సారించుట.

(7) పుష్పము—కనిష్ఠాంగుష్ఠముతోడి ఘాతము.

(8) అనుధ్వనితము (అనుస్వరితము)—తలస్థానమందు అక్షరన్యాసము.

(9) బిందువు—గుర్వక్షరైకతంత్రినే మీటుట.

(10) అనుబంధము— ఈ పై అంగములను కొన్నింటిని కూర్చుట లేదా వేరుచేయుట.

3. కరణము : కరణధాతువులు అయిదు విధములు— రుభిత-ఆహ్రాద-అనుబంధములు. (తక్కిన రెండుపేర్లను తెలియలేదు.)

ఈ కరణధాతువులును వీణావాద్యగతములే. ఇందు అన్ని భేదములును గుర్వంతములే అగును. ఇందు మొదటి నాలుగు భేదములును వరుసగా మూడు, నాలుగు, ఐదు, తొమ్మిది ప్రహారములచే ఏర్పడును. ఇంక అయిదవది వీని అనుబంధముచే ఏర్పడును.

4. ఆవిద్ధము : ఆవిద్ధధాతువు క్షేప - ప్లుత - అతిపాత - అతికీర్ణ - అనుబంధ భేదములచే అయిదు విధములు. ఇందు మొదటి నాలుగు భేదములును వరుసగా రెండు, మూడు, నాలుగు, తొమ్మిది ఘాతలచే నేర్పడును.

లక్షణాన్వితములైన నాలుగు ధాతువులను పైని వివరించియున్నాను.

### వృత్తులు

వృత్తులయందు వాద్యము ప్రతిష్ఠితమై యున్నది. ఈ వృత్తులు మూడు విధములు—(1) చిత్రము, (2) వార్తికము, (3) దక్షిణము. వాద్య-తాల-లయ-గతి-యతి-మార్గములు ఆయా వృత్తులకు వ్యంజనములగును.

1. చిత్రము—చిత్రవృత్తియందు వాద్యము సంక్షిప్తముగా నుండును. ద్రుతలయ, సమయతి, అనాగతగ్రహము అనువాని కిందు ప్రాధాన్యముండును.

2. వార్తికము— వార్తికమార్గమందు గతి - వాదిత్రములకు, ద్వికల తాలమునకు, మధ్యలయకు, స్రోతోగత (స్రోతోవహా) యతికి ప్రాధాన్యముండును. మార్గములన్నియును ఇందు ప్రధానములుగనే యుండును.

3. దక్షిణము—దక్షిణవృత్తియందు గతికి, చతుష్కల తాలమునకు, విలంబిత లయకు, గోపుచ్ఛయతికి, అతీతగ్రహమార్గములకు ప్రాధాన్యముండును.

సమస్తమైన వృత్తులందును లలితాది జాతులు ధాతువులతో సంయుక్తములై గుణవత్తరములగును.

గీత్యాశ్రయమగు వీణావాద్యము

గీత్యాశ్రయమగు వీణావాద్యము మూడు విధములుగా నుండును— 1. తత్త్వము, 2. అనుగతము, 3. ఓఘము.

1. తత్త్వము— అనేకకరణసంయుక్తమై, లయ-తాల-వర్ణ-పద-యతి-గీత్యక్షరములను భావింపజేయు వాద్యము.

2. అనుగతము—గీతమును అనుసరించి నడుచు వాద్యము.

3. ఓఘము—గీతార్థము నపేక్షించియుండక, ఆవిద్ధకరణధాతువు లధికముగా కలిగి, ఉపరిపాణి, ద్రుతలయ కలిగియుండు వాద్యము.

తత్త్వమును స్థితలయయందును, అనుగతమును మధ్యలయయందును, ఓఘమును ద్రుతలయయందును ప్రయోగించవలెను. ప్రథమగానమున తత్త్వమును, ద్వితీయగానమున అనుగతమును, తృతీయగానమున ఓఘమును లయ-తాల విచక్షణులు ప్రయోగించవలెను.

విపంచీవాద్యము

ఇంతవరకును వీణావాద్యమందలి ధాతువులను వివరించియున్నాను. ఇంక విపంచీవాద్యమందలి కరణములను వివరింతును— 1. రూపము, 2. ప్రతికృతము, 3. ప్రతిభేదము, 4. రూపశేషము, 5. ఓఘము, 6. ప్రతిశుష్క అనెడి భేదములచే ఆరు విధములైన కరణము లిందుండును.

1. రూపము—వీణావాద్యమునకు రెండు రెట్లుగా గురు-లాఘవ విధానముతో వాయించుట.

2. ప్రతికృతము—రూప రూపమును (ప్రతిరూపమును) భిన్న భిన్నములనుగా నొనర్చు వాద్యము.

3. ప్రతిభేదము—ఒకసారి ఒక విధముగా గురు-లాఘవ విధానమును పాటించి, మరల దానినే మరియొక విధముగా మార్చుట.



4. రూపశేషము—వీణావాద్యవిరామమునందు కూడ దీనిని అవిరతముగ సాగించుట.

5. ఓఘము—ఆవిద్ధకరణసంయుక్తముగా, ఉపరిపాణికముగా సాగించెడి వాద్యము.

6. ప్రతిశుష్క—వాదనమున ఒకే తంత్రిపై వాద్యమును సాగించుట.

ధ్రువాప్రయోగమునందు ప్రాయికముగా కోణవాదనమును ప్రయోగించవలెను.

ఏడు తంత్రులుకల వాద్యము 'చిత్ర' అనబడును.
తొమ్మిది తంత్రులుకలది 'విపంచి' అనబడును.
విపంచి కోణవాద్యమును, చిత్రము అంగుళివాద్యమును అగును.
నానాకరణాశ్రయమగు విపంచి పైవిధముగా నుండునని తెలియవలెను,*

బహిర్గీతవిధి

ఇంక లక్షణయుక్తమైన బహిర్గీతవిధిని[9] వివరింతును— (1) ఆశ్రావణ, (2) ఆరంభము, (3) వక్త్రపాణి, (4) పరిఘట్టన, (5) సంఘోటన, (6) మార్గాసారితము, (7) జ్యేష్ఠ-మధ్య-కనిష్ఠ భేదములతోడి ఆసారితము అనునవి బహిర్గీత విధియందలి భేదములు. వీని ప్రయోజనములు పూర్వరంగవిధి యందే చెప్పబడెను. ఇప్పుడింక నిదర్శనపూర్వకముగా వాని లక్షణములను వివరింతును.

1. ఆశ్రావణ—విస్తారధాతువిహితములగు కరణములు ప్రవిభాగముతో ద్విరభ్యస్తములుగా ఇందు ప్రయుక్తములగును. ఇది 11, లేదా 14, లేదా 15, లేదా 24, లేదా 48 లఘు-గురువులు కలిగియుండును. బాహ్యాశ్రావణయందు లఘువు-గురువుచొప్పున ఎనిమిదిఅక్షరములవరకును సాగి, తరువాత 6 లఘువులు చివర ఒక గురువు ఉండును. ఈ ఆశ్రావణలో ఉపరిపాణియందు 3 శమ్యలు, 3 తాలములు; సమపాణియందు రెండు శమ్యలు, రెండు తాలములు ప్రయుక్తములగును. దీనికి రెండు కలల కాలము పట్టును.

2. ఆరంభము—మొదట ఎనిమిది దీర్ఘములు, తరువాత పన్నెండు లఘువులు, నాలుగు గురువులు, ఎనిమిది హ్రస్వములు, ఒక దీర్ఘము, ఎనిమిది లఘువులు రెండు దీర్ఘములు, చివర ఎనిమిది లఘువులు వరుసగాఉండును.

---

*[కాశీముద్రణమునందు 29వ అధ్యా—76-115 శ్లో: బొంబాయిముద్రణమునందు 29 వ అధ్యా—48-81 శ్లో.; బరోడా-29 వ అధ్యా-46-82 శ్లో.]

9. 'నిర్గీతవిధానసమయమును' అని బొంబాయి ముద్రణపాఠము. ఈ బహిర్గీత విధి 'పూర్వరంగ' మందును వివరింపబడినది. పుటలు 160-161 చూడవలెను.

మొదట మూడు కలల తాలము, ఒక కల శమ్యా, రెండు ఏకకలాతాలములు, ద్వికలమగుశమ్యా, ద్వికలమగు సన్నిపాతము ఇందు ప్రయుక్తములగును. మరియు ఇందు షట్పితాపుత్రకతాలమును లేదా చచ్చత్ (చంచత్) పుట తాలమును ప్రయోగించవలెను.

3. వక్త్రపాణి—ఇది ఆవిద్ధకరణయుక్తమును, ద్వ్యంగమును, అర్ధవ్యంజన ధాతుయుతమును అయియుండును.

ఇందు 5 గురువులు, 6 హ్రస్వములు, 4 గురువులు, 2 గురువులు, ఒక లఘువు, నాలుగు గురువులు, నాలుగు లఘువులు, మూడు దీర్ఘములు, ఎనిమిది లఘువులు, ఒక దీర్ఘము ఉండును.

ద్వికలమగు మద్రకమునందువలెనే ఇందును శమ్యా-తాలనిపాతన ముండును. ఇందు ఎనిమిది కలలుండును. శమ్యా-తాలము, తాలము-శమ్యా, తాలము, శమ్యా, తాలము, సన్నిపాతము అనునవి క్రమముగా ప్రయుక్తము కావలయును. తరువాత నాలుగు పంచపాణులను ప్రయోగించవలెను.

4. సంఘోటనము-ఇందు అతిదండమగు వీణెను దక్షిణాంగుళితోను, అంగుష్ఠములతోను వాయించవలెను. విస్తారధాతువు కరణసహితముగా ప్రయుక్తమగును. గురు-లఘు క్రమమున ఎనిమిది అక్షరములు, రెండు దీర్ఘములు, లఘువు, దీర్ఘము, లఘువు, నాలుగు దీర్ఘములు, ఎనిమిది హ్రస్వములు, చివర గురువు ఇందుండును. ఇందు పంచపాణి తాళమును ప్రయోగించవలెను.

5. పరిఘట్టన— ఇందు వ్యంజనధాతువు నానాకరణాశ్రయోపేతముగా ప్రయుక్తమగును.

ఇందు మొదట ఎనిమిది దీర్ఘములు, రెండు లఘువులు, రెండు గురువులు, రెండు లఘువులు దీర్ఘములు, పదునారు లఘువుల చివర గురువు ఉండును. ఇందు వాద్యము విస్తారావిద్ధకరణసంయుక్తముగా నుండును.

6. మార్గాసారితము—నాలుగు గురువులు, నాలుగు లఘువులు, ఎనిమిది గురువులు, ఎనిమిది లఘువులు, చివర గురువు ఇందుండును.

7. ఆసారితము—జ్యేష్ఠ-మధ్య-కనిష్ఠ భేదములచే ఇది మూడు విధములు. వీని తాలప్రమాణములు వెనుక నిర్దిష్టములైనవి. వాని తాలప్రమాణమును యథాక్రమముగా తాలవిధానమందు పేర్కొందును.

ఇంతవరకును వీణా - శరీరములకు సంబంధించిన స్వరగతమగు విధిని వివరించితిని. ఇంక సుషిరాతోద్యలక్షణమును వివరింతును.*

ఏకోనత్రింశాధ్యాయము సమాప్తము

---

*[కాశీముద్రణమునందు 29 వ అధ్యా—115-149 శ్లో; బొంబాయిముద్రణమునందు 29 వ అధ్యా—81-125 శ్లో. బరోడా ముద్రణము-29 వ అధ్యా-83-119 శ్లో.]

# అధ్యాయము 30[1]

## వేణువు[2]

[కాశీ ముద్రణమునందు 30 వ అధ్యా— 12 శ్లోకములును; బొంబాయి ముద్రణమునందు 30 వ అధ్యా—13 శ్లోకములును కలవు.]

వంశకృతమగు (వెదురుతో తయారు చేయబడిన) వాద్యమును 'సుషిరము' (వేణువు) అని అందురని తెలియవలెను.

ఆ వేణువునందు స్వర-గ్రామాదులు వీణావాద్యమునందువలెనే యుండును.

### స్వరములు

శ్రుతిసంఖ్యాభేదములచే సుషిరగతస్వరములు మూడు విధములుగానుండును— 1. ద్వికము, 2. త్రికము, 3. చతుష్కము. ఇవియే క్రమముగా 1. అర్ధాంగులి, 2. కంపమానాంగులి, 3. వ్యక్తముక్తాంగులి అని వ్యవహరింపబడుచుండును[3].

ఇందు వ్యక్తముక్తాంగులిస్వరము చతుశ్శ్రుతికము.

కంపమానాంగులిస్వరము త్రిశ్రుతికము.

అర్ధాంగులిముక్తస్వరము ద్విశ్రుతికము.

ఇందలి స్వరములు మధ్యమగ్రామమునందు అధికముగానుండును. వ్యక్తముక్తాంగులిచే షడ్జ-మధ్యమ-పంచమ స్వరములు జనించును. కంపమానాంగులిచే ధైవత-ఋషభములు వాయింపబడును. సర్వసాధారణములగు కాకలి-అంతర స్వరములనెడి స్వరములు కూడ కంపమానాంగులికృతములే.

నిషాద-గాంధారములును, షడ్జ-మధ్యమములును శ్రుతిలక్షణసన్నికర్షము వలన విపర్యయము చెందుచుండును.[4] వంశాశ్రితములైన ఈ స్వరములు వేణుదండ (పిల్లనగ్రోవి) గతములై యుండును. గీతము ఏ యే స్వరముల నాశ్రయించి నడచునో దానిని దానిని వంశముచే ప్రయోగించవలెను.

శరీరజన్య - వీణాజన్య - వంశజన్యములగు స్వరములకు ఏకతను కూర్చుట ప్రశంసనీయమగు విధి.

---

1. అన్ని ముద్రణములందును త్రింశాధ్యాయమే (30 వ అధ్యా.).
2. 'సుషిరాతోద్య విధాన'మని కాశీముద్రణపాఠము; 'సుషిరాతోద్యాధికార'మని బొంబాయిముద్రణపాఠము. 'సుషిరాతోద్యలక్షణము' అని బరోడా ముద్రణ పాఠము.
3. ఇచ్చట రెండు శ్లోకములు విడువబడెను. (కాశీ - 3 - 4 శ్లో).
4. ఇచ్చట 10 వ శ్లోకము విడువబడెను (కాశీ - పుట 342).

వేణువాద్యము అవిచలితము, అవిచ్ఛిన్నము, వర్ణాలంకారసంయుతము, మందము, లలితమధురమును అయి ఒప్పుచుండవలెను.

ఇంతవరకును సుషిరస్వరవిధిని వివరించితిని. ఇంక ఘనాతోద్య (తాలవాద్య) వికల్పనమును వివరింతును*.

త్రింశాధ్యాయము సమాప్తము

---

* [కాశీముద్రణమునందు 30 వ అధ్యా—1-12 శ్లో; బొంబాయిముద్రణమునందు 30 వ అధ్యా—1-13 శ్లో. బరోడా - 30 వ అధ్యా. 1-12 శ్లో.]

# అధ్యాయము 31[1]

## తాళములు[2]

[కాశీముద్రణమునందు 31 వ అధ్యా— 545 శ్లోకములును,
బొంబాయి ముద్రణమునందు 31 వ అధ్యా— 334 శ్లోకములును కలవు.
బరోడా ముద్రణమునందు 31 వ అధ్యా. - 378 శ్లో. కలవు.]

**కాలము : కల : లయ**

కలా-పాత-లయాన్వితమగు "తాల(ళ)ము" 'ఘన' మనబడును. తాళజ్ఞులు కాలప్రమాణమును తప్పక ఎరింగియుండవలెను. కాలము లోకమునందు కలా - కాష్ఠా - నిమేషాది భేదములచే వ్యవహరింపబడును. కాని, ఈ తాళమున పాటించు కాలము ఆ లౌకికమగు కాలముకాదు. ఇందలి మానము వేరుగానుండును— ఇందు అయిదు నిమేషములు ఒక మాత్ర. రెండు మాత్రలు ఒక కల. గీతకాలమందు అయిదు నిమేషములు కలాంతరమని తెలియవలెను.[3]

---

1. అన్ని ముద్రణములందును ఏకత్రింశాధ్యాయమే (31 వ అధ్యా.)

2. 'తాలవ్యంజక' మని కాశీముద్రణ పాఠము; 'తాలవిధాన' మని బొంబాయి ముద్రణ పాఠము; తాలాధ్యాయను' అని బరోడా ముద్రణము.

3. ఇచ్చట 'కాలము'ను తెలుపు శ్లోకము సరిగాలేదు. గోవిందకవి ఈ మానమును క్రిందివిధముగా నిర్దేశించెను. [ రాగతాళచింతామణి - పుటలు 176.177 ; తాళదశప్రాణదీపిక–పుటలు 11-12 ]

తమ్మిరేకులు నూఱు తగదొంతిగా నిల్పి
సూదిచే నదిగ్రుచ్చి చూడనెంత
కాలమౌ- నదిచూడ క్షణమనఁబరఁగును—

8 క్షణములు = 1 లవము
8 లవములు = 1 కాష్ఠ
8 కాష్ఠలు = 1 నిమిషము
8 నిమిషములు = 1 కల (ళ)
2 కలలు = 1 చతుర్భాగము
2 చతుర్భాగములు = 1 అనుద్రుతము ( = పాదమాత్ర = $\frac{1}{4}$ మాత్ర )
2 అనుద్రుతములు = 1 ద్రుతము ( అర్ధమాత్ర )
2 ద్రుతములు = 1 లఘువు ( ఏకమాత్ర )
2 లఘువులు = 1 గురువు ( ద్విమాత్ర )
3 లఘువులు = 1 ప్లుతము ( త్రిమాత్ర )

కలా - కాలకృతమగునదే 'లయ' అనబడును. లయ మూడువిధములు—ద్రుతము, మధ్యము, విలంబితము. వీనిలో 'మధ్య లయ' ప్రమాణలయ అనబడును. కల చిత్ర-వార్తిక-దక్షిణ మార్గములు మూడింటియందును మూడు విధములుగా నుండును. చిత్రమార్గమందు కల ద్విమాత్రకముగా నుండును. వార్తికమార్గమందు కల చతుర్మాత్రకముగా నుండును. ఇంక దక్షిణమార్గమందు కల అష్టమాత్రకముగ నుండును. ఈవిధముగా కల మూడువిధములుగా నుండును.

### తాలము

కలా-కాలప్రమాణముచే ఏర్పడునదే 'తాళ' మనబడును.[4] తాళము రెండువిధములు; ఈ రెండువిధములగు తాళములకును ప్రకృతి ఒక్కటియే—(1) చతురస్రము, (2) త్ర్యస్రము. చచ్చత్పుటము చతురశ్రతాలజాతికిని, చాచపుటము త్ర్యస్రతాలజాతికిని చెందియున్నవి. చతురస్రము చతుష్కలము, త్ర్యస్రము త్రికలము. చతురశ్రమగు చచ్చత్పుటమున మొదట రెండు గురువులు, తరువాత ఒక లఘువు, చివర ప్లుతము ఉండును. త్ర్యస్రమగు చాచపుటమున మొదట ఒక గురువు, తరువాత రెండు లఘువులు, చివర ఒక గురువు ఉండును.

ఈ చచ్చత్పుట-చాచపుటములు అనగా చతురస్ర-త్ర్యస్ర తాలముల కలయిక వలన 'మిశ్రతాళము' ఏర్పడుచున్నది. అది 'షట్పితాపుత్రకము' లేదా 'పంచపాణి' అని వ్యవహరింపబడుచున్నది. ఇందు మొదటిది ప్లుతము, రెండవది లఘువు, మూడు నాలుగులు గురువులు, ఐదు లఘువు, ఆరు ప్లుతము[5].

---

4. గోవిందకవి 'తాళము'ను క్రిందివిధముగా నిర్వచించెను—
హస్తతలమున వేఱొక్క హస్తతలము, నంటఁదాటించి క్రమ్మఱ హస్తమెత్త
నడుమ నెంతటికాలంబు నడిచె నదియ తాళరూపంబు....
—(రాగతాళచింతామణి - పుట 174.)
కరతలయుగ సంయోగ, స్ఫురిత వియోగములయందుఁ బొలుపొందెడు నా
చరకాల మెంతఁగలదో కరమది తాళంబటంచుఁ గల్పితమయ్యెన్.
—(తాళదశప్రాణదీపిక - పుట 9.)

5. ఈ తాళముల నామములే వానియందలి గురు – లఘు – ప్లుతాక్షరములను తెలియజేయునవిగా కూర్పబడినవి—

| | |
|---|---|
| 1. చం(ఽ) చ(ఽ) త్పు(।) ట(ఽ̂) | మొదటి రెండును గురువులు, మూడవది లఘువు, నాలుగవది ప్లుతము. |
| 2. చా(ఽ) చ(।) పు(।) ట(ఽ) | మొదటిది గురువు, తరువాతి రెండు లఘువులు, చివరిది గురువు. |
| 3. ష(ఽ̂) ట్పి(।) తా(ఽ) పు(ఽ) త్రి(।) క(ఽ̂) | మొదటిది ప్లుతము, తరువాత లఘువు, పిమ్మట రెండు గురువులు, అటుపిమ్మట లఘువు, చివరిది ప్లుతము. |



### తాల భేదములు

1. చచ్చత్పుటము (చంచత్పుటము)— ఇది తాల క్రియల(పాతముల) వలన మూడు విధములుగా నుండును—(1) సన్నిపాతము, శమ్య, తాళము, శమ్య అను క్రియలు కలది 'సన్నిపాతాది' అనబడును. (2) శమ్య, తాళము, శమ్య, సన్నిపాతము అను క్రియలు కలది 'శమ్యాది' అనబడును. (3) తాళము, శమ్య, సన్నిపాతము, శమ్య అను క్రియలు కలది 'తాళాది' అనబడును.

సన్నిపాతాదిచంచత్పుటతాలము నాట్యమునందును, శమ్యాదిచచ్చత్పుటతాలము ఆసారితములందును, తాలాదిచంచత్పుటతాలము పాణికాదులయందును ప్రయుక్తములగును.

2. చాచపుటము— చంచత్పుటమునందువలెనే ఇందును సన్నిపాతాది భేదములు మూడును ఉండును. ఈ మూడింటిలోను సన్నిపాతాది బలవత్తరము.

3. షట్పితాపుత్రకము—ఇందు క్రింది విధములగు 'పాతములు' ఆరు ఉండును— (1) సన్నిపాతము, (2) తాళము, (3) శమ్య, (4) తాళము, (5) శమ్య, (6) తాళము.

4. సంపక్వేష్టాకము—తాళాదియగు త్ర్యశ్రభేదము 'సంపక్వేష్టాకతాళ' మనబడును. ఇందు మొదటను చివరను ప్లుతములును, మధ్య మూడు గురువులును ఉండును. తాళము, శమ్య, తాళము, సన్నిపాతము, శమ్య అను అయిదు పాతము లిందుండును.

5. ఉద్ఘట్టము—ఇది త్ర్యస్రజాతికి చెందినది. ఇందు అన్నియును గురువులే. మొదట నిష్క్రామము, తరువాత శమ్య, మరల శమ్య అను మూడుపాతములు వరుసగానుండును.

తాళము యథాక్షరపాతముతో కూడి, ఏకకలము అయినచో 'శుద్ధము' అనబడును. గుర్వక్షరములను విశ్లేషము చేసి పాతములను కూర్చినచో-అది 'ద్వికల' మగును. ద్వికలము ద్విగుణమై 'చతుష్కల' మగును. ఇట్లు పాతభేదములచే కలిగెడి మూడేసి భేదములు మూడు తాళములయందును (చంచత్పుట - చాచపుట - పంచపాణులయందును) ఉండును.

పైనచెప్పిన తాళములే కాక సంకీర్ణతాళములు మరికొన్ని కలవు. అవి 5, 7, 9, 10, 11 కలలు కలిగియుండును. సప్తరూపమందు కాని, ధ్రువల యందు కాని వీని ఉపయోగము లేదు; నృత్తమందే ఇవి ఉపయుక్తములగును.

చతురస్రతాలము మూడు విధములుగా నుండును— 1. చతుష్కలము, 2. అష్టకలము, 3. షోడశకలము.

త్ర్యశ్రము ఆరు విధనులుగానుండును— 1. త్రికలము, 2. షట్కలము, 3. ద్వాదశకలము 4. చతుర్వింశతి (24) కలము, 5. అష్టచత్వారింశత్ (48) కలము, 6. షణ్ణవతి (96) కలము.

ఇట్లు చతురశ్ర-త్ర్యశ్ర తాళములు తొమ్మిది విధములుగా నుండును; దీనినే 'ఆయుగ్మ' మని వ్యవహరింతురు*.

తాలక్రియలు

ఈ తాళములందు చేయబడు క్రియలు నిశ్శబ్ద-సశబ్ద భేదములచే రెండు విధములుగానుండును—

1. నిశ్శబ్దక్రియలు—(1) ఆవాపము (2) నిష్క్రామము, (3) విక్షేపము, (4) ప్రవేశకము అను భేదములచే నిశ్శబ్ద క్రియలు నాలుగు విధములు.

2. సశబ్దక్రియలు—(1) శమ్య, (2) తాళము, (3) ధ్రువము, (4) సన్నిపాతము అను భేదములచే సశబ్ద క్రియలుకూడ నాలుగువిధములు.

1. ఆవాపము—సర్వాంగులి సవాక్షేపము (ఊర్ధ్వముఖముగా నెత్తబడిన హస్తము యొక్క నాలుగు వ్రేళ్ళను చూపుడువ్రేలు మొదలుగ ముడుచుట 'ఆవాప' మనబడును.)

2. నిష్క్రామము— పైని చెప్పిన ఆవాపమునందలి ముడిచిన వ్రేళ్ళను క్రమముగా విప్పుట 'నిష్క్రామ' మనబడును.

3. విక్షేపము—హస్తమును కుడివైపునకు విదలించుట 'విక్షేప'మనబడును.

4. ప్రవేశకము—విదలించిన హస్తమును అధోముఖముగా మరల స్వస్థానమునకు చేర్చుట ప్రవేశకమనబడును. చతుష్కలాప్రయోగమున పై నాలుగు నిశ్శబ్దక్రియలును ప్రయోగింపబడును. ద్వికలమున నిష్క్రామ - ప్రవేశకములు రెండుమాత్రమే ప్రయోగింపబడును.

సశబ్దక్రియలు నాలుగును 'పాతము' లనబడును. ఇవి రాగమార్గప్రయోజకములు.

1. శమ్య—ఎడమచేతితో కుడిహస్తముపై దెబ్బవేయుట 'శమ్య'అనబడును.

2. తాళము—ఎడమ హస్తముపై కుడిచేతితో దెబ్బవేయుట 'తాళము' అనబడును.

* [ కాశీ ముద్రణమునందు 31 వ అధ్యా—1-29 శ్లో; బొంబాయి ముద్రణము నందు 31 వ అధ్యా—1- 29 శ్లో. బరోడా - 31 వ అధ్యా. - 1-29 శ్లో.]



3. సన్నిపాతము—అభిముఖముగానుండు రెండు హస్తములతోను సమానముగా దెబ్బవేయుట 'సన్నిపాతము' అనబడును.

4. ధ్రువము— శబ్దమగునట్లు చిటికవేయుట 'ధ్రువ' మనబడును.

ధ్రువలయందలి తాలక్రియలు

ధ్రువలయందు షట్కలమగు త్ర్యస్రతాలము కాని, అష్టకలమగు చతురశ్ర తాలము కాని ప్రయుక్తమగును.

1. షట్కలమగు తాళమున సశబ్ద-నిశ్శబ్ద క్రియలు క్రిందివిధముగా నుండును—(1) కనిష్ఠాంగులితో నిష్క్రామము, (2) శమ్య, (3) తాళము, (4) శమ్య, (5) తర్జనీనిష్క్రామము, (6) సన్నిపాతము.

2. అష్టకలమగు తాలమున సశబ్ద-నిశ్శబ్దక్రియలు క్రిందివిధముగానుండును— (1) కనిష్ఠాంగులి నిష్క్రామము, (2) శమ్య, (3) కనిష్ఠానామికా నిష్క్రామము, (4) తాళము, (5) శమ్య, (6) మధ్యమాంగుళిప్రవేశకము, (7) తర్జనీకృత నిష్క్రామము, (8) సన్నిపాతము.

3. ఇంక ద్వాదశకలమగు తాళమునందలి సశబ్ద-నిశ్శబ్ద క్రియలు క్రింది విధముగా నుండును— (1) కనిష్ఠాంగులినిష్క్రామము, (2) కనిష్ఠానామికా ప్రవేశము, (3) తాళము, (4) శమ్య, (5) మధ్యమాంగుళికృతనిష్క్రామము, (6) తాళము, (7) తర్జనీకృతనిష్క్రామము, (8) శమ్య, (9) తాళము, (10) కనిష్ఠికాప్రవేశకము, (11) తర్జనీనిష్క్రామము, (12) సన్నిపాతము.

కనిష్ఠాసారితమున చంచత్పుటమును, ద్వివిధమగు పంచపాణిని ప్రయోగించవలెను. రెండు విధములైన పంచపాణి యందలి క్రియలు క్రిందివిధముగానుండును—

1 వ పంచపాణి— (1) సన్నిపాతము, (2) తాళము, (3) శమ్య, (4) తాళము, (5) శమ్య, (6) తాళము.

2 వ పంచపాణి—(1) శమ్య, (2) తాళము, (3) తాళము, (4) శమ్య, (5) తాళము, (6) సన్నిపాతము.

'చంచత్పుట' శబ్దముననుండు నాలుగుఅక్షరముల చేతను వరుసగా శమ్యా-తాళ-శమ్యా-తాళములు సూచితములగును. పంచపాణి పర్యాయమగు షట్పితాపుత్రకమను పదమునందలి 'షట్' అనుదానిచే సన్నిపాతము, 'పి' అనుదానిచే తాళము, 'తా' కారముచే శమ్య, 'పు' అనుదానిచే తాళము, 'త్ర' కారముచే శమ్య, 'క' కారముచే తాళమును సూచితములగును. ఇక రెండవ విధమగు పంచపాణి యందు మొదట సన్నిపాతమునకు బదులు చివర సన్నిపాతముండును[6].

6. కాశీముద్రణమునందలి పుట 347 లోని 3 శ్లోకములు (57-58 శ్లో) విడువబడెను.

ఇది యథాక్షరపాతవిధానము. కనిష్ఠాసారితమునందలి గుర్వక్షరవిశ్లేషము వలన కళలధికమగుటచే మధ్యమాసారితమున పాతము అధికమగును. జ్యేష్ఠాసారితము మధ్యమాసారితమందలి కళల కంటె రెట్టింపు కళలను కలిగియుండును...[7]

ఆసారితాంగములు

ఇంక ఆసారితముల ప్రస్తారలక్షణమును చెప్పుదును. ప్రతి ఆసారితమునందును ముఖము, ప్రతిముఖము, దేహము, సంహరణము అనెడి నాలుగు అంగము లుండును. ఆసారితమున ఉపోహనము ముఖమనబడును. యుగ్మము ప్రతిముఖమనబడును. ఓజము దేహ - సంహరణములనబడును. ఇది అంగవిధిక్రమము. ఇట్లు ఆసారితము నాలుగు అంగములను కలిగియుండును.

ఇందు ముఖమున తాలములు ధ్రువ - పాతములతో నియమితములై యుండును. వానికి సంబంధించిన కలా - మాత్రా - అక్షర - గురు - లఘు - వర్ణ విభాగమును వివరింతును—

జ్యేష్ఠాసారితము నందలి ముఖమున 8 కలలును, మధ్యమాసారితమునందలి ముఖమున 7 కలలును, లయాంతరమునందలి ముఖమున 6 కలలును, కనిష్ఠాసారితమునందలి ముఖమున 5 కలలును ఉండును.

ఆసారితక—ఉపోహనముల ఆద్యంతములందు రెండేసి గురువులును, మధ్య లఘువులును ఉండును. అవి 8 లేదా 12 లేదా 16 లేదా 20 అక్షరములుగా ఉండును. ఉదా: "కూహలం జగతి యది గిని గిజహలం"

కనిష్ఠాసారిత యుగ్మము (ప్రతిముఖము) నందు నాలుగు గణములును, ఓజమున మొదటి భాగమున (దేహమునందు) ఆరు గణములును, ఉత్తరభాగమున (సంహారణమునందు) ఆరున్నర గణములును ఉండును. (ఇందు గణము అనగా 4 మాత్రలు కలది). ఇది ద్వితీయ పంచపాణి తాళమున నుండును. ఉదా:

దేవం దేవైః సంస్తుత మీశం (ప్రతిముఖము - 4 గణములు)

దైత్యైః యక్షైః నాగైః పితృభిః ప్రణమిత చరణం (దేహము - 6 గణములు)

---

7. (1) ఇచ్చట కాశీముద్రణమునందలి పుటలు 347-348 లోని 9 శ్లోకములు (67-75 శ్లో.) విడువబడెను.

(2) కాశీముద్రణమునందలి పుటలు 348-355 లోని వందశ్లోకములు (76-168 శ్లో) 24 వ అధ్యాయమునందుకూడ కలవు. ఇవి బరోడాముద్రణమునందు 22 వ అధ్యాయమందున్నవి.(178-278 శ్లో.) నేను వీటిని అచ్చటనే అనువదించితిని; పుటలు 673-680 చూడవలెను.

(3) కాశీముద్రణమునందలి పుటలు 355-356 లోని 22 శ్లోకములు (169-192 శ్లో) ఇచ్చట విడువబడెను.



త్రైలోక్యహేతు మీశం రుద్రం శరణమ హముపగ తః॥ 201

(సంహరణము - 6½ గణములు)

మధ్యమాసారితమున చంచత్పుటతాళమున యుగ్మమున ఎనిమిది గణములును, షట్పితాపుత్రకతాళమున ఓజమున మొదటి భాగమున (దేహము నందు) 12 గణములును, ద్వితీయ భాగమున (సంహారణమునందు) 12½ గణములును ఉండును. ఉదా:

భూతా ధిపతిం భగనే త్రహరం దేవై ర్వేద్యం సురవర మథనమ్

(యుగ్మము - 8 గణములు)

రౌద్రం భయదం గజచ ర్మవృతం శంభుం త్ర్యక్షం జ్వలనని భజటం భుజగ పరికరం— (దేహము - 12 గణములు)

త్రిదశగ ణవృతం దైత్యై ర్నిత్యం పరిపఠి తచరిత మమరప

తినమిత మభిమత సుఖదం శరణం సురనత చరణమ హముపగ తః॥ 204

(సంహరణము - 12½ గణములు)

జ్యేష్ఠాసారితమున చంచత్పుటతాళమున యుగ్మమున 16 గణములుం డును. ఓజమున ప్రథమభాగమున 24 గణములును, ద్వితీయభాగమున 24½ గణములును ఉండును. ఉదా:

1 2 3 4 5 6 7 8 9
అమర ప్రవరం మదనాం గహరం భువనై కనాథ మభయ ప్రదంత్రి పురాంత

10 11 12 13 14 15 16
కం దే వంతమ హంప్రణ తఃసుర గణపితృ మునినత చరణం।

1 2 3 4 5 6 7 8 9 10
పృథివీ సలిలా నలఖై రవరూ పంఖ ట్వాంగధ రంపవ నస్యూ ర్యశ్చం ద్రోయ

11 12 13 14 15 16 17 18 19
జ్ఞాధిప తిరో ర్వ్యా మాఖ్యా అష్టా మునిభిః యస్యను తాః త్రై లోక్యగు రుమచిం

20 21 22 23 24
త్యమజం విద్యా నిలయం భైరవ రూపం॥

1 2 3 4 5 6 7 8 9
నూష్మా క్షుమచిం త్యంచం ద్రార్ధధ రమ్త్రిక లధరం నేత్రా ర్ధధరం ముంచా

10 11 12 13 14 15 16 17 18
ర్ధధరం కాంతా ర్ధధరమ్ బహులై ర్వివిధై ర్వివృతై ర్వికటై ర్ముం డై ర్వివుఖై

19 20 21 22 23 24
ర్విషమైః ప్రమథైః పరివృత మహమీ శంసత తంప్రణ తః॥[8] 207

ఆసారితములన్నింటియందును యథాక్షరము, ద్విసంఖ్యాతము, త్రిసంఖ్యాతము అను మూడు భేదములు కలవు—

1. యథాక్షరము— ద్విగుణితసమవర్ణగణములు, కాలచ్ఛేదములు, అనివృత్తాక్షరపదము గల ఆసారితము 'యథాక్షరాసారిత' మనబడును.

---

8. ఇందు ముద్రణదోషములున్నవి; లక్షణమునకు సరిపెట్టబడెను.

2. ద్విసంఖ్యాతము— పై దానివలెనే ఉండి నివృత్తిసహితమైనది 'ద్విసంఖ్యాతాసారిత' మనబడును.

3. త్రిసంఖ్యాతము—యథాక్షరము వలెనే ఉండి నివృత్తిద్వయసంపన్న మైనది 'త్రిసంఖ్యాసారిత' మనబడును.

శాస్త్రోక్తముగ గురు - లఘువులతో కూడిన గణములను చతుర్మాత్రక ములుగ గీతములయందును, ఆ సారితములయందును కూర్చవలెను. అక్షరములను బట్టి చతుర్మాత్రకమగు గణము వర్ణములనుబట్టి ద్విమాత్రకమగును.

చిత్రమార్గమునందలి 'కల' వార్తికమార్గమున ద్విగుణితమగును. వార్తిక మార్గమునందలి కల చతుర్మాత్రకముగా చెప్పబడెనుకదా. ఆ వార్తికమునకు ద్విగుణముగా అనగా 8 కలలు దక్షిణమార్గమునందుండును. అక్షరములయందు మార్గభేద మెట్టిదియును ప్రసక్తము కారాదు. అక్షరమాత్రలను రెట్టింపు చేయుటచే వర్ణభేదము కలుగును.

ఇది గీత - ఆసారితములందలి వర్ణ - తాలసమాశ్రయమగు యథాక్షరవిధి. యథాక్షరమునందలి మొదటి అర్ధమున నివృత్తి కలిగినచో అది ద్విసంఖ్యాతమును, రెండవ అర్ధమునకూడ నివృత్తి కలిగినచో అది త్రిసంఖ్యాతమును అగును. వార్తిక మార్గమునందు త్రిసంఖ్యాతమును గీత - ఆసారితములం దెన్నడును ఉపయోగించ రాదు. చిత్రమార్గమున ద్విసంఖ్యాత - త్రిసంఖ్యాతములను ఉపయోగించరాదు.

చిత్రమార్గమున యథాక్షరమును, వార్తిక మార్గమున ద్విసంఖ్యాతమును, దక్షిణమార్గమున త్రిసంఖ్యాతమును ప్రయోగించవలెను.

గీతాదియందు త్రిసంఖ్యాతమున ముందుగా దక్షిణమార్గమున నడిచి నివృత్తి యందు వార్తికమార్గమున కాని, చిత్రమార్గమున కాని యథాన్యాయముగ ప్రయుక్తము కావలెను. ద్విసంఖ్యాతము కూడ వార్తిక - దక్షిణమార్గములందు ప్రయుక్తమగును.

గీత - ఆసారితములందు నివృత్తిని వస్త్వాదియందు కాని, వస్తుమధ్యమున కాని, వస్త్వంతమున కాని అంగబలాబలములను విచారించి ప్రయోగించవలెను. వర్ణ - అలంకారముల సౌభాగ్యము, కరణవిచ్ఛేదము, తత్త్వాద్యుల ప్రయోగము అను వానిని అభివ్యక్తము చేయుటయే నివృత్తుల ప్రయోజనము.

ఇంతవరకును గీత - ఆసారితములందలి వర్ణ - తాల - అక్షర సంయోగమును వివరించితిని.*

---

* [ కాశీ ముద్రణమునందు 31 వ అధ్యా—192–224 శ్లో; బొంబాయి ముద్రణ మునందు 31 వ అధ్యా— శ్లోకములు వరుసగాలేవు. బరోడా - 30-68 శ్లో.]



వర్ధమానకము

ఆసారితముల సంయోగము 'వర్ధమానక' మనబడును. ఆ వర్ధమానకము యొక్క ఉత్పత్తిని, ప్రయోజనమును వివరింతును.

మహాతేజశ్శాలియగు రుద్రుడు దానవసంహార మొనర్చి, చిత్ర - తాండవ సంజ్ఞితములగు రెండు నృత్తములను సృజించెను. ఆ సమయమున మహాత్ములగు భూతములు పిండీబంధములతో విభూషితమగు ఈ వర్ధమానకమును సృజించిరి. దానిని చూచి సంతుష్టుడై పత్నీసహితుడగు వృషధ్వజుడు ఇట్లు వరమిచ్చెను—

"లక్ష్యలక్షణ సంయుక్తముగ వర్ధమానకమును ప్రయోగించువారు శివగౌరవ మును పొందుదురు.'

ఈ విధముగా, పూర్వము, పిండీబంధసహాయకమగు వర్ధమానకము సృజింప బడెను. దీని లక్షణము నిపుడు వివరింతును.

వర్ధమానకమున ప్రయోగింపబడు కండికలు (కంటకములు - కాశీముద్రణ పాఠము) నాలుగు విధములు—(1) విశాల, (2) సంగత, (3) సునంద, (4) సుముఖ.

విశాలకు నాలుగు కలలును, సంగతకు ఎనిమిది కలలును, సునందకు 16 కలలును, సుముఖకి 32 కలలును ఉండును.

శమ్య, తాలము, శమ్య, తాలము, త్రికలసన్నిపాతము అనునవి విశాల యందుండును.

సంగతయందు ద్వికలాచంచత్పుటతాళము ప్రయుక్తమగును.

పై కండికల ఉపోహనవిధి నిప్పుడు వివరింతును. ఈ నాలుగు కండికల యందును ఉపోహనములు వరుసగా 5, 6, 7, 8 కలలు కలిగియుండును. ఇంక ఈ కండికల ఉపోహనములందలి గురు - లఘ్వక్షరక్రమమును వివరింతును—

1. విశాల—ఇందలి ఉపోహనమున మొదట 2 గురువులు, తరువాత 14 లఘువులు, చివర 1 గురువు ఉండును.

2. సంగత—ఇందలి ఉపోహనమున మొదట 2 గురువులు, తరువాత 18 లఘువులు, చివర 1 గురువు ఉండును.

3. సునంద— ఇందలి ఉపోహనమున మొదట 2 గురువులు, తరువాత 22 లఘువులు, చివర 1 గురువు ఉండును.

4. సుముఖ—ఇందలి ఉపోహనమున 2 గురువులు, 26 లఘువులు, 1 గురువు ఉండును.

స్థాయిస్వరసమాశ్రయమగు ఈ ఉపోహనమున స్వరములు ఉపోహితము లగుచు తదనుసారియగు గీతమును ప్రవర్తింపజేయును కాన ఇది 'ఉపోహన' మనబడును. లేదా సూచనాదులచే ప్రయోగము వహింపబడును కాన ఇది ఉపోహన మనబడును. ఇది గాన-భాండసమాశ్రయమై యుండును.

విశాలోపోహనమున శమ్యా, తాళము, శమ్యా, తాళము, సన్నిపాతము అను క్రియలుండును.

సంగతోపోహనమున ద్వికలా చంచత్పుటతాళమును ప్రయోగించవలెను.

సునందయందు పైసంగతలోని తాళమునకు చివర సన్నిపాతమును చేర్చవలెను.

సుముఖ్యుపోహనమున ద్వికలచంచత్పుటతాళమును ప్రయోగించవలెను.

ఇంక వీని అనుపూర్వీప్రయోగమును వివరింతును— కనిష్ఠాసారితమున విశాలను మొదట చంచత్పుటతాళమునందు ప్రయోగించవలెను. లయాంతరము నందు సంగతయందలి గ్రహమును గ్రహించి మరల విశాలను ఆచరించవలెను. చంచత్పుటతాళమును ఇందు కూర్చవలెను.'

ఆసారితములలో కనిష్ఠాసారితమున 9 కళలును, లయాంతరమున 17 కళలును, మధ్యమాసారితమున 33 కళలును, జ్యేష్ఠాసారితమున 65 కళలును ఉండును. [పుట 124 లోని 32 వ అధస్సూచికను చూడవలెను]

ఇందు కళలు, అక్షరములు, లయ అనునవి వృద్ధిపొందుటనుబట్టి దీనికి 'వర్ధమానక' మను పేరువచ్చెను. మరియు, వర్ణ - తాల - లయ - గ్రంథ - వాద్య - అభినయ - పాత్రముల వర్ధనమును (అభివృద్ధిని) బట్టి దీనికి 'వర్ధమానక' మను పేరు కలిగెను. [పుట 122 కూడ చూడవలెను]

వర్ధమానశరీరమునకును, ఆసారితమునకును పరస్పరము కార్య - కారణ భావము బీజాంకుర న్యాయముగ ఒప్పుచుండును.

సప్తగీతకములు

ఇంకగీతకముల లక్షణమును వివరింతును. సమస్తగీతముల వస్తువులయందును, అవయవముల యందును వివ(వి)ధము, ఏకకము, వృత్తము అను మూడంగము లుండును. ఒక విదారి ఉన్నచో 'ఏకక' మనియు, రెండు విదారులు కలది 'వివి(వ)ధ' మనియు, మూడు మొదలు ఆరు వరకును విదారులు కలది 'వృత్త' మనియు చెప్పబడును.

9. కాశీముద్రణము నందలి పుటలు 361-362 లోని 13 శ్లోకములు (248-260 శ్లో) ఇచ్చట విడువబడెను.



పదవర్ణసమాప్తి 'విదారి' అనబడును. పదమధ్యస్వరమును చీల్చునది కాన ఇది 'విదారి' అనబడినది.

న్యాస - అపన్యాస - అంశములు మూడింటితో కూడియుండునది 'వృత్త' మనబడును.

వివధ-ఏకకములు మద్రకగీతములందును, వస్తువు (వృత్తము) ప్రకర్యగీతము నందును, రోవిందకార్ధపాదమునందును ఉపయుక్తములగును.

రోవిందక-ఉత్తర-ఉల్లోప్యకగీతములందు వృత్తము (వస్తువు) ఉండును.

పాణికా-బహిర్గీత-లాస్యములందు ప్రవృత్తము, అవగాఢము అను భేదములచే వృత్తము రెండు విధములు. ఆరోహణము కలది అవగాఢమనబడును; అవరోహణము కలది ప్రవృత్త మనబడును. ఇందు ఆరోహణావరోహణము న్యాసాపన్యాసకృతము, మార్గాంతరకృతము అనెడి భేదములచే రెండు విధములు. ఇందు 3 మొదలు 11 వరకును విదారులుండును. ఈ విదారులు 24 వరకును ఉండుట పరమప్రమాణము.

వివధము మూడు విధములు— (1) సాముద్గము, (2) సముద్గము, (3) వివృత్తము.

మద్రకగీతమునందు సాముద్గము ఉపయుక్తమగును....[10]

ఇంక గీతము ఏడు విధములు— (1) మద్రకము, (2) అపరాంతకము, (3) ప్రకర్యము (ప్రవర్యము లేదా ప్రతర్యము), (4) రోవిందకము, (5) వేణకము (వైణకము), (6) ఉల్లోప్యకము, (7) ఉత్తరము.

1. మద్రకము— ఇది రెండు విధములు. (1) చతుర్వస్తుమద్రకము, (2) త్రివస్తుమద్రకము. ఈ త్రివస్తువు శీర్షకముతో కూడియుండును.

2. అపరాంతకము—ఇందు శీర్షకసహితముగా 5, లేదా 6, లేదా 7 వస్తువులుండును.

3. ప్రకర్యము—ఇందు 4 లేదా 3½ వస్తువులుండును.

4. రోవిందకము—ఇది సప్తాంగముగా లేదా షోడశాంగముగా నుండును. ఇందు సమవర్ణములు గల రెండుపాదములు ఉండవలెను. ప్రవృత్తమును, వివధమును దీని మొదట ప్రయోగించవలెను. తరువాత దేహమును, పిమ్మట అంగములను యథాయోగ్యముగ నుంచవలెను. దేహమును మధ్యాంతములందును, చివర శీర్షకమును తప్పక ప్రయోగించవలెను.

10. కాశీముద్రణము నందలి పుటలు 363-64 లోని 7 శ్లోకములు (280-286 శ్లో) ఇచ్చట విడువబడెను.

5. వేణకము—ఇది సప్తాంగముగా లేదా ద్వాదశాంగముగా నుండును. ఇందు 12 అంగము లుండును—(1) పాదము (ప్రస్తారము), (2) సంధి, (3) మాషఘాతము, (4) వజ్రము, (5) సంవిష్టకము, (6) శీర్షకము, (7) చతురశ్రము, (8) ఉపవర్తనము, (9) ఉపపాతము, (10) ప్రవేణి, (11) ద్వ్యంగము, (12) సంహారణము. ఇందలి సంవిష్టక-ఉపపాత-ప్రవేణీ-పాద-ఉపవర్తనములు తగ్గినచో మిగిలినవాటితో కూడి ఇది సప్తాంగమగును. ఇందు సప్తాంగము తుల్యవర్ణపదముగను, ద్వాదశాంగము భిన్నపదముగను ఉండును. ఈ అంగవిధానమే ఉల్లోప్యకము నందును వర్తించును.

మరియు వైణకము ద్వ్యంగకముగా, త్ర్యంగకముగా, ఏకాంగకముగా కూడ నుండును.

సితము (స్థితము లేదా అవగాఢము), ప్రవృత్తము, మహాజనికము అను మూడంగములతో కూడిన 'త్ర్యంగ'మగును.

మహాజనికమును విడిచి స్థిత-ప్రవృత్తములతో కూడిన అది 'ద్వ్యంగక'మగును. ఇంక మహాజనికము మాత్రమే ఉన్నచో అది 'ఏకాంగక' మగును.

వేణకమునందలి సంహారము ఏకాంగకము కాని, ద్వ్యంగకముకాని అగును. మరియు అందు ఒక విదారికాని, రెండు విదారులుకాని ఉండవచ్చును.

6. ఉల్లోప్యకము—ఇందు 6 మొదలు 20 వరకును అంగములుండును; మరియు ఇందు ముఖ-ప్రతిముఖ-సంహారణములుండును. ఇది వైహాయసిక సంయుక్తముకాని, తద్రహితముకాని అగును. ఉల్లోప్యక-ఉత్తరగీతములందు ముఖ-ప్రతిముఖములుండును. ఈముఖ-ప్రతిముఖములందు వివధమును, ప్రతిముఖమునందు వృత్తమును ఉండును. ఇంతియేకాక ఉల్లోప్యక-ఉత్తర-అపరాంతకములందు శాఖ-ప్రతిశాఖలుండును. ఇందు తుల్యవర్ణపదములును, అన్యపదములును కూడ ఉండును.

7. ఉత్తరము—ఇందు 6 అంగములు మొదలు 12 అంగములవరకును ఉండును. దేహ-పాదములు తప్ప మిగిలినవానియందు రోవిందకముతో సమానముగా నుండును. దీని చివర తప్పక శీర్షకమును కూర్చవలెను.

పై విధముగా సప్తగీతములందును అంగవిధానము నెరుంగవలెను.

ఇంక గీతములందలి వస్తుకల్పనమును వివరింతును.[11]

---

11. వస్తువికల్పనమునకు సంబంధించిన శ్లోకములలో (కాశీముద్రణమునందు 308-413 శ్లో.) చాలభాగము అర్థము కాలేదు. తెలిసిన వాక్యములు అచ్చటచ్చట అనువదింపబడెను.



### వస్తువికల్పనము

అన్ని వస్తువులయందును 16 కలలు ఒక 'మాత్ర' అని చెప్పబడును. ఆమాత్రయొక్క నాలుగవ భాగమే (=4 కలలు) 'పాదభాగ' మని చెప్పబడును. పాదమునకు మొదట 8 గురువులను, తరువాత 8 లఘువులను ఉంచవలెను. అందు మొదట రెండు గురువులయందును ఉపోహనమును కావించవలెను. మూడవ గుర్వక్షరమున ప్రత్యుపోహనమును, నాలుగైదు గుర్వక్షరముల శమ్యలును, ఆరేడు గుర్వక్షరముల రెండు తాలములును, అష్టమగుర్వక్షరమున శమ్యయును ఉండును.

గుర్వక్షరములందలి పాతములు ఒక కల ప్రమాణము కలవిగాను, ఇంక లఘ్వక్షరములందలి పాతములు అర్ధకలాప్రమాణము కలవిగాను ఉండును. లఘువులందు శమ్య, తాలము, శమ్య, తాలము, శమ్య, తాలము, సన్నిపాతము అను ఈ ఎనిమిది పాతములను ప్రయోగించవలెను.

దీనిపైన చాచపుటతాళముతో శీర్షకమును ప్రయోగించవలెను. మద్రకగీతమునందు ఈవిధముగ ఏకకలమగు తాలము నెరుంగవలెను. పై మద్రకగీతమున గురువులను విశ్లేషించుటచే ద్వికలతాళము ఏర్పడును.

ద్వికలమద్రకమున ఉపోహనము త్రికలముగా నుండవలెను; ఇంక ప్రత్యుపోహనము ద్వికలముగా నుండవలెను. ద్వికలములగు గుర్వక్షరములచే పాదభాగములను ప్రయోగించవలెను. నాలుగు పాదభాగములు ఒక 'మాత్ర' అగును. మూడు మాత్రలు ఒక వస్తువు. ఈ ద్వికల మద్రకమునందు అట్టి వస్తువులు మూడు ఉండును. ఇది ద్వికల మద్రకమునందలి పాదవిధి. ఉపోహన-ప్రత్యుపోహనములయిన తరువాత గుర్వక్షరములందు చెప్పబడిన శమ్యా-తాలాది పాతములే ఈ ద్వికల మద్రకమునందును ప్రయుక్తములగును. ద్వికలమద్రకగీతమున 8, 10, 12, 14, 16, 18 కళలు శమ్యలు; తక్కినవి తాళములు. లఘ్వక్షరపాతములు వెనుకటి ఏకకల మద్రకమునందువలెనే ఉండును. ఇట్లు పాతవిధిని ద్వికలములగు మూడు వస్తువులయందును ప్రయోగించవలెను. తరువాత పంచపాణితాళమున షట్కలమగు శీర్షకమును ప్రయోగించవలెను.

ఇంక చతుష్కలమద్రకవిధిని వివరింతును— 4, 5, 8, 10, 11, 19 కళలందు శమ్యలుండును. 2, 6, 7, 9 కళలందు తాళములును, 12 వ కళయందు సన్నిపాతములును ఉండును. ప్రథమవస్తువునందు మొదటి ఎనిమిదికళలును ఉపోహనము. ఇంక ప్రత్యుపోహనము ద్వితీయవస్తువునందు ద్వికలము, తృతీయవస్తువునందు చతుష్కలము అగును. దీని చివర షట్పితాపుత్రకతాళమున శీర్షకమును కూర్చవలెను.

అపరాంతకగీతమున 4 గుర్వక్షరములును, 4 లఘ్వక్షరములును ఉండును. మూడవ గురువునందు శమ్య, 4 వ గురువునందు తాళమును ప్రయోగించవలెను. లఘువులందు తాళము, శమ్య, తాళము, సన్నిపాతము అనెడి ఈ నాలుగు అంగములను ప్రయోగించవలెను. ఈ అపరాంతకగీతము త్ర్యశ్రతాళసముద్భవము; ఇదికూడ గురువిశ్లేషమునలన ద్వికలమగును. ఇందు మొదటి రెండు కలలును ఉపోహనము, తరువాతి కల ప్రత్యుపోహనము. చతుష్కలమున ఉపోహన - ప్రత్యుపోహనములు దీనికి ద్విగుణములుగా నుండును.

ఉల్లోప్యకమునందు మొదట రెండు గురువులు, తరువాత 2 లఘువులు, అంతమున గురువు ఉండును. ఇందు శమ్య, తాలము, శమ్య, తాలము, సన్నిపాతము అను క్రియలుండును. ఇది చతురశ్రతాలమునందుండును. ఇదికూడ పూర్వోక్త విధానమున ద్వికలముగను, చతుష్కలముగను కూడ ఉండును. ఇందు ఒక అంగము మొదలు 12 అంగముల వరకును ఉండును. ఇది ద్వాదశకలాప్రమాణము కలదై సప్తపాతములను కలిగియుండును. 2 కళల శమ్య, 2 కళల తాలము, 2 కళల శమ్య, 2 కళల తాళము, 2 కళల శమ్య, ఒకకళ తాళము, ఒకకళ సన్నిపాతము ఇందుండును. యథాక్షరముగా పంచపాణితాళమున దీనిని ప్రయోగించవలెను. ఈ గీతము ద్వివిధనివృత్తములు కలదిగను, మూడు అంగములు కలదిగను, త్ర్యశ్ర - చతురశ్ర - మిశ్రతాళోపేతముగను ఉండును.

ఆవేణకమున పడంగములుండును. రెండు శమ్యలు, రెండు తాళములు కలిగినదై ద్వాదశాంగము కూడ నగును. ఇందు 9 లేదా 11 పాతములుండును; మరియు వజ్రము, సంపిష్టకము, ఉపవర్తనము, ప్రవేణి అనెడి అంగములు నియతముగా నుండును. ఇది వివధ-వృత్తములను కలిగియుండును. దీనిని అంగానుగుణముగా, ద్వికలముగా మిశ్రతాళమునందు ప్రయోగించవలెను. ఉపవర్తనాంగమును పంచపాణితాళమున ప్రయోగించవలెను. త్ర్యస్రతాళమున ఉపపాతమును, వజ్రమును, అంతాహరణమును ప్రయోగించవలెను.

రోవిందకమునందు చతుష్కలమగు పాదభాగమునకు ఆరుమాత్రలుండును; తాళము, శమ్య, తాళము, శమ్య, తాళము, శమ్య అను ఆరుపాతములుండును. ఇది ఐదుమాత్రలు కలదిగాకూడ నుండును. దానియందును పాతము లివియే. ఇందు ఎనిమిది కళలుండును. మొదటి కళయందు ఉపోహనము, రెండవ కళయందు ప్రత్యుపోహనము ఉండును. మరియు నది వివధ - ఏకకయోజితమును, సన్నిపాతాంతమును అగును.*

* [కాశీముద్రణమునందు 31 వ అధ్యా—225-414 శ్లో; బొంబాయి ముద్రణమునందు 31 వ అధ్యా— శ్లోకములు వరుసగాలేవు. బరోడా - 69-320 శ్లో.]



ఈ సప్తరూపము అనగా సప్తగీతముల ప్రకృతి కులక-ఛేద్యక భేదములచే రెండు విధములు. ఏకార్థకము 'కులకము' అనబడును. పృథగర్థము 'ఛేద్యకము' అనబడును. నిర్యుక్తము, అనిర్యుక్తము, పదనిర్యుక్తము అని సప్తరూపగీతములు మూడు విధములు. బహిర్గీతాంగశాఖాయుక్తము 'నిర్యుక్త' మనబడును. బహిర్గీత విహీనము 'పదనిర్యుక్త' మనబడును. బహిర్గీతాంగహీనము 'అనిర్యుక్తము' అనబడును. గీతము పుణ్యమును, అనంతమును, దేవతారాధకమును అగుచున్నది. ఇట్టి సప్తరూపగీతము బ్రహ్మచే చెప్పబడినది. సప్తగీతములకును అంతమున 'ఛందకము'ను ప్రయోగించవలెను. ఛందకము చతురంగము, నవాంగము, త్ర్యంగము అగును—[12]

గాయక-వాదక లక్షణము

> యస్తు తాలం న జానాతి న స గాతా న వాదకః।
> అంగభూతా హి తాలస్య యతిపాణిలయాదయః॥ 530

—తాళము నెరుంగనివాడు గాయకుడు కాని, వాదకుడు కాని కానేరడు.[13] తాళమునకు యతి - పాణి - లయాదులు అంగభూతములు.

లయలు

ద్రుత - మధ్య - విలంబిత భేదములచే లయలు మూడు విధములు. గీత - వాద్యోభయాత్మకము లగు ఈ లయలు చిత్ర-వార్తిక-దక్షిణమార్గములం దభివ్యక్తము లగును. కలా-కాలాంతరకృత మగు గాన-వాద్య-సామ్యము 'లయ' అనబడును.

యతులు

లయసంశ్రయము లగు యతులును మూడు విధములు—సమ, స్రోతోవహా, గోపుచ్ఛ. ఆద్యంతమధ్యములందు సమానముగా నుండునదియును, వాద్యప్రధాన భూయిష్ఠమగునదియును 'సమయతి'. ఇది చిత్రమార్గమునందు ప్రయుక్తమగును. కొన్నిచోట్ల సూక్ష్మముగా నుండి నిలుకడను, కొన్నిచోట్ల అసమృద్ధమై త్వరిత గమనమును కలిగియుండునది 'స్రోతోవహాయతి'. ఇది వార్తికమార్గమున ప్రయుక్త

12. కాశీముద్రణములోని పుటలు 374-381 ల లోని 110 శ్లోకములు (420-529 శ్లో.) ఇచ్చట విడువబడినవి. ఈ భాగమందు లాస్యాంగముల ప్రయోగము సవిస్తరముగా చెప్పబడెను. కాని శ్లోకములు సుస్పష్టములుగా లేవు. లాస్యాంగముల నిర్వచనములు 19 వ అధ్యాయమందు కలవు. పుటలు 580-583 చూడవలెను.

13. గాయకలక్షణమునకు 33 వ అధ్యాయమును చూడవలెను.

మగును. గురులఘ్వక్షరకృతమై, గోపుచ్ఛాకారమున నుండునదై, విలంబితలయ భూయిష్ఠమై యుండునది గోపుచ్ఛయతి. ఇది దక్షిణమార్గమున ప్రయుక్తమగును.

పాణులు

సమపాణి-అవపాణి-ఉపరిపాణి అను భేదములచే పాణులు మూడు విధములు.

ఈ యతి-పాణి-లయలు గీతియోగము ననుసరించి కలాప్రమాణాను సారముగా ప్రయోగింపబడవలెను.

పైవిధముగా గానమునందు ధ్రువా-తాలవిధిని అనుసరించవలెను. ఇంక ధ్రువలయొక్క అంగకల్పనమును వివరింతును.*

ఏకత్రింశాధ్యాయము సమాప్తము

---

* [ కాశీముద్రణమునందు 31 వ అధ్యా—530-545 శ్లో. బరోడా ముద్రణమునందు - 31 వ అధ్యా. - 321-29; 368-78 శ్లో.]

# అధ్యాయము 32[1]

## ధ్రువలు[2]

[ కాశీముద్రణమునందు 32 వ అధ్యా— 458 శ్లోకములును, బొంబాయిముద్రణమునందు 32 వ అధ్యా— 442 శ్లోకములును కలవు. కాశీముద్రణమునందు ఈ అధ్యాయము చివరనున్న 27 శ్లోకములును (459-484 శ్లో.) బొంబాయిముద్రణమునందు 33 వ అధ్యాయముగా ఉన్నవి. బరోడా ముద్రణము - 32 వ అధ్యా. - 487 శ్లో.]

నారదప్రోక్తములు

నారదప్రముఖులగు ద్విజులచే ధ్రువాసంజ్ఞితములగు గీతములు కొన్ని చెప్ప బడెను. వీనియందు గీతాంగములన్నియును వివిధములుగా ఉపయుక్తము లగుచుం డును. ఋక్కులు, పాణికలు, గాథలు, సప్తరూపములు 'ధ్రువ' లనబడును. నానా ఛందఃకృతములగు ధ్రువల నిప్పుడు వివరింతును—

ధ్రువాంగములు

(1) ముఖము, (2) ప్రతిముఖము, (3) వైహాయసికము, (4) స్థితము, (5) ప్రవృత్తము, (6) వజ్రము, (7) సంధి, (8) సంహరణము, (9) ప్రస్తారము, (10) ఉపవర్తము, (11) మాషఘాతము, (12) చతురస్రము, (13) అవపాతము (ఉపఘాతము), (14) ప్రవేణి, (15) శీర్షకము, (16) సంపిష్టకము, (17) అంతాహరణము, (18) మాహాజనికము అను ఈ పదునెనిమిదియును ధ్రువాంగములు.

ఏకవస్తుకము 'ధ్రువ' అనబడును; ద్వివస్తుకము 'గీతి' అనబడును; త్రివస్తుకము 'మద్రక' మనబడును; చతుర్వస్తుకము 'చతుష్పద' మనబడును.

వాక్యములు, వర్ణములు, అలంకారములు, యతులు, పాణులు, లయలు అనునవి ఇందు అన్యోన్యసంబద్ధములగుచు స్థిరత్వము నందుచున్నవి కాన ఇది 'ధ్రువ' అనబడెను.

అవస్థాసమాశ్రయములగు ధ్రువాభేదములు

నానావస్థాసమాశ్రయములగు ధ్రువలు ఐదు విధములు—

1. ప్రావేశికి—ఈ ధ్రువయందు పై అంగములలోని ప్రవృత్త-ఉపవర్త-వజ్ర-శీర్షకములు ప్రయుక్తములగును.

---

1. ఈ భాగము అన్ని అధ్యాయములందును ద్వాత్రింశాధ్యాయమే (32 వ అధ్యా.)
2. 'ధ్రువావిధాన' మని కాశీముద్రణ పాఠము, 'ధ్రువాధ్యాయము' అని బొంబాయిముద్రణ పాఠము. ధ్రువావిధానము' అని బరోడా ముద్రణపాఠము.

2. అడ్డిత—ఈ ధ్రువయందు ప్రస్తార - మాషఘాత - మహాజనిక - అవపాత - ప్రవేణులు ప్రయుక్తములగును.

3. అవకృష్ట—ఈ ధ్రువయందు ముఖ-ప్రతిముఖములు ప్రయోగింపబడును.

4. స్థిత— ఈధ్రువయందు హైహాయసిక-అంతాహరణములు ప్రయుక్తములగును.

5. అంతర—ఈ ధ్రువయందు సంహార - చతురశ్రములు, ఖంజ - నర్కుటములు, సంధి-ప్రస్తారములు ప్రయుక్తములగును.

త్ర్యస్రజాతియందలి షట్కలమగు తాళమును, చతురశ్రజాతికి చెందిన అష్టకల తాలమును ధ్రువలయందు ప్రయోగించవలెను. గీతకాంగములగు ఏకక - వివధ - వృత్తములు ప్రకృతిభేదముల ననుసరించి ఇందు ఉపయుక్తము లగును. ఉత్తమ ప్రకృతులకు వృత్తమును, మధ్యమప్రకృతులకు వివధమును, నీచప్రకృతులకు ఏకకమును ఉపయోగించవలెను.

అవసానికీధ్రువయందు ప్రయోజనానుసారముగా త్ర్యస్ర-చతురస్ర తాళముల నుపయోగించవలెను. ఆధ్రువను ఆ తాళప్రమాణము ననుసరించి రచింపవలెను.

గాయత్రీ - అతిశక్వరీ ఛందస్సుల మధ్యనుండెడి ఛందస్సులను ఆవసానికీ ధ్రువలయం దుపయోగించవలెను. శక్వరీ - అతికృతి ఛందస్సుల మధ్యనున్న ఛందస్సులతో ఆవసానికీ ధ్రువను రచింపరాదు. మధ్య - ఉత్తమ ప్రకృతులకు త్ర్యస్ర అగు ఆవసానికీధ్రువ నుపయోగించవలెను. పూర్వోక్తచ్ఛందములనుండి గ్రహించిన పూర్ణపది (4 పాదములు కలిగిన) వృత్తమును ప్రయోగించి, ఆ వృత్తప్రమాణము ననుసరించి ధ్రువాప్రమాణమును నిర్ణయించవలెను.

యథాస్థానరసోపేతములగు ధ్రువా భేదములు

వివిధవృత్తములకు సంబంధించినవై, ఉత్తమ - మధ్యమ - అధమప్రకృతులు కలిగినవై, యథాస్థానరసోపేతములై ధ్రువలు ఐదు విధములుగా నుండును—

(1) ప్రావేశికి, (2) ఆక్షేపికి, (3) ప్రాసాదికి, (4) అంతర, (5) నైష్క్రామికి.[3] ఈ ధ్రువలు మూడువిధములుగా నుండును— (1) కనిష్ఠికాగ్రహా, (2) సన్నిపాతగ్రహా, (3) పాపగ్రహా.

---

3. ఈ ఐదుధ్రువలలక్షణములను ఇంతకుముందే సూచనామాత్రముగా పేర్కొనబడినవి. పుట 196 చూడవలెను. వసంతరాజీయశ్లోకములను పుట 181 లో పేర్కొంటిని.



ధ్రువల ఛందోవృత్తనిదర్శనము

ఈ ధ్రువలకు ఛందోవృత్తనిరూపణమును కావింతును—గాంధర్వము స్వర-తాల - పదాత్మకమై ఉండునని చెప్పబడెనుకదా. అందు స్వర - తాలానుభావకమైన పదము ధ్రువాగానమున వస్తువగును. అర్థసహితాక్షరయుతమగునది 'పద' మనబడును. అట్టి పదము నిబద్ధము, అనిబద్ధము అని రెండు విధములుగా నుండును. అవి మరల అతాలము, సతాలము అని రెండేసి విధములుగా నుండును. ధ్రువలలో సతాలమును, నిబద్ధమును అయిన పదము కూర్చబడును. కరణాతోద్య ములందు అనిబద్ధపదము ప్రయుక్తమగును.

నియతాక్షరసంబంధము కలిగి, ఛందోయతి సమన్వితమై, తాల - పాతముతో కూడిన పదము 'నిబద్ధ' మనబడును. యతి - పాదనియమము లేనిదియును, అనియతాక్షరమును అగు పదము అనిబద్ధ మనబడును. అనిబద్ధములును, తాలరహితములును అగు ఆ పదములను ఆతోద్యములందు నియోగించవలెను. అట్టివియే ఆతోద్యములందు నియుక్తములై రంజింపచేయును. ధ్రువలలో నిబద్ధపదములు నియుక్తములైనచో రంజకములగును,

ధ్రువాసంజ్ఞకములగు నిబద్ధపదములకు గల ఛందోక్షరవిధానమును వివరింతును—

అత్యుక్త, ప్రతిష్ఠ, గాయత్రి, మధ్య అను ఈ ఛందములు అప (వ) కృష్ట ధ్రువలందు ప్రయోగింపబడును. ఇవి త్ర్యశ్రజాతికి చెందియుండును.

ప్రాసాదికీధ్రువలయందు ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి అను ఛందములుపయుక్తము లగును. ఇవి చతురశ్రజాతికి చెందియుండును.

ప్రావేశికీధ్రువలయందు అనుష్టుప్, బృహతి, జగతి, విలంబిత, ధృతి ఛందములను; చపల, ఉద్గత వృత్తములను ఉపయోగించవలెను. ఉద్ధతధ్రువలందు పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి అను ఛందము లుపయుక్తములగును.

అన్ని జాతులందలి వృత్తములును గురుప్రాయములుగను, లఘుప్రాయములుగను, గురులఘుప్రాయములుగను ఉండును. అవకృష్టధ్రువ గురుప్రాయముగను, నైష్క్రామికీధ్రువ (ద్రుతధ్రువ) లఘుప్రాయముగను, మిగిలిన ధ్రువలు గురులఘ్వక్షరాత్మకములుగను ఉండును.

అల్పచ్ఛందఃకృతములగు అల్పాక్షరవృత్తములను స్థిత - అవకృష్ట - ఆక్షేపికీ ధ్రువలయందు ప్రయోగింపదగును.

ఆక్షేపికీధ్రువయందు సమ - విషమవృత్తములు రెండింటిని ప్రయోగింప వచ్చును. ఆ ధ్రువలను శమ్యా-తాల-పాతములచేత కూర్చవలెను. ఇక ధ్రువలయం దుపయోగించు చంధోవృత్తములను స్థానప్రమాణములతో వివరింతును—*

ఛందములు : ధ్రువలు

ఉక్తచ్ఛందమునందలి ధ్రువ.

1. శ్రీ—ఇది మొదటి ధ్రువ. ఇందు పాదమునకు ఒక గుర్వక్షరము చొప్పున నాల్గు పాదములుండును. ఉదా :

యో గం । గా శ్రీ॥ 47

( ఇవి నాలుగును నాలుగు పాదములని తెలియవలెను. )

అత్యుక్తచ్ఛందమునకు సంబంధించిన వృత్తము—

2. ఇందు పాదమునకు రెండు గుర్వక్షరములుండును. ఉదా :

ఈశం దేవం । శర్వం వందే ॥ 49

మధ్యచ్ఛందమునకు సంబంధించిన వృత్తములు.

3. తటి—ఇందు పాదమునకు మూడక్షరములుండును. మధ్యాక్షరము లఘువు అగును. ఉదా :

శంకరః శూలభృత్ । పాతుమాం లోకకృత్॥ 51

4. ధృతి—ఇందు పాదమునకు మూడక్షరములుండును. మొదటి అక్షరము లఘువు. ఉదా :

ఉమేశః సురేంద్రః । తవాయుః కరోతు॥ 53

5. రజని—పాదమునకు మూడక్షరములు. రెండు లఘువులు, ఒక గురువు ఉండును. ఉదా :

అధికం విరహే । మదనో దహతి॥ 55

ప్రతిష్ఠా ఛందమునందలి వృత్తములు—

6. పుష్పము—పాదమునకు నాల్గు అక్షరములు ఉండును. రెండవ అక్షరము లఘువు. మిగిలినవి గురువులు. ఉదా :

వాఇ వాఅ పుప్పవాహీ।

(వాతి వాతః పుష్పవాహీ) 58

7. భ్రమరి—పాదమునకు నాల్గు అక్షరములు. అందు వరుసగా రెండు లఘువులు, రెండు గురువులును ఉండును. ఉదా :

* [కాశీముద్రణమునందు 32వ అధ్యా—1-45 శ్లో; బొంబాయిముద్రణమునందు 32 వ అధ్యా—1-46 శ్లో. బరోడా ముద్రణము - 32 వ అధ్యా. - 1-46 శ్లో]

4. ఇచ్చటినుండి ఉదాహరణములన్నియును ప్రాకృతమునందే ఉన్నవి.



వణఖండే అదిమత్తో।

(వనఖండే అతిమత్తః)

వణహత్థీ పరిఖిణ్ణో॥

(వనహస్తీ పరిఖిన్నః) 60

8. జయ—పాదమునందలి నాల్గక్షరములలో 1, 3 అక్షరములు లఘువులు, 2, 4 అక్షరములు గురువులు. ఉదా :

హిమాహఏ వణంతరే

(హిమాహతే వనాంతరే) 62

సుప్రతిష్ఠా ఛందమునందలి వృత్తములు—

9. విద్యుద్భ్రాంత - ఇందుపాదమునకు 5 అక్షరములు. అన్నియును దీర్ఘములే. ఉదా :

ఏఏ గజ్జంతా తోఅం ముచ్చంతా।

(ఏతే గర్జంతః తోయం ముంచంతః)

లోఅం ఛాఅన్తా సంపణ్ణా మేహా॥

(లోకం ఛాదంతః సంపన్నా మేఘాః) 64

10. భూతలతన్వీ—ఇందు పాదమునకు 5 అక్షరములు. మొదటిది గురువు, పిమ్మట 2 లఘువులు, తరువాత 2 గురువులు. ఉదా :

మేహణిరుద్ధే పేఖిఅ వమ్మ

(మేఘనిరుద్ధే ప్రేక్ష్య వర్త్మ)

పంథిఅ దారా అంసుకిలిణ్ణా॥

(పథికదారాః అశ్రుక్లిన్నాః) 66

11. కమలముఖి—ఇందు పాదమునకు 5 అక్షరములు. అందు మొదటి నాలుగును లఘువులు, చివరిది గురువు. ఉదా :

పవణహట సలిలహరో।

భమఇ ణహే అహిఅసమో॥ 68

12. వాగురు—ఇందు పాదమునకు 5 అక్షరములుండును. 1, 3, 5 గురువులు; తక్కినవి లఘువులు. ఉదా :

మేహరాదఓ ణంత రుంణఓ।

ణిచ్చి ణిప్పహో ఏసచందఓ॥ 70

13. శిఖ—ఇందు పాదమునకు 5 అక్షరములుండును. 2, 4, 5 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు. ఉదా :

బహులఏహిం నగంఏహిం।

ణహంసమంతో వరుజ్జ ఇవ్వ॥ 72

14. ఘనపంక్తి—ఇందు పాదమునకు 5 అక్షరములుండును. మొదటివి రెండును లఘువులు, తక్కినవి గురువులు. ఉదా:

తడిసంబద్ధం ఘణసంరుద్ధం।
జలధారాహిం దువదీవం భం॥* 74

తనుమధ్య, మాలిని, మకరకశీర్ష, విమల, వీర్య, జలరమ్య, కాంత, పంక్తి, నలిని, నీలతోయ అను గాయత్రీఛందోవృత్తములను గూడ ధ్రువలయందు ప్రయోగించనగును.[5]

చపల, విమల, కామిని, భ్రమరమాల, భోగవతి, మధురిక, సముద్ర, కుసుమవతి, ముదిత, ప్రకాశితదీప్త, విలంబిత, పంచమగతి అను ఈ ఉష్ణిక్ ఛందోవృత్తములను ప్రాసాదికీధ్రువలయం దుపయోగించవలెను.

విమలజల, లలితగతి, లలిత, మహి, మధుకరసదృశ, నలిని, నది అను ఈ అనుష్టుప్ ఛందోవృత్తములను ప్రావేశికీధ్రువయందు ప్రయోగించవలెను. ఉత్తమ-మధ్యమ స్త్రీలకు ఈ వృత్తములలో అవకృష్టధ్రువను ఉపయోగించవలెను. రుచిర అను బృహతీఛందోవృత్తము ప్రావేశికీధ్రువలో ప్రయుక్తమగును.

ప్రమిత అనుపంక్తిచ్ఛందోవృత్తము అవకృష్టధ్రువలో ఉపయుక్త మగును.

గతవిశోక, విశోక, లలిత అను జగతీ ఛందోవృత్తములును ప్రావేశికీధ్రువయందు ప్రయుక్తము లగును.

విలంబిత అను అతిజగతీ ఛందోవృత్తమును ప్రావేశికీధ్రువయందు ప్రయోగించవలెను.

ప్రతిష్ఠాఛందము మొదలుగా పైన చెప్పబడిన వృత్తములు అవకృష్టధ్రువలో ఉపయోగింప నగును.

---

* [కాశీముద్రణమునందు 32 వ అధ్యా—46-74 శ్లో; బొంబాయిముద్రణమునందు 32 వ అధ్యా—47-78 శ్లో. బరోడా - 32 వ అధ్యా. - 47-76 శ్లో.]

5. 15 వ అధ్యాయమందు గాయత్రి మొదలు 'ఉత్కృతి' వరకునుగల ఛందములందలి వృత్తములు కొన్ని పేర్కొనబడినవి. పుటలు 406-407 చూడవలెను.

ఇప్పు డిచ్చట 'ఉక్త' చ్ఛందముతో మొదలిడి ఆయా ఛందములందలి వృత్తములు కొన్ని వివరింపబడెను. ఉక్తము మొదలు సుప్రతిష్ఠ వరకును గల ఐదు ఛందములందలి 14 వృత్తములుపైన లక్ష్య-లక్షణ సహితములుగా నిరూపింపబడినవి. ఇంక గాయత్రి మొదలు ఉత్కృతి వరకునుగల ఛందములందు 15 వ అధ్యాయమందు వివరింపబడిన వానికంటె అధికముగా ఇచ్చట వివరింపబడినవి. నేను వాటినెల్ల మరల అనువదింపక, ప్రాత-క్రొత్త వృత్తముల పేర్లను మాత్రమే పేర్కొనుచున్నాను.



దేవస్తుత్యాశ్రయములగు అత్యుక్తాఛందోవృత్తములను యతి-పాణిసహితముగ అవకృష్టధ్రువలో నుపయోగింపనగును. అవకృష్టధ్రువ స్థాయివర్ణము, స్థితలయ, సమపాణి, సమయతి కలిగియుండును.

అవకృష్టధ్రువ అల్పవస్తుకము, అల్పపదమునై యుండును.

ఇక ద్రుతధ్రువలయందు జగతి మొదలు అతిధృతి పర్యంతము గల ఛందములందలి వృత్తముల నుపయోగించవలెను.

జగతీఛందమునందలి విక్రాంత, అతిజగతియందలి విద్యున్మాల, శక్వరీఛందమునందలి విభ్రమ, అతిశక్వరియందలి భూతలతన్వి, అష్టిచ్ఛందమునందలి స్ఖలితవిక్రమ, అత్యష్టియందలి రుచిరముఖి, ధృతియందలి చపల, అతిధృతియందలి కనకలత అను వానిని ద్రుతధ్రువయందు ఉపయోగించవలెను.

ఈ ఎనిమిది వృత్తములును ద్రుతధ్రువలకు మూలజాతులు. వీనినుండి వినిస్సృతములగు యుగ్మ-ఓజ-విషమాక్షరములు గల వృత్తములు పెక్కుగలవు. పైన చెప్పిన జాతులు త్ర్యశ్రములును, ద్విపదములును అయియున్నవి.

చతురస్రద్విపదలను ఇంక వివరింతును. మాల, ప్రభావతి, మాలకిత అనునవి విలంబితధ్రువలకు సంబంధించిన చతురస్రజాతులు.

మనోజ్ఞగమన, లలితగతి, రతి, భుజగముఖి ద్రుతపదగతి అను ఈజాతులు ద్రుతధ్రువయందలి చతురస్రజాతులు. కనకలత, సురుచిర, శశిరేఖ, శలభవిచలిత మణిగణనికర, సింహాక్రాంత అను బృహతీఛందమునందలి వృత్తములు ప్రావేశికియందుపయోగింపదగును; ఇవి స్తుతిప్రధానములుగా నుండును.

సురదయిత, కుముదిని, ప్రథిత, ఉద్ధత, విపులభుజ, పుష్పసమృద్ధ అనునవి పంక్తిచ్ఛందమునందలి జాతులు.

చపల, కమలదలాక్షి, ద్రుతపదగతి, అతిచపల, విమల, రుచిర, అపరవక్త్రి అనునవి త్రిష్టుప్ జాతులు.

అతిచపల, మదకలిత, కమలలోచన అనునవి అతిజగతీఛందోజాతులు.*

ఈ పై జాతు లన్నియును ప్రావేశికి ధ్రువలయందు ప్రయోగింప దగియున్నవి. ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి అనునవి చతురస్రవివర్ధితజాతులు.

---

* [కాశీముద్రణమునందు 32 వ అధ్యా—75-254 శ్లో; బొంబాయిముద్రణమునందు 32 వ అధ్యా— శ్లోకములు వరుసలో లేవు.] 5 వ అధస్సూచికను చూడవలెను.
బరోడా ముద్రణమునందు 32 వ అధ్యా. - 77-286 శ్లో.

ధ్రువలయందలి గణ-మాత్రా వికల్పనము

సుప్రతిష్ఠ యందలి ఆవసానికీ ధ్రువలలో పాదమునందు 1½ గణము ఉండును; మొత్తము నాలుగు పాదములందును 6 గణము లుండును. అపకృష్టధ్రువ యందు పాదమునకు 2½ గణముల వంతున నాలుగు పాదములందును 10 గణములుండును. అడ్డితా-ఉద్ధతా ధ్రువలయందు పాదమునకు 3½ గణముల చొప్పున మొత్తము 14 గణము లుండును. ద్విపాదములగు త్ర్యశ్రజాతులయందు పాదమునకు 5½ గణముల వంతున రెండు పాదములకును 11 గణము లుండును. ద్విపాదములగు చతురశ్రజాతులయందు పాదమునకు 7½ గణము లుండును; రెండు పాదములందును మొత్తము 15 గణము లుండును.

మొదటి చతురశ్రజాతులయందు 2 మొదలు 9 వరకు అక్షరము లుండును; అందు మొదటిది గురువు, చివరిది లఘువు. త్ర్యస్రజాతియందు 5 మొదలు 9 వరకు అక్షరము లుండును. త్ర్యస్రమునందు మొదటిది (5 అక్షరములు కలది) సర్వగురువై యుండును; 9 అక్షరములు కల చివరిది సర్వలఘు వగును. ఇంక చతురస్రమునందు 8 మొదలు 13 వరకును అక్షరము లుండును. అందు 8 అక్షరములు గల మొదటిది సర్వగురువును, 13 అక్షరములు కలది సర్వ లఘువును అగును.

పై విధముగా అన్ని ధ్రువలయందును త్ర్యస్ర-చతురస్ర అక్షరసమూహము లుండునని తెలియవలెను.

ఇంక ద్విపాదముల గణమాత్రావిభాగమును వివరింతును.— త్ర్యస్రములలో 11 మొదలు 21 వరకు అక్షరములుండును. అందు మొదటిది సర్వగురువు, చివరిది సర్వలఘువు. చతురస్ర ద్విపదములందు 16 అక్షరములు మొదలు 20 అక్షరములవరకు ఉండును; అందు మొదటిది సర్వగురువు, చివరిది సర్వలఘువు. శీర్షకములందు ఇట్టి పాదవిధాననియమము లేదు. అది సర్వగురువుగా కాని, గుర్వాదిగా కాని, గురుమధ్యముగా కాని, గుర్వంతముగా కాని, సర్వలఘువుగా కాని ఉండవచ్చును.

త్ర్యస్రధ్రువకు సన్నిపాతాధికములగు 5 గుణములుండును. రెండు పాదములును, ఒక సన్నిపాతమును ద్రుత-శీర్షకములందుతప్ప తక్కిన ధ్రువలయందుండును.

ఇంక ధ్రువల గణ-మాత్రావిభాగమును వివరింతును. ధ్రువలయందు 5½ గణములు, 1 సన్నిపాతము ఉండును. గురు-లఘ్వక్షరాన్వితములగు 20 మాత్రలుండును.



శీర్షకమున కిట్టి పాద నియమములేదు. నానావృత్తనిష్పన్నములగు పాదములతో శీర్షకమును కూర్చవచ్చును. అది పైన చెప్పినట్లు సర్వగురువు మొదలగు భేదములతో కూడియుండును. ఇందలి గణములు నాలుగు మాత్రలను కలిగియుండును. పాదమునకు 7½ గణములుండును; ఇందు 21 మొదలు 26 వరకు అక్షరములుండవచ్చును శీర్షకమున రెండవ భాగములో నియమితముగా లఘువుల నుంచవలెను.

చపలాశీర్షకము—ఇందు మొదట 3 గణములు, చివర 3 లఘువులు, మధ్య రెండు గురువులు ఉండవలెను.

శీర్షకమున మొదటి సగమునందు గురువులు, తరువాత 2, లేదా 3 అక్షరములు లఘువులు, తరువాత 4 గణములు, తక్కినవి లఘువులు అగును.

ప్రాసాదికి, అంతర, ఆక్షేపికి ధ్రువలయందు విరామములు ఏకకల, త్రికల, చతుష్కల, అష్టకలముగా ఉండును. విరామము త్ర్యస్రమగు ప్రావేశికీధ్రువయందు త్రికలముగను, చతురస్రమగు నైష్క్రామికీధ్రువయందు చతుష్కలముగను ఉండును. అంతరాధ్రువయొక్క విరామము నిత్యమును ద్వికలముగా నుండును. ఆక్షేపికీ ధ్రువకు విరామము పాదాంతమందుండును. స్థితధ్రువకు పాదమధ్యమందుండును. ప్రాసాదికీధ్రువకు ఏకకలము లేదా అర్ధకలమగు విరామము ఉండును. ఈ ధ్రువలయం దుపయోగింపబడు వృత్తములు మూడువిధములుగా నుండును— సర్వగురువులు, సర్వలఘువులు, గురు-లఘ్వక్షరప్రాయములు. ద్రుతధ్రువ గురుప్రాయముగా కాని, లఘుప్రాయముగా కాని ఉండవలెను. ప్రాసాదికీ - అంతరాధ్రువలు గురు-లఘ్వక్షరప్రాయములుగా నుండవలెను. ఈ విధముగా ధ్రువలలో నుపయోగింపదగు వృత్తజాతులు వివరింపబడెను. ఇంక శీర్షకముల లక్షణములను వివరింతును. (కొంత లక్షణము పైని వివరింపబడెను.)—

స్ఖలితశీర్షకము—ఇది సంకృతిచ్ఛందమునందలిది; ఇందు పాదమునకు 24 అక్షరము లుండును; 1, 4, 7, 10, 11, 24 అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు.

సంకృతిచ్ఛందము నందలి స్ఖలిత-సంభ్రాంతములు, వికృతిచ్ఛందము నందలి పుష్పసమృద్ధ-ఉదితములు, ప్రకృతిచ్ఛందము నందలి శ్రేణీ-చపలలు, ఉత్కృతియందలి వేగవతీ-క్రౌంచములు అను ఈ ఎనిమిదియును శీర్షకమునకు తగినవృత్తములు.

నర్కుటము లేదా నర్కుటకము—దీనికి తగిన వృత్తములుకూడ ఎనిమిదే. త్రిష్టుప్ అందలి రథోద్ధతము, అతిజగతి యందలి బుద్బుదము, అష్టియందలి ఉద్గత-వంశపత్రములు, జగతియందలి ప్రమితాక్షర-కేతుమతులు, జగతియందలి హంసాస్య-త్రోట

కములు అను ఈ ఎనిమిది వృత్తములును నర్కుటమునం దుపయుక్తములు కాదగినవి.

ఇట్లు ధ్రువలయం దుపయోగించు సమవృత్తాక్షరకృతజాతులు అరువది నాలుగు. ఇంక మిగిలినవి విషమవృత్త జాతులు-285......*

## ధ్రువా వికల్పనము

పై ధ్రువలయందు ఐదు విధములగు హేతువులచే కలుగు వికల్పనములను వివరింతును— (1) జాతి, (2) ప్రకారము, (3) ప్రమాణము, (4) నామము, (5) స్థానము అను ఈ ఐదును హేతువులు.

1. జాతి—వృత్తాక్షరప్రమాణము 'జాతి' అనబడును.

2. ప్రకారము—వృత్తములయందలి సమ - విషమ - అర్ధవిషమ భేదములు 'ప్రకారము'లనబడును.

3. ప్రమాణము—షట్కలము, అష్టకలము అని ప్రమాణము ద్వివిధము. ఇది త్ర్యశ్ర - చతురశ్రజాతి తాళమానము నెరింగించును.

4. నామము— కులాచారవ్యవహారమును అనుసరించి "ఆయావ్యక్తుల కాయా ధ్రువలు" అని నిర్ణయించుట 'నామము' అనబడును.

5. స్థానము—పరస్థాశ్రయము, ఆత్మస్థాశ్రయము అని స్థానము ద్వివిధము. ధ్రువల నుపయోగించు స్థానాశ్రయములను బట్టి భేదములను చెప్పుట స్థానకృత భేదము - అట్టిస్థాన (కాల )ము లైదు విధములు—(1) ప్రవేశము, (2) ఆక్షేపము, (3) నిష్క్రామము, (4) ప్రాసాదికము, (5) అంతరము. ఈ స్థానములను బట్టి ధ్రువాగానములును అయిదు విధములు.

## ప్రావేశిక్యాది ధ్రువలు

1. ప్రావేశికి—నానారసార్థముల ననుసరించి పాత్రల ప్రవేశసమయమున చేయబడు ధ్రువాగానము 'ప్రావేశికీధ్రువాగానము' అనబడును.

2. నైష్క్రామికి— ప్రస్తుతవిషయస్తుతిపరముగ అంకాంతమున పాత్రల నిష్క్రమణ సమయమున చేయబడు గానము 'నైష్క్రామికీ గానము' అనబడును.

3. ఆక్షేపికి—ద్రుతతాలమునందలి నృత్తవిధియందు క్రమమును విడిచి నపుడు చేయబడు ధ్రువాగానము 'ఆక్షేపికీధ్రువాగానము' అనబడును. ఈ ధ్రువకు ద్రుతధ్రువ, స్థితధ్రువ అనియు పేర్లు కలవు.

* [కాశీముద్రణమునందు 32వ అధ్యా—255-326 శ్లో; బొంబాయిముద్రణము నందు 32వ అధ్యా— శ్లోకములు వరుసగాలేవు.] ఇచ్చట 326 వ శ్లోకము తరువాత 3 శ్లోకములు (కాశీముద్రణము-327- 329 శ్లో.) విడువబడెను. బరోడా ముద్రణము - 32 వ అధ్యా. - 236-306 శ్లో.



4. ప్రాసాదికి—రసాంతరోపగతమగు సామాజికహృదయమున ప్రకృత రసానుభవమునకు తగిన ప్రసాదమును కల్గించు ధ్రువాగానము 'ప్రాసాదికీ ధ్రువాగాన' మనబడును.

5. అంతర— ఎక్కువ భారముచే క్రుంగినపుడు, మూర్ఛ నందినపుడు, పతనము చెందినపుడు, దోషప్రచ్ఛాదనము చేయవలసిన సమయమున, విషాదము చెందినపుడు, విస్మృతి చెందినపుడు, క్రోధముకల్గినపుడు, నిద్రపోయినపుడు, మత్తత కల్గినపుడు చేయబడు ధ్రువాగానము 'అంతరాధ్రువాగానము' అనబడును.

## ధ్రువలు : రస-భావ-ప్రకృతిసంయోజనము

రస-భావముల ననుసరించి ధ్రువాగానమును చేయువిధానము నింక వివరింతును. బంధము, నిరోధము, పతనము, వ్యాధి, మరణము, కరుణాశ్రయమగు భావము అనువానియందు అవకృష్టధ్రువాగానము చేయవలెను.

ఔత్సుక్యము, అవహిత్థ, చింత, పరిదేవనము, శ్రమ, దైన్యము, విషాదము, అనెడి భావములందు స్థితధ్రువను గానము చేయవలెను. ఈ భావములందును, కరుణవేదితములందును ద్రుతధ్రువను గానముచేయవలెను.

మృతవార్తను చెప్పినందువలన గాని, మృతుని చూచుటవలనగాని కలిగిన దుఃఖమునను, కరుణరసమునందును స్థితధ్రువను గానముచేయవలెను.

ఉత్పాతము, సంభ్రమము, హర్షము, అద్భుతదర్శనము, విషాదము, ప్రమాదము, దోషము, బలప్రదర్శనము, ఆవేగము, సంభ్రమము, ప్రత్యక్షములు లేదా నివేదితములు అయిన రౌద్ర-వీర-భయానకములు మొదలగు వానియందు ద్రుతధ్రువాగానము చేయబడవలెను.

ప్రసాదము, సంభ్రమము, అనుస్మరణము, అతిశయవాక్యములు, నవసంగమము, గర్వము, ప్రార్థన, శృంగార-అద్భుత దర్శనము అను వానియందు మధ్యలయాశ్రయమగు ప్రాసాదికీధ్రువను గానము చేయవలెను.

శరీరవ్యసనము, రోషము, తిరిగి కలియుట అనువానియందు సానుబంధయగు అంతరధ్రువను గానముచేయవలెను.

సంభ్రమ-ఉత్పాత-ప్రేషణ-విస్మయములందును, ఏడ్చుచు పాడుచు పాత్రలు ప్రవేశించునపుడును ధ్రువాగానము లేకయే ప్రవేశము జరుగును.

ఈ విధముగా అర్థవిధిని, దేశ-కాలములను, ప్రకృతులను, భావములను ఎరింగి ధ్రువలను ప్రయోగించవలెను.

శీర్షకము, ఉద్ధత, అనుబంధము, విలంబిత, అడ్డిత, అప(వ)కృష్ట అను భేదములచే ధ్రువలు మరియు ఆరువిధములుగా నున్నవి.

శిరఃస్థానమున గానము చేయబడునది (తారస్వరమున గానము చేయబడునది) 'శీర్షక' మనబడును.

ఉద్ధతముగా గానము చేయబడునది కాన 'ఉద్ధత' అనబడును.

వేరొక భావమును ఆకర్షించునదియును, కారుణ్యసంయుక్తమగునదియును 'అపకృష్ట' అనబడును.

ఆక్రీడితప్రవృత్తమును, చతుర్విధములుగ లోపములను కలుగజేయునదియును, నాట్యోపచారమునుబట్టి వ్యవహరింపబడునదియును 'అనుబంధ' మనబడును.

ఉత్కటగుణములు కలదియును, శృంగారరసమున జనించునదియును, ప్రసన్నమును అగు ధ్రువ 'అడ్డితధ్రువ' అనబడును.

నాట్యమునందు నాతిత్వరితసంచారముకలదియు, నాట్యధర్మము ననుసరించి ఉండునదియు అగు ధ్రువ విలంబితధ్రువ అనబడును.

శీర్షక-ఉద్ధత ధ్రువలను దేవ-పార్థివుల విషయమున ఉపయోగించవలెను. అడ్డితధ్రువను దివ్య-పార్థివ-వేశ్యాస్త్రీలకు ఉపయోగించవలెను. విలంబితధ్రువను మధ్యమపాత్రప్రవేశమున గానము చేయవలెను. నర్కుట-ఖంజములను నీచపాత్రలకుపయోగించవలెను. ప్రాసాదికీధ్రువాస్థానమున నీచపాత్రల విషయమున ఖంజ-నర్కుటముల నుపయోగించవలెను.

నీచపాత్రసంబంధియగు హాస్యరసమునుకాని, శృంగారరసమునుకాని వర్ణించునపుడు అనుబంధధ్రువను గానముచేయవలెను.

స్త్రీ-రాజన్య-వైశ్యుల విషయమున అపకృష్టధ్రువాగానమును చేయవలెను. నీచపాత్రల విషయమున స్థిత-అడ్డిత ధ్రువల నుపయోగించరాదు. సర్వభావములయందును నీచపాత్రలకు నర్కుటమునే ప్రయోగించవలెను. నీచులకు హాస-శోక-భయానకరససంబంధిభావములే కలుగును. కావున అట్టివాని నెరింగి ధ్రువలను ప్రయోగించవలెను.*

### ధ్రువాప్రయోగవిషయమున గమనించవలసిన అంశములు

వస్తువును, ప్రయోగమును, ప్రకృతిని, రసమును, భావమును, ఋతువును, దేశమును, కాలమును, అవస్థను, వయస్సును ఎరింగి ధ్రువను ప్రయోగించవలెను—

1. వస్తువు— ఇది దేశజన్యము. మరియు నిది నగరసంభవము, అరణ్యసంభవము అని ద్వివిధము.

2. ప్రయోగము—దివ్యసంశ్రయము, మానుషసంశ్రయము అను భేదములచే ఇది రెండువిధములు.

---

* [కాశీముద్రణమునందు 32వ అధ్యా—326-368 శ్లో.] బరోడా ముద్రణమునందు - 32 వ అధ్యా. - 306-344 శ్లో.



3. ప్రకృతి— ఉత్తమ-మధ్యమ-అధమ భేదములచే ప్రకృతి త్రివిధము.

4, 5. రస-భావములు— ఇవి వెనుక వివరింపబడినవే.

6. ఋతువు— గ్రీష్మాదికాలకృతమైనది ఋతువు.

7. దేశము— కక్ష్యావిభాగముచే విభజింపబడినది.

8. కాలము— రాత్రి, పగలు, నెల, పక్షము మొదలగునవి.

9. అవస్థ— సుఖ-దుఃఖజన్యమైనది.

10. వయస్సు— శైశవ-యౌవన-వార్ధక్యాదులు.

పై స్థానములందు ధ్రువలను రస-భావానుగుణముగా, వివిధములుగా ప్రయోగించవలెను.

### ధ్రువాగాన ప్రయోజనము

వాక్యములచే వాచ్యముచేయరాని విషయమును మాత్రమే ధ్రువాగీతులచే చెప్పవలెను. కేవలము గీతులచేతనే రసము జనించదు. కాన అంతటను గీతులనే కూర్చరాదు.

### ధ్రువారచనము : ఔపమ్యసంవిధానము

ధ్రువాగానములు ఔపమ్య (సాదృశ్య) గుణాశ్రయములుగ నిర్మింపబడవలెను. ఈ ధ్రువలయందలి ఉత్తమాధమమధ్యములగు స్త్రీలకు పురుషులకు కూడ ఉపమానములను కల్పించవలెను. దేవ-పార్థివులకు చంద్ర-అగ్ని-సూర్య-పవనులను ఉపమానములనుగా కల్పించవలెను. దైత్యులకు, రాక్షసులకు మేఘ-పర్వత-సాగరములను ఉపమానములుగ నిబంధించవలెను. సిద్ధ-గంధర్వ-యక్షులకు గ్రాహ-ఇభ-వృషభములను, తాపసులకు సూర్య-అగ్ని-పవనులను, వీరి స్త్రీలకు విద్యుత్-ఉల్కా-అర్కరశ్మ్యాదులను ఉపమానములనుగా కల్పించవలెను.

దేవతలకుచెప్పు ఉపమానములనే నృపులకుకూడ ఉపమానములనుగా కల్పించవలెను. నాగ-సింహ-వృషాదులను దివ్యులకు ఉపమానముగ చెప్పరాదు. యక్ష-రాక్షస-భూతాదులకు మహిష-రురు-సింహాది క్రూరమృగములను ఉపమానములుగ కల్పించవచ్చును. ఉత్తములైన వారికి ఉపమానములుగ మత్తమాతంగ-రాజహంసలను కల్పించవలెను.

మధ్యములకు సారస-మయూర-క్రౌంచ-చక్రవాకములను ఉపమానములుగ నిల్పవలెను.

అధములకు కోకిలను, తుమ్మెదను, కాకిని, కురరమును, గ్రుడ్లగూబను, కొంగను, పావురమును ఉపమానములుగ కల్పించవలెను.

ఉత్తమ-అధమ-మధ్యమ స్త్రీలకును, ఆ యా పురుషులకువలెనే ఉపమానములను కల్పించవలెను.

శర్వరి (రాత్రి), వసుధ (భూమి), జ్యోత్స్న (వెన్నెల), నళిని (పద్మము), నది, కరిణి (ఆడు ఏనుగు) అనునవి నృపస్త్రీలకు ఉపమానములుగా కల్పింపబడవలెను.

మధ్యమస్త్రీలకు, వేశ్యాదులకు దీర్ఘిక, కురరి, వల్లి (లత), సారసి (బెగ్గురు పక్షి), శిఖిని (ఆడునెమిలి), మృగి అనువానిని ఉపమానములనుగా కల్పించవలెను.

నీచస్త్రీలకు షట్పది (ఆడుతుమ్మెద), కుక్కుటి (కోడిపెట్ట), ధ్వాంక్షి (ఆడు కాకి), పరపుష్ట (ఆడుకోయిల) అనువానిని ఉపమానములనుగా కల్పించవలెను.

సేనానాయకాదులు ప్రావేశికీ-నైష్క్రామికీధ్రువలచే ప్రవేశ-నిష్క్రమములను చేయవలెను.

ధ్రువలు : రసానుగుణ ప్రయోగసమయములు

పూర్వాహ్ణమున ప్రావేశికీధ్రువను, నక్తందివముల యథోచితముగ నైష్క్రామికీధ్రువను ప్రయోగించవలెను.

పూర్వాహ్ణమున సౌమ్యములగు శృంగారాది రసాశ్రయములుగను, మధ్యాహ్నమున రౌద్రాది దీప్తరసాశ్రయములుగను, అపరాహ్ణమున అద్భుతాది మధ్యరసాశ్రయములుగను, సంధ్యాకాలమున కరుణరసాశ్రయములుగను ధ్రువలను గానము చేయవలెను.

స్థావరములను ఆక్షేపికీధ్రువాశ్రయములనుగా వర్ణించవలెను.

ధ్రువలయందు వర్ణనీయవిషయములు

ఆక్షేపికీధ్రువను స్థితలయాశ్రయముగ కాని, ద్రుతలయాశ్రయముగ కాని ప్రయోగింపనగును.

రోష - అమర్ష - శోక - అద్భుత - భయానకాదులందు ఈ ధ్రువాగానమును చేయవలెను.

యోగ్యములగు నుపమానములతో వసుధాసంస్థమును, దివ్యమును కూడ ధ్రువాగానమున కూర్చవలెను.

స్థావరములకు స్థావరములను, జంగమములకు జంగమములను ఉపమానములనుగా కల్పించుచు సుఖ-దుఃఖకృతభావములను నిరూపించవలెను.

రథ-వాజి-కుంజర-మృగ-పశు-పక్షి-శిబికా-విమానాదుల గతుల ననుసరించి వాని గతివర్ణనమున ధ్రువలను రచించవలెను. అనగా రథ-పక్షి-వారణ-విమాన-



శిబికాది యానములను వర్ణించు ధ్రువలయందు తత్తద్గతిసూచకములగు పద-వర్ణ విశేషముల నుపయోగించవలెను.

ఓజఃప్రధానములగు వృషభ-గజ-సింహ-ఋషభముల గమనవర్ణనమున గురువర్ణభూయిష్ఠముగ రచన సాగవలెను.

సారస-హంస-మయూరాదుల గమనవర్ణనమునకూడ తదుచితపద-వర్ణములతో రచనను సాగించవలెను.

ద్రుతగతియందు లఘువర్ణములను, విలంబితగతియందు దీర్ఘవర్ణములను ధ్రువలలో కూర్చవలెను.

గానాశ్రయమగు పదము వృత్తరహితముగా ఉండదు. కావున గానమునకు యోగ్యమగునట్లు వృత్తములను ధ్రువలయందు కల్పించవలెను.

వాహనగమనములను వర్ణించు సందర్భమున ధ్రువయందలి తాళమానము ఖాండవాద్యానుగుణముగ నుండవలెను.

అంగ-పాతానుగుణముగ ప్రయోగింపబడిన వృత్తము గానమగును. మొదట గానమును, తరువాత వాద్యమును, తరువాత నృత్తమును ప్రయోగించవలెను. అట్టి గీత-వాద్య-అంగసంయోగము 'ప్రయోగ' మనబడును.

హృదయగతమగు భావము అంగాభినయములచేతను, నివృత్త్యంకుర-సూచాభినయములచేతను వ్యక్తము చేయబడవలెను.[6]

ప్రాసాదికీధ్రువను ప్రహర్ష జననమునకై ప్రయోగించవలెను.

ఆకాశపురుషభాషితములందు సంభాషణాశ్రయముగ, అన్వర్థముగ ప్రాసాదికీధ్రువను ప్రయోగించవలెను.

ఈర్ష్యా-క్రోధాదులనుండి ప్రసాదమును కల్పించునెడలకూడ శృంగారరసాశ్రయముగ అన్వర్థయగు ప్రాసాదికీధ్రువను ప్రయోగించవలెను.

అన్ని రసములందును ప్రసాదనమావశ్యకమగు స్థానములందు ప్రాసాదికీధ్రువను అన్వర్థముగ ప్రయోగించవలెను.

---

6. నివృత్త్యంకుర-సూచాభినయాదులు పుట 661 లో వివరింపబడియున్నవి. వీటిని గోవిందకవి క్రింది విధముగా వివరించెను. [రాగతాళచింతామణి-పుట 160]-

"......ఆంగికాభినయము త్రివిధంబు...శాఖాభినయంబును, నంకురాభినయంబును, సూచ్యాభినయంబును ననియెడు నీ యభినయత్రయంబునందు మొదట శాఖాభినయంబు చిత్రవిచిత్రకరప్రవర్తనాత్మకంబై యొప్పుచుండు; ముందఱ రాఁదగిన వాక్యంబు నుపజీవించి కావించు నభినయంబు లంకురనామకంబై యుండు. భావికార్యోపజీవితంబులైన కరణాంగహారములతోఁగూడిన యభినయంబు సూచ్యాభినయం బనంబరఁగు. ఏతాదృశాభినయాత్మకంబు నాట్యం బనందగును."

ధ్రువలు : భాషాసంవిధానము

ధ్రువలయందు సామాన్యముగ శౌరసేనీభాషనే వాడవలెను. నర్కుటమున మాగధీభాషను వాడవలెను.

దివ్యులకు సంస్కృతమును, మనుష్యులుగా అవతరించిన దివ్యులకు అర్ధ సంస్కృతమును ప్రయోగించవలెను.

దివ్యపురుషుల కర్మసంకీర్తనమున తత్తత్ప్రమాణానుగుణముగ మాలా-వక్త్ర-పుట-విశ్లోక-చూలికా-ఉద్గత-అపరవక్త్రవృత్తములను ఛందఃప్రమాణసంయుక్తముగ ధ్రువాగానమున కూర్చవలెను.

దేవతాసంబంధములగు జయ - ఆశీర్వాదాదులు ప్రయుక్తము లగునపుడు ఋక్కు, గాథ, పాణిక అనువానిని ధ్రువాగానమున ప్రయోగింపనగును. గాంధార-షడ్జ-మధ్యమ-పంచమ-ధైవత స్వరయుక్తములగు జాతులను ధ్రువాగానమున ఉపయోగించవలెను.

నానాదైవతకార్యములందు అంతరాధ్రువ తప్ప మిగిలిన ధ్రువలను సంస్కృతమున అనుష్టుప్ ఛందమున రచింపవలెను. ప్రావేశికీధ్రువయందు వక్త్ర-అపరవక్త్ర-మాలావృత్తముల నుపయోగించవలెను. నైష్క్రామికీధ్రువయందు పుట-చూలికల నుపయోగించవలెను.

ప్రాసాదికియందు ఉద్గతమును, స్థితధ్రువయందు అనుష్టుప్‌ను ప్రయోగించవలెను.

శాపభ్రంశము, చింత, శోకము, మున్నగువానిని గురుప్రాయాక్షరము, ప్రకృష్టవర్ణబహుళము అగు అనుష్టుప్ ఛందమునందు నిరూపించవలెను.

మనుష్యులుగా అవతరించిన దివ్యులకు దివ్యత్వస్మరణమున్నచో వారి విహరణాదులయందు దివ్యభావసమన్వితమగు గానమును చేయవలెను.*

ప్రయోగక్రమము : కలా-గ్రహాదివిధి

భాండవాద్యవిన్యాస మొనర్చినపిమ్మట త్రిసామమును ఆశ్రావణవిధిని ఆచరించి, బహిర్గీతమును ప్రయోగించి, పిమ్మట పూర్వరంగము నాచరింపవలెను. పిమ్మట ప్రవేశింపబోవు పాత్రలనుసూచించు ధ్రువాగానమునుచేయవలెను. తరువాత గత్యాశ్రయమగు పదములతో రంగపరిక్రమము నాచరించి అర్థవశముగ గానము చేయుచు షడ్విధపరివర్తముల నాచరించవలెను. అచట 21 పాతములను ప్రయోగించవలెను. ప్రయోగానుసారముగ త్ర్యస్ర - చతురస్ర ధ్రువలను ప్రయోగించ

* [కాశీముద్రణమునందు 32వ అధ్యా—369-427 శ్లో.]
బరోడా ముద్రణమునందు 32 వ అధ్యా. - 345-400 శ్లో.



వలెను. త్ర్యస్రధ్రువయందు పాదపాతము త్రికలముగను, చతురస్రధ్రువయందు పాదపాతము చతుష్కలముగను ఉండవలెను.

చతురస్రధ్రువ ఉత్తమపాత్రలకును, త్ర్యస్రధ్రువ మధ్యమపాత్రలకును, త్ర్యస్ర-నర్కుటములు అధమపాత్రలకును ఉపయోగింపబడవలెను.

స్వస్థులైన పాత్రల పాదపాతములయందు పైనచెప్పిన త్రికల-చతుష్కల నియమము వర్తించును.

సంభ్రమ-ఉత్పాత-రోషములయందు ఏకకలము లేదా అర్ధకలము అగు పాదపాతమును ప్రయోగించవలెను.

ద్వికల - త్రికల - ఏకకల - చతుష్కలములగు పాదవిన్యాసములను చేయునపుడు భాండవాద్యములతో సామ్యమును పాటించవలెనేకాని గానసామ్యమును పాటించ నక్కరలేదు.

ఇట్లు పాదపాతముల నెరింగి భాండవాద్యసామ్యమున స్థిత-ద్రుతలయలందు ధ్రువలను ప్రయోగించవలెను.

అత్యధిక హర్ష - శోక - రోషాదులచే కలుగు ప్రవేశము అపటీక్షేపకృతముగా నుండవలెను.

మొదటి పరివర్తమున గానము భాండవాద్యరహితముగ నుండవలెను. చతుర్థపరివర్తమున గానమునకు భాండగ్రహము జరుగును. ధ్రువాగానమున సన్నిపాతగ్రహ - ఆకాశగ్రహ - తర్జనీగ్రహాలు ఉండును.

కలా - తాల - లయాన్వితములగు గ్రహములు ధ్రువాగానమున గతి పరిక్రమమునందలి భాండవాద్యానుసారముగ ప్రయుక్తములగును.

శీర్షక - ఉద్ధతములయందు ప్రదేశినీగ్రహము ఉండును. విలంబిత - అడ్డితా ధ్రువలయందు సన్నిపాతగ్రహము ఉండును. నర్కుట - ప్రాసాదికీ ధ్రువలయందు కూడ సన్నిపాతగ్రహమునే ప్రయోగించవలెను. ద్రుతధ్రువయందు ఆకాశగ్రహమును ప్రయోగించవలెను.

నైష్క్రామికీ - అనుబంధధ్రువల గ్రహము గానసమముగా నుండును. గానవేత్తలు ఆ ధ్రువలకు పరివర్తము చేయరాదు.

నర్కుటమున నాలుగు గ్రహములను ఆచరించవలెను. సంభ్రమ - ఆవేగ - హర్షకృతప్రవేశములందు ఉద్ఘాత్యమనెడి గ్రహమును గానసమముగా ప్రయోగించవలెను.

భూషణపతనము, వస్త్రపతనము, మనోవైకల్యము, విస్మృతి, శ్రమ, దోషాచ్ఛాదనము అనువానియందు అంతరాధ్రువయొక్క ఉద్ఘాత్యగ్రహమును ప్రయోగించవలెను.

నాట్యము : ధ్రువాగానప్రయోజనము

> యథా వర్ణాదృతే చిత్రే శోభతే న నివేశనమ్ ।
> ఏవమేనం వినా గానం నాట్యం రాగం న గచ్ఛతి ॥ 450

—వర్ణసంయోగము లేనిదే చిత్రము శోభాజనకము కానట్లు ధ్రువాగానములేనిదే నాట్యము రక్తి కట్టదు.

పూర్వరంగమందలి గానవిధియు, దేవపూజావిధానమును వెనుక వివరింపబడినవి.

కావ్యబంధములయందు నానాభావసమాశ్రయముగ షడ్జ-మధ్యమ గ్రామములను రెండింటిని ప్రయోగించవలెను.

ముఖసంధియందు మధ్యమగ్రామమును, ప్రతిముఖసంధియందు షడ్జగ్రామమును, గర్భసంధియందు సాధారణస్వరమును, విమర్శసంధియందు పంచమమును నిర్వహణమున కైశికమును గానమున ప్రయోగించవలెను.

సంధి-వృత్త్యాశ్రయములుగను, రస-భావాన్వితములుగను, ప్రకరణసంబద్ధములుగను ధ్రువలను ప్రయోగించవలెను. నక్షత్రములు ఆకాశమునువలె ఆ ధ్రువలు నాట్యమును ప్రకాశింపజేయును.

పూర్ణస్వరము, వాద్యవిచిత్రవర్ణము, త్రిస్థానగామి, త్రిలయము, త్రిమార్గగతము, రక్తము, సమము, శ్లక్ష్ణము, అలంకృతము అగు గానము సుఖమును, మధురమును అగును.

మొదట గానమునకై ప్రయత్నము చేయవలెను. నాట్యమునకు గానమే శయ్యవంటిది. గీత-వాద్యములు సుప్రయుక్తములైనచో నాట్యప్రయోగము అవిపన్నమై ఒప్పును.

ఇంతవరకును ధ్రువలయొక్క లక్షణములను వివరించితిని. ఇంక గాయక-వాదకుల గుణములను వివరింతును. *

ద్వాత్రింశాధ్యాయము సమాప్తము

---

* [కాశీముద్రణమునందు 32వ అధ్యా—427-458 శ్లో; బొంబాయిముద్రణమునందు 32 వ అధ్యా— 408-442 శ్లో.] బరోడా 32 వ అధ్యా. - 401-437 శ్లో.

# అధ్యాయము 33[1]

## గాయక-వాదక గుణములు[2]

[కాశీముద్రణమునందు 32 వ అధ్యా- 27 శ్లో. (459-484 శ్లో.); బొంబాయి ముద్రణమునందు 33 వ అధ్యాయము 22 శ్లో. బరోడా ముద్రణమునందు - 33 వ అధ్యా. - 28 శ్లో]

గాయక గుణములు

గుణములవలన జ్ఞానము వృద్ధినొందును. దోషములవలన చిత్తము మోహితమగును. కావున గుణ-దోషములను ప్రయత్నపూర్వకముగా ఎరుంగవలెను.

గాయకుడు తరుణవయస్కుడు, మధురస్వరము కలవాడు, లయ-తాల-కలా-పాత-ప్రమాణ తత్త్వజ్ఞుడును అయి యుండవలెను.[3]

గాయికా గుణములు

గాయికలు రూప-గుణ-కాంతి-మాధుర్యములు కలవారు, సత్త్వసంపన్నలు, మృదుమధురస్నిగ్ధరక్తశుభకంఠలు, సునివిష్టపాణి-లయ-యతివిశారదలు, లఘుహస్తలు, గాత్రగుణోపేతలు, సంగీతమున అవహితమనస్సు కలవారు, ఆతోద్యార్పిత కరణలు, యౌవనవతులు కావలయును.

పురుషులకు పాఠ్యము, స్త్రీలకు గానము సహజములైనవి. అవి ఒక్కొక్కచో వ్యత్యస్తములై కన్పట్టిన అవి అలంకారములే కాని సహజములు కావు. పురుషుడొకవేళ పాడినను, ఆ గానము లక్షణోపేతమైనను, మాధుర్యము లేకపోవుటచే శోభాజనకము కాదు.[4]

---

1. ఈ భాగము కాశీముద్రణమునందు 32 వ అధ్యాయములో చివరి భాగము. బొంబాయి ముద్రణమునందు త్రయస్త్రింశాధ్యాయము. (33 వ అధ్యా.)

2. కాశీముద్రణమునందలి 32 వ అధ్యాయమునకు 'ధ్రువావిధాన' మని పేరు. బొంబాయి ముద్రణమునందు 33 వ అధ్యాయమునకు 'గుణాధ్యాయము' అని పేరు.

3. "తాళము నెరుంగనివాడు గాయకుడు కానేర" డని 31 వ అధ్యాయమునందు చెప్పబడినది (పుట 805).

గోవిందకవి వాగ్గేయకారగుణమును విపులముగా వివరించి యుండెను. మరియు శిక్షకుడు, అనుకారి, రసికుడు, రంజకుడు, భావకుడు, ఏకలుడు, యమళుడు, బృందుడు అను భేదములచే గాయకు లెనిమిది విధములని చెప్పి వారి లక్షణములనుకూడ వివరించెను [రాగతాళచింతామణి-పుటలు 152-153.]

4. 26 వ అధ్యాయమందు పుట 739 లో ఈ విషయ మిదివరకే వివరింపబడెను.

వాదక గుణములు

వీణావాదకులు చక్కగా తయారుచేయబడిన వాద్యములు కలవారును, జితశ్రములును. రక్తమగు కంఠము రక్తమగు వీణ కలవారును, చిత్రవాద్య కుశలులును కావలయును.

అవిచ్ఛిన్నస్వరము నిచ్చునదియు, వర్ణాలంకారములను స్పష్టముగా ప్రకటించునదియు, అవిచలితము స్నిగ్ధము దోషవిహీనము అయినదియు అగు వేణువాద్యము ప్రశస్తము.

వేణువాదకుడు బలశాలియు, సావధానుడును, గీత-లయజ్ఞుడును, శ్రోతలకు మధురమగు స్వరమును వినిపింపజేయువాడును, దృఢానిలుడును (ఎక్కువ దమ్ము కలవాడును) అయి యుండవలెను.

గాత్రసౌష్ఠవము

శరీరసౌష్ఠవము పురుషులకు వ్యాయామాదులచే చేకూరును, స్త్రీలకు మధురమగు అంగవిచేష్టితము స్వభావసిద్ధము.

కావున పురుషులు స్త్రీలకు గానమును, వాద్యమును, పాఠ్యమును నానా ప్రకృతిసంభవమగువానినిగా ఉపదేశించవలెనే కాని ప్రయోగించరాదని భావము.

స్త్రీలకు గాన-వాద్యములయందు వైస్వర్యము కలుగదు; స్త్రీల కంఠములందలి మాధుర్యము పురుషులకు కలుగదు.*

స్మృతి, మతి, మేధ, ఊహ, అపోహ, శిష్యనిష్పాదనము అను ఈ ఆరును ఆచార్యగుణములు. మేధ, స్మృతి, గుణశ్లాఘ, రాగము, సంఘర్షము, ఉత్సాహము అను ఈ ఆరును శిష్యగుణములు.[5]

కంఠగుణములు

శ్రావకత్వము, ఘనత్వము, స్నిగ్ధత్వము, మధురత్వము, అవధానవత్త్వము, త్రిస్థానశోభిత్వము అను ఈ ఆరును కంఠగుణములు.

1. ఏ కంఠస్వరము దూరమునకు వినబడునో అది 'శ్రావక' మనబడును.

2. సుస్వరము, అవిక్షిప్తము అగు కంఠస్వరము 'ఘనము' అనబడును.

3. ఉచ్చస్వరముననైనను, హీనస్వరముననైనను రక్తినివీడని కంఠస్వరము 'అవధానవంతము' అనబడును.

4. అపరుషధ్వనిసంయుక్తమగు కంఠము 'స్నిగ్ధము' అనబడును.

---

* [కాశీముద్రణమునందు 32 వ అధ్యా—469-478 శ్లో; బొంబాయిముద్రణమునందు 33 వ అధ్యా—1-10 శ్లో. బరోడా ముద్రణము - 33వ అధ్యా - 1-10 శ్లో.]

5. ఆచార్యగుణములు, ఆచార్య కర్మలు, శిష్యగుణములు 26 వ అధ్యాయమందు పుట 743 లో వివరింపబడెను. 26 వ అధ్యాయమందు ఆచార్యగుణములను గూర్చిన శ్లోకము వ్యత్యస్తముగా పడెను. ఇచ్చట సరిగానే ఉన్నది.



5. మనస్సునకు ఆహ్లాదమును కల్గించునది 'మధుర' మనబడును.

6. ఉరః-కంఠ-శిరములనెడు మూడు స్థానములందును మాధుర్యమును విడువని కంఠము 'త్రిస్థానశోభి' అనబడును.

కంఠదోషములు

కపిలత్వము, అవ్యవస్థితత్వము, సందష్టత్వము, కాకిత్వము, తుంబకిత్వము అను ఈ ఐదును కంఠదోషములు.

1. ఏ కంఠము విస్వరమై, ఘుర్ఘురాయితమై, శ్లేష్మయుతమై యుండునో అది 'కపిలము' అనబడును.

2. స్వరమున న్యూనత్వ-అధికత్వములు గల కంఠము 'అవ్యవస్థితము' అనబడును.

3. పండ్లు దగ్గరగాచేర్చి పాడెడి అలవాటు గలవాని కంఠము 'సందష్టము' అనబడును.

4. ఉచితస్థానమునుండి బయల్వెడలనిదై, రూక్షముగానుండు స్వరముగల కంఠము 'కాకి' అనబడును.

5. ముక్కుతోపాడు కంఠము 'తుంబకి' అనబడును.

ధ్రువాగానవిధానమును పైవిధముగా నెరుంగవలెను.

నారదుడు చెప్పిన గాంధర్వవిధిని సమగ్రముగ వివరించితిని.[6] ఈరీతిగా ప్రయోగించు మనుజుడు కుశలులందగ్రగణ్యుడుగా పరిగణింపబడి సమ్మానము నందును.*

త్రయస్త్రింశాధ్యాయము సమాప్తము

---

6. నారదుని గానక్రియయందు నియమించినట్లు ప్రథమాధ్యాయమందు చెప్పబడెను. పుట 9 చూడవలెను. ధ్రువాగానమంతయును నారదప్రోక్తమనియే 32 వ అధ్యాయమందు చెప్పబడెను.

* [కాశీముద్రణమునందు 32 వ అధ్యా—474-484 శ్లో: బొంబాయిముద్రణమునందు 33 వ అధ్యా—11-22 శ్లో. బరోడా ముద్రణమునందు "గుణదోష విచారము" అను 33వ అధ్యా. - 11-28 శ్లో.]

# అధ్యాయము 34[1]

## అవనద్ధవాద్యములు[2]

[కాశీముద్రణమునందు 33 వ అధ్యా—270 శ్లోకములును, బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—259 శ్లోకములును కలవు. బరోడా ముద్రణము-34వ అధ్యా-304 శ్లో. భిన్నపాఠము-246 శ్లో.]

### అవనద్ధవాద్యోత్పత్తి

ఇంతవరకును ఆతోద్యవిధానమును వివరించితిని. ఇంక అవనద్ధవాద్యములను, మృదంగ-పణవ-దర్దురవాద్యముల విధిని, వాదనమును వివరింతును. స్వాతి-నారదులు వాద్య-గాంధర్వముల విధానమును సవిస్తరముగా చెప్పిరి. స్వాతి చెప్పిన మార్గమున పౌష్కర వాద్యములయొక్క ఉత్పత్తిని వివరింతును.

ఒకానొక అనధ్యయనదినమున, దుర్దినమున నీరు తెచ్చుటకై జలాశయమునకు స్వాతి వెళ్ళెను. అతడు ఆ నదిఒడ్డున కూర్చుండియుండగా దేవేంద్రుడు ధారాసంపాతముగ, భూమి ఏకార్ణవమగునట్లుగా వర్షించెను. వాయువేగమున జలాశయమున పడు ధారలచే జలపత్రములు అవ్యక్తమధురముగ ధ్వని చేసెను. వాని గంభీరమధురశబ్దమును, పత్రులయొక్క జ్యేష్ఠ - మధ్య - కనిష్ఠ ధ్వనులను విని స్వాతి ఆశ్చర్యపరవశుడయ్యెను. అట్లు విని, ఆశ్రమమునకు వెళ్ళి, పుష్కర-మృదంగ-పణవ-దర్దుర వాద్యములను విశ్వకర్మ సాహాయ్యమున రచించెను. దేవదుందుభిని చూచి మురజ-ఆలింగ్య-ఊర్ధ్వక-అంకికములను సృజించెను. చర్మావనద్ధములగు మృదంగ-దర్దురములను, తంత్రులతో పణవమును నిర్మించెను. ఊహాపోహవిశారదుడగు స్వాతి ఇంకను అనేకవిధములగు కాష్ఠ-ఆయసకృతములును, చర్మావనద్ధములును అగు ఝల్లరీ-పటహాదులను నిర్మించెను. ఆ వాద్యములందలి అంగ-ప్రత్యంగ విభాగమును ఇప్పుడు వివరింతును.

### అంగ-ప్రత్యంగవాద్యములు

దారునిర్మితవాద్యములలో విపంచీ-చిత్రవాద్యములు అంగవాద్యములు; కచ్ఛపీ-ఘోషకాది వాద్యములు ప్రత్యంగవాద్యములు.

---

1. కాశీముద్రణమునందు త్రయస్త్రింశాధ్యాయము (33 వ అధ్యా). బొంబాయి బరోడా ముద్రణములందు చతుస్త్రింశాధ్యాయము (34 వ అధ్యా).

2. 'వాద్యాధ్యాయమని' కాశీముద్రణపాఠము. 'పుష్కరవాద్యము' అని బొంబాయి ముద్రణపాఠము. 'పుష్కర వాద్యాధ్యాయము' అని బరోడా ముద్రణము.



మృదంగ-దర్దుర-పణవములు అవనద్ధవాద్యములలో అంగవాద్యములు; ఝల్లరీ-పటహాదులు ప్రత్యంగవాద్యములు.

వంశవాద్యము అంగము ; శంఖ-ఢక్కినీ వాద్యములు ప్రత్యంగవాద్యములు.

దశరూపకములందు ఉపయోగింపని ఆతోద్యమెద్దియును లేదు. కాని, రసభావములనెరింగి ఆయా వాద్యముల నుపయోగించవలెను.

ఉత్సవమునందును, ప్రయాణమునందును, రాజుల మంగళకార్యములందును, శుభసమయములందును, వివాహమందును, సంగ్రామములందును— ఇట్లు ఇతర కార్యములందును సర్వాతోద్యములను ప్రయోగించవలెను.

స్వాభావికవిషయములందును, గృహవార్తలయందును భాండవాద్యములను అల్పముగ ప్రయోగించవలెను.

ఉద్ధతకావ్యబంధములందు సర్వాతోద్యములను ప్రయోగించవలెను.

అంగముల సామ్యముకొరకును, ఛిద్రములను కప్పిపుచ్చుటకును, శోభకొరకును భాండవాద్యములను ప్రయోగించవలెను.

### అవనద్ధవాద్యములు

స్వరసముత్థితమును, కరణసంయుక్తమును మాన - జాతివిభూషితమును అగు అవనద్ధవాద్యములను వివరింతును.

చర్మావనద్ధములగు త్రిపుష్కరాది ఆతోద్యములు 'అవనద్ధవాద్యము'లనబడును. వీని భేదములు శతాధికములుగ కలవు. త్రిపుష్కరవాద్యముయొక్క లక్షణమును చెప్పుదును. ఇతరావనద్ధవాద్యములగు భేరీ-పటహ-ఝల్లరీ-దుందుభీ-డిండిమాది వాద్యములందు అక్షర-స్వర-మార్జనాదులు వేరుగా లేకపోవుటచే అచట వివరించవలసిన విధి అంతగానుండదు. కావున త్రిపుష్కరవాద్యము యొక్క విధానమునే వివరింతును.

వాగాత్మకము అగు ఛందము స్వరవత్తు (స్వరము కలిగినది), అభిధానవత్తు (శబ్దము కలిగినది) అని ద్వివిధము. అభిధానవత్తు భావాశ్రయమును, స్వరవత్తు ఆతోద్యసమాశ్రయమును అగుచున్నది. శరీరమునందును, వీణయందును మాత్రమే సప్తస్వరములుండును. అవే ఇతర వాద్యములందు గూడ ఉండును. మొదట శరీరమునుండి జనించి వీణయందును, పిమ్మట పుష్కర-ఘనవాద్యములందును సప్తస్వరములు సంక్రమించినవి.

గానముచేయువాడు ఏ స్వరమును పాడునో వాద్యములచే ఆ స్వరమునే ప్రయోగించుచుండవలెను. యతి-పాణి సమాయుక్తమును, గురు-లఘ్వక్షరాన్వితమునుఅగు పుష్కర- మృదంగ-పణవ-దర్దురవాద్యముల విధానమును వివరింతును—

వాద్యసంగ్రహము

16 అక్షరములు, 4 మార్గములు, 1 విలేపనము, 6 కరణములు, 3 యతులు, 3 లయలు, 3 గతములు (గతులు), 3 ప్రచారములు, 3 సంయోగములు, 3 పాణులు, 5 పాణిప్రహతములు, 3 ప్రహారములు, 3 మార్జనలు, 20 అలంకారములు, 18 జాతులు అనునవి పుష్కరవాద్యగతములైన ప్రకారములు.*

అక్షరములు 16 – క,ఖ,గ,ఘ,ట,ఠ,డ,ఢ, త,థ,ద,ధ య,ర,ల,హ అను ఈ అక్షరములను పుష్కరవాద్యమున వాష్కరణమున-ప్రయోగించవలెను.

మార్గములు 4 – ఆలిప్తమార్గము, గోముఖమార్గము, వితస్తమార్గము, అల్పమార్గము.

విలేపనము 1 – వామోర్ధ్వకప్రలేపనము (ఎడమవైపు బోనమును పట్టించుట).

కరణములు 6 -- రూపము, కృతము (ప్రతికృతము), ప్రతిభేదము, రూపశేషము, ఓఘము, ప్రతిశుక్లము.

యతులు 3 – సమము, స్రోతోవహము, గోపుచ్ఛము.

లయలు 3 – ద్రుతము, మధ్యము, విలంబితము.

గతములు 3 – తత్త్వము, ఘనము, ఓఘము.

ప్రచారములు 3 – సమప్రచారము, విషమప్రచారము, సమవిషమప్రచారము.

సంయోగములు 3 – గురుసంయోగము, లఘుసంయోగము, గురులఘు సంయోగము.

పాణులు 3 – సమపాణి, అవరపాణి, ఉపరిపాణి.

పాణిప్రహతములు 5 – సమపాణిప్రహతము, అర్ధపాణిప్రహతము, అర్ధార్ధపాణిప్రహతము, పార్శ్వపాణిప్రహతము, ప్రదేశినీప్రహతము.

ప్రహారములు 3 – నిగృహీతము, అర్ధనిగృహీతము, ముక్తము.

మార్జనలు 3 – మాయూరి, అర్ధమాయూరి, కర్మారవి.

అలంకారములు 20, జాతులు 18 ముందు వివరింపబడును.

పణవ-దర్దుర-మృదంగము లనెడి పుష్కరవాద్యములందు పూర్వోక్తషోడశాక్షరములు అభివ్యక్తములగు విధిని వివరింతును—

*[కాశీముద్రణమునందు 33 వ అధ్యా—1-39 శ్లో: బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—1-38 శ్లో.] బరోడా ముద్రణము - 34వ అధ్యా - 1-38 శ్లో.]



అక్షరవిధి : స్వర-వ్యంజనసంవిధానము

మృదంగాది వాద్యములందు క, ట, ర, త మొదలగు అక్షరములు దక్షిణముఖమునను ; గ, హ, థ మొదలగునవి వామముఖమునను అభివ్యక్తము లగును.

కకారాది హల్లులు అచ్చులతో సంయోగము నందును. అందు కకారము అ, ఇ, ఉ, ఏ, ఓ, అం అను అచ్చులతో సంయోగము నందును (క, కి, కు, కే, కో, కం)

ఖకారము ఇ, ఉ, ఓ లతో కలసి ఖి, ఖు, ఖో అగును.

గకారము ఉ, ఏ, ఓ లతో కలసి గు, గే, గో అగును.

ఘకారము అ, ఏ, ఓ లతో కలసి ఘ, ఘే, ఘో అగును.

టకారము అ, ఇ, ఓ, అం లతో కలసి ట, టి, టో, టం అగును.

ఠకారము అ, ఇ, ఓ, అం లతో కలసి ఠ, ఠి, ఠో, ఠం అగును.

డకారము అ, ఓ లతో కలసి డ, డో అగును.

తకార-థకారములు అ, ఆ, ఇ, ఏ లతో కలసి త, తా, తి, తే ; థ, థా థి, థే అగును.

దకారము అ, ఉ, ఏ, ఓ లతో కలసి ద, దు, దే, దో అగును.

ధకారము అ, ఇ, ఓ, అం లతో కలసి ధ, ధి, ధో, ధం అగును.

రలలు అ, ఆ, ఇ, ఏ లతో కలసి ర, రా, రి, రే; ల, లా, లి, లే అగును.

అకార-మకారములు శుద్ధములుగానే ఉండును.

కకార-ఘకార-వకార-థకార-ధకారములకు రేఫము అనుబంధముగా చేరుచుండును. ఉదా : ధ్రు, క్రం, వ్రేఘ్న, ఘ్రు, వ్రఘ్న.

కకారమునకు లకారముకూడ అనుబంధముగా నుండును. ఉదా : క్లం.

ఈ విధముగ ఈ పైని చెప్పిన అచ్సహితములగు హల్లులు ద్విహస్తసంయోగముచే పలికింపదగిన అక్షరములు.

ఆంకికము నందును, ద్విపుష్కరము నందును, మృదంగము నందును సమహస్తనిపాతమువలన 'ధం' కారమును పలికించవలెను.

అంగులిచలనముచే 'కు' కారము, అవష్టంభముచే 'య'కారము, అర్ధనిగృహీతముచే 'థ' కారము, దక్షిణముఖమున పార్ష్ణిపీడనముచే 'క్ల' కారము, అంగులికూజనముచే 'ఝ' కారము పలికింపబడవలెను.

ఊర్ధ్వకవామకమునందు సమహస్త నిపాతముచే 'ధం' (హం?) కారమును, ప్రదేశినిచే ఆలింగ్యమున 'క్లే' కారమును పలికించవలెను.

పైన స్వర-వ్యంజన సంయోగమును వివరించితిని.

పాణిప్రహతము లైదును నిగృహీత-అర్ధనిగృహీత-ముక్తము లగుచుండును. అందు సమపాణిప్రహతము నిగృహీతము అగుచో 'మ'కార మగును. గకార-దకార-ధకారములు అర్ధపాణిప్రహతములై అర్ధనిగృహీతములు అగుచున్నవి.

కకార-ఖకార-డకారములు పార్శ్వపాణిప్రహతములై నిగృహీతములు అగును.

త, థ, హ లు అర్ధపాణిప్రహతములును, ప్రదేశినీప్రహతములును అగును.

ఆలింగ్యమునందు థకార-థంకారములు ముక్తము లగును. వాద్యజము లగు అక్షరములు పదునారింటిని ఈ విధమగు సంయోగములచే వాద్యములందు ప్రయోగించవలెను. *

### మార్గములు

ప్రహారకరణాశ్రయములగు మార్గములు ఆలిప్త-అడ్డిత-వితస్త-గోముఖములు అను భేదముచే నాలుగు విధములు. అందు ఆలింగ్య-మృదంగములయందు అంగహారయుక్తముగా అడ్డితమార్గము ప్రయోగింపబడును.

ఆలిప్తమార్గము ప్రహారయుక్తముగా నుండును. ఊర్ధ్వకవాద్యమున వితస్తమార్గము ప్రయుక్త మగును. ఆలింగ్యవాద్యమునందు కరణబహుళముగా ఉపయుక్తమును సర్వపుష్కరప్రహతమును, అగునది గోముఖమార్గము.

అడ్డితమార్గము—ఉదా : మట్టంకథితఘట్టంఘంటాఘట్టంగత్థిత్యుంగత్థిమగద్య సంధిత్థ.

ఆలిప్తమార్గము—ఉదా : దద్రోమామాద్రోంమంగుదుర్పేగుదురనందుంద్రీం ప్రీంద్రం ఘేంద్రోమాం.

వితస్తమార్గము—ఉదా : నితాంతకితత్సేన్తాకినాంధిసంకేతాఇదుహుదు కేంతాంతస్తే.

గోముఖమార్గము—ఉదా : ఠథణఘేండణుస్త్రుందులజదుఖేర్ న్దఘటమట్టా ఇదుణుధుణాంత్థిఘటంఘిటిమాంకక్కుటాందుణుషేర్జకిటిమార్జ ధేధేకోఖోమఖోమ.

### ప్రచారములు

ఈ పుష్కరవాద్యములందు మూడు విధములగు ప్రచారములుండును—
1. సమము, 2. విషమము 3. సమవిషమము.

---

*[ కాశీముద్రణమునందు 33 వ అధ్యా—39-48 శ్లో. ఇందు గద్యభాగమధికము బొంబాయి-34 వ అధ్యా—38-42 శ్లో. బరోడా - 39 - 47 శ్లో.

శి. కాశీముద్రణమునందు పుట 435 లో 7 వ పంక్తినుండి 10 వ పంక్తివరకును, 13 వ పంక్తినుండి 22 వ పంక్తివరకును మొత్తము 14 పంక్తులు విడువబడెను.



వామ - ఊర్ధ్వకములందును, వామ - సవ్యములందును అడ్డితమార్గమున సమప్రచారమును చేయవలెను. ఆలిప్తమార్గమున వామోర్ధ్వదక్షిణములందు విషమప్రచారమును చేయవలెను. వితస్తమార్గమున సవ్యోర్ధ్వములందు విషమప్రచారమును చేయవలెను. అడ్డిత - గోముఖయోగమున హస్తసంచారము సమవిషమమై యుండును.

### మార్గములు : రసయోజనము

శృంగార-హాస్యములందు వాద్యమును అడ్డితమార్గమున ప్రయోగించవలెను. వీరాద్భుతరౌద్రములందు వితస్తమార్గమున వాద్యమును ప్రయోగించవలెను. కరుణరసమునందు ఆలిప్తమార్గమున ప్రయోగించవలెను. బీభత్స - భయానకములందు గోముఖమార్గమున వాద్యమును ప్రయోగించవలెను. రసములను, సత్త్వములను, భావములను, అభినయములను, గతిప్రచారములను గమనించి వాద్యమును ఆ యా స్థానసంయోగమున ప్రయోగించవలెను. మార్గాశ్రితములైన రసముల ననుసరించి ప్రహతవిధానమును పాటించవలెను.

ఇక దర్దుర-పణవ వాద్యవిధానమును వివరింతును. వాద్యము అతివాదితము అనువాదితము, సమవాదితము అని మూడువిధములుగా నుండును.

మృదంగమునకు అగ్రతోగామియగు వాద్యము అతివాదితము, మృదంగానుగతవాద్యము అనువాదితము, మృదంగసామ్యముననుండు వాద్యము సమవాదితము అనబడును.

పణవవాద్యమున ప్రయోగింపదగిన అక్షరములు—

ధాధానాచోత్తకులంద్రవ్వహులంహాకిరిణికిరిల్హాఠంశేణికృమిణికిధఖోణం.

### యతులు

యతులు—సమ - స్రోతోవహా - గోపుచ్ఛ భేదములచే యతులు మూడు విధములు.

త్రివిధపాణిసంయోగము 'యతి' అనబడును. ఆ సంయోగము రాద్ధము, విద్ధము, శయ్యాగతము అని మూడువిధములు. మూడువిధములగు సంయోగము కరణములందు విధింపబడుచున్నది.

అవపాణి, పాణి, గోపుచ్ఛయతి, స్థితలయ అనునవి ఒకచో కలసియున్న ఆ వాద్యము 'శయ్యాగత' మనబడును. గీతి ప్రాధాన్యముకలిగి దక్షిణమార్గమును అతివాదితమును కలిసియుండుటకూడ శయ్యాగతమే.

స్రోతోవహాయతి, మధ్యలయ, సమపాణి కలిసియున్న ఆ వాద్యము 'విద్ధ'

మనబడును. దక్షిణవృత్తి-మార్గములందు ఉత్తమ-మధ్యమపాత్రలకు సంబంధించిన గీత-వాద్యములందు విద్ధవాద్యమును ప్రయోగించవలెను.

ఉపరిపాణి, సమయతి, ద్రుతలయ కలిగియుండి, వాద్యప్రాధాన్యము కలిగియున్నచో ఆ వాద్యము 'రాద్ధ' మనబడును.

వాద్యసమాశ్రయములగు యతులు, పాణులు, లయలు నాట్యయోగాను సారముగా ప్రయోగింపబడవలెను.

## మార్జనలు

మాయూరి, అర్ధమాయూరి, కర్మారవి అను భేదములచే మార్జనలు మూడు విధములు; ఇవి స్వరాశ్రయములు. మాయూరీమార్జనయందు వామకమున గాంధారమును, దక్షిణమున షడ్జమును, ఊర్ధ్వకమున మధ్యమమును పలికించవలెను.

అర్ధమాయూరీమార్జనయందు వామపుష్కరమున షడ్జము, దక్షిణపుష్కరమున ఋషభము, ఊర్ధ్వకమున ధైవతమును ప్రయోగించవలెను.

కర్మారవియందు వామపుష్కరమున ఋషభము, దక్షిణపుష్కరమున షడ్జము, ఊర్ధ్వకమున పంచమమును ప్రయోగించవలెను.

మాయూరీమార్జనను మధ్యమగ్రామమునందును, అర్ధమాయూరీమార్జనను షడ్జగ్రామమందును, కర్మారవీమార్జనను సాధారణస్వరములందును ప్రయోగించవలెను.*

## మృత్తికాలక్షణము

మృదంగమునకు ఆవశ్యకమగు మృత్తికయొక్క లక్షణములను వివరింతును.

కంకర, ఇసుక, గడ్డి, ఊక లేనిదియు, విడివిడిగా ఉండనిదియు, ఎక్కువగా జిగటగా ఉండనిదియు, చవుడుకాని ఉప్పుమన్ను కాని కానిదియు, తెల్లగాకాని నల్లగా కాని ఉండనిదియు, పులుపుగా కాని వగరుగా కాని ఉండనిదియు అగు మృత్తికను లేపనమున కుపయోగించవలెను.

నదీతీరమందు నీరు ప్రవహించి తీసివేసినప్పుడు మిగిలిన నల్ల ఒండుమట్టిని మృదంగమార్జనమున కుపయోగించవలెను.

మిక్కిలి తెల్లగాకాని, మిక్కిలి నల్లగాకాని ఉండు మన్ను ధ్వనిని ఈయదు. బరువు అయిన మట్టి స్థిరముగా నుండదు. తుషోపేతమగునది స్వరములను పలుకదు.

*[కాశీముద్రణమునందు 33 వ అధ్యా—44-91 శ్లో; బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—48-103 శ్లో.] బరోడా ముద్రణము - 34వ అధ్యా 48-126 శ్లో.



శ్యామవర్ణముగల మట్టి చక్కగా ధ్వనులను ఇచ్చును. ప్రలేపనమునకు యవచూర్ణము లేదా గోధూమచూర్ణమును ఉపయోగించవలెను.

## సంయోగములు

త్రిసంయోగములు—గురుసంచయము, లఘుసంచయము, గురులఘుసంచయము అను భేదములచే సంయోగములు (సంచయములు) మూడువిధములు.

గురుసంచయము—గుర్వక్షరములను స్థితలయయందు ప్రవర్తింపజేయుట.

ఉదా:

దేశో కేతాం చంద్రాం ద్వంద్వం ఖేతాం ధ్ధం
ద్వంద్వం ద్రాఘేతాం కత్తాం ఖేత్తాం

లఘుసంచయము—లఘువులు ద్రుతలయయందు ప్రవర్తింపజేయబడుట.

ఉదా: ఘటమట మటఘట మథిఘట ఘటఘట

గురులఘుసంచయము— గురు-లఘువులు ద్రుతలయయందు ప్రవర్తింపచేయబడుట. ఉదా:

ఘట విమ ధిథే మథితం కితాంఘ గంఘ మోధితం నాద్వం కటధిం కరస్థి మఘవే

## గతములు

తత్త్వము, అనుగతము, ఓఘము అను భేదములచే గతములు మూడు విధములు. అక్షరసదృశముగాను, స్ఫుటములగు పదములు వర్ణములు కలిగియుండునట్లుగాను, వృత్తసమముగాను, సువిభక్తకరణసంయుతముగను వాద్యమును ప్రయోగించుట 'తత్త్వము'.

సమపాణి-అవపాణులతో కూడియుండునట్లుగను, స్పష్టములగు అనేక కరణముల ననుసరించి యుండునట్లుగను వాద్యమును ప్రయోగించుట 'అనుగతము'. ఉపరిపాణితో కూడి యుండునట్లుగను, అనేకకరణాశ్రయముగను వాద్యమును ప్రయోగించుట 'ఓఘము'.

## వాద్యసామ్యములు

సమస్తవాద్యములకు ఎనిమిది విధములగు సామ్యములు ఉండును— (1) అక్షరసామ్యము, (2) అంగసామ్యము, (3) తాలసామ్యము. (4) లయసామ్యము, (5) యతిసామ్యము, (6) గ్రహసామ్యము, (7) న్యాసాపన్యాససామ్యము, (8) పాణిసామ్యము.

1. గానమందు గురులఘ్వక్షరాన్వితమగు ఏవృత్తము నాశ్రయించియుండునో ఆవృత్తమునే వాద్యముకూడ ఆశ్రయించియుండుట అక్షరసామ్యము.

2. ధ్రువయొక్క గ్రహ-మోక్షములయందును, కలాంతరకలలయందును గానము ఏ అంగములను కలిగియుండునో ఆ అంగములనే వాద్యమునందును కల్పించుట అంగసామ్యము.

3. గానముయొక్క కళా-తాళప్రమాణములకు సరియగు కళాతాళ ప్రమాణములను వాద్యమునందును కల్గించుట తాళసామ్యము.

4. గానము ఏ లయ యందుండునో ఆ లయయందే వాద్యమును ప్రయోగించుట లయసామ్యము.

5. గానమునందు ఏ యతి ప్రయుక్తమగునో ఆ యతినే వాద్యము నందును అనుసరించుట యతిసామ్యము.

6. తత-అవనద్ధ-వంశవాద్యము లన్నియును ఏకశ్రుతికృతమగు గ్రహమును కల్గియుండుట గ్రహసామ్యము.

7. వంశ-వీణావాద్యములందు న్యాసాపన్యాసములు సమానముగా నుండుట న్యాసాపన్యాససామ్యము

8. గానమునందలి సమపాణ్యాదిపాణుల ననుసరించి ఆ పాణులనే వాద్యమునందును కూర్చుట పాణిసామ్యము.*

జాతులు : రసాద్యనుగుణప్రయోగము

వాద్యజాతులు పదునెనిమిది విధములు—

(1) శుద్ధ, (2) ఏకరూప, (3) దేశానురూప, (4) దేశాపేతరూప, (5) పర్యాయ, (6) విష్కంభ, (7) పర్యస్త, (8) సంరంభ, (9) పార్ష్ణిసమస్త, (10) దుష్కరకరణ (పుష్కరకరణ), (11) ఊర్ధ్వగోష్ఠిక, (12) ఉచ్చితిక, (13) ఏకవాద్య (ఏవంవాద్య), (14) మృదంగపణవ, (15) అవకీర్ణ, (16) అర్ధావకీర్ణ, (17) సంప్లవ, (18) విధూత.

1. శుద్ధ—ఏకాక్షరకృతము కాని, లేదా ద్వ్యక్షరకృతము కాని అయి కరణయోగము గల జాతి 'శుద్ధ' అనబడును. ఉదా: ఖోం ఖోం ణాం ణాం, చంద్రం, ఇంద్రం.

ఈ శుద్ధజాతిని మధ్యస్త్రీల విషయమున ఉపయోగించవలెను.

2. ఏకరూప—పై నాల్గు మార్గములలోను ఒకేమార్గము నాశ్రయించి యుండుజాతి 'ఏకరూప'.

*[కాశీముద్రణమునందు 33 వ అధ్యా—92-115 శ్లో; బొంబాయి ముద్రణము నందు 34 వ అధ్యా— 103-133 శ్లో.] బరోడా - 34వ అధ్యా - 127-147 శ్లో.



ఈ ఏకరూపజాతిని పురుషుల విషయమున ఉపయోగించవలెను. ఉదా: ద్రోఙ్ ధోఙ్ దోఙ్ ధోఙ్ ఘేఘేఙ్ (అడ్డితమార్గమునందు).

3. దేశానురూప—అన్ని ప్రకృతులకును తగినట్లు స్థిత-ద్రుత-మధ్యలయల యందు దేశ-కాల-అవస్థానుగుణముగ వినియుక్తమగు జాతి 'దేశానురూప'.

సర్వాతోద్యములును ఒకే కరణమును అనుసరించుచు మృదంగవాద్యానుగమమువలన ఏకరూపము లగుట 'ఏకరూప' అనబడును. అడ్డితమార్గమున సంభోగ శృంగారమున స్థితలయయుక్తముగ దేశానురూపజాతిని ప్రయోగించవలెను. ఈ జాతిని ఉత్తమస్త్రీశృంగారమున కూడ ఉపయోగించవలెను.

ఉదా : మీమత్థిత్థమభూత్థికిమా.

4. దేశాపేతరూప—దీనిని కరుణరసమున ఉపయోగింపదగును. వామోర్ధ్వకవేధలచే ప్రవృత్తమును, క్షిప్త-అపకృష్ట లయయుతమును అగుజాతి 'దేశాపేతరూప' అనబడును. ఉదా : ఘేద్రజఘేద్రాజఘేఘేమే.

5. పర్యాయ—పూర్వసిద్ధమైన కరణములను పొంది, పర్యాయముగ వర్తించుచు త్రివిధలయయోగము కల్గియుండునది 'పర్యాయ'. ఇది వీరాద్భుతరౌద్ర రసములయందు ప్రయోగింపబడును. ఉదా : ఘోదాఘ్జేదేఙ్గుదుఘోజ. ఇవి వామోర్ధ్వకమున వామహస్తసంచారముచే ప్రయోజ్యములు.

6. విష్కంభ—గురుద్వయము, లఘుద్వయము, లఘు-గురు-గురు-లఘువులు అగు అక్షరములు కల్గియుండు జాతి 'విష్కంభ'. ఇది ఉత్తమస్త్రీల శృంగారమున ఉపయుక్తము. ఉదా: సిఙ్మాఘ్జిటచేద్రగుదుఘేఝమత్థిమేత్థం.

7. పర్యస్త—ఏకైకకరణయోగము కలదై, సర్వమార్గసంయోగము కలిగి సమహస్త-విషమసంచారయుతమగు జాతి 'పర్యస్త'. ఇది ఆకాశగమన-విమానయాన-రథగమనములందును ఋషి-విద్యాధర-భుజంగమాదుల గతి విన్యాసములందును లయానుగుణముగ ప్రయుక్తమగును. ఉదా : ఘేఙ్త్రాఙ్ఘోహ్ణభే.

8. సంరంభ—ఇది అధమస్త్రీల విషయమున ప్రయోగింపనగును.

9. పార్ష్ణిసమస్త—వితస్తమార్గమునందు ఊర్ధ్వకదక్షిణముఖమున క్షిప్తముగను, అధికముగను ఉండునది 'పార్ష్ణిసమస్త'. ఇది శృంగార-హాస్యగతులందుపయుక్తమగును. ఉదా : తత్థికటంమాంచ్ఛి, దీనిని పార్ష్ణినిష్పీడనములచే ప్రయోగించవలెను.

10. దుష్కరకరణ—సమస్తపాణిహస్తసంచారసహితమును, సర్వమార్దంగ ప్రకారసంయుక్తమును, త్రిలయయుక్తమును అగు జాతి 'దుష్కరకరణ'. ఇది

దైత్యేంద్ర-భుజగ-రాక్షస-పిశాచ-గంధర్వ-గుహ్యక-కింపురుష-దానవాదుల గతులం దుపయోగింపదగును. ఉదా: దుణుదుణుదుణాకింకథిమ ఘేజ్ ఘో ఉేజ్ మదీ.

11. ఊర్ధ్వగోష్ఠిక—ఊర్ధ్వకదక్షిణప్రహతము, ఆంకిక దక్షిణవామ ప్రహార ప్రవృత్తము, ఉద్ధత వాద్యము, విత స్తమార్గాశయము అగుజాతి 'ఊర్ధ్వగోష్ఠిక'. ఇది దివ్యులగతి విషయమున ప్రయోగింపబడును. ఉదా: 'ధృజ్' అనునది అధికముగా నుండుట.

12. ఉచ్ఛితిక—ఇది సర్వమార్గములందును ప్రయుక్త మగును. ఉదా: కేన్తా కేన్నా.

13. ఏవంవాద్య (ఏకవాద్య)—విత స్తమార్గమున ప్రయోగింపబడునది 'ఏవంవాద్య'. దీనిని రాజుల స్వభావగమనమున ప్రయోగించవలెను. సర్వమృదంగ ప్రకారములతో ఇది కూడియుండును. మరియు నిది గోముఖీమార్గసహితమై, విలంబితలయయం దుండును. దీనిని కుహకాభినయమున కూర్చవలెను.

వామన-విహ్వల-ఖంజాది వికలాంగుల గమనమునందును దీనిని ప్రయోగించవలెను. ఉదా: ఘండాజ్ఞాతోదకితాద్యేఝ్ జేజ్ మదాథిఘటఇఝ్జే.

14. మృదంగపణవ—ఇది సర్వమార్గసంచారిణియగు జాతి. పృథివీ-పర్వతాది వర్ణనమున ఉపయోగించును. ఉదా: ర్ధోం ర్ధోం ఉేం ఉేం.

15. అవకీర్ణ—దీనిని స్త్రీలగతి విషయమున ప్రయోగించవలెను. త్రిగుణములగు మృదంగ-దర్దుర-పణవ వాద్యకరణములతో కూడినది 'అవకీర్ణ'. ఇది గోముఖమార్గమున ప్రయోగింపబడును. ఉదా: కేన్తాం కేన్తాం.

16. అర్ధావకీర్ణ—అర్ధకీర్ణములగు దర్దుర-మృదంగ కరణములతో కూడినదై, మార్గములతో కూడినదై, అర్ధప్రయుక్తవాద్యకమగుజాతి 'అర్ధావకీర్ణ' ఉదా: థజ్గద ఘేట్టా సేంద్రాం.

17. సంప్లవము—వానర చేష్టల విషయమున 'సంప్లవము' ప్రయుక్తమగును.

18. విధూత—దివ్యములగు నానాకరణములతోను, చిత్రమృదంగ ప్రహారములతోను కూడినదై ఉత్తమనాయకుల స్వాభావికగతివిషయమున ప్రయుక్తమగునది 'విధూత' జాతి. ఉదా: దదిగేగుదు ఘేజ్.

ఈ పై జాతులను ఆయాగతిప్రచారములందు ప్రయోగించవలెను. ఇట్లు పై విధి ననుసరించి వాద్యములను ప్రయోగించవలెను.*

---

*[కాశీముద్రణమునందు 33 వ అధ్యా—116-155 శ్లో; బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—134-163 శ్లో.] బరోడా 34వ అధ్యా-148-170 శ్లో.]



గతములు

గతిప్రచారమునందును, గానమునందును, దశరూపకములందును, సప్తరూపమువందును, ఛందకాసారితములందును గుర్వక్షరకృతము, అల్పాక్షరకృతము అగు వాద్యమును అర్థానుసారముగా ప్రయోగించవలెను. రాజులు లలితభావము కలవారగుటచే వారి గతిప్రచారమున స్వభావజమగు వాద్యమును ప్రయోగించవలెను. గతిపరిక్రమములలో ప్రథమగానమునందు తత్త్వమును, ద్వితీయగానమునందు అనుగతమును, తృతీయగానమునందు ఓఘమును ప్రయోగించవలెను.

వాద్యము స్థితాపకృష్టాధ్రువలయందు అనుగతగతిని; ప్రావేశికీధ్రువయందు అనుగతగతిని కలిగియుండును. నైష్క్రామిక్యంతరాధ్రువలయందు వాద్యమును త్రిలయయుతముగా ప్రయోగించవలెను.

ప్రాసాదికీధ్రువయందు ద్రుతలయ యుండును.

ధ్రువలయందు వాద్యము ప్రకరణాశ్రయముగా నుండవలెను.

ధ్రువలయందలి మాత్రాంశవికల్పమును గతిపరిక్రమమున భాండవాద్యమునందు కూడ కల్పించవలెను.

గ్రహవికల్పనము

ఇక భాండసమాశ్రయ మగు గ్రహ[4] వికల్పమును వివరింతును. శమ్యా-గ్రహములను ఎల్లప్పుడును దక్షిణపుష్కరమునను, తాళ-గ్రహములను వామోర్ధ్వకమునను, తర్జనీగ్రహమును ఆలింగ్యమునను ప్రయోగించవలెను.

నిష్క్రామమున ఆకాశగ్రహమును ప్రయోగించవలెను. శీర్షక-ఉద్ధతలయందు ప్రదేశినీగ్రహము, నర్కుట-అడ్డిత-ప్రాసాదికీధ్రువలయందు ఏకకలమగు సన్నిపాతగ్రహము, శీర్షకములందు చతుర్ద్వికలయోగజమైన ఆకాశగ్రహము ప్రయోగింపబడును.

తాండవాదులు: వాద్యవిధి

ఇక తాండవమునందును, సుకుమార (లాస్య) నృత్తమునందును వాద్యవిధిని వివరింతును. గానమున మొదటి పరివర్తమును భాండరహితముగా ప్రయోగించవలెను; ఆ పరివర్తము చివరనుండు సన్నిపాతమును భాండగ్రహసహితముగా ప్రయోగించవలెను. నృత్తశోభకొరకు అంగాంగపరివర్తనము నాచరించవలెను.

---

4. గ్రహము=సంగీతరచనలలో తాళము నుపయోగించి సంగీతమును ప్రారంభించు తావునకుగల పేరు. దీనినే తెలుగులో 'ఎత్తుట' అందురు [సంగీతశబ్దార్థచంద్రిక-పుట 113].

లయపరివర్తమున సంగీతకమును ప్రయోగించవలెను. ఎచట అంగము అభినయ సహితమగునో అచట వాద్యమును ప్రయోగించవలెను. అంగహార - నృత్తములందు వాద్యమును ప్రయోగించవలెను. ఎచట ఒకే అంగము గీతినళమున పునఃపున రావర్తితమగుచుండునో అచట మొదటిసారి అంగమును అభినయించవలెను. మిగిలిన వానిని నృత్తముతో కూర్చవలెను. గానము ఏ వృత్తమును కలిగియుండునో దాని ననుసరించియే వాద్యమును ఉండవలెను. గీత - వాద్యప్రమాణానుగుణముగ అంగ విచేష్టితమును ఆచరించవలెను.

గీత - వాద్యములలో ప్రహారము స్థితలయయందు అల్పమును, మధ్యలయ యందు అక్షరసమమును, ద్రుతలయయందు ఉపరిపాణికమును కావలయును.

తాండవమున సమము, రక్తము, విభక్తము, స్ఫుటము, శుద్ధప్రయోగజము, నృత్తాంగగ్రాహి అగు వాద్యమును ప్రయోగించవలెను.

నృత్తసహితములగు ప్రయోగములందు వాద్యమును తత్త్వ-అనుగతము లందును, నృత్తరహిత ప్రయోగములందు తత్త్వ - ఓఘములందును ప్రయో గించవలెను.

స్థిత-మధ్య-ద్రుతలయలయందు గానానుసారముగా వాద్యమును ప్రయో గించవలెను.

పద-నృత్త-అంగహారములందు వానిననుసరించియే వాద్యమును ఉండవలెను.

అలంకారములు

ఇక వాద్యసంశ్రయములగు అలంకారములను (=తోటకములు=ప్రకార ములు) ప్రవచింతును-(1) చిత్రము, (2) సమము, (3) విభక్తము, (4) ఛిన్నము, (5) ఛిన్నవిద్ధము, (6) అనువిద్ధము, (7) స్వరూపానుగతము, (8) అనుస్సృతము, (9) విచ్యుతము, (10) దుర్గము, (11) అవకీర్ణము, (12) అర్ధావకీర్ణము, (13) ఏకరూపము, (14) కరిక్షిప్తము, (15) సాచీకృతము, (16) సమలేఖము, (17) చిత్రలేఖము, (18) సర్వసమవాయము, (19) దృఢము, (20) నియ మాన్వితము.

1. చిత్రము—నిర్వర్తితాదిచిత్రకరణములచేతను, నానావిధహస్తముల చేతను ప్రయుక్తమై త్రిలయము, త్రిపాణియుతము అగు వాద్యము 'చిత్రము' అనబడును.

2. సమము—నానాకరణాశ్రయములగు దర్దుర - పణవ - మృదంగములతో తాల-అంగ-వంశానుయుక్తముగ ప్రయోగింపబడు వాద్యము 'సమము'.



3. విభక్తము—అత్యాయతము కానిదై, అక్షరపాణిలయలందు సమ- విభక్తముగ నుండు వాద్యము 'విభక్తము'.

4. ఛిన్నము—త్రిలయయుతమగు వాద్యము సహసా వివర్ధమానమగుచు సర్వాతోద్యప్రయుక్తమైనచో 'ఛిన్న' మనబడును.

5. ఛిన్నవిద్ధము—మృదంగములయందు అర్ధపాణియు, పణవములందు ఉపరిపాణియు ప్రయుక్తమైనచో అది 'ఛిన్నవిద్ధము'.

6. అనువిద్ధము—సర్వాతోద్యములయందు విద్ధానువిద్ధమై పరస్పరవిరోధ ముతో ప్రయోగింపబడు వాద్యము 'అనువిద్ధము'.

7. స్వరూపానుగతము—ప్రకృతికి అనురూపమైన తాలముతో కూడిన విశుద్ధవాద్యము 'స్వరూపానుగతము'.

మురజమును పణవముకాని, పణవమును దర్దురము కాని అనుసరించి యున్నచో అదికూడ స్వరూపానుగతమే.

8. అనుస్సృతము— వాద్యములన్నియును పరస్పరసామ్యమును కలిగి యుండుట 'అనుస్సృతము'.

9. విచ్యుతము—ఏకజాత్యనుగతవాద్యము అన్యజాతికముగ ప్రయుక్త మైనచో అది 'విచ్యుత' మనబడును.

10. దుర్గము— విషమప్రచారము కలదై, సర్వమార్గనియతమును, అవిభక్తాక్షరకృతమును అగునది 'దుర్గము'.

11. అవకీర్ణము—సమవృత్తమునందు పణవసహితమై మురజము నానా విచిత్రకరణములతో ప్రయోగింపబడుట 'అవకీర్ణము'.

12. అర్ధావకీర్ణము—ద్రుతలయయందు ప్రారంభించి పణవ-దర్దురములు అర్ధపాణియుతములుగ ప్రయుక్తములైనచో అది 'అర్ధావకీర్ణము'.

13. ఏకరూపము—సర్వాతోద్యములును ఏకకరణభావకములై, సమ వృత్త - పదములు కల్గియుండునది 'ఏకరూపము'.

14. పరిక్షిప్తము— అల్పమగు మృదంగవాద్యము పణవములచే ఆచ్ఛా దితమై, అవిభక్తాక్షరపదము అగునది 'పరిక్షిప్తము'.

15. సాచీకృతము—ఒకే వాద్యముచే చిత్రకరణము నృత్తాంగహారాను గతముగ ప్రయోగింపబడినచో అది 'సాచీకృతము'.

16. సమలేఖము—పణవముకాని, దర్దురముకాని ఉపరిపాణిగతమై మురజ మును అనుసరించిన అది 'సమలేఖము'.

17. చిత్రలేఖము— సంరబ్ధములగు మృదంగ - పణవాదులచే బహువిధ చిత్రవాద్యములను ప్రయోగించినచో అది 'చిత్రలేఖము'.

18. సర్వసమవాయము— సర్వమార్గగతము, సర్వపాణిలయాశ్రయము, విచిత్రము, విభక్తము అగు వాద్యము 'సర్వసమవాయకము'.

19. దృఢము— మధ్యలయోపేతము, సువిహితాక్షరము, గతిప్రచార సహితము అగు వాద్యము 'దృఢము'.

20. నియమాన్వితము—ప్రశాంతనియమోపేతము, స్ఫుటముగా నాట్య సమన్వితమును అయి గీతమును పొందనిది 'నియమాన్వితము'.

ఈ అలంకారములను, జాతులను రసభావముల ననుసరించి గీతమునందును, గతిప్రచారమునందును ప్రయోగించవలెను. *

కుతపవిన్యాసము

ప్రాఙ్ముఖముగ రంగమున ఉపవిష్టులై నేపథ్యగృహద్వారముల మధ్యభాగ మున కుతపవిన్యాసమును గావించవలెను.

రంగాభిముఖులైన మార్దంగిక-పాణవిక-దార్దురికులు, గాయక-గాయికా-వాంశిక-వైణికసహితులై, అశిథిలాయితతంత్రీబద్ధస్తనితములగు ఆతోద్యములను గ్రామ-రాగ-మూర్ఛనానుగుణముగ నుంచి మృదంగవాద్యములు నిపీడిత - నిగృహీత-అర్ధనిగృహీత-ముక్తప్రహార కృతములగుచుండగా వాదకులు దర్దురాదివాద్య ముఖములందు హస్తముల నుంచి దేవతావాహన-విసర్జనములకై త్రిసామమును మొదట ఆచరించవలెను.

అందు ప్రథమసామముచే సచరాచరజగత్సృష్టి - స్థితి - లయహేతువగు బ్రహ్మను, వామపార్శ్వమందలి చంద్రుని, దక్షిణపార్శ్వమందలి పన్నగులను సంతుష్టుల నొనరించవలెను. రథంతరసామముచే మునులను, బృహత్సామముచే దైవతములను ప్రీతులనుచేయవలెను. మూడు సామములు కలది కనుక ఇది త్రిసామ మనబడెను. ఈ త్రిసామము త్రిమూర్తులకును ప్రీతిప్రదము.

నాలుగు వేదములకు మొదట ఓంకారమునువలె సర్వగీతముల ముందును త్రిసామగానమును చేయవలెను.

త్రిసామము మూడు ప్రచారములు, మూడు లయలు, అడ్డితీమార్గముకలదై షట్కలముగా కాని త్రికలముగా కాని ప్రయోగింపబడవలెను.

* [కాశీముద్రణమునందు 33 వ అధ్యా—156-205 శ్లో: బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—164-197 శ్లో.] బరోడా - 34వ అధ్యా-171-214 శ్లో.



ఆ త్రిసామాంతమున పూర్వరంగవిధి ననుసరించి ఛందస్సమముగను, అక్షర సమముగను వాద్యమును ప్రయోగించవలెను. బహిర్గీతమును త్రిలయయుతముగా కల్పించవలెను.

ఆసారితమున తత్త్వ-అనుగతగతిప్రాయముగ వాద్యమును ప్రయోగించ వలెను. మొదట మృదంగవాద్యమును వామోర్ధ్వకప్రచారయుతముగ ప్రయోగించవలెను. తరువాత విపంచీవాద్యమును ప్రవర్తింపజేయవలెను. మొదట ఖాండముచే రంగమును రంజితము నొనరించి, పిమ్మట ధ్రువాగానమును ఆచరించ వలెను. స్త్రీ - బాల - మూర్ఖావకీర్ణమగు రంగమున కుతూహలోత్పాదనమునకై ధ్రువాగానము నాచరించవలెను.

ఆచార్యాః సమ మిచ్ఛంతి పాదచ్ఛేదం తు పండితాః ।
సుకుమారం స్త్రియశ్చైవ వికృష్ట మితరే జనాః॥ 211

—గానము సమముగా నుండవలెనని ఆచార్యులును, పాదములను ఛేదించి చదువవలెనని పండితులును, సుకుమారముగ చదువవలెనని స్త్రీలును, వికృష్టముగ చదువవలెనని ఇతరులును వాంఛింతురు.

ఆ ధ్రువాగానాంతమున తాండవము నధికరించి నర్తకి అవతరించు సమయ మున లఘుసంచయము గల ఆంకికమున అంగులిప్రచలనప్రాయమగు వాద్యమును ప్రయోగించవలెను.

ఉత్తరాభిముఖుడగు గాయకుని వామపార్శ్వమున వైణికుడును, వైణికుని దక్షిణభాగమున (వామభాగమున?) మృదంగవాదకుడును ఉండవలెను.[5] వెనుక పూర్వరంగమున చెప్పిన విధానము ననుసరించి నృత్తాంగహారానుగతముగ వాద్య ప్రయోగము నాచరించవలెను.

శుష్కాపకృష్టయందు క్రింది విధముగ వాద్యము ఉండవలెను:

థోధో థోఖే ఖేధోధేజ్ ణదమ్యాం ఖోద్ధోకేతా ఖఖిఖేణ కసుగు ఘేజ్ ణో ఖఖేజ్ తాఙ్ఖేజణమ్ కిటకిట డఘే ఙ్ఖేఘే కటుకఘు గుదు కంల బలాఖో ఖోఖోవా ధ్రునే టా మాణిం ణమ్మాం కిటబత్థి.

వామకరణమందు సన్నిపాతగ్రహమున వాద్యము క్రింది విధముగా నుండ వలెను :

5. 5 వ అధ్యాయవ్యాఖ్యలో అభినవగుప్తుడు గాయక-వాదకుల స్థానములను వివరించియుండెను. ఆ వివరణమును పటరూపమున పుట 156 లో వివరించియున్నాను. ఈ విషయమును కొంత భరతుడే ఈ అధ్యాయమందు వివరించిన సత్యమును ఎవరును గుర్తించినట్లు కన్పట్టదు.

ఖోఖో ణాం దోదోదో కః మోకః దహేణణా థోథో ణోఘో ఘటమట థ్ధి మం ఘోఘో కటకట ఝుంకో ఖో థిత కటకటాం ఘటకమథ్ధి ఘోఘోమి థ్ధిణాం కిటికిణాంఖ కక్లం.

వితస్తమార్గమందుండు వాద్యమున ప్రదేశినీగ్రహము క్రిందివిధముగా నుండ వలెను:

ణణణఖో కణణో మధుణాం ఖోఖో మథితకి తాంతకి తాంకిటి కితోం ఖో ఖోమతితాం మథ్ధి ద్రమతితి కింతి కేం తాం కేంతాం ద్రీంతాం న త కేంతాం టఘి తాం ద్రాం కృంతాం ద్రాం తాం కిణ్ణాంకిణ్ణాం ముద్రాం ద్రేం ద్రేం క్లేం ధ్రుం ధ్రుం ద్రా ద్రాం ధ ద్రే ద్రాం ఘేన్ద్రాం ఘేంద్రా ఘజీక్లీజ.

ఇట్టి వాద్యములను చతురస్ర-త్ర్యస్రపూర్వరంగములందు ప్రయోగించవలెను.

నాయకగతులు - వాద్యవిన్యాసము

ఇక నాటకాదులయందు ధీరోదాత్త-ధీరోద్ధత-ధీరలలిత-ధీరశాంతు లనెడి నలుగురు నాయకుల స్వస్థావస్థల యందలి గతిప్రచారమునం దుపయోగింపదగు వాద్యములను వివరింతును.

దేవతల గతియందు 'బ్రం ధ్రం ధ్రం ధ్రా ద్రం' ప్రాయమగు వాద్యమును ప్రయోగించవలెను.

రాజుల గతియందు 'ఘేంతాం' ప్రాయముగా వాద్యమును ప్రయోగించవలెను.

మధ్యమపురుషుల గతిప్రచారమున "ధ్రంక్లంధటుఘీంఘింఘిటథ్ధిదునకిలీద్రాం ణాంణాంఘద్రా" ప్రాయముగ వాద్యము ఉండవలెను.

ఇక స్థితధ్రువ యందలి వాద్యవిధానమును వివరింతును—

ఇందు పాదవిన్యాసములు ఏకకల - ద్వికల - త్రికల - చతుష్కలములుగ ఉండును. ఖాండవాద్యము ప్రసన్నగానముతో సామ్యము కలిగియుండవలెను. స్వస్థగతిప్రచారమున త్రికలము లేదా చతుష్కలము అగు లయ-యతి విధానమును పాటించవలెను. ధ్రువావిరామములు వాద్యమునందు ఏకకల-ద్వికలములుకారాదు. త్వరితగమనముగల గతిప్రచారములందు "ధ్రజ్ ధ్రజ్ ఘేజ ధేజ" ప్రాయముగ వాద్యమును ప్రయోగించవలెను.

దుఃఖార్తుడు, వ్యాధితుడు, శాపక్లేశనిపతితుడు, ఇష్టజన-విభవనాశములు కలవారు, వధ-బంధ-నియమోపవాస యుక్తులు మొదలగు వారిగతి ప్రచారము లందు అలిప్త మార్గాశ్రయమగు ఉత్థాపనవాద్యమును ప్రయోగించవలెను.



దైత్య-దానవ-యక్ష-రాక్షస-భూత-పిశాచ-గ్రహాదుల గతులందు "ధ్రుజ్ ధ్రుజ్ ఖదఘటుతుతంతతో ద్రాం" మొదలగు అక్షరములతో కూడిన కరణములచే వాద్యమును ప్రయోగించవలెను.

ఖంజ-వికల-వామన-కుబ్జాదుల గమనమున "ఘేతాంకటకాం" అని వాద్యమును ప్రయోగించవలెను.

యతి-ముని-శాక్యాదుల గతిప్రచారమున "ధోఖోద్విత్విఖదగుదువోటక్లన దోధంతికికి" అని వాద్యమును ప్రయోగించవలెను.

విదూషక - వర్షవరాదుల గమనమున "ఘేఘేంస్తాణోణ్ణాదోణ్ణాణ్ణాం" అని వాద్యమును ప్రయోగించవలెను.

వృద్ధ-శ్రోత్రియ-కంచుకి-స్థూలాదుల గమనమున "ద్రీంద్రోంద్రాంజ్ ద్రోజ్ ధిజ్ ద్రోణాంఖోఖోణా" అని వాద్యమును ప్రయోగించవలెను.

రాజుల గమనమున "అవిధద్గోంకంఖుఖు" అని వాద్యమును ప్రయోగించ వలెను.

మధ్యముల, వేశ్యా - శిల్పకారికల గతులయందు "ధఖుఖుధికిటమధికిణటో ణాంధో" అని వాద్యమును ప్రయోగించవలెను.

ఈ విధముగ భావ-రసానుగుణముగను, అవస్థానుగుణముగను వాద్యమును ప్రయోగించవలెను. భావావేశముగను, మార్గాశ్రితముగను వాద్యమును ప్రయోగించవలెను. *

వాద్యమును జాతి - మార్గ-ప్రచార - కరణ-అక్షరములతో వస్తుసంకీర్ణముగ వాయించువాడు శ్రేష్ఠుడగు వాదకుడు.

అనుబద్ధము, విప్రహారికము, సిద్ధి, పరిచ్ఛిన్నము అని అంతర్వాద్యములు నాలుగు విధములు.

ఖోఖోణఖిఘే—అనునది అనుబద్ధసంజ్ఞమగు అంతర్వాద్యము.

ధ్రుంద్రాంఖోఖో—అనునది విప్రహారికసంజ్ఞమగు అంతర్వాద్యము.

ఐశ్వర్యము, విస్మృతి, శ్రమ, వస్త్రాభరణ సంయమము అనువానియందు 'సిద్ధి' నామకాంతర్వాద్యమును నానాకరణసంశ్రయముగ ప్రయోగించవలెను.

'సిద్ధి' అను ఈ అంతర్వాద్యమును యథోచితమార్గకరణాశ్రయముగను, చిత్రకరణముగను-పంచపటకలముగను ప్రయోగించవలెను.

* [కాశీముద్రణమునందు 33 వ అధ్యా—206-216 శ్లో—ఇందు అధికభాగము గద్యము; బొంబాయిముద్రణమునందు 34 వ అధ్యా—196-200 శ్లో. బరోడా ముద్రణము నబరు -34వ అధ్యా - 215-236 శ్లో

పరిచ్ఛిన్నాంతర్వాద్యమును సార్వభాండికముగ ధ్రువాగానమునందు గభీరధీర ప్రహారము కల్గునట్లుగా ప్రయోగించవలెను.

ఉత్తముల విషయమున వితస్తమార్గాశ్రయమును పంచపట్కలమును అగు వాద్యమును ప్రయోగించవలెను. ఉదా: ధుంధుంధుంల్క.

ఉత్తమస్త్రీలకు అడ్డితమార్గాశ్రితమగు వాద్యమును "ణణాంఖోఖోణణ్ణాం" అని ప్రయోగించవలెను.

అధమస్త్రీలకు ఖంజ - నర్కుటములందు "సంకేత కిటి విణ్ణాం" అని ప్రయోగించవలెను.

ప్రాసాదికీధ్రువయందు సమపాణివిభక్త్యంతరముచే వాద్యమును ప్రయోగించవలెను

ద్రుతధ్రువయందు ఉపరిపాణికము చిత్రకరణము అగు వాద్యమును, అడ్డిత ధ్రువయందు ఉపరిపాణికము చిత్రకరణము అగు వాద్యమును, అవకృష్ట ధ్రువయందు ఏకసన్నిపాతకృతమగు వాద్యమును ప్రయోగించవలెను.

ప్రాసాదికీధ్రువయందును, అంతరధ్రువయందును పరివర్తము నాచరించి, భాండరహిత మగు ఒక గీతమును ప్రయోగించవలెను.

సన్నిపాతాంతమునందు భాండవాద్యగ్రహము జరుగవలెను.

అడ్డితధ్రువయందు "ణాదేదేదేదేఖో దణ్ణంధుంధుం" అని వాద్యమునను ప్రయోగించవలెను. నర్కుట-ఖంజములందు "ణణ్ణావుపుణాణాఖోణాణ్ణా దేదేదేదే ఖోఖోఖోఖో" అని వాద్యమున ప్రయోగించవలెను.

ఉద్ఘాత్యము:సంభ్రమ-ఆవేగ-అమర్ష-విస్మయ-ఉత్సాహ-శోకజమగు అనుభవమున వాయింపబడు వాద్యము 'ఉద్ఘాత్య' మనబడును.

మోక్షము : అడ్డితధ్రువయందు "కింత కింతాం" అనియు, స్థితధ్రువయందు "ఘతతాం" అనియు, అపకృష్టాధ్రువయందు "వవతాం" అనియు మోక్షములను ప్రయోగించవలెను.

పైన ధ్రువలయందలి గ్రహ - మోక్షములను వివరించితిని. మార్దంగికుడు తాల - మార్గ - కాల - స్వర జ్ఞానమును కలిగియుండవలెను.

కాల - తాల శాస్త్రజ్ఞుడు కాని వాదకుడు చర్మఘాతకుడు మాత్రమే అని విద్వాంసులు నిందింతురు.

## ఆతోద్యలక్షణములు

ఇక ఆతోద్యముల లక్షణములను వివరింతును—



హారీతక్యాశ్రయము, యవాశ్రయము, గోపుచ్ఛరూపము అని మృదంగ క్రియలు మూడు విధములు—

అందు ఆంకికము హారీతక్యాకృతి, ఆలింగ్యము గోపుచ్ఛరూపము, ఊర్ధ్వకము యవాకృతి అయియుండును.

మృదంగ-ఆంకికములు మూడు తాలముల ప్రమాణము కలవై యుండవలెను. వానిముఖము 13, లేదా 14 అంగుళములుండవలెను. ఊర్ధ్వకము నాలుగు తాలముల ప్రమాణము కలదిగా నుండవలెను. దానిముఖము 8 అంగుళముల ప్రమాణము కలిగి యుండవలెను.

పణవము 16 అంగులముల పొడవు కలిగి యుండవలెను ; ఇందలి మధ్యభాగము 8 అంగుళములు కృశముగా నుండవలెను. ముఖము 5 అంగుళములుండవలెను. దాని ఓష్ఠము (అంచు) $1\frac{1}{2}$ అంగుళముల ప్రమాణము కల్గియుండవలెను. దానిమధ్య అవకాశము నాలుగు అంగుళముల ప్రమాణము కల్గియుండవలెను.

దర్దురము ఘటాకారముగా నుండును. దానిముఖము ఘటముఖసదృశముగా నుండవలెను. ముఖము 9 అంగుళముల ప్రమాణము కల్గియుండవలెను. 12 అంగుళముల విస్తీర్ణము కలదై, పీనమైన ఓష్ఠముకలదై యుండవలెను.

## చర్మలక్షణములు

ఇక చర్మలక్షణమును వివరింతును—

చర్మము జరోపహతము కాని, కంకముఖాహతము కాని, మేదోపగతము కాని, ధూమాది దూషితముకాని కారాదు. ఈ దోషములు లేని గోచర్మమును ఉపయోగించవలెను. చిగురుతో సమానముగా నున్నదియును, హిమకుందేందు సమానవర్ణమును, స్నిగ్ధమును, ఆమిషవిహీనమును, పదను చేయబడినదియును అగు చర్మము వాద్యమునకు ప్రశస్తము.

మృదంగవాద్యమును, చర్మమును భూతలమునందుంచి దేవతార్చనము కావించవలెను. హస్త-చిత్రా నక్షత్రములలో ఒక నక్షత్రమున, శుభదినమున, పగటివేళ కులీనుడును, రోగవర్జితుడును, ఘనవాద్యజ్ఞుడును, గీతతత్త్వజ్ఞుడు, మతిమంతుడును, నీతితత్త్వజ్ఞుడును, మధురుడును, నియతేంద్రియుడును అగు బ్రాహ్మణుడు ఉపవసించి ఆర్ద్రకేశుడును, శుక్లవస్త్రధరుడును అయి గోమయముచే మూడు మండలములను రచించి, వానిపై బ్రహ్మ విష్ణుమహేశ్వరులను త్రయమును ఆవాహనము చేయవలెను. అందు బ్రహ్మమండలమున ఆలింగ్యమును, రుద్రమండలమున ఊర్ధ్వకమును, విష్ణుమండలమున ఆంకికము (ఉత్సంగికము) ను ఉంచి

బలి-పుష్పోపహారాదులచే పూజించవలెను. బ్రహ్మమండలమందున్న ఆలింగ్యమునకు ఘృత - మధుసహితమగు పాయసమును, చందన - కుసుమములను శుక్లవస్త్రములను సమర్పించవలెను.

రుద్రమండలమునందలి ఊర్ధ్వకమునకు కూడ స్వస్తిక - అపూపికా - పిండకాదుల నైవేద్యములను సమర్పించి, ఉన్మత్త (ఉమ్మెత్త) - కరవీర (గన్నేరు) - అర్క (జిల్లేడు) పుష్పములతో పూజించి, రక్తాంబరములతో ఆరాధించి, రక్తవర్ణకములగు బలుల నొసంగవలెను.

విష్ణుమండలమందలి అంకికమునకు పీతవర్ణములగు వస్త్ర - పుష్ప-ఆలేపనాదులను సమర్పించి, పాయసమును నైవేద్యముగ అర్పించవలెను.

పిమ్మట బ్రాహ్మణులచే స్వస్తివాచనము కావించి, దక్షిణల నొసంగవలెను. గంధర్వులను పూజించి వాద్యమును కల్పించవలెను. సుమృష్టములగు తంత్రులతో పణవమును బంధించవలెను. తరువాత పుష్కరవాద్యములకు చర్మములను బిగించవలెను. ఈ విధముగ మృదంగ - పణవ - దర్దురములను నిర్మించవలెను. *

**వాద్యములు : అధిదైవతములు**

ఇక పై వాద్యముల అధిదైవతములను వివరింతును—

మురజములకు వజ్రేక్షణుడు, శంకుకర్ణుడు, మహాగ్రామణి అధిష్ఠాన దైవతములు.

మృణ్మయమగుటచే మృదంగమనియు, భ్రమింపచేయునది కాన (భ్రమయతీతి) భాండమనియు, ఊర్ధ్వకరణమువలన మురజము అనియు, తోదనమువలన ఆతోద్యము అనియు, భాండవాద్యములకు మొదట నిర్మింపబడినదగుటచే పణవము (ప్రణవము) అనియు, దారణమును చేయునది కాన దర్దురము అనియు వ్యవహారములు కలిగినవి.

మహాముని (స్వాతి) ఇట్లు మృదంగ-పణవ-దర్దురములను సృష్టించి మేఘములందలి స్వరసంయోగమును మృదంగములకు కల్పించెను.

స్వాతి విద్యుజ్జిహ్వా - ఐరావణ - మేఘములను ఊర్ధ్వకమునకును, తడిన్నామక మేఘమును ఆలింగ్యమునకును, కోకిలానామక మేఘమును పుష్కరమునకును అధిదేవతలుగా కల్పించెను. కావున వారికిని పూజలు గావించవలెను. సిద్ధి కోరినవాడు పై పూజావిధానము నాచరింపనిదే వాద్యములను నిర్మించరాదు.

---

* [కాశీముద్రణమునందు 33 వ అధ్యా—217-247 శ్లో; బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—200-237 శ్లో.] బరోడా - 34 అధ్యా 237-83 శ్లో.



నాటకము, అంకము, ప్రకరణము, వీథి, భాణము, డిమము అను రూపకములందు మృదంగ - పణవ - దర్దురములను ప్రయోగించవలెను.

**హస్తలక్షణములు**

ఇక హస్తముల లక్షణములను వివరింతును—

1. కర్తరి, 2. సమహస్తము, 3. హస్తపాణిత్రయము, 4. వర్తన, 5. దండహస్తము.

1. కర్తరి — తర్జన్యంగుష్ఠయోగమున రెండు హస్తముల యొక్క పర్యాయపతనము 'కర్తరి' అనబడును.

2. సమహస్తము — సమతాలముతో సమములగు రెండు హస్తముల యొక్క పర్యాయ పాతము 'సమహస్తము' అనబడును.

3. హస్తపాణిత్రయము — వామహస్తము యొక్క పార్ష్ణి చేతను, అంగుళుల చేతను, దక్షిణపాణి చేతను పాతములు పర్యాయముగా చేయుట 'హస్తపాణిత్రయము' అనబడును.

4. వర్తన — మొదట కుడిచేతితోను, పిమ్మట వామహస్తముతోను నాలుగు ప్రపాతము (ప్రహారము) లను చేయుట 'వర్తన' అనబడును.

5. దండహస్తము — ముందు ఎడమచేతితోను, పిమ్మట కుడిచేతితోను క్రమముగా ప్రహారములు చేయుట 'దండహస్తము' అనబడును.

**హస్తగుణములు**

సౌష్ఠవము, లాఘవము, బాహుళ్యము, దార్ఢ్యము అనునవి హస్తగుణములు.

**వాదకలక్షణములు**

ఇక వాదకుల లక్షణములను వివరింతును—

మృదంగవాదకుడు గీత - వాద్య - కలా - పాత - గ్రహ - మోక్ష విశారదుడు, లఘుహస్తుడు, చిత్రపాణివిధిజ్ఞుడు, ధ్రువాకుశలుడు, కలాభిరతుడు, మధురహస్తుడు, సునివిష్టుడు, రక్తమార్జనుడు, బలవంతుడు, సువిహితశరీర-బుద్ధులు కలవాడు అయియుండవలెను. ఇంకను ఆలేపనప్రమాణజ్ఞుడు, చతుర్మార్గకృతశ్రముడు, సిద్ధులను ప్రతిగ్రహించువాడు, అంగదోషవివర్జితుడు, స్వభ్యస్తకరణుడు, గీతసామ్యము నెరిగినవాడు, సంగీతప్రయోగజ్ఞుడు అయియుండవలెను.

దర్దురికుడు పై గుణములు కలవాడే కాక నిశ్చలుడు, నిపుణుడు, లఘుహస్తుడు, విధానవేత్త, వాదనాంతరవేది కావలయును.

నాట్యప్రయోగమును బట్టియు, సర్వలోకానుభావము ననుసరించియు వాద్య విధానమును వివరించితిని. ఇం అనుక్తములగు విషయములను పండితులు మార్గ-జాత్యనుగుణముగ తమ బుద్ధిచే కల్పించుకొనవలెను.

స్ఫుటప్రహారము, విశదము, విభక్తము, రక్తము, విఘుష్టకరలేపనము, మూర్ఛనాత్రయయుతము, రాగయుక్తము అగు మృదంగవాద్యము ప్రశస్తమైనదని తెలియవలెను.

వాద్యేతు యత్నః ప్రథమం తు కార్యః, శయ్యాం హి నాట్యస్య వదంతి వాద్యం।
వాద్యే చ గీతే చ హి సుప్రయుక్తే, నాట్యప్రయోగో న విపత్తి మేతి॥ 270

—మొదట వాద్యవిషయమున ప్రయత్నముచేయవలెను. నాట్యమునకు వాద్యమే శయ్య అని చెప్పుదురు. వాద్య-గీతములు సుప్రయుక్తములైనచో నాట్యప్రయోగము భంగమును పొందదు.*

చతుస్త్రింశాధ్యాయము సమాప్తము

---

* [కాశీముద్రణమునందు 33 వ అధ్యా—247-270 శ్లో; బొంబాయి ముద్రణమునందు 34 వ అధ్యా—238-259 శ్లో.] బరోడా - 34వ అధ్యా - 284-304శ్లో

# అధ్యాయము 35[1]

## సామాజికులు[2]

[కాశీముద్రణమునందు 35 వ అధ్యా—87[3] శ్లోకములును;
బొంబాయిముద్రణమునందు 35 వ అధ్యా—88[4] శ్లోకములును కలవు.]

### ప్రకృతిపాత్రవివేకము

ఇంక నాటకమునందలి భూమికావిన్యాసమును వివరింతును. గతి-వాక్-అంగ-చేష్టలచేతను, సత్త్వ-శీల-స్వభావములచేతను ఎవనికి ఏ భూమికాన్యాసము తగును అనెడి విషయమును పరీక్షించి ఆ పాత్రను ఆ భూమికయందు నియోగించవలెను. కావున, పాత్ర (నట) సమాశ్రయములైన గుణములను మొదట కనుగొని, పిమ్మట భూమికాయోజనమునకు కడంగినచో తరువాత ప్రయోగము ఆచార్యుని బుద్ధికి ఖేదజనకము కాబోదు. అందుచే ఆచార్యుడు పాత్రయొక్క స్వభావజములైన గుణములను తెలిసికొని యథాయోగ్యముగా భూమికానివేశనమును చేయవలెను.

### సామాజికులు - స్వరూపాదులు[5]

1. దేవభూమికానిర్వహణమునందు అంగ - ప్రత్యంగసంయుక్తుడు, అహీ

---

1. ఈ భాగము కాశీ - బొంబాయి ముద్రణములందు పంచత్రింశాధ్యాయమే (35 వ అధ్యా). కాని, కాశీముద్రణమునందలి కొంతభాగము బొంబాయి, బరోడా ముద్రణములందు 26 వ అధ్యాయమైనది. **బరోడా - 35వ అధ్యా - 41 శ్లో.]**

2. "భూమికాపాత్ర వికల్ప" మని కాశీముద్రణపాఠము. "భూమివికల్ప" మని బొంబాయిముద్రణపాఠము. **"భూమికావికల్పము" అని బరోడా పాఠము.**

3. కాశీముద్రణమునందలి 29 శ్లోకములు (=9-37 శ్లో.) బొంబాయి - బరోడా ముద్రణములందు 26 వ అధ్యాయమగుటచే అవి అచ్చటనే అనువదింపబడెను.

4. కాశీముద్రణమునందు ఈ అధ్యాయములో ఉన్న 30 శ్లోకములు (36-66 శ్లో.) బొంబాయిముద్రణమందు అధస్సూచికలో మాత్రమే కలవు. ఇవి బొంబాయిముద్రణమునందు 24 వ అధ్యాయము చివర సహజముగానే ఉన్నవి.

5. సామాజికులనగా సూత్రధారుడు, నటులు, నటీమణులు, సహాయకులు అనువారందరును. వీరు అందరును కలిసినదే సమాజము. ఈ నాటకసమాజమందలి సభ్యులెల్లరును 'సామాజికు' లనబడుదురని తెలియవలెను.

ఇప్పుడు సామాజికుల స్వరూపాదులు వివరింపబడుచున్నవి. సామాజికుల గుణములు తరువాత వివరింపబడును. స్వరూప - స్వభావముల (ఆకార-గుణముల) యందు ప్రకృతి-పాత్రలకు అనురూప్యము చెప్పబడుచుండుటచే ఇచ్చట అనురూపభూమికాధారణము వివరింపబడుచున్నదని తెలియవలెను.

నాంగుడు, వయోన్వితుడు, శ్లిష్టాంగుడు, ద్యుతిమంతుడు, ప్రియదర్శనుడు, మంచి కంఠస్వరము కలవాడు, అంతలావు అంతసన్నముకానివాడు, అంతపొడుగు అంత పొట్టికానివాడు అయిన భరతుడు (నటుడు) నియుక్తుడు కావలయును.

2. రక్షో-దానవ-దైత్యభూమికలయందు స్థూలశరీరులు, బాగుగా పొడగరులు, పెద్ద శరీరము కలవారు, మేఘగంభీరనిస్స్వనులు, రౌద్రస్వభావనేత్రులు, సహజముగానే బొమముడి కలవారు నియుక్తులు కావలయును.

ఇట్టి పురుషుల ప్రయోగము ఆంగికాభినయబహుళముగా నుండును కాన ఆ విషయమును దృష్టియందుంచుకొనవలెను.

3. కుమార - రాజభూమికలయందు నేత్ర-భ్రూ - అంగ - లలాట - నాసికా- ఓష్ఠ - గండ - ముఖ - కంఠ - గ్రీవ - సౌష్ఠవసంయుక్తులు, అంగప్రత్యంగోపేతులు, సుశీలురు, జ్ఞానవంతులు, ప్రియదర్శనులు, వ్యవస్థితస్వభావులు, అంత పొడుగు అంత పొట్టి కానివారు, అంత లావుగా అంత సన్నముగా లేనివారు అయిన భరతోత్తములు నియుక్తులు కావలయును.

4. అమాత్య - సేనాపతి భూమికలయందు ఊహాపోహావిచక్షణులు, దైన్యరహితులు, ప్రగల్భులు, ప్రత్యుత్పన్నమతులు వాక్కునందు స్ఫుటత్వము గాంభీర్యము కలవారు, అంత పొడగరులు అంతో స్థూలశరీరులు కానివారు నియుక్తులు కావలయును.

5. కంచుకి - శ్రోత్రియాదిభూమికలయందు పింగలవర్ణములయిన కనులు, పొడుగు ముక్కులు కలిగి పొడగరులు లేదా పొట్టివారు అయిన భరతులను నియోగించవలెను.

6. ఇతరభూమికలయందును పైవిధముగానే నాట్యధర్మము ననుసరించి దేశ - వేషానురూపముగా పాత్రలను నియోగించవలెను.

దాసభూమికలయందు మంథరులు, వామనులు, కుబ్జులు, వికృతులు, వికృతాననులు, నిష్టబ్ధనేత్రులు, కాణాక్షులు, స్థూలశరీరులు, చిపిటనాసులు (చప్పిముక్కు కలవారు), దుర్వేషులు, వికృతాకారులు, దాసవంశజులైనవారు నియుక్తులు కావలయును.

7. తపశ్శాలురభూమికలయందు సహజముగా కృశులు, శాంతులు అయినవారు నియోగింపబడవలెను.

8. అపరాధులైనవారి భూమికలయందు స్థూలశరీరులను నియోగించవలెను.



పైని పేర్కొన్నట్లు ఆకారముచే భూమికకు అనురూపుడైన పురుషుడు (నటుడు) దొరుకనిచో భావ - చేష్టా - స్వభావములచే అనురూపుడైన పురుషునైనను, ఆచార్యుడు స్వబుద్ధితో విచారించి, ఆ భూమికయందు నియోగించవలెను. మరియు, ఉత్తమ - మధ్యమ - అధమప్రకృతుల కనుగుణములగు చేష్టలను పరిశీలించి ఎవనికి ఏది సదృశమో వానిని దానియందే ఆచార్యుడు నియోగించవలెను. *

**నటుడు : రాజు**

నాట్యము ఆహార్యప్రభావముచేతనే సిద్ధించును. అట్లే కానిచో అల్పపరిచ్ఛదములు గల నటుడు రాజగుణముల నెట్లు నిరూపింపగలడు ? వర్ణకములచే ఆచ్ఛాదితుడును, భూషణములచే అలంకృతుడును అయిన నటుడు గంభీరమైన ఆహార్యముతో కూడినవాడై రాజువలెనే కన్పట్టును. లోకమంతయును నాట్యధర్మప్రవృత్తమై ఇందుండునుకదా ; అందుచే ఒకే నటుడు సప్తద్వీపాశ్రయుడును కావచ్చును.[6]

వర్ణకములచే ఆచ్ఛాదితుడై, ఆచార్యుని శిక్షవడసి, సౌష్ఠవాంగపురస్కృతమైన అంగవిచేష్టితము గల భరతుడు (నటుడు) రాజువలెనే ఉండును. నిజమునకు రాజును నటునివలెనే ఉండును. అనగా నటుడు రాజువలె కన్పట్టినట్లే రాజును నటునివలె కన్పట్టుచుండును.[7] ఉభయులయందును లీలా-అంగసౌష్ఠవములు సమమైనప్పుడే భావనిష్పత్తి అగును. నటుడు రంగమందు రాజువలె శోభించుటకు ఆచార్యోపదేశమే హేతువు; ఇంక రాజునకు ఆశోభ సహజము. పార్థివులకు ఏ పరివారము నియతమో అట్టి పరివారమునే నాటకమునందును రాజునకు కల్పించవలెను. మరియు తదుచితములైన వేష - భాషా - వయస్సులనుకూడ పాటించవలయును.

సహజముగా భూమికోచితములైన రూప - వయో - వేషములు ఎవనికి ఉండునో వానినే ఆ భూమికయందు నియోగించవలెను.

పైవిధముగా రాజోపచారవిషయమున పురుషులను ఎన్నుకొనవలయును.

---

*[కాశీముద్రణమునందు 35 వ అధ్యా—1-7 శ్లో; బొంబాయిముద్రణమునందు 35 వ అధ్యా—1-19 శ్లో; బొంబాయి ముద్రణమునందలి 12 శ్లోకములు (2-14శ్లో.) కాశీముద్రణమునందు లేవు.] **బరోడా ముద్రణము - 35వ అధ్యా-1-20 శ్లో.]**

6. అనగా ఒకేనటుడు సప్తద్వీపములకు చెందిన చక్రవర్తులభూమికలను ధరించి వారివలెనేప్రకాశింపగలడని భావము.

ఆహార్యాభినయప్రాధాన్యమును 21 వ అధ్యాయము చివర ఒకటవ విశేషాంశములో వివరించియున్నాను (పుటలు 650-652).

7. ఇచ్చట మూలశ్లోకము క్రిందివిధముగా ఉన్నది—

రాజవత్ భరత స్తస్మాత్ రాజాపి నటవత్ భవేత్ ।
యథా నట స్తథా రాజా యథా రాజా తథా నటః ॥ (కాశీముద్రణము - 42 శ్లో.)

సామాజికులు - గుణములు[8]

ఇంక ప్రయోక్తల గుణములను వివరింతును. అందు ముందుగా సూత్రధారుని గుణములను వివరింతును—

1. సూత్రధారుడు— అహీనవాక్యసంస్కారము, తాల - గీత - కాల - విధానజ్ఞత, స్వర - వాద్రిత తత్త్వ విజ్ఞానము అనునవి సూత్రధారగుణములు.

చతురాతోద్యకుశలుడు, శాస్త్రకర్మ సుశిక్షితుడు, నానాపాషండకార్యజ్ఞుడు, నీతిశాస్త్రార్థతత్త్వవిదుడు, వేశ్యోపచారనిపుణుడు, కావ్య - శాస్త్ర విచక్షణుడు, నానాగతిప్రచారజ్ఞుడు, రస - భావవిశారదుడు, నాట్యప్రయోగకుశలుడు, నానా శిల్పవేత్త, ఛందోవిధానతత్త్వజ్ఞుడు, దేశవ్యవహారతత్త్వవిదుడు (దేశీయమైన పలుకుబడి తెలిసినవాడు), పృథివీ - ద్వీప - వర్ష - పర్వతజనుల ప్రమాణ - ఆచారములను తెలిసినవాడు, రాజవంశప్రసూతివిదుడు, శాస్త్రార్థములనువిని తెలిసికొనినవాడు, తెలిసికొని ప్రయోగించినవాడు, ఉపదేశించినవాడు అయిన ఆచార్యుడు సూత్రధారుడుగా ఉండవలెను.

ఇంక సూత్రధారునకు స్వాభావికములైన గుణములను వివరింతును— స్మృతి, మతి, ధైర్యము, ఔదార్యము, స్మితవాక్కు, శుచిత్వము, ఆరోగ్యము, మాధుర్యము, క్షాంతి, దాంతి, ప్రియవాక్కు, కోపరాహిత్యము, సత్యవచనము, దాక్షిణ్యము, అలుబ్ధత, ప్రత్యుత్పన్నమతి అనునవి సూత్రధారుని స్వాభావిక గుణములు.

2. పారిపార్శ్వకుడు— పారిపార్శ్వకుడు సూత్రధారగుణములకంటె కించిదూనములైన గుణములు కలవాడును, మధ్యమప్రకృతియును కావలయును

3. నటుడు—నటుడు ఉజ్జ్వలుడు, రూపవంతుడు, ఉపకరణక్రియాదక్షుడు, మేధావి, విధానజ్ఞుడు, స్వకార్యకుశలుడు, దృఢశరీరుడు అయియుండవలెను.[9]

4. విటుడు—విటుడు వేశ్యోపచారకుశలుడు, మధురస్వభావుడు, దక్షిణుడు, కవి, ఊహాపోహశాలి, వాగ్మి, చతురుడు కావలయును.

5. శకారుడు—శకారుడు ఉజ్జ్వలవస్త్రాభరణుడు, అధముడు, మాగధభాషి, బహువికారములు కలవాడు, అనిమిత్తములగు కోప-ప్రసాదములుకలవాడు అయియుండవలెను.

8. ఇంతకుముందు సామాజికుల ఆకారాదులు వివరింపబడెను. ఇప్పుడు గుణములు వివరింపబడును.

9. ఈ నటుడు నాయకభూమికాధారి అని తెలియవలెను. నాయికాభూమికాధారిణి గుణములు తరువాత వివరింపబడును.



6. విదూషకుడు—ఇతడు వామనుడు, దంతురుడు, కుబ్జుడు, ద్విజన్ముడు. వికృతాననుడు, ఖలతి (బట్టతలవాడు), పింగలాక్షుడు అయియుండవలెను.

7. చేటుడు —చేటుడు కలాప్రియుడు, బహుకథాకుశలుడు, విరూపుడు, గంధసేవకుడు, మాన్యామాన్యవిశేషజ్ఞుడు కావలయును.

పైని పేర్కొనబడిన వారందరును సహజముగాకాని, ప్రయత్నపూర్వకముగా కాని ఆయా గుణములను కలిగియుండవలెను.

8. గణిక —గణిక కలాప్రయోగమందు ఆచార్యుల మెప్పువడసినది, లీలా-హావ - భావ - సత్త్వ - వినయ - మాధుర్య సంపన్న, చతుష్షష్టికలాన్విత, నృత్తోపచార (రాజోపచార - అని కాశీముద్రణ పాఠము) కుశల, స్త్రీదోషవివర్జిత, ప్రియవాదిని, ప్రియకథాకుశల, స్ఫుటావయవ, దక్ష, జితశ్రమ కావలయును.

వయోరూపవతులైన వేయిమంది స్త్రీలలోను గుణయుక్తురాలైన నర్తకి ఒక్కతె అయినను అరుదుగా లభించును.

9. నాయిక—నాయిక రూప - గుణ - శీల - యౌవన - మాధుర్య - శక్తి సంపన్న, విశద, స్నిగ్ధ, మధురస్వభావ, పేశలవచన, రక్తకంఠి, యోగ్య, అక్షుభిత, లయతాలజ్ఞ, రససంయుక్త కావలయును.

అస్థానహాసిని, రూక్ష, ఆవిద్ధగతిచేష్టాయుత, దీర్ఘరోష, దీన, ఉద్వృత్త, ఉద్భట, సర్వదోషయుత, గంధ - మాల్యశోభారహిత అయిన స్త్రీ నాయికాభూమికకు అర్హురాలు కాదని తెలియవలెను. *

నాటకసమాజ సభ్యులు : వారి విధులు

ఇంతవరకును ప్రయోక్తల స్వరూప - స్వభావములను వివరించితిని. ఇంక వారి విధులను వివరింతును—(1) భరతులు, (2) విదూషకుడు, (3) తౌరికుడు, (4) నటుడు, (5) నాయకుడు, (6) నాటకీయ, (7) నంది, (8) సూత్రధారుడు, (9) నాట్యకారుడు (కవి), (10) ముకుటకారుడు, (11) ఆభరణకారుడు, (12) మాలాకారుడు, (13) రజకుడు, (14) చిత్రకారుడు, (15) కారువు, (16) శిల్పి, (17) కుశీలవులు అనువారు సమాజసభ్యులని తెలియవలెను.

1. భరతుడు—అనేక భూమికాయుక్తుడు, భాండగ్రహోద్యుపకరణజ్ఞుడు అయి నాట్యమందు రస - భావభారమును ఎవడు వహించునో అతడు 'భరతు' డనబడును. భరతాశ్రయుడగుటచేతను భరతుడనబడును.

* [ కాశీముద్రణమునందు 35 వ అధ్యా—37-66 శ్లో; బొంబాయిముద్రణమునందు 24 వ అధ్యా—73-113 శ్లో. ఈ భాగము మరల ఈ 35 వ అధ్యాయమందు అధస్సూచికలో కలదు.]

2. విదూషకుడు— అనేకవేషములను పొందువాడు, సర్వప్రకృతిప్రచార సంయుక్తుడు, ఒక్కొక్కప్పుడు నారీసమాశ్రయుడు, ప్రత్యుత్పన్నప్రతిభుడు, నర్మములను ప్రయోగించువాడు, నర్మగర్భ నిర్భేద్యుడు, విచ్ఛేదవిదూషితవచనుడు (మాటలమధ్యలో కలుగజేసికొని ప్రసంగాంతరమునకు కొనిపోవువాడు) 'విదూషకు' డనబడును.

3. తౌరికుడు—సర్వాతోద్యప్రవాదనకుశలుడు, తూర్యపరిగ్రహాయుక్తుడు 'తౌరికు' డనబడును.

4. నటుడు—నటశబ్దము 'నట' (నటించుట) ధాతువునుండి నిష్పన్నమైనది. జరిగిన లోకవృత్తాంతమును రస - భావ - సత్త్వయుక్తముగా నటించువాడు 'నటు' డనబడును.

5. నాయకుడు—శాస్త్రవిహితమైన చతురాతోద్యవిధానము, శాస్త్రవిహితమైన నాట్యము సర్వమును ఫలప్రాప్తిపర్యంతము ఎవనివలన నడచునో ఆతడు 'నాయకు' డనబడును,

6. నాటకీయ—భాండవాద్యజ్ఞ, లయ - తాళజ్ఞ, రసానువిద్ధ, సర్వాంగసుందరి అయిన స్త్రీ 'నాటకీయ' కావలయును.

7. నంది ('నాంది' అని కాశీముద్రణ పాఠము)— మంగళాచరణయుక్తములగు మధురవాక్యములతో, స్తుత్యభివాదనయుతముగా సమస్తలోకమును స్తుతించువాడు 'నంది' అనబడును. బహువిధభావములతో నాట్యమందు ప్రాకృత-సంస్కృతపాఠ్యములతో ప్రజలకు శ్రేయస్సును కోరువాడు కావున 'నంది' అనబడును.[10]

8. సూత్రధారుడు—శిష్టోపదేశ యోగమువలన వివిధభావవిహితములగు గాన - వాద్య - పాఠ్యముల సూత్రమును తెలిసినవాడు కాన 'సూత్రధారు' డనబడును.

9. నాట్యకారుడు—యథోపదిష్టముగా (లక్షణానుసారముగా) సత్త్వసంయుక్తములైన రస - భావములను ఆయా భూమికలచే ప్రదర్శింపజేయువాడు 'నాట్యకారుడు' (కవి) అనబడును.

భరతోపకారకులు : ఇంక భరతోపకారకులను వివరింతును. ఎవడు ఏ ఉపకరణమును నిర్మించునో ఆతడు ఆ పేరుతోనే పిలువబడునని తెలియవలెను.

10. డా. ఘోష్ 'నాంది' అను పాఠమును గ్రహించి, దీనిని 'నాందీ' నిర్వచనముగా అనువదించెను.



10. ముకుటకారుడు— నానాప్రకృతిసముత్థములైన. వివిధవేషవిశేషములకు అనుగుణమగు శీర్షకములను నిర్మించునతడు 'ముకుటకారు' డనబడును.

11. ఆభరణకారుడు—బహువిధవిహితములైన ఆభరణములను చేయువాడు 'ఆభరణకారు' డనబడును.

12. మాల్యకారుడు— పంచవిధములైన మాల్యములను కట్టువాడు 'మాల్యకారు' డనబడును.

13. వేషకరుడు (Make-up man) —వివిధవేషములను సంఘటించువాడు 'వేషకరు' డనబడును.

14. చిత్రకరుడు (Painter)—చిత్రజ్ఞుడు 'చిత్రకరు' డనబడును.

15. రజకుడు—వస్త్రరంజనమువలన 'రజకు'డనబడును (చాకలి లేదా వస్త్రములకు రంగుల నద్దువాడు)

16. కారువు—జతు - అశ్మ - కాష్ఠములచే నానావిధద్రవ్యములను చేయువాడు 'కారువు' అనబడును.

17. కుశీలవుడు[11]—నానాతోద్యవిధాన - ప్రయోగముల నెరింగినవాడు, నిపుణుడు, అవదాతుడు, అవ్యథితుడు అయినవాడు 'కుశీలవు'డనబడును.

శిల్ప-కర్మ-ప్రయోగములలో ఎవరు వేనిని ఆశ్రయింతురో ఆ పేర్లతోనే ఆ పురుషులు వ్యవహరింపబడుదురు. ఇట్లు నాటకవిధియందు నటసంశ్రయములైన జాతులను తెలియవలెను.

ఇంతవరకును నాట్యోపకరణయుక్తమును, నానాశిల్పప్రసక్తమును అగు భూమికాన్యాసమును ప్రయోక్తృభేదసహితముగా వివరించితిని. నాట్యశాస్త్రమును సర్వమును ఉపదేశించితిని. ఓ మునులార ! ఇంకేమి చెప్పవలెను ?[12] *

పంచత్రింశాధ్యాయము సమాప్తము

11. అయోరూపమైన కుశినికూడ ఛేదించువాడుకాన 'కుశీలవు' డనబడెను.

12. ఇంతటితో నాట్యశాస్త్రోపదేశము ముగిసినది. ఇంక నాట్యావతరణము, ఫలశ్రుతి మిగిలియున్నవి.

*[కాశీముద్రణమునందు 35వ అధ్యా—67-87 శ్లో; బొంబాయి ముద్రణమునందు 35వ అధ్యా—21-39 శ్లో.] బరోడా - 15వ అధ్యా - 21 - 41 శ్లో.

## విశేషాంశములు

### 1. అధ్యాయముల సమన్వయము

24, 26, 35 అధ్యాయములు ఒండొంటితో సంబంధించియున్నవి. కాశీముద్రణము నందు వరుసగాఉన్న 34, 35 వ అధ్యాయములు రెండును ఇందు క్రమముగా 24 వ అధ్యాయమును, 26, 35 అధ్యాయములును అయినవి. బహుశః ఈ మార్పు అభినవ గుప్తునకు పూర్వమే జరిగియుండును.

(1) 24 వ అధ్యాయమందు రూపకగతులైన స్త్రీ-పురుషుల ప్రకృతిభేదములు వివరింపబడినవి. స్త్రీ-పురుషుల ప్రకృతులు మూడేసివిధములని ఇంతకుముందు చాలసార్లు పేర్కొనబడెను. ఈ 24 వ అధ్యాయమందు ఆయా ప్రకృతుల లక్షణములు స్పష్టముచేయ బడెను. మధ్య మోత్తమప్రకృతులలో నానాలక్షణ లక్షితులగు నాయకులు నాలుగు విధములుగాఉందురు-ధీరోద్ధతాదులు. అట్లే నాయికలును నాలుగు విధములుగాఉందురు— దివ్యాదులు. ఈ సర్వప్రకృతులకును బాహ్య - ఆభ్యంతర భేదములచే ఉపచారము రెండు విధములు కాన పరివారమును రెండువిధములుగా ఉండును. ఇందు రాజుల ఆభ్యంతర పరివారమును, బాహ్యపరివారమును వివరింపబడెను.

(2) 24 వ అధ్యాయమందు కవిదృష్టితో రూపకగతపాత్రలు వివరింపబడగా ఈ 35 వ అధ్యాయమందు ప్రయోక్తదృష్టితో నాటకసమాజమందలి వ్యక్తులు, ఆయా భూమికలను ధరించుటకు ఆయా కార్యములను నెరవేర్చుటకు వారికిగల అర్హతలు లక్షణములు వివరింపబడెను. అనగా దివ్యభూమికలను ధరించు ప్రయోక్త ఎట్టిలక్షణములు కలవాడుగా ఉండవలెను? రాజు భూమికను నిర్వహించువాడెట్టి లక్షణోపేతుడు కావలయును? నాయికా-గణికాభూమికలను ఎట్టి లక్షణములుకల స్త్రీలు ధరించవలెను? ఈ మొదలగు విషయములు ఇందు చర్చింపబడినవన్నమాట.

ఆకారముచే భూమికకు అనురూపుడైన నటుడు లభించనిచో, ఆచార్యుడు స్వబుద్ధితో విచారించి, భావ-చేష్టా-స్వభావములచే అనురూపుడైన వానినైనను ఆ భూమికయందు నియమించుట ఆవశ్యకము. ఆహార్యప్రభావముచే సామాన్యుడైన నటుడు మహారాజెట్లు కాగలడో ఇందు నిరూపింపబడెను. నటులేకాక వేషకార-ఆభరణకారాదులుకూడ సమాజ సభ్యులుగానే ఉండవలయును; వారివారి విధులు ఇందు వివరింపబడెను. కవికూడ సమాజ సభ్యుడుగా ఉండవలెననుట గమనార్హము.

(3) ఇంక 26 వ అధ్యాయము పై రెండు అధ్యాయములను సమన్వయపరచు చున్నది. ప్రయోక్త సర్వవిధముల ప్రకృతిసదృశుడుగా ఉండవచ్చును; లేదా విసదృశుడుగా ఉండవచ్చును; లేదా ఉభయాత్మకుడుగా ఉండవచ్చును. అనగా భూమి కాన్యాసము పై మూడు విధములుగానుండునన్నమాట. ఈ విషయము 26 వ అధ్యాయమందు చెప్పబడెను. మరియు ఆచార్యునిలక్షణములు, శిష్యుని లక్షణములుకూడ ఇందు విశదీకరింపబడెను.



### 2. నాటక సమాజములు

ప్రాచీనకాలమున ఒక నాటకసమాజమందలి నటులందరును ఇంచుమించుగా ఒకే కుటుంబమునకు చెందియుండెడివారనియు, నాడు స్త్రీలే భూమికలను ధరించెడివారనియు ఇరువదిఆరవ అధ్యాయముచివర 2 వ విశేషాంశములో తెలిపియున్నాను. నాడు స్త్రీ-పురుషులుకలిసియున్న సమాజములే కాక కేవలము స్త్రీలనాటకసమాజములు కూడ ఉన్నట్లు రామాయణమును బట్టి తెలియుచున్నది—

"వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్ ।" —బాలకాండ-5 వ సర్గ-12 శ్లో.

సందర్భము రామాయణప్రారంభములోని అయోధ్యాపురవర్ణనము. ఆ అయోధ్యా పురము నలుమూలల "వధూ నాటకసంఘములు" కలవట.

క్రీ. శ. 1900 ప్రాంతముల తెలుగుదేశములో కూడ కేవలము స్త్రీనాటకసమాజములు కొన్ని బయలుదేరినవి. బళ్ళారిలో ఆంధ్రనాటకపితామహుని పోషణలో ఒక సమాజము, శ్రీ కోలాచలమువారి పోషణలో ఒక సమాజము ఉండెడివి. 1902 లో శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు విశాఖపట్టణములో "సంగీతమానినీ సమాజము"ను ఏర్పరచి ప్రదర్శనము లిప్పించినారు. పిమ్మట ఇంకను కొన్ని స్త్రీనాటకసమాజములు తెలుగుదేశమునందు బయలుదేరినవి.

నాటకసమాజమందు సూత్రధారుడు పెద్ద. వానికి లోబడి తక్కినవా రందరును తమ తమ కృత్యములను సమర్థతతో, సంఘీభావముతో నిర్వహించవలసి యున్నది. నటులు సాధించవలసిన ఏకాగ్రతకు చిహ్నముగా 36 వ అధ్యాయము చివర చిరంజీవిని గీతా శేషాచలము యొక్క నృత్యభంగిమను చేర్చియున్నాను. ఏకాగ్రత అనగా సత్త్వము నాట్యము నకుప్రాణము. ఈఅధ్యాయమందు వివరింపబడిన సూత్రధారుని లక్షణములుగమనార్హములు. ఆతడు గాన-వాద్య-పాఠ్య-అభినయముల సూత్రము నెరింగినవాడు కావలయును. సూత్రధారుడు(నేటి 'డైరెక్టర్')కాదగిన అర్హత అందరకును ఉండదని తెలియవలెను. ఉత్తముడైన సూత్రధారుడు లభించుట నాటకసమాజము యొక్క అదృష్టమని చెప్పకతప్పదు.

కవికూడ నాటకసమాజసభ్యుడుగా పేర్కొనబడుట గమనార్హము. పుట 77 లోని 5 వ విశేషాంశమును కూడ చూడవలెను.

1880 ప్రాంతముల తెలుగుదేశములో ప్రప్రథమముగా నాటకసమాజములను ప్రారంభించినవారు కవులే అనెడి విషయమును గుర్తించవలసి యున్నది. రాజమహేంద్రవరములో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు; గుంటూరులో శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వేర్వేరు నాటకసమాజములను స్థాపించినారు. బందరులో శ్రీ నాదెళ్ళపురుషోత్తమకవిగారు, రాజమహేంద్రవరములో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ఆయా నాటకసమాజములను సమర్థతతో నిర్వహించిన విషయము విజ్ఞులకు తెలిసినదే. ఇంక బళ్ళారి విషయమును ఎరుగనివా రెవరు?

---

# అధ్యాయము 36[1]

## నాట్యావతరణము[2]

[కాశీముద్రణమునందు 36 వ అధ్యా—79 శ్లోకములుకలవు. బొంబాయి ముద్రణమునందు 36 వ అధ్యా—45 శ్లోకములును, 37 వ అధ్యా—33 శ్లోకములును మొత్తము 78 శ్లోకములు కలవు. బరోడాలో 36 వ అధ్యా. 50 శ్లో. 37 వ అధ్యా. - 31 శ్లో. మొత్తము 81 శ్లో.

నాట్యశాస్త్రోపదేశమును పొందిన ఋషులు

1. ఆత్రేయుడు
2. వశిష్ఠుడు
3. పులస్త్యుడు
4. పులహుడు
5. క్రతువు
6. అంగిరసుడు
7. గౌతముడు
8. అగస్త్యుడు
9. మనువు
10. ఆయువు
11. అరువంతుడు
12. విశ్వామిత్రుడు
13. స్థూలశిరుడు
14. సంవర్తుడు
15. ప్రతిమర్దనుడు
16. ఉశనుడు
17. బృహస్పతి
18. వ్యాసుడు
19. చ్యవనుడు
20. కాశ్యపుడు
21. ధ్రువుడు
22. దుర్వాసుడు
23. జమదగ్ని
24. మార్కండేయుడు
25. గాలవుడు
26. భరద్వాజుడు
27. రైభ్యుడు
28. వాల్మీకి
29. యవక్రీతుడు
30. స్థూలాక్షుడు
31. శకలాక్షుడు
32. కణ్వుడు
33. మేధాతిథి
34. కుశుడు
35. నారదుడు
36. పర్వతుడు
37. సుశర్మ
38. ఏకధన్వుడు (పెద్ద)
39. ఏకధన్వుడు (చిన్న)
40. నిష్ప్యాతి
41. నితంభువు
42. భువనుడు
43. సౌమ్యుడు
44. శతానందుడు
45. కృతవ్రణుడు
46. పరశురాముడు
47. కచుడు

1. ఈ భాగము కాశీముద్రణమునందు షట్త్రింశాధ్యాయమే (36 వ అధ్యా); బొంబాయి. బరోడా ముద్రణములందు రెండు అధ్యాయములుగా ఉన్నది– షట్త్రింశాధ్యాయము (36 వ అధ్యా); సప్తత్రింశాధ్యాయము (37 వ అధ్యా).

2. 'నాట్యావతార'మని కాశీముద్రణ పాఠము. బొంబాయి ముద్రణమునందు 36 వ అధ్యాయమునకు 'నటశాప' మని పేరు; 37 వ అధ్యాయమునకు 'గుహ్యవికల్ప' మని పేరు. బరోడాలో 36 నటశాపము; 37 - గుహ్యతత్త్వ కథనము.



అను ఈ ఋషులందరును[3] భరతుడు చెప్పినదానినెల్ల శ్రద్ధతో విని, ప్రీతులై, కుతూహలముతో సర్వజ్ఞుడైన భరతుని మరల క్రిందివిధముగా ప్రశ్నించిరి—

### ఋషుల ప్రశ్నలు

"నీవు చెప్పిన ఈ పురాతన నాట్యవేదమును మేమందరమును సావధానులమై గ్రహించితిమి. ఇంకను మాకు కలిగెడి సంశయములను తీర్చుటకు నీవే సమర్థుడవు. నాట్యవేదమును గూర్చి నిశ్చయజ్ఞానముతో చెప్పగలిగినవాడవు నీవొక్కడవే. ఓ భగవత్స్వరూపుడ! నాట్యమునుగూర్చి ఉపదేశార్థమే అడుగుచున్నాము కాని పరిహాసముతో కాని, విరోధముచే కాని, ఈర్ష్యచేకాని నిన్ను ప్రశ్నించుటలేదు. నీవు చెప్పెడిదానికి అంతరాయము కలుగుననెడి భావముతో ఇంతకుముందే నిన్ను ప్రశ్నించలేదు. తత్త్వనిర్ణయముకొరకు ఇప్పుడు నాట్యమందలి గుహ్యమును (గూఢార్థమును) ప్రకాశింపజేయుము. లోకచరితమే నాట్యమని చెప్పియున్నావు. ఆ లోకగుహ్యములను విశదపరచుటకు నీవే సమర్థుడవు. పూర్వరంగమందు ఏదైవము పూజింపబడును? పూజితుడగుటచే ఏమిఫల మొసంగును? పూజచేత దేవతలు నిజముగా ప్రీతులగుదురా? ప్రీతులైనచో ఏమిచేయుదురు? సహజముగా శుచియైన సూత్రధారుడు మరల శౌచమునేల ఆచరించవలెను? నాట్యము స్వర్గమునుండి ఉర్వీతలమునకెట్లు వచ్చినది? నీకును, నీవంశమువారికిని 'నట' సంజ్ఞ ఎట్లు కలిగినది? ఓ మహామునీ! ఈ సర్వస్వమును యథాతత్త్వముగా చెప్పగోరుచున్నాము."

### పూర్వరంగవిధి - నాందీపఠనముల ప్రయోజనము

అంతట భరతు డిట్లు సమాధాన మొసంగెను—

ఓ సువ్రతులారా! మీరు నన్నడిగిన గుహ్యమును, పూర్వరంగవిధి ఫలమును వివరింతును; సావధానముగా వినుడు. శుభకరమును, విఘ్ననిబర్హణమును అని ఇంతకుముందే చెప్పబడిన పూర్వరంగవిధికి అనుబంధముగా మరికొంత వివరింతును. శస్త్రప్రహారముల ప్రతీకారార్థము శరీరావరణము (కంచుకము) ఎట్లావశ్యకమో పాపములు నశించుటకు స్తుతియును అట్లే ఆవశ్యకము. జప - హోమ - దేవతాభ్యర్చనములతో, సర్వాతోద్యవిధాన - గీతస్వనములతో శాంతములును, పాపహరణములును, కర్మ - భావానుకీర్తనములును, విఘ్ననిబర్హణములును అయిన స్తుతి -

3. నాట్యశాస్త్రమంతయును ఈ ఋషులకే ప్రప్రథమముగా ఉపదేశింపబడెను. ప్రథమాధ్యాయప్రారంభమందు భరతుని ప్రశ్నించిన ఋషులు వీరే. పుటలు 2-3 చూడవలెను.

ఈ ఋషులపేర్లుగల 5 శ్లోకములును బొంబాయిముద్రణమునందు లేవు.

ఆశీర్వచనములను నేను నిర్వర్తింపగా వానిచే సంతుష్టులైన దేవతలు నాతోనిట్లనిరి- "ఈ నీ ప్రయోగముచే మేము మిక్కిలిగా పరితుష్టులమైనాము. దేవతలను, అసురులనుమాత్రమే కాక లోకమునెల్ల ఆనందింపజేయును కాన ఈ ప్రయోగము (స్తుతి - ఆశీర్వచనములు) 'నాంది' అనబడును."

గీత - వాద్యానునాదముగల శుభమైన కాకుస్వనము ఏదేశమందు ప్రయుక్తమగునో ఆ దేశమందు పాపములు నశించుటయేకాక మంగళములు చేకూరును. నాట్యసమాశ్రయమైన ధ్వని ఏదేశమందు వ్యాపించునో ఆదేశమందు రక్షస్సులు కాని, విఘ్నములుకాని నిలువజాలవు. ఆవాహ - వివాహములందును, నృపతి మంగళమందును, యజ్ఞమునందును నాందీపాఠమును విన్నచో హింస్రములు (విఘ్నములు) సర్వదా నశించును. పాఠ్య - నాట్య - గేయ - చిత్ర - వాదిత్రములు వేదమంత్రార్థ - వచనములతో సమములని తెలియవలెను.[4] స్నాన - జపసహస్రములకంటె గీత-వాదిత్రములు నిశ్చయముగా పవిత్రములని దేవదేవునివలనను, శంకరునివలనను వినియుంటిని. శుభమైన ఆతోద్య - నాట్య - గీత - పాఠ్యముల ధ్వని ఏదేశమందు వినిపించునో అచ్చట అశుభము ఎన్నడును సంభవించదు.

ఇట్లు రంగపూజాధికారార్థము అనేకవిధములగు స్తోత్రవాక్యములతో, దేవతాభ్యర్చనములతో కూడిన పూర్వరంగమును నేను నిర్వర్తించితిని. రంగమండలమందు అభివాదనసమయమున శిరమునకు క్లేశము కలిగినచో సూత్రధారుడు శౌచమొనర్పవలెను. శౌచమాచరించి, జర్జరపూజకై మంత్ర ముచ్చరించవలెను. ఇది పూర్వరంగవిధి. *

### నటులు శాపగ్రస్తులగుట

ఇంక, నాట్యము భూలోకమం దెట్లవతరించినదో వివరింతును; దీనిని మీకు చెప్పకుండ దాచుట యుక్తముకాదు. ఈ నా తనయులందరును నాట్యవేదమదాన్వితులై, నాట్యసంశ్రయములైన ప్రహసనములతో సర్వలోకమును బాధించసాగిరి. ఒకప్పుడు వారు గ్రామ్యధర్మప్రవర్తితమును, ఋషులను హేళనముచేయునదియును అయిన ఒక శిల్పకమును (నాట్యమును) నిర్మించిరి. అశ్రావ్యము, దురాచారము, గ్రామ్యధర్మప్రవర్తితము, నిష్ఠురము, అప్రశస్తము అయిన ఆ కావ్యమును పరిషత్తునందు ప్రయోగించిరి. ఆ విషయమును విని ఋషులందరును భీమరోషప్రకంపితులై,

4. నాట్యప్రయోగము యజ్ఞకర్మతుల్యమని పెక్కుసార్లు చెప్పబడుట గమనార్హము.

* [కాశీముద్రణమునందు 36 వ అధ్యా—1-28 శ్లో; బొంబాయిముద్రణమునందు 36 వ అధ్యా—1-26 శ్లో.] బరోడా - 36 వ అధ్యా. - 1-30 శ్లో.



భరతులనెల్ల నిర్దహింపగల అగ్నులవలె క్రుద్ధులై ఇట్లు పలికిరి—"ఓ ద్విజులార! మమ్మిట్లు విడంబించుట (హేళనముచేయుట) మీకు యుక్తముకాదు. ఇట్లు మమ్ము పరిభవించుట ఎందులకు? ఇది మాకు సమ్మతముకాదు. మీరు నాట్యవేదజ్ఞానమదోన్మత్తులై అవినయాశ్రితులైనారు. కావున మీ యీ కుజ్ఞానము నాశము పొందగలదు. ఋషి - బ్రాహ్మణసమాజమందున్నవారైనను మీరు గాయత్రీవర్జితులు, నిర్వ్రతులు, హోమరహితులు, శూద్రాచారులు అగుదురుగాక. మీవంశమంతయును అశౌచయుతమగునుగాక. మీ వంశజులెల్లరును స్త్రీ-బాల-కుమారసహితముగా నర్తకులై అపాంక్తేయులు, కుత్సితులు, అధములు, ఇతరులను కొలిచి జీవించువారు, శస్త్రమును అమ్ముకొని జీవించువారు కాగలరు."

### దేవతల అభ్యర్థనము

నా సుతుల శాపవృత్తాంతమును తెలిసికొని దేవతలందరును విమనస్కులై ఆ ఋషులయొద్దకు వచ్చిరి. శక్రప్రభృతులగు ఆ దేవతలందరును ఋషులను యాచించుచున్నవారై "ఇప్పుడు దుఃఖము సంభవించినది. నాట్యము నశింపగలదు" అని చెప్పిరి.

### ఋషుల సమాధానము

అంతట ఋషులు "నాట్యముమాత్రము నశించదు; కాని, తక్కిన శాపమంతయును జరిగితీరును" అని పలికిరి.

### భరతుని అనునయము

ఉగ్రతేజస్కులైన ఆ ఋషుల వచనమును విని నా సుతులందరును విషణ్ణులై నన్ను చేరి "అయ్యో! నీవలన మేము నాశనమైనాము. ఈ నాట్యదోషము కారణముగా మేము శూద్రాచారులమైనాము" అని దుఃఖపడిరి. అప్పుడు నేను వారిని సాంత్వనపరచి క్రిందివిధముగా చెప్పితిని—"ఓ అనఘులార! కోపమును చెందకుడు. మునుల వాక్యమెన్నడును మృష (అబద్ధము) కారాదు. ఇది అంతయును మనకు దైవవిహితమైనదని తెలిసికొనుడు. కావున మరణించవలెననెడి తలంపును రానీకుడు. మరియు ఈ నాట్యవేదము బ్రహ్మ స్వయముగా ప్రవర్తింపజేసినదని ఎరుగుడు. దీనిని శిష్యులకును, తదితరులకును ప్రయోగపురస్సరముగా నేర్పుదము. మహాశ్రయము, మహాపుణ్యాదము, వేదాంగోపాంగసంభవము అయి అతికష్టముతో ప్రవర్తింపజేయబడిన ఈ నాట్యము నశించకుండునుగాక. ఈ నాట్యమును యథా

తత్త్వముగా అప్సరసల కొసంగి మీరు ప్రాయశ్చిత్త మొనర్చుకొనుడు. (ఇట్లు నాట్యవేదమును స్త్రీల కొసంగినను వేదార్థత్యాగశంక లేదని తెలియవలెను.) *

నహుషుడు భరతసుతులను భూలోకమున కాహ్వానించుట<sup></sup>

అంతట, ఒకప్పుడు నహుషుడనెడి పార్థివుడు నయ - బుద్ధి - పరాక్రమము లచే దేవరాజ్యమును పొందెను. దేవరాజ్యమును పాలించుచున్నప్పుడు గాంధర్వమును, నాట్యమును చూచి "ఈ నాట్యప్రయోగము నా గృహమందు (భూలోక మందలిది) ప్రదర్శింపబడుట ఎట్లు?" అని చింతింపసాగెను. ఒకనాడాతడు ప్రయోగార్థియై, సాదరముగ కృతాంజలి అగుచు "అప్సరసలచే ఈ నాట్యము మా గృహమందు ప్రదర్శింపబడునుగాక" అని సురలను కోరెను.

అంతట బృహస్పతిపురోగములైన దేవతలిట్లనిరి— "మీరు స్వర్గాధిపతులు. హితముగను, పథ్యముగను చెప్పుట మా విధి. మనుష్యులతో సురాంగనలకు సంగతి విహితముకాదు. అందుచే నాట్యాచార్యుడు మాత్రము మీ గృహమునకువచ్చి మీకు ప్రీతిని కలిగించునుగాక."

అప్పుడు నహుషుడు కృతాంజలియై నన్నిట్లు కోరెను— "ఓ భగవత్స్వరూపుడ! ఈ నాట్యము ఉర్వియందును ప్రతిష్ఠితము కావలెనని కోరుచున్నాను. ఓ ద్విజోత్తమా! మీ ఆచార్యత్వమునుగూర్చి పూర్వము వినియున్నాను. ఇప్పుడు నా కది లబ్ధమైనది. పూర్వము మా పితామహుని (పురూరవుని) గృహమందు బ్రహ్మప్రోక్తమైన విధిననుసరించి అంతఃపురజనులయెదుట ఊర్వశి ఈ నాట్యమును ప్రదర్శించియుండెను. పిమ్మట ఊర్వశీప్రణాశశోకముచే రాజు ఉన్మత్తుడగుటయు, అంతఃపురజనులు విపన్నులగుటయు సంభవింపగా ఈ నాట్యము అచ్చట నశించినది'.

---

5. నాట్యముత్పన్నమైనప్పటినుండియు దానిని భరతసుతులును, అప్సరసలును కలిసి ప్రయోగించుచుండెడివారు. భరతసుతులు శాపగ్రస్తులైన పిమ్మట అప్సరసలు మాత్రమే ప్రయోగించెడివారు. వారే పురుషభూమికలనుకూడ ధరించెడివారు. కాళిదాసు విక్రమోర్వశీయ మీ విషయమును స్పష్టము చేయుచున్నది.

*[కాశీముద్రణమునందు 36వ అధ్యా— 29-47 శ్లో; బొంబాయి ముద్రణమునందు 36వ అధ్యా— 27-45 శ్లో.] బరోడా - 36 వ అధ్యా. - 31-50 శ్లో.

6. ఇచ్చటనుండి బొంబాయి బరోడా లందు 37 వ అధ్యాయము ప్రారంభమగుచున్నది. అభినవగుప్తుడుకూడ ఈ విధముగానే ఈ అధ్యాయమును విభజించియుండెను. నహుషుడు స్వర్గము నాక్రమించి పాలించిన విషయము పురాణప్రసిద్ధము.

7. కాళిదాసుని విక్రమోర్వశీయమందలి కథ ఇదియే.



మంగళకరములైన తిథులలో యజ్ఞక్రియలందు ప్రయుక్తమగుటకొరకు ఈ నాట్యమును మరల భూతలమునందు సుప్రకాశితమును చేయగోరుచున్నాను. నానా ప్రకృతిసంశ్రయములైన నాట్యబంధములను స్త్రీల లలితవిన్యాససహితముగా నా గృహమందు ప్రయోగింపగోరుచున్నాను".

ఇట్లు నహుషుడు కోరగా నే నంగీకరించితిని. పిమ్మట నా సుతులను, సురలనుకూడ పిలిచి సామపూర్వకముగా ఇట్లు చెప్పితిని— "రాజైన ఈ నహుషుడు కృతాంజలియై మనలను యాచించుచున్నాడు. కావున, ఈ నాట్యమును ప్రయోగించుటకై హితులతో కూడి మీరు భూలోకమున కేగుడు. మీరు అచ్చట చక్కగా నాట్యమును ప్రయోగించినచో నేను మీకు శాపాంతమును కలిగింతును. బ్రాహ్మణనృపుల విషయములో ఇంక మీరు కుత్సితభావమును చూపవలదు. ఈ పార్థివుని కోరికను నేను త్రోసివేయలేను. కావున మీరు వసుధాతలమున కేగి ప్రయోగమును ప్రదర్శింపుడు. మనకును, నహుషునకును ఆప్తోపదేశము చేతనే నాట్యసిద్ధి కలుగునని బ్రహ్మ చెప్పియుండెను. శేషమును అనగా నేను చెప్పక విడిచిన వివరములను ప్రయోగ-కారికా-నిరుక్తసహితముగా కోహలుడు ఉత్తరతంత్రము నందు చెప్పును. క్రీడనీయకమైన ఈ నాట్యమును అప్సరసల, స్వాతి-నారదుల సాహాయ్యముతో స్వర్గమునందు ప్రతిష్ఠించితిని. మీరు భూలోకమందు ప్రతిష్ఠింపుడు.*

నాట్యము భూలోకమందవతరించుట : భరత (నట) వంశోత్పత్తి

అప్పుడు నాసుతులు వసుధాతలమున కేగి నహుషగృహమందు స్త్రీలతో కూడిన పెక్కు ప్రయోగములను కల్పించి యథాక్రమముగా ప్రదర్శించిరి. నా సుతులు ఆ మనుష్యస్త్రీలయం దనురక్తులై, వారితో భోగము లనుభవించి పుత్రవంతులైరి. అట్లు పుత్రవంతులై, అపుత్రులకొరకు వివిధాశ్రయములైన పెక్కు ప్రయోగములను నిబంధించిరి. పిమ్మట బ్రహ్మచే అనుజ్ఞాతులై నాసుతులు మరల స్వర్గమును చేరిరి. ఇట్లు శాపవశమున నాట్యము ఉర్వీతలము నందవతరించినది; అంతియేకాక భరతవంశ మొకటి మర్త్యలోకమందు ప్రవర్తితమైనది⁸.

ధర్మక్రియాయుక్తులైన కోహలాదులు, వత్స-శాండిల్య - ధూర్తిలులును మర్త్యభావముతో కొంతకాలము భూమియందు వసించి నరులకు బుద్ధివర్ధనమును;

---

*[కాశీముద్రణమునందు 36వ అధ్యా— 48-66 శ్లో; బొంబాయిముద్రణమునందు 37 వ అధ్యా— 1-20 శ్లో. బరోడా - 37 వ అధ్యా. - 1-18 శ్లో.]

8. శూద్రాచారులగుదురని ఋషులచే శప్తులైన భరతసుతులు మనుష్యస్త్రీలను వివాహమాడి పుత్రవంతులైరి. ఆ పుత్రులే 'భరతవంశము' అను పేర ప్రసిద్ధినందిరి.

త్రైలోక్యక్రియోపేతమును, సర్వశాస్త్రనిదర్శనమును అయిన ఈ శాస్త్రమును భూలోకమున ప్రవర్తింపజేసిరి.

నాట్యవేద మాహాత్మ్యము

మంగళప్రదము, లలితము, బ్రహ్మవదనోద్భవము, సుపుణ్యదము, పవిత్రము, శుభకరము, పాపవినాశకము, స్వయంభూప్రోక్తము అయిన ఈ శాస్త్రమును నిత్యమును వినునతడును, అవధానముతో దీని ప్రయోగమును ఆచరణలో పెట్టునతడును, ఆ ప్రయోగమును దర్శించునతడును వేదవిదులు, యజ్ఞయాజులు, దానశీలురు పొందెడి ఉత్తమగతిని తప్పక పొందుదురు. సర్వదానములందును ప్రేక్షణీయ (నాట్యప్రయోగ) ప్రదానము ప్రశస్తమైనదికాన నృపధర్మము లన్నింటియందును ఇది మహాఫలముగా కీర్తింపబడినది. దేవతలు నాట్యప్రయోగగతములైన మంగళములచే తుష్టిని పొందినంతగా గంధమాల్యాదిపూజలచే తుష్టిని పొందరు. గాంధర్వమును కాని, నాట్యమును కాని చక్కగానేర్చి, కాపాడు నరుడు బ్రహ్మర్షులతోపాటు పుణ్యవంతమైన సద్గతిని పొందును. ఇట్లు, నాట్యప్రయోగమందు శాస్త్రప్రణీతమైన కర్మ పెక్కు విధములుగా ఉన్నది. ఇచ్చట నేను చెప్పక విడిచిన విషయములను తజ్ఞులు లోకము ననుకరించుటచే భావించవలెను.

భరతవాక్యము

కించాన్యత్ సస్యపూర్ణా భవతు వసుమతీ నష్టదుర్భిక్షరోగా ।
శాంతిర్గోబ్రాహ్మణానాం భవతు నరపతిః పాతు పృథ్వీం సమగ్రామ్ ॥

—ఇంక చెప్పవలసినదేమి కలదు ? వసుమతి సస్యపూర్ణ అగునుగాక ! దుర్భిక్షములు, రోగములు నశించునుగాక ! గో-బ్రాహ్మణులకు శాంతి కలుగునుగాక ! ఈ సమగ్రమైన అవనినెల్ల నరపతి రక్షించునుగాక !' *

షట్త్రింశాధ్యాయము సమాప్తము.

భారతీయనాట్యశాస్త్రము సంపూర్ణము.

---

9. దీనితరువాత బొంబాయిముద్రణమునందు క్రిందిశ్లోకమును, గద్యయునుకలవు—

మహాపుణ్యం ప్రశస్తం చ లోకానాం నయనోత్సవమ్ ।
నాట్యశాస్త్రం సమాప్తేదం (?) భారతస్య యశోవహమ్ ॥
....సమాప్తశ్చాయం గ్రంథః. నంది భరత సంగీతపుస్తకమ్ (?)

*[కాశీముద్రణమునందు 36 వ అధ్యా—67-79 శ్లో; బొంబాయిముద్రణమునందు 37 వ అధ్యా—20-33 శ్లో. బరోడా ముద్రణము - 37 వ అధ్యా. - 19-31 శ్లో.]



## విశేషాంశములు

### 1. అధ్యాయవిభజనము : అభినవగుప్తుడు

'అభినవభారతీ'ప్రారంభమందు "షట్త్రింశకం భరతసూత్రమిదం" అని అభినవగుప్తుడు వేర్కొనెను. అనగా భరతసూత్ర మనెడి 'నాట్యశాస్త్రము 36 అధ్యాయములు కలది' అని స్పష్టమగుచున్నది. కాని అభినవగుప్తుడే చివరి (36 వ) అధ్యాయమును రెండుగా విభజించి మొత్తము 37 అధ్యాయములను చేసెను. ఈ మార్పునకు కారణము డా. పి. యస్. శాస్త్రిగారు చెప్పినది కావచ్చును. కాశీముద్రణమునందు 36 అధ్యాయములే కలవు. ఈ అధ్యాయమందలి 6 వ అధస్సూచికనుకూడ చూడవలెను.

### 2. నాట్యావతరణము : శారదాతనయుని కథనము

భరతాద్యాచార్యులు చెప్పిన మార్గముననుసరించి నాట్య-నృత్యభేదములనెల్ల యథార్థముగా వివరించి యున్నాను. అవి మార్గ - దేశిభేదములచే రెండేసి విధములు. ఆ ప్రబంధభేదముల ప్రయోగక్రమమును ఇప్పుడు వివరింతును—

పూర్వము మనుమహీపాలుడు సప్తద్వీపవతి అయిన భువమును పాలించి, ఆ దుర్భరభారముచే శ్రాంతచేతస్కుడయ్యెను. "కొంతకాలము ఈ భూమిభారమునుండి విముక్తి పొంది సుఖింతునుగాక" అని తలంచి ఆతడు తండ్రియైన సూర్యునియొద్ద కేగెను. పుత్రవత్సలుడయిన భాస్కరుడు భూభారఖిన్నుడైన మనువునకు విశ్రామోపాయమును క్రిందివిధముగా బోధించెను.

పూర్వము, దుగ్ధాబ్ధిశయనుని నాభికమలమునుండి పుట్టిన బ్రహ్మ జంగమస్థావరాత్మకములైన లోకములను సృజించెను. కొంతకాలమునకు లోకపాలనాభారాయాసఖిన్నుడైన బ్రహ్మ విశ్రాంతిసుఖమును కాంక్షించి శ్రీపతియొద్ద కేగెను. 'ఏదేని ఒక వినోదముచేతనే వీనికి విశ్రాంతి కలుగును' అని విష్ణువు తలంచి "పురారాతియును, అంబికాపతియును అయిన ఈశ్వరునియొద్ద కేగుము" అని బ్రహ్మతో చెప్పెను. బ్రహ్మయును ఈశ్వరుని దర్శింపగా ఆతడు నందికేశ్వరుని పిలిచి "నీవు నాయొద్ద నేర్చిన నాట్యవేదమును అశేషముగా, సప్రయోగముగా, సవిస్తరముగా బ్రహ్మకు చెప్పుము" అని అజ్ఞాపించెను. నందికేశ్వరుడును నాట్యవేదమును సప్రయోగముగా నేర్పి, "జగత్పాలనాయాసమునుండి విశ్రాంతిసుఖమును పొందుము" అని చెప్పి బ్రహ్మను వీడ్కొల్పెను.

అంతట బ్రహ్మ స్వీయమందిరమున కేతెంచి, భారతీసహితుడై నాట్యవేదప్రయోక్త కొరకు ధ్యానించెను. అప్పుడొకముని ఐదుగురు శిష్యులతో బ్రహ్మయెదుట నిలిచెను. "ఈ నాట్యవేదమును భరించుము ('భరత')" అని బ్రహ్మ చెప్పగా ఆ ముని శిష్యసహితుడై, దాని నభ్యసించి రస - భావ - అభినయ ప్రయోగములచే అనేకవిధములుగా బ్రహ్మను సంతోషపెట్టెను. ప్రయోగపరితోషితుడైన బ్రహ్మ వారి కిట్లు వరమిచ్చెను- "ఈనాట్యవేదమును 'భరించు' మని మొదట చెప్పితిని కదా. కావున, జగత్రయమునందును మీరు 'భరత' నామముతో వ్యవహరింపబడుదురుగాక ! నాట్యవేదముకూడ మీ పేరుమీదుగానే ప్రసిద్ధి కెక్కును."

పై విధముగా బ్రహ్మ భరతులవలన లోకరక్షావ్యసనజన్యమైన శ్రమను పోగొట్టు
కొనుచుండెను. కావున నీవును బ్రహ్మను ఆరాధించి భరతప్రయోగమును భూమికి
తెచ్చుకొని, భూభారశ్రమను పోగొట్టుకొమ్ము-అని సూర్యుడు మనువుతో చెప్పెను.

అంతట మనువు బ్రహ్మయొద్ద కేగి వానిని ప్రార్థించెను. బ్రహ్మయును వానియందు
దయతలచినవాడై భరతులను పిలిచి "మీ రీ మనువుతో భూలోకమున కేగి భారతవర్షము
నాశ్రయించుకొని వర్తింపుడు" అని ఆదేశించెను. వారును మనువుతో అయోధ్యాపురి
కేతెంచి తమ ప్రయోగములతో రాజును ఆనందింప జేసిరి. పిమ్మట దేశదేశములును తిరిగి
తక్కిన రాజులను కూడ ఆనందింపజేసిరి....మనువు ప్రార్థింపగా ఆ భరతులు నాట్యవేద
విషయములను సంగ్రహించి రెండు ప్రతులను సిద్ధము చేసిరి. అందులో ఒకటి ద్వాదశ
సాహస్రి (12 వేల శ్లోకములు కలది); రెండవది షట్సాహస్రి (6 వేల శ్లోకములు
కలది). [భావప్రకాశము-10 వ అధికరణము - పుటలు 284-287.]

### 3. నాట్యావతరణము : నందికేశ్వరుని కథనము

పూర్వము చతుర్ముఖుడు నాట్యవేదమును భరతున కొసంగెను. భరతుడు గంధర్వ-
అప్సరోగణ సహితుడై శంభు నెదుట నాట్య-నృత్త-నృత్యములను ప్రదర్శించెను. దానిని
చూడగానే శివునకు స్వప్రయుక్తమైన 'తాండనము' జ్ఞప్తికి వచ్చెను. అంతట తండువు
శివుని ఆదేశము ననుసరించి భరతునకు తాండవమును ఉపదేశించెను. శివుని ఆదేశముననుస
రించి పార్వతి భరతునకు లాస్యమును కూడ ఉపదేశించెను.

ఇట్లు తండువువలన గ్రహించిన తాండవమును మునులు మానవులకు నేర్పిరి.
పార్వతి బాణాత్మజయైన ఉషకు లాస్యమును నేర్పెను. ఆమెనుండి ద్వారవతి యందలి
గోపికలును, వారినుండి సౌరాష్ట్రయోషితలును లాస్యమును నేర్చిరి. వారు దానిని
ఆయా దేశములందలి స్త్రీలకు నేర్పిరి. ఇట్లిది పరంపరాప్రాప్తమై లోకమందు ప్రతిష్ఠితమైనది.
[అభినయదర్పణ ప్రారంభమందలి కథ. ఇది వావిళ్ళవారిముద్రణమునందు లేదు. ఈకథను
అబ్బయామాత్యుడు 'అనిరుద్ధచరిత్ర'యం దనువదించెను - 5 వ ఆ. 104 ప.]

### 4. నటులపై నిషేధము

భరతసుతుల శాపమునకు వారి వివేకహీనమైన చేష్టలే కారణమనుట స్పష్టము.

నటులకు, నర్తకులకు, వాదకులకు, పాఠకులకు సంబంధించిన నాట్యశాలలు ఊరి
మధ్యలో కట్టరాదని అర్థశాస్త్రము చెప్పుచున్నది. మరియు కుశీలవులు శూద్రులనియు,
రూపాజీవులనియు, వారిని దరిచేరనీయరాదనియు తెలుపుచున్నది. (కుశీలవుడనగా 'కు+
శీలము' అనగా చెడు నడత కలవాడని కొందరర్థము చెప్పుదురు).

మనుధర్మశాస్త్రము నటవృత్తిని బహిష్కరించినది. భార్య నితరుల కప్పగించుటకు
నటులే సిద్ధపడుదురుకాన వారి భార్యలతో వ్యభిచరించుట పెద్ద దోషముగా పరిగణింప
బడలేదు. కుశీలవుని సాక్ష్యము న్యాయసమ్మతమైనదికాదని యాజ్ఞవల్క్యస్మృతి చెప్పినది;
మరియు బ్రాహ్మణుడు నటుడు కారాదనియు, బ్రాహ్మణుడు నటునితో భోజనము



చేయరాదనియు నిషేధించినది. నటులు శూద్రులకును, వైశ్యకన్యలకును పుట్టిన మిశ్రజాతి
వారని విష్ణుస్మృతి పేర్కొనుచున్నది. నటుడు జాయాజీవి అని అమరసింహుడు
పేర్కొనెను. 19 వ శతాబ్ది రెండవ భాగములో తెలుగు దేశమున నాట్యప్రయోగములు
ప్రారంభమైనప్పుడు కూడ నటులు హీనముగా చూడబడిరి.

మృచ్ఛకటికప్రస్తావనలో "మన యింటికి రాదగిన బ్రాహ్మణుని పిలువుము" అని
నటి చెప్పుటయు, "సుసమృద్ధమైన ఈ యుజ్జయినిలో నాకు దగిన బ్రాహ్మణునెట్లు వెదుక
గలను" అని సూత్రధారుడు బాధపడుటయు నటులు సంఘమందు హీనస్థితిలో ఉన్నట్లు
స్పష్టముచేయుచున్నవి. ఇందులకు వారి చెడునడతయే కారణము కావచ్చును.

కాని, పై విధముగా స్మృతులును, శాస్త్రములును నటులను నాట్యప్రయోగ
ములను నిషేధించుచున్నను రూపకరచన సాగుచునే వచ్చినది; ఆ రూపకములు నగర-రాజ
ప్రాసాద-దేవాలయములందు ప్రయుక్తములగుచునే యుండెను. ఇంచుమించుగా రూపక
కర్తలందరును నటులకు మిత్రులేయని ఆ యా ప్రస్తావనలనుబట్టి తెలియుచున్నది.

### 5. నాట్యమహిమ

నాట్యము యజ్ఞకర్మతుల్యమని పలుసార్లు స్పష్టము చేయబడినది. "మంగళప్రదము,
లలితము, బ్రహ్మవదనోద్భవము, సుపుణ్యదము, పవిత్రము, శుభకరము, పాపవినాశకము,
స్వయంభూప్రోక్తము అయిన ఈ నాట్యశాస్త్రమును నిత్యమును వినునతడును, అవధాన
ముతో దీని ప్రయోగమును ఆచరణములో పెట్టునతడును వేదవిదులు యజ్ఞయాజులు
పొందెడి ఉత్తమగతిని తప్పక పొందుదురు. సర్వదానములందును ప్రేక్షణీయ
ప్రదానము ప్రశస్తమైనది" అని ఈ అధ్యాయాంతమందు చెప్పబడుట గమనార్హము.

నటులను, నాట్యప్రయోగములను బహిష్కరించెడికాలము ఎన్నడో దాటిపోయినది.
క్రీ. శ. 15 వ శతాబ్దిప్రాంతమందే నృత్యకళను కూచిపూడి బ్రాహ్మణులు
చేపట్టుట స్పష్టముచేయుచున్నది. 19 వ శతాబ్ది రెండవ భాగములో విద్యాధికులును,
కళాభిమానులును నాట్యకళ నుద్ధరించుటకు చాల శ్రమపడిరి. ఇప్పుడు జాతీయప్రభుత్వము
కూడ ముందంజవేసి నాటకకళకు ఎనలేని గౌరవమును చేకూర్చినది.

భారతదేశమున నాటకకళ మరల మహోన్నతమైనదశకు రాగలదను విశ్వాసము
కలుగుచున్నది. నేడు తెలుగు నాటకరంగమును బాధించుచున్న కొన్ని సమస్యలుకలవు.
వాటిని తీర్చవలసిన బాధ్యత ప్రజాప్రభుత్వముచేపట్టుచున్నది.(పుట 746 కూడ చూడవలెను.)

అన్నింటికంటె ముఖ్యమైనది నటులకు చక్కని శిక్షణ నొసంగుట. ఇందులకు విశ్వ
విద్యాలయములు పూనుకొని, నాటకళకు శాఖల నేర్పరచి, నటవృత్తికి 'విద్యాస్థాయి'ని
కలిగించవలెను. నేడది జరుగుచున్నది కావున తెలుగుదేశమున నాటకకళ ఉత్తమస్థితిని పొంద
గలదనుటకెట్టి సంశయమునులేదు. అప్పుడే బ్రహ్మ వివరించిన నాట్యప్రయోజనములు సిద్ధింప
గలవు (పుట 18 లోని 30 వ అధస్సూచికను చూడవలెను.)

గుప్తభావప్రకాశిక సంపూర్ణము.

---

నాట్యము : యోగము



కుమారి పతివాడ్ల రాధిక

"పుంఖానుపుంఖవిషయేక్షణతత్పరో౽పి
బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ।
సంగీత-తాళ-లయ-వాద్యవశంగతాపి



1. శృంగారము 2. హాస్యము 3. కరుణము



4. రౌద్రము 5. వీరము భయానకము



7. బీభత్సము 8. అద్భుతము 9. శాంతము

నవరసాభినయము

# అనుబంధములు

## అనుబంధము - 1

### నాట్యశాస్త్రకర్తలు : వ్యాఖ్యాతలు

డా. పి. యస్. శాస్త్రి

రీడర్, సాగర్ విశ్వవిద్యాలయము.

సంవిద్రూపేణ యా నిత్యం లాస్యం దివ్యం ప్రయచ్ఛతి
స్వప్రకాశాం మహాదేవీం వందే తాం చిత్కలాం పరామ్.

1. నాట్యశాస్త్రము ఉపవేదములలో నొకటిగా ప్రసిద్ధి చెందినది. నేడు మనకు లభించు భరతుని నాట్యశాస్త్రముకన్న పూర్వ మనేక నాట్యగ్రంథము లుండెడివని తెలియ వచ్చుచున్నది. శిలాలి, కృశాశ్వులు నటసూత్రములను రచించిరని పాణిని సూత్రముల (4-3-110, 111) లో కన్పట్టును. రసభావాభినయాత్మకమగు నాట్యము నే వీరు సూత్రించి రని పాణిని చెప్పిన నాట్యశబ్దోత్పత్తి (4-3-129) వలన గ్రహించనగును. ధర్మశాస్త్ర ములు, దర్శనములు సూత్రరూపమున వెలువడినట్లు నాట్యశాస్త్రముకూడ మొదట సూత్రములలో చెప్పబడినది. ఈ ప్రాచీనసూత్రములు కాలగర్భమున లీనమైనవి.

ఇతరు లనేకులు నాట్యశాస్త్రములను రచించినట్లు సాహిత్యసంప్రదాయమున్నది.

"తస్మా న్నాట్యరసా అష్టావితి పద్మభువో మతమ్,"
"ఉత్పత్తి స్తు రసానాం యా పురా వాసుకి నోదితా
నారదస్యోచ్యతే సైషా ప్రకారాంతరకల్పితా."

అని శారదాతనయుడు భావప్రకాశలో (పుట 47) పల్కినాడు. పద్మభువు డనగా బ్రహ్మ. బ్రహ్మచెప్పిన నాట్యశాస్త్రమున ఎనిమిది రసములే చెప్పబడినవి. నారదుడు, వాసుకి రసో త్పత్తిని వివరించినారట!— "ఇతి వాసుకినా ప్యుక్తో భావేభ్యో రససంభవః" అని శారదాతనయుడు (పుట 37) చెప్పుటచేత భావములనుంచి రసము ఉత్పన్నమగునని వాసుకి సిద్ధాంతించెనని తెలియుచున్నది, తన భావప్రకాశలో ఎనిమిదవ అధ్యాయమున ఉత్సృష్టికాంకములోని అంకనియమమునుగూర్చి వ్రాయుచు

"అస్యాంక మేకం భరతో ద్వావంకా వితి కోహలః
వ్యాసాంజనేయగురవః ప్రాహు రంకత్రయం యదా,"
"విష్కంభకో ఽత్ర సంకీర్ణః తత్ర ప్రవేశకః"
"ముఖ నిర్వహణే సంధీ ఇతి కోహలభాషితమ్."

అని నాడు. భరతుడేకాక వ్యాస, ఆంజనేయ, కోహలులు నాట్యశాస్త్రములను రచించిరని స్పష్టమగుచున్నది. రసముల ప్రాధాన్యాప్రాధాన్యమును వ్యాసమతానుసారముగా చెప్ప దలచి "వ్యాసప్రోక్తేన మార్గేణ కథయామి యథార్థతః" (పుట. 55) అనినాడు. నంది కేశ్వరుడు బ్రహ్మకు నాట్యమును నేర్పెనను వ్యాసవచనము కలదట. నంది, బ్రహ్మ, వాసుకి, నారద, వ్యాస, ఆంజనేయు లను ఆర్గురు నాట్యప్రవక్తలు భరతునికన్న ముందుకలరు.

పాణిన్యాచార్యుని మహేశ్వరసూత్రములు శివనాట్యమున ఉత్పన్నమైనవని సంప్రదాయము. సదాశివుడు నాట్యశాస్త్రకర్తలలో మొట్టమొదటివాడు.

"ప్రోక్తః సదాశివే నాస్య స్వరూపాశ్రయనిర్ణయః"

అని ప్రారంభించి (పుట 152) సదాశివమతమును శారదాతనయుడు ప్రస్తుతించెను. కావ్యము రసాత్మకమని, రసమునకు ప్రధానలక్షణమును ఆస్వాద్యత్వమున గ్రహించవలెనని, రసికుడగు సామాజికునియందే రసము కలదని సదాశివుని మతము. శివుడు తాండవమును, పార్వతి లాస్యమును నిర్వచించిరని సంప్రదాయము. గ్రంథారంభమున సదాశివుడు, శివుడు, గౌరి, వాసుకి, సరస్వతి, నారదుడు, అగస్త్యుడు, వ్యాసుడు, భరతుడు, భరత శిష్యులు, ఆంజనేయుడు అనువారు నాట్యశాస్త్రప్రవక్తలని, వీరి గ్రంథముల నవలోకించి తాను భావప్రకాశను రచించుచుంటినని పలికినాడు. వీ రందరిలో మొట్టమొదట పేర్కొనబడిన సదాశివుడు సంగీతశాస్త్రప్రవక్తలలో కూడ కలడని చెప్పుచు ఇంకను విశేషములను తెల్పినాడు శార్ఙ్గదేవుడు (సం. ర. 1. 15). శివునిచే వివస్వంతునకు లాస్యతాండవసహితమగు నృత్త, నర్తన, నాట్యములు చెప్పబడినవని యోగమాలాసంహితకూడ పల్కినదని శారదాతనయుడనినాడు (పుట 45). శివభరతమనికాని సదాశివభరతమనికాని మొట్ట మొదటి నాట్యశాస్త్ర ముండెడిదని, ఆ తర్వాత బ్రహ్మభరతము వచ్చినదని, ఇవి నేటి భరతనాట్యశాస్త్రపు మాతృకలని చెప్పవలెను.

2. నేడు మనకు నందికేశ్వరుని అభినయదర్పణమొకటి ఉన్నది. నందికి తండు అని కూడ పేరు. శివుని అజ్ఞను పాటించి భరతునకు తండు చెప్పినది తాండవమని భరత నాట్యశాస్త్రమున కలదు. మానవులకు నాట్యశాస్త్రమును అందచేసినవాడు నంది కేశ్వరుడు కావచ్చును. ఈ సందర్భమున శారదాతనయు (పుట 56) డిచ్చిన కథ ఒకటి కలదు. మహేశ్వరుడు బ్రహ్మ, విష్ణువులను, వైష్ణవీ, సర్వమంగళా అను శక్తులను సృష్టించెను. అప్పుడు బ్రహ్మ లోకములను సృష్టించి, మహేశ్వరుని పురావృత్తమును స్మరించెను. ఈ సమయమున ఆయనకు నందికేశ్వరుడు ప్రత్యక్షమై ప్రయోగపూర్వకముగా నాట్యవేదమును చెప్పెనట. గ్రంథాంతమున (పుట 295-6) కొంత విశేషమును వివరించినాడు. సమగ్రముగా బ్రహ్మకు నాట్యవేదమును నేర్పి "దీనితో పాలనాయాసవిశ్రాంతిసుఖమును పొందుము"అనినాడు. ఆపై భారతీసహితుడైన బ్రహ్మ నాట్యవేదప్రయోక్తను స్మరించగా ఐదుగురు శిష్యులతో కూడిన ఒకానొక ముని వారియెదుటకు వచ్చెను. "నాట్యవేదమును మీరు భరింపుడు" అని వీరలను బ్రహ్మ అదేశించగా వీరు ప్రయోగసహితముగా నాట్యవేదమును నేర్చుకొనిరి. రసభావాభినయములతో, వివిధప్రయోగములతో బ్రహ్మను సంతోషపరచిన వీరికి బ్రహ్మయే భరతులను సార్థకనామమును ప్రసాదించెను. నందికేశ్వరుని నాట్యశాస్త్రముకూడ నేటి నాట్యశాస్త్రపు మాతృకలలో నొకటి అని స్థిరమగుచున్నది.

"షట్ త్రింశకం భరతసూత్ర మిదం" అని నాట్యశాస్త్రమును అభినవగుప్తుడు ప్రస్తుతించినాడు. "కలానామాని సూత్రకృదుక్తాని యథా" అని భరతభాష్యమున నాన్యదేవుడనినాడు. "సూత్రాణాం సకలాంకానాం జ్ఞేయ మంకముఖం బుధైః ఇతి షట్సహ



స్రీకారః" అని దశరూపవ్యాఖ్యానావసరమున బహురూపమిశ్రు డనినాడు. భరత నాట్య శాస్త్రము ఆరువేల సూత్రములతో నిండియున్నదట. కాని బహురూపమిశ్రుడే "సమావ్య తేహి నాట్యజ్ఞై రంకావతార ఇష్యతే, ఇతి ద్వాదశ సహస్రీకారః"అని పలికినపుడు పండ్రెండు వేల సూత్రములతో ఇంతకన్న ప్రాచీనకాలమున ఈ శాస్త్ర మున్నదని తెలియుచున్నది.

"నాట్య వేదాచ్చ భరతాః సారముద్ధృత్య సర్వతః
సంగ్రహం సుప్రయోగార్హం మనునా ప్రార్థితా వ్యధుః
ఏకం ద్వాదశసాహస్రైః శ్లోకై రేకం తదర్థతః
షడ్భిః శ్లోకసహస్రైర్యో నాట్యవేదస్య సంగ్రహః."

అని శారదాతనయుడు కూడ పల్కినాడు. పూర్వము పండ్రెండువేల శ్లోకములతోనున్న ఈ నాట్యశాస్త్రమును ప్రయోగసౌకర్యమునకై ఆరువేలకు సంక్షేపించినారట. యామ లాష్టకతంత్రము ననుసరించి అతిప్రాచీననాట్యశాస్త్రమున 36,000 శ్లోకములున్నవి. దీనిని 12,000 శ్లోకములకు సంక్షేపించిరని, ఆపైన 6,000 శ్లోకములతో సంగ్రహ పరచిరని చెప్పవలెను.

సదాశివుడు, బ్రహ్మ, భరతుడు అను మువ్వురు నాట్యశాస్త్రకర్తలు కలరని, ఈ మతత్రయమును వివేచించి బ్రహ్మమతమును ప్రతిపాదింపదలచి భరతుడీ నాట్యశాస్త్రమును నిర్మించెనని అభినవగుప్తుడనినాడు. దీనినిబట్టి సదాశివభరతమున 36,000 శ్లోకములు కలవని, బ్రహ్మభరతమున 12,000 శ్లోకములున్నవని, భరత నాట్యశాస్త్రమున 6,000 శ్లోకములు కలవని చెప్పవచ్చును. కాని మనకు లభించు నాట్యశాస్త్రమును మత త్రయమున లెక్కించు వీలులేదని చెప్పుట కాధారములున్నవి.

3. అభిజ్ఞానశాకుంతలవ్యాఖ్యలో అక్కడక్కడ ఆదిభరతమునుండి రాఘవభట్టు కొన్ని శ్లోకముల నిచ్చినాడు. వీటినిబట్టి ఈ ఆదిభరతము శివపార్వతుల సంవాదరూపము కలదని చెప్పవలెను.

"అత్ర నాందీలక్షణ మాదిభరతే-
ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యార్థసూచకః
నాందీతి కథ్యతే ఇతి"

అని ఒకచోట చెప్పినాడు. ఈ నాందీలక్షణము మన నాట్యశాస్త్రమున కూడ కలదు కాని ఇంత క్లుప్తముగా, ఇంత సూత్రప్రాయముగాలేదు. పూర్వరంగవిధానమును (పుట 6), సభ్యస్వరూపమును (పుట 9), లయభేదమును (పుట 12), ఆరంభబీజలక్షణమును లను, ఉత్తమనాయకునకు పాఠ్యవిధిని (పుట 15), ఉపక్షేపమను సంధ్యంగమును (పుట 23), పతాకాస్థానకమును (పుట 40), అంకలక్షణమును (పుట 54), బిందుప్రయత్న లక్షణములను (పుట 69), మదిరాదృష్టిలక్షణమును (పుట 105), ఉపన్యాసమను అంగమును (పుట 108), గర్భసంధిని (పుట 115), నియతాప్తిని (పుట 168), ఆది భరతమునుంచి నిర్వచించినాడు. విస్మయాభినయమున ఉరోనిహితహస్తము లుండవలెనని చిత్రాభినయాధ్యాయమున ఆదిభరతములో కలదనినాడు (పుట 248). ఈ ఆదిభరత

ములో నేటి భరతనాట్యశాస్త్రములోని విషయములు చాల విపులముగా, విశదముగా చర్చింపబడి యుండవచ్చును.

రసనిష్పత్తిని వివరించు సందర్భమున శారదాతనయుడు వృద్ధభరతమునుదాహరించినాడు. ఈ వృద్ధభరతమే ఆదిభరతము కావచ్చును. ఈ నాట్యశాస్త్రమున ఆలంకారికులు ప్రస్తుతించిన విషయములేగాక నృత్య, గీత, వాదిత్రాదివిషయములుకూడ ఉన్నవి. ఇట్టి గ్రంథములు రామాయణములోని ఉత్తరకాండకంటె పూర్వమే బయలుదేరినవని చెప్పుటకు

"స్వరాణాం లక్షణజ్ఞాం శ్చ ఉత్సుకా ద్విజసత్తమా
లక్షణజ్ఞాంశ్చ గంధర్వా.........................
కలామాత్రావిభాగజ్ఞా జ్యోతిషేచ పరంగతా
క్రియాకల్పవిద శ్చైవ తథా కార్యవిదో జనా......
చిత్రజ్ఞా నృత్తసూత్రజ్ఞా గీతనృత్తసూత్రజ్ఞా"... (94. 5-10)

అను పంక్తులాధారము, బహుశః సూత్రములలోనున్న సదాశివభరతమునకు ఆదిభరతము సంక్షేపమై ఉండవచ్చును.

ఆంగికాభినయాదిప్రస్తావములలో మన నాట్యశాస్త్రమున అన్యే, కేచిత్, అపరే మొదలగు మాటలతో భరతుడు పక్షాంతరముల నుపన్యసించుట కలదు. రస, భావ, గీతాది నిరూపణావసరములలో ఆనువంశ్యశ్లోకముల నుదహరించినాడు. ప్రాచీనలాక్షణికులచే విరచితములై, గురుశిష్యపరంపరద్వారా వచ్చుచు, ప్రసిద్ధములైన శ్లోకములు ఆనువంశ్య శ్లోకములని అభినవుడీ శబ్దమును నిర్వచించెను.

రసమునుంచి భావములు వచ్చుచున్నవా? లేక భావములనుంచి రసము నిష్పన్నమగుచున్నదా? అను ప్రశ్న వేసికొని "కేషాంచిన్మతం—పరస్పరసంబంధా దేషా మభినిష్పత్తి రితి"అనినాడు భరతుడు. తనకంటె పూర్వమున్న లక్షణగ్రంథములను సమగ్రముగా పరిశీలించి, సంక్షిప్తముగా ఈ నాట్యశాస్త్రమును భరతుడు రచించినాడనుట కిట్టి వాక్యములాధారములు.

"సంగ్రహం కారికాం చైవ నిరుక్తం చైవ తత్త్వతః"

అని మునులడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పుచు

"కిం త్వల్పసూత్రగ్రంథార్థ మనుమానప్రసాధకమ్
నాట్య స్యాస్య ప్రవక్ష్యామి రసభావాదిసంగ్రహమ్
విస్తరేణోపదిష్టానా మర్థానాం సూత్రభాష్యయోః
నిబంధో యః సమాసేన సంగ్రహం తం విదుర్బుధాః"

అనినాడు భరతుడు. ఈ భాగమునకుగల అభినవభారతిని అనుసరించి నాట్యసూత్రగ్రంథ మొకటి, కారికలతోనున్న శాస్త్రము వేరొకటి, నిరుక్తముతో కూడిన గ్రంథము మరియొకటి, ఈ మూటితోను కలసియున్న దింకొకటి కలవని చెప్ప వీలున్నది. రససూత్రమువంటి సూత్రములతోనున్న నాట్యశాస్త్రము సదాశివభరతము కావచ్చును. ఆనువంశ్యశ్లోకములని ఉదాహరింపబడిన కారికలతో నున్నది బ్రహ్మచెప్పిన నాట్యశాస్త్రము కావచ్చును. నిరుక్తప్రాయమైనది ఆదిభరతము. ఈ మూటి కలయికను



తెలుపునది మనకు లభించు భరత నాట్యశాస్త్రము. ప్రాచీనశాస్త్రిములలోని సూత్రములు, కారికలు ఇందున్నవి. ఇవి అతిప్రాచీనములగుటచే వీటిలో పాఠభేదములు, విషయభేదములు కూడ వచ్చినవి. అందుచేతనే కావ్యమాలాముద్రితగ్రంథాంతమున "నందిభరతసంగీత పుస్తకమ"ని కలదు. ఒక వ్రాతప్రతిలో ఆంగికాభినయనిరూపణాంతమున "నంది భరతోక్త సంకరహస్తాధ్యాయ"మని ఉన్నది. ఆరవ అధ్యాయమున

"రసా భావా హ్యభినయాః ధర్మీ వృత్తి ప్రవృత్తయః
సిద్ధిః స్వరా స్తథా తోద్యం గానం రంగ శ్చ సంగ్రహః."

అను సంగ్రహశ్లోక మున్నది. ఇచట చెప్పబడిన పదకొండు అంగములు నాట్యమున గలవని కోహలుని అభిప్రాయముగా ఉద్భటుడు వ్యాఖ్యానించెను. లొల్లటుడు పంచాంగములే అని చెప్పినాడు.

మన నాట్యశాస్త్రమున నందికేశ్వరుని వాక్యములు, కోహలుని వాక్యములుకూడ కలవు. కోహలుడు భరతుని తర్వాతివాడైనను, ఎవరో తర్వాతివారు కోహలుని వాక్యములను భరతుని గ్రంథమున చేర్చినారు. "శేష ముత్తర తంత్రేణ కోహలః కథయిష్యతి" అని గ్రంథాంతమున కన్పించుటచే భరతుని గ్రంథమును సవరించి, దానికి ప్రస్తుతరూపమునిచ్చినవాడు కోహలుడు అనవచ్చును. తొమ్మిదవ అధ్యాయమున కన్పించు చాలకములను ప్రపంచించినవాడు కోహలుడే అని వేమభూపు డనినాడు. దేశిస్థానలక్షణప్రయోగములను కోహల, మతంగులు ప్రపంచించిరి. నాట్యలక్షణములను వివరించు విశిష్టగ్రంథమును కోహలుడు రచించెనని శారదాతనయుని (పుట. 210) ద్వారా తెలియుచున్నది. భరతుని నాట్యశాస్త్రమును పరిష్కరించిన వారిలో కోహలు డొకడు.

4. మహాకవి కాళిదాసు భరతుని నాట్యశాస్త్రమునే విక్రమోర్వశీయమున ప్రస్తుతించినాడు. కాళిదాసుకన్న పూర్వుడు భరతుడని చెప్పగలము. కాని కాళిదాసు కాలమును విక్రమశకారంభమని కొందరు, ఆ తర్వాత ఐదు శతాబ్దములకు అని వేరొక కొందరు చెప్పుటచే భరతుని కాలమును నిర్ణయించుట కష్టమే. విక్రమశకారంభమున కాళిదాస మహాకవి గలడను వాదము నంగీకరించుటచే అంతకు కనీసము రెండు మూడు శతాబ్దములకు పూర్వమే భరతుని నాట్యశాస్త్రముగలదని చెప్పనగును.

కాళిదాసమహాకవి నాట్య మష్టరసాశ్రయమని చెప్పుటచేత ఆయనకాలమునకు శాంతరస ప్రకరణము నాట్యశాస్త్రములోనికి చేరలేదని స్పష్టము. మాలవికాగ్నిమిత్రములోని "దేవానా మిద మామనంతి మునయః శాంతం క్రతుం చాక్షుషం"అను శ్లోకము భరతనాట్యశాస్త్ర విషయములను అతిసంగ్రహముగా చెప్పుచున్నది. మనకు నేడు లభించు నాట్యశాస్త్రమున అర్వాచీనుల కారికలు, వాక్యములు తర్వాతికాలమున చేర్పబడినవగుటచే ఈ గ్రంథమునకు కాలనిర్ణయముచేయుట సాహసము మాత్రమే కాగలదు.

5. మొదటి అధ్యాయమున, చివరి అధ్యాయమున కోహల, దత్తిలులు భరతుని పుత్రులుగా చెప్పబడిరి. ఇట్లే తండు, తాండాయని, తాండ్యుడు అనువారు కూడ ఈ భరతపుత్రులలో లెక్కించ బడుటచే వీరు భరతునికన్న పూర్వులో, తర్వాతివారో, సమకాలికులో నిర్ణయించుట కష్టము. అభినవభారతిలో (1.48) కోహలుడు ఆదర్శనటుడుగా

చెప్పబడెను. కోహలుడు చెప్పిన లక్షణములను అనేకస్థలములలో అభినవుడు స్వీకరించినాడు (I-103, 173, 182, 184). కోహలుడు చెప్పిన విశేషహస్తములను ప్రామాణికముగా గ్రహించినాడు (II-26, 55). "కోహలాదిశాస్త్రలక్ష్యప్రవాహసిద్ధ మపి చిత్రాభినయం సూచయతి" అని ఇరువదియైదవ అధ్యాయమున పల్కుచు కోహలుని గ్రంథమును ఈ నాట్యశాస్త్రమునకు కొంతవరకు మాతృకగా అభినవుడు గ్రహించినాడు.

పాత్రప్రవేశావసరమున ప్రయోగవలనమును కోహలుడు చెప్పెనని అభినవుడు (II. 130). అభినవభారతిలో కన్పించు ఇతర వాక్యములనుబట్టి కోహలుడు నాట్యమును, నాట్యమునకు సంబంధించిన గీతాతోద్యములను వివరించెనని స్పష్టమగుచున్నది. రూపక విశేషములకు కూడ గతికల్పించినాడట (II. 407). సంప్రదాయవిచ్ఛేదము జరగకుండ చేయుటకు ఇరువది ఐదవ అధ్యాయాంతమున అభినవుడు కోహలుని కారికలను 38 ను ఉద్ధరించినాడు. మతంగునికన్న పూర్వుడు కోహలుడని కల్లినాథుని వాక్య (పుట 164) వలన తెలియుచున్నది. వర్తనలను వివరించుచు సంగీతరత్నాకరవ్యాఖ్యలో కోహలుని 39 కారికలు ఇవ్వబడినవి (పుటలు 675-679). ఈ కారికలలో కోహలుడు నందికేశ్వరుని, కీర్తిధరుని ప్రస్తుతించినట్లు కలదు. కాని కీర్తిధరుడు కోహలుని తర్వాతివాడగుటచే ఈ ప్రశంస ప్రక్షిప్తము కావలెను.

కోహలుని నాట్యశాస్త్రములోని ప్రధానవిషయములన్నియు మన నాట్యశాస్త్రమున చేరియుండుటచే కోహలుని గ్రంథము అలభ్యమైపోయినది. కోహల శార్దూల సంవాదమగు సంగీతమేరువులోని ముఖ్యవిషయములు సంగీతగ్రంథములలో లీనమైపోయినవి.

6. కీర్తిధరు డొక నాట్యశాస్త్రమును రచించెను. భరతుని గ్రంథమును విస్తృతము కావించినవారిలో నితడొకడు. బహుశః భరతుడు వదలివేసిన వృద్ధభరతపంక్తుల నీతడు ఉద్ధరించి యుండవచ్చును. నందికేశ్వరుని మతమును అనుసరించి చిత్రపూర్వరంగవిధానమున ఒక విధానమును ఐదవ అధ్యాయమున కీర్తిధరుడే చేర్చెనని అభినవభారతీకారుడనినాడు. ధ్రువాగానములోని అష్టాదశజాతి వినియోగములను ఇరువది ఎనిమిదవ అధ్యాయములో కీర్తిధరుడొక్కడే పఠించినాడు. ఇతరులు పదునాలుగు రకముల వంశములను స్వీకరించిరి; కాని, ఇతడు తొమ్మిదిరకములనే గ్రహించుటచే ముప్పదవ అధ్యాయమున కన్పించు "నవ వంశాస్తు విజ్ఞేయాః" అను శ్లోకము ఇతనిది కావచ్చును. హస్తముల లక్షణములలో కొన్ని కీర్తిధరుని శ్లోకములు అభినవుని పాఠముతో ఏకీభవించవు. చాలచోట్ల ఇతని లక్షణములను ప్రస్తుతించి అభినవుడు దూషించుట కలదు. నితంబాదిహస్తములను నిరూపించునపుడు అభినవాదుల పతాకాహస్తమునకు బదులు కీర్తిధరుడు త్రిపతాకను చెప్పినాడు. కరిహస్తమున రెండవచేయి ఖటకాముఖమని ఇతని వాదము. అడ్డితాచారీ విధానమున "అగ్రతః పృష్ఠతోవాపి" అను మాటలలో "పృష్ఠతోవాపి" అనుదాని నీతడు నిషేధించెను. భరతుడు ప్రాచీనుల సిద్ధాంతములకు భిన్నముగా చెప్పినాడని యెంచి సంప్రదాయమును సంస్కరించుటకు బయలుదేరినవాడు కీర్తిధరుడై యుండవచ్చును.



పన్నెండవ అధ్యాయమున కీర్తిధరుని పాఠము విశేషభేదములతో కన్పించుచున్నది. పదమూడవ అధ్యాయమున ప్రవృత్తులను చెప్పిన తర్వాత ధర్మీద్వయవివరణ మనకు నేడు లభించు గ్రంథమున కలదు. కాని ఆరవ అధ్యాయములోని సంగ్రహశ్లోకములోని క్రమము ననుసరించి కీర్తిధరుడు ధర్మీద్వయానంతరము ప్రవృత్తులను పఠించినాడు. ఇది వృద్ధభరత పాఠము ననుసరించి యుండవచ్చును. ఇట్లే ఆర్యావృత్తములను నిర్వచించు సందర్భమున యతిమాత్రవికల్పస్వరూప విషయకమగు భాగమును కీర్తిధరుడొక్కడే పఠించెనని అభినవుడనినాడు.

కీర్తిధరుని పాఠములలో కొన్ని మన నాట్యశాస్త్రములో కన్పించుచున్నవి. భరతుని మతమునకు అనుగుణముగా సంస్కరించుటచేత కాబోలు కోహలుని పాఠమును అభినవుడు చాలవరకు ఆదరించినాడు. భిన్నమతానుయాయిఅగు కీర్తిధరున కీగౌరవము దక్కలేదు. కాని వ్రాతప్రతులను తయారుచేసికొనినవారు కీర్తిధరపాఠమును కూడ గ్రహించి, మూలముతో సమన్వయించక పోవుటచే భరతుని గ్రంథము క్లిష్టమైనది.

7. మాతృగుప్తుడు విక్రమశకారంభము నాటివాడు. ఇతడుకూడ నాట్యశాస్త్రమును రచించినట్లు రాఘవభట్టు తన శాకుంతలవ్యాఖ్యానమున చెప్పినాడు. ప్రసిద్ధమగు ఇతివృత్తము నేగాక ఉత్పాద్యవస్తువునుసహితముస్వీకరించవచ్చునని ఇతనివాదము(పుట234). సూత్రధారలక్షణమును చెప్పు ఇతని కారికలు (పుట 5) భరతుని శ్లోకములకు చాల సన్నిహితములుగా నుండుటచే నితడుకూడ భరతునివలె ప్రాచీన నాట్యశాస్త్రమును సంక్షేపించెనేమో యను సందేహముకలుగును. వృత్తులు, ప్రవృత్తులు (పుట 8), నాటకలక్షణము (పుట 9), భాషావిషయకమగు ఔచిత్యము (పుట 15), యవనీలక్షణము (పుట 57), హసితలక్షణము (పుట 74) మొదలైనవాటికి చెందిన కారికలను చాలవరకు రాఘవభట్టు ఇచ్చినాడు. బీజాదికముల నిర్వచనమును (పుట 20) గమనించినచో నివి భరతుని వాక్యములకు వివరణములవలె కన్పించగలవు. పైగా వాచిక, నేపథ్య స్వాభావికరసములని రసములు ముత్తెరగుల కలవని (పుట 7) మాతృగుప్తుడు పలికినాడు. ఈ వాదము భరతుని కన్న పూర్వమే కలదనుటకు కొంత ఆధారమున్నది. భరతుడు ప్రాచీన గ్రంథమునుండి వదలివేసిన భాగములను కీర్తిధర మాతృగుప్తాదులు పూర్తిగా గ్రహించి, వివరించిరేమో అను సంశయమును పరిత్యజించుటకష్టము.

8. భరతుని నాట్యశాస్త్రముపై తొలుదొలుతగా కొన్నివార్తికములు వచ్చినట్లున్నవి. సంగీతమునకు సంబంధించిన భాగములపై సూత్రములను, తద్వివరణగా కారికలను రచించిన వారిలో మతంగుడు కన్పించును. మతంగుడు ప్రాచీనభరతపాఠము నవలంబించి "అలంకారా స్త్రయ స్త్రింశ దేవ మేతే మయోదితాః" అని పఠించినాడు. కాని నవ్యపాఠమున వీటి సంఖ్య ముప్పదియారైనది. శంకుకుని పాఠమున నివి ముప్పదినాలుగుమాత్రమే. చిత్రపూర్వరంగములో కన్పించు కీర్తిధరవిధానమును అభినవుడు నిరాకరించెనుగాని మతంగుడు దీనిని స్వీకరించినట్లున్నది.

ఈ సంగీతభాగమునకు వివృతిని రచించినవారిలో కశ్యపు డొకడున్నాడు. ఇరువది తొమ్మిదవ అధ్యాయమున అభినవభారతిలో 72 శ్లోకములు కశ్యపునివిగా ఉదహరింపబడినవి. భరతశాస్త్రమును పూరించుచు, వివరించినవారిలో దత్తిలుడు మూడవవాడు. నాల్గవ అధ్యాయమున అభినవుడు దత్తిలుని గౌరవపురస్సరముగా స్మరించెను (I. 205). సంగీతాధ్యాయములలో విశేషముగా దత్తిలుని పంక్తుల నుదాహరించుచు, ఒకచోట "దత్తిలాద్యనుసారిణో వ్యాచక్షతే—" అనినాడు. దత్తిలుడు అతని అనుయాయులు భరతుని వ్యాఖ్యానించిరని స్పష్టము.

9. అభినవుడు రెండు స్థలములలో వార్తికకారుని పంక్తుల నుదాహరించి-I-172·74) మరి రెండుచోట్ల (115, 172) రాహులవార్తికము నుద్ధరించుటచే రాహులు డొకడు నాట్యశాస్త్రముపై వార్తికములను చెప్పినట్లు కన్పించును. ఒకచోట రాహులునిభావమును "ఇత్యాచార్య రాహులాదిభి రభిధానం విరుద్ధ మిత్యలం బహునా" అని వార్తికకారుని త్రోసివేసినాడు. రాహులకాదులు నాలుగు వృత్తులనే గ్రహించినారని, ఉద్భటు డీవాదమును తిర్కరించెనని చెప్పి అభినవుడు ఉద్భటుని మతమును గ్రహించెను (II.208).

శ్రీహర్షవార్తిక మొకటి నాట్యశాస్త్రముపై గలదని శారదాతనయుడు (పుట. 238) పల్కినాడు. నాటకభేదముగా తోటకమును చెప్పి శ్రీహర్షుడు ఉపరూపకములకు గతి కల్పింప నెంచెను. కాని ఇతరు లీమాటలు అప్రామాణిక మనిరి. నృత్తనాట్యముల పరస్పర సంబంధమును విచారించునపుడు (I.207) పూర్వరంగవిషయమున (I.211) అభినవుడు శ్రీహర్షవార్తికమును స్మరించెను.

అంగహారములపై ఒక వార్తికకారు డిచ్చిన పదునాలుగు శ్లోకముల నుదాహరించి, అభినవుడు స్థిరహస్తముపైన, తలపుష్పపుటముపైన కొన్ని కారికల నుద్ధరించెను. భరతుని నిర్వచన మీ కరణములకు ఒక్కొక్క కారికలో సూత్రప్రాయముగా గలదు. కాని కరణమును చూపునపుడు యోజించవలసిన చారీ, స్థానకాది సహితమగు ప్రక్రియను ఈ వార్తిక శ్లోకములు చక్కగా వివరించుచున్నవి. ఈ వివృతినే అభినవుడు తన వ్యాఖ్యలో పూర్తిగా పొందుపరచెను.

10. వార్తికముల తర్వాత వ్యాఖ్యానములు బయలుదేరినవి. వీరిలో నొక టీకాకారు డున్నాడు. ఇత డెవ్వరో మనము నిశ్చయించుట కష్టము. "టీకాకారైస్తు శ్లోకార్థస్య ప్రతికరణత్వ మస్య వ్యాఖ్యాతం" అని అభినవభారతిలో నొకచో కలదు. విప్రలంభము మొదలగుచోట్ల కరుణగలదని (I.318) టీకాకారు డన్నాడు. "టీకాకృద్భిస్తు సదాశివమతాది గ్రంథాంతరలిఖితం త్రయస్త్రింశ దిమే ప్రోక్తా అలంకారా ఇత్యాది" అని అభినవు డన్నప్పుడు సదాశివభరతమును దృష్టిలో పెట్టుకొని భరతుని నాట్యశాస్త్రము నీ టీకాకారుడు వ్యాఖ్యానించినట్లు భాసించగలదు. "టీకాకృత్త్వావ దాహ—లయాంతరమితి కనిష్ఠ మేవోచ్యతే, తదాశ్రయత్వా దుపచారేణ" అని పల్కినప్పుడు టీకాకారుడు మూలగ్రంథమునకు ప్రతిపదార్థమునుకూడ చెప్పినట్లున్నది. పూర్వాపరవిషయములను సమన్వయపరచుకొనుచు, సందర్భోచితముగా అర్థము నితడు చెప్పిన ట్లితరపంక్తులవలన తెలియుచున్నది. ఇతని సమగ్రవిషయపర్యాలోచనను అభినవుడు బాగుగాగుర్తించినాడు.



11. తర్వాతవచ్చిన వ్యాఖ్యాతలు లోల్లట, ఉద్భటులు. నాట్యశాస్త్రమున ప్రాచీనకాలమందే సంక్షిప్త గ్రంథముతోపాటు విస్తృతగ్రంథముకూడ బయలుదేరినది. విస్తృతగ్రంథమును పఠించిన లోల్లటుడు పూర్వమీమాంసాదర్శనసిద్ధాంతముల కనుగుణముగా నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించెను. రసనిష్పత్తిసూత్రమును వ్యాఖ్యానించుచు మీమాంసకుల ఉత్పత్తివాదమును తెచ్చి, విభావాదులద్వారా ఉత్పాద్యమగు విశిష్టనవ్యపదార్థమే రసమని పల్కినాడు. దండి, రుద్రట, భోజప్రభృతు లీవాదమును స్వీకరించినారు. విభావములు, అనుభావములు, స్థాయిభావములు, సంచారిభావములు మొదలగునవన్నియు ప్రత్యేక ప్రత్యేకముగా రసములుగా పరిణమించగలవని, కాని లోకప్రసిద్ధి లేకపోవుటచే ఎనిమిది రసములనే భరతుడు చెప్పెనని లోల్లటుడు నిరూపించినాడు.

"రసా భావా హ్యభినయాః" అను ఆరవ అధ్యాయములోని శ్లోకమున కోహలాదులు ఏకాదశాంగముల నంగీకరించిరి. ఇది ఉద్భటసమ్మతము. లోల్లటుడు దీనిని దూషించి నాట్యమున రస, భావ, అభినయ, గీత, ఆతోద్యములను ఐదు అంగములు మాత్రమే కలవని నిర్ధారణచేసినాడు. దీనినే అభినవుడంగీకరించెను. ఇట్లే ఆదరాతిశయములతో లోల్లటుని వాదముల నితరచోట్ల (II. 134, 196) అభినవుడు స్వీకరించుట కలదు. లోల్లటుడు నాలుగు వృత్తులనే గ్రహించెను (II. 452). ఆనందవర్ధనాదు లిచ్చిన ఔచిత్యవాదము లోల్లటునిదే యనుటకు రాజశేఖర, హేమచంద్రు లిచ్చిన లోల్లటుని శ్లోకము లాధారములు. రాజశేఖరుడిచ్చిన అపరాజితీవాక్యమును హేమచంద్రుడు లోల్లటునిదిగా ఇచ్చుటచే లోల్లటుని తండ్రిపేరు అపరాజితుడు కావచ్చును. ఈ లోల్లటవ్యాఖ్య చాలవరకు అభినవభారతిలో లీనమై పోయినట్లున్నది.

12. నాట్యశాస్త్రపు సంక్షిప్తపాఠమును పఠించినవాడు ఉద్భటుడు. ఇతనిని కోహలమతానుయాయిగా అభినవుడెంచెను (I. 266). అభినవవాదు లంగములకు త్రివిధప్రచారమునే చెప్పిరి. కాని ఉద్భటుడు ఐదు ప్రచారములను ప్రపంచించెనట. సమవకారమున వృత్తములను నిషేధించినాడు. ఉత్సృష్టికాంకమున న్యాయవృత్తి, అన్యాయవృత్తి, ఫలవృత్తి అను మూడు వృత్తులు కలవని ఇతని వ్యాఖ్య. న్యాయవృత్తి అనగా కైశికీవృత్తి. లోల్లటుడు ఫలవృత్తిని దూషించెను. శంకుకు డిచట సాత్త్వతీవృత్తినే గ్రహించెను. అభినవుడు భారతీవృత్తినే ఇచట చెప్పవలెననినాడు. ఉద్భటుని వ్యాఖ్యలో కొన్ని క్రొత్తపోకడలు గలవని, వీటిని తర్వాతివారు అనాదరించిరని స్పష్టము.

13. తర్వాతి వ్యాఖ్యాతయగు శంకుకుడు న్యాయదర్శనమున కృషిసల్పి, తదనుగుణముగా నాట్యశాస్త్రమును వివరించెను. నైయాయికుల అనుమితివాదమును గ్రహించి రసము ఉత్పాద్యముకాదని, కేవలము అనుమేయవస్తువని సిద్ధాంతించినాడు.

మూడవ అధ్యాయములోని "నాగపుష్పస్య మూలేన విటపాభిః ప్రియంగుభిః" అను పంక్తిని వ్యాఖ్యానించు సందర్భమున నితడు వ్యర్థప్రయాసకు లోనాయెనని అభినవుడు నిరూపించినాడు (I. 74-75). విశేషపాఠభేదములతో గ్రంథమును పఠించి, అపార్థములను ఇతడు చెప్పెననికూడ తెలియుచున్నది (I. 216-217). అభినవున కీతనివాదము సర్వదా

పూర్వపక్షమే ఐనట్లున్నది (ii-411). అభినవుని పాఠమునకు, శంకుకుని పాఠమునకు విపరీత భేదములు లేకున్నను, వీరి వ్యాఖ్యానములలో చాల భేదమున్నది. వీరి సంప్రదాయములు వేరు, భావములు భిన్నములు, శాస్త్రమర్యాదలు విలక్షణములు. న్యాయదార్శనికులకు, శాక్తసమీక్షకులకు పొత్తుకలియుట దుర్ఘటము.

14. తర్వాత వచ్చినవారిలో మహావ్యాఖ్యాత, గొప్ప మేధావి, సునిశితబుద్ధి సంపదగల సహృదయుడు, భావనాపటిమగల వ్యక్తియగు భట్టనాయకుడు కన్పించుచున్నాడు. అభినవు డితని వ్యాఖ్యనుండి ఎక్కడ భేదించుచున్నాడో చెప్పజాలము. భట్టనాయకుని భావములను అభినవభారతినుండి తీసివేసితిమేని అభినవుని వ్యాఖ్యలో సజీవమైన భాగమేదియు మిగులజాల దనుటలో అతిశయోక్తి లేదు.

సాంఖ్యయోగదర్శనములను చక్కగా జీర్ణించుకొని, అద్వైతవేదాంతదర్శనమును స్వానుభవైకవేద్యముగా చేసికొని, కావ్యజగములో భాసించు సౌందర్యము సచ్చిదానంద భావనలో పర్యవసితమగునని గ్రహించి, నాట్యశాస్త్రవ్యాఖ్యకు పూనుకొనినవాడు భట్టనాయకుడు. ఇతడు ప్రపంచించిన రసప్రతీతివాదమును రసభోగవాదమని కాని, రసాస్వాదవాదమనికాని వ్యవహరించవలెను. ఈ వాదమును స్వల్పముగా మార్చి వ్యంజనకు గతి కల్పింప నెంచినవా డభినవుడు. రసభోగమున మనకు నేడు గోచరమగు సాధారణీకరణము, భావన, శబ్దవైశిష్ట్యము, అర్థవైశిష్ట్యము, శబ్దార్థసంబంధము, రసధ్వని మొదలగువాటి నన్నిటిని భట్టనాయకుడే సాహిత్యసమీక్షకుల కర్పించినాడు. ఈ వాదమే రసగంగాధరమున 'భగ్నావరణాచిత్'గా పరిణమించినది. భట్టనాయకుని సమగ్రముగా అర్థము చేసికొనిన తోతభట్టుద్వారా అభినవుని పంక్తులలో కన్పించున దీతడే.

నాట్యశాస్త్రమునకు పథమప్రయోజనమును చెప్పు సందర్భమున భట్టనాయకుని పంక్తుల నుదాహరించిన అభినవభారతి (I. 5-6) గమనార్హము—

"భట్టనాయకస్తు—'బ్రహ్మణా పరమాత్మనా యదుదాహృతమవిద్యావిరచితనిస్సారభేదగ్రహే య దుదాహరణీకృతం తన్నాట్యం, తద్వక్ష్యామి. యథాహి కల్పనామాత్రసారం తత ఏవానవస్థితైకరూపం క్షణేన కల్పనాశతసహస్రసహం, స్వప్నాది విలక్షణ మపి సుష్ఠుతరాం హృదయగ్రహనిదానమత్యక్తస్వాలంబనబ్రహ్మకల్పనటోపరచితం రామరావణాది చేష్టిత మసత్యం కుతో ఽప్యభూతామృతవృత్త్యా భాతి. తథా భాసమాన మపి చ పుమర్థోపాయతా మేతి. తథాతాదృగేవ విశ్వమిదమసత్యనామరూపప్రపంచాత్మకమ్ అథ చ శ్రవణమననాదివశేన పరమపుమర్థప్రాపకమితి లోకోత్తరపరమపురుషార్థసూచనేన శాంతరసోపక్షేపో ఽయం భవిష్యతి. స్వంస్వం నిమిత్త మాదాయ శాంతాదుత్పద్యతే రసః ఇతి తదనేన పారమార్థికం ప్రయోజన ముక్తం' ఇతి వ్యాఖ్యానం సహృదయదర్పణే పర్యగ్రహీత్. యదాహ—

"నమః త్రైలోక్యనిర్మాణకవయే శంభవే యతః
ప్రతిక్షణం జగన్నాట్యప్రయోగరసికో జనః' ఇతి."



ఈవాక్యములలో భట్టనాయకుని అద్వైతవేదాంతము స్పష్టముగా కన్పించుచున్నది. నాట్యశాస్త్రమును శ్రవణమననాది పరముగా జెప్పి, శాంతరసోపక్షేప మనినాడు. రసమనగా శాంతమే అని, శృంగారాదులు శాంతరసవికృతులని, శాంత మీ ఎనిమిది రసములకు వివర్తోపాదానమని భావము. దీనినిబట్టి ఆరవ అధ్యాయములోని శాంతరస ప్రకరణము భట్టనాయకకృత మేమో అను సందేహము కలుగక మానదు. భట్టనాయకు డీ భాగమును రచించకపోయినను, ఇతని వలననే ఈ భాగము ఆరవ అధ్యాయములోనికి చేరినది అని ఐనను చెప్పక తప్పదు. అభినవు డీ ప్రకరణమును వ్యాఖ్యానించినాడే కాని, భట్టనాయకుని భావమును పూర్తిగా అవగాహన చేసికొనినట్లు కన్పించదు.

పదునారవ అధ్యాయమున లక్షణను నిర్వచించువేళ అభినవుడు తన ఉపాధ్యాయ మతమును వదలి, భట్టనాయకుని మతమునే స్వీకరించినాడు. అచ్చటనే భట్టనాయకు డిచ్చిన శబ్దార్థసంబంధనిర్వచనమునుకూడ తీసికొనినాడు. ఈ సందర్భముననే భట్టనాయకుడు భావనావ్యాపారమును గమనించి, వివేచించినాడు. దీనిని అర్వాచీను లెందుకో వదలినట్లున్నారు.

15. ఉత్పలుడు, శంకుకుడు, భట్టనాయకుడు, తోతభట్టు, భట్టేందురాజు మొదలగువారు పఠించిన నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించినవాడు అభినవగుప్తుడు. వ్యాఖ్యాతృభేదము నాశ్రయించుకొని వచ్చిన పాఠభేదములు దేశవ్యాప్తమైయున్నవి. అభినవుని వ్యాఖ్యమాత్రమే మన కిపుడు లభ్యమగుటచే అభినవభారతి కనుగుణమైన పాఠమే మనకు ప్రధానమగుచున్నది.

నాట్యశాస్త్రము రసపరమని యెంచి సంస్కరించినవారిలో భట్టనాయకుడు, తోతభట్టు ప్రధానులు.

"పఠితోద్దేశక్రమ స్త్వస్మదుపాధ్యాయపరంపరాగతః" (II. 298)

అని అభినవుడు పదునారవ అధ్యాయమున చెప్పుటచే తోతభట్టు సల్పిన కృషి తెలియుచున్నది. శ్రేయోదాయకమగు ప్రవృత్తికి ఉత్సాహసంపదను చేకూర్చుచు, తదభివృద్ధికై స్వవిజ్ఞానక్రమోపారూఢమగు పరమేశ్వరవిషయము, స్మృత్యౌత్సుక్య ధృతిమత్యాది లక్షణము, బాహ్యాకరణీయవిషయము నగు భావాదులను ముందు వివేచించి, ధర్మవీరానుప్రవిష్టమై, తదుచితమగు ఆంగికవాచికానుభావప్రకటనపూర్వమైన స్వప్రవృత్తిప్రయోజనమునే నాట్యశాస్త్రము నిరూపించవలెనని తోతభట్టు పలికినాడు. అప్పుడు లౌకికపదార్థ వ్యతిరిక్తము, ఆస్వాదనరూపమున సంవేదనసంవేద్యమునగు వస్తువును రసస్వభావముగల నాట్యము చెప్పవలెను.

నాట్యము నియతానుకారముగాని, అనియతానుకారముగాని కాజాలదని తోతభట్టు వివరించుచు శంకుకవాదమును దూషించినాడు. అభినయహస్తముల సందర్భమున అభినవుడు తన గురువు మతమును చెప్పుచు (I. 109) ప్రధానకరణము నాడునపుడు వాక్యార్థాభినయముననే అభినయహస్తములను యోజించవలెననినాడు. తోతభట్టు నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించెననుటకు — "యథోక్తం భట్టతోతేన - పర్యాయశస్త్రిర్యశ్రస్య ప్రయోగ ఇతి" (I. 187) అను వాక్యము, "ఇత్యేవం శబ్ద స్యార్థ ఇత్యుపాధ్యాయమతం" (1.207)

అను వాక్యము మొదలైనవి ఆధారములు. అనేకస్థలములలో (I. 220, 291-2, 310; II.31, 67, 216, 292) ఉపాధ్యాయమతము కన్పించుచున్నది. పదునెనిమిదవ అధ్యాయము లోని "యః కశ్చి త్కార్యవశాద్గచ్ఛతి" అను శ్లోకమును భట్టలొల్లటాదులు నిరాకరించిరి. కాని ఇది ప్రక్షిప్తము కాదని శ్రీశంకుకుడు సమర్థించినాడు (II. 423).

16. ప్రత్యభిజ్ఞాదర్శనముతో రససిద్ధాంతమును సమన్వయపరుప యత్నించిన అభినవుని నాట్యశాస్త్రవివృతి మనకు నేడు లభించుచున్నది. శివాద్వయవాదమును విస్మరింపజాలని అభినవుడు శాంతరసవిచారములో సహితము శాక్తశైవాగమములను ప్రస్తుతించినాడు. ఇతని అభినవభారతి లేనిచో ప్రాచీనుల వాదములు తెలియకపోవుటయేగాక నాట్య శాస్త్రముకూడ అవగతము కాజాలకపోయెడిదని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

భరతుని కాలమునుండి వచ్చుచున్న రససిద్ధాంతమును, ఆనందవర్ధనుని ధ్వని వాదమును సమన్వయించిన భట్టనాయకుని అనుసరించి అభినవుడు మనకు రసధ్వని సిద్ధాంతము నిచ్చినాడు. సౌందర్యమీమాంసాసంప్రదాయమున అభినవుని వాక్యము వేద తుల్యమైపోయినది. తర్వాతి సమీక్షకు లితని భావములను తమ సిద్ధాంతములుగా పఠింప సాగిరేకాని ఈ సిద్ధాంతములు తామంగీకరించు దార్శనికసిద్ధాంతములతో సరిపోవునాయని విచారించినవారు కారైరి. జగన్నాథుడు సహితము బహిరంగముగా అభినవుని త్రోసివేయ సాహసింపలేదు. కాని,

"తస్మా త్సతా మత్ర న దూషితాని మతాని, తాన్యేవ తు శోధితాని;
పూర్వప్రతిష్ఠాపితయోజనాసు మూలప్రతిష్ఠాఫలమామనంతి."

అని అభినవు డనినాడు. పూర్వమతములను శోధించి, అందలి సారమును గ్రహించి, శాస్త్రమును నవగాహన చేసికొనుటయే తన పరమావధిగా నెంచినాడు. సాహిత్యవిషయముల పైననేగాక గీతాతోద్యాభినయాది విషయములపై గూడ విజృంభించి, తన పాండిత్యమును, సహృదయాభిజ్ఞత్వమును చూపినాడు. అభినయప్రకరణములను గమనించితిమేని అభినవుడు నృత్తాభ్యాసమున ఆరితేరినవాడని బోధపడగలదు.

పాఠమును సంస్కరించుటలో సహితము అభినవుడు చక్కని సహృదయత్వమును వెలిపుచ్చినాడు. పాఠభేదములను తిరస్కరించుటలోను, వ్యాఖ్యానభేదములను నిరసించుట లోను మంచి ఉపపత్తుల నిచ్చినాడు. ప్రాతప్రతులను పోల్చుట, పాఠక్రమమును దిద్దుట, పునరుక్తులను త్రోసివేయుట మొదలుగాగల పరిశోధకకృత్యములలో సహస్రవర్షముల క్రితమే అభినవుడు ఆదర్శప్రాయముగా ప్రవర్తించెనని గమనించుట ముదావహము.

తొమ్మిదవ అధ్యాయమున ఉరఃకర్మవర్ణనుంచి తర్వాతి అధ్యాయముగా పఠించుట అభినవునకు సమ్మతముకాదు. గతిప్రచారమున కొన్ని శ్లోకములను పరిత్యజించినాడు. వృత్తలక్షణమున గురులఘు వివేకముతో చెప్పిన లక్షణములనే అంగీకరించుచు—

"తత్రేహాధ్యాయే భరతమునికృత మితి త్రికైర్మకారాదిభిః కైశ్చిత్కించిల్లక్షణం స్వీకృతమితి ద్వివిధః పుస్తకపాఠో దృశ్యతే మధ్యే చ చింతనాయ పుస్తకేషూభయ మపి పఠ్యతే" (II-252-253).



అనినాడు. మగణాదిగణములతో వృత్తలక్షణములను భరతుడు ప్రపంచించినట్లు కొందరు భావించి, తదనుగుణములగు లక్షణశ్లోకములను కూడ పఠించిరట. ఇట్లే లక్షణాధ్యాయమున కూడ పాఠభేదములు కలవని, ఉపాధ్యాయుడు చెప్పిన పాఠమునే అంగీకరించుచుంటి ననినాడు.

భాషావిధానము, సంబుద్ధివిధానము, కాకువిధానము పదునేడవ అధ్యాయమున కలవు. కొన్ని ప్రతులలో భాషావిధానముతో నీ అధ్యాయము సమాప్తమగుచున్నది. వీథ్యంగములు వీథిక్రింద పఠింపబడినవి. లాస్యాంగములను సంధ్యంగాధ్యాయమున పఠించి నాడు. ఇరువదినాల్గవ అధ్యాయమును స్త్రీపుంసోపచారముగా అభినవుడు పఠించుచు, ఇతరప్రతులలో ఇచట కన్పించు చివరిశ్లోకములను ముప్పదియైదవ అధ్యాయమున చదివి నాడు. ఇతర ప్రతులలో కన్పించు ముప్పదినాల్గవ అధ్యాయమగు ప్రకృతివికల్పనము కొన్ని మార్పులతో అభినవుని ఇరువదియారవ అధ్యాయమైనది. ఇతరు లార్యావృత్తరూపమున చదివిన జాతిలక్షణములను గద్యముగా గ్రహించినాడు. అభినవుని పాఠమున ఆరోహి, అవ రోహి అలంకారములు నిర్వచింపబడలేదు. పైగా

"సానానుపయోగాత్ కావ్యాలంకారవ త్తేషా మియత్తా. నియమే నాభిధాతు మశక్యత్వా ద్వర్ణోక్త్యైవ చ తేషాం పరమార్థతో వ్యాపనాన్నయా యథాపి సర్వేన లక్షితాః, తథాపి శాస్త్రాంతరలక్ష్యమాణనిరుక్తపరస్పరసోపాయే నైతా జానీయేతేత్యర్థః"

అనినాడు. ఇతరశాస్త్రములలో నీ లక్షణములు చెప్పబడినవని, అక్కడక్కడ కొన్ని లక్షణ ములనే స్పృశించుచుంటినని పలికినాడు. కాని ఈ సందర్భమున భరతునినుండి మతంగు డుదహరించిన విషయ మభినవుని పాఠమున లేకున్నను ఇతరప్రతులలో కన్పించుచున్నది.

ఇరువది తొమ్మిదవ అధ్యాయమున కన్పించు చిత్రపూర్వరంగవిధి నందికేశ్వరమత మని, అది భరతుని గ్రంథములోనిది కాదని పలికినాడు. ఇరువదియైదవ అధ్యాయమున కోహలుని, ఇరువది యెనిమిదిలో కశ్యపుని నాట్యశాస్త్రపూరకులుగా ఎంచి, వారు ప్రామాణికులని చెప్పుటలో వీరు ఆదిభరతమునుంచి శేషపూరణ గావించిరను భావము దృఢీకృతమగును.

ప్రతి అధ్యాయమును ఒక ధ్యానశ్లోకముతో ఆరంభించుచు, శివాద్వయదర్శనమున గల ముప్పదియారు తత్త్వముల నభినవుడు స్పృశించినాడు. ఈ దర్శనమున గల అనుత్తర తత్త్వముతో ముప్పదియేడవ అధ్యాయమును ఆరంభించినట్లున్నది. ఈ అధ్యాయమున కోహల, వత్స, శాండిల్య ప్రభృతుల నామములున్నవి.

అభినవభారతి నాట్యశాస్త్రముపైగల గొప్ప వివృతిమాత్రమేగాక సంప్రదాయ బద్ధమగు భరతనాట్యశాస్త్రపాఠమును పునరుద్ధరించ యత్నించిన సంశోధనకూడ. ప్రాచీన మతములలో నెన్నింటిని సులభముగా నంగీకరించ వీలున్నదో వాటినన్నింటిని వివేచించి నాడు. తాను స్వీకరింపజాలని పాఠమును, భావమును సోపపత్తికముగా వివరించినాడు.

అభినవునికన్న ప్రాచీనములగు వ్యాఖ్యానములు మనకు లభించనంతవరకు అభినవు డంగీకరించిన నాట్యశాస్త్రపాఠమే మనకు ప్రధానమైనది.

17. అతిగహనమైన నాట్యశాస్త్రమునకు నేటివరకు సరియైన ప్రతి ప్రచురింపబడకపోవుట శోచనీయము. ముద్రితప్రతులు అయోమయముగా నున్నవి. అభినవభారతిని సరిజూచి ముద్రించదలచిన బరోడావారు పూర్వాపరముల వాక్యక్రమమును పరిగణించక ఈ అమూల్యమగు వివృతిని అత్యంతక్లిష్టము గావించిరి. నాట్యశాస్త్రము భారతీయ భాషలలోనికి ఇంతవరకు పూర్తిగా అనువదింపబడకపోవుట మన దురదృష్టమే. ఇటువంటి పరిస్థితులలో శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారి కృషి ప్రశంసనీయము. సంస్కృత మూలమును పూర్తిగా ఇవ్వకపోయినను మూలములోని విషయముల నన్నిటిని సమగ్రముగా ఇచ్చుచు, అభినవభారతిలోని ప్రధానవిషయములను వివరించుచు, అర్వాచీనులగు ప్రాచ్య పాశ్చాత్య సమీక్షకుల సిద్ధాంతములను చర్చించినారు. ప్రతి అధ్యాయాంతమందుగల విశేషాంశములు అను శీర్షిక సాహిత్యసమీక్షకుల కత్యంతోపయోగి. భావి సాహిత్యశాస్త్ర మీమాంసల కిది మూలకందము కాగలదు.

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

# అనుబంధము - 2

## నృత్త-నాట్య-నృత్య-రస-అలంకారశాస్త్రకర్తలు : గ్రంథములు

[క్రింద ఒసంగబడుచున్న కాలములన్నియును ఇంచుమించుగా సంభావ్యములు మాత్రమే. ఇవి మహామహోపాధ్యాయ పి. వి. కాణేగారి "The History of Sanskrit Poetics" (1951) అను గ్రంథమును, శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు సంపాదించిన "భరతకోశము" అను గ్రంథమును అనుసరించి యున్నవి. అలబ్ధములు, అముద్రితములు అని పేర్కొనబడినవితప్ప తక్కినవన్నియును ముద్రితములే అని తెలియనగును.]

శిలాలి - కృశాశ్వులు (పాణిని పేర్కొనిన నటసూత్రకర్తలు. క్రీ. పూ. 500 ప్రాంతములు) - నటసూత్రములు (అలబ్ధములు).

వృద్ధభరతుడు లేదా ఆదిభరతుడు (భరతమునికి పూర్వుడు కావచ్చును) - నాట్యశాస్త్రము (ద్వాదశసాహస్రి-అలబ్ధము).

భరతముని (క్రీ. పూ. 100 - క్రీ. శ. 300) - నాట్యశాస్త్రము (షట్సాహస్రి).

కోహలుడు (భరతముని సమకాలికుడు కావచ్చును) - ప్రత్యేకగ్రంథము లభించలేదు.

నందికేశ్వరుడు (క్రీ. శ. 3 వ శతాబ్ది ప్రాంతములు) - అభినయదర్పణము; భరతార్ణవము.

దత్తిలుడు (క్రీ. శ. 3 వ లేదా 4 వ శతాబ్ది ప్రాంతములు) - దత్తిలము.

వాత్స్యాయనుడు (కీ. శ. 4 వ శతాబ్ది ప్రాంతములు) - కామసూత్రము.

రాహులుడు (క్రీ. శ. 500 ప్రాంతములు) - ప్రత్యేక గ్రంథము లభించలేదు.

విష్ణుధర్మోత్తరపురాణము (క్రీ. శ. 500-600).

భట్టి (క్రీ. శ. 500-600 ప్రాంతములు) - భట్టికావ్యము.

భామహుడు (క్రీ. శ. 500 - 700 ప్రాంతములు) - కావ్యాలంకారము.

దండి (క్రీ. శ. 500 - 700 ప్రాంతములు) - కావ్యాదర్శము.

మాతృగుప్తుడు (క్రీ. శ. 7 వ శతాబ్ది ప్రథమపాదము) - ప్రత్యేకగ్రంథము లభించలేదు.

మతంగుడు (క్రీ. శ. 750 ముందు) - బృహద్దేశి.

వామనుడు (క్రీ. శ. 750 తరువాత) - కావ్యాలంకారసూత్రము.

ఉద్భటుడు (క్రీ. శ. 800 ప్రాంతములు) - కావ్యాలంకారసారసంగ్రహము.

దామోదరగుప్తుడు (క్రీ. శ. 8 వ శతాబ్ది రెండవభాగము) - కుట్టనీమతము.

కీర్తిధరుడు (అభినవగుప్తునకు పూర్వుడు) - ప్రత్యేకగ్రంథము లభించలేదు.

భట్టలోల్లటుడు (క్రీ. శ. 800-840) - ప్రత్యేకగ్రంథము లభించలేదు.

రుద్రటుడు (క్రీ. శ. 825-875) - కావ్యాలంకారము.

శ్రీశంకుకుడు (కీ. శ. 840 ప్రాంతములు) - ప్రత్యేకగ్రంథము లభించలేదు.

ఆనందవర్ధనుడు (క్రీ. శ. 860-890 ప్రాంతములు) - ధ్వన్యాలోకము.

ముకులభట్టు (క్రీ. శ. 9వ శతాబ్ది చివర) - అభిధావృత్తిమాతృక.

భట్టనాయకుడు (క్రీ.శ. 900-1000 ప్రాంతములు)-సహృదయదర్పణము (అలబ్ధము).

రాజశేఖరుడు (క్రీ. శ. 900-925 ప్రాంతములు) - కావ్యమీమాంస.

భట్టతౌ(తో)తుడు (అభినవగుప్తుని గురువు, క్రీ. శ. 950 ప్రాంతములు)-కావ్యకౌతుకము (అలబ్ధము).

భట్టేందురాజు (అభినవగుప్తుని గురువు-క్రీ. శ. 960-990) - ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహవ్యాఖ్యానము.

ధనంజయుడు (క్రీ. శ. 974-996 ప్రాంతములు) - దశరూపకము.

శ్రీహర్షుడు లేదా వార్తికకారుడు (అభినవగుప్తునకు పూర్వుడు) - నాట్యశాస్త్ర వ్యాఖ్యానము (అలబ్ధము).

కుంతకుడు (క్రీ. శ. 950-1000) - వక్రోక్తిజీవితము.

అభినవగుప్తుడు (క్రీ. శ. 980-1020 ప్రాంతములు) - లోచనము, అభినవభారతి (ధ్వన్యాలోక - నాట్యశాస్త్ర వ్యాఖ్యానములు).

క్షేమేంద్రుడు (అభినవగుప్తుని శిష్యుడు-క్రీ. శ. 990-1066) - ఔచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము, సువృత్తతిలకము.

ధనికుడు (క్రీ. శ. 1000 ప్రాంతములు) - దశరూపకవ్యాఖ్యానము.

అగ్నిపురాణము (క్రీ. శ. 1000 ప్రాంతములు).

భోజుడు (క్రీ. శ. 1005-1054 ప్రాంతములు) - సరస్వతీకంఠాభరణము, శృంగారప్రకాశము (ఇది అముద్రితము).

సాగర నంది (క్రీ. శ. 920-1100 ప్రాంతములు) - నాటకలక్షణరత్నకోశము.

మహిమభట్టు (క్రీ. శ. 1020-1100 ప్రాంతములు) - వ్యక్తివివేకము.

ప్రకాశవర్షుడు (క్రీ. శ. 1050 తరువాత) - రసార్ణవాలంకారము.

నాన్యదేవరాజు లేదా భాష్యకారుడు (క్రీ. శ. 1100 ప్రాంతములు) సరస్వతీహృదయాలంకారము లేదా భరతభాష్యము. వాచికాభినయమునకు సంబంధించిన భాగము మాత్రమే లభ్యము (అముద్రితము).

మమ్మటుడు (క్రీ. శ. 1050-1100 ప్రాంతములు) - కావ్యప్రకాశము.

రుద్రభట్టు (క్రీ. శ. 1100 ప్రాంతములు) - శృంగారతిలకము.

హేమచంద్రుడు (క్రీ. శ. 1088-1172 - జీవితకాలము) - కావ్యానుశాసనము.

రామచంద్ర-గుణచంద్రులు (హేమచంద్రుని శిష్యులు, క్రీ. శ. 1100-1175 ప్రాంతములు) - నాట్యదర్పణము.

సోమేశ్వరుడు (క్రీ. శ. 1140 - రచనాకాలము) - అభిలషితార్థచింతామణి.

జగదేకమల్లుడు (సోమేశ్వరుని పుత్రుడు, క్రీ. శ. 1134-43 - పరిపాలనాకాలము) - సంగీతచూడామణి.

రుయ్యకుడు (క్రీ. శ. 1135-1150 ప్రాంతములు - రచనాకాలము) - అలంకారసర్వస్వము ; వ్యక్తివివేకవ్యాఖ్యానము.



హరిపాలుడు (సౌరాష్ట్రరాజు క్రీ. శ. - 1175 ప్రాంతములు)-సంగీతసుధాకరము.

హమ్మీరుడు (క్రీ. శ. 12 వ శతాబ్ది ప్రాంతములు) - శృంగారహారము.

సోమభూపాలుడు (క్రీ. శ. 1180 లో రచన) - సంగీతరత్నావళి.

శారదాతనయుడు (క్రీ. శ. 1175-1250 ప్రాంతములు) - భావప్రకాశనము.

జయదేవ పీయూషవర్షుడు (క్రీ. శ. 1200-1250 ప్రాంతములు) - చంద్రాలోకము.

శార్ఙ్గదేవుడు (క్రీ. శ. 1230 ప్రాంతముల రచన) - సంగీతరత్నాకరము (సింగభూపాల - కేశవ - మల్లినాథులు సంస్కృతమందును, విఠ్ఠలుడు తెలుగులోను వ్యాఖ్యలు వ్రాసిరి).

జాయపసేనాపతి (క్రీ. శ. 1253-54 రచనాకాలము) - నృత్తరత్నావళి.

విద్యాధరుడు (క్రీ. శ. 1285-1325 ప్రాంతములు) - ఏకావళి.

పార్శ్వదేవుడు (క్రీ. శ. 1300 ప్రాంతములు) - సంగీతసమయసారము.

అల్లరాజు (క్రీ. శ. 1300 ప్రాంతములు) - రసరత్నదీపిక.

అశోకమల్లుడు (క్రీ. శ. 1300 తరువాత) - ఒక సంగీతగ్రంథకర్త.

మోక్షదేవుడు (క్రీ. శ. 1320 ప్రాంతములు) - సంగీతసారకలికము.

శృంగారశేఖరుడు (క్రీ. శ. 1330 ప్రాంతములు - వరంగల్ నివాసి) - అభినయభూషణము

సింగభూపాలుడు - (క్రీ. శ. 1330 ప్రాంతములు) - రసార్ణవసుధాకరము; సంగీతసుధాకరము (సంగీతరత్నాకరవ్యాఖ్య); నాటకపరిభాష (ఇది అలబ్ధము).

విద్యానాథుడు (క్రీ. శ. 14 వ శతాబ్ది ప్రారంభము) - ప్రతాపరుద్రయశోభూషణము.

విశ్వనాథకవిరాజు (క్రీ.శ. 1300-1384) - సాహిత్యదర్పణము.

సుధాకలశుడు (క్రీ. శ. 1324-1350 ప్రాంతములు) - సంగీతోపనిషత్సారము.

ఉమాపతి (క్రీ. శ. 1350 ప్రాంతములు) - ఔమాపతము.

మదనభూపాలుడు (ఢిల్లీరాజు-క్రీ. శ. 1375 ప్రాంతములు) - ఆనందసంజీవిని.

దేవనభట్టు (క్రీ. శ. 14 వ శతాబ్ది రెండవభాగము) - సంగీతముక్తావళి.

కుమారగిరిరెడ్డి లేదా వసంతరాజు (క్రీ. శ. 1400 ముందు) - వసంతరాజీయము (అలబ్ధము).

మల్లినాథసూరి (క్రీ. శ. 14 వ శతాబ్ది చివర - 15 వ శతాబ్ది ప్రారంభము) - అనేక కావ్య - నాటక వ్యాఖ్యానములు.

వేమభూపాలుడు (క్రీ. శ. 1400 ప్రాంతము రచన) - సంగీతచింతామణి; సాహిత్యచింతామణి (అముద్రితములు)

'పండితమండలి' - క్రీ. శ. 1429 లో సంగీతవిద్వాంసుల సమ్మేళనము సంకలనము నొనర్చిన గ్రంథము.

కుంభకర్ణుడు (రాజపుత్రరాజు - క్రీ. శ. 1449 లో రచన) - సంగీతరాజము.

భానుదత్తుడు (క్రీ. శ. 1450-1500) - రసమంజరి.

జగద్ధరుడు (క్రీ. శ. 1460 ప్రాంతములు) - సంగీతసర్వస్వము.

శుభంకరుడు (క్రీ. శ. 1480 తరువాత) - సంగీతదామోదరము; హస్తముక్తావళి.

రూపగోస్వామి (క్రీ. శ. 1470-1554 - జీవితకాలము) - నాటకచంద్రిక; ఉజ్జ్వల నీలమణి; భక్తిరసామృతసింధువు

లక్ష్మీనారాయణుడు (విఠ్ఠలుని పుత్రుడు - కృష్ణదేవరాయల కాలము) - సంగీత సూర్యోదయము.

అచ్యుతరాయలు (క్రీ. శ. 1543 పూర్వము) - తాలకళావర్ధని.

రామామాత్యుడు (అళియరామరాయల ఆస్థానములోనివాడు - క్రీ. శ. 1550 ప్రాంతముల రచన) - స్వరమేళకళానిధి.

అప్పయ్యదీక్షితుడు (క్రీ. శ. 1554-1626 ప్రాంతములు) - కువలయానందము మొ॥

శ్రీకంఠుడు (క్రీ. శ. 1583 లో రచన) - రసకౌముది.

అహోబల పండితుడు (క్రీ. శ. 1600 ప్రాంతములు) - సంగీతపారిజాతము.

కృష్ణశర్మ-చంద్రదేవశర్మ (క్రీ. శ. 1600 తరువాత) - మందారమరందచంపువు.

సోమనాథుడు (క్రీ. శ. 1609 లో రచన) - రాగవిబోధము.

విప్రదాసుడు (క్రీ.శ. 1625 ముందు) - సంగీత చంద్రము (క్రీ.శ. 1625 ప్రాంతముల నేపాలరాజు (జ్యోతిర్మల్లుడు దీనికి నేపాలీ భాషలో వ్యాఖ్య రచించెను. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచ్చిన "సంగీత చంద్రము" యొక్క చక్కని వ్రాతప్రతి నా యొద్దఉన్నది).

జగన్నాథపండితుడు (క్రీ. శ. 1620-1660 ప్రాంతములు) - రసగంగాధరము.

రఘునాథ భూపాలుడు (క్రీ. శ. 1620 ప్రాంతముల రచన) - సంగీతసుధ.

చతురదామోదరుడు (క్రీ. శ. 1630 ప్రాంతములు) - సంగీతదర్పణము.

వేంకటమఖి (క్రీ. శ. 1630 ప్రాంతముల రచన) - చతుర్దండి ప్రకాశిక.

గోవిందుడు (క్రీ. శ. 1680 ప్రాంతములు) - సంగ్రహచూడామణి.

మధుసూదనసరస్వతి (క్రీ. శ. 17 వ శతాబ్ది ప్రాంతములు) - భక్తిరసాయనము.

అక్బర్ షా లేదా బడేసాహెబ్ (క్రీ. శ. 17 వ శతాబ్ది) - శృంగారమంజరి.

తులజ మహారాజు (క్రీ.శ. 1729-1735 - పరిపాలనా కాలము) - సంగీతసారామృతము.

ధర్మసూరి (క్రీ. శ. 18 వ శతాబ్ది ప్రాంతములు) - సాహిత్యరత్నాకరము.

విశ్వేశ్వర పండితుడు (క్రీ. శ. 18 వ శతాబ్ది ప్రాంతములు) - రసచంద్రిక.

---

## అనుబంధము - 3

### ఉపయుక్త గ్రంథసూచి


తెలుగు గ్రంథములు

1. రాగతాళచింతామణి (పోలూరి గోవిందకవి) - Madras Govt. Oriental Series-No. LXXXXI - 1952.

తాళదశప్రాణదీపిక (పోలూరి గోవిందకవి) - Tanjore Saraswathi Mahal Series-No. 13 - 1950.

సంగీతశబ్దార్థచంద్రిక (అరిపిరాల సత్యనారాయణమూర్తి) - బెజవాడ, 1954.

సాహిత్యదర్పణము (విశ్వనాథ కవిరాజు) - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి అనువాదము, 1935.

రసార్ణవసుధాకరము (శింగభూపాలుడు) - శ్రీ. బులుసు వేంకట రమణయ్యగారి అనువాదము - పిఠికాపురాధీశులచే ప్రకాశితము, 1950.

భరతసారము (చంద్రశేఖర పండితుడు) - శ్రీ లంకా సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్యానసహితము - తెనాలి, 1955.

కావ్యాలంకారసంగ్రహము (రామరాజ భూషణుడు) - శ్రీ సన్నిధానము సూర్య నారాయణశాస్త్రిగారి వ్యాఖ్యానసహితము - హైదరాబాదు, 1945.

వ్యక్తివివేకము (మహిమభట్టు) - శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రిగారి అనువాదము - కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటితము.

ఆంధ్రనాటకపద్యపఠనము (శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు) - రాజమండ్రి, 1957.

లక్షణసారసంగ్రహము (చిత్రకవి పెద్దనార్యుడు) - ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము, 1940.

వాత్స్యాయనీయము (వాత్స్యాయనుడు) - శ్రీ మేడిచర్ల ఆంజనేయమూర్తిగారి వ్యాఖ్యానసహితము - సికింద్రాబాదు, 1945.

ధ్వన్యాలోకము (ఆనందవర్ధనుడు) - శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారి అనువాదము - ఆంధ్రధ్వన్యాలోకము - హైదరాబాదాంధ్రసాహిత్యపరిషత్తు, 1950.

నాట్యవేదము (భరతముని)-శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి అనువాదము-గుంటూరు, 1957.

నాట్యశాస్త్రము (భరతముని) - డా. పి. యస్. శాస్త్రిగారి అనువాదము - "నవభారతి" లో ప్రకటింపబడుచున్నది.

అభినయదర్పణము (నందికేశ్వరుడు) - వావిళ్ళవారి ముద్రణము, 1934.

ఆంధ్రనాటకరంగచరిత్రము (శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు) - అముద్రితము (రచన-1956).

స్వీయచరిత్ర (శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము) - ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం, బెజవాడ, 1944.

మృచ్ఛకటికము (శూద్రకుడు) - శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల అనువాదము.

నారాయణరావు (శ్రీ అడివి బాపిరాజు) - నవల.

నాటకోపన్యాసములు (శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ) - ఆంధ్రపత్రిక ముద్రాలయము - మద్రాసు, 1935.

తెలుగు వ్యాసములు

నాట్యగృహము (భారతి - నందన శ్రావణము) - డా. పి. యస్. శాస్త్రి.

రూపకరచనము (కిన్నెర - మే, జూన్ 1953) - శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు.

సంస్కృత సాహిత్య సంప్రదాయములు, కావ్యాలంకారపరిచయము - (కిన్నెర జనవరి, ఫిబ్రవరి - 1955) - శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు.

భరతవాక్యము (పరిశోధన - సం. 5-1955) - శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు.

నాట్యశాస్త్రానువాదము (సంస్కృతి - ఆగష్టు, 1954 - జనవరి, 1957) - శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు.

నృత్తరత్నావళి (ఆకాశవాణి ప్రసారిక - జనవరి, 1957) - శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ.

వసంతరాజీయము (కుమారగిరిరెడ్డి - వ్యాఖ్యానోద్ధాహృతశ్లోకముల సంకలనము) (భారతి - సెప్టెంబరు, 1958) - శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు.

సంస్కృత గ్రంథములు

మహాభాష్యము (పతంజలి)

నాట్యశాస్త్రము (భరతముని) - బరోడా ముద్రణము - ఒకటవ సంపుటము (రెండవ ముద్రణము) - 1956; రెండవ సంపుటము - 1934; మూడవ సంపుటము - 1954.

నాట్యశాస్త్రము (భరతముని) - జె. గ్రొసెట్ సంపాదించినది (1-14 అధ్యా) పారిస్ - 1898.

నాట్యశాస్త్రము (భరతముని) - కాశీముద్రణము (1929)

నాట్యశాస్త్రము (భరతముని) - బొంబాయి ముద్రణము (1943)

అమరకోశము (అమరసింహుడు) - గురుబాలప్రబోధికాసహితము, వావిళ్ళవారి ముద్రణము - 1938.

అభినయదర్పణము (నందికేశ్వరుడు) - డా. మనోమోహన్ ఘోష్ సంపాదితము, 1957.

కావ్యాలంకారము (భామహుడు) - శ్రీ పి. వి. నాగనాథశాస్త్రిగారి ఆంగ్లానువాదసహితము - తంజావూరు, 1927.

కావ్యాలంకారసూత్రము (వామనుడు) - శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారి అనువాదసహితము.

కావ్యప్రకాశము (మమ్మటుడు) - వామనాచార్య ఝళ్కీకర్ సంస్కృతవ్యాఖ్యానసహితము - 1950.



ధ్వన్యాలోకము (ఆనందవర్ధనుడు) - నిర్ణయసాగరముద్రణాలయము.

దశరూపకము (ధనంజయుడు) - ధనికుని సంస్కృతవ్యాఖ్యతో. డా. భోలాశంకర్ వ్యాస్ హిందీవ్యాఖ్యతో కూడినది - కాశీ, 1955.

భావప్రకాశము (శారదాతనయుడు) - గేక్వాడ్ ఓరియంటల్ సిరీస్ - No. XLV (బరోడా ముద్రణము), 1930.

సాహిత్యదర్పణము (విశ్వనాథకవిరాజు) - నిర్ణయసాగరముద్రణాలయము, 1902.

ప్రతాపరుద్రయశోభూషణము (విద్యానాథుడు) - శ్రీ కె. పి. త్రివేదిచే సంపాదితము.

రసార్ణవసుధాకరము (శింగభూపాలుడు) - పీఠికాపురాధీశులచే ప్రకాశితము, 1950.

సంగీతదర్పణము (చతుర దామోదరుడు) - హిందీ టీకాసహితము - సంగీతకార్యాలయము, హాథరస్, 1950.

వ్యక్తివివేకము (మహిమభట్టు) - చౌకాంబా ప్రచురణము, కాశీ, 1936.

ఔచిత్యవిచారచర్చ; సువృత్తతిలకము (క్షేమేంద్రుడు) - చౌకాంబా ప్రచురణలు - కాశీ, 1933.

నాట్యదర్పణము (రామచంద్ర-గుణచంద్రులు) - బరోడా ముద్రణము, 1929.

వక్రోక్తిజీవితము (కుంతకుడు) ఆచార్య విశ్వేశ్వరసిద్ధాంతశిరోమణికృత హిందీ వ్యాఖ్యాసహితము - ఢిల్లీ, 1955.

కావ్యానుశాసనము (హేమచంద్రుడు) - 2 భాగములు - మహావీరజైన విద్యాలయము, బొంబాయి, 1938.

సంగీతచంద్రము (విప్రదాసుడు) - అముద్రితము (శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు నా కొసంగిన వ్రాతప్రతి.)

భరతకోశము (సంపాదకులు - శ్రీ మానవల్లి రామకృష్ణకవి) - తిరుపతి దేవస్థానమువారి ప్రచురణము, 1951.

మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞానశాకుంతలము - కాళిదాసు.

ప్రబోధచంద్రోదయము - నాదెండ్ల గోపమంత్రి; ఉత్తరరామచరితము - భవభూతి; శాకుంతలవ్యాఖ్య - రాఘవభట్టు.

**Books in English**

Poetics (Aristotle)—S. H. Butcher's Translation and Commentary - "Aristotle's Theory of Peotry and Fine Art".

Poetics (Aristotle) - Fife's edition with notes- Oxford University Press.

The Sanskrit Drama (A. B. Keith)—Oxford University Press - 2nd edition, 1954.

Pain and Pleasure (H. R. Marshall)—Macmillan and Co., 1894.

Rhetoric Notes.

The Ancient Classical Drama (R. G. Moulton)—London, 1898.

Bhoja's Sṛngara Prakasa (Dr. V. Raghavan)—2 parts—Karnatak Publishing House—Bombay, 1940.

Number of Rasas (Dr. V. Raghavan)-Adayar Library Series-Madras, 1940.

Some Concepts of Alankara Sastra (Dr. V. Raghavan)—Adayar Library Series, Madras, 1942.

Principles of Literary Criticism (Prof. L. Abercrombie) —Victor Gollancz Ltd., London, 1932.

Introduction to the study of Literature (W.H. Hudson)-George G. Harrap & Co., Ltd., 1922.

The Kalas (Sri A. V. Subbaiah)—The Vasanta Press - Madras, 1911.

The History of Sanskrit Poetics (MM. P. V. Kane)—Introduction to Sahityadarpana - Bombay, 1951.

The History of Sanskrit Poetics (Dr. S. K. De)—2 parts—1923, 1925.

Tragedy (F. L. Lucas)—The Hogarth Press - London, 1949.

The Oxford Companion to the Theatre —Oxford University Press.

The Indian Theatre (Dr. C. B. Gupta)—Motilal Banarasi Das, Banaras, 1954.

Ancient Indian Theatre (Sri D.R. Mankad)—Charutar Prakasan - Vallabh Nagar, 1950.

Natya Sastra (Dr. M. Ghosh)—English Translation - Calcutta, 1951.

The Types of Sanskrit Drama (Sri D. R. Mankad)— Urmi Prakasan Mandir - Karachi, 1936.

The Indain Theatre (R. K: Yaznik)—London, 1933.

Tandava Lakshana (Dr. B. V. Narayanaswamy Naidu, Sri P. S. Naidu, and Sri O. V. R. Pantulu)—G. S. Press, Madras, 1936.

Indian Aesthetics (Dr. K. C. Pandey)—The Chowkhamba Sanskrit Series-Banaras, 1950.

Western Aesthetics (Dr. K. C. Pandey)— The Chowkhamba Sanskrit Series-Banaras, 1956.

Khsemendra Studies (Dr. Suryakanta)—Oriental Book Agency - Poona, 1954.

Drama in Sanskrit Literature (Sri R. V. Jagirdar)—Popular Book Depot-Bombay, 1947.



The Theatre of the Hindus (H. H. Wilson, Raghavan, Pisharoti, Vidyabhushan)—Susil Gupta (India) Ltd. - Calcutta, 1955.

World Drama (Prof. A. Nicoll)—George G. Harrap & Co., Ltd - 1954.

The Development of the Theatre (Prof. A. Nicoll)— ,,

Introduction to the theory of Drama (Prof. A. Nicoll)— ,,

Psychological Studies in Rasa (Dr. Rakesa Gupta)—Author, Hindu University-Banaras, 1950.

Natya Nṛtta and Nṛtya - Their meaning and relation (Sri K. M. Varma) —Orient Longmans - Calcutta, 1957.

Theatre and Stage - 2 volumes (Edited by Harold Downs)—New Era Publishing Co., Ltd. - London.

Indian Dancing (Ram Gopal and Dadachanji)—1953.

The Vidushaka (J. T. Parikh)—Sarvajanik Education Society - Surat, 1953.

Highways and Byways of Literary Criticism in Sanskrit (MM. S. Kuppuswamy Sastry)—The Kuppuswamy Sastry Research Institute, Madras, 1945.

A History of Sanskrit Literature - Classical period (S. N. Das Gupta and S. K. De)—University of Calcutta, 1947.

Dasarupaka (G. C. O. Haas)—English Translation - Columbia University Press, 1912.

A Comparative Study of Greek and Indian Poetics and Aesthetics (Prof. Ramendrakumar Sen)—Calcutta, 1954.

The Language of Kathakali (Premkumar) - 1948.

**Essays in English**

Natya Dharmi and Loka Dharmi; The Vṛthis; Writers quoted in the Abhinavabharati; A note on the Name Dasarupaka; Bahurupamisra's Commentary on the Dasarupaka (Journal of Oriental Research - Vols. IV - VIII) - Dr. V. Raghavan.

Music in Ancient Indian Drama (The Journal of the Madras Music Academy - Vol-XXV) — Dr. V. Raghavan.

Theatre Architecture in Ancient India (3 essays); Kathakali and other forms of Bharata Natya (Triveni - Vol. V - Vol VIII)—Dr. V. Raghavan.

Tragedy and the Purification of Pity and Terror (Triveni - Vol. V. No. 4) —E. A. Wodehouse.

Aristotle's Katharsis and Bharata's Sthayibhavas (Brahmavidya -Vol. XII, Part I)—Dr. Cunhanrajah.

Susruta, Caraka and Bharata (Indian Historical Quarterly - Vol. XXX. No. 1)—Prof. Ramendrakumar Sen.

Problems of Natya Sastra; A So-called Convention of the Hindu Drama (Indian Historical Quarterly - Vol. V and Vol. IX No. 4)—Dr. Manmohan Ghosh.

The Date of Bharata Natya Sastra (Journal of the Dept. of Letters - Calcutta University, 1933)—Dr. Manmohan Ghosh.

Nṛthapara (Journal of Oriental Research, Tirupati)—Sri M. R. Kavi.

The Ancient Indian Theatre (Rajah Sir Annamalai Chettiar Commemoration Volume, 1941)—Sri K. R. Pisharoti.

The Play-House of the Hindu Period (Dr. S. K. Aiyangar Commemoration Volume)—Sri P. K. Acharya.

Bharata's Natya Sastra - 2nd Chapter (The Bihar Theatre - Jan, 1954)—Dr. S. C. Sircar.

Bharata's Natya Sastra - 2nd Chapter (Appendix to the 2nd edition of the 1st Volume of Natya Sastra - Gaekwad Oriental Series - Baroda, 1956)—Prof. D. Subba Rao.

The Curtain in Ancient Indian Theatre (Bharatiya Vidya - Vol. IX, 1948) —Dr. S. K. De.

హిందీ గ్రంథములు

కావ్యశాస్త్రము (అభినవభారతాచార్య పండిత శ్రీ సీతారాం చతుర్వేది) — అరిష్టాటిల్ పొయెటిక్సుకు హిందీ అనువాదము.

సమీక్షాశాస్త్రము (శ్రీ సీతారాం చతుర్వేది)—ప్రాచ్య పాశ్చాత్య (విశ్వ) సాహిత్య విమర్శ - కాశీ, 1954.

అభినవనాట్యశాస్త్రము (శ్రీ సీతారాం చతుర్వేది) — ప్రాచ్య పాశ్చాత్య (విశ్వ) నాట్య విమర్శ - కాశీ, 1951.

సిద్ధాంత్ ఔర్ అధ్యయన్ (శ్రీ గులాబ్ రాయ్)— సాహిత్యవిమర్శ - ఢిల్లీ, 1951.

సాహిత్యశాస్త్రము (శ్రీ బలదేవ్ ఉపాధ్యాయ) - సాహిత్యవిమర్శ (2 భాగములు). —కాశీ, 1950.

---

# అనుబంధము 4

## ఉదాహృతశ్లోకములు

[ఆయా గ్రంథములందలివని కుండలీకరణములందు చెప్పబడినవి తప్ప తక్కిన శ్లోకము లన్నియును నాట్యశాస్త్రమందలివే. శ్లోకసంఖ్య బరోడా ముద్రణమునందలి శ్లోకసంఖ్యతో సంవదించును.]

| పుటలు | శ్లోక ప్రారంభము | అధ్యా. | శ్లో. |
|---|---|---|---|
| 3. | ప్రణమ్య శిరసా దేవౌ పితామహమహేశ్వరౌ | 1 | 1 |
| 4. | క్రీడనీయక మిచ్ఛామః | 1 | 11 |
| 5. | ధర్మ్య మర్థ్యం యశస్యం చ | 1 | 14 |
| | సర్వశాస్త్రార్థసంపన్నమ్ | 1 | 15 |
| | జగ్రాహ పాఠ్య మృగ్వేదాత్ | 1 | 17 |
| 10. | నటాశ్చ నర్తకా శ్చైవ | (భావప్రకాశనము - పుట 298) | |
| | తదే వాభ్యంతరం బాహ్యామితి | ,, | |
| 11. | తదంతే ఽనుకృతి ర్బద్ధా | 1 | 57 |
| | సంఫేటవిద్రవకృతా | 1 | 58 |
| 15. | అలం వో మన్యునా | 1 | 105 |
| | భవతాం దేవతానాం చ | 1 | 106 |
| | నైకాంతతోఽత్ర భవతామ్ | 1 | 107 |
| | క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా | 1 | 108 |
| | ధర్మో ధర్మప్రవృత్తానామ్ | 1 | 109 |
| | క్లీబానాం ధార్ష్ట్యజననమ్ | 1 | 110 |
| | ఈశ్వరాణాం విలాస శ్చ | 1 | 111 |
| | నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకమ్ | 1 | 112 |
| | ఉత్తమాధమమధ్యానాం నరాణామ్ | 1 | 113 |
| | ఏత ద్రసేషు భావేషు | (ప్రక్షిప్తశ్లోకము) | |
| | దుఃఖార్తానాం శ్రమార్తానామ్ | 1 | 114 |
| | ధర్మ్యం యశస్య మాయుష్యమ్ | 1 | 115 |
| | న తత్ జ్ఞానం న త చ్ఛిల్పమ్ | 1 | 116 |
| | తన్నాత్ర మన్యుః కర్తవ్యః | 1 | 117 |
| | దేవానా మసురాణాం చ | 1 | 118 |
| 16. | వేదవిద్యేతిహాసానామ్ | (ప్రక్షిప్తశ్లోకము) | |
| | శ్రుతిస్మృతిసదాచార | ,, | |
| 17. | న స శబ్దో న త ద్వాచ్యమ్ | (భామహకావ్యాలంకారము-V-4) | |
| 18. | యోఽయం స్వభావో లోకస్య | 1 | 119 |

| | | | |
|---|---|---|---|
| 22. | అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః | (ధ్వన్యాలోకము) | |
| | శృంగారీ చే త్కవిః కావ్యే | ,, | |
| | భావా నచేతనా నపి చేతనవత్ | ,, | |
| 30. | మండపే వికృష్టే తు పాఠ్యమ్ | 2 | 19 |
| | య శ్చాప్యాస్యగతో భావః | 2 | 20 |
| | ప్రేక్షాగృహాణాం సర్వేషామ్ | 2 | 21 |
| | కనీయస్తు స్మృతం త్ర్యశ్రమ్ | (ప్రక్షి ప్తశ్లోకము) | |
| 32. | చతుష్షష్టికరాన్ కృత్వా | 2 | 33 |
| | పృష్ఠతో యో భవేద్భాగః | 2 | 34 |
| | పశ్చిమే చ విభాగే ఽథ | 2 | 35 |
| 33. | యథాఽచలో గిరి ర్మేరుః | 2 | 61 |
| | జయావహో నరేంద్రస్య | 2 | 62 |
| | రంగపీఠస్య పార్శ్వే తు | 2 | 63 |
| | చతు స్తంభ సమాయుక్తా | 2 | 64 |
| | ఉత్సేధేన తయో స్తుల్యమ్ | 2 | 65 |
| 41. | రంగపీఠం తతః కార్యమ్ | 2 | 68 |
| | కార్యం ద్వారద్వయాం చాత్ర | 2 | 69 |
| 44. | కార్యః శైలగుహాకారో ద్విభూమిః | 2 | 80 |
| | మందవాతాయనోపేతః | 2 | 81 |
| | గంభీరస్వరతా యేన | 2 | 82 |
| 48. | త త్రాభ్యంతరతః కార్యా | 2 | 89 |
| | దత్త ప్రయో క్తృభిః స్తంభాః | 2 | 90 |
| | ఇష్టకా దారుభిః కార్యమ్ | 2 | 91 |
| | రంగపీఠావలోక్యం తు కుర్యాత్ | 2 | 92 |
| | విధినా స్థాపయే త్తజ్జ్ఞో దృఢాన్ | 2 | 93 |
| | స్థాప్యం చైవ తతః పీఠమ్ | 2 | 94 |
| 49. | నేపథ్యగృహకం చైవ తతః కార్యమ్ | 2 | 96 |
| | జనప్రవేశనం చాన్యత్ | 2 | 97 |
| 58. | అభినవగుప్తో ఽప్యనుభవలుప్తః | (శ్రీ డి. సుబ్బారావుగారి శ్లోకము) | |
| 68. | స్తంభే సనత్కుమారం తు | 3 | 32 |
| 69. | దేవదేవ మహాభాగ | 3 | 47 |
| 73. | ఇత్యయం యో విధి ర్దృష్టః | 3 | 102 |
| 78. | అహో నాట్య మిదం సమ్యక్ త్వయా | 4 | 12 |
| | మయా ఽపీదం స్మృతం నృత్తమ్ | 4 | 13 |
| | పూర్వరంగవిధా వస్మిం స్త్వయా | 4 | 14 |



| | | | |
|---|---|---|---|
| 78. | మహాగీతేషు చై వార్థాన్ | 4 | 15 |
| | పభి ర్వ్యమిశ్రితశ్చాయమ్ | 4 | 16 |
| 83. | యాని స్థానాని యా శ్చార్యః | 4 | 59 |
| | సా మాతృకేతి విజ్ఞేయా | 4 | 60 |
| | కటీ కర్ణసమా యత్ర | 4 | 61 |
| | అంగస్య చతురస్రత్వం | (వసంతరాజీయము) | |
| 119. | రేచకై రంగహారై శ్చ నృత్యంతమ్ | 4 | 249 |
| | సుకుమారప్రయోగేణ నృత్యంతీమ్ | 4 | 250 |
| | పణవై ర్దర్దురై శ్చైవ | 4 | 251 |
| | నానాంగహారైః ప్రానృత్యత్ | 4 | 252 |
| | చక్రు స్తే నామ పిండీనామ్ | 4 | 253 |
| 123. | యత్రాభినేయం గీతం స్యాత్ | 4 | 276 |
| | అంగహారప్రయోగే తు | 4 | 277 |
| | నృత్తాంగగ్రాహి వాద్యజ్ఞైః | 4 | 278 |
| 130. | తాండవం నటనం లాస్యమ్ | (అమరకోశము) | |
| 133. | నాట్యం నృత్తం నృత్య మితి | (అభినయదర్పణము) | |
| | నాట్యం తన్నాటకం చైవ | ,, | |
| | రసభావవ్యంజనాదియుక్తమ్ | ,, | |
| | అవస్థానుకృతి ర్నాట్యమ్ | (దశరూపకము) | |
| | అన్య ద్భావాశ్రయం నృత్యమ్ | ,, | |
| | మధురోద్ధతభేదేన తద్ద్వయమ్ | ,, | |
| 135. | గీతం వాద్యం న ర్తనం చ | (సంగీతదర్పణము) | |
| | ద్రుహిణేన యదన్విష్టమ్ | ,, | |
| | త త్తద్దేశస్థయా రీత్యా | ,, | |
| | నృత్యం భావాశ్రయం నృత్తమ్ | (భావప్రకాశనము) | |
| | తద్ద్వయం నాటకాదీనామ్ | ,, | |
| 137. | మానో రక్షో ఽభినట్ | (ఋగ్వేదము) | |
| | వ్యంజనాని పున ర్నటభార్యావత్ | (మహాభాష్యము-గద్యము) | |
| 148. | జయతి మహిమా లోకాతీతః | (అభిజ్ఞానశాకుంతలవ్యాఖ్య) | |
| 149. | ఆంగికం భువనం యస్య | (అభినయదర్పణము) | |
| 151. | సంధ్యాయాం నృత్యతః | (అభినవభారతి-కోహలశ్లోకము) | |
| 152. | చకారాభినయం ప్రీతః | ,, ,, | |
| 157. | యద్యపి పురుషో గాయతి గీతవిధానం తు | (అభినవభారతి) | |
| 162. | యా విద్యా యాని శిల్పాని | (అధికపాఠశ్లోకము) | |
| 167. | నమోఽస్తు సర్వదేవేభ్యః | 5 | 105 |

| | | | |
|---|---|---|---|
| 167. | బ్రహ్మోత్తరం తథైవాస్తు | 5 | 106 |
| | రాష్ట్రం ప్రవర్ధతాం చైవ | 5 | 107 |
| | కావ్యకర్తు ర్యశ శ్చాస్తు | 5 | 108 |
| 169. | పాదతలాహతిపాతితశైలమ్ | 5 | 127 |
| 176. | దేవం విభుం త్రిభువనాధిపతిమ్ | (ప్రక్షిప్తశ్లోకము) | |
| | చంద్రార్ధభూషణజటమ్ | ,, | |
| 177. | వరదం సగణం త్రిపురాంతకమ్ | ,, | |
| | ప్రవరం వరదం ప్రణమత సతతమ్ | ,, | |
| 178. | త్రిపురాంతకరం బహులీలమ్ | ,, | |
| 181. | సూచనే పాత్రభేదానామ్ | (వసంతరాజీయము) | |
| | ప్రావేశిక్యాక్షేపికీ చ | ,, | |
| | ప్రవేశసూచకాదా తు | ,, | |
| | ప్రాసాదికీ తు పాత్రాణామ్ | ,, | |
| | విషాదే విస్మృతే క్రోధే | ,, | |
| 184. | ప్రథమః పూర్వరంగ శ్చ | ,, | |
| | యన్నాట్యవస్తునః పూర్వమ్ | ,, | |
| | య ద్యప్యంగాని భూయాంసి | ,, | |
| | ఆశీ ర్నమస్క్రియారూపః | ,, | |
| | మాంగల్యారంభచక్రాబ్జ | ,, | |
| 187. | ధార్యా యవనికా రమ్యా | (భరతసారము) | |
| | అఖండమండలం చిత్రమ్ | ,, | |
| | నేపథ్యాంతరితః పూర్వమ్ | ,, | |
| 191. | రసా భావా హ్యభినయాః | 6 | 10 |
| 192. | శృంగార హాస్య కరుణా | 6 | 15 |
| | బీభత్సాద్భుతశాంతాశ్చ | (కావ్యాలంకారసారసంగ్రహము) | |
| 193. | రతి ర్హాస శ్చ శోక శ్చ | 6 | 17 |
| | నిర్వేద గ్లాని శంకాఖ్యాః | 6 | 18 |
| | వ్రీడా చపలతా హర్షః | 6 | 15 |
| | సుప్తం విబోధో ఒమర్షా శ్చ | 6 | 20 |
| | త్రాస శ్చైవ వితర్కా శ్చ | 6 | 21 |
| | స్తంభః స్వేదో ఒథ రోమాంచః | 6 | 22 |
| | జుగుప్సా విస్మయ శమాః | (ఇతరాలంకారికులు) | |
| 194. | ఆంగికో వాచిక శ్చైవ | 6 | 23 |
| | లోకధర్మీ నాట్యధర్మీ తు | 6 | 24 |
| | చతస్రో వృత్తయః | 6 | 25 |



| | | | |
|---|---|---|---|
| 195. | పాంచాలమధ్యమా చేతి | 6 | 26 |
| | శారీరశ్చైవ వైణాశ్చ | 6 | 27 |
| | చతుర్విధం విజ్ఞేయమ్ | 6 | 28 |
| | ప్రవేశాక్షేపనిష్క్రామ | 6 | 29 |
| | గానం పంచవిధం జ్ఞేయమ్ | 6 | 30 |
| 196. | న హి రసాదృతే కశ్చిత్ | 6 | (గద్యము) |
| 198. | యథా బహుద్రవ్యయుతైః | 6 | 32 |
| | భావాభినయసంబద్ధాన్ | 6 | 33 |
| 199. | న భావహీనో ఒస్తి రసః | 6 | 36 |
| 205. | స్మిత మథ హసితం విహసితమ్ | 6 | 52 |
| | ఈష ద్వికసితై ర్గండైః | 6 | 54 |
| | ఉత్ఫుల్లాననేత్రం తు | 6 | 55 |
| 206. | ఆకుంచితాక్షిగండం యత్ | 6 | 56 |
| | ఉత్ఫుల్లనాసికం యత్తు | 6 | 57 |
| | అస్థానహసితం యత్తు | 6 | 58 |
| | సంరబ్ధసాశ్రునేత్రం చ | 6 | 59 |
| 212. | న యత్ర దుఃఖం న సుఖమ్ | (ప్రక్షిప్తశ్లోకము) | |
| | భావా వికారా రత్యాద్యాః | ,, | |
| | స్వం స్వం నిమిత్త మాసాద్య | ,, | |
| 215 | మునినా భరతేన యః ప్రయోగః | (విక్రమోర్వశీయము) | |
| | రచనా ద్రసత్వ మేషాం | (రుద్రట కావ్యాలంకారము) | |
| 216. | ఏకో రసః కరుణ ఏవ | (ఉత్తరరామచరితము) | |
| 221. | విభావై రనుభావై శ్చ సాత్త్వికైః | (దశరూపకము) | |
| 224. | శబ్దోపహితరూపాం స్తాన్ | (వాక్యపదీయము) | |
| 225. | స్థాయీభావః శ్రితోత్కర్షః | (నాట్యదర్పణము) | |
| 237. | విరుద్ధై రవిరుద్ధైర్వా భావైః | (దశరూపకము) | |
| | వికృతాకారవాగ్వేషచేష్టాదేః | (సాహిత్యదర్పణము) | |
| | వాగంగవికారదర్శనజన్మా | (రసగంగాధరము) | |
| 259. | నహ్యేకరసజం కావ్యమ్ | 6 | 119 |
| | బహూనాం (సర్వేషాం) సమవేతానామ్ | (ప్రక్షిప్తశ్లోకము) | |
| | దీపయంతః ప్రవర్తంతే | ,, | |
| 267. | అభిపూర్వ స్తు ణీఞ్ ధాతుః | 8 | 7 |
| 268. | విభావయతి యస్మా చ్చ | 8 | 8 |
| | త్రివిధ స్త్వాంగికో జ్ఞేయః | 8 | 12 |
| | శిరో హస్త కటీ వక్షః | 8 | 13 |

| | | | |
|---|---|---|---|
| 268. | తస్య శిరో హస్తౌః | 8 | 14 |
| 281. | వివర్తితో వికాసీ చ | (వసంతరాజీయము) | |
| | కంపిత శ్చేతి నాట్యజ్ఞైః | ,, | |
| 283. | ఏవం భావరసాఢ్యేషు | 8 | 165 |
| | ముఖరాగవిహీనస్తు నైవ | 8 | 166 |
| 284. | ద్విగుణాం లభతే శోభామ్ | 8 | 167 |
| | ముఖరాగాన్వితో యస్మాత్ | 8 | 168 |
| | తథా భావరసోపేతమ్ | 8 | 169 |
| 286. | సందర్భేషు దశరూపకమ్ శ్రేయః | (కావ్యాలంకారసూత్రము) | |
| 287. | స(రసః) న అనుభవైకగమ్యత్వాత్ | (శృంగారప్రకాశము-గద్యము) | |
| 288. | అనుభావవిభావానాం వర్ణనా | (వ్యక్తివివేకము) | |
| 311. | యత్ర వ్యగ్రా వుభౌ హస్తౌ | 9 | 180 |
| 336. | కటినాభిచరౌ హస్తౌ | 10 | 34 |
| | వైష్ణవస్థాన మిత్యంగమ్ | 10 | 35 |
| | చతురశ్రశోభి ర్వపు ర్విభక్తమ్ | (కుమారసంభవము) | |
| 348. | భరతశబ్దేన ఉపచారతః | (అభినవభారతి-గద్యము) | |
| 355. | ......మృత ఇతి ప్రోక్తే | 12 | 106 |
| 367. | వయో ఒనురూపః ప్రథమస్తు వేషః | 12 | 247 |
| 374. | వికృష్టం యస్తు గచ్ఛేద్ధి | 13 | 23 |
| | అహ్నః ప్రమాణం గత్వా తు | 13 | 24 |
| | క్షణో ముహూర్తో యామో వా | 13 | 25 |
| | అంకచ్ఛేదే తు నిర్వృత్తమ్ | 13 | 26 |
| 375. | ఇహ భావా రసాశ్చైవ | 13 | 35 |
| | దృష్ట్యా హి సూచితో భావః | 13 | 36 |
| 380. | అథ బాహ్యప్రయోగే తు | 13 | 65 |
| | పృష్ఠే కృత్వా కుతపమ్ | 13 | 66 |
| | ద్వారాణి షడ్వైవ భవంతి | 13 | 67 |
| 380. | విధానముత్క్రమ్య యథాత్ర రంగే | 13 | 68 |
| | వయోఽనురూపః ప్రథమం తు వేషః | 13 | 69 |
| | స్వభావోపగతం శుద్ధమ్ | 13 | 71 |
| | స్వభావాభినయోపేతమ్ | 13 | 72 |
| 381. | అతివాక్యక్రియోపేతమ్ | 13 | 73 |
| | స్వరాలంకారసంయుక్తమ్ | 13 | 74 |
| 383. | యోఽయం స్వభావో లోకస్య | 13 | 81 |
| 384. | సర్వస్య సహజో భావః | 13 | 85 |



| | | | |
|---|---|---|---|
| 391. | వాచి యత్నస్తు కర్తవ్యః | 14 | 2 |
| | వాఙ్మయానీహ శాస్త్రాణి | 14 | 3 |
| 396. | ఛందోహీనో న శబ్దోఽస్తి | 14 | 45 |

పుటలు 409-434లలో వృత్తలక్షణములకు 78 ఉదాహరణశ్లోకములు కలవు. అవి లక్షణశ్లోకములుకాకపోవుటచే ఇచ్చట పేర్కొనబడలేదు.

పుటలు 452-455లలో యమకభేదములకు 13 ఉదాహరణశ్లోకములు కలవు అవి లక్షణశ్లోకములుకాకపోవుటచే ఇచ్చట పేర్కొనబడలేదు.

| | | | |
|---|---|---|---|
| 461. | కావ్యశోభాకరాన్ ధర్మాన్ | (కావ్యాదర్శము) | |
| 464. | ఉపమైకా శైలూషీ | (అప్పయ దీక్షితుడు) | |
| 466. | గౌ ర్గౌః కామదుఘా సమ్యక్ | (కావ్యాదర్శము) | |
| | తదల్ప మపి నోపేక్ష్యమ్ | ,, | |
| | నాకవిత్వ మధర్మాయ వ్యాధయే | (భామహకావ్యాలంకారము) | |
| 472. | కావ్యం గ్రాహ్య మలంకారాత్ | (కావ్యాలంకారసూత్రము) | |
| 476. | యత్రార్థ శ్శబ్దో వా తమర్థమ్ | (ధ్వన్యాలోకము) | |
| 479. | ఔచిత్య మనుధావంతి | (మ.మ. కుప్పుస్వామిశాస్త్రి) | |
| 486. | న బర్బరకిరాతాంధ్ర | 17 | 46 |
| 487. | మాగధ్యావంతిజా ప్రాచ్యా | 17 | 49 |
| 488. | శకారాభీరచండాల | 17 | 50 |
| 493. | శారీర్యా మథ వీణాయామ్ | 17 | 106 |
| 500. | కిం ? గచ్ఛ. మావిశ. | 17 | 132 |
| | యత్రవ్యగ్రా వుభౌ హస్తౌ | 17 | 134 |
| 508. | నాటకం సప్రకరణ మంకః | 18 | 2 |
| | ఈహామృగ శ్చ విజ్ఞేయః | 18 | 3 |
| 513. | అంక ఇతి రూఢిశబ్దః | 18 | 14 |
| 514. | యత్రార్థస్య సమాప్తిః యత్ర చ | 18 | 16 |
| 516. | ఏకాంకే న కదాచిత్ బహూని | 18 | 22 |
| 529. | సూచినీ ప్రస్తుతార్థస్య | (వసంతరాజీయము) | |
| 531. | అవస్థానుకృతి ర్నాట్యం | (దశరూపకము) | |
| 561. | ఇతివృత్తం తు నాట్యస్య | 19 | 1 |
| 572. | సంధిసంధ్యంగఘటనమ్ | (ధ్వన్యాలోకము) | |
| 584. | అవస్థా యా తు లోకస్య | 19 | 142 |
| | న తజ్జ్ఞానం న తచ్ఛిల్పమ్ | 19 | 143 |
| | యోఽయం స్వభావో లోకస్య | 19 | 144 |
| | దేవతానా మృషీణాం చ | 19 | 145 |
| | యస్మాత్ స్వభావం సంత్యజ్య | 19 | 146 |

| | | | |
|---|---|---|---|
| 606. | ధర్మార్థకామమోక్షేషు | (భామహకావ్యాలంకారము) | |
| | ఆనందనిష్యందిషు రూపకేషు | (దశరూపకము) | |
| 619. | హాస్యశృంగారబహులా | 20 | 73 |
| | రౌద్రే భయానకే చైవ | 20 | 74 |
| 620. | వీరాద్భుతప్రహసనై రిహ | (కోహలుడు) | |
| 634. | అదేశయుక్తో వేషో హి | 21 | 73-74 |
| | కంఠే మేఖలయా నితంబఫలకే | (ఔచిత్యవిచారచర్చ) | |
| | శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా | ,, | |
| 636. | స్వవర్ణ మాత్మనశ్ఛాద్యం | 21 | 88 |
| | ఆకృతి స్తస్య కర్తవ్యా | 21 | 89 |
| | తత్స్వభావం హి భజతే | 21 | 90 |
| | పరభావం ప్రకురుతే | 21 | 91 |
| 644. | ఇహ భావరసా శ్చైవ దృష్టిభిః | 21 | 160 |
| 654. | గ్రామ్యత్వ మనౌచిత్యమ్ | (రుద్రటాలంకారము) | |
| | అనౌచిత్యా దృతే నాన్యత్ | (ధ్వన్యాలోకము) | |
| | ఉచితం ప్రాహు రాచార్యాః | (ఔచిత్యవిచారచర్చ) | |
| 657. | వాగంగముఖరాగై శ్చ | 22 | 8 |
| 672. | తం వీక్ష్య వేపథుమతీ | (కుమారసంభవము) | |
| 682. | పితాపుత్రస్నుషాశ్వశ్రూ దృశ్యం | 22 | 299 |
| | వాక్యైః సాతిశయైః శ్రవ్యైః | 22 | 300 |
| 686. | అంగై రంతర్నిహితవచనైః | (మాళవికాగ్నిమిత్రము) | |
| | కరాభ్యాం చరణాభ్యాం చ | ,, | |
| 687. | నృత్తం తథా చ కైవారో | (నృత్తరత్నాకరము) | |
| | చిత్రాశీర్భూ హ స్తపాదైః | (కాటయవేముడు) | |
| 722. | ధైర్యలీలాంగసంపన్నమ్ | 25 | 49 |
| 723. | సర్వే సలలితా భావాః స్త్రీభిః | 25 | 66-67 |
| | కరపాదాంగసంచారాః స్త్రీణాం తు | 25 | 50 |
| 725. | అశ్రావ్యం నియతశ్రావ్యమ్ | (వసంతరాజీయము) | |
| 726. | తదాత్మగత మిత్యుక్త్వా | ,, | |
| | ద్వివిధః స పరిజ్ఞేయో జనాంత శ్చ | ,, | |
| | స్యా జ్జనాంతిక మిత్యుక్త్వా | ,, | |
| | సర్వై రాకర్ణనీయార్థః శ్రావ్యః | ,, | |
| 728. | ప్రత్యంగహీనం యత్కావ్యమ్ | 25 | 113 |
| 729. | నానావిధైః ర్యథా పుష్పైర్మాలామ్ | 25 | 117 |
| | మాలాకారో రచయతి యథా | (భామహకావ్యాలంకారము) | |



| | | | |
|---|---|---|---|
| 734. | అనురూపా విరూపా చ | 26 | 1 |
| 735. | నానావస్థాక్రియోపేతా భూమికా | 26 | 2 |
| 736. | స్వాభావికేన రూపేణ ప్రవిశేత్ | 26 | 5 |
| | యాదృశం యస్య యద్రూపమ్ | 26 | 6 |
| | యథా జీవః స్వభావం హి పరిత్యజ్య | 26 | 7 |
| | ఏవం బుధః పరం భావం సోఽస్మీతి | 26 | 8 |
| 737. | సోఽస్మీత్యనేన స్వాత్మావష్టంభస్య | (అభినవభారతి-గద్యము) | |
| 740. | రంభోర్వశీప్రభృతిషు స్వర్గే | 26 | 20 |
| 741. | తథైవ మానుషే లోకే రాజ్ఞామ్ | 26 | 21 |
| | న స్వయం భూమికాన్యాసః | 26 | 22 |
| 742. | సుకుమారప్రయోగో ఽయం | 26 | 26 |
| | శృంగారస మాసాద్య | 26 | 27 |
| | నతే స్త్రీణాం ప్రకర్తవ్యాః | 26 | 28 |
| | యోగ్యాః స చ ప్రయత్నః | 26 | 32-33 |
| 743. | గీతం నృత్తం తథా వాద్యమ్ | 26 | 35 |
| | ఊహాపోహా మతి శ్చైవ | 26 | 36 |
| 749. | న శబ్దో యత్ర న క్షోభః | 27 | 17 |
| 754. | అవ్యగ్రై రింద్రియైః శుద్ధః | 27 | 54 |
| | యే తుష్టౌ తుష్టి మాయాంతి | 27 | 42 |
| | య స్తుష్టౌ తుష్టి మాయాతి | 27 | 61-62 |
| 773. | గ్రహాంశౌ తారమంద్రౌ చ | 28 | 70 |
| 784. | స్థానే చాలంకారం కుర్యాత్ | 29 | 74 |
| | శశినా రహితేవ నిశా విజలేవ నదీ | 29 | 75 |
| 796. | దేవం దేవైః సంస్తుత మీశమ్ | 31 | 201 |
| 797. | భూతాధిపతిం భగనేత్రహరమ్ | 31 | 204 |
| | అమరప్రవరం మదనాంగహరమ్ | 31 | 207 |
| 805. | య స్తు తాలం న జానాతి న సః | 31 | 530 |

పుటలు 810-812 లలో ధ్రువలకు 14 చిన్న చిన్న ఉదాహరణశ్లోకములు కలవు.

| | | | |
|---|---|---|---|
| 824. | యథా వర్ణా దృతే చిత్రే | 32 | 450 |
| 843. | ఆచార్యాః సమమిచ్ఛంతి | 34 | 211 |
| 850. | వాద్యే తు యత్నః ప్రథమం తు | 34 | 270 |
| 853. | రాజవత్ భరత స్తస్మాత్ | 35 | 42 |
| 859. | వధూనాటకసంఘై శ్చ సంయుక్తామ్ | (రామాయణము) | |
| 866. | కించాన్యత్ సస్యపూర్ణా భవతు | | |
| | మహాపుణ్యం ప్రశస్తం చ | చివరి శ్లోకములు | |
| | ...సమాప్తశ్చాయం గ్రంథః | చివరి గద్యము | |
| 870. | పుంఖానుపుంఖైః | | |

రసములు : విభావాధులు (నాట్యశాస్త్రమునందు సుస్పష్టముగా పేర్కొనబడినవే ఇందు కూర్చబడెను.)



| రసములు | 1. శృంగారము | 2. హాస్యము | 3. కరుణము | 4 రౌద్రము | 5. వీరము | 6. భయానకము | 7. బీభత్సము | 8. అద్భుతము | 9. శాంతము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| దైవతములు (పుట 201) | విష్ణువు | ప్రమథులు | యముడు | రుద్రుడు | మహేంద్రుడు | కాలుడు | మహాకాలుడు | బ్రహ్మ | — |
| వర్ణములు (పుట 201) | శ్యామవర్ణము | సిత (తెలుపు) వర్ణము | కపోతవర్ణము | రక్తవర్ణము | గౌరవర్ణము | కృష్ణవర్ణము | నీలవర్ణము | పీతవర్ణము | — |
| స్థాయి భావములు (పుట 193) | రతి | హాసము | శోకము | క్రోధము | ఉత్సాహము | భయము | జుగుప్స | విస్మయము | శమము లేదా తత్త్వజ్ఞానము |
| స్వరూపములు (పుటలు 202-213) | ఉజ్జ్వలవేషాత్మకము, స్త్రీపురుషహేతుకము, ఉత్తమ యువప్రకృతులకు సంబంధించినది. | ఇది ఆత్మస్థ - పరస్థ రూపముగా నుండును. స్త్రీ-నీచ ప్రకృతులయందధికముగా గోచరించును. | ఇష్టజన వధ - నాశములు, అప్రియవార్తాదులుఅనునవి శోకమునకు ఆకరములు. | ఉద్ధతప్రకృతులకు సంబంధించియుండును. సంగ్రామహేతుకము. ఉగ్రకర్మలతో కూడియుండును. | ఇది ఉత్తముల స్వభావము. | స్త్రీ - నీచ ప్రకృతుల యందధికముగా కన్పట్టును. | జుగుప్సావహములగు వాని వలన జనించును. | విస్మయావహము లగువాని వలన జనించును. | మోక్ష ప్రవర్తకము, సర్వ ప్రాణి హిత రూపము. సర్వ రసములకును ప్రకృతి. |
| భేదములు (పు.211-212) | సంభోగశృంగారము, విప్రలంభ శృంగారము అను భేదములచే రెండు విధములు. వాక్ - నైపథ్య - క్రియాభేదములచే మరల మూడు విధములు. | ఆత్మస్థ - పరస్థభేదములచే ద్వివిధము. స్మిత-హసిత-విహసిత-ఉపహసిత - అపహసిత - అతి హసితము లనెడి భేదములచే 6 విధములు.వాక్-అంగ-నైపథ్య భేదములచే త్రివిధము. | ధర్మనాశముచేజనించునది. అర్థనాశముచే జనించునది. శోకముచే (మరణాదులచే) జనించునది అను భేదములచే మూడు విధములు. | వాగాత్మకము, నైపథ్యాత్మకము, క్రియాత్మకము అనెడి భేదములచే మూడు విధములు.(వాక్యరౌద్రము స్వభావరౌద్రమనబడును.) | దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము అను భేదములచే మూడు విధములు. (దయావీరము నాలుగవ భేదము) | కృతకము, అపరాధజము, విత్రాసితకము అనెడి భేదములచే మూడు విధములు. | క్షోభణము, ఉద్వేగి అనెడి భేదములచే రెండు విధములు. | దివ్యము, ఆనందజము అనెడి భేదములచే రెండు విధములు. | ఏకవిధము. |
| విభావములు (పు.202-212) | ఋతువులు, హారములు, గంధములు, నగలు, ఇష్టజనుల సహవాసము, గీతములు, ఉత్తమభవనములు, ఉద్యానవన విహారములు, చిత్రములు, జలక్రీడలు, ఉత్తమ జనుల అనుకరణము మున్నగు వానిచే జనించును. | వికృత పరవేష-అలంకారములు,ధార్ష్ట్యము,లౌల్యము, కుహకము, అసత్ప్రలాపము, అంగవికలులను చూచుట, అనిమిత్తభయ-అకార్యకరణ - వికృత వేషాది వర్ణనములు మున్నగువాని వలన జనించును. | శాపక్లేశము, ఇష్టజనవియోగము, విభవనాశము, వధ, బంధనము, దేశ బహిష్కారము, అగ్న్యాదులచే మరణము, ఆపదలు కలుగుట మున్నగు వానిచే జనించును. | సంగ్రామము, క్రోధము, ఆదర్షణము, అధిక్షేపము, అవమానము, అసత్య వచనము, ఉపఘాతము, వాక్పారుష్యము, అభిద్రోహము, అసూయ మొదలగువానిచే జనించును. | అసంమోహము, అధ్యవసాయము, నయము, వినయము, బలము, పరాక్రమము, శక్తి, ప్రలాపము; ప్రభావము మొదలగు వానిచే జనించును. | వికృతరవశ్రవణము,పిశాచ దర్శనము, ఇతరులత్రాస-ఉద్వేగములను చూచుట, శూన్యగృహ - అరణ్య గమనములు, స్వజనుల వధ-బంధనములను చూచుట, వినుట మున్నగు వానిచే జనించును. | అహృద్యములు, అప్రశస్తములు, అప్రియములు, అచోక్షములు,అనిష్టములు అయిన వస్తువులను గూర్చి చెప్పుట, వినుట, వానిని చూచుట,దుష్టములైనగంధ రస-స్పర్శ-శబ్దములుఅను వానివలన జనించును. | దివ్యజనదర్శనము,ఈప్సిత మనోరథ సిద్ధి, ఉద్యాన - దేవాలయ గమనములు, సభ - విమాన - మాయా-ఇంద్రజాలములను సందర్శించుట మొదలగువానిచే జనించును. | తత్త్వజ్ఞానము, వైరాగ్యము, ఆశయశుద్ధి మొదలగు వానిచే జనించును. |
| అనుభావములు (పు.202-212) | సం. శృం—కనుబొమల విలాసము, కటాక్షములు, లలితాంగహారములు,మధురములైన వాక్కులు. విప్ర. శృం—నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, శ్రమ, చింత, మోహము, ఔత్సుక్యము, నిద్ర, స్వప్నము,ప్రబోధము, వ్యాధి, ఉన్మాదము, అపస్మారము, జాడ్యము, మరణము. | పెదవులను, ముక్కును, చెక్కిళ్ళను స్పందింపజేయుట, కనులను కొలదిగా మూయుట విప్పారజేయుట, స్వేదము, ముఖరాగము, చేతులలో రెండు ప్రక్కలను పట్టుకొనుట అనెడి వానిచే హాస్యమును అభినయించవలెను. | కన్నీళ్ళు కార్చుట, పరిదేవనము, నోరెండిపోవుట శరీరము వివర్ణమగుట, అంగములు వ్రేలాడుట, ఉచ్ఛ్వాసనిశ్వాసము లధికమగుట, మరపు మున్నగు వానిచే కరుణమును అభినయించవలెను. | కొట్టుట, విరచుట, మర్దించుట, నరకుట, ఆయుధగ్రహణ - శస్త్ర ప్రయోగములు, రక్తనయనములు, స్వేదము, బొమముడి, పండ్లు కొరుకుట, పెదవులను కరచుట, అరచేతుల నొండొంటితో రాయుట మున్నగువానిచే రౌద్రమును అభినయించవలెను. | స్థైర్యము, ధైర్యము, శౌర్యము, త్యాగము, వైశారద్యము మొదలగు అనుభావములచే వీరరసమును అభినయించవలెను. | గాత్ర - ముఖ - దృష్టుల యందలి వైపరీత్యము, ఊరువులు స్తంభించుట, శూన్యముగాచూచుట,అంగములు జారుట, నోరెండుట, హృదయము కంపించుట, పులకలు మున్నగు వానిచే అభినయించవలెను.కృతక భయమందు చేష్టలు మృదువుగా నుండవలెను. | శరీరమును పిండీకృతము చేయుట ముఖసంకోచనము ఉల్లేఖనము, ఉమ్మివేయుట ముక్కు మూసికొనుట, ఎత్తెత్తి అడుగులువేయుట మున్నగు వానిచే బీభత్సమును అభినయించవలెను. | విప్పారిన కనులు, రెప్పపాటులేని చూపు, రోమాంచము, అశ్రుపాతము, స్వేదము, హర్షము, సాధువాదము, అధిక దానము, హాహాకారము, చేతులు వస్త్రములు మొదలగువానిని ఆడించుట మున్నగువానిచే అద్భుతమును అభినయించవలెను. | యమ-నియమములు, అధ్యాత్మ-ధ్యాన - ధారణ - ఉపాసనములు, భూతదయ, వైరాగ్య చిహ్నములు మున్నగువానిచే శాంతమును అభినయించవలెను. |

| రసములు | 1. శృంగారము | 2. హాస్యము | 3. కరుణము | 4. రౌద్రము | 5. వీరము | 6. భయానకము | 7. బీభత్సము | 8. అద్భుతము | 9. శాంతము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వ్యభిచారి భావములు (పుటలు 202-213; 258) | ఆలస్యము, ఉగ్రత, జుగుప్స అను మూడు భావములను తప్ప తక్కిన వన్నియును ఇందు వ్యభిచారి భావములే అగును. | గ్లాని, శంక, అసూయ, శ్రమము, చపలత, స్వప్నము, నిద్ర, అవహిత్థము, ప్రబోధము అనునవి ఇందు ప్రయుక్తము లగును. | నిర్వేదము, గ్లాని, చింత, ఔత్సుక్యము, ఆవేగము, మోహము, శ్రమము, భయము, విషాదము, దైన్యము, వ్యాధి, జడత, ఉన్మాదము, అపస్మారము, మరణము, స్తంభము, వేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, స్వరభంగము. | గర్వము, అసూయ, మదము, ఉత్సాహము, ఆవేగము, అమర్షము, క్రోధము, చపలత, ఉగ్రత, సంమోహము, స్వరభేదము, రోమాంచము అనునవి ఇందు ప్రయుక్తములగును. | అసంమోహము, ఉత్సాహము, ఆవేగము, హర్షము మతి, ఉగ్రత, అమర్షము, మదము, రోమాంచము, స్వరభంగము, క్రోధము, అసూయ, ధృతి, గర్వము వితర్కము అనునవి ఇందు ప్రయుక్తము లగును. | స్వేదము, వేపథువు, రోమాంచము, గాద్గద్యము, త్రాసము, మరణము, వైవర్ణ్యము, స్తంభము, శంక, దైన్యము, ఆవేగము చపలత, జడత, అపస్మారము, మరణము అనునవి ఇందుప్రయుక్తములగును. | అపస్మారము, ఉన్మాదము, విషాదము, మదము, మృత్యువు, వ్యాధి, భయము మొదలగునవి ఇందుప్రయుక్తములగును. | స్తంభము, స్వేదము, రోమాంచము, విస్మయము ఆవేగము, జడత, మూర్ఛ, హర్షము, మోహము, అశ్రువు, ఉన్మాదము, ప్రలయము అనునవి ఇందు ప్రయుక్తములగును. | నిర్వేదము, స్మృతి, ధృతి, సర్వాశ్రమశౌచము, స్తంభము, రోమాంచము ఇందు ప్రయుక్తము లగును. |
| దృష్టులు (పు.272-273) | కాంతదృష్టి | హాస్యదృష్టి | కరుణదృష్టి | రౌద్రదృష్టి | వీరదృష్టి | భయానకదృష్టి | బీభత్సదృష్టి | అద్భుతదృష్టి | శాంతదృష్టి |
| తారాకర్మలు (పుట 277) | వివర్తనతారక | సంప్రవేశతారక | పాతనతారక | భ్రమణ - వలన - సముద్వృత్త -నిష్క్రామతారకలు. | భ్రమణ - వలన - సముద్వృత్త-నిష్క్రామ తారకలు. | చలనతారక, నిష్క్రామతారక. | సంప్రవేశతారక | నిష్క్రామతారక | — |
| ముఖరాగములు (పుట 283) | ప్రసన్నము | ప్రసన్నము | రక్తము | రక్తము | రక్తము | శ్యామము | శ్యామము | ప్రసన్నము | |
| స్థానకములు (పుట 333) | వైష్ణవస్థానము | — | | ఆలీఢస్థానము | వైష్ణవ స్థానము, ఆలీఢ స్థానము. | — | వైష్ణవ స్థానము | — | — |
| గతులు (పు.350-352) | స్వస్థకామితగతి, ప్రచ్ఛన్నకామిత గతి. | హాస్యగతి | కరుణమందరి | రౌద్రగతి | వీరగతి | భయానకగతి | బీభత్సగతి | అద్భుతగతి | శాంతగతి |
| వృత్తములు (పుట 458) | ఆర్యాది మృదువృత్తములు | అర్థానుసార వృత్తయోజనము. | శక్వరి, అతిధృతి ఛందములందలి వృత్తములు. | లఘ్వక్షరప్రాయమగు వృత్తరచన, ధర్షణమందు గుర్వక్షరప్రాయ రచన. | జగతి, అతిజగతి, సంకృతి ఛందములందలి లఘ్వక్షర ప్రాయమగు వృత్తరచన. ధర్షణమందు గుర్వక్షర ప్రాయమగు రచనము. | అర్థానుసార వృత్తయోజనము. | అర్థానుసార వృత్తయోజనము. | లఘ్వక్షర ప్రాయమగు వృత్త రచన. | అర్థానుసార వృత్త యోజనము |
| కావ్యాలంకారములు (పుట 458) | రూపక - దీపకము లనెడి అలంకారములు | అర్థానుకూలముగా అలంకారయోజనము | — | ఉపమా - రూపకములు | ఉపమా-రూపకములు | — | — | ఉపమా-రూపకములు | — |
| స్వరములు (పుటలు 493; 779) | పంచమ - మధ్యమ స్వర భూయిష్ఠముగా గానము ప్రయుక్తము కావలెను. | పంచమ - మధ్యమ స్వర భూయిష్ఠముగా గానము ప్రయుక్తముకావలెను. | గాంధార-నిషాద ప్రాయమగుగానము ప్రయుక్తము కావలెను. | షడ్జ - ఋషభప్రాయమగు గానము ప్రయుక్తము కావలెను. | షడ్జ - ఋషభప్రాయమగు గానము ప్రయుక్తము కావలెను. | దైవత భూయిష్ఠముగా గానము ప్రయుక్తము కావలయును. | దైవత భూయిష్ఠముగా గానము ప్రయుక్తము కావలెను. | షడ్జ- ఋషభ ప్రాయమగు గానము ప్రయుక్తము కావలెను. | — |
| వర్ణములు (పుట 495) | స్వరిత - ఉదాత్తములు | స్వరిత - ఉదాత్తములు | అనుదాత్త-స్వరిత- కంపితములు | ఉదాత్త-కంపితములు | ఉదాత్త-కంపితములు | అనుదాత్త - స్వరిత - కంపితములు | అనుదాత్త - స్వరిత - కంపితములు | ఉదాత్త-కంపితములు | — |
| పాఠ్యాలంకారములు(పు.493) | విలంబితము | విలంబితము | విలంబితము | ఉచ్చ-దీప్తములు | ఉచ్చ-దీప్తములు | ద్రుత - నీచములు | ద్రుత-నీచములు | — | — |

స్వాతిముని - 9, 828, 848, 865
స్వాధీనభర్తృక (నాయిక) - 676
స్వాభావిక (నాసిక) - 280
స్వాభావికము (ముఖరాగము) - 283
స్వామి (నాయకుడు) - 683
స్వామినులు (ఆభ్యంతరపరివారము) - 706
స్వీయ (నాయిక) - 688
స్వేదము (స్వాత్త్వికభావము) - 256-57

హ

హంసపక్షము (అసం. హస్తము) - 302
హంసవక్త్రము లేదా హంసాస్యము (అసం. హస్తము) - 302
హడ్సన్ - 604 వి
హయశీల (స్త్రీ) - 669
హరిణప్లుత (ఆకాశికీచారి) - 331
హరిణప్లుత (వృత్తము) - 415
హరిణప్లుతము (కరణము) - 104
హరిణాశ్వ(మధ్యమగ్రామమూర్ఛన) - 768
హరిణి (వృత్తము) - 420 అ, చూ. వృషభ చేష్టితము
హర్షము (వ్య. భావము) - 237
హర్షాభినయము - 721
హస్తకరణములు - 315
హస్తకర్మలు - 308
హస్తభేదములు - 292, 322 వి
హస్తముల సంఖ్య - 292, 292 అ
హస్తరేచకము - 119
హస్తలక్షణదీపిక _ 823 వి
హస్తాభినయము - చూ. 9 వ అధ్యాయము
హస్తాభినయము : చిత్రాభినయము - 731 వి
హస్తాభినయ విధానము - 308- 11, 328 వి
హసితము (వర్ణాలంకారము) - 780, 783
హసితము (హాస్యభేదము) - 206
హస్తగుణము (వాదకుని) - 849 ⌈849
హస్తపాణిత్రయము (హస్తలక్షణము)-
హస్తప్రచారములు - 308-09, 308అ, 500
హస్తప్రహారభేదములు - 849
హస్తసంచారములు - 315
హస్తిశీల (స్త్రీ) - 668
హావము (స్త్రీల అంగజవికారము) - 657, 658 అ
హాసము (స్థాయిభావము) - 237-38
హాస్య (రసదృష్టి) - 272
హాస్యభేదములు - 205-06
హాస్యరసగతి - 351
హాస్యరసప్రకరణము - 204-06, 261-62 వి
హిక్క (విషవేగాభినయభేదము) - 254, 728
హుంకారము (వర్ణాలంకారము) - 780, 781
హృదయకర్మలు - 316
హృష్ట (స్థాయిభావదృష్టి) - 273
హృష్యక (మధ్యమగ్రామమూర్ఛన) - 768
హేతువు (లక్షణము) - 445 ⌈579
హేత్వప (వ) ధారణము (సంధ్యంతరము)-
హేల (స్త్రీల అంగజవికారము) - 658, 658 అ ⌈783
హ్రాదమానము (వర్ణాలంకారము) - 780,
హ్రీ లేదా ధీ (సంధ్యంతరము) - 578-79




తానీషా - శ్రీ పసల సూర్యచంద్రరావు
(అనురూపము)


శ్రీకృష్ణుడు - శ్రీ పిసపాటి నరసింహమూర్తి
(అనురూపము)


చిత్రాంగి - పద్మశ్రీ స్థానం నరసింహారావు
(రూపానురూపము)


దుర్యోధనుడు - డా. చాగంటి సన్యాసిరాజు
(అనురూపము)

భూమికాధారణభేదములు

చూ. పుటలు : 788 - 89



సావిత్రి - శ్రీ కడియాల రత్తయ్య
(రూపానురూపము)



దమయంతి - శ్రీ ముప్పిడి జగ్గరాజు
(రూపానురూపము)



ఉష - శ్రీ వేదాంతం సత్యనారాయణ
(రూపానురూపము)



'భయం'లో పిచ్చిది (వయస్సు 50 సం.)
కుమారి లక్ష్మి ( వయస్సు 15 సం.)
(విరూపము)

# సందేశములు: ఆశీస్సులు

**డా. ఎస్. గోవిందరాజులు నాయుడు**

ఉపాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయము.

మీ పుస్తకమును స్థాలీపులాకముగా చదివి ఆనందించితిని.

భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రమును సరళశైలిని సులభగ్రాహ్యముగా తెనిగించిన మీ కృషిని నే నెంతయును అభినందించుచున్నాను. శాస్త్రగ్రంథములుగాని, తదనువాదములుగాని తెనుగున లేని కొఱతను మీ పరిశ్రమ కొంతవరకు తీర్చినది. మీ యనువాదము ఆంధ్రలోకము యొక్క ఆదరణమునకు పాత్రమగునుగాక యని ఆశించుచున్నాను.

**శ్రీ రాజా బొప్పరాజు రామకృష్ణరాజు**

అధ్యక్షులు,
సంగీత నాటక అకాడెమీ, ఆంధ్రప్రదేశ్.

ఈ గ్రంథమును కొంతవరకు నేను చదివితిని. ఇది అపారపరిశోధనాఫలమనుట పైచూపుననే సువ్యక్తము. నాట్యముయొక్క పుట్టుపూర్వోత్తరములు, రూపురేఖలు - వీటిని ఆమూలాగ్రముగ పరిశోధించి రసికజనహృదయరంజకముగ రచింప శ్రీ అప్పారావుగారుచేసిన కృషి ఎంతయు ప్రశంసనీయము. ఈ అనువాదము సరళముగను, సుగ్రాహ్యముగను ద్రాక్షాపాకమున రచింపబడినది. ఇంతియే కాక కేవల అనువాదముతో తృప్తి చెందక, శ్లోకార్థము వ్రాయుటతోపాటు ప్రతి శ్లోకమందలి నిర్వచనార్హములగు పదముల విశేషార్థములను చక్కగా వివరించి, ప్రతి అధ్యాయము కడపటను ఆ అధ్యాయమందలి విశేషాంశములను వివరించుట ఈ రచనయందలి ప్రత్యేకత. భరతమహాముని ప్రోక్తమగు శాస్త్రమందలి విశేషములను వ్యక్తపరచుటతో తృప్తిచెందక ప్రపంచమందలి సనాతన అధునాతన నాట్య సంప్రదాయములతో సరిపోల్చి, ఈ వివిధసంప్రదాయములందలి విశేషములను వివరించుట ఈ శాస్త్రమునకు ఈ గ్రంథకర్త ఒసంగిన అమూల్యమును, మౌలికమును అగు కానుక. మరియు ఈ శాస్త్రమున పేర్కొనబడిన నాట్యమండప నిర్మాణ విషయమునను, హస్తవిన్యాస - కరణాదిభంగిములకును కూర్పబడిన చక్కని చిత్రములు ఈ రచనకు అలంకారములు. ఇట్టి చక్కని గ్రంథరచనకై నిర్విరామపంచవర్షకృషి ఏకదీక్షగా నిర్వహించిన శ్రీ అప్పారావుగారిని నేనెంతయు అభినందించుచున్నాను. వారి ఈ గ్రంథము సర్వజనాదరణీయమై అందునను కళాకారులయు, రసజ్ఞులయు ఆదరాభిమానములకు పాత్రమగునని నా ఆశయము. ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడెమివారు నిర్వర్తించగల విధులకు ఈ గ్రంథ ముపకరించుననియు నా అభిమతము.

**Dr. D. S. Reddy** — *Vice-Chancellor,* OSMANIA UNIVERSITY.

Sri P. S. R. Appa Rao, M. A., Research Scholar in Telugu of the Osmania University has to be congratulated for his successful translation into Telugu of the great Sanskrit work, the Natya Sastra of the sage Bharata. The emergence of Telugu Drama in the modern period owes not a little to the inspiration received from Sanskrit Drama on one side and to some extent to the Western Drama, chiefly, from England. It is, therefore, necessary for the student of Telugu Drama to know the underlying principles of the classical Sanskrit Drama as well as the canons of Western Drama. So far, books on dramaturgy have been very few in Telugu. I am informed that the Telugu translation of the Sanskrit work 'Dasarupaka' done by the veteran scholar, Pundit M. Suryanarayana Sastry was the only authoritative text on dramaturgy.

The Natya Sastra of Bharata though undoubtedly the foremost and oldest work on Dramaturgy in Sanskrit, has not been translated so far into Telugu and I am glad that Sri P. S. R. Appa Rao, during the course of his research work for the degree of Ph. D. in Telugu of the Osmania University on the subject "Evolution of Telugu Drama", felt a call to translate this well known work. I have glanced through some of the chapters and am happy to find that he has executed his task well. Besides rendering the text into easy Telugu prose, Sri Appa Rao has added copious explanatory notes in which he has compared and contrasted the Eastern and Western conceptions of Drama. It is a matter for appreciation that the Research Scholar could undertake and successfully finish a work of this nature besides doing his regular investigation on the thesis subject.

**Sri K. V. Gopalaswamy** — *Registrar,* ANDHRA UNIVERSITY.

I have received the proofs of your book, the Telugu translation of Bharata's Natya Sastra. You have undertaken a stupendous task. As far as I am aware there is no complete translation of Bharata's Natya Sastra in Telugu. This translation of yours would, therefore, be a great boon to the devotees of dramatic art.

I sincerely hope that the hard work you have put into this translation will be appreciated by the persons for whom it is intended.

Let me wish your work the success it deserves.

**శ్రీ పసల సూర్యచంద్రరావు** — ప్రధానకార్యదర్శి. ఆంధ్రనాటకకళాపరిషత్తు.

మిత్రులు శ్రీ శ్రీరామ అప్పారావుగారి భరతశాస్త్రానువాదము తెనుగుభాషాయోష కింకొక క్రొంగ్రొత్త మణిభూష.

నాట్యము అతిప్రాచీనమయినది; ప్రయోగాత్మకమయిన కళ. ఈ కళాసౌందర్యము సంప్రదాయసిద్ధముగ, శాస్త్రసంపదగా దినదినప్రవర్ధమానమైనది. పురుషార్థసాధనమగు ఈ నాట్యలక్ష్యమునకు భరతుని నాట్యవేదము లక్షణము. ఆర్షమైన, సర్వలక్షణ సమన్వితమైన, సర్వతోముఖమైన యీ నాట్యశాస్త్రమునకు భరతమునిని కర్తగా, భర్తగా స్వీకరించినారు ప్రాచీనులు. నాట్యము మానవుని శ్రేయస్సునకు, అభ్యుదయమునకు ఉపకరణము; కళామయుడగు పరాత్పరుని తేజః ప్రభావములను లలితముగ వ్యక్తపరచుటకు సుగమమార్గము. నాట్యాదికళలు మానవ మానస, మస్తిష్కచైతన్య సంపదను సుశిక్షితమొనర్చి, పారవంతమొనర్చుటకు సాధనములు. నాట్యము శాస్త్ర - కళ - మత - ఆధ్యాత్మిక సంపదల అవిరుద్ధమైన మిశ్రమము. సహేతుకమైన సత్యనిరూపణముగా, స్వతంత్రభావనతో భరతమునిచే సంస్కరింపబడిన యీ నాట్యశాస్త్రము సర్వజనీనమయిన భారతీయపరిజ్ఞానసంపద.

ఈ నాట్యశాస్త్రసంప్రదాయ మెంత ప్రాచీనమో కాని రామాయణ - భారత కర్తలు, వాత్స్యాయనుడు కూడ నాట్యసంపద నచ్చటచ్చట ప్రవచించినారు. మహాకవి కాళిదాసు తన కృతులలో భరతుని పేర్కొనుటయే గాక నాట్యవేదమును చాల మన్నించినాడు. ఈ శాస్త్రము కాలకాలాలలో క్రమవిలసితమగుచు, లావణ్యరూపము నలవరించుకొనుచు, ఉనికిని చేకూర్చుకొన్నది.

భరతుని నాట్యవేదమునకు అనేకవ్యాఖ్య లున్నట్లు చెప్పుచున్నారు. ఇందు ప్రసిద్ధ మయినది, చాలవరకు పూర్ణమైనది అభినవగుప్తుని అభినవభారతీవ్యాఖ్యానము. దీనిని శ్రీ మానవల్లి రామకృష్ణకవి సమగ్రముగ సంకలన పరచినారు. అనన్యసామాన్యమయిన దియు, చిరంతనమయినదియునయిన నాట్యవేదమును అభినవగుప్తాచార్యు నభినవభారతీ వ్యాఖ్యతో సమీకరించుప్రయత్నములో తాము చాల సతమతమైనట్లు మాన్యులు, బహుముఖప్రజ్ఞాన్వితులునగు శ్రీ మానవల్లి కవివతంసులు పేర్కొన్నారు. ఇట్టి యీ శాస్త్రానువాదప్రయత్నము చాల గురుతరమయిన భారము. ఇట్టి యనిర్వచనీయమైన బాధ్యతను సుగమమొనర్చుకొని, చిన్నిచిన్ని పదములతో, తీయనిపల్కులతో తమ యను వాదమును మన కందించిన శ్రీ శ్రీరామ అప్పారావుగారు తెలుగువారి బహుళమన్ననలకు పాత్రులు.

అధ్యేతలకు ఈ నాట్యశాస్త్ర మవశ్యబోద్ధవ్యమైనది. దీనిని సులభముగ తెనుగొనర్చి మన జాతి కెంతగానో మేలుచేసిన శ్రీ పోణంగివారి ప్రజ్ఞ సహస్రముఖముల కొనియాడ దగినది. సంపూర్ణశాస్త్రమును పొందుపరచుటయేగాక భరతకోశమను నిఘంటువును వ్రాసి, కళాత్మకప్రపంచమునకు శాశ్వతమగు మేలుచేసిన శ్రీ రామకృష్ణ కవిగారు, ఈమధ్యనే యీ నాట్యవేదమును తెనుగుజేసి మన కిచ్చి, సాహిత్యలోకపు రసజ్ఞుల మన్ననలనందుకొన్న

లాక్షణికశిరోమణి సాహిత్యవిద్యాభాషాప్రవీణులగు శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారు. ఈ శ్రీ శ్రీరామ అప్పారావుగారు మా తెనుగువారగుట భాగ్యము; మాకు గర్వకారణము.

అనవద్యమైన శ్రీ అప్పారావుగారి ధిషణాచైతన్యమునకు, ఉత్సాహమునకు భద్రమగుగాక! శుభమగుగాక!! పరమేశ్వరాశీస్సులు వీరిపయి యవిరళముగ వర్షించుగాక.

**డా. మర్రి చెన్నారెడ్డి**

అధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘము.

మిత్రులు, నాటక నాట్య సంస్థలలో సహచరులు అయిన శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు నాటక నాట్యములను గురించి గత రెండు సంవత్సరములుగా ఎంతయో పరిశ్రమచేసినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయములోనేకాక ఆంధ్రప్రదేశములో లభించు ముఖ్య నాటకగ్రంథములను పరిశీలించి, నటులను స్వయముగా కలిసికొని వివరములను సేకరించుటలో వారు చేసిన కృషి. చూపిన ఓర్పు అమోఘము.

మనోవాక్కాయకర్మల పాటుపడి, చరిత్రాత్మకమయిన ఆధారములన్నింటిని సేకరించి, సరళమైన ధోరణిలో చక్కటి విమర్శనలతో తీర్చి దిద్ది, చేతికందించిన గ్రంథము ఈ నాట్యశాస్త్రము.

ఇంత విపులముగా, ఇంత విస్పష్టముగా రచింపబడిన నాట్యశాస్త్రగ్రంథము మరొకటిలేదు. వివిధనాట్యమండపచిత్రములును పలువిధములైన నాట్యభంగిమల చిత్రములును ఈ గ్రంథమునకు అమూల్యత్వమును కలిగించుచున్నవనుట అతిశయోక్తి కాదు. కేవలము భరతుని నాట్యశాస్త్రమును యథాతథముగా తెనిగింపక దాని వ్యాఖ్యానమగు అభినవభారతిని, నాట్యశాస్త్రముపై పెక్కుమంది విద్వాంసులు ఆంగ్లమున రచించిన వ్యాసములను, వ్యాఖ్యలను, విమర్శలను లెస్సగా, నిశ్శేషముగా పరిశోధించి వానిని ఆయా స్థలములందు చేర్చుటవలనను, వీనితోపాటు పాశ్చాత్య, గ్రీకు నాట్య సిద్ధాంతములను గూడ సంగ్రహించుటవలనను ఇది కేవలనాట్యశాస్త్రమే గాక నాట్య సర్వస్వమనదగియున్నది (Encyclopaedia of Histrionics).

"అన్నీ ఒక యెత్తు, అగస్త్యుని కమండలం ఒక యెత్తు" అన్నట్లు శాస్త్రవిషయార్జనమొక యెత్తు, దానిని సుబోధముగా రచించుట ఒక యెత్తు. అనేకులు తమకు విషయము లెస్సగా తెలిసినను సముచితమగు భాషలో సుబోధముగా దానిని తెలుపజాలరు. కాని వీరి భాష పండువెన్నెలవలె సర్వవిషయములను అతిస్పష్టముగా గోచరింపజేయుచున్నది.

ఈ విధముగా ఈ గ్రంథము నాట్యసర్వస్వమనదగినంత విషయసమృద్ధిగలిగి సముచితమైన ముద్రణమును గలిగి సర్వాంగసుందరముగా శోభిల్లుచున్నది.

ఎంతయో పరిశ్రమచేసి యిట్టి యమూల్యగ్రంథమును రచించి, కళాదేవిని ఆరాధించిన ఈ గ్రంథకర్తకు ఆంధ్రదేశము ఎంతయు ఋణపడి యున్నది. ఇంకను వీరు ఇట్టి ఉద్గ్రంథములను వ్రాసి ఆంధ్రసరస్వతికి ఉపాయనముగా నర్పింతురుగాక!

**Sri T. N. Ramachandran** — *Special Officer,* NAGARJUNAKONDA EXCAVATIONS

Dear Dr. Srinivasachari,

I must congratulate you and your student Sri P. S. R. Appa Rao on the very excellent contribution that Mr. Appa Rao has made to the study of Natya Sastra. I perused with avidity and pleasure Mr. Appa Rao's publication 'Natya Sastra' (in Telugu). The publication reveals careful study of all the available texts on Bharata Natya, skill in the interpretation of the concerned texts and able guidance in the field.

The publication is doubly welcome in the present context of our world-existence, when, thanks to a remarkable wave of awakening and thinking, Bharata Natya has been sublimated to the extent that it has become a part of the Grihalakshmi of every Indian house-holder (Grihastha). I am happy that Mr. Appa Rao has avoided technical hurdles and has taken care to attend to the interpretation side of the task in simple style and in the language of the country. In this lies, I should say, the attraction for the work. I have no doubt that the book will find an important place for reference in all libraries and institutions devoted to Bharata Natya.

The publishers and the sponsors of this magnum opus deserve the grateful thanks of the Vidagdha-world.

**Sri C. Sivaramamurthy** — *Keeper, National Museum of* ARCHAELOGY, NEW DELHI.

The greatest of aesthetic seers in India, Kalidasa, has described Natya as the noblest and sweetest of sacrifices for the gods, and as the only one which in its manifold aspect appeals to a world so diverse in taste. The Glory of Natya Sastra is such that it has been given almost the status of a Veda. The daily ritual in the temple included till very recently the offering of Natya and it was as important as Gita and Vaditra and the Chanting of the Vedas Tiruvoymozhi and Devaram. The simple and sacred atmosphere in which this was presented in the village temple every day enabled the folk in the village including the juvenile denizens to thoroughly grasp the significance of this expressive language of swaying form and changing symbols and moods and an appreciative audience was created all over the land to foster this great art.

To-day for the proper comprehension of this great art the need of an exposition of the text of Bharata in the language of the people in every region

is indeed most urgent; and in this flush of enthusiasm for all our past glory and the desire for fostering arts born of a re-awakening of our soul in recent years soon after our independence it is to be expected that this would be manifest everywhere in creative activity. It is indeed gratifying that Bharata's Natya Sastra has been presented in Telugu, thanks to the devoted labours of Sri P.S.R. Appa Rao. He has laid the Telugu knowing population of India under deep debt of gratitude for providing them with such a simple, clear and comprehensive exposition of Bharata's text. He has taken great pains to study and interpret the viewpoints of other writers in the field and has added copious notes at the end of the translation to each chapter in addition to careful discussions in the footnotes at every stage. To enable easy comprehension of the Karanas and Hastas he has given sketches specially prepared for the purpose, and when we remember how important this visual presentation of the text was considered several centuries ago when the whole series was carved in a number of panels with inscribed labels describing each figure on the gopuras at Chidambaram leading to the temple of the Lord of Dance, Nataraja, we may feel happy on this account. This large volume prepared with a great purpose and with devotion to a great art to bring it nearer those who should form an appreciative audience for this "sweet sacrifice of the gods" is a great tribute to the industry and scholarship of the author. Sri Appa Rao is to be congratulated on the production of this important book on Bharata's Natya Sastra in Telugu.

శ్రీ కాళోజీ నారాయణరావు — హైదరాబాదు

భరతముని నాట్యశాస్త్రానికి తెలుగురూపం చేకూర్చినారు శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు. మూలంలోని శ్లోకాలకు కేవలం అర్థంరాయడమే కాకుండా సందర్భాను సారంగా విషయాన్ని తేటతెల్లంచేసే టిప్పణి యీ తెలుగురూపానికి మెరుగులు పెట్టింది. సంస్కృతముతో పరిచయం లేని తెలుగువారికి యీ పుస్తకం వరప్రసాదం. తెలుగు నాటకరంగముతో రచయితగానో, లేక నటకుడుగానో సంబంధం ఉన్న ప్రతివ్యక్తి తప్పని సరిగా చదవవలసిన పుస్తకం ఇది. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు ఈ పుస్తకాన్ని తెలుగులోకానికి అందించడానికి ఎంత కష్టపడ్డారో చెప్పుటకు మాటలు చాలవు. వారి కృషి పుస్తకరూపం దాల్చుటకు తోడ్పడిన వారందరు వందనీయులు. కష్టించి చేసిన రచన పుస్తకరూపం దాల్చి బైటపడుట రచయిత అదృష్టం.

ఇన్నీజరిగి, 'తెలుగుపాఠకులు దీనిని చదవకుంటే తెలుగువారి దురదృష్టం.

శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి — అసిస్టెంటు డైరెక్టర్, సమాచారశాఖ, ఆంధ్రప్రదేశ్.

హృద్యో నాట్యాగమోఽయం వివిధరసభరో భావవిస్తారరమ్యః
నృత్యం నృత్తం చ భావాభినయలయహితం తాలభంగీవిశేషమ్
సమ్యక్సంబోధయంశ్చ శ్రుతివిహితవచాః నైకలోకైకసేవ్యః
విద్వత్సంస్తుత్యధర్మా శివవిధిభరతైస్సాధితస్సార్వవర్ణః॥

భారత్యారసనావిలాసవిభవః నానాసహస్రాబ్దగః
పూతాం భారతసంస్కృతిం వికసయన్ యో రాజతే భానువత్
సోఽయం దృక్శ్రవణప్రసాదనవిభుః స్త్రీపుంసహృద్యాగమః
నాట్యాత్మా విభుతాం భువి ప్రకటయన్ విద్యోతతాం సర్వదా॥

అంతర్ధ్యానప్రవృత్తో భరతముని రతీతం చ భావిప్రదృశ్యం
వృత్తం సందృశ్య చక్రే జగదుదయకృపాబద్ధచిత్తో మహాత్మా
వేదం నాట్యప్రపంచం విపులరసచయాన్వితభావప్రపంచః
తస్మై యోగాత్మనేఽయం చలదచలగణో హ్యోధమర్ఘ్యం విధత్తే॥

సర్వస్మిన్ జగతీతలే స్థిరయశాః నాట్యాగమాంభోనిధా
ఆపాతాళనిమగ్నమందరనగః శ్రీమానవల్ల్యన్వయే
క్షీరాబ్ధావమృతాంశు దూర్జితవచాః శ్రీరామకృష్ణప్రధీః
నాట్యం వేద మదీధరత్ కరుణయా లోకప్రియంభావుకః॥

తత్త్వాదృజ్మహిమానమద్య సుకవిర్ధీమాన్ బుధగ్రామణీః
అప్పారాయసుధీః కరామలకవత్కృత్వాఽఽంధ్రభాషామయం
విద్వత్పామరలోకతోషమతనోదాంధ్రావనౌ శాశ్వతం
పూర్వేభ్యోఽపి కవిభ్య ఏష పృథులం స్థానం సమాపద్యత॥

ఆంధ్రాంగ్లామరసాహితీషు నిపుణః నాట్యాగమే కోవిదః
నిష్ణాతో రచనాఽధ్వని ప్రథితధీః భావప్రపంచే రసే
అప్పారాయసుధీమణిః భరత ఏవాఽంధ్రీయ ఇత్యారవి
ప్రఖ్యాతిం భజతాదముష్యకృతిరప్యాంధ్రశ్చనాట్యాగమః॥

ఆంధ్రపితామహ, పద్మవిభూషణ
**శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు** — సభాపతి, ఆంధ్రప్రదేశ్ విధానమండలి.

తమరు నాకిచ్చిన నాట్యశాస్త్రము అను గ్రంథమునుచూచి చాల సంతోషించితిని. విశ్వవిఖ్యాతమగు భరతమునిప్రణీతనాట్యశాస్త్రమును తెనుగు భాషలోనికి అనువదించిన తమ యుద్యమము ఉదాత్తమైనది. ఇట్టి ప్రయత్నమును జయప్రదముగా చేసిన వారిలో మీరే మొట్ట మొదటివారని భావించుచున్నాను. పుస్తకమును ఆమూలాగ్రముగా చదువు తీరిక నాకు కలుగలేదు. ఐనను చూచినంతవరకు తమరుచేసినది అసాధారణమగు మహోద్యమ మని తోచినది. తమ పుస్తకము ఆంధ్రవాఙ్మయమునకు నిరుపమానమగు అలంకారముగా ప్రసిద్ధిగాంచునని నమ్ముచు తమకు నా హార్దికమగు అభినందనను అందజేయుచున్నాను.

**పండిత శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు** — జయపుర సంస్థానాస్థానకవి

జీవననాటకంబునకు జీవము పోసెడు దృశ్యకావ్యపుం
ద్రోవలు రంగమున్ రసముతోయము నృత్తము నాట్యవృత్తముల్
భావము వృత్తి భూషణము భాషయు తాండవ జాతి తాళముల్
నీ వివరంబుతో సరళరీతిని దెల్పితి వప్పరాయ! యా
జీవుని లీల; నీకళకుఁ జేతుల నెత్తి తెలుంగుజాతి సం
భావనచేయు హారతులు పట్టి తనంతట వాడవాడలన్
పావనగౌతమీవిబుధపాండితికీ వొక జీవగఱ్ఱవై
యీ వరనాట్యశాస్త్రము రచించితి నించితి కీర్తి దిక్కులన్.

**విద్యారత్న, ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు** — సంపాదకులు, సంస్కృత అకాడెమీ, ఉస్మానియావిశ్వవిద్యాలయము.

శ్రీ భరతాచార్యుల 'నాట్యశాస్త్రము' అను నాట్యవేదము విశ్వవిఖ్యాతము. పాశ్చాత్యసంస్కృతపండితుల ధర్మమా యని క్రీ. శ. 1860, 1880, 1884, 1888 సంవత్సరములయం దీ గ్రంథరాజమునందలి 36 అధ్యాయములందును మొత్తము 10 అధ్యాయములు మాత్రము ముద్రణము నందినవి. ఇదంప్రథమముగా (క్రీ. 1894) నాట్యశాస్త్రమును సమగ్రముగాఁ బ్రచురించిన పుణ్యమూర్తులు బొంబాయి నిర్ణయ సాగర ముద్రణాలయాధినేతలు. దీనికి ద్వితీయావృత్తి క్రీ. 1943 న వెలువడెను. క్రీ. శ. 1898 వ వత్సరమున గ్రోస్సెట్ పండితుడు (J. Crosset) ఇందలి మొదటి 14 అధ్యాయములకును సువిమృష్టసంస్కరణమును (First Critical Edition) సిద్ధపఱచి సూర్యాలోకమునందించెను.

శాస్త్రవైదుష్యపరమావధి యనఁదగు ప్రాతఃస్మరణీయుఁడు అభినవగుప్త పాదాచార్యులు నిర్మించిన 'అభినవభారతీ' వ్యాఖ్యతో నీ గ్రంథమును మథన మొనరించి సంస్కరించిన సుగృహీతనామధేయులు (ప్రకృతము స్వర్గతులగు) శ్రీ మానవల్లి రామకృష్ణ కవివర్యులు. భారతీయవిద్యాప్రౌఢసరస్వతులగు వీరి సంస్కరణము 'గైక్వాడ్ - ఓరియంటల్ సీరిస్'లోఁ బ్రచురింపఁబడుచుఁ బ్రపంచ ప్రఖ్యాతినందినది. నాల్గు సంపుటముల యీ ప్రచురణమున మొదటి మూఁడు సంపుటములును (1-27 అధ్యాయములు) క్రీ. 1926, 1934, 1954 వత్సరములయందుఁ బ్రకటింపఁబడినవి. ప్రథమసంపుటద్వితీయ ముద్రణము 1956 లో ప్రకటింపఁబడెను. నాల్గవ సంపుటము ప్రకటితము కాకుండనే శ్రీ రామకృష్ణ కవిగారు దివంగతులగుట మన యభాగ్యము. శ్రీ కవిగారు సువిపుల సమాలోచనమును రచించి నాల్గవసంపుటమునకుఁ జేర్చు భాగ్య మిపు డంతరించినది. (శ్రీ కవిగారు 20-8-1875 తేదీన జన్మించి, 21-9-1957 తేదీన తిరుపతిలో స్వర్గస్థులైరి). సంస్కృతసాహిత్యశాస్త్రరంగమున బృహద్గ్రంథరాజములు రెండు : ౧. భోజుని శృంగార ప్రకాశము. ౨. భరతాచార్యుల నాట్యశాస్త్రము. నాట్యశాస్త్రమున అధ్యాయములు 36, దీని ననుసరించియే కావలయు, భోజుడు తన గ్రంథమును గూడ 36 ప్రకాశములలో రచించెను. నాట్యశాస్త్రమున శ్లోకములు 6 వే లుండుటచే దీనికి 'షట్సాహస్రి' యని పేరు వచ్చెను. శృంగారప్రకాశమున నించుమించుగా శ్లోకపరిమితి 36 వేలు. ఈ రెండు మహాశాస్త్రగ్రంథములతోడ శ్రీ కవిగారి కత్యంత సన్నిహితసంబంధము గలదు. శృంగారప్రకాశము పూర్తిగా నుత్సన్నము కాకుండ నించుమించు 33 ప్రకాశములను తాళీదళసంపుటగ్రంథారణ్యములనుండి బయటికిఁ దెచ్చిన కీర్తియు, 'అభినవభారతి' తో నాట్యశాస్త్రమును కూలంకషగవేషణమొనర్చి పరిష్కరించిన యశస్సును శ్రీ కవిగారికే దక్కినవి. నాట్యశాస్త్రమును మొట్టమొదట సమగ్రముగా 'అభినవభారతి' తోఁ గూడ నాంధ్రీకరించి, అనుబంధానుక్రమణికాది సర్వాలంకారశోభితముగాఁ బ్రకటించిన కీర్తి శ్రీ కవిగారి శిష్యనిర్విశేషులగు శ్రీ శ్రీరామ అప్పారావుగారికి దక్కినది. బహుముఖవైదుషీభూషితులగు మహావిద్వాంసు లెవ్వరును దీని నాంధ్రీకరింపఁ బూనుకొనలేదు. పల్లవగ్రాహిపాండిత్యము గలవారి కిది సాధ్యముగాదు. అందువల్ల మధ్యమకత్యకుఁ జెందిన శ్రీ అప్పారావుగారే దీనికి నడుముకట్టవలసివచ్చినది. శక్తివంచనలేక వీరు కఠోరపరిశ్రమ మొనర్చి, నాట్యశాస్త్రమునకు సంబంధించిన పరకృతగ్రంథములను, వ్యాసములను వివిధ భాషాత్మకములను బరిశీలించి, వీరీగ్రంథమునను వదించి, ఆంధ్రశారదకు విశిష్ట సేవ యొనర్చిరి.

ఫ్రెంచీ, ఇంగ్లీషు, జర్మన్, హిందీ, బెంగాలీ, ఆంధ్రభాషలలో నాట్యశాస్త్రమునందలి కొన్నికొన్ని అధ్యాయములకు మాత్రము పరివర్తనములు వెలసినవి. దీనినిబట్టి, ప్రపంచము నందలి యే భాషలోనికిని సమగ్రముగా ననువదింపఁబడని యీ గ్రంథమునకు సమగ్రానువాదము నొనర్చి, ప్రకటించిన ఖ్యాతి శ్రీ అప్పారావుగారికే లభించినది.

అనుక్రమణికాద్యనుబంధషట్కసంపన్నమగు నీ కృతి భరతమహర్షి గ్రంథమున నవగాహించువారి కెంతయో తోడ్పడును.

నాల్గవ యనుబంధము (897 పు.) ఉద్ధృతశ్లోకప్రతీకానుక్రమణిక అకారాది క్రమమున నుండిన నెంతయో యుపయుక్తముగా నుండెడిది.

ఈ మహాగ్రంథము నింకను సర్వాంగాలంకృతముగాఁ జేసి, ద్వితీయావృత్తిని బ్రకాశింపఁజేయునట్లు పరాత్పరుఁ డీ యాంధ్రభరతాచార్యులకుఁ బూర్ణపురుషాయుషమును, భోగభాగ్యోత్సాహములను బ్రసాదించుఁగాక యని మంగళాశాసనము.

## శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

ఆంధ్ర వాఙ్మయశాఖ,
ఆంధ్రవిశ్వవిద్యాలయము.

ఉపవేదములలో గాంధర్వవేద మొకటిగాఁ బరిగణింపఁబడును. దీనికి సంబంధించిన గానవిజ్ఞానము సామవేదముతోనే యావిర్భవించి యుండుననియు, భరతదేశమందలి గానవిద్యకంతకును సామవేదమే మూలమయి యుండుననియుఁ బరిశీలకులు భావింతురు.

అతిపురాతనములగు కొన్ని వైదికగ్రంథములందును, లౌకికరచనములందును గాంధర్వవేదము, నాట్యవేదము–అను శబ్దములు గానవచ్చును.

పాణినీయమగు-అష్టాధ్యాయిలో 'శైలాలిన' (శిలాలిప్రోక్తనటసూత్రముల నధ్యయనము చేయువారు), 'కృశాశ్విన' (కృశాశ్వప్రోక్తనటసూత్రముల నధ్యయనముచేయువారు) అనుశబ్దములు ప్రదర్శితములయి యుండుటచేఁబాణినికిఁ బూర్వమే నాట్యశాస్త్రము సూత్రరూపమునఁ బ్రణీతమై ప్రచారము నందినటులూహింపవచ్చును.

ప్రాచీనగురుపరంపరాప్రాప్తమగు నాట్యసంప్రదాయమే తరువాతివారికి నాట్యవేదమయినదనియు, దాని నాధారముగఁగొని వృద్ధభరతుఁడు తొలుత 12 వేల గ్రంథములో నొక నాట్యశాస్త్రము రచించెననియుఁబిమ్మట భరతముని యద్దానిని 6 వేల గ్రంథముగా సంగ్రహించెననియు చారిత్రికులు కొందఱు తలంతురు. వీరి యూహలకు శారదాతనయుఁడు రచించిన భావప్రకాశములోని శ్లోకములాధారములు (పుట. 287.)

ఈ నాట్యశాస్త్రము ప్రధానముగా రూపకప్రదర్శనముకే యుద్దేశింపఁబడినను శ్రవ్యసాహిత్యమునకుఁ గూడ మిక్కిలి యుపకారకమయినది. కాలక్రమమున వెలువడిన సాహిత్యలక్షణగ్రంథములన్నిటికిని భరతుని నాట్యశాస్త్రమే మూలగ్రంథము.

అతిప్రాచీనమయి, సర్వతోముఖసాహితీవిషయసంభరితమయిన యీ నాట్యశాస్త్రము నేఁడు తెనుఁగు భాషలో నవతరించుట ముదావహము. దీనికి, చిరంజీవి అప్పారావు ప్రవర్తకుఁడగుట మఱింత సంతోషదాయకము.

ఈతఁడు చిరకాలము పరిశ్రమించి, నాట్యశాస్త్రసంబద్ధములగు నితరరచనములఁ బరిశీలించి, వానిలో పలయు నంశములనిందుఁ బొందుపఱిచి, యధ్యాయాంతములందు వివిధదేశీయులయు, వివిధగ్రంథకర్తలయు సంప్రదాయములను నభిప్రాయములను వివరించి, తేటతెల్లమగు శైలిలో ననువాదము సాగించినాఁడు.

ఈ పరివర్తనము ఆంధ్రసారస్వతలోకమునకు మిక్కిలి యుపకారమయి వెలయఁగలదని ఆశంసింతును.

ఈతని శాస్త్రపరిశ్రమాసక్తిని మనసార అభినందింతును. పెద్దల మెప్పులాకర్ణించి, విద్యాసంబంధమున, ఆత్మీయుఁడగుటచే అంతరంగమున ఆనందింతును.

ఇట్టి రచనాసక్తి స్థిరమయి మఱికొన్ని గ్రంథములు వెలయింప ఆశాసింతును.

సహృదయతాసంపన్నమగు సారస్వతలోక మీతనికిఁ దగిన ప్రోత్సాహ మొదవింపఁగలదని ఆశింతును.

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

చిరంజీవి పోణంగి శ్రీరామఅప్పారావు వ్రాసిన భరతశాస్త్రములోఁ గొన్ని కొన్ని ఘట్టాలు ఆయన వినిపింపగా విన్నాను. శ్రమపడి యీ పని యింత నిర్విఘ్నముగా కొన సాగించిన అప్పారావు పాండిత్యము, శ్రమ, పట్టుదల, దైవానుగ్రహము అన్నియు ప్రశస్తములుగా నున్నవి. ఈయనకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములు పరమేశ్వరుఁడు ప్రసాదించుగాత మని ఆశీస్సులు.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతం

ఆశీర్వచనములు. నీ నాట్యశాస్త్రానువాదము, అచ్చుపడినంతవరకు చదివి చూచితిని. అనువాదము మూలవిధేయముగా, నిర్దుష్టముగా ఉన్నది. నీవిచ్చిన వివరణము, నీ వీశాస్త్రములో చేసిన పరిశ్రమను వేనోళ్ళ చాటుచున్నది.

## ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజి

ఆంధ్రవాఙ్మయశాఖాధ్యక్షులు,
ఆంధ్రవిశ్వవిద్యాలయము.

చిరంజీవి పోణంగి శ్రీరామ అప్పారావు ఆంధ్రభారతిని పూజించుటకయి తన జీవితము నుపయోగించుటకు సంకల్పించిన యువకశ్రేష్ఠులలో నొకడు. ఆంధ్ర విశ్వకలాపరిషత్తున పరిపుష్టినొంది, స్వకీయవివరణశక్తిచే వికసింపజేసికొన్న కృతికుసుమములచే నాంధ్రభారతి నర్చించి, యా మోదమును నలుగడల వెలయింపజేయ నిరంతరము ప్రయత్నించు తెలుగు చదువుల మొలకలలో నీతడు ఎన్నికగన్నవాడు. ఆంధ్రభాషావాఙ్మయములకు సంబంధించిన వివిధవిభాగములలో నొక్కొక్కదానిని పరిశోధించి తమ ఫలితములను తెలుగునాట వెలయింప నీతని సతీర్థ్యులెందరో ప్రయత్నించుచున్నారు. తెలుగు ధాతువులు, తద్భవములు, ప్రాచీనాంధ్రభాష, యక్షగానములు, నవలలు, క్షేత్రమాహాత్మ్యములు, జానపదవాఙ్మయము, ఆంధ్రవాఙ్మయముపై పాశ్చాత్యవాఙ్మయప్రభావము మొదలయిన యనేక విషయములపై పరిశోధన జరిగినది.

చిరంజీవి అప్పారావు పరిశ్రమకు తెనుగునాటకములు అనునది విషయము. తెనుగునందు నాటకముల ఉత్పత్తి, అనుసరణము, పరిణామము మొదలయిన వాని విచారణ, సమన్వయము అనునవి ఈతనికి విచారణీయములు. ఇది కేవలము స్వతంత్రము; ఆంధ్రవాఙ్మయమాత్రసంబంధి పూర్ణము కానున్నది.

ఆంధ్రమున పరిశోధనము రెండు విధములు. ఆంధ్రభాషా వాఙ్మయములకు సంబంధించిన సమస్యలను దెలిపి వివరణముతో, పౌర్వాపర్యక్రమమున పరిశీలించుట యొకటి. ఇది కేవలము ప్రాదేశికము మాత్రము. ఇఁక రెండవది, అన్యభాషాసిద్ధమయిన విమర్శనాదికమును, విజ్ఞానమును తెనుఁగునకుఁ దెచ్చుట. ఈ మార్గము ప్రాచీనులనేకు లనుసరించినదే. నన్నయనాటినుండియు కావ్యవనములను, శాస్త్రసౌధములను కవిపండితులు నిర్మించి, సంస్కృతాద్యనేక భాషల యాధారమున తెనుఁగును సేవించుచున్నారు. చిరంజీవి అప్పారావు ఆంధ్రనాటకచరిత్ర మొదటిరకపుపరిశ్రమ. నాట్యశాస్త్రము తెనిగింపు తెనుగున కింపునింపులు గూర్చు రెండవదారి.

తెనుగున సాహిత్యదర్పణ, ప్రతాపరుద్రీయ, ధ్వన్యాలోక, దశరూపకాదులను ఇతరశాస్త్రగ్రంథములగు వేదాంత, మీమాంసా. తర్క, వ్యాకరణములకుఁ జెందిన వానినేకులు పండితులు తెనిఁగించిరి. కొన్ని విషయకాఠిన్యమున నైననేమి, అనువాదసరణిచేతనేమి మూలము సాయములేక కొఱకఁబడవు. మూలమెఱింగినవారికి వీనిమీది యాదరము దూరాపాస్తము.

ఇఁక నీ నాట్యశాస్త్రము మిక్కిలి ప్రాచీనగ్రంథము; 36 ప్రకరణములు గలది, సుమారై దారువేల శ్లోకములు; అనేకవిషయసంభరితము. నాట్య, నృత్త, రస, భావ, రూపక, దేశీ, మార్గాది భేదము లనేకము లిందు వివరింపబడినవి. ఇది క్రీస్తుశకమునకు పూర్వమే భరతముని కర్తృకమయి నాట్యవేదమని ప్రసిద్ధికెక్కినది. తెనుఁగు నాటకముల పరిశోధనకు గడంగిన చిరంజీవి నాట్యశాస్త్రమును దడవి, యందు పరిశ్రమించి. తన పరిశ్రమ నీ రీతిని వెలువరించుట మిక్కిలి ప్రశంసార్హము.

ఇందలి శ్రమ బహుముఖము. నాట్యశాస్త్రపు ప్రతులు బహువిధములు. భిన్నపాఠములు కలవు. దాని యర్థము అభినవగుప్తులు అభినవభారతి యను పేర పదవశతాబ్దమున వ్యాఖ్యానమొనర్చిరి. అనాటికే యభిప్రాయభేదములు, భిన్నమతములు బయలుదేరినవి. ఆ తరువాత నేటి విమర్శకులనేకులు ఆంగ్లాదిభాషలలో విరివిగా నందలి యమ్యై విషయములను వివరించి విమర్శించిరి. ఈ విమర్శనలనన్నిటిని సంగ్రహించి యేకవాక్యత గల్పించి తెనుఁగున తెలుగువారికి చక్కగా తెలియగలిగినట్లు వ్రాయుట మిక్కలి పొగడదగినది. విషయస్పష్టత, సరళమయి సుబోధమయిన భాష, సప్రమాణమయిన నిర్వచనము. పూర్వగ్రంథముల పేళ్లనన్నిటిని చదువరులకు దెలిపి వానివలన నింకను జ్ఞానాతిశయమును సంపాదించుకొనుట కవకాశము గూర్చుట మొదలయినవి యిందలి ముఖ్యలక్షణములు. మూలగ్రంథము నంతటిని గూడ ముద్రించి గ్రంథమును తెలుగువారు మూలబడవేయునట్లు చేయక విషయప్రధానముగా వివరించుట పాఠకులకుపకారము.

ఈతని పరిశ్రమను ప్రభుత్వమువారు గుర్తించి ఆర్థికసాహాయ్యముఁ జేయుట పొగడఁదగినది.

ఈతడింక ననేకవిధముల ఆంధ్రభారతి నర్చించుగాకయని యాశీర్వదించుచున్నాను.

**శ్రీ నార్ల వేంకటేశ్వరరావు** — సంపాదకులు, ఆంధ్రప్రభ.

ఇది సరళమైన అనువాదం మాత్రమే కాదు,
సర్వాంగసుందరమైన అనువాదం;
శ్రీఅప్పారావుగారి బహుముఖప్రతిభను, పాండితిని
అడుగడుగున ప్రతిబింబిస్తున్న అనువాదం.

**ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనం** — ఆంధ్ర వాఙ్మయభాషాశాఖాధ్యక్షులు, ఉస్మానియావిశ్వవిద్యాలయము.

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు తెనుఁగుచేసిన భరతనాట్యశాస్త్రమునందలి ముఖ్యభాగములను చదివిచూచి మిక్కలి యానందించితిని. శ్రీ అప్పారావుగారు ఆంధ్రనాటకవికాసమునుగూర్చి ఉస్మానియావిశ్వవిద్యాలయమునందు Ph. D. కొఱకు పరిశోధనకృషి చేయుచున్నారు. ఈ సందర్భమును పురస్కరించుకొని వీరు భరత నాట్యశాస్త్రమును సాకల్యముగ చదువుటయు, దానిని అనువదించుటకు దొరకొనుటయు జరిగి ఆంధ్రభాషకు చక్కని ఉద్గ్రంథము నందజేయగల్గిరి. ఆధునికయుగారంభమునుండియు తెలుగుదేశమున నాట్యకళకును, రంగస్థలమునకును అపూర్వమైన ఆదరవికాసములు కలిగినవి. ఆంధ్రసాహిత్యపు పూర్వయుగములలో నాటకరచనము మృగ్యప్రాయమైన వెలితిని తీర్చుటకోయన వర్తమానయుగమునందు నాటకరచనము కొల్లలుగా సాగినది. నాటకరంగము నగరనగరమునను మొలకెత్తి ఉదయాస్తమయములకు లోనైనవిషయమును శ్రీ అప్పారావుగారి పరిశోధనవ్యాసము నిరూపింపగలదు.

ఈ బహుముఖమైన నాటకకళావిర్భావమునకు ఒకవంక సంస్కృతనాటకములు, మరియొకవంక పాశ్చాత్యనాటకపరిచితియు కారణమును, ఉద్బోధకమును అయినవనుట సర్వజనవిదితము. భారతీయులయు, పాశ్చాత్యులయు నాటకసంప్రదాయములను శాస్త్రీయరీతిని లోకులకు తెలియజేయు లక్షణగ్రంథము లాంధ్రమునందు సకృత్తుగమాత్రమే వెలసినవి. బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రదశరూపకము, శ్రీ పురాణం సూరిశాస్త్రిగారి "నాట్యాంబుజము," "నాట్యోత్పలము," శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారి "ఆంధ్రనటప్రకాశిక" మున్నగు గ్రంథములుమాత్రమే మనకు ఇంతవరకుండిన నాటకలక్షణసామగ్రి. గంగాజలమును పుడిసెడు మాత్రమే మనము పట్టగలిగితిమి.

ఇట్లుండ శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు భరత నాట్యశాస్త్రమునందలి సారభూతమైన విషయమును 'నాట్య వేదము' అనుపేర వెలయించి భాషకు గొప్ప మేలు చేసిన వారైరి. అభినవగుప్తాచార్యుడు నాట్యశాస్త్రముపై రచించిన అభినవభారతీనామక వ్యాఖ్యానమును శ్రీ శర్మగారు తమ నాట్యవేదమునకు పీఠముగాచేసికొని చర్చ సాగించిరి. భరతముని యభిప్రాయములును, అభినవగుప్తుని వ్యాఖ్యయు, శ్రీ శర్మగారి వివృతియు జడయల్లుకొనిపోయి 'నాట్య వేదము' విద్వదమృతముగా పరిణమించినది.

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు మరియొక విధముగ రచన సాగించి, పండిత పామరు లందరకును భరతనాట్యశాస్త్రమును చేతిలోని అరటిపండువలె చేసి పెట్టిరని

వ్రాయుటకు నాకెంతయో సంతోషమగుచున్నది. భరతముని యేమి చెప్పదలచుకొనినాడో వినినమీదట గదా ఇతరు లాతని భావముల నెట్లన్వయించిరో తెలిసికొనగోరుట. ఒక్కొక్కప్పుడు, అథవా, పెక్కుస్థలములందు అభినవగుప్తుని వ్యాఖ్యానసాహాయ్యము లేకుండ భరతమునీంద్రుని భావము పాఠకులకు తెలియబడకయే పోవచ్చును. అయినను మున్ముందు మనము భరతుని హృదయమును తెలిసికొని, దానిపై యితరుల విద్వదాలోకమును పరీక్షింపగోరుదము. భరతమునిహృదయమును ఉన్నదున్నట్లు మనకు తెలియజేయ కృషిచేసి, ప్రశంసనీయమైన కృతకృత్యతను సాధించుకొన్న శ్రీ అప్పారావుగారు అదృష్టశాలులని నేను భావించుచున్నాను. వీరు ఆంగ్లవిద్యాధికులగుటచే పాశ్చాత్య నాటకలక్షణకర్తలగు 'అరిస్టాటిలు' మున్నగు మహనీయుల సిద్ధాంతములనుగూడ విశేషాంశముల రూపమున ఆంధ్రుల కందించి తమ గ్రంథప్రాశస్త్యమును ద్విగుణీకరింపజేసినారు. అప్పారావుగారి శైలి సెలయేటి నడకగలది. దాని హృదయపు లోతులు అద్దమువలె మన కంటికి ప్రసన్నములు. ఒక వంక పరిశోధనపట్టమునకై కృషి సాగించుచు, దానికి ఉపష్టంభకముగ నాట్యశాస్త్రమువంటి గొప్ప గ్రంథమును సర్వజనామోదముగ తెనిగించిన శ్రీ శ్రీరామ అప్పారావుగారికి నా హృదయపూర్వకాభినందనములను, ఆశీస్సులను తెలుపుచున్నాను.

తెలుగునందు నాటకలక్షణగ్రంథనిర్మితి విషయమై చేయవలసిన దెంతయో కలదు. అధిరోహింపవలసినది హిమాలయము. అధిరోహించినది ప్రత్యంతపర్వతము మాత్రము. నాటకప్రపంచమున తమ కేర్పడిన సముచితప్రవేశమును స్థిరీకరించుకొని శ్రీ పోణంగి వారిట్లే ఎన్నియో ప్రాచ్య, ప్రాశ్చాత్యనాటకసంప్రదాయకములైన గ్రంథములను ఆంధ్రమున కవతరింపజేయుదురని విశ్వసించుచున్నాను.

శ్రీ రాజా రంగయ్యప్పారావు

అధ్యక్షులు,
ఆంధ్రనాటక కళాపరిషత్

నా చిరకాలమిత్రులు శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు నాట్యశాస్త్రమును తెనిగించుట నాకు అత్యంతముదావహమగు విషయము. నాట్యశాస్త్రమును తెనిగించుటకు కేవల ముభయభాషావైదుష్యమేగాక నాట్య కళాభిరుచియు, తదభినివేశమును ముఖ్యముగానుండవలయును. శ్రీ అప్పారావుగారు ఆంధ్రనాటకరంగ చరిత్రాంశములను గూర్చి విశేషపరిశ్రమచేయుచు పరిశోధన సాగించుచుండిన పండితులు గాన ఏతదనువాద కార్యమునకు వారు సర్వథా సమర్థులని నా యభిప్రాయము. ఇటీవల కొన్ని నాట్యశాస్త్రానువాదములు వెలువడుచున్నవి. కాని, శ్రీ అప్పారావుగారి యనువాదము వానికంటె సర్వసుబోధముగానుండి నాట్యకళా పిపాసువుల కెల్లరకు అత్యంతోపకారకముగ నున్నదని తెల్పుటకు మిక్కిలి సంతసించుచున్నాను.

శ్రీ అప్పారావుగారిట్లే కళాసాహిత్య రంగముల కృషిచేయుచు అమూల్యములగు గ్రంథములను వెలయించుచుందురని ఆశించుచున్నాను.

శ్రీమానాప్రగడ శేషశాయి

మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాల విజయనగరము

నీ వొకనాడు విజ్ఞ గణనీయ కృతిం బొనరింతువన్న సం
భావన నాకు నా చదువు ప్రాయమునం బొడసూపె, రూఢియై
తా విలసిల్లె నేటికిది తాల్చును పో శివు డర్ధచంద్ర భూ
షా విభవాధికంబయిన సత్కృతిగా తలపై గురూత్తమా !

నీ కృతి పారిజాత కమనీయలతాంతము, అహార్య కన్యకా
శ్రీ కుచకుంకుమాంక పరిచిహ్నిత కైవవిలాసము, అబ్ధి క
న్యాకృత మందహాస సుషమాంచిత తేజము, శారదా వధూ
స్వీకృత రమ్యహాస పరిశీలిత సృష్టికళా రహస్యమున్!

భరతముని ప్రణీత రసభావ సమన్విత నాట్యశాస్త్ర సా
గరము మథించి తెల్గులకు కానృకలు వెట్టితి రత్నరాసులన్
వరలును గుప్తపాద నవభాష్యమణీ విభవాభిరామమై
సరసజనానుమోదమయి సత్కృతి నీయశ ముగ్గడించుచున్ !

తలమీది చదలేటి గలగలార్భటులు తాం
        డవకేళి తాళమానములు గొలుప
కలువల చెలరేగు నెలదేటిరుతులు సం
        గీత సందర్భముల్ కీలుకొలుప
నెలడాలు నాగరాజుల మణికాంతుల
        పొలసి సంధ్యాకాంతి పుక్కిలింప
గిరిజా దరస్మితాంకుర మిళల్లోచనాం
        శులు హావ భావ శోభలు వెలార్ప
పదపద్మమున సృష్టి సర్వమ్ము నాట్య
పులకితము చేసి ఆనందజలధి దేల్చు
నాట్యనిగమాంత చిన్మయానందమూర్తి
పరమ శివముద్ర భద్రమై వరలుగాత !

డా. కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి

ఉస్మానియా విశ్వవిద్యాలయము

నీవొకమారు "తాజ్మహాలు" నిగ్గులు చింద రచించి మామనో
భావము తాండవింప బహుభంగుల "వేణువు" నూదగాను ఆం
ధ్రావళి స్వప్నసీమల విహార మొనర్చెను "విశ్వభారతి"న్
పూవులు తీవెలల్లుకొని పున్నమి వెన్నెల జిమ్మె నల్దిశల్.

నిన్ను స్తుతించి పెట్టుటకు నేను పరాయిన? విద్వదూహసం
పన్నము క్షేత్రమీమనది పంటకు దెచ్చితి వప్పరాయ! రా
నున్నది ఢిల్లి భోగముల నూర్పిడి కాలము నిన్నుబట్టి-నే
నన్నది చూతు నీ వభినవాభినవాకృతిలోచనాకృతీ!

సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప

గాసట బీసటే యెఱిఁగి కన్నులు వంకలు ద్రిప్పి భావవి
న్యాసములంచు మూర్ఖుల మనస్సులు రేచెడు వెఱ్ఱి నాట్యముల్
వీసరవోవ నేడు ప్రభవించిన దాంధ్ర సరస్వతీముఖో
చ్ఛ్వాసము నాట్యశాస్త్రము, వశంవదసూరిజనప్రపంచమై.
నను శిక్షించిన దొక్కనాడు రసవన్నాట్య ప్రపంచమ్ములో
మిన యాచార్యముదక్షయుగ్మయగు లక్ష్మీదేవి' యీ నాడు ని
న్ననుశాసించెను మౌనిరాజు భరతుండాత్మీయరాహస్యల
క్షణముల్ దీరిచి, ధన్యతల్ గుదిరె దిక్కాలానవద్యంబులై.

ఎన్నాళ్ళుగా మథియించితో భరతుని
యాత్మ గంభీరమౌ నర్ణవంబు?
స్వకపోల కల్పనా చాపల్యముల పొంగు
నింకింప నెటు తపియించినావొ?
మూలానుకూల శబ్దోత్కర్ష కెన్నాళ్ళు
శిరసార్చియార్చి యోజించినావొ?
యీ పరిశ్రమ కెవ్వరో పట్టుగొమ్మని
యెన్నాళ్ళు చూపు సారించినావొ?

ఓ రసతపస్వి! ధన్యుడవోయి. నేటి
కార్ద్రి గోపాలకుని దయ నవఘటించె
నీ తెనుగుసేత సంవిదున్నీత సకల
గుణ పరిస్పందయై రసాకులితమగుచు!



అప్సరసలు - అజంతా



# NĀTYA SĀSTRAMU

[Complete Telugu Translation in simple and lucid style along with the Commentary 'Guptabhāvaprakāsika']

*By*

Dr. P. S. R. APPA RAO

*A Nātyamāla Publication. Reprint, 1983* *Rs. 45/-*

నాట్యశాస్త్రము